శ్రీ

# శృంగారనైషధము

శ్రీనాథమహాకవిప్రణీతము.

బ్రహ్మశ్రీ కే. వేంకటశాస్త్రి

విరచిత

టీకాతాత్పర్యసహితము.

శ్రీమద్దేవరాజసుధీ

పరిశోధితము.

మద్రాసు

ఆనందముద్రాలయముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ అన్డ్ కంపెని

వారిచే ప్రకటితము.

1914.

# విషయసూచిక.

## శృంగారనైషధము.



శ్రీశారదాంబాయైనమః.

# ఉపోద్ఘాతము.



శృంగార నైషధముఁగూర్చియుఁ దత్కర్తయగు శ్రీనాథునిఁ గూర్చియుఁ బ్రశంసించునప్పు డందులకు ముందుగాఁ దెనుఁగు నైషధమునకు మూలభూతంబును, "నైషధంవిద్వదౌషధ" మ్మని ప్రఖ్యాతంబునునగు నైషధకావ్యముంగూర్చియుఁ దత్కర్తయును నిరుపమానకవితాపటిష్ఠుఁడునగు శ్రీహర్షుంగూర్చియుఁ గొంచెము ప్రసంగించుట యతిప్రసంగము కాదను బుద్ధితో నప్పనికి దొరకొనుచున్నాఁడ.

ఇట్టి మహాకవుల యథార్థచరిత్రంబులఁ దెలిసికొనుట ప్రతి వానికి నావశ్యకమే. కాని వానిఁ దెలుపు గ్రంథమ్ముల నాయా కాలములనుండువారు వ్రాసి యుండక పోవుటచేఁ దాదృశ భాగ్యము భారతీయులకుఁ బట్టలేదని చెప్పవలసియున్నది. అసమానవిద్యాశోభితు లగుపండితులయొక్కయు, నిరర్గళకవితాధారావిరాజితులగు కవిశిరోమణులయొక్కయు, నశేషశేముషీప్రఖ్యాతులును, రాజనీతి పారావారపారంగతులునగు మంత్రిపుంగవులయొక్కయు, నవార్య శౌర్యరసపూరితులయి, ధర్మయుక్తంబుగా ధారుణింబాలించి వాసిగాంచిన క్షమాపాలుర యొక్కయు యథార్థచరిత్రంబులు వినునట్టి మహాదృష్టము భారతీయులకుండినచో నీపాటికి వీరును లాతివిలాతులవారివలె నుచ్చపదవి నధిష్ఠించియుందు రనుట యతిశయోక్తి కాదు.

మన పూర్వులు తాదృశభాగ్యము మనకుఁ గలిగింపమికి విచారింప వలసినది.

ఆలోచింపఁ దాతముత్తాతలనాఁటి చరిత్రములనే యున్న దున్నట్టు దెలిసికొనుట కష్టసాధ్య మగుచుండ నందలకొలఁది సంవత్సరముల క్రిందట నున్న మహామహులచరిత్రతత్త్వ మిప్ప టివారు వ్రాయఁ బూనుట దుస్సాధకమనుటకు సందియము లేదు. అయినను దేశాభిమానులును భాషాభిమానులును నగు కొందఱు పండితులు మిక్కిలి శ్రమించి యట్టిచరిత్రమ్ములఁ గొంతవఱకు వ్రాసి ప్రకటించి కొంతలోపమును బాపిరి. వారట్టు వ్రాయుటకు నాయాకవులు రచించినగ్రంథములును, నందుఁ జేర్కొనఁబడిన కృతిపతుల శాసనంబులును దప్ప నితరాధారం బులేమియుఁగానరావు. వానివలనఁ గృతిపతు లొనర్చిన యద్భుత కార్యంబులలోఁ గొన్నియు, వారి కులగోత్రాదులును, గవి కుల గోత్రాదులును మాత్రమే దెలియనగును. కాని యమ్మహా మహుల చరిత్రమును వివరముగా వ్రాయ నవకాశము లేదు. ఆమహాకవులును గృతిపతులు నిప్పటివారివలె గ్రంథములందుఁ దమ్ముంగూర్చి వర్ణించికొంట నింద్యమని తలంపకపోవుటచేత నే యింతమాత్ర మయినమహానుభావులచరిత్రములు తెలిసికొను భాగ్యము మనవారికిఁ గల్గినది. లేనిచో నేమగునో! ఇట్లుండ వారి చరిత్రములు వివరముగా వ్రాయవలెనన్నచోఁ జరిత్రకారుల ప్రతి భావిశేషంబును, వృద్ధపరంపరవలన వినవచ్చు పుక్కిటికథలును, సాధనంబులై యున్నవి. ఆగాథలయిననన్నియు నొక్కవిధముగా నుండక వక్తలచాతుర్యమును బట్టియు, గల్పనాతిశయమునుబట్టియు, మాఱుచుండుటచే నవియుఁ బరస్పరవిరుద్ధము లయియుం

చును. ఇట్లుండ వారియథార్థచరిత్ర మెట్లు తెలియును? అయినను నవి శ్రావ్యంబులయి, యానంద జనకములయియుండును గాన వానినైనఁజదివి యానందించుట మంచిదను తలంపుతోఁ గొన్నింటి నిందుదాహరించెదను.

శ్రీ హర్షుఁడు.

ఇతఁడు మామల్లదేవీశ్రీహరుల కుమారుఁడు. చింతామణి మంత్రోపాసకుఁడు. ఇతఁడు సమస్తశాస్త్రంబులను బాండితి గలవాఁడన్నట్లు నైషధంబున నాయామాభాగముల వర్ణితములగు వర్ణనములనుబట్టియే స్పష్టమగుచున్నది. ఇతని నైషధమును జదివినవారు కల్పనాచతురులగు మహాకవులలో నితఁడొక్కండని చెప్పకపోరు. ఇతని కవితాధార యనర్గళమై, గంగాప్రవాహము వడువున నిర్దోషమై, సుధారసల హరిచందంబున శ్రవణపుటపేయమయి యున్నదనుట యతిశయోక్తి కాదు. మాఱు మూలపదములతోఁ గాక సుప్రసిద్ధపదములతోనే పండితమనోహరంబుగా శ్లేషకవిత్వము చెప్ప నేర్పితనికెంతేనియుఁ గలదని నిశ్చయింపవచ్చు ఇమ్మహాకవి స్థైర్యవిచారప్రకరణము. శ్రీవిజయప్రశస్తి. ఛందఃప్రశస్తి, గౌడోర్వీశకులప్రశస్తి, ఖండనఖండఖాద్యము, అర్ణవవర్ణనము, శివశక్తిసిద్ధి, నవసాహసాంకచరితము, నను మహాకావ్యముల రచించినట్టు లితఁడొనర్చిన నైషధ మహాకావ్యమున సర్గాంతములందుఁ జేర్చిన పద్యములచేతనే తెల్లమగుచున్నది. ఇతఁ డేకాలమున నున్నవాఁడో గ్రంథములో స్పష్టముగాఁ జెప్పకపోయినను జరిత్రకారుల కొక యాధారమును మాత్రము కల్పించెను. నైషధములో నిరువది రెండవసర్గమున కంతమున,

శ్లో॥ శ్రీహర్షాంకవిరాజరాజి మకుటాలంకారహీరస్స్రుతం
శ్రీహీరస్సుషువే జితేంద్రియ చయం మామల్లదేవీచయం
తాంబూలద్వయ మాసనంచలభతే యః కాన్యకుబ్జేశ్వరా
ద్యస్సాక్షాత్కురుతేసమాధిషుపరంబ్రహ్మప్రమోదార్ణవం॥

అని యతఁడు కాన్యకుబ్జాధీశ్వరునివలన బహుమానము నందుచున్నట్లు తెలుపుటచే నితఁడా రాజులయాస్థానము ననుండెనని చెప్పవచ్చును. అయిన నా కాన్యకుబ్జేశ్వరు నామ మేదియో యతఁ డేశతాబ్దముననుండెనో తెలిసికొనకుండ శ్రీహర్షుని కాలము నిర్ణీతముకాదు. వానిఁ దెలిసికొననేవియు విశేషాధారములు లేవు గాని యిప్పటికి సుమారాఱు శతాబ్దములక్రిందట,అనఁగాఁ క్రీస్తుశకము 1348 వ సంవత్సరముల ప్రాంతమున నున్న రాజశేఖరసూరి తనప్రబంధకోశమున శ్రీహర్షుఁడు కాన్యకుబ్జ (కనౌజి) పతి యగు జయచంద్రుని యాస్థానమున నుండె నని వ్రాసెను. రాజశేఖరసూరి కించుమించుగా 150 వత్సరముల క్రిందటనే శ్రీహర్షుఁ డుండియుండును. గాన యతఁడు వ్రాసినది నిక్కమనియే తలంపవచ్చు. హిందూదేశముపై కనేకపర్యాయములు దాడి వెడలివచ్చిన మహమద్గోరీకి, కాన్యకుబ్జము నేలు జయచంద్రుఁడు సమకాలికుఁడగుటచేతను, గోరీక్రీస్తు. శ. 11 వ శతాబ్దాంతమున నున్నవాఁడగుటచేతను,శ్రీహర్షకవియు నాకాలముననే అనఁగాఁ క్రీ॥ శ॥ వశతాబ్దాంతముననే యున్నాఁడని నిశ్చయింపవచ్చు. ఆధారములవలనఁ దేలినచరిత్రాంశమిది. ఇతని పాండిత్యమును గూర్చి యనేకు లనేక ప్రకారములఁ గథలను జెప్పికొను చున్నారు. అవి విశ్వసనీయము లయినను గాకపోయినను

శ్రవణరంజకములై యుండును. కాన వానిలో నొకదాని నీక్రింద నుదాహరించెదను.

శ్రీహర్షుని తండ్రి శ్రీహరుఁడు సకలశాస్త్రపారంగతుఁడు. తల్లి యగు మామల్లదేవియు మహావిద్వాంసురాలు. ఆ శ్రీహరుఁడు పెక్కుదేశములు దిరిగి తత్తద్దేశాధిపతుల యాస్థానంబుల కేగి తనవిద్యాపాటవంబున నచ్చటిపండితుల జయించి జయపత్రములఁ గొని వచ్చుచుండెను. అతఁడు పరాజయ మన్న నెట్టిదో యెఱుఁగఁడు. కాని యొకప్పుడతఁడు కాన్యకుబ్జనగరమున కేగి వాదము సల్పుచు నొకపండితున కోడిపోయెను. ఇట్లతఁడు నిర్జితుఁడై యా పరాభవమును సహింపఁజాలక యింటికి మరలివచ్చి నిరంతరచింతామగ్నుండై దినదినము కృశించిపోయి మంచము పట్టి యవసానసమయమున మహావిద్వాంసురాలగు భార్యను, బాలుఁడయిన తన పుత్త్రునిఁ జేరఁబిలిచి భార్యంజూచి "నే నీ లోకమును విడుచుచున్నాను. నీ వీ కుమారునిఁ బండితునిగాఁ జేసి నాశత్రువు నొద్దకుఁ బంపి యతని నోడించునట్లు చేయుము. నాతపంబుచే ఫలోన్ముఖ మయిన చింతామణిమంత్రమును నీకిప్పు డుపదేశించెద. బాలుఁ డుపనీతుఁ డయినతోడనే వాని కుపదేశింపుము. దాని వలననతఁడు స్వల్పకాలములోనే సమస్తశాస్త్రపండితుఁ డగు" నని చెప్పి యామంత్రవిధానమును దెలిపి కాలధర్మము నొందె. అనంతరము మామల్లదేవి భర్త్రాజ్ఞను శిరసావహించి బాలునికి విద్య గఱపుచుఁ గొంతకాలమున కుపనయనము చేసి యమ్మంత్రరాజము నుపదేశించె. బాలుఁడు శ్రద్ధాళువయి జపించెను. కాని శవముపై గూర్చుండి జపించినంగాని దేవత ప్రత్యక్షము కాదఁట. అతనికి శవము లభింపలేదు. అతనితల్లి కుమారుంజూచి

"పుత్త్రా! నేఁ బ్రాణముల విడిచెదను. నాపైఁ గూర్చుండి జపింపుము. భయపడకుము. తప్పక ఫలసిద్ధినొందుదువు. మీ జనకుని కోర్కె తీర్చుట మన యిరువురకును బ్రథమకర్తవ్య" మని చెప్ప నతఁడందుల కంగీకరించెను. అతఁ డేడుదినంబు లాశవముపైఁ గూర్చుండి జపింప దేవి ప్రత్యక్షమయి వలయు వరంబులు వేఁడు మన బుద్ధిమంతుఁ డయినయాబాలుఁడు తన తల్లిని బ్రదికింపవలె ననియు, నపారప్రజ్ఞయు, నసాధారణ కవితాధోరణియు, సకల శాస్త్రపరిపూర్ణ పాండిత్యంబును, నొసంగవలెననియుఁ, గోర నామె యట్లనుగ్రహించి యంతర్ధానముచెందె. తోడనే తల్లి నిద్రనుండి మేల్కొన్నట్లు మేల్కని లేచి జరిగిన వృత్తాంతమును గుమారునివలన విని సంతసించి తనపిల్లనికిఁ గొంచెం దోడిచ్చి కాన్యకుబ్జమునకుఁ బంపెను. అప్పుడు శ్రీహర్షుఁడు రాజసభకుఁ బోయి తనయసాధారణపాండిత్యముచే నప్పండితుని గెలిచెను. ఆ రాజా బాలునిపాండిత్యమున కచ్చెరువంది తన యాస్థానమున నుంచుకొనియె. శ్రీహర్షుఁడు తల్లితో నచ్చటనే నివసించి యుండె. తల్లి ననుమతిఁబొంది పుణ్యదాయకంబగు నలచరిత్రమును గావ్యముగా రచించి తల్లికిఁ జూపెను. ఆమె చదివి 'కుమారా! ఇది యెవ్వరికి నర్థము కాదు. దీనిఁ జించివైచి సులభశైలిని వ్రాయు'మన వల్లెయని యతఁడు దానిఁ జించివైచిమగుడ రచించి తల్లికిఁ జూపెనఁట! తల్లి యదియు వెనుకటిదానివలె నున్నదని చెప్పి దానిం జీల్చివైచి కుమారుని ప్రజ్ఞావిశేషము తగ్గుటకు బుద్ధిమాంద్యకరము లగువస్తువులను బెట్టుచుండెను. ఒకనాఁడు శ్రీహర్షుఁడు మినుపరొట్టెను దినుచుండ నతని మేనమామ వచ్చి "కిమశ్నాసి" యనియడుగ "అశేష శేముషీమో

షమాష మశ్నామి మారిష" అని ప్రత్యుత్తరమిచ్చెను. తల్లి యాసమాధానము విని కుమారుని కవిత్వము కొంతవఱకు దారికి వచ్చినదని నిశ్చయించి గ్రంథమును రచింపు మనవుడు మొదటఁ గొన్నిగ్రంథముల రచించి పిమ్మట నిప్పుడు ప్రచారములో నున్న నైషధమును రచించెనఁట.

పైఁగథాంశమువలన నైషధకవిత్వ మతిప్రౌఢమై సామాన్యపండితులకు దురవగాహమైయున్నట్టు తెలియవచ్చుచున్నది. నైషధకవిత్వ ప్రౌఢిమంగాంచి యందుల కుపష్టంభకముగా బుద్ధిమంతులు దీని కల్పించిరేమో యని సందేహింపవలసియున్నది. ఏది యేమయినను నైషధకవిత్వ మతిప్రౌఢమై యసాధారణ కల్పనాశోభితమై సామాన్యపండితులకు దురవగాహమై యున్న దనుట నిక్కము.

ఈ ప్రౌఢకావ్యమును సంస్కృత కవిత్వమున శ్రీహర్షకాళిదాసులవలె నాంధ్రకవిత్వమున సుప్రసిద్ధిఁగాంచిన శ్రీనాథుఁడు భాషాంతరీకరణముగావించె. ఇఁక సంస్కృత నైషధకర్త చరిత్రము నింతతోఁజాలించి యాంధ్రనైషధ కర్తయగు శ్రీనాథునిఁ గూర్చి కొంచెము వ్రాసెదను.

### శ్రీనాథుఁడు.

ఇమ్మహాకవి భీమాంబామారయామాత్యుల తనూజుఁడయినట్టును, భారద్వాజసగోత్రుఁడయినట్టును, నాపస్తంబసూత్రుఁడయినట్టును శృంగారనైషధమునఁ గలయీపద్యమువలనఁ దెల్లమగుచున్నది.

శా. భారద్వాజపవిత్రగోత్రుని శుభాపస్తంబసత్సూత్రు వి
ద్యారాజీవభవుండు మారయకుఁబుణ్యాచార భీమాంబకుఁ

గారామైన తనూజు న న్ననఘు శ్రీనాథాఖ్యునిం బిల్చి స
త్కారం బొప్పఁగ గారవించిపలికెన్ గంభీరవాక్ప్రౌఢిమన్
మఱియు నితఁడు పద్మపురాణసంగ్రహమును రచించిన కమ
లనాభామాత్యునికి మనుమఁడయినట్లులు భీమఖండములోఁ
బ్రథమాశ్వాసమున నున్న "కనకక్ష్మాధరధీరు" నను పద్యము
వలనఁ దెల్లమగుచున్నది. ఇతఁడు పాకనాటి నియోగిబ్రాహ్మ
ణుఁడు. అట్లయినట్లు కవియె భీమఖండమునఁ జెప్పియున్నాఁడు.

సీ. వినిపించినాఁడవు వేమ భూపాలున
కఖిల పురాణ విద్యాగమములు
కల్పించినాఁడవు గాథ పాకం బైన
హర్ష నైషధకావ్య మాంధ్రభాష
భాషించినాఁడవు బహుల దేశ బుధులతో
విద్యా పరీక్షణ వేళ లందు
వెద చల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిశాంగణము లందుఁ

తే. బాకనాఁటింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభుని మనుమఁడ వమలమతివి
నాకుఁ గృపచేయు మొక ప్రబంధంబు నీవు
కలితగుణగణ్య! శ్రీనాథ కవివరేణ్య!

శ్రీనాథునిజన్మస్థల మేది?

ఇతనిజన్మస్థలము కొండవీ డని కొందఱును, గర్ణాటకమని
కొందఱును వ్రాసిరి కాని యోజింప నతని జన్మస్థలము కొండ
వీటి సీమయని యే చెప్పనొప్పును. బ్రాహ్మణులేకవిధము వా
రయ్యు నాయాదేశములం దుండుటంబట్టి వెలనాఁటివారనియు

వేగినాఁటివారనియు శాఖాభేదమువచ్చినట్లు శ్రీనాథుని పూర్వులు పాకనాఁటియందు నివసించినవారగుటచేతనే వారు పాకనాఁటి నియోగులని యొకశాఖవారయిరి. శ్రీనాథుని పూర్వులం దుండక కన్నడమందుండినచో వారి కానామము రా వీలులేదు గదా! పాకనాఁడనగాఁ గొండవీడు మొదలుకొని నెల్లూరు మండలములోని కందుకూరువఱకుఁ గలదేశము. కావున శ్రీనాథుని పూర్వులు పాకనాఁటియందే కాఁపురమున్నట్టును,నతని జన్మస్థల మదియే యయినట్టును నిశ్చయింపనగు కాని కొందఱుపాఠితులు శ్రీనాథుఁడు రచించిన భీమఖండములోని,

సీ. ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాషయం డ్రదు
పలుకు నుడికారమున నాంధ్రభాషయందు
నెవ్వ రేమన్న నండ్రు నాకేమికొఱఁత
నా కవిత్వము నిజము కర్ణాటభాష.

అనుపద్యమున "నాకవిత్వమ్ము నిజము కర్ణాటభాషయని యుండుటచేతను, శ్రీనాథ కృతమగు వీధి నాటకములోని;

శా. కుల్లాయుంచితిఁ గోకచుట్టితి మహాకూర్పాసముందొడ్గితి
న్వెల్లుల్లిం దిలపిష్టము న్మెసవితి న్విశ్వస్త వడ్డింపఁగా
జల్లా యుంబలి ద్రావితి న్రుచులు దోసంబంచుఁ బోనాడితి
దల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా యేను శ్రీనాథుఁడన్.

అనుపద్యమున" తల్లీ! కన్నడ రాజ్యలక్ష్మి! యని సంబోధించి యుండుటచేతను, కాశీఖండములో "కర్ణాటకటక పద్మవన హేళి" అనఁగాఁ గర్ణాటదేశమందున్న పురములనెడి పద్మవనమునకు సూర్యునివంటివాఁడు" అని తనకు విశేషణమును జేర్చుకొనుట చేతను, నతని కవిత్వమున గన్నడ పదములుండుట చేతను

శ్రీనాథునిజన్మస్థలము కర్ణాటకమని నిశ్చయించి, కావుననే మాతృభాషయందలి యభిమానము చే "నాకవిత్వము కర్ణాట భాష" యనుటయు, దన మాతృదేశమందలి యభిమానముచే "తల్లీ! కన్నడ రాజ్యలక్ష్మి" యని సంబోధించుటయు, కర్ణాట పురములవారి కానందకారి యను నర్థమిచ్చు విశేషణమును జేర్చు కొనుటయు నుపపన్న మగుచున్నవని నుడువుచున్నారు. కాని యిది న్యాయమునకు దూరముగా నున్నదని తోఁచుచున్నది. శ్రీ నాథుని జన్మస్థలము కర్ణాటకమని చెప్పుటకుఁ బైని జెప్పినవి ప్రమాణములు కావు.

శ్రీనాథుని గ్రంథములను విమర్శనపూర్వకముగాఁ జదివిన చో నతఁ డాంధ్ర దేశములోఁ బుట్టి పెరిఁగి మాటాడునప్పటినుం డియు నాంధ్రభాషను మాటలాడి పెద్దయినపిమ్మటఁ దన మాతృ భాషాగ్రంథములను బెక్కింటిని జదివి పాండిత్య మలవఱచికొని యసాధారణప్రజ్ఞాశోభితుఁ డయినట్టును, దాతతండ్రులనాఁటి నుండియు ననుస్రుతమై వచ్చు నిరర్గళకవితాధార గలవాఁ డనియు నూహింపవలయును కాని యెచ్చటనోపుట్టి యెచ్చట నో పెరిఁగి తుదకుఁ దెనుఁగుదేశము చేరి మూఁడునాలుగు గ్రంథ ములు చదివినంతమాత్రముననే పండితుఁడయి శుష్కకవిత్వము చెప్పువాఁడు కాఁడని యూహింపవలసియున్నది. శ్రీనాథున కాంధ్ర ము మాతృభాష కానిచో నెంతయు మనోహరముగా దేశీయ ములువాడి యతి మృదుమధురముగా గ్రంథముల వ్రాసి పండిత తల్లజుల యుల్లంబులఁ గొల్లపెట్టఁజాలిన నేర్పులవడుట యసంభవ ము. మాతృభాషలోఁ గవిత్వము చెప్పి మెప్పువడసిన ట్లన్యభాష లోఁ గవిత్వము చెప్పి యట్లు మెప్పుడు యసంభవము. ఇట్లతని కవి

త్వమునుబట్టియు నతని యునికినిబట్టియు నతని జన్మస్థలము కొండ వీటి సీమ యని చెప్పవలసియుండఁగాఁ గర్ణాటకము జన్మస్థలమను టేటి పాటిదో తెలియరాకున్నది. శ్రీనాథుఁడే "నాకవిత్వము నిజము కర్ణాటభాష" యని చెప్పుకొనెనే యదెట్లని యందు రేని వినుఁడు. పౌఢిఁ బరికింప నను పద్యమును గుకవి నిందా ప్రకరణమున వ్రాసియున్నాఁడు. భీమఖండమున నీ పద్యమునకు ముం దీపద్యమును బొందుపఱిచి యున్నాఁడు.

గీ. నికటమున నుండి శ్రుతిపుటకీ నిష్ఠురముగ
నడరి కాకులు బిట్టు పెద్దఱిచినప్పు
డుదధి రాయంచ యూరకే యుంటలెస్స
సైఁపరాకున్న నెందేనిఁ జనుటయొప్పు.

ఈ ప్రకరణము నాలోచింపఁగా శ్రీనాథుఁడొనర్చిన గ్రంథముల లోని సంస్కృత పద భూయిష్ఠము లగు పద్యములను గాంచి కేవల మచ్చ తెనుఁగభిలషించు కుకవులు కొందఱు "ఇది సంస్కృత పద భూయిష్ఠమైనది కాన యిది సంస్కృత కవనమేకాని తెనుఁగు కవనము కాదని యాక్షేపించి యున్నట్టును, విస్పష్టార్థములు గల తెలుఁగు పదములతోఁ జేసిన పద్యములఁ గాంచి సంస్కృత భూయిష్ఠ పద్యము లభిలషించుకుకవులు కొందఱు కేవల మచ్చ తెనుఁగు కవనమని యాక్షేపించినట్టును దానికి శ్రీనాథుఁడు వారిని హేళన చేయునిమిత్తము" ఓరీ మీా రనుకొన్నట్టు నాకవిత్వము సంస్కృత భాషయుఁగాదు, తెనుఁగుభాషయుఁగాదు, కర్ణాటభాష" యని యుత్తరమిచ్చినట్టునూహింపవలె అది కుకవుల మీాది కోపముచే నన్నట్టులున్నది కాని మాతృభాషా ప్రేమమును వెల్లడింప నన్నది కాదు. లేక యది యథార్థమైనను కర్ణా

టమునఁ గవిత్వము చెప్పఁగలవాఁడే యయినచో నాంధ్ర
భాషలోవలెఁ గర్ణాటభాషలోఁగూడ గ్రంథములవ్రాసి తన మా
తృభాషాభిమానము నేల ప్రకటింపఁడు? "తల్లీ! కన్నడరాజ్య
లక్ష్మి" యను నుదాహరణముగూడ వారి వాదమును నిలువఁ
బెట్టఁజాలదు. ఆ పద్యార్థమును బాగుగా యోజింప శ్రీనాథుఁడు
కర్ణాట దేశాధిపతుల దర్శింపఁబోయి చిరకాల మచ్చట నివసించి
తుద కెప్పటికిని తన కోర్కె లభింపకపోఁగా విసిగివిసిగి తా నచ్చటఁ
జేయుచున్న పనులను, బడుచున్న కష్టములనుగూర్చి కర్ణాట
రాజ్యలక్ష్మితో మొఱపెట్టుకొనుచున్నట్టు లున్నది. అందు మొదటి
పాదముచేఁ దాను ప్రతిదినంబును దలపాగ మొదలగువానిఁ దాల్చి
రాజదర్శనార్థము పోయి విఫల మనోరథుఁడై వచ్చుచున్నట్లును,
రెండుమూఁడు పాదములచేతఁ బూఁటకూటింటఁ దా ననుభవించు
చున్నకష్టములను దెలుపుచు 'ఓ కన్నడ రాజ్యలక్ష్మీ! నీయొద్దకు
వచ్చి యిట్టి యిక్కట్టులను బడుచుంటిని, నీకు దయలేదా!" అని
యభిప్రాయమును సూచించెను. ఆ పద్యమందు "తల్లి" యను
పదము లోకమాత యనునామముగల లక్ష్మి నుద్దేశించి ప్రయో
గింపఁబడినదికాని మాతృదేశాభిమానద్యోతకముగాఁ జెప్పి
నది కాదు. ఒకవేళ శ్రీనాథునకుఁ గర్ణాటకము, మాతృదేశమే
యై చిరకాలము వియోగమును బొంది మరలఁ దనదేశమునకుఁ
బోవుచు నీపద్యము చెప్పెనన్నచోఁ జిరకాలము మాతృ
దేశమును విడిచి కొంతకాలమునకు మగిడివచ్చినప్పుడు సంతో
షాతిశయసూచకముగాఁ జెప్పుట తగునుగాని విచారము
ను వెలువఁబోయుట యనుచితము. "కర్ణాటకటకపద్మవనహేళి"
యను విశేషణములును శ్రీనాథుఁ డనేకపర్యాయములు

కర్ణాటములోని ప్రసిద్ధపట్టణములకుఁ బోయినట్టును దన పాండి త్యాతిశయమునకును, మృదు మధురకవితాతిశయమునకును బరిచితులై మిక్కిలి సంతసించుచున్నయచ్చటివారికిఁ దనరాక యానందజనక మయియుండినట్టును దెలుపును గాని వేఱొక యర్థమును నిర్ధారింపఁజాలదు. శ్రీనాథుని కవితామహార్ణవమున నచ్చటచ్చటఁ గానవచ్చు కన్నడపదములుగూడ నా వాదమును స్థాపింపఁజాలవు. ఆంధ్రకర్ణాటదేశములు పరస్పరము కలిసి యుండుటచే నాంధ్రపదములందులోను నందులోని వింద లోను బడియుండుట సహజము. కాన యింతమాత్రమున శ్రీనా థుఁడు కర్ణాటదేశ సంభవుఁడనుట యనాలోచితము. వారన్నట్లే యెంచినచో హిందుస్థానీ పదములను బెక్కింటినిఁ దన కవితం జొప్పించిన పెద్దనాది మహాకవులకుఁగూడ జన్మస్థానముల నన్య దేశంబుల వెదుకవలసి యున్నది. కావునఁ జక్కఁగా నాలో చింప శ్రీనాథుఁడు కొండవీటివాఁడనుటయే యుక్తము.

శ్రీనాథుఁడు కొండ వీటిరెడ్ల యాస్థానమందున్నవాఁడా? రాజమహేంద్రవరమున నున్నరెడ్ల యాస్థానమున నుండెనా? యని యాలోచింపవలసి యున్నది. శ్రీనాథుఁడు కొండవీటి సీమ యందే జన్మించినవాఁడయినను, గొండవీటిరెడ్ల మంత్రులు మొదలగువారికిఁ దన గ్రంథములను గృతియిచ్చినను సరసులు గాని కొండవీటిరెడ్లు తన సామర్థ్యమునెఱిఁగి యాదరింపకపో వుటచేత నితఁడు కొండవీడు వదలి రాజమహేంద్రవరమున రెడ్ల యాస్థానముననే యున్నట్లు చెప్పవలసి యున్నది. కొండ వీటిప్రభువులు సరసులు గారనియు నతని గౌరవింప లేరనియుఁ జెప్పవచ్చు. అట్లేకానిచోఁ దమక్రిందనున్న సేనానులు మొద

లగువారు శ్రీనాథునిచే నుత్తమ గ్రంథంబులు రచింపించి కృతి
నంది యతని గారవించియుండఁగా నాకొండవీటిరా జొకగ్రంథ
మునైనను గృతినొంది యేల గారవింపఁడు? కావున శ్రీనాథు
నకు వేమారెడ్డి సేనానాయకులయిన ప్రెగడయ్య సింగన్న
మొదలగువారి గౌరవమునకుఁ బాత్రుఁడగుటచే నొక్కప్పుడు
రాజమహేంద్రవరమును విడిచి యచ్చటకుఁ బోవుచున్నట్లు
నిశ్చయింపవచ్చును. కొండవీటికైఫీయత్తులవలన శ్రీనాథుఁడు
కొండవీటిరెడ్ల యాశ్రితుఁడయినట్లు తెలియవచ్చుచున్నను గ్రం
థప్రమాణ మేమియును లేకపోవుటచే వాని విశ్వసించుట తగ
దని నామతము. కొండవీటి ప్రభువులు గ్రంథములు కృతినొం
దక పోవుటయే కాక పోషించినట్లు గూడఁ గనిపింపదు. ఒకవేళఁ
దన్నుఁ బోషించినచో శ్రీనాథుఁ డొకప్పుడయిన వారిని బొగడి
కృతజ్ఞుండు కాక మానునా? కస్తూరినిచ్చిన తెనుంగురాయని,
హేమపాత్రములో భోజనము పెట్టిన విస్సనమంత్రిని స్మరించి
కృతజ్ఞతను జూపిన శ్రీనాథుఁడు తన్నుఁ బోషించుచుండిన కొం
డ“వీటిప్రభువులను మాత్ర మేల స్మరించుకొనఁడు? శ్రీనాథుఁడే
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేతి” నని తాను వీరభద్రారెడ్డి
కాస్థాన విద్వాంసుఁ డయినట్లు చెప్పుకొనుటచేతను, నంతిమదశ
యందు “కాశికా విశ్వేశుఁ గలిసె వీరారెడ్డి రత్నాంబరంబు
లేరాయఁడిచ్చు” నని యందఱికంటె ముందుగా వీరభద్రునే
పేర్కొనుటచేతను, కాశీఖండములో

తే. నైషధాది మహాప్రబంధములు పెక్కు
    చెప్పినాడవు మాకు నాశ్రితుఁడవనఘ

యిపుడు చెప్పఁదొడంగిన యీప్రబంధ
మంకితముచేయు వీరభద్రయ్యపేర.

అని యల్లాడ వేమారెడ్డి చెప్పినట్లు శ్రీనాథుఁడే వారి కాశ్రితుఁడయినట్లు తెలిపికొనియుండుటచేతను, నిమ్మహాకవి రాజమహేంద్రవరమునఁనున్న రెడ్ల యాస్థానముననే యున్నట్లు నిశ్చయింపవచ్చును. మఱియు నితఁడీరెడ్ల యాశ్రితుఁడై నను సర్వదా వారినే కాచికొనియుండక పలుమాఱు దేశసంచారముచేసి పెద్దపెద్ద ప్రభువులను దర్శించి వారి యనుగ్రహమునకుఁ బాత్రుఁడై యుండినవాఁడు. లేనిచో నతఁడు పెక్కుస్థలముల కేగుటయుఁ బెక్కండ్రవలన గౌరవమందుటయు నెట్లు తటస్థించును? రాజమహేంద్రవరపురెడ్లకును, గొండవీటిరెడ్లకును జుట్టఱికముండుటచేతను, గొండవీడు తనకు జన్మస్థల మగుటచేతను శ్రీనాథుఁడు ప్రభువుల కార్యము నిర్వహించుటకో తన స్వీయకార్యము నిర్వహించుటకో కొండవీటి కప్పటప్పటఁ బోయియుండుటచే శ్రీనాథు డచ్చటివాఁడేయని యెవ్వరైన భ్రమపడి కైఫియత్తులోఁ జేర్చియుందురని యోజింపవలసి యున్నది.

ఈ పై గ్రంథమునుబట్టి శ్రీనాథు డే శతాబ్దమునాఁటివాఁడో యని నిశ్చయింపవచ్చును. అల్లాడ వేమారెడ్డి క్రీస్తు. శ. 1,434వ సంవత్సరమున చామర్లకోటకు సమీపమందున్న భీమవర భీమేశ్వరస్వామికి భూదానము చేసిన ట్లచ్చట శిలాశాసనముండుటచే వేమారెడ్డి యాకాలమున నుండెననవచ్చును. వీరభద్రారెడ్డియు నప్పటివాఁడే కాన వారి కాశ్రితుఁడయియుండిన శ్రీనాథుఁడు నప్పటివాఁడనియే చెప్ప నొప్పును. తన యవసాన దశనాఁటికి వీరభద్రారెడ్డి కాలధర్మమునొందినట్లు చెప్పుటచే

**1434** తరువాతనుగూడ నితఁడు జీవించియున్నట్లు తెల్లమగు చున్నది. కొన్నింటినిబట్టి యోజింప నితఁడు క్రీ. శ. **1365** ప్రాంతమునఁబుట్టి 1450 వఱకు జీవించినట్లు తెలియవచ్చుచున్నది. ఈ విషయము ముందు చదువరులు విశదముగాఁ జదువఁగలరు.

శ్రీనాథుఁడేయేకాలమున నేయేగ్రంథములు రచించి యెవ్వరికిఁ గృతి యొసంగెనో తెలిసికొనవలసియున్నది. ఆపౌర్వాపర్య మాలోచింప నతఁడే కొన్నియాధారములఁ గల్పించి యున్నాఁడు. ఈమహాకవి కాశీఖండములో.

సీ. చిన్నారిపొన్నారి చిఱుతకూకటినాఁడు
　　రచియించితిని మరుత్రాటచరిత
నూనూగుమీసాల నూత్నయౌవనమున
　　శాలివాహన సప్తశతినొడివితి
సంతరించితి నిండుజవ్వనంబునయందు
　　హర్షనైషధకావ్య మాంధ్రభాష
ప్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని
　　యాడితి భీమనాయకుని మహిమ

గీ. ప్రాయమింతకు మిగిలఁగైవ్రాలకుండఁ
　గాశికాఖండమను మహాగ్రంథమేను
దెలుఁగుఁజేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి.

అను పద్యమును రచించెను. దీనివలనఁ గాశీఖండమునకుఁ బూర్వము మరుత్రాటచరిత్ర, శాలివాహన సప్తశతి, నైషధము, భీమఖండమును రచించినట్లు తెలియవచ్చుచున్నది. ఇవిగాక పండితారాధ్య చరిత్రము, హరవిలాసము, పల్నాటి వీరచరి

త్రము, వీథినాటకమును రచింపఁబడినట్లు తెల్లమగుచున్నది. అందుఁ గాశీఖండమునకుఁ బూర్వమే పండితారాధ్యచరిత్రము, వీథినాటకము, హరవిలాసము, రచింపఁబడినను నవి యుత్కృష్ట మైనవి కావన్న కారణముననో మఱి యేకారణముననో చేర్ప లేదని యోజింపవలసి యున్నది. హరవిలాసము మాట యెట్లు న్నను పల్నాటి వీరచరిత్రము 1445వ సంవత్సరప్రాంతమున రచింపఁబడినట్లు తోఁచుచున్నది. హరవిలాసములో ముఖ్యగ్రం థములలో నైషధమునుమాత్రమే పేర్కొని భీమఖండమును బేర్కొనకపోవుటచే హరవిలాసము భీమఖండమునకుఁ బూర్వ మే రచింపఁబడినట్టు చెప్పవచ్చును. ఇమ్మహాకవి మరుద్రాజచరి త్రమును శాలివాహన సప్తశతిని నిరువదేండ్ల ప్రాయములోనే రచించెను. వాని నెవ్వరికిఁ గృతియిచ్చినట్లు కానరాదు. తరు వాతఁ బండితారాధ్యచరిత్రమును రచించి వేమారెడ్డి సేనానా యకుఁడగు మామిడిప్రెగడయ్య కంకితముచేసెను. తరువాతఁ దన నిండు యౌవనమున ననఁగాఁ దనకు 25-30 వత్సరముల ప్రాయమున నైషధము రచించి వేమారెడ్డి సేనానాయకుఁడ యిన మామిడి సింగన్న కంకిత మొనర్చెను. అటుపిమ్మట హరవి లాసము రచించి కుమారగిరివేమారెడ్డికి సుగంధద్రవ్యాదుల నొసంగు నవచి తిప్పని కంకితము చేసినట్లు తెలియవచ్చుచున్నది. మామిడి ప్రెగడయ్యయు, సింగనామాత్యుఁడు వేమారెడ్డి సేనానాయకులని నైషధపద్యములవలనఁ దెల్లమగుచున్నది. కాని యతఁడే వేమారెడ్డియో తెలిసికొనవలసి యున్నది. ఆవం శంబున క్రీ. శ. 1340 మొదలు 1369 వఱకుఁ బాలించినయన వేమారెడ్డి యొకఁడుకలఁడు. కాని యతనియొద్ద మామిడిప్రెగ్గ

డాదుల తండ్రి పెద్దనామాత్యుఁడు సేనాధిపతియై యుండినట్లు తెలియవచ్చుటచే నప్పటికిఁ బ్రెగ్గడాదులు బాలకులై యుండురు. ఆ వేమారెడ్డి యనంతరమున నతని మనుమఁడు కుమారగిరి వేమారెడ్డి రాజ్యమునకు వచ్చెను. అప్పటికిఁ బెద్దనామాత్యుఁడు ముదుసలివాఁడగుటచేఁ దనయుద్యోగము మానుకొనఁగా నీ పెగడయ్యయు, సింగన్నయు నావదవికి నియోగింపఁబడి యుందురు. నైషధభర్తయగు సింగన కాలమందలి వేమారెడ్డి యనఁగాఁ గుమారగిరి వేమారెడ్డి యని యూహింపవలసి యున్నది. ఈకుమారగిరి వేమారెడ్డి క్రీ. శ. 1380వ ప్రాంతమున రాజ్యము గైకొని 1395 సంవత్సరము వఱకును బాలించుటచేతను, హరవిలాసము కృతినొందిన తిప్పయ్య శ్రీశైలమునకు మెట్లుగట్టించి యన వేమారెడ్డియొద్దను, గుమారగిరి వేమారెడ్డియొద్ద నున్నట్లు హరవిలాసములో స్పష్టముగాఁ జెప్పఁబడియుండుటచేతను, హరవిలాసము 1395-1405 ప్రాంతమున రచింపఁబడి యుండినదేమో యని యూహింపవలసి యున్నది. లేక 1440వ ప్రాంతముననే రచించినచో నన వేమారెడ్డి కాలమునుండియు, సుగంధద్రవ్యాధ్యక్షుఁడై యున్న తిప్పయ్య కుమారగిరి ప్రభువునొద్దనే కాక యతని యనంతరమునఁగూడ ననఁగా 1395 సంవత్సరమునకుఁ బైని 45 వత్సరముల వఱకును జీవించియుండుట యసంభవము. కావున హరవిలాసము 1440వ వత్సరముల ప్రాంతమున రచింపఁబడె ననుటకు హేతు వేమియు లేదు.

పై గ్రంథ సంధర్భము నాలోచింప శ్రీనాథుఁడు క్రీ. శ. 1365వ సంవత్సర ప్రాంతమునఁ బుట్టినట్లును, 1380 లోపలనే

మహరుద్రాజ చరితమును రచించినట్లును, నూత్నయౌవనమున శాలివాహన సప్తశతి వ్రాసినట్లు చెప్పుటచే 1385వ ప్రాంతమున సప్తశతిని వ్రాసినట్లును, 1390వ ప్రాంతమునఁ బండితారాధ్య చరిత్రమును, 1395వ ప్రాంతమున ననఁగాఁ దనకు ముప్పదవయేఁట నైషధమును, 1405వ వత్సర ప్రాంతమున హరవిలాసమును, బిమ్మట నప్పటికిఁ బ్రబలియున్న రాజమహేంద్రవరపురెడ్ల నాశ్రయించి యచ్చటనుండి 1415, 20వ ప్రాంతమున భీమఖండమును, 1425, 35వ ప్రాంతమున కాశీఖండమును, వీరభద్రాదుల యనంతరమున మగుడఁ గొండవీటిసీమ కేతెంచి ముసలికాలంబున నసఁగా 1440, 45వ ప్రాంతమునఁ బల్నాటివీర చరిత్రమును, రచించి యుండునని తోఁచుచున్నది. కొండవీటిని వదలి రాజమహేంద్రవరమును జేరకపూర్వము దేశసంచారము చేయుచు నాయా పుణ్యక్షేత్రములకుఁ బోయి యాయా దేశస్థలములఁగల స్త్రీలను వర్ణించి వీథినాటకము రచించినట్లు తోఁచెడిని. దీనిఁబట్టి యోజింప శ్రీనాథుఁడు సుమారు 80 వత్సరములు జీవించినట్లు కానవచ్చెడిని. శ్రీనాథుఁడు దేశసంచారము చేసి పెక్కండ్రప్రభువులఁగాంచి గౌరవము వడసెను. అట్లు వడసినట్లు సర్వజ్ఞ సింగభూపాలుని సందర్శనార్థము పోవుచు శారదాంబనుగూర్చి శ్రీనాథుఁడు చెప్పిన యీపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

సీ. దీనార టంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాలఁ
బలుకుఁదోడై తాంధ్రభాషా మహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునకు

బగులఁగొట్టించి తుకోద్భట వివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్కఁ
జంద్రశేఖరక్రియాశక్తిరాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుద

తే. మెటులు మెప్పించెదోనన్ను నింకమీఁద
రావుసింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సకలసద్గుణ నికురుంబ శారదాంబ.

దీనివలన దక్షిణాధీశ్వరుని సందర్శించి పెక్కు దీనారములఁ బడ సినట్టును, శాస్త్రవాదముచేసి యోడించి గౌడ డిండిమ భట్టు యొక్క ఢక్క బ్రద్దలు గొట్టించినట్టను, రాయలను మెప్పించి కవిసార్వభౌమ బిరుదమందినట్లును, దెలియనగు. సర్వజ్ఞ సింగ భూపాలుని పండితులు శ్రీనాథుని చాతుర్యమును గనుఁగొన "కుక్కవు నక్కవు ఫణివు క్రోఁతివు పిల్లివి భూతపిల్లివో అని సమస్యనొసంగిరఁట. అంత శ్రీనాథుఁడు తత్క్షణమందే

ఉ. తక్కక రావు సింగ వసుధాధిపుఁ డర్థుల కిచ్చుచున్నచో
దిక్కులలేని కర్ణుని దధీచిని ఖేచరు వేల్పుమ్రాను పెం
పెక్కినకామధేనువు శిబీంద్రుల నెన్నెదవేమి యాచకా
కుక్కవొ నక్కవో ఫణివొ క్రోఁతివొ పిల్లివొ భూతపిల్లివో.

అందులకు సంతసించి తరువాత, వారు, గోలకొండ, మాల ముండ, పూలదండ, కొత్తకుండ, సనుపదములను జేర్చి భార తార్థము వచ్చున ట్లొకపద్యమును జెప్పుమన నిట్లుచెప్పెనట.

ఓయి ధృతరాష్ట్ర! నీకొడుకు త్తగోల
కొండవిధ మాలముండఁ గృష్ణుండుగాచి

పాండుసూనుల గెల్పించు శ్రీ నండయగుచు
నుదరమునఁ బూలదండ శ్రేకొత్తకుండ.

దానికి సభవారు మిక్కిలి యచ్చెరువొందిరఁట. అనంతర మీకవి సింగ భూపాలునిఁగూర్చి.

క. సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావుసింగ జనపాలునకే
యుర్వింజెల్లును నితరుని
సర్వజ్ఞుం డనుట కుక్క సామజమను టే.

అని నుతించి యతని మెప్పించి బహుమతులువడ సెనఁట. మఱియు నితఁ డాంధ్రరాయలయొద్దకేగి యతని సందర్శించి కస్తూరిని యాచించి తెచ్చినట్టు లీ క్రింది చాటుపద్యముచేఁ దెలియవచ్చు చున్నది.

శా. అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ! కస్తూరికా
భిక్షాదానము చేయురా సుకవిరాడ్బృందారక శ్రేణికిన్
దాక్షారాము చళుక్య భీమవర గంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ కుంభి కుంభములపై వాసించు నవ్వాసనల్.

ఇతఁడు బహుదేశములు దిరిగి బహుపండితులతో వాదించి యనేకసంప్రదాయములను దేశాచారములను జక్కఁగ నెఱింగియుండుటయే యితని కవిత్వము నత్యున్నతదశకుఁ దెచ్చిన దని చెప్పవచ్చు. మఱియు కాశీఖండములో, "వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండలీల నొక్కొకమాటు" నని చెప్పినరీతిగా నితఁడు భీమకవివలెఁ దిట్టు కవిత్వమందుఁగూడ ఘనతవహించిన ట్లూహింపవచ్చును. ఇతఁ డొకప్పుడు పల్నాటి సీమకుఁ బోయినప్పు డచ్చటివారు తన్ను గౌరవింపక పోవుటచే

నాపల్నాటనున్నవారి నిందించినట్లీ క్రిందిపద్యములచే నూహింపవచ్చు.

క. నెమలిపురి యమపురంబుగ
యముఁడాయెను బసివిరెడ్డి ◆ యంతకు మిగులన్
యమదూత లైరి కాఁపులు
క్రమమెఱుఁగని దున్నలైరి ◆ కరణాలెల్లన్.

క. గుడిమీఁది కోఁతిచేతను
గుడిలోపలి నంబివారి ◆ కోడలిచేతన్
నడివీథి లంజచేతను
నడిగొప్పల యోరుగాలి ◆ నణఁగితి ననుమీ.

క. జొన్నకలి జొన్నయంబలి
జొన్నన్నము జొన్నపిసరు ◆ జొన్నలెతప్పన్
సన్నన్నము సున్నసుమీ
పన్నుగఁ బల్నాటిసీమ ◆ ప్రజలందఱకున్.

గీ. ఊరు వ్యాఘ్రనగర(పులిపాడు)మురగంబు కరణంబు(శేషయ్య)
కాఁపు కపివరుండు (హనుమయ్య) కసవు(పుల్లయ్య) నీఁడు
గుంపుగాఁగఁ జేరి గురిజాలసీమలో
నోగులంత గూడి ◆ రొక్కచోట.

పయిగ్రంథమును బరిశీలింప నితఁడు తెలుఁగుదేశముననే కాక దానికిఁ జుట్టుననున్న దేశములనుగూడఁ దిరిగి తన కవితాపాటవంబువలన జనించిన యశశ్చంద్ర చంద్రికాకాంతిసంతతులచే నీయాంధ్రదేశంబునే కాక తక్కిన దేశములనుగూడ ధవళాయితములుగా నొనర్చిన మహానుభావుఁడని నిశ్చయింపవచ్చును.

భూపతులు తన్నాదరింపక పోవుటచేతనో, వారిని మెప్పింపఁజాలిన కవితాపాటవము తఱుఁగుటచేతనో శ్రీనాథుఁ డవసానదశయం దీకవితాప్రసంగమును విడిచి బొడ్డుపల్లెనను దాని గుత్త చేసి సస్యములు పూర్తిగా నశించుటచే రాజులకు సొమ్ము చెల్లింపలేక పలుబాధ లనుభవించి నట్లీ పద్యములవలనఁ దెలియుచున్నది.

సీ. కవిరాజు కంఠంబు కౌఁగిలించెనుగదా
పురవీథి నెదురెండ పొగడదండ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా
నగరివాకిటనుండు నల్లగుండు
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబున
దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత
వియ్యమందెనుగదా వెదురుగొడియ
గీ. కృష్ణవేణమ్మ కొనిపోయె నింత ఫలము
బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేఱి మోసపోతి
నెట్లు చెల్లింతుఁ డంకంబు - లేడునూర్లు-

మఱియు.

సీ. కాశికావిశ్వేశుఁ గలిసెవీరారెడ్డి
రత్నాంబరంబు లేరాయఁడిచ్చు
కైలాసగిరిఁబండె మైలారువిభుఁడేగి
దినవెచ్చమేరాజు దీర్పఁగలఁడు
రంభఁగూడెఁ దెనుంగురాయరాహుత్తుండు
కస్తూరికేరాజు ప్రస్తుతింతు

స్వర్గస్థుఁడయ్యె వి స్సనమంత్రి మఱి హేమ
 పాత్రాన్న మెవ్వాని పంక్తిఁ గలదు

గీ. భాస్కరుఁడు మున్నె దేవుని పాలికరిగెఁ
 గలియుగంబున నిఁక నుండఁ గష్టమనుచు
 దివిజకవివరుగుండియల్ దిగ్గురనఁగ
 నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి.

శ్రీనాథుఁడు పెక్కెంటి గ్రంథంబుల రచించి పెక్కండ్ర కంకిత మొనర్చి యధికధనం బార్జించియుఁ దుదకు నిట్టిదారిద్ర్యమనుభవించుటకుఁ గారణ మతని స్త్రీలౌల్యముదక్క వేఱొక్కటి లేదని కొందఱు చెప్పుదురు. అతఁ డార్జించినధనము వ్యయమగుట కదియే కారణమని యూహించుట యెట్లో తెలియకున్నది. తగిన నిదర్శనములు లేకపోయినను నట్టి మహామహుని యశశ్చంద్రుని సకళంకునిగాఁ జేయుట యనుచితము. దారిద్ర్యమనుభవించిన మహాకవు లెందఱో కలరు. మహాకవులు బీదతనమనుభవించుట మన దేశములోనే కాదు, ప్రతి దేశ భాషలోను మహాకవు లనిపించికొన్న మహాత్ములు పెక్కండ్రు బీదవారయినట్టు చరిత్రములవలనఁ దెలియవచ్చుచున్నది. ఆ కవీంద్రుల దారిద్ర్యమున కెల్ల స్త్రీ లౌల్యమే కారణమందురా? అది యనుచితమని యెవ్వరికిఁ దోఁచదు? కావున నతని పేదఱికమునకు జారత్వము కారణమనుటకంటె, నతని వితరణగుణమో యధిక కుటుంబభరణమో హేతువనుట యర్హమని నా మతము. లేక వారన్నట్లతఁడు యౌవనమున స్త్రీలతో విచ్చలవిడిగా విహరించినవాఁడయినచో నంతకాలము జీవించుటయు, నన్నిగ్రంథముల రచించు సామర్థ్యము గల్గియుండుటయు నసంభవమని శారీర

శాస్త్రజ్ఞులకెల్లఁ దెలిసినవిషయమే. ఇమ్మహాకవి కవిత్వధోరణి నిరుపమానమై మహాప్రవాహమువలె నిరర్గళమైనది. ఇతఁడేభాగమువర్ణించినను ముద్దులమూటగట్టుచుండును. ఇతని కవిత సలక్షణమైనది. త్రికవు లంగీకరింపని ప్రయోగముల గొన్నింటి నితఁడుచేర్చెను. కాని నిరంకుశత్వముచేత నట్లు ప్రయోగించెఁగాని యజ్ఞతచేఁగాదు. కొన్నిచోట్ల నితనికవిత్వ మాంనన్నయభట్టాదుల కవిత్వముకంటెను నతిశయమువహించినదని చెప్పవచ్చు. కావుననె పెద్దనాదికవు లితనికవితాధోరణి ననుసరించినట్లు పూర్వకవుల ననుసరించినట్టు కనుపట్టదు. ఇఁక నితనినైషధగ్రంథము నాంధ్రీకరణముంగూర్చి కొంచెముచర్చించెదను. భట్టహర్షుని కవితానుగుంభములను దెనిఁగింప మహాకవియగు నితఁడు సాహసించెనుగాని వేఱొకఁ డట్టిఘనకార్యము నను సాహసింపలేఁడని చెప్పవచ్చును. కొన్నిచోట్ల నితఁడు మూలమును విడిచి స్వేచ్ఛగా రచించినను కొన్నిచోట్ల మూలము నుజక్కఁగా ననుసరించి రచింపకపోలేదు. సంస్కృతమునుండి తెనుఁగునకుఁ దేనశక్యంబు లగు శ్లేషలను, గొన్నిసమాసములను మూలములోనివే చేర్చెను. కొన్నికొన్ని భాగంబులు విమర్శించినచో శ్రీనాథుడు కాఁబట్టి తెనుఁగుజేయఁ గలిగెను; కాని వేఱొకఁడు చేయలేఁడని తోఁపకపోదు. ఇతని యాంధ్రీకరణమునకుఁ గొన్ని యుదాహరణంబు లిచ్చెద.

మూ॥ యథోహ్యమానః ఖలుభోగభోజినా
ప్రసహ్య వైరోచని జస్యపత్తనమ్
విదర్భజాయా మదన స్తథామనో
నలావరుద్ధం వపుసెవ వేశితః.

తే. అప్పుడనలావరుద్ధతనారఁ గూరి
బాణపురమును బోని యాకైతమి మనము
పుష్పబాణాసనుఁడు భోగభోజియైన
వర నయోవిశేషంబు వాకర్వముగఁ దలఁచె.

మూలమున "మనోనలావరుద్ధ" మనునెడ "నలావరుద్ధము, అనలావరుద్ధము" ననిపదశ్లేషయు, భోగభోజి, "వయస్" అను చోట్ల నర్థశ్లేషయుఁ జేర్పఁబడినవి. ఆశ్లేషము నాంధ్రము లోఁ దెచ్చుటకు వఁనుపడమిచే శ్రీనాథుఁ డప్పదములనే కైకొనెను. అతఁ డెంతయు నాలోచించి "మనోనలావరుద్ధ" మనుదానికి బదులుగా" అప్పుడు అనలావరుద్ధ యనియు, అప్పుడ, నలావరుద్ధమనియుఁ బదశ్లేషము నరిపుచ్చినను, భోగభోజి వయశ్శబ్దములవంటి యర్థశ్లేషపదములు తెనుఁగున లేకపోవుటచే నిట్టి శ్లేషస్థలంబులందు శ్రీనాథుఁడు మూలములోని పదములనే వాడుకొనెను. కొన్నిచోట్ల మూలములో లేనివి పెక్కుపదములను రసపుష్టికై చేర్పఁబడినట్టు తెలియవచ్చెడిని.

మూ. సరసీః పరిశీలితుంమయా
గమికర్మీకృత నైకనీవృతా
అతిథిత్వమనాయి సాదృశోః
సదసత్సంశయ గోచరోదరీ !

దీనికిఁ దెనుఁగు.

మ. మృదురీతిం బ్రతివాసరంబుగమికకర్మీభూతనానానదీ
నదకాంతారపురీ శిలోచ్చయుఁడనైకనైకాద్భుతశ్రీజిత
త్రిదివంబైనవిదర్భదేశమున నారీరత్నముంగాంచితిః
సదసత్సంశయ గోచరోదరి శరత్సంపూర్ణ చంద్రాననన్.

మ. కమలేందీవరషండ మండితలసత్ త్కాసారతీరంబునన్
గమికర్మీకృత నైకసీవృతుఁడనై కాంటిన్విదర్భంబునన్
రమణిం బల్లవపాణి పద్మనయనన్ రాకేందు బింబాననన్
సమపీన స్తని న స్తినా స్తివిచికిత్సాహేతుశాతోదరిన్.

అని రెండు విధములఁగా రచించెను. రెండును మూలమునకు సరిగా లేవని చదివినవారికెల్లరకు బోధపడును. ఇందు మూలములో లేని యర్థమును బోధించు పెక్కుపదములను జేర్చెను. బద్యములు రసవంతములై వ్యర్థపదభూయిష్ఠములవలెఁ గానరాక స్వతంత్రపద్యములవలె శ్రోతల కాహ్లాదమును బుట్టించుచున్నవి.

మూ. త్వచ్చేతసస్థైర్యవి పర్యయంతు
సంభావ్య భావ్యస్మి తదజ్ఞ ఏవ
లక్ష్యేహి బాలా హృదిలోలశీలే
దరాపరాద్ధేషు రపిస్మరస్యాత్.

ఉ. ఇప్పటి నీతలంపు తెఱఁగిట్టిదియౌనిట మీఁదనెప్పుడే
చొప్పుననుండునో నిజముసుద్దియెఱుంగము గానియుగ్మలీ
చెప్పెడిదేమి ? బాలికలచిత్తములంబుతరంగలోలముల్
తప్పనొ తాఁకునో కుసుమసాయకునివ్వి యేటులు దైవికంబుగన్.

ఇటఁ గవి మూలములోని యర్థమును మిక్కిలి పోషించెను. "అంబుతరంగలోలముల్" అనునెడ మూలములోనున్న లోల పదమునకు "అంబుతరంగ" యను నుపమానముం జేర్చుట మిక్కిలి శ్లాఘనీయమైయున్నది.

మూ. శ్లో॥ మందాకినీ నందనయోర్విహారే
దేవేభవేద్దేవరి మాదవేనా

శ్రియః శ్రియాం యాతరి యచ్చసఖ్యా
తచ్చేతసాభావిని ! భావయస్వ.

సీ. నందనోద్యాన మందారక చ్ఛాయల
విశ్రమింపఁగ నీకు వేడ్కగాదె
మందాకినీ పాంశుసమహిత సైకతములఁ
క్రీడసల్పఁగ నీకుఁ బ్రియముగాదె
దుగ్ధాబ్ధి కన్యక తోడికోడలు గాఁగ
నోరిమమైయుంట నీకొప్పుగాదె
మధుకైటభారాతి మఱఁదిరమ్మనిపిల్చి
పనిగొంట నీకుఁ బ్రాభవముగాదె
తే. మూఁడుసంధ్యల నీచేత మ్రొక్కుగొందు
రెవ్వరిటఁ దొల్లి యావేల్పులెల్ల నీకు
నర్థి మొక్కంగ నునికి భాగ్యంబుగాదె
యేల సందేహ మమరేంద్రు నేలి కొనుము.

ఇందు మూలములోనున్న " మందాకిని, నందన, దేవరి, యాతరి " యను నర్థమిచ్చు పదములను దెనుఁగునఁ గైకొని పెంచి వ్రాసియున్నాఁడు. మూలములోని గూఢార్థాభిప్రాయ మును వివరించి స్పష్టముగాఁ జెప్పెను. గీత మితని యూహాకల్పి తము. ఏది యెట్లయినను మూలముకంటె నిదియే మిక్కిలి రస వంతముగా నున్నదని చెప్పకతీఱదు.

మూ. శ్లో॥ త్రినేత్రమాత్రేణ రుషాకృతం య
త్తదేవయోద్యాపి న సంవృణోతి
న వేదరుష్టేద్య సహస్రనేత్రే
[illegible]

గీ. మూఁడుకన్నుల వేల్పుతోఁ బోహరించి
నేఁడు దేహంబు లేక యున్నాఁడు దాను
వేయికన్నులవేల్పుతోఁ బవిగ్రహించి
వనిత యింకేమిగా నున్నవాఁడొ మరుఁడు.

ఇది మూలమున కన్యూనానతిరిక్తమై మూలాభిప్రాయ
మును జక్కఁగా వివరించున దై యుండెను. మీఁదియాశ్వాసము
లోని పెక్కు పద్యములందు, సంస్కృతకల్పనముల నిమ్మహా
మహుఁ డిమిడ్చినట్లు వేఱొకఁడు చేయఁజాలడని నిశ్చయ
ముగాఁ జెప్పవచ్చును. ఇఁకను నిందుగుఱించి చర్చించిన
భారతమంతగ్రంథమగును. కాన గ్రంథవిస్తరభీతిచే నిఁక విర
మించెదను.

వ్యాఖ్యానమునుగూర్చి, కొంచెము వ్రాసెదను. ప్రౌఢత్వ
మునఁ బ్రసిద్ధిచెందినయాంధ్రప్రబంధములలో శృంగారనైషధ
మొకటియని చెప్పవచ్చును. వ్యాఖ్యాన సాహాయ్యంబు లేకుండ
నిట్టి గ్రంథము నర్థము చేసికొనుట సామాన్యులకేకాక పండి
తులకుఁగూడ నలవికాదేమోయని సంశయింపవలసియున్నది.
సంక్షిప్తవ్యాఖ్యానమైన లేకపోవుటచే మహారణ్యమువలె
దుష్ప్రవేశ మగునీగ్రంథమునకు ఘంటాపథమువంటి వ్యా
ఖ్యానము చేయించి ప్రకటించి లోకోపకారము చేయఁ
దలంచి యిప్పటికి సరిగా నాలుగేండ్లక్రిందటనే శ్రీమదానంద
యంత్రాలయమువారు నాకీ పని నప్పగించిరి. అది మిక్కిలి కష్ట
సాధ్యమైనను, నాశక్తి వినియోగించి నైషధ మహారణ్యము
లోనికి ఘంటాపథము గాకపోయినఁ జిత్తుదారి నేర్పాటుచేయు
టయుఁ గొంత లోకోపకారమే యగునని తలంచి యప్పని నారం

ఘించితి. స్వల్పకాలములోనే 4 ఆశ్వాసములు సవ్యాఖ్యాన ముగా నచ్చొత్తింపఁబడినను దక్కినభాగమును శీఘ్రకాల ములో ముగించునంతటి యవకాశము మాయంత్రాలయము వారికిఁ జిక్కినదికాదు. అందుచే నీగ్రంథమును బ్రకటింప నింత కాలముపట్టెను.విలంబనుయినగ్రంథము ముగించినందులకానంద ముద్రాయంత్రాలయము వారికి నెంతయుఁ గృతజ్ఞుఁడను.

శ్రీహర్ష మహాకవి కల్పనములకుఁ దన కల్పనాతిశయమును దోడ్పఱిచి శ్రీనాథునివంటి మహాకవి వ్రాసిన యీగ్రంథము నభిప్రాయములను నున్నదియున్నట్టు దీయనావంటివానికి సుకరము గాదు. అయినను బండితుల యభిప్రాయములనుగైకొనియు,మూ లంబును, దాని వ్యాఖ్యానములను, నాధారముగాఁ జేసికొనియు నాశక్తినంతయు నుపయోగించి నైషధగూఢార్థములను దెలు పునదగుటచే గూఢార్థప్రకాశికయను నామమున నొకవ్యా ఖ్యానము వ్రాసితిని. గ్రంథమునకు వ్యాఖ్యానము చేయుటకంటె నచ్చుప్రతులలోనున్న తప్పులను దిద్దుటయే యధికకష్టమయ్యె.

అది యట్టిశ్రమకరంబైనను నోర్చి వ్రాఁతప్రతులనుబట్టియు, మూలమునుబట్టియుఁ బెక్కుస్థలంబులఁగల తప్పులను దిద్దు టకుఁ గారణముల నాయాస్థలంబులలోనే వివరించియుంచుటచే నిట వివరింపఁ బనిలేదు. "వ్యాఖ్యాబుద్ధిబలాపేక్షా" యన్నట్లు నాబుద్ధికి సాధ్యముగాని యభిప్రాయములు మఱికొందఱు బుద్ధి మంతులకు సాధ్యము కావచ్చును. నాదాసియందుఁగల తప్పు టభిప్రాయములను మన్నించి సదభిప్రాయములను దెల్పినచోఁ బునర్ముద్రణమందు సవరించుకొందు. ఈనైషధపద్యముల తాత్పర్యార్థములను, నలంకారములను, స్పష్టముగాఁ దెల్పు

టకే వ్రాయఁబడిన దగుటచే నీవ్యాఖ్యానమందుఁ బాఠకులకు విసువుదలఁ బుట్టించు నిఘంటువులను, నుదాహరణంబులను జేర్పనందులకు క్షమింతురుగాక. అట్లని యూరకుండక మాఱు మూలపదములకు మాత్ర మచ్చటచ్చట నిఘంటువులఁ జేర్చితిని. రత్యాదిఘట్టములందు పద్యముల కర్థము విరివిగ వ్రాయుట యనుచితమని కఠినపదముల కర్థము వ్రాయఁబడియె. సప్తమాశ్వాసమున 13వ పద్యమున యతిమాసి కోపాసి యతిథి యనుదానికి మాఱుగా "యతిమాచకమ్మ గొడ్రా" లని పొరపాటువలనఁ బడినది. కాన దానిదిద్దుకొనఁ జదువరులు ప్రార్థితులు. అచ్చుప్రతులలోఁ గుప్పలుగాఁబడియున్న తప్పులనెడి మహాగణ్యమును భేదించుటకుఁ గుఠారమనఁదగిన యొక తాటియాకులప్రతి నొసంగినవారును, బొబ్బిలియాస్థానకవులును నగు బ్రహ్మశ్రీమండలేముల సీతారామ శాస్త్రులవారికిఁ గృతజ్ఞతానందనము లర్పించెదను. మూలమునను నా వ్యాఖ్యానమునను గల తప్పులనుదిద్ది, యవ్వియెడల మఱింత చక్కనియర్థము యవరించి, నా వ్యాఖ్యకెంతయో మెంఱుగుగూర్చి మిక్కిలియు సాయము చూపినవారును, నానంద ముద్రాక్షులశాలాపండితులును నగు, తం. తేవప్పెరుమాళ్లయ్యగారికిని, తగినంత ధనవ్యయమున కోర్చి యీ వ్యాఖ్యానసహితనైషధమును బ్రకటించి నా కష్టమును సఫలము గావించినందులకు "ఆర్" వేంకటేశ్వర్, అండ్ కంపెనీ వారికిని నెంతయుఁ గృతజ్ఞుఁడను.

| | |
|---|---|
| సంస్కృతపాఠశాల ! | ఇట్లు, |
| విజయనగరము. | విన్నవించు విధేయుఁడు, |
| 6-5-1914. | కేతవరపు - వేంకటశాస్త్రి. |



శ్రీరస్తు.

# శృంగారనైషధము.

## టీకాతాత్పర్యసహితము.



## ప్రథమాశ్వాసము.



రామాకుచమండలీమృగమద
శ్రీగంధసంవాసిత
స్ఫారోదారభుజాంతరుండు ధరణీ
సంశ్లేషసంభావనా
పారీణుండు కృతార్థుఁ జేయుఁ గరుణా
పాథోధి పద్మాక్షుఁ డిం
పారన్ మామిడి పెద్దమంత్రిసుతు సిం
గామాత్యచూడామణిన్.

అవ:—కవి తాను ప్రారంభించినగ్రంథము నిర్విఘ్నముగాఁ బరిసమాప్తి నొందుటకుఁ దొలుత మంగళము నాచరించువాఁడై 'ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశో వాఽపి తన్ముఖమ్' అను వచనముచొప్పున గ్రంథాదిని ఆశీరూపమైన మంగళము నాచరించుచున్నాఁడు.

టీ. శ్రీరామా......భుజాంతరుండు-శ్రీరామా=శ్రీమహాలక్ష్మియొక్క, కుచమండలీ = వక్షమగు స్తనప్రదేశములయందలి, మృగమద=కస్తూరిచేతను, శ్రీగంధ=మంచిగంధముచేతను, సంవాసిత = పరిమళింపఁజేయఁబడినట్టిదియు, స్ఫార=పెద్దదయినదియు,ఉదార=విశాలమయినదియు, అగు,భుజాంతరుండు=వక్షస్స్థలము గలవాఁడును, ధరణీ... పారీణుండు -ధరణీ = భూమియొక్క, సంశ్లేష = ఆలింగనమును, సంభావనా = గౌరవించుటయందు, పారీణుండు= మిక్కిలి నేర్పరియయినవాఁడును, కరుణాపాథోధి=దయాసముద్రుఁడును, అగు, పద్మాక్షుఁడు=పద్మములవంటి నేత్రములు గలవాఁడు. అనఁగా-విష్ణుమూర్తి, మామిడి పెద్దమంత్రిసుతున్=మామిడి పెద్ద మంత్రి యొక్క కుమారుఁడగు,సింగామాత్య చూడామణిన్= సింగన్నయనెడి పేరుగల మంత్రిశ్రేష్ఠుని, కృతార్థుఁ జేయున్ = నెఱవేర్పఁబడిన సమస్తకార్యములు గలవానినిగాఁ జేయుఁ గాత:—

ఇట మృగమదసంవాసితభుజాంతరత్వముతోడ ధరణీ సంశ్లేషసంభావనను జెప్పుటవలనిసారస్య మేమన:— శ్రీవిష్ణుదేవుఁడు తాను భూదేవి సువ్యక్తముగాఁ గౌఁగిలించుకొన్నయెడల శ్రీదేవికిఁ గోపముగలుగుననితలఁచి, మొదట శ్రీదేవిని గౌఁగిలించుకొని యామెకుచములందలి కస్తూరి తనవక్షమందు నంటుకొన్నపిదప భూదేవిని గౌఁగిలించెననియు భూమి నల్లనిదిగనుక నల్లనికస్తూరియందామె సువ్యక్తముగాఁ దోఁపకుండెననియు భావము స్ఫురించుచున్నది. ఇట'శ్రీగంధశబ్దముచే 'గన్ధవతీ పృథివీ' అని యున్నదికాన ట్టిభూమిగంధము కస్తూరిగంధమునందుమాటుపడి యుండెనని యొకసారస్యము గుదురుచున్నది; 'సంవాసిత' శబ్దమునందలి 'సం' అనునుపసర్గముచే స్ఫారోదార మైన భుజాంతరము మిక్కిలి వాసితమగు నంతయధికముగాఁ గస్తూరియంటుటచే భూదేవి యందుఁ గనుపట్టకుండెననియు, కేవల'ధరణీసంశ్లేషము' ను గావించినాఁడని చెప్పక ధరణీసంశ్లేషపు సంభావన యందు 'పారీణుఁ' డనుటచేఁ గౌఁగిలి పచరించుట యందలి మెలపును నేరుపును సూచితములు. కవి కృతిపతికిఁ బరమాభ్యుదయము గల్గుగుటకె యుండు ని ష్టువునను లక్ష్మీదేవ్యాలింగనోత్తరకాలమును భూదే

వ్యాలింగనకాలమునునగు పరమానందానుభవసమయము ననుసంధించెను. మఱి యు నద్దేవునకు శ్రీపతిత్వమును భూపతిత్వమును వర్ణించుటచే నట్టిదేవునివలనఁ గృతిపతికి శ్రీసమృద్ధియు భూసమృద్ధియుఁ గలుగుఁగాకయని యాశయము.

తా. శ్రీదేవి గబ్బిగుబ్బలయందలి కస్తూరికాశ్రీగంధములచేతఁ బరిమళింపఁ జేయఁబడినట్టి మిక్కిలి గొప్ప వక్షస్థ్సలము గలవాఁడును, భూదేవి నాలింగ నముచేసి కొనుటయందు దక్షుఁ డయినవాఁడును, దయాసముద్రుఁడునగు విష్ణుమూర్తి మామిడి పెద్దమంత్రిగారి కుమారుఁ డయినసింగనామాత్యుని, నతఁ డు తలంచినకార్యముల నన్నింటిని నెఱవేర్చి రక్షించుఁగాత.

మ. కనకక్షోణిధరంబు కార్ముకముగాఁ గద్రూతనూజుండు శిం
జినిగా మాధవుఁ డమ్ముగాఁ బురము లక్షీణైకదోశ్శక్తి గె
ల్చినజోదీశ్వరుఁ డిచ్చుగాత జయలక్ష్మీసుస్థిరైశ్వర్యశో
భనముల్ పెద్దయసింగమంత్రికి జగత్ప్రఖ్యాతసత్కీర్తికిన్.

టీ. కనకక్షోణిధరంబు=బంగారుకొండ - అనఁగా మేరుపర్వతమనుట, కార్ముకము కాఁ=ధనువు కాఁగా, కద్రూతనూజుండు = ఆదిశేషుఁడు, శింజి నిగాఁ =అల్లెత్రాడుకాఁగా, మాధవుఁడు=విష్ణుమూర్తి, అమ్ముగాఁ = బాణము కాఁగా, అక్షీణైకదోశ్శక్తి-అక్షీణ=గొప్పదయిన, ఏక = ముఖ్యమయిన, దోశ్శ క్తిఁ = బాహుసామర్థ్యముచే, పురములు=త్రిపురములను, గెల్చినజోదు= గెల్చిన వీరుఁడగు, ఈశ్వరుఁడు = శంకరుఁడు, జగత్......కీర్తికిఁ - జగత్ =లోక మునందు, ప్రఖ్యాత=ప్రసిద్ధిచెందిన, సత్కీర్తికిఁ =మంచియశస్సు గలవాఁడైన, పెద్దయసింగమంత్రికిఁ = పెద్దమంత్రిగారి సింగన్నకు, జయ...శోభనముల్ -జ య=శత్రుజయమనెడి,లక్ష్మీ=సంపత్తిని, సుస్థిర ఐశ్వర్య=మిక్కిలి నిశ్చలమయి నయైశ్వర్యమును,అనెడుశోభనముల్ =శుభములను,ఇచ్చుఁగాత=ఒసంగుఁగాక.

బంగారుకొండ విల్లు. శేషుఁడు నారి. విష్ణుఁడమ్ము. ఇట్టియనన్యసామాన్యపరిక రముచే ననన్యశక్యములైన త్రిపురములను నీశ్వరుఁడు జయించినట్టివాఁడుగావు న నే కృతిపతికి జయలక్ష్మినిచ్చుఁగాతయనుట. ఈశ్వరుండు గావున సుస్థిరైశ్వ ర్యమునిచ్చుఁగాతయని చమత్కారము.

తా. మేరుపర్వతమును విల్లుగాఁ జేసికొని యనంతుని నల్లెత్రాడుగాఁ జేసికొని, నారాయణుని బాణముగాఁ జేసికొని, యమితమయిన బాహుబలముచేతఁ త్రిపురముల సంహరించి జయముగొన్న యీశ్వరుండు సింగనమంత్రికి జయసంపత్తిని, నైశ్వర్యము ననుశుభములను నొసంగి రక్షించుఁగాక.

ఉ. హాటకగర్భుచేతఁ గమలాసనుచేఁ జతురాస్యకంఠశృం
  గాటకవీథికాకృతవిగాహచతుశ్శ్రుతిచేత దేవతా
  కోటికిరీటసంఘటితకోమలపాదసరోజుచే జగ
 న్నాటకసూత్రిచేతఁగృతినాథుఁడుగాంచుఁజిరాయురున్నతుల్.

టీ. హాటకగర్భుచేతన్ - హాటక = సువర్ణవికారమయిన యండమే, గర్భ = ఉత్పత్తిస్థానముగాఁ గలవానిచేతను - సృష్టికిఁ బూర్వము హిరణ్మయాండము పుట్టినట్లును, నాయండమునుండి చతుర్ముఖుం డుద్భవించినట్లును జెప్పుదురు. కమలాసనుచేన్ = పద్మమేసింహాసనముగాఁగల వానిచేతను, చతురాస్య... శ్రుతిచేతన్ - చతుర్ = నాలుగయిన, ఆస్య = వదనములుగల, కంఠ = కుత్తుకయనెడి, శృంగాటకవీథికా = నాలుగుత్రోవలుకలసెడుచోటయిన వీథియందు, కృత = చేయఁబడిన, విగాహ = సంచారము గల, చతుశ్శ్రుతిచేతన్ = నాలుగయిన వేదములు గలవానిచేతను - అనఁగా బ్రహ్మ కంఠముననుండి నాలుగు వదనములమూలమున వెడలివచ్చుచున్న నాలుగువేదములు గలవాఁడని భావము, దేవతా... సరోజుచేతన్ - దే-తా = సురలయొక్క, కోటి = సమూహముయొక్క, కిరీట = కిరీటములచేత, సంఘటిత = తాఁకఁబడుచున్నట్టియు, కోమల = మృదువయిన, పాదసరోజుచేన్ = పాదపద్మములు గలవానిచేత—అనఁగా సమస్తదేవతలచేతను వారికిరీటములు తనయడుగులుసోఁకునట్లు నమస్కరింపఁబడుచున్న వాఁడనిభావము, జగన్నాటకసూత్రిచేతన్ - జగత్ = లోకమనెడి, నాటక = నాటకమునకు, సూత్రిచేతన్ = సూత్రధారునివంటివానిచేత - అనఁగా నాటకములను సూత్రధారుఁడు నడపుచున్నట్లుగా లోకములను బ్రవర్తింపఁజేయుచున్నవాఁడగు బ్రహ్మచేత, కృతినాథుఁడు = కృతిపతియయిన సింగనామాత్యుఁడు, చిరాయురున్నతుల్ = పూర్ణాయువును మహోన్నతియును, గాంచుచున్ = పొందుఁ

గాక. హాటకమునఁ బుట్టి, కమలాసనమును మెట్టి, చతుర్వేదముల నధిగమించి, దేవతాపూజ్యపాదుఁడై, జగములనెల్ల వర్తిల్లఁజేయునట్టి యున్నతి గాంచిన బ్రహ్మ కృతిపతి కున్నతిఁ జేయుఁగాత యనియు 'ఆయుష్యంకమలాసనోవిత; రతాత్' అనువచనముచొప్పున నాయుర్దాతయగుటచేఁ బూర్ణాయుర్దాయము నిచ్చుఁ గాతయనియు నాశయము. "చతురానన...శ్రుతిచేత" అనువిశేష ణమువలన ఎల్లపుడు బ్రహ్మ వేదములఁ బఠించుచున్నవాఁడు గావున బరిపూత మయినవాక్కులు గలవాఁడగుటంజేసి యితనివాక్యప్రకారమునఁ జిరాయువు గలుగుననియు, వేదోక్తమయిన యాయువు నీఁగలవాఁడనియు సారస్యము స్ఫురించుచున్నది.'

తా. హిరణ్యగర్భుఁడును, పద్మసింహాసనుఁడును, నాలుగు ముఖములుగల కుత్తుకయను శృంగాటకవీథియందు సంచారముచేయుచున్న నాలుగు వేదము లు గలవాఁడును, సమస్తదేవతలచేతనునమస్కరింపఁబడుచున్నవాఁడును, జగ న్నాటకసూత్రధారియు నగుబ్రహ్మవలనఁ గృతినాయకుఁ డయినసింగనామా త్యుఁడు పరిపూర్ణాయువును మహోన్నతియును బడయుఁగాక.

శా. జేజే యంచు భజింతు నిష్టఫలసంసిద్ధుల్ మదిం గోరి ని
ర్వ్యాజప్రౌఢకృపావలంబునిఁ గటప్రస్యందిదానాంబునిం
బూజాతత్పరదేవదానవకదంబున్ బాలకేళీకలా
రాజత్కౌతుకరంజితోరగపతిప్రాలంబు హేరంబునిన్. 4

టీ. ఇష్టఫలసంసిద్ధుల్-ఇష్ట=కోరఁబడిన, ఫల=ఫలముయొక్క, సంసిద్ధుల్ =ప్రాప్తులను, మదిన్=మనస్సునందు, కోరి=యపేక్షించి, నిర్వ్యాజ...లంబు నిన్-నిర్వ్యాజ=నిర్హేతుకమును, ప్రౌఢ=ఉదారమునయిన, కృపా=దయకు, అవలంబునిన్=ఆదరవయినట్టివాఁడును, కటప్రస్యందిదానాంబునిన్-కట=చె వుడలవలన, ప్రస్యంది=స్రవించుచున్న, దానాంబునిన్=మదజలము గలవాఁడు ను,పూజా...కదంబున్-పూజా=తన్నుఁ బూజించుటయందు, తత్పర=ఆసక్తు లైన, దేవదానవ=దేవతలయొక్కయు రాక్షసులయొక్కయు, కదంబునిన్= సమూహము గలవాఁడును, బాల...ప్రాలంబునిన్-బాలకేళీకలా=బాలక్రీడా

చాతుర్యముచే, రాజత్=ప్రకాశించుచున్న, కౌతుక=కౌతూహలముచేత, రంజిత=రంగువేయఁబడిన, ఉరగపతి=సర్పరాజును, ప్రాలంబున్ = హారముగాఁ గలవాఁడునగు, హేరంబునిన్ =విఘ్నేశ్వరుని, జేజే యంచున్ =నమస్కారమని పలుకుచు, భజింతును=సేవింతును.

ఇట 'కట...దానాంబునిన్' దానశబ్దస్వారస్యముచే ఎడతెగని దానధారలుగలవాఁడు-అనఁగా మిక్కిలిదాతయనుట స్ఫురించుచున్నది. కృప నిర్వ్యాజమైనది; దానధారయెప్పుడును గలఁదు; దేవదానవులకును బూజ్యుఁడగునట్టిమహిమగలవాఁడు; బాల్యదశయందే శేషునిఐంటివానిని నవలీల హారముగావేసికొన్నట్టి మహాశక్తిమంతుఁడు. ఏవంవిధానేకగుణప్రభావ సంపన్నుఁడుగావున నేయిష్టఫలసంసిద్ధులకై భజింతునని సంసిద్ధి బహువచనమునస్ఫురితము.

తా. నిర్హేతుకమయిన దయారసమున కాధారుఁడును, గండస్థలముల నుండి స్రవించుచున్నమదజలము గలవాఁడును, సమస్తసురాసురలచేఁ బూజింపఁబడుచున్నవాఁడును, చిన్నతనమునందే నాటలయందలి వేడుకంబట్టి సర్పరాజునకు రంగువేసి హారముగా ధరించినవాఁడునగు వినాయకునికి నమస్కరించుచు నిష్టఫలములను బొందుటకై సంతతము మనస్సునందు భజించుచుందును.

సీ. సింహాసనము చారుసితపుండరీకంబు
చెలికత్తె జిలుబారుపలుకుచిలుక
శృంగారకుసుమంబు చిన్నిచుక్కలరాజు
పసిఁడికిన్నెరవీణె పలుకుదోడు
నలువనెమ్మోముఁదమ్ములు కేళిగృహములు
తలుకుటద్దంబు సత్కవులమనసు
వేదాదివిద్యలు విహరణస్థలములు
చక్కనిరాయంచ యెక్కిరింత
తే. యెపుడు నేదేవి కాదేవి యిందుకుంద
చంద్రచందనమందారసారవర్ణ

శారదాదేవి మామకస్వాంతవీథి
నిండువేడుక విహరించు సుండుఁగాత. 5

టీ. ఎపుడున్ = ఎల్లప్పుడు, ఏదేవికిన్ = ఏసరస్వతీదేవికి, చారుసితపుండరీకంబు - చారు = సుందరమయిన, సితపుండరీకంబు = తెల్లదామరపూవు, సింహాసనము = సింగపుగద్దియయై, ఒప్పున్ (అని క్రియాపద మధ్యాహారము చేసి యీపద్యమునఁ బ్రతివాక్యమునయందుఁ జేర్పవలెను)= ప్రకాశించునో; ఏదేవికిన్ = ఏసరస్వతికి, జిలుబారుపలుకుచిలుక = ముద్దులొలుకు పలుకులు గలయట్టిచిలుక, చెలికత్తె = సఖియై, ఒప్పున్; చిన్నిచుక్కలరాజు = బాలచంద్రుఁడు, ఏదేవికిన్ = ఏసరస్వతికి, శృంగారకుసుమంబు- శృంగార=అలంకారార్థ మగు, కుసుమంబు= పుష్పమయి, ఒప్పున్; ఏదేవికిన్ = ఏసరస్వతికి, పలుకుఁదోడు = పలుకరించుటకుఁ దోడు, పసిఁడికిన్నెరవీణె = బంగారపు కిన్నెరయనువీణె యయి, ఒప్పున్; ఏదేవికిన్ = ఏసరస్వతికి, కేళీగృహములు = క్రీడామందిరములు, నలువనెమ్మోముఁదమ్ములు-నలువ = బ్రహ్మయొక్క, నెమ్మోముఁదమ్ములు=ముఖపద్మములయి, ఒప్పున్; ఏదేవికిన్ = ఏసరస్వతికి. సత్కవులమనసు - సత్కవుల = రసికులగు కవీశ్వరుల యొక్క,మనసు = చిత్తము, తళుకుటద్దంబు=నిగ్గుటద్దమయి,ఒప్పున్ -అనఁగా నద్దమునందువలెఁ గవులయొక్క హృదయంబులయందుఁ బ్రతిఫలించు నను ట,ఏదేవికిన్=ఏసరస్వతికి, విహరణస్థలములు=విహరింపఁదగినచోట్లు,వేదాదివిద్యలు = వేదములు మొదలగువిద్యలయి, ఒప్పున్;ఏదేవికిన్ =ఏసరస్వతికి, ఎక్కిరింత = వాహనము, చక్కనిరాయంచ = సుందరమగు రాజహంసమయి, ఒప్పున్, ఆదేవి = ఆదివ్యకాంతయు, ఇందు... సారవర్ణ-ఇందు=చంద్రుఁడు, కుంద=మల్లెలు, చంద్ర = పచ్చకప్పురము, చందన = మంచిగంధము, మందార=కల్పవృక్షములు వీని వలె,సార=నిగ్గయిన, వర్ణ=దేహచ్ఛాయ గలట్టియు,శారదాదేవి=సరస్వతి, మామకస్వాంతవీథిన్ -మామక=నాసంబంధియగు, స్వాంతవీథిన్ = చిత్తమునందు, నిండువేడుకన్ = పూర్ణమయినవేడుకతో, విహరించుచుండుఁగాత= ఆడుకొనుచుండుఁగాక.

తా. ఏసరస్వతీదేవికిఁ బుండరీకము సింహాసనమయి, చిలుక చెలికత్తెయయి, చంద్రుఁడు శృంగారపుష్పమయి, మాటలోఁడు కిన్నెరయనునట్టి వీణయై, కేళీమందిరములు బ్రహ్మముఖపద్మములయి, కవీశ్వరుమానసము తళ్కుటద్దమయి, విహారస్థలములు వేదములు మొదలగువిద్య లయి, వాహనము రాజహంస మై యొప్పునో యట్టియు, చంద్రకుందాదుల ఛాయవంటిఛాయగలిగియొప్పుచున్న, యా సరస్వతీదేవి నాచిత్తమునం దెల్లప్పుడు సంచరించుఁగాక.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు చేసి. 6

అర్థము సులభము.

సీ. వ్యాసవాల్మీకిసంయమివాక్సుధాంభోధి
లోలోర్మిపంక్తుల నోలలాడి
భట్టబాణమయూరభారతీసందర్భ
సౌభాగ్యగరిమంబు సంగ్రహించి
భాససౌమిల్లకప్రతిభాసమున్మేష
హేలావిశేషంబు నిచ్చగించి
మాఘభారవివచోమకరందనిష్యంద
మాధుర్యమునకు సమ్మదమునొంది.

తే. కాళిదాసు మనంబులోఁ గాంచి మ్రొక్కి
రాజశేఖరుఁ గవిరాజుఁ బ్రస్తుతించి
ధీరమతి నన్నపార్యుని దిక్కయజ్వ
శంభుదాసునిఁ గరమర్థి సన్నుతించి. 7

టీ. వ్యాస...పంక్తులన్ - వ్యాస సంయమి = వ్యాసమహామునియొక్కయు, వాల్మీకిసంయమి = వాల్మీకిమునియొక్కయు, వాక్ = వాక్యములనెడి, సుధాంభోధి = అమృతసముద్రముయొక్క, లోల = చలించుచున్న, ఊర్మిపంక్తులన్ = తరంగపంక్తులయందు, ఓలలాడి= ఈఁదులాడి, అనఁగా వ్యాసుఁడు వాల్మీకి రచించిన భారతాదిగ్రంథములను రామాయణ మనుగ్రంథమును జ

క్కఁగాఁ జదివికొని యందలిరసము ననుభవించియనుట, భట్ట...గరిమంబు- భట్టబాణ = భట్టబాణుఁడను కవీశ్వరునియొక్కయు, మయూర = మయూరుఁడను కవీశ్వరునియొక్కయు, భారతీ = వాక్యములయొక్క, సందర్భసౌభాగ్య = సందర్భ సంపదయొక్క, గరిమంబు = పెంపును, సంగ్రహించి = సంపాదించి- అనఁగా భట్టబాణుఁడు మయూరుఁడు ననుకవీశ్వరులు రచించినకావ్యములసందర్భములను బాగుగాఁ దెలిసికొని, భాస...విశేషంబు-భాస= భాసుఁడనుకవియొక్కయు, సౌమిల్లక=సౌమిల్లకుఁడను కవియొక్కయు, ప్రతిభా= క్రొత్తక్రొత్తవికాసముగల బుద్ధియొక్క,సమున్మేష=వికాసముయొక్క, హేలా విశేషంబు=లీలలయొక్క వైఖరిని, ఇచ్ఛగించి=ఇష్టపడి - అనఁగా భాససౌమిల్లాది కవీశ్వరులు తమప్రతిభావిశేషముచే రచించినకావ్యములయందలి లీలామహిమను మనస్సునకుఁ బట్టించికొని యనుట, మాఘ...మాధుర్యమునకున్ - మాఘ=మాఘుఁడనెడి కవియొక్కయు, భారవి=భారవి యనెడి కవియొక్కయు, వచస్ =వాక్యములనెడి, మకరంద నిష్యంద=మకరందప్రవాహముయొక్క, మాధుర్యమునకున్ =తియ్యఁదనమునకు, సమ్మదమున్ =సంతసమును, ఒంది=పొంది, - అనఁగా మాఘభారవికవీశ్వరులచే రచితములై మకరందములొలుకునట్టికావ్యములనుఁ జక్కఁగాఁ జదివి అనుట, కాళిదాసున్ = కాళిదాసుఁడను మహాకవిని, మనంబులోన్ = మనస్సునందు, కాంచి = చూచి- అనఁగాఁ దలంచి, మ్రొక్కి=నమస్కరించి,కవిరాజున్ =కవులలో శ్రేష్ఠుఁడయిన, రాజశేఖరున్ =రాజశేఖరుఁ డనుకవీశ్వరుని, ప్రస్తుతించి=స్తోత్రముచేసి, ధీరమతిన్ =నిశ్చలమయిన బుద్ధిగల, నన్నపార్యునిన్ =నన్నయభట్టారకుని,తిక్కయజ్వన్ =తిక్కనసోమయాజిని, శంభుదాసునిన్ =ఎఱ్ఱాప్రగ్గడను, కరము=మిక్కిలి, అర్థిన్ =అక్కఱతో,సన్నుతించి=స్తోత్రము చేసి.

తా. ఈపద్యమునఁ గవీశ్వరులకు నమస్కారముచేయుచున్నానని చెప్పక గ్రంథకర్త యాయాకవీశ్వరుల గ్రంథములఁజదివియందలిసారమును గ్రహించినాఁడనని చెప్పుటచే నితనిగ్రంథ మాయాకవుల గ్రంథములయందున్న చమత్కారములవంటి చమత్కారములు కలదగుటచే మిగులనింపుగానుండుననితోఁ

చుచున్నది. మఱియు బూర్వకవిచంద్రులు చెప్పినవిషయములనే నేఁజెప్పు చున్నానుగాని నేను గ్రొత్తగాఁ జేసినదేదియులేదుసుఁడీయని యహంకారపరిహారము చేసికొన్నట్లుగూడ స్ఫురించుచున్నది.

వ. నవరసభావానుబంధబంధురంబు గా నొక్క ప్రబంధంబు నిర్మింపఁ దలంచి కౌతూహలాధీనమానసుండనై తన్మహాప్రబంధప్రారంభంబునకుం దగినపుణ్యశ్లోకపురాతనమహారాజచరిత్రం బెయ్యదియొకో యని వితర్కించు చున్నసమయంబున. 8

టీ. నవ...బంధురంబుగాన్, నవరస=శృంగారవీరాదులగుతొమ్మిదిరసములను వెలువరించు, భావ=భావములయొక్క, అనుబంధ=సంబంధముచే, బంధురంబుగా=అతిశయించునట్లుగా, ఒక్క ప్రబంధంబున్=ఒక కావ్యమును, నిర్మింపన్ తలంచి= రచింప నిశ్చయించి, కౌతూహలాధీన మానసుండనై= కౌతూహలమునకు లోఁబడినమనస్సు కలవాఁడనై, తత్...ప్రారంభమునకున్-తన్మహాప్రబంధ=ఆగొప్పప్రబంధముయొక్క, ప్రారంభమునకున్ = మొదలిడుటకు, తగిన...చరిత్రంబు -తగిన=అర్హమైన, పుణ్యశ్లోక = పవిత్రమయినకీర్తి గల, పురాతన=ప్రాచీనుఁడయిన, మహారాజ=గొప్పరాజుయొక్క, చరిత్రంబు=చారిత్రము, ఎయ్యది ఒకో అని=ఏది కలదో యని, వితర్కించుచున్=ఆలోచించుచు, ఉన్న సమయమున.

సీ. తనకృపాణము సముద్ధతవైరిశుద్ధాంత
తాటంకములకెగ్గు దలఁచుచుండఁ
దనబాహుపీఠంబు ధరణిభృత్కమఠాహి
సామజంబులకు విశ్రాంతి యొసఁగఁ
దనకీర్తినర్తకి ఘనతరబ్రహ్మాండ
భవనభూములఁ గొండ్లి సలుపఁ

దనదానమహిమ సంతానచింతారత్న
జీమూతసురభులకు సిగ్గుపఱుపఁ
తే.గీ. బరఁగు శ్రీవేమమండలేశ్వరునిమంత్రి
యహిత దుర్మంత్రివదనముద్రావతార
శాసనుఁడు రాయవేశ్యాభుజంగబిరుద
మంత్రి పెద్దయసింగనామాత్యవరుఁడు. 9

టీ. తనకృపాణము= తనయొక్క కత్తి, సముద్ధత... తాటంకములకున్ = సముద్ధత=గర్వించిన, వైరి=శత్రువులయొక్క, శుద్ధాంత=అంతఃపుర స్త్రీలయొక్క, తాటంకములకున్ = బంగారపు మెఱుఁగుకమ్మలకు, ఎగ్గు=హానిని, తలఁచుచుండన్ =ఆలోచింపుచుండఁగా-అనఁగా స్త్రీలు తమభర్తలు సజీవులైయున్నప్పుడలంకారములఁదాల్చుటయు, వారు సమసినప్పు డలంకారములను బరిహరించుటయు విహితకృత్యము. కావునఁ దనకత్తి శత్రురాజులనుజంపుటచే వారిభార్యలు విభూషణములఁ బరిహరింతురుకాన తనకత్తి తాటంకపరిహారమునకుఁ బరంపరాకారణమగుచున్నదని భావము, తనబాహుపీఠంబు=తనయొక్క బాహువులనెడిపీఁట, ధరణి...సామజంబులకున్ = ధరణిభృత్-కులపర్వతములకు, కమఠ = ఆదికూర్మమునకు, అహి = సర్పరాజునకు, సామజములకున్ =దిగ్గజములకును, విశ్రాంతి=బడలికను దీర్చుటను, ఒసఁగన్ = ఇచ్చుచుండఁగా-అనఁగాఁ దాను భూభారమును వహించుటచే నిదివఱకు భూభారము వహించుచున్న కులపర్వతములు నాదికూర్మను శేషుఁడు దిగ్గజములు తమయాయాసమును బోఁగొట్టుకొనుచున్న వని భావము, తనకీర్తినర్తకి = తనయొక్క కీర్తినటి, ఘన...భూములన్ - ఘనతర=మిగులగొప్పది యగు, బ్రహ్మాండ=బ్రహ్మాండమనెడి,భవన= నాట్యశాలయొక్క, భూములన్ =ప్రదేశములయందు,గొండ్లిన్ = నాట్యమును,పరిఢవింపన్ = ప్రవర్తింపఁజేయుచుండఁగా-అనఁగాఁ దననిర్మలమయినకీర్తి బ్రహ్మాండమునందంతటను వ్యాపించుచుండఁగా నని భావము. తనదానమహిమ=తనయొక్క దానాతిశయము, సంతాన...సురభులన్ - సంతాన=కల్పవృక్షమును, చింతారత్న=చింతామణిని, జీమూత=మే

ఘుని, సురభులన్ =కామధేనువును, సిగ్గుపఱుపన్ =సిగ్గుపడునట్లు చేయుచుండఁగా- అనఁగా వితరణగుణమందుఁ బ్రసిద్ధి చెందినకల్పవృక్షము చింతామణి మేఘుఁడు కామధేనువు మొదలగువానికి సిగ్గు పొడమునట్లు దానముచేయుచున్నాఁడని భావము. పరఁగు...మంత్రి, పరఁగు=ప్రవర్తించుచున్న, శ్రీవేమమండలేశ్వరుని=లక్ష్మీసంయుతుఁడయిన వేమమండలాధిపునియొక్క, మంత్రి =ప్రెగ్గడయు, అహిత...శాసనుఁడు-అహిత=శత్రువులయొక్క, దుర్మంత్రి= దుష్టమంత్రులయొక్క, వదన=నోళ్లను, ముద్రావతార=మూయునట్లుచేయుటకు, శాసనుండు=ఆజ్ఞాపించువాఁడును, అనఁగా శత్రురాజులమంత్రులు పన్నుచున్నయుక్తుల నించునట్లు యుక్తులపన్ని వారినోళ్లను మూయించువాఁడని తాత్పర్యము, రాయ...మంత్రి-రాయవేశ్యాభుజంగ = రాయవేశ్యాభుజంగ యనెడు, బిరుద=బిరుదపదము, మంత్రి=సహాయముగాఁగలవాఁడు-అనఁగా రాయవేశ్యాభుజంగయనెడి బిరుదపదము కలవాఁడని భావము, పెద్దయ్యసింగనామాత్యవరుఁడు=అటువంటి పెద్దయగారి సింగన్నయనెడి మంత్రిశ్రేష్ఠుఁడు.

శా. పంచాంగస్థిరమంత్రరక్షణకళాప్రౌఢుండు బాలామనః
పాంచాలుండు విరించివంశజలధిప్రాలేయభానుండు దో
శ్చంచచ్చాపకృపాణలబ్ధవిజయైశ్వర్యుండు దిక్కామినీ
కాంచీమౌక్తికకీర్తి పెద్దవిభుసింగం డొక్కనాఁ డిమ్ములన్.

టీ. పంచాంగ...ప్రౌఢుండు-పంచాంగ=సహాయ, సాధనోపాయ, దేశవిభాగ, కాలవిభాగ, విపత్ప్రతీకారము లనుపీనిచే, స్థిర = నిశ్చలమయిన, మంత్ర=రహస్యములను, రక్షణకళా = రక్షించుటయనెడివిద్యలందు, ప్రౌఢుండు=ప్రగల్భుఁడయినవాఁడును, బాలా...పాంచాలుండు - బాలా=జవరాండ్రయొక్క, మనః=మనస్సునకు, పాంచాలుండు=పాంచాలజాతిపురుషునివంటివాఁడును-అనఁగాఁ బ్రియుఁడని భావము. విరించివంశజలధిప్రాలేయభానుండు- విరించివంశ = బ్రహ్మవంశమనెడి, జలధి=సముద్రమునకు, ప్రాలేయభానుండు= చంద్రునివంటివాడును, దో...శ్వర్యుండు- దోః = బాహువులయందు, చంచత్ =ప్రకాశించుచున్న, చాప=ధనుస్సుచేతను, కృపాణ=కత్తిచేతను, లబ్ధ=

పొందఁబడిన, విజయ+ఐశ్వర్యుండు= విజయసంపదలు కలవాఁడును, దిక్ ... కీర్తి-దికామినీ=దిక్కులనెడి స్త్రీలయొక్క, కాంచీ = మొలత్రాటియందున్న, మౌక్తిక=ముత్యములుగాఁ బరిణమించిన, కీర్తి= యశస్సుగలవాఁడును, పెద్దవిభుసింగఁడు= పెద్దప్రభువుగారికుమారుఁడయిన సింగనామాత్యుఁడు, ఒక్కనాఁడు=ఒకదినమందు, ఇమ్ములన్ =బాగుగా... పైపద్యముతో నన్వయము.

తా. సహాయసాధనోపాయ దేశకాలవిభాగ విపత్ప్రతీకారము లనెడి పంచాంగములచే, రహస్యాలోచనములను శత్రువులకుఁ దెలియకుండఁ గాపాడుటయందు నేర్పుగలిగి, యువతులకుఁ బాంచాలపురుషునివలెఁ బ్రియతముఁడై, సముద్రమును చంద్రునట్లు బ్రాహ్మణవంశమును వర్ధిల్లఁజేయుచు, తనబాహువులందున్న చాపకృపాణములచే శత్రువుల గెలిచి జయముపొందుచు దిగంతములపఱకు వ్యాపించినకీర్తి కలవాఁడగు సింగనామాత్యుఁ డొకదినమందు.

వ. మృదుమధురచిత్రవిస్తరకవితావిలాసవాగీశ్వరు లగుకవీశ్వరులును బతంజలికణాదాక్షచరణపక్షిలాది శాస్త్రసిద్ధాంతకమలవనహంసు లగువిద్వాంసులును భరతమతంగదత్తిళకాపాలాంజనేయప్రణీతసంగీతవిద్యా రహస్యవిజ్ఞానవైజ్ఞానికస్వాంతు లగుకళావంతులును శక్తిత్రయచతురుపాయషాడ్గుణ్యప్రయోగయోగ్యవిచారు లగు రాయబారులును నిఖిలపురాణేతిహాస సంహితాతాత్పర్యపర్యాలోచనాధురంధరధిషణాసముత్సాహం బగుపౌరాణికసమూహంబును బరివేష్టింపం గొలువుండి సకలవిద్యాపారంగతుండు సరససాహిత్యగోష్ఠీవినోదప్రసంగంబున.

టీ. మృదు... వాగీశ్వరులు-మృదు = మృదులశైలి గలట్టియు, మధుర= ఇంపైనట్టియు, చిత్ర = అబ్బురమును బుట్టించుచున్నబంధములు గలదియు, విస్తర=శబ్దములవిరివిగల, కవితావిలాస=కవిత్వచాతురిగలవారును, వాగీశ్వరులును=భాషానాథులును, అగుకవీశ్వరులును=అయినట్టికవిచంద్రులును, పతంజలి... హంసులు-పతంజలి=భాష్యకారుఁడు, కణాదుఁడు, అక్షచరణ=గౌత

ము(డు,పక్షిల=పక్షులు(డు,ఆది=మొదలుగా(గలవారిచేరచింప(బడిన, శాస్త్రి =శాస్త్రిములయొక్క, సిద్ధాంత=నిశ్చయమగునేర్పాటులనెడి,కమలవన=పద్మ వనమునకు, హంసులు=సూర్యునివంటివారు, అగువిద్వాంసులు = అయినపండి తులు-అన(గాసూర్యు(డు పద్మవనమును వికసింప(జేసినట్లు పండితులు శాస్త్రి సిద్ధాంతములను వెల్లడిచేయుచున్నారని భావము, భరత...స్వాంతులు- భరత=భరతునిచే, మతంగ=మతంగునిచే, దత్తిళ=దత్తిళునిచే, కాపాల=కా పాలునిచే, ఆంజనేయ=హనుమంతునిచే, ప్రణీత=రచింప(బడిన,సంగీతవిద్యా =గానశాస్త్రిమునందున్న, రహస్య = గుట్టులను, విజ్ఞాన= తెలిసికొనుటచే, వైజ్ఞానిక=విశేషజ్ఞానముకలిగియున్న, స్వాంతులు=చిత్తములుగలవారు, అగుక ళావంతులును=అయినవిద్యావంతులును,శక్తి...విచారులు-శక్తి=ప్రభుమంత్రో త్సాహశక్తులయొక్కయు, చతురుపాయ=సామదానభేదములనెడి నాలుగు పాయములయొక్కయు, షాడ్గుణ్య=సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధము, సమాశ్రయము, అనెడిషడ్గుణములయొక్కయు, ప్రయోగ=వినియో గించుటకు, యోగ్య=తగినసమయములను, విచారులు=ఆలోచించువారు, అగు రాయబారులు=అయినట్టిసందేశహరులును, నిఖిల...సముత్సాహంబు-నిఖిల= సమస్తమయిన, పురాణ=పురాణసంహితయొక్కయు, ఇతిహాససంహితా=పూ ర్వచరిత్రసంహితయొక్కయు, తాత్పర్య=భావములను, పర్యాలోచనా=చక్క( గ యోచించుటయొక్క, ధురంధర=భారవాహకమయిన- అన(గా(దాత్ప ర్యములలెస్సగా యోజింపసమర్థమయిన, ధిషణా=బుద్ధిచేత,సముత్సాహంబు= ప్రయత్నము కలవారు, అగుపౌరాణికసమూహంబును=అయినట్టిపౌరాణికుల యొక్కసముదాయమును, పరివేష్టింపన్ = చుట్టును బలిసియుండ(గా, కొలు వుండి=సభచేసి, సకలవిద్యాపారంగతుండు=సమస్తవిద్యలయొక్క పారమును ముట్టినవా(డై - అన(గా( బూర్ణముగా( జదివినవా(డనుట, సరససాహిత్యగో ష్ఠీవినోదప్రసంగంబునన్-సరస=రసముతో(గూడిన, సాహిత్య=సాహిత్యమును గూర్చి, గోష్ఠీ=పరస్పరము సల్లాపించుటయనెడి, వినోద=వేడుకయొక్క, ప్ర సంగంబునన్=ప్రసక్తియందు.

శా. భారద్వాజపవిత్రగోత్రుని శుభాపస్తంబసత్సూత్రు వి
ద్యారాజీవభవుండు మారయకుఁ బుణ్యాచారభీమాంబకు
న్గారా మైనతనూజు నన్ననఘు శ్రీనాథాఖ్యునిం బిల్చిస
త్కారం బొప్పఁగ గారవించి పలికెన్ గంభీరవాక్ప్రౌఢిమన్.

టీ. భారద్వాజపవిత్రగోత్రుని - భారద్వాజ = భారద్వాజమహామునియొక్క, పవిత్ర=పరిశుద్ధమయిన, గోత్రుని=గోత్రముగలట్టియు, - అనఁగా భారద్వాజగోత్రమందుఁ బుట్టినవాఁడనుట, శుభా... సత్సూత్రున్ -శుభ=మంగళమయిన,ఆపస్తంభసత్సూత్రున్ =ఆపస్తంబసూత్రము గలవాఁడును,విద్యారాజీవభవుండు=చదువులకు బ్రహ్మతో సమానుఁడును, మారయకున్ =మారయ్యకు, పుణ్యాచార = పవిత్రమయినప్రవర్తనగల, భీమాంబకున్ =భీమమ్మకును, గారాము=ముద్దు, ఐనతనూజున్ =అయినట్టికుమారుఁడనగు, శ్రీనాథాఖ్యున్ =శ్రీనాథుఁడను పేరుగల, నన్నున్ =నన్నును, పిల్చి=సభకు రప్పించి, సత్కారంబు= మర్యాద, ఒప్పన్ =ఒప్పునట్లుగా, గారవించి=మన్నించి, గంభీరవాక్ప్రౌఢిమన్ =గంభీరమయిన వాక్చాతుర్యముచే, పలికెన్ = ఇట్లనెను.

తా. ఆసింగనామాత్యుఁడు భారద్వాజసగోత్రుండును, ఆపస్తంబసూత్రుండును, మారయభీమాంబలకు ముద్దుకుమారుండును, శ్రీనాథుఁ డను పేరుగలవాఁడు నగునన్నుఁబిలిపించి పూజించిగౌరవించి గంభీరవాక్యములతో నిట్లుపలికెను.

శా. బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడ వురుప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చనకళాశీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాదిమహాపురాణచయతాత్పర్యార్థనిర్ధారిత
బ్రహ్మజ్ఞానకళానిధానమవు నీభాగ్యంబు సామాన్యమే. 13

టీ. బ్రాహ్మీ... ప్రసాదుఁడవు- బ్రాహ్మీ=సరస్వతీదేవిచే,దత్త=ఇయ్యఁబడిన, వరప్రసాదుఁడవు = వరరూపమయిన యనుగ్రహము గలవాఁడవు, ఉరు... స్వాంతుండవు - ఉరు=గొప్పదయిన, ప్రజ్ఞావిశేష=బుద్ధివిశేషముయొక్క, ఉదయ=అభివృద్ధిచేత, అజిహ్మ=కుటిలముకాని, స్వాంతుండవు = మనస్సుగల

వాఁడవు, ఈశ్వరార్చనకళాశీలుండవు- ఈశ్వర=శివుని, అర్చనకళా=పూజిం చుటయనెడి విద్యయందు, శీలుండు=ఆసక్తికలవాఁడవు,అభ్యహిత ...నిధాన మవు- అభ్యర్హిత=అభ్యసింపఁబడిన, బ్రహ్మాండాది=బ్రహ్మాండపురాణము మొద లుగాఁగల, మహాపురాణ = మహాపురాణములయొక్క, చయ=సమూహము యొక్క, తాత్పర్య=తాత్పర్యముచేతను, అర్థ=అర్థముచేతను, నిర్ధారిత=నిర్ణ యింపఁబడిన, బ్రహ్మజ్ఞానకళా = పరబ్రహ్మవిషయకమయినజ్ఞానకళకు, నిధాన మవు=నిధివంటివాఁడవు, అయిన, నీభాగ్యంబు=నీయొక్కయదృష్టము, సామా న్యమె=సాధారణమయినదా? అనఁగా సాధారణమయినది కాదనుట.

తా. ఓశ్రీనాథా!నీవు సరస్వతీదేవివలన వరము కొన్నవాఁడవు, జ్ఞానాతి శయముచేతఁదప్పదారిఁద్రొక్కని మనస్సుగలవాఁడవు, ఎల్లప్పుడు శివార్చన యందునాసక్తికలవాఁడవు, మఱియు బ్రహ్మాండాదిపురాణములఁ జదివి తాత్ప ర్యార్థములచేఁ దత్త్వజ్ఞానమును నిశ్చయించియున్నావు.నీయదృష్టమ సాధా రణమయినదికాదుగదా.

క. జగము నుతింపఁగఁ జెప్పితి
ప్రెగడయ్యకు నాయనుంగుఁ బెద్దనకుఁ గృతుల్
నిగమార్థసారసంగ్రహ
మగునారాధ్యచరిత్రమాదిగఁ బెక్కుల్. 14

టీ. ప్రెగడయ్యకు=మంత్రివర్యుఁడయిన ప్రెగడయ్యకు,నాయనుంగు పెద్ద నకు=నాప్రేమమునకాస్పదుఁడయిన పెద్దన్నకు, నిగమార్థసారసంగ్రహము-నిగ మార్థ=వేదార్థములయొక్క, సార=నిగ్గును,సంగ్రహము=సంగ్రహించెడిది,అగు =అయినట్టి,ఆరాధ్యచరిత్ర=ఆరాధ్యచరిత్రము,ఆదిగన్ = మొదలుగాఁ గల, పెక్కుల్ =అనేకములయిన, కృతుల్ =గ్రంథములను, జగము=లోకమం దలిజనులు, నుతింపన్ =పొగుడునట్లుగా, చెప్పితి=రచించినాఁడవు.

తా. ఓశ్రీనాథా!మాపెద్దన్నమంత్రికి, ప్రెగడయ్యమంత్రికి,వేదార్థములను సంగ్రహించెడి యారాధ్యచరిత్రము మొదలుగాఁ గల పెక్కుగ్రంథములను లోకులు గొనియాడునట్లు రచించి యంకితము చేసినాఁడవు.

వ. కావున నాకు నొక్క ప్రబంధంబు పుణ్యశ్లోకపురాతనరాజర్షి
చరితానుబంధబంధురంబు గా రచింపు మందును. 15

టీ. కావునన్ = నీ వనేకప్రబంధాదులరచియించికృతియిచ్చియున్నవాఁడవు కావున, ఒక్క ప్రబంధంబు = ఒక ప్రబంధమును, పుణ్య...బంధురంబుగా - పుణ్యశ్లోక = పవిత్రమయిన కీర్తి గలట్టియు, పురాతన = ప్రాచీనుఁడయినట్టియు, రాజర్షి = రాజర్షి యొక్క, చరిత = చారిత్రముయొక్క, అనుబంధ = సంబంధముచే, బంధురంబుగాన్ - ఒప్పిదమగునట్లుగా, నాకున్ = నానిమిత్తము, రచింపుము = చేయుము. అందును = ఆచేయుటలో, పైపద్యముతో నన్వయము.

తాత్పర్యము స్పష్టము.

సీ. కవిరాజరాజిశేఖరహీరముకుటంబు
శ్రీహీరకులవార్ధిశిశిరకరుఁడు
మామల్లదేవికుమారరత్నంబు చిం
తామణిమంత్రచింతనఫలంబు
కవికులాదృష్టాధ్వగమనాధ్వనీనుండు
కాశ్మీరనృపసభకమలహేళి
ఖండనగ్రంథసంగ్రథనకర్కశబుద్ధి
షట్తర్కఫక్కికాచక్రవర్తి

తే. భట్టహర్షుండు ప్రౌఢవాక్పాటవమున
నెద్ది రచియించె బుధలోకహితముపొంగ
నట్టినైషధసత్కావ్య మాంధ్రభాష
ననఘ! యొనరింపు నాపేర నంకితము గ. 16

టీ. కవి...ముకుటంబు-కవిరాజ = కవిశ్రేష్ఠులయొక్క, రాజి = సమూహము నకు, శేఖర = శిరోభూషణరూపమయిన, హీర = వజ్రమయమయిన, ముకుటంబు = కిరీటమువంటివాఁడును, శ్రీ...కరుండు-శ్రీహీరకుల = శ్రీహీరునివంశమనెడి, వా

ర్థి=సముద్రమునకు, శిశిరకరుఁడు=చంద్రునివంటివాఁడును, శ్రీహీరుఁడు కవితం డ్రియని తెలియున్నది, మామల్లదేవికుమారరత్నంబు=మామల్లదేవియొక్క తన యామణియు, చింతా... ఫలంబు-చింతామణి మంత్ర=చింతామణియనెడి మం త్రముయొక్క, చింతన=స్మరించుటకు, ఫలంబు=ఫలమువంటివాఁడును- అనఁ గా నతనితల్లిదండ్రులు చింతామణి మంత్రోపాసన చేసినందువలన నుద్భవించి వాఁడనుట. కవి... నీనుఁడు-కవికుల=కవిసమూహముచే, అదృష్ట=చూడఁ బడని, అధ్వ=మార్గమందు, గమన=నడచుటకు, అధ్వనీనుఁడు = బాటసారి యయినవాఁడును - అనఁగా నంతకుఁ బూర్వమున్న కవీశ్వరులెఱుఁగని క్రొత్త మార్గములఁ ద్రొక్కువాఁడనుట. కాశ్మీర... హేళి-కాశ్మీరనృప=కాశ్మీరరాజు యొక్క, సభకమల=సభయనెడిపద్మమునకు, హేళి=సూర్యునివంటివాఁడును, ఇటసభాశబ్దము స్త్రీలింగమయినను వ్యా॥ సూ॥ సభారాజామనుష్యపూర్వా॥ అనుసూత్రముచే నపుంసకలింగమాయెను. ఖండన... బుద్ధి-ఖండనగ్రంథ=ఖండ నఖాద్యమనెడి గ్రంథమును, సంగ్రథన=కూర్చుటయందు - రచించుటయంద నుట, కర్కశ=దిట్టయైన, బుద్ధి=బుద్ధిగలవాఁడును- అనఁగా శ్రీహర్షుఁడు ఖం డనఖాద్య మనెడిగ్రంథమును రచించినాఁడనుట, షట్...చక్రవర్తి-షట్= ఆఱువిధములయిన, తర్కఫక్కికా=తర్కశాస్త్రఫణితులకు, చక్రవర్తి=సా ర్వభౌమునివంటివాఁడు - అనఁగా గౌతమకాణాద వైశేషికాదితర్కశాస్త్ర ములయందుఁ బ్రవీణుఁడనుట, భట్టహర్షుండు=భట్టహర్షుఁ డనుకవీశ్వరుఁడు, ప్రౌఢవాక్పాటవమునన్ = ప్రౌఢమయిన వాక్యములయొక్క పటుత్వముచే, ఎద్ది=ఏగ్రంథమును, బుధలోకహితము పొంటెన్ =పండిత సమూహముయొక్క మేలుకొఱకు,రచించెన్ =చేసెనో,అనఁగా "నైషధంవిద్వదౌషధమ్" అనిప్ర సిద్ధిచెందినగ్రంథమును రచించి పండితుల కుపకారముచేసినాఁడనుట. అట్టి నై షధసత్కావ్యము=అటువంటి నైషధకావ్యమును, అనఘ = పాపరహితుఁడ వయినశ్రీనాథుఁడా, నాపేరన్ అంకితముగా=నా కంకితముగా, ఆంధ్రభా షన్ = తెనుఁగుభాషయందు, ఒనరింపుము=రచింపుము- అనగా భాషాంతరీక రణముచేయుము.

తాత్పర్యము స్పష్టము.

చ. పనివడి నారికేళఫలపాకమునం జవి యైనభట్టహ
ర్షునికవితానుగుంభములు సోమరిపోతులు *కొందఱయ్యలా
వని కొనియాడనేర రది యట్టిదలేజవరాలు చెక్కుగీఁ
టిన వసవల్చుబాలకుఁడు డెందమునం గలఁగంగనేర్చునే. 17

టీ. నారికేళఫలపాకమునన్ = నారికేళపాకముచే, చేవి=రుచి, ఐన... గుంభనములు-ఐన=కలయట్టి, భట్టహర్షుని=శ్రీహర్షుఁడనెడి కవియొక్క, కవితానుగుంభనములు=కవిత్వసందర్భములు, సోమరిపోతులుకొందఱు=కొందఱు సోమరిపోతు లై చదువెఱుఁగనివారు, అయ్యలు=అయ్యయ్యో, పనివడి=అక్కఱగొని, ఔన్ అని= మేలయినదని, కొనియాడన్ నేరరు=నుతింపఁజాలరు, అది =అనుతింపలేకుండుట, అట్టిదె=అటువంటిదే - అనఁగావారుపట్టిమూఢులుకావునఁదెలియమిచేనుతింపలేరనుట, లేజవరాలు = నూతనమయిన యౌవనముగల స్త్రీ, చెక్కుగీఁటినన్ = చెక్కునొక్కినచో, వసవల్చుబాలకుఁడు=వసవాసనగొట్టుబాలకుఁడు- పసిబిడ్డఁడు, డెందమునన్ =మనస్సునందు, కలఁగంగన్ నేర్చునే = కలఁకచెందునా? అనఁగా మన్మథవికారము చెందఁడనుట.

తా. ఓ శ్రీనాథా! పసిబిడ్డఁ డెలపరువము గలసుందరి చెక్కు నొక్కినను, మఱికొన్ని శృంగారవిలాసములను గనఁబఱిచినను, దాని చేష్టలయందలిసారమును గ్రహింపలేనట్లు నారికేళపాకముచే రుచించునట్టి శ్రీహర్షుని కవిత్వచమత్కారములను, గొందఱు సోమరిపోతు లక్కటకటా! తెలిసికోలేరు గదా?

వ. అని పలికి సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలం బొసంగి జాంబూనదాంబరాభరణంబులు గట్టనిచ్చి వీడ్కొలిపిన నేను నమ్మహాప్రధానునిం గృతినాయకుం జేసి నైషధకావ్యం

---

* కొంద ఱియ్య నైనని, 'ఇయ్య' అనుటకు 'తనుమధ్య...యియ్య, యనిరొ' ఆదిపర్వ-౮. 'చక్కనగు... బెరిఁగి యియ్య యగు నిప్పుడు' ఆది-౬. అని నన్నయప్రయోగములు గలవు.

బు చెప్పం దొడంగితిఁ దత్ప్రారంభంబునకు మంగళాచర
ణంబుగాఁ దదీయవంశావతారం బభివర్ణించెద. 18

టీ. అని పలికి=ఇట్లుసంభాషించి, సబహుమానంబుగాన్ = గౌరవముతో, కర్పూరతాంబూలంబున్ =కర్పూరముతోఁగూడిన తాంబూలమును, ఒసంగి= ఇచ్చి, జాంబూనదాంబరాభరణంబులు-జాంబూనద = కనకమయములయిన, అంబర=వస్త్రములను, ఆభరణంబులు=అలంకారములను, కట్టన్ ఇచ్చి=ధరింపఁజేసి, వీడ్కొలిపినన్ =పంపఁగా, నేనును, అమ్మహాప్రధానునిన్ =ఆ సింగనామాత్యవర్యుని, కృతినాయకున్ =కృతి కధిపతిగా, చేసి, నైషధకావ్యంబున్ =నైషధమనెడికావ్యమును, చెప్పన్ తొడఁగితిన్ = తెనిఁగింపఁబూనితిని, తత్ప్రారంభంబునకున్ =ఆగ్రంథప్రారంభమునకు, మంగళాచరణంబుగాన్ = మంగళము నాచరించుటకై, తదీయవంశావతారంబు-తదీయ = ఆసింగనామాత్యునియొక్క, వంశావతారంబు=వంశక్రమమును, అభివర్ణించెదను=వర్ణించిచెప్పెదను.

తా. స్పష్టము.

శా. తోరం బైనతపోవిశేషమున సద్యోజాతవక్త్రంబున
న్గౌరీవల్లభుచేత దీక్షఁ గొనియె న్సప్తర్షులం దొక్కఁడై
తారావీథి నలంకరించెఁ గనియెం ద్రయ్యర్థసంఘాతమున్
భారద్వాజమహామునీంద్రుఁ దగదే భక్తిం బ్రశంసింపఁగన్.

టీ. తోరంబు=గొప్పది, ఐనతపోవిశేషమునన్ =అయినటువంటి తపంబు పెంపుచే, సద్యోజాతవక్త్రంబునన్ =సద్యోజాతమని పేరుగల ముఖముచేత, గౌరీవల్లభుచేతన్ =ఈశ్వరునిచే, దీక్షన్ = శివపంచాక్షరీమంత్రమును, కొనియెన్ =ఉపదేశమునొందెను, సప్తర్షులందున్ =సప్తమహర్షులలోను, ఒక్కఁడై=ఒకఁడయి, తారావీథిన్ =ఆకాశమును, అలంకరించెన్ =భూషించెను, త్రయ్యర్థసంఘాతమున్ = వేదార్థసమూహమును, కనియెన్ =పొందెను, భారద్వాజ మహామునీంద్రున్ =అటువంటి భారద్వాజ మహామునిని, భక్తిన్ =భక్తిచే, ప్రశంసింపఁగన్ తగదే = [illegible] పొగడుటకొప్పుననుట.

తా. భారద్వాజ మహామునీంద్రుండు ఘోరంబగుతపంబుచేసి యీశ్వరునిఁ బ్రసన్నునిగాఁ జేసికొని యతనినే గురువుగాఁజేసికొని సద్యోజాతము, వామదేవము, తత్పురుషము, ఈశాన్యము, అఘోరము, అనెడి యీశ్వరుని యైదుముఖంబులలో మిగులఁ బ్రధాన మయినసద్యోజాతముఖముచే మంత్రోపాసన నందెను. మఱియుఁ దపోవిశేషముచేతనే సప్తమహర్షులలో నొకరుండై గగనము నలంకరించెను. మఱియు వేదసమూహమును సంగ్రహించెను. అటువంటి మహాత్ముఁడయిన భారద్వాజమహామునిని గొనియాడనొప్పదా?

ఉ. ఆమునినాథునన్వయమునందు దుదయించెఁబయఃపయోనిధిఁ
యామవతీకళత్రుఁ డుదయంబయినట్లుగఁ గల్పవృక్షచిం
తామణికామధేనుసమదాననిరూఢుఁడు విద్విషత్తమ
స్తోమదివాకరుండు పెదతూర్కనమంత్రికులాగ్రగణ్యుఁడై.

టీ. ఆమునినాథు నన్వయమునందున్ =ఆభారద్వాజ మహామునియొక్క వంశమందు, కల్ప ...నిరూఢుఁడు-కల్పవృక్ష=కల్పవృక్షముతోను,చింతామణి=చింతామణితోను, కామధేను=కామధేనువుతోను, సమ=సమానమయిన,దాన=వితరణగుణమునందు,నిరూఢుఁడు=స్థిరుఁడయినవాఁడును, విద్విషత్ ... దివాకరుండు,విద్విషత్ =శత్రువులనెడి, తమస్తోమ=చీఁకట్లసమూహమునకు, దివాకరుండు=సూర్యునివంటివాఁడును, పెదతూర్కనమంత్రి= పెదతూర్కన్న యను పేరుగలయమాత్యుఁడు,కులాగ్రగణ్యుఁడై=కులమునకునగ్రేసరుఁడై,పయఃపయోనిధిన్ =పాలసంద్రమునందు, యామవతీకళత్రుఁడు=చంద్రుఁడు, ఉదయంబయినట్లుగన్ =పుట్టినట్లు గా,ఉదయించెన్ =పుట్టెను.ఇట"పయఃపయోనిధిన్ యామవతీకళత్రుఁడు" అన్న యుపమానమువలన, నామునినాథువంశము క్షీరమువలె నిష్కళంకమైయున్నదనియు నాతూర్కనమంత్రి,చంద్రుఁడు తనకళలచే లోకమున కానందముకలిగించునట్లు, తనసుగుణపుంజముచేఁ బ్రజలకానందము కలిగించుచున్నాఁడనియు సారస్యము స్ఫురించుచున్నది.

తా. దానమునందుఁ గల్పవృక్షాదులతో సమానుఁడై శత్రుహంతయై యు

ష్టు పెదతూర్కన్న మంత్రి, వంశప్రధానుఁడయి క్షీరసాగరమునందుఁజంద్రుఁ డుదయించినచందమున, నాభారద్వాజమునీంద్రునివంశమం దవతరించెను.

వ. తత్సంతానక్రమంబున. 21

టీ. స్పష్టము.

మ. కుటిలారాతివరూథినీధవశిరఃకుట్టాక ధాటీమహా
పటహధ్వానవిపాట్యమానదశదిగ్భాగుండు త్రైలోక్యసం
పుటపేటీపరిపూర్ణ కీర్తిమయ కర్పూరప్రకాండుండు శ్రీ
చిటిపెద్దప్రభుఁ డొప్పె విక్రమపురీసింహాసనాధ్యాసి యై.

టీ. కుటిలారాతి...భాగుండు- కుటిల = కపటులయిన, అరాతి=శత్రువుల యొక్క, వరూథినీధవ= సేనాధిపతులయొక్క, శిరః=తలలను, కుట్టాక = ఛేదించునట్టి, ధాటీ=దండయాత్రయందలి, మహాపటహ=గొప్పతప్పెటలయొక్క, ధ్వాన =ధ్వనిచే, విపాట్యమాన=బ్రద్దలు గొట్టఁబడుచున్న, దశ=పదియయిన, దిగ్భాగుండు=దిక్కులు గలవాఁడును - దీనిచే దిక్కులనెల్ల గెలిచినాఁడనియుఁ బెక్కుశత్రువుల సంహరించినాఁడనియు వ్యంజితము, త్రైలోక్య...ప్రకాండుండు, త్రైలోక్య=మూడులోకములనెడి, సంపుటపేటీ=బరిణవంటి పెట్టెయందు, పరిపూర్ణ=నిండినట్టి, కీర్తిమయ=యశోరూపమయిన, కర్పూర ప్రకాండుండు =మంచి కర్పూరముగలవాఁడును, శ్రీ...ప్రభుఁడు, శ్రీ=లక్ష్మీయుతుఁడయిన, చిటిపెద్దప్రభువు=చిటిపెద్దన్న యనెడి ప్రభువు, విక్రమ...ధ్యాసి యై - విక్రమపురీ=విక్రమనగరముయొక్క, సింహాసన=సింహాసనమునందు, అధ్యాసియై=అధిష్ఠించినవాఁడయి, ఒప్పెన్ =ప్రకాశించెను.

తా. దిగ్విజయార్థము దాడివెడలి కుటిలులైన శత్రుసేనాధిపతుల శిరస్సులను దునుముచుఁబోయి, దశదిశలును గొప్పతప్పెటల చప్పుళ్లచే బ్రద్దలువాఱ, నలుదిక్కులు గెలిచినవాఁడై, దానంజేసి మూఁడులోకములయందు బరిణయందుఁ నించిన గర్పూరమువలె తనకీర్తి నిండఁగా, చిట్టిపెద్దన్న ప్రభువు విక్రమనగర సింహాసనాసీనుఁ డయి ప్రకాశించెను. అలం: రూపకము.

క. ఆచిటి పెద్ద ప్రభునకు, వాచస్పతిసదృశనీతివైభవలక్ష్మీ
వైచిత్రికి నధికవిమలశి,వాచారఘనుండు మామిడన్న జనించెన్.

టీ. వాచస్పతి... వైచిత్రికిన్ - వాచస్పతి=బృహస్పతితో, సదృశ=సమానమైన, నీతివైభవ=నీతి ప్రాభవముయొక్క, లక్ష్మీ=సంపదయొక్క, వైచిత్రికిన్=వైచిత్ర్యముగల, ఆచిటి పెద్ద ప్రభువునకు, అధిక... ఘనుండు -అధిక=గొప్పదయిన, విమల=నిర్మలమయిన, శివ=మంగళప్రద మయిన, ఆచార=ప్రవర్తములచే, ఘనుండు=గొప్పవాఁడగు, మామిడన్న=మామిడన్న యనెడి మంత్రి, జనించెన్=పుట్టెను.

ఉ. స్వామిహితంబునన్ సమదశాత్రవభంజనశక్తి బంధు ర
క్షామహనీయసంపద వసంతసమాగమపుల్లమల్లికా
స్తోమతుషారపాండురయశోగరిమంబున ధర్మశీలతన్
మామిడిమంత్రిఁబోల మఱిమంత్రులు లేరువసుంధరాస్థలిన్.

టీ. స్వామి హితంబునన్=ప్రభువునకు హితకార్యము లొనర్చుటయందు, సమద...శక్తిన్-సమద=గర్వముతోఁ గూడిన, శాత్రవ=శత్రువులను, భంజన=సంహరించుటయందలి, శక్తిన్=సామర్థ్యమందును, బంధు...సంపదన్-బంధు=చుట్టాలను, రక్షా=రక్షించుటచేత,మహనీయ=పూజ్యమైన, సంపదన్=సంపదయందును, వసంత...గరిమంబునన్ -వసంత = వసంతకాలముయొక్క,సమాగమ=వచ్చుటచే,పుల్ల=వికసించిన, మల్లికాస్తోమ=మల్లెపూవులసమూహమువలెను, తుషార=మంచువలెను, పాండుర=తెల్లని, యశోగరిమంబునన్=కీర్తి పెంపునందును, ధర్మశీలతన్ = ధర్మయుక్తమైన ఆచారమందును, మామిడిమంత్రిన్=మామిడి మంత్రిని, పోలన్=సరిపోలుటకు, వసుంధరాస్థలిన్=భూమియందు, మఱిమంత్రులులేరు=వేఱు మంత్రులు లేరు-అనఁగా నిరుపమానుఁ డనుట.

తా. ప్రభుహితముచేయుటయందును, శత్రుభంజనమందును, బంధురక్షణమందును, కీర్తియందును, ధర్మవర్తనమందును మామిడిమంత్రివరునికి సాటివచ్చు మంత్రులు లోకమునలేరు.

తే. అతనియర్ధాంగలక్ష్మి యక్కాంబ గనియె
నాత్మజుల వేదమూర్తుల నబ్ధినిభుల
వెలయ శ్రీపెద్దనామాత్య వీరభద్ర
మారనప్రభు నామన మంత్రివరుల. 25

టీ. అతని యర్ధాంగలక్ష్మి=ఆమామిడిమంత్రి భార్యయగు-భార్య పురుషునం దర్ధము గనుక అర్ధాంగలక్ష్మియనఁబడెను, అక్కాంబ=అక్కమాంబ, వెలయన్ =ఒప్పునట్లుగా, వేదమూర్తులన్ = వేదస్వరూపులయినట్టియు, అబ్ధినిభులన్ = సముద్రములతో సమానులయినట్టియు, శ్రీ ... వరులన్, శ్రీ=శోభాయుతులయిన, పెద్దనామాత్య=పెద్దనమంత్రిని, వీరభద్ర=వీరభద్ర మంత్రిని, మారనప్రభున్ = మారన్నమంత్రిని, నామనమంత్రివరులన్ = నామన్న యనెడిమంత్రివరుని, కనియెన్=కాంచెను.

సీ. అనవద్యహృద్య విద్యాబుద్ధిసంసిద్ధి
బిసరుహాసనునుద్ది పెద్దవిభుఁడు
భద్రనిర్నిద్రవాఙ్ముద్రాసముద్వృత్తిఁ
గద్రూభవుఁడు వీరభద్రమంత్రి
మేరుభూధరసార ధీరతాగుణహారి
వైరిశైలబలారి మారశౌరి
* స్వామిభక్తిహితైక భావ వైభవభూమి
భామినీరతిరాజు నామరాజు

తే. మామిడీశ్వరసాగరామరకుజంబు

---

* 'స్వామిభక్తిహితైకభూమవైభవభూమి' అని వ్రాఁతప్రతులు. అప్పుడు, స్వామిభక్తిహిత=ఏలికవలని భక్తియందును మేలునందును, ఏక=ముఖ్యమయినదియు, భూమ=మిక్కిలి గొప్పదియునగు, వైభవ=ప్రాభవమునకును, భూమి=స్థానమైనట్టివాఁడును, తనపెంపు సొంపునంతయు స్వామికిఁగొలువుసేసి యతనికి మేలు [illegible]

లక్కమాంబికాశుక్తిరత్నాంకురములు
వంశపావను లర్థార్థివాంఛితార్థ
దానశౌండులు సౌభాగ్యత్రధర్మపరులు. 26

టీ. అనవద్య...సంసిద్ధిక్, అనవద్య=తక్కువకాని, హృద్య=మనోహరమ యిన, విద్యాబుద్ధి=విద్యాబుద్ధులయొక్క, సంసిద్ధిక్=సంప్రాప్తిచే, బిసరుహాస నునుద్ది=బ్రహ్మతో సమానుఁడయిన, పెద్దవిభుఁడు = పెద్దనామాత్యుండును, అనఁగాఁ బెద్దనామాత్యుఁడు విద్యాబుద్ధులయందు బ్రహ్మతో సమానుఁడనిభా వము,భద్ర...వృత్తిక్-భద్ర=మంగళమయిన,నిర్నిద్ర=ప్రకాశమయిన, వాఙ్ము ద్రా=వాక్స్వరూపముయొక్క,సముద్వృత్తిక్=అతిశయముచేత,కద్రూభవుఁ డు=శేషునివంటివాఁడగు,వీరభద్రమంత్రి=వీరభద్రామాత్యుఁడును, వీరభద్రుఁ డు శేషుని వాగ్జాలమువంటి వాగ్జాలము కలవాఁడని భావము. మఱియు శేషు నివంటివాఁడని చెప్పుటచే నతఁడు రచించిన భాష్యవాక్యలవలె వీరభద్రుని వాక్యములు నిర్దుష్టములయి యుండుననుట. మేరు...హారి - మేరుభూధర = మేరుపర్వతమునయొక్క, సార = నిగ్గయిన, ధీరతాగుణ = ధైర్యగుణము ను, హారి = హరించెడునట్టియు, వైరి శైలబలారి - వైరి = శత్రువులనెడి, శైల=పర్వతములకు, బలారి=ఇంద్రునితో సమానుఁడయిన, మారశౌరి=మార న్నమంత్రియు-మారన్న మేరువుతో సమానమయిన ధైర్యముగలవాఁడనియు శత్రువుల జంపువాఁడనియు భావము, స్వామి...భూమి, స్వామి భక్తి=ప్రభు వునందలి భక్తికి,హిత=ప్రభువునకు మేలుచేయుటయే,ఏక=ముఖ్యముగాఁగల, భావ=ఆత్మను,వైభవ=ప్రాభవమునకు,భూమి=నిలయమైనట్టియు,భామినీరతి రాజు= స్త్రీలకు మన్మథునివంటివాఁడు నగు, నామరాజు=నామనప్రభువు( ఈ నలువురు,) మామిడి...కుజంబులు, మామిడీశ్వర=మామిడివిభువనెడి, సాగర=స ముద్రమునందుబుట్టిన, అమరకుజంబులు=కల్పవృక్షములవంటివారు, అక్క... రములు,అక్కమాంబికా= అక్కమాంబయనెడి,శుక్తి=ముత్తెపుచిప్పకు,రత్నాం కురములు=ముత్యములవంటివారును, వంశపావనులు=వంశమును బవిత్రము చేయు వారలును, అర్థార్థి...శౌండులు, అర్థార్థి=యాచకులయొక్క,వాంఛితార్థ=ఇష్ట

ములను, దాన=ఇచ్చుటయందు, శౌండులు=నేర్పుగలవారును, సౌభ్రాత్ర ధర్మ =మంచి సోదరభావమనెడిధర్మమందు, పరులు=సక్తులయినవారు-అనఁగా మంచి సోదరభావముగలవారనుట.

మ. అనతారాతి వసుంధరారమణ సప్తాంగాపహారక్రియా
ఘనసంరంభ విజృంభమాణపటుదోఃఖర్జూ ద్వితీయార్జునుం
డన వేమాధిపరాజ్యభారభరణవ్యాపారదక్షుండు పె
ద్దనమంత్రీశుఁడుమామిడన్న సుతుఁడే తన్మాత్రుఁడే చూడఁగన్.

టీ. అనత . ర్జునుండు, అనత=నతులు కాని-అనఁగాఁ దనయెడల వినయము చూపనివారనుట, అరాతివసుంధరారమణ=శత్రుభూపతులయొక్క, సప్తాంగ =రాజ్యాంగముల నేడింటిని- స్వామి, అమాత్యులు, పురము, రాష్ట్రము, ధనాగారములు, దండము, మిత్రబలమనెడియేడును రాజ్యమునకంగములని చెప్పుదురు. అపహారక్రియా=అపహరించుట యనెడి వ్యాపారమందు, ఘన=గొప్పదైన, సంరంభ=తొందరపాటుతో, విజృంభమాణ=విజృంభించుచున్నట్టియు, పటు =సమర్థములైన, దోః=భుజములయొక్క, ఖర్జూ = దురదగల, ద్వితీయార్జునుండు=రెండవయర్జునుండు, అనన్=అని పలుకుచుండఁగా, వేమా...దక్షుండు, వేమాధిప=వేమమండలాధిపతియొక్క, రాజ్యభార= రాజ్యముయొక్క బరువును, భరణ=వహించుటయనెడి, వ్యాపార=వ్యాపారమందు, దక్షుఁడు=సమర్థుఁడగునట్టియు, మామిడన్న సుతుఁడు=మామిడి మంత్రియొక్క కుమారుఁడయిన, పెద్దనమంత్రీశుఁడు= పెద్దనామాత్యవరుఁడు, చూడఁగాన్ =ఆలోచింపఁగా, ఏతన్మాత్రుఁడే=సాధారణుఁడా ? అనఁగా సామాన్యుఁడు కాఁడనుట

తా. శత్రుభూపతులయొక్క రాజ్యము నపహరించుట యనెడివ్యాపారమందు సరభసంబుతో విజృంభించు చున్న బాహువులుగలవాఁడయి రెండవయర్జునుం డని జనులందఱిచేఁ బిలువఁబడుచు వేమదేశాధిపతిరాజ్యభారము వహించుటయందు సమర్థుఁడై యున్న పెద్దనామాత్యుఁడు సామాన్యమంత్రులవలెఁ జెప్పఁదగినవాఁడు కాఁడు.

ఉ. హేమధరాధరేంద్రమునఁ * కెంతయుఁబెద్ద ధృతిఁ భుజంగమ
స్వామికి మేలుచేయి పటుఁ వాగ్విభవంబున బుద్ధిసంపదం
దామరచూలికిఁ సరి ప్రధానులు దక్కినవారు సాటియే
మామిడివీరభద్రున కమాత్యశిఖామణి కివ్వసుంధరన్. 28

టీ. ధృతిఁ=ధైర్యగుణముచే, హేమధరాధరేంద్రమునకుఁ = మేరుప ర్వతముకంటె, ఎంతయుఁ=మిక్కిలి, పెద్ద=గొప్పవాఁడు, పటువాగ్విభవం బునఁ=సమర్థమయిన వాక్యసంపదచే, భుజంగమస్వామికిఁ = శేషునకు, మే లుచేయి=పైచేయి-అనఁగా శేషునికంటె నధికుఁడనుట, బుద్ధిసంపదఁ=ధీస మృద్ధిచే, తామరచూలికిఁ=బ్రహ్మకు, సరి=సమానుఁడు, ఇవ్వసుంధరఁ=ఈ భూమియందు, అమాత్యశిఖామణికిఁ=మంత్రివర్యుఁడయిన, మామిడి వీరభద్రు నకుఁ=మామిడన్నకుమారుఁ డయినవీరభద్రునకు, తక్కినవారు=ప్రధానులు తక్కుఁగల మంత్రివరు లందఱు, సాటియే=సరిపోలుదురా? అనఁగా సరిరార ని యర్థము.

తా. మామిడివీరభద్రమంత్రి, మేరుపర్వతమును మించిన ధైర్యముకలవాఁ డు, శేషునికంటె నధికమయినవాక్సంపదకలవాఁడు, బుద్ధికి బ్రహ్మతో సమానుఁ డు. అట్టివీరభద్రమంత్రికిఁ దక్కినమంత్రులు సములు కారు.

ఉ. సత్యవచోనిరూఢుఁడు నిశాకరశేఖరభక్తిభావనా
సాత్యవతేయుఁ డుద్భటభుజాబలవిక్రమకేళివిక్రమా
దిత్యుఁడు కార్యఖడ్గసముదీర్ణుఁడు మామిడిమంత్రిమారనా
మాత్యుఁడువానిఁ బోల వశమా ధరణీధవమంత్రికోటికిన్.

టీ. మామిడిమంత్రి మారనామాత్యుఁడు=మామిడి మంత్రికుమారుఁడయిన మారన్నమంత్రి, సత్యవచోనిరూఢుఁడు= సత్యము పలుకుటయందు స్థిరమయిన వాఁడు- అనఁగా నెల్లప్పుడు సత్యము పలుకువాఁడని యనుట. నిశాకర ... సా

---

*ఈ పద్యములో ఎంతటిపెద్ద అని పాఠాంతరము. ఇచ్చట షష్ఠ్యంత మనన్వితముగావున మొదటిపాఠమే మేలని తోఁచెడిని.

త్యవతేయుఁడు, నిశాకరశేఖర = చంద్రకలావతంసుని యొక్క - అనఁగా నీశ్వరునియొక్క, భక్తి= భక్తిరూపమయిన, భావనా= ధ్యానమందు, సాత్యవతేయుఁడు=వ్యాసుఁడు-అనఁగా వ్యాసునివంటివాఁ డనుట, ఉద్భట...ఆదిత్యుఁడు- ఉద్భట=ఘనమయిన,భుజాబల=బాహుబలముచేతను, విక్రమకేళీ=పరాక్రమక్రీడచేతను,విక్రమాదిత్యుఁడు=విక్రమార్కునివంటివాఁడు, కార్యఖడ్గ= కార్యమునను ఖడ్గమునను - ఇట కార్యశబ్దముచే యుక్తియు ఖడ్గశబ్దముచే శౌర్యమును దెలియునది. 'నీతలన మనకార్యఖడ్గంబులమో పెక్కించె' విరాట, పంచ. 'కార్యమును ఖడ్గమును నింతగలుగు నీవు' ఉద్యోగ, చతుర్థ. సముదీర్ణుఁడు = మిక్కిలి గొప్పవాఁడు, ధరణీధనమంత్రికోటికిన్ = రాజులయొద్దనుండు తక్కినమంత్రులకు, వానిన్ =ఆమారనామాత్యుని, పోలన్ వశమా=సరిపోలఁదరమగునా? అనఁగావారు సములు కారనుట.

తా. మారనామాత్యుఁడు సత్యసంధుఁడు; శివభక్తియందు వ్యాసునితోసమానుఁడు; బలవిక్రమములచే విక్రమార్కునితోఁదులదూగును; మఱియు మంత్రనిర్వాహణమును శౌర్యమునుగలవాఁడు; అట్టిమారన్నమంత్రితోఁదక్కిన మంత్రు లెంతమాత్రము సరిరారు.

శా. స్వామిద్రోహరగండలాంఛనునకున్ సంగ్రామగాండీవికిన్
వేమక్ష్మాపతికార్యభారకలనావిఖ్యాతధీశక్తికిన్
నామామాత్యున కన్యరాజనిటలాన్యస్తభాగ్యాక్షర
స్తోమాపాకరణప్రవీణునకు మంత్రుల్ సాటియేయెవ్వరున్.

టీ. స్వామి...లాంఛనునకున్ -స్వామి=ప్రభువులవిషయమయి,ద్రోహర=ద్రోహచింతగలవారియెడ, గండ=వీరుఁడనెడి, లాంఛనునకున్ =బిరుదపదము గలవాఁడును - అనఁగా రాజద్రోహకారులను జంపువాఁడనుట, సంగ్రామగాండీవికిన్ - సంగ్రామ=యుద్ధమందు, గాండీవికిన్ =అర్జునునివంటివాఁడును, వేమ...శక్తికిన్ - వేమక్ష్మాపతి=వేమరాజుయొక్క, కార్యభార=కార్యములయొక్క బరువును,కలనా=నిర్వహించుటచే,విఖ్యాత=ప్రసిద్ధికెక్కిన,ధీశక్తికిన్ = బుద్ధిసామర్థ్యముకలవాఁడును-అనఁగా దనబుద్ధిచాతుర్యముచే వేమ మండలా

ధిపునియొక్క రాజ్యమును నిరపాయముగాఁ గాపాడి గులఖ్యాతి గాంచినవాఁడ నుట. అన్య...ప్రవీణునకున్ - అన్యరాజ = శత్రురాజులయొక్క, నిటల = ఫాలములయొక్క, అంతర్ = మధ్యభాగమునందు, న్యస్త = వ్రాయఁబడిన, భాగ్యాక్షరస్తోమ = భాగ్యమును దెలియఁజేసెడి యక్షరములయొక్క పంక్తిని - అనఁగా భాగ్యవంతుఁడగునని బ్రహ్మవ్రాసినవ్రాలను, అపాకరణ=తుడిచివేయుటయందు,ప్రవీణునకున్ = నేర్పుగలవాఁడును,ఇట బ్రహ్మవ్రాసినవ్రాఁతనుగూడఁ దప్పుగా జేయఁగలవాఁడని చెప్పఁబడినది. ''లలాటరేఖానపునః ప్రయాతి''అను ప్రమాణముంబట్టి బ్రహ్మవ్రాఁత దిరుగనిదయినను నామనమంత్రి త్రిప్పివేయఁగలఁ డని చెప్పుటవలన నసాధ్యకార్యములయిననుసాధింపఁగలఁడని భావము, అగు, నామామాత్యునకున్ =నామన మంత్రికి, మంత్రులు ఎవ్వరున్ = ఏమంత్రులైనను, సాటియే=సమానులగుదురా? సమానులు కారనుట.

తా. నామనమంత్రి స్వామిద్రోహరగండఁ డనుబిరుదముగలవాఁడు,యుద్ధమునందర్జునునితో సమానుఁడు, వేమభూపతియొక్క రాజ్యకార్యముల నెఱవేర్చుటయందుఁ బ్రథితమయినబుద్ధి కలవాఁడు, శత్రురాజులయొక్క భాగ్యరేఖను దుడుచువాఁడు. అట్టి నామనమంత్రికి నేమంత్రులును సరిరారు.

ఉ. తమ్ములు దన్నుమువ్వురును దైవముగా గురుగా మహానిధా
నమ్ముగ దాతగాఁ దమమనంబుల భావన సేసి కొల్వ భా
గ్యమ్ములకెల్ల నెల్లయయి కాంచెఁ బ్రసిద్ధి నృపప్రధాన ర
త్నమ్మగుమంత్రి పెద్దన యుదాత్తమతిన్ రఘురాముకైవడిన్.

టీ. నృపప్రధానరత్నమ్ము=వేమరాజునకు ముఖ్యమంత్రి,అగు మంత్రి పెద్దన= అయినట్టి పెద్దనమంత్రి, తన్నున్, తమ్ములు మువ్వురు = సోదరులుముగ్గురు, దైవముగాన్ =భగవంతునిగాను, గురుగాన్ =గురువునిగాను,మహానిధానమ్ముగన్ = పెన్నిధిగాను, దాతగాన్ =సర్వమునిచ్చునట్టి వానినిగాను, తమ మనంబులన్ = తమ చిత్తములయందు, భావన చేసి=తలంచి, కొల్వన్ = సేవించుచుండఁగా, భాగ్యమ్ములకున్ ఎల్లన్ =సమస్తమయిన భాగ్యములకు, ఎల్లయయి= మేరయ

యిన వాఁడయి - అనఁగా నంతకంటె నెక్కుడు భాగ్య మెవ్వరికి నుండ దని యభిప్రాయము, రఘురాముకైవడిన్ = రామచంద్రునివలె, ఉదాత్తమతిన్ =ఉదారభావముచే, ప్రసిద్ధికాంచెన్ =ప్రసిద్ధికెక్కెను. అనగా లక్ష్మణ భరత శత్రుఘ్నులు రామచంద్రుని దైవముగాను గురువుగాను పెన్నిధానముగాను దాతగాను, దలంచి సేవించినట్లు పెద్దనమంత్రిని తమ్ములు ముగ్గురు సేవించిరని భావము.

తా. మామిడి పెద్దనమంత్రి తనతమ్ము లయినవీరభద్రాదులు మువ్వురును దన్ను దైవమనియు, గురువనియు, పెన్నిధియనియు, దాతయనియుఁ,దమచిత్తములయందుఁ దలంచి సేవించుచుండఁగా రామచంద్రునివలె నుదారమయిన మనస్సుతోఁ బ్రసిద్ధిచెందెను.

సీ. గౌతమగోత్ర విఖ్యాతుఁ డాపస్తంబ
పరమసంయమిసూత్ర పావనుండు
గారాబుపౌత్రుండు గంధవారణుఁ డగు
శ్రీకేతనామాత్య శేఖరునకు
పేషణిహనుమంత బిరుదాంకుఁ డగురాచ
వారికి నెయ్యంపు వరసుతుండు
చౌహత్తమల్లుండు దోహత్తనారాయ
ణుండు ఖండియరాయ చండ*బిరుదు

తే. మంత్రి యల్లాడరాజును మహితపుణ్య
యన్నమాంబయుఁ దనకు నత్యంతగరిమ
దల్లియునుదండ్రియును గాఁగఁ దనరునట్టి
తల్లమాంబికాదేవి నుద్వాహమయ్యె. 32

టీ. గౌతమగోత్రవిఖ్యాతుఁడు = గౌతమ గోత్రముకలవారిలోఁ బ్రసిద్ధికెక్కినవాఁడు,ఆపస్తంబ...పావనుండు-ఆపస్తంబ పరమసంయమి=ఆపస్తంబ

*వ్రాఁతప్రతుల 'బిరుదు' అని ఉకారాంతముగనే పాఠము చూపట్టుచున్నది.

మహామునియొక్క, సూత్ర=విధులను, పావనుఁడు = పవిత్రముచేయువాఁడు, గంధవారణుఁడు=గంధజాతి గజమువంటివాఁడు, అగు... శేఖరునకున్, అగు= అయినట్టి, శ్రీకేతనామాత్య శేఖరునకున్ = శ్రీకేతనమంత్రివరునకు, గారాబు పౌత్త్రుండు=ముద్దుమనుమఁడయినట్టియు, పేషణి హనుమంత బిరుదాంకుఁడు= పేషణి హనుమంతయనెడిబిరుదపదములు లాంఛనముగాఁ గలవాఁడు, అగురాచ వారికిన్ = అయినట్టి రాజునకు - రాచవారు ఏకవచనము; రాజు అని యర్థము, 'వి.వ్వచ్చుఁడు రాచవారుఁ గురువంశముచేటున కోపకుండుటన్' ఉద్యోగపర్వ, తృతీ. 'ఒకచపలాక్షి తేఁజిగురుటూరియెలఁ గోయిలరాచవారి ఉత్తర హరివంశము. 'ఏనికమోముతా ల్వెలుక నెక్కుడురావుతురాచవారు' భీమేశ్వర ఖండము. నెయ్యంపువరసుతుండు = ముద్దుకుమారుఁడును, చౌహత్తమల్లుండు= చౌహత్తమల్లుఁడనియు, దోహత్తనారాయణుఁడు=దోహత్త నారాయణుఁ డనియు, ఖండియరాయచండబిరుదు = ఖండియరాయచండయనెడి బిరుద పదముగలవాడు, మంత్రి=మంత్రియగు, అల్లాడరాజును, మహితపుణ్యా=కొని యాడఁ దగినపుణ్యముగల, అన్నమాంబయు=అన్నమ్మయు, తనకున్ =తల్లమాం బికకనుట, తల్లియునుతండ్రియును, కాఁగన్ =అగుచుండఁగా, తనరునట్టితల్లమాం బికాదేవిని=ఒప్పుచున్న తల్లమాంబికయనునట్టి కాంతను, ఉద్వాహమయ్యె= వివాహమాడెను.

తా. స్పష్టము.

మ. వనితారత్నము తల్లమాంబికకు శ్రీవత్సాంకతుల్యుండు పె
ద్దనకుంబుట్టిరి నందనుల్ విమలవిద్యాభారతీవల్లభుల్
వినతాసూనుసమాన విక్రమనిధుల్ వీరుండు వేమాహ్వయుం
డును శ్రీపెగ్గడదండనాథతిలకుండుర్కసింగనామాత్యుఁడున్.

టీ. వనితారత్నము= స్త్రీలలో నుత్తమురాలగు, తల్లమాంబికకున్ =తల్లమ్మ దేవికిని, శ్రీవత్సాంకతుల్యుండు=విష్ణువుతో సమానుఁడయిన, పెద్దనకున్ = పెద్ద నమంత్రికిని, విమల...వల్లభుల్, విమల=నిర్దోషమయిన, విద్యా=చదువులకు, భారతీవల్లభుల్ =బ్రహ్మదేవునివంటివారును, వినతా...నిధుల్, వినతాసూను=

గరుత్మంతునితోఁ, సమాన=సరియయిన, విక్రమ=పరాక్రమమునకు, నిధుల్=నివాసభూతులును, వీరుండు = వీరుఁడయిన, వేమాహ్వయుండు = వేమన్నయనెడి పేరుగలట్టియు, శ్రీ...తిలకుండుక్, శ్రీ=లక్ష్మీయుతుఁడయిన, పెద్దడదండనాథతిలకుండుక్=పెద్దడయ్యయనెడి పేరుగల దండనాయక శ్రేష్ఠుఁడును, సింగనామాత్యుఁడుక్=సింగనామాత్యుఁడనెడి పేరుగలట్టియు, నందనులు=కుమారులు, పుట్టిరి=కలిగిరి.

తా. తల్లమాంబికకును బెద్దనమంత్రికి వేమనమంత్రియు, పెద్దడయ్యయు, సింగనమంత్రియు ననెడి పేరులుగలవారై విక్రమధుర్యులగు కుమారులుజనించిరి.

వ. అందగ్రజుండు. 34

టీ. అందుక్=ఆసోదరులలో, అగ్రజుండు=పెద్దవాఁడు, అని పైపద్యముతో నన్వయము.

సీ. కాలకంఠకఠోరకంఠహుంకారంబు
చెవులు సోఁకనినాఁటిరిచిత్తభవుఁడు
కుపితరాఘవఘనక్రూరనారాచంబు
తనువు నాటనినాఁటివనధిరాజు
క్రుద్ధకుంభోద్భవభ్రూలతాకౌటిల్య
వికృతిఁ గ్రుంగనినాఁటివింధ్యశిఖరి
వీరభద్రోదారఘోరవీరావేశ
విహృతిఁ గందనినాఁటితుహినకరుఁడు

తే. చక్కఁదనమున గాంభీర్యసారమునను
బ్రకటధైర్యకళాకలాపములయందు
దండనాయకచూడావతంస మైన
మంత్రిమామిడివేమనామాత్యుఁ డెలమి. 35

టీ. దండనాయక చూడావతంసము = దండనాయకులలో శ్రేష్ఠుఁడు, అయినమంత్రిమామిడివేమనామాత్యుఁడు = అయినట్టిమంత్రియయిన వేమన్న,

చక్కఁదనమునన్ = అందమునందు, కాల...హుంకారంబు, కాలకంఠ = ఈశ్వరునియొక్క, కఠోర = కఠినమయిన, కంఠహుంకారంబు = పెడబొబ్బ, చెవులు సోఁకని నాఁటి = చెవులయందుఁ బడకుండనుండు కాలమందలి, చిత్తభవుఁడు = మన్మథుండు, గాంభీర్యసారమునన్ = గాంభీర్యాతిశయమునందు, కుపిత... నారాచంబు, కుపిత = క్రుద్ధుఁడయిన, రాఘవ = రామచంద్రునియొక్క, ఘన = గొప్పదయిన, క్రూర = భయంకరమయిన, నారాచంబు = బాణము, తనువు నాటనినాఁటి = శరీరమందు నాటకుండనుండు కాలమందలి, వనధిరాజు = సముద్రుఁడు, ప్రకటధైర్యకళాకలాపములయందు = ప్రసిద్ధమగు ధైర్యమందును, కాంతిసంతానమందును, క్రుద్ధ...వికృతి, క్రుద్ధ...వికృతిన్ - క్రుద్ధ = కోపించిన, కుంభోద్భవ = అగస్త్యునియొక్క, భ్రూలతాకౌటిల్య = బొమముడులయొక్క, వికృతిన్ = వికారముచే, క్రుంగనినాఁటి = భూమిమట్టమున కడఁగి పోక యుండునప్పటి, వింధ్యశిఖరి = వింధ్యపర్వతము, వీర...విహృతిన్ - వీరభద్ర = వీరభద్రునియొక్క, ఉదార = గొప్పదియు, ఘోర = భయంకరమయినదియు, నగు, వీరావేశ = వీరరసావేశముచేతనైన, విహృతిన్ = విహారముచేత, కందనినాఁటి = కందిపోక యుండిన కాలమందలి, తుహినకరుఁడు = చంద్రుఁడు. అనఁగా మన్మథుని కంటెను సుందరుఁడును, సముద్రుని కంటెను గంభీరుఁడును వింధ్యగిరికంటెను ధీరుఁడును, చంద్రునికంటెను కాంతిమంతుఁడు నగు ననిభావము.

తా. వేమనామాత్యుఁడు శివునికంటిమంటలచే దహింపఁబడనిమన్మథునితో సమానమయిన యందముగలవాఁడు, రామచంద్రుని బాణాగ్నిచేఁ గలంగిపోని సముద్రముతో సమానమైన గాంభీర్యముకలవాఁడు, అగస్త్యునికోపముచే భూమికిఁ గ్రుంగనట్టి వింధ్యముతో సరియయిన ధైర్యముకలవాఁడు, వీరభద్రునిచే మర్దింపఁబడని చంద్రునితో సరియయిన కాంతిగలవాఁడు.

మ. తగుఁ గైవారమొనర్ప విక్రమకళాధౌరేయతాశాలి శ్రీ
ప్రెగడన్నధ్వజినీశుఁ డంబునిధిగంభీరుండు శుంభద్ద్విష
న్నగరద్వారకవాటపాటనవిధాసప్రౌఢబాహార్గళా
యుగళుం[illegible]నన్.

టీ. విక్రమ...శాలి, విక్రమకళా=పరాక్రమరేఖయొక్క, ధౌరేయతా=భారవాహకత్వముచే, శాలి=ఒప్పుచున్నవాఁడును, అంబునిధిగంభీరుండు=సముద్రునితో సమానమయిన గాంభీర్యముగలవాఁడును, శుంభత్...యుగళుండు-శుంభత్=ప్రకాశించుచున్న, ద్విషన్నగర = శత్రుపురములయొక్క, ద్వార=ద్వారములయొక్క,కవాట=తలుపులను,పాటన=బ్రద్దలుచేయుటయనెడి, విధాన= పనియందు, ప్రౌఢ=నేర్పుగల, బాహార్గళ=అడ్డకఱ్ఱలవంటి భుజముల యొక్క, యుగళుండు=జతగలవాఁడు, ధరలోన్=భూమియందు, పేరు+ఉక్కునన్=అధికమయినబలముచేత, ఒక్కండు= అపూర్వుఁడు లేక, వింత కాఁడును-అనఁగా బలమునం దతనికిఁ బూర్వులెవ్వరును సాటిరారనుట. ఆహవ సవ్యసాచి=యుద్ధమునం దర్జునునితో సమానుఁడును,అగు, శ్రీప్రెగడన్న ధ్వజినీశుఁడు, శ్రీ=శోభాయుతుఁడయిన, ప్రెగడన్న ధ్వజినీశుఁడు= ప్రెగడన్నయనెడి సేనానాయకుఁడు, కైవారము=స్తోత్రమును, ఒనర్పన్ తగున్ = చేయఁదగినవాఁడు-అనఁగా బొగడఁ దగినవాఁడని యర్థము.

తా. పరాక్రమశాలియు, సముద్రముతో సమ మగుగాంభీర్యగుణముగలవాఁడును, శత్రుపురముల భేదించుటయందు సమర్థము లయినబాహువులుగలవాఁడును, సంగరమునందుఁ గిరీటితో సమానుఁడు నగుప్రెగడయ్య యనెడిసేనానాయకుఁడు భూమిలో నుతింపఁ దగినవాఁడు.

సీ. గగనకల్లోలినీకల్లోలమాలికా
హల్లీసకములతోఁ గే నవఘళించి
చరమసంధ్యాకాలసంపుల్లమల్లికా
స్తబకపంక్తులతోడఁ గే సరసమాడి
శరదాగమారంభసంపూర్ణపూర్ణిమా
విమలచంద్రికలతోఁ గే వియ్యమంది
బిసరుహాసనవధూపృథుపయోధరభార
హారవల్లరులతోఁ గే నవ్వఁగి పెన్వఁగి

వెలయు నెవ్వానియభిరామ విమలకీర్తి
యతఁడు త్రిభువనరాయవేశ్యాభుజంగ
కదనగాండీవి జగనొబ్బగండబిరుద
శాశ్వతుం డొప్పు సింగనసచివవరుఁడు. 37

టీ. ఎవ్వానియభిరామ విమలకీర్తి-ఎవ్వాని= ఏసింగనమంత్రియొక్క, అభిరామ=మనోహరమును, విమల=నిర్మలము నైన, కీర్తి=యశస్సు-ఇటకీర్తికి అనఘళించుట సరసమాడుట వియ్యమందుట యనఁగి పెనఁగుట యనువానిచే అభిరామత్వమును, గంగాకల్లోలాదులతోడిసామ్యముచే విమలత్వమును దెలియునది. గగన...హల్లీసకములతోఁ - గగనకల్లోలినీ = ఆకాశగంగయొక్క, కల్లోల =పెద్దతరంగములయొక్క, మాలికా = పంక్తులయొక్క, హల్లీసకములతోఁ =నాట్యములతో, అనఘళించి = సాటియై - అనఁగా గంగా కల్లోలములు సహజముగానే తెల్లనివి; కేవలకల్లోలములను జెప్పక వాని హల్లీసకములను జెప్పుటచే నవి నురుఁగుతోఁ గూడియుండుట సూచితముగా వున ధావళ్యాతిశయము గ్రాహ్యము - అనఁగానురుఁగులతోఁ గూడినగంగా కల్లోలమాలికలవలె కీర్తి మిక్కిలియుఁ దెలుపైన దనుట. ఇట్లే మీఁద నెల్ల ఉపమానముల సహజధావళ్యమునకు మఱింతయతిశయము గలిగించుసందర్భములు పన్నుట యూహించునది. చరమ...పంక్తులతోడఁ - చరమసంధ్యాకాల = సాయంసంధ్యాకాలమందు, సంఫుల్ల = వికసించిన, మల్లికాస్తబక = మల్లెపూ గుత్తులయొక్క, పంక్తులతోడఁ = పంక్తులతోను, సరసమాడి = సరసములుపలికి - అనఁగా మల్లెపూగుత్తుల సహజంపుఁదెలుపునకు మలుసంజయందు నిండారవికసించుటవలని యతిశయము దెలియునది - మలుసంజను విరిసినమల్లెపూవుగుత్తులవలె నతనికీర్తి మిక్కిలి తెల్లనిదై యొప్పుచున్న దనుట, శరద్...చంద్రికలతోన్ - శరత్ = శరత్కాలముయొక్క, ఆగమ=రాకయొక్క, ఆరంభ=ప్రారంభదశయందున్న, సంపూర్ణ=నిండయిన, పూర్ణిమా=పున్నమనాఁటి, విమల=నిర్మలమయిన, చంద్రికలతోఁ = వెన్నెలలతో, వియ్యమంది=బంధుత్వముచేసి- అనఁగా తెల్లని చంద్రికలకు శరదాగమ

మందలి నిండుపున్నమనాఁటి ధావళ్యాతిశయ మూహ్యము. "వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే" అను వచనప్రకారమున సమానులకే యొండొరులతో వియ్యము మొదలైనవి జరుగునుగాన 'చంద్రికలతో వియ్యమంది' యనుటచే చంద్రికలతో సాటియైన యని యర్థము. బిసరు...వల్లరులతోన్- బిసరుహాసన = బ్రహ్మయొక్క, వధూ = భార్యయయిన సరస్వతియొక్క, పృథు=గొప్పవయిన, పయోధరభార = బటువులైన స్తనములందలి, హారవల్లరులతోన్ = తీఁగెలవంటి ముత్తెపుసరులతో, అనఁగి పెనఁగి = ఒద్దికనొంది, తెల్లని ముత్తెపుసరులకు దెల్లని సరస్వతిగుబ్బలయం దునికివలని మిక్కుటంపుఁదెలుపు గ్రాహ్యము. కీర్తి యంత మిక్కిలియుఁ దెల్లనిదనుట. వెలయున్ = ప్రకాశించునో, అతఁడు=అట్టివాఁడును, త్రిభువన...శాశ్వతుండు - త్రిభువన=ముల్లోకములయందు, రాయవేశ్యాభుజంగ = రాయవేశ్యాభుజంగుఁడనునట్టియు, కదనగాండీవి = కదనగాండీవియనునట్టియు, జగనొబ్బగండ=జగనొబ్బ గండయనునట్టియు, బిరుద=బిరుదపదములచే, శాశ్వతుండు=స్థిరుఁడైన, సింగనసచివవరుఁడు = సింగనామాత్యుండు, ఒప్పున్ =వెలయుచుండును.

తా. ఎవనికీర్తి సురఁగులతో డిగంగయలలకుసాటియై మల్లెపూవులతో సరసమాడి పండువెన్నెలలతో బంధుత్వముచేసి, సరస్వతీదేవి తారహారములతో స్నేహముచేసి ప్రకాశించుచున్నదో, అట్టివాఁడును రాయవేశ్యాభుజంగాది బిరుదములు గలవాఁడునగు సింగనామాత్యుఁడు వెలయుచుండును.

మ. అరుదారన్ వివిధాగ్రహారములతో శ్రీనాందోళికాచ్ఛత్రచా
మరకల్యాణకళాచికాదిబహుసమ్మానార్హచిహ్నంబులా
దరమొప్పారఁగ వేమభూవరునిచే శ్రీతం గాంచె సామ్రాజ్యసం
భరణప్రౌఢుఁడమాత్యసింగఁడునయశ్రీప్రాగల్భ్యగర్వోన్నతిన్.

టీ. సామ్రాజ్యసంభరణప్రౌఢుఁడు - సామ్రాజ్య = సమస్తమైన రాజ్యమును, సంభరణ=భరించుటయందు, ప్రౌఢుఁడు=నిపుణుఁడగు, అమాత్యసింగఁడు= సింగనామాత్యుఁడు, నయ...[illegible]...శాస్త్రిమునం

దలి, ప్రాగల్భ్యశ్రీ=ప్రౌఢత్వముయొక్క, గర్వ=కావరముయొక్క - విజృంభణ ముయొక్క యనుట, ఉన్నతిఁ=అతిశయముచేతను, వేమభూవరునిచేతఁ=వేమభూపాలకునివలన, అరుదారఁ=అబ్బురముకలుగునట్లుగా, వివిధాగ్రహార ములతోఁ-వివిధ=అనేకములయిన, అగ్రహారములతోఁ = అగ్రహారముల తోఁగూడ, ఆందోళికా... చిహ్నంబులు-ఆందోళికా=పల్లకీలు, ఛత్త్రి=గుబ్బ గొడుగులు, చామర=వింజామరలు, కల్యాణ=మంగళసూచకమయిన, కళాచి కా=బరిణెలు, ఆది=మొదలుగాఁగలుగు, బహు=అనేకములయిన, సమ్మాన= గౌరవములకు, అర్హ=తగినట్టి, చిహ్నంబులఁ = లాంఛనములను, ఆదరము= ప్రేమము, ఒప్పారఁగఁ=ఒప్పునట్లుగా, కాంచెఁ=పుచ్చుకొనెను.

తా. సింగనామాత్యుఁడు వేమభూపాలుని సామ్రాజ్యభారము వహించి యత నివలన ననేకములయిన బహుమానములను అగ్రహారములను బుచ్చుకొని మిగులఁ బ్రసిద్ధి కాంచెను.

వ. ఈదృగ్విధగుణాలంకారుం డైనయమ్మహా ప్రధాన శేఖరునకు.

టీ. ఈదృగ్విధగుణాలంకారుండు, ఈదృగ్విధ= ఇటువంటి, గుణ=సద్గు ణములనెడి, అలంకారుండు=భూషణములుగలవాఁడు, ఐనయమ్మహాప్రధాన శేఖరునకు=అయినట్టిసింగనామాత్యశ్రేష్ఠునకును.

క. శ్రీమంతున కావర్జిత
సామంతున కహితహృదయజలజాతవనీ
హేమంతునకును సలలిత
భామాకంతునకు సచివభాస్వంతునకున్. 40

టీ. శ్రీమంతునకున్ = ఐశ్వర్యముగలవానికి, ఆవర్జితసామంతునకున్ - ఆవ ర్జిత=లోఁగఁదీసికోఁబడిన, సామంతునకున్ =సామంతప్రభువులుగలవాఁడును, అహిత... హేమంతునకున్ -అహిత= శత్రువులయొక్క, హృదయ=చిత్తముల నెడి, జలజాత=పద్మములయొక్క, వనీ=వనమునకు, హేమంతునకున్ = హేమం తఋతువువంటివానికి-మంచుకాలము తామరలను దూలించునట్లు తాను పగవారి

హృదయములను దూలించువాఁడనుట, సలలితభామాకంతునకున్ - సలలిత= సుందరులైన, భామా= స్త్రీలకు, కంతునకున్ =మన్మథునివంటివానికి, సచివభాస్వంతునకున్ =మంత్రులలో నుత్తముఁడయినవానికి.

క. కుకురుకురుచోళకేరళ
శకమరుకర్ణాటలాటసౌవీరనృప
ప్రకరసభాభరణమహా
సుకవిజనానీకవినుతశుభచరితునకున్. 41

టీ. కుకురు ... చరితునకున్ -కుకురు... సౌవీర=కుకురు, కురు, చోళ, కేరళ, శక, మరు, కర్ణాట, లాట, సౌవీరదేశములయొక్క, నృప=రాజులయొక్క, ప్రకర=సమూహముయొక్క, సభా=సభాస్థలులకు, ఆభరణ=అలంకారములవంటి, సుకవిజన=కవివర్యులయొక్క, అనీక=సమూహముచేత, వినుత=పొగడఁబడుచున్న, శుభ=మంగళమయిన, చరితునకున్ =చారిత్రముగలవానికి.

క. చెంచుమలచ్చూఱకారున
కంచితకరుణాతరంగితాపాంగునకుం
జంచలనయనాకలకిలి
కించితలీలావిలాసకేళీరతికిన్. 42

టీ. చెంచు... కారునకున్ - చెంచుమల=చెంచుమలయనెడి దుర్గమును,చూఱకారునకున్ =కొల్లఁబెట్టినవానికిని, చూఱకారుఁడనుట బిరుదుపేరు 'అనవరత సుకవినికరస్తోత్రవచనరచనా సమయనిర్వికారుండును జెంచుమల చూఱకారుండును' విష్ణుపురా. ౧. ఆ. కానయిది లక్షణమునకుఁ గట్టుపడదు. అంచిత ... అపాంగునకున్ -అంచిత=ప్రకాశించుచున్న, కరుణాతరంగిత = దయారసముచేత తరఁగలవలెపైపైనిగుడు, అపాంగునకున్ =క్రేఁగంటిచూపులుకలవానికిని- అనఁగా దయారసపూరితములయిన చూపులుకలవాఁడనుట, చంచల...రతికిన్ -చంచలనయనా = చలించుచున్న నేత్రములుగలవారియొక్క-అనఁగా స్త్రీలయొక్క, కల=అవ్యక్తమధురమయిన, కిలికించిత = శృంగారభావజనిత

మయిన చేష్టలును, లీలా=లీలయనెడి హావభేదమును, విలాస = విలాసమనెడి హావభేదముగల, కేళీ=క్రీడలయందు, రతికిఁ=ఇష్టముకలవానికి-అనఁగా స్త్రీలుచేయు శృంగారచేష్టలయందుఁ బ్రీతికలవాఁడని చెప్పుటచే రసికుఁడని స్ఫురించుచున్నది.

తా. చెంచుమలదుర్గమును గొల్లఁబెట్టినవానికిఁ గరుణారసపూరితములయిన క్రేఁగంటి చూపులుకలవానికి స్త్రీల భావహావాదులయం దత్యంతప్రీతిగలవానికిని.

క. హాటకగిరిధీరున కరి
తాటంకవతీకపోలతల[1]వరమకరీ
పాటచ్చరకఠినధను
ర్జ్యాటంకారునకు మన్మథాకారునకున్. 43

టీ. హాటకగిరిధీరునకుఁ = మేరుపర్వతమువలె ధైర్యగుణముగలవానికి, అరి... టంకారునకుఁ - అరి=శత్రువులయొక్క, తాటంకవతీ= స్త్రీలయొక్క, కపోలతల = గండప్రదేశములయందున్న, వర=శ్రేష్ఠమయిన, మకరీ=మకరికాపత్రములను, పాటచ్చర = దొంగిలించుచున్న, కఠిన = కఠోరమయిన, ధనుర్జ్యా=వింటినారియొక్క, టంకారునకుఁ=ధ్వనికలవానికి-అనఁగా నితఁడు వింటినెక్కుడి శత్రురాజులను సంహరించుచుండుటచే వారి స్త్రీలు వైధవ్యమును బొందుదురుకాన సౌమంగల్యసూచకములయిన మకరీపత్రములను వ్రాయ మానుచున్నారనుట. మఱియు నితనిధనుష్టంకారమే శత్రు రాజభార్యల మకరీపత్రములను దస్కరించుచున్నదని చెప్పుట వలన, సింగనామాత్యుఁడు యుద్ధముచేయుటకు ధనుష్టంకారమును జేసినంతమాత్రముననే శత్రురాజులు భయాతిరేకముచేఁ జచ్చుచున్నారనఁగా నిఁక నతనియుద్ధమునందు నెదుర్కొని నిలువనోపినట్టి శౌర్యవంతులు గలరనుటయెక్కడిదని తోఁచుచున్నది, మన్మథాకారునకుఁ=మన్మథునితో సమానమయిన రూపముకలవానికిని.

---

1 'కరిమకరీ' వ్రా. ప్ర.

క. శ్రీమహిత[1] పెద్దసుతునకు
వేమక్షితిపాలరాజ్యవిభవకళార
క్షామణికి సింగసచివ
గ్రామణికిం బాండ్యరాయగజకేసరికిన్. 44

టీ. శ్రీమహితపెద్దసుతునకున్ - శ్రీ=లక్ష్మిచే, మహిత=పూజితుఁడయిన, పెద్ద=పెద్దన్నమంత్రియొక్క, సుతునకున్ = కుమారునికి, వేమ...మణికిన్ - వేమక్షితిపాల=వేమరాజుయొక్క, రాజ్యవిభవకళా=రాజ్యవైభవము యొక్క విన్నాణమునకు, మణికిన్ = రక్షగాఁగట్టుకొనుమణియైనవానికి-దుష్టగ్రహాదులు సోఁకకుండుటకై కట్టికొను భూషణమునకు రక్షామణియని పేరు-రక్షామణివలె వేమరాజురాజ్యవైభవమును చెఱుపునొందనట్లు కాచువాఁడని భావము. పాండ్యరాయగజకేసరికిన్ - పాండ్యరాయ = పాండ్యభూపాలుఁడనెడి, గజ=ఏనుఁగునకు, కేసరికిన్ =సింహమువంటివానికి, పాండ్యరాజును గెలిచినవాఁడనుట. సింగసచివగ్రామణికిన్ =సింగన్నమంత్రిశ్రేష్ఠునికి.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనినయిమ్మహాప్రబంధమునకుఁ గథానాయకుండు. 45

టీ. స్పష్టము.

---

1 'పెద్దకోమటి, వేమక్షితిపాల' అనియే వ్రా. ప్ర.

## కథాప్రారంభము.

సీ. తపనీయదండైకశుభ్రధవళాతపత్రితో
ద్దండతేజఃకీర్తిమండలుండు
నిర్మలనిజకథానిమిషకల్లోలినీ
క్షాళితాఖిలజగత్కల్మషుండు
వితతనవద్వీపవిద్వీపనానాజయ
శ్రీవధూటీసమాశ్లిష్టభుజుఁడు
నిఖిలవిద్యానటీనృత్తరంగస్థలా
యతనాయమాన*జిహ్వాస్థలుండు

తే. ప్రస్తుతింపంగఁ దగు సముద్భటకఠోర
చటులగుణటంక్రియాఘనస్తనితఘోష
చాపనీరదభవశరాసారశమిత
బలవదహితతేజోదవానలుఁడు నలుఁడు. 46

టీ. తపనీయ...మండలుండు- తపనీయ=కనకమయమయిన, దండ=కాము గల, ఏక=ఒక్కటైన, ధవళ=తెల్లని, ఆతపత్రిత=గొడుగుగాఁ జేయఁబడుచున్న, ఉద్దండ=గొప్పదయిన, తేజః=తేజస్సుయొక్కయు, కీర్తి=యశస్సుయొక్కయు, మండలుండు = సమూహముగలవాఁడును, ఇటఁ "తపనీయ" "ధవళ" అను విశేషణముల సారస్యమేమన:—ప్రతాప మెఱుపువన్నె కలదనియుఁ గీర్తి తెల్లగానుండుననియు వర్ణించుట కవిసమయసిద్ధము. కాన ప్రతాపము బంగారపు కామవలెనున్నదనియు, యశస్సు తెల్లనిగొడుగువలె నున్నదనియు మఱియు "మండలుండు" అని చెప్పుటచే, మండలమనఁగా వర్తులవగానున్న వస్తుసమూహముగాన గుండ్రనగు గొడుగున కుపమించుట యుక్తమనియు మఱియు నానలునికీర్తిప్రతాపములకు గొడుగు నుపమానముగాఁగొనుటచే గొడుగు

* జిహ్వాంచలుండని పాఠాంతరము.

నకుఁగాను యాధారమయినట్లె కీర్తికిఁ బ్రతాపము కారణమైయున్నదనియుఁ దోఁచుచున్నది. నిర్మల...కల్మషుండు-నిర్మల=స్వచ్ఛమైన, నిజ=తనయొక్క, కథా=చరిత్రమనెడి, అనిమిషకల్లోలినీ=ఆకాశగంగచే, క్షాళిత=కడుగఁబడిన, అఖిల=సమస్తమయిన,జగత్=లోకములయందలి, కల్మషుండు = పాపములుకల వాఁడు, ఇట నలునిచరిత్రమును గంగానదితోసాటి తెచ్చుటవలన గంగవలె నిష్కలుషమైనదియు, గంగ, లోకములను బవిత్రము చేయుచున్నట్లు పాపముల నడఁచి లోకములను బవిత్రము చేయుచున్నదనియు, గంగవలెఁ బుణ్యదాయి యనియు, మూడులోకములయందు వ్యాపించియున్నదనియు, దెలియవచ్చుచు న్నది. నలునిచరిత్రము పాపహారియగుటకుఁ బ్రమాణము "శ్లో॥ కర్కోటకస్య నాగస్య దమయంత్యానలస్యచ। ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనంకలినాశనం" అని యున్నదికాన నలునికథకట్టి శక్తికలదనిభావము. వితత...భుజుఁడు-వితత = విస్తారమయిన, నవద్వయద్వీప = పదునెనిమిది ద్వీపములయొక్క, నానా=అనేకవిధములయిన, జయశ్రీ =జయలక్ష్మియనెడి, వధూటీ= స్త్రీచేత, సమాశ్లిష్ట=కౌగిలింపఁబడిన, భుజుఁడు=బాహువులుగలవాఁడును-అనఁగా నష్టా దశద్వీపములను జయించి జయలక్ష్మిఁగొన్నవాఁడనుట. నిఖిల...స్థలుండు-నిఖిల=సమస్తమయిన, విద్యా=విద్యలనెడి, నటీ=ఆటకత్తెలయొక్క, నృత్త= నాట్యమునకు, రంగస్థల=రంగస్థలమనెడి, ఆయతీనాయమాన = భవనముగ చేయఁబడిన, జిహ్వాస్థలుండు = నాలుకకలవాఁడును, సముద్భట...దవానలుఁ డు-సముద్భట=గొప్పదయిన, కఠోర = కఠినమైన, చటుల = చలించుచున్న, గుణ=నారియొక్క, టంక్రియా = టంకారమనెడి, ఘన = గొప్పదయిన, స్తనితఘోష=గర్జనము గల, చాపనీరద=ధనుస్సనెడి మేఘమువలన, భవ=పుట్టు చున్న, శర=బాణములనెడినీటియొక్క, ఆసార = గొప్పవర్షముచే, శమిత= చల్లార్పఁబడిన, బలవత్ =బలవంతులయిన, అహిత=శత్రువులయొక్క, తేజః= తేజస్సనెడి, దవానలుండు=కార్చిచ్చుగలవాఁడును, అగు, నలుఁడు=నలమహా రాజు, ప్రస్తుతింపఁగన్ తగున్ =పొగడనొప్పును. అనఁగా భయంకరముగగర్జిం చుచు మేఘుఁడువర్షధారలచే దావానలమునుజల్లార్చుచున్నట్లు, నలమహారాజు

భయంకరమగుటంకారము గలచాపమువలనబయలు దేఱు చున్న బాణపరంపర చే శత్రురాజులప్రతాపాగ్నిని నశింపఁజేసినవాఁడనుట.

తా, ఈగ్రంథమునకుఁ గథానాయకుండు, ప్రతాప మనెడిబంగారుకామగ లట్టినిర్మలమయిన సత్కీర్తియనెడి యేకాతపత్రముకలవాఁడును, గంగానదివ లె మల్లోకములను బవిత్రముచేయుచున్న నిర్మలమయిన కథగలవాఁడును, పదునెనిమిదిద్వీపములజయించి యాయాజయలక్ష్ములచే నాలింగనముచేయఁబడుచున్న వాఁడును, సమస్తమయినవిద్య లనెడియాటకత్తెలు నాట్యముచేయుటకుఁ దగిన నాట్యశాలయైన నాలుకగలవాఁడు-అనఁగా సమస్తవిద్యలను నేర్చినవాఁడను ట, ధనుష్టంకారమనెడియుఱుములు గల కార్ముక మనెడి మేఘమువలన బయలుదేఱుచున్న బాణవర్ష మనెడివర్షముచేతఁ జల్లార్పఁబడిన శత్రురాజులప్రతాప మనెడియగ్ని కలవాఁడు నగునలమహారాజు పొగడఁదగును.

అలం. శ్లిష్టరూపకము.

అవ. వెనుకటిపద్యములో నలునిగుణములను సంగ్రహముగాఁ జెప్పి యిప్పుడతనివిద్యాగరిమను దెలియఁజేయుచున్నాఁడు.

చ. అలయకధీతిబోధములు నాచరణంబు ప్రచారణంబు నాఁ
గలుగునుపాధిభేదముల గాఢమతిన్ నిగమాదులైనవి
ద్యలు పదునాలుగింటికి నతం డొనరించెఁ జతుర్దశత్వముం
దెలియగలేము కారణము దీనికి నెమ్మెయిఁ జర్చసేసినన్. 47

టీ. అతండు=ఆనలమహారాజు, అలయక = ఆయాసము చెందక, అధీతి బోధములు, అధీతి=అధ్యయనము చేయుట, బోధములు=ఆచదివినదానిని బాగుగ తెలిసికొనుట, ఆచరణంబు=శాస్త్రములయందుఁ జెప్పఁబడిన విధముగఁ గర్మముల నాచరించుట, ప్రచారణంబు=ఒకరిచేఁ జదివించుట, నాన్=అనఁగా, కలుగు నుపాధిభేదములన్=కలయుట్టి యీనాలు గుపాధిభేదములచేతను, గాఢమతిన్ = స్థిరబుద్ధితో, నిగమాదులు = వేదములు మొదలుగాఁ గలవి, ఐనవిద్యలు పదునాలుగింటికిన్=అయినట్టి పదునాలుగు విద్యలకుఁ (అనఁగా

పురాణములు, న్యాయశాస్త్రము, ధర్మశాస్త్రము మీమాంస, షడంగముల తోఁ(గూడిన వేదములు పదునాలుగు విద్యలయినవి) చతుర్దశత్వమ్ము = పదునా ల్గింటియొక్క ధర్మమును, ఒనర్చెన్ = చేసెను. దీనికిన్ = చతుర్దశ విద్యలకు నొక్కొక్క దానికి నాలుగేసి యుపాధులచే భేదముకల్పించి యేబదియాఱగు టకు మాఱుగాఁ జతుర్దశత్వమును మాత్రమే కల్పించుటకు, కారణమున్ = హేతువును, ఎమ్మెయిన్ = ఏరీతిచేతనయిన, చర్చచేసినన్ = విచారించి నప్పటికిని, తెలియఁగలేము = తెలిసికొనలేము, (అనఁగా నిక్కడ దశాశబ్దమున కు అవస్థయనియు, దశసంఖ్యయనియు రెండర్థములు తీసికొనఁబడినవి. దశశబ్ద ము సంఖ్యావాచకముగా వాడినప్పుడు చతుర్దశ విద్యలకు నొక్కొక్కదానికి నాలుగేసి యుపాధిభేదములఁ గల్పించియుఁ జతుర్దశత్వమునే యెట్లుచేసినాఁ డో యెట్లాలోచించినను గారణము తెలిసికోలేము అను విరోధమువచ్చును. ఆవి రోధము దశశబ్దమున కవస్థలని యర్థముచెప్పినచోఁ దొలంగును. ఎట్లనఁగా పదు నాలుగు విద్యలకు నుపాధిభేదములచే నాలుగేసి యవస్థలు కలదానిగాఁ జేసె ననియు,చక్కఁగా యోచించిన నందులకుఁ గారణము దెలిసికోలేమా అని కాకు స్వరమును చెప్పికొనవలెను. అనఁగా నలుఁడు పదునాలుగువిద్యలను నేర్చియున్ని టిని లోకమునందు వ్యాపింపఁజేసినాఁడనుట.అలంకారము, విరోధాభాసము.

అవ. నలుఁడు సూపకారవిద్యయందసమానుఁడని చెప్పుచు న్నాఁడు.

తే. అతనివిద్య జిహ్వానటి శ్రుతివిధమున
నంగగుణమున నష్టాదశాత్మ యగుచు
విస్తరిల్లె నవద్వయశద్వీపపృథగ
శేషభూజయలక్ష్మీజిగీషఁబోలె. 48

టీ. జిహ్వానటి=సమస్తలోకులయొక్క నాలుకలయందు నాట్యమునలుపు చున్న, అతని=అనలమహారాజుయొక్క, విద్య=సూపకారవిద్య, (పచనముచే యుటయనెడివిద్య) అంగగుణమునన్ - అంగ=షడంగములయొక్క, గుణము

నక్ =ఆవృత్తిచేత, అష్టాదశాత్మము = పదునెనిమిది సంఖ్యగలిగిన, త్రుతివిధ మునక్ =త్రయియనెడి ఋగ్యజుస్సామవేదములవలె, అంగగుణమునక్ -అంగ= ఆఱురసములయొక్క, గుణమునక్ =ఆవృత్తిచేత, అష్టాదశాత్మము=పదునెనిమి దిసంఖ్యకలది, అగుచుక్, (అల్పాధికసమము లనెడిమూడువిధములు గలసూప శారవిద్య యాఱురసములచే నావృత్తిచేయుటంజేసి యష్టాదశత్వమునుబొం దుచు,) నవ...జిగీషఁబోలెన్ -నవద్వయద్వీప=పదునెనిమిదిద్వీపములవగు,పృ థక్ =వేఱువేఱుగానున్నట్టి, అశేష=విస్తారమయిన, భూ=భూమండలమును, జయ=జయించుటవలనఁగలిగిన, లక్ష్మీ = లక్ష్ములను, జిగీషంబోలె=జయింపని చ్ఛచేతంబోలె, విస్తరిల్లెక్ =విస్తరించినది. అనఁగా లక్ష్మి పదునెనిమిదివిధము లయియుండుటచేఁ దానుగూడఁ బదునెనిమిదివిధములయి లక్ష్మిని జయింపవలె నని తలంచి సూపకారవిద్యారూపమయిన సరస్వతి మొదట న్యూనాధికసమ ములను మూఁడువిధములయి, షడ్రసములచే నావర్తింపఁబడి పదునెనిమిదివిధ ములయినదని భావము.

తా. లక్ష్మీసరస్వతుల కన్యోన్యకలహము జగత్ప్రసిద్ధము కావున, నలమహా రాజునకు వశ్యమయినదియు, న్యూనము అధిక సమము అనుమూఁడు భేదములు గలదియునగు సూపకారవిద్య, షడంగములచేత నావృత్తిచేయఁబడి పదు నెనిమిదిసంఖ్య వహించినవేదత్రయమువలె, నాఱురసములచేత నావృత్తి చేయఁబడి పదునెనిమిదివిధములుగలదగుచు, నలమహారాజు ద్వీపములను జయిం చితెచ్చి వేఱువేఱుగా నుంచినపదునెనిమిదిజయలక్ష్ములను జయింపఁగోర్కి కల దివోలె విస్తరిల్లెను.

అలంకారములు, ఉపమోత్ప్రేక్షలు.

అవ. ఈపద్యమందు నలునిశాస్త్రజ్ఞానమును బ్రకారాంతర ము చేఁజెప్పుచు నలుఁడీశ్వరసమానుండని నిరూపించుచున్నాఁడు.

తే. తాఁ ద్రినేత్రునియపరావతార మగుటఁ

దెలుపు దిక్పాలకాంశావతీర్ణుఁ డతఁడు

కామసంచారహరణప్రగల్భ మైన
శాస్త్ర మను పేరియధిక లోచనముకలిమి. 49

టీ. దిక్-తీర్ణుఁడు-దిక్పాలక=దిశాపాలురయొక్క, అంశ=భాగములవలన, అవతీర్ణుఁడు=అవతరించినట్టి, అతఁడు=ఆనలమహారాజు, తాన్=తాను, త్రినేత్రుని యపరావతారము=ఈశ్వరునియొక్క రెండవయవతారము, అగుటన్ = అయియుండుటను, కామ... ప్రగల్భము-కామసంచార = స్వేచ్ఛావిహారము యొక్క,హరణ=హరించుటయందు,ప్రగల్భము=ప్రౌఢము,ఈశ్వరపక్షమందు-కామ=మన్మథునియొక్క, సంచార=విహారమును, హరణ=హరించుటయందు, ప్రగల్భము-అనఁగా మన్మథునిదహించినదని భావము. ఐనశాస్త్రము=అయినట్టి శాస్త్రము, అను పేరి=అనునట్టినామముగల, అధికలోచనముకలిమి = రెండింటి కంటె నధిక మైనలోచనముండుట-అనఁగాశాస్త్రమనెడి మూఁడవనేత్రముకల వాఁడనుట, తెలుపున్ = తెలియఁజేయుచున్నది. అనఁగా నీశ్వరునియందు దేవత్వము, కామనిగ్రహత్వము, త్రినేత్రత్వము, ననుధర్మములున్నవి. ఆధర్మములు నలునియందుఁగూడనున్నవి. ఎట్లన "అష్టాభిర్లోకపాలానాం మాత్రాభిర్నిర్మితోనృపః" అను ప్రమాణముచే దేవత్వము సిద్ధించుచున్నది. కామవిహారమును హరించెనుగాన కామనిగ్రహత్వమున్నది. శాస్త్రమనులోచనము కలవాఁడగుటచేఁ త్రినేత్రత్వము సిద్ధించుచున్నది. కాన నలుం డీశ్వరతుల్యుఁడని ఫలితార్థము.

తా. అష్టదిక్పాలురయొక్క యంశములచే జనించిన నలమహారాజు కాముని దహించిన మూఁడవలోచనము గలయీశ్వరునివలెఁ గామసంచారము హరించుటయందు నేర్పుగలశాస్త్ర మనెడిమూఁడవనేత్రముకలవాఁడు గనుకఁ త్రినేత్రుని యపరావతారమనుటకు సందియములేదు. అలంకారము వ్యస్తరూపకము.

అవ. ఈపద్యమందు నలునికీర్తివ్యాపకత్వమును దెలియఁజేయుచున్నాఁడు.

చ. కెరలి మహాసివేమసహాకృత్వరి తద్భటకోటిచాతురీ
తురగ సమరాంగణంబులఁ జతురగ రిద్దావరణంబులన్ యశోం

బరములనేయుచుండుబహు భంగులఁబున్నమనాఁటినిండుచం
దురునునుసోగవెన్నెలల తోఁ దులదూఁగెడుతద్గుణంబులన్.

టీ. సమరాంగణంబులన్ =యుద్ధభూములయందు, మహాసివేమసహాకృత్వరి - మహత్ =గొప్పదగు, అసి=ఖడ్గమనెడి, వేమ=(సాలెవానినేఁత) పలక, సహాకృత్వరి= సహాయముగాఁగల, తద్భటకోటిచాతురీతురి- తద్భట=ఆనలమహారాజు భటులయొక్క, కోటి=సమూహముయొక్క, చాతురీ=నేర్పనెడి, తురి=(నూలుకండెయుంచుకొనెడి) నాడె, కెరలి=అతిశయించి, పున్నమ... వెన్నెలల తోన్ -పున్నమనాఁటి=పూర్ణిమయందున్న, నిండు=పూర్ణుఁడయిన, చందురు=చంద్రునియొక్క, నును=స్నిగ్ధములయిన, సోగ=నిడుదలయిన, వెన్నెలల తోన్=చంద్రకాంతులతోడ, తులదూఁగెడి=సాటిచెందెడి, తద్గుణంబులన్ - తత్ = ఆనలమహారాజుయొక్క, గుణంబులన్ = సద్గుణములనెడి తంతువుల చేత, చతుర్హారిదావరణంబులన్ -చతుర్ =నాలుగయిన, హరిత్ =దిక్కులను, ఆవరణంబులు=కప్పచుండెడి, యశోంబరములన్ =కీర్తియనెడి వస్త్రములను, బహుభంగులన్ =అనేకవిధములచే, నేయుచుండును. అనఁగా నలమహారాజు కత్తి చేతధరించి తనభటులకు సహాయుండయి యుండుటచే వారలు దిక్కులనుజయించి యతనికీర్తిని దిక్కులన్నింటియందు వ్యాపింపఁజేయుచున్నారనుట.

తా. ఉత్కటమయినఖడ్గమనెడి నేఁతపలక సహాయముగాఁగల యట్టినలమహారాజుయొక్క భటసమూహముల చాతుర్యమనెడినాడె నిండుచందురుని పండువెన్నెలలతో సమానములయిన నలమహారాజుగుణము లనెడితంతువుల చేత దిక్కులనావరింపఁజాలిన కీర్తిపటములను నేయుచుండును.

అలంకారము, సాంగరూపకము.

తే. తద్దిశాజయయాత్రోత్థ ధరణిధూళి
దోఃప్రతాపవైశ్వానర ధూమరేఖ
పాలమున్నీటిలోఁ బడి పంక మయ్యె
నమృతదీధితిమేఁ జెంది యంక మయ్యె. 51

టీ. దోః ప్రతాప వైశ్వానర ధూమరేఖ - దోః = బాహువులయొక్క, ప్రతాప = ప్రతాపమనెడి, వైశ్వానర = అగ్నిహోత్రముయొక్క, ధూమరేఖ = పొగసమూహమువలెనున్న, తత్ ... ధూళి - తత్ = ఆ నలమహారాజుయొక్క, దిశాజయ = దిగ్విజయము కొఱకయిన, యాత్ర = యుద్ధయాత్రలయందు, ఉత్థ = లేఁగిన, ధరణిధూళి = భూపరాగము, పాలమున్నీటిలోన్ = పాలసముద్రమునందు, పడి, పంకము = బురద, అయ్యెన్ = అయెను, అమృతదీధితిమైన్ - అమృత దీధితి = చంద్రునియొక్క, మైన్ = శరీరమును, చెంది = పొంది, అంకమయ్యెన్ = కళంకమాయెను.

తా. ఆ నలమహారాజుయొక్క చండప్రతాపమనెడి యగ్నిహోత్రుని పొగవలె వెలయునట్టిదై దిగ్జయములయం దతనిసేన వలన బయలువెడలినపరాగము, పాలసంద్రములోఁబడి బురదయయి, పాలసముద్రమునందుఁబుట్టిన చంద్రుని శరీరమును జెంది కళంకమాయెను. అట్లుకానిచోఁ జంద్రుని శరీరమందుఁ గళంకముండుటకుఁగతమేమి? అలంకారము గమ్యోత్ప్రేక్ష.

చ. అరయికగల్గి భూమివలయం బఖిలంబును నీతిబాధలం
బొరయక యుండనానృపతిపుంగవుఁ డేలుచు నుండ నొండుచో
టిరవయియుండకుండుటఁ జుమీ యతివర్షములాశ్రయించెద
త్పరనరనాథయూథవనితాజనతానయనోత్పలంబులన్. 52

టీ. ఆనృపతిపుంగవుఁడు = రాజశ్రేష్ఠుఁడయిన నలమహారాజు, అరయిక = విచారణ, కలిగి, భూమివలయంబును = భూమండలము, అఖిలంబును = అంతను, ఈతిబాధలన్ = ఈతిబాధలను (అతివృష్టి, అనావృష్టి, మూషికములు, మిడుతలు, చిలుకలు, తనకుసమీపముననుండు రాజు, ఈయాఱును ఈతిబాధలనఁబడును) పొరయక ఉండన్ = పొందకుండ, ఏలుచుండన్ = పరిపాలించుచుండఁగా, ఒండుచోటు = మఱియొకస్థలము, ఇరవయి = నివాసస్థలమై, ఉండక ఉండుటన్ + చుమీ = ఉండకపోవుటచేతనే చుమీ, అతివర్షములు = అతివృష్టియనెడి యీతిబాధ, తత్ ... ఉత్పలంబులన్ - తత్ = ఆనలమహారాజు

యొక్క, పరనరనాథ=శత్రురాజులయొక్క, యూథ=సమూహముయొక్క, వనితాజనతా=భార్యాజనములయొక్క, నయన+ఉత్పలంబులన్ =కలువలవంటి నేత్రములను, ఆశ్రయించెన్ =చేరినవి.-అనఁగా నలమహారాజు శత్రువులను జంపుటచే వారి భార్య లనవరతము దుఃఖించుచున్నారనుట.

తా. నలమహారాజు భూమియందెచ్చట నీతిబాధలులేకుండునట్లు పరిపాలించుచుండ నీతిబాధ లన్నియుఁ జెదరిపోయెను. అప్పుడతివృష్టి తనకుండుటకుఁ దగిన నివాసస్థలమును గానక తిరిగివచ్చి నలుని శరణువేఁడి యతని సెలవు చొప్పున శత్రురాజుభార్యల నేత్రముల నాశ్రయించెను. లేనిచో నెల్లకాలములయందును వారికన్నులవెంబడిని నీరు కారుచుండ నేల? అలంకారము,ఉత్ప్రేక్ష.

ఉ. కొండనివేడ్కతోఁబసిఁడికొండ ధనార్థులకెల్లఁబంచియీఁ
కుండుటదానధారకుఁ బయోనిధులెల్లవ్యయింపలేమియీ
రెండపకీర్తులం దల ధరించినవాఁడు ప్రదానశీలుఁడా
తండిరువాయగాముడికిఁదార్చినవెంద్రుక లన్మిషంబునన్.

టీ. కొండు+అని=తీసికొండని, వేడ్కతోన్ =వేడుకచే, పసిఁడికొండన్ =బంగారపుకొండను, ధనార్థులకున్ +ఎల్లన్ =ధనము యాచించువారి కందఱికి, పంచి=విభాగించి, ఈకుండుట=ఈయక పోవుటయు, దానధారకున్ =దానములుచేయునప్పుడు విడిచెడిజలధారలకు,పయోనిధులు ఎల్లన్ =సముద్రములనన్నింటిని,వ్యయింపలేమి=వ్యయముచేయలేక పోవుటయు, ఈరెండు, అపకీర్తులన్ =ఈరెండపయశస్సులను-పసిండికొండను యాచకులకుఁ బంచి యీలేకపోవుటచేతను, సముద్రములను దానజలమునకయి వ్యయముచేయలేక పోవుటచేతను, బుట్టిన చెడ్డకీర్తులను,ప్రదానశీలుఁడు=మిక్కిలి దానము సేయుటే స్వభావముగాఁ గలవాఁడు, అతండు=ఆనలమహారాజు, ఇరు+పాయగాన్ =రెండుపాయలుగా, ముడికిన్ =బంధమునకు, తార్చినవెంద్రుకలు=పొందించిన కేశములు,అన్ -మిషంబునన్ =అనెడి మిషచే, తలన్ =శిరస్సుపయిని, ధరించినవాఁడు=తాల్చినవాఁడు (అనఁగా నుత్తరదేశపురాజులు పాపటఁదీసి ముడివేసికొనుటచే రెండుపాయలయి కానవచ్చు) కేశములను కవీశ్వరుఁ డపకీర్తులనుగా వర్ణించినాఁడు.

తా. ఇదిగో నిచ్చుచున్నాను పుచ్చుకొనుఁడని మిగులవేడుకతో యాచకులకుఁ బంగరుకొండ పంచి యీయలేక పోవుటచేతను, దానజలమునకు సముద్రములను వ్యయముచేయలేక పోవుటచేతను గలిగిన యీరెండపకీర్తులను నా నలమహారాజు కేశపాశమును రెండుపాయలుగాఁజేసి బంధించిన వెంద్రుకలనెడి మిషచేఁ దన శిరంబునందు ధరించెను. మఱియు, లోకములో రాజులు రాజద్రోహులను రాజ్యమందుంచినచో దానికిభంగముకలిగింతురని వారిని దమయొద్దనె యుంచుకొందురు. అట్లె యుత్తమశీలుఁ డయిననలుఁడు, లోకమందు వ్యాపించి తనకీర్తికి భంగము కలిగింపకుండుటకయి తనయొద్దనే యీయపకీర్తుల నుంచుకొన్నాఁడనియు భావము. అలంకారము వ్యస్తరూపకము.

చ. నియమవిచిత్రభంగి మహనీయుఁడు భూమివిభుండు మిత్రజే
తయును నమిత్త్రజేతయుఁబ్రతాపగుణంబున నీతిఁజారదృ
ష్టియును విచారదృష్టియు నటే పరిపంథిమహీశులట్ల త
ద్భయమున భేత్తృతాగుణముఁ బాసెనొ కాక విరుద్ధధర్మముల్.

టీ. నియమవిచిత్రభంగి-నియమ=నేమముచే, విచిత్ర =అద్భుతములయిన, భంగి=రీతులు గలిగినవాఁడును, మహనీయుఁడు= పూజనీయుండును, భూమివిభుండు= రాజయిన నలమహారాజు, ప్రతాప గుణంబునన్ = ప్రతాపముచే, మిత్రజేతయు = మిత్రుని జయించువాఁడును, అమిత్రజేతయు = అమిత్రులను జయించువాఁడును, మిత్రజేతయై యమిత్రజేత యెట్టులగునని విరోధము. మిత్రశబ్దమునకు సూర్యుఁడని యర్థము చెప్పుకొని నలుఁడు ప్రతాపముచే సూర్యునిఁ దనశత్రువులను జయించుచున్నాఁడనిన విరోధపరిహారమగు, నీతిన్ =నీతిశాస్త్రమునందు, చారదృష్టియున్ =చారు లనెడిదృష్టికలవాఁడును,విచారదృష్టియున్ -వి=విగతమయిన-అనఁగా లేని, చార=చారులనెడి, దృష్టియున్ = దృష్టికలవాఁడు, చారదృష్టియయిన వాఁడు విచారదృష్టియెట్టులగునని విరోధము. విచారశబ్దమునకు వివేకమని యర్థము చెప్పికొని నలుఁడు చారదృష్టి కలవాఁడనియు,వివేక మనెడిదృష్టి గలవాఁ డనియుఁ జెప్పినవిరోధపరిహారమగును. అటే=ఆశ్చర్యము. తద్భయమునన్ = ఆనలునివలని భయముచేత, విరు

ద్ధధ ర్మముల్ =విరుద్ధము లయినధర్మములు, పరిపంథిమహీపాలులట్ల= శత్రుభూపాలురువలె, భేత్తృతాగుణమున్ =భేదబుద్ధిని, పాసెనో కాక = విడిచిపెట్టినవి కాఁబోలును. మిత్రజేతృత్వమును అమిత్రజేతృత్వమును బరస్పరవిరుద్ధములు. అట్లె చారదృష్టిత్వమును విచారదృష్టిత్వము నన్యోన్యవిరుద్ధములు. ఈవిరుద్ధ ధర్మములు నలునియందొక్కటిగాఁ గలసియుండుట యెట్లన్నచోఁ బరస్పర విరోధులగు శత్రువులు నలునికి భయపడి తమతమ విరోధములు మాని స్నేహమునఁ గలసి యతనిని గొలుచునట్లు లావిరుద్ధ ధర్మములును గలసి యతనియందు గనుపట్టుచున్న వేమోయని కవియుత్ప్రేక్షించినాఁడు. అనఁగా నలుఁడు ప్రతాపాతిశయముచేతను నీతివైభవముచేతను శత్రువులనెల్ల నడఁచి పరస్పరవైరములు మఱచి తన్నుఁ గొలుచునట్లు గావించినాఁడని భావము.

తా. నలుఁడు ప్రతాపముచే మిత్రజేతయు, నమిత్రజేతయునై, నీతిని చారదృష్టియు విచారదృష్టియునై యుండెను (అనఁగానొక్కచోటనుండని విరుద్ధ ధర్మములు గలిగియుండెను) కావున నలమహారాజువలనఁ గలిగెడిభయముచే శత్రుభూపాలురు తమతమ భేదబుద్ధిని విడిచి స్నేహితులై కొలుచుచున్నట్లు విరుద్ధధర్మములుగూడ నలునికిభయపడి భేదబుద్ధినివిడిచి యతనిసేవించుచున్నవి కాఁబోలు. అలంకారములు విరోధాభాసము, ఉత్ప్రేక్షయు.

మ. ధరనేకాంఘ్రికనిష్ఠికాంగుళమ యాధారంబుగా నిల్చి ని
ర్భరలీలం గృతవేళ నెట్టన యధర్మంబుం దపస్వితముం
బొరసెం దక్కినవార లెవ్వరు తపంబుల్ సేయ రష్మేదినీ
శ్వరుసామ్రాజ్యమునందుధర్మముచతుష్పాదంబులం గాలఁగన్.

టీ. కృత... వేళన్ =కృతయుగమునందు, అష్మేదినీశ్వరు సామ్రాజ్యమునందున్ =ఆనలమహారాజుగొప్పరాజ్యమందు, ధర్మము, చతుష్పాదంబులన్ =నాలుగుపాదములచేతను, క్రాలఁగన్ =ప్రకాశించుచుండఁగా, అధర్మంబున్ =అధర్మముసైతము, ఏకాంఘ్రికనిష్ఠికాంగుళమ- ఏక=ఒక్కటైన, అంఘ్రి=పాదముయొక్క, కనిష్ఠికాంగుళమ=చిటికెనవ్రేలుమాత్రమే, ఆధారంబుగాన్ =ఊఁతయగునట్లు, నిల్చి=నిలిచి, నిర్భరలీలన్ =[illegible] నెట్టన్ =

మిక్కిలి, తపస్విత్వమున్ = తాపసవృత్తిని, పొరసెన్ = పొందెను, తక్కినవారలు=తక్కిన ప్రజలు, ఎవ్వరు=ఏవారు, తపంబుల్, చేయరు=తపంబులనాచరింపరు, (అనఁగానందఱును తపమునాచరింతురని) యర్థము. ఇట నధర్మము బొటనవ్రేలూనినదనుటచే నుండుట కవకాశములేమి సూచితము. నలుఁడధర్మమునకు నిరవకాశముగా ధర్మోత్తరముగాఁ బాలించినాఁడని యాశయము.

తా. నలమహారాజు కృతయుగమందు ధర్మము నాలుగుపాదములను బ్రవర్తిల్లునట్లు చేయుచుండఁగా, నతని రాజ్యమం దచ్చటచ్చట నున్నయధర్మముగూడ ధర్మబుద్ధిగలదయి భూమియందుఁగాలిచిటికెనవ్రేలిని మోపి నియమముతోఁ దపంబు చేయుట కారంభించెను. అధర్మమే తపంబు చేయుట కారంభించినప్పుడు తక్కినమానవులెవ్వరు తపంబు చేయఁబూనుకొనరు? అందఱును దపంబుల నాచరింతురు. అలంకారము, కావ్యార్థాపత్తి.

క. ఆరాజు విజయలక్ష్మికి
నీరాజన మాచరించు నిర్దగ్ధదిగం
తారాతిరాజనగరీ
దారుణవైశ్వానరప్రదక్షిణశిఖలన్. 56

టీ. ఆరాజు=ఆనలమహారాజు, విజయలక్ష్మికిన్ = జయలక్ష్మికి, నిర్దగ్ధ...శిఖలన్-నిర్దగ్ధ=దగ్ధము చేయఁబడిన, దిగంత=దిక్కులయంతములనుండు, అరాతిరాజ=శత్రురాజులయొక్క, నగరీ=పురములయొక్క, దారుణ = భయంకరమైన, వైశ్వానర=అగ్నిహోత్రునియొక్క, ప్రదక్షిణ =వలయముగాఁ దిరుగుచున్న, శిఖలన్ =జ్వాలలచేత, నీరాజనమాచరించున్ = నీరాజనమిచ్చును, నలమహారాజు దిగ్విజయములందు శత్రుపురములను దహింపఁగా నామంటలను కవియిట్లుత్ప్రేక్షించుచున్నాఁడు. అనఁగాఁ గ్రొత్తగాఁ బెండ్లియాడి తీసికొనివచ్చిన స్త్రీలను దమయిండ్లఁ బ్రవేశపెట్టుటకు ముందుగా నీరాజనమిచ్చుట ప్రసిద్ధము. అట్లే నలుఁడు దేశములజయించి సంపాదించిన జయలక్ష్మికి శత్రుపురములను మంటలచే నీరాజనమిచ్చుచున్నాఁడనుట. ఈచెప్పుట

చే నలుఁ డనర్గళపరాక్రమశాలియై శత్రుపురములను గాల్చి తన్ను నెదుర్కొ-
న్నవారలను జయించుచు జయలక్ష్ములను సంపాదించుచున్నట్లు స్ఫురించు
చున్నది.

తా. ఆనలుఁడు శత్రుపురములనుగాల్చి యామంటలచే తనజయలక్ష్మికి నీ
రాజనమిచ్చును. అలంకారము, గమ్యోత్ప్రేక్ష.

చ. ఇతఁడు దరిద్రుఁడౌ ననుచు నేర్పడ నర్థిలలాటపట్టికన్
శతధృతి వ్రాసినట్టిలిపిజాల మనర్థము గానియట్లుగా
వితరణఖేలనావిభవవిభ్రమనిర్జితకల్పభూరుహుం
డతఁడు దరిద్రతాగుణమునందు దరిద్రునిఁజేయు నాతనిన్.

టీ. వితరణ...భూరుహుండు-వితరణ ఖేల నా= దానగుణమనెడి క్రీడయొ
క్క, విభవ=సంపదయొక్క, విభ్రమ=విలాసముచే, నిర్జిత=జయింపఁబడిన,క
ల్పభూరుహుండు=కల్పవృక్షముగల, అతఁడు=ఆనలమహారాజు, ఈచెప్పుటచే
నలుండు దానగుణమందుఁ గల్పవృక్షాదులకంటె మిగులఁ బ్రసిద్ధుఁడని తోఁచు
చున్నది. ఇతఁడు=ఈమనుజుఁడు, దరిద్రుఁడు=బీదవాఁడు, ఔను,అనుచున్ =
అనిపలుకుచు, ఏర్పడన్ =స్పష్టముగా,అర్థిలలాట పట్టికన్ = యాచకునియొక్క
ఫాలతలమునందు, శతధృతి=బ్రహ్మ,వ్రాసినట్టి లిపిజాలము=లిఖించినయక్షర స
ముదాయమును, నర్థము=అర్థములేనిది, కాని యట్లుగాన్ = కాకుండ, అనఁగా
బ్రహ్మ వ్రాసినవ్రాఁతను మిథ్యాభూతముగాఁ జేయకుండునట్లు, ఆతనిన్ =ఇతఁ
డు దరిద్రుఁడౌనని బ్రహ్మచే స్థిరీకరింపఁబడినవానిని, దరిద్రతాగుణమునం
దున్ =బీదతనమునందు, దరిద్రునిన్ =బీదవానినిగా, చేయున్ =చేయుచుండు
ను,ఈచెప్పుటచే నలునికి బ్రహ్మవ్రాఁతను దప్పింపఁగలంత శక్తియున్నట్లును,
అతనికట్టి శక్తియున్నను దేవతాభక్తి కలవాఁడగుటచే బ్రహ్మవ్రాఁతను మిథ్యా
భూతముగాఁ జేయలేదనియును, దాను దేవతలను సైత మతిక్రమింపఁగల సా
మర్థ్యము కలవాఁడయినను గర్వింపక దేవతలయెడల వినయముకలవాఁడనుట
చేతఁ బూజనీయములయిన సుగుణములు కలవాఁడనియుఁ దోఁచుచున్నది.

తా. బ్రహ్మ యీఁడు దరిద్రుఁడగు' నని యాచకుని ఫాలభాగమందు వ్రాసిన

వ్రాఁతను నలమహారాజు వానికి విస్తారమగు ధనమునొసంగి యాతని బీదతనమును దొలఁగించి బ్రహ్మవ్రాఁత వ్యర్థము కాకుండునట్లు వాని బీదతనమునందు బీదవానినిగాఁ జేయును.

తే. అతనికీర్తిప్రతాపంబు లవనిఁ గలుగ
నేల యివి యంచు మదిలోన నెపుడు దలఁచు
నపుడ పరివేషనెపమున నబ్జసూర్య
మండలముల విధాతృండు గుండలించు. 58

టీ. అతనికీర్తి ప్రతాపంబులు-అతని=ఆనలమహారాజుయొక్క, కీర్తిప్రతాపంబులు=యశస్సును ప్రతాపమును, అవనిన్=భూమియందు, కలుగన్=ఉండఁగా, ఇవి=ఈ సూర్యచంద్ర మండలంబులు, ఏలయంచున్=ఎందులకని, విధాతృండు=బ్రహ్మ, మదిలోనన్=మనస్సునందు, సూర్యచంద్రులు పరివేషము కలవారయి యుండుట యొక్కొక్కసమయమందే కాని యెల్లప్పుడు తటస్థింపదుగనుక దానికనుగుణముగా 'ఎపుడు దలంచునపుడు' అని కవిచెప్పినాఁడు. అనఁగా బ్రహ్మ ఒకానొకప్పుడే యట్లు దలఁచి కుండలించునుగాన ఒకానొకప్పుడే పరివేషములు కలుగుచుండుననియు నట్లు తలఁచునప్పుడు కుండలించుటలేదు గావున బరివేషములు కలుగవనియుసారస్యము స్ఫురించుచున్నది. ఎపుడు=ఏసమయమందు, తలఁచున్=స్మరించుకొనునో, అపుడు =ఆకాలమందు, పరివేషనెపమునన్ = పరివేషమనెడిమిషచేత, అబ్జసూర్యమండలంబులన్ = చంద్ర సూర్యమండలములను, కుండలించున్ = కుండలరేఖఁగలవానినిగా జేయును.

తా. వ్రాయువాఁడధికాక్షరమును విసర్జించుటకు, సున్నచుట్టినట్లు బ్రహ్మయు నలుని యశఃప్రతాపములుండ దా నిర్మించిన చంద్రసూర్యు లిరువురునుండ నవసరములేదన్ని తలంచినకాలమునందెల్ల పరివేష మనెడినెపముచేత నారెంటికి సున్నచుట్టుచుండును. అలంకారము, సాపహ్నవోత్ప్రేక్ష.

వ. అన్నలుండు నళినబాంధవుండునుంబోలె ప్రతిదినంబును న

భ్యుదయంబు నొందుచుఁ గ్రమంబున శైశవంబు నతిక్రమిం
చి యౌవనారంభంబున నరిదుర్గలుంఠనావసరంబులంబోలె
లోహార్గళదీర్ఘ పీనతయును, గోపురద్వారకవాటదుర్ధర్షతిరఃప్ర
సారితయును, బాహావక్షంబులచేత వందీగ్రాహంబుగ్రహిం
చి రోమకోటికపటంబున హాటకగర్భుండు పాటించి లిఖించి
నసుగుణగణనా రేఖ లవయవంబులం బొలుపార సంపూర్ణ
పూర్ణిమాచంద్రబింబంబు విడంబింపం జాలునెమ్మొగంబున
కుం గళంకాలంకారశంక నంకురింపఁజేయంజాలుఁగోమలశ్మ
శ్రురాజి విరాజిల్ల గండుమెఱసి రెండవకుసుమకోదండుండు
నుంబోలె విలాసినీమండలికిం గన్నులపండువై వెండియు. 59

టీ. అన్నలుండు = అ నలమహారాజు, నళినబాంధవుండునుం బోలె=సూ
ర్యుఁడువలెనే,ప్రతిదినంబును=దినదినమును, అభ్యుదయంబుఁ =అభివృద్ధిని, ఒం
దుచుఁ =పొందుచు,క్రమంబునఁ =క్రమముగా, శైశవంబును = బాల్యమును,
అతిక్రమించి = కడచి, యౌవనారంభంబునఁ = యౌవనముయొక్క యా
రంభ దశయందు, అరి... పోలెఁ - అరి=శత్రువులయొక్క,దుర్గ=కోటలను,
లుంఠనా వసరంబులంబోలె=దోపుడు సమయములయందుఁ గాఁబోలును, లో
హార్గళదీర్ఘపీతయును - లోహ = లోహసంబంధమయిన, అర్గళ=అడ్డుకఱ్ఱల
యొక్క, దీర్ఘ పీనతయుఁ =దీర్ఘత్వమును, స్థూలత్వమును, గోపుర...యు
ను- గోపురద్వార=గోపురద్వారములయందున్న, కవాట = తలుపులయొక్క,
దుర్ధర్షతిరఃప్రసారితయు-దుర్ధర్షతయు=కాఠిన్యము, తిరఃప్రసారితయు=వైశా
ల్యమును, బాహావక్షంబులచేతఁ =బాహువులచేతను, వక్షస్థలముచేతను, వందీ
గ్రాహంబు గ్రహించి=బలత్కారముగాఁ దీసికొని, ఇటవందీగ్రాహంబు అన్వ
యము - అనఁగా నలమహారాజు శత్రువుల దుర్గములను గొల్లపెట్టునప్పు డతని
బాహువులు ద్వారనిరోధముచేయు కఱ్ఱలయొక్క దీర్ఘత్వ పీనత్వములను గొల్ల
పెట్టెను గాఁబోలు నటులనే ... ... ... ... వక్షస్థలము గోపుర

ద్వారమం దుండుతలుపులయొక్క కఠినత్వ వైశాల్యములను గొల్లపెట్టెను గాఁబోలునని యర్థము. అలంకారము త్ప్రేక్ష - నలమహారాజు యౌవనమం దర్గళముల వంటిబాహువులు గలవాఁడనియును,దలుపువలె విశాలమును కఠినము నగుఱొమ్ము కలవాఁడనియు భావము. హాటకగర్భుండు = బ్రహ్మ, పాటించి= గమనించి, లిఖించిన సుగుణగణనారేఖలు= వ్రాసినట్టి సుగుణముల లెక్కించు టకొఱకయిన గీఱలు, రోమకోటి కపటంబునన్ - రోమ = వెంట్రుకలయొ క్క, కోటి=సమూహముయొక్క, కపటంబునన్ = మిష చేత, అవయవంబు లన్ = అంగములయందు, పొలుపారన్ = ప్రకాశింపఁగా, యౌవనావిర్భావ మందు నలుని యంగంబులయందు రోమకూపంబులు వెలువడఁగా నవి బ్రహ్మ దేవుఁడు నలునియందున్న సుగుణములను లెక్కపెట్టుటకయి వ్రాసిన మసిరేక లన్నట్టుగాఁ బ్రకాశించుచుండెనని భావము. అలం. అపహ్నవము. సంపూర్ణ... బింబంబును - సంపూర్ణ=నిండయిన, పూర్ణిమాచంద్రబింబంబును = పున్నమనాఁ టిచందురుని, విడంబింపన్ =సరిపోలుటకు, చాలునెమ్మొగంబునకున్ = సమర్థమ యిన వదనమునకు, కళంకాలంకార శంకన్ = కళంకమనెడియలంకారము యొక్క శంకను, అంకురింపన్ చేయన్ =కలిగించుటకు, చాలు కోమలశ్మశ్రు రాజి=సమర్థమగు కోమలమయిన గడ్డమందు మీసమందు నుండు రోమసమూ హము, విరాజిల్లన్ = ప్రకాశింపఁగా, సంపూర్ణ చంద్రబింబముతో సరియగు నలుని ముఖమునందు వెలయుచున్న శ్మశ్రురోమసమూహము చంద్రబింబమునం దుఁ గళంకమువలెనొప్పుచున్నదని భావము. గండు మెఱసి=మిగులఁ బ్రకాశిం చి, రెండవ కుసుమ కోదండుండునుంబోలె= రెండవ మన్మథునివలె, విలాసినీ మండలికిన్ = స్త్రీసమూహమునకు, కన్నులపండువై = నేత్రోత్సవమై, వెం డియున్ =ఇంకను.

తే. దాస్య మొనరించు విధుఁ డేత దాస్యమునకుఁ
బల్లవము లేతదంఘ్రిసం పల్లవములు
జలరుహములకుఁ దచ్ఛయ చ్ఛాయ దాయ
యనఁగ నతఁ డొప్పె నవయౌవ నాగమమున. 60

టీ. విధుఁడు=చంద్రుఁడు, ఏతదాస్యమునకున్=ఈనలునియొక్క ముఖము
నకు, దాస్యము=ఊడిగమును, ఒనరించున్=చేయును, పల్లవములు=చిగుళ్లు, ఏత
దంఘ్రిసంపల్లవములు-ఏతత్=ఈనలునియొక్క, అంఘ్రిసంపత్=పాదశోభయొ
క్క, లవములు=లేశములు కలవి- అనఁగాఁ బల్లవములు నలుని పాదశోభాలేశ
ము కలవికాని పూర్ణశోభ కలవి కావు కనుక పల్లవములు పాదముల కీడురావ
ని భావము. తచ్ఛయచ్ఛాయ-తత్=ఆనలునియొక్క, శయ=అఱచేతియొక్క,
ఛాయ=కాంతి, జలరుహములకున్=పద్మములకు, దాయ=శత్రువు. అనఁగా
నలునిముఖము చంద్రబింబముకంటెను, పాదములు చిగుళ్లకంటెను,హస్తము పద్మ
ములకంటెను, మిక్కిలిశోభగలవనుట, అనఁగన్ = అని పల్కుచుండఁగా, అ
తఁడు=ఆనలుఁడు, నవయౌవనాగమమునన్-నవయౌవన=లేఁ బ్రాయముయొ
క్క, ఆగమమునన్=ఆరంభమునందు, ఒప్పెన్=ప్రకాశించెను.

తా. స్పష్టము. అలంకారము అతిశయోక్తి.

వ. అయ్యవసరంబున. 61

టీ. స్పష్టము.

తే. వానిఁ గలలోనఁ గానని ✽ వనజముఖియు
వాని మార్పడఁ బేర్కొని ✽ మానవతియు
వానిఁ గా నాత్మ భావించి ✽ వరునిఁ గవయ
నప్పళింపనిసతియు లే ✽ దయ్యె నెచట. 62

టీ. వానిన్=ఆనలుని, కలలోనన్=స్వప్నమందు, కానని వనజముఖియు=
కాంచనట్టి స్త్రీయును, (ఏదేని వస్తువును సంతతము తలంచుకొనినఁ గలలో న
దే కనఁబడునని వాడుక; కావున స్త్రీలు సంతతము నలునినే తలంచుకొనుచుండు
టచేఁ గలయందుఁ గాంచుచున్నారని భావము.) వానిన్=ఆనలుని, మార్పడన్
=పేరుతప్పి-ఒకరినాపేరితో, పేర్కొని మానవతియు=పిలువనట్టి స్త్రీయును, ఎ
ల్లపుడు నలునిగుఱించియే సంభాషించుటచే నానామమే యలవాటుపడి, తమ
భర్త్రాదులను బిలుచునప్పుడుకూడ "ఓనలా" యనియేపిలుచుచుండిరనిభావము.
ఆత్మన్=మ[illegible] భావించి=త

లంచి,కపయర్ =పొందుటకు,అప్పళింపని సతియుర్ =ఉద్రేకింపనిపతివ్రతయు, ఎచటర్ =ఎక్కడను, లేదయ్యె=లేకపోయెను. ఇట 'వనజముఖి' 'మానవతి' 'సతి' యనుపదవిశేషములచే తామరవంటి మొగముగలదయ్యును వాని కలను అనఁగా వానిముఖచంద్రుని కళలను లోఁగొననిదిగాని, మానముగలదయ్యును వాని మాఱుపడ పేరుకొననిదిగాని, ఎట్టి పతివ్రతయయ్యును తనపాతివ్రత్యము చెడకుండుటకు దనభర్తనే వానినిగాభావించి కలియనిదిగాని లేదని భావము స్ఫురించుచున్నది.

చ. దరహసితావధీరితసుధాకరబింబము నేత్రనిర్జితాం
బురుహము నైనయానిషధభూవరునుల్లసితాననంబుతో
సరి మఱి యొండు గల్గమికి సంశయమేటికిఁ దద్ద్వయీవిజి
త్వరకమనీయవస్తురహితం బగునట్టిచరాచరంబునన్. 63

టీ. దర...బింబము-దరహసిత=మందహాసముచే, అవధీరిత=దిరస్కరింపఁబడిన,సుధాకరబింబము=చంద్రబింబముగలట్టియు, నేత్రనిర్జితాంబురుహము= నేత్ర=కన్నులచే, నిర్జిత=జయింపఁబడిన, అంబురుహము=పద్మముకలట్టియు,ఐన ...ఆననంబుతోర్ -అయిన=అయినట్టి, ఆనిషధభూవరు= ఆనలమహారాజు యొక్క,ఉల్లసిత=ప్రకాశించునట్టి, ఆననంబుతోర్ =వదనముతో,సరి=సమానమయినవస్తువు, తద్ద్వయీ...రహితంబు-తద్ద్వయీ=ఆచంద్రపద్మములను, విజిత్వర=జయించు స్వభావముగల,కమనీయ=మనోహరమైన, వస్తు=వస్తువుచే, రహితంబు=శూన్యము, అగునట్టి చరాచరంబునర్ =అయినట్టి చరాచర ప్రపంచమునందు, మఱియొండు=మఱియొకటి, కల్గమికిర్ =లేక పోవుటకు, సంశయము ఏటికిర్ =సందియమేల? అనఁగ లోకములోని సుందరవస్తు సముదాయములో సుందరతమము లయినవని ప్రసిద్ధిని జెందినచంద్రపద్మము లతనివదనైకదేశము లయినమందహాసనేత్రములచేతనే జయింపఁబడినవి. సుందరతమములయినచంద్రపద్మములే నలునిముఖముతోఁ బోలలేనప్పుడు తక్కినవస్తువులు సరిపోలలేవని చెప్పనేల? కావున నాతని వదనము నిరుపమానమని చెప్పవచ్చునని భావము.

తా. లోకములో సుందరములయిన వస్తువులని ప్రసిద్ధిచెందియు ఆనలుని ముఖమున కేక దేశమయిన మందహాసముచేఁ జంద్రుఁడును నేత్రముచేతఁ బద్మమున్ను,జయింపఁబడినవి. ముఖైక దేశముచేతనే జయింపఁబడిన చంద్రపద్మములాతని మొగంబున కెట్లు సాటియగు ? మఱియు నా చంద్రపద్మములకంటె మిగుల సుందరమయినవస్తువు లోకమందున్నయెడ నేవస్తువునైన సాటి తేఁగలుగుదుము కాని యట్టివస్తువును లోకమందు లేకుండునప్పు డతని వదనము నిరుపమానమనుటకు సందియ మేదియు లేదు. అలం. కావ్యలింగము.

క. తలవెండ్రుక లెగఁగట్టెడు
కొలఁదిని నానృపకుమారకుఁడు కడిమిమెయిన్
నలుదెసలకరులగండ
స్థలఫలకములన్ లిఖించె జయశాసనముల్. 64

టీ. ఆనృప కుమారకుఁడు=ఆ నలమహారాజు, తలవెండ్రుకలు=కేశములను, ఎగన్=మీఁదుగా, కట్టెడుకొలఁదిని=బంధించెడు కొలఁది-అనఁగాఁ దలవెండ్రుకలు ముడికందునంతటిప్రాయము వచ్చునప్పటికి నని యర్థము, కడిమిమెయిన్=పరాక్రమముచే, నలుదెసల...ఫలకములన్ - నలుదెసల=నాల్గుదిక్కులందున్న, కరుల=ఏనుఁగులయొక్క, గండస్థల ఫలకములన్=ఫలకములవంటి చెక్కిళ్లయందు, జయశాసనముల్ = జయశాసనాక్షరములను, లిఖించెన్ = వ్రాసెను. అనఁగా చిన్నతనమునందె దిక్కుల జయించినాఁడనుట.

తా. నలమహారాజు తలవెండ్రుకలు ముడికి నందునంతటిప్రాముమువచ్చునప్పటికిఁ బరాక్రమముచే నాలుగుదిక్కులనుజయించి యాదిక్కులయందున్న యేనుఁగుల చెక్కిళ్లయందు జయశాసనములు వ్రాసెను.

తే. తరుణపాథోరుహాధోవిధానములను
ధరణినాథకిరీటాగ్రధానములను
నూర్ధ్వమయ్యెడు నిది యంచు నొకొ విధాత
తద్పద[illegible] ఊర్ధ్వ[illegible]వేసె. 65

టీ. తరుణ...విధానములను-తరుణ=లేఁతయయిన,పాథోరుహ=పద్మముల ను,అధోవిధానములను=క్రిందు చేయుటలలోను, ధరణీ...ధానములను-ధరణి నాథ=రాజులయొక్క, కిరీట=కిరీటములయొక్క,అగ్ర=కొనలయందు, ధాన ములను=ఉంచుటలలోను-అనఁగా రాజులందఱు నతనికినమస్కరింపఁగా వారి కిరీటాగ్రములయందు నీతని పాదముండుననుట. ఇది=ఈనలుని పాదము, ఊ ర్ధ్వము=మీఁదుగానుండు నది, అయ్యెడు నంచునోకో=అగునని కాఁబోలు,వి ధాత=బ్రహ్మ, తత్పదంబు=ఆనలునియొక్క పాదము, ఊర్ధ్వరేఖాంచితంబు= ఊర్ధ్వరేఖచే నొప్పునట్టిది, చేసెన్ =చేసెను. పాదములయం దూర్ధ్వరేఖలుగల వాఁడు సర్వోత్కృష్టుఁడగునని సాముద్రికశాస్త్రప్రసిద్ధము. అట్టి యూర్ధ్వ రేఖలకు, దరుణపద్మములను క్రిందుపఱిచి యూర్ధ్వముగా(మీఁదుగా) నుండుట యును, రాజకిరీటముల యూర్ధ్వభాగముల నుండుటయును ఫలములుగాఁ గవి యుత్ప్రేక్షించినాఁడు. నలమహారాజు పాదము లేఁతదామరలమించిన యంద ము కలదనియు, సమస్తరాజులచే మ్రొక్కఁబడుచున్నదనియు, నూర్ధ్వరేఖల తోఁ గూడినదనియు భావము.

తా. నలమహారాజు పాదము, పద్మములను గ్రిందుగాఁ జేయుటచేతను, రా జులయొక్క కిరీటాగ్రములయం దుంచుటచేతను, నూర్ధ్వమగ్యెడు ననుతలం పునఁ గాఁబోలు బ్రహ్మ నలునిపదమందు నూర్ధ్వరేఖలను నిర్మించెను.

అలంకార ముత్ప్రేక్ష.

తే. అపుడు లీలావినిర్జితానంగుఁ డైన
యతనిఁ గనియును వినియుఁ జింతానురక్తి
స్వర్గమర్త్యపాతాళవిష్టపములందు
విబుధనరభోగికాంతలు వివశ లైరి. 66

టీ. అపుడు = ఆయౌవనారంభకాలమందు, లీలావినిర్జిత అనంగుఁడు- లీలా=విలాసముచే, వినిర్జిత=మిక్కిలి జయింపఁబడిన, అనంగుఁడు=మన్మథుఁ డుగలవాఁడు, ఐనయతనిన్ =అయినట్టి యానలమహారాజును, కనియున్ = చూచియు, వినియున్ =ఆలకించియు, [illegible] స్మరించుట

యందలి యనురాగముచే, స్వర్గ... విష్టపములందుఁ - స్వర్గ=స్వర్గలోకమందు, మర్త్య=భూలోకమందు, పాతాళవిష్టపములందుఁ = పాతాళలోకమునందును, విబుధ... కాంతలు - విబుధ=సురలయొక్కయు, నర=మానవులయొక్కయు, భోగి=సర్పములయొక్కయు, కాంతలు=స్త్రీలు, వివశలు ఐరి=మోహమును జెందిరి. అనఁగా నలుని సౌందర్యాతిశయము ముల్లోకములయందుఁ బ్రసిద్ధమయి స్త్రీలకు మన్మథవికారము కలిగించినదని భావము.

తా. యౌవనారంభదశయందు మన్మథునికంటె మిగుల సుందరుఁడైయున్న నలమహారాజును జూచియు, నతని గుణములనువినియు, ముల్లోకములయందున్న దేవకాంతలు, మానవస్త్రీలు, నాగకన్యకలును సదా యతని స్మరించుచు మోహమును జెందిరి.

ఉ. ఱెప్పలు వాల్పక ప్పుడమిఱేనిమనోహరమూర్తి నిచ్చలుం
దప్పక చూచి చూచి విబుధప్రమదల్ ప్రమదంబు లాత్మలం
జిప్పిలుచుండ నెద్దిపరిశీలన సేసిరి యట్టియభ్యసం
బిప్పుడు వారుచూపుదు రపేతనిమేషము లైనచూపులన్.

టీ. విబుధప్రమదల్=దేవతాస్త్రీలు, ఆత్మలన్=చిత్తములందు, ప్రమదంబులు=సంతోషంబులు, చిప్పిలుచుండఁ = అతిశయించుచుండునట్లు, అప్పుడమిఱేని మనోహరమూర్తిఁ = ఆనలుని సుందరమయిన యాకారమును, నిచ్చలుఁ=ఎల్లప్పుడు, ఱెప్పలు = కనుఱెప్పలు, వాల్పక=మూయకుండ, తప్పక=మానక, చూచి చూచి=మిక్కిలిచూచి, ఎద్ది=దేనిని, అనఁగా గన్నుఱెప్పవాల్పకుండుటను, పరిశీలనచేసిరి = అభ్యసించిరో, అట్టి అభ్యసంబు=అట్టి యభ్యాసమునె, ఇప్పుడుఁ=ఈసమయమందుఁగూడ, వారు=ఆదేవకాంతలు, అపేతనిమేషములు - అపేత=పోయిన, నిమేషములు=ఱెప్పపాట్లుగలవి - అనఁగా నిర్నిమేషములనుట, ఐనచూపులఁ=అయినట్టి చూపులచేత, చూపుదురు= తెలుపుచుందురు - అందుచేతనే వారనిమిషులైరనుట. అనఁగా ఱెప్పపాటులేనివారని వ్యుత్పత్త్యర్థము. అనఁగా దేవతాకాంతలకుఁగూడ మోహము పుట్టింపఁజాలిన సౌందర్యము కలవాఁడనిభావము.

తా. దేవతాకాంతలు చిత్తములం దానందముప్పతిల్లగా నానలుని మనోహరమయినయాకారము నెల్లప్పుడు కనుఱెప్పవాల్పకుండఁ జూచుచుండుటచేత నాయలవాటు వారికిఁ బట్టుపడి యిప్పటికిం గూడ నిర్నిమేషములయిన చూపులుగలవారలయి యీ వెనుకటియభ్యాసము నే తెలుపుచుందురు.

ఉత్ప్రేక్షాలంకారము.

తే. తద్గుణాకర్ణనంబునఁ దదనిరీక్ష
ణమున ధన్యత్వమును నధన్యతయుఁ బొంది
యభిమతానభిమత మైనయక్షియుగము
దాల్చుఁ జక్షుశ్శ్రవస్స్త్రీకదంబకంబు. 68

టీ. చక్షు...కదంబకంబు-చక్షుశ్శ్రవస్ = కన్నులే చెవులుగాఁ గలవారియొక్క-అనఁగానాగములయొక్క, స్త్రీకదంబకంబు= స్త్రీసమూహము, తద్గుణాకర్ణనంబునన్ -తత్ =ఆ నలునియొక్క, గుణ=సద్గుణములను, ఆకర్ణనంబునన్ =వినుటచేతను,తదనిరీక్షణమునన్ -తత్ =అనలమహారాజును, అనిరీక్షణమునన్ =చూడలేకపోవుటచేత,ధన్యత్వమును=కృతార్థత్వమును,అధన్యతయున్ =జన్మముయొక్క నిష్ఫలత్వమును,పొంది=చెంది,అనఁగా నాగకాంతలకుఁగన్నులేచెవులుగాని వేఱువేఱుగా నారెండు లేనందునఁజూచినప్పుడు వినలేకపోవుటయు, వినినప్పుడు చూడలేకపోవుటయు సంభవించును. అందుచే వారు నలునిగుణములు వినుచున్నప్పుడు వీనులవలన ధన్యులమైతిమనుకొని, యాతని మూర్తి చూడలేకపోవుటచే ధన్యులముకామనియుఁ దలంచుకొని, ఆనలమహారాజుమూర్తినిజూచినప్పుడు, నేత్రములవలన ధన్యులమైతిమి కాని యతనిగుణములు వినలేక పోవుటచేధన్యులముకామనియుఁ దలంచుకొనిరనియర్థము. అభిమతానభిమతము-అభిమత= ఇష్టమైనదియు, అనభిమత = ఇష్టముకానిదియు, ఐనయక్షియుగము=ఐనట్టి నేత్రద్వంద్వమును, తాల్చును=ధరించును.

తా. నాగకన్యలు నేత్రములే చెవులుగాఁ గలవారుకనుక నలునిగుణములను విన్నప్పుడుధన్యత్వమును బొంది యతనిఁ జూడకపోవుటచే నధన్యలయి,యిట్లిష్టమయ్యు నిష్టముగాని నేత్రద్వయమును దాల్చిరి. అలంకారము, అతిశయోక్తి.

చ. పొలుపొనఁగూడి కన్నుఁగవ మోడ్చినయప్పు డజస్రభావనా
బలమున నానృపాలకునిఁ బాయక చూతురు మర్త్యభామ లా
యలికులనీలవేణులకు నమ్మెయి నవ్విభుఁ జూచువేళలం
గలుగవుపో నిమేషపరికల్పనఁ బుట్టెడునంతరాయముల్.

టీ. మర్త్యభామలు=మానవకాంతలు, పొలుపు=నిలుకడను, ఒనఁగూడి=పొంది, కన్నుఁగవ=నేత్రద్వయమును, మోడ్చినయప్పుడు=మూసినసమయమందుఁగూడ, అజస్రభావనాబలమునన్ - అజస్ర= ఎల్లకాలములందు, భావనా= ఆనలుని దలపోయుటయనెడి, బలమునన్=సామర్థ్యముచేత, ఆనృపాలకున్ = ఆనలుని, పాయక=విడువక, చూతురు=జూచుచుందురు-అనఁగా నెల్లప్పుడు నలమహారాజునే స్మరించుచుండుటచేఁ గన్నులు మూలన చేసినప్పుడును మనస్సునందతనిని జూచుచున్నారని యర్థము. ఆయలికులనీలవేణులకున్ - ఆ, అలికుల =తుమ్మెదలసమూహమువలె, నీల=నల్లనైన, వేణులకున్ = జడలుగలవారికి-అనఁగా నామనుజస్త్రీలకు, ఆవిభున్=ఆనలుని, చూచువేళలన్ = చూచునప్పుడు, అమ్మెయిన్ = అప్పుడు,నిమేషపరికల్పనన్ = కనుఱెప్పపడినప్పుడు, పుట్టెడునంతరాయముల్=కలుగుచున్న విఘ్నములు, కలుగవుపో=కలుగనేరవుకదా ?

తా. మానవస్త్రీలెల్లప్పుడు నలునినే స్మరించుచుండుటచే నాభావనాబలముచేతఁగన్నులు మూసినప్పుడు సయితమానలమహారాజుసుందరాకారమును మనోదర్పణమందుఁ జూచుచున్నారు కావున వారలకు ఱెప్పమూసినకాలములోఁ గూడ నతని దనివి దీరఁ జూచుటయందు విఘ్నముకలుగలేదు. అలంకారము అతిశయోక్తి.

సీ. కోరి లీలాగేహకుడ్యభాగంబుల
వ్రాయుదు రమ్మహీశ్వరునిమూర్తి
వ్రాసి కన్యాత్వగౌరవము వీసరపోవ
దర్శింతు రనురాగతరళదృష్టి
దర్శించి యతని కే దగుదునో తగనో యం

చించుకించుక సంశయింతు రాత్మ
సంశయించి కరాంబుజములఁ గ్రొమ్మించు ట
ద్దము లెత్తి చూతురు తమ్ముఁ దారు

గీ. రాజకన్యలు జగతి నాక్రమమునందుఁ
గందువారల నిట్టూర్పుగాడ్పు వేఁడి
ముకురములు చారుమోహనమూర్తి యనఁగఁ
బరఁగుదమయంతిచేతిదర్పణము దక్క. 70

టీ. జగతిన్ = భూమియందు, రాజకన్యలు = రాజపుత్రికలు, కోరి = అపేక్షించి, లీలా ... భాగంబులన్ - లీలా గేహ = క్రీడామందిరములయొక్క, కుడ్య భాగంబులన్ = గోడలయందు, అమ్మహీశ్వరునిమూర్తిన్ = ఆనలునివిగ్రహమును, వ్రాయుదురు = లిఖింతురు, వ్రాసి, కన్యాత్వగౌరవము = కన్యకాత్వమందుండెడి పేరిమి, వీసరపోవన్ = వెలితిపడునట్లు, అనురాగతరళదృష్టిన్ = ప్రేమచేఁ జలించుచున్న చూపుచే, దర్శింతురు = చూచుచుందురు, దర్శించి, అతనికిన్ = ఆనలునకు, ఏన్ = నేను, తగుదున్ ఓ = అర్హురాలనో, తగన్ ఓ = అర్హురాలను కానో, అంచున్ = అనితలపోయుచు, ఇంచుకించుక = కొంచెముకొంచెముగా, ఆత్మన్ = మదియందు, సంశయింతురు = సందియము చెందుదురు, సంశయించి, కరాంబుజములన్ = చేతులతో, క్రొమ్మించుటద్దములు = క్రొత్తవియగు తళుకుటద్దములను, ఎత్తి = పట్టుకొని, తమ్మున్ తారు = తమ్మునుదాము, చూతురు = చూచికొందురు, ఆక్రమమునందు = ఆచూచుటలో, చారుమోహనమూర్తి, చారు = సుందరమైన, మోహన = మోహముపుట్టించు, మూర్తి = ఆకారముకలది, అనంగన్ = అని పలుకుచుండఁగా, పరఁగుదమయంతిచేతిదర్పణముదక్కన్ = ప్రసిద్ధిచెందిన దమయంతి చేతిలోనున్న యద్దముతప్ప, ముకురములు = తక్కిన రాజకన్యకల చేతిలోనుండునద్దములు, వారలనిట్టూర్పుగాడ్పువేఁడిన్ - వారల = ఆరాజకన్యకలయొక్క, నిట్టూర్పు = దీర్ఘనిశ్వాసరూపమయిన, గాడ్పు = గాలియొక్క, వేఁడిన్ = వేఁడిమిచేత, కందున్ = మలినములగును, అనఁగాలోకములోఁదామొకపనికయి ప్రయత్నించినప్పుడాపని నెఱవేఱనిచో విచారాతిశయముచే

నిట్టూర్పుపుచ్చుట ప్రసిద్ధము. అట్లె రాజకన్యలు నలునికిఁ దాము భార్యలయి యుండుటకుఁదగుదుమొ తగమోయని మనంబులనాలోచించి యాతనిరూపము ను గోడలయందు వ్రాసి యద్దంబు చేతఁదాల్చిచూచి నలుని కెంతమాత్రము తగ కుండుటకని పెట్టి తమయుద్యోగము విఫలమగుటచే నిట్టూర్పుపుచ్చియాగాడ్పు చే నద్దమును మలినముగావించినారనియు, దమయంతియు వారివలెనే చేసి తాను నలునికిఁ దగినదిగా నెఱుఁగుటచే నిట్టూర్పుపుచ్చదయ్యెగాన యాబిడ యద్దము నిట్టూర్పుచే మలినముగాదయ్యెననియు భావము.

తా. భూలోకమునందున్న ప్రతిరాజకన్యకయు మిగులఁగోరికతోఁ గ్రీడా మందిరముల గోడలయందా నలునియాకారమునులిఖించి కన్యాత్వగౌరవము వెలితిపడునట్లు చంచలదృష్టులచేఁ గనుఁగొనుచు,నలునకు భార్యనైయుండుటకుఁ దగినదాననో, కానోయని సంశయమునొందుచు,నాసంశయముపోవుటకుఁగా ని గ్గుటద్దంబు చేతఁబట్టికొని తనసౌందర్యమును జూచుకొనుచుండును. ఇట్టిస మయములందు సౌందర్యవంతురాలని ప్రసిద్ధి చెందినదమయంతిచేతిలో నుండు నద్దముకాక తక్కినరాజకన్యకలచేతులలో నుండునద్దములన్నియు నిట్టూర్పు వాయువులచేత మలినములాయెను.

వ. ఇవ్విధంబున*ననన్యరూపలావణ్యరేఖావిలాసభాసమాన యగు భీమనందన యానరేంద్రబృందారకునియందు జిందంబు నిలు పుటయును. 71

టీ. ఇవ్విధంబునన్ = ఈరీతిని, అనన్య ... భాసమాన - అనన్య=ఇతరులకులేని, రూప=సౌందర్యముయొక్కయు, లావణ్యరేఖా = లావణ్యాతిశయముయొక్క యు, విలాస=లీలలచే, భాసమాన=ప్రకాశించునట్టిది- అనఁగా నిరుపమానసౌం దర్యవిలాసములు కలదనిభావము.అగుభీమనందన=అయినట్టి భీమరాజుకూఁతుర యిన దమయంతి,నరేంద్రబృందారకునియందున్ =ఆరాజశ్రేష్ఠుఁడయిన యానల

---

* 'అననురూపలావణ్యరేఖా' అని వ్రాఁతప్రతులందున్నది. అప్పుడు; అన నురూప=సాటిలేని ... సౌందర్యాతిశయములచే అని యర్థము.

మహారాజునందు, డెందంబు= మనస్సును, నిలుపుటయును = నిలుపుటంబట్టి, పైపద్యముతో నన్వయము. తా. స్పష్టము.

తే. అప్పు డనలావరుద్ధతఁ జే నారఁ గూరి
బాణపురమును బోనియాఁ భైమిమనముఁ
బుష్పబాణాసనుఁడు భోగభోజి యైన
* వరవయోవిశేషంబువార్వమునఁ దఱిసె. 72

టీ. ఇందు, బాణపురపరముగాను దమయంతీమనఃపరముగాను అర్థద్వయము దెలియఁదగును. పుష్పబాణాసనుఁడు=పుష్పము విల్లుగాఁగలవాఁడు-అనఁగా మన్మథుఁడు-లేక ప్రద్యుమ్నుఁడు,అప్పుడు+ఆ=నలమహారాజునందుదమయంతి డెందమునిలిపినప్పుడే,నలావరుద్ధతన్-నల=నలమహారాజుచే, అవరుద్ధతన్=అవరోధింపఁబడుటను,ఆరఁగూరి=మిక్కిలియుఁబొంది-ఇదిమనఃపరము, మఱియు,అప్పుడు=ఆసమయమందు, అనఁగా ననిరుద్ధుని బాణుఁడుబంధించినప్పుడు, అనలావరుద్ధతన్-అనల=అగ్నిచే,అవరుద్ధతన్=నిరోధింపఁబడియుండుటను-అనఁగా బాణాసురుని పురముచుట్టు నగ్నిహోత్రము మండుచుండునని ప్రసిద్ధి,ఆరఁగూరి=మిక్కిలియు నొంది-ఇదిపురపరము, బాణపురమునుబోని=బాణాసురునిపురమైన శోణితపురమువలెనున్న,భైమిమనముఙ్ = దమయంతియొక్క మనస్సును, భోగభోజియైన=సౌఖ్యములననుభవించునట్టి,వరవయోవిశేషంబు వార్వమునన్-వర=శ్రేష్ఠమైన, వయోవిశేషంబు=యౌవనమనెడి, వార్వమునన్=గుఱ్ఱముచే, తఱిసెన్=సమీపించెను. అనఁగా మన్మథుఁడు దమయంతి మనములోఁ బ్రవేశించి పీడించుచున్నాఁడని యర్థము. రెండవపక్షమందు, భోగభోజి=సర్పకాయములను దినునట్టిది, వరవయోవిశేషంబువార్వమునన్=అయినట్టిగరుత్మంతుఁడను గుఱ్ఱముచే,తఱిసెన్=సమీపించెను. ఇట యౌవనమును వారువముగా రూపించుటవలన వారువము గమ్యస్థానమునకుఁ ద్వరితముగాఁ గొనిపోవునట్లు సౌందర్యప్రయుక్తమైన నలుని నవయౌవనాతిశయము మఱింత వేగముగా దమయంతి మనస్సునాకర్షించె నమట.

---

* వరవయో విశేషంబు గర్వమునఁదఱిసె. అనిపాఠాంతరము.

తా. పూర్వముప్రద్యుమ్నుఁడు వహ్నిచే నావరింపఁబడియున్న బాణాసురుని పురమును సర్పములఁ దినునట్టిగరుత్మంతుని పై నధివసించి చేరునట్లు మన్మథుఁడు నలమహారాజునందు లగ్న మయినదమయంతిమనస్సును యౌవనమనెడితురగముపై నధివసించి ప్రవేశించెను. అలంకారములు, శ్లేషోపమాతిశయోక్తులు.

పురా. పూర్వము బాణాసురుని పుత్రికయగు నుషాకన్యక తనస్వప్నమందు గానవచ్చిన యనిరుద్ధుఁడను రాజకుమారునిఁ జిత్రలేఖచేఁదెప్పించికొని రహస్యముగాఁ బెండ్లియాడెను. అదిబాణాసురుఁడు తెలిసికొని యనిరుద్ధుని బంధించి కారాగృహమం దుంచెను. ఆయుదంతమును శ్రీకృష్ణుఁడు నారదునివలన విని యనిరుద్ధుని విడిపించుటకయి ప్రద్యుమ్నాదియాదవులతో బాణపురమునకుఁ బోయెను. కాని యాతనిపురముచుట్టు నగ్నిమండుచుండుటచే లోనికిఁబ్రవేశింపలేకపోయెను. అంతశ్రీకృష్ణుఁడు గరుఁడుని రప్పించి యతనిపయిఁ గూర్చుండి ప్రద్యుమ్నాదులతో నప్పురముప్రవేశించివానినిజయించియనిరుద్ధుని విడిపించెను.

వ. దమయంతియు శ్రవణప్రీతివాసనావశంబునం బ్రతిదినప్రవర్ధమానం బగుమనోనురాగంబు*నిరూఢం బై యుండ. 73

టీ. దమయంతియు, శ్రవణప్రీతివాసనావశంబునన్ - శ్రవణ = నలుని గుణములు వినుటవలనఁ గలిగిన, ప్రీతి=ప్రేమసంబంధమయిన, వాసనా= అనుభూతార్థసంస్మరణమునకు, వశంబునన్ = అధీనురాలగుటచే - అనఁగా సంతతము వినుటచే ననుభూతంబులయిన నలుని గుణంబులఁదలంచుకొని వాని కధీనురాలయినదనుట, ప్రతిదినప్రవర్ధమానంబు=ప్రతిదినము వృద్ధిపొందుచున్నది, అగుమనోనురాగంబు = అయినట్టి మనస్సునందలి ప్రేమ, నిరూఢంబు=స్థిర మైనది, ఐయుండన్=అయి ప్రవర్తింపఁగా, పైపద్యముతో నన్వయము.

తా. దమయంతి నలుని గుణము లనవరతము వినుచుండుటచేఁ గ్రమక్రమము

---

* 'నిగూఢంబై' అని వ్రాఁతప్రతిపాఠము. సందర్భము నాలోచింప నిదియే సమీచీనమని తోఁచెడిని.

గా వృద్ధిచెందిన మనంబునందలి ప్రేమ, నలునియందు స్థిరమయి విలసిల్లుచుండఁగా.

అవ. ("సాధారణముగా విరహులకు-శ్లో॥ చక్షుఃప్రీతిః ప్రథమం చిన్తాసంగ స్తతోఽథసంకల్పః । నిద్రాచ్ఛేద స్తనుతా విషయనివృత్తి స్త్రపానాశః । ఉన్మాదోమూర్ఛామృతిరి త్యేతేస్మరదశాద శైవస్యుః॥") అనఁగా చూచుట, చింతించుట, తలఁచుట, జాగరణము, కృశించుట, విషయనివృత్తి, లజ్జాత్యాగము, ఉన్మాదము, మూర్ఛయు, మృతియు నను పది మన్మథావస్థలు సంభవించుచుండు. వానిలోఁ బ్రథమమున దమయంతికి సంభవించిన మొదటియవస్థను దెలుపుచున్నాఁడు.

మ. జనకుంగొల్వఁగవచ్చినప్పుడు తదాస్థానంబులోఁబాఠకుల్
విసుతప్రౌఢి వసుంధరాధిపతులన్ వేర్వేఱకీర్తించుచో
వనితారత్నము వీరసేనుతనయున్ వర్ణింపఁగా నున్నత
స్తనభారంబు కెలంకులన్నినుచుఁజంచల్లీలరోమాంచమున్.

టీ. వనితారత్నము=స్త్రీలలో శ్రేష్ఠురాలయిన, దమయంతి, జనకున్=తనతండ్రియగుభీమరాజును, కొల్వఁగన్=సేవించుటకు, వచ్చినప్పుడు=వచ్చినసమయమందు, తదాస్థానంబులోన్-తత్=ఆభీమరాజుయొక్క, ఆస్థానంబులోన్=కొలువునందు, పాఠకుల్=వందిమాగధులు, వినుతప్రౌఢిన్-వినుత=కొనియాడఁబడిన, ప్రౌఢిన్=నేర్పుచే, వసుంధరాధిపతులన్=రాజులను, వేర్వేఱన్=ప్రత్యేకముగా, కీర్తించుచోన్=నుతించుచున్నవేళయందు, వీరసేనుతనయున్=వీరసేనుని కుమారుఁడయిన నలుని, వర్ణింపఁగాన్=స్తోత్రముచేయఁగా, చంచల్లీలన్=ఒప్పుచున్నవిలాసముచే, రోమాంచమున్=పులకాంకురములను, ఉన్నతస్తనభారంబు కెలంకులన్-ఉన్నత=ఎత్తైన, స్తనభారంబు=స్తనములయొక్క, కెలంకులన్=పార్శ్వములయందు, నినుచున్=నిండించును- అనఁగ మన్మథవికారము కలిగెను. తలప్పుటచే, శ్లో॥ స్తుతిప్రయోగాచ స్స్వేదో

వైవర్ణ్యవేపథూ । అశ్రువైస్వర్యమిత్యష్టౌసాత్వికాః పరికీర్తితాః ॥ అనఁగానవయవచాంచల్యము లేకపోవుటయు, నింద్రియపరవశత్వమును, గన్నీ రుకారుట యు,చెమర్పుటయు,డగ్గుత్తికతోడిమాటలును,గగుర్పాటుగలుగుటయు, వడఁకుటయు, రూపముమారుటయు, నని చెప్పఁబడు నెనిమిదివిధములయిన సాత్వికభావములలో రోమాంచరూపమగు సాత్వికభావము దమయంతి కుత్పన్నంబయినట్లు తెలియవచ్చుచున్నది. ఈపద్యమునందు నలునిఁ జూచినట్టు చెప్పక యతనిసద్గుణంబులు విన్నట్టు చెప్పఁబడినది. ఇందువలన చక్షుఃప్రీతిరూపమగు నవస్థ యెట్లుసూచింపఁబడినదని సందియింప నవసరంబులేదు. చక్షుః ప్రీతియనుపదము నుపలక్షణముగాఁజెప్పకొని శ్రవణానురాగముగూడఁ బరిగణింపఁబడినదికాన నలునిగుణంబు లత్యంతానురాగంబుతో వినుటవలన మొదటియవస్థ సూచితమైనదని గ్రాహ్యము.

తా. దమయంతీదేవి తనతండ్రియగు భీమరాజును సేవించునిమిత్తము కొలువునకుఁ బోయినప్పుడు వందిమాగధులు లోకంబునంగల రాజులనందఱిని వర్ణింపుచు నలమహారాజునుగూడ వర్ణింప నప్పు డతని గుణములనాలించి మహామోహముచెంది యత్యున్నతంబులగు స్తనంబులపార్శ్వంబులందుఁ బులకాంకురంబులను నింపుచుండును.

తే. *మహిమ హిమవేళలందు నకమ్మానవతికి
మాసరములయ్యెఁ దలపంగ కె వాసరములు
పొడువుగలిగి తపర్తు సంకెపూర్తియందు
నంచితాయామవతులయ్యె కె యామవతులు. 75

టీ. తలఁపఁగన్ కన్ =ఆలోచింపఁగా, వాసరములు=పగళ్లు, మహిమన్=అతిశయముచే, హిమవేళలందు=హేమంతఋతువునందు, అమ్మానవతికిన్ =ఆదమయంతికి, మాసరములు, "మాసాన్ రాన్తిమాసరాః" అను వ్యుత్పత్తిచే మాస

* 'మహితహిమవేళలందు నమ్మానవతికి' అని వ్రాఁతప్రతియందుఁ గానవచ్చుచున్నది.

ములను దెచ్చునని, అయ్యెన్ = దీర్ఘములాయెనని యర్థము. తపర్తు సంపూర్తి యందున్ = గ్రీష్మఋతువునందు, యామవతులు = రాత్రులుపొడువుగలిగి = దైర్ఘ్యము చెంది, అంచితాయామవతులు - అంచిత = ఒప్పుచున్న, ఆయామవతులు = దైర్ఘ్యముకలవి, అయ్యెన్. అనఁగా హేమంతఋతువునందుఁ బగళ్లుదఱిగియుండుటయు, రాత్రులు హెచ్చియుండుటయు, గ్రీష్మఋతువునందు రాత్రులు తఱిగియుండుటయుఁ బవళ్లుహెచ్చియుండుటయు సహజము. ఇట్లుండ మన్మథునిచే బాధింపఁబడుచున్న దమయంతికి హేమంతఋతువునందుఁ బగళ్లే దీర్ఘములయ్యెనట. రాత్రులమాటచెప్పనేల? అట్లే మండువేసవిలో రాత్రులు దీర్ఘములు గాఁగానవచ్చెనట. తఱిగియుండెడిపగళ్లేదీర్ఘములు గానున్నప్పుడు దీర్ఘములయినపగళ్లెంత దీర్ఘములగునో యనిభావము. ఈచెప్పుటచే దమయంతికి నిరంతరచింతయు జాగరణంబును గలిగియున్నట్లు విశదమగుచున్నది కాన, చింతాజాగరణంబులను మన్మథావస్థలు సూచితములు. అలం. భావోదయము.

తా. మన్మథపీడితయగు దమయంతికి హేమంతఋతువునందుఁ బగళ్లు మిగుల నిడుదలై, వేసవియందు రాత్రులత్యంతము దీర్ఘములై యుండెను.

సీ. సఖులుఁ దాఁ బుష్పాస్త్రు * జతపెట్టు పదమున
నభిషేక మొనరించు నవనినాథు
నలనామధేయ మైనతృణంబు వినఁబడ్డ
నధిపతిపే ర్విన్నయట్ల యలరు
నిషధదేశపు విప్రనికరంబుఁ బూజించి
† యలవ్రాకఁ బ్రియునుద్ది యడుగఁ దలఁచు
నభ్యాసవశమునఁ బ్రాణేశ్వరునిమీఁది
యించుగీతములు వాయించు వీణ
తే. నేర్పుగల చిత్రకరులచే నిలయభిత్తి

---

* 'సఖులుఁ దాఁ బుష్పాస్త్రు చాపట్టుపదవికి' నని పాఠాంతరము.

† "అలయుక" యని పాఠాంతరము.

భువనమోహనాకారత ~ బొలుపుమిగులు
మగని నగువను వ్రాయించి ~ మదిఁ దలంచు
నిషధరాజును దన్నుఁగా ~ నీరజాక్షి. 76

టీ. సఖులు=చెలికత్తెలు, తాన్=ఆదమయంతియు, పుష్పాస్త్రు జతపెట్టుపదమునన్=మన్మథునితో సరిపెట్టవలసినస్థానమందు, అవనినాథున్=నలమహారాజును, అభిషేకమొనరించున్=అభిషేకముచేయును - అనఁగా దమయంతియు జెలికత్తెలును సౌందర్యమున మన్మథునితో సమానుఁడు నలుఁడే కాని మఱియొకండు కాఁడని యతనినే తెచ్చి మన్మథుని స్థానంబున నభిషేకించుచుండురనుట. దీనికి సంస్కృతమునందు. శ్లో॥ నర్మాత్పరాసో రనిమేషలోచనాద్బిభేమి తద్భిన్న ముదాహరేతిసా।జనేనయూనస్తు ్నవతా తదాస్పదే నిదర్శనం నైషధమభ్యషేచయత్॥ అనఁగా దమయంతి చెలినిజూచి 'యిట్లనె.మృతుఁడై నిశ్చలనయనుండై యున్న మన్మథునిఁజూచుటకుభయపడుచున్నానుకాన మన్మథునికి సమానమయిన వాని మఱొక్కని నుదాహరింపు' మని పలుకుచు,రాజకుమారులఁ బేర్కొనుచున్న చెలికత్తెలచే మన్మథసాదృశ్యపదమునకుఁ దగినవాఁడు నలుఁడే కాని మఱియొకండు కాఁడని తత్స్థానమునందు నలుని నభిషిక్తునిగా ననియున్న విశేషయించు.ఇది సంస్కృతానుసారముగానుండలేదు.ఏమన లోకములో మృతుఁడైనవాని స్థానంబున వానితో సదృశుఁడగు మఱియొకరి నుంచుటచూచుచున్నారము. కావున మృతుఁడైన మన్మథునిపదమునకు నలుఁడే తగినవాఁడు కాని మఱియొకఁడు లేఁడన్న యర్థసారస్యము సంస్కృతమునందున్నది. కాని తెనుగున నట్టి యర్థములేదు.నలనామధేయము=నలమనునట్టి పేరుగలది, ఐనతృణంబు=అయినట్టిగడ్డిపోఁచ, వినఁబడ్డన్=వినఁబడినను, అధిపతిపేరు=అనలునిపేరు, విన్నయట్లు=ఆలకించినట్లే,అలరున్= సంతసించును. అనఁగాఁ జెలికత్తెలు ప్రసంగవశమున నలాఖ్యమైన తృణమునుగూర్చి పలుకఁగా దమయంతి "నల" అనుశబ్దమువిని నలమహారాజు పేరు విన్నట్లు సంతసించుచుండును.అర్థాంతరమందుఁ బ్రయుక్తమైన నలశబ్దమునువిని నలమహారాజు పేరువిన్నట్లు ... మెమాన

సంబు నాకర్షించుచుండెనని చెప్పుటచే దమయంతికి నలునియందున్న యనురాగాతిశయము సూచితము. నిషధ...నికరంబుల్ =నిషధదేశపువిప్రనికరంబుల్ =నిషధదేశమునుండివచ్చిన బ్రాహ్మణసమూహమును, పూజించి=పూజచేసి, అలవోకల్ =లీలగా-వేడుకసెపమున, ప్రియుసుద్ది = తనకుఁబ్రియుఁడయిన నలుని యొక్క-చరిత్రము,అడుగల్ తలఁచుల్ = అడుగుట కిష్టపడును,అనఁగా నిషధదేశ విప్రులనుబూజించి ప్రియుఁడయిన నలునిచరిత్రనడుగఁదలఁచుకొనుచుండెనని భావము. ఈభావము సంస్కృతమునందుగానవచ్చుచున్నది. శ్లో॥నలస్య పృష్టానిషధాగతాగుణాన్ మిషేణ దూతద్విజవందిచారణాః ॥ అనియున్నది. ఇందు దూతాదులచేఁ బ్రియుని గుణంబులను వర్ణింపించుటచేఁ బ్రలాప మనురత్యనుభావము సూచితము. అభ్యాసవశమునల్ =అభ్యాసముచేయుటంబట్టి, వీణల్ = వీణపయిని, ప్రాణేశ్వరునిమీఁదివాయించుగీతములు=ప్రాణనాథుఁ డయిననలమహారాజుమీఁదిసొగసగు కీర్తనలు, వాయించుల్ =వాయించుచుండును,ఇందు నలుని గుణంబులను స్వయముగానే పాడుచుండునని చెప్పుటచే గుణవినుతిరూపమయిన మన్మథావస్థ సూచితము.నిలయభిత్తిల్ = మందిరముయొక్క గోడయందు, నేర్పుగలచిత్రకరులచే, భువనమోహనాకారతల్ - భువన=లోకములకు, మోహన=మోహముకలిగించు, ఆకారతల్ =ఆకృతిచే, పొలుపు = అందము, మిగులుమగనిల్ =అతిశయించినపురుషుని,మగువను= స్త్రీని,వ్రాయించి,నీరజాక్షి =పద్మములవంటి నేత్రములుగలదమయంతి,నిషధరాజును=నలునిఁగాను, తన్నుఁగాల్, (దమయంతిగాననుట) మదిల్, తలంచుల్ = తలపోయును. అనఁగా విరహులకుఁ జిత్రఫలకదర్శనాదులు వినోదకరములుగా నుండును కాన దమయంతి యింటిగోడయందు నిరుపమాన సౌందర్యము గల స్త్రీపురుష ప్రతిమలను వ్రాయించి తన్నుఁ గాను నలునివారినిగాను దలంచుకొనుచుండును. ఈ ప్రకారము జిత్రఫలకాదుల మూలమున నలుని గుణకీర్తనంబు చేయుటంజేసి ప్రలాపమనురత్యనుభావము సూచితము.

తా. దమయంతి నలునియం దధికప్రేమము కలదయి సఖులతోఁగూడి నలుని మన్మథునికి జతపెట్టుటకు నతనిపదమందుంచి యభిషేకముచేయును. నలమనె

డి పేరుగలగడ్డినిగూర్చి యెవరైన సంభాషింప నదివిని నలుని పేరువిన్నట్లుసంతసించును. నిషధ దేశమునుండివచ్చిన బ్రాహ్మణులను బూజించి నలునిచరిత్రమడుగుటకుఁ దలంచుచుండును. ఒకమాఱువీణపయి నలునిమీదికీర్తనలు వాయించును. గోడపయి నందముగల స్త్రీపురుషులను జిత్రకరులచే వ్రాయించి తన్నుఁగాను నలునిగాను భావించును.

అవ. దమయంతికి నలునియందున్న యధికానురాగమును జెప్పుచున్నాఁడు.

ఉ. పువ్విలుకానితోడ సరిపోలెడుచక్కనివాఁడు భూమిలో
నెవ్వఁడుచెప్పఁడాయనుచు* నిష్టవయస్యలఁగూర్చియాత్మలో
నువ్విళులూరుచుం బలుకు నొప్పులకుప్పనలుండుగాక యొం
డెవ్వఁ డనంగ మెచ్చుఁ దరళేక్షణనెయ్యము వియ్య మెట్టిదో.

టీ. ఒప్పులకుప్ప=సౌందర్యములకు నిలయమయిన దమయంతి, పువ్విలుకానితోడన్=మన్మథునితో, సరిపోలెడి చక్కనివాఁడు=సరియయిన అందముకలవాఁడు, భూమిలోన్=భూమిపయిని, ఎవ్వఁడు, చెప్పుడా=చెప్పుడీ, అనుచున్, ఇష్టవయస్యలఁగూర్చి=చెలికత్తెలనుద్దేశించి, ఆత్మలోన్=మనస్సులో, ఉవ్విళ్లూరుచున్=ఊటలూరుచు, పలుకున్=సంభాషించును, నలుండుకాక=నలమహారాజుతప్ప, ఒండు=మఱియొకఁడు, ఎవ్వఁడు=ఎవఁడున్నాఁడు, అనంగన్=అని చెలికత్తెలు పల్కినచో, మెచ్చున్=మెచ్చుకొనును, తరళేక్షణ నెయ్యమువియ్యము-తరళేక్షణ=చలించుచున్న నేత్రములుగల దమయంతియొక్క, నెయ్యము వియ్యము=ప్రేమానుబంధము, ఎట్టిదో=ఎటువంటిదోకదా! అనఁగా నామెకు నలునియందున్న ప్రేమమునకు హద్దులేదని భావము.

తా. ఆదమయంతి తన చెలికత్తెలనుజూచి, ఓసీ! చక్కఁదనమున మన్మథునితో సరియగువాఁడు భూమియం దెవఁడున్నాఁడో తెలియఁజెప్పుఁడీ యఁట మిగుల నేడ్కతోఁ బలుకుచుండును. అప్పుడు చెలికత్తెలు నలమహారాజుతప్ప

* ఇష్టవయస్యలఁగూర్చి యని పాఠాంతరము.

మన్మథునితో సమానుఁ డెవఁడున్నాఁడని పలుకఁగా మిగుల సంతసించి మెచ్చుకొనును. అయారే! దమయంతికి నలునియందున్న ప్రేమానుబంధము నిరుపమానమయినదికదా?

అవ. దమయంతి చిత్రఫలకాదులందు నలుని దర్శించినట్లు చెప్పి యిప్పుడు స్వప్నములయందు నలునిఁ జూచుచున్నట్లు చెప్పుచున్నాఁడు.

వ. మఱియు మనోరథపరంపరాసంవరణప్రసూనదామంబున నమ్మహీపతిం బతిగా వరియించియుం బ్రగిభాగశేషంబు లగు విభావరీసమయంబుల నిమీలితం బైననేత్రయుగ్మంబును బాహ్యేంద్రియమౌనముద్రాభిముద్రితం బైనయంతఃకరణంబును మొఱంగి నిద్రాసమానీతుం డైన యారాజమనోజాతుతో నెంతయుం దడవు మంతనంబుండియు నిరంతరస్మరణసరణిధారావాహికావగాహంబున నెడనెడం బొడమాపు నప్పుడమిఱేనిఁ గనుంగొని లజ్జాసాధ్వసంబులు మనంబులో ముప్పిరిగొనం బ్రమోదించియు నవైవ్యదర్శి నిర్భరమదనశరశలాకాశంకు*సంకలితవేదనాదూయమానమానస యై విజృంభితమనోభవభుజావష్టంభంబు లగుహిమారంభంబులుం గాలాగరుకళంకితకామినీకంఠమూలంబు లగుశిశిరకాలంబులుం గలకంఠకామినీకోమలకుహూకారకోలాహలకరంబితకకుబంతంబు లగువసంతంబులును సాయంతనసమయసంఫుల్లమల్లికామోదమేదుర సమీరణౌఘంబు లగునిదాఘంబులును విరహిజనహృదయ భయంకరస్తనితసందోహంబు లగుజలధరానేహంబులును సకలజన

* "శకలిత" యనిపాఠాంతరము. ఇదియె సముచితముగా నున్నది.

మనోవికాససమయంబు లగుశారదసమయంబులుం గడపు
చుండె నవ్వేళ జలధివేలావలయవలయితవసుంధరాభువనమం
డలాఖండలుం డగునలుండును విమలనిజకీర్తి మౌక్తికమా
లికాసంతానంబులకు నంతర్ఘటనాగుణంబులుంబోలె బొ
లుచు నక్కాంతాలలామంబుగుణంబులు జనపరంపరవలన
వినియె నాసమయంబున. 78

టీ. మఱియుఁ=ఇంతియకాక,మనోరథ...దామంబునఁ-మనోరథ=కోర్కు
లయొక్క,పరంపరా=ఎడతెగని పంక్తియనెడు,సంవరణ=స్వయంవరమునిమిత్త
మయిన, ప్రసూనదామంబునఁ=పూవులదండచే, అమ్మహీపతిఁ=అనలుని, ప
తిగా=భర్తగా, వరించియుఁ=చేపట్టియు, ఇందు "మనోరథపరంపరా"
అని చెప్పుటచే సర్వకాల సర్వావస్థలయందు నొకప్పుడును నలునిఁ బరిణయ
మాడవలెనన్న కోర్కి విడువలేదని స్ఫురించుచున్నది. త్రిభాగశేషంబులు-త్రి
భాగ=మూడుభాగములకంటె, శేషంబులు=మిగిలియున్నవి, అగువిభావరీ సమ
యంబులఁ=అయినట్టి రాత్రులయందు-అనఁగాఁ దెల్లవాఱుజాములందనిభా
వము, నిమీలితంబు=మూయఁబడియున్నది, ఐన నేత్రయుగ్మంబును=అయినట్టి
కన్నుఁగవను, బాహ్య...ముద్రితంబు - బాహ్యేంద్రియ = బాహ్యేంద్రి
యములయొక్క, మౌన=వ్యాపారోపరమమనెడి, ముద్రా=ముద్రచే,అభిముద్రి
తంబు=ప్రతిబద్ధమయినది - అనఁగా నస్వతంత్రమైనదిఅయిన, అంతఃకరణంబు
ను= మనస్సును, మొఱంగి=వంచించి, నిద్రాసమానీతుండు=నిద్రచేఁ దీసికొని
రాఁబడినవాఁడు, ఐనయారాజమనోజాతుతోఁ=అయినట్టి యారాజమన్మథు
నితో -అనఁగా మన్మథునివంటి నలునితోననుట, ఎంతయుఁ=మిక్కిలి, తడ
వు=కాలము,అనఁగాఁజాలకాలము, మంతనంబుండియు=రహస్యముగా వర్తిం
చియు, అనఁగా మనోరథములనెడి పూవులు గలదండచే నానలమహారాజు
ను వరించి ఇంద్రియంబుల వంచించి రహస్యంబుగా నిద్రచేఁగొని రాఁబడినన
లునితో రహస్యంబుగాఁ గాలముగడపుచుండియు ననిభావము. ఇందునిద్ర మ
నంబు నింద్రియంబులను వంచించి మనసునకు నలుని చూపించి ... బడినది.

స్వప్నమనఁగా మనోజన్యమగు జ్ఞానమే కావున మనంబునకుఁ గనఁబడకుండఁ దెచ్చుట యసంగతముగాఁ దోచును. కాని "బాహ్యేంద్రియమాన ముద్రాభిముద్రితము" అని మనస్సునకు విశేషణము చేయుటచే నట్టిసంగతి వారించుచున్నది. ఎట్లనఁగా మనయింద్రియంబులకు విషయములకును సంబంధమున్నయెడ జ్ఞానముకలుగుచుండును. జాగరావస్థయందు మనస్సుతోఁగూడిన యే యింద్రియ మేవిషయముయొక్క సంబంధముకలదగునో యాజ్ఞానమేకలుగుచుండు, ఎట్లనఁగా మనమనస్సు నేత్రేంద్రియములతోఁగూడి వస్తువునుజూచినచోఁ దద్వస్తువిషయకమైన జ్ఞానముకలుగును. కాని మనస్సునకు నింద్రియంబునకు సంయోగమే లేనిచో జ్ఞానముకలుగదు. కావుననే మనస్సణుస్వరూపమనియు మనస్సంయోగముగలిగిన యింద్రియంబులనుండియే జ్ఞానముకలుగుచుండుననియు నన్నియింద్రియంబులనుండియు జ్ఞానము లొక్కమాఱు సంభవింపనేరవనియు ననుభవజ్ఞులుపల్కుచుందురు, మనస్సు జాగ్రదవస్థయందు బాహ్యేంద్రియజన్యమగుజ్ఞానముకలదై యుండును గాని దక్కినయవస్థలయందుండదు. కావున మనంబు బాహ్యేంద్రియ జ్ఞానంబుకలదనియు లేనిదనియు రెండువిధములు. ప్రస్తుతమున బాహ్యేంద్రియమాన ముద్రాభిముద్రితమనుదానికి నింద్రియార్థసంయోగము వలనఁ గలిగిన జ్ఞానములేనిదని యర్థముకావున స్వప్నావస్థయందు దాదృశజ్ఞానము లేని మనస్సును వంచించికొని రాఁదగియుండుట సంగతమగుచున్నది. అనఁగా నొకదూతిక యొకనాయికకుఁ బ్రియతముఁడైన పురుషుని రహస్యముగాఁగొనివచ్చి యామెతోఁగూర్చినట్లు నిద్రప్రియతముఁడైన నలుని రహస్యంబుగాఁ గొనివచ్చి దమయంతితోఁ గూర్చినదని భావము. మఱియు త్రిభాగశేషంబులగు విభావరీ సమయములయందని చెప్పుటలో సారస్యమేమనఁగా దమయంతి నలమహారాజ సమాగమము దెల్లవాఱుజామునందు గలిగిన స్వప్నములందు గాంచుటచే నట్టి స్వప్నంబులు శీఘ్రఫలదాయకంబులగునట్లు తెలియుచున్నది. నాల్గవజామునందలి స్వప్నము శీఘ్రంబుగాఫలదాయకంబగు ననుటకుఁ బ్రమాణమే మన మత్స్యపురాణమున శ్లో॥ స్వప్నాస్తుప్రథమే యామేసంవత్సర విపాకినః। వడ్భిర్మాసై ర్ద్వితీయే[illegible]త్రిభిర్మాసైస్తృతీయే[illegible]మాసార్ధేన పచ్యంతే

వాస్తినంశయః॥ అని చెప్పఁబడినది. కావున! మహారాజదర్శనరూప సుస్వప్న
ముయొక్క శుభఫలము స్వల్పకాలములోనే రానున్నదనిస్ఫురించుచున్నది. అ
ట్లుకాక త్రిభాగశేషంబులు అనుపదమునకు మూఁడు భాగములు మిగులుగాఁగల
వని బహువ్రీహినాశ్రయించి మొదటి యామమనియర్థమునంగీకరించి తత్ఫలమొక
వత్సరంబులోరానున్నదని చెప్పినను జెప్పవచ్చును. కాలవ్యవధానమును బట్టి యెట్లా
శ్రయించిన నాశ్రయింపవచ్చును. నిరంతర...గాహంబునన్-నిరంతర=ఎల్లప్పు
డును, స్మరణ=ధ్యానముయొక్క, సరణి = రీతియనెడి, ధారావాహికా =
ధారారూపమయినప్రవాహమునందు,అవగాహంబునన్ =మునుఁగుటచే,ఎడన్,
ఎడన్ =మాటిమాటికి, పొడచూపు నప్పుడమిఱేనిన్ = కనఁబడుచున్న నలమహా
రాజును, కనుంగొని=చూచి, లజ్జాసాధ్వసంబులు=లజ్జాభయములు, మనంబు
లోన్ =మనస్సులో, ముప్పిరిగొనన్ = పెనఁగొనఁగా,ప్రమోదించియు=ఆనందిం
చియు, అనఁగా దమయంతి నలుని సంతతము స్మరించుచుండుటచేఁ దనకు మా
టిమాటికిఁగానవచ్చు నతనిఁబొడగాంచి ముగ్ధయగుటచేలజ్జాసాధ్వసంబులతోఁ
గూడిన ప్రమోదము చెందుచుండెనని భావము. అవ్వైదర్భి=ఆదమయంతి, ని
ర్భర...మానస- నిర్భర=సహింపరాని, మదనశర=మన్మథబాణములనెడి, శ
లాక=కణికలవంటి, శంకు=మేకులచే, సంకలిత=కూడికొనియుండుటవలనఁ గ
లిగిన, వేదనా=బాధచే, దూయమాన=నొచ్చుచున్న, మానస=మనస్సుకలది,
ఐ, విజృంభిత మనోభవ భుజాస్తంభంబులు-విజృంభిత=అతిశయించిన,మనో
భవ=మన్మథునియొక్క, భుజాస్తంభంబులు=బాహుగర్వముగలవి,అగుహేమా
రంభంబులు=అయినట్టి హేమంత ఋతువుయొక్క ప్రారంభ దశలును-అనఁ
గా మన్మథోద్దీపకములయిన హేమంతకాలములయందనిభావము. కాలాగరు
కళంకిత కామినీకంఠమూలంబులు - కాలాగరు=కృష్ణాగరుచే, కళంకిత=కలుషి
తములైన-పూయఁబడిన, కామినీ= స్త్రీలయొక్క,కంఠమూలంబులు=కంఠప్రదే
శములుగలవి,అగు శిశిరకాలంబులును=అయినట్టి శిశిరకాలములను-అనఁగాహే
మంతము నందుఁ జలిచేవిడువఁబడిన యంగరాగాదులను గామోద్దీపకములగు
నట్లు తిరిగి యలందుకొనఁదగినకాలములని భావము. కలకంఠ... కకుబంతంబులు–

కలకంఠకామినీ=ఆఁడుకోకిలలయొక్క, కంఠ=కుత్తుకలవలనబయలు వెడలిన, కోమల=మృదువైన, కుహూకార=కుహూయనెడి, కోలాహల=కలకలధ్వనిచేత, కరంబిత=మిశ్రీభూతమైయున్న, కకుప్+అంతములు=దిగంతములుకలవి, అగువసంతంబులును=అయిన వసంతకాలములను-అనఁగా నతిమనోహరములయిన కోకిలాలాపంబులచే నల్గడలు గడలుకొనుటంబట్టి వసంతకాలములుమిగులమన్మథోద్దీపకంబులగుచున్నవనిభావము. సాయంతన... సమీరణౌఘంబులు - సాయంతన సమయ=సాయంకాలములయందు, సంఫుల్ల=వికసించిన, మల్లికా = మల్లెపూవులయందున్న, ఆమోద=పరిమళముచే, మేదుర=బలిసియున్న - అనఁగా మిక్కిలిపరిమళవంతములయిన, సమీరణ=మారుతములయొక్క, ఓఘంబులు=సమూహములుగలవి, అగునిదాఘంబులును=అయినట్టి గ్రీష్మకాలములును అనఁగా గ్రీష్మకాలము చక్కఁగవికసించినమల్లిపూలయందలి నెత్తావుల నాకర్షించి ప్రసరించు మందమారుతంబులు గలదగుటచే మిగుల రమణీయముగా నున్నదని భావము. విరహి... సందోహంబులు - విరహిజన=వియోగముపొందియున్న నారియొక్క, హృదయ=మనస్సులకు, భయంకర=భయమును గలుగఁజేసెడి, స్తనిత=గర్జనలయొక్క, సందోహంబులు=సమూహములుకలవి, అగుజలధర+అనేహంబులును=వర్షకాలములును,అనఁగా వర్షకాలముపత్నీసహితులకు నానందము గొలుపునవికాని విరహులకు మిగులభయంకరంబులయియుండుననుట.సకల... సమయంబులు - సకలజన=సమస్తజనులయొక్క, మనః=మనస్సుయొక్క, వికాస=సంతోషమునకు, సమయంబులు=అవధులు - అనఁగా నమితమగుమనోవికాసమునుగలిగించునవియనుట, అగుశారదసమయంబులును=అయినట్టిశరత్కాలంబులును,కడపుచుండెన్ = జరపుచుండెను, అవ్వేళన్=అట్టిసమయమందు,జలధి... అఖండలుండు=జలధివేలావలయ=కడియమువలెనున్న సముద్రపు గట్టుచే, వలయిత=చుట్టఁబడిన, వసుంధరాభువనమండల=భూలోకమండలమునకు,అఖండలుండు=ఇంద్రుఁడు అనఁగాఁబ్రభువయిన, నలుండును,విమల...సంతానంబులన్ - విమల=నిర్మలమయిన, నిజకీర్తి=తనకీర్తి యనెడి,మౌక్తిక=ముత్యములయొక్క,మాలికా=సరములయొక్క, సంతానములకున్=సమూహమునకు,

అంతర్ఘటనాగుణంబులుంబోలె=లోపలనుండెడిగుంభనసూత్రములవలె,పొలుచు నకాంతాలలామగుణంబులు - పొలుచు=ఒప్పెడి, అకాంతాలలామంబు=దమయంతియొక్క, గుణంబులు=సద్గుణములను, జనపరంపరవలనన్ =జనసమూహమువలన, వినియెన్.ఆసమయంబున, సౌందర్యముచేతను, సద్గుణంబులచేతను సత్కీర్తిచేతను దమయంతి తనకుఁ దగియున్నదనుట. ఈచెప్పుటచే ముత్యంబులకు గుంభన సూత్రంబు ప్రధానంబయినట్లు నలునికీర్తికి దమయంతి ముఖ్యరాలయినట్లు తోఁచుచున్నది. అలం. రూపకము.

అవ. వెనుకటివాక్యమున దమయంతీగుణశ్రవణమును బ్రతిపాదించి యింక దమయంతియందు నలునికి ననురాగంబుకలుగుచున్నదని వర్ణించుచున్నాఁడు. [న్

శా. ఆవామాక్షిమనోహరాకృతి యమోఘాస్త్రంబుగాభూవరు
లావణ్యాధికు నచ్చలంబుమెయి గెల్వంబూని యిందిందిర
జ్యావల్లీకిణకర్కశం బయినహస్తం బుద్ధతిం జాఁపి వే
పూవుందూపులజోదు పుచ్చుకొనియెంబుండ్రేక్షుకోదండమున్.

టీ. ఆవామాక్షి మనోహరాకృతి - ఆవామాక్షి = సుందరము లయిన నేత్రములుగల యాదమయంతియొక్క,మనోహరాకృతి=సొగసయిన యాకారము, అమోఘాస్త్రింబుగాన్ - అమోఘ=వ్యర్థముకాని, అస్త్రింబుగాన్ =అస్త్రిముకాఁగా, లావణ్యాధికున్ - లావణ్య=చక్కఁదనముచే, అధికున్ =గొప్పవాఁడగు, భూవరున్ = నలమహారాజును, గెల్వన్ పూని = గెల్చుటకుఁ బ్రయత్నించి, ఇందిందిర... కర్కశంబు - ఇందిందిర = తుమ్మెదల నెడి, జ్యావల్లీ = లతవంటి వింటినారివలనఁ గలిగిన, కిణ = కాయలచే, కర్కశంబు= కఠినము, అయినహస్తంబు = అయినట్టిచేతిని, ఉద్ధతిన్ =అతిశయముచే, చాపి=చాఁచి, వే= శీఘ్రముగా, పూవుందూపులజోదు = పూవులుబాణములుగాఁగలవీరుఁడు-అనఁగా మన్మథుఁడు, పుండ్రేక్షు కోదండమున్ - పుండ్రేక్షు= నామాలచెఱకుగడ యనెడి, కోదండమున్ = కార్ముకమును, పుచ్చికొనియెన్ =ధరించెను. ఇందు "లావణ్యాధికు" నని చెప్పుటచే నలుఁడు లావణ్య

ముచే మన్మథుని మించినవాఁ డగుటంబట్టి లోకములో సౌందర్యవంతుఁ డని ప్రసిద్ధికెక్కినట్టి తనకంటెను మిగుల సౌందర్యవంతుఁ డగు నలునిపై మరుఁడు మచ్చరంబు వహించి యతని జయింపఁబూని తనబాణములు కొఱగామికి విచారించుచునుండి సమయమువేచి దమయంతీసుందరాకారంబును బాణంబు గాఁజేసికొని నలునిజయింప వేడుకపడుచుండె ననియర్థము. మఱియు నీయర్థ మునుబట్టి యోచింప నీశ్వరాదులఁ జలింపఁజేసిన మన్మథబాణంబులయినను న లునిచిత్తంబును జలింపఁజేయలేకపోయినవని చెప్పుటచే నలునిధైర్యాతిశయము వెలువడుచున్నది. మన్మథుని చేతను మఱియే స్త్రీలలామంబు చేతను బోరివోని నలుని దృఢధైర్యంబును దమయంతిపోఁగొట్టిన దనిచెప్పుటచే దమయంతి సౌం దర్యాతిశయంబును వెలువడుచున్నది. అనఁగా నే సుందరిని జూచినను గలంగని నలునిమానసంబు దమయంతిసద్గుణశ్రవణంబుమాత్రంబున నేకలఁగి యామెను వరింప నిష్టపడుచున్న దనిభావము. అలం=ఉత్ప్రేక్ష.

తా. మన్మథుఁడు తనకంటెను సుందరుఁ డయిననలమహారాజుపై మచ్చరం బు వహించి జయింప నిశ్చయించి దమయంతిసుందరాకార మనెడి బాణము తనకు లభించుటచే నద్దానిసంధింప తుమ్మెద లనెడి యల్లెత్రాటియొ క్కరాపిడిచే జనించినకాయులచేఁ గఠోరమయిన హస్తమును వేగము గాఁజాపి చెఱకువింటెని దీసికొనెను.

క. శ్రవణావతంస మాయెను
ధవళాయతనేత్రగుణము ధరణీపతికిన్
శ్రవణావతంస మయ్యెను
బువ్వువింటిగుణంబు నపుడు పుష్పాస్త్రునికిన్. 80

టీ. ధవళాయత నేత్రగుణము-ధవళ=తెల్లని, ఆయతి=దీర్ఘములయిన, నే త్ర=నేత్రములుగల దమయంతియొక్క, గుణము=సద్గుణము, ధరణీపతికిన్= నలమహారాజునకు, శ్రవణావతంసము - శ్రవణ=చెవులకు, అవతంసము=భూష ణము, ఆయెన్=అయినది-అనఁగా దమయంతిగుణములు నలునిచెవిని బడినవ నియర్థము. దమయంతిగుణములు కర్ణపథమునఁ బడినవని చెప్పుట శ్రవణావ

తింస మయినదని చెప్పుటచే నలంకారములు ప్రియమయినయట్లు దమయంతీ గుణంబులు నలునకత్యంతప్రియం బగుటస్పష్టము. అపుడు=దమయంతిగుణములు నలుని కర్ణపథమునఁ బడినసమయమందు, పుష్పాస్త్రునికిన్ =మన్మథునికి, పువు వింటి గుణంబును=పుష్పమనెడి వింటియొక్క యల్లెత్రాడుగూడ, శ్రవణావతంసము - శ్రవణ=చెవులకు, అవతంసము=అలంకారము, ఆయెన్ = అయినది. అనఁగా దమయంతిగుణంబులు నలుని కర్ణపథంబునఁ బడినక్షణమునందె యితని కధికమయిన మన్మథవికారము గలిగినదని భావము. మఱియు నిట మన్మథుఁడు వింటినారి నాకర్షించె ననిచెప్పక యది శ్రవణావతంసమయినదని చెప్పుటచేఁ దనవింటినారిని గర్ణాంతముపర్యంతము లాఁగి నలుని గాఢముగాఁ గొట్టఁదలంచి యున్నట్లు సూచితమగుచున్నది.

తా. దమయంతీదేవి సుగుణములు నలమహారాజు కర్ణపథమునఁబడిన కాలమందే మన్మథుఁడుకూడఁ దనపూవింటియల్లెత్రాటిని గర్ణాంతముపఱకు లాఁగి యుంచెను. అలంకారము, కావ్యలింగము.

ఉ. ఆవసుధాధినాథుని మహాధృతిశాలి జయించు తెంపునన్
*భావజుఁడప్పు డున్మథనబాణము తియ్యనివింటఁ గూర్చుచోఁ
గేవలసాహసంబుమదిఁ గీలొ్కనఁ జేసియుముంచెఁదాఁ ద్రిలో
కీవిజయార్జితంబు లగుకీర్తిభరంబుల సంశయాంబుధిన్. 81

టీ. భావజుఁడు=మన్మథుఁడు, మహాధృతిశాలిన్ -మహత్ =గొప్పదయిన, ధృతి=ధైర్యముచే, శాలిన్ =ఒప్పునట్టి, ఆవసుధాధినాథునిన్ =ఆనలమహారాజును, జయించు తెంపునన్ =జయింపవలెనన్న తెగువచేత, ఉన్మథనబాణము- ఉన్మథన=లోకులనందఱిని బాధింపఁజాలిన, బాణము=అమ్మును, తియ్యనివింటన్

* "భావజుఁ డప్పు డున్మదనబాణము" అని యచ్చుప్రతులలో నున్నపాఠమవలంబించినచో, ఉన్మదన=ఉన్మాదము కలిగించెడి, అనఁగా వెఱ్ఱిపుట్టించెడి బాణమని యర్థము.

= చెఱకు వింటియందు, కూర్పఁజేసెన్ =సంధించుసమయమున, కేవలసాహసంబు= పెద్దసాహసమును, మదిన్ =మనస్సునందు, కీలొల్పన్ చేసియున్ =దృఢముగానిలుచునట్లు చేసియు, అనఁగా "నసాహసమనారుహ్యనరో భద్రాణి పశ్యతి" యనునట్లు భద్రములను బొందుటకు మహాసాహసము నవలంబించియు ననియర్థము. తాన్ =ఆమన్మథుఁడు, త్రిలోకీ విజయార్జితంబులు=మూడులోకములను జయించుటవలనఁ గలిగినవి, అగుకీర్తిభరంబులన్ =అయినట్టి యశోరాసులను, సంశయాంబుధిన్ =సందేహమనెడి సముద్రమునందు, ముంచెన్ =మునుఁగునట్లు చేసెను. అనఁగా మన్మథుఁడు ముల్లోకంబుల జయించిన వీరుండయినను, తాను లోకోన్మథన మగుశరమును వింటియందుఁగూర్చి పెద్దసాహసము పూనెనన, నలునిధైర్యంబును బాపఁగలనో లేనో యనుసందియ ముదయించి యతఁడు "త్రిలోకవిజయీ" యనిపించికొని సంపాదించిన గొప్పకీర్తియొక్క నాశనముచేయ సమకట్టె ననియర్థము. మఱియుఁ దాను మూడులోకముల జయించిన జోదయినను నలుని జయింతునో జయింపలేనో యనియు, ఆనలుని జయింపలేకపోయినచో నింతకుఁబూర్వము సంపాదించిన కీర్తియంతయుఁ బోవునేమో యనియు చిరకాలార్జితంబగు యశస్సేపోవుచున్నపుడు వర్తమానమునందు సంపాదించిన యశంబుపోవునని వేఱచెప్పనక్కఱయే లేదనియు, నెక్కువకీర్తినిగోరి యనుచితములయిన కార్యములకుఁ బూనుకొనినచో నున్నది కూడ నశించు నేమో యనియు, సందేహించె ననిభావము. తానంతిగొప్పవాఁడయినను ముల్లోకముల జయించినవాఁడయినను నలునిజయించుటలో సందేహము పూనె ననుటచే నలుని ధైర్యాతిశయము స్పష్టమగుచున్నది.

తా. మన్మథుఁడు మహాధీరుఁడయిన నలమహారాజును జయింప నిశ్చయించికొని సమస్తలోకములను మథింపఁజాలినబాణమును వింటఁ గూర్చునప్పుడెంతో సాహసము నవలంబించియు మూడులోకముల జయించి తాను సంపాదించినకీర్తిని సంశయమనెడి సముద్రములో ముంచివేసెను. అలం, అతిశయోక్తి.

అవ. వెనుకటిపద్యమున మన్మథుఁడు త్రిలోకీవిజయియైనను నలుని జయింప సందియమందెనని చెప్పి యిప్పుడు మరునికి దైవ

సాహాయ్య ముం డుటచేతనే నలుని జయింపఁగలిగెనని చెప్పు చున్నాఁడు.

తే. అతనుఁడఁట జోదు పూమొగ్గ యఁట శరంబు
  *చించినది యఁట తద్ధైర్య కంచుకంబు
  నలుని దమయంతితోఁగూర్పఁ దలఁచియున్న
  ధాత మదియొత్తికోల్ తుదిఁ దాఁకదున్నె. 82

టీ. జోదు=వీరుఁడు, అతనుఁడఁట=శరీరములేనివాఁడఁట- అనఁగా మన్మథుఁడనియునర్థము, శరంబు = బాణము, పూమొగ్గయఁట = పూవుమొగ్గయఁట-అనఁగా బాణము మిగుల మృదువయినదని భావము, తద్ధైర్యకంచుకంబు-తత్ =ఆనలునియొక్క, ధైర్యకంచుకంబుఁ =ధైర్యమనెడి కవచమును, చించినదియఁట=చీల్చివేసినదఁట, నలుని=నలమహారాజును, దమయంతితోఁ =దమయంతీదేవితో, కూర్పఁ =కూర్చుటకు, తలఁచి=ఆలోచించి, ఉన్న...ఎత్తికోలు - ఉన్న=ఉన్నట్టి, ధాత=బ్రహ్మయొక్క, మదియొత్తికోలు=మనోభిప్రాయము, తుదిదాఁకక=కొనసాఁగకుండ, ఉన్నే=ఉండునా?కొనసాఁగకతీరదని యర్థము. అనఁగా బ్రహ్మ యట్టిదాంపత్యము సమకూర్పనెంచియున్నాఁడు కావున కార్యముకొనసాఁగినదిగాని లేనిచో నతనుఁడయినకూముఁడుపూవును బాణముగాఁజేసికొని నలుని ధైర్యము దలంపశక్తుఁడుగా నేరఁడని భావము.

తా. మనుఁడు శరీరములేనివాఁడయినను తన బాణము మృదువయిన పూవుమొగ్గయయినను, నలమహారాజు ధైర్యకంచుకమునుజించి మనస్సునుగలంచెను. నలమహారాజును దమయంతితోఁగూర్పఁ దలంచిన బ్రహ్మయొక్కతలంపు తుద ముట్టకమానదు. అలం. రూపకానుప్రాణితమైన విరోధాభాసము.

అవ. చెప్పినయర్థమునే ప్రకారాంతరమునఁ జెప్పుచున్నాఁడు.

ఉ. ఎయ్యదికారణంబుగ మహీపతి †యంచితధైర్యకంచుకం

* 'చించెనఁటయది'' యని వ్రాఁతప్రతులలోనిపాఠము.

† ''మహీపతిమానసధైర్యకంచుకంబు'' అని పాఠాంతరము.

బయ్యతనుండు సించె నలశింమ్ములచే నది కారణంబుగాఁ
దొయ్యలి రాజనందనుసితోడను గూర్పఁ దలంచుచున్నయా
దయ్యము నెత్తికోలుతుదిఁదాఁకుటగానఁగనయ్యెనయ్యెడన్.

టీ. అయ్యతనుండు=అమన్మథుఁడు, అలరమ్ములచేన్=పూవుటమ్ములచే, మహీపతియంచిత ధైర్యకంచుకంబున్-మహీపతి=నలునియొక్క, అంచిత=ఒప్పుచున్నట్టి, ధైర్యకంచుకంబున్=ధైర్యమనెడి కవచమును, ఎయ్యది కారణంబుగన్=ఏకారణముంబట్టి, చించెన్=చీల్చెనో, అనఁగా ధైర్యమును వదలునట్లు చేసెనో అనియర్థము. అదికారణంబుగాన్=అకారణముచే, తొయ్యలిన్=దమయంతిని, రాజనందనునితోడను=నలమహారాజుతో, కూర్పన్=సమకూర్చుటకు, తలంచుచున్న... కోలు-తలంచుచున్న=ఆలోచించుచున్న, ఆదయ్యము నెత్తికోలు=అబ్రహ్మయొక్క ప్రయత్నము, అయ్యెడన్=ఆసమయమందు, తుదిఁ దాఁకుట=కొనసాఁగుట, కానఁగన్ అయ్యెన్=కనఁబడఁజొచ్చెను. నలదమయంతులకు దాంపత్యము సంఘటింపనెంచి బ్రహ్మ మృదులంబులైనను మదనబాణంబులచే నలుని ధైర్యకంచుకంబును భేదిల్లునట్లు చేసి తనకోర్కెని సఫలము గావించుకొనెను గానిలేనిచో నతనుండు పూవుటమ్ములతో నలుని ధైర్యకంచుకమును భేదించుటపొసంగదని యర్థము. మఱియు దైవమనుకూలమయినచో దుష్కరకార్యంబులయినను సఫలత్వమునొందుననిభావము. పుష్పబాణంబులచే ధైర్యకంచుకంబును జించుట యెట్లనెడి విరోధము, విధివిలాసము దుర్ఘటకార్యములనైన ఘటించు ననిచెప్పుటచే నాభాసమగుచున్నదిగాన విరోధాభాసాలంకారము. అది రూపకముచే ననుప్రాణిత మగుచున్నది.

తా. మన్మథుఁ డేకారణముచేత మృదువయిన పూవుటమ్ములచే నలమహారాజుయొక్క ధైర్యమును గలంచెనో ఆకారణముననే దమయంతిని నలమహారాజుతోఁ గూర్పఁదలంచియున్న బ్రహ్మప్రయత్నము నెఱవేఱినట్టు లందఱికిఁ దెలియవచ్చెను.

ఉ. *ఏసల నవ్విరించి నొకయేటునఁ దామరపాన్పుపైఁ బడం
ద్రోసినజోదు మన్మథుఁడు దుర్వహనూత్నవియోగవేదనా
యాసితమైనరాజుహృదయాబ్జముఁ గాఁడఁగ నేసె నెంతయున్
గాసిలి తేఁటిఱెక్కగఱిఁగట్టినపుష్పశిలీముఖంబులన్. 84

టీ. మన్మథుఁడు=మరుఁడు, ఏసలన్=విలాసములచే, అవ్విరించిన్ = ఆబ్రహ్మను, ఒకయేటునన్=ఒక్కదెబ్బచే, తామరపాన్పుపైన్=పద్మమనెడిశయ్యపైని, పడన్=పడునట్లు, ద్రోసినజోదు=త్రోసినట్టివీరుఁడు, అనఁగా బ్రహ్మను జయించినవాఁడని యనుట, "తామరపాన్పుపైఁ బడంద్రోసిన" అనుటచే మదనతాపపీడితునకు తామరపాన్పు శైత్యోపచారార్థము చేయుట ప్రసిద్ధము. ఇట బ్రహ్మకు స్వభావసిద్ధమైన తామరపాన్పు మన్మథతాపనివృత్తికి రచితమైనదిగా ఉత్ప్రేక్షితము, దుర్వహ...యాసితము-దుర్వహ=భరింపశక్యముకాని నూత్న=క్రొత్తదగు, వియోగ = విరహమువలనఁ గలిగిన, వేదనా=బాధచే, ఆయాసితము=అలసటచెందియున్నది, ఐనరాజు హృదయాబ్జమున్=అయినట్టినలమహారాజుయొక్క హృదయపద్మమును, ఎంతయున్=మిక్కిలి, గాసిలి=కోపించి, తేటిఱెక్కగఱిన్=తుమ్మెదయొక్క ఱెక్కయందున్న యీఁకను, కట్టిన పుష్పశిలీముఖంబులన్ - కట్టిన=బంధించిన, పుష్పశిలీముఖంబులన్=పూవుటమ్ములచే, యుద్ధవీరులు బాణములకు గద్దలయొక్క యీఁకలను గట్టుదురని ప్రసిద్ధి; అట్లె మన్మథుఁడును తన పూవుటమ్ములకుఁ దుమ్మెదఱెక్కలను గట్టెనని యర్థము, కాఁడఁగన్=నాటునట్లు, ఏసెన్=కొట్టెను బ్రహ్మను దామరపాన్పునందుఁ బడ నేసిన మన్మథుఁడు వియోగపీడితుండయిననలుని జయించుట యెంత కార్యము? అలం. కావ్యార్థాపత్తి. ఉత్ప్రేక్ష.

తా. సృష్టికర్తయగు బ్రహ్మను తామరపాన్పునందుఁ బడునట్లుకొట్టిన మన్మథుఁడు దుర్వహమయిన వియోగబాధచే నలఁతచెందియున్న నలమహారాజు హృదయకమలమును దనపూవుటమ్ములచే మిక్కిలి నాటునట్లు కొట్టెను.

---

* "ఏసరవిన్విరించి" అని వ్రాఁతప్రతుల పాఠము.

తే. లలన లజ్జాసరిద్దుర్గ లంఘనమున
రాజుహృదయంబుఁ జొచ్చినక్రమముఁ జూడఁ
దరుణిమారంభ పరికల్పితంబు లయిన
వలుఁదకుచకుంభముల ప్రభావమునఁ జూవె. 85

టీ. లలన=దమయంతి. లజ్జాసరిద్దుర్గ లంఘనమునన్ - లజ్జాసరిద్దుర్గ=సిగ్గనెడి నదీదుర్గముయొక్క, లంఘనమునన్ =దాఁటుటచే, రాజుహృదయంబున్ =నలమహారాజుయొక్క హృదయమును, చొచ్చిన క్రమము=ప్రవేశించినరీతిని, చూడన్ =ఆలోచింపఁగా, తరుణిమారంభ పరికల్పితములు-తరుణిమారంభ =యౌవనప్రాదుర్భావముచేత, పరికల్పితంబులు=కల్పింపఁబడినవి, అయిన... చూవె- అయిన=అయినట్టి,వలుఁద =స్థూలములయిన,కుచకుంభముల = స్తనములనెడి కుంభములయొక్క, ప్రభావమునన్ +చూవె=సామర్థ్యముచేతనే చుమీ? అనఁగా దమయంతి కుచయుగముయొక్క సౌందర్యముఁ గనుటచే నలుఁడు సిగ్గువిడిచిదమయంతియందాసక్తికలవాఁడాయెనని యర్థము. ఈచెప్పుటచే మనస్సంగమనెడి మదనావస్థసూచితము లోకములో నదులను దాఁటునపుడు చంకలక్రింద కుంభములనుంచికొని యీఁదుట సుప్రసిద్ధము. అట్లే దమయంతియు కుంభములవంటి స్తనములసాహాయ్యమున నలునిలజ్జాజలదుర్గముదాఁటినదని భావము. ఇందుఁగుచకుంభములప్రభావంబుచే లజ్జాసరిద్దుర్గంబును దాఁటినదని చెప్పుటచే దమయంతికుచములు సర్వాతిశాయిసౌందర్యముకలవనియు,కావున నేతక్కినసమస్తాంగములశ్లాఘ మటుండఁ గేవలము దమయంతికుచయుగంబె మహాధైర్యశాలి యగునలునిహృదయము నపహరింపఁగలిగెననియు నర్థసారస్యము స్ఫురించుచున్నది.

తా. నలమహారాజుహృదయము సిగ్గనెడి నదీదుర్గముచే నావరింపఁబడియున్నను దమయంతి యానదీదుర్గమును లంఘించి నలుని హృదయములోఁ బ్రవేశించినది. ఆమె యట్టిజలదుర్గము లంఘించుట లేజవ్వనముయొక్క ప్రాదుర్భావమువలనఁ గల్పింపఁబడిన యున్నతములయిన కుచకుంభముల ప్రభావముచేత నేచుమీ.

అలంకారము రూపకముచే ననుప్రాణితమయిన యుత్ప్రేక్ష.

అవ. దమయంతియందు నలున కనురాగాంకురముద్భవించి నట్లుచెప్పి యిప్పుడు మన్మథపీడితుండయిననలుని వర్తనము వర్ణించుచు ముందుగా మన్మథావస్థలలో నొకటి యగుజాగరణావస్థ జెప్పుచున్నాఁడు.

సీ. జాగరోద్భూతదృగ్రాగంబు మాణిక్య
కర్ణకుండలదీప్తిఁ గప్పిపుచ్చు
రాజకార్యపరంపరాఖేదమిషమున
నిట్టూర్పుగాడ్పుల నిహ్నవించు
ఘనసారబహుళచందనవిలేపనమున
నాపాండుభావంబు నపలపించు
దోరంతరన్యస్తతారహారంబుల
నంతఃపరీతాప మపనయించు

తే. మానసీయశశాంకకోమలము లైన
యామినీసమయములఁ బర్యంకములును
సాక్షులుగ నొందు వలవంత జనవిభుండు
కన్నెకూర్మి ప్రకాశంబుగాక యుండ. 86

టీ. జనవిభుండు = నలుఁడు, కన్నెకూర్మి = క్రొత్తయైన ప్రేమము, ప్రకాశంబు కాక ఉండన్ = పరులకుఁ దెలియకుండ, జాగరోద్భూతదృగ్రాగంబున్ - జాగర = మేలుకొనుటవలన, ఉద్భూత = పుట్టిన, దృక్ = నేత్రముల యందున్న, రాగంబున్ = ఎఱ్ఱఁదనమును, మాణిక్య... దీప్తిన్ - మాణిక్య = రత్నమయములయిన, కర్ణకుండల = మకరకుండలములయొక్క, దీప్తిన్ = కాంతి చేత, కప్పి పుచ్చున్ = మాటుచేయును, - అనఁగా దమయంతివైనున్న మోహాతిశయముచే [illegible]

మొరులకు దెలియకుండునట్లు కర్ణకుండల కాంతులచే మఱుఁగుపఱుచుచునిభా
వము. రాజ... మిషమునన్ - రాజకార్య=రాజకీయ కార్యముల యొక్క, పరంప
రా = సమూహమునందలి, ఖేదమిషమునన్ = ఆయాసమనెడి మిషచేత,
నిట్టూర్పుగాడ్పులన్ = దీర్ఘశ్వాసములను, నిహ్నవించున్ = కప్పుచుండును.
అనఁగా దమయంతీ వియోగతాపమువలన దీర్ఘశ్వాసములు కలుగుచుండ నది
సభవారెఱిఁగి యనుమానపడుదురేమోయని తలంచి నలుఁడు రాజ్యకార్యముల
పెక్కింటినిజక్కఁబెట్టుటవలన నట్టి నిట్టూర్పులు కలుగుచున్నవని సభవారికిఁ దె
లియునట్లుచేయువాఁడు, ఘన... విలేపమునన్ = ఘనసార=పచ్చకప్పురముచే,
బహుళ=నిండియున్న, చందన = మంచిగంధముయొక్క, విలేపనమునన్ =
పూఁతచేత, ఆపాండు భావంబున్ = తెల్లఁదనమును, అపలపించున్ = మఱుఁగు
పఱుచుచుండును. దమయంతివలనివలపుచేత శరీరము? పాలిపోఁగా నలుఁడా
సంగతి యొరులకుఁ దెలియకుండఁ బచ్చకప్పురముచే మిళితమగు గంధపుఁ
బూఁతచేఁ గప్పివేయును. ఇందు కర్పూరబహుళమగు చందనమనుటచేఁ
కర్పూర మేళనముచే చందనమునకు మఱింత తెలుపెక్కును గాన నట్టిచందనము
పూసికొనుటచే శరీరము తెల్లగానున్నది. కాని మఱియొక హేతువుచేఁ గా
దని తలఁపించుటకై యిట్లుచేయుచున్నాఁడన్న సారస్యము స్ఫురించుచున్నది.
జనవిభుండు=నలుఁడు, దోరంతరన్యస్తతారహారంబులన్ - దోర్ = బాహువుల
యొక్క, అంతర= మధ్యభాగమందు, న్యస్త = ఉంపఁబడిన, తారహారంబు
లన్ = ముత్యాలసరులచే, అంతఃపరీతాపంబున్ - అంతః = లోపలనున్న, పరీ
తాపంబున్ = పరితాపమును, అపనయించున్ = కప్పిపుచ్చుచుండును. అనఁ
గా దమయంతివలనివలపుచేత గలిగిన యంతస్తాపంబును ముత్యాలసర
ముల చలువచే నెల్లడికాదను నభిప్రాయంబుతో ముత్యాలహారములను ధరించి
సంతాపమును గప్పిపుచ్చుచుండును. మాననీయ శశాంక కోమలములు -
మాననీయ = గౌరవింపఁదగిన, శశాంక = చంద్రునిచే, కోమలములు =
మనోహరములు, ఐన యామినీసమయములు = అయినట్టి రాత్రికాలములు, శశాం
క=చంద్రుని [illegible] శయ్యలను

సాక్షులుగన్ = సాక్షీభూతములు కాఁగా, వలవంతన్ = మదనసంతాపమును, ఒందును=పొందును. వ్యా. సూ, సాక్షాద్ద్రష్టరిసంజ్ఞాయాం. అనెడిసూత్రప్రకారము ప్రత్యక్షముగాఁజూచినవారే సాక్షులగుదురుకాన రాత్రిసమయములందు శయ్యాతలమందు దతఁడనుభవించు మన్మథసంతాపమునకు రాత్రియు, శయ్యయునీరెండే సాక్షులగుచున్నవని యర్థము. ఈచెప్పుటచే దమయంతీవియోగబాధను నలుఁ డనుభవించుచున్నట్లు పరులెవ్వరు నెఱుఁగరని తోఁచుచున్నది. ఇందు "శశాంకకోమలములు" అన్న విశేషణమువలన "మనోహరవస్తువులు విరహులకుఁ గామోద్దీపకములగుచుండును" గాన నలునికి సంతాపాతిశయము కలిగించు ననుట స్పష్టమగుచున్నది. ఇందుజాగరణంబువలనఁ గలిగిన కన్నుల యెఱ్ఱఁదనమును గుండలకాంతులుగాను, వియోగమువలనఁ గలిగిన నిట్టూర్పును రాజకార్యనిర్వహణ శ్రమంబువలనఁ గలిగినట్టుగాను, శరీరముయొక్క పాలిపోవుట కప్పురపుఁబూఁతవలనఁ గలిగినట్టుగాను, లోపలనున్న సంతాపము ముత్తెంపుహారములు దాల్చుటచేతను గప్పిపుచ్చెనని యుఁ జెప్పి దమయంతియందున్న యనురాగంబును దాఁచుటచే "అవహిత్థ" మనెడి సంచారీభావము సూచితమగుచున్నది- అవహిత్థమనఁగా, ఆకారమును గోప్యముగా నుంచుటయే.

అలం—అపహ్నవము.

వ. ఇవ్విధంబున ననంవరం బైనశంబరవైరివిక్రమంబు క్రమక్రమంబునం బరిస్ఫుటంబగుచుండ వియోగవేదనాచిహ్నంబులు నిహ్నవింపం గొలఁది గాక చీకాకుపడి యాకారరేఖావినిర్భర్త్సితమత్స్యలాంఛనుం డగునారాజకుమారుం డొక్కనాఁ డారామవీథీవిహారంబునం గాలక్షేపంబు సేయువాఁడై ప్రభంజనాధేయజవంబును జంచలఖురాంచలక్షోదితక్షోణీమండలంబును నిగాళదేవమణిదీప్తిచ్ఛటాపటలశంకావహాకృకా

టికాధవళకేసరకేశరశ్మిసంచయంబును వల్గువల్గానుషక్తవద
నతావిడంబితవక్త్రస్థభుజగవైనతేయంబును జలాచలప్రోథ
తానుమీయమాననిజవేగదర్పప్రశంసాప్రవచనోపన్యాసంబు
ను నై సింధుజంబును శీతమహాస్వహోదరంబును నగుట
రెండవయుచ్చైశ్శ్రవంబునుం బోలినయాపవాహ్యంబు నా
రోహణంబుసేసి. 87

టీ. ఇవ్విధంబునన్ = ఈరీతిగా, అసంవరంబు=దాఁచఁదరముకానిది, ఐనశంబ
రవైరి విక్రమంబు= అయినట్టి మన్మథునిపరాక్రమంబు, క్రమక్రమంబునన్,
పరిస్ఫుటంబు అగుచుండన్ = స్పష్టమగుచుండఁగా, వియోగవేదనాచిహ్నం
బులు - వియోగ=విరహమువలనఁ గలిగిన, వేదనా = బాధాసంబంధమయిన,
చిహ్నంబులు=గుఱుతులు, నిహ్నవింపన్ = రహస్యముగానుంచుటకు, కొలఁది
కాక=తరముకాక, అనఁగా నలుడు మన్మథబాధవలనిగుఱుతుల నొరులకుఁ
దెలియకుండ దాఁచుటకు సమర్థుఁడు కాకపోయెనని యర్థము చీకాకుపడి=అలసి
పోయి, ఆకార...లాంఛనుండు-ఆకారరేఖా = ఆకృతిచేతి, వినిర్భర్త్సిత=
జయింపఁబడిన, మత్స్యలాంఛనుండు= మన్మథుఁడుగలవాఁడు-అనఁగా మన్మ
థునిమించిన సౌందర్యము కలవాఁడనుట, అగు నారాజకుమారుండు = అయినట్టి
నలమహారాజు, ఒక్కనాఁడు, ఆరామవీక్షావిహారంబునన్ - ఆరామ=పూవుల
తోఁట,వీక్షా=చూచుటకొఱకయిన, విహారంబునన్ =సంచారముచేతను, కాల
క్షేపంబు=కాలమునుగడపుటను, చేయువాఁడై=చేయుటకుఁ బూనుకొనిన
వాఁడయి-అనఁగా నుద్యానవనవిహారముచేఁ గాలముపుచ్చఁదలంచినవాఁడనుట,
ఈచెప్పుటచే నలుఁడొక్కస్థలంబున నుండలేకపోవుట స్పష్టమగుచున్నది.
కానఁ జాపలమనెడి సంచారీభావము సూచితమయ్యె. చాపలమనఁగా రాగాతి
శయమువలనఁ గలిగిన క్రియానవస్థయే, ప్రభంజనాధ్యేయజవంబును = ప్రభం
జన= వాయువుచే, అధ్యేయ=నేర్వఁదగిన, జవము=వేగముగలదియు, అనఁ
గావాయువుకంటె మించినచుఱుకుఁదనము కలదనుట, చంచల.. మండలంబు
ను - చంచల=చలనస్వభావముగల, ఖుర=డెక్కలయొక్క, అంచల=కొనలచే

త, క్షోదిత = చూర్ణముగాఁ జేయఁబడిన, క్షోణీమండలంబున = భూమండలము కలదియు, నిగాళ...సంచయంబును- నిగాళ=గుఱ్ఱముయొక్క గళప్రదేశమునందున్న, దేవమణి=దేవమణియనెడిసుడియొక్క, దీప్తి=కాంతులయొక్క, ఛటా = సమూహముయొక్క, పటల = భాగములని, శంకావహా = శంక కలిగించుచున్న, కృకాటికా=పెడతలయందున్నగుంటపలనఁబుట్టిన, ధవళ=తెల్లనయిన, కేసరకేశ=కేసరములనఁబడు నెంద్రుకలయొక్క, రశ్మి = కిరణములయొక్క, సంచయంబును= సమూహముగలదియు, వల్గు...వైనతేయంబును-వల్గు=సుందరమయిన, వల్గ=కళ్లెముతగిలించెడిపగ్గములచే, అనుషక్త = కూడికొనియున్న, వదన=ముఖముచే, విడంబిత = అనుకరింపఁబడుచున్న, వక్త్రస్థ = నోటియందున్న, భుజగ=పాములుగల, వైనతేయంబును= గరుత్మంతుఁడుకలదియు-అనఁగాఁ గళ్లెము తగిలించెడిపగ్గములచే నొప్పుచున్నయాయశ్వము, నోటియందు పాములు గలగరుడునివలె నొప్పుచున్నదని యర్థము, చలాచల... ఉపన్యాసంబును-చలాచల=చలించుచున్న, ప్రౌఢతా = ముక్కుగలదగుటచేత, అనుమీయమాన=ఊహింపఁబడుచున్న, నిజ=తనయొక్క, వేగదర్ప=వేగాతిశయమునుగూర్చిన, ప్రశంసాప్రవచన=స్తుతివాక్యములయొక్క, ఉపన్యాసంబును నై, ఉపన్యాసముకలదియునై -అనఁగా నాగుఱ్ఱము మాటిమాటికిఁ దనను ట్టినజలింపఁజేయుటంబట్టి యోజింపఁ దనయొక్క వేగాతిశయమునుగూర్చి యుపన్యాసమిచ్చుటకుఁ బ్రయత్నించుచున్నదనియర్థము (అట్లుప్రయత్నించియు నలుఁడశ్వహృదయము నెఱింగినవాఁడు కాన నతనికిఁ జెప్పుట యనవసరమని కాఁబోలు మౌనమవలంబించెనని స్వతస్సిద్ధమైన మౌన మిట్లూహింపఁబడియె). ఈ సారస్య సంస్కృతమందున్నది. సింధుజంబును=సింధుదేశమునఁ బుట్టినదియును, (సముద్రమునందుఁ బుట్టినదనియుఁగూడ నర్థము) శీతమహస్సహోదరంబును - శీతమహస్=చంద్రునితో, సహోదరంబును=సమానమయినదియు,-మఱియుఁజంద్రునితోఁబుట్టువనియు గూడనర్థము, అగుటక్=అయియుండుటనుబట్టి, రెండవయుచ్చైశ్శ్రవంబును=రెండవదియయిన యుచ్చైశ్శ్రవమును, పోలినయాసవాహ్యంబును=సాటిపచ్చెడి హయమును, (ఆరోహణంబు... చేసి=అధిరోహించి.

తే. ప్రమదనిష్పందతరనేత్రపద్మ లగుచుఁ
బౌరజనులు విలోకింపఁ బ్రకటలీల
సముచితానల్పపరివారసహితుఁ డగుచు
నవనినాథసుతుండు వాహ్యాళి వెడలె. 88

టీ. పౌరజనులు=పురజనులు, ప్రమద...పద్మలు-ప్రమద=సంతోషముచే, నిష్పందతర = మిక్కిలినిశ్చలములయియున్న, నేత్రపద్మలు = పద్మములవంటి నయనములుగలవారు, అగుచున్, విలోకింపన్ =చూచుచుండఁగా, ప్రకటలీలన్ =ప్రసిద్ధమయిన విలాసముచే, సముచిత . సహితుఁడు-సముచిత=తగిన, అనల్ప=లెక్కవకాని, పరివార=పరివారముచేత, సహితుఁడు = కూడికొనినవాఁడు, అగుచున్, అవనినాథసుతుండు = నలుఁడు, వాహ్యాళి, వెడలెన్ = స్వారి వెడలెను.

తా. నలుఁ డుత్తమమయిన హయము నధిరోహించి జనులందఱుఁ దన్ను సంతోషాతిశయముచే నిశ్చలమయిన నేత్రములు గలవారయి చూచుచుండఁ దగుపరివారముతోఁ గూడికొని విహారార్థము బయలు వెడలెను.

వ. తత్ప్రదేశంబున. 89

ఉ. నేమ మెలర్పఁగా గొడుగునీడ వహించువసుంధరాస్థలీ
సీమనె యెక్కి యాతను విచిత్రగతిం దురగోత్తమంబు నా
భూమివిభుండు తత్క్రమము వ్రాయెడఁ దప్పక యభ్యసించువా
త్యామయచక్రచంక్రమవిహారములన్ సుడిగాడ్పులిప్పనన్.

టీ. ఆభూమివిభుండు=ఆనలుఁడు, తురగోత్తమంబున్ =శ్రేష్ఠమయినగుఱ్ఱమును, ఎక్కి=అధిరోహించి, నేమము=నియమము, ఎలర్పన్ =ఒప్పునట్లుగా, గొడుగునీడ = తానుపూనినట్టి గొడుగుయొక్కనీడ, వహించువసుంధరాస్థలీ సీమనె-వహించు=పొందిన, వసుంధరాస్థలీసీమన్ + ఎ=భూప్రదేశమునందు మాత్రమె-అనఁగాఁ దనగొడుగునీడ యాక్రమించునంతప్రదేశమునందుమాత్రమె యనియర్థము, విచిత్రగతిన్ =విచిత్రములయిన రీతులచేత, ఆతను= విహారిం

చెను, తత్క్రమము, పో-తత్ =ఆనలునిహయముయొక్క, క్రమము పో =రీతినె- అనఁగా నలమహారాజు హయముయొక్కమండలగతులనె, ఎడ తప్పక=అనవృతెప్పకుండ, సుడిగాడ్పులు=సుడిగాలులు, ఇప్పుడున్ = ఈసమయమందుఁగూడ, వాత్యా—విహారములన్ =వాత్యామయ = వాయుసమూహరూపములయిన, చక్రచంక్రమ=వలయముగాఁదిరుగుటలనెడి, విహారములన్ = విహారముల చేత,అభ్యసించున్ = నేర్చుకొనుచుండును, ఇందు నలుని హయమును సంబంధించిన మండలగతులను సుడిగాలులిప్పుడును నేర్చుచున్నవని చెప్పుట చే వాయువునకు సైతము సంభవింపని మండలగతుల నానలునిగుఱ్ఱము చేసినదనియు, సుడిగాలులు వెంటనే నేర్వలేక యిప్పటికి నభ్యసించుచున్నవనుట చే నామండలగతులయందు దురవగాహమైన యొకవిశేషముకలదనియుఁ దోఁచుచున్నది. మఱియు నాహయసంబంధులైన మండలగతులు సుడిగాలులకే లభింపనప్పుడు తక్కినగుఱ్ఱములకు లభించుట స్వప్నవార్తయేయనియు, గావున నాహయము నిరుపమానమనియుఁ దెల్లమగుచున్నది.

తా నలుఁడు తన గొడుగునీడ యాక్రమించినంత స్థలమునందే తన గుఱ్ఱము చే మండలగతులు చేయించెను. అతని గుఱ్ఱముచేసిన మండలగతులనే సుడిగాలులు వాయుసమూహరూపమయిన వలయాకారముగాఁ దిరుగుటలనెడి విహారముచేత నిప్పటికి నభ్యసించుచున్నవి. అలంకారము ఉత్ప్రేక్ష.

వ. ఇవ్విధంబునఁ గొంతతడవతిజవ చతురతురగనర్తన క్రీడాడోలాయమానమణికుండలమరీచిమండలీనీరాజితగండస్థలుండై వాహ్యాళివిహారంబు సలిపి వలయునమాత్యులం బరివారంబును నచ్చోటన యుండ నియమించి యొక్కరుండునుం బాదచారియై ఘనచ్ఛాయంబునుం బ్రవాళరాగచ్ఛురితంబును నగు విలాసకాననంబుఁ బయోనిధానంబు నంబుజాతుండువోలెఁ బ్రవేశించె. 90

టీ. ఇవ్విధంబునన్ = ఈరీతిగా, కొంతతడవు = కొంతకాలము, అతిజవ... గండస్థలుండు + ఐ - అతిజవ = మిక్కిలి చుఱుకుఁదనముగల, చతుర = నేర్పుగల, తురగ = గుఱ్ఱముయొక్క, నర్తనక్రీడా = నాట్యక్రీడచేత, డోలాయమాన = ఉయ్యేలవలెఁ జలించుచున్న, మణికుండల = రత్నకుండలములయొక్క, మరీచి = కిరణములయొక్క, మండలీ = సమూహముచేత, నీరాజిత = నీరాజనమిడఁబడుచున్న, గండస్థలుండై = చెక్కిళ్లుకలవాఁడయి, (అనఁగా నలమహారాజు గుఱ్ఱముచే మండలగతి చేయింప నాసమయమునందు నతని రత్నకుండలముల కాంతులసమూహంబు లిటు నటుక్రిందికి మీఁదికి నర్ధవలయాకారముగా నూఁగుటచే నివాళి చుట్టిన ట్లుండెనని యర్థము. వాహ్యాళి విహారంబు = స్వారిచేయుటను, సలిపి, అనఁగా విహరించి, ఎలయునమాత్యులన్ = ప్రియులయిన మంత్రులను, పరివారంబును = సైన్యమును, అచ్చోటన = ఆస్థలమందే. - అనఁగా నేస్థలమందుఁ దురంగవిహారము సలిపెనో యాస్థలమందు, ఉండన్, నియమించి = ఆజ్ఞాపించి, ఒక్కరుఁడునన్, వాదచారియై, ఘనచ్ఛాయంబును - ఘన = దట్టమయిన, ఛాయంబును = నీడకలదియు, సముద్రపక్షమందు, ఘన = మేఘముయొక్క, ఛాయంబును = కాంతివంటి కాంతిగలది, అనఁగా మేఘమువలె నీలవర్ణము కలదనుట, ప్రవాళరాగచ్ఛురితంబును - ప్రవాళ = చిగుళ్లయొక్క, రాగ = ఎఱుపుకాంతులచే, ఛురితంబును = వ్యాప్తమయినదియు, సముద్రపక్షమందు, ప్రవాళ = పవడములయొక్క, రాగ = ఎఱుపుఁగాంతులచే, ఛురితంబును = వ్యాప్తమయినది, అనఁగా సముద్రములోఁ బవడపుఁదీవెలుండుట ప్రసిద్ధము కాన వానియొక్క యెఱ్ఱనికాంతులచే వ్యాప్తమైయున్నదని యర్థము. అగు విలాసకాననంబు = అయినట్టి యుద్యానవనమును, సముద్రపక్షమందు, "వబయోరభేదః" అనియున్నది కాన వకారమును బకారముగాఁ బఠించుకొనవలెను, బిలాసకాననంబు = (బిల + అసక - బిలాసక = బిలములందు వసించునవైన) సర్పములకు = అవనంబు = బలకరమయినది, అనఁగాఁ బాములకు నివాసభూతమైనదనుట, సముద్రంబునఁ బాములుండుట సుప్రసిద్ధము. లేక, విలాసకాననంబు - వి = పక్షులయొక్క, లాస = క్రీడలకు, కాననంబు = ఉనికిపట్టయినది, నఁగాఁ పక్షులకు [illegible] యర్థము. అగు, పయో

నిధానంబును=సముద్రమును, అంబుజాక్షుండుఁబోలె,అంబుజ = పద్మమువంటి, అక్షుండుఁబోలెన్ = నేత్రములు కలవానివలె, అనగా నారాయణునివలె, ప్రవేశించి=చొచ్చి-వైపద్యముతో నన్వయము.

తే. పత్రములమీఁద మూఁగినభ్రమరకులము
హరవిసర్జన జనిత* దుర్యశముఁ బోలఁ
గమియ విచ్చినగేదంగి కన్నెపువ్వుఁ
గౌతుకము పల్లవింపఁగఁగాంచె విభుఁడు. (78) 91

టీ విభుఁడు=నలమహారాజు, పత్రములమీఁదన్ = ఱేకులమీఁద, మూఁగిన భ్రమరకులము=మూఁకలుగానున్న తుమ్మెదసమూహములు, హర...యశముఁ - హర=ఈశ్వరునియొక్క, విసర్జన=విడుచుటచే, జనిత=పుట్టిన, దుర్యశముఁ = అపకీర్తిని, పోలన్ = పోలునట్లుగా, శ్లో ॥ "నకేతక్యా సదాశివః" అని మొగలిపూవు శంకరపూజకు నిషేధింపఁబడినది. కాన పత్రములమీఁదనున్న తుమ్మెదసమూహము శివపూజకు నిషేధించుటవలనఁ గలిగినదుష్కీర్తివలె నున్న దని భావము. కమియన్=నిండార, విచ్చినగేదంగి కన్నెపువ్వున్ - విచ్చిన=వికసించిన, గేదంగి కన్నెపువ్వున్ =క్రొత్తదయిన మొగలిపుష్పమును, కౌతుకము=వేడుక, పల్లవింపన్=చిగురొత్తఁగా, కాంచెన్=చూచెను.

తా. తన ఱేకులమీఁదమూఁగియున్నతుమ్మెదసమూహము ఈశ్వరుండు విడుచుటవలనఁ గలిగినదుష్కీర్తివలె దిక్కుల నొప్పచుండఁ జక్కఁగ వికసించిన మొగలిపూవును నలుఁడు సంతసముమీఱ వీక్షించెను. అలం. ఉత్ప్రేక్ష.

వ. విరహిజనహృదయచ్ఛేదనక్రియాక్రకచంబులు వియోగిమర్మవిదారణవ్యాపారకర్ణినారాచంబులుఁ బాంథజనహృత్పీకసూచీశలాకలు నగుకనకకేతకీజాలంబులఁ జేరం జనుదెంచి. 92 79

* "దుర్యశముఁబోలెఁ గమియ" అని వ్రాఁతప్రతుల పాఠము.

టీ. నలుండు, విరహి...క్రకచంబులు - విరహిజన = వియోగి జనుల యొక్క, హృదయ=మనస్సులను, ఛేదనక్రియా = ఛేదించుటయనెడి క్రియకు, క్రకచంబులు=అంపములవంటివియు, వియోగి—నారాచంబులు - వియోగి = విరహుల యొక్క, మర్మ=మర్మస్థానములను, విదారణ=చీల్చుటయనెడి, వ్యాపార = వ్యాపారమందు, కర్ణినారాచంబులు = చెవులుగల బాణముల వలెనున్నవియు, పాంథ...శలాకలు - పాంథజన = పథికజనులయొక్క, హృషీక = ఇంద్రియములకు, సూచీశలాకలు = సూదులవలెనున్నవి, అగుకనక కేతకీజాలంబులు - అగు=అయినట్టి, కనక =బంగారపుఁజాయగల, కేతకీజాలంబుల్ = మొగలి పూవులసముదాయమును, చేరన్, ఐనుదించి = సమీపించి, పైపద్యముతో నన్వయము.

చ. చిలికెడుకమ్మదేనియలఁదెజిప్పిలి హస్తము లస్తకంబునన్
నిలువక జీరువాఱునెడ నీయతిసాంద్రపరాగముల్ గదా
యలరులవింటిజోదునకు నప్పటి కప్పటి కప్పళించుకోఁ
గలిగెడునంచు వేగనలు గైకొనిచూచె విభుండు కేతకిన్. 93

టీ. హస్తము=చేయి, చిలికెడుకమ్మదేనియలన్ - చిలికెడి=వింటివలనఁ జిందుచున్న, కమ్మతేనియలన్ = కమ్మనిమధురసములచేత, చిప్పిలి = తడిసి, లస్తకంబునన్ =పిడియందు, నిలువక = నిలిచియుండక, జీరువాఱునెడ=జాఱిపోవుచున్నసమయమున, ఓకేతకీ? (అధ్యాహారము) ఓమొగలిచెట్టా! నీయతిసాంద్రపరాగముల్ కదా, నీ=నీయొక్క, అతిసాంద్ర = మిగుల దట్టమైన, పరాగములుకదా=ధూళులేకదా? అలరులవింటిజోదునకు=పువ్వువే ధనుస్సుగాఁగల వీరునకు, అనఁగా మన్మథునకనుట, అప్పటికప్పడు=మాటిమాటికి,అప్పళించుకోన్ =అద్దుకొనుటకు, కలిగెడున్ =సమర్థములగుచున్నవి, అంచున్ =అనిపలుకుచు, విభుండు=నలుఁడు, వే = శీఘ్రముగా, కనలు=కోపమును, కైకొని = వహించి, కేతకిన్ = కేతకీవృక్షమును, చూచెన్ = కనుఁగొనెను-
ఓకేతకీ! మన్మథునకు పూవేవిల్లు కావున నందుండి స్రవించుచున్న మకరం

దమునఁ దనచేయి తడియుటచే వింటినిబట్టికోలేకపోవును. వింటినే పట్టుకొన
లేనప్పుడును మన్మథు నెట్లు బాధింపఁగలఁడు? ఇట్లసమర్థుండై యుండ నీపరాగ
మతనికి లభించినది. అందుచే నతఁడు నీపరాగము తనచేతులకద్దుకొని వింటిని
దృఢముగాఁ బట్టికొనఁగలిగి మావంటి విరహులను బాధించుచున్నాఁడు. నీప
రాగ మతనికి లభింపనిచో నతఁడు మమ్మేమిచేయఁగలఁడు? కావున మమ్ము
మన్మథుఁడు బాధింపఁగలుగుటకుఁ గారణము నీపరాగమే. అందుచే నీవు నపరా
ధివని పలుకుచుఁ గోపముతోఁ జూచెనని భావము. లోకమున యోధులు స్వేదా
దులచేఁ దమచేతనాయుధంబులు పట్టుకోలేనప్పుడు చేతులకు భూపరాగము
రాచికొనుట ప్రసిద్ధము. అట్లే మన్మథుఁడు చేసెనని యర్థము. ఈపద్యమునఁ
కొన్నింటి ప్రతులలో "వేగనలు కైకొనిచూచె విభుండు కేతకిన్" అని పాఠము
కానవచ్చుచున్నను 'ప్రసూనధన్వా శరసాత్కరోతి మామితి క్రుధా క్రుశ్యత తేన
కైతకమ్' అని సంస్కృతముననున్న "క్రుధా" యనుపదము ననుసరించి "కనలు
కైకొని" అనిదిద్దుఁబాటు చేయఁబడెను.

తా. మన్మథుఁడు తనపూవింటినుండి కాఱుచున్న మకరందముచేఁ జేయి
తడిసి ధనువుపట్టుకొనుటకు వలనుపడనప్పుడు మొగలిచెట్టా! నీ రేకులయందున్న
ధూళిని జేతికి రాచుకొని మావంటివారల జయించుచున్నాఁడు; లేనిచోఁ జేతి
నుండి ధనువుజాఱిపోవుచుండ నెట్లుమమ్ముఁ గొట్టఁగలఁడు? ఇంతకుఁ గారణమ
వునీవే! అని నలుండు మొగలిచెట్టును గోపముతోఁ జూచెను.

మ. దమయంతీ స్తనకుంభవిభ్రమముఁ బొందంగోరుటన్ ధూ
మవా। నముఁ గావించు చధోముఖంబు లగునానాకుంభ
ముల్ వ్రాలె ధూ। పములన్ దోహదమాచరింపఁగఁగడుం
బక్వంబులై యున్నదా। డిమముల్ సూచి నృపాలకుండు మదిఁ
బాటించెన్ మహౌత్సుక్యమున్. (82) 94

టీ. నృపాలుండు=నలమహారాజు, దమయంతీస్తనకుంభవిభ్రమమున్ =
దమయంతీ=దమయంతియొక్క, స్తనకుంభ = కుంభములవంటి స్తనములయొ
క్క, విభ్రమమున్=విలాసమును, పొందన్=పొందుటకు, గోరుటన్= ఆపే

క్షించుటంబట్టి, ధూమపానముల్, కావించుచున్ = చేయుచు, అధోముఖం బులు=క్రిందయినముఖములుగలవి, అగునానాకుంభములు్-అగు=అయినట్టి, నానాకుంభముల్ పోలెన్ = పలురకములయినకుండలవలెనే, అనఁగా - (యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చదుస్తరం । తత్సర్వంతపసాప్రాప్యం ॥ అనునట్టులన్ని కార్యంబులను దపంబుచే సాధించుకొనవచ్చును గాన ఫలార్థులు ధూమపానాదులనొనరించుచు నగ్న్యాదులనడుమఁదపంబాచరించుచుందురు.అట్లె కుంభములు దమయంతి కుచస్థులమౌన్నత్యము పొందఁదలంచి యధోముఖంబులై ధూమపానము నొనర్చుచున్న వని భావము. లోకమునం దున్నతపద ప్రాప్తికొఱకు నధోముఖముగానుండి ధూమపానాదులచేఁ దపముసలుపుటసుప్రసిద్ధము.ధూపములన్ =ధూపములచేత,దోహదము=తరుగుల్మాదులకకాలమునందు ఫలాదులనుబుట్టించునట్టి క్రియను,దోహదమనఁగా॥ని॥తరుగుల్మలతాదీనామకాలేకుశలైఃకృతం।పుష్పాద్యుత్పాదకం ద్రవ్యందోహదంస్యాత్తుతత్క్రియా॥అని శబ్దార్ణవము. అనఁగా దాడిమచెట్లకు ధూపములువేసినచోఫలించునని ప్రసిద్ధి.ఇంక దాడిమీవృక్షము ఫలించుటకు దోహద మేమనఁగా, శ్లో॥ మేషామిషాంబు సంసేకస్తత్కేశామిషధూపనమ్।స్థేయా నయం ప్రయోగోహి దాడిమీఫలవృద్ధయే॥ మత్స్యాజ్యత్రిఫలాలేపై ర్మాంసైరాజావికోద్భవైః।లేపితా ధూపితాసూతేఫలం తాళీవదాడిమీ ॥ అవిక్షీరేణసంసిక్తా ధూపితాతస్యలోమభిః । ఫలానిదాడిమీసూతే సుబహూని పృథూనిచ ॥ అనిచెప్పఁబడియున్నది. ఆచరింపఁగన్ = చేయఁగా, కడున్ =మిక్కిలి, పక్వంబులై =పండినవై, ఉన్నదాడిమములన్ = ఉన్నట్టిదాడిమపండ్లను, అనఁగా దమయంతి కుచములమౌన్నత్యము పొందఁగోరి ధూమపానముచేయుచుఁజెట్టుకొమ్మలఁ దలక్రిందులై వ్రేలుచు తపముచేయుచుటంబులవలె దోహదముకొఱకు ధూపధూమము వేయంబడి తలక్రిందుగా వ్రేలుచున్న దాడిమీఫలములను జూచెనని యర్థము. చూచి = కనుఁగొని, మదిన్ = మనస్సునందు, మహౌత్సుక్యమున్ = గొప్పవేడుకను, పాటించెన్ =పొందెను. ఇట దాడిమీఫలములను జూచి మిగుల వేడుక చెందెనని చెప్పుటలో సారస్యమేమనఁగా, లోకములోఁదనకుఁ బ్రియమయినవస్తువులతో సమానములయిన వస్తువులనుజూచుటచేఁ బ్రియవస్తువులనుస్మరించుకొనుటయు,

వానిని దనప్రియవస్తువులను జూచినట్లే వేడుకతోఁ జూచుటయు, సుప్రసిద్ధము. అట్లే నలుఁడు దనకుఁబ్రియను లయినదమయంతికుచములకు సదృశములయిన దాడిమములను జూచి తెత్కుచముల స్మరించుకొనుచు వేడ్కతోఁ జూచెనని స్ఫురించుచున్నది.

తా. దమయంతి కుచములతో సాటిఁజెందఁగోరి ధూమపానము చేయుచు నధోముఖములై తపమాచరించుచున్న కుంభములోయనునట్లు, ధూపములనెడి దోహదములచే మిక్కిలిపండియున్న దాడిమపండ్లను నలుఁడు చూచి మదియం దెంతయుసంతసించెను. అలంకారము - ఉత్ప్రేక్ష.

తే. మన్మథుం డేయుకింశుక మార్గణములు
చన్నుఁగవ నాటుటయుఁ బాంథసతియుఁబోలెఁ
బాఱుదెంచి కీరంబులు పండ్లు గఱవ
వడఁకు దాడిమిఁ జూచె భూవరుఁడు వేడ్క. 95

టీ. భూవరుఁడు=నలుఁడు, మన్మథుండు = మారుఁడు, ఏయుకింశుకమార్గణములు- ఏయు=ప్రయోగించెడి, కింశుకమార్గణములు = మోదుగుపూవులనెడి బాణములు, చన్నుఁగవన్ = కుచయుగమునందు, నాటుటయున్=నాటుకొనుటంబట్టి, పాంథసతియుఁబోలెన్ =పథిక స్త్రీవలెనె, పాఱుదెంచి=పర్విడివచ్చి, కీరంబులు=చిలుకలు, పండ్లు=దాడిమపండ్లను, కఱవన్ = కొఱుకఁగా, వడఁకుదాడిమిన్ = కంపించుచున్నదానిమ్మచెట్టును, వేడ్కన్ = వేడుకచే, చూచెన్ =కనుఁగొనెను. అనఁగాఁ జిలుకలువచ్చి దాడిమకొమ్మలపైఁగూర్చుండి పండ్లనుగొఱికి తినుచుండఁగా నా దాడిమచెట్టు కదలుచుండె. అప్పుడది మదనబాణములు చనుఁగవయందు నాటుటచే సహింపలేక వణఁకుచున్న పథిక స్త్రీవలెఁగానవచ్చుచుండ దానిని నలుఁడు వేడ్కతోఁ జూచెననిభావము. ఇందుకింశుకమనిచెప్పుట చిలుకముక్కుతో సామ్యమందుట కని తెలియందగినది-ఇట పాంథసతికిని దాడిమికిని, జన్నుఁగవకును దాడిమీఫలములకును కీరతుండములకును కింశుకమార్గణములకును సామ్యమూహ్యము.

తా. మన్మథుఁడు మోదుగుపూవనెడి బాణములచేఁ బాలిండ్లయందుఁగొట్టఁగా భయముచే వణఁకుచున్న పథిక స్త్రీవలెను పరుగెత్తుకువచ్చి చిలుకముక్కులతో

పండ్లనుబొడుచుచుండగాఁ గంపించుచున్న దాడిమవృక్షములను నలుండు మిగుల వేడ్కతోఁజూచెను.

వ. మఱియు మందానిల[1]పరిస్పందంబునం గందళితంబులై మకరందబిందునిష్యందంబులు [2]చిందించుగురివెంద పూఁబందిరులును నలరాచరాచవారికి వనదేవత యొసర్చునీరాజనప్రదీపాంకురంబులుంబోని కోమలకోరకంబులు గరంబు సొంపారుసం పెంగలును, మదనచాపవిముక్తంబులై మొదలం గ్రోలిన భవశరీరభస్మాంగిరాగంబు పరాగవ్యాజంబున వెడలం గ్రాయుచున్నసురపొన్నలును రోలంబనికురుంబంబులకుఁ బానగోష్ఠీస్థానంబు లగువికస్వరస్థలకమలినీకదంబంబులును గలకంఠకంఠహుంకారంబులం బాంథులకు భయంబు సంపాదింపం జాలుక్రొమ్మావిమోకచాలును ధూమకేతుమండలంబునుంబోలె విరహిజనులగుండియ[3]లవియించుచుఁ జంచరీకపరంపరా[4]శేఖరంబులై సొంపారుచాంపేయంబులును, వలయాకారంబునం బరిభ్రమించుభ్రమరంబులసంగతిం గేసరరేణువిస్ఫులింగంబు లెగయ శాణోత్తేజనప్రకారంబు నంగీకరించు ననంగునకుం బ్రధానబాణంబు లగునారంగం

---

1. "మందానిలపరిష్వంగంబునన్" అని వ్రాఁతప్రతిపాఠము సముచితముగానున్నది. ఇచ్చటికు సంస్కృతమున "నవాలతాగంధవహేనచుంబితా" అని మందానిలముచే స్పృశింపఁబడినదని చెప్పఁబడినది. కాన నిందును దదనుగుణముగ పరిష్వంగపద మేయుక్తముగానున్నది.

2. "సంధించు" అని పాఠాంతరము.

3. అవియించుచుఁ జరించు చంచరీక' అనిపాఠాంతరము.

4. "శేఖరంబులై" యనిపాఠాంతరము.

బులును, మృదులపవమానసంపాతకంపమాన కిసలయ [1]కంటకక్షతంబులై మదనముద్రాభిముద్రితంబు లగు వారాంగనాజనంబులవక్షోజపాలిండ్లకుం జుట్టంబులై తోరంబు లగుమారేడుపండ్లును, నిఖిలయువద్వయీచిత్తని మజ్జనోచితంబు లగుసజ్జకపుంబూమొగ్గలును ప్రవాళ గర్భ గహ్వరంబులు వహియించుచు నించువిలుకానితూణీరంబులకుం బోల్పంబట్టైనకలిగొట్టుపాదలును, నొండొండ చంద్ర ఖండంబులు వెడలం గ్రక్కురాహుమండలంబునుంబోలెం గుటిలసితకుట్మలంబులు వ్రేలం గాఢాంధకారంబునం గారు కొనుచుమద్రుమంబులును, గనుంగొనుచుం బోషితరాజకీరంబులు కైవారంబులు సేయం[2]బ్రోదికోయిలలు మంగళ గానంబొనర్పం గొలంకులకెలంకులను[3]బావులక్రేవలను నికుంజక్రోడంబులనీడలను విశ్రమించుచుం[4]బ్రసవమృదు గంధ పశ్యతోహారంబు లగుగంధవాహంబులరాకలు విహారశ్రాంతి నపనయింప వికటఘటీయంత్రసలిలధారా సరణిమార్గంబులం డెక్కెంబునకుం జక్కనిగండుమీను వెదకుమీనకేతనుండునుంబోలె నుద్యానంబెల్లం గ్రుమ్మరి యగ్రభాగంబున. 96

టీ. మఱియు,మందానిల పరిస్పందంబునన్-మందానిల=మెల్లని గాడ్పులయొక్క, పరిస్పందంబునన్=ప్రసారము చేత,కందళితంబులు,ఐ=మొలక లెత్తినవై, మకరంద బిందు నిష్యందమ్ములు- మకరంద=మధురసములయొక్క, బిందు=బొ

1. " కంటకాగ్రక్షతంబులని " పాఠాంతరము.

2. "ప్రోదిరాయంచలమంగళగానంబులు" అని పాఠాంతరము

3. " బావులక్రేవను" అనునది కొన్నిప్రతులందు లేదు.

4. "ప్రసవమదగంధ" అనిపాఠాంతరము.

ట్లయొక్క, నిష్యందంబులు = స్రావములను, చిందించు గురివెంద పూపందిరు లును-చిందించు=ఒలికించునట్టి, గురివెంద పూపందిరులును=గురివెంద పూవులచే నిండియున్న పందిరులును, వలరాచరాచవారికిన్ = మన్మథుఁడను రాజునకు, వన దేవత=వనలక్ష్మి, ఒనర్చు... బోని-ఒనర్చు=చేయుచున్న, నీరాజనప్రదీప=నీరాజన మిచ్చుట కొఱకయిన దీపములయొక్క, అంకురంబులుం బోని=కొనలువలెనే యున్న, కోమల కోరకంబులు=మృదువయిన మొగ్గలు, కరంబు=మిక్కిలి, సొం పారు సంపెఁగలును=ప్రకాశించుచున్న సంపెంగచెట్లును, అనఁగాఁ బసుపురం గుగల సంపెంగమొగ్గలు మన్మథునకు వనదేవత యిచ్చెడి నీరాజనదీపములవలెఁ బ్రకాశించుచున్నవని భావము. మదనచాప విముక్తంబులై=మన్మథునియొక్క వింటినుండి విడువఁబడినవై, మొదలన్ =ముందుగా, క్రోలిన... రాగంబు-క్రోలి న=పానము చేసిన, భవ=ఈశ్వరునియొక్క, శరీర=దేహమందున్న, భస్మ=బూ డిదయనెడి, అంగరాగంబు=గంధము, పరాగవ్యాజంబునన్ = పరాగమనెడిమి షచే, వెడలన్ గ్రాయుచున్న=వెడలఁ గ్రక్కుచున్న, సురపొన్నలును=సురి పొన్నపూవులను, అనఁగా సురపొన్నపూవులనడుమనుండు పరాగము పూర్వ మవి మన్మథునికి బాణంబులై యతనిచేఁ బ్రయోగింపఁబడి నప్పుడీశ్వరశరీరసం పర్కంబువలనఁ దమకు లభించినబూడిదయో యనునట్లు ప్రకాశించుచున్నవని భావము. మఱియు నీశ్వరుని శరీరమందున్న భస్మాంగరాగము సురపొన్నల క ఱ్ఱైననుటచే నీశ్వరుఁడు నిర్జింపఁబడినట్లు తెలియవచ్చుచున్నది. అట్టి యీశ్వ రునే జయించి తదీయాంగరాగంబు నాకర్షించినప్పుడు, తక్కిన సామాన్య వియోగులను జయించుట యేమాత్రపు కార్యము? ఇందుచే సురపొన్నలకు లోకము నిర్జింపఁదగినసామర్థ్యము కలదని స్ఫురించుచున్నది. కాన సురపొన్న లు వియోగి యయినవలునకుఁ గామోద్దీపకంబు లయినట్లు తెల్లమగుచున్నది. రోలంబనికురుంబంబులకున్ = తుమ్మెద సమూహములకు, పానగోష్ఠీ స్థానంబులు- పానగోష్ఠీ=త్రావుటయనెడి ప్రసంగమునకు, స్థానంబులు=నిలయంబులు, అగు... కదంబంబులును-అగు=అయినట్టి, వికస్వర= వికసించినట్టి, స్థలకమలినీ=మెట్ట దామరతీఁగెలయొక్క, కందబంబులును=సమూహంబులును, అనఁగాఁదుమ్మెదలు మెట్టతామరలను స్థానంబులుగఁ జేసికొని పుష్పరసంబులను బానపాత్ర

ములుగాఁజేసికొని యందున్నమకరందంబును ద్రావుచున్నవని భావము.మఱియు నిందు "వికస్వర" అని చెప్పటచేఁ బుష్పంబులు బాగుగ వికసించి యుండుట చే నందున్న తేనెను ద్రావుట సులభమౌట సూచితమగుచున్నది.కలకంఠ కంఠహుంకారంబులన్ - కలకంఠ=కోకిలలయొక్క, కంఠ=ఎలుంగులనెడి, హుంకారంబులన్=జడిపింపులచేత,పాంథులకున్=పథికజనులకు, భయంబు, సంపాదింపన్=కలిగించుటకు, చాలుక్రొమ్మావిమోక చాలును - చాలు=సమర్థమయిన, క్రొమ్మావి=లేఁతమామిడి చెట్లయొక్క, మోక=అంకురములయొక్క,చాలును=పంక్తియు,అనఁగా లేఁతమామిడిమొక్కలు కోయిలలకు నివాసభూతంబులై వానికంఠధ్వనులనెడి యెలుంగులచేఁ బథికజనమును జడిపించి భయపెట్టుచున్నవనుట, మఱియు నతిమనోహరంబుగఁ గూయుచు కోయిలగుంపులతో నిండి చక్కఁగఁ జిగిర్చియున్న లేఁతమామిడిమొక్కలుః వియోగులకుఁ గామోద్దీపకంబులై మిగుల భయంబును గలిగించుచున్నవని భావము. ధూమకేతుమండలంబుంబోలెన్=తోఁకచుక్కల సమూహమువలెను, విరహిజనుల గుండియలు=వియోగులయిన జనులయొక్క హృదయములను, అవియించుచున్=బ్రద్దలుచేయుచు, చంచరీకపరంపరా శిఖరంబులై - చంచరీక పరంపరా=తుమ్మెదల పంక్తులు, శేఖరంబులై=అగ్రములందు కలవయి,సొంపారు=ప్రకాశించుచున్న,చాంపేయఃబులును=నాగకేసరపుష్పాలును, అనఁగాఁ దుమ్మెదపంక్తులు కొనలయందుఁగల నాగకేసర పుష్పములు లోకముల కుపద్రవము కలిగించు తోఁకచుక్కలవలె వియోగిజనుల కుపద్రవము కలిగించుచున్నవని యర్థము.మఱియుఁ దుమ్మెదలతోఁ గూడిన నాగకేసరములు మిక్కిలి సౌందర్యవంతంబులై వియోగిజనులకుఁ గామోద్దీపకఁబులగుటచే భయప్రదము లగుచున్నవని భావము. వలయాకారంబునన్=వర్తులముగా, పరిభ్రమించుచు=తిరుగుచున్న, భ్రమరఁబుల=తుమ్మెదలయొక్క, సంగతిన్=సంపర్కముచే, కేసర రేణు విస్ఫులింగంబు-కేసర=కింజల్కములయందున్న, రేణు=పరాగమనెడి, విస్ఫులింగంబులు=అగ్గి కణములు, ఎగయన్=బయలు వెడలగా, శాణోత్తేజన ప్రకారంబు-శాణ+ఉత్తేజన=సానఁబట్టుటయొక్క, ప్రకారంబున్=విధమును, అంగీకరించుననంగునకున్=ఇష్టపడెడి మన్మథునికి, ప్రధానబాణఁబులు, అగు నారంగంబులు=అయినట్టి నారంజపుష్పములు

ను, అనఁగాఁ బూఁదేనె ద్రావుటకైవచ్చి తుమ్మెదలు పుష్పంబుల చుట్టు తిరుగుచు నొక్కొక్కమాఱు పూవులం దాఁకఁగా వాని కేసరములందున్న పరాగంబుపై కెగయుచుండె. అప్పుడు నారంగ కుసుమములు భ్రమర సంపర్కముచేఁ బైకెగయుచున్న పరాగ మగ్నికణములవలె వ్యాపింపఁ దుమ్మెదలు వలయముగాఁదిరుగుటలనెడి సానపై మన్మథుఁడు సానఁబట్టుకొనుచున్న బాణంబులవలెఁ బ్రకాశించుచున్నవని భావము. మృదుల... ప్రక్షతంబులై - మృదుల= మెల్లని, పవమాన=వాయువుయొక్క, సంపాత=ప్రసారముచే, కంపమాన=చలించుచున్న, కిసలయ=చిగుళ్లయందున్న, కంటక=ముండ్లచే, ప్రక్షతంబులై - చీల్పఁబడినవయి, మదన ముద్రాభి ముద్రితంబులు=మన్మథునియొక్క ముద్రచే ముద్రితములు - అనఁగా నఖక్షతములచే నొప్పుచున్నవని భావము. అగు . పాలిండ్లకుఁ -అగు= అయిన, వారాంగనాజనంబుల=వెలయాండ్రయొక్క, వర్తులవ పాలిండ్లకుఁ = వర్తులమయిన గుబ్బలకు, చుట్టంబులై, తోరంబులు=బలిసినవి. అగుమారేడుపండ్లును-అనఁగా మలయమారుతముచేఁ జలించుచున్న చిగుళ్లయందున్న ముండ్లచే గంట్లు పఱుపఁబడిన మారేడుపండ్లు విటులు నఖక్షతములుచేయఁగాఁ బొలుచు వెలయాండ్ర గుబ్బచన్నులవలెఁ బ్రకాశించుచున్నవని భావము. ఉపమేయమందు చిగుళ్లను వ్రేళ్లుగాను, కంటకములను గోళ్లుగాను గ్రహించునది. మఱియువర్తులత్వమందును క్షతములుకలిగియుండుటలోను మారేడుపండ్లువారాంగనాకుచసాదృశ్యంబు కలవని తెలియవచ్చుచున్నది నిఖిల... చితంబులు నిఖిల=సమస్తమయిన, యువద్వయీ = స్త్రీపురుషులయొక్క, చిత్త = మనస్సులను, నిమజ్జన=మోహసముద్రములో ముంచుటకు, ఉచితంబులు=తగినవి, అగుసజ్జకపుఁ బూమొగ్గలును=అయినట్టి మనోహరములగు పూవులమొగ్గలను, ప్రవాళగర్భగహ్వరంబులు-ప్రవాళ=చిగుళ్లసంబంధమయిన, గర్భగహ్వరంబులు=లోపలిగుహలను, వహియించుచుఁ =ధరించుచు, ఇంచు విలుకాని తూణీరంబులకుఁ = మన్మథునియొక్క యమ్ముల పొదులకు, పోల్పఁ =పోల్చుటకు, పట్టయిన=స్థానములయిన, కలిగొట్టు పొదలును=పాటలీ వృక్షములయొక్క పొదలును. అనఁగాఁ జూపఱ మనంబుల నాకర్షింపఁజాలిన సౌందర్యము గలిగి వికసించుచున్న మొగ్గలచేతను, జగుళ్ల సంబంధంబులగు లోపలి గుహలచేతను బ్రకాశించుచు

న్న పాటలీ వృక్షంబుల పొదలు, లోకములోని జవ్వనుల మానసంబులకు మోహం బు గలిగించుచున్న మన్మథుబాణంబులచే నిండియున్న యమ్ములపొదులవలెఁ బ్రకాశించుచున్నవని భావము. పొదులలో వివిధంబులగు వస్తువుల నుంచుకొనుటకు గదుల నేర్పఱుచుట ప్రసిద్ధము. ఇటఁ బాటలీ వృక్షముల పొదలు మదనుని యమ్ములపొదివలె నున్నదని చెప్పుటచే ప్రవాళగవ్వారంబులు లోపలి గదుల వలెను, వికసించుచున్న చక్కని మొగ్గలు బాణములవలెను, నున్నవని గ్రహింపఁ దగినది. ఒండొండక = క్రమక్రమముగా, చంద్రఖండంబులు = చంద్రశకలములను, వెడలక + క్రక్కు = ఉమియుచున్న. రాహుమండలంబునుంబోలెక = రాహువు మండలంబువలెను, కుటిల సిత కుట్మలంబులు-కుటిల=వక్రములయిన, సిత=తెల్లని, కుట్మలంబులు= మొగ్గలు, వ్రేలక = వ్రేలాడుచుండఁగా, గాఢాంధకారం బుగక = పెనుఁ జీఁకటిచే, కారుకొను=నల్లఁబాఱుచున్న, మహీద్రుమంబులును =నల్లయవిసిచెట్లును, అనఁగా నల్లనిపత్రములు గలవౌటచేఁ జీఁకట్లను వ్యాపింపఁజేయుచున్న నల్ల యవిసిచెట్లు, తమయందుఁ దెల్లనివియు, వంకరగా నున్నవియునగు మొగ్గలు వ్రేలాడుచుండుటచేఁ జంద్ర ఖండంబుల మ్రింగి యెక్కువగుటచేఁ గ్రమక్రమముగాఁ బైకుమియుచున్న రాహుమండలంబులవలె నున్నవని భావము. ఇట నల్లయవిసి రాహుమండలముతోను వంకరగా నున్న తెల్లని మొగ్గలు చంద్రఖండములతోను, బోల్పఁబడినవి. ఇందు క్రమక్రమముగా అని చెప్పుటచే చెట్టునుండి మొగ్గలు వ్రేలాడుచున్నవి గనుక నవి రాహువునోటినుండి క్రమముగా జాఱుచున్న చంద్రఖండంబులవలె నున్నవను సాదృశ్యము తేటపడుచున్నది. కనుఁగొనుచు, పోషితరాజకీరంబులు= పెంపుడు చిలుకలు, కైవారంబులు చేయక = స్తోత్రములు చేయుచుండఁగా, ప్రోది కోయిలలు= పెంపుడు కోయిలలు, మంగళగానంబు=మంగళ ప్రదమయిన సంగీతము, ఒనర్పక = చేయుచుండఁగా, కొలంకుల కెలంకులను=తటాక ప్రాంతములయందును, బావుల క్రేవలను=బావుల ప్రక్కలయందును, నికుంజ క్రోడంబుల నీడలను-నికుంజ=పొదరిండ్లయొక్క, క్రోడంబుల నీడలను=ముందరి భాగములందున్న నీడలయందును, విశ్రమించుచుక = ఆయాసము నుబోఁగొట్టుకొనుచు, ప్రసవ—హారంబులు - ప్రసవ=పూవులందున్న, మృదు=మనోహరమయిన, గంధ=పరిమళమును, పశ్య

తోహారంబులు=చూచుచుండగనె దొంగిలించెడివి, అగు గంధవాహంబుల రాకలు=అయినట్టి మారుతములయొక్క ప్రసారములు, విహారశ్రాంతిన్=సంచారము వలనఁగలిగెడి యాయాసమును, అపనయింపన్=పోఁగొట్టుచుండఁగా, వికట... మార్గంబులన్-వికట=గొప్పవయిన, ఘటీయంత్ర = ఏతాములవలనఁ జిమ్మఁబడు, సలిలధారా=నీటి ప్రవాహములయొక్క, సరణి=కాలువలయొక్క, మార్గంబులన్=త్రోవలయందు, పెక్కంబునఁపన్=ధ్వజమునను, చక్కనిగండుమీను=సొగసైన పెద్దచేఁపను, వెదకు మీనకేతుండునుం బోలె=వెదుకుచున్న మన్మథుఁడువలెనె, ఉద్యానంబు ఎల్లన్=పూవుల దోఁటయంతయు, క్రమ్మరి=తిరిగి, అగ్రభాగంబునన్=తనయెదుటి ప్రదేశమందు, పై పద్యముతో నన్వయము.

సీ. శేషపుచ్ఛచ్ఛాయఁ జెలువారు *బిసము లం
తర్మగ్నసురదంతి దంతములుగ
నిండార విరిసినపుండరీకశ్రేణి
†యామినీరమణ రేఖాంకురములుగఁ
బ్రతిబింబితోపాంత బహుళపాదపములు
గర్భస్థశైలసంఘములు గాఁగ
నేకదేశంబున నిందీవరంబులు
గరళకూటమయూఖ ఖండములుగ.

---

* "బిసములు తన్మగ్న సురదంతి దంతములుగ" అని పాఠాంతరము.

† "యామినీరమణ రేఖాళిగాఁగ" అని పాఠాంతరము. ఇది మిగుల నసమంజసముగా నున్నది. ఏమన, సముద్రమందు చంద్రరేఖ యొక్కటియేయున్నది కనుక, పుండరీకశ్రేణి చంద్రలేఖవలె నున్నదనిన యుపమానము సరిపడుచున్నది. ఇట్లుకాక పుండరీకశ్రేణిఁ జంద్రలేఖాళితోఁ బోల్చి చెప్పినచో పుండరీకశ్రేణిని జంద్రలేఖతోఁ బోల్చుచున్నాము కాని పుండరీకములను బోల్పలేదు. కావున నొకటైన పుండరీకశ్రేణి చంద్రలేఖవలె నున్నదని చెప్పుట యుక్తము కాని చంద్రలేఖల పంక్తివలె నున్నదనుట యుక్తముకాదు. అట్లు చెప్పినచో మొదట మఱియొక సమూహవాచకపద ముండవలెను. మఱియు సముద్రమునందుఁ బెక్కు చంద్రరేఖ లుండుట యనుపపన్నము.

తే గీ. బాలశైవాలవల్లరీజాలకంబు
బాడబానల భవధూమపంక్తిగాఁగ
వారిరాశియుఁ బోలె గంభీరమైన
ఘన తటాకంబుఁ గాంచె నక్జనవిభుండు. 97

టీ. శేషపుచ్ఛచ్ఛాయన్ - శేష=అనంతునియొక్క, పుచ్ఛ=తోఁకయం దున్న, ఛాయన్=కాంతిచే, చెలువారు బిసములు=ఒప్పుచున్న తామరతూం డ్లు-అనఁగా మిక్కిలి తెల్లగానున్న తామరతూండ్లు, అంతర్మగ్న సురదంతి దంతములుగన్-అంతర్=ఆసముద్రమందు, మగ్న=మునిఁగిన, సురదంతి=ఐరా వతముయొక్క,దంతములుగన్=దంతము లగుచుండఁగా-అనఁగా ననంతునితోఁ కవలె మిక్కిలితెల్లనైన తామరతూండ్లు సముద్రమందే యుద్భవించి యందుఁ దిరుగులాడుచున్న యైరావతముయొక్క దంతములవలె నున్నవని భావము. ఇం దైరావతము దంతములఁబోలిన తామరతూండ్లు తటాకమందుండుటచే నీసామా న్యధర్మమునుబట్టి తటాకమునకు సముద్రమునకు సామ్యమున్నదని యెఱుంగునది. నిండారన్=నిండుగా, విరిసిన పుండరీకశ్రేణి-విరిసిన=వికసించినట్టి, పుండరీక శ్రేణి=తెల్లదామరలయొక్క పంక్తి,యామినీరమణ రేఖాంకురముగన్-యామి నీరమణ=రాత్రి కధిపతియొక్క, (అనఁగా చంద్రుఁడనుట) రేఖా=రేఖయొక్క, అంకురముగన్= మొలకయగుచుండఁగా (అనఁగాఁ జంద్రుఁడు సముద్రమందుఁ బుట్టినవాఁడగుట ప్రసిద్ధి; చంద్రరేఖతోఁ బోలిన తెల్లదామరపూపంక్తి తటా కమందున్నదికాన నీతటాకము సముద్రమును బోలుచున్నదని భావము). ఇందు "శ్రేణి" అనఁగా వరుసగానున్న పంక్తియని యర్థము- కావునఁ జంద్రరేఖాసా మ్యము సంగతమగుచున్నది. ప్రతి... పాదపంబులు - ప్రతిబింబిత=ప్రతిఫలిం చిన,ఉపాంత=ప్రాంతములయందున్న, బహుళ=అనేకములయిన, పాదపములు =చెట్లు, గర్భ... కాఁగన్ - గర్భస్థ=ఉదరమందున్న, శైలసంఘములు=పర్వత సమూహములు, కాఁగన్=అగుచుండఁగా - అనఁగా మైనాకపర్వతము సము ద్రముననుండునని పురాణప్రసిద్ధి. మఱియు సముద్రములోఁ బెక్కులు పర్వత ములుండునని ప్రసిద్ధి. ... నీటిలోఁ

బ్రతిఫలింపగా నవి పర్వతములను బోలుచున్నవని భావము. ఏకదేశంబునన్ = ఒకప్రదేశమునందు, ఇందీవరంబులు=నల్లఁగలువలు, గరళ...ఖండములుగన్ - గరళ కూట=హాలాహలముయొక్క, మయూఖ=కిరణములయొక్క, ఖండములు గన్=ముక్కలుకాఁగా-అనఁగాఁ దటాకములో నొకమూలను వికసించియున్న నల్లఁగలువలు సముద్రమునందుఁ బొడమిన హాలాహలముయొక్క కాంతి మండలములవలె నొప్పుచున్నవని భావము, బాల...జాలకంబు-బాల=లేఁతయైన,శైవాలవల్లరీ=నాఁచుతీవెలయొక్క, జాలకంబు=సమూహము, బాడబానల...పంక్తిగాఁగన్ -బాడబానల=బడబాగ్నిహోత్రమువలన, భవ=పుట్టిన, ధూమపంక్తిగాఁగన్ =పొగలతెగలుకాఁగా-అనఁగాఁ జెఱువులోని'నాఁచుతీఁగెలసమూహములు సముద్రములోని బడబాగ్నియొక్క పొగలతెగలవలె నున్నవని భావము. వారిరాశియుబోలెన్ =సముద్రమువలెనె, గంభీరము=లోఁతుగలది, ఐనఘనతటాకంబున్ =అయినట్టి పెద్దచెఱువును, అజ్జనవిభుండు=ఆనలుఁడు, కాంచెన్ -చూచెను. అనఁగా వెనుకఁజెప్పిన సామాన్యధర్మంబులఁబట్టి సముద్రముతోఁదులచేందియున్న తటాకమును నలుఁడు చూచెనని భావము.

తా. తటాకమునందున్న తెల్లని తామరతూండ్లు ఐరావతముయొక్క దంతములవలెనుండగాఁ, జక్కఁగవికసించిన తెల్లఁదామరపూవులపంక్తి చంద్రలేఖవలె నలరుచుండఁగా, నాతటాకప్రాంతములయందున్న చెట్లందు ప్రతిఫలించగా, నవి సముద్రమధ్యమందున్న పర్వతములను బోలుచుండగా, నొకప్రదేశమందు వికసించిన నల్లగలువల మొత్తములు హాలాహలముయొక్క కిరణముల ఖండములవలె నుండఁగా, చక్కఁగబలిసిననాఁచు బడబానలము వలనఁ గలిగిన పొగగుంపులవలె నుండఁగా, సముద్రమువలె నొప్పుచు లోఁతుగలదైయున్న గొప్పతటాకమును నలమహారాజు పొడఁగాంచెను.

వ. కాంచి యొక్కింతదడవు మనంబునం గొనియాడుచుం దిమి తిమింగిల ఘులీకులీరమత్స్యకచ్ఛప మకరనికర సంచారతరళ* తరంగమాలికాడోలాధిరోహలీలావ్యాలోలకలహంస సంస

* "తరంగమాలికా డోలికా" యని పాఠాంతరము.

దాలాపకోలాహల ముఖరితదిశాభాగం బైన యమ్మహాతటా
కంబుతీరప్రదేశంబున. 98

టీ. కాంచి=చూచి, ఒక్కెతెదడవు=కొంతసేపు, మనంబునన్=మనస్సునందు, కొనియాడుచు=పొగడుచు, తిమి...దిశాభాగంబు - తిమి=నూఱామడపొడవుగల చేఁపలు, తిమింగిల=వానిని మ్రింగునట్టి చేఁపలు, ఝుళీ=ఆఁడుతాఁబేళ్లు, కుళీర=ఎండ్రకాయలు, మత్స్య=చేఁపలు, కచ్ఛప=తాఁబేళ్లు, మకర=మొసళ్లు, వీనియొక్క, నికర=సమూహములయొక్క, సంచార=విహారములచేత, తరళ=చలించుచున్న, తరంగ=అలలయొక్క, మాలికా=పంక్తులనెడి, డోలా=ఉయ్యెలలను, అధిరోహ=అధిరోహించుటయనెడి, లీలా=విలాసములయందు, వ్యాలోల=మిక్కలి యాసక్తిగల, కలహంస=మధురముగాఁ బలికెడిహంసములయొక్క, సంసద్=సమూహముయొక్క, ఆలాప=మధురధ్వనులయొక్క, కోలాహల=కలకలముచేత, ముఖరిత=ప్రతిధ్వనులిచ్చుచున్న, దిశాభాగంబు=దిక్కులుకలది,ఐన యమ్మహాతటాకంబు తీరప్రదేశంబునన్ - అయిన=అయినట్టి, అమ్మహాతటాకంబు=ఆపెద్దచెఱువుయొక్క, తీరప్రదేశంబునన్=ఒడ్డునందు... అ: పైపద్యముతో నన్వయము.

సీ. విలసితజంబాలకీపులినభాగమున ను
  ద్దండపద్మాతపత్రంబునీడఁ
గమలకాండకఠోరకీకంటకాంకురపంక్తి
  [1]నొయ్యనఁ గంధరంబొరసికొనుచు
నొంటికాలనె నిల్చి కీయూర్మిమారుతములఁ
  జిగురుటెక్కలరేకు లెగయుచుండ
విశదమై [2]పక్షతిద్వితయంబు విడజాఱఁ
  జఁచు లోకించు కాకకుంచితముగ

1. ''ఒయ్యన కంధరంబొరసికొనఁగ'' యని పాఠాంతరము.

2. "పక్షతిద్వితయంబు లెడఁజాఱ'' అను నచ్చుప్రతిపాఠముకంటె నిది యే యుక్తము గానున్నది. ఏమనఁగా బక్షతిద్వితయంబని యేకవచనమే యుచితమైనది కాని బహువచనము యుక్తము కాదు.

తే. వరుణరాజున కిడినచామరము వ్రాలెఁ
బొడువు మిగిలిన వెలిదమ్మిపువ్వుఁబోలె
నిబిడనిద్రాభిముద్రితనేత్ర మైన
రాజహంసంబుఁ గాంచె నా రాజసుతుఁడు. 99

టీ. విలసిత...భాగములన్ -విలసిత=ఒప్పుచున్న, జంబాల=బురదగల, పులినభాగములన్=ఇసుకదిన్నెయందు, ఉద్దండ పద్మాతపత్రంబునీడన్ - ఉద్దండ =గొప్పదయిన, పద్మాతపత్ర=గొడుగువంటి పద్మముయొక్క, నీడన్=నీడయందు, కమల...పంక్తిన్ - కమలకాఁడ = తామరకాడలయందున్న, కఠోర=కఠినములయిన, కంటకాంకురపంక్తిన్=ముండ్లమొలక సమూహమునందు, ఒయ్యన్=మెల్లగా, కంధరంబు=మెడను, ఒరసికొనుచు=చేర్చుకొనుచు, ఇటుఁ గఠోరమయిన ముండ్లు తనకొత్తుచున్నను నిద్రించుచున్నదని చెప్పుటచే,నిద్రాతిశయము సూచితమగుచున్నది. ఒంటికాలనె=ఒక్కపాదముతోనె, నిలిచి, ఊర్మిమారుతములన్=తరంగములయందలి గాలిచే, చిగురు ఱెక్కల ఈకలు- చిగురు = లేఁతయైన, ఱెక్కల ఈకలు= ఱెక్కలయందున్న చిన్నయీఁకలు,ఎగయుచుండన్=మీఁదికి లేచుచుండఁగా, విశదము, ఐ=శుభ్రమయినదై, పక్షతిద్వితయంబు= ఱెక్కలురెండును, విడన్ జాఱన్ = విడిపోవుచుండఁగా, చంచులు=ముక్కు, ఇంచుక=కొంచెము, ఆకుంచితముగన్ = ముడుఁగఁగా, వరుణరాజునకున్=వరుణదేవునకు, ఇడినచామరముపోలెన్=పట్టినవింజామరమువలెను, అనఁగా ఛత్రచామరాదులు రాజలక్షణము కనుక ఱెక్కలువిడఁజార్చి యొకపాదముననే నిలిచియున్న హంస యుదకములకు రాజయిన వరుణునకుఁ బట్టినచామరమువలెఁ బ్రకాశించుచున్నదని భావము.పొడువు=ఉన్నతి, మిగిలిన వెలిదమ్మిపువ్వుఁబోలెన్=అతిశయించిన తెల్లదామరపువ్వువలెను, అనఁగా నేకపాదమున నిలిచియున్న హంస నాళముగలిగి పొడువుగానున్న తెల్లదామరపూవువలె నున్నదని భావము. నిబిడ... నేత్రము- నిబిడ=గాఢమైన, నిద్రా=నిద్దురచే, అభిముద్రితము=మూయబడిన, నేత్రము=కన్నుగలది, ఐనరాజ

హంసంబున్ = అయినట్టిరాయంచను, ఆరాజసుతుఁడు = అనలుఁడు, కాంచెన్ = చూచెను. అలం = స్వభావోక్తి.

తా. అనలమహారాజు తటాకము తీరమునందు గొడుగువంటి గొప్పపద్మము యొక్క నీడయందుఁ దామరతూండ్లను తెలగడగాఁజేసికొని మెడను దానికిఁ జేరఁజేసి, యొక్క కాలనెనిలువఁబడి తరంగమారుతములచేఁ గొంచెము మీఁదుగా నెగయుచున్న చిన్న యీఁకలుగలదై, రెండు ఱెక్కలు కొంచెము దూరముగాజాఁచి, ముక్కును కొంచెముదగ్గఱఁగాఁజేసికొని వరుణదేవునికిఁ బట్టినవింజామరమువలెను, నాళముతోఁగూడిన తెల్లఁదామరపువ్వువలెను నొప్పుచు, నిద్రాతిశయముచేత గన్నులను మూసియున్న రాజహంస నొకదానిని జూచెను.

క. కాంచనపక్షం బగు రా
యంచం గనుఁగొని నృపాలుఁ డనురాగముతో
వంచించి పట్టుకొనియెద
నంచుఁ దలఁచె దైవఘటన కనుకూలముగాన్. 100

టీ. కాంచనపక్షంబు = బంగారు ఱెక్కలుగలది, అగురాయంచన్ = అయినట్టిరాజహంసమును, కనుఁగొని, నృపాలుఁడు = నలుఁడు, అనురాగముతోన్ = ప్రేమతో, వంచించి = మోసపుచ్చి, పట్టికొనియెదన్ అంచున్, దైవఘటనకున్ = దైవయత్నమునకు, అనుకూలముగాన్ = తగునట్లుగా, తలంచెన్ = ఆలోచించెను.

తా. అనలుఁడు బంగరు ఱెక్కలుగలరాయంచను బట్టుకొందునని దైవప్రయత్నమునకు-అనఁగానలదమయంతులదంపతులగా జేయఁదలఁచిన దైవముతలంపునకు, తగునట్టుగాఁ దలంచెను.

తే. వామనుం డయినకైటభవైరివిధము
నభినయించుక్రమంబున నధిపసుతుఁడు
నడి కినడి కి యల్లల్లన నడచి పట్టెఁ
బాణిపద్మద్వయంబున బసిఁడియంచ. 101

టీ. అధిపసుతుఁడు=నలమహారాజు, వామనుఁడు=పొట్టివాఁడు, అయిన కైటభ వైరి విధము-అయిన, కైటభవైరి=విష్ణుమూర్తియొక్క, విధము=రీతిని,అభినయించు క్రమమునన్, నటించు క్రమముచేత, నడిఁకి నడిఁకి=మిక్కిలి వడఁకుచు, అల్లల్లనన్-మెల్లమెల్లగా, నడచి=గమనించి, పసిండియంచన్=బంగరుహంసను, పాణిపద్మద్వయంబునన్ = పద్మములఁ బోలిన రెండు చేతులతోను, పట్టెన్=గ్రహించెను.

తా. పిట్టలు మొదలగువానిని బట్టుకొనునప్పుడు తనయాకారమును బొట్టిగాఁ జేసి చప్పుడు కాకుండఁ దాఁచుచుఁ బట్టుకొనుట ప్రసిద్ధము. అట్లైనలమహారాజు మెల్లమెల్లఁగా వంగి వంగినడచుచుండుటచే పొట్టివాఁడై వామనదేవునివలెఁ బ్రకాశించుచు, చప్పుడు కాకుండఁబోయి రెండు చేతులతోను బంగారు హంసమునుబట్టుకొనెను. అలంకారము స్వభావోక్తి.

వ. ఇట్లు నిషధరాజుచేతం బట్టువడి మేల్కాంచి యక్కాంచన హంసంబు కంచు గీసిన తెఱంగున నెలుఁగించుచు నెగయనుంకించుచుఁ జంచుపుటంబునఁ బాణిపల్లవంబులు గఱచుచుఁ జరణంబులఁ గింజుకొనుచు నఖంబుల నొత్తుచు నలుదిక్కులం జూచుచు నెద్దియుం జేయునది లేక చీకాకు పడుచుండ నప్పాటన సంభ్రమ సముత్పతత్పతగకులంబై కమలషండంబు గలగుండువడియెఁ గూలంబులం గులాయంబులనుండి పుండరీక వనలక్ష్మీచరణ నూపుర క్రేంకారంబుల ననుకరించుచుఁ గారండవబకక్రౌంచరథాంగ కోయష్టికాదులు విహాయసంబున కెగసి కూయం దొడంగె నప్పుడు. 102

టీ. ఇట్లు, నిషధరాజుచేతన్=నలునిచేత, పట్టువడి, బిట్టు=వేగముగా, మేల్కాంచి=మేలుకొని. అక్కాంచనహంసంబు=ఆబంగరుహంస, కంచుగీసిన తెఱంగునన్=కంచుగీసినప్పుడు పొడమినధ్వని విధముగా, ఎలుఁగించుచు=కంఠ

కంఠధ్వనిచేయుచు, ఎగయన్ = ఎగురుటకు, ఊంకించుచున్ = ప్రయత్నించుచు. చంచూపుటంబునన్ = దొన్నెవంటిముక్కుచేత, పాణిపల్లవంబున = చిగురువంటి చేతులను. కలచుచు, చరణంబులు = కాళ్లు, గింజుకొనుచు = విదలించికొనుచు; నఖంబులన్ = గోళ్లచే, ఒత్తుచున్ = చీరుచు, నలుదిక్కులను, చూచుచు, ఎద్దియును = ఏమియును, చేయునది = చేసెడిపని, లేక, చీకాకుపడుచుండన్ = శ్రమపడుచుండఁగా, అప్పాటున = ఆసమయమందె, సంభ్రమ...కులంబై - సంభ్రమ = తొట్రుపాటుచే, సముత్పతత్ = ఎగురుచున్న, పతగకులంబై = పక్షిసమూహము కలదై, కమలషండంబు = పద్మములసమూహము. కలగుండువడియె = సంక్షోభముచెందెను, కూలంబులన్ = తీరములయందు, కులాయంబులనుండి = గూళ్లనుండి, పుండరీక...క్రేంకారంబులన్ పుండరీకవన = పద్మవనములయందుండెడి, లక్ష్మీ = లక్ష్మీదేవియొక్క, చరణ = కాళ్లయందున్న, నూపుర = అందెలయొక్క, క్రేంకారంబులన్ = క్రేంకారధ్వనులను, అనుకరించుచు = విడంబించుచు, కారండవ... కోయష్టికాదులు - కారండవ = కన్నెలేడిపిట్టలు, బక = కొంగలు, క్రౌంచ = క్రౌంచపక్షులు, రథాంగ = చక్రవాకములు, కోయష్టిక = గ్రుడ్డికొంగలు, ఆదులు = మొదలయినజలపక్షులు, విహాయసంబునకున్ = ఆకాశమునకు, ఎగసి = ఎగిరి, కూయన్ దొడంగెన్ = ధ్వనులు చేయ నారంభించెను, అప్పుడు = ఆసమయమందు. పైపద్యముతో నన్వయము.

తే. జాతరూపచ్ఛదచ్ఛటాజాతరూప
లక్ష్మి యిం తొప్పునే మరాళమున కనుచు
నద్భుతం బంది తనుఁ జూచు నధిపు సుతున
కి ట్లనె మనుజభాషల హేమఖగము. 103

టీ. మరాళమునకు = హంసకు, ఇంత = ఇటువంటి, జాత...లక్ష్మి - జాతరూప = బంగారుయొక్క, ఛద = రెక్కలయొక్క, ఛటా = సమూహమువలన, జాత = పుట్టిన, రూపలక్ష్మి = సౌందర్యశోభ, ఒప్పునే = ప్రకాశించునా? అనఁగా నిట్టి శోభగల హంసముండదనిభావము. మఱియు నసాధారణమయినశోభ దీనికిఁగలదు కనుక నిదితక్కిన హంసలవంటిది [illegible] చుచున్న [illegible] = అనిపలు

కుచు, అద్భుతంబు=ఆశ్చర్యము ను, అంది=పొంది, తనున్=రాజహంసననుట, చూచునధిపసుతునకున్=చూచుచున్న రాజకుమారునకు, హేమఖగము=పసిఁడి పిట్ట, మనుజభాషలన్=మనుష్యవాక్యములచే, ఇట్లనెన్=ఇట్లుపలికెను.

తా. భూలోకమందు బంగారుపక్షినెక్కడనైనఁ జూచితిమా యని చూచుచున్న నలున కాపిట్ట మనుజభాషలతో నిట్లనియె.

క. తెక్కలకొనలం గలిగిన
యిక్కాంచన మాసపడియెదే నృప నీకే
యక్కఱ దీనం దీరెడు
నక్కట! నీహారలేశ * మబ్ధికిఁబోలెన్. 104

టీ. నృప=ఓరాజా, తెక్కలకొనలన్=తెక్కలకొనలయందు, కలిగిన యిక్కాంచనము=ఉన్నట్టి యీబంగారమును, ఆసపడియెదే=అపేక్షించుచున్నావా? అనఁగా నట్లపేక్షించుట యుక్తముకాదనిభావము,అక్కట! అయ్యయ్యో! నీహారలేశము=మంచుచుక్క, అబ్ధికిఁబోలెన్=సముద్రమునకువలెనే, దీనన్=ఈబంగారముచేత, నీకు,ఏయక్కఱ=ఏయవసరము, తీరెడున్=తీరుచున్నది? అనఁగా నీకెంతమాత్రము నక్కఱకురాదని యర్థము. అనగాఁ జక్రవర్తివై సకలసంపదలఁదులదూగుచున్ననీకు కొంచెమయిన బంగరువలన నేయవసరమును దీరదని భావము.

తా. ఓరాజా? నీవు భూపాలుఁడవే? ఈ నా తెక్కలకొనయందున్న బంగరు నపేక్షించుచున్నావా? మంచుచుక్క సముద్రమునకుఁ గొఱగాని యట్టులీ స్వల్పమయినకాంచనము నీకెందులకు సరిపోవును? ఎందులకుఁ జాలదు.

అలంకారము, ఉపమ.

చ. ఎఱుఁగనె నీవుప్రాంతమునకే నింతటనంతట నున్కియింత యేమఱుదునె నిన్ను విశ్వజనకేమాన్యుఁడవంచును విశ్వసించి యిత్తఱి సుఖనిద్రఁ బొందితి వృథామతి నెట్టన యాత్మ నమ్మినం జెఱుపఁ దలంతురే ఘనులుకే చిత్తమునం బగవారినేనియున్.

---

* "పడితివే నృప" అని పాఠాంతరము.

టీ. ఓనృపాలా! నీవు, ప్రాంతమునన్=సమీపముగా, ఇంతటన్,అంతటన్= ఈపాటి యాపాటిదూరములో, ఉన్కి=ఉండుట, ఎఱుఁగన్+ఎ=తెలియక పోతి నే? ఇంత, యేమఱు దు నె=ఇంత ప్రమాదమును జెందుదునా? విశ్వజన మాన్యుఁడవు-విశ్వ = ప్రపంచములోనున్న, లేక, సమస్తమయిన,జన=జనులచే, మాన్యుఁడవు=మన్నింపఁ దగినవాఁడవు, అంచున్=అని తలంచుచు, నిన్నున్, విశ్వసించి=నమ్మి, ఇత్తఱిన్=ఈసమయమందు, వృథామతిన్=వ్యర్థమయిన తె లివితో, సుఖనిద్రను=సుఖకరమయిన నిద్రను, పొందితిన్=చెందితిని, ఘనులు= గొప్పవారు, నెట్టన = మిక్కిలి, ఆత్మన్=మనస్సునందు, నమ్మినన్=విశ్వసిం చినచో, పగవారి నేనియున్=శత్రువులనైనను, చిత్తమునన్=మనస్సునందు, చెఱుపన్, తలంతురే=చెఱుచుటకు ఆలోచింతురా ? అనఁగా నాలోచింప రని యర్థము

తా. ఓరాజా! నీవు నాకు సమీపముగాఁ బ్రవర్తించుచున్నావని యెఱుం గను. ఎఱిఁగినచో నింతప్రమాదము చెందుదునా? మఱియు నీవు సమస్తజనులకు హాని చేయనివాఁడవనియు, నీదేశములో నెవరికిని నుపద్రవము కలుగనీయవనియుఁ దలంచి నీయందు నమ్మకముంచి యిట్లునిద్రించితిని. ఇట్లుండ నీవునన్నుఁ బట్టు కొనుట యుచితమా? ఉత్తములు తమ్మునమ్మినవారిని శత్రువులనయినను చెఱు చుటకు యత్నింపరుగదా? అలం - అర్థాంతరన్యా.

ఉ. హింసయు నీకు వేడ్కయగునేని కృపాశ్రయమైన యీసరో
హంసముఁ జంపనేల కఱవా తరవాత వసుంధరాధిపో
త్తంస!విజృంభమాణ భుజదర్పనిరంకుశ సాహసక్రియా
మాంసలచిత్తవృత్తులయి మత్తిలియుందురాతిభూపతుల్.

టీ. వసుంధరాధిపోత్తంస=ఓరాజశ్రేష్ఠా! హింసయు=హింసాకృత్యము గూడ, నీకు, వేడ్క = ప్రియము, అగు నేని=అయినచో, కృపాశ్రయము= దయకుఁ బాత్రము,ఐన యీసరోహంసము = అయినట్టి యీతటాకమునందలి యంచను, చంపన్+ఏల=చంపుటయెందుకు? తరవాతన్=సమయమందు, విజృం భమాణ ... వృత్తులు - విజృంభమాణ = అతిశయించుచున్న, భుజదర్ప =

బాహుగర్వముచే, నిరంకుశ = అడ్డులేని, సాహసక్రియా = సాహస కృత్యములచేత, మాంసల=దట్టమైన, చిత్తవృత్తులు=మనోవ్యాపారములు గలవారు, అయి, మత్తిలి=మదించి, ఉండునరాతి భూపతుల్=ఉన్నట్టి శత్రురాజులు, కలవా=లేరా? అనఁగా జెక్కురుకలరని యర్థము. నీకు హింసాకృత్యము తగ నేతగదు. ఒకవేళ నిష్టమయినచో మదించిన శత్రుభూపతు లెందఱున్నారు కారు. వారలజంపి వేడ్క తీర్చుకొనుము. అంతియు కాని దయనీయములమయిన మావంటివారియందు హింసజూపింపఁగూడదు. కావున నా ప్రాణముల కెంత మాత్రముహాని గలుగనీరాదని భావము.

తా. ఓరాజా! నీకు హింసాకృత్యము లొనర్చుటయందు వేడుకయున్నచో దయఁ జూడఁదగిన యీహంసను జంపఁ బ్రయత్నింప నేల? బాహుగర్వముచే నతిసాహసకర్మము లొనరించుటయందాసక్తికలవారయి మిగుల మదించి యున్న శత్రురాజు లెందఱులేరు. వారలను జంపి హింసాకృత్యములయందలి వేడుకను దీర్చుకొనఁగూడదా?

వ. ఫలకుసుమమూల మాత్రంబున శరీరయాత్ర నడుపుచు మునులుంబోలె సలిలంబులలో నం దపంబు చేయుచున్న వారము మామీఁద దండనీతిం బ్రయోగింప నీకుం దగు నే యదియు నుంగాక. 107

టీ. ఫల...మాత్రంబునన్ - ఫల=పండ్లు, కుసుమ=పూవులు, మూలమాత్రంబునన్=దుంపలచేతను, శరీరయాత్ర=జీవనోపాధిని, నడపుచు=వెళ్ళించు. అనఁగా నొకరికి హానిచేయకుండ సాధువృత్తిచే జీవించుచున్నామని యర్థము. మునులుంబోలె=మునీశ్వరులు వలెనే,సలిలంబులోనన్=జలములలో తపంబున్, చేయుచున్నారము. అనఁగా జలమధ్యమందు మునీంద్రులు తపస్సు చేయుచున్నట్లు మేమును సదాజలమధ్యమందు వసించి తపంబుచేయుచు నిరపరాధులమయి యున్నామని యభిప్రాయము. మామీఁదన్=నిరపరాధుల మయిన మాపయిని, దండనీతిని, ప్రయోగింపన్, తెగునా=అనఁగా దగదనియర్థము అది. యునుంగాక...

తా. ఓ రాజా! దండింపఁదగనివారిని దండించినచో రాజు నరకమునొందునని పండితులు చెప్పుదురు. కావున రాజు, నిరపరాధులయిన సామాన్యప్రాణులనే చంపఁగూడదు అట్లుండ కందమూలాదుల దినుచు జలమందు నివసించుచుఁ దపంబు చేయుచున్నారము, కావున మేము మునులము. శ్రేయోభిలాషియయిన రాజు మునుల కెన్నఁడు నపాయముకలిగింపఁడు. నీవు నీశ్రేయస్సును గోరుదువేని నన్నుఁజంపకుమని భావము.

అవ. వెనుకటి వాక్యమున నిరపరాధియగుమునివంటిదానను కావుననన్నుఁ జంపఁదగదని చెప్పి యింక నీపద్యముచే వధానర్హహేతువులను చెప్పుచున్నది

సీ. తల్లి మదేకపు ౹ త్త్రిక పెద్ద కన్నులు
గాన దిప్పుడు మూఁడు ౹ కాళ్లముసలి
యిల్లాలు గడుసాధ్వి ౹ యేమియు నెఱుఁగదు
పరమపాతివ్రత్య ౹ భవ్యచరిత
వెనుకముందరలేదు ౹ నెనరైనచుట్టంబు
లేవడి యెంతేని ౹ జీవనంబు
గానక కన్నసం ౹ తానంబు శిశువులు
జీవనస్థితి కేన ౹ తానలంబు
తే గీ. కృపఁ దలంపఁగదయ్య యో ౹ నృపవరేణ్య
యభయ మీవయ్య యోతుహి ౹ నాంశువంశ
కావఁ గదవయ్య యర్థార్థి ౹ కల్పశాఖి
నిగ్రహింపకు మయ్య యో ౹ నిషధరాజ. 108

టీ. నృపవరేణ్యా! ఓ రాజశ్రేష్ఠా! తల్లి= నాతల్లి, మదేకపుత్త్రిక =నన్నొక్కనినే కుమారుగాఁ బడసినది. అనఁగా మాతల్లికి నేనొక్కఁడనే పుత్త్రుఁడనుకాని మఱిసంతానములేదనుట. పెద్ద= మిగులవృద్ధురాలు, కన్నులుకానదు = గ్రుడ్డిది, మూఁడుకాళ్లముసలి= మూఁడుకాళ్లు గలముసలిది, అనఁగా ముసలివారికివలె కఱ్ఱ

మూఁడవకాలుగానుండును. అనఁగా నాకంటె వేఱె సంతానఁబులేని మాతల్లి మిక్కిలివృద్ధురాలయి గ్రుడ్డిదయి చేఁగఱ్ఱసాయమున నడచుచున్నది. ఆమె శాహారాదులనే నొసంగవలసినదేకాని యామె స్వతంత్రురాలై సంపాదించికొన లేదు, నన్నునీవు చంపినచో నాతల్లి యాహారములేక పుత్త్రశోకమగ్నయై ప్రాణములు విడుచును. అందువ నాపాపముగూడ నిన్నుఁ జుట్టుకొనక మానదని భావము. నీవంటివారు వంశమునిలఁబెట్టవలసినవారే కాని యున్మూలింపఁ దగినవారుకారు. నీకిట్టిపాపంబులు సంభవించుచున్నవి కాన నన్ను విడిచిపెట్టుమని ఫలితార్థము. ఇల్లాలు=నాభార్య, కడున్, సాధ్వి=మిక్కిలి యోగ్యురాలు, ఏమియుం నెఱుఁగదు= మిక్కిలియవివేకురాలు, పరమపాతివ్రత్యభవ్యచరిత=పరమపాతివ్రత్య=పూజ్యమయిన పాతివ్రత్యము చే,భవ్య=ప్రశస్తమయిన,చరిత=ప్రవర్తనముకలది. అనఁగా నాభార్యయుఁగూడ నాహారాదులఁ దెచ్చుకొనునంతతెలివికలది కాదు.మిక్కిలి యోగ్యురాలు. పతివ్రత.నన్నునీవు చంపినచో, పతివ్రతయగు నాభార్య భర్తృవియోగాగ్నిచేతనే కాక యాహారాదులు లేమి నాఁకటిచిచ్చుచేఁగూఁడ ప్రాణంబులు విడుచు.ఆపాపముగూడ నిన్నుఁజుట్టుకొనునని భావము. మఱియుఁ బతివ్రతలకు హానిచేసినవారు లోకమున జీవించి యుండలేదు. కావున నన్నుఁ జంపి పతివ్రతయగు నాభార్యకు హానిగలిగించితివేని తదీయకోపాగ్ని నిన్ను దిగమ్రింగకమానదు కావున నన్ను విడిచిపుచ్చుమని ఫలితార్థము. నెనరు=దయగలవాఁడు,దీనచుట్టంబు=దీనబంధువు, వెనుకకున్ ముందఱన్=ఇరువంకలను, అనఁగా నత్తింటివంకగాని పుట్టింటివంకగాని యనియర్థము, లేదు, జీవనంబు = జీవనోపాధి, ఎంతేనిలేవడి = ఏమియులేదు అనఁగా మిగుల బీదవారమనుట, కానకకన్నసంతానము, ఎన్నిశ్రమలనొందినంగాని కలుగనిసంతతి, శిశువులు=పసివారు, జీవనస్థితికిన్ =నాభార్యను తల్లిని బిడ్డలను బోషించుచుంటకు,ఏన=నేనే, తాలంబనన్=కారణమను, పలుశ్రమలు పొంది పలువ్రతముల నాచరించి యెంతోఁ బూర్వపుణ్యముంగలిగియుండినంగాని బిడ్డలుపుట్టరు. నన్నునీవు జంపినచో నాశిశువు లాహారములేక చావవలసినవారు. కావున నాపాపముగూడ నిన్ను జుట్టుకొనక మానదు. దిక్కులేనితల్లికి, భార్య

కు బిడ్డలకుఁ, జీవనమిచ్చెడి వాఁడను నేనే. అట్టినన్నుఁజంపినచో నీవెంతటిప్రాణములు దీసినవాఁడవగుదువో యోజింపుము. ఇట్టిదానవగునన్ను హింసింపఁగూడదని యభిప్రాయము, కృప, తలంపఁగదయ్యా. ఓ తుహినాంశువంశ=చంద్రవంశమందుబుట్టిన, యోరాజా! అభయము, ఈవయ్యా. తుహినాంశువంశ 'అని' చెప్పుటచే జగత్ప్రసిద్ధుఁడయి చంద్రునివంశంబునఁబుట్టి నీచునివలె నిట్టిసాధుపక్షుల కపకారమొనర్చి పాపంబుమూటఁగట్టుకొనుట దగదని యభిప్రాయము తెల్లమగుచున్నది. అర్థార్థికల్పశాఖి=యాచకులకుఁ గల్పవృక్షమువంటి ఓనిషధరాజా! కావఁగదయ్యా, నిషధరాజ=నిషధదేశాధిపా, నిగ్రహింపకుము + అయ్యా=చంపకుమా? "అర్థార్థికల్పశాఖి" అని చెప్పుటలో సారస్యమేమన కల్పవృక్షమెంతదుర్ఘటములయిన కోర్కెలనయినను దడయకిచ్చును. నీవు నట్టికల్పవృక్షముతో సమానుఁడ వగుటంబట్టి నాప్రాణంబులు నాకిచ్చి నా కోర్కెదీర్ప సమర్థుండవని యభిప్రాయము తెల్లమగుచున్నది.

వ. అక్కటకటా దైవంబ! నీకంటికిం బేలగింజయుం బెద్దయయ్యెనే? జననీ! ముదిసి ముప్పుకాలంబున సుతశోకసాగరం బెట్లుంగి నీఁదఁగలదానవు? ప్రాణేశ్వరీ! యేచందంబున మద్విరహవేదనాదవానలంబునం దెరికొనియెదవు? సఖులారా! యేప్రకారంబునం బుటపాకప్రతీకాశం బైనకరుణారసంబునఁ బురిపురం బొక్కెదరు? బిడ్డలార! యేలాగున నతితృష్ణాపిపాసాకులంబులై కులాయకుహరాంబులం గులకులం గూసెదరని విలాపంబు సేయుచు దృగ్గోళకంబుల వేఁడి కన్నీరు వెడల గోలుగోలున నేడ్చునంగృపాళుండై యాభూపాలుండు హస్తపల్లవంబులు వదలి రాజహంసంబ పొమ్ము సుఖంబుండు మని విడిచిపుచ్చె ననంతరంబ.

టీ. అక్కటకటా! అయ్యయ్యో! దైవంబా! నీకంటికి పేలగింజయున్, పెద్దయయ్యెనే? అనఁగా నల్పులమయిన మేమే నీకు బరువయితిమా మేమే నీకంటికిఁగనఁబడినారము, అని [illegible], ముప్ప

కాలంబునన్=ఈమునలితనంబునందు. సుతశోకసాగరంబు= పుత్త్రశోకమనెడి సముద్రమును, ఎబ్భంగిన్=ఏరీతిగా, ఈఁదఁగలదానవు, ప్రాణేశ్వరీ! ఓప్రియురాలా! ఏచందంబునన్; మద్విరహ...దవానలంబునన్-మత్=నాయొక్క,విరహ=వియోగమువలనఁగలిగిన,వేదనా=బాధయనెడి, దవానలంబునన్=కార్చిచ్చుచే, దరికొనియెదవు=దహింపఁబడుదువో కదా? సఖులారా! ఏప్రకారంబునన్, పుటపాకప్రతీకాశంబు - పుటపాక=పుటము పెట్టుటవలనఁగలిగినవేడిమితో,ప్రతీకాశంబు=సమమయినది, ఐన కరుణరసంబున=అయినట్టి దుఃఖముచేత, పురపురన్ బొక్కెదరో= మిక్కిలి బాధ చెందుదురో కదా? బిడ్డలారా! ఏలాగునన్=ఏరీతిగా, అతిక్షుత్పిపాసాకులంబులై=అధికమయిన యాఁకఁటిచేతను దప్పిచేతను వివశులై, కులాయకూలంబులన్=గూండ్లప్రక్కలయందు, కులకులన్ కూసెదరు=అసురసురులై యఱచెదరో కదా? అని, విలాపంబు చేయుచు=రోదనము చేయుచు, దృగ్గోళకంబులన్=నేత్రములనుండి, వేఁడికన్నీరు=వెచ్చనినీరు, వెడలన్=బయలు వెడలఁగా, గోలుగోలునన్,ఏడ్చినన్=ఏడుచుచుండగా, కృపాళుండయి, ఆభూపాలుండు=ఆనలుఁడు, హస్తపల్లవంబులు, వదలి=విడిచి, రాజహంసంబ! పొమ్ము సుఖంబుండుము, అని విడిచిపుచ్చె, అనంతరంబ=అటుతరువాత...

శా. భారద్వాజపవిత్రగోత్ర విమలాపస్తంబసత్సూత్ర వి
ద్యారాజార్ఘకిరీట రాజహితకార్యారంభనిర్ధారణా
ధారంధర్వకళాయుగంధర సమిద్ధాఃడీవి శ్రీఖండక
ర్పూరక్షోదవిపాండునిర్మలయశః పూర్ణక్షమామండలా.110

టీ. భారద్వాజ పవిత్రగోత్ర- భారద్వాజ = భారద్వాజమునియొక్క, పవిత్ర= పరిశుద్ధమయిన, గోత్ర=వంశముకలవాఁడా? పవిత్రమయిన భారద్వాజవంశమందుఁ బొడమినవాఁడాయనియనుట, విమలా..సూత్ర-విమల=నిర్మలుఁడయిన, ఆపస్తంబ=ఆపస్తంబునియొక్క, సత్=మంచిదయిన, సూత్ర=సూత్రముకలవాఁడా, విద్యారాజార్ఘకిరీట=విద్వాంసులలో శ్రేష్ఠుఁడయినవాఁడా? రాజ...యుగంధర...హిత=హితముయిన, కార్య=ప

నులను, ఆరంభ=ప్రారంభించుటలను, నిర్ధారణా = నిర్ణయించుటయొక్క, ధౌరంధుర్య=భారవాహకత్వముయొక్క, కళా=చాతుర్యమునందు, యుగంధర=యుగంధరునివంటివాఁడా? అనఁగా రాజునకు హితమయినకార్యము లాచరించుటయందు యుగంధరుఁడనెడి మంత్రివంటివాఁడనుట. యుగంధరుఁడు ప్రతాపరుద్రునిమంత్రి, ఇతఁడు తనబుద్ధిచాతుర్యముచేఁ దురకలచే డిల్లీకిఁగొనిపోఁబడిన తనప్రభువును విడిపించి తెచ్చెను. సమిద్గాండీవి- సమిత్ = యుద్ధములయందు, గాండీవి=అర్జునునివంటివాఁడా? శ్రీఖండ ..మండలా-శ్రీఖండ=మంచిగంధమునవలెను, కర్పూర=కప్పురమునుయొక్క, క్షోద=గుండవలెను, విపాండు=మిక్కిలి తెల్లని, నిర్మల=మలినముకాని, యశః=కీర్తిచే, పూర్ణ=నిండయిన, క్షమామండలా భూమండలముకలవాఁడా! కర్పూరాదులవలె దెల్లనిదియు సమస్తభూమండలము నావరించినదియునగు కీర్తికలవాఁడని యర్థము.

క. కేళాదిరాయ యభినవ

లీలామకరాంక చంద్రరేఖాంకుర చూ

డాలంకారపదాంబురు

హాలింగనసుఖిత నిర్మలాంతఃకరణా? 111

టీ. కేళాదిరాయ! అభినవలీలామకరాంక -అభినవ= క్రొత్తవైన, లీలా=విలాసలచే, మకరాంక = మన్మథునివంటివాఁడా? చంద్ర... కరణా-చంద్రరేఖా=చంద్రరేఖయొక్క, అంకుర = మొలక,అనఁగా బాలచంద్రరేఖయనియర్థము, చూడాలంకార=శిరోభూషణముగాఁ గలవానియొక్క, అనఁగా శంకరునియొక్కయని యర్థము, పదాంబురుహ=పద్మములవంటి పాదములను, ఆలింగన=కౌఁగిలించుకొనుటచేత, అనఁగా శరణుచొచ్చుటచేత, సుఖిత=సుఖించుచున్న, నిర్మల=పరిశుద్ధమైన, అంతఃకరణా=మనస్సుకలవాఁడా? అనఁగా నెల్లప్పుడు శివునిపాదపద్మముల గొల్చుచుండుటచే మిగుల సుఖించుచున్న చిత్తము కలవాఁడనిభావము.

మాలిని. జరఠకమఠరాజశ్రీస్తబ్ధరోమప్రధాన

[illegible]

స్థిరతరధృతసంపద్గేహబాహాగ్రపీఠీ
పరిచయసుఖలక్ష్మీపక్ష్మలక్షోణిచక్రా. 112

టీ. జరఠ...చక్రా-జరఠ=ముసలిదయిన, కమఠరాజ=కూర్మరాజును, స్తబ్ధరోమప్రధాన=ఆదివరాహము, ద్విరసనపతి=శేషుఁడు, భూభృత్=కులపర్వతములు, దిగ్గజగ్రామ=దిగ్గజములయొక్కసమూహము, (ఇవియన్నియు భూమిని మోయుచున్నవని పురాణప్రసిద్ధము.) ఈ యన్నింటికంటె,భూమ=నిండుగాను,స్థిరతర=మిగులదృఢముగా, ధృత=ధరింపఁబడినదగుటచేత, సంపత్=సంపదలకు, గేహ=నిలయమయినట్టియు, బాహాగ్రపీఠీ=బాహుపీఠముతోనున్న, పరిచయ=పరిచయమువలనఁగలిగిన, సుఖలక్ష్మీ-సౌఖ్యసమృద్ధులచేత, పక్ష్మల=సాంద్రమైనట్టియు,క్షోణిచక్రా=భూమండలము కలవాఁడా? అనఁగా సింగనామాత్యుఁడు కూర్మరాజాదులకంటె మిక్కిలి స్థిరముగా భూభారమునువహించి, సకలసంపదలతోను దులదూగు చుండునట్లును మిగుల సౌఖ్యము కలుగునట్లును భూమండలమును బరిపాలించెనని భావము.

తా. కూర్మరాజు, వరాహము, సర్పరాజు, కులపర్వతములు, దిక్కరులు మొదలగునవి భూమినిమోయుచున్నను నీబాహువులంతకంటె సుస్థిరముగాధరించుటచే సంపన్నలయమయి నీబాహుపీఠ పరిచయముచేఁగలిగిన సుఖసంపదలచేఁ దులదూగెడు భూమండలముగల సింగనామాత్యా?

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్యపుత్త్ర, సకలవిద్యాసనాథ, శ్రీనాథభట్ట ప్రణీతమయిన శృంగారనైషధకావ్యమునందుఁ బ్రథమాశ్వాసము.

---



శ్రీ ర స్తు.

# శృంగారనైషధము.

## టీకాతాత్పర్యసహితము.

---

### ద్వితీయాశ్వాసము.



రాజరాజ వేమ
క్ష్మారమణకృపాకటాక్ష సంవర్ధిత ల
క్ష్మీరక్షితబుధలోక!యు
దార గుణాధార!సింగనామాత్యనిధీ. 1

టీ. శ్రీరాజ...లోక - శ్రీ=శోభాయుతుఁడైనట్టియు, రాజరాజ=రాజులకు రాజైన, వేమక్ష్మారమణ=వేమభూపతియొక్క, కృపాకటాక్ష=దయారసముతో నిండినచూపులవలన, సంవర్ధిత =వృద్ధిపొందింపబడిన, లక్ష్మీ=సంపదలచేత, రక్షిత = పోషింపబడుచున్న, బుధలోక = పండితసమూహము గలవాఁడా, ఉదారగుణాధార = గొప్పగుణములకు ఆధారమైనట్టి, సింగ నామాత్యనిధీ=సింగన్న అను పేరుగల మంత్రిశ్రేష్ఠుఁడా-అని వైపద్యముతో నన్వయము.

తా. రాజరాజైన వేమభూపాలునియొక్క కృపాకటాక్షమువలన సంపాదింపబడినసంపదలచే రక్షింపబడుచున్న పండితసమూహముగలిగి యున్నతగుణముల కాధారుఁడవైనట్టి సింగనామాత్యుఁడా!

వ. అవధరింపుము. 2

టీ. అవధరింపుము=ఆలకింపుము.

తే. అట్లు పురుషోత్తముం డైనయతనివలనఁ
ముక్తి గాంచినయాద్విజముఖ్యుఁ డెలమిఁ
డెందమునకును వాక్కునకు నందరాని
యధికతర మైనయానంద మనుభవించె 3

టీ. అట్లు=ఆరీతిగా, పురుషోత్తముండు=పురుషశ్రేష్ఠుఁడు, (భగవంతుండు, అనియునర్థము) అయినయతనివలనన్=అయినట్టి నలమహారాజువలన, ముక్తి=విడుదలను (మోక్షమనియునర్థము) కాంచిన యాద్విజముఖ్యుఁడు=పొందినట్టి యాపక్షిశ్రేష్ఠుఁడు (బ్రాహ్మణశ్రేష్ఠుఁడనియునర్థము) ఎలమిన్=సంతోషముచే, డెందమునకున్=మనస్సునకు, వాక్కునకున్=మాటలకు, (వేదములకుననియునర్థము) అందరాని=అందనట్టియు, (అనఁగా నవాఙ్మానసగోచర మైనదని భావము) అధికతరము=మిక్కిలిగొప్పది, అయినయానందము=ఐనట్టిసంతోషమును, అనుభవించెన్=పొందెను. (అనఁగా బ్రహ్మానందసుఖ మనుభవించెననుట)

తా. భగవంతుండైన విష్ణువువలన ముక్తిఁజెందిన బ్రాహ్మణశ్రేష్ఠుఁ డవాఙ్మానసగోచరంబైన బ్రహ్మానంద మనుభవించినట్లు నలమహారాజువలన విడుదలనుపొందిన యాహంసశ్రేష్ఠము చెప్పం దలంపఁదరముగాని బ్రహ్మానందమును బొందెను.

క. చుట్టంబులుఁ జెలులుం దనుఁ
జుట్టుఁ దరిగి యుండ ముదముఁ బొంపెసలారన్
నెట్టపడి చచ్చి క్రమ్మఱఁ
బుట్టినచందమున హంసము దటాకములోన్. 4

టీ. స్పష్టము.

సీ. తిక్కించికొని యున్నతెక్కమొత్తముతోడ
యొడలు జాడించి నెవ్వడి విదిర్పుఁ
జేదోయిమొత్తునఁ జేసి నెత్తురులైన
[illegible] ఁ జేయుఁ

గుటిలచంచూపుటకోటికుట్టనములఁ
దనుకీటముల నిరోధంబు మాన్పుఁ
దొడఁగ జుంజుఱు మేని దుర్వికారంబునఁ
బులుఁగుఁ జుట్టాల బిట్టులుకఁ జేయు
తే. నూర్మిపంక్తుల నుయ్యాలలూఁగి యాడుఁ
దివుటఁ దియ్యని తమ్మిపూఁదేనెఁ గ్రోలుఁ
బ్రమదమున నాఁచుఁదీఁగఁజొంపములఁ దూఱు
నరుగుఁ గేళికులాయ శుద్ధాంతములకు. 5

టీ. చిక్కించి—యొడలు, చిక్కించికొనియున్న = చిక్కించికొనినట్టి, చొక్క=చిన్న యీఁకలయొక్క, మొత్తములోడి=సమూహముతోఁ గూడియున్న, యొడలు=దేహమును, జాడించి, నెవ్వడిన్=మహావేగముచే, విదిర్చున్=దులుపుచుండును, చేదోయి... జేసి, చేదోయి= రెండు చేతులయొక్క, ఒత్తునంజేసి,=రాపిడింబట్టి, నెత్తురులు=రక్తముకలవి, అయిన అవయవంబులు=ఐనట్టి అవయవంబులను, నోరన్=నోటిచే, సవరన్, చేయున్=చక్కఁబఱుచుకొనుచుండును. కుటిల...కుట్టనములన్ - కుటిల=వంకరయిన. చంచూపుట=దొన్నెవంటి ముక్కుయొక్క, కోటి=అంచుయొక్క, కుట్టనములన్=పొడుచుకొనుట చేతను, తనుకీటముల నిరోధంబున్-తను=శరీరమందున్న, కీట=పురుగులయొక్క, నిరోధంబున్=బాధను, మాన్చున్=తొలఁగించుకొనును-తొడఁగన్ = దేహమును సాగునట్లుచేయగా, జుంజులు...కారంబునన్-జుంజులు = చింపిరిగానున్న, మేని=శరీరముయొక్క, దుర్వికారంబునన్=చెడువికారముచే, పులుఁగు=ఆహంసము, చుట్టాలన్=తనబంధుగులను, బిట్టులుకన్ చేయున్=అధికముగా భయపడునట్లు చేయును-అనఁగా, నలమహారాజు చేతియొత్తుడుచే, మిక్కిలి వికారముగానున్న యాహంసను చూచిన దానిబంధువులకుఁ దనకుఁ గీడుమూడెనేమోయని మిగులభయముఁ గలుగఁజేయుచున్నది యని భావము) ఊర్మి పంక్తులన్=తరంగ మాలికలయందు, ఉయ్యాలలు, ఊఁగి, ఆడున్=విహరించుచుండును, తివుటన్=కోర్కెచే, తియ్యని...

దేనె—తియ్యని=మధురమైన, తమ్మిపూ=పద్మములయందున్న, తేనెల్=మకరందమును, గ్రోలుక్=గ్రోవును, ప్రమదమునక్=సంతోషముచే, నాఁచు... జొంపముక్-నాఁచుతీగె=నాఁచుతీగలయొక్క, జొంపములల్=సమూహములందు, తూఱుక్=ప్రవేశించును, కేళి...ములకుక్-కేళికులాయ=విలాసకోటికైన గూళ్ళనెడి,శుద్ధాంతములకుక్=అంతఃపురములకు, అరుగుక్=పోవును.

తా. ఆహంసము తటాకములోఁ బ్రవేశించి శరీరమును వేగముగా జాడించుచుండును. నలమహారాజు చేతియొత్తున రక్తసిక్తములైన యవయవములం జక్కఁబఱుచును-ముక్కుచే శరీరమందున్న కీటకబాధ దొలగించుకొనును, తన వికారఁపు శరీరమును జూపి బంధువులకు భయము గలిగించును. తరంగపంక్తులలో విహరించును, మకరందమును గ్రోలును, ఒకమారు సంతోషముచే నాచుతీఁగెలలోఁ బ్రవేశించుచుండును, ఒకప్పుడు తనకులాయములకుఁ బోవుచుండును.

అలం, స్వభావోక్తి.

వ. ఇవ్విధంబునం గొంతదడవు గ్రీడించి యానీడోద్భవంబు భవార్చనాయోగ్యంబును రుద్రాక్షమధువ్రతపరీవృతంబును బహుశైవలక్ష్మతాసమన్వితంబును నగుటఁ బద్మంబునుం బోని నిషధరాజు హస్తంబునకుఁ గమ్మఱ నరుగుదెంచె నమ్మహాభుజుండును భుజంబు సాఁచి యమ్మానసౌకంబు మన్నించి యిమిడికొని యుండెనప్పుడు. 6

టీ. ఇవ్విధంబునక్=ఈరీతిగా,కొంతతడవు=కొంతకాలము,క్రీడించి=ఆటలాడి,ఆనీడోద్భవంబు=ఆహంసము,భవార్చనాయోగ్యంబును-భవ=ఈశ్వరుని, అర్చనా = పూజించుటకు, యోగ్యంబును = తగినదియు, (పద్మపక్షమందు ఈశ్వరునిపూజకు తగినదని యర్థము)రుద్రాక్ష...వృతంబును-రుద్రాక్ష=రుద్రాక్షధారణమనెడి, మధు=సమీచీనమయిన, వ్రత=నియమముచే, పరీవృతము=కూడికొనినది. అనఁగా నలునిచేయి సర్వదా రుద్రాక్షధారణముచే నొప్పుచున్నదనిభావము. పద్మపక్షమందు, రుద్రాక్షలవంటి తుమ్మెదలచే గూడికొనినదని యర్థము, లేక రుత్+ర+అక్షి+మధువ్రత - రుత్=ధ్వనిచేయుచున్న, ర =

అగ్ని వంటి, అక్షి=నేత్రములుగల, మధువ్రత=తుమ్మెదల చే,పరీవృతము=కూడియు న్నది. బహుశైవ ..తంబును ;బహు=అనేకములయిన, శైవ=ఈశ్వరసంబంధ మయిన, లక్ష్మతా=లక్షణములు కలిగియుండుటతో, సమన్వితంబు=కూడుకొని యున్నది. అనఁగాఁ ద్రిపుండ్రాదులయిన యీశ్వరలక్షణములతోఁ గూడికొని నది. లేక, శైవ=మంగళ ప్రదములయిన, లక్ష్మతా=సాముద్రికలక్షణంబులు కలి గియుండుటతో, సమన్వితంబు, అనఁగానలునిచేయి సాముద్రికలక్షణములతోఁ గూడికొనినదని భావము. పద్మపక్షమందు, బహు=విస్తారమయిన, శైవల=నా చుగల, క్ష్మతా=భూమిగలుగుటచే, సమన్వితంబు=కూడికొనినది. విస్తారమైన నాచుగలప్రదేశమందు, బుట్టినదని భావము. అగుటన్ - అయియుండుటచే, పద్మంబునుం=తామరను, పోని నిషధరాజహస్తంబునకున్=సరిపోలెడి నలమ హారాజు చేతికి, క్రమ్మఱన్, అనుగుదెంచెన్,అమ్మహాభుజుండును=ఆనలుఁడును, భుజంబు, సాచి=చేయిచాచి, అమ్మానసౌకంబున్ =ఆహంసను, మన్నించి, ఇమిడికొనియుండెన్ =ఇమిడ్చుకొనియుండెను, అప్పుడు=ఆసమయమందు, అని పైదానితో నన్వయము.

తే. ఇష్టమానస మయిన యా హేమఖగము
నలునిమానస మానంద జలధియందుఁ
గర్ణ శష్కులికలశంబు గౌఁగిలించి
యీఁదఁ జేయుచు మృదుభాష నిట్టు లనియె. 7

టీ. ఇష్టమానసము - ఇష్ట=అభిమతమయిన, మానసము=మానససరస్సుగలది, అయినయా హేమఖగము=అయినట్టి యా బంగారుపిట్ట, నలునిమానసమున్ =న లునియొక్క మనస్సును, ఆనందజలధియందు=ఆనందమనెడి సముద్రమందు,కర్ణ శష్కులికలశంబున్ =చక్కిలమువంటి చెవులనెడి, కలశంబున్ =పాత్రమును, కౌఁగలించి; ఈఁదజేయుచున్ =ఈఁదునట్లుచేయుచు, అనఁగా నీఁదునప్పు డు కలశంబులంజంకలయందుంచికొనుట ప్రసిద్ధము. అట్లె నలునిమానసము కర్ణ ములను పాత్రములను నూనుకొని యానందసముద్రము నీఁదునట్లు చేయుచున్న దనిభావము. అతనిమానసము మిక్కిలి యానందముచెందునట్లు చేసినదని నిశ్చ

యార్థము. మృదుభాషణ=మెత్తనివచనములతో, ఇట్టులు, అనియె.

తా. మానససరస్సునందు నిష్టముగలిగినట్టి యాహంసము నలునియొక్క-చిత్తమును, కర్ణములనెడి కలశములను కౌఁగలించుకొనునట్లు చేసి, యానందసముద్రమునందు నోలలాడించుచు, మృదువాక్యములతో నిట్లనియె.

అలం-రూపకము.

వ. దేవా! యవధరింపుము. ధర్మశాస్త్రమర్మపారగులైనపెద్దలు దుర్బలకులజిఘాంసువులైనఝషంబులను నీడద్రుమపీడాకరంబులైననీడజంబులను ననవద్యతృణహింసానృశంసంబులగుమృగంబులను మృగయావినోదంబుల నధియించి మహీధవుండు కిల్బిషంబునఁ బొందఁడని చెప్పుదు రప్పట్టునం బట్టువడిననన్ను విడిచిపెట్టి ప్రాణంబురక్షించిన యుపకారికిఁ బ్రియంబుసేయుదునని నేర్తునేనైనను నీకు నొక్కప్రియంబుచేసెదనయాచితోపపన్నం బయిన హితంబు పరిహరింపంబనిలేదు.నిఖిలభువననాయకుండవైన నీకు మముబోంట్లు సేయు నుపకారం బపేక్షణీయంబుగాకుండుట యెఱుంగుదునైనను గృతజ్ఞతాగుణలేశంబు క్లేశపఱుచుచున్నయది సన్నంబు దొడ్డయనువిశేషంబు విచారింపక హస్తకల్పజనాంతరంబయిన దైవంబు ప్రశస్తివిమర్శించి నాచేయుప్రయోజనం బంగీకరింపుము.

టీ. దేవా=ఓనరాధిపా? అవధరింపుము=ఆలింపుము, ధర్మశాస్త్ర...పారగులు, ధర్మశాస్త్ర=ధర్మశాస్త్రములయందున్న, మర్మ=రహస్యములయొక్క, పారగులు=అంతమునుపొందినవారు, అయినపెద్దలు=అయినటువంటి పండితులు, అనఁగా ధర్మశాస్త్రము బాగుగానెఱింగినవారనుట- దుర్బలకుల జిఘాంసువులు = దుర్బలకుల = అల్పజంతువులయొక్క సమూహములను, జిఘాంసువులు = చంపనిష్టపడుచున్నవి, ఐనఝషంబులను = అయినటువంటి పెద్దచేపలను, నీడద్రుమపీడాకరంబులు- నీడద్రుమ=నీడలాయనవృక్షములకు, పీడాకరంబులు =

బాధకలిగించునట్టివి, ఐననీడజంబులను= అయినపక్షులను, అనవద్య-నృశంసంబులు- అనవద్య = తక్కువగాని, తృణ=గడ్డికి, హింసా = హింసచేయుటచేత, నృశంసంబులు=ఘాతుకములు,అగుమృగంబులను=అయినజంతువులను, మృగయావినోదంబులన్-మృగయా=వేఁటయను, వినోదంబులచేన్=ఆటలన్, వధియించి=చంపి, మహీధవుండు=రాజు, కిల్బిషంబును=పాపమును, పొందండు=పొందఁడు-అనిచెప్పుదురు. ఇప్పట్టునన్=ఈస్థలమందు, లేక, యీసమయమందు, పట్టుపడిననన్నున్=పట్టుకొనఁబడిననన్ను, విడిచిపెట్టి, ప్రాణంబున్=జీవనమును,రక్షించిన=కాపాడినట్టి, ఉపకారికిన్=ఉపకారముచేసినట్టినీకు, ప్రియంబు=ఇష్టమయినకార్యమును, చేయుదున్ అనన్ నేర్తునే=చేయుదునని చెప్పఁజాలుదునా, అనఁగా జెప్పలేననుట, అయినను, నీకు, ఒక్కప్రియంబు = ఒక ఉపకారమును, చేసెదను, అయాచితోపపన్నంబు-అయాచిత = యాచింపకుండ, ఉపపన్నంబు=ప్రాప్తమయినది, అయినహితంబున్=అయినటువంటి మేలును, పరిహరింపన్ పనిలేదు=విడిచిపెట్టనవసరములేదు, నిఖిలభువననాయకుండవు-నిఖిల=సమస్తమయిన, భువన=లోకములకు, నాయకుండవు=లోకాధిపతివి, అయిననీకు,మముబోంట్లు,చేయు నుపకారంబు=చేసెడిమేలు,అపేక్షణీయంబు=కోరఁదగినది, కాక ఉండుట=కాకుండుట,ఎఱుంగుదును, ఐనను, కృతజ్ఞతా గుణలేశంబు-కృతజ్ఞతా గుణ=చేసిన మేలుమఱవకుండుట యనెడి గుణముయొక్క, లేశంబు=కణము,క్లేశపఱుచుచున్నయది=కష్టపెట్టుచున్నయది,సన్నంబు=చిన్న, దొడ్డ=పెద్ద, అనువిశేషంబు=అనునట్టి భేదంబు, విచారింపక=ఆలోచింపక, హస్త=హస్తముతో, కల్ప=సమానమైన, జనాంతరంబు=మఱియొకజనుఁడు గలవాఁడు,ఐనదైవంబు=అయినట్టి బ్రహ్మదేవునియొక్క, ప్రశస్తి=ఉత్తమత్వమును, విమర్శించి=ఆలోచించి, నాచేయుచున్నటువంటి ఉపకారమును, అంగీకరింపుము=పొందుము. అనఁగా:—నేను బ్రహ్మయొక్క హస్తముతో సమానుఁడైనవాఁడనగుటచే బ్రహ్మతనచేతితో నిచ్చినవస్తువును గౌరవముచే నెట్లుగా గ్రహింపఁదగినదో యట్లే నేఁ జేయు నుపకారంబుగూడ బ్రహ్మదేవునియందలి గౌరవము చేతనైన స్వీకరింపక తప్పదనిభావము.

సీ. ప్రత్యర్థిరాజసార్థకనామధేయుండు
భూమీశ్వరుం డొప్పు భీముఁ డనఁగ
నారాజు త్రిదివంబు నమరేంద్రుఁడును బోలెఁ
దేజంబున విదర్భ దేశ మేలు
దమనాహ్వయుం డైన తపసి సద్వరమునఁ
గాంచె నాతఁడు కన్యకాలలామ
సర్వలోకాంగనా సౌభాగ్య గరిమంబు
దమియించు కతమున దానినామ
తే. యభ్రభారతి దమయంతి యంచు నొడివెఁ
దద్గుణంబులు వర్ణింప ధరణినాథ
యబ్జసూతికినైన శక్యంబుగాదు
పలుకఁ బూఁబోఁడికైనను నలవి గాదు. 9

టీ. ప్రత్యర్థిరాజ=శత్రు రాజుల విషయమై, సార్థక=అన్వర్థముతోఁగూడిన, నామధేయుండు=పేరుగలిగినట్టి, భూమీశ్వరుండు=రాజు, భీముఁడనఁగన్=భీముఁడని పిలువఁబడుచు, ఒప్పున్=ప్రవర్తించుచుండును-అనఁగా శత్రువులను భయపెట్టుచు భీముఁడనెడు తననామమును సార్థక పఱుచుచుండుననిభావము. ఆరాజు=ఆభీమరాజు, త్రిదివంబున్=స్వర్గలోకమును, అమరేంద్రుఁడును బోలెన్=దేవేంద్రునివలె, తేజంబునన్=ప్రతాపముచే, విదర్భదేశమున్=విదర్భయనెడు దేశమును, ఏలున్=ఏలుచుండును-అనఁగా స్వర్గపట్టణమును దేవేంద్రుఁడేలునట్లు, అతఁడు విదర్భదేశమును బ్రతాపముచే నేలుచుండుననిభావము. దమనాహ్వయుండు=దమనుఁడను పేరుగలవాఁడు, అయిన తపసి, సద్వరమునన్=అయినట్టి మహాముని యొక్క మంచివరముచే, ఆతఁడు=ఆరాజు, కన్యకాలలామన్=కన్యకామణిని, కాంచెన్=కనెను-అనఁగా నారాజు దమనుఁడను మునిశ్రేష్ఠునివరముచే నొక కూఁతుంగనెనని భావము. సర్వ...గరిమంబు-సర్వలోక=సమస్తలోకములందున్న, అంగనా=స్త్రీలయొక్క, సౌభాగ్య=సౌందర్యముయొక్క, గరి

మంబున్ = అతిశయమును, దమియించు కతమునన్ = జయించు కారణముచే, దానినామము = ఆమెయొక్క నామము, దమయంతియంచున్ = దమయంతియని, అభ్రభారతి = ఆకాశవాణి, నొడివెన్ = పలికెను, అనఁగా సమస్తదేశములందున్న స్త్రీలయొక్క సౌందర్యాతిశయము జయించుకారణమున నాకాశవాణియే యామెకు దమయంతి యనెడి నామ మొసంగినదని భావము. ధరణీనాధ = రాజా! తద్గుణంబులు = ఆదమయంతియొక్క గుణములను, వర్ణింపన్ = వర్ణించుటకు, అబ్జసూతికైనను = నలువకైనను, శక్యంబుకాదు = తరముకాదు, పలుకుఁ బూఁబోఁడికైనను = సరస్వతికైనను, అలవికాదు = శక్యముకాదు. అనఁగా రాజా! ఆమెయొక్క గుణములు వర్ణించుటకు బ్రహ్మకైనను, సరస్వతికైనను దరముగాదని భావము. సమస్తలోకంబు సృజించి మహాబుద్ధిమంతుం డనిపించికొనినబ్రహ్మయు, వాక్కులకు నిలయభూతయయిన సరస్వతియు, వీ రిరువురే దమయంతిగుణంబులను వర్ణింప లేనప్పుడు తక్కిన వారిసంగతి చెప్ప నేల?

తే. విదుషి యాయింతి దలఁదాల్చు వెంట్రుకలకు
నహహా! యెబ్బంగి సాటిసేయంగ వచ్చుఁ
బశువుచేతఁ బురస్కృతిఁ బడయ లేక
చాపలంబున వర్తించు చామరములు. 10

టీ. పశువుచేతన్ = చమరీమృగముచేత, (నీచ జంతువుచేత ననియునర్థము) పురస్కృతిన్ = గౌరవమును, (ముందుగా నుంచుకొనుటను ననియర్థము) పడయలేక = పొందలేక, చాపలంబునన్ = చాంచల్యంబుచేత, వర్తించు = ప్రవర్తించుచున్న, చామరములు = చమరీ మృగముయొక్క వాలములను, విదుషి = విద్వాంసురాలయిన, ఆయింతి = ఆదమయంతి, తలన్ = శిరస్సునందు, తాల్చు వెంట్రుకలకున్ = ధరించెడి శిరోజములకు, అహహా = ఆహా, ఎబ్బంగిన్ = ఏరీతిని, సాటిన్ = సామ్యమును, చేయంగవచ్చున్ = చేయవచ్చును? అనఁగా సాటిచేయలేమనుట. ఇందుఁ జమరీమృగముచేతననక పశువుచేత నని చెప్పుటలోను, విదుషి, యని దమయంతికి విశేషణముచేయుటలోను సారస్య మేమనఁగాఁ బశువని చెప్పుటచే నీచత్వము తెలియఁజెప్పుచు, ...

గా నుంచుకొనఁబడని చమరీవాలము విద్వాంసురాలు కావున నుత్తమత్వము,న ధమత్వమును, జక్కఁగఁ దెలిసికొనుచున్న దమయంతిచే నతిగౌరవముతోఁ దలయందుఁ దాల్పఁబడుచున్న శిరోజముల కెట్లుసాటివచ్చునని తెలియఁదగినవి. మఱియు నీచులచేతనైన గౌరవము పడయలేనివి,చామరములు, విద్వాంసురాల యిన దమయంతిచేత నెక్కుడుగా గౌరవింపఁబడుచున్నవి శిరోజములు. ఇంత తారతమ్యముండుటచే సామ్యము కుదురదనుట స్పష్టము.

తా. పృష్ఠభాగమున ధరింపఁబడినవై పశువుచేతనుగూడ గౌరవము పడ యలేక చపలత్వంబునఁ బ్రవర్తించుచున్న చమరీమృగములయొక్క వాలముల ను విద్వాంసురాలయిన యాదమయంతి తలను ధరించుచున్న శిరోజములకెట్లు సాటిచేయవచ్చును? అనఁగా సాటి చేయలేమనుట.

అలం- కావ్యలింగము.

క. ఖురకండూ యనమిషమున
హరిణంబులు సాంత్వనంబు సేనాపాదించున్
*దరుణి విలోచనములచేఁ
బరిభూతము లైనతమచపలదృష్టులకున్. 11

టీ. తరుణివిలోచనములచేన్-తరుణి=దమయంతియొక్క, విలోచనముల చేన్=నేత్రములచేత, పరిభూతములు=తిరస్కరింపఁబడినవి, అయిన తమ... దృష్టులకున్-అయిన=అయినట్టి, తమ=తమయొక్క, చపల=చలించుచున్న, దృష్టులకున్=చూపులకు, ఖుర...మిషమున్-ఖుర = డెక్కలతోడ, కం డూయన=గోకుకొనుటయనెడి, మిషమునన్=నెపముచేత, హరిణంబులు=లేళ్లు, సాంత్వనంబున్=అనునయమును, ఆపాదించున్=చేయును - అనఁగా లోక ములో మానవులు విపదలనుగాని, యొకరివలన నవమానముగాని చెంది కలఁతనొం దుచున్నప్పుడు వారి స్నేహితులుగాని బంధువులుగాని వచ్చి మంచిమాటలచే నోదార్చి వారికలంతను బోకార్చుట సుప్రసిద్ధము.అట్లె దమయంతి నేత్రములచే నవమానింపఁబడి చాపల్యము నొందుచున్న లేడికన్నులను ఆకన్నులపఁ దోఁ

* "తరుణీ విలోకనములు" అని పాఠాంతరము.

ఋట్టువులైన డెక్కలు వచ్చి యొదార్చుచున్నవని భావము. లేళ్లుమొదలగు జంతువులు తమకన్నులు దురద వేయుచున్నప్పుడు డెక్కలతో నివారించుకొనుట స్వభావము. ఇట్లుండఁ గవీశ్వరుండు దమయంతి నేత్రముచేత జయింపఁబడినందువలనఁ గలిగినపరాభవదుఃఖమును మాన్పుటకే డెక్కలు నేత్రముల యొద్దకుఁ బోవుచున్నవి కాని దురద తొలంగించుకొనుటకుఁ గాదని చెప్పియున్నాఁడు. దమయంతి నేత్రములు లేడికన్నులను మించియున్నవని ఫలితార్థము.

తా. లేళ్లుదమయంతియొక్క నేత్రములచేఁ దిరస్కరింపఁబడినతమయొక్క చపలనేత్రములను డెక్కలతో గోఁకుకొనుటయనెడుమిష చేనోదార్చుచుండును.

అలం-అపహ్నుతి.

2-23

క. లలన కనుదోయి ముందట
సలవడ నలినంబు మలినమయ్యె ను హారిణం
బులు *పూరి మేయఁ దొణఁగెను
గలితద్యుతి ఖంజ మయ్యె ఖంజనకులమున్. 12

టీ. లలన ... ముందటన్ -లలన=దమయంతియొక్క, కనుదోయిముందటన్ =కనులయొక్కయెదుట, అలవడన్ =ఏర్పడఁగా (అనఁగా దమయంతికన్నులయెదుట నున్నపుడని యర్థము) నలినంబు=పద్మము, మలినమయ్యెన్ =దూషితమయ్యెను. లోకమున నవమానితులైనవారలు విచారంబుచేఁ గాంతి విహీనులగుట సహజము. అట్లె దమయంతి నేత్రముల కీడు కాక యవమానంబునొంది పద్మములు విచారంబునఁ గాంతిహీనములగుటచే మలినంబులయ్యెనని భావము. హారిణంబులు=లేళ్లు, పూరిన్=గడ్డిని, మేయన్ =మేయుటకు, తొణఁగెన్ = మొదలు పెట్టెను, యుద్ధంబులఁ బరాజితులయినవారు గడ్డినోటఁగఱచికొనినచో శత్రువులనుండి ప్రాణభయంబు రాదని వాడుక. అట్లె దమయంతి నేత్రములచేఁ బరాజితములయిన కన్నులు గలలేళ్లు ప్రాణభయంబు గలుగకుండ గడ్డి మేయ నారంభించినవనిభావము. లేళ్లకు స్వభావసిద్ధమయిన గడ్డిమేయుటను బరుల

* "హరిణంబులు బులుమేయఁదొడంగెను." అని పాఠాంతరము.

వలనఁ బ్రాణభయంబు రాకపోవునిమిత్తమని కవి యూహించినాఁడు. ఖంజనకులమ్ = కాటుక పిట్టలయొక్క సమూహమును, కలితద్యుతి ఖంజము-కలిత=ఒప్పుచున్న, ద్యుతి=కాంతియొక్క, ఖంజము=నాశనముకలది (అనఁగా కాటుకపిట్టలకాంతి యంతయు నశించెనని భావము) అయ్యెన్ =అయెను.

తా. దమయంతియొక్క నేత్రములచే జయింపఁబడి పద్మములు కాంతిహీనములగుచున్నవి.అట్లే లేళ్లు పరాభవమున పూరిని నోటఁగఱచుకొనుచుండెను. మఱియు నామె నేత్రములు కాటుకపిట్టలను గాంతిహీనములనుగాఁ జేయుచున్నవి. అలం-వ్యతిరేకము.

తే. రాజబింబంబునందు సారము హరించి
* చేసినాఁడు విధాత యా చెలువమోము
నడిమిరంధ్రంబునందుఁ గానంగ వచ్చు
ఖనిఖనీలిమ యది నిదర్శనము గాదె. 13

టి. విధాత=బ్రహ్మ,ఆచెలువమోము=ఆదమయంతి యొక్క ముఖమును,రాజబింబంబునందున్ =చంద్రబింబమందున్న, సారమున్ =నిగ్గును, హరించి=తీసి, చేసినాఁడు = నిర్మించినాఁడు,నడిమిరంధ్రంబునందున్ =చంద్రబింబముయొక్క నడుమనున్నకన్నమునందు,కానంగన్ వచ్చు = కనఁబడుచున్న,ఖని =గోతియొక్క, ఖ=అవకాశముయొక్క,నీలిమ=నల్లఁదనము, అది=ఆనల్లఁదనము,నిదర్శనము=దృష్టాంతము,కాదె=కాదా (అవుననుట.) అనఁగా బ్రహ్మ దమయంతి మోమును జేయుటకుఁ జంద్రునిలో నున్నసారమునంతను దీయుటనిజము. కావుననే చంద్రబింబంబు మధ్యభాగంబునందు సారముతీయుటవలనఁ గలిగిన నల్లనియవకాశము నిదర్శన మగుచున్నది.చంద్రునియందు స్వభావసిద్ధమయినమచ్చను దమయంతి మోము నిర్మించుటకయి బ్రహ్మ సారము తీయఁగా నేర్పడిన గోయి యని కవి యుత్ప్రేక్షించినాఁడు. దమయంతి ముఖము నిష్కలంక మగునిందుసారమువంటిదని ఫలితార్థము.

---

*"చేసినాఁడో" అనిపాఠాంతరము,

తా. బ్రహ్మ దమయంతీదేవిమోమును జేయుటకుఁ జంద్రబింబమునం దున్న సారమునంతను దీసియున్నాఁడు. ఆతీయుటవలన నాబింబమందొక రంధ్రముపడి నల్లగాఁగానవచ్చుచుండెను. అందుచేతినే యాస్థలమునందుఁగా నవచ్చుచున్ననల్లఁదనమును బ్రహ్మ చంద్రబింబమందున్న సారమును దీసియు న్నాఁడని నిదర్శనముగాఁ జెప్పవలనుపడుచున్నది.

అలం- కావ్యలింగము, ఉత్ప్రేక్ష.

2-26-

క. ప్రవిలేపనపాండరమును
నవలాంఛనగోమయాంచనము నగు రాకా
ధవళాంశుమండలము విధి
నివాళి సేయును లతాంగి నెమ్మొగమునకున్. 14

టీ. విధి=బ్రహ్మ, లతాంగినెమ్మొగమునకున్ = దమయంతియొక్క ముఖ మునకు, ప్రవిలేపనపాండరమును-ప్రవిలేపన = పిష్టోదకమువలె, పాండరమును= తెల్లనిదియు, నవలాంఛనగోమయాంచనము - నవ=నూతనమయిన, లాంఛన= కళంకమనెడు,గోమయాంచనము=గోమయపూజఁగలిగినది;అగు...మండలము - అగు=అయినట్టి,రాకా=పున్నమనాటి, ధవళాంశు=చంద్రునియొక్క, మండల మున్ =బింబమును, నివాళిసేయును=ఆరతియిచ్చును. లోకములో సుందరమైన వస్తువులకు దృష్టిదోషము తగులకుండుటకై పిండినీటితోఁగూడియున్నమట్టి పాత్రమునందు గోమయమును బూజించి దిగఁదుడిచి పాఱవేయుట ప్రసిద్ధము. అట్లె బ్రహ్మ దమయంతీదేవి సుందరమైనముఖమునకు దృష్టిదోషము తగులకుండుటకై తనకిరణములచేఁ దెల్లనిదియు, గోమయమువంటికళంకము కల దియు,నగుచంద్రబింబమనెడి మట్టిపాత్రములో దిగఁదుడుచుచున్నాఁడు. అనఁ గాఁ బున్నమనాటిచంద్రబింబ మామె ముఖమును బోలలేదని భావము.

తా. పిండినీటివలెఁ దెల్లనిదియుఁ గళంకమనెడి గోమయ పూజకలదియు, నగు పున్నమనాటిచంద్రబింబమును బ్రహ్మ దమయంతీ ముఖమునకు నివాళి యిచ్చును.

అలం- [illegible]

సీ. జగము లొక్కుమ్మడి సాధింప నెత్తిన
  * రతిమన్మథులవిండ్లు రమణిబొమలు
కాంతినిర్ఘర మీఁదు కామయౌవనముల
  కుంభప్లవము లింతి కుచయుగంబు
నడు మింత యని కేలఁ దొడికి పట్టినధాత
  యంగుళిరేఖ లబ్జాస్యవళులు
యువమనోమృగ రాజిఁ దవిలింపఁ దీర్చిన
  మదనవాగుర లిందువదనకురులు
తే. బాల్యతారుణ్య సీమావిభాగమునకు
నజుఁడు వ్రాసిన రేఖ తన్వంగియారు
భానువరమునఁ బడసిన పంకజముల
యపరజన్మంబు పూఁబోఁడి యడుగు లధిప. 15

టీ. రమణిబొమలు=దమయంతియొక్క కనుబొమ్మలు, జగములు=లోకములను, ఒక్కుమ్మడిన్=ఒక్కమారుగా, సాధింపన్=జయించుటకు, ఎత్తిన... విండ్లు- ఎత్తిన=తాల్చినట్టి, రతిమన్మథులవిండ్లు=రతిమన్మథులయొక్క చాపములు, అనఁగా దమయంతియొక్క కనుబొమలు లోకమును మోహింపఁ జేయదగినంత సౌందర్యము కలిగియున్నవనుట, ఇంతికుచయుగంబు=దమయంతియొక్క పాలిండ్లు, కాంతినిర్ఘరము=కాంతియనెడి నదిని, ఈఁదు... ప్లవములు- ఈఁదు=ఈఁదుచున్నట్టి, కామయౌవనముల=కామ యౌవనములయొక్క, కుంభప్లవములు=కుంభములవంటిపడవలు, (అనఁగా శరీరమందున్న కాంతి ప్రవాహమునందుఁ గామయౌవనము లీఁదుచుండఁగా వానికి దమయంతిపాలిండ్లు ఈఁదుటకు సాధనమయిన కుంభములవలె నున్నవని భావము. ఇందువలన దమయంతి మిగులలావ

* రతివల్లభుని విండ్లురమణి బొమలు'' అనిపాఠాంతరము. దీనికంటె రతిమన్మథుల విండ్లనెడు పాఠమె సంస్కృతమునకు సరిగానున్నది. ''ధనుషీ రతిపంచశరయో రుదితే విశ్వజయాయ తద్భ్రువౌ'' అనిసంస్కృతము.

ణ్యావతి గానియు, నామె కుచములు గుంభములవలె మిగులఁ బెద్దవయి ప్రకాశిం చుచున్నవనియు, స్పష్టమగుచున్నది. అబ్జాస్యవళులు-అబ్జాస్య=పద్మమువంటి మొగముగలదమయంతియొక్క, వళులు=కడుపుమీఁదనున్న ముడుతలు, నడుము, ఇంతయని=ఇంతేయని, కేలన్=హస్తముచే, తోడికి...రేఖలు - తోడికి= ఒడిసిపట్టుకొనిన, ధాత=బ్రహ్మయొక్క, అంగుళిరేఖలు=వ్రేళ్లయొత్తుడుచేఁ బడినగీఁతలు-అనఁగా దమయంతియొక్కవళులుబ్రహ్మ నడుమింతమాత్రమేయనిచే తితోఁగిలించిపట్టుకొనఁగాఁ జేతిరాపిడివలనఁ బడినవ్రేళ్లగీఁతలవలెనున్నవనుట, మఱియు దమయంతియొక్కనడుము గుప్పిటిలోనికిముడుచున్నదనియు,వళులచే మిగులమనోహరముగా నున్నదనియు భావము, ఇందువదనకురులు - ఇందువ దన=చంద్రునివంటిమొగముగల దమయంతియొక్క, కురులు=తలవెండ్రుకలు, యువమనోమృగరాజిక్ - యువ=పిన్నవయస్సుగల జనులయొక్క, మనస్= చిత్తములనెడి, మృగ=లేళ్లయొక్క, రాజిక్=సమూహమును, తవిలింపక్=చి క్కించుటకు, తీర్చినమదనవాగురలు-తీర్చిన=పన్నినట్టి, మదనవాగురలు=మ న్మథునియొక్కవలలు, అనఁగా దమయంతి కేశపాశము, సమస్తమయిన మాన వులయొక్క చిత్తములను బంధించుటకు మన్మథుఁడు పన్నినట్టివలలవలెఁ బ్రకా శించుచున్నవని భావము. దమయంతి కేశములందఱిని మోహసముద్రమున ముం పఁదగినంత మనోహరముగా నున్నవని ఫలితార్థము. తన్వంగియారు-తన్వంగి=కృ శించినశరీరముగల దమయంతియొక్క, ఆరు=నూఁగారు, బాల్య...విభాగము నకుక్-బాల్య=చిన్నతనముయొక్కయు, తారుణ్య=యౌవనముయొక్కయు, సీమా=హద్దును, విభాగమునకుక్ = ఏర్పాటుచేయుటకు, అజుఁడు = బ్రహ్మ, వ్రాసినరేఖ=వ్రాసినట్టిగీఁతయే, అనఁగా దమయంతియొక్కనూఁగారు, చిన్నతన మునకు యౌవనమునకు, నడిమిహద్దు నేర్పాటుచేయుటకయి బ్రహ్మవ్రాసిన గీఁతవలె వెలయుచున్నదనుట. అధిప=ఓనలమహారాజా! పూఁబోఁడిమడుగులు =దమయంతియొక్క పాదములు, భానువరమునక్=సూర్యుఁడిచ్చినవరముచే, పడసిన...జన్మంబు - పడసిన=పొందినట్టి, పంకజముల=పద్మములయొక్క, అప గజన్మంబు=రెండవజన్మమే-అనఁగాఁ బద్మములు దమయంతిపాదములతో సరి

కాలేక సూర్యునిగూర్చి తపంబాచరించి వరమునొంది తత్ప్రభావముచే రెండవజన్మమందు దమయంతి యడుగులయినవనుట, మఱియు దమయంతిపాదములు పద్మములకంటె మించినసౌందర్యము కలవనిభావము.

క. జలదుర్గస్థ మృణాళా
వలిజిత్కమనీయబాహు ♦ వల్లరి యగునా
జలజానన *నీకుం దగుఁ
బలుకులు వేయేల యధిక ♦ బలశౌర్యనిధీ. 16

టీ. అధిక బలశౌర్యనిధీ-అధిక=గొప్పదయిన, బల=బలమునకును, శౌర్య=పరాక్రమమునకును, నిధీ=స్థానమయినట్టి నలమహారాజా! పలుకులు=మాటలు, వేయేల? వేయియెందుకు? జల...వల్లరి-జలదుర్గస్థ = జలదుర్గమందున్న, మృణాళ=తామరతూండ్లయొక్క, ఆవళి=సముదాయమును, జిత్=జయించినట్టి, కమనీయ=మనోహరమయిన, బాహువల్లరి = బాహులతలుగలది, అగునాజలజానన=అయినట్టి పద్మమువంటి మొగముగల దమయంతి, నీకున్, తగున్=తగియున్నది.

తా. ఓనలమహారాజా! పెక్కుమాటలతో నేమిప్రయోజనము? తామరతూండ్లకంటె సుందరమయిన బాహువులుగలయట్టి యాదమయంతి యన్నివిధములచేతను నీకు భార్యగా నుండుటకుఁ దగియున్నది.

క. హాటకకలశంబులకును
బాటి యగువధూటిమెఱుఁగుఁ ♦ బాలిండ్లు నిరా
ఘాటస్ఫురణప్రభ యను
నేటికిఁ జక్కవల†కవవ ♦ హి విరాజిల్లెౕ. 17

టీ. వధూటి మెఱుఁగుపాలిండ్లు - వధూటి=దమయంతియొక్క, మెఱుఁగుపాలిండ్లు=ప్రకాశించునట్టి స్తనములు, హాటకకలశంబులకును = బంగారుకుండ

* "నీకేతగు" నని పాఠాంతరము.

† జక్కవలకవయయివి రాజిల్లె ననిపాఠాంతరము.

లకు, పాటియగుర్ = సరివచ్చును, వధూటి మెఱుఁగుఁబాలిండ్లు = దమయంతి యొక్క కుచములు, నిరాఘాటస్ఫురణప్రభ - నిరాఘాట = నిరాటంకమైన, స్ఫురణ=నిండారిన, ప్రభ=కాంతి, అను నేటికిన్ = అనునట్టినదికి, జక్కవలక వఫిన్ =చక్రవాకపక్షులజతవలె, విరాజిల్లెన్ = ప్రకాశించెను. అనఁగా దమయంతి కుచములు మనోహరమయిన శరీరకాంతి యనునదికిఁ జక్రవాక పక్షులవలె నున్నవనుట, చక్రవాకపక్షిద్వయముచే నది ప్రకాశించుచున్నట్లు కుచకుంభములచే దమయంతి శరీరము ప్రకాశించుచున్నదనిఫలితార్థము.

తా. దమయంతి వలుఁదగుబ్బలు బంగారుకుండల కీడుచేయవచ్చును. మఱియు నవి దమయంతియొక్క లావణ్యమనెడి ప్రవాహమునందు వెలయునట్టిచక్రవాకపక్షులవలెనొప్పచుండెను.

అలం-ఉపమ.

తే. వలుఁదయును వట్రువయుఁ గాఁగ నలినభవుఁడు
భీమభూపాలపుత్త్రికిఁ బిఱుఁదొనర్చె
నర్కరథ శిల్పశిక్షఁ బుష్పాస్త్రు తేరు
నేకచక్రంబు సేయ నూహించి యొక్కొ. 18

టీ. నలినభవుఁడు=బ్రహ్మ,అర్కరథ శిల్పశిక్షన్ =అర్క,సూర్యునియొక్క, రథ=రథమును, శిల్ప=చేయుటయందలి, శిక్షన్ =అభ్యాసముచే, పుష్పాస్త్రు= పుష్పమే బాణముగాఁగల-అనఁగామన్మథునియొక్క, తేరు=రథమును,ఏకచక్రంబు=ఒక్కటేచక్రము కలదానిగా, చేయన్ =చేయుటకు, ఊహించియొక్కొ=ఊహించియే కాఁబోలును,భీమభూపాల పుత్త్రికిన్ =భీమరాజుయొక్క కూఁతురయిన దమయంతికి, పిఱుఁదు=నితంబము,వలుఁదయును= పెద్దదియును, వట్రువయును=గుండ్రనిదియు, కాఁగన్ =అగునట్లుగా, ఒనర్చెన్ = చేసెను. అనఁగా దమయంతి పిఱుఁదులొక్కటిగను జక్రాకృతిగను నుండి మన్మథునిరథచక్రమువలె నున్నదని భావము. దమయంతికి లోకములను మోహింపఁజేయుచున్ననితంబము కలదని ఫలితార్థము.

అలం-ఉత్ప్రేక్ష.

తా. బ్రహ్మ సూర్యునియొక్క రథము నొక్కచక్రముకలదానినిగాఁ జేసియున్నాఁడు గావున మన్మథుని యొక్క రథముగూడ నొక్కచక్రముగలదానినిగాఁ జేయనూహించియే కాఁబోలును, దమయంతియొక్క నితంబమును పెద్దది యగునట్లుగాను, గుండ్రనిదిగాను జేసి యున్నాఁడు.

మ. వనజాతేక్షణ యూరుయుగ్మమున లావణ్యంబునం గేళికా
ననసంక్రందన పట్టణప్రకట జన్మస్థానలౌ రంభలౌ
ధనదాపత్య తపఃఫల స్తనుల నత్యంతాభిరామాంగులౌ
మనుజాధీశ యధఃకరించుఁ బొగడౌ నీమాబోంట్లకునౌ శక్యమే.

టీ. మనుజాధీశ=నలమహారాజా! వనజాతేక్షణ=పద్మములవంటి నేత్రములు గలదమయంతియొక్క, ఊరుయుగ్మమునన్=తొడలయొక్క జత చేతను, లావణ్యంబునన్=సౌందర్యము చేతను, కేళి.. స్థానలన్-కేళికానన=ఉద్యానవనములు, సంక్రందన=దేవేంద్రునియొక్క, పట్టణ=నగరము-అనఁగా స్వర్గమనుట, ప్రకట=ప్రసిద్ధమయిన, జన్మస్థానలన్=జన్మభూములుగాఁగల, రంభలన్=అనఁటులను, స్వర్గమందును, నుద్యానవనములందును బుట్టిన రంభా స్తంభములు దమయంతియూరువులకు సరి పోల వని భావము. "ఇందుఁ గేళికానన" "సంక్రందన పట్టణము" అని చెప్పుటలో సారస్యమేమనఁగా నట్టి ప్రసిద్ధస్థలంబులఁ బుట్టిన యనఁటిచెట్లు మిక్కిలి యేపుగాను మనోహరముగాను వృద్ధిపొందును. కాన యట్టిచోట్లఁ బుట్టిన రంభా స్తంభములే దమయంతి యూరువులఁబోల లేనప్పుడు సామాన్యస్థలంబులఁ బుట్టినవి బొత్తిగా సాటి చెంద లేవన్న సారస్యము తెలియుచున్నది. లావణ్యంబునన్=సౌందర్యము చే, ధనదా... స్తనులన్-ధనద =కుబేరునియొక్క, అపత్య=కుమారునియొక్క-అనఁగా నలకూబరునియొక్క యనుట, తపఃఫల=తపఃఫలరూపమైన, స్తనులన్=కుచములుగల, అత్యంతాభిరామాంగులన్ - అత్యంత=మిక్కిలి, అభిరామ=మనోహరమైన, అంగులన్=దేహముకల స్త్రీలను, అనఁగా-రంభాదులననుట, అధఃకరించున్=తిరస్కరించును, పొగడన్ =పొగడుటకు, నీమాబోంట్లకున్, శక్యమే=శక్యమా?

తా. ఆదమయంతి తనతొడలచేతఁ గేళికాననములందు స్వర్గమందుఁబుట్టిన రంభాస్తంభములను జయించుచున్నది. సౌందర్యముచే రంభ మొదలగు నచ్చరలఁ దిరస్కరించుచున్నది. అట్టిదమయంతిని మేమెట్లు వర్ణింపఁగలము?

మ. *మృదురీతిం బ్రతివాసరంబు గమికర్మీభూత నానానదీ
నదకాంతారపురీశిలోచ్చయుఁడనై నైకాద్భుతశ్రీజిత
త్రిదివంబైనవిదర్భదేశమున నారీరత్నముంగాంచితిన్
సదసత్సంశయగోచరోదరి శరత్సంపూర్ణచంద్రాననన్. 20

టీ. ప్రతివాసరంబు=ప్రతిదినమందును, మృదురీతిన్ = తగినవిధముచే,గమికర్మీభూత...శిలోచ్చయుఁడనై-గమికర్మీభూత=గమనవిషయములైయున్న నానా=అనేకములయిన, నదీ=నదులును, నద=సముద్రములును, కాంతార=అరణ్యములును, పురీ=నగరములు, శిలోచ్చయుఁడన్ +ఐ=పర్వతములుగలవాఁడనై, నైకాద్భుత...త్రిదివంబు- నైక=అనేకములైన, అద్భుత = వింతవస్తువులయొక్క, శ్రీ=సంపదచేత, జిత=జయింపఁబడిన, త్రిదివంబు = స్వర్గపురముగలది,ఐనవిదర్భదేశమునన్ =ఐనట్టివిదర్భదేశమునందు,సదసత్...దరిన్-సదసత్=ఉన్నదాలేదాయనెడి,సంశయ=సందేహమునకు, గోచర=విషయమైన, ఉదరిన్ = నడుముగలదానిని, శరత్సంపూర్ణచంద్రాననన్ - శరత్=శరత్కాలమందలి, సంపూర్ణచంద్ర=నిండుచంద్రునివంటి,ఆననన్ =ముఖముగలదానిని, నారీరత్నమున్=స్త్రీరత్నమైన దమయంతిని, కాంచితిన్ = చూచితిని.

తా. ఓరాజా!ప్రతిదినము నేను సమస్తనదులను సముద్రములను అడవులను, మొదలగువానిని జూడఁబోయి,స్వర్గముకంటెమించియున్న విదర్భదేశమునందు శరత్కాలచంద్రునివంటిమోముకలదియు, నున్నదా లేదాయనెడి సందియమును గలుగఁజేయునడుము గలదియు, నగు దమయంతిని జూచితిని.

మ. కమలేందీవరషండ మండితలసత్కాసార సేవారతిన్
గమికర్మీకృత నైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్.21

* ఈపద్యముకు న్నప్రతులయందు గానరాదు.

రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్
సమపీనస్తనిఁ నస్తినాస్తివిచికిత్సాహేతుశాతోదరిన్. 21

టీ. కమల...రతిన్-కమల = పద్మములయొక్క, ఇందీవర=నల్లగలువల యొక్క, షండ=సమూహముచే, మండిత = అలంకరింపఁబడిన, లసత్=ప్రకాశించుచున్న, కాసార=సరస్సులను, సేవా=సేవించుటయందలి, రతిన్ =ఇష్టముచే, గమికర్మీకృత నైకనీవృతుఁడనై-గమికర్మీకృత = గమనవిషయములై యున్న, నైక=అనేకములయిన, నీవృతుఁడను+ఐ = దేశములుకలవాఁడనై. అనఁగా సమస్తదేశములను దిరుగుచునని భావము. విదర్భంబునన్ =విదర్భదేశమునందు, పల్లవపాణిన్ =చిగురాకులవంటి చేతులుగలదానిని, పద్మనయనన్ = పద్మములవంటి నేత్రములుగలదానిని, రాకేందుబింబాననన్ - రాక=పున్నమనాటి, ఇందుబింబ=చంద్రబింబమువంటి, ఆననన్ =ముఖముగలదానిని, సమపీనస్తనిన్ =సమానములైన బలిసిన స్తనములుగలదానిని, అస్తి . దరిన్-అస్తి నాస్తి =ఉన్నది లేదు అనెడి, విచికిత్సా=సందియమునకు, హేతు = కారణమైన, శాత=కృశించిన, ఉదరిన్ =నడుముగలదానిని, రమణిన్ =దమయంతిని, కంటిన్ =చూచితిని.

తా. ఓనలా! నేను గాసారములనుజూడ వేడుకతో సమస్తదేశములను దిరుగుచు, విదర్భదేశమునందుఁ జిగురువంటి చేతులుకలదియుఁ బద్మములవంటి నేత్రములుగలదియుఁ బున్నమచంద్రునివంటి మోముగలదియు, బలిసిన స్తనములుగలదియు, ఉన్నదా లేదా యనెడిసందేహము గలిగించు నడుముగలదియు నగు దమయంతిని జూచితిని.

వ. కాంచి విబుధపురపురంధ్రీరామణీయకం బీరమణీరత్నంబు ముందట నిస్సారంబు పొమ్మనియును, విధాత చిత్తంబున నీ మత్తకాశినికిం దగినయుత్తముం డగువరుండెవ్వండు గలిగియున్నవాఁడొకో యనియును, జింతించుచుఁ గొంతతడవు నివ్వెఱపడి చూచుచుండితి. అనంతరంబ యనురూపలావణ్యారేఖాసంపన్నుండైన పిన్నవయసురాకొమరుని నవలో

కింతు నని లోకాలోకపర్యంతంబుగా నీలోకంబు విశ్వంబు
నుం బరిభ్రమించి యుర్వీశ్వరకుమారకులనెల్లం బూర్వ
పక్షంబు గావించుచు వచ్చివచ్చి యిచ్చోట నిన్నుం గనుం
గొని సిద్ధాంతీకరించితి. సాదృశ్యనిబంధనంబై పొడమిన సం
స్కారబోధంబునఁ జిరకాలావలోకిత యగు నబ్బాల యిప్పు
డు నామనంబునం బొడఁ గానవచ్చుచున్నయది. 22

టీ. కాంచి=చూచి, విబుధ...రామణీయకంబు - విబుధపుర=అమరావతి
యందున్న, పురంధ్రీ=అంతఃపుర స్త్రీలయొక్క, రామణీయకంబు=సౌంద
ర్యంబు, ఈ రమణీరత్నము నుందటన్ = ఈ స్త్రీరత్నము నెదుట, నిస్సారంబు
=సారములేనిది, పొమ్ము,అనియున్ =అని పలుకుచును - అనఁగా దేవతాకాం
తలయొక్క సౌందర్యముకంటె, దమయంతి సౌందర్యము మిక్కిలి యధికమైన
దని భావము. విధాత=బ్రహ్మ, చిత్తంబునన్ =మనస్సునందు, ఈ మత్తకాశిని
కిన్ =ఈ స్త్రీకి, తగినయుత్తముండు=తగిన సత్తముఁడు, అగు వరుండు=ఐనట్టి
భర్త, ఎవ్వాఁడు=ఎవఁడు, కలిగియున్నవాఁడు+ఒకో=కలవాఁడో, అనియును=
అనుచును, అనఁగా బ్రహ్మ యీకాంతాలలామకుఁ దగినవరుని నెవ్వని నేర్ప
ఱచియుండునో యనిభావము. చింతించుచున్ =ఆలోచించుచు, కొంతతడవు,
నివ్వెఱపడి=అద్భుతపడి, చూచుచుండితిని. అనంతరంబ, అనురూప=తగిన, లా
వణ్యరేఖా=సౌందర్యరేఖచే, సంపన్నుండు=కూడినవాఁడు, ఐన పిన్నవయసు
రా కొమరునిన్ =ఐనట్టి జవ్వనము గల రాకుమారుని,అవలోకింతున్ =చూతును,
అని, లోకా లోక పర్యంతంబు గాన్ =చక్రవాళపర్వతమువద్దుగాఁగల, ఈ
లోకంబును, విశ్వంబునున్ =అంతయు, పరిభ్రమించి=తిరిగి,ఉర్వీశ్వర కుమారకు
లన్ +ఎల్లన్ =రాజకుమారుల నందఱిని, పూర్వపక్షంబు+కావించుచున్ =పనికి
రారని పలుకుచు, వచ్చివచ్చి, యిచ్చోటన్, నిన్నున్, కనుంగొని = చూచి,
సిద్ధాంతీకరించితిని=స్థిరపఱిచితిని, సాదృశ్యనిబంధనంబు+ఐ=సామ్యముచేబద్ధమ
గుటంబట్టి, పొడమినసంస్కారబోధంబునన్ = కలిగినసంస్కారజ్ఞానంబు
చే, చిరకాల+అవ[illegible] యగున బ్బాల

=వినయాదమయింతి, ఇప్పుడు, నామనంబునన్, పొడఁగానన్, వచ్చుచున్నది, అనఁగా...సమానములైనవస్తువులలో నొకదానినిచూచినప్పుడు రెండవది తలఁపునకు వచ్చుట, ప్రసిద్ధము. అట్లే నలునిఁజూచుటచేత అతనితోసరియైన దమయింతి తలఁపునకు వచ్చినదని భావము.

క. దమయంతీకిలికించిత
మమృతాంశుకులావతంస! యలరించు నినున్
విమలతరతారహారము
రమణీరమణీయకుచభరంబునుబోలెన్. 23

టీ. అమృతాంశుకులావతంస - అమృతాంశు = అమృతమయమయిన కిరణములు గలవానియొక్క, అనఁగా, చంద్రునియొక్క, కుల=వంశమునకు, అవతంస-భూషణమువంటి, నలమహీధవా! దమయంతీ కిలికించితము -దమయంతీ= దమయంతీదేవియొక్క, కిలికించితము=శృంగారభావమువలనఁ బుట్టినచేష్ట, విమలతర=మిక్కిలినిర్మలమైన, తారహారము=ముత్యాలహారములు గల,రమణీ...పోలెన్.రమణీ=దమయంతియొక్క, రమణీయ=మనోహరమైన కుచభరంబును+పోలెన్ = స్తనములయొక్క అతిశయమువలెనే, నినున్=నిన్ను, అలరించున్=సంతోషపెట్టును.

తా. ఓనలమహారాజా! దమయంతీదేవియొక్క శృంగారచేష్ట తారహారములుగల యామె స్తనాతిశయము సంతోషపెట్టినట్లు నిన్ను సంతసింపచేయగలదు. అలం. దృష్టాంతము.

తే. సౌరభము లేనియట్టి పుష్పంబువోలె
గండుఁగోయిల వెలియైన కానవోలె
నధిప! దమయంతితోడి సఖ్యంబులేని
నీదుసౌందర్యవిభవంబు నిష్ఫలంబు. 24

టీ. అధిపా = ఓరాజా, దమయంతితోడి సఖ్యంబు=దమయంతీదేవితో స్నేహము, లేని...విభవంబు-లేని=లేనట్టి, నీదు=నీయొక్క, సౌందర్యవిభవంబు=సౌందర్యసంపద, ...పుష్పంబువోలెన్=

లేనట్టిపూవువలెను, గండుకోయిల=మగకోకిల, వెలి=దూరము, వినకానవో లెక్ =వినట్టి యడవివలెను, నిష్ఫలంబు=ప్రయోజనములేనిది.

తా. ఓరాజా! దమయంతితో స్నేహములేనట్టి నీదుసౌందర్యము పెంపం తయు పరిమళములేని పుష్పమువలెను, కోయిలలేనివనమువలెను వ్యర్థము.

అలం = వినోక్తి.

వ. కావున నిఖిలవైమానికనికాయకామ్యమానయైన నమ్మాన వతికి నిన్నుం గూర్ప నాకు నేర్పుగలదు. అక్కొమ్మ నెమ్మనంబున నిన్నుం దక్కం దక్కొరుం బరిగ్రహింపకుండునట్లుగా భవ ద్గుణంబులు ప్రశంసించెద. నన్నుం బనిగొమ్ము లెమ్ము. కా ర్యంబునన యార్యులు నిజప్రయోజనంబు నెఱింగింతురు గాని మాటలం బ్రకటింప రని పరిస్ఫుటంబుగాఁ బలికిన. 25

టీ. కావునన్ = కాఁబట్టి, నిఖిల... కామ్యమాన - నిఖిల = సమస్త మయిన, వైమానిక = దేవతలయొక్క, నికాయ = సమూహములచే, కామ్య మాన = కోరఁబడుచున్నది, అయిన యమ్మానవతికిన్ = అయినట్టిదమయంతి తో, నిన్నున్, కూర్పన్=సంఘటించుటకు, నాకు నేర్పుగలదు, అక్కొమ్మ= ఆదమయంతి, నెమ్మనంబునన్=మనస్సుచే, నిన్నున్, తక్కన్=నిన్నువిడి చి, తక్కొరున్=మఱియొకరిని, పరిగ్రహింపక=వరింపక, ఉండునట్లుగా, భవ త్+గుణంబులను=నీయొక్క సద్గుణములను, ప్రశంసించెదన్=పొగడెదను, అనఁ గా-దమయంతి మనస్సు నీయందే లగ్నమగునట్లు నీగుణంబులను కొనియా డెదనని భావము, పనిగొమ్ము=పంపుము, లెమ్ము, కార్యంబునన్+అ=కార్యముచే తనే, ఆర్యులు=పెద్దలు, నిజప్రయోజనంబున్=తాముచేసిన ఫలమును, ఎఱింగిం తురు గాని=తెలియఁజేయుదురు గాని, మాటలన్, ప్రకటింపరు=వెల్లడిపఱుపరు, అని, పరిస్ఫుటంబుగాన్=మిక్కిలి స్పష్టముగా, పలికినన్=పై పద్యముతో నన్వయము.

తే. ఆద్విజాధిపువలన సంప్రాప్తమయిన

వాక్సుధాధారఁ గ్రోలి భూకవల్లభుండు
లలితలీలఁ దదుద్గారకలవము వ్రోలె
మొలకనవ్వు వహించెఁ గెకమ్మోవిమీఁద. 26

టీ. ఆద్విజాధిపువలనన్ - ఆహంసవలన, సంప్రాప్తము = లభించినది, ఐన వాక్సుధాధారన్ = అయినట్టి వాక్యములనెడి సుధారసమును, భూవల్లభుండు = నలమహారాజు, క్రోలి = త్రావి, లలిత = సుందరమైన, లీలన్ = విలాసముచే, కెమ్మోవిమీఁదన్ = అధరోష్ఠముమీఁద, మొలకనవ్వు = మందహాసము, తదుద్గారలవము + పోలెన్, తత్ = ఆత్రావిన సుధారసమును, ఉద్గార = వెళ్లఁగ్రక్కుటవలనఁ బడినట్టి, లవము + పోలెన్ = లేశమువలెనే, వహించెన్ = ప్రకాశించెను. నవ్వు తెల్లగా నుండుననుట కవిసమయసిద్ధము. కాన నది తెల్లనియమృతలేశమువలె నున్నదని భావము.

తా. నలమహారాజు హంసముచెప్పిన వాక్యము లనెడియమృతముఁద్రావి మందహాసముఁజేసెను. ఆ మందహాసము, సుధారసమునుగ్రోలి తృప్తుఁ డగుటచే వెడలఁగ్రక్కుచున్నయమృతలేశమువోలెఁ బ్రకాశించెను.

అలం = ఉత్ప్రేక్ష.

వ. ఇవ్విధంబున మందస్మితసుందరవదనారవిందుం డై కరారవిందంబునం బతంగపుంగవునంగంబు నివురుచు మృదుభాషణంబుల నిట్లనియె. 27

టీ. ఇవ్విధంబునన్ = ఈరీతిగా, మందస్మిత ... అరవిందుండై - మందస్మిత = చిఱునవ్వుచే, సుందర = సొగసైన, వదనారవిందుండై = ముఖపద్మముగలవాఁడై, కరారవిందంబునన్ = పద్మమువంటి చేతిచే, పతంగపుంగవునంగంబు = పక్షిశ్రేష్ఠముయొక్క శరీరమును, నివురుచు = దువ్వుచు, మృదుభాషణంబులన్ = మృదువాక్యములచే, ఇట్లనియె.

సీ. అండజాధీశ! నీకయాకారరేఖతోఁ
దులఁదూఁగలేవు వకసువులు జగతి

నీడోద్భవశ్రేష్ఠ! నీదుసౌశీల్యంబు
పలుకుల కందంగఁ గొలఁది గాదు
పతగపుంగవ! నీ సుభాషితంబులయట్ల
యవయవంబులు సువర్ణాత్మకములు
పక్షివంశవతంస! పక్షపాతము నీకు
గతియంద కాదు సద్వితతియందు
తే. నధిక తాపపరీతాత్ముఁడైన నాకు
నెట్లు వచ్చితి చలిగాడ్పునట్లు నీవు
పూర్వజన్మమహాతపస్స్ఫురణఁ జేసి
నీదుసన్నిధి సమకూరె నిధియుఁబోలె. 28

టీ. అండజాధీశ=ఓపక్షిరాజా, జగతిన్=భూమియందు, నీయాకారరేఖతోన్=నీరూపముతో,వస్తువులు=పదార్థములు, తులదూఁగలేవు=సమానములుకానేరవు, అనఁగా నీవు నిరుపమానుండైనవాఁడవని యభిప్రాయము. నీడోద్భవశ్రేష్ఠ=ఓపక్షిశ్రేష్ఠమా, నీదుసౌశీల్యంబు=నీమంచి ప్రవర్తనము, పలుకులకున్=మాటలకైనను,అందంగన్ కొలఁదిగాదు=అందశక్యముకాదు - అనఁగా నీప్రవర్తన మిట్టిదని నిర్వచింప నెవ్వరికిం దరముకాదనుట. పతంగపుంగవా=ఓపక్షిశ్రేష్ఠమా, నీసుభాషితంబులయట్ల=నీమంచిమాటలువలెనే, అవయవంబులు=అంగములు, సువర్ణాత్మకములు=కాంచనమయములైనవి (వాక్యపక్షమందు మంచి అక్షరములుగలవి యనియు నర్థము) అనఁగా—నీ సుభాషితములు మంచివర్ణములతో కూడుకొన్నవనియు, నీ యవయవములు కాంచనమయములయినవనియు భావము. పక్షివంశవతంస-పక్షివంశ=పక్షికులమునకు, వతంస=శిరోభూషణము వంటివాఁడా! నీకు, పక్షపాతము = ఱెక్కలయొక్కపడుట (మఱియు, దయయనియు నర్థము) గతియంద = నడుచుటప్పుడే, కాదు, సద్వితతియందు = సజ్జనులయందుఁగూడ, (కలదు). అనఁగా-ఓపక్షిరాజమా! నీకు గమనమందుపక్షపాతముండుట సహజమే. మఱియుఁ

పక్షపాతము సజ్జనులయందుఁగూడ నున్నదనిభావము. సాధులయందు దయగలవాఁడ వని ఫలితార్థము. అధిక తాప పరీతాత్ముఁడు - అధిక = మిక్కిలి, తాప = సంతాపముచే, పరీత = చుట్టఁబడిన, ఆత్ముఁడు = మనస్సుగలవాఁడు, అయిన నాకున్ = ఇనట్టినాకు, చలిగాడ్పునట్లు = చల్లనిగాలివలెనే, నీవు, ఎట్లువచ్చితివి = ఏరీతిగా వచ్చినవాఁడవు? అనఁగా సంతాపము నార్చి సుఖము గలిగించుటకు వచ్చినాఁడ వని భావము. పూర్వ... చేసి - పూర్వజన్మ = తొంటిపుట్టువునందుఁ జేయబడిన, మహాత్ = గొప్పదయిన, తపస్ = తపస్సుయొక్క, స్ఫురణన్ చేసి = ప్రకాశము నుబట్టి, నీదుసన్నిధి = నీయొక్క సమక్షము, నిధియున్ బోలెన్ = నిధివలెనే, సమకూరెన్ = కలిగెను.

తా. ఓ పక్షిశ్రేష్ఠమా! నీయాకారముతో సమానమైన వస్తువులు లోకమందులేవు. నీసల్ప్రవర్తనము కొనియాడఁదరముగాదు. నీయవయవంబులు నీమాటలవలెనే సువర్ణమయమయి యున్నవి. నీకుఁగేవలము గమనమందే కాక పక్షపాతము మావంటిసాధువులయందుఁగూడఁ గలదు. మిగులఁ దాపముచే బాధింపఁబడుచున్న నాకుఁ జల్లని మందమారుతమువలె వచ్చి సంతసింపఁ జేసితివి. పూర్వజన్మమందు నాయొనర్చినతపంబు పెంపుచేత నీసందర్శనము పెన్నిధివలెనే సంప్రాప్తమయినది. లేనిచో సంప్రాప్తమగునా?

మ. త్రిజగన్మోహమహౌషధీలతిక ధాత్రీపాలకన్యావరో
ధజనోత్తంసమణిప్రరోహ మగునాతన్వంగి నేరీతులం
బ్రజలెల్లన్ వినుతింప విందు మొదలం బక్షీంద్ర! యూహింపనన్
క్కజమీవిప్పుడు సంస్తుతింప నది సాక్షాత్కారముం బొందెడు

టీ. త్రిజగత్... లతిక - త్రిజగత్ = మూఁడులోకములను, మోహ = మోహింపఁజేసెడి, లేక, వశీకారముచేసికొనెడి, మహత్ = గొప్పదైన, ఓషధీలతిక = ఓషధీలతవంటిదియు - అనఁగా దమయంతి ముల్లోకములను మోహింపఁజేసి తన వశము కావించుకోఁదగినంతసౌందర్యము కలదనుట. ధాత్రీ... ప్రరోహము - ధాత్రీపాల = రాజులయొక్క, కన్యా = కుమారికలనెడి, అవరోధజన = అంతఃపుర స్త్రీలయొక్క, ఉత్తంస = శిరోభూషణములైన, మణి = రత్నములయొక్క,

ప్రరోహము=మొలకవంటిది,అనఁగా నందఱి స్త్రీలకంటె నుత్కృష్టురాలను టు, లేక, ధాత్రీ...ఉత్తంస-ధాత్రీపాలకన్యాః=రాజకన్యలనెడి, అవరోధజన =అంతఃపుర స్త్రీలకు, ఉత్తంస=శిరోభూషణమువంటిది, అనఁగా రాజకన్య లలో శ్రేష్ఠురాలనుట, మణిప్రరోహము = రత్నాంకురమువంటిది, అనఁగా ర త్నాంకురమువలెనే మిక్కిలి మనోహరత్వము కలదనుట. అగు నాతన్వంగిన్ =అయినట్టి యాదమయంతిని, వేరీతుల్ = వేయివిధములచే, ప్రజలెల్లన్ = జనులందఱు,వినుతింపన్ = నుతించుచుండఁగా, మొదలన్ = మొట్టమొదట, విందున్ = వినుచుందును. పక్షీంద్ర=ఓపక్షిరాజమా! ఊహింపన్ =ఆలోచిం పఁగా, ఈవు=నీవు, ఇప్పుడు, సంస్తుతింపన్=నుతింపఁగా,అది=ఆదమయంతి, సాక్షాత్కారమున్ పొందెడున్ = ప్రత్యక్షమగుచున్నది. అనఁగాఁ బక్షి నలమహారాజు తన్మయత్వమందునట్లు దమయంతిగుణంబుల వర్ణించెనని భావ ము. మఱియు జనులవలన దమయంతి గుణములు విన్నప్పుడు నలునికిఁ దన్మయ త్వముకలుగక యిప్పుడు హంసవర్ణించుటవలనఁ దన్మయత్వము కలిగినదని చె ప్పుటచే హంసవచనములందున్న నిరుపమానాతిశయము తెల్లమగుచున్నది.

తా. ముల్లోకమును మోహింపజేయుటయం దోషధీలతవంటిదియు, సమ స్తరాజకుమారికలయం దుత్తమురాలును నగు నాదమయంతిని జనులందఱుఁ బలుమాఱుఁ బొగడుచుండఁగా వినుచున్నాను. ఇప్పుడు నీవు నుతింప వాకను లకుఁ గట్టినట్లున్నది. అలం-భావికము.

తే. సహృదయుండును హృదయంబు ⁘ సమ్మతింప
నరయువారికి నఖిలంబు ⁘ నకలుషంబు
చెంతనైనను సూక్ష్మ మీాక్షింపఁ జాల
దాన నాలంక్రియామాత్ర ⁘ మక్షియుగము. 30

టీ. సహృదయుండును=స్నేహితుఁడును, హృదయంబు= మనస్సును,సమ్మ తింపన్ = ఇష్టపడునట్లువచించుచుండగా, అరయువారికిన్ = పండితులకు, అఖిలంబున్=సమస్తము, అకలుషంబు = కలుషములేనిది. లేక, సందేహము లేనిదైయుండును, అనఁగా సమస్తము నిస్సంశయముగాఁ దెలియుననిభావము.

అక్షియుగము = కనుఁగవ, చెంతనైనను=దగ్గఱనున్నప్పటికిని, సూక్ష్మముఁ = చిన్నవస్తువును, ఈక్షింపఁజాలదు = చూడఁజాలదు, ఆననా...మాత్రము-ఆనన=ముఖమునకు, అలంక్రియామాత్రము=అలంకారముమాత్రమె, తదీయకార్యంబుల నెఱవేర్పసమర్థముకానిచే నిష్ఫలమనుట. అనఁగా మిత్రుఁడు తననేత్రములకంటె నధికుఁడనిభావము.

తా. స్నేహితుఁడును, దమచిత్తుఁను, సమస్తమైనపదార్థములను సందేహములు లేకుండ బోధపఱుచుచుండగాఁ బండితులకు సమస్తము చక్కఁగఁ దెలియును, దగ్గఱనున్న సూక్ష్మవస్తువునైన గ్రహింపఁజాలని కనుఁగవ వారికి ముఖమున కలంకారరూపమే యైయుండును.

ఉ. తియ్యని తేనెవోలె సుదతీతిలకంబుగుణంబు లుత్సవం
బయ్యె శ్రుతిద్వయంబునకు నాదిమకాలమునందు నిప్పుడా
తొయ్యలి నీవు సమ్మదముతో వినుతింపఁగ మన్మథాగ్నికిన్
ధాయ్యయుఁబోలె నయ్యెమదిధైర్యముపల్లటిలెన్ ఖగేశ్వరా!.

టీ. ఖగేశ్వరా = ఓపక్షిరాజమా! ఆదిమకాలమందు=మొట్టమొదట, సుదతీతిలకంబుగుణంబులు - సుదతీతిలకంబు = స్త్రీరత్నమైనదమయంతియొక్క, గుణంబులు = సద్గుణంబులు, తియ్యని తేనెవోలె = తియ్యనిమధురసమువలె, శ్రుతిద్వయంబునకున్ = రెండుచెవులకు, ఉత్సవంబు = సంతోషముకలిగించునవి, అయ్యెన్ = ఆయెను. ఇప్పుడు=ఈసమయమందు, సమ్మదముతోన్ = సంతోషముతో, నీవు, ఆతొయ్యలిన్ = ఆదమయంతిని, వినుతింపన్ = నుతించుచుండఁగా, మన్మథాగ్నికిన్ =మన్మథసంబంధమైన యగ్నిహోత్రమునకు, ధాయ్యయున్ పోలెన్ +అయ్యెన్ = అగ్నివృద్ధిచేయుమంత్రమువలెను, అయ్యెనుజుమీ, పూర్వము జనులు దమయంతి గుణంబులను వర్ణింపఁగా నాగుణంబులు చెవులకమృతరసమువలె నుండెడివికాని నీవాగుణంబుల వర్ణింప నవి మన్మథోద్రేకమును గలిగింపఁ జొచ్చిన వని భావము. దమయంతి గుణంబులను జనులు వర్ణించుటకంటె నీవు మిక్కిలి రసోద్దీపకముగా వర్ణించితివని ఫలితార్థము. మదిన్ = మనస్సునందున్న, ధైర్యము, పల్లటిలెన్ = చలించెను.

ఓపక్షిరాజమా! పూర్వ మాదమయంతి సద్గుణంబులు నాచెవులకు మధుర సమువలె సంతోషము గలిగించినవి. కాని యిప్పుడు నీవాదమయంతిసద్గుణంబులు వినుతింపగా మన్మథసంబంధమైన అగ్నిని, ప్రజ్వలింపఁజేయుమంత్రములవంటి వైనవి. నాధైర్య మంతయు నశించినది.

శా. కాలాంతఃపుర కామినీకుచతటీకస్తూరికాసౌరభ
శ్రీలుంటాకము చందనాచలతటశ్రీఖండసంవేష్టిత
వ్యాలస్ఫారఫణాకఠోరవిషనిశ్శ్వాసాగ్ని పాణింధమం
బేలా?నాపయి దక్షిణానిలము పక్షీ!చేయు దాక్షిణ్యమున్.

టీ. పక్షీ ! కాలాంతఃపుర ... లుంటాకము- కాల=యమునియొక్క, అంతఃపురకామినీ = అంతఃపుర స్త్రీలయొక్క, కుచతటీ= స్తనపార్శ్వస్థుల యందున్న, కస్తూరికా = కస్తూరియొక్క, సౌరభశ్రీ = పరిమళసంపదను, లుంటాకము=అపహరించునట్టిదియు, చందనా .. పాణింధమంబు-చందనాచల= మలయపర్వతముయొక్క, తట=చఱియలయందుపుట్టిన, శ్రీఖండ=మంచిగంధపుఁజెట్లను, సంవేష్టిత=చుట్టుకొనియున్న, వ్యాళ=పాములయొక్క, స్ఫార = గొప్పవైన, ఫణా= పడగలవల్లనుండిబయలుదేఱిన, కఠోర=క్రూరమైన,విష =విషసంబంధమైన, నిశ్వాస = ఫూత్కారములవలనఁగలిగిన, అగ్ని=అగ్నిహోత్రమునకు, పాణింధమంబు = కొలిమితిత్తివంటి, దక్షిణానిలము = మలయమారుతము,నాపయిన్ = నామీఁద, దాక్షిణ్యమున్ = దయను, ఏలాచేయును=ఎందుకుచేయును? అనఁగా చేయదనుట, మలయమారుతము విరహులకు దుస్సహముగానుండును. కావున దమయంతీవిరహముతోనున్ననలునకు యమునియంతఃపుర స్త్రీల పాలిండ్లయందలికస్తూరిని ఏహించుటచే మిగులఁ బరిమళించునట్టి దక్షిణానిలము మిక్కిలి సంతాపకరమైయుండె. చల్లని వాయువు సంతాపకరమెట్లాయె నని యూహించి యిట్లుత్ప్రేక్షించుచున్నాఁడు; ఎట్లన, మలయపర్వతమందున్న చందనవృక్షములఁ బరివేష్టించి పెక్కువ్యాళము లున్నవి. అవి వాయుభుక్కులు గనుక మలయమారుతమును నిశ్వసించి విడువ వాని ఫూత్కారముల సంబంధమువలన విషమిశ్రమైనందున గలద

గుటచే నావాయువు మిగుల సంతాపకరముగానున్నది. అట్టి విషవాయువు నన్ను దయఁజూడక బాధించుచున్నది కాన నాకెట్లయిన దమయంతిని గూర్చి యీతాపము తొలంగింపుమని భావము.

తా. యమునియంతఃపుర స్త్రీలపాలిండ్లయందున్న కస్తూరియొక్క పరిమళసంపదను హరించునట్టియు మలయపర్వతమందున్న మంచిగంధపుఁజెట్లయందలిపాముల విషాగ్నులను బ్రజ్వలింపఁ జేసెడు నదియునగు మందమారుతము నన్ను మిక్కిలి బాధించుచున్నది.

క. నెలనెలఁ దప్పకయుండఁగ
నెల భాస్కరుఁ జొచ్చుటెల్ల నియమముతోడం
గలహంస వేఁడివెన్నెల
సొలయక నాయంగకములు సూఁడుటకుఁ జుమీ. 33

టీ. కలహంస = ఓరాజహంసమా!, నెలనెలన్ = ప్రతినెలయందు, తప్పకయుండంగన్ = తప్పిపోకుండ, నియమముతోడన్ = నిష్ఠతో, నెల=చంద్రుఁడు, భాస్కరున్ = సూర్యుని, చొచ్చుటెల్లన్ = ప్రవేశించుటంతయు, వేఁడివెన్నెలన్ = వెచ్చనివెన్నెలలచేత, సొలయక = వెనుదీయక, నాయంగకములు = నాయవయవములను, చూఁడుటకుసుమీ = కాల్చివేయుటకుసుమీ. ప్రతియమావాస్యయందును జంద్రుఁడు సూర్యునితోఁ గలియుచుండుట సుప్రసిద్ధము. ఇట్లుండ దమయంతీ విరహాతిన్నుఁడయిన నలుఁడు తనకు వెన్నెలవేఁడిగా నుండుటచే నిట్లూహించె. ఈచంద్రుఁడు నన్ను బాధింపనెంచి శీతకిరణుఁడగుటచే నేమియుఁ జేయలేక కోపముతో దనకిరణములకు వేఁడిమిఁగలిగించికొని 'నన్ను బాధింపవలె ననియెంచియే ప్రతినెలయందు తాను సూర్యునిఁ జొచ్చుచున్నాఁడు. లేనిచోఁ జంద్రునికి సూర్యునిఁజొరదా నేమియవసరము. అనఁగా - వెన్నెల తనకు మిక్కిలి బాధకరముగా నున్నదని యర్థము.

తా. చంద్రుఁడు ప్రతిమాసమునందుఁ దప్పిపోకుండ నియమముతో సూర్యునిఁ బ్రవేశించుటంతయు, వేఁడివెన్నెలలచే నాదేహమును గాల్చుటకేచుమీ? చంద్రుఁడు ప్రతిమాసమునందు సూర్యునితోఁగలియుట వేదాదిప్రసిద్ధము.

అలం=ఫలోత్ప్రేక్ష.

ఉ. మోహము దాహముం మదికిఁ మూడ్చుచు నున్నవి పాయ
దెప్డు సం, దేహము మీనకేతనునిదివ్యశరంబులుపువ్వుమొ
గ్గలో, యూహ యొనర్పఁగాఁ బిడుగులో కులిశంబుల వె
ట్లు భారతీ, వాహకులావతంస ! విషవల్లిసముద్భవముల్
ప్రసూనముల్. 34

టీ భారతీవాహకులావతంస= ఓహంసకులావతంసమా? మీనకేతనుని దివ్య శరంబులు = మన్మథునియొక్క శ్రేష్ఠమైన శరంబులు, మదికిన్ = మనస్సునకు, మోహము = మూర్ఛను, దాహమున్ = తాపమును, మూడ్చుచునున్నవి = కలిగించుచున్నవి, ఊహ యొనర్పఁగాన్ =ఆలోచింపఁగా, మీనకేతనునిదివ్య శరంబులు, పూవుమొగ్గలో, కాక, పిడుగులో యసి,ఎప్పుడున్ =ఎల్లప్పుడును,సందేహము=సంశయము, పాయదు=విడువదు, అవి=ఆబాణములు, కులిశంబులు= వజ్రాయుధములు,ఎట్లు=ఎట్లగును? అనఁగాఁ గేవలపుష్పములుకావు పిడుగులనుగావనియర్థము. ప్రసూనముల్ =పువ్వులు, విషవల్లిసముద్భవములు-విషవల్లి= విషసంబంధమైన తీఁగెయందు, సముద్భవముల్ =పుట్టినవి.

తా. ఓహంసమా! మన్మథబాణములు నామదికి మోహతాపములఁగలిగించుచున్నవి. అవి పువ్వులేయయినచో నాకిట్లు కలిగించునా? కాన నవి పిడుగులయి, యుండవచ్చును. పిడుగులుమోహముకలిగింపలేవుకాన నవిపిడుగు లెట్లగును? అవి పువ్వులేయయినానాపువ్వులు విషవల్లియందుఁబుట్టినవై యుండును. కానిచో నింతతాపము కలిగించునా ?

వ. కావునం దీరంబు లేనివిరహభారం బను పారావారంబున మునుంగం బాఱుచున్న నాకుం దెప్పగా విరించి నిన్నుఁ గల్పించినాఁడు. మిముబోంట్లగు పెద్దలగుణంబులు పరార్థప్రవణంబులుగదా! పొమ్ము. కార్యమ్ము సాధింపుము. పునస్సమాగంబయ్యెడు. నీవు వచ్చునంతకు నిచ్చోటన యుండుదుం జుమీ మాతమ్ముగదా నీ గమనవేగం బని పల్కి యన్నీడజంబు వీడు

కొల్పి క్రీడావనంబులో నొక్కనికుంజక్రోడంబునీడ నన్న రేంద్రుండు చంద్రకాంతశిలాతలంబున విశ్రమించి రాయంచపలుకులు మనంబునం దలపోయుచుండెఁ గలహంసంబు ను నలుని వీడ్కొని భూమండలమండనాయితం బైనకుండినగరంబున కభిముఖంబై ప్రార్థనాసిద్ధిసూచకంబు లగు ననుకూలగంధవాహాదినానావిధశుభనిమిత్తంబు లనుసంధించుచు నికషపాషాణపట్టనిభం బయిననభస్స్థలంబునం దన పసిండి తెక్క లొరవెట్టుచందంబున నందంబుగా ఘూంకారితపతత్త్రిధారావిహారంబున గోడివడి డిగ్గునప్పు డలదిగువన నున్నపతంగంబులు వడవడవడంకుచు నొంటెకంటఁ గనుంగొన నొక్కొక్కమాఱు విధూతపక్షతియును, నొక్కొక్కసారి యూర్ధ్వాయనదుర్విభావంబును, నొక్కొక్కమాటు వితతీకృతనిశ్చలచ్ఛదగుచ్ఛంబును, నగుచు వనంబులు గడచి శైలంబులుదాఁటి నదులు లంఘించి చనిచని ముందట. ౯౯

టీ. కావున, తీరంబు=ఒడ్డు, లేని విరహభారంబు=లేనట్టి వియోగాతిశయము, అనుపారావారంబునన్ = అనెడి సముద్రమందు, అనఁగా:- పారములేని వియోగ సముద్రమనియర్థము. మునుంగం బొలుచున్న=మునుఁగుచున్నట్టి, నాకు, తెప్పగాన్ = తెప్పకొయ్య గా, విరించి=బ్రహ్మ, నిన్ను, కల్పించినాఁడు=సృజించినాఁడు, మిముబోంట్లు, అగు పెద్దలగుణములు=ఐనట్టి పూజ్యుల గౌనంబులు, పరార్థప్రవణంబులు-పర=పరులయొక్క, అర్థ= కార్యములయందు, ప్రవణంబులకదా=ఆసక్తి గలిగినవిగదా- అనఁగా మీవంటివా రెప్పుడును బరోపకారంబునకే పాటుపడుచుందురని భావము. పొమ్ము, కార్యంబుసాధింపుము=పని నెఱవేర్పుము, పునస్సమాగమంబు=తిరిగి కలిసికొనుట, అయ్యెడున్, అని=పలికి, నీవు, వచ్చునంతకున్=వచ్చునంతకాలము, ఇచ్చోటన్, ఉండుదుఁ జుమీ = పసిం

చెదనుజుమీ, చూతము కదా, నీగమనవేగంబు=నీ గమనముయొక్క యూర వడిని, అని పలికి, ఆనీడజంబు=ఆహంసమును, వీడుకొల్పి=విడిచిపుచ్చి, లేక, పంపించి, క్రీడావనంబులోన్ = ఆయుద్యానవనంబులోపల, ఒక్క...నీడన్ -ఒక్కనికుంజ = ఒకపొదరింటియొక్క, క్రోడంబు=మధ్యభాగముయొక్క, నీడన్=నీడయందు, అన్నరేంద్రుండు=ఆనలుఁడు, చంద్రకాంతశిలాతలంబునన్-చంద్రకాంత శిలా=చంద్రకాంత మణిమయమైన, తలంబునన్ = ప్రదేశమందు, విశ్రమించి, రాయంచ పలుకులు=ఆరాజహంస పలికినపలుకులు, మనంబునన్, తలపోయుచుండెన్=స్మరించుకొనుచుండెను, కలహంసంబును=రాజహంసయు, నలునిన్, వీడ్కొని = విడిచి, భూమండలమండనాయితంబు = భూమండలమున కలంకారమువంటిది, ఐన కుండినసగరంబునకున్ = ఐనట్టి కుండిన మను పేరుగల పట్టణమునకు, అభిముఖంబై =ఎదురుముఖముగలదై, ప్రార్థన...సూచకంబులు-ప్రార్థన=కోరికలయొక్క, సిద్ధి=నెఱవేఱుటను, సూచకంబులు=తెలుపుచున్నవి, అగు ననుకూల...నిమిత్తములు, అగు=అయిన, అనుకూల=తగియున్న, గంధవాహ=వాయువు,ఆది=మొదలుగాఁగల, నానావిధ=అనేకవిధములైన, శుభనిమిత్తంబులు=శుభ శకునములను, అనఁగా - కార్యార్థము పోవునపుడు, మలయమారుతము వీచినచోఁ గార్యము సిద్ధించునని యార్యులంద్రు, అనుసంధించుచున్=విమర్శించుచు, నికష...నిభంబు, నికష=సానయనెడు, పాషాణపట్ట=రాతిపలకతో, నిభంబు=సమానము, ఐనసభస్థలంబునన్=ఐన యాకాశమందు, తనపసిండిరెక్కలు=తన కనకమయమయిన రెక్కలు, ఒరపెట్టుచందంబునన్=రాచునట్లుగా, అందంబుగా=సొగసుగా, అనఁగా నల్లని యాకాశమున నెగయుచున్న యాహంసయొక్క బంగారురెక్కలు శాణముపై రాచఁబడిన బంగారపుగీఁతలవలె నొప్పుచున్నవని యర్థము. ఝూంకారిత...విహారంబునన్ -ఝూంకారిత=ఝూంకారధ్వనిగల, పతత్త్ర=ఱెక్కలయొక్క, ధార=గతిభేదములయొక్క, విహారంబునన్=విహరించుటచేత, గోడివడి=తగ్గి, డిగ్గునప్పుడు=దిగుసమయమందు, అలదిగువన్=ఆక్రింది భాగమునందు, ఉన్న పతంగంబులు=ఉన్న పక్షులు, వడవడన్, వడంకుచున్,

ఒంటికంటన్ =ఒక కంటిచే, కనుఁగొనన్ =చూచుచుండగా, అనఁగా ఆహం
సము క్రిందికిఁదిగుచున్నప్పుడు క్రిందనున్న పక్షులు తమకేదేనియుపద్రవముఇచ్చు
చున్నదేమో యనిభ్రమఁజెంది భయముచే ఐడఁకుచు నాదిక్కు చూచుచున్నవ
నియర్థము:ఒక్కొకమాఱు,విధూత పక్షతియును,విధూత=కదల్పఁబడిన, పక్షతి
యును=రెక్కలు కలదియును, ఒక్కొకసారి, ఊర్ధ్వ...భావంబును-ఊర్ధ్వ
=ఎత్తయిన, అయన=మార్గముచే, దుర్విభావంబును=చూడరానిదియు, అనఁ
గా-ఆహంస మిక్కిలి దూరమార్గమందున్నదగుటచే, లోకులకుఁ గానరాకు
న్నదని భావము. ఒక్కొక్కమాటు, వితతీకృత...గుచ్ఛంబును-వితతీకృత=
విస్తరింపఁబడినట్టిదియు,నిశ్చల=చలింపనిదియును, అగు,ఛద=పిల్లఱెక్కలయొ
క్క, గుచ్ఛంబును=సమూహముగలదియు, అగుచున్, వనంబులు, కడచి=
దాఁటి, శైలంబులు=పర్వతములను,దాఁటి, నదులను, లంఘించి=దాఁటి, చని
చని=పోయిపోయి, ముందట=తనయెదుటిభాగమునందు - అని పైపద్యములో
నన్వయము.

ఉ.అండజరాజు గాంచె లవణాంబుధివేష్టితమేదినీవధూ
కుండలమండనం బయిన కుండినమున్ నిజకీర్తికల్పితా
ఖండలపట్టణప్రథన ఖండనమున్ క్రథకైశికేంద్రదో
ర్దండబలాభిగుప్తము నుదగ్రహిరణ్మయవప్రదీప్తమున్.

టీ. అండజరాజు = ఆహంసరాజము-నిజ...ఖండనమున్ - నిజ=తనయొక్క,
కీర్తి=కీర్తిచేత,కల్పిత=కల్పింపబడిన, ఆఖండలపట్టణ=స్వర్గపట్టణముయొక్క,ప్ర
థన=ప్రసిద్ధియొక్క,ఖండనమున్ =నిరసనోక్తి కలదియు- అనఁగా స్వర్గపురము
నునిరసించుచున్నదని భావము,క్రథ...గుప్తము, క్రథకైశికేంద్ర=క్రథకైశికుల
కధిపుఁడగు భీమరాజుయొక్క, దోర్దండ=బాహువుల సంబంధమైన, బల=బల
ముచేత, అభిగుప్తమున్ =రక్షింపఁబడుచున్నదియు,ఉదగ్ర... దీప్తమున్ -ఉ
దగ్ర=మిక్కిలి పొడుగైన, హిరణ్మయ=సువర్ణమయమైన, వప్ర=పుట్టకోటచే
త, దీప్తమున్ =ప్రకాశించుచున్నదియు, లవణ...మండనంబు-లవణాంబుధి=సము
ద్రముచే, వేష్టిత=చుట్టఁబడిన, మేదినీ=భూమియనునెడు, వధూ= స్త్రీయొక్క,

కుండల మండనంబు=కుండలమనెడి యలంకారమునంటిది, అనఁగా భూమికి శోభగలిగించెడిదనుట. అయిన కుండినమున్ =ఐనట్టికుండిన పట్టణమును, కాంచెన్ =చూచెను.

తా. ఆహంసమట్లు పోయిపోయి స్వర్గపట్టణమును నిరాకరించునట్టి యందముగలదియు, భీమభూపాలునిచేఁ బరిపాలింపఁ బడునదియు, పొడువైన కనకమయ వప్రములుకలదియు, భూదేవతకుఁ గర్ణభూషణమువలెఁ బ్రకాశించునట్టి కుండిన నగరమును జూచెను.

వ. అప్పట్టణంబున కరుగఁ బ్రాకారంబు లగుప్రాకారంబులవలనను, నారసాలలగంభీరసలిలసంచారంబు లగుపరిఖాకూపారంబులవలనను, ప్రస్ఫుటస్ఫటికోపలవిగ్రహంబు లగుగృహంబులవలనను, శశిభిత్తివిమలభిత్తి సముత్సేధంబు లగుసౌధంబులవలనను, నింద్రనీలమణిచ్ఛాయాకల్పితాకాలకాలికలగు చంద్రశాలికలవలనను, కేలీవిలోల బాలికాకుచలికుచఘుసృణపంకకషాయితాంభఃపూరంబు లగుకాసారంబులవలనను, ఘనఘనాఘనఘటాకఠోరఘుర్ఘురధ్వానగోధూమ ఘరట్టంబు లగుహట్టంబులవలనను, అనిలచలచ్చేలాంచలదండతాడనావిహితహేళి హయాళీకాలనక్రియాదత్తానూరు విశ్రాంతు లగుప్రాసాదవైజయంతులవలనను, నవవికచవివిధకుసుమవాసనాపేటిక లగులీలోద్యానవాటికలవలనను, బటీరకర్పూరకస్తూరికాకుంకుమసంకుమదహిమాంబుప్రముఖనిఖిలపరిమళవస్తువిస్తారసౌరభోద్గారసముత్పణంబు లగునాపణంబులవలనను, హావభావవిలాసవిభ్రమైకభాజనంబు లగువనితాజనంబులవలనను, జవవిజితమరుత్తురంగంబులగు తురంగంబులవలనను, అసమసమరవిజయకారణంబు లగువారణంబులవలనను, నభిరామంబై యక్కలహంసంబునకుఁ

గాతుకం బాపాదించె వెండియు. 37

టీ. అప్పట్టణంబునకున్ =ఆకుండిన నగరంబునకు,అరుగన్ = వెళ్లఁగా,వప్రదీప్రాకారంబులు-వప్ర=వప్రములచే,దీప్ర=ప్రకాశించునట్టి,ఆకారంబులు=ఆకృతులుగలవి, అగుప్రాకారంబులవలనను=ఐనట్టి చుట్టుగోడల వలనను, ఆరసాతల...సంచారంబులు-ఆరసాతల=పాతాళము పర్యంతముపోయినదియు, గంభీర=లోఁతైన,సలిలసంచారంబులు=జలప్రవాహంబులుగలవి,అగు, పరిఖాకూపారంబులవలనను=అయినసముద్రమువంటియగడ్తలవలనను,ప్రస్ఫుట...విగ్రహంబులు- ప్రస్ఫుట=గొప్పవైన,స్ఫటిక+ఉపల=పటికపురాలచేఁగట్టఁబడిన,విగ్రహంబులు=ఆకారంబులుగలవి, లేక, స్ఫటికములచే నిర్మితములయిన బొమ్మలుగలవి, అగు గృహంబులవలనను = ఐనట్టి మందిరములవలనను-శశిభిత్తి...భేదంబులు, శశిభిత్తి = చంద్రఖండమువలె, విమల = తెల్లని, భిత్తి = గోడలచే, సముచ్ఛేదంబులు = పొడుగైనవి, అగు సౌధంబులవలనను = అయిన మేడలవలనను, ఇంద్రనీల...కాలికలు - ఇంద్రనీలమణి = ఇంద్రనీలమాణిక్యములయొక్క, ఛాయా=కాంతులచేత, కల్పిత=కల్పింపఁబడిన,అకాల=అసమయమునందలి, కాలికలు=మేఘముల సమూహములుకలవి, అగుచంద్ర శాలికలు = ఐనట్టి శిరోగృహములచేతను, అనఁగాఁ జంద్రశాలలం దమర్పఁబడినయింద్రమాణిక్యములకాంతిపుంజంబు మేఘసమూహంబువలెఁ గానవచ్చుచున్నదనిభావము. కేళీవిలోల...పూరంబులు - కేళీ = ఆటలయందు, విలోల = ఆసక్తిగల, బాలికా= స్త్రీలయొక్క, కుచలికుచ = నిమ్మపండ్లవంటి పాలిండ్లయందున్న, ఘుసృణ=కుంకుమయొక్క, పంక=బురదచేత, కషాయిత = ఎఱ్ఱనైన, అంభఃపూరము=ఉదకసమూహములుకలవి, అగు కాసారంబులవలనను =ఐనట్టి సరస్సులవలనను,ఘనఘనా... ఘరట్టంబులు-ఘన=దట్టమైన,ఘనాఘన = వర్షాకాలసంబంధమైన మేఘములయొక్క, ఘటా= సమూహమువలె, కఠోర=నిష్ఠురములైన, గర్ఘరధ్వాన= గర్ఘరధ్వనులు చేయుచున్నట్టి, గోధూమ=గోధుమలను విసరుచున్న,ఘరట్టంబులు = తిరుగళ్లుగలవి, అగు హట్టంబులవలనను = ఐనట్టి అంగడివీధులవలనను, అనఁగా గోధూమాదులను విసరుచుండునప్పుడా తిరుగ

ళ్లనినాదములు వర్షాకాలమేఘముల గర్జనముబోలుచున్నవనుట. అనిల...వి
శ్రాంతులు-అనిల=గాలిచేత, చలత్=చలించుచున్న, చేలాంచల=గుడ్డయొక్క
అంచుగల, దండ=కొయ్యయొక్క, తాడన=తాఁకుడుచేత, విహిత=కల్పింపఁ
బడినట్టి, హేళి=సూర్యునియొక్క, హయాళి = గుఱ్ఱములగుంపుల, కాలనక్రి
యా=ప్రేరణచేయుటయనెడి వ్యాపారముచేత, దత్త= ఇయ్యఁబడిన, అనూరు
=సూర్యసారథియొక్క, విశ్రాంతులు=శ్రమతీర్చుకొనుటకలవి, అగు ప్రాసా
ద...వలనను- అగు ప్రాసాద=అయిన మేడలయందున్న, వైజయంతులవలనను
=జండాలవలనను, అనఁగాఁ గుండినగరమందున్న మేడల యుపరిభాగంబున
వైజయంతులు ప్రకాశించుచుండఁగా,దాని స్తంభాగ్రములుమీఁదనుండి పోవుచు
న్నసూర్యుని హయములకుఁదాఁకెను. ఆదెబ్బలచే సూర్యాశ్వంబులు చోదన
క్రియలేకయే నడుచుచుండుటచే వానిని జోదనచేయుననూరుఁడు విశ్రాంతి
దీసికొనుచున్నాఁడని భావము. అనఁగా నందలి మేడలు సూర్యమండలము
దాఁక వ్యాపించిన వని ఫలితార్థము.నవ... పేటికలు-నవ=క్రొత్తగా, వికచ=
వికసించిన, వివిధ = పలురకములైన, కుసుమ = పువ్వులయొక్క, వాస
నా = పరిమళమునకు, పేటికలు = పెట్టెలవంటివి, అగు లీలోద్యానవాటికల
వలనను=ఐనట్టి ఉద్యానవనములవలనను, పటీర...సముత్పణంబులు - పటీర=
మంచిగంధము, కర్పూరము, కస్తూరికా=కస్తూరి, కుంకుమ=కుంకుమను, సంకు
మద=జవ్వాది, హిమాంబు=చల్లనినీరు,లేక పన్నీరు,ప్రముఖ=మొదలుగాఁగల,
పరిమళవస్తు=పరిమళపదార్థములయొక్క, విస్తార = అధికమైన, సౌరభ =పరి.
మళమును, ఉద్గార=వెడలఁగ్రక్కుటచే, సముత్పణంబులు = నుతింపఁదగినవి,
అగు, ఆపణంబులవలనను = అంగళ్లవలనను, హావ...భాజనంబులు - హావ =
హావము, భావ=భావము, విలాస=లీలఅనెడి శృంగారచేష్టలయొక్క, విభ్రమ
=విలాసములకు,ఏక=ముఖ్యమయిన,భాజనంబులు=పాత్రములు,అగు వనితాజనం
బులవలనను = ఐనట్టిస్త్రీసమూహములవలనను, జవవిజితమరుత్కురంగంబులు-
జవ=జవముచే,విజిత=జయింపఁబడిన, మరుత్=వాయువుయొక్క, కురంగంబు
లు=లేళ్లుగలవి, అగు తురంగంబులవలనను=ఐనట్టి గుఱ్ఱములవలనను, అనఁగా

వాయువేగమును మించినవనుట,అసమ... కారణంబులు_అసమ=సాటిలేని,సమర=యుద్ధములయందు, విజయ = గెలుపునకు, కారణంబులు = హేతువులు, అగు వారణంబులవలనను=ఐనట్టి యేనుంగులవలనను, అభిరామంబై - సొగసైనదయి, అక్కలహంసంబునకు = ఆహంసకు, కౌతుకంబు, ఆపాదించెన్=కలిగించెను, వెండియుక్=మఱియును, అని పైపద్యమునకో నన్వయము.

తే. పరిఖ గుడివోలెఁ దనచుట్టుఁ దిరిగియుండఁ
బరుల కేరికి గ్రహణగోచరము గాక
విషధరాధీశ భాషిత విషమభాష్య
ఫక్కికయుఁ బోలె నొప్పె నప్పట్టణంబు. 38

టీ. అప్పట్టణంబు=ఆకుండినపురము, పరిఖ=అగడ్త, తనచుట్టుక్ = తననలువైపుల, గుడివోలెక్ = వలయాకారరేఖవలెనే, (మఱియు వరరుచి భాష్యము శేషునికిఁదప్పనొరులకుఁ దెలియదని మండలిరేఖయుంచెనని ప్రసిద్ధి ఆవరరుచియుంచిన కుండలనారేఖవలెననియునర్థము.) తిరిగియుండక్ =చుట్టుకొనియుండఁగా,పరులకుక్=ఇతరులకు, ఏరికిక్ =ఎవరికిని, గ్రహణగోచరము=ప్రవేశింపవలనుపడునది, కాక=కాకుండ, భాష్యపక్షమందు:—పరులకున్=అనంతునికిఁదక్కఁ దక్కినవారికి, గ్రహణగోచరము = తెలిసికొనవలనుపడినది, కాక=కాకుండ, విష... పోలెన్-విషధర = సర్పములకు, అధీశ=ప్రభువుచే (అనఁగా పతంజలిచే),భాషిత=రచింపఁబడిన,విషమ=దురవగాహమైన,భాష్యఫక్కికయుఁబోలెక్=మహాభాష్యస్థమైన కుండలిగ్రంథమువలెనే, ఒప్పెక్=ప్రకాశించెను.

తా. పతంజలిచే రచింపఁబడిన మహాభాష్యస్థకుండలి గ్రంథము పరులకెవ్వరికిని గ్రహింపశక్యముకానియట్లు ఆకుండినపురము భయంకరమైన యగడ్తచేఁ జుట్టుకొనఁబడి శత్రువులకెవ్వరికిని సాధింపఁదరముఁగానిదై ప్రకాశించెను.

అలం=ఉత్ప్రేక్ష.

క. నెలపొడుపుల సురనది ని
ర్మలతరతదగారకుట్టిమస్రవదిందూ
పలతుందిలాప యగుచుం
దెలివొందుఁ బతివ్రతౌచితీసంపత్తిన్. 39

టీ. సురనది = గంగానది, నెలపొడుపులన్ = చంద్రోదయకాలముల యందు,నిర్మల...తుందిలాప-నిర్మలతర=మిక్కిలిస్వచ్ఛమయిన, తత్ =ఆకుండి ననగరమందున్న, గృహ=గృహములయొక్క, కుట్టిమ =కట్టడపు నేలల సంబంధమైనట్టియు, స్రవత్ = స్రవించుచున్న, ఇందూపల = చంద్రకాంతపురాలచేత, తుందిల=వృద్ధిఁజెందిన, ఆప = నీటిసమూహముగలది. అగుచున్, పతివ్రతౌచితీసంపత్తిన్ - పతివ్రత = పతివ్రతా స్త్రీలయొక్క, ఔచితీసంపత్తిన్ = ఔచిత్యసంపదచే, తెలివొందున్ =సంతసించును. పతివ్రతా స్త్రీలు తమభర్తలు సంతసించుచుండునపుడు సంతసించుటయు దుఃఖించునపుడు దుఃఖించుటయుఁ బ్రసిద్ధము. ఇందులకుఁ బ్రమాణము. "ఆర్తార్తే ముదితాహృష్టే ప్రోషితేమలినాకృశా"అనియున్నది. కావునఁ జంద్రోదయకాలమందుఁ దనభర్తయగు సముద్రుఁడు వృద్ధిఁజెందుటచూచి గంగానదియుఁ గుండినపురసౌధములందలి కుట్టిమప్రదేశములందుఁ గూర్పఁబడిన చంద్రశిలలు చంద్రకాంతులచేతఁ గరఁగి తనలోఁగలియుటచేఁ దాను వృద్ధిపొంది తనపతివ్రతాధర్మమును నిలుపుకొనుచున్నదని భావము. అనగా కుండిననగరమందున్న గృహములు గంగానదికంటెఁ బొడువుగా నున్నవనుట.

తా. గంగానది చంద్రోదయకాలములయందుఁ దనభర్త వృద్ధిఁజెందుట చూచి తానునాకుండిననగరమందున్న కట్టడపునేలలయందున్న చంద్రకాంతశిలలు చంద్రోదయకాలములయందుఁగరఁగిస్రవించి తనలోఁ గలియుచుండుటచే వృద్ధిబొంది తనపాతివ్రత్యమును దెలియఁజేయుచున్నది. అలం.అతిశయోక్తి.

తే. క్రుంకఁ బొలుసహస్రాంశుఁ డే గూడలేక
వెనుకఁ జిక్కినజరదంశువితతి వ్రాలెఁ

బొలుచు నపరాహ్ణవేళ నశేప్పురమునందు
భాసురాలేపకాశ్మీరకపణ్యవీథి. 40

టీ. అప్పురమునందుఁ=ఆకుండినపురమందు, భాసురా...పణ్యవీథి-భాసుర=ప్రకాశించుచున్న, ఆలేప = సుగంధద్రవ్యములయొక్క, కాశ్మీర = కుంకుము యొక్క; పణ్యవీథి = అంగడివీథి, అపరాహ్ణవేళఁ = సాయంకాలములందు, క్రుంగఁ = అస్తమించుటకు, పొలుసహస్రాంశుఁ=పరువెత్తుచున్నసూర్యుని, కూడలేక = కలిసికొనలేక, వెనుకఁ = వెనుకను, చిక్కినా...పోలెఁ - చిక్కిన = నిల్చిపోయిన, జరత్ = ముదుసలివైన,అంశు = కిరణములయొక్క, వితతి పోలెఁ = సమూహమువలె, పొలుచుఁ = ప్రకాశించుచుండును.

తా. కుండినపురమందు సుగంధద్రవ్యములచేతను గుంకుముచేతను బ్రకాశించుచున్నయంగడివీథి సాయంకాలములందు నస్తమించుటకుఁ బర్విడుచున్న సూర్యునిఁ గలిసికో లేక తమకాధారుఁడయిన సూర్యుఁ డస్తమించుటచే నిరాధారములయి వెనుకను నిలిచిపోయియున్న సంధ్యాకాలసూర్యకిరణ సమూహమువలెఁ బ్రకాశించుచుండును. అలం. ఉత్ప్రేక్ష,విశేషము.

శా. వేదాభ్యాసవిశేషపూతరసనా విర్భూతభూరిస్తవా
సాదిబ్రహ్మముఖౌఘవిఘ్నితనవ స్వర్గక్రియాకేళిచే
నాదిఁ గాధితనూజుచే సగముసేయంబడ్డ మిన్నేఱు ప్రా
సాదస్వర్ధుదుకూలకైతవమునం జాలంగ నొప్పుం బురిన్.41

టీ. పురిఁ =అపట్టణమునందు, వేదాభ్యాస...కేళిచేఁ - వేదాభ్యాస=వేదములనభ్యసించుటయొక్క,విశేష=అతిశయముచే, పూత=పవిత్రమైన, రసనా=నాలుకలవలన, ఆవిర్భూత=పుట్టిన, భూరి=పెద్దవైన, స్తవ=స్తోత్రములను,ఆసాది=చేయుచున్న,బ్రహ్మ=బ్రహ్మదేవునియొక్క, ముఖ + ఓఘ=ముఖసమూహముచే, విఘ్నిత=విఘ్నముచేయబడిన, నవస్వర్గ=క్రొత్తస్వర్గమును, క్రియా=చేయుటయనెడి,కేళిచేఁ=లీలగల, గాధితనూజుచేఁ=విశ్వామిత్రునిచేఁ,ఆదిఁ=పూర్వమందు, సగము,చేయంబడ్డ మిన్నేఱు=చేయఁబడిన గంగానది, ప్రాసా

ద...కైతవమునన్ -ప్రాసాద=దేవతలయొక్కయు,రాజులయొక్కయు, సౌధ ములపైనున్న, స్వచ్ఛ=తెల్లనైన, దుకూల=వస్త్రముయొక్క, కైతవమునన్= మిషచే, చాలంగన్ = అధికముగా,ఒప్పున్ =ప్రకాశించుచుండును. ప్రాసా దములు మిక్కిలిపొడవులగుటచే నందలి తెల్లనిపతాకాంబర పంక్తులు గంగా నదివలె నుండెననుట. పూర్వమువిశ్వామిత్రుఁడు వసిష్ఠునిశాపంబునఁ జండాల త్వము నొందినత్రిశంకుచే యజ్ఞముచేయించి తనతపోబలంబుచే స్వర్గంబునకుఁ బంపెను. కాని దేవతలు స్వర్గమునకు నతనిరానీక క్రిందికిఁ ద్రోసివేసిరి. త్రిశంకు వచ్చుటనుండి క్రిందఁబడుచు విశ్వామిత్రునిఁ బ్రార్థింప నతని దీనాలాపములు విని యతఁడు తనతపోమహిమచే మఱియొకస్వర్గము చేయఁదలంచి స్వర్గమం దున్నవస్తువు లన్నింటికిఁ బ్రతిగావస్తువులను సృజించుచు, గంగానదిని సగము వఱకు నిర్మించెను. అంత బ్రహ్మ వచ్చి విశ్వామిత్రుని నుతించి యతఁడొనరించు సృష్టిని మాన్పించుటచే గంగానది సృష్టియగుట్లై నిలిచియుండెను. ఉన్నత ప్రా సాదశ్రేణులందు నందంద, కట్టఁబడిన తెల్లని పతాకాంబరముల పంక్తులు అం దంద కొంతకొంత సృజింపఁబడి నడుమనడుమ సృజింపఁబడని గంగానదివలె నొప్పుచున్నవని భావము.

తా. ఎల్లప్పుడు వేదములను బఠించుచుండుటచేఁ బవిత్రమైన ముఖములుగల బ్రహ్మ, విశ్వామిత్రుని నుతించి యతఁడు చేయుచున్నక్రొత్తస్వర్గసృష్టిని మాన్పిం చెను.అందువలన విశ్వామిత్రుఁడు సగము సృష్టిచేసి చాలించెను.ఆసగముచేయఁ బడ్డ సృష్టిలో గంగానది, సౌధములపైనున్న తెల్లనిపతాకవస్త్రములనెడు మి షచే నాకుంజీనపురమందుఁ బ్రకాశించుచుండెను. అలం. అపహ్నవము.

తే. అమరు హాటకమయకవాటములతోడ
గురుతరంబైనయవ్వీటికైకోటగవను
కులిశధారకుఁ దప్పితెక్కలును దాను
బయటఁగొలువున్నపసిఁడికొండయునుబోలె. 42

టీ. హాటక...కవాటములతోడన్ -హాటకమయ = కనకమయము లైన, వాటములతోడన్ =తలుపులతో, గురుతరంబు = మిక్కిలిగొప్పది, అయిన =

అయినట్టి, అప్పీటి = ఆకుండినపురముయొక్క, కోట = ప్రాకారముయొక్క, గవను=దుర్గద్వారము, కులిశధారకున్ - కులిశ = వజ్రాయుధముయొక్క, ధారకున్ =వాదరకు, తప్పి=తప్పిపోయి, ఔక్కలునుదాను = ఔక్కలతో నొప్పుచున్న తాను, బయటన్ =వెలుపలిభాగమునందు, కొలువున్న=సేవించుచున్న, పసిఁడికొండయునుబోలెన్ =బంగారుపుకొండవలెనే,అమరున్ =ప్రకాశించును. అనఁగాఁ దెఱచినతలుపులతో నొప్పునాదుర్గద్వారము ఔక్కలతో నొప్పు బంగారు పర్వతమువలెనే ప్రకాశించుచున్నదని భావము.

తా. బంగారపుఁదలుపులతోఁ బ్రకాశించుచున్నయాకుండినపురముయొక్క దుర్గద్వార మాపురములోదాఁగియుండి దేవేంద్రునియొక్క వజ్రపాతమును తప్పించుకొనుటకై యచ్చటికివచ్చి యాదుర్గములోఁదగినస్థలము చిక్కకపోవుటచేఁ బురమునకు బహిర్భాగమునందు వేచియున్న ఔక్కలుగలబంగారపుఁ గొండవలెఁ బ్రకాశించుచున్నది. అలం. ఉత్ప్రేక్ష.

మహాస్రగ్ధర.

దమయంతీకేళిధాత్రీధరశిఖరహరిద్రత్నభాదర్భసందో
హమజాండాఘాతభగ్నస్యదభవమదతావాప్తలజ్జావనమ్ర
త్వముమై నుత్తానగామర్త్యసురభివదనాంతస్థమై లీల నత్యా
ర్థముగోగ్రాసప్రదానవ్రతసుకృతము తోరంబుగా వీటికిచ్చున్.

టీ. దమయంతీ...సందోహము-దమయంతీ=దమయంతీదేవియొక్క, కేళిధాత్రీధర=క్రీడాపర్వతములయొక్క, శిఖర=అగ్రములయందున్న,హరిద్రత్న= మరకతమాణిక్యములయొక్క,భా=కాంతియనెడు, దర్భ=కుశలయొక్క, సందోహము=సమూహము, అజాండ...నమ్రత్వము-అజాండ=బ్రహ్మాండముయొక్క, ఆఘాత=దెబ్బచే, భగ్న=కొట్టఁబడిన, స్యద=వేగమువలన,భవ=పుట్టిన, మదతా=గర్వముకలదగుటచే, అవాప్త=పొందఁబడిన, లజ్జా=సిగ్గుచేత,అవనమ్రత్వముమై = వంచుకొనుట కలదయి, ఉత్తానగామర్త్య...వదనాంతస్థమై - ఉత్తానగా=వెలికిలగా నడుచుచున్న, అమర్త్యసురభి=కామధేనువుయొక్క, వదన=నోటియొక్క, అంతస్థమై = లోపలనున్నదై, లీలన్ =విలాసముగా, అత్యర్థము=

మిక్కిలి, తోరంబుగాన్=అధికముగా, గోగ్రాన...సుకృతము, గోగ్రాస, గో=గోవులకు, గ్రాస = ఆహారము ప్రదాన = ఇచ్చుటయనెడు, వ్రత=నియమముపలనఁగలిగెడు, సుకృతము=పుణ్యమును, అప్పోటికిన్=ఆకుండినపురమునకు ఇచ్చున్ = ఇచ్చుచుండును, అనఁగా దమయంతి క్రీడాపర్వతశిఖరమందు స్థగితములయినమరకతమాణిక్యములకాంతిపుంజ మనెడి దర్భసమూహము, బ్రహ్మాండకర్పరము భేదింపనెంచి పయికిఁబోయి దానిని దాఁకెను; కాని భేదింపలేక పోయినది. మఱియు నాకర్పరమును దాఁకుటచే వేగమంతయుఁ దగ్గినది. కావున గర్వమంతయు నశించినది. మఱియు సిగ్గుచేఁ దలవంచుకొన్నది. (దర్భలు లతలు మొదలగునవిపొడువుగానెదుగుచుఁ దమకేదేని యడ్డంకిసంభవించినప్పుడు వానికొనలు తిరిగి క్రిందుమొగములుగలవయి పచ్చుచుండుట సహజము) అందుచే నట్లు చెప్పఁబడెను. ఇటులు దర్భకాంతిపుంజ మనెడి దర్భాగ్రము లధోముఖంబులయి వచ్చితమప్రయత్నము వ్యర్థమగుటచే విచారించుచుఁ దనదేహము పరోపకారముకయి వ్యయముచేసి పుణ్యము సంపాదించుకోవలె నని యెంచి(లోకమున మానవులు మొదట గర్వితులయి వర్తించుచు, నేదేనికారణంబున గర్వము తొలంగింపఁబడఁగా నప్పుడు సాధువులయి పుణ్యమార్గములఁ ద్రొక్కుటకుఁబూనుకొనుట నైజము. అట్లే,)తిరిగివచ్చుచు నాకాశంబున నాలుగుకాళ్లుమోపిననడుచుచుండుటచే వెలికిలగానున్న కామధేనువునోటిలోఁబడి గోగ్రాసప్రదానసుకృతమును సంపాదించి యాపురంబునకిచ్చుచుండు. సురధేనువులు వెలికిలగా విహరించుచుండుటకుఁ బ్రమాణము. శ్రు॥ ఉత్తానావై దేవగవావహంతి'' అనెడి శ్రుతి.ఆకాశమున గోవువెలికిలగా నడుచుచుండును గనుక దానినోటిలో మీఁద నుండి తిరిగివచ్చుచున్న దర్భాగ్రములు పడుచుండుట సంభవించుచున్నదని తెలియఁదగినది. ఇందువలనఁ గుండినపురమున రత్నమయములయిన క్రీడాపర్వతములుగలవనియు, నవి మిగులఁ గాంతిమంతము లై యొప్పుచున్నవనియు స్పష్టమగుచున్నది. అలం. రూపకాతిశయోక్తులు.

తా. దమయంతీదేవి క్రీడాపర్వతమందున్న మరకత మాణిక్యములయొక్క కాంతియనెడు దర్భసమూహము పయికిఁబోయి బ్రహ్మాండకర్పరమునకు దగిలి

వెనుకకు మఱలి బ్రహ్మాండమును భేదింపలేకపోవుటవలనఁ గలిగినసిగ్గుచే నధోముఖమైయాకాశమందు వెలికిలగా నడుచుచున్న కామధేనువునకు నాహారమైగోగ్రాసము నిచ్చుటవలనఁగలిగిన పుణ్యము నాకుండినపురమునకు నిచ్చుచున్నది.

అలం. అతిశయోక్తి.

వ. ఇట్టి విచిత్రశోభావైభవంబులకుం బట్టైనయప్పట్టణంబు గలయం గనుంగొని పతంగపుంగవుండు కన్యాంతఃపురప్రదేశంబున నొక్కశృంగారవనంబులోన సఖీమధ్యంబునఁదారకామధ్యంబున శీతాంశురేఖయుంబోలె నున్నయారాజపుత్త్రి వీక్షించి యభ్రమండలంబున నుండి విభ్రమభ్రమణరయవికీర్ణస్వర్ణమయపర్ణపాళిచ్ఛాయాపటలంబు దిక్కులఁ బిక్కటిల్ల మెఱుంగు మెఱసినచందంబునం గొఱవిఁ ద్రిప్పిన పోల్కి దమయంతీవదనచంద్రబింబంబు సేవింపం బనిపూని వచ్చుపరివేషచక్రంబుచాడ్పున వలయాకారంబున సవతరించుచు నాకుంచితపక్షమూలంబును నివేశదేశాతతధూతపక్షంబునుంగా నాక్షణంబ వ్రాలిన. 44

టీ. ఇట్టి...వైభవంబులకున్ - ఇట్టి=ఇటువంటి, విచిత్ర = అద్భుతవస్తువుల యొక్క, శోభావైభవంబులకున్ = కాంతి సంపదలకు, పట్టు=నిలయము, అయిన యప్పట్టణంబు=ఐన యానగరమును, కలయం గనుంగొని=అంతటనుజూచి, పతంగపుంగవుండు = పక్షిరాజు, కన్యాంతః పురప్రదేశంబునన్ -కన్య = దమయంతియొక్క, అంతఃపురప్రదేశంబునన్ = అంతఃపురమునందున్న, ఒక్క శృంగారవనంబులోన్ =ఒకయుద్యాన వనములో, సఖీమధ్యంబునన్ = చెలికత్తెలనడుమను, తారకా మధ్యంబునన్ =నక్షత్రముల మధ్యను, శీతాంశురేఖయుంబోలెన్ = చంద్రరేఖయువలె,ఉన్న యారాజపుత్త్రిన్ = ఉన్నయాదమయంతిని, వీక్షించి=చూచి, అభ్రమండలంబుననుండి=ఆకాశమార్గమునుండి,విభ్రమ... పటలంబు[illegible]యొక్క, ర

యు=వేగముచేత, వికీర్ణ=వ్యాప్తమయిన, స్వర్ణమయ=బంగారు వికారమయిన, పర్ణ=ఱెక్కలయొక్క, పాళీ=పంక్తియొక్క, ఛాయాపటలంబు=కాంతిసమూహము, దిక్కులఁ=దిశలయందు, పిక్కటిల్లఁ=నిండుచుండఁగా, మెఱుంగు=మెఱపు, మెఱసినచందంబునఁ=ప్రకాశించునట్లును, కొఱవి త్రిప్పినపోల్కిన్=నిప్పుగలకట్టెనుద్రిప్పినట్లుగా, దమయంతీవదనచంద్రబింబంబుఁ=దమయంతీ దేవియొక్క ముఖచంద్రబింబమును, సేవింపఁ= సేవించుటకు, పనిపూని=ప్రయత్నించి, వచ్చుపరివేషచక్రంబు చాడ్పునఁ=వచ్చుచున్న పరివేషమువలెనే, పరివేషమనఁగా:-(సూర్య చంద్రులచుట్టును, ఐట్రువగా నుండుకాంతి మండలము)వలయాకారంబునఁ=ఐట్రువగా, అవతరించుచుఁ=దిగుచు, ఆకుంచిత...మూలంబును, ఆకుంచిత=ముడువఁబడిన, పక్షమూలంబును=ఱెక్కలుగలదియై, నివేశ...పక్షంబునుంగా-నివేశదేశ=పండుటకు తగినప్రదేశమందు, ఆతత=విస్తరింపఁబడినవియు, ధూత=కదల్పఁబడుచున్న, పక్షంబునుంగా=ఱెక్కలుకలదియై, ఆక్షణంబు=తత్క్షణమందే, వ్రాలినఁ;

ఉ. దుందుభి వాద్యనిస్స్వనముతోఁ దులఁదూఁగెడుపక్షనాదమం
దంద యతర్కితోపనతమై వినఁబడ్డ విహారలీలలం
జెంది పరాకునఁ మెలఁగుచిత్తము లుద్దవిడిం గలంగఁగా
నిందునిభాస్య లప్పుడు సమీక్షణచేసిరి రాజహంసమున్. 45

టీ. దుందుభి...స్వనముతోఁ- దుందుభి=భేరులయొక్క, వాద్య=వాయించుటవలనఁ గలిగిన, నిస్వనముతోఁ=ధ్వనితో, తులఁ దూఁగెడుపక్షనాదము=సరి పోలుచున్న ఱెక్కలచప్పుడు, అందంద = అచ్చటచ్చట, అతర్కితోపనతమై=ఆకస్మికముగా వచ్చినదై, వినఁబడ్డఁ=వినఁబడఁగా, విహారలీలలఁ=క్రీడావిలాసములను, చెంది=పొంది, పరాకునఁ=ఏమఱపాటుతో, మెలఁగుచిత్తములు=ప్రవర్తించుచున్నచిత్తములు, ఉద్దవిడిఁ=వేగముగా, కలంగఁగాఁ=చెదరిపోవుచుండఁగా, అప్పుడు=ఆసమయమందు, ఇందునిభాస్యలు=చంద్రునివంటి ముఖములుగల స్త్రీలు, రాజహంసమున్=రాజహంసమును, సమీక్షణ చేసిరి=చూచిరి

తా. భేరీధ్వనులలో సమానమైన యాహంసము ఱెక్కల చప్పుడా స్మికముగా వచ్చి వీనులఁబడఁగా నంతపఱకు నాటలాడుకొనుచున్నయా స్త్రీ లందఱు పరాకుచేఁ బ్రవర్తించుచున్నచిత్తములయందు భయముగలవారై యా వచ్చుచున్నరాజహంసమును జూచిరి.

వ. అమ్మత్తకాశినులు తమచిత్తంబులు విముక్తతత్తద్విషయగ్రహణంబులై యాహంసంబునందుఁ బరబ్రహ్మంబునందునుం బోలె వర్తించుచుండం జూచుచుండిరి. విదర్భరాజుపట్టి తన నెమ్మనంబునం బుట్టినకౌతూహలంబున నమ్మరాళంబుఁబట్టఁ దలంచి యొయ్యనొయ్యన గదియ నేతెంచిన నజ్జాలపాదంబును నబ్జాలతలం పెఱింగి యెగసియుం దప్పఁ గ్రుంకియుఁ దాఁటుకొనియుఁ దనమీఁదఁ వ్రాలు కేలుదోయియొడుపు దప్పించుకొనియెం. గాంచనపత్త్రిరథగ్రహణలీలా వ్యవసాయంబు నిష్ఫలం బైన రాచూలిం జూచి చెలులు గలకలం జేచఱచి నగిరి.హస్తతలతాళకోలాహలంబునం బులుఁగు బెదరించితిరి.దీన మీకు నేమి లాభంబయ్యెనని సఖీజనంబులం గనలి పలుకుచు మార్తాండు ననువర్తించుఛాయాదేవి యుంబోలె నత్తోయజాక్షి మానసౌకంబు వెనుకొని చనియె. అన్నారీని వహంబును మేలంపుమాటలకై వడి హంసగమన హంసాభిముఖమైన యాత్రఁ బెద్దలు నిషేధింతురు సుమీయనుచుమందగతిం బిఱుందన యేతించిరి.నీడోద్భవంబును నచ్చేడియమందగమన విలాసంబు పరిహాసంబునకై యనుకరించు నదియునుం బోలె ముందటం జరియించుచుం జేయీక యీఁకలు ముడిఁగించుకొని యీఱం బైనయొక్కలతాగేహంబుఁ దూఱె. అట్లు దూఱిన వెలరువ్వాఱి చేయునది లేక నిషేధజనిత

రోషనిరుద్ధాశేషనిజపయస్యయు, నాత్మచ్ఛాయాద్వితీయ
యుఁ బ్రస్వేదాంభఃకణవిభూషితాంగియు నిశ్వాసవేగకం
పిత స్తన భాగయు నై యూరకుండె నప్పు డయ్యాండజంబు
మనుష్యభాషణంబుల. 46

టీ. అమ్మత్తకాశినులు=ఆ స్త్రీలు, తమచిత్తంబులు=తమ మనస్సులు, విము
క్త...గ్రహణంబులు+ఐ-విముక్త=విడిచిపెట్టఁబడిన,తత్తత్ =ఆయాయి,విషయ
గ్రహణంబులు=విషయజ్ఞానములుగలవై,అనఁగావారిచిత్తము లాయావిషయంబు
లనుండి మఱలినవని యర్థము. ఆహంసంబునందున్, పరబ్రహ్మంబునందునుంబో
లెన్=పరమాత్మయందువలెనే, వర్తించుచుండఁగా = ప్రవర్తించుచుండఁగా,
అనఁగా యోగీశ్వరులు ప్రపంచజ్ఞానమును విడిచి నిశ్చలమనస్కులై పరబ్ర
హ్మమును చూచుచున్నట్లు వా రాహంసమును జూచుచున్నా రనిభావము.
చూచుచుండిరి, విదర్భరాజుపట్టి = దమయంతి, తననెమ్మనమునన్=తనమనస్సు
నందు, పుట్టినకౌతూహలంబుతోన్ = జనించినవేడుకచే,అమ్మరాళంబున్=ఆ
హంసమును, పట్టన్, తలంచి, ఒయ్యనొయ్యన = మెల్లమెల్లగా, కదియన్,
ఏతెంచినన్=దగ్గఱకురాఁగా, ఆజాలపాదంబును = ఆహంసయును, అబ్జాలత
లంపు=దమయంతియొక్క యభిప్రాయమును, ఎఱింగి, ఎగసియున్=పైకెగిరి
యు, తప్పన్=దమయంతినుండి తప్పించుకొనునట్లు, క్రుంకియున్ = క్రిందికి
డఁగియు, దాఁటుకొనియున్, దనమీఁదన్,వ్రాలుకేలుదోయి = పడిన దమ
యంతి చేతులయొక్క, ఒడుపున్=పట్టును, తప్పించుకొనియెన్,కాంచన...
వ్యవసాయంబు, కాంచన=బంగారువికారమైన, పత్త్రరథ=(ఱెక్కలెరథముగాఁ
గలదియగు) పక్షిని, గ్రహణ = పట్టుకొనుటయనెడు, లీల=వేడుకకైన, వ్యవ
సాయంబు=ప్రయత్నంబు, నిష్ఫలంబయినన్=వ్యర్థముకాఁగా, రాచూలిన్=
దమయంతిని, చూచి, చెలులు, కలకలన్=కలకలమని, చేచఱచి = చప్పటలు
చఱచి, నగిరి=నవ్విరి, హస్త...కోలాహలంబునన్, హస్తతల= చేతులనెడు,
తాళ=తాళములయొక్క, కోలాహలంబునన్, గొప్పధ్వనిచేనే, పలుఁగున్ =

హంసను, బెదరించిరి=భయపెట్టిరి, దీనన్ = ఈభయపెట్టుటవలన, మీ రున్ = సఖులకనుట, ఏమిలాభంబు, అయ్యెన్ అని, సఖీజనంబులన్,కనలి= కోపించి, పలుకుచు, మార్తాండున్ = సూర్యుని, అనువర్తించు ఛాయాదేవియుం బోలె=అనుసరించి తిరుగుచున్న ఛాయాదేవివలెనే, అత్తోయజాక్షి = పద్మము లవంటి నేత్రములుగల యాదమయంతి,మానసౌకంబున్ = హంసను, వెనుకొని= వెంబడించి, చనియెన్=వెళ్లెను, ఆన్నారీనివహంబును = ఆ స్త్రీలును, మేలంపు మాటలకై వడిన్=పరిహాసములాడుచున్నట్లు,హంసగమన=హంసనడకవంటి నడ కగల ఓదమయంతీ, హంసాభిముఖియైన=హంస కభిముఖమైయున్న, (సూర్యు ని కభిముఖియై యున్నదనియు నర్థము) యాత్రన్= నడకను, పెద్దలు= పండి తులు=నిషేధింతురుసుమీ = వలదందురుసుమా? యనుచున్, అనఁగా:హంస మున కెదురుగా నడుచుట యపశకునమని భావము. మఱియు "అసూర్యం పశ్యారాజదారాః" అనఁగా (రాజభార్యలు సూర్యునిఁ జూడరు.) అని యున్నది గాన నీవు హంసాభిముఖివై (సూర్యాభిముఖివై) పోవుట యుచితముగాదని, హంసపదశ్లేషముచే గేలి చేయుచున్నారని భావము. మంద గతిన్ = మెల్లగా, పిఱుందన = వెనువెంటనే, ఏతెంచిరి = వచ్చిరి, ఆ నీడోద్భవంబును = ఆహంసయు, అచ్చేడియమందగమనవిలాసంబున్ - అచ్చేడియ = ఆదమయంతియొక్క, మందగమన = మెల్లని నడకయొక్క, విలాసంబున్ = లీలను, పరిహాసంబునకై =నవ్వుటాలకై, అనుకరించునదియుం బోలెన్=విడంబించుచున్నదివలెనే, ముందటన్, చరియించుచు, చేయాక= చేతికి దొరకక, లేక, పట్టుపడక, ఈఁకలను=చిన్న ఱెక్కలను, ముడిఁగించి కొని = ముడిఁచికొని, ఈఱంబు = దట్టము, ఐనయొక్కలతాగేహంబున్ = ఐనట్టి యొక్కలతాగృహమును, తూఱెన్=ప్రవేశించెను, అట్లు మాఱినన్ = అట్లు చొరఁగా, వెలరు, పాఱి= తెలతెలపోయి, చేయునదిలేక, నిషేధ ...వయస్యయు-నిషేధ=వలదని యాటంకపఱుచుటచే,జనిత=పుట్టిన, రోష= కోపముచే,నిరుద్ధ = నిరోధింపఁబడిన, అశేష=సమస్తమయిన, నిజ = తన యొక్క, వయస్యయున్ = చెలిక త్తెలు కలదియు - అనఁగా చెలిక త్తెలు హంస

ను బట్టుకొన వలదు వలదని నిషేధింప, దమయంతి కోపము వహించి వారలఁ దన వెంట రావలదని వారింప వార లామెవెనుకఁ బోవుట మానిరని భావము. ఆత్మచ్ఛాయాద్వితీయయున్ - ఆత్మ=తనయొక్క, ఛాయా=నీడయె నెడు, ద్వితీయయుర్ = రెండవదికలదియు, అనఁగా తా నొక్క తెయే యని యర్థము, ప్రస్వేద.. భూషితాంగియున్, ప్రస్వేద+అంభఃకణ=చెమట బిందువులచేత, విభూషిత=అలంకరింపఁబడిన, అంగియు = శరీరముగలదియు, అనఁగా అలఁతవలనఁగలిగినచెమ్మట బిందువులు శరీరమంతటను నిండినవై, ముత్యములవలెఁ బ్రకాశించి దమయంతీ శరీరము నలంకరించుచున్న వని భావము, నిశ్వాస...భారయునై = నిశ్వాస వేగ=నిట్టూర్పు వేగముచే, కంపిత= చలించుచున్న, స్తనభారయుర్ = స్తనములు కలదియునై, ఊరకుండక్ = మిన్నకుండెను. అప్పుడు=ఆసమయమందు, ఆయండజంబు=ఆహంస, మనుష్యభాషణంబులర్ =మనుష్యులాడు మాటలచే, అని పైపద్యముతో నన్వయము

శా. కాంతా! శైశవచాపలంబున లతాకాంతారవీథిం బరి
  శ్రాంతిం బొందెదవేల? బేలవె? ననుం జేకొన శక్యంబె పట్టంగ నీ
  వెంతే దవ్వుగ నేఁగుదెంచితి గదే? యేలమ్మ నీబోటు లం
  తంతం జిక్కిరి; చిక్కకుండుదురె? నీయాక్షేపముల్ పల్కఁగన్.

టీ. కాంతా=ఓసుందరీ!, శైశవచాపలంబునర్ = చిన్నతనంపుదుడుకు తనముచే, లతాకాంతారవీథిర్ - లతా = తీఁగెలుమొదలగువానిచే, కాంతార = వెళ్లశక్యముగాని, వీథిర్ = ప్రదేశమందు, పరిశ్రాంతిర్ = ఆయాసమును, పొందెదవు+ఏల=ఎందుకుపొందెదవు, బేలవె = వెఱ్ఱిదానవా, ననున్, పట్టంగర్ శక్యంబె = నన్నుఁబట్టుకొనుటకుఁ దరమగునా, నీవు, ఎంతే=ఎంతయో, దవ్వుగా=దూరముగా, ఏఁగుదెంచితివి+కదే = వచ్చినావే?, అనఁగా జాలదూరమువచ్చితివనుట, ఏలమ్మ = ఎందుకమ్మ, నీబోటులు= నీచెలికత్తెలు, అంతంతర్ = అక్కడక్కడనే, చిక్కిరి=నిలిచిరి. నీవు, ఆక్షేపముల్ = నిషేధవచనములు, పల్కఁగర్, చిక్కకుండుదురే=వెనుకకుఁబోకుండ నుందురా అనఁగా పోదురనుట.

తా. ఓచెలియా! నీవుబాల్యచాపలముచే నిట్టిదుర్గమమార్గములయందు నేల యాయాసపడెదవు? వెఱ్ఱిదానవా! నన్నుపట్టికొన నీతరమగునా? కాదు. నీవు చాలదూరమువచ్చితివి; ఇంకనైననీప్రయత్నము మానుము. నీచెలికత్తెలందఱు వెనుకకుమఱలిరి. అవును. నీవువారలఁ గోపించి పొమ్మన్నప్పుడు వారలు నీవెనుక నేల వత్తురు?.

ఉ. ఆళియుఁ బోలె నిప్పుడు వనాళి యమార్గమునం జరించునిం
నో లలితాంగి! కాదనుచు నున్నది మందసమీరణంబునం
గ్రాలుప్రవాళమంజరులు క్రమకరంబుల విభ్రమంబు గా
బాలరసాలపుష్పరస పాయివనప్రియకంఠహుంకృతిన్. 48

టీ. ఓలలితాంగి = ఓమనోహరాంగీ, వనాళి = వనపంక్తి, అమార్గమునన్ = చెడ్డమార్గమునందు, చరించునిన్ను = సంచరించుచున్న నిన్ను, ఇప్పుడు = ఈసమయమునందు, ఆళియుఁబోలెన్ = స్నేహితురాలివలె, మందసమీరణంబునన్ = మలయమారుతముచే, క్రాలుప్రవాళమంజరులు=చలించుచున్న చిగురుగుత్తులు, క్రమకరంబులవిభ్రమంబుగాన్ - క్రమ = ప్రకాశించెడి, కరంబుల = చేతులయొక్క, విభ్రమంబు = విలాసము, కాన్ = అగుచుండఁగా, బాల...హుంకృతిన్ - బాలరసాల = లేఁతమామిడియొక్క, పుష్పరస = తేనెను, పాయి = త్రాగిన, వనప్రియ = కోయిలయొక్క, కంఠ = కంఠధ్వనియనెడు, హుంకృతిన్ = హుంకారముచే, కాదనుచున్నది = వలదు, అని నిషేధించుచున్నది. అనఁగా వనపంక్తి చెలికత్తెవలెనే సమీరకంపితమయిన చిగుళ్లనెడికరంబులఁ ద్రిప్పుచు గోకిలాలాపమనెడి హుంకృతిచే వలదని నిషేధించుచున్నదనిభావము.

తా. ఓదమయంతీ! ఈవనపంక్తి నీ చెలికత్తెవలెనే లేఁతమామిపూవులయందున్నరసమును త్రావిమదించిన కోకిలముయొక్కకంఠధ్వని యనెడుకోపవచనములచే గాలిచేఁ గదలుచున్న చిగుళ్లనెడు చేతులఁద్రిప్పుచు నీ విట్టిదుష్పథమందు సంచరింపఁగూడ దని నిషేధించుచున్నది.

అవ. హంస యెట్టికార్యముల నైన సంఘటింపఁ దగినసా
మర్థ్యము తనకుఁగలిగినట్టు లీపద్యముచేఁ జెప్పుచున్నది.

సీ. నలినసంభవుసాహిణమువారువంబులు
కులముసాములు మాకుఁ గువలయాక్షి
చదలేటిబంగారుజలరుహంబులతూండ్లు
భోజనంబులు మాకుఁ బువ్వుబోఁడి
సత్యలోకముదాఁక సకలలోకంబులు
నాటపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరము లైన మామాటలు వినంగ
నమృతాంధసులు యోగ్యు లనుపమాంగి

తే. భారతీదేవిముం జేతి పలుకుఁజిలుక
సమదగజయాన! సబ్రహ్మచారి మాకు
వేదశాస్త్రపురాణాది విద్య లెల్లఁ
దరుణి! నీయాన నుంటాపథంబు మాకు. 49

టీ. కువలయాక్షి = కలువవంటి నేత్రములు గలదమయంతీ! నలిన... వారు
వంబులు, నలినసంభవు=బ్రహ్మయొక్క, సాహిణము= లాయముయొక్క, వారువం
బులు = గుఱ్ఱములు, మాకుఁ, కులముసాములు=వంశకర్తలు, అనఁగా బ్రహ్మకు వా
హనభూత మైనహంస వంశమందు జన్మించితిమని తాత్పర్యము- పువ్వుబోఁడి=
పువ్వువంటిశరీరముగల దమయంతీ, చదలేటి... తూండ్లు- చదలేటి=ఆకాశ
గంగయందున్న, బంగారు జలరుహంబుల తూండ్లు = బంగారుతామరతూం
డ్లు, మాకుఁ, భోజనంబులు ఆహారములు, ఈచెప్పుటచేఁగారణమందున్న గుణము
లు కార్యమం దుండుట స్వభావసిద్ధము గనుక బంగారుతూండ్లను దినుటంబట్టి
హంస రెక్కలుగూడ పసిమివన్నెకలవయ్యె ననితోఁచుచున్నది. అబ్జవదన =
పద్మమువంటిముఖము గలదమయంతీ! సత్యలోకముదాఁకన్ =బ్రహ్మలోకపర్యంత
న్న, సకలలోకంబులు = లోకములన్నియు, మాకున్, ఆటపట్టులు = క్రీడా

స్థానములు-అనఁగా నన్ని లోకములయందు నిరాటంకముగా విహరింపఁగలమని భావము. అనుపమాంగి = సాటిలేని శరీరముగలదమయంతీ, మధురాక్షరములు = తియ్యనియక్షరములుగల, ఐనమామాటలు = అయినట్టిమా వాక్యములు, వినంగన్ = వినుటకు. అమృతాంధసులు= అమృతమేయన్నముగాఁగలవారు (అనఁగా దేవత లనుట), యోగ్యులు = తగినవారు-అనఁగామావాక్యములు దేవతలు వినఁ దగినవి కాని సామాన్యులు వినఁదగినవి కావనిభావము. సమదగజయాన = మత్తుటేనుఁగువంటి నడకగల దమయంతీ! భారతీ...జిలుక, భారతీదేవి = సరస్వతియొక్క, ముంజేతి = ముంజేతియందు, పలుకు = మాటలాడుచున్న, చిలుక, మాకున్, సబ్రహ్మచారి = సహాధ్యాయి, అనఁగాసరస్వతీదేవికి మిగులఁబ్రియమయినవారమనియు,నామెవలననే తాము గూడ మాటలాడ నేర్చితిమనియుఁ గావున మామాటలు నిర్దుష్టములై యుండుననియు,భావము.తరుణి =ఓదమయంతీ, వేదశాస్త్రపురాణాది విద్యలుఎల్లన్= వేదములు, శాస్త్రములు పురాణములు మొదలగునట్టి విద్యలును, మాకున్, ఘంటాపథంబు = రాజమార్గమువంటివి, నీతోడను = నీతోడు, అనఁగా రాజమార్గమందు నిరాటంకముగాఁ బోవునట్లు సమస్తవిద్యలయందు నిరాటంకముగా విహరింపఁగలము. అన్నివిద్యలను నిస్సందేహముగా నేర్చితిమనుట. నీతోడుగాఁ జెప్పుచున్నాను. ఇవి యన్నియు సత్యములు.

వ. ఒక్కనాఁడు విధాత వినోదార్థంబు వాహ్యాళి వెడలి మఱలివచ్చునపుడు మాకులస్వాములైనయతనిరథరథ్యంబులు శ్రమంబున డీలుపడి యున్నం జూచి యేను విమానదండంబు కంఠంబున ధరియించి విరించిచేతం బారితోషికంబు వడిసితి. నేను దివ్యతిర్యగ్జాతిని.మము బోంట్లు పాశాదికంబులంగట్టువడుదు రేగుణపాశంబులంగాక.భూలోకంబున రాజబృందారకులు కొందఱు కలరు.వారితోఁ జెలికారంబు వాటించి యుండుదు.విశేషించియు నిషధదేశాధీశ్వరుండగు నలుండనురాజు మీఁద మిగులం బక్షపాతంబు గలిగి యుందు. 50

టీ. ఒక్కనాఁడు,విధాత = బ్రహ్మ, వినోదార్థంబు = వేడుకకై, వాహ్యాళి, వెడలి = స్వారివెడలి, వచ్చునపుడు , మకులస్వాములు = మావంశకర్తలు, ఇన...రథ్యంబులు=ఇనట్టియతనిరథమునకుఁ గట్టినగుఱ్ఱములు, శ్రమంబునన్ = శ్రమచే, డీలుపడి = బలహీనములై, ఉన్నన్, చూచి, ఏను, విమానదండంబున్ =ఆవిమానముయొక్కదండమును, కంఠంబునన్ = మెడపై, ధరియించి, విరించిచేతన్ = బ్రహ్మచే, పారితోషకంబున్ = బహుమానము, ను, పడసితిని = పొందితిని, నేను, దివ్యతిర్యగ్జాతిని = దేవతాపక్షిజాతియందుఁబుట్టినవాఁడను, మనుబోంట్లు = మావంటివారు, గుణపాశంబులంగాక = గుణములనెడు త్రాళ్లచేఁదప్ప, పాశాదికంబులన్ = కేవలముత్రాళ్లమొదలగువానిచే, కట్టువడుదురే = బంధింపఁబడుదురా! (అనగా మేము పెద్దలసద్గుణములకు లోఁబడుదుముగాని తక్కిన పక్షులవలె పాశాములకుఁ జిక్కుడువారముకామనితాత్పర్యము) భూలోకంబునన్, రాజబృందారకులు = రాజశ్రేష్ఠులు, కొందఱు, కలరు = ఉన్నారు, వారితోన్ = ఆరాజశ్రేష్ఠులతో, చెలికారంబున్=స్నేహమును, పాటించి=చేసి, ఉండుదున్, విశేషించియున్= అధికముగా, నిషధదేశాధీశ్వరుండు = నిషధదేశమున కధిపతి, అగునలుండు = ఆయిననలుఁడు, అనురాజుమీఁదన్ = అనెడిరాజుపై, మిగులన్, పక్షపాతము= ప్రేమ, కలిగియుండుదును.

అవ. నలమహారాజునందు దమయంతి కనురాగంబు గలిగించుట కతనివైభవంబును వర్ణించుచున్నది.

తే. కనకశైలంబు డిగ్గి యాకాశసింధు
సలిలములఁ దోఁగి మిగులంగఁ జల్లనైన
చారుహాటకమయగరుచ్చామరముల
వీతు నతనికి వైశాఖవేళలందు. 51

టీ. కనకశైలంబున్ = బంగారుపర్వతమును, డిగ్గి = దిగి, ఆకాశసింధుసలిలములన్ = ఆకాశగంగయందున్నసలిలములందు, తోఁగి = తానమాడి,

మిగులన్ = మిక్కిలి, చల్లని = చల్లఁదనముగల, ఐన...చామరములన్ = ఐన = అయినట్టి, చారు = సుందరములైన, హాటకమయ = బంగారు, వి కారములైన.గరుత్ = ఱెక్కలనెడు చామరములన్ = వింజామరలచే, వైశాఖ వేళలందున్ = వేసవి కాలములయందు, అతనికిన్ = ఆనలమహారాజునకు, వీ తున్ = వీచుచుందును.

తా. దమయంతీ! నేనుబంగారపుకొండనుండి దిగి గంగానదియందుఁ గ్రుం కులిడి తజ్జలసంపర్కముచేఁ జల్లనైన నా ఱెక్కలనెడు వింజామరలచే నలమహా రాజునందు మిగులఁ బ్రేమగలవాఁడనై వేసవి కాలములయందతనికి సంప్రాప్త మగుచున్న తాపమును దొలఁగించుచుందును.

మ. రణకండూభర దుస్సహం బయిన యాశ్రీరాజన్య దేవేంద్రుదః
క్షిణబాహాగ్రమునన్ జనించిన మహాకీర్తి ప్రవాహంబు గా
రణసంక్రాంత గుణానుషంగముననో ప్రస్ఫీతదిజ్మత్తవా
రణగండస్థలకుంభ కూటములతోరాచుం ది వారాత్రముల్.

టీ. రణ...దుస్సహంబు-రణ=యుద్ధములయందున్న, కండూభర=దురద యొక్క యతిశయముచే, దుస్సహంబు=సహింపఁదరముకానిది, అయిన...బా హాగ్రమునన్=అయినట్టి యానలమహారాజుయొక్క సవ్యహస్తాగ్రమునందు,జనిం చిన...ప్రవాహంబు-జనించిన=పుట్టిన, మహత్=అధికమయిన,కీర్తి ప్రవాహం బు=కీర్తియనెడిప్రవాహము, కారణ...షంగమునన్+ఓ-కారణ = కారణము నందు, సంక్రాంత=తగులుపడ్డ, గుణ=గుణములయొక్క, అనుషంగముననో = సంబంధముచేతనే కాఁబోలు, ప్రస్ఫీత.. కూటములతోన్-ప్రస్ఫీత=మహో న్నతములయిన, దిక్=దిక్కులయందున్న,మత్త=మదించిన,వారణ=గజములయొ క్క, గండస్థ=చెక్కిళ్లతోను, కుంభకూటములతోన్ = కుంభాగ్రములతోను, దివారాత్రముల్=అహర్నిశంబులు, రాచున్=ఒరయుచుండును. కారణగుణ ములు కార్యమందు సంక్రమించుట స్వభావము. కావున దురదగలిగిన నలమ హారాజు హస్తము దుద్భవించినకీర్తి దురదకలదయి దిగ్గజముల చెక్కిళ్లతోను కుంభస్థలములతోను నొరసికొని దురద బోఁగొట్టుకొనుచున్నదనిభావము.



177. దమయంతి హంసతో మాటలాడుట; హంస నలునిగుణములను వర్ణించుట.

అనఁగా నలుని కీర్తి దిగంతములదాఁక వ్యాపించినదని ఫలితార్థము.

తా. యుద్ధము చేయుటచే దురద చెంది యున్న నలుని బాహువువలన జనించినకీర్తి కారణమువలన సంక్రమించినదురదను బొందినదయి యాదురదను దొలఁగించుకొనుటకయి దిగంతములకుఁ బోయి యచ్చటనున్న గజముల చెక్కిళ్లతోను, గుంభస్థలములతోను, రాచుచుండును. అలం-ఉత్ప్రేక్ష.

తే. అతని బాహాపరాక్రమం బభినుతింప
నలవియే పద్మజునికైన నబ్జవదన!
శాతతద్బాణధారాభుజంగభుక్తి
వైరిరాజవ్రజీయాసుమారుతంబు. 53

టీ. అబ్జవదన=పద్మమువంటి ముఖముగల దమయంతీ ! అతనిబాహాపరాక్రమంబున్ = ఆనలమహారాజుయొక్క బాహుబలమును, అభినుతింపన్ = కొనియాడుటకు, పద్మజునికైనన్ = బ్రహ్మకైనను, అలవియే=తరమగునా? శాత... భుక్తి-శాత=వాడియయిన,తత్ = ఆనలమహారాజుయొక్క,బాణధారా=బాణపంక్తియనెడు, భుజంగ = పాములకు, భుక్తి=ఆహారము, వైరి... మారుతంబు, వైరిరాజ = శత్రురాజులయొక్క, వ్రజీయ = సమూహసంబంధమైన, అసుమారుతంబు-ప్రాణవాయువులు, అనఁగాఁబెక్కండ్ర శత్రువులఁ జంపుచున్నాఁడని భావము.

తా. ఓదమయంతీ! నలమహారాజు బాణపంక్తులనెడు సర్పములకు నాహారము శత్రువుల ప్రాణవాయువులేయని తెలిసికొనుము. అట్లుశత్రువులను సంహరించుచున్న నలమహారాజు పరాక్రమము నుతింప బ్రహ్మకైనను దరముకాదు.

అలం-రూపకము.

3-26

చ. వినుకలికూర్మిఁ జిక్కి పృథివీభువనంబునకుం డిగంగ నే
యనువును లేక రంభ యనునచ్చరలేమ నలున్ వరింపఁ బూ
నినతనకోర్కి నొక్కమెయి నిండఁగఁ జేయుటకై భజించెఁదా
గొనకొని వేల్పులందు వలపులమొనగాఁడు మరున్ వసనన్.

టీ. రంభ అను నచ్చరలేమ=రంభయనెడు నప్సరస్త్రీ(స్త్రీ), వినుకలికూర్మిఁ=వినుకలి=నలమహారాజు గుణములు వినుటవలనఁగలిగిన, కూర్మిఁ=ప్రేమచే, చిక్కి=వశురాలై, పృథివీభువనంబునకుఁ=భూలోకమునకు, దిగంగఁ=దిగుటకు, ఏయనువును=ఏ యుపాయమును, లేక=కానక, నలుఁ=నలమహారాజును, వరింపఁ=పెండ్లాడుటకు, పూనిన తనకోర్కి=ప్రయత్నించిన తనయొక్క మనోరథమును, ఒక్కమెయిఁ=ఒక్కవిధముగా, నిండఁగఁ, చేయుటకై=పూర్తి చేయుటకై, తాఁ=రంభ, తచ్ఛుభనామవాసనఁ-తత్=నలమహారాజుయొక్క, శుభ=మంచిదయిన, నామ=పేరియొక్క, వాసనన్=గంధము గలుగుటచే, నలకూబరున్=నలకూబరుని, భజించెన్ = సేవించెను. (అనఁగా నలుఁడు దేవతాస్త్రీలచేఁగూడ వరింపఁదగిన యందము గలవాఁడనుట).

తా. ఓదమయంతీ! రంభ నలమహారాజు సద్గుణములను విని యతనిఁ బెండ్లాడఁదలంచినది. కాని యామె దేవతాస్త్రీయగుటచే భూలోకంబునకు వచ్చుట కేయుపాయము లభించినదికాదు.అందుచే మిగుల విచారించుచుఁ దన కోర్కి నేవిధముననైన నెఱవేర్చుకొనఁ దలంచి నలమహారాజు నామమయిన నలయనుపదముతోఁగూడియున్న నామముగల నలకూబరుని వరించినది. అలం-అతిశయోక్తి.

వ. ఆరాజుకడం జనువు గలిగి వర్తింతు మఱియును. 55

టీ. స్పష్టము.

మ. స్మరవాత్స్యాయనకూచిమారకృతశాస్త్రగ్రంథసందర్భము
పరిశీలించినవాఁడ దంపతుల కుత్పాదింతు సారస్యముల్ [ల్
మురిపెం బొప్పఁగ మందమంద గమనంబుల్ నేర్పుదున్మేదినీ
శ్వరశుద్ధాంతనితంబినీజనులకుఁ సంపూర్ణచంద్రాననా!. 56

టీ. సంపూర్ణచంద్రాననా=నిండుచందురునివంటి ముఖముగల దమయంతీ! స్మర ... సందర్భముల్-స్మరణ ... సంబంధమైన, లేక స్మరుఁడనునొక కామ

శాస్త్రకర్తచేత, వాత్స్యాయన=వాత్స్యాయన మునిచేతను, కూచిమార=కూచి మారుని చేతను,కృత=రచింపఁబడిన,శాస్త్రగ్రంథ=శాస్త్రసంబంధమైన గ్రంథములయొక్క, సందర్భముల్=సందర్భములను, పరిశీలించినవాఁడక్ = నేర్చినాఁడను, దంపతులకున్ = భార్యాభర్తలకు, సారస్యముక్=రసగ్రాహకత్వమును, ఉత్పాదింతుక్=కలిగింతును, మేదినీ...జనులకున్ - మేదినీశ్వర= రాజులయొక్క, శుద్ధాంతనితంబినీజనులకుక్ = అంతఃపుర స్త్రీలకు, మురిపెంబు=నడలయొయ్యారము, ఒప్పఁగక్=ఒప్పునట్లుగా, మందమందగమనంబుల్=మిక్కిలి మందగమనమును; నేర్పుదుక్ = నేర్పుచుందును.

తా. ఓదమయంతీ! వాత్స్యాయనుఁడు, కూచిమారుఁడు రచించిన కామశాస్త్రముల నన్నింటిఁ జక్కఁగాఁ జదివినాఁడ. భార్యాభర్తలకు సారస్యము గలిగించునంతటిచతురత నాకుఁగలదు.మఱియు రాజులయంతఃపుర స్త్రీలకు మందగమనంబులను మిక్కిలి నేర్పుచుందును.

వ. భామినీజనంబులకు భావభవదివ్యజ్ఞానవిశ్వాసముద్రావిశేషపభూమి నై యుండుదు. తిర్యగ్జాతిమాత్రంబుగాఁ దలంపవలదు. విరించివదనకమలవినిర్గతవివిధశాస్త్రవాసనాపూర్ణకర్ణుండ నైనయేను సామాన్యుండ నే?నన్నుం బనిగొమ్ము. ఈ శరీరంబు పరోపకారార్థముగదా! పద్మాసనుశిల్పప్రయాసంబు లక్ష్మీనారాయణులయెడలను గౌరీవృషభాంకులపట్టునను బోలెఁ బరస్పరయోగ్యసమాగంబునకుం బాల్పడుంగాక. వేలాతిక్రాంతకాంతగుణాబ్ధివేణి వగునీవు నలునిపాణిపల్లవంబు పరిగ్రహింప నర్హురాలవు కోమలం బగుమల్లికాముకుళదామంబు గర్కశం బగుకుశసూత్రంబునం గట్టఁ బాత్రంబు గాని తెఱంగున నిషధరాజుదక్క వే ఱొక్కండు నిన్ను వరియింపఁ బాత్రుండు గాఁడు. మఱియు నొక్కవిశేషంబు. 57

టీ. భామినీజనంబులకున్ = స్త్రీసమూహములకు, భావభవ... భూమినై - భావభవ=మన్మథసంబంధమైన, దివ్యజ్ఞాన=పెద్దజ్ఞానమందలి, విశ్వాసముద్రా=నమ్మకము నెడు ముద్రకు, నిక్షేపభూమినై=నిక్షేపించుటకుఁ దగినప్రదేశమనై, ఉండుదున్-అనఁగా స్త్రీలకందఱకు మన్మథజ్ఞానముఁదెలియఁజేయుటకు పేఁడుదగినవాఁడనెడినమ్మకము నాయందుఁగలదనిభావము. తిర్యగ్జాతిమాత్రంబుగాన్ = సామాన్యమైన పక్షినని, తలంపవలదు= ఆలోచింపవలదు, విరించి...కర్ణుండను-విరించి = బ్రహ్మయొక్క, వదనకమల = ముఖపద్మములనుండి, వినిర్గత=బయలువెడలిన, వివిధశాస్త్ర=అనేకములైన శాస్త్రములయొక్క, వాసన = సంస్కారములచే, పూర్ణ=నిండిన, కర్ణుండను=శ్రోత్రములుగలవాఁడను, అనఁగా బ్రహ్మను గురువుగాఁ జేసికొని సమస్తశాస్త్రములను నేర్చికొంటినని భావము. అయిన నేను, సామాన్యండనే=సామాన్యుఁడనా!-అనఁగా సామాన్యుఁడనుగా ననుట, నన్నున్, పనిగొమ్ము=ఆజ్ఞాపింపుము, ఈ శరీరంబు=ఈదేహము, పరోపకారార్థముకదా=పరుల కుపకారముచేయునిమిత్తమేకదా, పద్మాసనుని శిల్పప్రయాసంబు-పద్మాసనుని=బ్రహ్మయొక్క, శిల్పప్రయాసంబు=నైపుణ్యముతో సృష్టిచేయుటవలనఁ గలిగినయాయాసము, లక్ష్మీనారాయణులయెడలను, గౌరీవృషభాంకులపట్టుననుబోలెన్ = పార్వతీపరమేశ్వరులందువలెను, పరస్పర...సమాగమమునకున్—పరస్పర=అన్యోన్యము, యోగ్య=తగినవారియొక్క, సమాగమమునకున్ = సంఘటనకు, పాల్పడుఁగాక= ప్రయత్నించుఁగాక, వేలా... వేణివి—వేలా=హద్దును, అతిక్రాంత= మీఱిన, కాంత=మనోహరమైన, గుణ=గుణములనెడు, అబ్ధి=సముద్రముయొక్క, వేణివి=ప్రవాహమవు, అగు నీవు, నలుని పాణిపల్లవంబును, పరిగ్రహింపన్=స్వీకరించుటకు-అనఁగా నలుని పెండ్లియాడుటకని భావము,అర్హురాలవు = తగినదానవు, కోమలంబు= మృదువైన, మల్లికాముకుళదామంబు=మల్లెమొగ్గలయొక్క దండ, కర్కశంబు = కఠినమైనది, అగు కుశసూత్రంబునకున్ =అగుదర్భసూత్రమందు, కట్టన్, పాత్రంబు=అర్హము, కాని తెఱంగునన్ =కానట్లు, నిషధరాజుదక్క = నలుఁడు

దక్క, వేఱొక్కండు, నిన్నుఁ, పరింపఁ, పాత్రుండు=అర్హుఁడు, కాఁడు, మఱియుఁ, ఒక్కవిశేషంబు=ఒకవిశేషముకలదు.

చ. అడిగితి నొక్కనాఁడు గమలాసను తేరికి వారువంబనై
నడచుచు నుర్విలో నిషధనాథుని కెవ్వతెయొక్కొ భార్యయ
య్యెడునని చక్రఘోషమున నించుకయించుకగాని యంతయే
ర్పడ వినఁగాని నీవనుచుఁ బల్కినచందము దోఁచె మానినీ!

టీ. మానినీ=ఓదమయంతీ! ఒక్కనాఁడు,=ఒకసమయమున, కమలాసను తేరికిఁ=బ్రహ్మరథమునకు, వారువంబునై=గుఱ్ఱమై, నడచుచు, ఉర్విలోఁ=భూమిలో, నిషధనాథునికిఁ=నిషధ దేశాధిపతియైన నలునికి, భార్య=పెండ్లము, ఎవ్వతె=ఏ స్త్రీ), అయ్యెడునొక్కొ=అగునో, అని, అడిగితిఁ, చక్రఘోషమునఁ=చక్రములయొక్క చప్పుడుచే, ఇంచుక యించుకగాని=కొంచెము కొంచెమేకాని, అంత=సమస్తము, ఏర్పడఁ=స్పష్టముగా, వినఁ=విని యుండలేదు. కాని, నీవు, అనుచుఁ=నలునికి భార్యవు నీవేయని, పల్కినచందము=చెప్పినట్లు, తోఁచెఁ=తెలియవచ్చినది.

తా. ఓదమయంతీ! మీయిరువురి సమాగమము బ్రహ్మకుఁగూడ నిష్టమైనట్లు తోఁచుచున్నది. ఏమనఁబూర్వము నేను బ్రహ్మరథమును లాగుచు బ్రహ్మదేవునితో నలమహారాజునకు భార్య యెవ్వతెయగునని యడిగితి. అతఁడిచ్చుప్రత్యుత్తరమును జక్రములచప్పుడుచే స్పష్టముగా విని యుండలేదు. కాని నీనామము నే యుచ్చరించినట్లు తెలియవచ్చినది. ఇందుచే మీదాంపత్యము బ్రహ్మకుఁగూడ నిష్టమే.

ఉ. నిర్ణయమాన్నృపాలునకు నీకును సంగతి యెల్లి నేఁటిలోఁ
దూర్ణము సేయఁగాగలఁడు దోయజసూతి తదన్యథావృథా
దుర్ణయవృత్తికిన్ మనసు దూర్చెనయేని జగజ్జనాపవా
దార్ణవ ముత్తరించుటకు నాతని కెయ్యదిదెప్ప చెప్పుమా.

టీ. తోయజసూతి=బ్రహ్మ, అన్నృపాలునకుఁ=ఆనలునికి, నీకును, సంగతి=

సమముమాపగ=ను, ఎల్లి రేపో, నేఁటిలోఁ=ఈదినముననో,తూర్ణము=వేగముగా, చేయఁగాఁగలఁడు=ఒనర్పఁగలడు,నిర్ణయము=ఈమాటనిశ్చయము, తత్...ప్రవృత్తికిన్-తత్=అందులకు(అనఁగా నలదమయంతులను సమకూర్చుటకనుట)అన్యథా=వ్యతిరిక్తమైన, వృథా=వ్యర్థమైన, దుర్ణయ=దుష్టమైన, ప్రవృత్తికిన్=ప్రవర్తనకు, లోకయజసూతి=బ్రహ్మ, మనస్సు=చిత్తమును, తూర్చెనయేని=ప్రవేశపెట్టినచో, జగజ్జనాపవాదార్ణవము = లోకాపవాదమనెడు సముద్రమును, ఉత్తరించుటకున్=దాఁటుటకు, అతనికిన్=ఆబ్రహ్మకు, ఎయ్యది, తెప్ప=ఏది తెప్పయగునో, చెప్పుమా=తెలియఁజేయుమా.

తా. దమయంతీ!నీకును నలునకును బ్రహ్మ నేఁడో రేపో వేగముగా సంఘటన చేయఁగలఁడు. అట్లు నిన్ను నలునిలోఁగూర్పక మఱియొకనితోఁగూర్చుటకుఁ బ్రయత్నించినచో లోకులందఱు బ్రహ్మను దప్పక నిందింపకమానరు.అట్టి నిందాసముద్రమును బ్రహ్మయెట్లు దాఁటఁగలఁడు?కావున బ్రహ్మ నిన్ను నలునిలోఁ దక్క మఱియొకనితోఁగూర్పఁడు.

వ. అనిన విని ముహూర్తమాత్రంబు చింతించి యాయింతి శకుంతవల్లభున కిట్లనియె. 60

టీ. స్పష్టము.

తే. బాల్యమునఁ జేసి యేను చాపలముఁ బూని
నిన్ను నాయాసపెట్టితి నిగ్రహమున
దప్పుఁజేసితి లోఁగొమ్ము దయ దలిర్ప
బ్రహ్మవాహనకులముఖ్య! పక్షిరాజ! 61

టీ. బ్రహ్మవాహనకులముఖ్య-బ్రహ్మవాహనకుల=హంసకులమునకు, ముఖ్య=ప్రధానుఁడవయిన, పక్షిరాజ, బాల్యమునంజేసి = చిన్నతనముంబట్టి, చాపలముఁ=చపలత్వమును, పూని, నిగ్రహమునన్=నిరోధముచే, నిన్నున్,ఆయాసపెట్టితిని, తప్పున్, చేసితిని=అపరాధముఁజేసితిని- దయ=కరుణ, తలిర్పన్=మొలకలెత్తునట్లుగా, లోఁగొమ్ము = క్షమింపుము-నాతప్పును దిగవిడువుమనుట.

తా. ఓపక్షిరాజ! చిన్నతనముచేఁజపలత్వమును బూని పట్టుదలచే నిన్నుఁ బట్టికొనుటకుఁ బ్రయత్నించి ని న్నాయాసపెట్టితిని. తప్పుచేసితిని. క్షమింపుము. దయఁజూడుము.

సీ. దర్శనీయంబు నీతను విలాసం బెప్డు
నీమనం బత్యంతనిర్మలంబు
మధురాక్షరములు నీ మహితభాషణములు
కీర్తనీయంబు నీ వర్తనంబు
ప్రౌఢియుక్తంబు నీ ప్రతిభావిశేషంబు
కమనీయతరము నీ కలితనంబు
శ్లాఘనీయంబు నీసౌహార్దగరిమంబు
ప్రార్థనీయంబు నీ ప్రాభవంబు
ఆ. మత్స్యమూర్తి యైన మధుకైటభారాతి
భాతి నీవు భువనపావనుఁడవు
నిండునెలయుఁ బోలె నేత్రోత్సవంబ వై
యున్న వాఁడ విట్టి యొప్పు గలదె. 62

టీ. నీతనువిలాసంబు= నీశరీరకాంతి, ఎప్పుడుక్, దర్శనీయంబు=చూడఁదగినది, నీమహితభాషణములు=నీపూజ్యమైనవాక్యములు, మధురాక్షరములు= తీయనియక్షరములుగలవి, అనఁగావినుటకింపుగానుండుననుట. నీవర్తనంబు = నీనడత, కీర్తనీయంబు= కొనియాడఁదగినది, నీప్రతిభావిశేషంబు=నీబుద్ధివిశేషము, ప్రౌఢియుక్తంబు = నేర్పుగూడియుండినది, నీకలితనంబు=నీవిన్నాణము, కమనీయతరము=మిక్కిలి మనోహరమైనది, నీసౌహార్దగరిమంబు= నీయొక్క స్నేహాతిశయము, శ్లాఘనీయంబు = కొనియాడఁదగినది, నీప్రాభవంబు = నీ ప్రభుత్వము, ప్రార్థనీయము=కోరఁదగినది, మత్స్యమూర్తి= మత్స్యావతారుఁడు, ఐన, ...భాతిక్ - ఐన, మధుకైటభారాతిభాతిక్ = మధుకైటభులకు శత్రువైన విష్ణువువలెనే, నీవు,భువనపావనుఁడవు=లోకమును బవిత్రముచేయువాఁ

డవు, నిండు నెలయుంబోలెన్ = పున్నమచంద్రునివలె, నేత్రోత్సవంబవై = నేత్రముల కుత్సవము కలిగించువాఁడవై, ఉన్నవాఁడవు, ఇట్టియొప్పు = ఇట్టిసౌందర్యము, కలదె=కలదా? అనఁగా లే దనుట.

తా. స్పష్టము.

వ. నామనోరథంబు కంఠపథంబున వర్తించుచున్నయది. దుర్లభజనానురాగంబును సమప్రాధాన్యంబు నధిష్ఠించి యున్నయది. అందనిమ్రాఁకులపండ్లుఁ గోయందలంచెద. రాజుం బాణిగ్రహంబున వశీకరింపఁగోరెద. బాల్యచాపలంబున బేలనై యున్నదాన నని సాభిప్రాయంబుగాఁ బలికె నప్పుడు. 63

టీ. నామనోరథంబు=నాకోరిక, కంఠపథంబునన్=కంఠమార్గమందు, వర్తించుచున్నయది, దుర్లభజనానురాగంబును, దుర్లభ=పొందశక్యముకాని, జన=జనులయందున్న, అనురాగము=ప్రేమ, సమప్రాధాన్యంబు=సమానమైన ముఖ్యత్వమును, అధిష్ఠించి=వహించి, ఉన్నది, అందనిమ్రాఁకులపండ్లు=అందని చెట్లనున్న ఫలములను, కోయన్=కోయుటకు, తలంచెద=తలంచుచున్నాను, రాజున్=చంద్రుని, పాణిగ్రహంబునన్=చేతఁబట్టుకొనుటచే, వశీకరింపఁగోరెద=లోఁబఱచుకొనఁగోరెద - నలమహారాజును వివాహముచే వశపఱుచుకొనఁగోరెదని లోపలిభావము. అనఁగా నలమహారాజును గోరుట, నందనిమ్రానిపండ్లనాసించుటతోను చంద్రునిఁజేతఁ బట్టుటతోను సాటియనియు భావము. బాల్యచాపలంబునన్=చిన్నతనమువలని పేరానచే, బేలనై=వెఱ్ఱిదాననై, యున్నదానన్, అని, సాభిప్రాయంబుగాన్=తనలోని యభిప్రాయము సూచితమగునట్లుగా, పలికెన్, అప్పుడు- పైపద్యముతో నన్వయము.

తే. రమణి మందాక్షమందాక్షరంబుగాఁగఁ
బరిమితోక్తుల నిబ్భంగిఁ బలుకుటయును
సంశయాళువై హంస దక్షచ్ఛంసితంబు
హృదయమున నొయ్యఁ జింతించు చిట్టులనియె. 64

3-61

టీ. ఇబ్భంగిన్ = ఈరీతిగా, రమణి = దమయంతి, మందాక్షమందాక్షరంబు - మందాక్ష = సిగ్గుచే, మందాక్షరంబుగాఁగ = మెల్లగ వెలువడుచున్న యక్షరములు కలుగునట్లుగా, పరిమితోక్తులన్ = మితభాషలచే, పలుకుటయును = పలుకఁగా, హంస సంశయాళువై = సందేహముగలదై, తత్ + శంసితము = ఆదమయంతి చెప్పిన మాటను, తనదు హృదయమునన్ = తన మనస్సునందు, ఒయ్యన్ = మెల్లగా, చింతించుచున్, ఇట్టులు, అనియెన్. దమయంతి 'రాజుం... గోరెద' నని యర్థద్వయముచే గూఢముగా చెప్పినందున హంసకు సంశయమయ్యెనని తెలియునది.

తా. దమయంతి సిగ్గుచేఁ దనయభిప్రాయంబు వెలువరింప లేక మితవాక్యముల సూచింపఁగా రాజహంసము విని మనమునం దాలోచించుచు నిట్లనియె.

వ. ఓరాజవదన! రాజుపాణిగ్రహణంబు దృష్టాంతీకరించి పలికిన నీ సుభాషితంబులకు నర్థంబెయ్యది? అంతిమవర్ణంబునకు వేదవర్ణంబునుంబోలె నయ్యర్థంబు నావీనులు ప్రవేశింప నర్హంబు గాదె తిర్యగ్జాతినై యుండియు మాయేలిక నాళీకభవుని యాన నేను జన్మించినయది యాదిగా నెన్నండును మృషాభాషణంబులు వలుక. సత్యంబ వలుకుదు. పలికిన ప్రయోజనంబు సాధింతు. లోకాలోకపర్యంతం బైనధాత్రీమండలంబునందు నీ వెయ్యది యపేక్షించితి వప్పదార్థంబు గొనివచ్చి నీకు సమర్పింపం జాలుదు. కందర్పాకారులైన రాజకుమారు లెల్లను నాకు వశవర్తులై యుండుదురు. విశేషించి యన్నిషధభూవల్లభుండు నన్నుం బ్రాణంబుగా మన్నించియుండు. 65

టీ. ఓరాజవదన = చంద్రునివంటి ముఖముగల దమయంతీ! రాజుపాణిగ్రహణంబు = చంద్రుని జేతం బట్టుకొనుట, దృష్టాంతీకరించి = నిదర్శనముగాఁ జేసికొని, పలికిన నీసుభాషితంబులకున్ = పలికినట్టి నీవాక్యములకు, అర్థంబెయ్యది? అర్థమేమి, అంతిమవర్ణంబునకున్ = శూద్రజాతికి, వేదవర్ణంబునుంబోలె = వేదాక్షరము

వలెనే, అయ్యర్థంబు=నీపలికిన వాక్యములయర్థము, నావీనులు=నాచెవులను, ప్రవేశింపన్=చొచ్చుటకు, అర్హంబు కాదె=తగినదికాదే, (అనఁగా నందని మ్రానిపండ్లకాసించుట యెట్టిదో నలమహారాజును వివాహమాడఁదలంచుటయు నట్టిదేయన్న నీవాక్యం బెంతమాత్రము విన నర్హంబైయుండదు. ఏమన కార్యము సఫలమగుచుండ నీ విట్లువచించుట యుక్తముకాదని భావము) తిర్యగ్జాతినై=పక్షిజాతియందుఁబుట్టినదాననై, ఉండియున్, మాయేలిక=మాప్రభువగు, నాలీకభవునియానన్=బ్రహ్మతోడుగా, నేను, జన్మించినయదియాదిగాన్=జన్మించినది మొదలుకొని, ఎన్నండును, మృషాభాషణంబులు=అబద్ధపువాక్యములను, పలుకన్ =పలుకను, సత్యంబు, పలుకుదున్, పలికినప్రయోజనంబు=నా చెప్పిన కార్యమును, సాధింతును=సఫలమగునట్లు చేయుదును, లోకాలోకపర్యంతంబు=చక్రవాళమహద్దుగాఁగలది, ఐనధాత్రీమండలంబునందున్=అయినభూమండలమందు, నీవు, ఎయ్యది, అపేక్షించితివి=ఏదికోరితివో, అప్పదార్థంబున్=అవస్తువును, కొనివచ్చి, నీకున్, సమర్పింపన్=ఇచ్చుటకు, చాలుదున్ = ర్థుఁడనగుదును, మరుకందర్పాకారులు=మన్మథునితో సమానమైన యాకారముగలవారు, ఐనరాకుమానరెల్లను = అయినట్టి రాజకుమారులందఱు, నాకున్, వశవర్తులై = లోఁబడియుండువారలై, యుండుదురు, విశేషించి= అధికముగా, అన్నిషధభూవల్లభుండు=అనిషధరాజు, నన్నున్, ప్రాణంబుగా=తనప్రాణమువలెనే, మన్నించి=గౌరవించి, ఉండును.

సీ. అతఁడు పాణిగ్రహణార్హుండు విను నీకు
నతనిఁ గూర్పఁగ నేర్తు నతివ! యేను
పిన్నపాపవు నీవు పితృపరాధీనవు
కార్యనిర్ణయశక్తి గలదె నీకు
నావల నిషధరాజఖిలలోకేశ్వరుం
డీవలఁ బరమేష్ఠిహితుఁడ నేను
సందేహ[illegible] యైనప్రసంగ

మిప్పట్టునందు నే కె నె ట్లొన ర్తు

తే. మొదల సంఘటించినఁ బొంది కె పిదప నున్న
గార్య మఘటించె నేనియు కె ఘనత తప్పి
ప్రాణమై నన్ను రమ్ము పొ కెమ్మనునృపాలు
నెదురఁ దలవంచికొనియుండ కె నెట్లు నేర్తు. 66

టీ. అతివ=దమయంతీ! అతఁడు=ఆనలుఁడు, నీకు, పాణిగ్రహణార్హుండు=పెండ్లియాడఁదగినవాఁడు, వినుము, అతనిక్=ఆనలుని, కూర్పఁగక్, నేర్తుక్=నీకుసమకూర్పఁగలను, నీవు, పిన్నపాపవు, పితృపరాధీనవు=తండ్రికి నధీనురాలవు, నీకుక్, కార్యనిర్ణయశక్తి=కార్యమును నిశ్చయింపఁగలంత సామర్థ్యము, కలదె=కలదా, (అనఁగా లేదనుట) ఆవలక్=అటువైపు, నిషధరాజు=నలుఁడు, అఖిలలోకేశ్వరుండు=సకలలోకముల కధిపతియై యున్నాఁడు. ఈవలక్=ఈతట్టుచూడఁగా, పరమేష్ఠిహితుఁడక్=బ్రహ్మకు స్నేహితుఁడను ఐన, నేను, (కార్యము నెఱవేర్పఁ బూనియున్నాననుట) సందేహడోలాధిశాయి=సందేహమనెడు నుయ్యెలయందున్నది, ఐన ప్రసంగము=అయిన కార్యము, ఇప్పట్టునక్=ఈసమయమందు, నేను, ఎట్లు, ఒనర్తుక్=ఎట్లు చేయుదును (అనఁగా నీవు పితృపరాధీనవగుటచేఁ బెండ్లాడ నీయిష్టము కాదు గనుక నీవు నలుని వరించినప్పటికి నీతండ్రిమతియొకని కిచ్చునేమోయన్న సందేహము బాధించుచున్నదని భావము) మొదలక్, సంఘటించినక్=సమకూర్పఁగా, పొంది=కూడి, పిదపక్, ఉన్న కార్యము, అఘటించెనేనియుక్=చెడినచో, ఘనత=గౌరవము, తప్పి=పోఁగొట్టుకొని, ప్రాణమై=ప్రాణమువంటివాఁడై, నన్ను, రమ్ము, పొమ్ము, అను నృపాలునెదురక్=అనునలునియెదుట, తలవంచికొనియుండక్, ఎట్లు నేర్తుక్=ఎట్లు సమర్థుఁడనగుదును, అనఁగా నీమాట చొప్పున నేఁగార్యము స్థిరపఱచినపిదప నీతండ్రికి నలునికీయ నిష్టములేక కార్యము చెఱిచినచో నాకుఁబ్రాణహితుఁడై వర్తించు నలునియొద్ద నేనెట్లు గౌరవము గావర్తింపఁగలుగుదును. కావున నిప్పని చక్కఁగ నాలోచించి చేయవలసినది.

ఉ. ఇప్పటినీతలంపు తెలుఁ కె గిట్టిద పో యిట్టిమీఁద నెప్పుడే

చొప్పున నుండునో నిజముశుద్ది యెఱుంగముగాని యుగ్మలీ!
చెప్పెడిదేమి బాలికలచిత్తము లంబుతరంగలోలముల్
తప్పునొ తాఁకునో కుసుమధన్వుని యేటులు దైవికంబునన్.

టీ. ఉగ్మలీ=దమయంతీ! ఇప్పటినీతలంపుతెఱంగు=ఈకాలమందున్న నీ కోర్కియొక్కరీతి, ఇట్టిదపో=ఇట్టిదే కానిమ్ము! ఇటమీఁదన్=ఈపైని, ఎప్పుడు=ఏకాలమందు, ఏచొప్పునన్=ఏరీతిగా, ఉండునో, నిజముసుద్ది=నిజమైనసంగతి, ఎఱుంగము=తెలిసికోలేము, కాని, చెప్పెడిదేమి=ఏమిచెప్పఁగలము, బాలికలచిత్తములు=చిన్నపిల్లలయొక్క మనస్సులు, అంబుతరంగలోలముల్-అంబుతరంగ=కెరటములవలె, లోలముల్=చలించుచుండును, కుసుమధన్వుని యేటులు=మన్మథునియొక్క దెబ్బలు, తాఁకునో=తగులునో, లేక దైవికంబునన్=దైవవశమువలన, తప్పునో=తప్పిపోవునో. అనఁగా మీవంటి బాలికల చిత్తములు మిక్కిలి చలించుచుండును. మదనబాణములకు లక్ష్యములయిన మీచిత్తములు కదలుచుండుటచే మన్మథుని బాణములకు లోఁబడవు కావునఁ గాముకులోఁబడని మీచిత్తము లేకాలమున నెట్టులుండునో. కావున నిప్పటి స్థితినిబట్టి కార్యము నెఱవేర్ప వీలులేదని భావము.

తా. సుందరీ! ఇప్పుడు నీకోరికయిట్లున్నను, నీపై నెట్లుగానుండునో నిజమైనస్థితిని దెలిసికొనలేము. పిల్లలచిత్తములు కెరటములవలె చలించుచుండును. అట్లుచలించుచున్న చిత్తములలోఁ బుట్టినకోరిక స్థిరముగా నుండునో యుండదో యేమిచెప్పఁగలము. కావున నీయీపలికినవాక్యములనుబట్టి కార్యము నెఱవేర్చుట దుర్ఘటము.

వ. శంకాకళంకితం బయినయివ్విషయంబునందుఁ బ్రామాణికుండనై యేను వర్తింప నంగీకరింపం గాని వేఱొక్క కార్యంబునకు నన్ను నియోగింపుము. దుర్ఘటంబయిన నది సంఘటించెద నని పలికిన నాపతత్త్రిపుంగవునకు ధాత్రీపురు

టీ. శంకాకళంకితంబు=శంకచేఁ గలకచెందినది, అయినయివ్విషయంబునందుఁ=అయినట్టి యీకార్యమునందు, అనఁగా సందేహాస్పదమయిన కార్యమందనుట. ప్రామాణికుండనై=నిర్ణయించువాఁడనై, ఏనువర్తింపఁ, అంగీకరింపను=ఇష్టపడను, కాని, వేఱొకకార్యంబునకు= వేఱొకకార్యము నిమిత్తమై, నన్నుఁ, నియోగింపుము, దుర్ఘటంబుఅయినఁ=ఘటింపశక్యముకానిదైనను,అది=ఆకార్యము, సంఘటించెదఁ = సమకూర్పఁగలను, అనిపలికినఁ, ఆపతత్త్రిపుంగవునకు= ఆపక్షిరాజమునకు, ధాత్రీపురుహూతపుత్త్రి - ధాత్రీపురుహూత=భూదేవేంద్రుఁడైనభీమరాజుయొక్క, పుత్త్రి=కూఁతురైనదమయంతి, ఇట్లనియెఁ=ఇట్లుపలికెను.

తే. నిషధభూపాలు నొల్లకే నృపతి నొరుని
నభిలషించితినేని హంసాగ్రగణ్య
యామవతి చంద్రు నొల్లక యన్యు నొకని
నభిలషింపంగ నోంకార మాచరించు. 69

టీ. హంసాగ్రగణ్య! ఏఁ=నేను, నిషధభూపాలుఁ=నలుని, ఒల్లక=వరింపక, నృపతిఁ-ఒరునిఁ=మఱియొకరాజును, అభిలషించితి నేని=వరించినచో, యామవతి=రాత్రి, చంద్రుని, ఒల్లక=వరింపక, అన్యునొకనిఁ=మఱియొకని,అభిలషింపఁ=వరించుటకు, ఓంకారము, ఆచరించుఁ=అంగీకరించును. అనఁగా రాత్రిచంద్రునివిడుచుట యెట్టి దుర్ఘటమైనపనియో నేను నలుని విడుచుటకూడ నట్టిదియే యని భావము.

తా. హంసరాజా! రాత్రి చంద్రుని విడిచిపెట్టి మఱియొకని వరించినట్లయిన నేను నలుని విడిచి మఱియొకనిఁ జేపట్టుదు.

తే. అబ్జినీమానసానురాగాభివృద్ధి
యర్కసంపర్కమునఁ దక్క నగునె యొంట
నలుని దక్కంగ నొరునినేఁ దలఁతునెట్లు
విడువు సందేహమోహంబు విహగరాజ! 70

టీ. అబ్జినీమానస..వృద్ధి-అబ్జినీ=తామరతీఁగయొక్క, మానస=చిత్తమందున్న. అనురాగ=ప్రేమయొక్క, వృద్ధి, అర్కసంపర్కమునఁదక్కన్=సూర్యసంబంధముచేఁగాక, ఒంటన్=మఱియొకదానిచే, అగునె=అగునా? అనఁగాఁగాదనుట విహగరాజ=ఓహంసమా, నేను, నలుని, తక్కంగన్=నలునివిడిచి, ఒరునిన్=మఱియొకని, ఎట్లుతలఁతున్=ఎట్లుగాఁగోరుదును, సందేహమోహంబు=సందేహమనెడి యజ్ఞానము, విడువు=విడువుము.

తా. ఓపక్షిరాజా! తామరలతకు సూర్యసంపర్కముచేఁగాక మఱియొకసంబంధముచేఁ బ్రేమకలుగని విధంబున నాకు నలునిసంబంధముచేఁగాని మఱియొకనిసంబంధముచేఁ బ్రేమ కలుగదుగాన సందేహమువిడిచిపెట్టుము.

అలం - సమాసోక్తి.

తే. అనలసంబంధవాంఛ నాకగునయేని
ననలసంబంధవాంఛ నాకగును జూవె
చాలు సందేహవక్రభాషణము లింకఁ
దరుణచక్రాంగ! పాథః పతంగశక్ర!. 71

టీ. పాథః పతంగశక్ర = ఓజలపక్షిరాజా ! తరుణ = యౌవనముగల, చంక్రాంగ=ఓహంసమా, అనలసంబంధవాంఛ-అనల = నలుఁడుకాని పురుషుని యొక్క, అనఁగా-నలవ్యతిరిక్తునియొక్క యనుట, సంబంధ=స్నేహమందు వాంఛ=కోరిక, నాకు, అగున యేని=ఐనట్టయిన, అనల సంబంధవాంఛ=అగ్నిహోత్రునియొక్క సంబంధమందలి కోరిక, నాకున్, అగున్ చూవె=అగునుజుమీ, అనఁగా-నలునివరింతును, లేనిచో ననలములోఁబడిచత్తునని భావము. ఇఁక=ఈపైని, సందేహవక్రభాషణములు= సందేహముచేఁ గుటిలములగు మాటలు, చాలు = చాలింపుము,

తా. ఓపక్షిరాజమా! నలునిసంబంధముమాని మఱియొకని సంబంధమందు నాకుఁ గోరికయుండినచో నగ్నిహోత్రునిసంబంధమందుఁ గోర్కెయున్నట్లు తలంపుము- అలం - శ్లేష.

ఉ. దివ్యము ... విప్రలం

భ వ్యవహారము న్నిలువఁ బట్టఁగ నేమిఫలం బశక్యశం
కావ్యభిచారహేతువనఁ గల్గినమాటయ వేదవాక్యముల్
భవ్యవిచార! కావనిన భావనసేయుమ యెవ్వి వేదముల్. 72

టీ. దివ్యఖగేంద్ర=ఓదేవతా సంబంధమైన పక్షిరాజా! మదిన్ = మనస్సునం దు, ఇయ్యెడన్ = ఈపట్టున, ననున్, నమ్మవు=నమ్మకుంటివి, నాకున్, విప్రలంభవ్యవహారమున్ =నిన్నువంచింపనలెనన్న ప్రయత్నమును, నిలువఁ పట్టఁగన్ =నిలుకడగా నుంచుటకు, ఏమి ఫలంబు=ఏమి ప్రయోజనము, అనఁగా నిన్నువంచించినచో నాకేమిఫలముగలదు? అనిభావము. అశక్య... హేతువు-అశక్య = శక్యముకాని, శంకా=సందియములుకల, వ్యభిచారహేతువు=అజ్ఞానకారణముకలవి-అనఁగా నేవాక్యములకు వ్యభిచారకారణమున్నదని శంకింపం దరముకాదో, యట్టివాక్యములనిభావము. వ్యభిచారమనఁగాఁదప్పిచరించుట. అనన్ =అనిపలుకగా, కల్గినమాటయ=కలిగినట్టి, వాక్యమే, వేదవాక్యముల్ = వేదవచనమువలెఁ బ్రమాణమైనది. భవ్యవిచార=ప్రశస్తమగు ఆలోచనగలవాఁడా! కావనినన్ =అవి వేదములుకావన్నచో, యెవ్వి వేదముల్=ఏవి వేదములో, భావనసేయుమ=ఆలోచింపుమా.

తా. ఓ పక్షిరాజమా! నాపలికినవాక్యము లెందుచేతనమ్మవు? నేనుఁ గపటపువాక్యములు పలికి నిన్ను వంచించినచో నాకేమి ప్రయోజనము? కావున నామాటలయందు వంచనలేదని నమ్ముము. వంచనముచేయని మాటలేకదా వేదవాక్యములనఁబడును. అందువలన నామాటలందు వంచనలేదుకావున నామాటలు వేదతుల్యములనవచ్చును. కానిచో నింక వేదములనఁగా నెట్టివో చెప్పుము. మఱియు వేదము లసత్యమయినచో నావాక్యము లసత్యము లౌనని యెంచుము.

తే. తండ్రి నిషధాధిపతి కీక తక్కు యొరున
కీఁదలంచిన నే విహగేంద్ర! వినుము
దేహమనలంబునకు నాహుతి గనొనర్చి
యతనిఁ బొందంగఁ గందు జన్మాంతరమున. 73

టీ. విహగేంద్ర=పక్షిరాజా! తండ్రి=నాతండ్రియగు భీమరాజు, నిషధాధిప

తికిన్=నలునికి, ఈక=ఇయ్యక, తక్కన్=మాని, ఒరునకున్=మఱియొకరాజునకు, ఈఁదలంచినన్=ఇచ్చుటకిష్టపడినచో, నేన్=నేను, దేహమున్=శరీరమును, అనలంబునకున్=అగ్నికి, ఆహుతిగన్, ఒనర్చి=హోమముగాఁజేసి, అతనిన్=అనలుని, జన్మాంతరమునన్=మఱియొకజన్మమందు,పొందన్, కన్, కందు=పొందఁగలను.

తా. ఓపక్షిరాజ! నాతండ్రి నలమహారాజునకు నన్నీయక మఱియొకని కిచ్చినచో నాశరీరమును వెంటనే యగ్నికర్పించి రెండవజన్మమందైనను నలునిఁ బొందక మానను.

శా. తద్దాసీత్వపదంబు గైకొని కృతార్థత్వంబునుం బొందుదుం
దద్దివ్యాంఘ్రిసరోజవందనవిధిం దాత్పర్యముం జెందుదుం
దద్దాక్షిణ్య మపేక్ష సేయుదు మదిం దత్సేవకుం జొత్తు నేఁ
దద్దోరంతర పీఠిఁ జేరుతుఁ గుచద్వంద్వంబు నీసత్కృపన్.74

టీ. తద్దాసీత్వపదంబు=అతనియొక్క సేవాస్థానమును, అనఁగా సేవనుట. కైకొని=చెంది, కృతార్థత్వంబునుం=ధన్యత్వమును, పొందుదును. తత్...విధిన్,తత్=నలునియొక్క, దివ్య=మనోహరమైన, అంఘ్రిసరోజ=పాదపద్మములకు, వందనవిధిన్=నమస్కారము చేయుటయనుపనియందు, తాత్పర్యమున్=అత్యాసక్తిని, చెందుదున్=పొందుదును, తత్=ఆనలమహారాజుయొక్క, దాక్షిణ్యము=దయను, మదిన్, అపేక్ష సేయుదున్=కోరుదును, ఏన్=నేను, తత్సేవకున్=ఆనలుని సేవకు,చొత్తున్=పూనుకొందును. తద్దోరంతరపీఠిన్-తత్=ఆనలునియొక్క, దోర్=బాహువులయొక్క, అంతరపీఠిన్=పీఠమువలెనున్న మధ్యభాగమందు,అనఁగా వక్షస్థలమందనుట, నీసత్కృపన్=నీదయచే, కుచద్వంద్వంబున్=స్తనయుగ్మమును, చేరుతున్=చేర్చెదను.

తా. ఓపక్షిరాజమా! అతని దాసినై యుండి, ధన్యురాలనగుదును. అతని పాదపద్మములకు నిత్యము నమస్కరించి కృతార్థురాలనగుదును. అతనిదయనే కోరెదను. అతని సేవనే చేయుచుందును. నీదయవలన నతనినే కౌఁగిలించుకొందును.

తే. అతనిఁ గోరుదు నే నంత రంగసీమ
నంతఁ జింతామణికిఁ జింత యాచరింపఁ
బద్మముఖుఁ డైనయతఁడు నా పాలి కనఘ
పెన్నిధానంబు మాటలు పెక్కు లేల. 75

టీ. అనఘ=పాపరహితుఁడా, నేను, అంతరంగసీమన్=హృదయమందు, ఋ అతనిన్=నలుని, కోరుదున్=వరింతును, అంతన్=అతనిఁగోరినపైని, చింతామణికిన్=చింతామణి నిమిత్తమును, చింత, ఆచరింపన్=విచారింపను, చింతామణి యనఁగాఁ గోరినకోర్కులిచ్చెడి యొక దివ్యరత్నము. ఆదివ్యరత్నముకంటె నలుఁడు ప్రియుండనిభావము, పద్మముఖుఁడు=పద్మమువంటి ముఖముకలవాఁడు (పద్మనిధిలోనుగాఁ గలనిధులుకలవాఁడు), ఐనయతఁడు=అయినట్టి యానలుఁడు, నాపాలికిన్=నాకు, పెన్నిధానంబు=పెద్దనిధివంటివాఁడు, పెక్కులు, మాటలు, ఏల=పెక్కుమాటలతో నేమి ప్రయోజనము. ఆనలుఁడే నాకుఁ బెన్నిధి. అతనికంటె నన్యమేమియు నక్కఱలేదని భావము.

తా. పక్షిరాజమా! పెక్కుమాటలతో నేమి ప్రయోజనము? నలమహారాజును నే నామనసులోఁ గోరెదను. అతండు నాకు లభించచోఁ జింతామణిని గూర్చి యైనను విచారింపను. అతఁడు నాకు నిధివంటివాఁడని నమ్మియున్నాను.

తే. వింటిఁ దద్గుణనికరంబు వీను లలరఁ
గంటి నాతని మోహసంక్రాంతిఁ దిశలఁ
బోలఁ దలఁచితి నీరంధ్ర బుద్ధిధారఁ
జాల వలచితి నతని నే సత్య మిదియ. 76

టీ. తద్గుణనికరంబు=ఆనలమహారాజుయొక్క గుణ సముదయము, వీనుల లరన్=చెవులపండువుగా, వింటిని, దిశలన్=దిక్కులయందు, ఆతనిన్=ఆనలుని, మోహసంక్రాంతిన్=మోహసంక్రమణముచే, అనఁగా నలునియందలి మోహాతిశయమున నున్మాదావస్థనుబొందియుండుటంజేసి జగమ్మంతయు నలమయముగానే కనఁబడుటచేఁ బ్రతిదిక్కునందు నలునిఁ జూచుచున్నానని భావము, కంటిని=

చూచితిని, నీరంధ్రబుద్ధిధారన్ -నీరంధ్ర=అవకాశములేని, అనఁగా నితరజ్ఞాన మునకుఁదావులేని, బుద్ధిధారన్ =ధారవంటి బుద్ధిచే-అనఁగా నెడతెగని బుద్ధిచే ననుట, పోలన్, తలఁచితిన్ =సమానురాల నగుదు ననితలంచితి, అతని నే=అనలుని నే, చాలన్ =మిక్కిలి, వలచితి=ప్రేమించితిని, ఇదియ సత్యము=ఇదే నిజము.

తా. ఓవిహంగమా! నలునిగుణనికరమును జెవులపండువుగా వినియున్నాను మోహముచే నతనిఁ బ్రతిదిక్కునందుఁ జూచుచున్నాను. ఎడతెగనిబుద్ధిచే నత నికి సమానురాల నగుదును నని తలంచితిని. ఆతని నే చాలఁ బ్రేమించితిని. ఇదే సత్యము.

సీ. ఆతనిఁగూర్చి నా ప్రాణంబు రక్షింపు
మింతయు నీచేతి దేమిసెప్ప
నాశ్రితసంరక్షణాభ్యుత్థితం బైన
పరమపుణ్యంబు చేపట్టు మిపుడు
మిథ్యావిశంక యేమిటికిఁ బాటించెద
వవలంబనంబు సేయకు విలంబ
మనురాగజలధివేలాంతర్వినిర్మగ్నఁ
దెప్ప వై ననుఁ జేర్పు తీరమునకు
తే. ధర్మపరులు వరాటికాదానమాత్ర
లాభమునకైన మెత్తు రుల్లములలోనఁ
బ్రాణనాథప్రదానతత్పరుఁడవైన
నిన్ను నేమని మెత్తునో నిర్మలాత్మ! 77

టీ. ఆతనిఁగూర్చి = అనలమహారాజును గూర్చి, నాప్రాణంబు = నాయొక్కజీవమును, రక్షింపుము=కాపాడుము, ఇంతయు = ఇదంతయు, నీచేతిది = నీచేతిలోసంగతి, ఏమిచెప్పన్ = ఏమిచెప్పఁగలను, ఆశ్రిత...ఉత్థితంబు-ఆశ్రిత=ఆశ్రయించినవారలను, సంరక్షణ=రక్షించుటవలన, అభ్యుత్థితంబు = పుట్టినది, పరమపుణ్యంబు=అధికమైన పెద్దపుణ్యమును, ఇపుడు=ఈసమయమందు,

చేపట్టుము=అవలంబింపుము, లేక, పొందుము. మిథ్యావిశంక=వట్టి సందేహము ను, ఏమిటికి=ఎందుకు, పాటించెదవు=స్వీకరించెదవు, అనఁగా లేనిపోనిశంక లను గారణముగాఁజేసికొని విచారమొందకుమని భావము. విలంబము=ఆలస్యము, అవలంబనంబుఁ జేయకుము= కయికొనకుము, అనురాగ...నిర్మగ్నున్-అనురా గ=ప్రేమ యనెడు,జలధి=సముద్రముయొక్క, వేల=ఒడ్డయొక్క, అంతర్=మ ధ్యమందు,వినిర్మగ్నున్=మిక్కిలి మునిఁగినదానను, తెప్పవై=నావవై,ననున్, తీరంబునకున్=ఒడ్డునకు, చేర్పుము, ధర్మపరులు = ధర్మాసక్తిగలవారు, పరా టికా దానమాత్రము-పరాటిక=గవ్వయొక్క,దానమాత్ర=ఈవిమాత్రమగు,లాభ మునకున్-ఐనన్=ప్రయోజనమునకైనను, ఉల్లములలోనన్=మనస్సులో, మెత్తు రు=మెచ్చుకొందురు, ఓ నిర్మలాత్మ=ఓ నిర్మలమైన అంతఃకరణముకలవాఁడా! ప్రాణనాథ...తత్పరుఁడవు- ప్రాణనాథ=భర్తను, ప్రదాన=ఇచ్చుటయందు, తత్పరుఁడవు=ఆసక్తిగలవాఁడవు, ఐననిన్నున్= అయినట్టి నిన్నును, ఏమని మె త్తున్=ఏమని మెచ్చుకొందును.

తా. ఓపక్షిరాజమా ! అనలమహారాజుతో నన్నుఁగూర్చి రక్షిం పుము; ఈకార్యమంతయు నీచేతిలోనున్నది. ఆశ్రితులసంరక్షించుటవలనఁ గలి గినఫలమును బొందుము. ఇంక సంశయమును విడిచి పెట్టుము. ఆలస్యముచేయ కుము. అనురాగమనెడి సంద్రమందు మునిగియున్న నాకుఁ దెప్పవై యొడ్డును జేర్పుము. లోకములో స్వల్పోపకారము జేసినను, ధర్మాత్ములు మనంబున నెంత యో సంతసించుచుండఁ బ్రాణేశ్వరుని నాకు సమకూర్పఁ బాటువడుచున్న నిన్నును బొగడుటకు నాతరమగునా ? నీవుచేసిన యుపకారమువలన నాకు వొడముచున్న సంతోషమునకు హద్దులేదు.

చ. మనమున లోకపాలు రెనకేమంద్రను మెచ్చఁ, దృణీకరింతుఁ ద
క్కిన సురకోటి, రాసుతులఁ గేగిడ్పడఁ జూచుటఁ జెప్పనేటికిం
గొనకొని యానృపాలునకుఁ గూర్చుటకై శపథంబుచేసెదన్
ననవిలుకాని పాదనలినంబులపై రతి చన్నదోయిపై. 78

టీ. మనమునన్ = మనసునందు, లోకపాలురెనమంద్రను = అష్టదిక్పా

లురను, మెచ్చక్ = కోరను, తక్కినసురకోటిక్ - తక్కిన=మిగిలిన, సురకో టిక్ = దేవతలను, తృణీకరింతుక్ = తిరస్కరింతును, రాసుతులక్= రాకుమారులను, కీడ్వడక్ చూచుటక్ = తిరస్కరించుట, చెప్పనేటికిక్= చెప్పుటయెందుకు, కొనకొని = ప్రయత్నించి, అనృపాలునకుక్ =అనలమహా రాజునకు, కూర్చుటకై =ప్రియపడుటకై -(అనఁగా నలునినే నేను వలతుననుట కనుట, ననవిలుకాని = మన్మథునియొక్క, పాదనలినంబులపైక్ =పాదపద్మ ములపైని,రతిచన్నుదోయిపై = రతీదేవియొక్క స్తనయుగళంబుపై, శపథం బుచేసెదక్ =ప్రతిజ్ఞచేసెదను.

తా. అష్టదిక్పాలకులు తమమనంబులలో ననువరింపఁ దలంపుకొని వరించి నను దిరస్కరించెదను. అష్టదిక్పాలురనే తిరస్కరించినపుడు తక్కినవారిసం గతి జెప్పవలయునా? ఇదిగో,చూడు! రతిమన్మథులయొద్ద శపథముచేసి చెప్పు చున్నాను! నలునినే నేను గామింతును.

క. కార్యమిది కాలయాపన
ధైర్యసహముకాదు చను ముదంచితగతి నో
యార్యభవన్నయధౌరం
ధర్యము చూతముగదా యుదాత్తస్ఫురణన్. 79

టీ. ఓఆర్య=ఓపూజ్యుడవైన హంసరాజా, ఇది, కార్యము=చేయఁదగినది, కాలయాపన=కాలమును వెడలఁబుచ్చుట, లేక కడపుట-ధైర్యసహము=ధైర్య ముచే సహింపఁదగినది కాదు, ఉదంచితగతిక్ =ఒప్పుచున్న గమనముచే, చనుము=పొమ్ము; భవన్నయ ధౌరంధర్యము - భవత్ =నీయొక్క, నయ=నీతి యొక్క, ధౌరంధర్యమును=చాతుర్యమును, ఉదాత్తస్ఫురణక్ = నీయౌదా ర్యాతిశయమును, చూతము+కదా.

తా. ఓహంసరాజా? నన్ను నలునితోఁ గూర్చుట చేయవలసినకార్యము. ఇఁకధైర్యముతోఁ గాలముఁ బుచ్చుట కష్టము.నీవుత్వరితగమనముతోఁ బొమ్ము. నీ నీతిచాతుర్యమును నీయౌదార్యమును చూచెదను గాక.

తే. అతఁడు మద్దాంపత్యము నైనయపుడు నీవు

నా ప్రసంగంబు సేఁత విహఁగ్నను వు గాదు
భామినీముఖదాక్షిణ్యకబలముకలిమి
నితరకాంత నిషేధించు నెవ్వఁడైన. 80

టీ. అతఁడు=అనలుఁడు,శుద్ధాంతగతుఁడు=అంతఃపురమును పొందినవాఁడు, వినయపుడు = విన సమయమునందు, నీవు, నాప్రసంగంబు సేఁత = నాప్రసంగము చేయుట, విన్ననువుగాదు = బాగుగాదు, భామినీముఖ దాక్షిణ్యబలము కలిమిన్ - భామినీ =తన స్త్రీలయొక్క, ముఖదాక్షిణ్యబలము కలిమిన్ = మొగమోటముయొక్క బలిమికలిగియుండుటచే, ఎవ్వఁడైనన్ = ఎటువంటివాఁడైనను, ఇతర కాంతన్ = పరకాంతను, నిషేధించున్ =వలదనును-

తా. ఓవిహంగమా! నాసంగతి నలమహారాజు అంతఃపుర స్త్రీలయొద్ద నున్నప్పుడు తెలియఁజేయకుము.లోకములోఁ దనభార్యయందున్న ప్రేమాతిశయముచే నెటువంటి స్త్రీనైనను వలదని తిరస్కరించుట సహజము.

ఉ. నాగతి విన్నవించుట యనర్హము సుమ్ము నిజావరోధసం
భోగనితాంతతృప్తుఁడగు భూపతికిన్ సలిలంబు దప్పిపోఁ
ద్రాగినవారి కింపగునె తన్పను దియ్యఁదనంబు వాసనా
యోగము గల్గెనేని విహగోత్తమ!నిర్మలవారిపూరముల్.81

టీ. నిజ......తృప్తుఁడు, నిజ=తనయొక్క, అవరోధ=అంతఃపుర స్త్రీలవలనఁగలిగిన,సంభోగ= రతిక్రీడచే, నితాంత=మిక్కిలి, తృప్తుఁడు=తనివిఁజెందినవాఁడు, అగుభూపతికిన్ =అయినట్టి నలునికి, నాగతిన్ =నాసమాచారమును, విన్నవించుట = తెలుపుట, అనర్హముసుమ్ము= తగదుసుమీ, దప్పి=దగ, పోన్ =పోవునట్లుగా,సలిలంబున్ =నీటిని,త్రాగినవారికిన్ , విహగోత్తమ=పక్షిశ్రేష్ఠ,నిర్మలవారి పూరముల్ =నిర్మలమైన నీటిముంపులు,తన్పును=చల్లదనమును, తియ్యఁదనముఁ =మాధుర్యమును, వాసనాయోగముఁ =మంచి వాసనయొక్క సంబంధమును, కలిగెనేని = కలిగి యున్నప్పటికిని, ఇంపగునె= రుచించునా - రుచింపవనుట.

తా. ఓపక్షిరాజమా! దప్పిపోవునట్లుగాఁ గడుపార నీరు ద్రావినవారికి చల్లనై తియ్యఁదనముగలిగి పరిమళించుచు మఱింత మేలయిన నీరపూరము కలిగినను తృప్తికలిగింపలేనివిధమున నంతఃపుర స్త్రీలవలనఁ గలిగిన సౌఖ్యము చేఁదనిపించెంది మరు లుపశమించియున్నపుడు నలునికి నా స్త్రీలకంటె నెక్కువ నయ్యు నాసమాచారము తృప్తిఁగొలుపదు. కావున నట్టిసమయములోఁ గాక మఱియొక సమయముఁజూచి విన్నవింపుము. అట్లైన కార్యము నెఱవేఱును.

తే. అధికరోషకషాయితస్వాంతుఁ డైన
నరపతికి విన్నవింపకు నాయవస్థ
పైత్యదోషోదయంబునఁ బరుసనైన
జిహ్వకకుఁ బంచదారయుఁ జేఁదుగాదె. 82

టీ. అధిక... స్వాంతుఁడు-అధిక=మిక్కిలి, రోష=కోపముచే, కషాయిత=కలుషమైన, స్వాంతుఁడు=చిత్తముకలవాఁడు, అయిన నరపతికిన్=ఐనరాజునకు-అనఁగా నలునకనుట, నాయవస్థ=నాదశను, విన్నవింపకు=తెలియఁ బఱుపకుము, పైత్యదోషోదయంబునన్=పైత్యాధిక్యముచే, పరుసనైన = బిఱుసువాఱిన, జిహ్వకకున్=నాలుకకు, పంచదారయున్, చేఁదుగాదె=చేఁదుకాదా; అనఁగా నగుననుట.

తా. పైత్యాధిక్యము కలవాని నాలుకకుఁ బంచదారసహితము చేఁదైన విధమున నధికకోపముతోఁ గూడియున్న నలునకు నాయవస్థ, లేక, గుణములు, మంచివైనను రుచింపవు, గనుకఁ దెలుపవలదు.

ఆ. కదిసి నాతెఱంగు కార్యాంతరాసక్త
చిత్తుఁ డైనపతికిఁ జెప్ప వలన
దనవబోధనిద్ర యవమానముద్రకుఁ
బ్రథమకారణంబు పక్షిరాజ! 83

టీ. పక్షిరాజ, కార్యాంతరాసక్తచిత్తుండు-కార్యాంతర=మఱియొక కార్యమునందు, ఆసక్త=తగిలియున్న, చిత్తుఁడు=మనస్సు కలవాఁడు, ఐనపతికిన్=ఐననలునకు, కదిసి=సమీపించి, నాతెఱంగు=నాస్థితి, చెప్పవలవదు, అనవబోధనిద్ర =

ఎఱుఁగుటలేమి యనునిద్ర - నిద్రించునప్పటివలె చెప్పుకొన్న మనవి నెఱుంగఁ జాలనట్టి స్థితి, అవమానముద్రవున్ =అవమానమనెడు గుఱుతునకు, ప్రథమకారణంబు=మొదటి కారణము. అనఁగాఁ ప్రభువులు కార్యాంతరాసక్తులయి నప్పుడు యాచకులు తమప్రార్థితార్థములఁ గూర్చిమనవిచేసికొన్నచో వారు వాని నెఱుంగఁగూడునట్టిస్థితిలో లేమిచే యాచకుల నవమానింపక మానరు. కావున నీవు కార్యాంతరాసక్తుఁడయి కాన నీమనవి నెఱుంగఁజాలకున్న నలునకు నా యవస్థ విన్నవించినచోఁ గార్యవైఫల్యమే కాక యవమానమును గూడఁబొందుదువు. అట్టి సమయములందు మనవిచేయవలదని భావము.

తా. ఓపక్షిరాజా! మనవినెఱుంగలేనట్టి తెలివిమబ్బునను‌న్న ప్రభువు మనవి చేసినవానికి నవమానము కలిగించునుగాన కార్యాంతరాసక్తుఁడైన రాజునకు నీవు పలికినమాటలు వినఁబడక యవమానము కలిగించును. కనుక, సమయముచూచి మనవిచేయుము.

వ. కావున నవసరం బెఱిఁగి యాత్యంతికాసిద్ధివిలంబసిద్ధుల యందు నీకు నెయ్యది శుభంబై తోఁచు నదియ చూచుకొనునది యని యవ్వైదర్భి మదనోన్మాదంబునం జేసి లజ్జాభరం బుజ్జగించి కులకన్యాజనంబులకు నుచితంబులు గానియతిప్రౌఢవచనంబులం బలికిన. 84

టీ. కావునన్ =కాఁబట్టి,అవసరంబున్ + ఎఱింగి=సమయము దెలిసికొని,ఆత్యంతికా ... సిద్ధులయందున్ -ఆత్యంతిక=శీఘ్రకాలములో,అసిద్ధి= కార్యము విఫలమగుట, విలంబ=ఆలస్యముగా, సిద్ధి=కార్యసాఫల్యముఁ బొందుటయు, ఈరెంటియందున్,నీకు, ఎయ్యది=ఏది, శుభంబు=మంచిది, ఐ,తోఁచున్, అది య=దానినే, చూచుకొనునది=ఆలోచింపఁ దగినది - అనఁగా శీఘ్రకాలములోఁగార్యము విఫలముగాఁ జేసికొనుటకంటె నాలస్యమైనను గార్యమును సఫలముగాఁ జేసికొనుటయే మంచిది కావున విలంబమైనను సహించి సమయమునకు వేచియుండి కార్య మెట్లయిన సఫలమగునట్లు చేయవలెనని భావము. అని,ఆ వైదర్భి=ఆదమయంతి,మదనోన్మాదంబునన్ + చేసి=మన్మథతాపముచే తన్ను మఱచి, లజ్జాభరంబున్ =లజ్జాతిశయమును, ఉజ్జగించి=విడిచి,కులకన్యాజనంబులకున్ =తమతుల్యత్రియకులమందుఁ బుట్టినకన్నెలకు, ఉచితంబులు=తగినవి, కాని

యతిప్రౌఢవచనంబులు=కానట్టి ప్రౌఢవాక్యములను, పలికెన్=పలుకఁగా పైపద్యముతో నన్వయము.

ఉ. ఆపరమేష్ఠివాహన కులాగ్రణి భీమతనూజ మన్మథా
జ్ఞాపరతంత్రతన్ నలవశంవదమానసఁగా నెఱింగి చం
చూపుటమానముద్రఁ దఱిఁజూచి వినిద్రవివేకశాలి యు
ద్వ్యాపన చేసెఁ గన్నుఁగొనలందుఁ దొలంకఁగ మందహాసమున్.

టీ. వినిద్రవివేకశాలి-వినిద్ర = సంకోచములేని-వికాసముగల, వివేక=జ్ఞానముచే, శాలి-ఒప్పుచున్న, ఆపరమేష్ఠి...అగ్రణి-ఆ, పరమేష్ఠివాహన=హంసయొక్క, కుల=వంశమునకు, అగ్రణి=శ్రేష్ఠుఁడు-అనఁగా రాజహంసశ్రేష్ఠుఁడనుట, భీమతనూజన్=దమయంతిని, మన్మథాజ్ఞాపరతంత్రతన్-మన్మథ=మన్మథునియొక్క, ఆజ్ఞ=ఆజ్ఞకు, పరతంత్రతన్ = లోఁబడినదగుటచే, నలవశంవదమానసగాన్=నలునకు వశమైన మనస్సు కలదానినిగా, ఎఱింగి, తఱిన్=సమయమునను, చూచి=కనిపెట్టి, కన్నుఁగొనలందు, మందహాసమున్=చిఱునవ్వు, తొలంకఁగన్ = ప్రసరింపఁగా, చంచూపుటమానముద్రన్=చంచూపుటముయొక్క, లేక, దొన్నెవంటిచంచువుయొక్క, మానభంగిని, ఉద్వ్యాపన చేసెన్ =చాలించెను. అనఁగా నాహంసము మందహాసముచేసి దమయంతితో నిట్లుపలికెనని యర్థము.

తా. జ్ఞానశాలియైనయాహంసశ్రేష్ఠుఁడు, దమయంతి మన్మథాజ్ఞకు లోఁబడినదై నలమహారాజునువరించియున్నట్లు తెలిసికొని తన వాక్యము నెఱవేరినందులకు మిక్కిలి సంతసించుచుఁ దిరిగి యిట్లు పలుకనారంభించెను.

సీ. విను మింతి! యీయర్థమును ఘటింపఁగఁ జేయఁ
బుష్పనారాచుండు పూఁటకాఁపు
సమరూపలావణ్యసౌందర్య మగుమిథు
నంబుఁ గూర్పకపోదు నలినజునకు
నినుఁజేరి నిషధనాథుని యింద్రియములకు
నిజదేవ భూయంబు నివ్వటిల్లు

గన్నులుచల్లఁగాఁ ✻ గనుఁగొందు నేను మి
మ్మిరువుర దేవి దేవరనుబోలె

తే. నీవు మా రాజుపైఁ గూర్మి ✻ నిలుపుగలిగి
చిత్త మఱసేయ కున్నట్లు ✻ చెప్పితిపుడు
వినుము నీవును నతని నె ✻ మ్మనమునందుఁ
గలుగు నీమీఁదిప్రేమంబు ✻ నలినవదన. 86

టీ. ఇంతి=దమయంతీ, వినుము, ఈయర్థమును = ఈకార్యమును, ఘటింపఁగన్ + చేయన్ =సమకూర్చుటకు, పుష్పనారాచుండు=మన్మథుఁడు, పూఁటకాఁపు=జామీనుదారుఁడు, అనఁగా-మీరిరువురునొండొరుల గుఱించిమదనపీడననుభవించుచున్నారు. కావున తప్పక యిప్పని నెఱవేఱునని భావము- నలినజునకున్ =బ్రహ్మకు, సమరూపలావణ్య సౌందర్యము- సమ=సమానమైన, రూప=ఆకారము, లావణ్యము= శరీరమందున్న తళుకు, సౌందర్యము = చక్కఁదనముగలది, అగుమిథునంబు= ఐనటువంటి దంపతులను, కూర్పకపోదు = చేర్పక తీఱదు, నినున్, చేర, నిషధ నాథు నింద్రియములకున్ =నలుని యింద్రియములకు, నిజదేవభూయంబు-నిజ=తమయొక్క, దేవభూయంబు=దేవత్వము, నివ్వటిల్లున్ = ప్రవర్తిల్లును- అనఁగా-నిన్నుఁజెంది నలుని చక్షురాదీంద్రియంబులు దేవతలవలె నధికసౌఖ్యమును జెందుచుఁ దమదేవత్వము (నింద్రియత్వమును) సార్థకమగునట్లు చేయుననిభావము, నేను, మిమ్మిరువురన్, దేవిదేవరనుబోలె=దేవినివలెను దేవునివలెను, కన్నులుచల్లగా, కనుఁగొందున్ = చూతును, ఇపుడు, నీవు, మారాజుపైన్=మానలునిపై, కూర్మినిలుపు=ప్రేమయొక్క స్థిరత్వము, కలిగి, చిత్తము=మనస్సును, అఱసేయక=చలింపఁజేయక, ఉన్నట్లు, చెప్పితివి. అతని నెమ్మనమునందున్ =నలునిమనస్సునందు, కలుగునీమీఁదప్రేమంబు=కలిగియున్న నీపైకూర్మిని, నలినవదన=దమయంతీ, వినుము=ఆలింపుము.

తే. వెలఁది సంకల్పసోపాన ✻ వితతియందు
నతఁడు సూడంగ సంచరిం ✻ తహరహంబుఁ

ధరణిపుఁడు దీర్ఘనిశ్వాస భరమునించుఁ
నద్భుతముగాదె యీచంద మరసిచూడ. 87

టీ. వెలఁది=దమయంతి,అతఁడు=అనలుఁడు,చూడంగన్=చూచునట్లుగా, అహరహంబు=ప్రతిదినము, సంకల్పసోపానవితతియందున్-సంకల్ప=నలునికోరికలనెడు, సోపాన=మెట్లయొక్క, వితతియందు=సమూహమునందు, సంచరింతువు=తిరుగుచుందువు, ధరణిపుఁడు=అనలుఁడు, దీర్ఘనిశ్వాసభరము = నిట్టూర్పు వాయువులను - నించున్=విడుచుచుండును, ఈచందము = ఈసంగతి, అరసిచూడన్ = ఆలోచింపఁగా, అద్భుతముగాదె = ఆశ్చర్యముకాదా? అనఁగా - లోకములోఁ బనిచేయుచున్నవానికే యాయాసమువలన నిట్టూర్పు గలుగుట సహజము - అట్లుండ నలుని సంకల్పశ్రేణియనెడి సోపానపంక్తి నధిరోహించుచున్న దమయంతికిఁ గలుగవలసిన నిట్టూర్పు నలునకుఁ గల్గుట యాశ్చర్యము. మఱియు నలుఁడు సర్వదా నిన్ను స్మరించుచుండుటచే నతనికి నీవుగాన వచ్చుచుందువు. అప్పు డతఁడు నీ సమాగమాభావముచే నిట్టూర్పు పుచ్చుచుండునని ఫలితార్థము.

అలం — అసంగతి.

తా. నలుఁడు మనంబున సర్వదా దమయంతినే స్మరించుభావనచేఁబొడసూపుచున్న నిన్నుఁజూచి కామపీడితుడై నిట్టూర్పు పుచ్చుచున్నాఁడు. దమయంతీ! నీయం దతని కెంతప్రేమయున్నదో చూడుము.

తే. హంసతూలికాతల్పంబునందు మేనిఁ
జేర్చి నప్పుడు నేత్రరాజీవయుగము
చేరి చుంబించి మోహింపఁ జేయుదు రన
నతివ! నిద్రయు నీవు నే కాదురొక్క. 88

టీ. అతివ=ఓదమయంతీ, హంసతూలికా తల్పంబునందున్ - హంస=హంసలయొక్క, తూలికా=చిన్నయీకలచే రచింపఁబడిన,తల్పమునందున్=శయ్యయందు, మేనున్=శరీరమును, చేర్చినప్పుడు, —అనఁగానలుఁడు శయనించునప్పుడనుట- నేత్రరాజీవ యుగమున్ = నేత్రపద్మ యుగళమును, చేరి=సమీపించి,

చుంబించి=ముద్దాడి - మోహింపఁగ్, చేయుదురు, అనగ్ =మోహింపఁజే యఁగలరని చెప్పవలసినపుడు, నిద్రయు, నీవును, అనగా - దమయంతియనుట ఔదురు + ఏమి + ఒక్కొ=అగుదురేమొ, అనగా- నలుఁడు నిద్రతోఁగాని, నీతోఁగాని, విహరించునుగాని మఱియొకదానిని జేపట్టఁడని యర్థము.

తా. ఓదమయంతీ! నలుఁడు హంసతూలికాతల్పమునందు శయనించియు న్నపు డతని నేత్రములను ముద్దాడి నిద్ర మోహింపఁజేయఁగలదు. లేనిచో నీవు మోహింపఁజేయఁగలుగుదువు. కాని యితరులెవ్వరును మోహింపఁజేయలేరు.

వ. బాల! యాలేఖ్యమయభవన్మూర్తిసౌందర్యసందర్శనలాలసుం డును, నశ్రుధారాధౌతదీర్ఘలోచనుండును, నిశ్వాసపరంప రాసంపాతపరిమ్లానపాటలాధరుండును, బ్రవాళశయ్యాచరణ కంపితశరీరుండును, మదనదాహజ్వరారంభకంపితస్వాంతుం డును నై విప్రలంభవేదనావికారంబున నకాండహాసంబును, నకారణభయంబును, ననవసరశయ్యాసముత్థానసంభ్రమం బును, నలక్ష్యప్రేక్షణంబును, నప్రతివచనవాగారంభణంబు నుం గలిగి యార్తిధారాప్రవాహంబున మూర్ఛాంధకార పంకంబున మునుంగుచున్నవాఁడు భవత్ప్రాపకం బైనదో షంబునకు వెఱవఁడు దాస్యంబునకైన లజ్జింపఁడు. 89

టీ. బాల = ఓదమయంతీ, ఆలేఖ్య... లాలసుండును-ఆలేఖ్యమయ = చి త్రపటరూపమైన, భవన్మూర్తి=నీయాకారముయొక్క, సౌందర్య=చక్కఁదన మును, సందర్శన=చూచుటయందు, లాలసుండును=ఆసక్తిగలవాడును,అశ్రు ...లోచనుండును-అశ్రు=కన్నీటియొక్క, ధార=ధారలచే, ధౌత=కడుగఁబ డిన, దీర్ఘ=పొడుపైన, లోచనుండును=నేత్రములు గలవాడును - అనఁగా విరహాతిశయంబునఁబొడముచున్న బాష్పము కన్నులనుండి వెడలుచుండ నేత్ర ముల కల్మషమంతయుఁబోయి స్వచ్ఛముగా నున్నవని భావము.నిశ్వాస...అధ రుండును - నిశ్వాస=నిట్టూర్పులయొక్క, పరంపరా=సమూహముయొక్క, సం పాత=పడుటవలన, పరిమ్లాన=వాడినదియు, పాటల=ఎఱ్ఱనైనదియునగుచున్నది,

యొనగు, అధరుండును=అధరోష్ఠముగలవాఁడును, ప్రవాళ...శరీరుండును-ప్రవాళ =చిగుళ్లచే, శయ్యా = తల్పముయొక్క, చరణ=కల్పించుటచే, కంపిత= చలనమునొందుచున్న,శరీరుండును=దేహముగలవాఁడును- అనఁగా విరహులకుఁ గిసలయతల్పాదులు కామోద్దీపకములయి భయంకరములయియుండును; కాన దమయంతీ విరహపీడితుఁ డగుసలునకుఁ గిసలయతల్పము భయంకరమై కంపమును బుట్టించుచున్నదని భావము. మదన...స్వాంతుండును- మదనదాహ = మదనసంతాపమువలనఁ గలిగిన, జ్వర=రోగముయొక్క, ఆరంభ=ప్రారంభముచే, కంపిత= చలించుచున్న, స్వాంతుఁడు=చిత్తముకలవాఁడును, ఐ, విప్రలంభ...వికారంబునన్- విప్రలంభవేదన=ఎడఁబాటువలనఁ గలిగిన బాధను సంబంధించిన, వికారంబునన్=వికారంబుచే, అకాండహాసంబును = అసమయమందు నవ్వుటయు, అకారణభయంబును = కారణములేకుండ భయపడుటయు, అనవసర...సంభ్రమంబును- అనవసర= అవసరము లేకుండ, శయ్యా= తల్పమునుండి, సముత్థాన=లేచుటయందు, సంభ్రమంబును=తొట్రుపాటుపడుటయు, అలక్ష్యప్రేక్షణంబును=లక్ష్యము (విషయము) లేక యే-చూచుటయు, అప్రతివచనవాగారంభంబును - అప్రతివచన = ప్రత్యుత్తరము లేకుండఁగనే, వాగారంభంబును=మాటలాడుటయును, కలిగి, ఆర్తిధారాప్రవాహంబునన్ = ఆర్తి=పీడలనెడు, ధారా=ధారలయొక్క, ప్రవాహమునన్ = ప్రవాహము నందును, మూర్ఛాంధకారపంకంబునన్ - మూర్ఛ = మూర్ఛలనెడు, అంధకార=చీఁకటితోఁగూడిన,పంకంబునన్=బురదయందును, మునుంగుచు నున్నవాఁడు, భవత్ప్రాపకంబు=నిన్నుబొందించెడి, దోషంబునకైనన్=పాపమునకైనను, వెఱవఁడు=భయపడఁడు, దాస్యంబునకైనన్ = సేవఁ జేయుటకైనను, లజ్జింపఁడు = సిగ్గుపడఁడు.

చ. మదనుఁడు రెండు చేతులను గ్రుమ్మరఁబడనేయఁగఁదూపులై దునుం
బదియయి వేయువేలు పరిపాటి నవస్థలు సంఘటింపఁగాఁ
దుదిదశ రాజునందుఁ దగఁ దోఁచుచునున్నది యేనువచ్చుచో
న[illegible]వికాసమయ్యెడున్.

టీ. మదనుఁడు=మన్మథుఁడు, రెండు చేతులను, మార్పడన్ = మార్చిమార్చి, ఏయఁగన్ = వైచుటకు, తూపులు+ఐదునున్ = ఐదు బాణములును,పదియై =రెండు చేతులచేఁ బ్రయోగించుటచే ద్విరుక్తిజెంది పదిసంఖ్యగలవై, వేఱువేఱ = వేఱువేఱుగా, పరిపాటిన్=వరుసగా, అవస్థలు=పదియవస్థలును,అనగా-(1) చక్షుః ప్రీతి, 2 మనస్సంగము, 3 సంకల్పము, 4 జాగరణ, 5 కృశించుట, 6 విషయనివృత్తి, 7 త్రపానాశనము, 8 మూర్ఛ, 9 ఉన్మాదము, 10 మరణము అనెడు యీపదిదశలను,సంఘటింపఁగాన్=కలిగింపఁజేయఁగా,తుదిదశ=ఈ పదింటిలోఁ గడపటిదశ—అనగాచావుఅనుట, ఏనువచ్చుచోన్=నేను వచ్చునపుడు, రాజునందున్=నలునియందు, తగన్=ఒప్పునట్లుగా, తోఁచుచున్నది=కనఁబడుచున్నది. అది= ఆయవస్థ,చిగురాకుబోఁడి=ఓదమయంతీ,అట = అచ్చట, అంబరపుష్పవికాసము=గగనపుష్పము వికసించుట వంటిది, అయ్యెడున్ = అగుఁగాక—అనఁగా నాయవస్థ సంప్రాప్తము కాకపోవుఁగాక యనుట.

తా. దమయంతీ! మదనుఁడు రెండు చేతులచేఁ బ్రయోగింపగాఁ దన బాణములైదయినను బదియైనవై, నలునకుఁ బదియవస్థలఁ గలిగించినవి. ఆదశలలోఁ బదియవదగు మరణదశ, నేవచ్చునప్పటికిఁ గానవచ్చుచున్నయది. ఇఁక మీఁదట నాయవస్థ తొలఁగిపోవుగాక.

వ. మదనశరవేదనాదూయమానమానసుండైన యతండుపుత్తేర
నీ సమ్ముఖంబునకు వచ్చితి నీచిత్తంబులోనిభావంబు నెఱింగితి.

టీ. మదన...మానసుండు,మదన శర=మన్మథబాణములవలనఁ గలిగిన, వేదన=పీడచే, దూయమాన=బాధింపఁ బడుచున్న, మానసుండు=చిత్తముగలవాఁడు,ఐన,యతఁడు=ఆనలుఁడు, పుత్తేరన్=పంపఁగా, నీసమ్ముఖంబునకున్ వచ్చితి, నీచిత్తంబులోని భావము=నీమనంబునందు నభిప్రాయమును, ఎఱింగితిన్ = తెలిసికొంటిని.

తా. స్పష్టము.

తే. తరుణి వైదర్భి నీవెట్టి కధన్యవృకొ—
భావహావవిలాసవిశ భ్రమనిరూఢిఁ

కౌముదీలక్ష్మి యప్పాలకడలిఁ బోలె,
నలరఁజేసితి నిషధరాజంతవాని. 92

టీ. తరుణి=దమయంతి, కౌముదీలక్ష్మి=వెన్నెలలయొక్క శోభ, అప్పాలకడలిఁబోలెన్ = ఆపాలసంద్రమువలెను, భావ...నిరూఢిన్ - భావము, హావము, విలాసము, విభ్రమము, అనెడు శృంగారచేష్టలయొక్క, నిరూఢిన్ = స్థైర్యముచే, నిషధరాజంతవానిన్=నలునంతవానిని, అలరఁజేసితివి = సంతోషపెట్టితివి, వైదర్భి=దమయంతి, నీవు, ఎట్టిధన్యవు+ఒక్కొ=ఎటువంటి ధన్యాత్మురాలవో కదా?

తా. దమయంతీ! చంద్రిక పాలసంద్రమును సంతోషపెట్టినట్లు నీ శృంగార విలాసములచే నలమహారాజంతవానిని సంతోషపఱిచితివి. నీవెంత ధన్యురాలవో కదా? అలం = ఉపమ

వ. చంద్రుఁడునుఁ జంద్రికయుఁబోలెఁ బువ్వునుందావియుంబోలె రసంబును భావంబునుంబోలె నవినాభావసంబంధంబున నతండును నీవును నన్యోన్యప్రేమానుబంధంబున ధన్యత్వంబు నొందుండు పాణిద్వయంబుచేతం బల్లవితంబును,మందస్మితంబుచేతం గోరకితంబును, శరీర సౌకుమార్యంబుచేతం బుష్పితంబును, గుచభరంబుచేత ఫలితంబును నైనభవన్మూర్తి కల్పపాదపంబునకు నృపతినందనుండు నందనోద్యానం బయ్యెడుంగాక మఱియును. 93

టీ. చంద్రుఁడును=చందమామయు, చంద్రికయు=వెన్నెలయు, పోలె=వలెను, పువ్వును తావియుంబోలెన్=పువ్వును బరిమళమువలెను, రసంబును భావంబునుబోలెన్=శృంగారాది రసమును భావమునువలెను, అవినాభావసంబంధంబునన్=ఒకప్పుడును విడువక యుండెడి సంబంధముచేత,అతండును, నీవును—అనఁగానలదమయంతులనుట, అన్యోన్య...ప్రేమానుబంధంబునన్ = ఒండొ

రులయందున్న ప్రేమాతిశయమునుచే, ధన్యత్వంబునొందుండు = ధన్యులగునుడు, పాణిద్వయంబుచేతన్ = రెండుచేతుల చేతను, పల్లవితంబు=చిగిర్చినదియు, మందస్మితంబుచే=చిఱునగవుచేత, కోరకితంబును= మొగ్గలుగలదియు, శరీరసౌకుమార్యంబునన్ = దేహమార్దవముచేతను, పుష్పితంబు=పుష్పించినదియు, కుచభరంబుచేతన్ = స్తనములచే, ఫలితంబు=ఫలించినదియు, అగు, భవదీయ=నీయొక్క, మూర్తి=స్వరూపమనెడు, కల్పపాదపంబునకున్ =కల్పవృక్షమునకు, నృపతినందనుఁడు=నలుఁడు, నందనోద్యానంబు=నందన వనమువంటివాఁడు, అయ్యెడుంగాక = అగుఁగాక —మఱియును.

తే. మహితబంధాఢ్యరతికేళి మల్లయుద్ధ
సమయములయందుఁ* జెలి మరుత్సముదయంబు
గుసుమవర్షంబు మీమీఁదఁ గురియుఁగాక
వనజదళనేత్ర! శృంగారవనములోన. 94

టీ. వనజదళనేత్ర=పద్మములవంటి నేత్రములు గలఓదమయంతీ,శృంగారవనములోనన్ =ఉద్యాన వనమందు, మహిత... సమయముల యందున్ -మహిత= మనోహరమైన, బంధ=చౌశీతిబంధములచే, ఆఢ్య=ఒప్పుచున్న,రతికేళి=సంభోగమనెడి, మల్లయుద్ధ=జెట్టిపెనఁకువలయొక్క,సమయములందున్ = వేళలయందు,మరుత్సముదయంబు=గాడ్పులు,(దేవతాసమూహము)కుసుమవర్షంబున్ =పుష్పవర్షమును, మీమీఁదన్ =మీపైని, కురియుఁగాక.

తా. లోకములో మల్లయుద్ధము మొదలగు నద్భుతచర్యలు నడుచునపుడు, చూచి సంతోషించి దేవతలు పుష్పవర్షము కురియుచుందురు. అట్లే ఓదమయంతీ! క్రీడావనములలోఁ బలువిధములగు బంధములచే నొప్పుచున్న రతికేళి యందున్న మిమ్మిరువురఁజూచి, సంతసించి గాడ్పులు (లేక దేవతలు) మీపైని పుష్పవర్షము కురియఁగలవు.

చ. నెలఁతుక యీ నృపాలునకు నీకుఁ బరస్పరసంగమంబునం

* "దివి మరుత్సముదయంబు" అని పాఠాంతరము.

గలయఁగడాసిమానసయుగంబువికాసమునొందుఁగాక పూ
విలుతుని దేహయష్టిఁ బ్రభవింపఁగఁజేయ సమర్థమైన ని
ర్మలపరమాణుయుగ్మకముమాడ్కి నదైవమనోనుకూలతన్.

టీ. నెలఁతుక=ఓదమయంతీ! అనృపాలునకున్=ఆనలునకును, నీకున్=దమయంతి కనుట, పరస్పరసంగమంబునన్= సంభోగమునందు, మానసయుగంబు=మీయిరువురి మానసములు, కలయఁగన్, డాసి=ఏకమయి, దైవమనోనుకూలతన్ = దైవముయొక్క యభిప్రాయమునకుఁ దగునట్లు, పూవిలుతుని దేహయష్టిన్-పూవిలుతుని = మన్మథునియొక్క, దేహయష్టి=(పూర్వమందు హరునిచే దహింపఁబడిన) శరీరమును, ప్రభవింపఁగన్=కలిగించుటకు,చేయన్, సమర్థము=శక్తిగలది, ఐన...మాడ్కి-ని-ఐన, నిర్మల=పరిశుభ్రమయిన,పరమాణు=పరమాణువుల యొక్క,యుగ్మకము మాడ్కిన్=జతవలెను, వికాసమున్=సంతోషమును, ఒందుఁగాక=పొందుగాక, పండితులు మనస్సున కణుత్వ మంగీకరించిరి. మఱియు సిద్ధాంతములో రెండు పరమాణువులు కలసి యొకద్వ్యణుకమును బుట్టించుననియు, నట్టై క్రమముగా మహత్కార్య మారంభింపఁ బడుననియుఁ జెప్పుదురు. మీరిరువురు సంభోగించుచున్నప్పుడు పరమాణుపరిమాణములుగల మీమనస్సులు రెండును గలిసి మన్మథుని శరీరమును బుట్టించుటకు దైవవశమువలన నేకమయిన పరమాణుద్వయమువలె ఖిలసిల్లి యానందించుఁగాక అని తాత్పర్యము. మఱియు మీయిరువురి సంభోగమువలనఁ గాముండు తిరిగి యుద్భవింపఁగలఁడని ఫలితార్థము.

శా. గ్రీవాలంకృతి పట్టసూత్ర లతికా శ్రీకార రేఖాంకితన్
దేవీ! యట్రవణవంశసంభవ గుణాశ్రీస్వీతన్ నినుం గాయజుం
డావిర్భూతరతిం ధనుర్లతికఁగా నంగీకరించుంబలే
పూవింటన్ నిషధాధినాథు గెలువం బూనంగ రాకుండుటన్.

టీ. దేవీ=దమయంతీ, గ్రీవా...రేఖాంకితన్=గ్రీవా,మెడకు, అలంకృతి=అలంకారభూతమయిన, పట్టసూత్రలతికా=దీర్ఘమయిన పట్టసూత్రముయొ

క్క-, శ్రీఘర్ష రేఖా= మేలైనగీచినరేఖచే, అంకితక్ =చిహ్నితేవును, ధనువృక్ష మందు,సిందూరవర్ణముగల వెదుళ్లువృథములయి విండ్ల కుపయుక్తములయియుం డును. కావున ధానుష్కులు వెదుళ్లను ఘర్షణచేసి సిందూరవర్ణమువచ్చినచో విం డ్ల కుపయోగింతురు. తాదృశఘర్షణరేఖచే నొప్పుచున్నది. అనఁగా దమయంతి మెడ కలంకారభూతిమై యొప్పుచున్న పట్టసూత్రము చాపముల వెనుకభాగము నందున్న ఘర్షణరేఖవలె నొప్పుచున్నదని భావము. అవ్రణవంశ సంభవక్ = నిష్కళంకమగు వంశమందుఁ బుట్టినదానవును, ధనుస్సుపక్షమందు, అవ్రణ= నలుకట, లేక, క్షతములులేని, వంశ=వెదురువలన, సంభవ=కలిగినది, గుణా న్వితక్ =సౌందర్యాదిగుణములు కలదానవు, చాపపక్షమందు, నారితోఁగూడి యున్నదని యర్థము. నిన్నుక్ = అట్టినిన్ను, కాయజుండు=మన్మథుఁడు, బలే=వహ్వారే, ఆవిర్భూతరతిక్ =పుట్టినప్రేమముచే, నిషధాధినాథుక్ =నలుని, పూవింటక్ =పుష్పధనుస్సుచే, గెలువక్, పూనంగక్, రాకుండుటక్ =జయిం చుటకు నలనుపడమిచే, ధనుర్లతికగాక్ = చాపమునుగా, అంగీకరించుక్ = స్వీకరించును.

తా. దమయంతీ! మన్మథుండు పూవింటిచే నలుని గెలువలేనివాఁడయినందున గ్రీవాలంకారభూతమయిన పట్టసూత్రమను సిందూరరేఖ గలిగి, యక్షతమగు వంశమందుఁ బొడమి మంచిగుణమను గుణములో నొప్పుచున్న నీవ నాడికార్ము కమును దాల్చి నలుని జయింపఁగలఁడు.

తే. తరుణి నతనాభిమండలోదంచనాభి
  రామరోమావళీజ్యావిరాజమాన
  నీదుతను వుండవిలు సేసి నెఱకులేయు
  రతివరుఁ డుకోజగుళికల రాజవదన. 97

టీ. రాజవదన=చంద్రునివంటి ముఖముగల, తరుణి=దమయంతీ!నత...విరా జమాన-నత=లోఁతైన,నాభిమండల=నాభిచక్రమునుండి,ఉదంచన=మీఁదుగా బయలువెడలినదియు, అభిరామ=సుందరమయిన, రోమావళీజ్యా=నూఁగారనెడి నారిచే,విరాజమాన=ప్రకాశించునట్టి, నీదుతనువు=నీశరీరమును, పుండవిలుక్

దేసి=ఉండలునైచు విల్లుగాఁ జేసికొని, రతివరుఁడు=మన్మథుఁడు, ఉరోజగుళిక లన్-ఉరోజ=కుచములనెడి, గుళికలన్ = ఉండలచే, నెఱకులు = (నలుని) మర్మస్థానములను, ఏయున్=హింసించును.

తా. దమయంతీ! నూఁగారనెడినారితోఁ, గూడియున్న, నీశరీరమనెడి యుండవింటిని జేపట్టి నీకుచములనెడి యుండలచే మన్మథుఁడు నలునిమర్మస్థానములను దప్పక భేదింపఁగలఁడు.

వ. అని పలికి వీరె సఖులు వచ్చుచున్నవారు మంత్రరహస్యంబులు బయలుపడకుండవలయు. నన్ను వీడుకొల్పు పోయి వచ్చెదనని తదనుమతి వడసి గగనమార్గంబున నిషధాధిపరాజధానికి నభిముఖుండై చనియె నప్పుడు. 98

టీ. స్పష్టము.

మ. మరువాలారుశరంబులం దొరఁగుకమ్మందేనెతోఁ గూడియ
య్యరవిందాక్షికిఁ బక్షిపుంగవగవీహైయంగవీనంబు ని
ర్భరహర్షంబునొనర్చె మున్నరుచిసౌరభ్యంబులం బిమ్మటన్
మురియం ద్రోయుచు నూన్చె నెమ్మనమునన్ మూర్ఛాసము
చ్ఛ్రాయమున్. 99

టీ. మరువాలారు శరంబులన్=మన్మథుని వాఁడియైన పుష్పబాణములనుండి, దొరఁగుకమ్మందేనెతో=ప్రవహించుచున్నకమ్మనితేనెతో, కూడి, పక్షి... హైయంగవీనంబు-పక్షిపుంగవ = హంసశ్రేష్ఠముయొక్క, గవీ=వాక్యములనెడి, హైయంగవీనంబు=సద్యోఘృతము, మున్న=ముందుగా, అయ్యరవిందాక్షికిన్= పద్మములవంటి నేత్రములుగల దమయంతికి, రుచి సౌరభ్యంబులన్=రుచి సువాసనలచే, నిర్భరహర్షంబున్=పట్టఁదరముగాని యానందమును, ఒనర్చెన్= చేసెను, పిమ్మటన్ = తరువాత, నెమ్మనమునన్ = మానసమునందు, మూర్ఛాసముచ్ఛ్రాయమున్=మూర్ఛాతిశయమును, మురియన్ = ఖండములుగా, త్రోయుచు=వేడలఁ ద్రోయుచున్, ఊన్చెన్ = కలిగించెను. తేనెతోఁగూడిన నేయి



211. హంసపోఁగానే దమయంతి నలునే మనస్సునఁ జింతించుచుండుట.

విషతుల్యమయి మూర్ఛనుబొడమించునని వైద్యశాస్త్రప్రసిద్ధము. అట్లయినను దమయంతికి మూర్ఛ కలుగకపోవుట యాశ్చర్యము. అనఁగాఁ గామోద్దీపకము లును మనోహరములునగు రాజహంసవాక్యములు దమయంతికి మిగుల నానంద ము కలిగించెనని భావము.

తా. మన్మథుని పూములుకులవలనఁ బ్రవహించు తేనెతోఁగూడియున్న హం సవాక్యము లనుసద్యోఘృతము తనివిదీరఁ గ్రోలినను దమయంతికి మూర్ఛకలుగ లేదు. మఱియు నిర్భరమగు నానందమును గలిగించెను. అలం. విరోధా భాసము.

తే. ప్రాణబాంధవుఁ డైనయప్పక్షిరాజు
నభ్రమార్గంబునం దొయ్య నసుచరింప
నశ్రుధారాప్రవాహంబ యవధి గాఁగ
దైన్యమందుచు మరలె వైదర్భిచూడ్కి. 100

టీ. ప్రాణబాంధవుఁడు=మిక్కిలి గారాబుచుట్టము, ఐన యప్పక్షిరాజు= అయినట్టి యాపక్షిశ్రేష్ఠుఁడు, అభ్రమార్గంబునన్ =ఆకాశమార్గముచేత, ఒయ్యన్ =మెల్లగా, అనుచరింపన్ =అనుగమింపఁగా, అశ్రుధారాప్రవాహంబ = కన్నీటి వెల్లువయె, అవధి గాఁగన్ =హద్దు గాఁగా, దైన్యము=దుఃఖమును, ఒందుచున్ = పొందుచు, వైదర్భిచూడ్కి = దమయంతియొక్క చూపు, మరలెన్ =వెను కకుఁ దిరిగి వచ్చెను.

తా. తనకు గారాబుచుట్టమయినపక్షిరాజు గగనమార్గము ననుసరించి యెగిరి పోవుచుండఁగా నప్పక్షివియోగమువలనఁ గలిగెడి కన్నీరు గ్రమ్మి దృష్టినిరోధ ముచేసెను. అందువలన నామెదృష్టి పక్షిని జూడలేక తనకార్యము విఫలమ గుటచే దైన్యమునొంది వెనుకకు మఱలిపోయెను.

వ. ఇవ్విధంబునఁ బక్షివిక్షేపసూచితనిజకార్యప్రయోజనసద్భా వుండయి యమ్మహానుభావుండు దనరాక కెదురుచూచుచుం డటాకప్రాంతకేళీవనాంతరంబున [illegible]యా

శీతలశిలాతలంబున నుపవిష్టుం డైననిషధరాజుం గనుంగొని
తనపోయివచ్చినవృత్తాంతం బంతయు నెఱింగించిన ముదిత
స్వాంతుండై. 101

టీ. ఇవ్విధంబునన్, పక్ష...సద్భావుండు-పక్ష=ఱెక్కలయొక్క, విక్షేప=కంపములచే, సూచిత=స్పష్టము చేయుచున్న, నిజ=తనయొక్క, కార్యప్రయోజన=కార్యసిద్ధియొక్క, సద్భావుండు=ప్రాప్తిగలవాఁడు, అయి, అమ్మహాసుభావుండు=అపక్షిరాజు, తనరాకకున్, ఎదురు చూచుచున్=నిరీక్షించుచు, తటాక...వనాంతరంబునన్-తటాక=చెఱువునకు, ప్రాంత=చేరువగానున్న, కేళీవనాంతరంబునన్=ఉద్యానవనమందు, అశోకా...తలంబునన్-అశోకానోకహ=అశోకవృక్షములయొక్క, ఛాయా=నీడచే, శీతల=చల్లని, శిలాతలంబునన్=శిలాప్రదేశంబునందు, ఉపవిష్టుండు=కూర్చున్నవాఁడు, ఐన నిషధరాజున్=అయినట్టి నలుని, కనుంగొని, తన పోయివచ్చిన వృత్తాంతంబున్, అంతయు, ఎఱింగించిన, ముదితస్వాంతుండై=సంతోషించినచిత్తముకలవాఁడై. అని పై పద్యములో నన్వయము.

మ. సరసత్వంబు నిగూఢకార్యఘటనాచాతుర్యసంపత్తియుం
బురుషార్థైకపరాయణత్వమును నభ్యుత్థానలీలాధురం
ధరతాప్రౌఢిమయుం గృతజ్ఞతయు వాత్సల్యంబు నద్భావముల్
సరసీజాసనవాహనాన్వయవతంసా! హంస! నీకుండముల్. 102

టీ. సరసీ...వతంసా-సరసీజాసనవాహన=హంసయొక్క, అన్వయ=కులమునకు, వతంసా=శిరోభూషణము నంటివాఁడవగు, హంస, సరసత్వంబు=రసికత్వమును, నిగూఢ...సంపత్తియున్-నిగూఢ=రహస్యముగా, కార్య=పనులను, ఘటనా=సమకూర్పుటయందలి, చాతుర్యసంపత్తియున్ = నేర్పరితనముయొక్క సమృద్ధియు, పురుషార్థైకపరాయణత్వము=పురుషార్థముల నెఱవేర్చుకొనుటయందత్యాసక్తియు, అభ్యుత్థాన...యున్-అభ్యుత్థానలీలా=గృహాగత జనులయెడఁ గనఁబఱచువినయముయొక్క, ధురంధరతా=భారవాహకత్వమునందున్న,

ప్రౌఢిమయుఁ = నేర్పరితనమును,కృతజ్ఞతయుఁ = చేసినమేలుమఱవకుండుట యు,వాత్సల్యంబు=ప్రేమయు, సద్భావంబు=నిర్మలమయిన మనస్సు,ఇవియన్ని యు, నీకుఁ, అందముల్ =తగియున్నవి.

తా. ఓ హంసరాజా!సరసత్వము, కార్యఘటన, పురుషార్థ పరత్వము, వినయము, కృతజ్ఞతయు, వాత్సల్యము, సద్భావము కలిగియుండుట, మొదలగు సద్గుణములన్నియు నీయం దలరుచున్నవి.

క. పరవతి యగుదమయంతిని
ధరణీధవకన్య నల్పతారుణ్య సఖీ
పరివార మెఱుఁగకుండఁగ
బరిచితి నిమిషమునఁ జేయఁ బరులకు వశమే. 103

టీ. పరవతి=పరుల కధీనురాలును, ధరణీధవకన్యఁ = రాజకన్యకయు, అల్పతారుణ్యఁ=లేఁబ్రాయము కలదియు, అగు దమయంతిని, సఖీ పరివారము=చెలికత్తెలసమూహము, ఎఱుఁగక, ఉండఁ, నిమిషమునఁ=నిమిషకాలములో, పరిచితిఁ చేయఁ=పరిచయము చేయుటకు, పరులకుఁ = నీకంటె నితరులకు, వశమే=తరమగునా? అనఁగాఁ గాదనుట.

తా. ఓ విహంగరాజా! పితాదులయాజ్ఞలో మసలుచున్నదియు, లేఁబ్రాయముకలదగుటచే మిగుల సిగ్గుపడుచుండునదియు, నగు దమయంతితో నొరులెఱుఁగకుండునట్టు లవలీలఁ బరిచయము చేసి వచ్చినావు. ఇట్లు చేయుట పరులకుఁ దరమగునా?

వ. అని గారవించి. 104

శా. ఏమేమీ!యనివిన్నమాటయవినుఁ వీక్షించునెమ్మోముసాం
ద్రామోదంబునఁబక్షముల్ నివురుహాస్తాంభోజయుగ్మంబునఁ
భామారత్నము రూపసంపదఁ దగఁ భావించు నానందమా
ధ్వీమత్తుండయిచొక్కుఁజిత్తమునఁబృథ్వీనాయకుండెంతయున్.

టీ. పృథ్వీ...  ... అనిపలికి,

విన్నమాటయు=ఇదివఱకు విన్నట్టివాక్యమునే, వినన్=మఱలనాలకించును. నె మ్మోమున్=ఆహంసయొక్కముఖమును, వీక్షించున్=చూచును. సాంద్రామోద మ్మునన్=అధికమగు నానందముతో, పక్షముల్=ఱెక్కలను, హస్తాంభోజ యుగ్మంబునన్=పద్మములవంటిచేతులజతచే,నివురున్,భామారత్నము రూపసం పదన్=దమయంతియొక్క సౌందర్య సంపదను, తగన్=ఒప్పునట్లుగా, భావిం చున్=తలపోయుచుండున్, ఆనంద మాధ్వీమత్తుండై=సంతోషమనెడి ద్రా క్షసారాయముచేమదించినవాఁడై,ఎంతయున్=మిక్కిలి,చిత్తమునన్=మనస్సు నందు, చొక్కున్=పరవశుఁడగుచుండును.

తా. నలుఁడు దమయంతినిగూర్చి హంస తెల్పినవాక్యములు మాటిమాటికి వి నుచుండును. హంసమోమును జూచును. చేతులతో హంసపక్షముల నివురును. దమయంతి సౌందర్యమును మనస్సులోఁ దలపోయును. సంతోషముచేఁ బర వశుఁ డగుచుండును.

వ. ఇవ్విధంబున నానందరసమగ్నుండైన యన్నరేంద్రుం గనుం గొని విహంగపుంగవుండు కార్యంబు సంఘటితంబయ్యె నిం క నాకుం బంకజాసనునకుం బరిచర్య సేయం బోవలయునని పలికి యతనిచేత సముచితప్రకారంబున వీడుకోలువడసి య మ్మానసౌకంబు బ్రహ్మలోకంబునకుం జనియె నప్పుడు. 106

టీ. ఇవ్విధంబునన్, ఆనందరసమగ్నుండు = ఆనందరసములో మునిఁగిన వాఁడు, ఐనయన్నరేంద్రున్=అయినట్టియానలుని, కనుంగొని, విహంగపుంగ వుండు=ఆపక్షిరాజు, కార్యంబు, సంఘటితంబు, అయ్యెన్=నెఱవేర్పఁబడినది ఇంకన్, నాకున్, పంకజాసనునకున్=బ్రహ్మకు, పరిచర్య=సేవ, చేయన్=చే యుటకు, పోవలయున్, అనిపలికి, అతనిచేతన్=నలునిచేత, సముచితప్రకారం బునన్=తగునట్లుగా, వీడుకోలు=ఆజ్ఞను, పడసి=పొంది, అమ్మానసౌకంబు, బ్ర హ్మలోకంబునకున్, చనియెన్, అప్పుడు=ఆసమయంబున.

తే. నిషధభూవల్లభుం డాత్మ నిండియున్న

కౌతుకంబు [illegible]

వనము వెలువడి పరివార జనము గొలువ
వచ్చెఁ గ్రమ్మఱ నాత్మనివాసమునకు. 107

టీ. నిషధభూవల్లభుండు=ఆనిషధరాజు, ఆత్మన్=మనస్సునందు, నిండి, ఉన్నకౌతుకంబు= ఉన్నట్టివేడుక, ప్రకాశంబు, కాక, ఉండన్ = వెల్లడికాకుండునట్లుగా, వనము=ఉద్యానమునుండి, వెలువడి=బయలుదేఱి,పరివారజనము, గొలువన్ =సేవించుచుండఁగా, క్రమ్మఱన్=తిరిగి, ఆత్మనివాసమునకున్=తన నివాసస్థలమునకు, వచ్చెన్.

వ. వచ్చి విదర్భరాజకన్యావియోగవిహ్వాలుం డగుచుఁ గాలంబు గడపుచుండె నంత నక్కడ. 108

చ. నలవసుధాకళత్రునిగుణంబె గుణంబుగ సారసౌరభా
కలితతదీయకీర్తికళికామయ మైనశరాసనంబునన్
విలసితసౌమనస్యపదవీరుచిరం బగుతద్విలాసమున్
ములికిగఁ జేసి మన్మథుఁడు ముద్దియ నేయఁదొడంగె నెవ్వడిన్.

టీ. నల...గుణంబె - నలవసుధాకళత్రుని=నలరాజుయొక్క, గుణంబె=సద్గుణపుంజమే, గుణంబుగన్ = నారిగాను, సార...కలికామయము-సార=ప్రశస్తమైన, సౌరభ=పరిమళముచేతను, కలిత=మనోజ్ఞమయిన, తదీయ=నలసంబంధమయిన, కీర్తి=యశస్సనెడి, కలికామయము=ముదురమొగ్గమయము, ఐనశరాసనంబునన్ = అయినట్టిధనుస్సుచేత, విలసిత...రుచిరంబు-విలసిత=ప్రకాశించునట్టి, సౌమనస్య = సౌమనస్యమునకు, పదవీ = స్థానభూతమగుటచే,రుచిరంబు=మనోహరము,అగుతద్విలాసమున్ =అయినట్టి నలునివిలాసమున్, ములికిగన్ =బాణముగా,చేసి, మన్మథుఁడు, ముద్దియన్ =దమయంతిని, నెవ్వడిన్ = మిక్కిలి శీఘ్రిముగా, ఏయఁదొడంగెను=కొట్టనారంభించెను.

తా. మన్మథుఁడు, నలునిసద్గుణము నల్లెత్రాడుగాఁ జేసికొని నలునికీర్తిపుష్పమును ధనుస్సుగాఁజేసికొని యతనివిలాసమును బాణముగాఁజేసి దమయంతిని బాధింప మొదలుపెట్టెను. అంత. యాపడతుకను.

తే. అతనుతాపజ్వరంబుమై నమరియుండఁ
జపలలోచన ప్రియకథాసరసిఁ దేలె
నాయపథ్యంబునన కదా యంతకంత
కలరుబోఁడికి సంతాప మతిశయిల్లె. 110

టీ. చపలలోచన=చలించుచున్న లోచనములుగల దమయంతి, అతనుతాపజ్వరంబు-అతనుతాప = మన్మథసంతాపమనెడి అధికతాపముగల,జ్వరంబు=ఉష్ణము, మైన్ =దేహమందు,అమరి,ఉండన్ =కలిగియుండఁగా,ప్రియకథాసరసిన్ - ప్రియ=తనకుఁ బ్రియుఁడయిన నలునియొక్క,కథా=చరిత్రమనెడి,సరసిన్ =సరస్సునందు, తేలెన్ =ఈఁదులాడెను, అనఁగా నలునిచరిత్రము బాగుగానాలకించెననిభావము.అలరుబోఁడికిన్ =దమయంతికిన్, ఆయపథ్యంబునన్+అ+కదా= ఆయపథ్యసేవముచేత నేకదా,అంతకంతకున్ =క్రమముగా, సంతాపము, అతిశయిల్లె=హెచ్చెను,అనఁగా నలునికథలు వినుటచే నలవియోగపీడితయగు దమయంతి కవికామోద్దీపకములాయె ననుట. అలం-విషయము.

తా. జ్వరపీడితుఁడు చన్నీటఁ బానమాడినచో వానికి జ్వరము మిక్కిలియధికమగుట ప్రసిద్ధము. అట్లుండ దమయంతి మన్మథతాపమనెడి జ్వరముచేఁ బీడింపఁబడుచుఁ దనప్రియుని కథయనెడి సరస్సునందుఁ దానమాడెను. ఆయపథ్యముచే నామెకు మఱింతసంతాపము హెచ్చినది.

తే. కమలనేత్ర కవస్థానవిముఖమైన
చంచలత్వంబు మదిఁ బ్రకాశించుచుండె
బాలయాలీల యభ్యసింపంగఁ బోలు
రమణదూతపతంగశక్రంబుతోడ. 111

టీ. కమలనేత్రకున్ =దమయంతికి, అవస్థానవిముఖము-అవస్థాన=స్థితికి, విముఖము =పరాఙ్ముఖము, ఐన చంచలత్వంబు=అయినట్టి చాంచల్యగుణము, మదిన్ = మనస్సునందు, ప్రకాశించుచుండెను ... దమయంతి, ఆలీ

లన్ =అచాంచల్యరూప మయినవిలాసమును, రమణ...తోడన్ -రమణ=తిన్రపి యుఁడయిన నలునికి, దూతి=దూతియగు, పతంగశక్రంబులోడన్ =పక్షిరాజు నొద్ద, అభ్యసింపంగఁ బోలు=అభ్యసించినది కాఁబోలు. అనఁగా హంసవలనఁ దన్రపియునిగుణములు విన్నప్పటినుండియు దమయంతికి మదనజ్వరము హెచ్చుటచే నున్మాదముకలదయి యొక్కస్థానమందు స్థిరముగా నుండఁజాలక సంచరించుచుండె నని ఫలితార్థము.

తా. దమయంతి మిక్కిలి చాంచల్యగుణము కలదయియున్నది, ఆగుణము హంసతో స్నేహముచేయకమునుపు లేదు. దీనింబట్టి యోఁచింప నీగుణమును హంసయొద్ద నేర్చుకొన్నది కాఁబోలు ! లేనిచో హంసతో స్నేహముచేసిన ప్పటినుండియే యిది యేలకలుగవలెను? అలం. ఉత్ప్రేక్ష, అర్థాంతరము.

ఉ. బాలిక చెక్కుటద్దములపజ్జలఁ గోమలమందహాసరే
ఖాలవ మంకురింపదు వికాసమునొందదు నెమ్మనంబునన్
వాలికమించుకన్గొనలవాకిట నల్లన సంచరింపనుం
జాలక చాలఁ గుంటుపడెఁ జారునిరీక్షణఖంజరీటముల్.112

టీ. బాలిక చెక్కుటద్దములపజ్జలన్ = దమయంతియొక్క అద్దములవంటి చెక్కులయొక్క ప్రక్కలయందు, కోమల...లవము-కోమల = నవీనమయిన, మందహాసరేఖా = చిఱునవ్వుయొక్క, లవము=లేశము, అంకురింపదు = కలుగ లేదు. నెమ్మనంబునన్ =చిత్తమునందు, వికాసము = సంతోషము, ఒందదు = పొందదు. వాలికన్ =బాణమును,మించు...వాకిటన్ - మించు=మీఱుచున్న, కన్గొనల = అపాంగములనెడి, వాకిటన్ = వాకిటియందు, చారునిరీక్షణ ఖంజరీటముల్ - చారు=సుందరమయిన, నిరీక్షణ = చూపులనెడి, ఖంజరీట ముల్ =కాటుక పిట్టలు, అల్లనన్ =మెల్లగా, సంచరింపనున్ =సంచరించుటకయి నను, చాలక=సమర్థముకాక, చాల=మిక్కిలి, కుంటుపడెన్ =కుంటివయ్యెను. అనఁగా విరహవిహ్వలయగు దమయంతి దృష్టి ప్రసరించి చూడలేకున్నదని భావము.

తా. మదనజ్వర మధికముగా నుండుటచే నాదమయంతి యొకప్పుడును మందహాసము చేయలేదు. ఆమె మానన మొకప్పుడయిన సంతసముతో వర్తింపలేదు. మఱియు వాలికల మించి యున్న నేత్రములతో నొకమాఱయినను జూడలేదు. అలం. రూపకము.

సీ. అతివ సమ్ముఖవాస్తి వగువస్తువును గాన
దాత్మ యంతర్ముఖం బౌటఁ జేసి
చెలువ క్రొమ్మించు లేఁజెక్కుటద్దం బొయ్యఁ
బాణిపల్లవశయ్యఁ బవ్వళించె
గోమలినిట్టూర్పు క్రొవ్వేఁడి నెత్తావి
ముసరు తేఁట్లును మూతిముట్ట వెఱచెఁ
దరుణిలోచనబాష్పధారాలవంబులు
ముత్యాలసరులతో ముద్దుగురిసెఁ
బాము! శరకాండపాండిమచ్ఛాయ నొందె
బోటిమది కింపు గాదయ్యె నాటపాట
మృగవిలోచన కంతంత మేను డస్సె
నంతకంతకు సంతాప మతిశయిల్లె. 113

టీ. ఆత్మ=మనస్సు, అంతర్ముఖంబు=విషయనివృత్తికలది, ఔటఁజేసి=అయినకారణమునఁబట్టి, అతివ=దమయంతి, సమ్ముఖవాస్తవు=ఎదుటనున్నది, అగువస్తువును=అయినవస్తువును సహితము, కానదు=చూడదు. అనఁగా నలవిషయకచింత తప్ప మఱియొకచింత లేక పోవుటచే దగ్గఱ నున్నవస్తువయినను నామెకుఁ గనఁబడలేదనుట, చెలువ... చెక్కుటద్దంబు - చెలువ=దమయంతియొక్క, క్రొమ్మించు=క్రొత్త కాంతులుగల, లే=కోమలమయిన, చెక్కుటద్దంబు=అద్దమువంటిచెక్కులు, ఒయ్యన్=మెల్లగా, పాణిపల్లవశయ్యన్=చిగురువంటికరమనెడిశయ్యయందు, పవ్వళించెన్=శయనించెను. అనఁగా నెల్లప్పుడు చెక్కిటఁజేయి చేర్చి విచారించుచున్నదనుట. కోమలి... నెత్తావి - కోమలి=దమయంతియొ

క్క, నిట్టూర్పు=దీర్ఘ శ్వాసములయందున్న, క్రొవ్వేఁడి=మిక్కిలి వేఁడియయిన, నెత్తావిన్ =నిండయినవాసనలగూర్చి, ముసరు తేంట్లు=క్రమ్ముకొనెడి తుమ్మెదలు, మూతిన్ =మూతిచే, ముట్టన్ = ముట్టికొనుటకు, వెఱచెన్ =భయపడెను. పద్మినీజాతి స్త్రీలముఖములు సువాసనలు కలవయి యుండు నని కామశాస్త్రప్రసిద్ధము. దమయంతి పద్మినీజాతి స్త్రీ కావున నామె మదనజ్వరబాధ సహింపలేక నిట్టూర్పుగాడ్పులనువిడుచుచుండ నాగాడ్పులయందున్న సుగంధము నాఘ్రాణించుటకుఁ దుమ్మెదలు ముసరుచున్నవి. కాని యానిట్టూర్పుగాడ్పులు నిప్పంతవేఁడిమిగలవయియున్నందునఁ, దుమ్మెదలుమూతితో ముట్టికొన భయపడుచున్న వనిభావము. దీనంబట్టి యోజింప దమయంతి యధికమగుమదనజ్వరముకలదైయున్నట్టుతోఁచుచున్నది. తరుణి...లవంబులు - తరుణి=దమయంతియొక్క, లోచనబాష్పధారా=కన్నీటిధారలయొక్క, లవములు=బిందువులు, ముత్యాలసరులతోన్ = ముత్యాలహారములతో, ముద్దుఁగురిసెన్ = ముద్దులొలికెను. అనఁగా దమయంతికన్నులనుండి వెలువడుచున్న నీరు బిందురూపములనొంది యెడతెగక పడుటచే నవి ముత్యాలసరములవలె నొప్పుచున్నవనుట, చామ=దమయంతి, శరకాండపాండిమచ్ఛాయన్ - శరకాండ = బిసకాండముయొక్క, పాండిమ=తెల్లని, ఛాయన్=కాంతిని, బొదెన్ =పొందెను. అనఁగా విరహముచే శరీరము తెల్లఁబడుచున్నదనుట. ఆట=నృత్యము, పాట=గానము, బోటిమదికిన్ =దమయంతియొక్కమనస్సునకు, ఇంపు, కాదయ్యె, మృగవిలోచనకున్ =లేడికన్నులవంటి కన్నులుగల దమయంతికి, మేను=శరీరము, అంతంత=క్రమముగా, డస్సెను= చిక్కెను, అంతకంతకున్, సంతాపము=బాధ, అతిశయిల్లెన్ =అధికముగాఁ జొచ్చెను.

చ. ఉదితమనోనురాగదహనోష్మభరంబున నాలతాంగికిన్
హృదయమునందు జొబ్బిల వహించినచందనకర్దమంబుబు
ద్బుదముల నీనెఁ గల్పితవిభూషణజాలమృణాళవల్లరీ
వదనములం దమందగతి వారక పిచ్చిలఁ జొచ్చె ఫేనముల్.

టీ. ఆలతాంగికిన్=ఆదమయంతికి, హృదయమునందున్ =ఱొమ్మునందు, జొ

ర్పిలన్ = నిండుగా, వహించినచందనకర్దనుంబు=పూసికొనియున్న మంచిగంధము, ఉదిత...భరంబునన్ - ఉదిత=ఉదయించిన, మనస్=మనస్సునందున్న, అనురాగ=ప్రేమమనెడి, దహన=అగ్నిహోత్రముయొక్క, ఉష్మభరంబునన్=వేఁడిమియొక్క యతిశయము చేత,బుద్బుదములన్=నీటిబుగ్గలను, ఈనెన్=వెడలఁగ్రక్కెను. కల్పిత.. వదనములందున్ - కల్పిత=రచించుకొనిన, విభూషణజాల = అలంకారసమూహరూపములయిన, మృణాళ=తామరతూండ్లయొక్కయు,వల్లరీ=లతలయొక్కయు, వదనములందున్=ముఖములందు, ఫేనముల్=నురుఁగులు, అమందగతిన్=అధికముగా,వారక=ఎడతెగకుండ, పిచ్చిలన్, చొచ్చెన్=పైకి వెడలుచుండెను. మదనజ్వరమువలనఁ గలిగినవేఁడిమి దమయంతిశరీరమందు మిక్కుటముగా నున్నదని యర్థము.

తా. దమయంతి హృదయతాపము పోవుటకై యలందిన మంచిగంధము నిప్పుకలమీఁద నుంచినప్పుడు బుస్సునుల గ్రక్కునట్లు బుద్బుదముల నీనుచుండెను. మఱియు నధికమయిన వేఁడిమిగల దమయంతి శరీరమునందున్న యలంకారరూపములయిన తామరతూండ్లు,లతలు,నగ్గిలోఁబెట్టినప్పుడు వేఁడిమిచే నుడికిపోయి, ముఖములనుండి నురుఁగు వెలువరించునట్లు వెలువరించుచుండెను. అలం. అతిశయోక్తి.

మ. దశ లంతంతకు నెక్కుఁగా విరహసంతాపాతిరేకంబునన్
 శశిబింబాననకుం దమస్వసకుఁ గార్శ్యంబొందె దేహంబహ
 ర్నిశముల్ సాంద్రనిరంతరస్మృతిసమున్మేషంబునంగాంతకుం
 దశదిగ్భిత్తులయందుఁ గానఁబడియెం దద్రూపచిత్రావళుల్.

టీ. శశిబింబాననకున్=చంద్రబింబమువంటి ముఖముకల, దమస్వసకున్=దమయంతికి, దశలు=మన్మథావస్థలు, అంతకంతకున్=క్రమక్రమముగా,ఎక్కఁగాన్=అధికము కాఁగా, ఒకదశతర్వాత రెండవదశరాఁగా ననుట, విరహసంతాపాతిరేకంబునన్ - విరహసంతాప=విరహబాధయొక్క, అతిరేకంబునన్=అతిశయముచే, దేహంబు=శరీరము, కార్శ్యంబు=కృశత్వమును, ఒందెన్; అనఁగాఁ జిక్కెను. అహర్నిశముల్=దివారాత్రములు, సాంద్ర...సమున్మేషంబు

నన్ -సాంద్ర=దట్టమయినదియు, నిరంతర=ఎడతెగనిదియునగు, స్మృతి=నలుని స్మరించుటయొక్క,సముత్కర్షంబునన్ =అతిశయముచే, అనఁగా నిరంతరము నలుని స్మరించుచుండుటచే నని యర్థము. కాంతకున్=దమయంతికి,దశదిగ్భిత్తులయందున్=పదిదిక్కులనెడి గోడలయందు, తద్రూపచిత్రావళుల్ - తద్రూప=నలమహారాజరూపములయిన, చిత్ర=చిత్తరువులయొక్క, ఆవళుల్ = సమూహములు, కానఁబడియెన్=కనఁబడఁ జొచ్చెను.

తా. విరహాతిశయముచే , దమయంతిశరీరము మిగులఁ గృశించినది. మఱియు సర్వకాల సర్వావస్థలయందు, దమయంతి నలునిరూపమునే స్మరించుటచే నామె యేదిక్కునందుఁ జూచినను నలుఁడే కన్పట్టుచుండెను. అలం.రూపకము.

తే. చెలులు శిశిరోపచారముల్ సేయుపొంకెఁ
  బ్రోవు లిడ్డమృణాళకర్పూరవితతిఁ
  గాంచి వైదర్భిమదిలోనఁ గళవళించె
  జాలకాయాతచంద్రికాజాల మనుచు. 116

టీ. వైదర్భి=దమయంతి, చెలులు=దమయంతి చెలికత్తెలు, శిశిరోపచారములు=శైత్యోపచారములను, చేయుపొంకెన్=చేయుటకొఱకు, ప్రోవులు, ఇడ్డమృణాళకర్పూరవితతిన్ = పెట్టినట్టి తామరతూండ్లయొక్కయుఁ గర్పూరముయొక్కయు సమూహమును, కాంచి=చూచి, జాలకాయాతచంద్రికాజాలము=గవాక్షద్వారములనుండి లోనికివచ్చినవెన్నెలసమూహము, అనుచున్,మదిలోనన్ =మనస్సునందు, కళవళించెన్ = తొందరపడఁజొచ్చెను.

తా. దమయంతికి శైత్యోపచారములు చేయుటకుఁ జెలులు గొనివచ్చియుంచిన మృణాళకర్పూరసమూహమును దమయంతి చూచి గవాక్షములనుండి వచ్చిన వెన్నెలయేమోయని భ్రాంతిచెంది తొందరపడఁజొచ్చెను .భ్రాంతిమదలంకారము.

క. బిసపన్నగభూషణయును
  బ్రసవ[illegible]

వసతియు నై చూపెను సతి
యసమాయుధునకుఁ *బినాకిరయాటోపంబున్. 117

టీ. బిసపన్నగభూషణయును-బిస = తామరతూండ్లనెడి, పన్నగభూష ణయును= సర్పభూషణములుకలదియై, ప్రసవరజోభూతిమతియున్-ప్రసవర జస్=పుష్పపరాగమనెడి, భూతిమతియు=విబూదికలదియు, పాండిమలక్ష్మీవస తియు-పాండిమలక్ష్మీ=విరహమువలనఁగలిగిన తెల్లఁదనముయొక్క సంపదకు, వస తియు=స్థానభూతయు,ఐ, సతి=దమయంతి, అసమాయుధునకున్=పంచబాణు నకు, పినాకియాటోపంబున్ = ఈశ్వరునియొక్క యుద్రేకమును, చూపెను. అనఁగా దమయంతి యీశ్వరలక్షణంబులు గలిగి మన్మథునికి నేనేశంకరుఁడ ననుభ్రాంతి గలిగించి భయపెట్టుచున్నదని భావము.

తా. తామరతూండ్లను నాగాభరణంబులు కలదయి, పుష్పపరాగమనెడి బూదికలదయి, విరహమువలనఁ గలిగినపాండిమము కలదైయున్నదమయంతి మన్మథునకు నీశ్వరావతారమువలెఁ గన్పించెను. అలం. రూపకము.

తే. మన్మథానలతాపంబు మాన్ప వేఁడి
డెందమునఁ జేర్పఁ బూను కెందమ్మివిరులు
వెలఁదినిట్టూర్పుగాడ్పుల వెచ్చఁ దాఁకి
బెరసి యరత్రోవయంద మర్మరములయ్యె. 118

టీ. మన్మథానలతాపంబున్ - మన్మథానల = కామాగ్నిసంబంధమయిన, తాపంబున్=సంతాపమును, వేఁడిడెందమునన్=మిక్కిలి వెచ్చఁగానున్న హృ దయమునందు, చేర్పన్ = చేర్చుటకు, పూనుకెందమ్మివిరులు = ప్రయత్నించు చున్నయెఱ్ఱనిపద్మములు, వెలఁది...గాడ్పులన్ - వెలఁది=దమయంతియొక్క, నిట్టూర్పుగాడ్పులన్=నిట్టూర్పుసంబంధమయిన వేఁడివాయువులచే, వెచ్చదాఁకి= తప్తములయి, బెరసి=చెడిపోయి, అరత్రోవయంద= మధ్యమార్గమందే, మర్మ

*[illegible]



223. దమయంతి విరహ తాపపు నిట్టూర్పుచే
చేతిలోనిపువ్వు వాఁడిపోవుట.

రములు=మర్మర ధ్వనులుకలవి, అయ్యెన్ = కాఁజొచ్చెను. అనఁగా సెండిన పత్రములయొక్కగాని యెండినపువ్వులయొక్కగాని ధ్వనిమర్మరమని చెప్పఁబడు. చల్లఁదనము కలిగించుటకుఁ జెలికత్తెలు దమయంతిహృదయమునఁ జేర్పఁబోవుపద్మములు మర్మరధ్వనులు చేయుచున్నవని భావము. దమయంతిశరీరము తెప్ప నలవికానంత వేఁడిమి కలదని ఫలితార్థము.

తా. దమయంతి కామవహ్నితాపము నడఁగింపఁ దలంచి యామెచెలికత్తెలు పద్మములను దెచ్చి యామెహృదయమునం దుంచుటకుఁ బ్రయత్నించుచుండ మధ్యమార్గమునందే యామె వెచ్చనినిట్టూర్పుగాడ్పులచే సెండిపోయి మర్మరధ్వనిచేయ నారంభించెను. అలం. అతిశయోక్తి.

సీ. చిగురు దామరపాకు ♦ చివ్వనఁ జనుదోయి<br>
మొనలఁ గ్రొవ్వేఁడిని ♦ ముడుఁగఁ బాఱెఁ<br>
దరుణరంభాగర్భ ♦ దళ తాళవృంతంబు<br>
పై గాలి సోఁకిన ♦ బలుకఁ బాఱె<br>
లలితముక్తాహార ♦ గుళికాకలాపంబు<br>
ఘ్రాణానిలంబునఁ ♦ గందఁ బాఱెఁ<br>
గర్ణపూరకలాప ♦ కల్హారదళరాజి<br>
యశ్రుధారల నురి ♦ యంగఁ బాఱె

తే. దర్పమొలయ నాలీఢపా ♦ దమున నిల్చి<br>
మండలీకృతచాపుఁడై ♦ మన్మథుండు<br>
గసలి సవ్యాపసవ్యమా ♦ ర్గములఁ దొడిగి<br>
పువ్వుఁదూపులు పుంఖాను ♦ పుంఖ మేయ. 119

టీ. దర్పము=గర్వము, ఒలయన్=అతిశయింపఁగా, మన్మథుండు, ఆలీఢపాదమునన్ - ఆలీఢ=మోఁకరించుకొనిన, పాదమునన్=కాలిచే, నిల్చి, అనఁగా విలుకాండ్రొక కాలు మోఁకరించి రెండవకాలు ముందిడి నిలువఁబడి యుద్ధము చేయుట ప్రసిద్ధ

ము. మన్మథుఁడు నల్లేనిలువఁబడినాఁడని యర్థము. మండలీకృతచాపుఁడై=వల యాకారముగాఁ జేయఁబడినవిల్లుకలవాఁడై, అనఁగా వింటినెక్కు_వెట్టి, కనలి= కోపించి, సవ్యాపసవ్యమార్గములన్ = రెండుచేతులతోను, తొడిగి=సంధించి, పువ్వుఁదూపులు, పుంఖానుపుంఖము= ఎడతెగనిపంక్తిగా, ఏయన్=ప్రయోగిం పఁగా, మన్మథుఁ డెడతెగనిబాణపరంపరను బ్రయోగించుచుండెనని యర్థము. చిగురుఁ దామరపాకు = తాపశాంతికై చేర్చినలేఁతతామరపాకు, చివ్వనన్ = వేగముగా, చనుదోయిమొనలఁ గ్రొవ్వేఁడిని = చూచుకములయొక్క క్రొత్తవేఁ డిచే,ముడుఁగఁబాఱెన్ =ముకుళింపఁ జొచ్చెను.అనఁగాఁ దామరపాకు వేఁడి మి తగిలినప్పుడు ముడిచికొనిపోవుట స్వభావము.అందుచే మిక్కిలి వేఁడిమిగలిగి యున్న దమయంతిశరీరముపయి లేఁతతామరపాకు చేర్చినప్పుడు దానితాఁకుడు చే వాడి ముడిచికొనిపోయినదని తాత్పర్యము. తరుణ... తాళవృంతంబుపై-త రుణ=లేఁతయైన,రంభాగర్భదళ = అనఁటిమాననెడి,తాళవృంతంబుపై=వీవనపై నుండివచ్చు,గాలి=వాయువు,సోఁకినన్ =తగులఁగా, పలుకఁబాఱెన్ =దుస్సహ మాయెను. లలిత...కలాపంబు-లలిత = సుందరమయిన, ముక్తాహార=ముత్యా లసరులందున్న,గుళికా=పూసలయొక్క, కలాపంబు=సమూహము, ఘ్రాణాని లంబునన్ =నిశ్వాసవాయువుచే,కందఁబాఱెన్ =కందిపోయెను.అనఁగాఁగళా హీనములయ్యెననుట. కర్ణపూర... రాజి - కర్ణపూర=తాటంకమనెడి, కలా ప=భూషణముగాఁ జేర్పఁబడిన, కల్హార=ఎఱ్ఱకలువయొక్క, దళ=రేకులయొ క్క, రాజి=పంక్తి, అశ్రుధారలన్ =కన్నీటిధారలచే, ఉరియంగఁబాఱెన్= చలింపఁజొచ్చెను.అనఁగాఁ గన్నీటిధారలు వెడలునప్పు డాయురవడిచేఁ దాటం కముగా నుంచికొనిన కలువరేకులు కదలుచున్నవనిభావము.

తా. స్పష్టము.

వ. ఇవ్విధంబున నం బ్రతిపచ్చంద్రరేఖయుంబోలెఁ గళామాత్రా వశేషయై విషమశరశరాశీవిషవేదనాదూయమాన మానస యగుచు శిశిరశైవాలపలాశగుచ్ఛంబునను, సరసబిసకి సలయచ్ఛటలను, [illegible] గ

ర్పూరపరాగపాళిసముద్ధూళనంబులను, జందనచర్చామచర్చికాక్షాళనంబులను, జంద్రకాంతశిలాతల్పంబులను, గదళీదళపలాశతాళవృంతసంతానంబులను, వాసరంబులు గడపుచు నొక్కనాఁడు విభావరీసమయంబునఁ గేలిసౌధమణిచంద్రశాలాప్రదేశంబున సఖీజనులు పరివేష్టించి యుండ నిండుచందురుం జూచి వైదర్భి యుపాలంభగర్భంబుగా నిట్లనియె.

టీ. ఇవ్విధంబునన్ = ఈరీతిగా, ప్రతిపత్...బోలెన్-ప్రతిపత్ = శుక్లపక్షప్రతిపద్దినమందలి, చంద్రరేఖయుం బోలెన్ = చంద్రలేఖవలెనే, కళామాత్రావశేషయై = కళామాత్రమె మిగులుగలదై, విషమ...మానస-విషమశర = మన్మథునియొక్క, శరాశీవిష = పాములవంటి బాణములవలనఁ గలిగిన, వేదనా = బాధచే, దూయమాన = తాపమొందుచున్న, మానస = మనస్సుగలది, అగుచున్, శిశిర...గుచ్ఛంబులను-శిశిర = చల్లని, శైవాల = నాఁచుయొక్క, పలాశ = ఆకులయొక్క, గుచ్ఛంబులను = గుత్తులచేతను, సరస...ఛేదంబులను-సరస = రసముతోఁగూడిన-అనఁగా నెండిపోని, బిసకిసలయ = లేఁతతామరతూండ్లయొక్క, ఛేదంబులను = ఖండంబులచేతను, తుషార...సేకంబులను - తుషార = మంచుసంబంధమైన, సలిలధారా = ఉదకధారలయొక్క, సేకంబులను = చల్లుటలచేతను, కర్పూర...సముద్ధూళనంబులను, కర్పూరపరాగపాళి = కప్పురపు పొడిసముదయముయొక్క, సముద్ధూళనంబులను = అలందుకొనుటలచేతను, చందనచర్చామచర్చికాక్షాళనంబులను = మంచిగంధమును బూసికొని కడుగుటలచేతను, చంద్రకాంతశిలాతల్పంబులను - చంద్రకాంతశిలా = చంద్రకాంతశిలలచే నిర్మించిన, తల్పంబులను = శయ్యలచేతను, కదళీ...సంతానంబులను-కదళీపలాశ = అనఁటియాకులనెడి, తాళవృంత = వీవనలయొక్క, సంతానంబులను = సమూహములచేతను, వాసరంబులు = దినములు, కడపుచున్ = వెళ్లించుచు, ఒక్కనాఁడు = ఒకదినము, విభావరీసమయంబునన్ = రాత్రిపూఁట, కేలి...ప్రదేశంబునన్ - కేళిసౌధ = క్రీడాసౌధములయొక్క, మణి = రత్నమయములయిన, చంద్రశాలాప్రదేశంబునన్ = శిరోగృహమునందు, సఖీజ

నులు=చెలికత్తెలు, తన్నుక్, పరివేష్టించి = చుట్టుముట్టి, ఉండఁగ్, నిండు చందురునిక్, చూచి, వైదర్భి=దమయంతి, ఉపాలంభగర్భంబుగా=నిందాగర్భముగా, ఇట్లు=ఈవిధముగా, అనియెక్=పలికెను.

ఉ. హాలహాలద్వయంబు గలశాంబుధిఁ బుట్టె వినీలపాండుర
జ్వాలలతోడ నం దొకవిషం బొకవేలుపు మ్రింగె నెందఱే
వేలుపు లోలిమై ననుభవించిన రెండవయీవిషంబు ని
ర్మూలముగాక యున్నయది ముద్దియ! పాంథులపాప మెట్టిదో.

టీ. కలశాంబుధిక్=పాలసంద్రమందు, హాలహాలద్వయంబు=రెండువిషములు, వినీలపాండురజ్వాలలతోడక్-వినీల=మిక్కిలినల్లనివియు, పాండుర=తెల్లనివియు, నగు, జ్వాలలతోడక్=మంటలతో, అనఁగా నొకటి నల్లనికాంతులతోను, రెండవది తెల్లనికాంతులతోను నని యర్థము. పుట్టెక్ = కలిగినవి, అందు=ఆరెండింటియందు, ఒకవిషంబును, ఒకవేలుపు=ఒకదేవత, అనఁగా నీశ్వరుఁడనుట, మ్రింగెక్, ముద్దియ=చెలియా! ఎందఱే వేలుపులు=దేవతలెందఱో, ఓలిమైక్=వరుసగా, అనుభవించినక్=భక్షించుచున్నను, రెండవయీవిషంబు=రెండవదయినయీవిషము (అనఁగాఁ జంద్రుఁడనుట) నిర్మూలము, కాక=నశింపక, ఉన్నయది, పాంథులపాపము=పథికజనుల దురదృష్టము, ఎట్టిదో =ఎటువంటిదోకదా? విరహాతురయయియున్నదమయంతికిఁ జంద్రుఁడు హాలహాలముకంటె భయంకరుఁడయి యున్నాఁడని యర్థము. మఱియుఁ జంద్రునియొక్క కళలను దేవత లొక్కొక్కటిచొప్పున భక్షించుచుందురని శ్రుతిప్రసిద్ధము.

తా. ఓచెలియా! సముద్రమం దొక్కవిషమే పుట్టినదని చెప్పుదురుకాని యది యబద్ధము. అందు రెండుపాడమినవి. అందు నల్లనికాంతులతో నొకటియు, తెల్లనికాంతులతో రెండవదియుఁ బుట్టినవి. ఆరెండిటిలో నొకదాని నీశ్వరుఁడు దిగమ్రింగెను. కాని రెండవదయి, యీచంద్రరూపమయిన హాలాహాలమును దేవతలందఱు పూనికొన్నను మ్రింగి నాశనముచేయ లేకున్నారు. విరహిజనుల దురదృష్టమే మని చెప్పుదు. దేవతలే మ్రింగినచో మాకీబాధ గలుగకుండునుగదా!

సీ. విరహిణీవధమహాదురితపంకకళంక
కలుషితాత్మకుఁ డైనఖలుఁడు వీఁడె
గరళకూటకఠోరకల్పాంతవహ్నికిఁ
దోఁబుట్టు వైనఘాతుకుఁడు వీఁడె
చండదీధితికరజ్వాలమండలములోఁ
బ్రోదిఁ బొందినమహాగ్రుండు వీఁడె
బాడబంబునుఁ దాను బాధోధికుక్షిలో
సరిఁబొత్తు మన్నదుర్జాతి వీఁడె
తే. సైంహికేయనిశాతదంష్ట్రావిటంక
విషరసప్రతిపాకభావితుఁడు వీఁడె
గగన మనురుద్రభూమి నేకతమ తిరుగు
చదరు లుమిసెకొఁకవిదయ్యంబు వీఁడె. 122

టీ. విరహిణీ...కలుషితాత్మకుఁడు - విరహిణీ = విరహిస్త్రీలను, వధ =చంపుటవలనఁగలిగిన, మహాదురితపంక = మహాపాతకరూపమయినబురదయ నెడి, కళంక=మచ్చచేత;కలుషిత=మలినమయిన,ఆత్మకుఁడు = మూర్తికలవాఁడు, ఐనఖలుఁడు=అయినట్టినీచుఁడు, వీఁడే= ఈచంద్రుఁడేసుమీ? అనఁగా నో చెలియా! ఈచంద్రుఁడు విరహిస్త్రీలను జంపుటచే మహాపాతకము జనించి యది కళంకరూప మయి వీని నావరించినది చూడు.అంతియకాని వీని కిది స్వభావసిద్ధమయినదికాదు సుమీ? అనిభావము. గరళ...వహ్నికిన్ –గరళకూట=కాలకూటసంబంధమయిన, కఠోర=భయంకరమయిన, కల్పాంతవహ్నికిన్ =ప్రళయకాలాగ్నికి, లేక,గరళ ..వహ్నికిన్ =భయంకరమగు కల్పాంతవహ్నివలెనున్న కాలకూటమునకు, తోఁబుట్టువు= తోడఁబుట్టినవాఁడు, ఐనఘాతుకుఁడు= అయినట్టి క్రూరుఁడు, వీఁడే–ఈచంద్రుఁడే–అనఁగా వీఁడు భయంకరమయిన కాలకూటముతోఁగూడి పుట్టినవాఁడుకావున వీఁ డావిషమువలెనే లోకభయంకరుఁ డైయున్నాఁడనిభావము.చండ...మండలములోన్ -చండదీధితి=సూర్యుని

యొక్క,కర=కిరణములనెడి,జ్వాల=మంటలయొక్క,మండలములోన్=సమూహములో,ప్రోదిన్=పోషణమును, పొందినమహోగ్రుండు=పొందినట్టి మహాభయంకరుఁడు,వీఁడే=ఈచంద్రుఁడే?అనఁగా నీచంద్రుఁడు ప్రతిమాసాంతముననుసూర్యునిలోఁగలిసి తదీయకాంతులను జేకొని పర్ధిల్లినవాఁడు. కావున వీఁడు మిగుల భయంకరుఁడై వేఁడిమిగలవాఁడై యొప్పుచున్నాఁడని భావము. బాడబంబును=బడబానలమును, తాను=ఈచంద్రుఁడనుట,పాథోధికుక్షిలోన్=సముద్రగర్భమునందు,నరిఁబొత్తు=ఒక్కపొత్తున-కలసి మెలసి, మన్న=వర్తించుచున్న-లేక జీవించుచున్న,దుర్జాతి=చెడ్డజాతికలవాఁడు,వీఁడే=ఈచంద్రుఁడే-అనఁగా నీచంద్రుఁడు సముద్రగర్భమందున్న బడబానలముతోఁగూడ పొత్తుగల్పినవాఁడు.కావున వీఁడు బడబానలంబువలెనే భయంకరుఁడైయున్నాఁడని భావము.

సైంహికేయ... భావితుఁడు-సైంహికేయ=రాహువుయొక్క, నిశాత=వాఁడియైన,దంష్ట్రా=కోఱలనెడు,విటంక=కూఁటియందు,విషరస=విషరసముతోఁగూడ,ప్రతిపాక= ప్రతికూలముగాఁబచనమగుటచే-అనఁగా నేదేని ద్రవముతోఁ గలిపి యుడికించిన వస్తువు మొదటిగుణమును విడిచి గుణాంతరమును బొందుట సహజము. అట్లె యిట చంద్రుఁడు రాహువుకోఱలందున్న విషరసముతోఁగూడఁ బచనమాయెనుగాన దాను మొదట నమృతమయుఁడయ్యు విషరససంక్రాంతిచే గుణాంతరముగలవాఁడాయెనని భావము. భావితుఁడు=ఊహింపఁదగినవాఁడు,వీఁడె,అనఁగా:- ఈచంద్రుఁడు రాహువుయొక్క వాఁడియైన కోఱలయందున్న విషముచే సంక్రాంతుఁడై యున్నవాఁడు గావున విషతుల్యుఁడై మిగుల భయంకరముగాఁ గనఁబడుచున్నాఁడని తాత్పర్యము. గగనము=ఆకాశము, అనురుద్రభూమిన్=అనెడివల్లకాటియందు,ఏకతమ=ఒంటిగానే; తిరుగుచున్=తిరుగుచును, ఆదరులు=అగ్నికణములు, ఉమిసెడు = వెడలఁగ్రక్కుచున్న, కొఱవిదయ్యంబు, వీఁడె=ఈచంద్రుఁడె-అనఁగా నీ చంద్రుఁడు కాటియందు నగ్నికణంబుల నుమియుచుఁ దిరుగుపిశాచమువలెనే మింటఁ దిరుఁగుచున్నాఁడనిభావము.

సీ. జననకాలమునాఁడు శ్రీ జలరాశికుక్షిలోఁ

దరిగొండ ఘోరివెన్నాఁడ శ్రీ ద్రాఁకెనేని

గ్రహణవేళలయందు రాహు వాహరించి
తృప్తిమై గల్గినఁ ద్రేఁచెనేని
విషమనేత్రుఁడు చేతివిష మారగించుచోఁ
బ్రతిపాకముగఁ జేసి త్రావెనేని
నపరపక్షము పేరియపమృత్యు దేవత
యొకమాటుగా నామ ముడిపెనేని
తే. కుంభసంభవుఁ డబ్ధితోఁగూడఁ గ్రోలి
తజ్జలముతోడ వెడలింపఁ దలఁపఁడేని
విరహిజను లింతపడుదు రే వీనిచేత
నక్కటా! దైవమటుసేయఁ డయ్యెఁగాక. 129

టీ. జననకాలము నాఁడు=పుట్టినప్పుడు, జలరాశికుక్షిలోన్ =సముద్రగర్భమునందు, తరికొండ=కవ్వపుఁగొండ, పొరివోన్ = ఈచంద్రుఁడు చచ్చునట్లు, తాఁకెన్ +ఏని=తగులుకొనినను, లేక, గ్రహణవేళలయందు = గ్రహణసమయములయందు, రాహువు, ఆహరించి=భక్షించి, తృప్తిమైన్ = తనివిచే, గల్గినన్ =గల్గుమనిధ్వనికలుగునట్లు, త్రేఁచెన్ +ఏని = త్రేనిచినను, విషమనేత్రుఁడు=ఈశ్వరుఁడు, చేతివిషమున్ = చేతిలోనున్నవిషమును, ఆరగించుచోన్ = భక్షించునప్పుడు, ప్రతిపాకముగా=మిళితముగ, చేసి, త్రావెన్ +ఏని=పానముచేసినను, లేక, అపరపక్షము పేరియపమృత్యుదేవత = కృష్ణపక్ష మనునామముగల యపమృత్యుదేవత, ఒకమాటుగా=ఒక్కసారి, నామను=పేరిని, ఉడిపెన్ +ఏని=నాశనము చేసినను, కుంభసంభవుఁడు = అగస్త్యుఁడు, అబ్ధితోఁగూడన్ =సముద్రముతోఁగూడ, క్రోలి=పానముచేసి, తజ్జలముతోడన్ =తాఁద్రావినజలములోఁబాటుగా, వెడలింపన్ =బయటికిఁద్రోయుటను, తలఁపఁడు +ఏని=ఆలోచింపకుండినచో, వీనిచేతన్ =ఈచంద్రునిచేత, విరహిజనులు = వియోగమువలన బాధపడుచుండెడిజనులు, ఇంతపడుదురే=ఇంతబాధను బొందుదురా? అనఁగా బొందరనుట. అక్కటా! అయ్యయ్యో? దైవము అటుచే

యఁడు+అయ్యెన్ +కాక = అట్లుచంద్రుని గడతేర్చుటకు నూహించినాఁడు కాఁడుకదా?

ఓ. ఓచెలియా! ఈచంద్రుని కెన్నిగండములు గడచినవో చూడుము. నాఁడు దేవదానవులు సముద్రమును మథించునప్పుడా కొండరాపిడి వీనికిఁ దగిలిన చోఁ దప్పక చావవలసినదే కాని యట్లు తగిలినది కాదు. గ్రహణకాలములయందు. రాహు వాహారించియుఁగూడ విడిచిపెట్టియున్నాఁడు. అట్లు చేయక తన జఠ రాగ్ని చే జీర్ణింపఁజేసినచో వీఁడు బ్రదుకఁడుకదా? మఱియు శంకరుఁడు విషము గ్రోలునప్పుడు వీనిని వ్యంజనముగాఁ జేసికొని భక్షించినచోఁ జచ్చియుండునుగదా? కృష్ణపక్షము చంద్రునిపాలిట మృత్యుదేవతవంటిదని చెప్పవచ్చును. కాని యదియు నేమియుఁ జేయఁదలంచినదికాదు. పోనిమ్ము. దీనికేమి అగస్త్యుఁడు సముద్రమును పానముచేయునప్పుడు చంద్రునిగూడ మ్రింగినాఁడు. అతఁడట్లు చేసియుఁ దిరుగ జలములో విడిచిపెట్టినాఁడు. ఈపైని జెప్పఁబడిన వారిలో నెవరిచేతనైనఁ జంపఁబడినచో వీనివలన విరహిజను లింత బాధపడ నవసర ముండదుకదా? మావంటి వారిదురదృష్ట మెట్టిదోకాని దైవమట్లు చేయఁదలంచినాఁడు కాఁడు.

తే. ప్రాణసఖులార! వెన్నెలకో బయలి కిపుడు
మించుటద్దంబుఁ గోలయుఁ గొంచు రండు
చోరుఁ డలచంద్రుఁ డద్దంబుకో సొచ్చినపుడ
వంచనము లేక వ్రేయుఁడీ కో పొంచి యుండి. 124

టీ. ప్రాణసఖులార = చెలికత్తెలారా! వెన్నెలబయలికిన్ = వెన్నెల యున్నప్రదేశమునకు, ఇపుడు=ఈసమయమందు, మించుటద్దంబున్ =తళుకుటద్దమును, కోలయున్ =దండంబును, కొంచున్, రండు=తీసికొనిరండు, చోరుఁడు= దొంగవాఁడగు, అలచంద్రుఁడు= ఆచంద్రుఁడు, అద్దంబున్, చొచ్చినపుడె= ప్రవేశించినప్పుడే, వంచనము=కపటము, లేక =లేకుండ, పొంచి, ఉండి=దాఁగి యుండి, వ్రేయుఁడి=కొట్టుఁడీ ?

తా. ఓచెలులారా! వెన్నెలగలబయటికి నొకనిగ్గుటద్దమును నొకదండము ను గొనిరండు. అట్లుచేసి చంద్రుఁ డద్దములోఁ బ్రవేశించునప్పుడు కొంకులేకుండ నాదండములో మొత్తి చంపుదు.

తే. మనము గారానఁ బోషించి కనకపంజ
రముల నిడ్డకేళీచకోరవ్రజంబు
దీనివెన్నెల దిగఁద్రోలు గాన విడువుఁ
డొక్కగ్రుక్కనఁ గుంభజుఁ డుదధిఁబోలె. 125

టీ. చెలులారా! మనము, గారానన్ = ప్రేమతో, పోషించి=పెంచి, కనకపంజరములన్ =బంగారపుపంజరములయందు, ఇడ్డకేళీచకోరవ్రజఁబున్ = ఉంచినట్టిక్రీడాచకోరపక్షిసమూహమును, కుంభజుఁడు=అగస్త్యుఁడు, ఉదధిఁబోలెన్ =సముద్రమువలెను, ఒక్కగ్రుక్కనన్ =ఒక్కగ్రుక్కతోనే, దీనివెన్నెలన్, దిగఁద్రోలున్ =; పానముచేయఁగలవు. కానన్ =కావున, దీనిన్ = ఈచకోరవ్రజమును, విడువుఁడు = విడిచిపెట్టుఁడు.

తా. ఓచెలులారా! మన మెంతోప్రేమతోఁ బెంచి బంగారపుపంజరములలో నుంచినచకోరపక్షులను విడిచిపెట్టుఁడు. అట్లుచేసినచో నవి యీచంద్రునివెన్నెలలనెల్ల నగస్త్యుఁడు సముద్రమును పానముచేసినట్టు లొకమాఱె పానము చేయఁగలవు.వీని వెన్నెల నశించినచో మావంటివిరహులు సుఖముతో వర్తించెదరు.

తే. శ్రవణపూరతమాలపల్లవచయంబు
మేపుదము వీనిలో నున్నమృగశిశువున
కది ప్రవర్ధన మొందెనే ముదితలార
మండలం బెల్లఁ దానయై యుండుఁగాన. 126

టీ. ముదితలార = ఓచెలులారా! వీనిలోన్ =ఈచంద్రునిలో, ఉన్నమృగశిశువునకున్ = ఉన్నట్టిలేడిపిల్లకు, శ్రవణ...చయంబున్ - శ్రవణపూర = కర్ణాభరణరూపములైన, తమాలపల్లవ = తాపింఛపుచిగుళ్లయొక్క, చయం

బుగ్ =సమూహమును, మేపుదము, అది=ఆమృగశిశువు, ప్రవర్ధనము=మిక్కలి వృద్ధిని, ఒందెనేని= పొందినచో, మండలంబు+ఎల్లన్ = ఆచంద్రమండలమంతయు, తాను+అ+యై=తానేయయి, ఉండుఁగాన=ఉండునుగనుక, అని వెనుక కన్వయము.

తా. ఓచెలులారా! చంద్రునియందున్న లేడిపిల్లకు మనము కర్ణభూషలుగా నుంచుకొనినతమాలపల్లవములను మేపినచో నది మిక్కలి వృద్ధిచెంది చంద్రమండలము నాక్రమింపఁగలదు. అందువలనఁ జంద్రుఁడు రూపుమాయునుగాన నిఁక నతనివలన మావంటివారికిఁ గలుగుసంతాప ముండ నేరదు.

క. రాహుగ్రహవదనగుహా
గేహాంతర్ధ్వాంతపటలకేళీరసకౌ
తూహలనవఖద్యోతం
బీహరిణాంకుండు వీని కేటికి వెఱవన్. 127

టీ. ఈహరిణాంకుండు=ఈచంద్రుఁడు, అనఁగా లేడియే చిహ్నముగాఁగలవాఁడనుట, రాహు...ఖద్యోతంబు- రాహుగ్రహ = రాహుగ్రహముయొక్క, వదనగుహా=గుహావంటినోరనెడి, గేహ = గృహముయొక్క, అంతర్ = మధ్యభాగమందున్న, ధ్వాంత=చీఁకట్లయొక్క, పటల=సమూహమందైన, కేళీరస=క్రీడావిలాస మనుభవించుటయందు, కౌతూహల = వేడుకపాటుగల, నవ=క్రొత్తదగు, ఖద్యోతంబు = మెఱుఁగుడుఁబురుగువంటివాఁడు, వీనికిన్ = ఇట్టిచంద్రునికి, వెఱవనేటికిన్ = భయపడనేల? అనఁగా రాహువునోటిలోఁబడి పెంపుచెడి వర్తించుచంద్రునికై భయపడ నవసరము లేదనిభావము.

తా. ఓచెలులారా! ఈచంద్రుఁడు రాహుగ్రహము నోరనెడి గృహమందు వ్యాపించియున్న చీఁకటియందు విహరించుమెఱుఁగుడుఁబురుగువంటివాఁడు. ఇట్టివానిఁజూచి భయపడ నవసరములేదు.

వ. అని మఱియును. 128

మ. అవతంసంబున పార్వతీపతిశిరస్సాంద్రోర్మికిం ధూర్జిప

ట్టివి బృందారకధేనుకల్పతరువాటీకౌస్తుభశ్రీసుధా
సవదిగ్వారణసోదరుండవు జగచ్ఛ్లాఘ్యుండ వీ విట్టినీ
కవునే ధర్మ్మవు శోచ్యపాంథజనసంహారంబు తారాధిపా!.

టీ. తారాధిపా= ఓచంద్రా! ఈవు=నీవు, పార్వతీపతికిన్ = ఈశ్వరునికి, అవతంసంబవు = శిరోభూషణమైనవాఁడవు, దుగ్ధాంభోధికిన్ = పాలసముద్రమునకు, కూర్మిపట్టివి=ముద్దుకుమారుఁడవు, బృందారక...సోదరుండవు-బృందారకధేను= కామధేనువునకు, కల్పతరువాటీ= కల్పవృక్షములకును, కౌస్తుభ=కౌస్తుభమాణిక్యమునకును, శ్రీ=లక్ష్మికి, సుధాసవ=అమృతమునకును, దిగ్వారణ= ఐరావతమునకును, సోదరుండవు= తోడఁబుట్టినవాఁడవు, జగచ్ఛ్లాఘ్యుండవు= జగంబుచే నుతింపఁదగినవాఁడవు, ఇట్టినీకున్ =ఇటువంటినీకు, శోచ్యపాంథజనసంహారంబు = జాలిగొలుపు వియోగిజనులను జంపుట, ధర్మ్మవు, అగునే = ధర్మము అగునా ? అనఁగా ఓచంద్రా! తెలివితక్కువచేఁ బాంథజనుల సంహరించుటె గొప్పపుణ్యకార్యము: (లేక విహితకృత్యము) అని తలంచి యట్లు చేయుచున్నావు. అది నీ కెంతమాత్రము తగినకృత్యము కాదు. నిన్ను జేరఁదీసినశివునిబట్టి యోజించినను, నీకు జనకుఁ డగుపాలసంద్రమును బట్టి చూచినను, నీతోఁబుట్టువు వైనకల్పవృక్షాదులఁ బట్టి తలపోసినను, నీవు లోకమును మన్నించుచు, లోకముచే నీవు మన్నింపఁబడుచు నీవారిప్రవర్తన మనుసరించి వర్తింపవలసినది. ఇట్లుండఁ బాంథజనసంహారము నీకుఁ దగియుండునా? కావున దీనిమాను మని భావము.

తా. ఓచంద్రా! నీవు శంకరునికి శిరోభూషణమవై వర్తిల్లుచుంటివి. మఱియు లోకమున మహాప్రఖ్యాతి గాంచినకామధేనుకల్పవృక్షాదులతోడఁ బుట్టువవు. పాలసంద్రముముద్దుకొడుకవు. నీవారవలెనే లోకశ్లాఘనీయుండవై యుండఁదగు. ఇట్లుండ నీవు సత్ప్రవర్తనము విడిచి పాంథజనుల సంహరించుట నీకుఁ బాడియా ?

క. చేయకుము చంద్ర! సుమన

స్సాయకునిం గూడి విరహిజనపీడనమ్ముఁ
వ్రేయకు మందంద పయ
స్తోయధివంశమున కపయశోడిండిమమున్. 130

టీ. చంద్ర=ఓచంద్రుఁడా, సుమనస్సాయకునిన్ =పుష్పములే బాణములు గాఁగలవానిని,అనఁగా మన్మథుని వని యర్థము. కూడి=కలసి, అనఁగా వతనితో నేకీభవించి యనుట, విరహిజనపీడనమున్ =వియోగ పీడితులగుజనములపీడించుటను, చేయకుము=మానుము. అనఁగా దుర్మార్గుఁడయిన మన్మథుని సహవాసము చేసి వానివలెనే వియోగిజనుల బాధింపకుమని భావము.అందంద=అచ్చటచ్చట, పయస్తోయధివంశమునకున్ =పాలసంద్రపువంశమునకు, అపయశోడిండిమమున్ = అపకీర్తియనెడిఢక్కను, వ్రేయకుము=ఘోషింపఁజేయకుము, అనఁగా కీర్తిమంతమై లోకమునఁబ్రఖ్యాతిచెందిన క్షీరసముద్రకులమందుఁ బుట్టిననీవు,ఆవంశమునకుఁ దగినట్లు ప్రవర్తింపక దుష్టకార్యము లొనరించి వంశమున కపకీర్తి దెచ్చి లోకమందు వ్యాపింపఁజేయకుమని భావము.

తా. ఓచంద్రా! దుష్టుఁడయినమన్మథుని సహవాసముచేసి వానివలెనే విరహిజనులఁ బీడింపకుము. మఱియు నీ వట్టిదుంటరిపను లొనరించి పాలవలె నిష్కళంక మగునీవంశమున కపకీర్తి దేకుము.

వ. అని బహుప్రకారంబుల. 131

టీ. స్పష్టము.

తే. ఇవ్విధంబునఁ గ్రథకైశికేంద్రతనయ
మదనదవథువ్యథాధూయమాన యగుచు
బహువిధంబుల విధు దూఱి పలుకుచుండి
తొడఁగి మధురంబుగా విధుంతుదునిఁ బొగడె. 132

టీ. ఇవ్విధంబునన్ =ఈప్రకారముగా, క్రథకైశికేంద్రతనయ=క్రథకైశిక దేశముల కధిపతియగు భీమరాజుకూఁతురు అనఁగా దమయంతియనుట, మదన

... మా[illegible]యమాన=

నొప్పింపఁబడినది, లేక కలఁగింపఁబడినది, అగుచున్, బహువిధంబులన్=అనే కప్రకారములచే, విధున్=చంద్రుని, దూఱి=నిందించి, పలుకుచుండి, అనఁగా వెనుకఁజెప్పినట్లు చంద్రునిగూర్చి నిందావాక్యములు పలుకుచుండి యని భావము. తొడఁగి = ప్రయత్నించి, మధురంబుగాన్=మృదువుగా, విధుంతుదునిన్= రాహువును,పొగడెన్=స్తోత్రముచేసెను.అనఁగా విరహిజనులఁ బీడించుచున్న చంద్రుని గ్రసించివిరహిజనుల కానందము గొలుపుచున్నవాఁడు కావున రాహువు నెంతయుసంతసమునఁ బొగడెనని భావము.

తా. ఇట్లు దమయంతి మదనబాధచేఁ బీడితయై తనకు బాధగలిగించుచంద్రుని నిందించి చంద్రుని నంతము పొందించి తనకు సంతసముగొలుపు రాహువును స్తుతించెను.

వ. తదనంతరంబ. 133

తే. అంతరిక్షంబునం దతివ్యవహితుఁ డగు
నిందు నిందింపఁ గారణం బేమి నాకు
నెమ్మనంబునయంద సన్నిహితుఁ డైన
కంతుఁ బాపాత్ము నిందింతుఁ గాక యనుచు. 134

టీ. అంతరిక్షంబునందున్=ఆకాశమునందు, అతివ్యవహితుఁడు= దూరమునందున్నవాఁడు, అగునిందున్=అయినచంద్రుని, నిందింపన్=తిట్టుటకు, నాకున్=దమయంతికనుట, కారణంబు ఏమి= ఏమికారణము? అనఁగా నెక్కడనో యాకసమందు దూరమం దుండి వర్తించుచంద్రునిబట్టి తిట్టఁదగినంతయవసరము నాకేమున్నదని భావము. నెమ్మనంబునయందున్+అ=చిత్తమునందే,సన్నిహితుఁడు=సమీపమున నున్నవాఁడు, ఐనకంతున్=అయినమన్మథుని, పాపాత్మున్=పాతకములే స్వరూపముగాఁ గలవానిని, నిందింతున్ + కాక=తిట్టుదునుగాక, అనుచున్=అనిపలుకుచు, అని పైపద్యముతో నన్వయము.

తా. చంద్రుఁ డాకాశమందు దూరమున నున్నవాఁడు. అంతదూరమందు వర్తించువాఁడు నాకు మిగుల బాధగలిగింపలేఁడు. కాన నాతని నేల నిందింప

వలెను. కావున నామనమునందే సర్వదా మెలఁగుచు బాధగలిగించుమన్మథు
నే తిట్టెదను గాక.

చ. ననవిలుకాఁడ! మన్మథ! యనాథవధూవధపాతకంబు నిన్
గొని మునిఁగించెఁ గ్రూరహరకోపకటాక్షశిఖిస్వరూపమై
మనమున నీవు నిర్దయత మానవు చూడఁగ నేముహూర్తవే
ళను జనియించితో యకట! లచ్చికి నమ్మధుకైటభారికిన్. 135

టీ. ననవిలుకాఁడ = పువ్వుమే ధనువుగాఁగల, మన్మథా! అనాథ...
పాతకంబు - అనాథవధూ = పతివిరహితలగు స్త్రీలను, వధ= చంపుటవలన
జనించిన, పాతకంబు = పాపము, క్రూర...స్వరూపమై- క్రూర = భయం
కరమగు, హరకోప = ఈశ్వరక్రోధసంబంధులగు, కటాక్ష = కడకంటి
చూపులవలనఁ గలిగిన, శిఖి=అగ్నిహోత్రుఁడే, స్వరూపమై=స్వరూపముగాఁ
గలదయి, నిన్=మన్మథుననుట, గొని=చుట్టుముట్టి, మునిఁగించెన్ =ముంచివైచె
ను, చంపెనని నిశ్చయార్థము, అనఁగా ననదలగు స్త్రీలను జంపుటంజేసి తజ్జనిత
పాతకము ముక్కంటికంటిమంటల రూపము నొంది నిన్ను దహించిన దనిభా
వము. మునిఁగించెన్, అని పఠించినప్పుడు ప్రాణములు తీసినదని యర్థము. చూ
డఁగన్=ఆలోచింపఁగా, మనంబునన్=మనస్సునందు, నీవు, నిర్దయతన్=ద
యాశూన్యత్వమును, అనఁగాఁ గాఠిన్యము ననుట, మానవు=విడువవు. అనఁ
గా నెట్టిదుష్టులయినను దా మొనరించిన చెడుపనులం గాంచి యధిపతి శిక్షించి
నచో నాశిక్షను బొంది సిగ్గుచెంది యాదుష్టత్వమును విడుచుట గలదు. అట్లె నీ
వనాథస్త్రీలను జంపుటచూచి యీశ్వరుండు తనకంటిమంటలచే దగ్ధునిగాఁజేసి
తగినశిక్ష గావించెను. అట్టిశిక్షను నీవుపొందినను సిగ్గుచెంది చెడుకార్యములనుం
డి మఱలక యింకను గఠినత్వము పూనియుండుట నీమొండితనమును సూచనచే
యుచున్నదని భావము. అకట=అయ్యయ్యో, లచ్చికిన్ =శ్రీమహాలక్ష్మికిని, అ
మ్మధుకైటభారికిన్ =మధుకైటభులనెడి రాక్షసులకు శత్రువగు నావిష్ణుమూర్తి
కిని, ఏముహూర్తవేళన్ =ఎట్టిదుష్టలగ్నమందు, జనియించితివి + ఓ=జనించి
నావో? అనఁగా నతిశ్రేష్ఠులగు లక్ష్మీనారాయణులకు గర్భమునఁ బుట్టినప్పు

డు వారివలె నీవు లోకనందనీయుండవయి మెలంగవలసినది. అట్లుగాక మిక్కిలి నొండివాఁడవయి వర్తించుచున్నావు. ఆలోచింప నేదో దుష్టముహూర్తమున జనించితివి. లేనిచో నీకిట్టి తుంటరిబుద్ధు లేలయుదయింపవలెనని భావము. మఱియు నట "ఎట్టిముహూర్తవేళను" అని చెప్పుటచే మన్మథుం డట్టి దుండగీ డగుటకు దుష్టమగు జననకాలమె కారణముగాని జననీజనకులగు లక్ష్మీనారాయణులు కారనుట స్పష్టమగుచున్నది.

తా. ఓమదనా! అనాథస్త్రీలను జంపుచుండుటవలన జనించినపాపము హరుని కంటిమంటలరూపము నొంది దహించినది. అయినను బుద్ధితెచ్చుకొని సాధువయి వర్తింపక మిగులఁ గ్రూరుఁడవయి వర్తిల్లుచున్నావు. ఆలోచింప నీవాలక్ష్మీనారాయణులకు నేదో దుష్టలగ్నంబున జనించియుందువు. లేనిచో వారి నే పోలక యిట్టిదుష్టుఁడవై యేల వర్తింపవలెను?

తే. కామ ! పరమేష్ఠి నీమనఃక్రౌర్య మెఱిఁగి
పుష్పములు నీకు నాయుధమ్ములుగఁ జేసె
నవియు బహుళంబుగాఁ జేయకైదు చేసె
నింతకైనను బ్రతుకునే యిజ్జగంబు. 136

టీ. కామ=ఓమన్మథా ! పరమేష్ఠి=బ్రహ్మ, నీమనఃక్రౌర్యమున్=నీమనస్సు యొక్క-క్రూరత్వమును, లేక కఠినత్వమును, ఎఱిఁగి=తెలిసికొని, పుష్పములు=పువ్వులు,నీకున్,ఆయుధమ్ములుగన్=బాణములుగా, చేసెన్=కల్పించెను. అవియున్=ఆపుష్పములును,బహుళంబుగాన్=అధికముగా, చేయక, ఐదుచేసెన్=అయిదింటినిమాత్రమే యిచ్చెను. ఇంతకైనన్= ఇట్లుచేసినను, ఇజ్జగంబు= ఈలోకము, బ్రతుకున్ + ఏ=బ్రదుకుచున్నదా? అనఁగా లేదనుట.

తా. ఓరీ! మన్మథా! సృష్టికర్తకు సమస్తము గోచరమగును గాన నీమనమునం దుండుక్రూరత్వమును గనిపెట్టి, "యిట్టిక్రూరునికి దృఢములగు నాయుధములు కల్పించినచో లోకము జీవింపద"ని నిశ్చయించి పూవుల నాయుధములగాఁ జేసెను.ఆపూవులనైన నధికముగాఁ జేసినచో లోకము సహింపలేదని

యెంచి వైదింటనిమాత్రమె చేసెను. అట్లు చేసినప్పటికి నీడాకకు నోర్చి లోకము జీవింప లేకున్నది.

ఉ. రాక సుధాంశుమండలము రాకకు మాఱుమొగంబు సే
దీకొని వచ్చుదండధరదిక్పవమాన మదక్షిణంబవుం[ యుచో
గాక వియోగికిం గుసుమకార్ముకశృంగము వంగఁ జేయునీ
యాకరపంకజాతము రతీశ్వర! దక్షిణ మైననాఁటికిన్. 137

టీ. రతీశ్వరా=ఓమదనా! రాకన్ = పున్నమయందు, సుధాంశుమండలము రాకకున్ =చంద్రబింబముయొక్క యుదయమునకు, మాఱుమొగంబు = పెడమొగము, చేయుచో = పెట్టినచో, కుసుమ...శృంగమున్ - కుసుమకార్ముక=పూవింటియొక్క, శృంగమున్=కొప్పును,వంగన్=వంగునట్లు, చేయు నీయాకరపంకజాతము = చేయుచున్న యీనీహస్తపద్మము, వియోగికిన్ = విరహవంతునకు, దక్షిణము = దయగలది, ఐననాఁటికిన్ = అయినప్పటికిని, దీకొని = విజృంభించి, వచ్చుదండధరదిక్పవమానము = వచ్చుచున్నదక్షిణదిక్కుగాలి, అదక్షిణంబు = దయలేనిదై, అవుంగాక = అవునుగదా-అనఁగా విరహులయెడ నీవు కరుణించి బాధింప మానినను మలయమారుతము బాధింపక విడువకున్న దనిభావము. లేక, రతీశ్వర=ఓమదనా! వియోగికిన్ = వియోగి నిమిత్తము, కుసుమకార్ముకశృంగమున్=పూవింటికొప్పును, వంగన్, చేయునీ యాకరపంకజాతము=చేయునట్టి యీనీహస్తపద్మము,దక్షిణమైన నాఁటికిన్ = దక్షిణముదిక్కుగా నుండునదైనను; ఎట్లనఁగా వియోగి చంద్రునకు విముఖుం డగుటచేఁ బశ్చిమాభిముఖుఁడై యుండును. ఒకరినొకరు కొట్టుకొనునప్పుడు వారు పరస్పర మభిముఖులై యుండుట ప్రసిద్ధము. కావున వియోగచిత్తమందు వర్తించుమన్మథుఁడు వియోగిని బ్రహరించునప్పు డతని కభిముఖుఁడై యుండును. అందుచే పశ్చిమాభిముఖుఁ డయిన వియోగికి నభిముఖుఁడై యున్న మన్మథుని కుడిచేయి దక్షిణపుదిక్కునం దున్నదేయగునని యెఱుంగునది. రాకన్ = పున్నమయందు, సుధాంశుమండలము రాకకున్ = చంద్రబింబోదయమునకు, మాఱుమొగంబు చేయుచోన్ = విముఖుఁడైన

చో, దీప్తాని = విజృంభించి, వచ్చుదండధరదిక్పవమానము = వచ్చుచున్న దక్షిణపుగాలి, అదక్షిణంబు = ఎడమచేతివైపుననున్నది, అవుంగాక అని ధ్వన్యర్థము. అనఁగా వియోగులు కామోద్దీపక మగుటచేఁ జంద్రోదయమును జూడలేక పడమటిదిక్కు మొగంబైనచో దక్షిణది క్కెడమవైపుననుండును గాన నందలిగాలియు నెడమవైపుననే యుండునని భావము.

తా. ఓమదనా! చంద్రాదులు విరహులకుఁ గామోద్దీపకము లగుటచేఁ జంద్రోదయమును జూడలేక విముఖులై యున్నప్పుడు వియోగులయెడ, సాధారణముగా వియోగుల బాధింపఁబూవింటినెక్కువెట్టెడి నీహస్తపద్మము దయ కలిగి యాకార్యమునుండి విరమించినను మిగుల విజృంభించి యరుదెంచుచున్న దక్షిణపుగాలి దయదలఁపక బాధింపక మానదు.

సీ. భువనమోహనసము ॥ ద్భవ మైనయఘమున
నశరీరభూతంబ ॥ వైతి మదన!
విరహమాలిన్యదు ॥ ర్విధుఁ గాని సోఁకవు
కలిదోషమవె? నీవు ॥ కాయజుండ!
ప్రాల్గలరతిదేవి ॥ భాగ్యసంపదఁ గదా
ప్రసవసాయక! చచ్చి ॥ బ్రతికి తీవు
చాలదా? యేలెదీ ॥ సకలప్రపంచంబు
పంచత్వ మొందియుఁ ॥ బంచబాణ!

తే. తమ్మిపూఁజూలి నీయాగ్ర ॥ హ మ్మెఱింగి
లోక మవ్యాపలతఁ బొందుఁ ॥ గాక యనుచు
దక్కుఁ గలకైదువులు మాని ॥ దర్పకుండ!
విరులు నీ కాయుధములు గా ॥ వించినాఁడు. 138

టీ. మదన=ఓమన్మథా! భువన...భవము - భువన=లోకములను, మోహన=మోహింపఁ జేయుటవలన, లేక యజ్ఞానములోఁ ద్రోయుటవలన, సముద్భవము=పుట్టినది, ఐనయఘమునన్ = అయినట్టిపాపముచే, అశరీరభూతంబవు =

శరీరములేని భూతమవు, ఐతివి=అయినవాఁడవు, అనఁగా లోకములోఁ బాపాత్ములు పిశాచము లగుచుందురని ప్రతీతి. కావున ఓమదనా! నీవు లోకము నజ్ఞానములో ముంచుటవలనఁ బాప మార్జించుకొంటివి కాన నీవాపాపముచే నశరీరభూతమవయితి వని భావము. కాముఁడు శివునికంటిమంటలచే దగ్ధుండై శరీరహీనుఁడయి యుండఁగా నామన్మథుని కశరీరత్వము పాపకార్యము లాచరించుటవలన సంభవించె నని కవీశ్వరుం డూహించుచున్నాఁడు. కాయజుండ=శరీరమువలన జన్మించినవాఁడా, అనఁగా మన్మథుఁడాయనుట నీవు, విరహ...దుర్విధుర్ - విరహ=వియోగమువలనఁ గలిగిన, మాలిన్య=మలినత్వముచే, దుర్విధుర్, గాని=చెడురీతులుగలవానినిగాని, సోఁకవు=ఆవహింపవు, కలిదోషమవె=కలివలనఁగలిగినపాతకమవాయేమి? అనఁగా, "కిన్ను శాలేషుశూరేణ కవినాధీరభీరుణా। అప్రమత్తః ప్రమత్తేషుయోవృకోవిషువర్తతే" అనెడిభాగవతవచనప్రకారము కలి మాలిన్యము గలమూర్ఖులయెడ శూరుఁడయి గొఱ్ఱెలమందలోనికి భయపడుచు మెల్లమెల్లగఁబోవు తోఁడేలువిధంబునఁబోవుచుండునుగాని వివేకులను శౌచవంతులను జేరలేదు. అట్లె నీవును విరహమాలిన్యము గలవారినేకాని యితరులచెంతకుఁబోవు. ఆలోచింపనీవు కలిపురుషుఁడవేమోయని సందియమగుచున్నది. ప్రసవసాయక = పుష్పమేబాణముగాఁ గలవాఁడా! ప్రాల్గలరతిదేవి = సౌమంగల్యవంతురా లగురతీదేవియొక్క, భాగ్యసంపదర్+కదా=భాగ్యసమృద్ధిచేతనే కదా! ఈవు=నీవు, చచ్చి, బ్రదికితివి=జీవించితివి, అనఁగారతీదేవిసౌమంగల్యాతిశయమువలన నీవు చచ్చియు జీవించితివి. అదిలేనిచో నీవుజీవింప నేరవని భావము. పంచబాణ=ఓమన్మథా! పంచత్వము, ఒందియుర్=చచ్చియును, ఈసకలప్రపంచమును=ప్రపంచకమునంతయు, ఏలెదు = పరిపాలించెదవు, చాలదా ? సరిపోలేదా? అనఁగాఁ జచ్చియుఁబ్రపంచమును పాలించుచున్నావు. అందువలనఁ దృప్తిచెందక యందఱను బాధించెదవేల? అనిభావము. తమ్మిపూచూలి=తామరయందుఁ బుట్టినవాఁడు. అనఁగా బ్రహ్మయనుట, నీయాగ్రహము=నీకోపమును, ఎఱింగి=తెలిసికొని, లోకము=ప్రపంచము, అవ్యాకులతర్=తొట్రుపాటులేకుండుటను ఒందుర్+కాక, అనుచుర్=పొందుఁగాకయనిపలుకుచు, తక్కుఁగలకైదువులు

=లోహమయములగు నాయుధములను, మాని=ఇచ్చుటకిష్టపడక, దర్పకుండ= ఓమన్మథా! నీకుఁ, విరులు=పువ్వులను, ఆయుధములుగాఁ=బాణములుగాఁ, కావించినాఁడు=చేసినాఁడు అనఁగా బ్రహ్మ నిన్ను సృజించినప్పుడు నీయాగ్రహము దుస్సహమైనదని తలంచి "యితనికి లోహమయము లగునాయుధముల నిచ్చినచో లోకముల ధూళిపాలుగావించు"నని తలపోసి, లోకముల కట్టియుపద్రవము గలుగకుండుటకై నీకుఁ బుష్పములు మాత్రమే యాయుధంబులగాఁ జేసినాఁడు.

తా. గతార్థము.

వ. అని పలికియు సవిధలీలోద్యానంబునందు సరసరసాలకోమలకిసలయాస్వాదనకషాయకంఠకలకంఠకామినీకుహూకారకోలాహలపంచమంబు వీతెంచిన నప్పల్లవాధరి యుల్లంబు జల్లన నొల్లంబోయి మూర్ఛిల్లిన. 139

టీ. అనిపలికియుఁ, సవిధలీలోద్యానంబునందుఁ=సమీపమందలి విలాసకాననమునందు, సరస...పంచమంబు-సరస=రసముతోఁగూడిన, రసాలకోమలకిసలయ=మామిడిచెట్లయొక్క మృదువగు చిగుళ్లను, ఆస్వాదన=భక్షించుటవలన, కషాయ=రక్తిమగల, కంఠ=కంఠములుగల, కలకంఠకామినీ=ఆఁడుకోవెలలయొక్క, కుహూకార=కుహూయనెడి ధ్వనులయొక్క, కోలాహల=కలకలముయొక్క, పంచమంబు=పంచమస్వరము, వీతెంచినఁ=రాఁగా, అప్పల్లవాధరి=చిగురువంటి యోష్ఠముగలదమయంతి, ఉల్లంబు=మనస్సు, జల్లనఁ, ఒల్లంబోయి=ఖిన్నురాలయి-లేక చిన్నఁబోయి, మూర్ఛిల్లినఁ=మూర్ఛనొందఁగా అని పైపద్యముతో నన్వయము.

ఉ. గొజ్జఁగనీరుసల్లె నొకకోమలి దిప్పె లతాంగి యొార్తు లామజ్జకతాలవృంత మొకకమానినిచందనకర్దమంబునఁ [యఁ మజ్జన మాచరించెఁ గుచమండలి నొక్కవధూటి యెంత బుజ్జవమొప్పఁబాదములఁబుష్పాడి యొత్తె విదర్భకన్యకున్.

టీ. ఒకకోమలి = ఒక స్త్రీ, గొజ్జఁగనీరన్ = పన్నీటిని, చల్లెన్ = చిలుకరించెను, లతాంగియోర్తు = మఱియొకస్త్రీ, లామజ్జకతాలవృంతము = వట్టివేళ్లచేఁ గట్టినవీవనను, త్రిప్పెన్ = విసరెను, ఒకమానిని = ఒక స్త్రీ, చందనకర్దమంబునన్ = మంచిగంధపుబురదచే, కుచమండలిన్ = స్తనయుగ్మమును, మజ్జనమాచరించెన్ = స్నానము చేయించెను. ఒక్కవధూటి = ఒక స్త్రీ, ఎంతయున్ = మిక్కిలి, బుజ్జవము = లాలన, ఒప్పన్ = ఒప్పునట్లుగా, విదర్భకన్యకున్ = దమయంతికి, పాదములన్ = అఱికాళ్లయందు, పుప్పొడి = పద్మపరాగమును, ఒత్తెన్ = అలఁదెను, లేక పూసెను.

తా. స్పష్టము.

సీ. పద్మిని! కన్నీరు పన్నీటఁ దుడువుము
రంభాదళంబు సారంగి! వీవు
కల్పవల్లి! యొనర్పు కర్పూరతిలకంబు!
చక్రవాకి! యలందు చందనంబు
చలిగావివలివంపు వలువఁ గట్టు చకోరి!
బిసకాండహారంబు వెట్టు హారిణి!
కలకంఠి! చేర్పు చెంగలువయెత్తుదలాడ
కలికి! పైఁ జిలికించు గమ్మఁదేనె
తే. బాలశైవాలమంజరీజాలకంబు
నిందుమతి! యొత్తు మఱిచేతులందుఁ గదియ
నప్పళింపు మందారిక! యడుగులందుఁ
జల్లఁగాఁ బుండరీకకింజల్కధూళి. 141

టీ. ఓపద్మిని! కన్నీరు = బాష్పములను, పన్నీటన్ = పన్నీటిచే, తుడువుము, ఓసారంగి! నీవు, రంభాదళంబు = అనఁటియాకును, వీవు = వీచుము. ఓకల్పవల్లి! కర్పూరతిలకంబున్ = కర్పూరపుబొట్టును, ఒనర్పుము = చేయుము. ఓచక్రవాకి! చందనంబున్ = మంచిగంధమును, అలందుము = పూయుము. ఓచకోరి! చలిగావి

వలిపంపువలువు=సన్న కావిగల మడుఁగుపుట్టమును, కట్టు=కట్టుము. ఓహరిణి! బిసకాండహారంబు=తామరతూండ్లనెడు హారంబును, పెట్టుము. ఓకలకంఠీ! చెంగలువ=ఎఱ్ఱకలువలచేనైన, ఎత్తుదలాడన్ =తలగడను, చేర్పుము. ఓకలికి! పైన్ =దమయంతిమీఁద, కమ్మతేనెన్ =కమ్మనితేనెను, చిలికించు=చల్లుము. ఓయిందుముఖి! బాల=లేఁతయగు, శైవాలమంజరీజాలకంబున్ - శైవాల = నాచుయొక్క, మంజరీ=గుత్తులయొక్క, జాలకంబున్ =సమూహమును, చేతులందున్ =హస్తములందు, కదియన్ = దగ్గఱగా, ఒత్తుము = చేర్పుము. ఓమందారిక! అడుగులందున్ = పాదములందు, పుండరీకకింజల్కధూళిన్ -పుండరీక = తెల్లదామరలయొక్క, కింజల్క=కేసరములందున్న, ధూళిన్ =పరాగమును, అప్పళింపుము=అద్దుము.

తా. స్పష్టము.

వ. అని పలుకుచు సంభ్రమించుసఖీజనంబుల కలకలం బాలించి యిదియేమి కోలాహలం బని భీమభూపాలుండు దేవీసహితుండై యడుగఁ దద్వయస్యాజనంబులు దా రెఱింగిన తెఱంగెల్లను విన్నవింప నన్నరనాథుండు ముద్దుఁగూఁతు మనోభిలాషంబునకు ననుకూలంబుగా జగంబునం దెల్ల స్వయంవరంబుఁ జాటింపం బంచిన. 142

టీ. అనిపలుకుచున్, సంభ్రమించు...కలకలంబు - సంభ్రమించు=తొందరపడుచున్న, సఖీజనంబుల = చెలికత్తెలయొక్క, కలకలంబు = కోలాహలము, ఆలించి=విని, ఇది, ఏమి, కోలాహలంబు+అని, భీమభూపాలుండు=దమయంతితండ్రి, దేవీసహితుండై=భార్యతోఁగూడ, అడుగన్, తద్వయస్యాజనంబులు = ఆదమయంతిచెలికత్తెలు, తారు=తాము, ఎఱింగిన తెఱంగెల్లను=తెలిసికొనిన వృత్తాంతమంతయు, విన్నవింపన్, అన్నరనాథుండు=ఆభీమరాజు, ముద్దుకూఁతు మనోభిలాషంబునకున్ = ముద్దుపట్టియొక్క కోర్కికి, అనుకూలంబుగన్=తగునట్లుగా, జగంబునం దెల్లన్ = లోకమందంతటను, స్వయంవరంబు

=స్వయంవరమును, చాటింపన్ = వెల్లడించుటకు, పంచినన్=పంపఁగా—అని వైపద్యముతో నన్వయము.

తే. సప్తసాగరపరివృతక్ష్మాతలమునఁ
జాటఁబడియెను వాదిత్రసంయుతముగ
ధరణినాథకుమారహృద్ధైర్యహారి
భోజకన్యాస్వయంవరాభ్యుదయమహము. 143

టీ. సప్త...తలమునన్, సప్తసాగర=ఏడుసముద్రముల చేతను, పరివృత=చుట్టఁబడిన, క్ష్మాతలమునన్=భూతలమునందు, ధరణి... అభ్యుదయము - ధరణినాథకుమార=రాజకుమారులయొక్క, హృత్ = హృదయములందున్న, ధైర్య=ధైర్యమును, హారి=హరించునటువంటి, భోజకన్యా=దమయంతియొక్క, స్వయంవర=స్వయంవరమనెడి, అభ్యుదయ=మంగళరూపమైన, మహము=ఉత్సవము, వాదిత్రసంయుతముగన్=వాద్యవిశేషములతోఁగూడ, చాటఁబడియెను=వెల్లడిపఱుపఁబడియెను.

తా. రాకొమరుల ధైర్యమును హరించెడుదమయంతియొక్క స్వయంవర మహోత్సవము సప్తసాగరవలయితంబయినభూతలమందు వాద్యఘోషములతోఁ గూడ వెల్లడిపఱుపఁబడియెను.

మ. నవరత్నోపలదివ్యలింగవరదానప్రీతదాక్షాయణీ
ధవ! కర్పూరవసంతరాయ! యనవద్యద్వాదశీవాసరో
త్సవరుక్మాంగద! వేమభూపతిమహాసామ్రాజ్యరక్షామణీ!
యవనాధీశసభానిరంకుశవచోవ్యాపారసారంగతా! 144

టీ. నవ...ధవ-నవ=తొమ్మిదివిధములైన, రత్న+ఉపల = రత్నమయములైన, దివ్య=దేవసంబంధమైన, లింగవర=శ్రేష్ఠమైన లింగములను, దాన=దానముచేయుటచే, ప్రీత=సంతోషపెట్టఁబడిన, దాక్షాయణీధవ=ఈశ్వరుఁడుకలవాఁడా! కర్పూరవసంతరాయ = కర్పూరవసంతుఁడను బిరుదముగలవాఁడా! అనవద్య...రుక్మాంగద-అనవద్య=లోపములేని, ద్వాదశీవాసర = ద్వాదశీదినం

బునందు చేయఁబడుచున్న, ఉత్సవ=పండువునకు, రుక్మాంగద=రుక్మాంగదునివం టివాఁడా!, వేమభూపతి...మణీ-వేమభూపతి = వేమదేశాధీశునియొక్క, మ హత్=గొప్పదైన, సామ్రాజ్య=ప్రభుత్వమును, రక్షా=రక్షించుటయందు,మణీ =శ్రేష్ఠుఁడా! యవనాధీశ...పారంగతా - యవనాధీశ = తురుష్కరాజుల యొక్క, సభా=సభయందు, నిరంకుశ = అడ్డులేకుండ, వచోవ్యాపార = వా గ్వ్యాపారము చేయుటయందు, పారంగతా = పారమును బొందినవాఁడా- అనఁగా నిపుణతగలవాఁడనుట.

క. ఆచక్రవాళశైల
క్ష్మాచక్రమహామహీశకటకాస్థానీ
వాచాటచాటు*కవితా
గోచరకీర్తిప్రతాప! శ్రీకులమణిదీపా! 145

టీ. ఆచక్రవాళ ..ప్రతాప - ఆచక్రవాళశైల = చక్రవాళపర్వతపర్యం తముగల, క్ష్మాచక్ర=భూతలమందున్న, మహత్ = పూజ్యులైన, మహీశ=రా జులయొక్క, కటక=పట్టణములయందున్న, ఆస్థానీ = సభలయందున్న, వా చాట=పండితులయొక్క, చాటుకవితా=చాటుకవిత్వమునకు, గోచర=విషయ మగుచున్న, కీర్తిప్రతాప=కీర్తియుఁ బ్రతాపముఁ గలవాఁడా, అనఁగా రాజా ధిరాజులసభలందున్న పండితు లీతనికీర్తిప్రతాపములను దమతమకవిత్వముల చే వర్ణించుచున్నారనుట!కులమణిదీపా=కులమునకు రత్నదీపము వంటివాఁడా!

తా. భూచక్రమందున్న సమస్తరాజుల సభలయందున్న పండితులచాటు కవిత్వముచే వెల్లడిచేయంబడుచున్న కీర్తిప్రతాపములుగల సింగనామాత్యా.

పృథ్వీవృత్తము. చతుర్ముఖవిలాసినీ శ్రీశయవిలాసపంకేరుహ
ప్రసూతామృతమధూళికాశ్రీసురభి సారసారస్వతా!
వితీర్ణమహిమార్ణవా!శ్రీవిభవయోగ సంక్రందనా!
ప్రతాపగుణభూషణా! శ్రీపరిణతార్థసంభాషణా!

* 'కవి వాగ్గోచర' అని పాఠా.

టీ. చతుర్ముఖ......సారస్వతా - చతుర్ముఖవిలాసినీ=సరస్వతీదేవియొక్క, శయ = చేతియందున్న, విలాసపంకేరుహ = లీలాపద్మమునుండి, స్రుత = స్రవించుచున్న, అమృత = మకరందముయొక్కయు, మధూళికా = పుష్పొడియొక్కయు, సురభి=పరిమళముగలదియు, సార=శ్రేష్ఠమయిన, సారస్వతా =వాక్సంపదఁగలవాఁడా, అనఁగా నిర్దుష్టముగాను, మృదుమధురముగాను వాగ్వ్యాపారముచేయువాఁడనుట, వితీర్ణ=ప్రసిద్ధమయిన, మహిమ=సామర్థ్యమునకు, అర్ణవ=సముద్రమువంటివాఁడా, విభవ...సంక్రందనా-విభవ=వైభవముయొక్క, యోగ=సంబంధమందు, సంక్రందనా=దేవేంద్రునివంటివాఁడా,ప్రతాపగుణభూషణా = ప్రతాపగుణమనెడు నలంకారముగలవాఁడా, పరిణతార్థసంభావణ-పరిణత=సిద్ధమయిన, అర్థ=అర్థముగల లేక, ప్రయోజనముగల, సంభావణ=వాక్కులుగలవాఁడా-అనఁగా అతనినోటినుండి వాక్యము వెడలిఁచోఁదత్ప్రియుక్తమగుకార్యము మొదటనే సిద్ధిపొందియుండెడిదని భావము.

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్రి మారయామాత్యపుత్త్రి సకలవిద్యాసనాథ శ్రీనాథభట్టప్రణీతంబయిన శృంగార నైషధకావ్యంబునందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము.





శ్రీ ర స్తు.

# శృం గా ర నై ష ధ ము.

## టీ కా తా త్ప ర్య స హి త ము.

## తృ తీ యా శ్వా స ము.



శ్రీహర్షసుకవికవితా
వ్యాహారకథాసుధారసాస్వాదసుఖ
శ్రీహర్షోదయ! సత్యస
మాహిత!మహితాంతరంగ! శ్రీ మామిడిసింగా! 1

టీ శ్రీహర్ష...హర్షోదయ-శ్రీహర్ష=శ్రీహర్షుఁడనెడు, సుకవి=కవిశ్రేష్ఠునియొక్క, కవితావ్యాహార=కవిత్వవచనములచేఁ గూర్పఁబడిన, కథా=చరిత్రమనెడి, సుధారస=అమృతరసమును, ఆస్వాద=అనుభవించుట యనెడి, సుఖశ్రీ=సుఖసమృద్ధిఫలనఁ గలిగిన, హర్షోదయ=సంతోషాతిశయము గలవాఁడా, సత్యసమాహిత=సత్యమందు స్థిరమనస్సుగలవాఁడా లేక, సత్యసంధా!మహితాంతరంగా=పూజ్యమైన మనస్సుగల, మామిడిసింగా=మామిడన్నకుమారుఁడవైన సింగనామాత్యా! అని పైపద్యముతో నన్వయము. ఇట "శ్రీహర్ష...హర్షోదయ" యను విశేషణమునుఁ బట్టి యోజింప సింగనామాత్యుఁడు శ్రీహర్షకృతమైన నైషధకావ్యమునుఁ జక్కఁగఁ బఠించినట్లును, నందలి రసాస్వాదసుఖ మనుభవించి యాసుఖమును సంపూర్ణమెఱుఁగనివారలకుఁ గూడఁ గలిగించు

నిమిత్తము నైషధగ్రంథము భాషాంతరీకరణమునుఁ జేయించెననియు, స్ఫురించుచున్నది. ఈచెప్పుటచే సింగనామాత్యుఁడు రసికుఁడనియుఁ బరోపకారియనియుఁ గూడఁ దెలియవచ్చుచున్నది.

తా. సులభము.

వ. ఆకర్ణింపు మాయవసరంబున నిఖిలభువనవృత్తాంతవేదియు,నశేషభాషాకుశలుండును, సర్వవిజ్ఞాననిధియును, సమస్తశాస్త్రప్రవీణుండును, సకలపురాణేతిహాససంహితారహస్యవిజ్ఞానవిశారదుండును, నగు నారదుండు బాల్యసఖుండైన పర్వతుండునుం దానును. 2

టీ. ఆకర్ణింపుము=వినుము, ఆయవసరంబునన్ = దమయంతీస్వయంవరము చాటించిన సమయమందు, నిఖిలభువనవృత్తాంతవేదియు - నిఖిల=సమస్తమయిన, భువన=లోకములందున్న,వృత్తాంత=సంగతులను, వేదియు=తెలిసినవాఁడును, అశేషభాషాకుశలుండును-అశేష = అనేకములయిన, భాషా=భాషలయందు, కుశలుండు=నేర్పరియు, సర్వవిజ్ఞాననిధియు = సమస్తమైనతత్త్వజ్ఞానమునకు నిధివంటివాఁడును, సమస్త శాస్త్రప్రవీణుండును = అన్నిశాస్త్రములయందును నిపుణత గలవాఁడును, సకల...విశారదుండును-సకల=సమస్తమైన, పురాణ=పురాణసంహితలయందు, ఇతిహాస సంహిత = పూర్వచరిత్రసంహితలయందును గల, రహస్య=గుట్టులను, విజ్ఞాన=తెలిసికొనుటయందు, విశారదుండును=నేర్పుగలవాఁడును,అగు,నారదుండు=అయిననారదమహర్షి, బాల్యసఖుండు =చిన్ననాఁటి స్నేహితుఁడు, అయినపర్వతుంకు=అయిన పర్వతుఁడను ఋషియు--ని॥ పర్వతశ్శైలదేవర్ష్యోః । అని విశ్వకోశము, తాను=నారదుండనుట. ఇట-"నిఖిల... వేది" "అశేష...కుశలుండును" అను విశేషణంబులవలన నారదుఁడు దమయంతీస్వయంవరవృత్తాంత మితరభాషలలోఁ జాటించినను దెలిసికొనఁగలవాఁడని తెలియవచ్చుచున్నది.

ఉ. పంబిన వేడ్కతో బిదురపాణి సురాసురమాళిమాలికా

చుంబితపాదపీఠు బలసూదనుఁ జూడఁగఁ గోరి నాకలో
కంబునకుం జనంగ సమకట్టెఁ బితామహకూర్మిపట్టి హ
స్తాంబురుహాంగుళీనఖశిఖాంకురకోటి విపంచి మీటుచున్.

టీ. పితామహకూర్మిపట్టి=బ్రహ్మముద్దుకుమారుఁడైన నారదుఁడు, హస్తాం బు...కోటిన్ - హస్తాంబురుహ=పద్మమువంటిచేతియొక్క, అంగుళీ = వ్రేళ్ల యొక్క, నఖశిఖాంకురకోటిన్ =కొనగోళ్ల సమూహముచేత,విపంచిన్ =వీణెను, మీటుచున్, పంబినవేడ్కతోన్ =అతిశయించిన వేడుకతో, భిదురపాణిన్ = వజ్రాయుధము హస్తమందుఁ గలవానిని, సురాసుర...పీఠున్-సురాసుర = దేవదానవులయొక్క, మౌళిమాలికా=కిరీటపంక్తులచే, చుంబిత=తాకఁబడుచు న్న, పాదపీఠున్ = పాదపీఠముగలవానిని, అనఁగా — సమస్తదేవదా నవులచే మ్రొక్కఁబడుచున్నవాఁడనుట. బలసూదనున్ =బలాసురునిఁజంపిన వానిని, అనఁగా—దేవేంద్రుననుట, చూడఁగన్+కోరి = చూడ నపేక్షించి, నాకలోకంబునకున్ = స్వర్గలోకమునకు, చనంగన్, సమకట్టెన్ = పోవు చుండెను.

తా. నారదమహాముని తనస్నేహితుండగు పర్వతునితోఁగూడి కొనగోళ్ల తో విపంచి మీటుచు సమస్తసురాసురులచే నభివందింపఁబడుచున్న దేవేంద్రు నిఁ జూడఁ దలంచి స్వర్గలోకంబునకుఁ బోవుచుండెను.

చ భువనగురుత్వవైభవము పూనెనయేనియుఁ బూనెఁగాని పొం
దవుఁ జరియింప నారదున కభ్రపథంబునఁ బర్వతుండు దాఁ
దివ్రరుటయెట్లు నెంటఁ జనుకదేరఁగ యుక్తమయివ్విధంబునం
బ్రవితతపక్షపాతగతిభంగి మునిం దలఁపంగ వచ్చినన్. 4

టీ. భువనగురుత్వవైభవము = భువనభారముయొక్క సమృద్ధిని, (లోక పూజ్యత్వసంపదననియు నర్థము) పూనెనయేనియున్ =పొందినను, పూనెన్ కాని=పొందెనుఁగాని, అనఁగా లోకములో దుర్భరత్వాతిశయము నొకవేళఁ బొందినప్పటికిని...నారదమునికి...నియు

నర్థాంతరము) అభ్రపథంబునన్ = ఆకాశమార్గమునందు, చరింపన్, పొందు, అవున్ = సంచరింపఁదగియుండును, అనఁగా లోకములో గురుత్వముపొందినప్పటికి నారదున కాకాశమందుఁ జరించుట యుక్తము. భువనగురుత్వము వహించినవాని కాకాశగమన మెట్లు అన్న విరోధము గురుత్వపదమునకుఁ బూజ్యత్వమని యర్థము చెప్పినచో నాభాసమగును. పర్వతుండు=(పర్వతుఁడని పర్వతమనియు నర్థాంతరము) తాన్ = తాను, వెంటన్ = నారదుని వెనుక, చనుదేరఁగన్ = వచ్చుటకు, తివురుట = ప్రయత్నించుట, ఎట్లు ?, ప్రవితతపక్షపాతగతిభంగి-ప్రవితత=విస్తారమయిన, పక్షపాత = నారదునందుఁ బర్వతునకుఁగల మైత్రిమువలనఁగల్గిన, గతి=గమనముయొక్క, భంగి=రీతి, అని పర్వతముని పరమైనయర్థము, ప్రవితత=వెడల్పయిన, పక్ష=రెక్కలయొక్క, పాత=పడుటవలనఁ గలిగిన, గతి=గమనముయొక్క, భంగి=రీతి, అని కేవల పర్వతపరమైన యర్థాంతరము. మదిన్ = మనస్సునందు, తలఁపంగవచ్చినన్ = తలఁపఁబడినచో, ఇవ్విధంబునన్ = ఈరీతియును, యుక్తమే=పర్వతుఁడు మింటసంచరించుట తగినదే. పర్వతమునకు రెక్కలుండుటవలన మింటఁజరింపఁ దివురుట యుక్తమేయని యర్థము; పర్వతమునికి నారదునివలనిపక్షపాతమువలన నతనివెంట మింటఁ జనుదేరఁ బ్రయత్నించుటయుక్తమేయని యర్థాంతరము. ఇట గురుశబ్దమునకు పూజ్యుఁడనియు దుర్భరుఁడనియు నర్థము, నారదపదమునకు నారదమహర్షియనియు, "ఆపో నారా ఇతిప్రోక్తాః" యనుటఁబట్టి నారశబ్దంబునకు జలమని యర్థమున్నదిగనుక, దాని నిచ్చునట్టి మేఘుఁడనియు నర్థము. పర్వతశబ్దమునకు, కొండయనియు, పర్వతమహర్షియనియు నర్థము. గ్రంథకర్త యిచటఁ బొందుపఱచిన సారస్యమేమన;-భువనగురుత్వ వైభవము పొందినను నారదునకు (మేఘునికి) నాకాశమార్గమునఁ జరియించుట యుక్తమే కాని-పర్వతుఁ డాకాశమందు సంచరించుట యెట్లని విరోధము, ఏమన,బరువైన వస్తు వాకసమందుండుట యసంభవమగుట యనుభవసిద్ధము. అందుచే బరువైన కొండ యాకసమం దెట్లుండుననియు,లేక పర్వతముని కాకాశగమనమెట్లనియు, భావము-అది [illegible] ప్రసిద్ధము.

గనుక యట్టి యెక్కులు పర్వతమునకున్నవనిగాని, నారదునివలన పక్షపాతము పర్వతునికున్నదనిగాని, తలపోసినచో నాకాశమ్మదు సంచరించుట యుక్తమే యని చెప్పుటచే నాభాన మగుచున్నది. అనఁగాఁ గవి నారదపర్వతశబ్దముల శ్లేషించి విరోధాభాసమను నలంకారమును గూర్చినాఁడని ఫలితార్థము - అలంకారము విరోధాభాసము.

తా. గతార్థము.

తే. గగనవీథి విమాన మెక్కకయ చనిరి
యోగవిద్యాబలంబు చేయూఁతగాఁగఁ
దపము గల్గంగ సాధనాంతరము లేల
సకలకార్యంబులందును సంయములకు. 5

టీ. ఆపర్వతనారదులు,(అధ్యాహారము) యోగవిద్యాబలంబు=యోగవిద్యామహిమ, చేయూఁతగాఁగన్ =ఆధారముకాగా, విమానము =విమానమును, ఎక్కకయ=అధిష్ఠింపకయె, గగనవీథిన్ =ఆకాశమార్గమునందు, చనిరి=పోయిరి, సంయములకున్ =మునీశ్వరులకు, తపము=తపస్సు, కల్గంగన్ =కలిగియుండఁగా, సకలకార్యంబులందున్ =అన్నికార్యములను సాధించుటయందు, సాధనాంతరములు= వేఱుసాధనములు, ఏల=ఎందుకు, అనఁగా తపముచేతనే సమస్తకార్యములు సాధింపఁబడునవనుట,ఇందుగుఱించి మనువు శ్లో॥ యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చదుస్తరమ్। తత్సర్వం తపసా ప్రాప్యం తపోహిదురతిక్రమమ్॥ అని చెప్పియున్నాఁడు కావున తపస్సులభించుటయే కష్టముగాని తపస్సుచే సమస్తము లభింపఁగలదని భావము.

తా. నారదపర్వతులు విమానసహాయ మక్కఱలేకయే యోగబలమును బురస్కరించుకొని గగనవీథియందుఁ బ్రయాణముచేసిరి. మునులకుఁ గార్యసాధనకై తపముండఁగా సాధనాంతరములకై తడవనేల?అలం-అర్థాంతరన్యాసము.

సీ. అంతరాంతరముల నాకాశచరకోటి
మోడ్పుఁజేతులు మ్రొ క్కులు ఘటింపఁ

దనకాంతి చంద్రికాధవళయయ్యెను బేర్మి
 నాదిత్యదీప్తుల నతకరింపఁ
జదలేఱు వీచిహస్తముల నిర్మలవారి
 సంఘ్రముల కర్ఘ్యపాద్యంబు లొసఁగ
నావహాసంవహాద్యనిలఘట్టనముల
 శతతంత్రి మూర్ఛనాస్వరము లీన

తే. గహనసంసారఘోరసాగరము దాఁటి
 పరమయోగీశ్వరుఁడు మోక్షపదముఁబోలె
 బహుళతరమైన యాకాశపథము దాఁటి
 నాకభువనంబు సొత్తెంచె నారదుండు. 6

టీ. నారదుండు, అంతరాంతరములన్ = నడుమనడుమ, ఆకాశచరకోటి= దేవతాసమూహము, మోడ్పుచేతులు= చేమోడ్పులను, మస్తములన్ = శిరస్సులయందు, ఘటింపన్ =కూర్చుచుండఁగా, (అనఁగా నాకాశమందుసంచరించుచున్న దేవతలందఱు ఎడనెడ నారదుని సందర్శించి యతనికి నమస్కారములు చేయుచున్నారని భావము) తనకాంతి=తనశరీరచ్ఛాయ, చంద్రికాధవళయయ్యెను=వెన్నెలవలె తెల్లనిదియయ్యెను, పేర్మిన్ =పెంపుచే, ఆదిత్యదీప్తులన్ = సూర్యకాంతులను, అతకరింపన్ = క్రిందుపఱుపఁగా (అనఁగా లోకములోఁ జంద్రిక తెల్లనిదనియు, సూర్యకాంతి యెఱ్ఱనిదనియు, ననుట యనుభవసిద్ధము. ఇట నారదునిశరీరకాంతి వెన్నెలవలె తెల్లనిదయ్యు నెఱ్ఱనిసూర్యకాంతుల నతకరించె నని చెప్పుటచే విరోధ ముత్పన్నమగుచున్నది. ఆవిరోధము నారదునికాంతి పెంపుచే సూర్యకాంతులను బోలుచున్నదని చెప్పుటవలన నాభాసమగుచున్నది. కావున నిట నలంకారము విరోధాభాసము) మఱియు లోకములోని తేజఃపదార్థము లన్నిటికంటె సూర్యుఁ డధికుఁడు-కావున నారదుని కాంతి వర్ణమునుబట్టి వెన్నెలతో సమానమైనదనియు, పెంపునుబట్టి సూర్యకాంతులతో [illegible] హస్తములన్ =

తరంగములనెడు చేతులచే, నిర్మలవారిన్ = స్వచ్ఛోదకముచే, అంఘ్రులకున్ = నారదునిపాదములకు, అర్ఘ్యపాద్యంబుల్ = అర్ఘ్యమును, పాద్యమును, ఒసంగన్ = ఇచ్చుచుండఁగా-అనఁగా గంగానది తనతరంగములనెడు చేతులచే జలముగొని పూజార్హుఁడైన నారదుని కర్ఘ్యపాద్యము లిచ్చుచున్నదని భావము. ఇట 'గంగాదేవి' యనకుండ 'చదలేఱు' ని చెప్పుటచే నారదుఁడ చేతనములచేఁగూడఁ బూజింపఁబడుచున్న పుడు చైతన్యవిశిష్టులైన దేవతలచేఁ బూజింపఁబడుచున్నాఁడని వేఱచెప్పవలయునా? యనునర్థము స్ఫురించుచున్నది. ఆవహ...ఘట్టనముల్ = ఆవహ సంవహ = ఆవహము సంవహము, ఆది = మొదలుగాఁగల, అనిల = వాయువులయొక్క, ఘట్టనముల్ = రాపిడులచే, శతతంత్రి = నూఱుతంతులుగలనారదునివీణె, మూర్ఛనాస్వరములు = ఆరోహణావరోహణారూపముగా సరిగమాదిసప్తస్వరములను, ఈనన్ = ప్రకటించుచుండఁగా (అనఁగా నారదుఁడు విపంచికఁబూని యాకాశమునఁ బోవునపుడు యందున్న సప్తమారుతములచే సంఘర్షింపఁబడియతనివీణెయారోహణావరోహణారూపములైనసప్తస్వరములను బ్రకటించుచున్నదని భావము) పరమయోగీశ్వరుఁడు = గొప్పయోగీంద్రుఁడు, గహన... సాగరము-గహన = దుఃఖకరమైన-లేక దాఁటరాని, సంసార = సంసారమనెడు, ఘోర = భయంకరమైన, సాగరము = సముద్రమును, దాఁటి = లంఘించి, మోక్షపదముఁ బోలెన్ = ముక్తిస్థానమును వలెనే, బహుళతరము = అనంతము, ఐనయాకాశపథము = అయినయాకాశమార్గమును, దాఁటి, నాకభువనంబున్ = స్వర్గలోకమును, సొత్తెంచెన్ = ప్రవేశించెను (అనఁగా యోగీంద్రుఁడు భయంకరమైన సంసారసాగరమునుదాఁటి మోక్షస్థానమును జెందునట్లు నారదుఁడు బహుళతరమైనగగనమార్గమునుదాఁటి స్వర్గలోకముఁ బ్రవేశించెను. ఇట యాకాశమును సంసారముతోఁ బోల్చుటవలన సంసారమెట్లుదుర్లంఘ్యమో యట్లె యాకాశము దుర్లంఘ్యమైనదని తెలియవచ్చుచున్నది. అలం - ఉపమ.

వ. ఇట్లు నారదపర్వతులు నాకలోకంబునకుం జని సర్వగీర్వాణులు గొల్వం బేరోలగంబున్న సుపర్వాధీశ్వరు సన్నిధికి నేతెంచి యాశీర్వాదంబు చేసిరి. అతండును సుముఖోల్లాసంబున స

ముచితాసనవిన్యాసంబు మొదలయినయుపచారంబు లాచ
రించి యిష్టగోష్ఠీవినోదంబులఁ గొంతప్రొద్దు నడపి ప్రసంగ
వశంబున. 7

టీ. ఇట్లు, నారదపర్వతులు, నాకలోకంబునకుఁ=స్వర్గభువనంబునకు,చని, సర్వగీర్వాణులు = సమస్తమైన దేవతలు, కొల్వఁగ = సేవించుచుండఁగా, పేరోలగంబున్న = పెద్దసభనున్న, సుపర్వాధీశ్వరుసన్నిధికిఁ = దేవేంద్రుని సన్నిధికి, ఏతెంచి=వచ్చి, ఆశీర్వాదంబుఁ = ఆశీర్వచనంబులను, చేసిరి, అతండును=ఆదేవేంద్రుఁడును, సుముఖోల్లాసమునఁ=ముఖవికాసముచే, సముచితాసనవిన్యాసంబు-సముచిత = తగిన, ఆసనవిన్యాసము = ఆసనములనిచ్చుట మొదలయిన యుపచారంబులు, ఆచరించి = చేసి, ఇష్టగోష్ఠీవినోదంబునఁ = ఇష్టమువచ్చినటులు ప్రసంగించుట యనెడు వేడుకయందు, కొంతప్రొద్దు=కొంతకాలము,నడపి (అనఁగాఁ గొంతకాలమునకు నిష్టప్రసంగమును చేసియనుట) ప్రసంగవశంబున=పైపద్యముతోనన్వయము.

తే. అనఘ జగములఁ గల్గువృత్తాంత మెల్లఁ
దెలియఁగా నీకుఁ గరతలామలక మగును
గారణం బేమి నడిమిలోకమునుండి
నరపతులు రారు మునువోలె నాకమునకు. 8

టీ. అనఘ=పాపరహిత, జగములఁ =లోకములయందు, కల్గువృత్తాంతము =కలయట్టిసంగతులు, ఎల్లఁ =అన్నియు, తెలియఁగాఁ = తెలిసికొనుట, నీకు, కరతలామలకము, అగును=అఱచేతిలోని యుసిరికకాయవంటిది యగు, నరపతులు=రాజులు,మునువోలెఁ =పూర్వమువలెనే, నడిమిలోకమునుండి=భూలోకమునుండి, నాకమునకుఁ =స్వర్గలోకమునకు, రారు=రాకున్నారు, కారణంబేమి=రాకుండుటకు కారణమేమి?

తా. ఓనారదా ! లోకములోని వృత్తాంతములన్నియుఁ దెలిసికొనుట నీకు నఱచేతిలోని యుసిరికకాయవలె సులభమయినది కదా! రాజులు పూర్వము

వలె భూలోకమునుండి నాలోకమునకు రాకున్నారు. ఆకారణము తెలియఁ జేయుము.

క. రా రిపు డిచ్చోటికి నసి
ధారామార్గమున ధరణిధవు లెవ్వారుర్
నారద! నృపవంశంబున
వీరకరీరంబు లుద్భవింపవె ధరణిన్. 9

టీ. నారద ! ధరణిధవు లెవ్వారుర్ = ఏరాజులును, అసిధారామార్గమునర్=కత్తివాదరయొక్క దారిచే (అనఁగా యుద్ధములయందు నాయుధఘాతములచే ప్రాణములు విడిచి యనియర్థము) ఇచ్చోటికిర్=ఈలోకమునకు, ఇపుడు,రారు=రాకున్నారు,ధరణిర్=భూలోకమందు, నృపవంశంబునర్=రాజులయొక్క వంశమనెడు వెదురుపొదయందు, "ని॥ వంశో వేణౌకులేవర్గే" అనియెడు విశ్వకోశమున వంశశబ్దమున కుభయార్థములున్నవి. వీరకరీరంబులు=వీరులనెడు వెదురుబోదులు, ఉద్భవింపవె=కలుగలేదా, ఈపద్యమందు నాల్గవపాదమున వీరశరీరంబులనెడు పాఠము వ్రాఁతప్రతులలోను ముద్రితగ్రంథములలోను వాడఁబడుచున్నది కాని యీపాఠము గ్రంథకర్తృసమ్మతమైనది కాదు. ఏమన, సంస్కృతనైషధమున శ్లో॥ ప్రాగివప్రసువతే నృపవంశాః కిన్ను సంప్రతి నవీరకరీరాః॥అని యుండుటవలన నిటఁగూడ వీరకరీరంబులని పఠించుటయే కవి సమ్మతము. అప్పుడు వంశపదమునకుఁ దగినసార్థక్యము సమకూడును.

తా. ఓనారదా! లోకములో వీరులు యుద్ధములందు నాయుధములచే హతులై నాలోకమునకు వచ్చుచుందురు. ఇపు డట్లు వచ్చుటలేదు. యుద్ధప్రియులును వీరులు నగురాజులు నృపకులములందు జనింపలేదా? జనించినచో నేలరాకుందురు?

ఉ. ఏలొకో మాగృహంబునకు నిప్పుడురారు మునీంద్ర! భద్రశుండాలసమానులైన నరనాథతనూజులు మోముఁ దమ్ములర్

వాలికపోటుగంట్లు చెలువంబుగ విప్పగుపేరురంబులం
గ్రాలఁగ లీలమై దివిజకాంతలు వైచినపుష్పమాలికల్. 10

టీ. మునీంద్ర=నారదా! భద్రశుండాలసమానులు=భద్రజాతియేనుఁగులతో సమానులు, ఐన నరనాథతనూజులు = ఐనట్టిరాకుమారులు, మోముదమ్ములన్ = ముఖపద్మములందు, వాలికపోటుగంట్లు=గొప్పయుద్ధములయందుఁ గత్తిదెబ్బలవలనఁ గలిగినగాయములు, చెలువంబుగన్=అందమగుచుండఁగా, విప్పగుపేరురంబులన్=విరివియైన పెద్దవక్షస్థలములయందు, దివిజకాంతలు=దేవకాంతలు,లీలమై=విలాసముచేత, వైచినపుష్పమాలికల్=వేసినటువంటిపూలదండలు, గ్రాలన్, కన్=ప్రకాశింపఁగా, ఇప్పుడు, మాగృహంబునకున్=మామందిరమునకు, అనఁగా స్వర్గలోకమున కనుట -. ఏలొకో రారు=ఎందుచేతనో రారు, కారణము తెలిసినచోఁ దెలియఁ బలుకుము.

తా. ఓ నారదా ! మదపుటేనుఁగులతో సమానులైన రాజకుమారులు ఘోరమగు యుద్ధములయందుఁ దమపరాక్రమము వెల్లడియగునట్లు పోరాడి నిహతులై వారిపరాక్రమమునకు మెచ్చికొని దేవతాకాంత లర్పించినపుష్పదామము లురములందుఁ బ్రకాశించుచుండఁగా మాస్వర్గలోకమునకు రాలేదు. రానందులకుఁ గారణము తెలియదు. నీవెఱిఁగినఁ దెలియఁజెప్పుము.

చ. అతినిశితాసిధార సమరాంగణభూములఁ ద్రెస్సి శోణిత
స్రుతిఁ గడుఁజుల్కనైయెగసి సూర్యపథంబున నేఁగుదెంచుచో
గతిఁగయికొంద్రులాఘవముగాంతురుమాభువనంబునందుఁదా
రతిథిసమర్చనాప్రభవమైనగురుత్వము పార్థివోత్తముల్.11

టీ. పార్థివోత్తముల్=రాజశ్రేష్ఠులు, అతినిశితాసిధారన్=మిక్కిలి వాఁడియైన కత్తివాదరచే, సమరాంగణభూములన్=యుద్ధభూములందు, త్రెస్సి=తునిఁగినవారై, శోణితస్రుతిన్=రక్తము స్రవించుటచే;అనఁగా రక్తమంతయు పోవుటచేననుట, కడున్=మిక్కిలి,చుల్కనై=తేలికగలవారలయి, సూర్యపథంబునన్=సూర్యమార్గముచే, ఏఁగుదెంచుచోన్=మాలోకమునకు వచ్చునపుడు,

గతిః=గమనమునందు, లాఘవమ్మః=చుల్కఁదనమును, కైకొంద్రు=స్వీకరింతురు, వారు=ఆరాజకుమారులనుట, మాభువనంబునందుఁ=మాలోకమునందు, అతిథిసమర్చనాప్రభవము=అతిథిసత్కారములవలనఁ గలిగినది, ఐనగురుత్వము=ఐనట్టి దుర్భరత్వమును, పూజ్యత్వముననియు నర్థము, కాంతురు=పొందుదురు, నడలచే లాఘవమును అతిథిసమర్చనచే గౌరవమును బొందుదురని యర్థము. ఇట లాఘవము గైకొన్నవారు గురుత్వము బొందుట యెట్లని విరోధము-గురుత్వశబ్దమునకు పూజ్యత్వమని యర్థముజెప్పినచో నాభాసమగును. కావున నిట అలం. విరోధాభాసము.

తా. నారదా! రాజకుమారులు యుద్ధములం దాయుధములచేఁ జచ్చి శరీరమందున్నరక్తమంతయు దొరుఁగుటచేఁ జుల్కఁదనము గలవారలై పైకెగసి సూర్యమార్గముచే నాలోకమునకు వచ్చునపుడు లఘుత్వముఁబొందినను నాలోకమందు పూజ్యత్వమునే పొందుచుందురు. ఇట్టిలాభ మున్నను రాకుండుటకుఁ గారణము తెలియదు.

క. అభిముఖులై యేలకో నా
  సభ కిప్పుడు రారు నృపతిసత్తము లనఘా!
  యభిశాప మొనర్పరుగా
  త్రిభువనసంస్తుత్య! నాదుదెస నరనాథుల్. 12

టీ. త్రిభువనసంస్తుత్య=మూఁడులోకములచేఁగొనియాడఁదగినవాఁడా!అనఘా=పాపరహితుఁడవైన యోనారదా! నృపతిసత్తములు=రాజశ్రేష్ఠులు, ఏలకొ=ఎందుచేతనో, నాసభకుఁ=నాకొలువుకూటమునకు, ఇప్పుడు, అభిముఖులై=ఎదురుముఖము గలవారై, రారు=రాకున్నారు. నరనాథుల్=రాజులు, నాదుదెసః=నావిషయమై, అభిశాపము=లేనిదోషముల నారోపించుట,ఒనర్పరుగా=చేసియుండరు కదా!

తా. నారదా! పూర్వమువలె నిప్పుడు నరనాథులు నాసభకు రాకున్నారు. ఆరాజులు నాయందు లేనిదోషముల నారోపించి "యింద్రలోకమునకుఁ

లోవుటయుచితముకాద''ని పరస్పరముబోధించికొని నాలోకమునకు విముఖులయియున్నారు. లేనిచో నాలోకమునకుఁ బూర్వమువలె నేల రారు?

చ. కొలకొలమంచు నుండు సితకోకనదప్రభవప్రసూత! నా
కొలువిది తొంటినాఁ డతిథికోటులసందడి; నిప్పుడెంతయుం
బలపలనయ్యె బంధుగులు పల్మరుఁ బైకొనిరాక యున్కినా
కలిమి నిజోదరైకభృతికార్యకదర్యతఁ జిన్నఁబోయెడున్. 13

టీ. సిత...ప్రసూత - సిత=తెల్లని, కోకనద=ఎఱ్ఱఁదామరనుండి, ప్రభవ=పుట్టినబ్రహ్మవలన, ప్రసూతా = పుట్టినవాఁడా! అనఁగా:- బ్రహ్మకుమారా! యనుట; ఇట సితకోకనదమని చెప్పుటచే నెఱ్ఱనిచాయచేతనుఁ దెల్లనిచాయచేతను బ్రకాశించెడు సామాన్యపుఁబద్మమని కవియభిప్రాయము. తొంటినాఁడు = పూర్వమందు, నాకొలువిది - ఈనాసభామందిరము, అతిథికోటులసందడిన్ =అతిథిసమూహములయొక్క సమ్మర్దముచే, కొలకొలమంచు= కలకలధ్వనిఁజేయుచు,ఉండున్ =ఉండునది,ఇప్పుడు=ఈసమయమందు, ఎంతయున్ =మిక్కిలి, బంధుగులు=అతిథులు, పైకొని=అతిశయించి,పల్మరున్ =మాటిమాటికిని, రాకయున్కిన్ =రాకుండుటచే, పలపలన్ +అయ్యెన్ =వెలితిపడినది, నాకలిమి=నాసంపద,నిజ...కదర్యతన్ -నిజోదర=నాపొట్టనుమాత్రమే,ఏక=ముఖ్యముగా,భృతి=పోషించుకొనుటయనెడు,కార్య=కార్యముయొక్క,కదర్యతన్ =కృపణత్వముచే,చిన్నఁబోయెడున్ =వెలవెలవోవుచున్నది; కదర్యుఁడనఁగా క్షుద్రుఁడు; వాఁడెట్టివాఁడన—శ్లో॥ "ఆత్మానంధర్మకృత్యంచ పుత్రదారాంశ్చ పీడయేత్। లోభాద్యఃపితరాభ్రాతౄన్ సకదర్య ఇతిస్మృతః" అనఁగా-నెవఁడు దారసుతాదులనుఁ దన్నునుఁ దలిదండ్రులను నన్నదమ్ములను ధర్మకార్యములను లోభత్వముచే బాధించుచున్నాఁడో వాఁడు కదర్యుఁ డని చెప్పఁబడును.

తా. ఓనారదా! పూర్వము నాసభ యతిథిసమూహములయొక్క సందడిచే నెంతయుఁ గలకలధ్వనితో నిండియుండెడిది. కాని యిప్పు డట్టియతిథికోటులు రాకపోవుటచే నాకొలువు పలుచఁబడి నిశ్శబ్దముగ నున్నది.మఱియు

సంపదగల్గుటకు ఫలము సర్వదా యతిథిపూజ యొనరించుటయేకదా? అట్టియతిథిపూజచేయక సంపదను నాపొట్టబోషించుకొనుటకు మాత్రమే యుపయోగపఱచుచున్నందున నాకలిమి నిష్ఫలమై వెలవెలబోవుచున్నది.

చ. వదలక పూర్వపుణ్యవిభవవ్యయహేతువు లౌట సంపదల్
మదిఁ దలఁపంగ నాపదలె మాన్యసుహృజ్జనబంధుకోటికిన్
హదనున మేలుసేఁత చతురాననసంభవ! శాస్త్రపద్ధతిం
దదుచిత మైనశాంతికవిధానము నిక్కమెఱుంగ వచ్చినన్.

టీ. చతురాననసంభవ = బ్రహ్మపుత్త్రుఁడవైననారదా! సంపదల్=ఐశ్వర్యములు, పూర్వ... హేతువులు - పూర్వపుణ్య = పూర్వజన్మపుణ్యమువలనఁ గలిగిన, విభవ=సంపదలను, వ్యయ=వ్యయింపఁజేయుటే, హేతువులు=కారణములుగాఁగలవి, అగుటన్ = అయియుండుటంజేసి, వదలక = విడువక, మదిన్=మనస్సునందు, తలఁపంగన్ = ఆలోచింపఁగా, ఆపదలే = విపత్తులే-అనఁగాఁ బూర్వపుణ్యములు సంపదలను గలిగించి నశించును, కావునఁ బూర్వపుణ్యనాశకరములగుటవలన నాసంపద లాపదలే యని చెప్పవచ్చు. హదనునన్=మంచికాలమునందు, మాన్యసుహృజ్జనబంధుకోటికిన్ - మాన్య=గౌరవార్హులైన, సుహృజ్జన=మిత్రజనమునకు, బంధుకోటికిన్=బంధుసమూహమునకు, మేలుసేఁత=సత్కారముచేయుట, నిక్కము, ఎఱుంగన్, వచ్చినన్ = నిజముగా నాలోచించినచో, శాస్త్రపద్ధతిన్=యథావిధిగా, తదుచితము-తత్= ఆసంపద్రూపములగునాపదలకు, ఉచితము=తగినది, ఐనశాంతికవిధానము= ఐనట్టియపాయపరిహారముఁజేసెడికృత్యము. అనఁగా నీజన్మమందలి సంపదలను గౌరవార్హుల గౌరవించుటయందును దానములందును వ్యయముచేసినచో నుత్తరజన్మమం దధికమగుసంపదలు గలుగు నని పండితులందురు. కావునఁ బూర్వపుణ్యనాశనకరము లగుటంజేసి యాపద్రూపములగు సంపదల నట్లు వినియోగించి యుత్తరజన్మమున కధికసంపద లార్జించుకొనుట యుక్తము. మఱియు, నష్టసుకృతముకంటె నిప్పు డధికమగుసుకృతము కలుగుచున్నది. కావుననదియేమంచిది.

తా. ఓనారదా! సంపదలు పూర్వపుణ్యములను వ్యయము చేయుటవలనఁ

గలుగుచుండుటంబట్టి మనమునం దాలోచింప నవి యాపదలేకాని సంపదలు కావు. అట్టిసంపద్రూపము లైనయాపదలకుఁ దగినశాంతి చేయుట తగినపాత్రలను జూచి యథావిధిగ దానము చేయుటయేగదా!

వ. కావున నఘమర్షణబుక్కులం బోలునీవాక్కుల మత్సంశయాఘుం బపనయింపు మని సహస్రాక్షుండు నిజచక్షుస్సహస్రంబు తనముఖంబున నిల్పి యూరకున్న నారదుండు పాకశాసనువినయపరిపాకంబునకు మనంబునం బరితోషంబు నొందుచు నిట్లనియె. 15

టీ. కావున, అఘమర్షణబుక్కులంబోలు=అఘమర్షణ మంత్రములనుఁ బోలిన నీవాక్కులచేత, మత్సంశయాఘుంబు = నాసందేహమనెడిపాపమును, అపనయింపుము=తొలఁగింపుము. అనఁగా - లోకములోఁ బాపనివృత్తికై ప్రాయశ్చిత్తము జేసికొనవలసివచ్చినప్పుడు "ఋతంచ సత్యంచ" యనెడుమంత్రముల చే నుదకముఁ జల్లుకొని పాపములు తొలంగించుకొనుట సుప్రసిద్ధము. కాన నఘమర్షణబుక్కులచేఁ బాపము తొలఁగించునట్లు నీవాక్యములచే నాసందియముల తొలంగింపు మని భావము. అని, సహస్రాక్షుండు వేగన్నులు గలవాఁడు అనఁగా-ఇంద్రుఁ డనుట, నిజచక్షుస్సహస్రంబు=తనవేగన్నులను, తనముఖంబునన్ = తనమోమునందు, నిలిపి, ఊరకున్నన్ =మిన్నకుండఁగా, నారదుండు, పాకశాసనునివినయపరిపాకంబునకున్ - పాకశాసనుని=దేవేంద్రునియొక్క, వినయపరిపాకంబునకున్ = వినయాతిశయమునకు, మనంబునన్, పరితోషంబున్ = ఆనందమును, ఒందుచున్ =పొందుచున్, ఇట్లనియెన్.

తే. అతిథిబాంధవసంభావనాభిలాష
గర్భ మగునీదువాక్యసందర్భమునకు
సంతసంబయ్యె సురరాజ! సాధు సాధు
సార్వకాలంబు నీవ యీజగము లేలు. 16

టీ. సురరాజ=దేవేంద్రా!, అతిథి...గర్భము-అతిథి= ఆపూఁటకువచ్చినవా

రనెడి,బాంధవ=చుట్టాలను, సంభావన=గౌరవించుట యనెడు, అభిలాష=కో రిక,గర్భము=గర్భమందు,గలది, అగునీదువాక్యసందర్భమునకున్ =ఐన నీవాక్య ములయొక్క సంబంధమునకు, సంతసంబయ్యె=సంతోషముకలిగెను. సాధుసా ధు=బాగుబాగు, ఈచెప్పుటచే నింద్రుఁడు త్రిలోకాధిపత్యము వహించియు న్నను గర్వమువిడిచి యతిథిబంధుసత్కారాభిలాషియై యున్నాఁ డనుటవ లన నింద్రునివినయసంపద వెల్లడియగుచున్నదని భావము. సార్వకాలంబు=ఎ ల్లకాలము, నీవ=నీవె, ఇజ్జగములన్ =ఈలోకములను,ఏలుము = పరిపాలింపుము.

తా. ఓదేవేంద్రా ! నీ యతిథిసత్కారముఁ జేయఁ గుతూహలపడుచుఁ బలికి నట్టి వాక్యములకు మిగుల సంతసించితిని. నీవంటివినయసంపన్నుండు మఱియొ కఁడుండఁడు. బాగుబాగు! నీవే యీలోకముల నెల్లకాలముఁ బరిపాలింపుము.

వ. నాకభువనంబునకు రాజలోకంబు భూలోకంబుననుండి రాకుం డుటకుం గారణంబు వినుము. 17

మ. ఒకరత్నంబు విదర్భదేశమునయందు దుద్భూతమై పార్థివ
ప్రకరంబుం భ్రమియించుచున్నయది సౌభాగ్యప్రభానిత్యల
క్ష్మికి సంకేతనివాస మై మదననిస్త్రింశంబు నా భీమక
న్యక నాఁగా దమయంతి నాఁగలుగుపర్యాయాభిధానంబులన్.

టీ. ఒకరత్నంబు=ఒకమాణిక్యము,అనఁగాఁ గన్యారత్నమనుట, విదర్భదేశ మునయందున్ =విదర్భయను పేరుగల దేశమునందు,ఉద్భూత మై=పుట్టినదై, సౌ భాగ్య ప్రభానిత్యలక్ష్మికిన్ - సౌభాగ్య=సౌందర్యముయొక్కయు,ప్రభా=కాంతి యొక్కయు, నిత్య=స్థిర మైన, లక్ష్మికి=సంపదకు, సంకేతనివాసమై=సంకేతగృహ మై,మదననిస్త్రింశంబు నాన్ =మన్మథునియొక్క ఖడ్గమనియు, భీమకన్యక నాన్ నాన్ =భీమరాజపుత్రిక యనియు,దమయంతి నాన్ =దమయంతియనియు, కలు గుపర్యాయాభిధానంబులన్ = కలిగినట్టి పర్యాయపదంబులచే, పార్థివప్రకరం బున్ =రాజసమూహమును, భ్రమియించుచున్నది=మోహింపఁజేయుచున్నది.

తా. ఓసురరాజా! ఒకకన్యారత్నము విదర్భదేశమునం దుద్భవించి యు

న్నది. అది కాంతిసౌందర్యసంపదలకు నివాసభూతమై మన్మథఖడ్గమనియు, భీమరాజకుమారిక యనియు, దమయంతియనియుఁ బర్యాయనామంబులచేఁ బిలువఁబడుచు సమస్తరాజసమూహమును మోహింపఁజేయుచున్నది.

తే. ప్రతిముహూర్తంబు మధురసౌభాగ్యరేఖ
యౌవనముతోడఁ బెరుఁగునాయలరుఁబోఁడి
ధరణియం దొక్కరాజనందనునిమీఁద
నిలిపెనఁట బయల్వోకుండ నెమ్మనంబు. 19

టీ. ప్రతిముహూర్తంబు=ప్రతిముహూర్తకాలములోను, మధుర సౌభాగ్యరేఖ=సౌందర్యరేఖ, యౌవనముతోడన్=జిన్నవయస్సుతో, పెరుఁగునాయలరుఁబోఁడి=వృద్ధిఁ జెందుచున్న యా దమయంతి, ధరణియందున్=భూమియందు, ఒక్క రాజనందనునిమీఁదన్=ఒక రాజకుమారునిపై, నెమ్మనంబున్=నిండైనమనస్సును, బయలువోకుండన్=బయటఁబడకుండ-లేక మఱియొకచోటికిఁ బోకుండ, నిలిపెనట=ప్రవేశింపఁ జేసినదట.

తా. ఆదమయంతి సౌందర్యాతిశయము కలదై దినదినప్రవర్ధమానయై లేఁ బ్రాయముఁగలదై తనమనస్సు నొరులకుఁ దెలియకుండ భూలోకమున కలంకారభూతుఁడైన యొకరాకొమారునియందుఁ జేర్చియున్నది.

వ. పురాకృతసంభవంబైనభాగ్యంబునకు దానకంబైనయమ్మా
నవేంద్రుం డెవ్వండొకో యని యడుగం దలంచెదేని. 20

టీ. పురాకృతసంభవంబైన భాగ్యమునకున్=పూర్వపుణ్యమువల్లఁ గలిగిన యదృష్టమునకు, తానకంబు=స్థానభూతుఁడు, ఐన యమ్మానవేంద్రుండు=ఐనట్టి యారాజు, ఎవ్వండొకో=ఎవఁడో యని, యడుగఁ దలంచెదేని, పైపద్యముతో నన్వయము.

తే. అడుగఁ బూఁచినమాట యేకొమెడకు నెక్కె
నంతనుండియు మగిడింపు కొమమరరాజ
ప్రశ్నమున కుద్గమునపరిశాంతి వలదు
తెలిసి యుత్తర మీ నాకు వలను లేమి. 21

టీ. అమరరాజ=దేవేంద్రా! అడుగక=అడుగుటకు,పూ౯చినమాట= ప్రయత్నించిన ప్రశ్న-అనఁగా నానరపాలకుమారుం డెవఁడనినమాట యని భావము. ఏ యెడకుక=ఎంతవఱకు,ఎక్కెక= వెళ్లెనో,అంతనుండియ=ఆస్థలమునుండియె,మగిడింపుము=మరల్చుకొనుము. ప్రశ్నమునకుక=ప్రశ్న చేయుటకు, తెలిసి=ఆయుదంతమునుఁ దెలిసికొని, ఉత్తరము=నీప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరము, ఈక=ఇచ్చుటకు, నాకు వలనులేమి=నాకు వలనుపడక పోవుటంబట్టి, ప్రశ్నమునకుక= అడుగుటకు, ఉద్గమన పరిశ్రాంతి=ప్రయత్నమువలనఁ గలిగిన యాయాసము, వలదు=వద్దు-నీవడిగినను బ్రత్యుత్తర మీఁలేను. అట్లుండ నీ కడుగుటవలనఁ బ్రయాసముతప్ప మఱియొకటిలేదు అని భావము.

తా. ఓయింద్రా! నీ వడుగఁదలంచినప్రశ్న మెంతవఱకు వెళ్లినదో యచ్చటనుండియె వెనుకకు మరలింపుము. నీ విట్లడుగుటవలనఁ బ్రయాసము దక్క లాభ మేమియు లేదు. ఏమన-నీప్రశ్నమునకు నేఁ బ్రత్యుత్తర మీయలేను అట్టి నిరుత్తరమైన ప్రశ్నమడిగి ప్రయాసపడుటకంటె మొదట మానుటేయుత్తమము.

వ. నీవు యోగీశ్వరుండవు. నీహృదయంబు పరమాణుదర్శనసమర్థంబు. మనంబులు నణుపరిమాణంబులు గావున నక్కాంతారత్నంబుమనం బెఱుంగవే? యని యడిగె దేని. 22

టీ. నీవు, యోగీశ్వరుండవు=యోగులకధిపతివి,నీహృదయంబు= నీమనస్సు, పరమాణుదర్శన సమర్థంబు-పరమాణు=పరమాణువును,దర్శన=చూచుటకు,సమర్థంబు=శక్తిగలది,మనంబులు=మనస్సులు, అణుపరిమాణంబులు=అణువంతపరిమాణముగలవి, మన స్సణుపరిమాణమనుటకుఁ బ్రమాణము. శ్లో॥ "అయౌగపద్యాజ్జ్ఞానానాం। తస్యాణుత్వ మిహోచ్యతే" అనఁగా:-చాక్షుషాదిజ్ఞానము లొక్కమారు సంభవించును గనుకను, నట్లు సంభవించుట యనుభవసిద్ధము కాదు గనుకను, మనస్సున కణుత్వ మంగీకరింపఁబడుచున్నది. యని యర్థము. అనఁగా—యోగులు పరమాణువులనే దర్శింపఁ గలిగినప్పు డణువంతపరిమాణముగల మనస్సునుఁ జూడలేవా? యనిభావము. కావున, అక్కాంతారత్నం

బు=ఆదమయంతియొక్క, మనంబు=మనస్సును, ఎఱుంగవే=తెలిసికొనలేవా? అని యడిగెదేని=అని యడిగినచో, నని వైపద్యముతో నన్వయము.

చ. అలయక యోగిబుద్ధిపరమాణువుఁగాంచినఁ గాంచుఁగాక, కే
వలము దదంతరస్థ మగువస్తువు గానఁగ నెట్లు నేర్చు న
న్నలినదళాయతేక్షణమనఃపరమాణువునందు హ్రీదరీ
నిలయహరీకృతుం డతఁడు నేరఁగవచ్చునె వానిఁ గానఁగాన్.

టీ. యోగిబుద్ధి=యోగీశ్వరునియొక్కబుద్ధి, అలయక =అలతఁజెందక, పరమాణువున్, కాంచినన్=చూచినచో, కాంచున్+కాక=చూచుఁగాక, కేవలము=ముఖ్యముగా, తదంతరస్థము=ఆపరమాణువు నడుమనున్నది, అగు వస్తువు=ఐనపదార్థమును, కానఁగన్ =చూచుటకు, ఎట్లు నేర్చు=ఎట్లుసమర్థమగును. అతఁడు=ఆరాజకుమారుఁడు, అన్నలిన...అందున్-అన్నలినదళాయతేక్షణ=పద్మదళమువలె విశాలమైన నేత్రములుగల యాదమయంతియొక్క, మనఃపరమాణువునందున్=మనస్సను పరమాణువునందు, లేక, పరమాణుసదృశంబగుమనస్సునందు, హ్రీదరీనిలయహరీకృతుండు - హ్రీ=సిగ్గనెడు, దరీనిలయ=పొదరింటికి, హరీకృతుండు=సింహమువంటివాఁడు, వానిన్=అట్టివానిని, కానఁగాన్=చూచుటకు, నేరఁగవచ్చునే=తరమగునా? అనఁగా-కాదనుట.

తా. ఇంద్రా! యోగులబుద్ధి పరమాణువును దర్శింప సమర్థమైనదే కాని పరమాణువుకంటె నల్పతరమై యందిమిడియున్న వస్తువునుఁ జూచుటకశక్తము కావున దమయంతియొక్క పరమాణుసదృశమైనమనస్సునం దిమిడి సిగ్గనెడి పొదరింటియందు నివసించియున్న రాజసింహు నెట్లు గాఁ జూడఁగలను?

వ. అన్నీలవేణి కుసుమబాణపరంపరాశరవ్యం బై నతనహృదయంబు విరహపరితాపపాండురంబు లైన యవయవంబులం బ్రకాశించుటం గనుంగొని గురుజనంబు తద్భావపరిజ్ఞానార్థంబు పంచాశత్కోటివిస్తీర్ణంబైన భూమండలంబున స్వయంవరమహోత్సవంబు చాటింపం బంచిన. 

టీ. అన్నీలవేణి = ఆదమయంతియొక్క, కుసుమబాణ...శరవ్యంబు-కుసుమబాణ=మన్మథునియొక్క, బాణపరంపరా = బాణసమూహమునకు, శరవ్యంబు=లక్ష్యంబు, ఐనతనహృదయంబు = ఐనట్టి తనమనస్సును, విరహాపరితాపపాండురములు - విరహ= వియోగమువలనఁ గలిగిన, పరితాప = సంతాపముచే, పాండురములు=తెల్లఁబడినవి. ఐనయవయవంబులన్ = ఐనట్టియంగములలో, ప్రకాశించుటన్ = ప్రకాశించుచుండుటను, గనుంగొని=చూచి, గురుజనంబు=జననీజనకులు, తద్భావపరిజ్ఞానార్థంబు=ఆమెయభిప్రాయమును వెలిసికొనుటకు, పంచాసత్కోటివిస్తీర్ణంబు = ఏఁబదికోట్లచే విస్తరింపఁబడినది, ఐనభూమండలమునన్ = ఐనట్టిభూప్రదేశమందు, స్వయంవరమహోత్సవంబున్ = స్వయంవరమనెడి గొప్పయుత్సవమును, చాటింపన్ = తెలియఁజేయుటకు,పంచినన్ =పంపినన్, యని పైపద్యముతో నన్వయము.

ఉ. అంగదఁ దత్స్వయంవరమహామహవైభవకేలిహూతికిన్
క్రంగునఘంటపైఁ గొడుపు క్రాలుట యెన్నఁడునాఁటనుండియున్
సంగరమున్ గరంబుగ మనంబున భావన సేయుదుర్ వధూ
మంగళకార్యనిష్ఠులయి మధ్యమలోకమునన్ మహీపతుల్.

టీ. మధ్యమలోకమునన్ =భూలోకమునందు, మహీపతుల్ =రాజులు, అంగదన్ =ఉత్సాహముచే, తత్...హూతికిన్, తత్ =ఆదమయంతియొక్క, స్వయంవర = స్వయంవరమనెడు, మహామహ = గొప్పదయిన, వైభవ = విభవముగల, కేలి= ఉత్సవమునిమిత్తము, హూతికిన్ =పిలుచుటకొఱకుఁగా, క్రంగునన్ =క్రంగుమని, ఘంటపైన్, కొడుపు=(ఘంటవాయించెడు సన్నని)కోయ్య, క్రాలుట = ఆడుట - అనఁగా వేడుట, ఎన్నఁడు = ఎప్పుడో, నాఁటనుండియున్ =అప్పటినుండియు, వధూమంగళకార్యనిష్ఠులై = దమయంతియొక్కశుభప్రదమైన కార్యమందాసక్తిగలవారై, సంగరమున్ = యుద్ధమును, గరంబుగన్ = విశేషముగా, మనంబునన్ = మనస్సునందు, భావనసేయుదురు = తలఁతురు.

తా. ఓయింద్రా! దమయంతీస్వయంవరమునిమిత్తము రాజులను బిలుచుట

కై ఘంట వాయించినదిమొదలు మధ్యమలోకవాసు లైనరాజులందఱు నాకా ర్యముంగూర్చిపోవ బయనమై యున్నవారగుటచే యుద్ధములను మనంబునం దు విషముగాఁ దలంతురు.

తే. అఖిలమోహిని యయినయయ్యెలరుఁబోఁడి
శైశవము వీడుకొన్నది సందుగాఁగ
ననుదినంబును రాజనందనులమీఁద
వేఁటలాడుచు నున్నాఁడు విషమశరుఁడు. 26

టీ. అఖిలమోహిని-అఖిల=సమస్తమును, మోహిని=మోహింపఁజేసెడిది, అ యిన యయ్యెలరుఁబోఁణి=అయినట్టి యాదమయంతి, శైశవమున్ =బాల్యమును, వీడుకొన్నది=విడిచిపెట్టినది, సందుగాఁగన్ =అవధిగా, (అనఁగా శైశవము విడి చినప్పటినుండియు ననియర్థము.) విషమశరుఁడు-విషమ=బేసియైన-అనఁగా ఐ దైన, శర=బాణములుగలవాఁడు-అనఁగా మన్మథుఁడనుట, అనుదినంబును=ప్రతిది నంబును, రాజనందనులమీఁదన్ =రాజకుమారులపై, వేఁటలాడుచున్ ఉన్నాఁడు =హింసించుచున్నాఁడు-అనఁగా దమయంతింజూచి సమస్తరాజబృందము మద నపీడిత మగుచున్నదని భావము.

తా. ఓదేవేంద్రా! సమస్తలోకమునకు మోహము పుట్టించెడు దమయంతికి యౌవన మావిర్భవించినదిమొదలు రాజకుమారులందఱామెను బెండ్లియాడుటకై ప్రయత్నించుచు మదనపీడితులై యున్నారు.

వ. అది కారణంబుగా రాజలోకం బీలోకంబునకు రాదు భూ మండలంబున భండనంబు లేకుండుటంజేసి నావిలోచనంబు లుపవసించి యున్నయవి యే నిప్పుడు వీనికి సుఖపారణంబుగా రణక్రీడాడంబరంబు రాకునులతో నీకు సంభవించునోకో యనునాస నిచ్చోటికిఁ జనుదెంచితి నని పలికిన. 27

టీ. అదికారణంబుగాన్ =ఆహేతువువలన, రాజలోకంబు= రాజసమూహ ము, ఈలోకంబునకున్ , రాదు=రాలేదు, భూమండలంబునన్ , భండనంబు =

యుద్ధము, లేకుండుటంజేసి=లేకపోవుటంబట్టి, నావిలోచనంబులు=నానేత్రములు, ఉపవసించి=ఉపవాసముచేసి, యున్నయవి, ఏను. ఇప్పుడు, వీనికిన్ =ఈ నేత్రములను,సుఖపారణంబుగాన్ =సుఖభోజనంబుగా, రణక్రీడాడంబరంబు - రణక్రీడ=యుద్ధక్రీడలయందలి, ఆడంబరంబు=అతిశయము, రాక్షసులతోన్, నీకు, సంభవించునో కో=సంభవించునేమో, అనునాసన్, ఇచ్చోటికిన్ =ఈ లోకమునకు, చనుదెంచితిన్ =వచ్చితిని, అనిపలికినన్ =అనిపలుకగా, పైపద్యముతో నన్వయము.

ఉ. అమ్మఘవంతుఁ డల్ల నగి యంబురుహాసన సూతి కిట్లనున్
సమ్మద మొప్పలేదు రణచర్చ దివంబున నాదునెయ్యపుం
దమ్ముఁడు కైటభాంతకుఁడు దక్షతఁ బెగ్గడయై సమస్తభా
రమ్ము వహింపఁగాఁ ద్రిదశరాజ్యము నెమ్మదిఁ జేయుచుండుదున్.

టీ. అమ్మఘవంతుఁడు=ఆదేవేంద్రుఁడు, అల్లన్ = మెల్లగా, నగి=నవ్వి,అంబురుహాసనసూతికిన్ =బ్రహ్మకుమారునికి (అనఁగా,నారదునికననుట), సమ్మదము ఒప్పన్ = సంతసము కలుగునట్లుగా, ఇట్లనున్= ఈరీతిగాఁబలుకును, దివంబునన్ =స్వర్గమునందు, రణచర్చ=యుద్ధసమాచారము, లేదు, నాదునెయ్యపుందమ్ముఁడు=నాముద్దుతమ్ముఁడు, కైటభాంతకుఁడు=కైటభాసురుని చంపినవాఁడు (అనఁగా విష్ణువనుట), పెగ్గడయై = మంత్రియై, దక్షతన్ =నేర్పుచే, సమస్తభారము=సమస్తమైనబరువు, వహింపఁగాన్ = వహించుచుండఁగా (అనఁగా సమస్తరాజకీయవ్యవహారములను జక్కఁబెట్టుచుండఁగా ననుట), త్రిదశరాజ్యమున్ = స్వర్గరాజ్యమును, నెమ్మదిన్ = నిశ్చింతతో, చేయుచుండుదున్ = పరిపాలించుచుందును.

తా. నారదుఁడు పలికినవాక్యములను దేవేంద్రుఁడు విని మందహాసముచేసి సల్లాపముతో నిట్లనియె. "ఓనారదా! స్వర్గమందు యుద్ధమన్న పేరేవినఁబడలేదు. నాతమ్ముఁడైన నారాయణుఁడు నాకుసహాయభూతుఁడై నేర్పుచే వ్యవహారములు చక్కఁబెట్టుచుండఁగా నిశ్చింతతో స్వర్గరాజ్యమును బరిపాలించుచున్నాను.

తే. సాక్షిమాత్రంబుగాఁ గరకపలమునందు

నెపుడు వజ్రాయుధంబు వహింతుఁగాని
యతనియాజ్ఞయ చాలు సంయమివరేణ్య !
త్రిదశలోకాధిరాజ్యంబు స్థిరము సేయ. 29

టీ. ఎప్పుడున్ = ఎల్లపుడు, వజ్రాయుధంబున్ = వజ్రాయుధమును, కరస్థలమునందున్ = చేతియందు, సాక్షిమాత్రంబుగాన్ = విలాసనిమిత్తము, వహింతును=ధరింతును, కాని, సంయమివరేణ్య = మునిశ్రేష్ఠ, త్రిదశలోకాధిరాజ్యంబు=స్వర్గలోకరాజ్యమును, తిరము సేయన్ = దృఢపఱుచుటకు, అతని యాజ్ఞయ=ఆవిష్ణువుయొక్క యానయే, చాలున్ =సరిపోవును.

తా. ఓమునీంద్రా! నే నెల్లపుడు చేతియందు వజ్రాయుధంబును విలాసమున కుమాత్రమే ధరించుచున్నానుగాని యుద్ధమునకై గాదు. స్వర్గలోకరాజ్యమును శత్రువులపాలఁ బడకుండఁ గాపాడుటకు నారాయణునియాజ్ఞయే చాలును నావజ్రాయుధముతో నేమిప్రయోజనము?

వ. అని పలికినం గలహభోజనుండు నిట్టూర్పు నిగిడించి యి ట్లనియె. 30

టీ. అనిపలికినన్ =అని యింద్రుఁడు పలుకఁగా, కలహభోజనుండు=యుద్ధమే ఆహారముగాఁగలవాఁడు(అనఁగా నారదుఁడనుట)నిట్టూర్పున్ =దీర్ఘశ్వాసమును, నిగిడించి=పుచ్చి, యిట్లనియెన్.

శా. పాతాళంబున నున్నయప్పుడుగడుం బ్రార్థింతుభూలోకమునం
జేతోవీథి ధరిత్రి నున్నపుడు గాంక్షింతున్ సురావాసమున్
దైతేయాంతక !యొక్కచోట నిలువం దాత్పర్య మిబ్బంగినా
చేతోయంబున లేకపోయెను సమిద్వీక్షాభిలాషంబునన్. 31

టీ. దైతేయాంతక =రాక్షసశత్రుఁడవైనయింద్రా!పాతాళంబునన్ =పాతాళలోకమునందు, ఉన్నయపుడు=ఉన్నసమయమందు, సమిద్వీక్షాభిలాషంబునన్ -సమిత్ =యుద్ధమును, వీక్షా=చూచుటయందలి, అభిలాషంబునన్ =కోరిక చే, చేతోవీథిన్ =మనస్సునందు, కడున్ =మిక్కిలి, భూలోకమున్ =భూ

లోకమును, ప్రార్థింతుర్ = కోరుచుందును, ధరిత్రిక్ = భూలోకమందు, ఉన్న పుడు = ఉన్నకాలమునందు, సురావాసమున్ = సురలకు నివాసస్థలమును, అనఁగా - స్వర్గలోకము ననుట, కాంక్షింతుర్ = కోరుచుందును. ఇబ్భంగిక్ = ఈరీతిగా, ఒక్కచోటర్ = ఒకస్థలమందును, నిలువర్ = నిల్చుటకును, తాత్పర్యము = ఆసక్తి, నాకు, ఏతో యంబునర్ = ఏరీతిచేసైనను, లేకపోయెను = కలిగినది కాదు.

తా. ఇంద్రా! యుద్ధములు చూడ వేడుకగలవాఁడనై సంతతంబును లోకంబులఁ దిరుగుచుఁ బాతాళమున నున్నపుడు భూలోకమునుఁ జూడ వేడుకపడుచు, నందున్నపుడు స్వర్గలోకమునుఁజూడ నభిలషించుచు ని ట్లొకచోటనైన నిలువక తిరుగుచున్నాను. కాని యెచ్చటను గలహంబు సంఘటిల్లదాయె.

వ. నిన్నుం గనుంగొంటి నారాక కిదియ లాభంబు. నన్ను వీడుకొల్పుము. మధ్యమలోకంబునకుం గ్రమ్మఱఁ బోయెద దమయంతీస్వయంవరోత్సవావసరంబున మాత్సర్యంబు వుట్టి జట్టిబిరుదులగురాచపుట్టువులు దమలోనం బ్రతిఘటించి నిల్చి శస్త్రాశస్త్రిం గదిసి మొత్తులాడిరేనిఁ జిత్తంబునం గుత్తుకబంటిగా సమరసంరంభంబు భుజియింతుంగదా యని పలికి సముచితప్రకారంబున నముచిసూదనుచేత ననుజ్ఞాతుండై పర్వతుండునుం దానును నరిగెఁ దదనంతరంబ. 32

టీ. నిన్నుక్, కనుంగొంటిన్ = చూచితిని, నారాకకున్ = నేనిచ్చటకు వచ్చుటకు, ఇదియ = నీదర్శనమే, లాభంబు = ఫలంబు, నన్ను, వీడుకొల్పుము = పంపుము. మధ్యమలోకంబునకున్ = భూలోకంబునకు, క్రమ్మఱన్ = తిరుగ, పోయెదన్, దమయంతీ స్వయంవరోత్సవావసరంబునన్ - దమయంతీ స్వయంవర = దమయంతియొక్క స్వయంవరమనెడు, ఉత్సవావసరంబునన్ = ఉత్సవసమయమునందు, మాత్సర్యంబు = అసూయ, పుట్టి = కలిగి, జట్టిబిరుదులు = పరాక్రమశాలులు, ఐనరాచపుట్టువులు = ఐనట్టిరాజకుమారులు, తమలోనన్, ప్రతిఘటించి = ఎదుర్కొని, నిలిచి, కదిసి = సమీపించి, శస్త్రాశస్త్రిన్ = ఒండొరులు శస్త్రంబులధరించి, మొత్తులాడిరేని = పోట్లాడినచో, చిత్తంబునన్, కుత్తుక

బంటిగా=కంఠపూర్తిగా, సమరసంరంభమును = యుద్ధసంరంభమును, భుజయింతుంగదా = భుజయింతును. అనిపలికి, సముచితప్రకారంబునన్ =తగినరీతిచే, నముచిసూదనుచే=దేవేంద్రునిచే, అనుజ్ఞాతుండై=సెలవు పొందినవాఁడై, పర్వతుండును, తానును, అరిగెన్ =పోయెను. తదనంతరంబ=పిమ్మట.

గీ. దేవమునిమాట లమృతంపుఁదేట లగుచు
నధికతర మైనయాహ్లాద మాచరింప
వేడ్కపడె నెమ్మనంబులో విబుధరాజు
భోజకన్యాస్వయంవరంబునకుఁ బోవ. 33

టీ. దేవమునిమాటలు = నారదమహామునిమాటలు, అమృతంపుతేటలు = నిర్మలమైన అమృతమువంటివి, అగుచున్, అధికతరము=మిక్కిలిగొప్పది, ఐన యాహ్లాదమున్ = ఐనసంతోషమును, ఆచరింపన్ = కలిగింపఁగా, విబుధరాజు=దేవేంద్రుఁడు, భోజకన్యాస్వయంవరంబునకున్ = దమయంతీస్వయంవరమునకు, పోవన్ = వెళ్లుటకు, మనములో = మనస్సునందు, వేడ్కపడెన్ = కుతూహలపడెను.

తా. నారదునివాక్యము లమృతతుల్యములై తనకు మిక్కిలి సంతోషమునుఁ గలిగించినందున దేవేంద్రుఁడు, దమయంతీస్వయంవరంబునకుఁ బోవ వేడుకపడెను.

మ. పవిసంగంబునఁ దాప మొందినశచీప్రాణేశు కెంగేలికిం
జివురుంగైదువుజోదు వైద్య ముపదేశించెన్ రహస్యంబుగా
నవనీహారపయోమిళన్మలయజక్షోదార్ద్రపర్యంతమై
యివతాళించువిదర్భరాజతనయాహృద్యస్తనద్వంద్వమున్.

టీ. పవిసంగంబునన్-పవి = వజ్రాయుధముయొక్క, సంగంబునన్ = సంబంధముచే, తాపము = సంతాపమును, ఒందిన··· కెంగేలికిన్ - ఒందిన= పొందినట్టి, శచీప్రాణేశు = దేవేంద్రునియొక్క, కెంగేలికిన్ = కెంపువలె యెఱ్ఱనైనచేతికి, చివురుంగైదువుజోదు = చిగురేఆయుధముగాఁగలవాఁడు, అనఁగా - మన్మథుఁడనుట. నవ...పర్యంతమై - నవ=నూతనమైన, నీహార =

మంచుసంబంధమైన, పయస్ = నీటితో, మిశత్ = కలిసిన, మలయజ=మంచిగంధముయొక్క, స్నాన = అభిషేకముచే, లేక, చిలుకుటచే, ఆర్ద్రి=తడిసిన. పర్యంతము+ఐ=ప్రక్కలుకలదై, ఇవతాళించు .. స్తనద్వంద్వముక్ - ఇవతాళించు = మిక్కిలిచల్లఁదనముఁగలిగియున్న,విదర్భరాజతనయా=దమయంతియొక్క, హృద్య = మనోహరమైన, స్తనద్వంద్వముక్ = స్తనయుగళమును, రహస్యంబుగాక్, వైద్యము=చికిత్సను,ఉపదేశించెక్ = తెలియఁబఱచెను-అనఁగా దమయంతినిఁ బెండ్లియాడఁ దలంపు పుట్టెనని యర్థము.

తా. వజ్రాయుధముయొక్క రాపిడివలనఁ గందినట్టి దేవేంద్రునియొక్క చేతితాపము పోవుటకు హిమజలమిళితమగు మంచిగందపుఁబూఁతచేఁ దడిసి మిక్కిలి చల్లఁదనముఁగలిగిన దమయంతియొక్క మనోహరమైన స్తనద్వయమును గ్రహించుటయే మందని మన్మథుఁడు రహస్యముగా నుపదేశించెను.

వ. అప్పుడు. 35

సీ. రంభవిస్రంభసం రంభంబు విగనాడె
మానరోషము పూనె మంజుఘోష
దళుకొత్తె మదిఁ దిలో త్తమకు నుత్తలపాటు
ప్రమ్లోచ ప్రమ్లానభావ మొందె
నూర్వశిసౌభాగ్యగర్వంబు పారిపోయె
హరిణి సంతాపాగ్నికరణి యయ్యె
వంతఁ బానుపుమీఁద వైచె మేను ఘృతాచి
మేనకసన్మాన మూనమయ్యె

తే. నచ్చరలు దక్కఁగలవారు నలసి సొలసి
ప్రాణముక్తియ యుక్తిగా ననుమతించి
రాత్మవల్లభుఁ డింద్రుండ యవనినాథ
తనయ వరియింప ధరకుఁ బోఁ దలఁచుటెఱిఁగి. 36

టీ. ఆత్మవల్లభుఁడు=మనోవల్లభుఁడైన, ఇంద్రుండు=దేవేంద్రుఁడు, అవను

వనినాథతనయన్ =ఆదమయంతిని, వరియింపన్ =వరించుటకు, ధరకున్ =భూమికి, పోఁదలంచుట=వెళ్లుట కిష్టపడుట, యెఱింగి=తెలిసికొని, రంభ=రంభ యనెడియచ్చర, విస్రంభసంరంభమును = దేవేంద్రునియందున్నవిశ్వాసాతిశయమును, దిగనాడెన్ =విడిచిపెట్టెను. అనఁగా- స్త్రీలు తమభర్తలన్య కాంతలఁ గోరుచున్నప్పు డది సహింపకఁ గ్రోధము వహించియుండుట స్వభావము. గావున దేవేంద్రుఁడు దమపై నున్నకూరిమిని విడిచి దమయంతినిఁ గోరినట్లు తెలిసికొని యతనిపైఁ బూర్వమందున్న విశ్వాసమును విడిచిపెట్టినదని భావము. మఱియు దమయంతి యని చెప్పక యవనినాథతనయ యనిచెప్పుటచే మర్త్యభామినియని తోఁచును గాన తమకంటె మర్త్యస్త్రీకి నాధిక్యము గలిగినదని యచ్చరలకుఁ జిన్నతనమును మచ్చరమును గలిగెనని తెలియఁదగినది. మంజుఘోష=మంజుఘోష యనునచ్చర, మానరోషమున్ = ప్రణయకోషమును, పూనెన్ = పొందెను. తిలోత్తమకున్ = తిలోత్తమ యనుదానికి, మదిన్ =మనంబున, ఉత్తలపాటు=తొట్రుపాటు, లేక మనోదుఃఖము, తళుకొత్తెన్ =ప్రకాశించెను-అనఁగా నధికమాయెననుట. ప్రమ్లోచ=ప్రమ్లోచ యను నచ్చర, ప్రమ్లానభావము=వెలవెలవోవుటను, ఒందెన్ =పొందెను. ఊర్వశి సౌభాగ్యగర్వంబు=ఊర్వశియొక్క సౌందర్యాతిశయము, పారివోయెన్ =నశించెను. అనఁగా లోకములలోఁ దనకంటె నధికసౌందర్యవంతురాలు లేదని తిరుగుచున్న ఊర్వశియొక్క గర్వ మంత నొందెను. హరిణి=హరిణియనునది, సంతాపాగ్నికిన్ =సంతాపమను నగ్నిహోత్రమునకు, అరణి = అగ్నిమంథన కాష్ఠము, ఆయెన్ =ఆయ్యెను. అనఁగా సంతాపంబునకు స్థానభూత మైనదనుట. ఘృతాచి=ఘృతాచియనునది. వంతన్ =దుఃఖముచే, మేను=శరీరమును, పాన్పుమీఁదన్ =శయ్యయందు, వైచెన్ =పడవైచెను-అనఁగా విచారముచేఁ బరుండెనని భావము. మేనకసన్మానము=మేనకయొక్క గౌరవము, ఊనమయ్యెన్ =తగ్గిపోయెను. తక్కుఁగల వారలు, అచ్చరలు=మిగిలిన దేవతాస్త్రీలు, అలసి=ఆయాసమును బొంది, సొలసి=మూర్ఛఁజెంది, ప్రాణముక్తియ=ప్రాణములు విడుచుటయే, యుక్తిగా= ఉపాయముగా, అనుమతించిరి=అంగీకరించిరి. ఈచెప్పుటచే దమయంతి దేవతాస్త్రీలకంటె నధికసౌందర్యవంతురాలనిఁ దెలియవచ్చుచున్నది.

తా. దేవతాస్త్రీలైన తమకు వల్లభుఁడైన దేవేంద్రుఁడే మానవకన్యక యగు దమయంతినిఁ దనంతఁ దానె వరింపఁబూని భూలోకంబునకుఁ బోవునని తెలిసి కొని పూర్వ మింద్రునిపై విశ్వాసమునుంచి విహరించురంభ యావిశ్వాసమును విడిచిపెట్టెను. మంజుఘోష ప్రణయకోపమును వహించెను. తిలోత్తమ దుఃఖ మునుఁ బొందెను. ప్రమ్లోచ తెలతెలపోయెను. ఊర్వశి తాను సౌందర్యవంతు రా లన్నగర్వము విడిచిపెట్టెను. హారిణి సంతాపమున కధీనురాలయ్యెను. ఘృ తాచి దుఃఖాతిశయముచే శయనించెను. మేనక తనగౌరవము నశించినదని దుఃఖించెను, తక్కఁగల యచ్చరలందఱు దుఃఖాతిశయముచే నలసి మూర్ఛిల్లి ప్రాణములను విడుచుటే యుపాయముగాఁ దలంచియుండిరి.

వ. ఇట్లు జంభారి విశ్వంభరాభువనంబునకుం బోవ సమకట్టి కట్టా యితం బయ్యె. అతనితోడంగూడఁ బావకపరేతరాజపాశపా ణులు పయనం బైరి. అప్పు డప్పురందరాదిబృందారకచతుష్ట యంబు మున్నాడి ప్రోడ లగువేల్పుఁజేడియలచేత దమయం తికిం గానుకలుగా నిగూఢప్రకారంబున మందారకుసుమ దామంబులు మొదలుగా దేవలోకంబునం గలవస్తువులు పంచిరి యనంతరంబ. 37

టీ. ఇట్లు, జంభారి = జంభాసురునిఁ జంపినవాఁడు-అనఁగా దేవేంద్రుఁడు, విశ్వంభరాభువనంబునకున్ = భూలోకమునకు, పోవన్, సమకట్టి = ప్రయత్నించి, కట్టాయితంబయ్యెన్ = సిద్ధపడెను. అతనితోడన్ = ఆదేవేంద్రునితోఁగూడ, పావక...పాణులు-పావక = అగ్నియు, పరేతరాజ = యముఁడు, పాశపాణులు = వరుణుఁడు, అనఁగా - వహ్నియమవరుణులని యర్థము, పయనంబయిరి = ప్రయాణమయిరి. అప్పుడు, అప్పురందరాదిబృందారకచతుష్టయంబు = దేవేంద్రుఁడు మొదలగు నలువురుదేవతలు, మున్నాడి = ముందుగా, ప్రోడలగు వేల్పుచేడియలచేతన్ = ప్రౌఢులైనదేవతాకాంతలచేత, దమయంతికిన్, కానుకలుగా = బహుమానములుగా, నిగూఢప్రకారంబునన్ = రహస్యముగా, మందారకుసుమదామము

లు = మందారపుష్పమాలికలు, మొదలుగాన్ = మొదలైన, దేవలోకంబునంగల వస్తువులు, పంచిరి= పంపిరి. అనంతరంబ=పిమ్మట. పైపద్యముతో నన్వయము.

శా. ఆదిక్పాలురు దివ్యకాంచనవిమానారూఢులై సమ్మదా
పాదివ్యోమతరంగిణీలహరికాపర్యంతవాతంబు ప్ర
స్వేదాంభఃపృషతంబులం గముపఁగా శీఘ్రంబయే తెంచిరా
హ్లాదంబొప్పవసుంధరాస్థలికి మర్త్యవ్రాతముల్ గొల్వఁగన్.

టీ. ఆదిక్పాలురు = అయింద్రాగ్నియమవరుణులు, దివ్యకాంచనవిమానారూఢులై=మనోహరమైన బంగారువిమానములపై నధిష్ఠించినవారై, సమ్మద... వాతంబు - సమ్మద=సంతోషమును, ఆపాది=కలిగించుచున్న, వ్యోమతరంగిణీ=గంగానదియొక్క, లహరికా = ప్రవాహములయొక్క, పర్యంత = ప్రాంతములనుండివచ్చు, వాతంబు=గాలి, ప్రస్వేదాంభఃపృషతంబులన్ = చెమటబిందువులను, కముపఁగాన్ = నశింపఁజేయుచుండఁగా,అమర్త్యవ్రాతముల్= దేవతాసమూహములు, కొల్వఁగన్ = సేవించుచుండఁగా, ఆహ్లాదంబు=సంతోషము, ఒప్పన్ = ఒప్పునట్లుగా, వసుంధరాస్థలికిన్ = భూమికి, శీఘ్రంబ= వేగముగానె, ఏతెంచిరి=వచ్చిరి.

తా. అట్లింద్రాదిదిక్పాలురు విమానముపై నధివసించి గంగానదినుండి వచ్చుచల్లని మెల్లగాడ్పులుచెమ్మటల నశింపఁజేయుచుండఁగా దేవతలు సేవించుచుండఁగా మిక్కిలి సంతోషముఁ జెంది భూలోకమునకు వేగముగా వచ్చిరి.

వ. ఇట్లు గగనంబు డిగ్గి యమరులు సజలజలధరధ్వానగంభీరంబై దూరంబున నుండి వీతెంచునొక్క మ్రోఁత యాలకించి యిది యేమిఘోషంబొకో యని యద్దిక్కుఁ గనుంగొనునప్పుడు నిస్వనశ్రుతిసహోపయాతం బైనరథంబునందు. 39

టీ. ఇట్లు, గగనంబు, డిగ్గి=ఆకాశమునుండి దిగివచ్చి, అమరులు=దేవతలు, సజల...గంభీరంబై-సజల= జలముతోఁగూడిన, జలధర = మేఘముయొక్క, —అనఁగా వర్షకాలమేఘముయొక్క, ధ్వాన=గర్జవలెనే, గంభీరం

బై=గొప్పదై, దూరంబుననుండి, వీతెంచునొక్క (మోఁత=వచ్చుచున్నయొక ధ్వని, ఆలకించి=విని, ఇది, ఏమిఘోషంబు+ఒకో=ఇదిఏమిచప్పుడోయని, అద్దిక్కు=ఆధ్వనివచ్చుచున్న దెసను, కనుంగొనునప్పుడు = చూచుచున్న సమయంబున, నిస్వనశ్రుతిసహోపయాతంబు - నిస్వన=ధ్వనియొక్క, శ్రుతి=వినికితో, సహోపయాతంబు = కూడివచ్చునది-అనఁగా రథధ్వని వినఁబడినకాలమందే రథముకూడ వచ్చియున్నదని భావము. ఈ చెప్పుటవలన రథముయొక్క వేగాతిశయము తెల్లమగుచున్నది. ఐనరథంబునందున్ = ఐనట్టిరథముపైని, అని పై పద్యముతో నన్వయము.

ఉ. కాంచిరి నిర్జరేశ్వరు లఖండితరూపవిలాససంపదన్
వంచితపంచబాణుఁ డగువాని సమంచితసారధీరతన్
గాంచనభూధరంబునకుఁ గాదిలినెచ్చెలి యైనవాని ని
ర్వంచితదానశక్తి సురరత్నముఁ బోలెడువాని నైషధున్. 40

టీ. నిర్జరేశ్వరులు = ఇంద్రాగ్నియమవరుణులు, అఖండితరూపవిలాససంపదన్ - అఖండిత=తక్కువగాని, రూప=సౌందర్యముయొక్కయు, విలాస=కాంతియొక్కయు, సంపదన్ = సమృద్ధిచే, వంచిత...అగువానిన్-వంచిత=జయింపఁబడిన, పంచబాణుఁడు=మన్మథుఁడుగలవాఁడు,అగువానిన్ = ఐనట్టివానిని, సమంచితసారధీరతన్ - సమంచిత = ఒప్పుచున్న, సార = నిగ్గయిన, ధీరతన్=ధైర్యగుణముచే, కాంచనభూధరంబునకున్ = బంగారుకొండకు, గాదిలినెచ్చెలి = నచ్చినస్నేహితుఁడు, ఐనవానిని=ఐనట్టివానిని, నిర్వంచితదానశక్తిన్ -నిర్వంచిత = కపటములేని, దానశక్తిన్ = దానమందున్నసామర్థ్యముచే, సురరత్నమున్ = చింతామణిని, పోలెడువానిన్ =అనుకరించువానిని, లేక సరియైనవానిని, నైషధున్=నలమహీధవుని, కాంచిరి=చూచిరి.

తా. ఇంద్రాది దిక్పాలురు మన్మథునితో సరియైనరూపసంపదఁ గలవాఁడును, బంగారుకొండతో సరియైన ధైర్యగుణముగలవాఁడును, చింతామణితో సదృశమైనదానగుణము గలవాఁడును నగునలమహారాజును జూచిరి.

వ. కాంచి వరుణుం డతనితరుణత్వంబునకు నిబిడం బగుజడభూయంబును లులాయధ్వజుం డతనిరూపధేయంబునకు ధూమ

లత్వంబును వైశ్వానరుం డతనియైశ్వర్యంబునకుం బరి
తాపంబును సుత్రాముం డతనికామనీయకంబునకుం జూపో
పమియును నిక్కంబుగా వహించి. 41

టీ. కాంచి=అట్లు నలునిఁజూచి, వరుణుండు=వరుణదేవుఁడు, అతనితరుణత్వమునకున్=అతని యౌవనమునకు, నిబిడంబగు=దట్టమైన, జడభూయంబును=జడత్వమును-లేక స్తంభాఖ్యసాత్త్వికభావమును,అనఁగా- తారుణ్యభూషితమైన నలునిరూపమునుజూచి వరుణుం డచ్చెరువడి స్తంభాకృతి నొందెననుట, వరుణుండు జలపతిగాన జడభూయమనఁగా లడల కభేదమునుబట్టి జలభూయమును అనఁగా ఉదకరూపత్వమును బొందినాడని భావము. లులాయధ్వజుండు=మహిషమే ధ్వజముగాఁగలవాఁడు - అనఁగా యముఁడు, అతని రూపధేయంబునకున్=ప్రశస్తమైన సౌందర్యంబునకు,శ్యామలత్వంబును=మిక్కిలి నల్లఁదనమును, అనఁగా యముఁడు నలునిసౌందర్యమును జూచి యచ్చెరువడి వైవర్ణ్యమును బొంది నల్లనివాఁడై కాలుఁడని యిప్పటికిని బిలువఁబడుచున్నాఁడని భావము. ఇట కవీశ్వరుండు యమునకు స్వభావసిద్ధమగు నల్లఁదనమును నలమహారాజు సౌందర్యముజూచి యచ్చెరువడి వైవర్ణ్యము నొందుటవలన నే కలిగినదని యూహించినాఁడు. వైశ్వానరుండు=అగ్నిహోత్రుఁడు, అతనియైశ్వర్యమునకున్, పరితాపంబును=సంతాపంబును, ఇటఁగవివరుండు వహ్నికి స్వాభావికధర్మమగు సంతాపమును నలుని నైశ్వర్యంబుజూచి సహింపలేక పోవుటచేఁ గలిగిన ట్లూహించె. సుత్రాముండు = దేవేంద్రుండు, అతని కామనీయకంబునకున్=అతనియొక్క కమనీయత్వమునకు,చూపోపమియున్=మచ్చరమును, వేయికన్నులకును ప్రేఁగగుటయని భావము, నిక్కంబుగాన్=నిజముగా,వహించి=దాలిచి,యని పైపద్యముతో నన్వయము.

మ. శ్రుతపూర్వం బగువిశ్వమోహనకళాశోభావిశేషంబు స
మ్మతినూహింపఁగఁ జాయనాఋటయుఁ బ్రేమంబాత్మలోఁగీలుకో
నితఁడే నైషధుఁ డంచు నొండొరులతో నేకాంతమొయ్యొయ్యనా
శతమన్యుప్రముఖామరుల్ మునుకుచుం జర్చించిరుత్కంఠతోన్.

టీ. శ్రుతపూర్వంబు=పూర్వమందు వినఁబడియున్నది, అగు...విశేషంబు-

అగు=అయిన, విశ్వ=ప్రపంచమునకు,మోహనకళాశోభా=మోహముపుట్టించెడు కాంతిసమృద్ధియొక్క,విశేషంబున్ =అతిశయమును,సమ్మతిన్ =మనస్సునందు, ఊహింపఁగన్ =ఆలోచింపఁగా,చాయవాఁటుటయున్ =సరిపోలుటంబట్టి, అనఁగా-అతనిసౌందర్యాతిశయము తాము పూర్వమువినియున్ననలమహారాజు సౌందర్యాతిశయమువలెనే యుండుటంబట్టి యనుట, ప్రేమంబు,ఆత్మలోన్ =మనస్సులో,కీలుకొన్ =తగులొ్కనుచుండ, అనఁగా-ప్రేమజనింపఁగా ననియర్థము, ఆశతమన్యుప్రముఖామరుల్= దేవేంద్రుఁడు మొదలుగాఁగలదేవతలు, ఉత్కంఠతోన్ =తహతహతో, మానుకుచున్ =ఆరాటపడుచు,ఇతఁడే=ఈరాజకుమారుఁడే,నైషధుఁడు=నలమహారాజు, అంచున్ =అనుచు, ఒండొరులతోన్ = ఒకరితోనొకరు, ఏకాంతము=రహస్యముగా,ఒయ్యొయ్యన్ = మెల్లమెల్లగా, చర్చించిరి = ప్రసంగించికొనిరి.

తా. అవచ్చుచున్నరాజకుమారునిసౌందర్యము పూర్వము తాము వినియున్ననలమహారాజుసౌందర్యమువలెనే యుండుటంబట్టి నలుఁడని నిశ్చయించుకొని యతనియందుఁ బ్రేమ జనించుచుండఁగా సంద్రాదిదేవతలు వేడుకపడుచు నితఁడే నలమహారా జని తమలోఁదాము రహస్యముగాఁ బ్రసంగించుకొనిరి.

వ ఇట్లు విమర్శించుచుండ. 43

తే. విమలతరదివ్యగగనయానముల మీఁద
ధరణిఁ గొలు వున్నయాదిగీశ్వరులఁ జూచి
యద్భుతాక్రాంతచిత్తుఁ డై యధిపసుతుఁడు
చేరఁ జను దెంచి యంతంతఁ దేరు డిగ్గె. 44

టీ. విమల...మీఁదన్ - విమలతర=మిక్కిలి నిర్మలములయిన, దివ్య=దేవతాసంబంధమైన, గగనయానములమీఁదన్ =ఆకాశవిమానములమీఁద,ధరణిన్ =భూమిపైని, కొలువున్న=సభ చేసియున్న, ఆదిగీశ్వరులన్ =ఆయష్టదిక్పాలురను, చూచి, అధిపసుతుఁడు=రాజకుమారుఁడు(నలుఁడనుట), అద్భుత+ఆక్రాంతచిత్తుఁడై= ఆశ్చర్యముచేఁ గ్రమ్ముకొనఁబడిన మనసుకలవాఁడై, అంతంతన్ = క్రమక్రమముగా, చేరన్ + చనుదెంచి = దగ్గఱగా వచ్చి, తేరున్ = రథమును, డిగ్గెన్ =దిగెను.

తా. మిక్కిలి ప్రకాశమానములైన యాకాశవిమానములపైని భూమికిమీఁదుగా సభచేసి యున్నయాయష్టదిక్పాలురను జూచి నలుఁ డాశ్చర్యమగ్నుఁడై వారల సమీపించి తేరు డిగెను.

వ. ఇవ్విధంబున రథంబు డిగ్గి మూర్తం బైనరామణీయకగుణాద్వయవాదంబునుం బోని యమ్మేదినీరమణుండు సుత్రామాది విబుధరాజచతుష్టయంబునకు నభివాదనం బాచరించి ప్రాంజలియై పార్శ్వంబున నిలిచి యుండె. అయ్యమృతాశను లతనిం జూచి దమయంతీనిరాశంబు లైనయాశయంబులతోఁ బరస్పరముఖావలోకనంబులు చేసిరి. అప్పుడు వంచనాకపటనాటక సూత్రధారుం డైనసునాసీరుం డాన్నృపకుమారున కిట్లనియె.

టీ. ఇవ్విధంబునన్ = ఈతీరున, రథంబు, డిగ్గి, మూర్తంబైన = మూర్తీభవించిన, రామణీయక = సౌందర్యమనెడు, గుణ = గుణమునకు, అద్వయ = ఒక్కటియేయనెడు, వాదంబునుంబోని = వాదంబువలెనున్న, లేక, రామణీయకగుణ = సౌందర్యగుణమునకు, అద్వయవాదంబునుబోని = అద్వైతవాదము వలెనున్న, అమ్మేదినీరమణుండు = ఆనలమహారాజు (అనఁగాఁ ద్రిలోకైకసౌందర్యవంతుఁడైన నలమహారాజనుట), సుత్రామా.. చతుష్టయంబునకున్ - సుత్రామాది = దేవేంద్రుఁడు లోనుగాఁగల, విబుధరాజచతుష్టయంబునకున్ = ఆనల్గురు సురరాజులకును, అభివందనము = నమస్కారము, ఆచరించి = చేసి, ప్రాంజలియై = కట్టఁబడిన చేతులుగలవాఁడై, పార్శ్వంబునన్ = ప్రక్కను, నిలిచియుండెన్, అయ్యమృతాశనులు = అమృతమే భోజనముగాఁగల వారు (ఆదేవతలనుట), అతనిన్ = ఆనలుని, చూచి, దమయంతీనిరాశంబులు = దమయంతియందాశలేనివి, ఐనయాశయంబులతోన్ = అయిన కోర్కులతో (అనఁగా నలుఁడు దమకంటె నధిక సౌందర్యవంతుఁడై యుండుటఁ జేసి దమయంతి నలునినే వరించుఁగాని తమ్ము వరింప దని నిరాశులై రనిభావము.) పరస్పరముఖావలోకనంబునన్ = ఒండొరులముఖములను చూచుకొనుటను, చేసిరి, అప్పుడు, [illegible] సూత్రధారుం [illegible] తోఁగూడిన,

కపట=కపటమనెడు, నాటక=నాటకమునకు, సూత్రధారుఁడు=మేళనాయకుఁడు (అనఁగానాటకమును సూత్రధారుఁడు నడిపించునటులు కపటమనెడు నాటకమును నడిపించుసూత్రధారునివంటివాఁడనుట) అయిన, అసునాసీరుఁడు =ఆదేవేంద్రుఁడు,అన్నృపకుమారునకున్ =అనలునితో,ఇట్లనియెన్ =ఇట్లుపలికెను.

సీ. అన్న! యెవ్వరివాఁడవయ్య సేమమె? నీకు
నైషధుం డనుబుద్ధి నాకుఁ బొడమె
గారాపుఁ జెలికాఁడు వీరసేనుఁడు మాకు
నాతని రేఖ నీయందుఁ దోఁచె
నేమి కార్యముఁ గోరి యెట పోవుచున్నాఁడ
వెపుడు నీచారిత్ర మేము విందు
మెఱుఁగుదో నీవు మ మ్మిందఱ లెస్సగా
నెఱుఁగకుండిన నేమి యెఱిఁగికొనుము

తే. దండపాణి యితం డనలుం డతండు
వరుణుఁ డితఁ డేను నిర్జరవల్లభుండఁ
బింశితార్థంబు విను మేల పెక్కుమాట
లర్థులై వచ్చితిమి మము నాదరింపు. 46

టీ. అన్న=ఓ సోదరుఁడా ! ఎవ్వరివాఁడవయ్య = ఎవరికుమారుఁడవయ్యా, నీకున్, సేమమె=కుశలమా! నాకున్, నైషధుండు=నలమహారాజు, అనుబుద్ధి= అనెడితలంపు, పొడమెన్ = పుట్టినది. అనఁగా-నిన్నుఁజూడ నలమహారాజనెడి బుద్ధిని గలిగించుచున్నావనుట, వీరసేనుఁడు = వీరసేనమహారాజు, అనఁగా నలునితండ్రియనుట, మాకున్, గారాపుఁజెలికాఁడు = ముద్దుస్నేహితుఁడు, ఆతని రేఖ= ఆతనిపోలిక, నీయందున్, తోఁచెన్ =కనఁబడెను. అనఁగా-తండ్రిగుణములు కుమారునియందుండుట సహజము గనుక వీరసేనునిగుణంబులు నీయం దుండుటంబట్టి నీవే నలమహారాజవని భావించుచున్నామనుట, ఏమికార్యమున్, కోరి=ఏకార్యము నపేక్షించి, ఎట పోవుచున్నాఁడవు=ఎక్కడికి పోవుచున్నాఁ

డవు, ఏము=మేము, ఎపుడున్ =ఎల్లపుడును, నీచారిత్రమున్ =నీప్రవర్తనమును, విందుము=వినుచుందుము. నీవు, మమ్మింతలన్ = మమ్మునందఱను, లెస్సగాన్ = బాగుగా, ఎఱుఁగుదు+ఓ = ఎఱుగుదువా? ఎఱుఁగక, ఉండినన్, ఏమి=ఎఱుఁగకపోయినఁబోనిమ్ము, ఎఱిఁగికొనుము=తెలిసికొనుము. ఇతఁడు, దండపాణి=దండము పాణియందుఁ గలవాఁడు,-అనఁగా యముఁడనుట, అతండు, అనలుండు=అగ్నిహోత్రుఁడు, ఇతఁడు, వరుణుండు=వరుణదేవుఁడు, ఏను=నేను, నిర్జరవల్లభుండన్ =దేవేంద్రుఁడను, పెక్కుమాటలు=చాలవాక్యములు, ఏల=ఎందుకు, పిండితార్థంబును = ఫలితార్థమును, వినుము = ఆలకింపుము, అర్థులైవచ్చితిమి=యాచకులమైవచ్చితిమి, మమున్, ఆదరింపు=ప్రేమింపుము.

తా. అయ్యా! నీవెవరికుమారుండవు? నీకుఁగుశలమా; నాకు స్నేహితుఁడైన వీరసేనమహారాజుపోలిక నీయందుండుటచే నీవు నలమహారాజవని యెంచుకొనుచున్నవాఁడను. ఏకార్యముఁగూర్చి యెచ్చటికిఁబోవుచున్నావు? నీచారిత్రము నెల్లప్పుడును వినుచునేయుందుము. నీవు మమ్మందఱనెఱుఁగుదువా? ఎఱుఁగకుండినఁ జెప్పెదవినుము. ఇతఁడు యముఁడు, ఇతఁడగ్నిహోత్రుఁడు, ఇతఁడు వరుణదేవుఁడు, నేను దేవేంద్రుఁడను, మాకోర్కివినుము. మేము యాచకులమై నీయొద్దకు వచ్చితిమి. మమ్ముఁ బ్రేమింపుము.

వ. ముహూర్తమాత్రంబున మార్గఖేదనం బపనయించి కార్యనివే
దనం బొనర్చెద మని పలికి యభిధాకుశలుం డైనయవ్విబుధ
నాయకుం డూరకుండిన. 47

టీ. ముహూర్తమాత్రంబునన్ = రెండుగడియలకాలములోనే, మార్గఖేదనంబు=మార్గాయాసమును, అపనయించి=తొలఁగించి, కార్యనివేదనంబు=కార్యముయొక్క తెలుపుటను, ఒనర్చెదము=చేసెదము. అని పలికి, అభిధాకుశలుండు=మాటలనేర్పరి, ఐనయవ్విబుధనాయకుండు = ఐనట్టియా దేవేంద్రుండు, ఊరకుండినన్ = మిన్నకుండఁగా, అని పైపద్యముతో నన్వయము.

తే. అర్థి యను పేరు చెవి సోఁకినంతమాత్ర
జాదుకోఁ బులకించె నైజ్జనవిభుండు

ప్రావృ షేణ్యపయోధరక్రభవ మైన
గాలి ననిచిననీపవృక్షంబపోలె. 48

టీ. అజ్జనవిభుండు=ఆనలమహారాజు, అర్థియనుపేరు = "అర్థి" యనెడు నామము, చెవిసోఁకినంతమాత్ర = చెవినిబడినంతమాత్రమున నే, ప్రావృషేణ్య= వర్షకాలసంబంధమైన, పయోధర = మేఘము, ప్రభవ= కారణముఁగాఁగలది, ఐనగాలిన్ =ఐనట్టిగాలిచే, ననిచిననీపవృక్షంబువోలెన్ - ననిచిన=పుష్పించిన, నీపవృక్షంబపోలెన్ = కడిమిచెట్టువలెనే, జాదుకోన్ =దట్టముగా, పులకించెన్ = గగుర్పాటుచెందెను.

తా. వర్షకాలమేఘములవలనఁ గలిగినగాలిచేఁ బుష్పించినకడిమిచెట్టువలెనే నలమహారాజు "అర్థి" యనునామమును విన్నంతమాత్రముననే సంతోషాతిశయముచే సాంద్రముగాఁ బులకితమైనశరీరము గలవాఁడాయెను.

వ. ఇట్లు సంతసిల్లి భూవల్లభుం డంతర్గతంబున. 49

టీ. ఇట్లు, సంతసిల్లి = సంతోషించి, భూవల్లభుండు = నలమహారాజు, అంతర్గతంబునన్ = మనస్సునందు, అని పైపద్యముతో నన్వయము.

క. త్రిదశులకును దుర్లభమై
మదధీనం బయినయట్టి మంచిపదార్థం
బది యెట్టిదొక్కొ? వేగమ
యొదవునొకో? యడిగినపుడ యుచితంబునకున్. 50

టీ. త్రిదశులకును=దేవతలకుఁ గూడ,దుర్లభమై=పొందశక్యముకానిదై,మదధీనంబు అయినట్టి=నాకు వశమయియుండినట్టి,మంచిపదార్థము=శ్రేష్ఠమైనవస్తువు, అదియెట్టిదొక్కొ=అదియేదియొ, వేగమ=శీఘ్రముగా,అడిగినపుడ=కోరినపుడే, ఉచితంబునకున్ = అర్హాకృత్యమునకు, అనఁగా నిట్టిసత్కార్యమునకు వినియోగింపననుట, ఒదవునొకో=లభించునో(అనఁగా లభించునో లభింపదో యనుట).

తా. అయ్యారె! దేవతలకుఁగూడ దుర్లభమై మనుష్యమాత్రుఁడనైన నాకు వశమైన యామంచిపదార్థం బేదై యుండునో? వా రడిగినయాపదార్థము నాకు వేగముగా లభించునో లభింపదో?

తే. అడిగినప్పుడ యిత్తు నేఁ బ్రాణమైన
నర్థిమాత్రంబునకు వేడ్కఁ నతిశయిల్ల
నట్టియే నింద్రుఁడంతవాఁ డాసపడిన
నకట యేమిచ్చి పరితోష మందువాఁడ. 51

టీ. నేను, అడిగినప్పుడ= అడిగినతత్క్షణమే, వేడ్కన్=కుతూహలము, అతిశయిల్లన్=అతిశయించునట్లుగా, అర్థిమాత్రంబునకున్=సాధారణయాచకునకుఁ గూడ,ప్రాణమైనన్,ఇత్తును,అట్టియేను=అటువంటిదాతనైనయేను, ఇంద్రుఁడంతవాఁడు=ఇంద్రుఁడంత గొప్పవాఁడు,ఆసపడినన్=అపేక్షింపఁగా, ఏమిచ్చి=ఏవస్తువునిచ్చి, పరితోషము=సంతసము,అందువాఁడన్=పొందువాఁడను. అకట=అయ్యయో ! అనఁగాఁ బ్రాణముకంటెఁ బ్రియమును నధికమును నగువస్తువు లోకమునలేదు. సామాన్యు లడిగినప్పుడే యాప్రాణమునైన నిచ్చుచుందును. ఇప్పు డింద్రుండంతవాఁడు వచ్చినప్పుడు ప్రాణముకంటె నధికప్రియమగువస్తువు నీవలదా? అట్టివస్తువు నెట్లుసంపాదించి యింద్రునకిచ్చి సంతోషింపఁగలను?

తా. సామాన్యులైన యాచకులు నాదగ్గఱ కేతెంచి యాచించునపుడు వారికి నాప్రాణమైన నర్పించుచుందును. ఆటువంటిదాతనైన నేను త్రిలోకాధినాథుఁడువచ్చి యాచించునపు డేవస్తు విచ్చువాఁడను; అకటా ! ఎట్లు సంతోషము పొందువాఁడను

క. ప్రాణంబుకంటె భీమ
క్షోణిపతితనూజమీఁదఁ గూర్మి గలదు గీ
ర్వాణాధీశ్వరుఁ డయ్యలి
వేణిన్ మదిఁ గోరెనేని వేగమ యిత్తున్. 52

టీ. ప్రాణంబుకంటెన్ = జీవముకంటె, భీమక్షోణిపతితనూజమీఁదన్= భీమరాజుకూఁతురైన దమయంతిపైని, కూర్మి=అనురాగము, కలదు. గీర్వాణాధీశ్వరుఁడు = దేవతలకు రాజగు నింద్రుఁడు, అయ్యలివేణిన్ = తుమ్మెదలవంటి జడగలయాదమయంతిని, మదిన్ = మనసునందు, కోరెనేని = అపేక్షించినచో, వేగమ=శీఘ్రముగా, ఇత్తును.

తా. నాకుఁ బ్రాణంబులమీఁదనున్న ప్రేమకంటె దమయంతియందున్న య నురాగము మెండు. ఒకవేళ దేవేంద్రుఁ డాదమయంతినే కోరెనేని యామెను శీఘ్రముగా నిత్తును.

తే. ఎద్దియొకో వీరియభిలాష యె మెఱుఁగుభంగి
నడుగకయ మున్న యీవి భాగ్యంబుగాదె
వాంఛ నెఱిఁగియు నర్థార్థివచనదైన్య
మాత్మ సైరింపఁ జాలువాఁ డధమదాత. 53

టీ. వీరియభిలాషము=యాచకులైన వీరియొక్క కోర్కి, ఎఱుఁగుభంగి= తెలి సికొనెడిరీతి, ఎద్దియొకో = ఏదైయుండునో -అనఁగా వీరియభిలాష మెట్లుగాఁ దెలిసికోఁగలనో తెలియరాకున్నది. అడుగక అ+మున్న+అ=యాచించుటకు ముందే, యీవి=దానమిచ్చుట, భాగ్యంబు గాదె=అదృష్టముకాదా? అనఁగా- అగుననుట, వాంఛ=యాచకునియొక్క కోర్కి, ఎఱిఁగియున్ =తెలిసికొనియు, అర్థార్థివచనదైన్యము = ధనముఁగోరువానియొక్క వాక్యములందున్న దుఃఖము, లేక దీనత్వము, ఆత్మన్ =మనమునందు, సైరింపన్ =సైఁచుటకు, చాలువాఁ డు=సమర్థుఁడైనవాఁడు, అధమదాత=అధముఁడైనదాత, లేక దాతలలో నీచుఁ డని యనిపించుకొనును.

తా. లోకములో యాచించువారియభిలాషను ముందుగాఁ దెలిసికొనుటయు, నట్లు తెలిసికొని యాచకుఁడు యాచించుటకు ముందే యభిలాష నెఱవేర్చుటయు నదృష్టమేకదా! అట్లుగాక యాచకునియభిలాష మెఱింగియు వానిదీనాలాపము లు విన సహించి వాఁ డడుగునంతదనుక విళంబముఁజేయువాఁ డధమదాత యని యనిపించుకొనును.

చ. * కటికితనంబు బూని చటుకాకువిడంబముఁ గూర్చి లజ్జ సం
కటపడఁ జేసి యర్థిఁ గడుఁగాఱియపెట్టినపాతకంబు న
క్కటి తలఁగంగఁజాలునొకొ కాలవిలంబము నాచరించి పి
మ్మటఁ దదభీప్సితార్థము సమర్పణసేయుప్రదాతయెమ్మెయిన్.

---

* కటుకృదనంబు మాని.

టీ. కటికితనంబు = కాఠిన్యము, పూని=వహించి, చటుకాకువిడంబముల్ - చటు=చటూక్తుల చేతను, కాకు=పామరోక్తుల చేతను, విడంబనముల్ = పరిహాసమును, కూర్చి=కలిగించి, అనఁగా హేళనచేసియనుట, లజ్జన్=సిగ్గుచే, సంకటపడన్, చేసి=బాధపొందునట్లుచేసి, అనఁగా మాటిమాటికి నడిగించుకొనుచు నందులకుఁ బ్రత్యుత్తరములీయక కాఠిన్యము పూనియుండి యాచకునకు సిగ్గుగలిగించుచు, నట్టిసిగ్గుచే నతనికి బాధగలిగించియనుట, అర్థిన్=యాచకుని, కడున్=మిక్కిలి, కాఁకయిపెట్టినపాలకంబు = యాచకునికి మిగుల బాధగలిగించుట వలన జనించినపాపము, కాలవిలంబముల్ = ఆలస్యమును, ఆచరించి = చేసి, పిమ్మటన్ = తరువాత, తదభీప్సితార్థము = ఆ యాచకుని కిష్టమయినకోర్కె, సమర్పణము = ఇచ్చుటను, చేయుప్రదాత = చేసెడియట్టిదాత, అనఁగా యాచకునికోర్కె నెఱవేర్చెడుదాతయనుట, ఎమ్మెయిన్ = ఏవిధముచేతనైనను, అక్కటా!=అయ్యయ్యో! తలఁగంగన్ +చాలున్ + ఒకో=నివారణ చేసికొనఁగలఁడా? అనఁగానట్టిపాపమును బోఁగొట్టుకొనుటకుఁ బ్రాయశ్చిత్తాదులయిన లేనికారణమునఁ బాపము తొలఁగించుకోలేఁడనుట.

తా. మనస్సునఁ గాఠిన్యము వహించి మిథ్యాస్తోత్రములచేతను బామరోక్తులచేతను యాచకుని బరిహసించి మాటిమాటి కడిగించుకొనుచు నతనికి సిగ్గుగలిగించి బాధపెట్టుచుండినందువలనఁ గలిగిన పాపమును దాత, తరువాత నాయాచకునిసంపూర్ణ మనోరథుంజేసినను నెన్నికష్టములఁ జెందినను దొలఁగించుకొనలేఁడు.

చ. కమలము పంకసంకరవిగర్హిత మర్హముగాదు నిల్వఁగాఁ
గమలకు నంచు నెంతయును గౌతుక మింపెసలార నర్థిదో
కమలము నిర్మలంబు నతిగాఢవివేకులు తద్వ్యహారస
ద్మముగ నొనర్తు రప్రతిమదానకళాకలనాధురీణతన్. 55

టీ. కమలకున్ = లక్ష్మీదేవికి, పంకసంకరవిగర్హితము - పంక = బురుద యొక్క, సంకర=సంబంధముచే, విగర్హితము=నిందింపఁబడెడు, కమలము= పద్మము, నిల్వఁగా=నిల్చుటకు, అర్హముగాదు=తగదు, అంచున్=అనిపలుకుచు, ఎంతయున్=మిక్కిలి, కౌతుకము=వేడుక, ఇంపు, ఎసలారన్=వృద్ధిఁజెందున

ట్లుగా, నిర్మలంబు=పంకరహితమైన, అర్థిదోఃకమలము = యాచకునియొక్క కరపద్మమును, అతిగాఢవివేకులు=మిక్కిలి గొప్పబుద్ధిఁగలవారు, అప్రతిమ... ధురీణతన్ - అప్రతిమ=సాటిలేని దానకళా=దానచాతుర్యమనెడు, కలనా= కార్యముయొక్క, ధురీణతన్=భారవాహకత్వముచే, అనఁగా - విశేషముగా దానముచేయుటచేననుట, తద్విహారసద్మంబుగన్ - తత్=ఆలక్ష్మీదేవికి, విహార సద్మముగన్=క్రీడాభవనముగా, ఒనర్తురు=చేయుదురు. అనఁగా-బుద్ధిమంతులు తమసంపదలను కేవలము యాచకులనిమిత్తమే వ్యయముచేయుదురని యర్థము.

తా. బుద్ధిమంతులు, బురుదచే మిళితమైనపద్మము లక్ష్మీదేవికి నివాసస్థలమగుట కర్హముగాదని తలంచి గొప్పవేడుకచే సాటిలేనిదానములఁ జేయఁదలంచి యా లక్ష్మికి నిర్మలమైన యాచకుని కరపద్మమును క్రీడాభవనముగఁ జేయుచుందురు.

ఉ. దానకళాకలాపసముదంచితసారవివేకసంపదన్
మానితయాచమానజనమానసవృత్త్యభిపూర్తిబుద్ధి యె
వ్వానికి లేదొకింతయును వాఁడొకరుండు భరంబుధాత్రికిం
గానలు గావుశైలములుగావుపయోధులు గావు భారముల్.

టీ. దాన...సంపదన్ - దాన=వితరణగుణమందున్న, కళా=చాతుర్యముల యొక్క, కలాప=సమూహముచే, సముదంచిత=ప్రకాశించుచున్న, సార= నిర్దైన, వివేకసంపదన్=జ్ఞానసమృద్ధిచే, లేక, దానకళా = దానచాతుర్యమ నెడు, కలాప=అలంకారముచే, సముదంచిత=ప్రకాశమానమైన, సార=దృఢ మైన, వివేకసంపదన్=జ్ఞానసమృద్ధిచే (అనఁగా నెల్లపుడు దానమే చేయుచుం డవలయుననెడు జ్ఞానముచేననుట), మానిత...బుద్ధి - మానిత=గౌరవార్హులైన, యాచమానజన=యాచకులయొక్క, మానస=మనస్సునందు, వృత్తి=ఉన్నకోరి కను, అభిపూర్తి=నిండింపవలెననెడు, బుద్ధి=తలఁపు, ఒకింతయును=కొంచెమై నను,ఎవ్వానికిన్=ఎవనికి,లేదు=లేదో, వాఁడొకరుండు=వాఁడొక్కఁడే, ధాత్రి కిన్=భూమికి, భరంబు=బరువు, కానలు=అడవులు, భారముల్=బరువైనవి, కావు, శైలముల్=పర్వతములు, భారముల్, కావు, పయోధులు=సముద్రము లు, భారముల్, కావు.

తా. లోకములోఁ గొనియాడఁదగిన వితరణగుణము కలవాఁడై తన్ను యాచించుచున్నయాచకులయొక్క కోర్కులను నెఱవేర్పవలయు నన్నబుద్ధి యెవనికి కలుగదో వాఁడొకఁడే భూమికి భారము కలిగించువాఁడు, కాని యట్లు పర్వతములైనను, వనములైనను, సముద్రములైనను భూమికి భారమును గలిగింప నేరవు.

తే. తలఁప నధమర్ణుఁ*డొకఁడు ప్రదానపాత్ర
మిచట నొక్కటి గొని మీఁద నిచ్చుఁ గోటి
సుకృతసంపదఁ బారలౌకికకుసీద
మాసపడువారి కిదియ బేహార మరయ. 57

టీ. తలఁపన్ = ఆలోచింపఁగ, ప్రదానపాత్రము = దానమున కర్హుఁడగు, అధమర్ణుఁడు = ఋణము పుచ్చుకొన్నవాఁడు (అనఁగా యాచకుఁడనుట), ఒకఁడు, ఇచటన్ = ఈలోకమందు, ఒకటి = ఒకదానిని, కొని = పుచ్చుకొని, మీఁదన్ = పరలోకమునందు, కోటిన్ = కోటిగుణితమైనదానిని, ఇచ్చున్, సుకృతసంపదన్ = పుణ్యసంపదచే, పారలౌకికకుసీదము = పరలోకసంబంధమైన వడ్డిబ్రతుకు లేక జీవనోపాయమును, ఆసపడువారికిన్ = అపేక్షించువారికి, అరయన్ = ఆలోచింపఁగా, ఇదియ = ఇదే (యాచకులకు దానము చేయుటయే), బేహారము = వ్యవహారము.

తా. ఋణము పుచ్చుకొనువాఁడు కొంతమూలధనమును తీసికొని దానిని వడ్డితోఁగూడ నిచ్చివేయును. అట్లే యాచకుఁ డీలోకమందు నొక్కటి దీసికొని దాతకు దానిని కోటిగుణితముగాఁజేసి పరలోకమం దిచ్చుచుండును. పరలోకసంబంధమైన వడ్డిబ్రతుకు నపేక్షించువారికి యాచకులకు దానము చేయుట యొకవ్యవహారమువంటిదే. కనుక యాచకులకు దానము చేయవలయును.

వ. అని ముహూర్తమాత్రంబు చింతించి యానిషధరాజు ప్రసన్నముఖుం డై యాబర్హిర్ముఖుల కిట్లనియె. 58

టీ. అని, ముహూర్తమాత్రంబు = ముహూర్తకాలము, చింతించి, ఆనిషధ

* ఇట "డొక్క ప్రధానమాత్ర మిచట నొక్కటిగొన" అని వ్రా. ప్ర.

రాజు=ఆనలుఁడు, ప్రసన్నముఖుండై =నగుమోముగలవాఁడై, ఆబర్హిర్ముఖులకున్ =ఆదేవతలకు, ఇట్లనియెను.

తే. జన్యజనకంబులకు భేదశంక లేదు
దేహ మన్నజ మిందు సందేహ మెద్ది
మీర లమృతాశు లమృతంబు మిమ్ముఁ జూడఁ
దృప్తిసంపద నొందె మద్వీక్షణములు. 59

టీ. జన్యజనకంబులకున్ - జన్య=కార్యమునకును, జనకంబులకున్ =కారణములకును, భేదశంక = భేదముకలదనెడుసందియము, లేదు, దేహము=ఈశరీరము, అన్నజము = అన్నము తినుటవలన పరిణమించినది, ఇందున్ =ఈచెప్పిన విషయమందు, సందేహము=సంశయము, ఎద్ది= ఏదికలదు (అనఁగా నెంతమాత్రము సందేహము లేదనుట), మీరలు, అమృతాశులు=అమృతమే యన్నముగాఁగలవారు, అమృతంబు= అమృతస్వరూపులైన (అనఁగా నమృతమే యన్నముగా గలవారగుటచే నందువలన పరిణమించిన మీదేహము లమృతమయమని యన వచ్చుననియర్థము), మిమ్మున్, చూడన్ = చూడఁగా, మద్వీక్షణములు=నా చూపులు, తృప్తిసంపదన్ = విస్తారమైనతృప్తిని, ఒందెను= పొందినవి.

తా. ఓదేవతలారా! కార్యకారణములకు భేదములేదుగనుక నన్నముచే వృద్ధి బొందినశరీరమునకు నన్నమునకు భేదముండదు. అందువలన నమృతాహారులైన మీశరీరమునకును నమృతమునకును భేదముండదు గనుక మిమ్మును జూచిన యంతమాత్రముననే నాచూపు లమృతమునందుఁ దానమాడుటవలనఁ గలిగినసుఖము ననుభవించుచున్నవి.

తే. ఏను జేసినపుణ్యంబు లెట్టివొకొ
ఫలితమయ్యెను మత్పూర్వపరమతపము
లింతకల్యాణకరమాయె నీయాదినంబు
కౌతుకం బార దర్శింపఁ గంటి మిమ్ము. 60

టీ. ఏను, చేసినపుణ్యంబులు = చేసినటువంటిపుణ్యకార్యములు, ఎట్టివో

కొక్కా = ఎటువంటివారో కదా, మత్పూర్వ... తపములు-మత్ = నాయొక్క, పూర్వ= పూర్వజన్మమందు చేయఁబడిన, పరమ = గొప్పవైన, తపములు=తపస్సులు, ఫలితమయ్యెను = ఫలించెను. ఈదినంబు = ఈదినము, ఇంతకల్యాణకరము= ఇంతమంగళముకలిగించునది, ఔనె=అగునా? (అనఁగా ఈసినమిట్టి సుదినమగునని యెఱుంగననుట). కౌతుకంబు=వేడుక, అరర్ =నిండునట్లుగా, మిమ్ముక్,దర్శింపక్ కంటిని=చూడఁగంటిని.

తా. నేను బూర్వమం దెట్టి సుకృతముఁ జేసికొంటినో కదా! నాపూర్వతపము ఫలించెను. మీవంటిమహాత్ములను నేను గంటిని. నేఁడు సుదినము. ఈదినమిట్టి మంగళప్రదమైనదని యెఱుఁగనైతినిగా.!

చ. నలువు దలిర్ప సర్వసహాసవ్రతజన్మము లైనకర్మముల్
ఫలితములయ్యెఁగావలయుభాగ్యము పెంపునభూతధాత్రికిక్
లలితము లైనపాదకమలంబుల నర్చన మాచరింపఁగాఁ
దలఁతురె వేల్పులార! ప్రమదంబున మీరటుగాక తక్కినన్.

టీ. నలువు – ఒప్పిదము, తలిర్పక్ = ప్రకాశించునట్లుగా,సర్వ... జన్ములు-సర్వ=సమస్తమయిన యవమానములను, సహన = సహించుటయనెడు, వ్రత=నియమమువలన, జన్మములు = పుట్టినవి, అయినకర్మముల్ = అయినట్టిసుకృతంబులు (అనఁగా భూమి సమస్తమయినజంతుజాలమును,తత్కృతమయిన యవమానమును, సహించుటయే యొకవ్రతముగాఁగలదయి సర్వంసహా యని పేరొందినది, అట్టిసువ్రతము నాచరించుటవలనఁ గలిగినపుణ్యములని యర్థము), భాగ్యముపెంపునక్ = అదృష్టముయొక్కయతిశయముచే, ఫలితములు= పరిపాకమును జెందినవి,అయ్యెంగావలయును = అయినవికాఁబోలు (అనఁగా భూదేవియొక్కభాగ్యములు ఫలించి యుండవచ్చు నని యర్థము), వేల్పులార=అటుగాక, తక్కినక్ = నేను చెప్పినట్లు కానిచో, మీరు, లలితములు= సుందరములు, అయిన పాదకమలంబులక్ = అయినట్టిమీపాదములనెడు పద్మములచేత, భూతధాత్రికిక్ =భూతములకుఁ బెంపుడుతల్లివంటిదియగు భూదేవికి, ప్రమదంబునక్ = సంతసంబుచే, అర్చనము=పూజను, ఆచరింపఁగాక్ = చేయుటను, తలఁతురె=

వూనుకొందురా? (అనఁగా మహాత్ములరైనమీపాదములసంపర్కముచే భూమి యంతయుఁ బవిత్రమైనదానిగాఁ జేయుటకుఁ దలపోయుదురా? అనుట.

తా. దేవతలారా! భూదేవి సర్వావమానములను సహించుట యనెడు నోమును నోఁచి సంపాదించినపుణ్యకార్యము లదృష్టవశముచే ఫలించిన వని తలంచెదను. అట్లే కానిచో మీపాదము లనెడుకమలములచే భూతధాత్రి యయినభూమికిఁ బూజ లొనర్చుటకై యాలోచింపరు.

వ. నాయందు మీ రపేక్షించినప్రయోజనంబొనతిండు. ప్రాణం బైనను ప్రాణాధికంబైనను నెద్దియేని పదార్థంబైన నిచ్చెద నని నిర్విశంకంబుగాఁ బలికినయుర్వీశ్వరునకు గీర్వాణవల్లభుం డిట్లనియె. 62

టీ. నాయందుర్ = నావలన, మీరు, అపేక్షించిన = ఆసపడిన, ప్రయోజనంబు = ఫలము, ఆనతిండు = సెలవిండు, ప్రాణంబు+ఐనను = ప్రాణమైనను, ప్రాణాధికంబైనను = ప్రాణముకంటె నెక్కుడుదైనను, అది = ఆకోరినవస్తువు, ఎట్టిపదార్థంబు+ఐనను=ఎట్టిదుర్లభమైనపదార్థమైనను, ఇచ్చెదను, అని, నిర్విశంకంబుగార్ = నిరాటంకముగా, పలికిన=పలికినటువంటి, ఉర్వీశ్వరునకుర్ = నలమహారాజునకు, గీర్వాణవల్లభుండు = దేవతలకు రాజగుదేవేంద్రుఁడు, ఇట్లు, అనియెర్.

ఉ. ఓమిహిరాంశువంశకలశోదధికౌస్తుభరత్న ! భూపతి
గ్రామణి! యస్మదీయమగుకాంక్షితముర్ వినుభీమపుత్రిపైఁ
గామనసేసి వచ్చితిమి గమ్ము సహాయము మాకు నిక్కపుం
బ్రేమయుభక్తియుంగృపయుఁ బెంపుగఁ జేయుముదూతకృత్యమున్

టీ. ఓ...కలశోదధికౌస్తుభరత్న - మిహిరాంశు = చంద్రునియొక్క, వంశ = కులమనెడు, కలశోదధి = పాలసంద్రమునకు, కౌస్తుభరత్న = కౌస్తుభమాణిక్యమువంటివాఁడా, ఈచెప్పుటచేఁ గౌస్తుభరత్నము కాంతి సంతానములచే లోకమునఁ బ్రసిద్ధిఁ జెందిన కులమునకు వన్నెఁ దెచ్చినటులు

నీవును నీసద్గుణపరంపరచే జగత్ప్రసిద్ధుండవై కులమునకు వన్నె దెచ్చుచు న్నాఁడవు అనునర్థము స్ఫురించుచున్నది. భూపతిగ్రామణి=రాజశ్రేష్ఠా! అస్మదీయము=మాసంబంధమైనది, అగుకాంక్షితమున్=అయినకోర్కెని, వినుము=ఆలకింపుము. భీమపుత్రిపైన్=భీమరాజుకూఁతురగు దమయంతిపై, కామన=కోర్కెని, చేసి, (అనఁగా దమయంతిని వరింప నపేక్షించి యని యర్థము.) వచ్చితిమి,మాకున్, సహాయము, కమ్ము=తోడ్పడుము. నిక్కపుంబ్రేమయున్=నిజమైన యనురాగము, భక్తియున్=పూజ్యభావము, కృపయున్=దయయు, పెంపుగన్=వృద్ధిఁజెందునటులు, దూతకృత్యమున్=దూతధర్మమును, (దూత చేయవలసిన పనియనుట) చేయుము=కావింపుము. (అనఁగా దమయంతియొద్ద కు సందేశ మొకటి గొనిపోవలయునని యర్థము.)

తా. చంద్రవంశమనెడుపాల్కడలికి కౌస్తుభమువలెనొప్పునలమహారాజా! మాయభిలాషఁ దెలియఁజేయుదుము వినుము. మేము దమయంతిని వరింపఁగోరి యిటవచ్చితిమి. మాయందు నీకు దయయు భక్తియుఁగలిగినచో మాకుఁదోడ్పడి దమయంతికడకు రాయబారిగా నేఁగుము.

వ. భూమండలంబున రాజనందను లెందఱు లేరు? వారిప్రయోజనంబేమి? * తక్కినగ్రహంబులు గ్రహరాజుం బోలనేర్చునె? యగాధగుణాంభోధి వగునీవు సహాయంబుగా మాకు సాధింపరానికార్యంబు గలదే యని పలికిన. 64

టీ. భూమండలమునన్=భూలోకమునందు, రాజనందనులు=రాజకుమారులు, ఎందఱు లేరు=ఎంతమంది లేరు, వారిప్రయోజనంబు=వారివలనిలాభము, ఏమి=మాకేమిగలదు (అనఁగా నేమియులేదనుట) తక్కినగ్రహంబులు=మిగిలినగ్రహములు, (అనఁగా జంద్రుఁడు, కుజుఁడు, బుధుఁడు, బృహస్పతి, శుక్రుఁడు, శని, రాహువు, కేతువు) గ్రహరాజున్ = సూర్యుని, పోలన్ నేర్చునె=సరిపోలునా, అగాధగుణాంభోధివి - అగాధ=లోఁతైన, గుణాంభోధివి=గుణసము

* "అంబరంబునసంచరించు" అనుపాఠము వ్రాతప్రతులలోనున్నది.

ద్రుండవు, అగునీవు, సహాయంబుగాన్ = తోడ్పడఁగా, మాకున్, సాధింపరానికార్యంబు = సాధింపఁ దరముకానిపని, కలదే = యున్నదా? (అనఁగా నీవు తోడ్పడినచో సర్వకార్యములు సిద్ధించుననుట) అనిపలికిన, పైపద్యముతో నన్వయము.

తే. బలనిషూదనుకపటంపుభాషణములు
    విని నృపాలుండు పలికెఁ దద్విధము గాఁగఁ
    గుటిలబుద్ధుల గెలువంగఁ గుటిలమతియ
    యర్హ మగుఁ గాని నీతి గాదార్జవంబు. 65

టీ. బల...భాషణములు - బలనిషూదను = బలాసురునిఁ జంపినవాఁడగు దేవేంద్రునియొక్క, కపటంపుభాషణములు=కపటవాక్యములు, నృపాలుఁడు= రాజు, విని, తద్విధముగాఁగన్ = ఆవిధముగానే (అనఁగానాకపటవాక్యములకుఁదగినటులుగా నేయనుట, పలికెన్, కుటిలబుద్ధులన్ =కుటిలములైనబుద్ధులను, గెలువంగన్ =జయించుటకు, కుటిలమతియ = కపటమైనబుద్ధియే, అర్హము=తగినది, అగును, కాని, ఆర్జవంబు=నిష్కాపట్యము, నీతిగాదు=ప్రయోక్తవ్యమగు నీతికాదు.

తా. దేవేంద్రునికపటవాక్యములను నలమహారాజువిని యాతనికపటవాక్యములకుఁ దగినట్టికాపట్యమును వహించి సంభాషించెను. అవును. కుటిలబుద్ధులను గుటిలబుద్ధియే జయింపఁదగినదికాని నిష్కాపటబుద్ధి జయింపలేదు. అలం. అర్థాంతరన్యాసము.

వ. అఖిలభూతాంతర్వర్తనంబుల నెఱింగెడుమీకు నెఱుంగంబడని యర్థంబునుంగలదె? అట్టిమీ రివ్విధంబున నాననతిచ్చిన నేమి యనంగలదు? ఏ నయ్యంగనం గోరి వరియింపం బోవుచున్నవాఁడ. అమ్మచ్చెకంటికిం గుంటెనతనంబెట్లుసేయ నేర్తు? విరహవేదనాదూయమానమానసుండ నైన యేను మీరహస్యం బెట్లు రక్షింప నోపుదు. మనోరథపరంపరానుభావనంబునఁ బరవశుండ నైన నాకు భావగోపనం బెట్లు సిద్ధిం

చు. వివిధరతూధికృతపాలితంబు లైన రాజశుద్ధాంతభవనక
క్ష్యాంతరంబు లేప్రకారంబునం బ్రవేశింతు? పెద్దకాలంబున
నుండియు నాయందు వినుకలిం దద్దయుం దగిలియున్నయమ్ము
ద్దియతో మీప్రసంగం బెబ్భంగిఁ జేయుదు? కావున హాస్యకా
రణం బగునిక్కార్యంబునకు నన్ను భారకుం జేయకుం డని
పలికిన. 66

టీ. అఖిలభూతాంతర్వర్తనములన్ - అఖిల=సమస్తములయిన, భూత=భూతములయొక్క, అంతర్వర్తనంబులన్ = మనోభిప్రాయములను, ఎఱింగెడు మీకు=తెలిసికొనియున్న మీయట్టిమహాత్ములకు, ఎఱుంగంబడనియర్థంబునన్ = తెలియఁబడని ప్రజయోనముగూడ, కలదె=యున్నదా? (అనఁగా మీరు సమస్తభూతముల యంతరంగంబులందుండు నభిప్రాయము తెలిసికొనఁదగినంత సాకల్యముకలవా రగుటంబట్టి మీకుఁ దెలియనియర్థముండదు.) అట్టిమీరు, ఇవ్విధంబునన్=ఈరీతిగా, ఆనతిచ్చినన్ = సెలవిచ్చినచో, ఏమనంగలదు=ఏమి చెప్పఁగలను? ఏను, అయ్యంగనన్ = ఆదమయంతిని, కోరి=అపేక్షించి, పరియింపన్ = పెండ్లియాడుటకు, పోవుచున్నాఁడను, (అనఁగా మీరు సర్వజ్ఞులరగనుక దమయంతిని వరింప నేను బూనికొనియుండుట మీకుఁ దెలిసియేయుండును. అట్లు తెలిసియుండఁగా మీ రిట్లుకోరుట ధర్మముకాదని భావము) అమ్మచ్చెకంటికిన్ = నాచే పరియింపఁ బడఁబోవుచున్నదమయంతికి, కుంటెనతనంబు=తార్చువానితనము (అనఁగా విటీవిటులకు సంధానముచేయుట,) ఎట్లు=ఏరీతిగా, చేయనేర్తున్=చేయఁగలను? విరహ......మానసుండను - విరహ=దమయంతీవియోగమువలన గలిగిన, వేదనా=బాధచే, దూయమాన=కలుషితమైన, మానసుండను=మనసుగలవాడను, అయిన నేను, మీరహస్యంబు=మీగుట్టును, ఎట్లు=ఏవిధంబుగా, రక్షింపన్, ఓపుదును=సమర్థుఁడనగుదును? మనోరథ .....రసంబునన్ .. మనోరథ=కోర్కులయొక్క, పరంపరా=వరుస వెంట, [illegible] ప్రేమఅచి యు.

న్న వాఁడను, అయిన నాకుఁ =అయినట్టినాకు, భావగోపనంబు=అభి|ప్రాయమును రహస్యముగానుంచుట, ఎట్లు=ఏరీతిగా, సిద్ధించును=లభించెడును. (అనఁగా దమయంతీవియోగముచే మిగులఁ దహతహపడుచు నా మెసుందరరూపము వీక్షించుటకు మిగులఁ జాటుపడుచు వర్తించెడు నేను నాయందు మిగుల |ప్రేమాతిశయముచే వర్తించుచున్న దమయంతియొద్దకు దూతగాఁబోయి కార్యము నెఱవేర్చుటయు నాయభిలాష నడఁగఁ |దొక్కుటయు మిగులఁ గష్టమని భావము) వివిధ ... పాలితంబులు - వివిధ=అనేకులయిన, రక్షాధికృత=రక్షకభటులచే, పాలితంబులు=పరిపాలింపఁబడుచున్నవి, అయిన......కక్ష్యాంతరంబులు - అయిన, రాజ=రాజులయొక్క, శుద్ధాంతభవన=అంతఃపురసౌధంబులయొక్క, కక్ష్యాంతరంబులు = నాలుగిండ్లవాకిళ్లమధ్య|ప్రదేశములు, ఏ|ప్రకారంబునన్, |ప్రవేశింతును=చొత్తును. పెద్దకాలంబుననుండియుఁ =చిరకాలమునుండియు, నాయందు, వినుకలిఁ =వినుటను, తద్దయున్ =మిక్కిలి, కలిగి=కలదై, (అనఁగా చిరకాలమునుండి నాసద్గుణములనువిని నాయందు |ప్రేమాతిశయము కలదై యనుట) ఉన్నయమ్ముద్దియతోఁ = ఉన్న యాదమయంతితో, ఎబ్భంగిఁ, మీ|ప్రసంగంబుఁ, చేయుదుఁ, (అనఁగా మిమ్ముగుఱించి యెట్లుగాఁ |బసంగింపఁగలను) కావునఁ, హాస్యకారణంబు=పరిహాసాస్పదము, అగు నికార్యంబునకుఁ =అయిన యీరాయబారమనెడు పనికి, నన్నున్, భారకుఁ =బరువు మోచువానినిగా లేక నిర్వాహకునిగా, చేయకుండు = చేయవలదు, అనిపలికినఁ, పైపద్యముతో నన్వయము.

క. మేలపుమైవడి నగవున
వేలుపులం దోడివారి కై వీక్షించి మహీ
పాలునితో ని ట్లనియెను
బౌలోమీవల్లభుండు కై |ప్రస్ఫుటఫణితిన్. 67

టీ. పౌలోమీవల్లభుండు-పౌలోమీ=శచీదేవియొక్క, వల్లభుండు=|ప్రియుఁడు (అనఁగా దేవేం|దుఁడనుట) మేలపుమైవడి, నగవునన్ =పరిహాసమునుదెలుపు

చున్ననవ్వుచే, దోడివారిఁ=తనతోనున్న, వేలుపులఁ=దేవతలను, వీక్షించి=చూచి, ప్రస్ఫుటభణితిఁ=స్పష్టమయిన వాక్కులచే, మహీపాలునితోఁ=నలమహారాజుతో, ఇట్లనియెను=ఇటులుపలికెను.

తా. దేవేంద్రుఁ డట్లు నలుఁడు పలికినవాక్యములువిని తనతోవచ్చినవరుణాదిదేవతలను జూచి పరిహాసమును దెలియఁజేయుచున్ననవ్వుతో నలున కిట్లనియె.

సీ. ఈమాట లాడకు మిందువంశవతంస!
యాడి తప్పఁగ వచ్చునయ్య! నీకు
క్షణభంగురం బైన సంసారమునకుఁగా
ధర్మంబుఁ గీర్తియుఁ దగునె విడువ?
నన్వయంబున కాది యగుచందురుఁడుఁబోలె
నకట! కళంకి వేమి లయ్యె దీవు?
చిరకాలమున నుపార్జింపఁబడ్డప్రసిద్ధి
సేగిఁ బొందఁగ నుపేక్షింపవలదు

తే. పరుసనైనచింతామణిం బసరమైన
కామధేనువు మ్రానైనకల్పకంబు
నడిగి వైఫల్యమును బొందరర్థిజనులు
మిన్నకయపోదుమే యేము నిన్ను నడిగి. 68

టీ. ఇందువంశవతంస=చంద్రవంశమునకు శిరోభూషణమువంటి నలమహారాజా! ఈమాటలు=ఇటువంటిమాటలు, ఆడకుము=పలుకవద్దు, ఆడి=ముందు కార్యమును జేసెద ననిపలికి, నీకుఁ, తప్పంగఁ,వచ్చునయ్యా= తప్పిపోవచ్చునా? (అనఁగాఁ దొలుత చేసినవాగ్దానమును తప్పిపోవుట నీవంటియుత్తమక్షత్రియునకు యుక్తముకాదనుట) క్షణభంగురంబు = క్షణకాలములో నశించునట్టిది, ఐన సంసారంబునకుగాఁ = అయినట్టిసంసారము నిమిత్తము, ధర్మంబుఁ, కీర్తియుఁ=యశమును, విడువఁ తగునె = విడుచుటయుక్తమా? (అనఁగా [illegible] ధర్మము

లను విడిచిపెట్టుట యెంతమాత్రము యుక్తము కాదనుట) అన్వయంబునకున్ = వంశమునకు, ఆది=మూలము, అగు చందురుఁడుఁబోలెన్ =అయినట్టి చందురునివలెనే, అకటా=అయ్యయో, ఈవు, కళంకివి=అపకీర్తియనెడు మచ్చగలవాఁడవు, ఏలయ్యెదు=ఎందుకయ్యెదవు (అనఁగా నీవింతవఱకు నీసద్గుణంబులచే నిష్కళంకుండవై వర్తించుచుంటివి. అట్టినీ విపుడు మొదటచేసెదనన్న వాగ్దానమును దప్పి యపకీర్తిపాలయి నీవంశకర్తయగు చందురునివలెనే కళంకము గలవాఁడవగుట ధర్మముకాదు) చిరకాలమునన్ = చాలఁగాలముచేత, ఉపార్జింపఁబడ్డ ప్రసిద్ధి=సంపాదింపఁబడిన ఖ్యాతి, నేగిన్ = అపాయమును, పొందఁగాన్ =పొందుచుండఁగా, ఉపేక్షింపవలదు=ఊరకుండుట తగదు (అనఁగా చిరకాలార్జితమైన ప్రఖ్యాతి నశించుచుండఁగా నూరకుండుట యుక్తముకాదని భావము.) అర్థిజనులు=యాచకులు, పరుసన = కాఠిన్యముకలది, ఐన చింతామణిన్ =అయిన చింతామణియనెడు రత్నమును, పసరము=పశువు, ఐనకామధేనువున్ =అయినట్టి కామధేనువును, మ్రాను=వృక్షము, ఐనకల్పకంబున్ =మందారమును, అడిగి=యాచించి, వైఫల్యమును=విఫలత్వమును, పొందరు=ఒందరు.(అనఁగా జ్ఞానశూన్యమును గఠినహృదయముగల చింతామణిని,జ్ఞానములేక మోటుతనముచేఁ దిరుగుపశువనిపించుకొనిన కామధేనువును,సంచరణాదికములులేక యెల్లపు డొక్కచోటనే స్తంభాకృతిఁ దాల్చియుండుకల్పవృక్షంబును యాచించియే యాచకులందఱు సఫలమనోరథు లగుచుండిరనుట) నిన్నున్ అడిగి=నిన్నుయాచించి, ఏము, మిన్నకయపోదుమే=ఊరకపోదుమా (అనఁగా యాచకులు చింతామణిమొదలగు జ్ఞానశూన్యములైనవానిని యాచించియే సఫలప్రయత్ను లగుచుండఁగా మృదుహృదయముఁగలవాఁడవును, జ్ఞానవంతుఁడవును, సమస్తకార్యములయందును దక్షుండవు నగునిన్ను యాచించి విఫలప్రయత్నులమై యెట్లు పోఁగలుగుదుము. మాకోర్కె నెఱవేర్పకతీరదు) "పరుసనైన చింతామణి, పసరమైన కామధేనువు, మ్రానైనకల్పకంబు" అని చెప్పుటచే నలునియందు చింతామణ్యాదులయందుండువితరణగుణమేకాక యింకను పెక్కెన్ని సద్గుణంబులు గలవని స్ఫురించుచున్నది. అలం కావ్యార్థాపత్తి.

చ. అసదృశదానవైభవమహాగుణధన్యుని నిన్ను దేవతా
  విసరము యాచకత్వమున వేఁడఁగవచ్చుట కారణంబుగాఁ
  బ్రసవవికాసమాత్రమునఁ బాండురభావమునొందుఁగాక యా
  కసము యశోవిహీనమగుఁ గల్పమహీరుహపంచకంబుచేన్.

టీ. అసదృశ...ధన్యుని-అసదృశ = సాటిలేని, దానవైభవ = దానసమృద్ధిచేతను, మహాత్ =పూజ్యములైన, గుణ=గుణములచేతను, ధన్యునిన్ = కృతార్థుఁడవైన, నిన్నున్, దేవతావిసరము=దేవతాసమూహము, యాచకత్వమునన్ = యాచకధర్మముచే, వేఁడఁగవచ్చుట= యాచింపవచ్చుట, కారణంబుగాన్ = హేతువుచేత, ఆకాశము = స్వర్గలోకము, కల్పమహీరుహపంచకంబుచేన్ =ఐదువిధములు (మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము), ఐన దేవతావృక్షములచే, ప్రసవవికాసమాత్రమునన్ =పుష్పములు పూచుటమాత్రముననే, పాండురభావమును=ధావళ్యమును, ఒందున్ కాక=పొందినఁ బొందవచ్చును, కాని, యశోవిహీనము-యశస్ = యాచకులకోర్కుల నెఱవేర్చుటవలనఁ గలిగినకీర్తిచే,హీనము=శూన్యమయినది,అగున్. ఈ చెప్పుటచే నలుఁడు కల్పవృక్షాదులు నెఱవేర్పలేనికోరికలను దీర్పఁగలఁడని తోఁచుచున్నది.

తా. ఓరాజకుమారా! సమస్తవరములను నెఱవేర్పఁజాలిన కల్పవృక్షములు గలవారమైనను వానిని విడిచి సాటిలేనిదాతృత్వముచేతను సద్గుణములచేతను బ్రసిద్ధిఁజెందిన నిన్నును యాచించుటకై మేము వచ్చియుండుటవలనఁ గల్పవృక్షములప్రఖ్యాతి తగ్గిపోయినది. అందుచే నవి పూచినపుష్పములకాంతులచే స్వర్గమును ప్రకాశింపఁ జేయవలసినదేకాని యశస్సుచే ప్రకాశింపఁజేయలేవు.

ఉ. అక్షరముల్ పఠించుసమయంబునఁ బాఠము సేయుఁడయ్యెనో
  వీక్షితవర్ణమధ్యమున విస్మృతిఁ బొందెనో యంచు నర్థులు
  త్ప్రేక్ష యొనర్తురీక్రియ నభీష్టఫలప్రతిపాదనక్రియా
  దక్షుని నిన్నుఁగూర్చి నయ మధర వికారము నన్నకారమున్.

టీ. అర్థులు=యాచకులు,అక్షరములన్=వర్ణములను:-అనఁగా, నేఁబది లేక యే బదియాఱువర్ణములనుట,పఠించుసమయంబునన్=అభ్యసించెడిసమయమునందు, పాఠము = (నకారమును) అభ్యసించుట, చేయఁడు+అయ్యెనో=మానివేసెనో, వీక్షిత వర్ణమధ్యమున=అభ్యసింపఁబడిన యక్షరములందు, విస్మృతిన్+పొందెనో = (నకారమును) మఱచిపోయెనో, అంచున్=అనిసలుపుచు, ఈక్రియన్ =వెనుక చెప్పినట్లుగా, అభీష్ట...దక్షుని-అభీష్ట=ఇష్టమైన, ఫల=ఫలములను, ప్రతిపాదనక్రియా=ఇచ్చుట యనెడువ్యాపారమునందు,దక్షునిన్ = నేర్పరివైన ట్టి, నిన్నుంగూర్చి=నిన్ను నుద్దేశించి, నయధర్మవికారమున్=నయధర్మములకు విరుద్ధమైన:-అనఁగా, నకార మభావార్థముకలది గనుక, నీతి, ధర్మము, మొదలగు భావపదార్థములకు విరుద్ధముగా నుండుననని భావము. నకారమున్ ="న" యనెడి యక్షరమును, ఉత్ప్రేక్షయొనర్తురు=యూహించుచుందురు:—అనఁగా నలుని వదనమునుండి యొకప్పుడైన లేదను నర్థముగల నకారము వెలువడనందున యాచకులందఱు సఫలాభీష్టులై తమలోఁదాము నలునినోరనుండి నకార మొకపర్యాయమైన వెలువడలేదు, దీనింబట్టి యోజింప నలుఁడు నకారము నభ్యసించెనో లేక మహారాజులకుఁ గార్యాంతరములు పెక్కులుండుటచేఁ జదువునందు శ్రద్ధతీసికొనరు గనుక నభ్యసించినయక్షరములలోని నకారమును మఱచెనో?లేనిచో నొకపర్యాయమైనను నకారము నుచ్చరింపఁడా!అనిసందేహము నొందుచున్నారు. ఈచెప్పుటచే నలమహారాజు యాచకులు యాచించినకోర్కుల నన్నింటిని నెఱవేర్చుచున్నాఁడని తోఁచుచున్నది.

తా. ఓనలా! సమస్తయాచకుల కోర్కుల నెఱవేర్చుటయందు నేర్పుగల నిన్నుంగూర్చి.యాచకులందఱు నలమహారాజక్షరములను బఠింపలేదా! పఠించినను మఱచెనా! లేనిచో నకార మొకపర్యాయమైన నోటనుండి వెలువడదా! యని సకలాభీష్టదాయకుఁడగు నిన్ను నుద్దేశించినకారమును నుత్ప్రేక్షించుచుందురు. (ఇట్లు దానమందు జగత్ప్రసిద్ధుఁడవైననీకు, మాకోర్కి నెఱవేర్చుట యుచితమని భావము. అలం. అతిశయో క్తి. సందేహము.

శా. ఈయర్థంబు ఘటింపవన్న నృప! నీకెంతేనిమే లయ్యెడున్
మాయాశీర్వచనంబులం ద్రిజగతీమధ్యంబునన్ నీయశ
శ్ఛాయామండల మిందుకుందకుముదస్వచ్ఛంబుసంధించుసం
ధాయుక్తిన్ శితిపీతరోహితహరిద్వర్ణోపసంహారమున్. 71

టీ. నృప=ఓనలరాజా! ఈయర్థంబున్ = ఈ కార్యమును, ఘటింపవన్న=సంఘటింపుమీ; నీకున్, ఎంతేని మేలు=గొప్పశ్రేయస్సు, అయ్యెడున్ =కల్గెడును, మాయాశీర్వచనంబులన్ = మేమిచ్చునట్టి యాశీర్వాదములనుబట్టి, ఇందుకుందకుముదస్వచ్ఛంబు-ఇందు=చంద్రుఁడు, కుంద=మల్లెలు,కుముద=కలువలువీనివలె,స్వచ్ఛంబు=నిర్మలమైన, నీయశశ్ఛాయామండలము=నీకీర్తికాంతులయొక్క సమూహము, త్రిజగతీమధ్యంబునన్ =ముల్లోకములయందు, సంధాయుక్తిన్ =మారణయుక్తిచే, శితి...సంహారమున్-శితి=నలుపు, పీత=పసుపు, రోహిత=ఎఱుపు, హరిత్ =ఆకుపసుపు, వర్ణ =ఈ మొదలగు వర్ణములయొక్క, ఉపసంహారమున్ = నాశనమును, సంధించున్ =కలిగించుఁగాత-లేకకూర్చుఁగాక.అనఁగా:-నీయశఃకాంతులసమూహము లోకములోని నానావిధవర్ణములుఁగల వస్తువులను తెల్లని వర్ణము గలవానిఁగా నొనర్చుఁగాక యనియు, నీసత్కీర్తి ముల్లోకముల నావరించియుండుఁగాక యనియు భావము.

తా. ఓనలమహారాజా! ఈ మాకార్యమును నీవు తప్పక నెఱవేర్పుము, నీకు గొప్పశ్రేయస్సుగలుగును. మఱియు మాయాశీర్వచనములవలన .ఇందుకుందాదులవలెనే నిర్మలమైన నీకీర్తికాంతిసమూహము ముల్లోకములయందున్న రక్తపీతాది వస్తువులయొక్క రక్తాది గుణములను సంహరించి సమస్తమును సితవర్ణముగలదిగాఁ జేయుఁగాక.

చ. వసుమతి వేయుపాదములవానికిఁ బుట్టినచాయపట్టికి
న్వసవిస గాదు కాలోకటినిత్యముతండ్రిసుతుండువోలెఁగాఁ
బొసఁగదె? దీని కుత్తరము వ్రా యిది నీప్రకటప్రతాపముం
గసమసదాఁటఁబోయియతిఖంజతఁజిక్కెసహస్రపాదుఁడున్.

టీ. వసుమతిన్ =భూమియందు, వేయుపాదములవానికిన్ = సహస్రకిరణములు గలవానికి, అనఁగా:-సూర్యునికనుట, (వేయికాళ్లు గలవాఁడనియు నర్థము) పుట్టినచాయపట్టికిన్ =పుట్టిన శనైశ్చరునకు, నిత్యము=ఎల్లప్పుడు, అనఁగా:-నొకసమయమందైనను ననుట, కాలొకటి=ఒక కాలైనను, విసవిస గాదు=ప్రసరింపదు, అనఁగా:-కుంటివాఁడని యర్థము. శనైశ్చరుఁడు కుంటివాఁడైనట్లు ప్రసిద్ధము, సుతుండు=కుమారుఁడు,తండ్రిన్ =జనకుని,పోలఁగాన్ =సరిపోలుట, పొసఁగదే=పొసఁగి యుండలేదె. అనఁగా-లోకములోఁ గుమారుఁడు తండ్రినిఁబోలియుండుట ప్రసిద్ధము-అట్లుండ శనైశ్చరుఁడు వేయుపాదములుగల సూర్యునికిఁ బుట్టినను నొకపాదమైననులేక కుంటివాఁడాయెను. అందుచే శని జనకునిపోలలేదేమి? యని ప్రశ్నము.దీనికిన్ = ఈప్రశ్నమునకు,ఇది= ఈ చెప్పఁబోయెడిది, ఉత్తరముపో=సమాధానమే. ఎట్లన-నీప్రకటప్రతాపమున్ = నీప్రసిద్ధమైన ప్రతాపమును, సహస్రపాదుఁడున్ =వేయుపాదములు గలవాఁడు, అనఁగా:-సూర్యుఁడనుట, కసమసన్ =సంభ్రమముచే, లేక, తొందరపాటుచే, దాఁటలేక=అతిక్రమింపలేక, అతిఖంజతన్ =మిక్కిలి కుంటితనమున, జిక్కెన్ = తగులుపడెను. అనఁగా:- నలరాజా! నీప్రతాపంబు నతిక్రమింపలేక తొందరపాటుచే వేయుపాదములు గలసూర్యుఁడు కుంటితనమునఁ జెందుచున్నాఁడు. కావున సూర్యుఁడు కుంటివాఁడైయున్నాఁడు కనుక యతని కుమారుఁడైనశనియుఁ గుంటివాఁడనుట సంభవించుచున్నది. కనుక జనకునిఁ గుమారుఁడు బోలియుండుట సరిపోవుచున్నది.

తా. భూమిలో గుమారుఁడు జనకునిఁ బోలియుండుట ప్రసిద్ధము. అట్లు వేయుపాదములుగల సూర్యునికిఁ బుట్టిన శనైశ్చరుని కొకపాదమైనలేదు గావున శని సూర్యునిఁ బోలలేదేయని శంకింపంబనిలేదు. నీ ప్రకట ప్రతాపంబుం దాఁటలేక సూర్యుఁడు కుంటివాఁడైనాఁడు గనుక సూర్యుని శనైశ్చరుఁడు పోలుట సరిపోయినది.

వ. అనిమె నప్పుడు.　　73.

తే. అధిప! యిది మాకుఁ బురుషార్థ మనియె వహ్ని

ప్రార్థనంబుఁ జేకొను మంచుఁ దా బలికె జముఁడు
రాజ యన్యోపకారసంప్రభవమైన
యశముఁ గైకొనుమయ్య నీ వనియెఁ బాశి. 74

టీ. వహ్ని=అగ్నిహోత్రుఁడు, అధిప=ఓనలరాజా! ఇది=ఈమాతకృత్యము, మాకున్, పురుషార్థము=ప్రయోజనకారియని, అనియెన్=పలికెను. అనఁగా నానలువురు దేవతలలో నొకఁడగు యగ్నిహోత్రుఁడు, ఓనలరాజా దమయంతిని మేమువరించుటయే మాకు పురుషార్థమువంటిది కావున మాకోర్కెచొప్పున దూతకృత్యమునువహించి కార్యము నెఱవేర్పవలయునని పలికెను. జముఁడు, ప్రార్థనము=మాప్రార్థించుటను అనఁగా.-మాకోర్కెననుట, చేకొనుము=స్వీకరింపుమని, పలికెన్=పలికెను. పాశి=పాశము కలవాఁడు, అనఁగా: వరుణుఁడనుట, రాజ=ఓనలరాజా! అన్యోపకారసంప్రభవము=పరోపకారమువలనఁ గలిగినది. అయినయశమున్=ఐనట్టికీర్తిని, నీవు, కైకొనుము+అయ్య=పొందుమయ్య అనియనియెన్. దమయంతిని గోరుచున్న మాకు దమయంతినిగూర్చి యుపకారము చేసి యశంబు నొందుమని భావము.

తా. దేవేంద్రుఁడు నలుఁ బ్రార్థించి యూరకున్నపిమ్మట నగ్నిహోత్రుఁడీకార్యము పురుషార్థమువంటిది కావున దప్పక నెఱవేర్పవలసినదనియు, యముఁడు మాప్రార్థన నంగీకరింపక తీఱదనియు, వరుణదేవుఁడు మా కుపకారమొనరించి యందువలన జనించిన సత్కీర్తినిఁ బొందుమనియుఁ గ్రమముగాఁ బలికిరి.

వ. ఇత్తెఱంగునం జాటుగర్భంబు లైనవేల్పులవాక్యసందర్భంబు లాకర్ణించి వైదర్భీకాముకుండయ్యును నయ్యాదిగర్భేశ్వరుండు తద్దూత్యభారంబు భరించె. రాజపుంగవు నంగీకారం బెఱింగి దేవత లతని కంతఃపురప్రవేశంబున కుచితంబుగాఁ దిరస్కరిణీవిద్య యుపదేశించి పొమ్ము కార్యసిద్ధి యయ్యెడు మని వీడుకొల్పిన. 75

టీ. ఇత్తెఱంగునన్ = ఈప్రకారముగా, చాటుగర్భంబులు = ప్రేమకృతమైన స్తోత్రము గర్భమందుఁగలవి, అనఁగా:—నలునిపై దమకున్నట్టిప్రేమను ప్రకటించుచు నాతనిగుణము లల్పములైననుఁ గొండంతలుగాఁజేసి నుతించిరనుట, ఐనవేల్పులవాక్యసందర్భంబులు=ఐనట్టి దేవతలయొక్క మాటలసందర్భమును, ఆకర్ణించి=ఆలకించి, వైదర్భీకాముకుండయ్యును=దమయంతిని గోరుచున్నవాఁడైనను, అయ్యాదిగర్భేశ్వరుండు=ఆభూమీశ్వరుండు - అనఁగా నలుఁడనుట, తద్దూత్యభారంబు= ఆదూతకార్యముయొక్క భారమును, భరించెన్=వహించెను. అనఁగా - నాదేవతలయొక్క వాక్యప్రకారము దమయంతియొద్దకు రాయబారిగాఁబోయి కార్యము నెఱవేర్చుట కంగీకరించెను. రాజపుంగవు నంగీకారంబు=నలుఁ డాకార్యము నెఱవేర్ప నంగీకరించుట, ఎఱింగి= తెలిసికొని, దేవతలు=ఇంద్రాగ్నియమవరుణులు, అతనికిన్, అంతఃపురప్రవేశంబునకున్ =అంతఃపురమును ప్రవేశించుటకు, ఉచితంబుగా=తగునట్టుగా, తిరస్కరిణీవిద్య=తిరస్కరిణియనెడువిద్యను, అనఁగా: - నావిద్య నవలంబించినవారు తత్సామర్థ్యముచే నొరులకగుపడకుండ నితరుల ప్రవర్తనాదులఁ దెలిసికొనుచు నిష్టమువచ్చిన స్థలములకుఁ బోఁగలుగుదురు. అట్టిసామర్థ్యముఁగల విద్యననుట, ఉపదేశించి, పొమ్ము, కార్యసిద్ధి=కార్యసాఫల్యము, అయ్యెడుమని = అగుఁగాకయని, ! వీడుకొల్పిన=పంపఁగా, నని పైపద్యముతో నన్వయము.

ఉ. అపరమోపకారనిధి యయ్యెడు వేల్పులరాయబారమ
న్మోపు వహించి యాదివిజముఖ్యుల వీడ్కొని చిత్తవృత్తికిం
జూపునకున్ శతాంగరయశుద్ధికి లక్ష్యముఁ జేసె భూతధా
త్రీపతిరాజధాని జగతీరమణీమణిహారవల్లరిన్. 76

టీ. అపరమోపకారనిధి=గొప్పయుపకారమునకు సిద్ధమైన యానలుఁడు, అప్పుడు=ఆసమయమందు, వేల్పుల రాయబారము=దేవతలకు రాయబారిగాఁబోవుట, అన్ + మోపు=అనెడిభారము, వహించి అనఁగా దేవతలయిష్టకార్యమును నిర్వహింపనెంచి, యాదివిజముఖ్యులన్ = ఆయింద్రాదిదేవతాశ్రేష్ఠులను,

వీడ్కొని=విడిచిపెట్టి, జగతీ...వల్లరికిన్-జగతీ=భూమియనెడు, రమణీ=స్త్రీ యొక్క, మణిహారవల్లరికిన్ - మణి=రత్నమయమైన, హారవల్లరికిన్=హారలతవ లెనున్న, భూతధాత్రీపతిరాజధాని=భీమరాజుయొక్క రాజధానియైన కుండి ననగరమును, చిత్తవృత్తికిన్=మనోవ్యాపారమునకు, చూపునకున్=దృష్టికిని, శతాంగరయశుద్ధికిన్-శతాంగ=రథముయొక్క, రయశుద్ధికిన్=వేగాతిశయము నకు, లక్ష్యముచేసెను=గురిచేసెను - అనఁగాఁ-గుండిననగరమునకుఁ బోవు టకు మనంబుననిశ్చయించి యాపురికభిముఖంబుగా రథంబును నడిపించుచుఁ బోయెననుట.

తా. పరోపకారనిపుణుఁడైన యానలుఁడు వేల్పులయాజ్ఞను శిరసావహించి భూమియనెడు స్త్రీకి రత్నమయమైన హారమువలెఁ బ్రకాశించుచున్న కుండిన నగరంబునకు బోఁదలంచి రథంబెక్కి యాదిక్కుమొగంబై పోయెననుట.

అలం. గమ్యోత్ప్రేక్ష.

గీ. విరహభారంబుతోన యుర్వీధవుండు
 ప్రబల మగు దేవకార్య భారము వహించె
 నౌర్వశిఖితోన జలరాశి యంబుపూర
 మౌర్వసేయుఁడు భరియింపఁ డయ్యె నిట్లు. 77

టీ. ఉర్వీధవుండు=భూమికధిపతి, అనఁగా- నలుఁడనుట, విరహభారంబు తోన=విరహమనెడి బరువుతోనె, ప్రబలము=మిక్కిలిగొప్పది, అగు దేవకార్య భారము=ఐనట్టి దేవతలకార్యమనెడి భారమును, భరించెన్=వహించెను- అనఁ గా:-కార్యమును నెఱవేర్పఁబూనుకొనెననుట, ఇట్లు=ఈనలుఁ డొనరించినట్లు, ఔర్వసేయుఁడు=అగస్త్యుఁడు, ఔర్వశిఖితోన్+అ-బడబానలముతోనె,జ లరాశియంబుపూరము=సముద్రజలము, భరింపఁడయ్యెన్=సహింపలేఁడాయెను. అనఁగా:- నగస్త్యుఁడు సముద్రపానముచేసి దేవతాకార్యము నెఱవేర్పఁదలం చినవాఁడై పానసమయమున నందున్న బడబానలమునుఁ బైకిత్రోసివైచి పాన ముచేసెను. కాని దుస్సహమైన బడబానలముతోఁ గూడ పానము సేయలేఁడయ్యె.

నలుఁ డట్లుగాక తాఁ బ్రతిజ్ఞ చేసినకార్యము విరహాగ్నిసంతప్తుఁడైనతనకు మిగు లదుస్సహమైనను, సహించి నెఱవేర్చెనని భావము.మఱియు పరోపకారగుణము నందుఁ బ్రసిద్ధిఁజెందిన యగస్త్యునికంటె నలుఁ డధికుండనియుఁ దోఁచుచున్న ది. ఈపద్యము - శ్లో ॥ భైమ్యాసమంనాజగణద్వియోగం సదూతధర్మే స్థిరధీర ధీశః । పయోధిపానే మునిరంతరాయం దుర్వారమప్యౌర్వ మివౌర్వసేయః ॥ నై ॥ స ॥ ౬ ॥ ౨ ॥ ఈశ్లోకమునుఁబట్టి యోజింప నగస్త్యుఁడు బడబానలము తోఁగూడ పానము చేసినట్లు కన్పట్టుచున్నది. కావున తదనుగుణముగా నీపద్య ము నాలవపాదమున "ఔర్వసేయుండు భరియించునట్లుధృతిని" అని సవరణ చే సినచో బాగుగనుండునని తోఁచెడిని. ఇందు "విరహభారంబు" "దేవకార్యభా రము" అను విశేషణములవలన గలిగిన సారస్యమేమన - దమయంతీవియోగమే యతికష్టముగానున్నను గష్టతరమైన దేవకార్యమను భారమునుగూడ వహిం చెనని చెప్పుటచేఁ దా నతిప్రయాసఁజెందినను, దేవకార్యము నెఱవేర్చుటకై పూనుకొనిన నలుని యుత్తమశీలత్వము ప్రకటితమగుచున్నది. మఱియుఁ దా నె న్నికష్టములలోనున్నను సహించి దేవకార్యము నెఱవేర్పఁబూనుకొనెనని చెప్పు టచే,దైవభక్తిగలదనియుఁ దోఁచుచున్నది.ఇక్కడ 'ఔర్వశిఖి'యను నుపమా నమునుఁబట్టి యోజింప దమయంతీవియోగము బడబానలమువలెనే యతిదుస్స హమైనదని వెల్లడి యగుచున్నది.

తా. నలమహారాజు దమయంతీవియోగము తనకు మిగుల దుస్సహమైనను సహించి ప్రబలమైన దేవకార్యమును నిరంతరాయముగ నెఱవేర్పఁబూనుకొ నెను. కాని యగస్త్యుఁడు సముద్రపానముజేయఁ బూనుకొని యందు దుస్స హమైన బడబానలమును సహింపలేక విడిచిపెట్టెను. అలం - వ్యతిరేకము.

మ. బలభిద్వహ్నిపరేతరాజవరుణుల్ కెపర్యుత్సుకత్వంబు సం
 ధిలఁ గూర్చుండిరి యొండొరుంగదిసి యర్థింద త్ప్రదేశంబున
 న్నలనాళీకమృణాళనాళలతికాకేనవ్యప్రణాళీమిళ
 ల్లలనాలాపకథాసుధానుభవలీలాలోలచేతస్కులై. 

టీ. బలభిత్ ...వరుణుల్-బలభిత్=బలాసురునిఁ జంపినవాఁడు (అనఁగా నింద్రుఁడు), వహ్ని=అగ్నిహోత్రుఁడు, పరేతరాజ=యముఁడు, వరుణుల్=వరుణదేవుఁడు, ఒండొరుల్=పరస్పరము, గదిసి=సమీపించి, నల... చేతస్కులై. నల=నలమహారాజనెడు, నాళీక మృణాళనాళలతికా=లతలవంటి తామరతూండ్లసంబంధమైన, నవ్య=క్రొత్తదయిన, ప్రణాళీ=జలనిర్గమప్రదేశమునుండి,(అనఁగా కాలువనుండి యని యర్థము), మిళత్=ప్రవహించుచున్న, లలనాలాపకథాసుధా=దమయంతినిగూర్చి సంభాషించుట యనెడుకథామృతమును, అనుభవ=అనుభవించుటయనెడు, లీలా=విలాసమందు, లోల=ఆసక్తిగల, చేతస్కులై=చిత్తముగలవారై, (అనఁగా రాయబారిగాబోయిన నలమహారాజు తెచ్చెడి దమయంతీవృత్తాంతమును వినఁగోరినవారై యనుట) పర్యుత్సుకత్వంబు=ఇష్టప్రయోజనమునందలి ప్రయత్నము, సంధిలన్=కూడునట్లుగా, అర్థిన్=అక్కఱతో, తత్ప్రదేశంబునన్=ఆప్రదేశమునందు, (అనఁగా నలుఁడు తమ్ము విడిచిపోయినస్థలమునందనుట) కూర్చుండిరి.

తా. ఇంద్రాగ్ని యమ వరుణులు నలమహారాజనెడు జలనిర్గమప్రదేశమునుండి ప్రవహించుచున్నదమయంతీచరిత్ర మనెడు యమృతరసమును ద్రావ కుతూహలులై యిష్టమయిన దమయంతీచరిత్రమును దెలిసికొనుట యనెడుకార్యమందు స్థిరప్రయత్నులై పరస్పరము గదిసి నలమహారాజు తమ్మువిడిచిపెట్టిపోయినప్రదేశమందే కూర్చుండిరి. అలంకారము. రూపకము.

గీ. అమ్మహారథురథముఁ డాయెయంగ నరిగె
సత్వరమున విదర్భరాజన్యుపీడు
సార మగుభాగ్యవంతుమనోరథంబు
కార్యసంసిద్ధిఁబోలె నస్ఖలితలీల. 79

టీ. అమ్మహారథురథము=అనంతుమహారాజురథము, సత్వరమునన్=శీఘ్రముగా, అస్ఖలితలీలన్=నిరాటంకమైనరీతిచే, సారము=దృఢమయినది, అగుభాగ్యవంతుమనోరథంబు=అయినట్టిభాగ్యవంతునికోరిక, కార్యసంసిద్ధిఁబోలెన్=

కార్యసాఫల్యము జెందునట్లుగా, విదర్భరాజన్యవీడు=విదర్భరాజుయొక్కపట్టణము అనఁగా కుండినగరమును, డాయంగనరిగెన్ =సమీపించె, ఇట సారమగు భాగ్యవంతు మనోరథం బనిచెప్పి నలమహారాజురథమున కుపమించుటచే భాగ్యవంతునియొక్క మనోరథము తప్పక ఫలించునట్టు లీరథముకూడ నేకార్యమునందైన జయము పొందు ననునంశము తోఁచుచున్నయది. ఇట 'సార' అను విశేషణమువలన నెట్టిభాగ్యవంతునిమనోరథమైనను దృఢముగా నుండినచో నే సఫలత్వము జెందును కాని మనోరథమున కట్టిదృఢత్వములేనిచో సఫలము కానేర దనునంశము తెల్లమగుచున్నది.

తా. దృఢత్వము వహించినభాగ్యవంతునిమనోరథంబు నిరాటంకముగా సఫలత్వము చెందునటులు నలునిరథముకూడఁ గుండినపురమును సమీపించినది.

మ. దమయంతీసుకుమారపాదకమలద్వంద్వార్పణాధన్యకు
ట్టిమహర్మ్యంబగుపట్టణంబపుడుగంటిన్ మంటినంచెంతయుం
బ్రమదంబందె దిగీశకార్యఘటనాభారంబు చింతించి దీ
ర్ఘముసుష్ణంబునుగానొనర్చెధరణీకాంతుండునిశ్వాసమున్.

టీ. దమయంతీ...హర్మ్యము-దమయంతీ=దమయంతియొక్క, సుకుమార=కోమలములైన, పాదకమల=పద్మములవంటి పాదములయొక్క, ద్వంద్వ=జతను, అర్పణా=ఉంచుటచేత, ధన్య=కృతార్థతఁజెందిన, కుట్టిమ=రత్నఖచిత ప్రదేశములుగల, హర్మ్యంబు=రాజగృహములుగలది, అగుపట్టణంబు=అయిన కుండినపురమును, కంటిన్ =చూచితిని, మంటిన్ =బ్రతికితిని, అంచున్ =అనిపలుకుచు, ధరణీకాంతుండు=నలుఁడు, ఎంతయున్ =మిక్కిలి, ప్రమదంబు=సంతోషమును, అందెన్ =పొందెను(అనఁగాఁ జిరకాలమునుండి యేదమయంతిని వరింప మిగులఁ గుతూహలపడి కామపీడితుండై నలుండు వర్తించుచున్నాఁడో యట్టి దమయంతి నివసించుచున్న కుండినపురమును జేరినంతులకు మిక్కిలి సంతసించెనని భావము), ధరణీకాంతుండు=నలుఁడు, దిగీశ...భారంబు-దిగీశ=దిక్పాలురయొక్క (అనఁగా నింద్రాదులయొక్కయనుట), కార్య=పనిని, ఘటనా=కూర్చుటయనెడి, భారము=బరువును, చింతించి=ఆలోచించి, దీర్ఘంబు = నిడుపైనది

యు, ఉష్ణంబు=వెచ్చనిదియు, కాఁ=అగునట్లుగా, నిశ్వాసముఁ=శ్వాసను, ఒనర్చెఁ=చేసెను (అనఁగా వెచ్చని నిట్టూర్పుపుచ్చెననుట). అనఁగా నలమహారాజు కుండినపురమును బ్రవేశించినందులకు మొదట సంతసించి తరువాత దేవతలకార్యమును ఘటించుటను మనంబునఁ దలపోసి తాను రాయబారిగఁ బోయి దమయంతితో నింద్రాదులు నిన్ను వరింతురని చెప్పినపు డామె తనకంటె వేమడుఁగుల యాధిక్యముగల దేవేంద్రుని వరించును గాని తన్ను వరింపదనియు నందువలనఁ దనకార్యము విఫలమగుననియుఁ దలపోసి లోపలనున్న మదనతాపము వెల్లడియగునటులు వెచ్చని నిట్టూర్పుపుచ్చె ననునీవిషయము కార్యఘటనాభారంబు చింతించి యనుపదమువలనను దీర్ఘము, ఉష్ణము, అనుపదమువలనను స్ఫురించుచున్నది.

తా. నలుఁడు దమయంతి పాదపద్మములత్రొక్కుడులచేఁ బవిత్రమయిన కట్టడపు నేలలతో నొప్పు రాజగృహములుగల కుండినపురమును బ్రవేశించి మిగుల సంతసించెను. కాని వెంటనే దేవతలకార్యమును (అనఁగా దమయంతీ వరణరూపము) దలంచుకొని తనకోర్కె విఫలమయినందులకు విచారించుచు వెచ్చని నిట్టూర్పుపుచ్చెను.

వ. ఇట్లు కుండిననగరంబు చేరం జనుదెంచి యప్పురుషప్రకాండుండు నలయుసమాత్యులం దగినవారల నొక్కరమ్యప్రదేశంబున సైన్యంబు విడియింప నియమించి బృందారక సందేశకార్యంబు నిర్వర్తింపం దలంచి ససారథికం బగుతనరథంబు నచ్చోటన నిలిపి యొక్కరుండునుఁ బాదచారంబున నప్పురంబు ప్రవేశించె నప్పుడు. 81

టీ. ఇట్లు, కుండిననగరంబుఁ=కుండినపురమును, చేరఁ, చనుదెంచి=సమీపించి, అప్పురుషప్రకాండుండు=అప్పురుషశ్రేష్ఠుండైన నలుఁడు, నలయున మాత్యులఁ=ప్రియులైన మంత్రులను, తగినవారలఁ=తగినజనులను, ఒక్కరమ్యప్రదేశంబునఁ=ఒకమనోహరమైన సలమునందు, సైన్యంబుఁ=సేనను, విడి

యింపన్, నియమించి=విడిది సేయించునటు లాజ్ఞాపించి, బృందారకసందేశకార్యంబు-బృందారక = దేవతలయొక్క, సందేశ=వర్తమానమనెడు, కార్యంబున్ = పనిని, నిర్వర్తింపన్ తలంచి=నెఱవేర్పనెంచి, ససారథికంబు=సారథితోఁగూడి యున్నది, అగురథంబున్ =అయినరథమును, నిలిపి, ఒక్కరుండును, పాదచారంబునన్ =కాలినడకచే, అప్పురంబున్, ప్రవేశించెన్, అప్పుడు అని పై పద్యముతో నన్వయము.

శా. చూడంజూడఁగ దేవతావరమునం జోద్యంబుగా భూమిభృ
చ్చూడారత్న మదృశ్యుఁడయ్యె నతఁడచ్చో నద్భుతం బందన
వ్వాడం బౌరజనంబు లెల్లనితఁ డెవ్వాఁడొక్కొ నేత్రోత్సవం
బై డాయం జనుదెంచె నంతటన మాయంబయ్యె నం చెం
తయున్. 82

టీ. చూడన్, చూడన్,కన్ =చూడఁగాఁ జూడఁగా, దేవతావరమునన్ = దేవత లిచ్చినకోరికచే (అనఁగా దమయంతి యంతఃపురంబునఁ జొచ్చుటకు నింద్రాదు లొసంగినతిరస్కరిణీవిద్యకొక్కమహిమచే ననుట), చోద్యంబుగాన్ =అద్భుతముగా, భూమిభృచ్చూడారత్నము=రాజులలో శ్రేష్ఠుఁడైన, అతఁడు=ఆనలుఁడు, అవ్వాడన్ =ఆవీథియందు, పౌరజనంబు లెల్లన్ =పురజనులందఱు, ఇతఁడు=ఈ వచ్చినపురుషుఁడు, ఎవ్వాఁడొక్కొ=ఎవఁడో కదా, నేత్రోత్సవంబై=కనులపండువు నొనరించువాఁడై, డాయన్ =సమీపముగా, చనుదెంచెన్ =వచ్చెను, అంతటన =తత్క్షణమందే, మాయంబయ్యెను=అంతర్ధానము చెందెను, అంచున్ =అనిపలుకుచు, ఎంతయున్ =మిక్కిలి, అద్భుతంబందన్ = అచ్చెరువందుచుండఁగా, అచ్చోన్ =ఆస్థలమందు, అదృశ్యుఁడయ్యెను. అంతర్ధానము చెందెను.

తా. నలుం డాకుండినపురమును బ్రవేశించి కొంతదూరము చని తిరస్కరిణీమహిమ చేకొని పురముననున్నజనులందఱు కనులపండువు లొనరించుచు నీపురంబు ప్రవేశించి యిప్పటి కిపుడే యంతర్ధానము చెందెను. ఈపురుషుఁ డెవఁడైయుండునో యని యచ్చెరుపడుచుండఁగా నంతర్ధానము చెందెను.

వ. ఇట్లంతర్హితుండై రాజమార్గంబున నిరర్గళవేగంబునం జని యా రాజకుంజరుండు మదకుంజరఘటాసుందరం బగురాజమందిరంబు డాసి. 83

టీ. ఇట్లు=ఈప్రకారముగా, అంతర్హితుండై=అంతర్ధానము చెందినవాఁడయి, రాజమార్గంబునన్=రాజవీధియందు, నిరర్గళవేగంబునన్=అడ్డులేని వేగముచే, చని=పోయి, ఆరాజకుంజరుండు=ఆరాజశ్రేష్ఠుఁడైన నలుఁడు, మద ... సుందరంబు-మదకుంజర=మదపుటేనుఁగులయొక్క, ఘటా=సమూహముచే, సుందరంబు=మనోహరమైనది, అగు, రాజమందిరంబున్=అయినట్టి రాజగృహమును, డాసి=సమీపించి, అని వైపద్యముతో నన్వయము.

సీ. వంచనమై డాఁగి వర్తించు టిది యేమి
ప్రాభవం బని సిగ్గు పాటునొందు
నాయుధహస్తులై యాయితం బై యున్న
రక్షివర్గముల తీవ్రతకు నవ్వు
నది యెవ్వరని ప్రతీహారు లెవ్వరి నన్నఁ
దన్నుగాఁ దలఁచి చిత్తమున నెనఁగు
నెదురుగాఁ జనుదెంచు నిందీవరాక్షుల
కొయ్యెయ్యఁ దెరువిచ్చి యోసరిల్లుఁ
గీ. దలఁచితలఁచి యలీకనైదర్భిఁ గాంచుఁ
గాంచి వేల్పులప్రియవాచికంబు నొడువు
నొడివి తనమాట కచ్చెరుపడుజనంబు
క్రందుసందడిఁ దెలివొందు రాజసుతుఁడు. 84

టీ. రాజసుతుఁడు=రాజకుమారుఁడైన నలుఁడు, వంచనమై=మోసముచే, డాఁగి=మఱుఁగుపడి, వర్తించుట=తిరుగుట, ఇదియేమి ప్రాభవంబు=ఇదియేమి ప్రభుత్వమని, సిగ్గుపాటున్, ఒందున్=సిగ్గుఁ జెందుచుండును (అనఁగా నలుఁడు తిరస్కరిణీవిద్యచే నొరులకంటఁ బడకుండ ప్రవర్తించుచుఁ దా రాజకుమారుండు

గనుక ఛీ! యుత్తమరాజపుత్త్రిండనయిన నేను సువ్యక్తముగ నీపురంబు ప్రవేశించుట యుక్తముకాని మోసముచే నొరులకంటఁ బడకుండఁబోవుట యిది ప్రభుత్వపద్ధతికాదని సిగ్గుఁజెందెనని భావము.) ఆయుధహస్తులై=ఆయుధములు పాణులయందు గలవారలై, యాయితంబై=సిద్ధపడి (అనఁగా నొరులెవరైన నాస్థలముఁ జొచ్చినచోఁ దుదముట్టించుటకు సిద్ధపడి యనిభావము.) ఉన్న... తీవ్రతకున్ = ఉన్న రక్షకభటుల సమూహముల యురవడికి, నవ్వున్ = నవ్వుచుండును (అనఁగా నాయుధములధరించి పెఱవా రాస్థలమును జేరకుండునటుల కాపాడ నడుముకట్టి జాగరూకులై వర్తించినను దిరస్కరిణీవిద్యచే నంతర్హితుండయిన తన్నుఁ గనుఁగొనలేకుండుటచే నాభటుల వ్యర్థప్రయత్నములకు నవ్వుచుండెననిభావము. అది=ఆవచ్చెడువారు, ఎవ్వరు, అని, ప్రతీహారులు=కావలివారు, ఎవ్వరినన్నన్ =ఎవ్వరిని గూర్చిపలికినను, చిత్తమునన్ =మనసునందు, తన్నుగాన్ ,తలఁచి=తన్ననుకొని,ఎసఁగున్ =తొట్రుపడును,(అనఁగా నలునకిది వఱకుఁ దిరస్కరిణీవిద్యచే వర్తించుట యభ్యాసము లేకపోవుటచే నే నొరులకుఁ గనఁబడననువిషయము మఱచి ద్వారపాలు రెవరినైన "ఎవరు వార"ని యడిగినఁదన్ననుకొని తొందరపడుచుండును) ఎదురుగాన్ =అభిముఖముగా, చనుదెంచు నిందీవరాక్షులకున్ =వచ్చుచున్నకలువకంటులకు, అనఁగా స్త్రీలకనుట, ఒయ్యొయ్యన్ =మెల్ల మెల్లగా, తెరువు, ఇచ్చి=మార్గమొసఁగి, ఓసరిల్లున్ =ఒత్తిగిల్లును, లేక తప్పుకొనును(అనఁగా నలుఁడు తనకెదురుగావచ్చుచున్న స్త్రీలను దప్పించుకొని పోవుచున్నాఁడని భావము) తలఁచి తలఁచి=మాటిమాటికి స్మరించి, అలీకవైదర్భిన్ =బూటకపు దమయంతిని (అనఁగా నలుఁడు దమయంతినే సంతతము తలఁచుచుండుటచే మోహావశమునఁ గానవచ్చుచున్న దమయంతిని జూచునని భావమును) కాంచి=అట్లుచూచి, వేల్పుల ప్రియవాచికంబు=దేవతలకు నిష్టమయిన సందేశసమాచారము, నుడువున్ =పలుకును, (అనఁగా బూటకపుదమయంతిని చూచి దేవతులకార్యమును వివరించి చెప్పుచుండునని భావము. నొడివి=ఇటులుపలికి, తనమాటకున్ =తాఁబలికిన వచనములకు, అచ్చెరు...సందడిన్ -అచ్చెరుపడు=ఆశ్చర్యము నెందుచున్న, జనంబు=జనముయొక్క, [illegible] సందడిన్ =

కలకలధ్వనిచేత, తెలివొందుఁన్ = తెలివిచెందును, (అనఁగా నలుఁడు మాటలాడు చుండుట యచటిజనంబులు విని నలుఁడు తమ కగపడనందున నీమాట లెవరను చున్నారని యాశ్చర్యమును బొంది కలకలధ్వని చేయుచుండ నది విని నలుఁడు నారహస్యము తెల్లమగుచున్నదని తెలివిఁజెంది మాటలాడుట మానివేయుచుం డెనని భావము.

తా. నలుఁడు తాను తిరస్కరిణీవిద్యచే నదృశ్యుఁడై బోవుచు దాను ప్రభువుగనుక ప్రభువునకుఁ దగినటులుగాకుండ వర్తించుటకు మనములో సిగ్గుఁజెందుచు,నాయుధములు ధరించి యెంతజాగరూకులై యున్నను దన్నుఁ గనుఁగొనలేకున్న రక్షకభటులను జూచి నగుచు ద్వారపాలురు 'ఆపోయెడివారెవర' ని యవలించినపుడు తన్నునుకొని తొట్రుపడుచుఁ, దన కభిముఖులై వచ్చు స్త్రీలను దప్పించుకొనిపోవుచు, సంతతము దమయంతిని స్మరించుచుండుటచే నలుదిక్కుల బూటకపుదమయంతిని బొడఁగాంచి తాను వెచ్చినదేవతుల సందేశమును వివరించిచెప్పుచు, నాపలికినమాటల నచ్చటిజనులు విని యచ్చెరువడి కలకలము చేయు నదివిని తెలివినొందుచు నుండును.

వ. ఇవ్విధంబున నేనుంగుమొగసాల గడచి కక్ష్యాంతరంబులు ప్రవేశించి యంతఃపురంబు సొత్తెంచె నప్పుడు. 85

టీ. ఇవ్విధంబునన్ = ఈప్రకారముగా, ఏనుంగుమొగసాలన్ = ఏనుఁగులుండెడు సాలను, కడచి = దాఁటి, కక్ష్యాంతరంబులు = ఇతరములయిన కట్లను, ప్రవేశించి = చొచ్చి, అంతఃపురంబు, సొత్తెంచెన్ = ప్రవేశించెను. అప్పుడు = ఆసమయమందు, పైపద్యముతో నన్వయము.

చ. ప్రిదిలిననీవిఁ గేల సవరించుతలోదరి నోర్తుఁ గాంచి లోఁ
గదిరినపాపభీతిఁ బతికై కన్నులు మోడ్చ నొకొల్లొకళ్లకై
యెదురుగవచ్చివచ్చి యొకరొయిద్దఱుముద్దియ లొత్తిరవ్విభున్
మదగజరాజకుంభములకైమచ్చరికించుకుచద్వయంబులన్.

టీ. ప్రిదిలిననీవిన్ = ... చేలన్ = ... ... ... లచే, సవ

రించుతలోదరిన్ = సవరించుకొనుచున్న స్త్రీని, ఓర్తున్ =ఒకర్తెను, కాంచి= చూచి, లోన్ =మనసులో, కదరినపాపభీతిన్ = అతిశయించిన పాపభయము చే,పతి=నలుఁడు,(అనఁగాఁ బరస్త్రీలయొక్క గుట్టులను జూచినందునఁ బాపము సంభవించినదని భయముచెందియనుట) నేత్రములు, మోడ్చన్ =మూసికొనఁగా, ఒకొళ్లొకళ్లకై = ఒకరికొకరు, ఎదురుగన్ = అభిముఖముగా, వచ్చివచ్చి, ఒకయిద్దఱు ముద్దియలు=ఒకయిద్దఱుస్త్రీలు,అవ్విభున్ =ఆనలుని, మదగజరాజకుంభములన్ = మదించినయేనుఁగులకుంభస్థలములను, మచ్చరికించు = తిరస్కరించుచున్న, కుచద్వయంబులన్ = స్తనద్వయములచే, ఒత్తిరి= హత్తింపఁజేసిరి(అనఁగా నింతవఱకు నలుఁడు తా నొరులకుఁ గనఁబడకపోయినను దనకొరులు గనఁబడుచుండిరి గనుక పరస్త్రీలు తనకెదురైనపుడుచూచి తప్పించుకొనిపోవుచుండెడివాఁడు కాని యిపుడు నలుఁడు కనులుమోడ్చియుండుటచేఁ దనకెదురుగవచ్చు స్త్రీలను దప్పించుకొనలేకయుండెను. అందువలన నిరువురు స్త్రీలు తమకుచములతని కొరయునటులు తాఁకిరనిభావము.

తా. నలమహారాజంతఃపురముఁ జొచ్చునపుడు విడివడినపోఁకముడిని సవరించుకొనుచున్నయొక స్త్రీని జూచి పాపభయముచే నేత్రములు మూసికొనఁగా మఱి యిరువురు స్త్రీ లభిముఖముగవచ్చి నలునిఁ దమకుచములచే నొత్తిరి.

వ. మఱియు శుద్ధాంతభవనాంతరంబులఁ జరియించువాఁడు హృదయోత్కంఠాతిరేకంబున. 87

టీ. మఱియున్ =ఇంకను, శుద్ధాంతభవనాంతరంబులన్ = తక్కినఅంతఃపురగృహములయందును, హృదయోత్కంఠాతిరేకంబునన్ - హృదయ=హృదయమందున్న,ఉత్కంఠా=వేడుకయొక్క, అతిరేకంబునన్ =అతిశయముచే, పైపద్యముతో నన్వయము.

సీ. సమనుభూతానాదిసంసర్గపరంపరా
 ప్రసక్సమాకలితసంసర్గమువనొ
లలితకేళీచిత్రఫలకాభివిలిఖిత
 ప్రతిమావిలోకనాభ్యాసమువనొ

యాస్వాదనీయవిహంగపుంగవగవీ
హైయంగవీనపానాభిరతినొ
భువనైకమోహనాద్భుతశంబరారాతి
శాంబరీలీలావిడంబమునసొ

తే. వివిధసంకల్పకల్పనావేశమునసొ
కన్నెఁ గొక్కాఱు మెఱుఁగుదీఁగయనుబోలెఁ
బొలసి యప్పడ యడఁగుపూఁబోఁడిమూర్తి
నక్కుమారుండు నలుదిక్కులందుఁ గాంచు. 88

టీ. సమనుభూతా...సంసర్గమునసొ- సమనుభూత=అనుభవింపఁబడిన, అనాది=అనాదులైన (అనఁగా నింతకంటె మొదటిసృష్టి లేదనుట), సర్గ=సృష్టులయొక్క,పరంపరా స్రక్ =మాలికవంటివరుసనుండి, సమాకలిత=లభించిన, సంసర్గమునసొ=సంపర్కముచేతనో(అనఁగాఁ జిరకాలమునుండి వచ్చుచున్నమాలికవంటి సృష్టివలనఁ బొందఁబడిన సంపర్కముచేత ననుట, లేక పూర్వజన్మములయం దనుభూతమయి యనుస్రుతముగా వచ్చుచున్నసంస్కారమునుబట్టి యనుట), లలిత.. అభ్యాసమునసొ-లలిత=సుందరమయిన, కేళీ=విలాసార్థమయిన, చిత్రఫలక=చిత్తరువుపలకలయందు, అభివిలిఖిత=లిఖింపఁబడిన, ప్రతిమా=దమయంతీప్రతిమయొక్క, విలోకనా=చూచుటయందలి,అభ్యాసమునసొ=అభ్యాసముచేతనో(అనఁగాఁ జిత్తరువునందు సుందరముగా లిఖింపఁబడిన దమయంతిప్రతిమను సర్వకాలసర్వావస్థలయందుఁ జూచుచుండుటచేఁ గలిగిన యభ్యాసముచేతనో యనుట),ఆస్వాద...రతిన్ ఒ-ఆస్వాదనీయ=అనుభవింపఁదగియున్న, విహంగపుంగవ=పక్షిశ్రేష్ఠముయొక్క(అనఁగా హంసముయొక్కయనుట), గవీ=వాక్కులనెడు, హైయంగవీన=సద్యోఘృతమును,పాన=త్రావుటయందలి, అభిరతినొ=కోరికచేతనో (అనఁగాఁ బూర్వము హంసము తనయొద్దికివచ్చి దమయంతినిగూర్చి చెప్పినవాక్యములను బాగుగ వినుటచేతనో యనుట),భువనైక

...విడంబమునసో-భువనైకమోహన=భువనములకు ముఖ్యముగా మోహముగలిగించెడునదియు, అద్భుత=ఆశ్చర్యమునుగొలుపు, శంబరారాతి=మన్మథునియొక్క, శాంబరీలీలా=మాయావిలాసములయొక్క, విడంబమునసో = అనుసరించుటచేతనో (అనఁగా మూడులోకములను మోహింపఁజేయఁజాలిన మన్మథునిమాయలకు లోఁబడి యుండుటచేతనో యనిభావము), వివిధ...ఆవేశమునసో-వివిధ=అనేకములైన, సంకల్ప=మనసులోఁ దలఁచుకొనుటయును, కల్పన=కల్పించుటయొక్క, ఆవేశమునసో=ఆవేశించుటచేతనో (అనఁగాఁ బలువిధములైన మనోరథములను గల్పించుకొనుటయందలి యతిశయముచేతనో యనుట), కన్నె...పోలెన్ = క్రొత్తతొలకరిమెఱపుతీఁగవలె, పొలసి=సంచరించి, అప్పుడు=తత్క్షణమునసే, అడఁగు...మూర్తి-అడఁగు=అదృశ్యమగు,పూఁబోఁడి=దమయంతియొక్క,మూర్తి=స్వరూపమును,అక్కుమారుఁడు=అనలుఁడు,నలుదిక్కులయందున్ =నాలుగు దిక్కులయందును, కాంచున్ = చూచుచుండును.

తా. నలుఁ డంతఃపురంబులయందు సంచరించునపుడు పూర్వజన్మసంస్కారమునుబట్టియో లేక యెల్లపుడు తాను జిత్తరువునం దత్తియున్న దమయంతిరూపమును జూచుచుండుటంబట్టియో లేక నాఁడు హంసమువచ్చి దమయంతిగుణములను వర్ణించినపు డాగుణంబు లతనిమనసునందు బట్టియుండుటచేతనో లేక ముల్లోకములను మోహింపఁజేయఁజాలిన మన్మథునిమాయలకు లోఁబడియుండుటంబట్టియో పలువిధములయినమనోరథములను సర్వకాలములయందును గల్పించుకొనుచుండుటంబట్టియొ నూతనవర్షాకాలపుమెఱపుతీఁగవలెఁ దళుక్కుమని మెఱసి యప్పటికప్పుడే యదృశ్యమగు దమయంతియొక్క యాకారమును జూచుచుండును. అనఁగాఁ దన్మయుఁడై యున్నాఁ డనుట. భ్రాంతిమదలంకారము.

ఉ. సోరణగండ్లమార్గమునఁ జొచ్చినసన్నని గాలి యొక్కయం
భోరుహపత్రనేత్రనునుఁబొంకపుఁజన్నులమీఁదిసన్నపుం
జీరచెఱంగు వాయగిలఁ జేసినవిశ్వధరాతలేశ్వరుం
డోరయొనర్చెఁ బాపభయమొంది నిజాననచంద్రబింబమున్.

టీ. సోరణగండ్లమార్గమునన్ =కిటికీల మార్గముచే, చొచ్చినసన్ననిగాలి= ప్రవేశించిన మందమారుతము, ఒక్క... చెఱంగు-ఒక్కయంభోరుహపత్ర నేత్ర= పద్మపత్రములవంటి నేత్రములుగల యొక స్త్రీయొక్క, ను=నున్నని, పొంక ము=అందమైన, చన్నులమీఁది=కుచముల పైనున్న, సన్న పుంజీర చెఱంగు=పలుచ నిపైఁటకొంగు,పాయగిలన్ =తొలఁగునటులు, చేసినన్ =చేయఁగా, విశ్వధరా తలేశ్వరుండు=సమస్తభూమికి నధిపతియైననలుఁడు, పాపభయమొంది=పాపభ యమునుజెంది, నిజాననచంద్రబింబమున్ = తనయొక్క చంద్రునివంటి ముఖము ను, ఓరయొనర్చెన్ = పెడగాఁజేసెను.

తా. గవాక్షమార్గములనుండి వచ్చుచున్న మందమారుత మొక స్త్రీయొక్క రమణీయకుచములపైనున్న వస్త్రమును దొలంగునటులు చేయఁగా నలుఁ డది చూచి పాపభయమందుచు పరాఙ్ముఖుఁ డాయెను.

తే. ఇరుల గెలిచినయంతఃపుర రేందుముఖుల
కురుల మరుఁడనువేఁటకాఁ డురులు సేసి
మరులు గొలుపంగ లేఁడయ్యె మనుజవిభుని
సరులు లేనిదృక్ఖంజన శాబకముల. 90

టీ. ఇరులన్ = చీఁకటులను, గెలిచినయంతఃపురేందుముఖులకురులన్ = గెలిచినట్టి యంతఃపుర స్త్రీలయొక్క ముంగురులను, మరుఁడను వేఁటకాఁడు= మన్మథుఁడనెడు వేఁటకాఁడు, ఉరులుసేసి=ఉరులుగాఁబన్ని, మనుజవిభుని = లునియొక్క, సరులులేని దృక్ఖంజనశాబకములన్ =సాటిలేని నేత్రములనెడు కాటుకపిట్టలపిల్లలను, మరులు=మోహమును, కొలుపంగ లేఁడయ్యెన్ =కలిగింప లేకపోయెను. అనఁగా నంతఃపురములలో మెలఁగుచున్న సుందరులైన యంతః పుర స్త్రీలను జూచినను నలునిమనస్సు చలింపలేదని భావము.

తా. చీఁకటులను గెలిచినట్టి యంతఃపుర స్త్రీలయొక్క ముంగురుల నురులు గాఁ బన్నుకొని మన్మథుఁ డనువేఁటకాఁడు నలుని నేత్రములనెడు కాటుకపిట్టల పిల్లలను మోహము జెందునటులు చేయలేకపోయెను. అలం. రూపకము.

ఉ. కష్టప్రత్యవాయ మిది గల్గుచు నున్నది మీలనక్రియా
స్పష్టవిలోకనంబుల నపాంగపుఁజూ పనురాగవిక్రియా
పుష్టికరంబు బాహ్యగృహభూమిఁ బ్రచారము సేయుచోట నా
దృష్టికి మార్గ మొండుగలదే యని చింతవహించె రాజెదన్.

టీ. రాజు=నలమహారాజు, బాహ్యగృహభూమిన్ =బాహ్యప్రదేశమందును గృహమందును, ప్రచారము=సంచారము, చేయుచోటన్ =చేయునప్పుడు, మీలనక్రియాస్పష్టవిలోకనంబులన్ =నేత్రములను బాగుగ మూసికొనుటచేతను, స్పష్టముగా చూచుచుండుటచేతను, కష్టప్రత్యవాయము=సహింప శక్యముకాని పాపము, ఇది, కల్గుచున్నది=సంప్రాప్తమగుచున్నది, (అనఁగాఁ బరస్త్రీలను జూడలేక కన్నులను మూసికొన్నప్పుడు పరస్త్రీలు తన్నెదుర్కొని తాఁకుచుండుటం బట్టియుఁ, దాను కనులు తెఱచిచూచునప్పుడు పరస్త్రీలగుట్టులు తనకంటఁ బడుచుండుటం బట్టియు నిట్లు చూచినను చూడకుండినను పాపము సంభవించుచున్నదని భావము) అపాంగపుఁ జూపు=క్రేగంటిచూపు, అనురాగ విక్రియాపుష్టికరంబు - అనురాగ=ప్రేమయనెడు, విక్రియా=వికారమును, పుష్టికరంబు=వృద్ధిచేయునది, (అనఁగాఁ గ్రేగంటిచూపులచేఁ జూచినచో నది యనురాగవ్యంజక మగునని భావము. ఈ చెప్పుటచే నలుఁడు కనులు విచ్చిచూచినను లేక మూసికొన్నను క్రేగంటిచూపులచేఁ జూచినను బ్రత్యవాయము సంభవించుచున్నదనుట స్పష్టమగుచున్నది. కానయట్లు చూచుటకు వలనుపడదని భావము) నాదృష్టికిన్ =నాచూపునకు, మార్గ మొండు=ఈ చెప్పినవానికంటె నితరమైన మార్గమేదైన, కలదే=కలుగునా, అని, ఎదన్ =మనస్సునందు, చింత=ఆలోచన, వహించెన్ =చేసెను. (అనఁగా నాలోచించెననుట.)

తా. ఆనలుఁడు 'అకటా నేను బాహ్యప్రదేశమందు సంచరించినపుడు, గృహములయందు సంచరించినప్పుడును, నేత్రములు మూసికొనినను, తెఱచినను గ్రేగంటిచూపులచేఁ జూచినను నెట్లయినను పాపము సంభవించుట తప్పకున్నయది. నా కీమూడుమార్గములకంటె నితరమార్గ మేదైననుండునా? అట్లయినఁ బాపము సంభవింపదే' అని యాలోచింపఁ దొడంగెను.

తే. రాజశుద్ధాంతభామినీరత్నరాజి
దీము గావించి వలరాజ యధీశు నేసె
నతనితాల్మికి నది పూజ యయ్యె నట్ల
యతనుతూపులు పుష్పంబులౌనొ కావొ. 92

టీ. వలరాజు=మన్మథుఁడు, రాజ...రాజి- రాజ=రాజులయొక్క, శుద్ధాంత భామినీరత్న=శ్రేష్ఠురాండ్రయిన యంతఃపుర స్త్రీలయొక్క, రాజిన్=పంక్తిని, దీముగావించి=దీమముగాఁజేసి(దీమములనఁగాఁబక్షిమృగాదులను బట్టుకొనుటకై వేఁటకానిచే బెంపఁబడుచున్న పక్షులు మృగములు మొదలగునవి.)వలరాజను వేఁటకాఁడు తనచేఁ బెంపఁబడుచున్న యంతఃపుర స్త్రీలను ముందుగాఁ బెట్టి నలుని లొంగదీసికొనుటకుఁ బూనుకొనెనని చెప్పుటచే నంతఃపుర స్త్రీలతి సౌందర్యవంతురాండ్రని తెలియవచ్చుచున్నది. అధీశున్=నలుని, ఏసెన్=కొట్టెను. అతనితాల్మికిన్=అనలునియొక్క యోర్పునకు, అది=ఆమన్మథుఁడు కొట్టుట,పూజయయ్యెన్=పూజవంటిది యయ్యెను (అనఁగా నలుఁడు వింట బాణమును సంధించివేయఁగా నవి నలునియొక్కయోర్పునకు బూజఁజేసినటు లాయెను గాని యతనితాల్మిని జలింపఁజేయలేకపోయినవని భావము). అట్ల=అది నిశ్చయమే, అతనుతూపులు=మన్మథుని బాణములు, పుష్పంబులు=పూవులు, ఔనో, కావో=పుష్పములుకావో (అనఁగా మన్మథునిబాణములు పుష్పములౌనో కావోకాని వలరాజు ప్రయోగించినబాణములుమాత్రము నలునియోర్పునకుఁ బూజయగుట నిశ్చయమనిభావము) మన్మథుఁ డంతఃపుర స్త్రీలనెడి దీమమునుంచి తా శరవర్షము గురియించియు, నలునిధైర్యమును జలింపఁజేయలేకపోయెనని నిశ్చయార్థము.

తా. మన్మథుఁ డంతఃపుర స్త్రీలను దీమముగాఁ జేసికొని బాణమును సంధించి నలమహారాజునుగొట్టెను. ఆకొట్టిన బాణములు పుష్పములౌనో కావో తెలియవుకాని నలమహారాజు ధైర్యమునకుఁ బూజచేసినట్లాయెను.

ఉ. చీటికిమాటి కేకపథసీమఁ దొలంగఁగఁ బాటుగామి శృం
గాటకవీథి కేఁగెఁ బతి కాంతలసందడిగలి యెన న

ప్పాటవసించియుండుటయుపాయమె చూడఁగ నాల్గుత్రోవలం
బాటలగంధులొక్కతఱిఁ బైకొనివచ్చినఁ జిక్కుఁ జిక్కఁడో.

టీ. పతి=నలమహారాజు, చీటికిమాటికిన్ =పల్మాఱు, ఏకపథసీమన్ =ఒక్కరే పోఁదగినమార్గప్రదేశమునందు, అనఁగా నిఱుత్రోవయందనుట, మెలంగన్ = సంచరించుటకు, పాటుగామి=శ్రమంపడుట యుక్తముకాకపోవుటచే, అనఁగా నలుఁ డట్టి యిఱుత్రోవలయందుఁ జరించినప్పుడు స్త్రీ లెదురుగా వచ్చినచోఁ దప్పించుకొనుట కవకాశము చిక్కకపోవుటచే నాయాస్త్రీలను దాఁకి పాపమార్జించుకొనుచున్నాఁడు. కావున నతఁ డట్టిసన్ననిమార్గములయందు జరించుట యుక్తముకాదని భావము. కాంతలసందడికల్మియైనన్ =స్త్రీలయొక్కసమ్మర్ద మధికముగానుండఁగా, శృంగాటకవీథికిన్ = నాల్గుత్రోవలు కలసియున్నచోటికి, ఏఁగెన్ =వెళ్లెను. అనఁగా నాల్గుత్రోవలుగల ప్రదేశమందున్నచో నొకమార్గమునుండిగాని రెండుమార్గములనుండికాని మూడింటనుండికాని స్త్రీలువచ్చినను మఱియొకమార్గమునకుఁ బోఁగలిగియుండుటచే స్త్రీస్పర్శప్రత్యవాయముండదని నలునియభిప్రాయము. అప్పాటన్ = అవ్విధమున, వసించియుండుట = నిలిచియుండుట, చూడఁగన్ =ఆలోచింపఁగా, యుక్తమె=తగునా, అనఁగాఁ దగదనుట. నాల్గుత్రోవలన్ =నాలుగుమార్గములనుండియు, పాటలగంధులు=స్త్రీలు ఒక్కతఱిన్ =ఒక్కమాఱు, పైకొనివచ్చినన్ =ఎదురుగావచ్చినచో, చిక్కన్ = కష్టమునందు, చిక్కఁడో=తగులుకొనఁడా? అనఁగాఁ దగులుకొనుననుట.

తా. నలుఁడు సన్ననిమార్గములయందుఁ దిరుగునప్పుడు స్త్రీలను దప్పించుకొనుట కష్టముగానుండుటచే నాప్రదేశమువిడిచి యొకమార్గమునుండి మఱియొకమార్గమునకుఁ దప్పించుకొనుటకుఁ దగియుండునని యోజించి శృంగాటకవీథికేఁగెను. కాని యతఁ డట్లుపోవుట యుక్తముకాదు. ఏమనఁగా నాల్గుత్రోవలనుండి స్త్రీలొక్కపర్యాయమే వచ్చినచో నాతనిప్రయత్నము వ్యర్థమేకదా?

చ. ఉరవడి నేఁగుచోట నొకయుగ్మలియొల్లెచెఱంగు మేదినీ
శ్వరునిభుజావిభూషణము వజ్రములన్ దవులంగ జాఱినన్

విరిసెను నీవిబంధ మది విస్మయ మందఁగఁ దోడిభామినుల్
పరిహాసనం బొనర్పఁ బతి పాపభయంబునఁ గంప మొందఁగన్.

టీ. ఉరవడిన్ =మిక్కిలివేగముగా, ఏఁగుచోటన్ =వెళ్లునప్పుడు, ఒకయుగ్మలి... చెఱంగు - ఒకయుగ్మలి=ఒక స్త్రీయొక్క, ఒల్లె=చీరయొక్క, చెఱంగు= అంచు, మేదినీ...వజ్రములన్ - మేదినీశ్వరుని=నలరాజుయొక్క, భుజా=బాహువులయందున్న, విభూషణము=అలంకారములయొక్క, వజ్రములన్ =వజ్రమాణిక్యములందు, అనఁగా నలరాజు బాహువులయందున్నయలంకారములయందుఁ గ్రుచ్చఁబడియున్న వజ్రమాణిక్యమునందు ననుట, తవులంగన్, జాతిన్ =తగులుకొనిజాఱఁగా,అది, విస్మయము=ఆశ్చర్యము, ఒందఁగన్ =పొందునట్లుగా, తోడిభామినుల్ =దానితోవచ్చునట్టిస్త్రీలు, పరిహాసనంబున్ ,ఒనర్పన్ = పరిహాసముచేయునట్లుగా, పతి=నలుఁడు, పాపభయంబునన్ =పాపభీతిచే, కంపము, ఒందఁగన్ =చలింపఁగా, నీవిబంధము=పోకముడి అనఁగా స్త్రీలు నాభియొద్ద బంధించియున్నముడి యనుట, విరిసెన్ = విడిపోయెను. అనఁగా నలుని భూషణములయందున్న రత్నములకుఁ దగిలి యా స్త్రీయొక్క బట్ట విడిపోగా నదిచూచి తోడిభామినులు నవ్విరనియు, దిగంబరయయిన స్త్రీని జూచుటచేఁ బాపము సంభవించెనని నలుఁడు భయమందెననియు, గట్టిగ బంధింపఁబడియున్న పోకముడి నిష్కారణముగా నేల విడివడెనని యాపర్విడునట్టిస్త్రీ యాశ్చర్యము చెందెననియు భావము.

తా. ఒక స్త్రీ మిక్కిలివేగముతోఁ బోవుచుండఁగా దానిచీరచెఱంగు నలుని యలంకారములయందున్న మణులకుఁ దగిలికొంటచేఁ గట్టుబట్ట విడిపోయెను. అదిచూచి యా స్త్రీ యచ్చెరువొందెను. తోడి స్త్రీలు నవ్విరి. ఆనలుఁడు పాపభయముచే వడంకెను.

చ. ఇరువురు నీలనీరజనిభేక్షణ లించినవేడ్కతోఁ బర
స్పర మెదిరించి కాంచనపుబంతులఁ గ్రచ్చఱఫాటులాడఁగా
ధరణిపుఁ డడ్డమై చనుఁడుఁ దద్భుజదండముఁ దాఁకి మిట్టి బి
ట్టురవడిఁ జెండు క్రమ్మఱినను బ్బరవ్రాయిరి భామినీజనుల్. 95

టీ. నీలనీరజనిభేక్షణలు=నల్లఁగలువలవంటి నేత్రములుగల స్త్రీలు, ఇరువురు, ఇంచినవేడ్కన్ = అధికమయిన కౌతుకముతో, పరస్పరము=ఒండొరులు, ఎదిరించి=ఎదుర్కొని, కాంచనపుబంతులన్ = బంగారపుకందుకముల చే, క్రచ్చఱన్ =శీఘ్రముగా, వాటులాడఁగాన్ =ఒకరిపైనొకరు వేసికొనుచుండఁగా, తచ్చనవాటులాడఁగన్ అనిపాఠా-పరిహాసార్థ మాడుకొనుచుండఁగా, ధరణిపుఁడు=నలరాజు, అడ్డమై=ఆబంతులకు నడ్డముగా, చనుదున్ =పోవుచుండఁగా, తద్భుజదండమున్ =ఆనలునిభుజాదండమును, తాఁకి=తగులుకొని, మిట్టి=మీఁదికెగిరి, బిట్టు=అధికమగు, ఉరవడిన్ = శీఘ్రత్వముతో, చెండు=బంతి, క్రమ్మఱినన్ =తిరిగిరాఁగా, భామినీజనముల్ =స్త్రీజనము, ఉబ్బరపోయిరి=నివ్వెఱపడిరి-అనఁగా నాశ్చర్యపడిరనుట.

తా. ఇరువురు స్త్రీలు మంచివేడ్కలతో నొండొరుల కభిముఖులై యుండి బంగారపుబంతులఁ జేకొని ఒకరిపైనొకరు వేగవైచుకొనుచుండఁగా నొకబంతి నడుమనుండి పోవుచున్న నలుని భుజాదండమునకుఁ దగిలి మీఁదికెగిరి మిక్కిలివేగముతో మగిడివచ్చెను. వారదిచూచి యాబంతి యట్లు వచ్చుటకుఁ గారణమరయ నేరక యచ్చెరువొందిరి.

సీ. చెలువారుఁ గ్రొమ్మించుకనిలువుటద్దములలోఁ
      బ్రతిబింబములు గానఁబడుటకతన
   సికతామయంబైన కసీమాంతరంబులఁ
      బాదపద్మంబు లేర్పడుటకతన
   నలవొక యనుఁబోలె కనాకస్కికంబైన
      యంగాంగసంస్పర్శ మైనకతన
   దిక్పాలు రొసఁగిన కదివ్యపుష్పంబుల
      బహుళంబు లగుసౌరభములకతన
తే. విరహవిభ్రాంతి నొక్కొక్క[1] వేళఁ బలుకు
   కలవరింతభాషణములకతన నప్పు

1. వేళలందుఁ,గళవళపువింతభాషలకతన .. గళవళింత భాషణములకతన.

డెవ్వఁడే నొక్క మాయావి యేఁగుదెంచె
నంతిపురమున కని లోఁగి రబ్జముఖులు. 96

టీ. చెలువారు...ములలోన్ - చెలువారు=అందమైన, క్రొమ్మించు=క్రొత్త కాంతులుగల, నిలువుటద్దములలోన్, ప్రతిబింబములు=ప్రతిఫలనములు, లేక నీడలు, కానఁబడుటకతనన్ =కనఁబడుటచేతను, సికతామయంబు=ఇసుకతోఁ గూడికొనినది,ఐన సీమాంతరంబులన్=అయినట్టి ప్రదేశములందు, పాదపద్మంబులు=కాళ్లజాడలు, ఏర్పడినకతనన్= ఏర్పడుటచేతను. అలవోకయును బోలెన్=యాదృచ్ఛికముగావలె, ఆకస్మికంబు=హఠాత్తుగా సంప్రాప్తము ఐన యంగాంగసంస్పర్శము=అయినట్టి యవయవసంస్పర్శము, ఐనకతనన్=అయిన హేతువుచేతను, దిక్పాలురు=ఇంద్రాగ్ని యమవరుణులు, ఒసఁగిన ...కతనన్ -ఒసఁగిన=ఇచ్చినట్టి, దివ్యపుష్పంబుల=దేవతాకుసుమములయొక్క, బహుళంబులు=అధికములగు, సౌరభములకతనన్=పరిమళంబులచేతను, విరహవిభ్రాంతిన్ =దమయంతీవియోగమువలనఁ గలిగిన విశేషభ్రాంతిచేత, ఒక్కొక్కవేళన్ =ఒక్కొక్కసమయములందు,పలుకుకలవరింతభాషణములకతనన్ = చెప్పెడికలవరింతవలనఁ గలుగు వింతమాటలవలనను,అప్పుడు=నలుఁడు దమయంతియంతఃపురంబులో సంచరించుచున్నప్పుడు, ఎవ్వఁడేన్,ఒక్కమాయావి=మాయలుగల పురుషుఁడొకానొకఁడు,అంతిపురంబునకును=అంతఃపురంబులోనికి,ఏఁగుదెంచెన్,అని=వచ్చెనని,అబ్జముఖులు=పద్మమువంటి,లేక చంద్రునివంటి ముఖములుగల స్త్రీలు,లోఁగిరి=భయపడిరి, అనఁగా విచ్చలవిడి చరింప వెనుదీసిరనియర్థము.

తా. నలుఁడు దమయంతి యంతఃపురంబులోఁ దిరస్కరిణీవిద్య నవలంబించి సంచరించుచుండఁగా, నతఁడు పరులకు గానరాకపోయినను, నతనినీడ నిలువుటద్దములలోఁ గనఁబడుటచేతను, నిసుకగలప్రదేశములం దతనియడుగుల జాడలు గానవచ్చుటచేతను, నాకస్మికము వారలశరీరము లతనిశరీరము తాఁకుటవలనను, నింద్రాదిదిక్పాలు రిచ్చినపుష్పంబుల పరిమళాతిరేకములచేతను, నతఁడు దమయంతీవియోగపీడితుఁడై భ్రాంతుఁడయి యున్నాఁడు కాన మోహావశమున దమయంతినిగూర్చి పలికినకలవరపుమాటలవలనను, నచ్చటిస్త్రీలందఱు నంతః

పురంబులో నెవ్వఁడో యొకమాయావి వచ్చి చరించుచున్నాఁడని యూహించి విచ్చలవిడి చరింప వెనుదీయ నారంభించిరి.

వ. ఇవ్విధంబునం బరస్త్రీపరాఙ్ముఖుండును జగన్మోహనాకారుండును నగు నారాజకుమారుండు శుద్ధాంతకాంతామధ్యంబున నిర్వికారుండై చరించుచు నుపకారికాభవనంబు గడచి యెడనెడం జంద్రకాంతవేదికావిటంకంబుల విశ్రమించుచుం బ్రబోధమోహాశబరితం బగుచిత్తంబుతో విరహవేదనాభరంబునం దూఁగాడుచుం బాదచారంబున నతిదూరం బరిగి యభ్రంకషంబును, బ్రతోళికారత్నవేదికామధ్యాధ్యాసీనసిద్ధగంధర్వాంగనాప్రవర్తితసంగీతకంబును, దారహారగుంభనవ్యాపారపారంగతశంభళికానికాయంబును, బంచశరలేఖలేఖనావియూతదూతికానీతికానీతకేతకీగర్భపలాశంబును, గల్హారబిసకిసలయప్రధాననానాశిశిరోపచారద్రవ్యసమానయనసత్వరసంచారికాజనాసారప్రసారసంకులంబును, నగుదమయంతీప్రాసాదంబు డాయం జని యచ్చట. 97

టీ. ఇవ్విధంబునన్ = ఈరీతిగా; పరస్త్రీపరాఙ్ముఖుండును = పరస్త్రీలకు విముఖుఁడగువాఁడును, జగన్మోహనాకారుండును = జగత్తునకు మోహమును పుట్టించు నాకారముకలవాఁడును, నగు నారాజకుమారుండు, అయిననలుఁడు, శుద్ధాంత...మధ్యంబునన్ = అంతఃపురస్త్రీలనడుమ; నిర్వికారుండై = వికారము నుచెందనివాఁడై, చరించుచు = తిరుగుచు, ఉపకారికాభవనంబున్ = రాజమందిరమును, కడచి = దాఁటి, ఎడనెడన్ = ప్రతిస్థలమందును; చంద్ర... విటంకంబులు-చంద్రకాంత = చంద్రకాంతమణిమయములయిన, వేదికావిటంకములన్ = తిన్నెలపయిని, విశ్రమించుచు = అలసటతీర్చుకొనుచు; ప్రబోధ... శబరితము-ప్రబోధ = జ్ఞానముచే, లేక తెలివిచే, మోహ = అజ్ఞానముచే, శబరి

తంబు=మిశ్రమైనది, అగు చిత్తంబులోన్=మనస్సుతో; విరహవేదనాభరంబునన్-విరహ=దమయంతీవియోగమువలనఁగలిగిన, వేదనాభరంబునన్=బాధాతిశయంబుచే, తూఁగాడుచు=ఊఁగుచు; పాదచారంబునన్=కాలినడకచే; అతిదూరంబరిగి=చాలదూరముపోయి; అభ్రంకషంబును=ఆకాశము నొరయుచున్నదియు,ప్రతోళికా......సంగీతకంబును—ప్రతోళికా=రాజవీథియందున్న, రత్నవేదికా=రత్నమయములయిన యరుఁగులయొక్క,మధ్య=మధ్యభాగమున, అధ్యాసీన=కూర్చుండియున్న; సిద్ధగంధర్వాంగనా=సిద్ధగంధర్వస్త్రీలచే, ప్రవర్తిత=ప్రవర్తింపఁజేయఁబడిన,అనఁగా గానము చేయఁబడిన; సంగీతకంబును=పాటలుకలదియు; తార......నికాయంబును - తారహార=ముత్యాలహారములను, గుంభన=గ్రుచ్చుటయనెడు, వ్యాపార=కార్యమందు, పారంగత=నేర్పరులయిన, శంభళికానికాయంబును=కుంటెనకత్తెలయొక్క సమూహముకలదియు, పంచశర...పలాశంబును-పంచశరలేఖ = మన్మథలేఖలయొక్క, లేఖనా = వ్రాయుటయందు, వియాత = దిట్టలయిన, దూతికా = దూతికలయొక్క, నీతికా = నేర్పరితనముచేతను, ఆనీత = పొందింపఁబడుచున్న; కేతకీ గర్భపలాశంబులు = కేతకీగర్భదళములుకలదియు ; కల్హార...సంకులంబును, కల్హార=సువాసనగల కలువలు; బిసకిసలయ=లేఁత తామరతూండ్లు; ప్రధాన=ముఖ్యములైన, నానా=అనేకవిధములయిన, శిశిరోపచారద్రవ్య=శైత్యోపచారములకుఁ దగిన పదార్థములను, సమానయన=కొనివచ్చుటయందు, సత్వర=తొందరపడుచున్న, సంచారికాజన=పరిచారికాజనముయొక్క, ఆసార ప్రసార=రాకపోకలచే, సంకులంబును=నిండియున్నదియు; అగు దమయంతీప్రాసాదంబు=అయినటువంటి దమయంతి మేడను, డాయంజని=చేరఁబోయి, అచ్చటన్=ఆస్థలమున.

ఉ. లేమ యొకర్తు వేడుక నళీకనళీకరణంబు జాతిగా
బూమియ దాను బన్నుకొని పోకలఁబోవుచునుండఁగా వృషా
భీమభవీభవంతియయి బింబఫలాధరి యోర్తు పార్థివ
ప్రాయుణివెమాడనాలెమెడలగను, నవైచెనుదూకదామమున్.

టీ. లేమయొకర్తు=ఒకస్త్రీ, వేడుకన్=ఉత్కంఠతో ; అలీకనలీకరణంబు జాతిగా=కపట నలరాజరీతిగా ; బూమియ=మాలువేషమును, తాను, పన్నుకొని=వేసికొని; పోకల=కపటప్రవర్తనములచే; పోవుచునుండఁగా; బింబఫలాధరి=దొండపండువంటి యధరముగలస్త్రీ; యొకర్తు=ఒకర్తె; మృషాభీమభవీభవంతియయి=కపటదమయంతీవేషము దాల్చినదయి; పార్థివగ్రామణి=రాజశ్రేష్ఠుఁడయిన నలమహారాజు; చూడఁగాన్=చూచుచుండఁగా; దాసిమెడన్=ఆనలవేషము ధరించినదానిమెడలో; మధూకదామమున్=ఇప్పపూలదండను, గ్రక్కునన్=వేగముగా; వైచెన్=వేసెను. అంతఃపురమునందు స్త్రీలీవిధమున కపటనలదమయంతీవేషములు వేసికొని యందు దమయంతి నలుని వరించినట్లు నటించుచున్నారని చెప్పుటను యోజింప నలరాజు వియోగముచేఁ బరితపించుచు దుస్సహమయినకాలమును గడపుటకుఁ దలంచి తనవినోదార్థము దమయంతియే యిట్టికార్యము లొనర్పించుచున్నట్లు తోఁచెడిని. ఇందు "పార్థివగ్రామణిచూడఁగ" అని చెప్పుటచే, దమయంతి తన్నుఁదప్ప నితరుని వరింపఁదన్న సమాచారము నలునకుఁ దెలిసెనని స్ఫురించుచున్నది.

తా. అంతఃపురములో నొకస్త్రీ నలునివేషము ధరించి కపటప్రవర్తనలచే పోవుచుండఁగా వేఱొకతె దమయంతివేషమునుధరించి నలమహారాజు చూచుచుండఁగా కపటనలునికంఠమందు బూలహారమునువేసి వరించెను.

గీ *వ్రాసె నొక్కలతాంగి క్రొక్కావ్వాఁడిగోర
వర్ణములు తోడుతో మషీవర్ణములుగఁ
బసిఁడిగేదంగి రేకునఁ బ్రస్ఫుటముగ
మదనలేఖంబు నర్మమర్మంబు మెఱయ. 99

టీ. ఒక్కలతాంగి=లతవంటి శరీరముగల యొకస్త్రీ; పసిఁడిగేదంగిరేకునన్=బంగారు మొగలిరేకునందు; ప్రస్ఫుటముగన్= స్పష్టముగాను ; నర్మమర్మంబు=సురతాభిలాషనుఁ దెలుపు నభిప్రాయమును; మెఱయఁగన్=ప్రకటనమగునట్లు

---

* "వర్ణములు తెలుపుతో" అని పాఠాంతరము

గా; మదనరేఖంబున్ = మన్మథసంబంధమయిన యుత్తరమును; క్రొవ్వాఁడి గోరన్ = క్రొత్త వాఁడిగోటితో; వర్ణములు=అక్షరములు, తోడుతోన్ =తోడనే,మషీవర్ణములుగన్ =నల్లనిరంగు గలుగునట్లుగా; వ్రాసెన్ =విరచించెను.

తా. ఒక స్త్రీ పసిఁడి కేతకీదళమునందు స్పష్టముగాను, సురతాభిలాష ప్రకటితమగునట్లుగను, అక్షరములుతోడనే నల్లఁబాఱ దనకొనగోటను మదన లేఖను వ్రాసెను.

గీ. చంద్రరజమున నొకపూర్ణచంద్రవదన
చంద్రమండలతిలకంబు సఖికిఁ దీర్చె
చంద్రశాలాంతరప్రదేశంబునందు
నావహిల్లంగ నపుడు చంద్రానవస్థ. 100

టీ. ఒకపూర్ణచంద్రవదన=నిండుచంద్రునివంటిముఖముగల యొక స్త్రీ; చంద్రరజమునన్ = కప్పూరపుఁబొడిచే, చంద్రశాలాంతరప్రదేశంబునందున్ =మిద్దెటింటియొక్క మధ్యప్రదేశమందు; అప్పుడు=ఆసమయమందు;చంద్రానవస్థ=తిలకచంద్రులయొక్క ఆనంత్యము; ఆవహిల్లంగన్ =కలుగునట్లుగా అనఁగా:— లెక్కలేనన్ని చంద్రులు కలుగునట్లనుట. చంద్రమండలతిలకంబున్ =చంద్రబింబమువంటి బొట్టును; సఖికిన్ =చెలికత్తెయొక్క ముఖమునందు; తీర్చెన్ = రచించెను. ఇట నొకస్త్రీ మఱియొకస్త్రీముఖమునందుఁ దిలకముతీర్చునప్పుడొక తిలకచంద్రుఁడే కల్పింపవలయునుగాని యనేకతిలకచంద్రులు కలుగుట యెట్లని శంకింపరాదు. రెండద్దము లభిముఖముగా నుంచినప్పుడందు ప్రతిఫలించువస్తువొక్కటయినను బెక్కువస్తువులుగాఁ దోఁచుచుండును. అట్లే యిట స్త్రీలముఖము లద్దములవలె బింబగ్రాహులై యుండుటవలన నాచెలితీర్చిన తిలకచంద్రుఁడొక్కఁడయినను వారల పరస్పరముఖంబులఁ బ్రతిఫలించుటవలనఁ దిలకచంద్రున కనేకత్వము కలుగుచున్నది.

తా. ఒకచంద్రవదన చంద్రశాలామధ్యభాగమునందుఁ గూర్చుండి కర్పూరరజముచేఁ దనచెలిముఖమునందుఁ జంద్రమండలసదృశమయిన తిలకమును రచించి, దానివలన చంద్రులు పెక్కండ్రు కల్గుంచెను.

గీ. మహితలావణ్యవార్ధిలో • మదనుఁ డెక్కు
కప్పురపుజోగు కంటిమి • కంటి మనుచు
నర్మగర్భంబుగా నొక్క • నలినవదన
పొగడెఁ సఖచంటిమీఁదియొ • ప్పులనఖంబు. 101

టీ. ఒకనలినవదన = పద్మమువంటి ముఖముగల యొక స్త్రీ, మహితలావణ్యవార్ధిలోన్ - మహిత = శ్రేష్ఠమయిన; లావణ్యవార్ధిలోన్ = సౌందర్యమనెడుసముద్రములో; మదనుఁడు = మన్మథుఁడు; ఎక్కు...జోగు - ఎక్కు = ఆరోహించిన; కర్పూరసంబంధమయిన యోడను; కంటిమికంటిమి = చూచితిమి చూచితిమి; అనుచు; సఖిచంటి...నఖంబున్ - సఖి = చెలికత్తెయొక్క; చంటిమీఁది = స్తనముపైనున్న; ఒప్పులనఖంబును = ప్రకాశించు నఖక్షతమును; నర్మగర్భంబుగా = పరిహాసము గర్భమందు గలుగునట్లుగా, పొగడెన్ = నుతించెను. అనఁగా నా స్త్రీలావణ్య మొకసముద్రమువంటిదనియు, నఖక్షతము నౌకాకారముగా నుండును గనుకనది మన్మథుఁ డెక్కి విహరించెడుపడవయనియుఁ బొగడెననియభిప్రాయము.

తా. ఒక స్త్రీ దమయంతీప్రాసాదమునందు మఱొక స్త్రీ స్తనముపైనున్న నఖక్షతమును గాంచి సౌందర్యమనెడు సముద్రములో మన్మథుఁ డెక్కెడు కప్పురపుఁ బడవను జూచియున్నామని పరిహాసముగా నుతించెను.

ఉ. భావము పల్లవింప నొక • పంకజలోచన వ్రాసె నొక్కల
జ్జావతి మించుగుబ్బవలి • చన్నులపై మకరీకలాపమున్
వావిరిగమ్మనీరు మృగ • నాభిరసంబున మేళవించి యే
కావళినాకసింధువున • కన్వయలీల ఘటిల్లునట్లుగాన్. 102

టీ. ఒకపంకజలోచన = పద్మములవంటి నేత్రములుగల యొక స్త్రీ, భావము = చిత్తము, పల్లవింపన్ = చివుళ్లొత్తగా, ఒక్క...పై - ఒక్కలజ్జావతి = ఒకస్త్రీయొక్క, మించుగుబ్బవలి చన్నులపై = వర్తులమైన చల్లనికుచములపై, వావిరి = మిక్కిలి, కమ్మనీరు = పన్నీరు, మృగనాభిరసంబునన్ = కస్తూరిరసముతో, మేళవించి = కలిపి, యే[illegible]దికి, అ

న్వయలీల=సంబంధము, ఘటించునట్లుగా=కలుగునట్లుగా, మకరీకలాపమున్=మకరీరేఖలయొక్క సమూహమును, వ్రాసెన్ = రచించెను. అనఁగా:-గంగ మకరీవాహన గనుక నేకావళియను గంగకు నీమకరికలు వాహనమని సంబంధము గలుగునట్లుగా మకరికలను వ్రాసెననుట. లేక సామాన్యముగా నదులలో నుండవలసినమకరము లిట కెట్లువచ్చె? నని శంకించి ముత్యాలహారమనెడు గంగానది యుండుటంబట్టి యిచ్చట మకరులుకూడ యుండుట సంభవమేయని తోఁచునట్లుగా వానిని వ్రాసెను.

తా. ఒక స్త్రీ పన్నీటిని గస్తూరితోఁ గలిపి మఱియొక స్త్రీ యర్తుల కుచములపై మకరికారేఖలను వ్రాసెను. దానిచే, ఏకావళి యనెడిగంగకు వాహనముగా మకరికల నేర్పఱచెనని యట్లు వ్రాయుటకు సంబంధము చూపట్టెను.

క. శారి యదె పొడువు మని యొక
సారి యొకతె యక్షకేళిసమయంబున ని
చ్చారతి నొకతెకుఁ జెప్పిన
శారి కనకపంజరమున సాధ్వసమొందెన్. 103

టీ. ఒకసారి=ఒకపర్యాయము ; ఒకతె = ఒక స్త్రీ; అక్షకేళిసమయంబునన్=సొకటాలాడునప్పుడు, శారియదె—అదె=అదిగో, శారి=ఆసొగటమును, పొడువుము, అని, ఇచ్ఛారతిన్=ఇష్టానురాగముతో, ఒకతెకున్ = మఱియొక స్త్రీకి, చెప్పినన్=చెప్పఁగా, కనకపంజరంబునన్ = బంగారుపంజరమునందున్న, శారి=గోరువంక, సాధ్వసమొందెన్=భయపడెను. అనఁగా:— శారి అనుపదమునకు సొకటమనియు గోరువంక యనియు నర్థముకలదు. కావున చెలులు సొగటాలాడుచు శారిని పొడువుమని యొక స్త్రీ మఱియొకర్తుతో జెప్పఁగా శబ్దసాదృశ్యమువలనఁ దన్నే పొడువుమన్నదేమోయని పంజరమందలి శారి భయపడెనని భావము.

తా. దమయంతియంతఃపురంబునఁ జెలులందఱు సొగటాలాడుచు నా శారిని పొడువుమని యొకతె మఱియొకతెతోఁ జెప్పఁగా, ఆమాటవిని శబ్దసా

327. దమయంతి తాంబూలపుతట్టను హస్తమునం
దుంచుకొనుట ; అంతర్హితుఁడైన
నలుఁడు దానిని జూచుట.

దృశ్యముచేఁ దన్నె పొడువమన్న దేమోయని బంగారుపంజరమందున్న శారిక భయపడసాగెను.

ఉ. వీఁడె నలుండు విశ్వపృథివీవలయైకవిభుండు వచ్చుచు
న్నాఁడని భీమభూమిపతినందన యూరడిలంగఁ బల్కుపూఁ
బోఁడులమాట నేర్చికొని ప్రోదిశుకాంగన యట్ల పల్కినన్
వీఁడిది నన్ను నేక్రియ నెఱింగెనొకోయనియుండెనాత్మలోన్.

టీ. విశ్వ......విభుండు—విశ్వపృథివీవలయ = సమస్తభూమండలమున కు, ఏక=ఒకఁడే, విభుండు=ప్రభువైన, నలుండు=నలమహారాజు,వీఁడెవచ్చుచు న్నాఁడని=వీఁడుగో వచ్చుచున్నాఁడని, భీమభూమిపతినందన = దమయంతి, ఊరడిలంగన్ =శాంతించునట్లుగా,పల్కుపూఁబోఁడులమాటన్ =పలుకుచున్న చె లికత్తియలవాక్యమును, నేర్చికొని=అభ్యసించి, ప్రోదిశుకాంగన = పెంపుడు చిలుక, అట్ల=ఆచెలికత్తెలు పలుకునట్లుగనే, పల్కినన్ = నలమహారాజు వ చ్చుచున్నాఁడని యనఁగా, వీఁడు = ఆయంతఃపురమున సంచరించునలమహా రాజు, ఇది=ఈచిలుక, నన్నున్, ఏక్రియన్=ఏరీతిగా, ఎఱింగెనొకో=తెలిసి కొన్నదో:- అని, ఆత్మలోన్=మనస్సులో, ఉండెన్=అనుకొనుచుండెను.

తా. దమయంతి నలవియోగమును సహింపలేక దుఃఖించుచుండఁగా నా మెకూరటగల్గుటకయి చెలికత్తె లదిగో నలుఁడువచ్చుచున్నాఁడని మాటిమాటికి పలుకుచుండిరి. ఆమాటనే పెంపుడుచిలుక నేర్చికొని పలుకఁగా నంతఃపురసం చారి యగునలుఁడు తిరస్కరిణీవిద్యచేఁ దిరోహితుఁడ నయినన న్నీచిలుక యె ట్లు తెలిసికొనినదని సందేహింపఁజొచ్చెను.

గీ. అంబుజానన కొలువుకూటంబునందు
కనకకలహంసశాబకాకారమైన
పీఁడియఁపుఁ బెట్టె చూచి యుర్వీధవుండు
దలఁచెఁ దనకూర్మిదూత చిత్తంబులోన.        105

టీ. అంబు......నందు, అంబుజానన=పద్మమువంటి ముఖముగలదమయం

తియొక్క, కొలువుకూటంబునందున్ = సభయందు, కనక ... ఆకారము—కనక=సువర్ణవికారమయిన, కలహంసశాబక=రాయంచపిల్లయొక్క, ఆకారము=రూపమువంటిరూపముగలది, అయిన వీడియపుఁబెట్టె=అయినట్టి తాంబూల ద్రవ్యము లుంచుకొనెడుపెట్టెను, చూచి, ఉర్వీధవుండు=నలుండు, తనదూర్మి దూతన్=తనప్రియదూతయగు హంసను, చిత్తంబులోన్ = మనస్సులో, తలంచెన్=తలంచుకొనెను.

తా. దమయంతి సభామధ్యమునందుఁదాంబూలద్రవ్యము లుంచుకొనుటకుఁ గనకవికారమయిన హంసవంటియొక పెట్టెను చేసియుంచుకొనఁగా దానిని నలుఁడు చూచి తనప్రియదూతయగు హంస మేయని తలఁచెను.

వ. ఇట్లు కన్యాంతఃపురంబుఁ బ్రవేశించి దమయంతి సభాభవన ద్వారంబు నొక్కపసిండియరుఁగుమీఁదఁ గూర్చుండె నప్పు డబ్బాలికారత్నంబును జననీప్రయత్నంబునం దత్సమ్ముఖం బున కరుగుటయును స్వయంవరకల్యాణమహోత్సవంబు సంపాదింపంబడుటయు శోభనారంభ సంభ్రమంబులవలన నెఱింగినవాఁడు గావున నయ్యంభోరుహాక్షిసమాగమనం బపేక్షించుచుండె నప్పుడు. 106

టీ. ఇట్లు=ఈవిధముగా, కన్యాంతఃపురంబున్=దమయంతి యంతఃపురంబును, ప్రవేశించి=చొచ్చి, దమయంతీసభాభవనద్వారంబు=దమయంతి సభామండపముయొక్క ద్వారముయొక్క, ఒక్కపసిండియరుఁగుమీఁదన్=ఒకబంగారపుటరుఁగుపైని, కూర్చుండెను. అప్పుడు, అబ్బాలికారత్నంబు = ఆదమయంతి, జననీప్రయత్నంబునన్=తల్లియొక్క ప్రయత్నముచే, తత్సమ్ముఖంబునకున్=ఆజననియొద్దకు,అరుగుటయును,స్వయంవర ...... ఉత్సవంబు—స్వయంవర=స్వయముగా భర్తను వరించుటయనెడు, కల్యాణ=మంగళప్రదమయిన, మహోత్సవంబు=గొప్పయుత్సవము, సంపాదింపఁబడుటయు = స్థిరపఱుపఁబడుటయు, శోభనా ... వలనన్—శోభనారంభ = శుభకార్యారంభముల

యందలి, సంభ్రమంబులవలనన్ = తొట్రుపాటువలన, ఎఱింగినవాఁడు = తెలిసికొనినవాఁడు, కావునన్ = కనుక, అయ్యంభోరుహాక్షీ సమాగమనంబు = ఆదమయంతియొక్క రాకను, అపేక్షించుచుండెన్ = కోరుకొనుచుండెను, అప్పుడు = ఆసమయమందు.

గీ. అనుఁగుఁదల్లికి వందనం బాచరించి
వరుస నిలువేల్పులకు మ్రొక్కి వలను మిగుల
బ్రాహ్మణులచేత దీవనల్ వడసి పుణ్య
భామ లిచ్చు హేమాక్షతప్రతతిఁ దాల్చి. 107

టీ. దమయంతి (అధ్యాహారము) అనుఁగుదల్లికిన్ = ప్రేమాస్పదురాలయిన తనతల్లికి, వందనంబాచరించి = మ్రొక్కి, వరుసన్ = క్రమముగా, ఇలువేల్పులకున్ = గృహదేవతలకు, వలనుమ్రొక్కి = ప్రదక్షిణనమస్కారములుచేసి, బ్రాహ్మణులచేతన్, ఆశీర్వాదములు, మిగులన్ = మిక్కిలి, పడసి = పొంది, పుణ్యభామల్ = పుణ్యస్త్రీలు, ఇచు హేమాక్షతప్రతతిన్ = ఇచ్చెడు బంగారపుటక్షతలసమూహమును, దాల్చి = ధరించి. అని పైపద్యముతో నన్వయము.

తా. అట్లు దమయంతి తల్లియొద్దకుఁబోయి నమస్కరించి, గృహదేవతలకు వరుసగాఁ బ్రదక్షిణనమస్కారములు సలిపి, బ్రాహ్మణాశీర్వాదములఁగొని, పుణ్యస్త్రీలిచ్చెడు హేమాక్షతలను దలయందు ధరించెను.

ఉ. తల్లి మనఃప్రసాదసహితంబుగ నిచ్చినపుష్పదామమున్
బల్లవపాటలం బయిన పాణిసరోజమునన్ ధరించి యా
యల్లకతీవ్రసంజ్వరభరాలసకోమలగాత్రవల్లి యై
యల్లన యేఁగు దెంచుకమలాననఁ గాంచె విభుండు దవ్వులన్.

టీ. తల్లి = దమయంతియొక్క జనని, మనఃప్రసాదసహితంబుగన్ = నిర్మలమైనమనస్సుతోఁగూడ, ఇచ్చినపుష్పదామమున్ = ఇచ్చినటువంటిపూలదండను, పల్లవపాటలంబు = చిగురువలెనే పాటలవర్ణముగల, పాణిసరోజమునన్ = పద్మమువంటిచేతియందే ధరించి, ఆయల్లక ... వల్లియై ... ఆయల్లక = విరహసంబంధ

మయిన, తీవ్ర=దుస్సహమయిన, సంజ్వరభర=ఉష్ణాతిశయముచే, అలస=మంద మయిన లేక వివశమయిన, కోమల=మృదువైన, గాత్రవల్లిగ్రె=తనూలతకలది యయి, అల్లన=మెల్లఁగా, ఏఁగుదెంచుకమలాననన్=వచ్చుచున్నదమయంతి ని, విభుండు=నలుఁడు, దవ్వులన్=దూరముగా, చూచెన్=కనుఁగొనెను.

తా. దమయంతి తల్లిసమీపమునకుఁబోయి యామెనిండుమనస్సుతో నొసంగినపూలదండను కరపల్లవముచే స్వీకరించి, ప్రియుఁడగు నలుని నెడబాసియుండుటవలనఁ గల్గిన తీవ్రమయిన యుష్ణాతిశయముచేఁ గోమలశరీరము కందిపోవుచుండఁగా మెల్ల మెల్లఁగా వచ్చుచుండఁగా నలుఁడు దూరముగాఁ జూచెను.

వ. ఇట్లు వీక్షించి నిషధాధ్యక్షుండు సాక్షాత్కరించినమదనసామ్రాజ్యలక్ష్మియుం బోనియాధవళాక్షిసమక్షంబు చేరంబోయె నప్పుడు. 109

టీ. ఇట్లు=ఈరీతిగా, నిషధాధ్యక్షుండు=నిషధదేశమున కధిపతియైన నలుఁడు, సాక్షాత్కరించిన ......లక్ష్మియున్-సాక్షాత్కరించిన= ప్రత్యక్షమయిన, మదనసామ్రాజ్యలక్ష్మియున్ = మన్మథరాజ్యలక్ష్మిని,బోనియాధవళాక్షిసమక్షంబు=పోలినయాతెల్లనినేత్రములుగల దమయంతియొక్క మ్రోలను, చేరంబోయె= చేరఁజనియెను లేక సమీపించెను, అప్పుడు=ఆసమయమందు.

ఉ. ఎంతయుడాయనేఁగియు మహీశుఁడెఱుంగఁగ నేరఁడయ్యెవిభ్రాంతివిదర్భరాడ్దుహితృపంక్తులలోన మృగాక్షి నప్పు డయ్యంతి యెఱుంగ దయ్యె దిగధీశచతుష్టయదత్తశాంబరీధ్వాంతనిగూఢుఁడై నవనిషధాధిపునిర్ణిక టస్థలంబునన్.

టీ. మహీశుఁడు=భూమికధిపతియయిన నలుఁడు; ఎంతయున్ = మిక్కిలి; డాయన్+ఏఁగియున్=సమీపించియును; విభ్రాంతి...పంక్తులలోన్—విభ్రాంతి=మోహముచేఁ గానవచ్చుచున్న, విదర్భరాట్ = విదర్భరాజగు భీమసేనునియొక్క, దుహితృ = కూఁతురియొక్క, అనఁగా —దమయంతియొక్క

యనుట; పంక్తులలోన్ = వరుసలలో; మృగాక్షిన్ = లేడికన్నులవంటికన్నులుగల సత్యమైనదమయంతిని; ఎఱుంగన్, నేరఁడయ్యెన్ = తెలిసికొనలేకపోయెను; అప్పుడు; అయ్యింతి=ఆదమయంతి; దిగధీశ ..నిగూఢుఁడు - దిగధీశచతుష్టయ=నలుగురుదిక్పాలురచే; అనఁగా ఇంద్ర; అగ్ని; యమ; వరుణులచే ననుట; దత్త= ఈఁబడిన; శాంబరీ=మాయాసంబంధమయిన లేక తిరస్కరిణీవిద్యాసంబంధమయిన; ధ్వాంత=చీఁకటియందు; నిగూఢుఁడు=దాఁగియున్నవాఁడు; అయినవసుధాధవునిన్ = అయినట్టినలమహారాజును; నికటస్థలంబునన్ =సమీపమందున్నట్టు; ఎఱుంగదు, అయ్యెన్ = తెలిసికొనలేకపోయెను.

తా. నలదమయంతు లిరువురు నొకరికొకరు సమీపముగానున్నను మోహాతిశయముచేఁ దనకుఁ గానవచ్చుచున్న దమయంతీసమూహములో సత్యదమయంతిని దెలిసికొనలేకపోయెను. మఱియు నాదమయంతియు దిరస్కరణీవిద్యచేఁ దిరోహితుఁడై యుండుటంబట్టి నలుఁడు సమీపమందున్నట్టుగాఁ దెలిసికొనలేకపోయెను

గీ. అతివ యుద్భ్రాంతివీక్షితుఁ డయిననృపతి
కంఠమున వైచెఁ జేతిచెంగలువదండ
యది నిజంబుగ నికటస్థుఁ డైనవిభుని
యఱుత సంలగ్నమయ్యె నత్యద్భుతముగ. 111

టీ. అతివ=ఆదమయంతి, ఉద్భ్రాంతివీక్షితుఁడు=భ్రాంతిచేఁగానవచ్చుచున్న, నృపతికంఠమునన్ = నలమహారాజు మెడలో, చేతచెంగలువదండన్ = చేతిలోనున్నయెఱ్ఱకలువదండను, వైచెన్ =వేసెను, అది=ఆదండ, నిజంబుగ= సత్యముగా, నికటస్థుఁడు = దగ్గఱనున్నవాఁడు, అయినవిభునియఱుతన్ = అయినట్టినలునికంఠమున, అత్యద్భుతముగాన్ =మిక్కిలియాశ్చర్యము కలుగునట్లుగా, సంలగ్నమయ్యెన్ =తగుల్కొనెను.

తా. దమయంతి సంతతము నలునినే ధ్యానించుచుండుటవలన మోహాతిశయముచేఁ గానవచ్చిన నలునిఁజూచి యితఁడే నలుఁడని తనచేతియందున్న పూలదండను వేయఁగా [illegible] బడెను.

గీ. వాసనాదృష్టయగు కాంత కై వైచినట్టి
పొందు నిజమయ్యె నని చోద్యకు మందె రాజు
తాను వైచినకల్హారకీదామకంబు
మాయమగుటయుఁ దరుణి విస్మయమునొందె. 112

టీ. వాసనాదృష్టయగు — వాసనా = అనుభూతయైనదమయంతి సంబంధమయినస్మృతిచే, దృష్ట=కానవచ్చుచున్నది,అగుకాంత=అయినదమయంతి, వైచినట్టిపొందు = పుష్పదామమువేయుటవలనఁ గలిగినకూడిక, నిజమయ్యెన్ =సత్యమయ్యెను, అని, రాజు=నలమహారాజు, చోద్యము, అందెన్ = ఆశ్చర్యపడెను, ఆశ్చర్యకారణంబెద్దియనఁగా— మోహవశమునఁ గానవచ్చుదమయంతులలో సత్యదమయంతి యెవతియో తెలియమిచే దమయంతి వైచినపుష్పదామమును మిథ్యాదమయంతివైచినదానిగాఁ దలంచి మిథ్యాదమయంతివైచినపూలదండ తథ్యముగా నాకంఠమందుఁ దగుల్పడియెనే యనియాశ్చర్యము. తాను=దమయంతి, వైచినకల్హారదామకంబు = వేసినయెఱ్ఱకలువదండ, మాయమగుటయు=అంతర్ధానము చెందుటంబట్టి, తరుణి=దమయంతి, విస్మయమునొందెన్=ఆశ్చర్యపడెను. ఇట దమయంతి భ్రాంతినలునిఁజూచి చెంగలువదండ వేడుకతో వేయఁగా నది యచట మాయచే దాఁగియున్న సత్యనలునికంఠమునఁ దగులుకొనెనుగాన దండ కానరాదయ్యెను. అప్పుడు దమయంతి భ్రాంతినలుని మెడలో వైచినపూలదండ యేల కానరాదని యాశ్చర్యపడెను. మఱియు నలుఁడు భ్రాంతిదృష్టుఁడుకాని పూలదండ సత్యమైనదేకాన, నలుండు లేకపోయినను సత్యమైనపూలదండ కనఁబడవలసినది. కాని యది కానరామిచే దమయంతికి నాశ్చర్యముకలిగెను.

తా. స్పష్టము.

గీ. ఒక్కచో నుండియును బాసి కై యున్నభంగి
భ్రాంతి నన్యోన్య మీక్షించి కై పతియు సతియుఁ

చేరి మిథ్యాపరస్పరాశ్లేషకలన
సత్యపరిరంభఖేలనాసక్తులైరి. 113

టీ. ఒక్కచోన్ = ఒకస్థలమందు, ఉండియును, పాసి = ఎడఁబాసి, ఉన్న
భంగి = ఉండునట్లుగా, భ్రాంతిన్ = మోహముచే, అన్యోన్యము = పరస్పరము,
చూచి, పతియున్, సతియున్ = నలదమయంతులు, చేరి = సమీపించి, మిథ్యా
పరస్పరాశ్లేషకలనన్ - మిథ్య = అసత్యమగు, పరస్పరాశ్లేష = ఒండొరుల కౌఁగి
లింతలనెడి, కలనన్ = కార్యముచేత, సత్య... సక్తులు - సత్య = నిజమైన, పరిరంభ
ఖేలనా = కౌఁగిలింతయనెడు నాటయందు, ఆసక్తులు = ఆసక్తికలవారలు, అయిరి.

తా. నలదమయంతు లిద్దరు నొకచోనుండియు నెడఁబాసి యున్నట్లు
గనే తలంచికొని, తమ్మును భ్రాంతిచేఁ జూడఁబడు వారినిఁగాఁ దలంచికొని యస
త్యమయిన కౌఁగిలింతలను బెనంగ మొదలిడి సత్యమయినకౌఁగిలింతలనే పొందిరి.

శా. అంభోజానన భూమిపాలకునిచే నాశ్లిష్టయయ్యు న్మదిన్
సంభావింప దతం డదృశ్యుఁడగుటన్ సత్యోపగూహంబుగా
స్తంభావిష్కృతి వైరసేనియును వైదర్భిన్ గ్రహింపంగఁ బ్రా
రంభంబుం దగఁ జేయ నించుకయు నేరం డయ్యె నీక్షించియున్.

టీ. అంభోజానన = పద్మమువంటి ముఖముగల దమయంతి, భూమిపాలకుని
చేన్ = నలమహారాజుచే, నాశ్లిష్టయయ్యున్ = కౌఁగిలింపఁబడియు, అతండు = ఆన
లుండు, అదృశ్యుఁడగుటన్ - తిరస్కరిణీవిద్యచేఁ దిరోహితుఁడై యుండుటం
బట్టి, సత్యోపగూహంబుగా = యథార్థమయిన కౌఁగిలింతఁగా, మదిన్ = మనస్సు
నందు, సంభావింపదు = ఊహింపదు, వైరసేనియున్ = వీరసేనకుమారుఁడయిన
నలుఁడును, ఈక్షించియున్ = సత్యదమయంతిని జూచియు, స్తంభావిష్కృ
తిన్ = స్తంభాఖ్యమగు సాత్త్వికభావము కలుగుటచే, వైదర్భిన్ = దమయంతిని,
గ్రహింపంగన్ = పట్టుకొనుటకు, ప్రారంభంబున్ = ప్రయత్నమును - లేక మొదలి
డుటను, తగన్, చేయన్ = ఒప్పునట్లుగాఁ జేయుటకు, ఇంచుకేనియున్ = కొంచె
మైనను, నేరఁడయ్యెన్ = సమర్థుఁడు కాఁడాయెను

తా. దమయంతి నలునిచే సత్యముగాఁ గౌఁగిలింపఁబడినదయ్యు నతఁడు తన కుఁ గానరాకుండుటచే నాకౌఁగిలింత యసత్యముగానే తలంచికొనుచుండెనుకా ని సత్యమయినదానిఁగాఁ దలంచుకొనలేదు. నలుఁడును సత్యదమయంతిని జూచి స్తంభాఖ్యసాత్త్వికభావము కలవాఁడగుటచే దమయంతిని గ్రహించుటను సుం తేనియుఁ బ్రయత్నము చేయలేకపోయెను.

చ. మొదల శరీరసంగమసముద్గతసత్యమతిప్రకాశతన్
బిదప నలీకసంవిదుపబృంహితభావతఁ బొంద నిద్దఱుం
బదపడి యంతరంగములఁ బ్రత్యయ మొందరొకించుకేనియుం
గదిసి యొకళ్లొకళ్ల నిఱికౌఁగిట జేర్చియునుం బ్రముగ్ధతన్.

టీ. మొదలన్=మొట్టమొదట, శరీర...ప్రకాశతన్—శరీరసంగమ=శరీర సంస్పర్శవలన, సముద్గత=పుట్టిన, సత్యమతిప్రకాశతన్ = సత్యమనెడుబుద్ధిని వెల్లడిచేయుటను, పిదపన్ = తరువాత, అలీకసంవిత్ = మిథ్యాజ్ఞానముచే, ఉపబృంహిత=వర్ధింపఁబడిన; భావతన్ = మనస్సుకలవారగుటను అనఁగా మి థ్యాజ్ఞానముకలవారనుట, ఒందన్=పొందఁగా, ఇద్దఱున్ = నలదమయంతు లిద్దఱును, కదిసి=సమీపించి, యొకళ్లొకళ్ల=ఒండొరులను, ఇఱికౌఁగిటను=బిగి కౌఁగిలింతను, చేర్చియున్=పొందించియు, అనఁగా—ఒకరినొకరు బిగువుగాఁ గౌఁగిలించికొని యుండియునని యర్థము, ప్రముగ్ధతన్=మిక్కిలి తెలివిలేని వారగుటచే, పదపడి=వెనుక, అంతరంగములన్=మనస్సులలో, ఒకించుకేని యున్=కొంచెమైనను, ప్రత్యయమున్=నమ్మకమును, ఒందరు=ఒందలేదు.

తా. మొదటఁ దమశరీరములు తాఁకుటచే సత్యమనితలంచికొనియుఁ దరు వాత మిథ్యాజ్ఞానముచేఁ దిరోహితులైనవారగుటచే నానలదమయంతు లిద్దరు నొకరినొకరు బిగ్గరగాఁ గౌఁగిలించికొనియుఁ దెల్విలేమిచేఁ దమమనంబుల నించుకేనియు నమ్మలేకపోయిరి.

ఉ. ఆరడి బోటికిన్ విభున కొకప్పు మనంబుల విప్రలంభశృం
గార మొకళ్లొకళ్ళయిఱికౌఁగిటఁ బుట్టినవిందువేడ్క—చే

బోరన నారఁగూరి మదిఁ బొంగె ఘృతంబతిమాత్ర పోసినన్
గూరికికూర్కి యాక్షణమునం గొబ్బున మండిన దీపమోయనన్.

టీ. ఆరడిన్ = వ్యర్థముగా, బోటికిన్ = దమయంతికిని, విభునకున్ = నలమహారాజునకును, అప్పుడు = ఆసమయమందు, మనంబుల = మనస్సులలోనున్న, విప్రలంభశృంగారము = ఎడఁబాటువలనఁ గలిగిన శృంగారరసము, ఒకళ్లొకళ్లయిఱికౌఁగిటన్ = ఒండొరుల బిగికౌఁగిటియందు, పుట్టిననిండువేడ్కచేన్ = ఉదయించిన గొప్పయుత్కంఠచే, ఘృతంబతిమాత్రపోసినన్ = నేయి యెక్కుడుగా పోయుటచే, కూరికికూర్కి = కునికికునికి, యాక్షణమ = ఆసమయమందె, గొబ్బునన్ = వేగముగా, మండినదీపమోయనన్ = మండుచున్న దీపమోయనునట్లుగా, బోరనన్ = వేగముగా, ఆరఁగూరి = లెస్సగానయి, మదిన్, పొంగెన్ = మనస్సునందుద్రేకించెను.

తా. నలదమయంతులకు నాసమయమున మనమునందుండు విప్రలంభశృంగారరస మొకరినొకరు కౌఁగిలించికొనుటవలనఁ గలిగిన నిండయిన యుత్కంఠచే ఘృత మధికముగాఁ బోసినప్పుడు కునికికునికి యుత్తరక్షణమందే వేగముగా బగ్గనమండెడి దీపమువోలె లెస్సఁగా మనంబుల నుద్రేకించెను.

వ. ఇవ్విధంబున సంయోగవియోగంబులవలన బోధమోహంబులు వహించుచు నవ్వరారోహ హృదయనిర్విశేషం బగుసఖీజనంబు మెత్తమెత్తనఁ దోడ్కొనిపోవ నిజసభాభవనంబునకు నెట్టకేలకుం జనియె. ధరాధీశ్వరుండును ధారావాహికజ్ఞానప్రవాహంబునం దేలియాడుచు నంతనంతఁ గాంతారత్నంబుఁ గదియ నేతెంచె. అట్లు కొలువుకూటంబుఁ జొచ్చి యబ్బోటి హాటకపీఠం బలంకరించి సఖీపరివారపరివృతయై, తారకాగణపరివృత యగు చంద్రరేఖయుంబోలె బొలుపారె నాసమయంబున. 117

టీ. ఇవ్విధంబునన్ = ఈరీతిగా, సంయోగవియోగంబులవలనన్ = కూడికవలనను ఎడ[illegible]ము, వహిం

యుచున్ = పొందుచు, అనఁగా-సంయోగమువలనబోధను, నెడబాటువలన మోహమును, ననియర్థము. అవ్వరారోహ = ఆదమయంతి, హృదయనిర్విశేషము=హృదయములో భేదములేని అనఁగా-శరీరములు వేఱుగాని హృదయములొక్కటేయనిభావము. అగుసఖీజనంబు=ఐనట్టిచెలికత్తెలసమూహము, మెత్తమెత్తనన్ =తిన్నగా, తోడ్కొనిపోవన్ =కొనిపోవఁగా, నిజసభాభవనంబునకున్ =తనకొల్వుకూటంబునకు, ఎట్టకేలకున్ = అతికష్టముచే, చనియెన్ = వెళ్లెను, ధరాధీశ్వరుండును=నలమహారాజును, ధారావాహిక=ధారాపాతము గల, జ్ఞానప్రవాహమునందు, తేలియాడుచున్ = ఈఁదులాడుచు,అంతనంతన్ = క్రమక్రమముగా, కాంతారత్నంబున్ =దమయంతిని, కదియన్ ,ఏతెంచెన్ = సమీపించెను, అట్లు, కొలువుకూటంబున్ =సభామందిరమును, చొచ్చి, అబ్బోటి=ఆదమయంతి, హాటకపీఠంబున్ , అలంకరించి = బంగారుపీఠముపయిఁగూర్చుండి, సఖీపరివారపరివృతయై = చెలికత్తెలచేతను దక్కినపరివారముచేతను, చుట్టఁబడి, తారకాగణపరివృత=నక్షత్రగణములచే చుట్టఁబడినది, అగుచంద్రరేఖయుంబోలెన్ =అయినచంద్రరేఖవలె, పొలుపారెన్ =ఒప్పెను, ఆసమయంబునన్ =అప్పుడు అని పైపద్యములో నన్వయము.

ఉ. భావముఁజూడఁగోరి యొకపార్శ్వమునన్ దమయంతిఁ జేరిధా
త్రీవరుఁ డుండె శాంబరి ధరించియు భీమసుతావినోదసం
భావనకై సఖీజనులు పన్నిన యాత్మమనోజ్ఞపుంస్వరూ
పావళిలో నిజాకృతి బయల్పడకుండఁగ రత్నవేదికన్. 118

టీ. భావమున్ =దమయంతిమనస్సును, చూడన్ కోరి = పరీక్షింపనెంచి, ఒకపార్శ్వమునన్ =ఒకప్రక్కను, దమయంతిన్ , చేరి=సమీపించి, శాంబరి ధరించియున్ =తిరస్కరిణీవిద్యను ధరించియు, భీమసుతా = దమయంతియొక్క, వినోదసంభావనకై = వేడుకయొక్క గౌరవముకొఱకయి, అనఁగా-దమయంతికోర్కిని గౌరవముగాఁ దీర్చుటకయి యనిభావము. రత్నవేదికన్ = మణిమయమయిన అరుఁగుపయి, సఖీజనులు=దమయంతి చెలికత్తెలు, పన్నిన...
వళితో -పన్నిన=ఏర్పరచిన,ఆత్మ=తనయొక్క,మనోజ్ఞ=సుందరమయిన, పుం

స్వరూప=పురుషాకారముయొక్క, ఆవళిలోన్=సమూహములో లేక పఙ్క్తిలో, నిజాకృతి = తనయాకారము, బయల్పడకుండన్ = తెలియకుండునట్లు, ఉండెన్=ఉండెను.

తా. నలమహారాజు దమయంతిహృదయము గనుఁగొనఁ దెంచి యామెపార్శ్వమును జేరి శాంబరిని ధరించినవాఁడయినను దమయంతీవినోదమునకొఱకు రత్నవేదికపయిని నా మెచెలికత్తెలు పన్నిన తనప్రతికృతిపంక్తిలోఁ దనయాకారము బయల్పడకుండునట్లుగా నుండెను.

వ. ఇవ్విధంబున నబ్బాల పేరోలగం బున్నసమయంబునఁ బ్రతిహారిణి యేతెంచి యింద్రాదియమవరుణులు పుత్తెంచిన దూతికలు మందిరద్వారంబున నున్నవారని విన్నపంబుచేసి తదనుమతి వడసి ప్రవేశింపఁజేయుటయు నాసందేశహారిణులు మందమందగమనంబున నాత్రైలోక్యసుందరిం జేరంజనుదెంచి సముచితసత్కారంబులు వడసి సఖీనిర్దిష్టంబు లగుమణిమయాసనంబులం గూర్చుండిరి. ఆసంచారికాచతుష్టయంబునందు విస్పష్టమధురాలాపయు నర్మోక్తినిపుణయు నింగితాకారచేష్టావివేకవిశారదయునుం బుంవత్ప్రగల్భయు నగు జంభారిగారాపుశంభళి హస్తాంభోరుహంబులు మోడ్చి యిట్లనియె. 119

టీ. ఇవ్విధంబునన్, అబ్బాల=ఆదమయంతి, పేరోలగంబు = పెద్దకొలువును, ఉన్నసమయంబునన్=తీర్చినవేళ, ప్రతీహారిణి=ద్వారపాలిక, ఏతెంచి, ఇంద్రాగ్నియమవరుణులు, పుత్తెంచినదూతికలు = పంపినదూతికలు, మందిరద్వారంబునన్=ఇంటివాకిటను, ఉన్నవారు, అని, విన్నపంబుచేసి = మనవిచేసికొని, తదనుమతి = ఆదమయంతియాజ్ఞ, పడసి=పొంది, ప్రవేశింపఁజేయుటయు=లోనికిఁబంపఁగా, ఆసందేశహారిణులు=వార్తలనుదెచ్చిన యాస్త్రీలు, మంధమందగమనంబునన్=మిక్కిలి మెల్లని గమనంబుతో, ఆత్రైలోక్యసుందరిన్=ముల్లోకములకు సుందరియయిన యాదమయంతిని, జేరంజనుదెంచి=

ఇచ్చి, సముచితసత్కారంబులున్ = తగినగౌరవంబులను, పడసి = పొంది, సఖీనిర్దిష్టంబులు = చెలులచేఁ జూపింపఁబడినవి, అగుమణిమయాసనంబులన్ = అయిన రత్నపీఠములందు, కూర్చుండిరి. అసంచారికాచతుష్టయంబునందున్ = అనలువురుదూతికలయందును, విస్పష్టమధురాలాపయున్ = స్పష్టముగాను మధురముగాను మాట్లాడునదియు, నర్మోక్తినిపుణయు = పరిహాసవచనములందు నేర్పుకలదియు, ఇంగిత = హృద్గతాభిప్రాయము, ఆకారచేష్టా = శరీరసంబంధమైన చేష్టలను, వివేక = తెలిసికొనుటయందు, విశారదయును = నేర్పుకలదియు, పుంవత్ప్రగల్భయున్ = పురుషునివలెనే ప్రతిభగలదియు, నగు, జంభారిగారాపుశంభళి = ఇంద్రునిప్రియదూతిక, హస్తాంభోరుహంబులను = పద్మములవంటి చేతులను, మోడ్చి, యిట్లనియెన్ = ఇట్టులనెను.

సీ. అవధారు దేవి దివ్యకిరీటకోటిసం
  దానితవికచమందారదామ
సందోహమకరందబిందుధారాధౌత
  సందీప్తచరణారవిందుఁడైన
సంక్రందనుండు నాస్వామి నన్నాయింద్రు
  గారాబుసంచారిగా నెఱుంగు
పాలిండ్లకొత్తుగాఁ బరిరంభణముసేసి
  యడిగె నీక్షేమ మయ్యమరవిభుఁడు

గీ. పారిజాతకమాల్యంబు పాయనముగ
నముచిదమనుండు పుత్తెంచినాఁడు నీకుఁ
గైకొనుము దీని నని యిచ్చె నాకవనిత
పూర్ణచంద్రనిభాస్యకుఁ బువ్వుదండ. 120

టీ. దేవి = దమయంతీ, అవధారు = వినుము, దివ్య... అరవిందుఁడు - దివ్య = దేవతలయొక్క, కిరీట = కిరీటములయొక్క, కోటి = యంచులందు, సందానిత = కూర్పఁబడిన, వికచ = వికసించిన, మందార = మందారపుష్పములయొక్క, దామ = దం

డలయొక్క, సందోహ=సమూహమందలి, మకరంద=తేనెయొక్క, బిందు=కణములయొక్క, ధారా=ధారలచే,ధౌత=కడుగఁబడిన, సందీప్త=మిక్కిలి ప్రకాశించు, చరణారవిందుఁడు = పద్మములవంటి పాదములుకలవాఁడు, అయినసంక్రందనుండు=అయినట్టి దేవేంద్రుఁడు, నాస్వామి=నా౽ధిపతి, ననున్, ఆయింద్రుగారానుసంచారిగాన్ =ఆదేవేంద్రునిప్రియదూతికఁగా,ఎఱుంగుము=తెలిసికొనుము,పాలిండ్లకున్ = స్తనములకు,ఒత్తుగా=అదుముడు కలుగునట్లు గా. బిగ్గనను, పరిరంభణముచేసి=కౌఁగిలించి, అయ్యమరవిభుఁడు=ఆదేవేంద్రుఁడు,నీసేమము,అడిగెన్ =నీయొక్క కుశలమడిగెను, పారిజాతకమాల్యంబు=పారిజాతపుష్పములదండ, ఉపాయనంబుగాన్ =కానుకఁగా, నీకు, నముచిదమనుండు = నముచి యనురాక్షసుని శిక్షించినవాఁడు, అనఁగా ఇంద్రుఁడనుట, పుత్తెంచినాఁడు=పంపినాఁడు. దీనిన్, కైకొనుము = తీసికొనుము, అని, పూర్ణచంద్రనిభాస్యకున్ =పూర్ణచంద్రునితో సమానమయినముఖముగల దమయంతికి, అప్పూవుదండన్ =అపుష్పమాలికను, ఇచ్చెన్ =ఒసంగెను.

తా. ఓదమయంతీ వినుము. సమస్తదేవతలచే మ్రొక్కఁబడుచున్న దేవేంద్రుఁడు నాప్రభువు. నన్ను నాదేవేంద్రుని దూతికనుగాఁ దెలిసికొనుము. ఆదేవేంద్రుఁడు నిన్నుబిగ్గరగాఁ గౌఁగిలించుకొని నీసేమ మడిగెను. పారిజాతపుష్పమాలికను నీకు బహుమానముగాఁ బంపినాఁడు. దీనిని స్వీకరింపుము. అనిపలికి యాయా దేవదూతిక దమయంతి కాపూవులదండ నిచ్చెను.

వ. ఇట్లు కనకకదళీపలాశగర్భితంబై, నిర్భరామోదమధురంబగు
దివ్యదామం బయ్యాదిగర్భేశ్వరికి సమర్పించి యిట్లనియె.

టీ. ఇట్లు=ఈరీతిగా—కనక ..గర్భితంబై -కనకకదళీపలాశ= బంగారు అరటియాకులచే,గర్భితంబై=కప్పఁబడినదయి, నిర్భర=అధికమైన,ఆమోద=పరిమళముచే, మధురంబు = సుందరమైనది, అగుదివ్యదామంబు=అయినయాదేవతాసంబంధమయినమాలికను, అయ్యాదిగర్భేశ్వరికిన్ = అభూమి కధిపురాలగు దమయంతికి, సమర్పించి=ఇచ్చి, ఇట్లనియెన్ =ఇట్లుచెప్పెను.

తా. స్పష్టము.

ఉ. చంచలనేత్ర! దివ్యలిపిసంతతి భూజనముల్ పఠింపలే
రంచును మానెఁగాని నఖరాగ్రమునన్ లిఖియించినీకుఁబు
త్తెంచుఁజుమీ మహేంద్రుఁడు మదీయకరంబున దేవతావనీ
కాంచనకేతకీకుసుమగర్భదళంబునఁ గార్యపద్ధతుల్. 122

టీ. చంచలనేత్ర= చలించు నేత్రములు గలదమయంతీ, దివ్యలిపిసంతతిన్ = దేవతలయక్షరసమూహమును, భూజనముల్ = భూలోకజనులు, పఠింపలేరు= చదువలేరు,అంచును,మానుకాని=మానివేసెనుగాని లేక విడిచెనుగాని,దేవతా... దళంబునన్ — దేవతావనీ = నందనవనమందలి, కాంచనకేతకీకుసుమ=బంగారు మొగలిపువ్వుయొక్క, గర్భదళంబునన్ = లోపలిరేకునందు, కార్యపద్ధతుల్ =కార్యరీతులను, నఖరాగ్రమునన్ =కొనగోటిచే,లిఖియించి=వ్రాసి, మహేంద్రుఁడు=దేవేంద్రుఁడు, మదీయకరంబునన్ = నాచేతితో, నీకున్, పుత్తెంచుఁజుమీ = పంపునుజుమా.

తా. దమయంతీ! దేవేంద్రుఁడు దేవతాసంబంధియగు నక్షరసమూహమును భూలోకవాసులు చదువలేరని తలంచి నీకుత్తరమంపుట మానెను. అట్లుగాక భూజనులు దేవతాలిపినిఁ బఠింపఁగలిగినచో నందనవనమందలిబంగారుమొగలి రేకునందుఁ గార్యపద్ధతులనుఁ దనగోటికొనతో వ్రాసి నాచేతిచే నీకుఁ బంపియుండుఁజుమీ.

తే. తెఱవ! యిన్నాళ్లు నడిగిపుత్తేఁడు నిన్ను
నరయ నిది తప్పుగాదె? సంవరణవేళఁ
గట్టు మమరేంద్రుకంఠంబుఁ గప్పురంపు
పలుకు లెడఁ బెట్టి కట్టినయలరుదండ. 123

టీ. తెఱవ=ఓదమయంతీ! ఇంద్రుఁడు (అధ్యాహారము) ఇన్నాళ్లు=ఇన్నిదినములును, నిన్నున్ =నిన్నును, అడిగిపుత్తేఁడు=కుశలప్రశ్నముచేయఁడాయెను, అరయన్ = ఆలోచింపఁగా, ఇది= ఇట్టిన్నిదినములును గుశలమడుగకుండుట, తప్పు= [illegible] నేళన్ =స్వ

యంబరకాలమందు, కప్పురంపుపలుకులు = కర్పూరపుముక్కలు, ఎడన్ = దూరముగా, పెట్టి, కట్టినయలరుదండన్ = కూర్చినపుష్పమాలచే, అమరేంద్రుకంఠంబున్ = దేవేంద్రునికంఠంబును, కట్టుము=బంధింపుము. అనఁగా సిగ్గువిడిచి ప్రార్థించుచున్న దేవేంద్రునివరింపుమని ఫలితార్థము. ఇట నింద్రునిపరిచారిక దమయంతింజూచి యింద్రుని వరింపుమని స్పష్టముగాఁ జెప్పక, "ఓదమయంతీ! దేవేంద్రుం డింతకాలము నిన్నుఁ గుశలమడుగక యుండుటచేఁ దప్పు చేసెను, దప్పుచేసినవాని దండించుట యుత్తమముఁ, గావున స్వయంవరకాలమందుఁ బూలదండచే నింద్రునికంఠంబున కురివోసి పగదీర్చుకొమ్మని చమత్కారముగాఁ జెప్పినది.

తా. ఓదమయంతీ! ఇంతకాలము నిన్ను దేవేంద్రుఁడు కుశలమడుగలేదు. కావున నేరముచేసెను. అట్లు నేరముచేసినయింద్రునికంఠంబును స్వయంవరకాలమందుఁ బూలదండతో బంధింపుము.

చ. భువనములందు నెల్లఁ గడుఁ బూజ్యము నాకము నాకభూమిలో
దివిజులు ప్రాభవాధికులు దివ్యకదంబములోఁ బులోమజా
ధవుఁడు వరేణ్యుఁ డానముచిదర్పహరుండు దృఢానురాగుఁడై
యువిద! నిను న్వరింప మదినువ్విళులూరెడు నెట్టిధన్యవో.

టీ. ఉవిద=ఓదమయంతీ! భువనములందున్, ఎల్లన్ = అన్నిలోకములలోను, నాకము = స్వర్గలోకము, కడున్ = మిక్కిలి, పూజ్యము = గౌరవార్హమైనది, నాకభూమిలోన్ = ఆస్వర్గలోకమందు, దివిజులు=దేవతలు, ప్రాభవాధికులు=సామర్థ్యముచే గొప్పవారు, దివ్యకదంబములోన్ = ఆదేవతాసమూహములో, పులోమజాధవుఁడు = శచీవల్లభుఁడు, అనఁగా నింద్రుఁడనుట, వరేణ్యుఁడు = శ్రేష్ఠుఁడు, ఆనముచిదర్పహరుండు = నముచి యనురాక్షసుని గర్వమడంచినవాఁడు, అనఁగా నింద్రుఁడు, దృఢానురాగుఁడై = అధికమగు ప్రేమకలవాఁడై, నినున్ = నిన్నును, వరింపన్ = వరింపఁగా, మదిన్ = మనస్సునందు, ఉవ్విళులూరెడున్ = ఎప్పుడువరించుననిఁ యూటలూరుచుండును, ఎట్టిధన్యవో = ఎటువంటిపుణ్యాత్మురాలవో కదా! సామాన్యముగాఁ దపంబు

లచేతనైనను భర్తగాఁ బడయ శక్యముకానియంద్రుఁడు మిక్కిలి ప్రేమతోఁ దనంతఁదాను నిన్నువరించుట నీభాగ్యాతిశయమును బ్రకటించుచున్నదని భావము. ఆలం. సారాలంకారము.

తా. లోకములన్నిటిలోను స్వర్గలోకముగొప్పది. స్వర్గలోకములో దేవతలు గొప్పవారు. ఆదేవతలగుంపులో దేవేంద్రుఁడు గొప్పవాఁడు అట్టి దేవేంద్రుఁడు మిక్కిలి యనురాగముతో నిన్ను వరించెను. నీ వెంత పుణ్యాత్మురాలవో కదా?

శా. ఏలోకంబునకై మహాక్రతుశతంబేకాగ్రతం జేసినాఁ
డాలోకంబు నలంకరించుటకు నిన్నర్థించె జంభారి నీ
వాలేఖర్షభునాజ్ఞ సేయఁ దగదే యబ్జాక్షి! మైకోలుమై
నాలస్యంబునుబోలె నైన నొకమాటల్లార్పు భ్రూవల్లరిన్.

టీ. అబ్జాక్షీ=పద్మములవంటి నేత్రములుగల దమయంతీ! జంభారి= జంభాసురుని: జంపినవాఁడు, అనఁగా నింద్రుఁడనుట, ఏలోకంబునకై = ఏస్వర్గలోకమునుబొందుటకు, మహాక్రతుశతంబున్ = గొప్పయాగములనూఱింటిని, ఏకాగ్రతన్ = తదేకమనస్సుతో, చేసినాఁడు = ఒనర్చియున్నాఁడో, ఆలోకంబున్ =ఆస్వర్గలోకమును, అలంకరించుటకున్, నిన్నున్ = అర్థించెను. స్వర్గలోకమునకుఁగూడ నలంకరణముపంటిదని చెప్పుటచే దమయంతి నిరుపమాన సౌందర్యము స్పష్టమగుచున్నది. నీవు, ఆలేఖర్షభునాజ్ఞన్ =ఆదేవేంద్రునియొక్కయాజ్ఞను, చేయన్ = ఒనర్చుట, తగదే = అర్హముకాదా? శతక్రతువులొనరించి మహావిఖ్యాతుఁడయినదేవేంద్రుని నీవు వరించుట మిక్కిలియుక్తమయినపనియని భావము. ఆలస్యంబును, పోలెన్, ఐనన్ = వ్యభిచారభావభేదమువలెనైనను, లేక, విలంబనుచేసినట్టులుండిరైనను, మైకోలుమైన్ = అభిలాషముచే, భ్రూవల్లరిన్ = భ్రూలతను, ఒకమాటు = ఒకపర్యాయము, అల్లార్పు = అంగీకారసూచనముగాఁ జలింపఁజేయుము.

తా. ఓదమయంతీ! యింద్రుఁ డేలోకమునిమిత్తము మహాక్రతువుల నూఱింటినిజేసెనో, యాస్వర్గలోకంబును, నలంకరించుటకు నిన్నుఁ బార్థించుచున్నాఁడు. నీ వాతనికోర్కి తీర్చుట యుక్తము. కావున నాలోచించుకొని

విలంబము చేసియయినను సతనికోర్కి నీ దీర్చునన్నట్టు లంగీకారమును దెలుపు నట్లు వీభూ్రలతను జలింపఁజేయుము.

సీ. నందనోద్యానమంకె దారకచ్ఛాయల
విశ్రమింపఁగ నీకు కె వేడ్కగాదె
మందాకినీపాండుకెమహితసైకతములఁ
గ్రీడ సల్పఁగ నీకుఁ కె బ్రియముగాదె
దుగ్ధాబ్ధికన్యకకెతోడికోడలు గాఁగ
నొరిమమై నుండ నీ కె కొప్పగాదె
మధుకైటభారాతి కె మఱఁది రమ్మని పిల్చి
పనిగొంట నీకుఁ బ్రాకెభవముగాదె

తే. మూఁడుసంధ్యల నీచేత కె మ్రొక్కుగొందు
రెవ్వరిటు తొల్లియావేల్పు కె లెల్ల నీకు
నర్థి మ్రొక్కంగ నునికి భాకెగ్యంబుగాదె
యేలసందేహ మమరేంద్రు కె నేలుకొనుము. 126

టీ. నందన...ఛాయలన్ – నందనోద్యాన= నందనమను పేరుగల పూలతోఁటయందుఁగల,మందారక=శౌలమందారవృక్షములయొక్క,ఛాయలన్ = నీడలందు, విశ్రమింపన్ = శ్రమదీర్చుకొనుటకు, నీకున్, వేడ్క, కాదే= కుతూహలత్వము లేదా? అనఁగా స్వర్గలోకమందుఁ జరించి యలంత చెందినప్పుడు పరులకు దుర్లభములయిన మందారవృక్షంబులనీడ విశ్రమించుట నీ కానందకరమైయుండును గాదా, కావున నీకోర్కి దీర్చుకొనవలెనంటేని నింద్రుని వరింపుమనిభావము. మందాకినీ...సైకతంబులన్ – మందాకినీ = గంగానది యొక్క, పాండు=తెల్లనైన, మహిత=ఒప్పుచున్న, సైకతంబులన్ = ఇసుకతిన్నెలయందు, క్రీడ, సల్పఁగన్=ఆటలాడుటకు, నీకున్, ప్రియము కాదే= ఇష్టము కాదా? అనఁగా నిష్టమగుననుట, మానవస్త్రీలకుఁ బొందఁదరము కాని మందాకిని[illegible] వలెనఁ౨

నింద్రుని వరింపుమనిభావము. దుగ్ధాబ్ధికన్యకతోడికోడల్లుగాఁగన్ = పాల సంద్రముకూఁతురగు లక్ష్మీదేవితోడికోడలు కాఁగా, ఒరిమమ్మైన్ = ఐకమత్యముతో, ఉండన్ = ఉండుటకు, నీకున్, ఒప్పగాదె=ఇష్టముకాదా? అనఁగా నగునునుట, వామనావతారమున విష్ణు వదితిగర్భమున జన్మించుటచే విష్ణు వింద్రునకుఁ దమ్ముఁడగును. కాన దమయంతి దేవేంద్రుని వరించినచో లక్ష్మీదేవి తోడికోడలగునని తెలియునది. సమస్తలోకములకును బూజ్యురాలగు లక్ష్మీదేవిని దోడికోడలుగాఁ బడయుభాగ్యము లభించునుగాన నింద్రునివరించుట యుత్తమమని భావము. మధుకైటభారాతిన్ =మధుకైటభులను రాక్షసులకు శత్రువును, అనఁగా విష్ణువునుట, మఱఁది!, రమ్ము=ఇట్లురా, అని, పిల్చి = చేరఁజీరి, పని, కొంట, పనులుచేయించుకొంట, ప్రాభవముకాదె = ప్రభుత్వలక్షణమేకదా? అనఁగా బ్రహ్మాదిదేవతలనుతికిఁ బాత్రుఁడగు విష్ణువును మఱఁదిగాఁ బడసి యతనిచేత సమస్తకార్యంబులను నెఱవేర్చుకొనునంతటిభాగ్యమింద్రునివరించిననీకుఁగాక మఱెవ్వరికి లభించు ననిభావము. ఎవ్వరు = ఏదేవతలు, మూఁడు సంధ్యలన్ = మూఁడుసంధ్యాకాలంబులందును, ఇటు= ఈరీతిగా, తొల్లి= పూర్వము, నీచేతన్, మ్రొక్కు = నమస్కారమును, కొందురు=కొనుచున్నారో, అనఁగా నేదేవత లిదివఱకు మ్రొక్కఁబడుచున్నారో, ఆవేల్పులెల్లన్ = ఆదేవతలందఱును, నీకున్, అర్థిన్ = ప్రీతితో, మ్రొక్కంగన్ = నమస్కరించుచుండఁగా, ఉనికి = ఉండుట, భాగ్యమ్ముకాదె=అదృష్టము కాదా? సందేహము=సంశయము, ఏల=ఎందుకు, అమరేంద్రునిన్ = దేవేంద్రుని, ఏలికొనుము=వరింపుము.

తా. ఓదమయంతీ! మానవులకు లభింపనినందనోద్యానమునఁ గలమందార వృక్షముల నీడలను సుఖముగా విశ్రమింపవచ్చును. నదులలోఁ బేరెన్నికగల గంగానదియొక్క యిసుకతిన్నెలందుఁ గ్రీడింపవచ్చును. మహాపూజ్యురాలయిన లక్ష్మీదేవితోడికోడలవయి యుండవచ్చును. ముల్లోకములకు నాథుండగు నారాయణుని "మఱఁది" యనిపిల్చి సకలకార్యంబు లతనిచేఁ జేయించుకొనవచ్చు.ఇది వఱకు మూఁడుసంధ్యలందును నీచే మ్రొక్కఁబడుచున్న దేవతలందఱిచేతను

మ్రొక్కులు గొనునట్టిభాగ్యమును బడయవచ్చును. కావున సందియమువిడిచి యింద్రునిఁ బెండ్లియాడుము.

ఉ. అద్దివిజాధినాయకుని యానతి సేయుము చిత్తవృత్తి నొం
డెద్దియునుం దలంపకు మహీనపరాక్రమనీతిశాలి నీ
ముద్దుమఱందికుఱ్ఱ హరి మోసలకార్యభరంబు దీర్పఁగా
గద్దియమీఁదనుండి త్రిజగంబులు నేలికొనంగ నొల్లదే. 127

టీ. అద్దివి...యానతి—అద్దివిజాధినాయకుని = ఆదేవేంద్రునియొక్క, ఆనతి=పంపును, చేయుము=అంగీకరింపుము, చిత్తవృత్తిన్ =మనోవ్యాపారమునందు, ఒండు, ఎద్దియునున్ =మఱేమియును, తలంపకు=స్మరింపకుము, అనఁగా నీమనంబునం దింద్రునిదక్క మఱొక్కని వరింపవలదని భావము, అహీన... శాలి-అహీన=తక్కువకాని, పరాక్రమ=విక్రమముచేతను, నీతి=రాజనీతిచేతను, శాలి=ఒప్పుచున్నవాఁడు, నీముద్దుమఱందికుఱ్ఱ=నీకుముద్దుగులుకు చిన్నిమఱఁది యైనట్టివాఁడును, అగు, హరి = నారాయణుఁడు, మోసలకార్యభరంబు=సభాకార్యవిశేషములు, తీర్పఁగాన్ = నెఱవేర్చుచుండఁగా, గద్దియమీఁదన్ =సింహాసనంబుపయిని, ఉండి=కూర్చుండి, త్రిజగంబులన్ =ముల్లోకములను, ఏలికొనంగన్, ఒల్లదే=పాలించుట కంగీకరింపరాదా? అనఁగా నంగీకరింపవచ్చునని భావము.

తా. ఓదమయంతీ! నీ వాదేవేంద్రుని శాసనంబును మన్నింపుము. నీమనంబున వేఱురీతిగాఁ దలంపకుము. పరాక్రమశాలియు నీతిశాలియును, నీకు ముద్దుమఱందియు నగు నారాయణుండు సమస్తరాజకీయవ్యవహారములను నెఱవేర్చుచుండఁగా సింహాసనముపై భర్తతోఁగూడఁగూర్చుండి ముల్లోకములను బాలించుకొనుము.

వ. అనిన విని యక్కన్నియ మిన్నకుండె. అప్పు డాపేరోలగంబున నున్న బోటికత్తియ లిది యుత్తమకార్యం బనువారును, నీప్రయోజనంబునకు విచారింపఁ బనిలేదనువారును, దీనికిం

దగినయుత్తరం బంగీకారం బనువారును, నై తమలోన గుజగుజలం బోవుచుండిరి. అనంతరంబ మందస్మితసుందరవదనారవింద యగుభీమనందన హస్తారవిందంబులుమోడ్చి సంక్రందనుం దలంచి వందనం బాచరించి తత్సందేశహారిణిం గనుంగొని యిట్లనియె. 128

టీ. అనినన్ = దేవేంద్రునిదూతిక పలుకఁగా, విని, అక్కన్నియ=ఆదమయంతి, మిన్నకుండెన్=ఊరకుండెను, అప్పుడు=ఆసమయమునందు, ఆపేరోలగంబునన్=ఆపెద్దసభయందున్న, బోటికత్తియలు=చెలికత్తెలు, ఇది=దేవేంద్రుని వరించుటయే, ఉత్తమకార్యంబు=మంచికార్యము, అనువారును=అనుపల్కుచుండువారును, ఈప్రయోజనంబునకున్=ఈకార్యంబునకు, విచారింపన్=ఆలోచింపఁగా, పనిలేదు=అవసరములేదు, అనువారును=అని పల్కువారును, దీనికిన్=ఈ సందేశమునకు, తగినయుత్తరంబు=తగిన ప్రత్యుత్తరము, అంగీకారంబు=సమ్మతించుటయే, అనువారును=అని పలుకువారును, ఐ, తమలోనన్, గుజగుజలన్, పోవుచుండిరి=గుసగుసలాడఁజొచ్చిరి. అనంతరంబ=తరువాత, మంద...విందమందస్మిత=చిఱునవ్వుచే, సుందర=సొగసైన, వదనారవింద=ముఖపద్మముగలది, అగు భీమనందన=అయిన దమయంతి, హస్తారవిందంబులు=కరపద్మములు, మోడ్చి=ముకుళించి, సంక్రందనున్=దేవేంద్రుని, తలంచి=స్మరించుకొని, వందనంబు=నమస్కారమును, ఆచరించి=చేసి, తత్సందేశహారిణిన్=ఆదేవేంద్రుని దూతికను, కనుంగొని=చూచి, ఇట్లనియెన్=ఇట్లు పలికెను.

తా. స్పష్టము.

తే. వేదములు నాల్గు వేవేలవిధులఁ బొగడ
మనము వొగడెడువారమే యనిమిషేంద్రు
వేఁడికొనియెదఁ జిగురాకుఁబోఁడి నిన్ను
హరిగుణస్తుతిసాహసికత్వంబు మాను. 129

టీ. చిగురాకుఁబోఁడి=చిగురువంటిశరీరముగల యోచెలియా, వేదములు, నాల్గు=నాల్గువేదములును, వేవేలవిధులన్=వేనవేల రీతులచే, బొగడన్=నుతింపుచుండఁగా, అనిమిషేంద్రున్=దేవేంద్రుని, మనము=స్త్రీలమగు మనము, పొగడెడువారమే=నుతింపఁగలమా, అనఁగా నుతింపలేమనుట, నిన్నున్, వేఁడుకొనియెదన్=ప్రార్థించెదను, వాఁగుణస్తుతి సాహసిక్యంబు=దేవేంద్రుని గుణంబుల నుతించుటయందలి సాహసమును, మాను=విడువుము, వేదము లనేకవిధముల నింద్రునిఁ బొగడుచుండఁగా, నాడువారమగుమనము పొగడుట కేపాటి వారము, కాన నిన్ను వేఁడుకొందును, ఇంద్రునిగుణములను వర్ణించుటకు సాహసింపకుము. ఈచెప్పుటచే దేవేంద్రునిగుణములు వర్ణనాతీతములు వానినిబొగడఁదరముకాదని దూతికనుమందలించుచున్నట్లు తెలియఁబడుచున్నది. మఱియు, నా మె నలుని వరించియున్నదికానఁ, బరుఁడగునింద్రునిగుణవర్ణనములను విన్నచోఁ దనపాతివ్రత్యమునకు లోపముగలుగునేమోయని యూహించి యింద్రుని గుణముల దనయెదుట వర్ణింపవలదని చెప్పఁదలంచియు నట్టు చెప్పిన బాగుగ నుండదని యట్లుచెప్పక యింద్రుని గొప్పగుణములను వర్ణింపలేము మానుమని మానిపించెనని సూచితమగుచున్నది. ఇందువలన దమయంతి పాతివ్రత్యము తెల్లమగుచున్నది.

తా. స్పష్టము.

సీ. శ్రుతి నుతింపఁగ నీవు • నుతియించెదే యింద్రు
　　నతివ యీసాహసి•క్యంబు మాను
సకలాత్మసాక్షికి • శతమన్యునకు వేఱ
　　చెప్పంగ వలయునే • చిత్తవృత్తి
హరియాజ్ఞ లక్షించి • నాకురోచ్చారపా
　　రుష్యభారమున కోఁ•కుచునె జిహ్వ
సంక్రందనునిదివ్య•సందేశవాక్యంబు
　　దరియింతు మాల్కిఁ బూ•దండఁ బోలె

తే. రాజునాఁగ నిజాంశసంప్రభవుఁడైన
జిష్ణునకు నేను బరిచర్య సేయఁగలను
మున్నె నలునకు నన్నిచ్చుకొన్నదాన
నింక నొరునకు నెబ్భంగి నిత్తు చెపుమ. 130

టీ. శ్రుతి=వేదము; నుతింపఁగన్=స్తోత్రముచేయుచుండఁగా, నీవు, ఇంద్రున్=దేవేంద్రుని, నుతియించెదే=స్తోత్రము చేయుదువా, అనఁగా నింద్రుని సద్గుణములను నుతింప వేదములకే సామర్థ్యముకలదు కాని నీవంటివాని కది యెట్లు లభించుననిభావము. అతివ=ఓలలనా!, ఈసాహసిక్యంబు=ఈసాహసమును, మాను=విడిచిపెట్టు, సకలాత్మసాక్షికిన్=అన్నిజీవులకు సాక్షిభూతుఁడయిన, శతమన్యునకున్=దేవేంద్రునకు, చిత్తవృత్తి=నామనోవ్యాపారమును, వేఱ=ప్రత్యేకముగా, చెప్పంగన్, వలయునే=చెప్ప నవసరముండునా, అనఁగా, నింద్రుఁడు సమస్తప్రాణులకు సాక్షిభూతుఁడై తదీయచిత్తవృత్తులను దెలిసికొనియే యుండునుగాన నతఁడు నాచిత్తవృత్తినిగూడఁ దెలిసికొనియే యుండును. ఇందువిషయమై ప్రత్యేకముగాఁ జెప్పవలసిన యవసరము లేదనిభావము. హరియాజ్ఞ=ఇంద్రునియొక్క యాజ్ఞ, లక్షించి=తెలిసికొని, నాక్షర భారమునకున్-నాక్షర="న"యనెడు యక్షరమును, ఉచ్చార=ఉచ్చరించుట యందలి, పారుష్యభారమునకున్=కాఠిన్యాతిశయమునకు, జిహ్వ=నాలుక, ఓరుచునే=సహించునా, అనఁగా నింద్రునివంటి యుత్తమోత్తముని యాజ్ఞను శిరసావహింపవలసినదే కాని తదాజ్ఞకు బ్రతిషేధవాచియగు నకారము నుచ్చరించుటకు నెవరినాలుక సహింపఁగలుగును. ఎవ్వరు నట్టివానియాజ్ఞను బ్రతిషేధింపలేరని ఫలితార్థము. సంక్రందనుని..వాక్యంబున్ = దేవేంద్రునియొక్క, దివ్య=శ్రేష్ఠమైన, సందేశవాక్యంబు=సందేశవచనమును,పూదండఁబోలెన్=పూలదండనువలెను, మౌళిన్=శిరస్సునందు,ధరియింతున్ = తాల్చెదను, రాజునాఁగన్=రాజశబ్దముచే చెప్పఁబడుచు, నిజాంశసంప్రభవుఁడు=తనయొక్క యంశముచే జనించినవాఁడు,ఐనజిష్ణునకున్=ఐనట్టి దేవేంద్రునకు, నేను, పరిచర్య=సేవను,చేయఁగలను, ఓయింద్రదూతికా!యింద్రునిఁ బ్రత్యక్షముగా వరియింపలేక

పోయినను, శ్లో "అష్టాభిశ్చ సురేంద్రాణాం మాత్రాభి ర్నిర్మితోనృప 'యను టంబట్టి తదీయాంశముచే జన్మించినరాజునుదప్పకవరింతును. ఇంద్రాంశముచే జనించినరాజును వరించుట యింద్రునివరించుటవంటిదే గనుక నతనియాజ్ఞ నుల్లంఘింపకపోవుట స్పష్టమగుచున్నది. మున్నె=ఇంద్రుఁడుసందేశమంపుటకు పూర్వమే, నన్నుఁ, నలునకుఁ, ఇచ్చుకొన్నదానఁ=అర్పించుకొంటిని, ఇంకఁ=ఇపుడు, ఒరునకు=మరియొకనికి, ఎబ్భంగిఁ=ఏరీతిగా; ఇత్తుఁ=అర్పించుకొనఁగలను, చెపుమా.

ఈపద్యము మూడవపాదమున "అక్షరోచ్చారపారుష్యభారమునకు" అని యచ్చుప్రతులలోను, "యాక్షరోచ్చారపారుష్యభారమునకు" అని వ్రాఁతప్రతులలోను ద్వివిధముగాఁ బాఠముగానవచ్చుచున్నను "నకారపారుష్యముపై తిజిహ్వ" అను సంస్కృతపాఠము ననుసరించి యిట "నాక్షరోచ్చారపారుష్యభారమునకు" అనుట యుత్తమమనితెలంచి అట్లు సవరణచేయఁబడెను.

తా. ఓచెలియా ! వేదములచే నుతింపవలసినయింద్రుని మనము నుతింపలేము. కాన నతని నుతింప సాహసింపకుము. ఇంద్రుఁడు సకలజీవులకు సాక్షియైయుండును గనుక నాచిత్తవృత్తినిగూడ చెలిసికొఁగలఁడు. ఇందువిషయమై ప్రత్యేకముగా జెప్ప నవసరములేదు. ఇంద్రాజ్ఞను సందఱుజేయవలసినదేకాని చేయనని నిషేధింప నెవరికి నోరువచ్చును ? దేవేంద్రునిశాసనమును పూలదండనువలెను శిరమునందు ధరింతును. నేను బ్రత్యక్షముగా నింద్రుని వరింపలేకపోయినను నిజాంశముచే భూమిలో రాజుగా నుదయించినయింద్రుని సేవఁజేసెదను. ఇంతకుమున్నే నన్ను నలున కర్పించుకొంటిని. ఇఁక నొరులకిచ్చుకొనలేను.

తే. నలుని వరియింపఁ గోరెడునాకు నిప్పు
డింద్రుపలుకు లయుక్తంబు లింపు గావు
గామసుఖములు నిర్వాణకాముమతికిఁ
గరము రుచియింపకునికి యుక్తంబకాదె. 131

టీ. నలునిఁ, వరియింపఁ = పెండ్లియాడుటకు, కోరెడునాకుఁ = అభిలషించుచున్ననాకు, ఇప్పుడు = ఈసమయమునందు, ఇంద్రుపలుకులు = దే

వేంద్రునిమాటలు,అయుక్తంబులు=తగవు,ఇంపుగావు=ఇష్టముగావు లేక రుచింపవు, నిర్వాణకామమతికిన్ = మోక్షసుఖము నపేక్షించువానికి, కామసుఖములు=ఇంద్రియసుఖములు; కరము = మిక్కిలి, రుచింపక, ఉనికి=ఇష్టపడక పోవుట, యుక్తంబకాదె=తగదా అనఁగాఁ దగుననుట.

తా. ఓసుందరీ! నిరతిశయమైన మోక్షసుఖము కోరుచున్నవాని కింద్రియ సుఖములు రుచింపనట్లు నిరతిశయసౌఖ్యదాయకుఁడగు నలునివరింపఁ గోరుచున్న నాకు నింద్రుపలుకులు వినఁదగవు. మఱియు రుచింపవు.

మ. ఇల వర్షంబులలోన భారతము భూయిష్ఠంబు నాల్గాశ్రమం
బులలోనన్ గృహమేధియాశ్రమమునుంబోలెంబయోజాక్షి
యి,చ్ఛలఁగావించెద భర్తృభక్తిగరిమన్ శర్మోర్మి కిమ్మీరని
ర్మలధర్మాగమమర్మనర్మసఖసమ్యక్కర్మకాండంబులన్. 132

టీ. పయోజాక్షి = పద్మములవంటి నేత్రములు గలిగిన ఓ చెలియా ! నాల్గాశ్రమంబులలోనన్ =బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసములనెడి యాశ్రమములనాల్గింటిలోను; గృహమేధియాశ్రమమునుంబోలెన్ = గృహస్థాశ్రమమువలెనే; ఇలన్ = భూలోకమునఁగల, వర్షంబులలోన్ = ఇలావృతాదులగు వర్షములలో, భారతము=భరతవర్షము, భూయిష్ఠంబు = శ్రేష్ఠమైనది, ఇటన్ =(అధ్యాహారము) ఈభారతవర్షమునందు, గృహస్థాశ్రమము నవలంబించినదాసనై, భర్తృభక్తిగరిమన్ = పతిభక్తిపెంపుచే, కర్మ... కాండంబులన్ -శర్మోర్మి=సుఖపరంపరలచే, కిమ్మీర = చిత్రితమైన, అనఁగా సుఖపరంపరలను కలిగించునదనుట, నిర్మల=స్వచ్ఛమైన, ధర్మాగమమర్మ=ధర్మశాస్త్రరహస్యములకు,నర్మసఖి=ప్రియస్నేహితములైన,అనఁగా విరుద్ధములుకావనుట, సమ్యక్ =లెస్సయైన లేక మేలుకలిగించెడు, కర్మకాండంబులన్ = క్రియాకలాపములను, ఇచ్ఛలన్ =కోర్కులచే, కావించెదన్ =ఒనర్చెదను. ఈ చెప్పుటచే దమయంతి నలుని వరించి స్వర్గసుఖదాయకములైనధర్మము నాచరించి తత్సహాయమున స్వర్గలోకమునకుఁ బోఁదలంచెనుగాని నిరాయాసముగా లభించుచున్న ను నింద్రునివరించి స్వర్గసుఖ మనుభవింపఁదలంపలేదని తెలియవచ్చుచున్నది.

తా. ఓసుందరీ ! చతురాశ్రమములలో గృహస్థాశ్రమము శ్రేష్ఠమైనట్లు వర్షములలో భారతవర్షము మిగులశ్రేష్ఠమైనది. నే నీభారతవర్షమున, గృహస్థాశ్రమమునుండి పతిభక్తిపెంపుచే సుఖపరంపరలను గలిగించునవియు ధర్మశాస్త్రములకు విరుద్ధములు గానివియు నగుయుక్తకర్మకలాపమును గోర్కులతో గావింతును.

అవ. ఓదమయంతీ ! భూలోకములోనంబోలె స్వర్గమందుఁ గూడ సుఖధర్మములుకలవుగాని లేకపోలే దనుప్రశ్నమునకు నీ పద్యముచే సమాధానము చెప్పుచున్నది.

ఉ. శర్మమెకాని యవ్విబుధసద్మమునందుఁ దలంచిచూడఁగా
 ధర్మము సేయలే దిచట ధర్మముసేయఁగ నిర్విశంకతన్
 శర్మమునొందనుంగలదుశర్మముధర్మముఁగాంచుటొప్పునో
 శర్మముగాంచుటొప్పునొవిచారము సేయుము నెమ్మనంబునన్

టీ. తలంచి, చూడఁగాన్ = తరిచితరిచి యాలోచింపఁగా, అవ్విబుధసద్మమునందున్ = ఆస్వర్గలోకమునందు, శర్మమెకాని = సుఖ మనుభవించుటెకాని, ధర్మము; చేయన్ = చేయుటకు, లేదు, అనఁగా నీభూలోకమున ధర్మము లాచరించి యవసానమున స్వర్గమునకుఁ బోయి యందు స్వవిహితకర్మజనితములగు సుఖము లనుభవింపవలసినదేగాని యట నింకను సుఖమును కలిగించు ధర్మముల నాచరింప వలనుపడదని భావము, ఇచటన్ = ఈలోకమునందు, నిర్విశంకతన్ = నిస్సందేహముగా, ధర్మము, చేయఁగన్ = చేయుటకును, శర్మము=సుఖమును, ఒందనున్ =పొందుటకును, కలదు, శర్మము = సుఖమును, ధర్మమున్, కాంచుట=పొందుట, ఒప్పునో=తగునో, శర్మమున్ = కేవలసుఖమును, కాంచుట=పొందుట, ఒప్పునో=తగునో, నెమ్మనమ్మునన్ = నిండుమనంబుతో, విచారము సేయుము = ఆలోచింపుము.

తా. ఓసుందరీ! భూలోకముకంటె స్వర్గలోక ముత్తమముకాదు. ఆలోచింపఁగా నాస్వర్గమందు సుఖ మనుభవించుటయేకాని, సుఖజనకములగు ధర్మము

లాచరింప వలనుపడదు. ఈలోకమందో నిస్సందేహముగా సుఖజనకమగు ధర్మము నాచరింపవచ్చును. సుఖము ననుభవింపవచ్చును. కావున సుఖమును, సుఖజనకమగు ధర్మమును సంపాదింపఁదగియున్నలోకమే మంచిదో, ఇదివఱ కాచరింపఁబడిన ధర్మములవలన గలుగు సుఖములనుమాత్రమే యిచ్చి స్వర్గలోకమే మంచిదో, నీవేయోజింపుము.

క. ఇందుండి యూర్ధ్వగతియును
   నందుండి యధోగతియును నవసానమునన్
   బొందును సజ్జనుఁ డిందును
   నందును గలవాసి చూడుమా డెందమునన్. 134

టీ. సజ్జనుఁడు=మంచివాఁడు, అవసానమునన్ =అంతమందు, ఇందుండి= ఈలోకమునుండి, ఊర్ధ్వగతియును=ఊర్ధ్వగమనమును, అందుండి = ఆలోకమునుండి, అధోగతియును= అధోగతిపాలగుటయు, పొందున్ = పొందును, డెందమునన్ = మనస్సునందు, ఇందున్ = ఈభూలోకమునందును, అందున్ = ఆస్వర్గలోకమునందును, కలవాసి = ఉన్నతారతమ్యమును, చూడుమా = పరిశీలింపుమా, అధోగతిపాలుసేయుస్వర్గలోకముకంటె నూర్ధ్వలోకగమనము గలిగించెడు భూలోకమే యుత్తమమని భావము.

తా. ఓసుందరీ! సజ్జనుఁ డంతమందు యీలోకమునుండి యుత్తమగతిఁజెందును. ఆలోకమునుండి యధోగతిపాలగును. ఈరెండులోకములందుఁ గలతారతమ్యము నాలోచించిన నేలోకము మంచిదో నీకే తెలియును.

ఉ. ఆతతమైనకర్మగతి నాయువు వీడ్కొనునప్పు డాత్మలోఁ
   గౌతుక మావహించునది గావున నాకసుఖం బపథ్యమా
   పాతసుఖోన్ముఖుం డయినపంచజనుండు భజించు దానిఁ గా
   మాతురితాతిరేకమున నార్యుల కింపవు దత్ప్రకారముల్.

టీ. ఆతతము = విస్తారమైనదే, ఐనకర్మగతిన్ = ఏనట్టికర్మము గతించుటచేత, ఆయువు = ఆయుష్కాలము, వీడ్కొనునప్పుడు = వెళ్లునప్పుడు, ఆత్మ

లోన్ = మనమునందు, కౌతుకము = ప్రాప్తివస్తువుల ననుభవింపవలెనన్న కోరికను, ఆవహించునది = కలిగించునది, కావునన్, నాకసుఖంబు = స్వర్గలోకసుఖము, అపథ్యము=హితకరముగాదు,ఆపాతిసుఖోన్ముఖుండు-ఆపాతి= ప్రారంభమునందు, సుఖోన్ముఖుండు = సుఖముల కున్ముఖుఁడు, ఐన, పంచజనుండు=ఐనట్టిసామాన్యపురుషుఁడు, దానిన్ = ఆస్వర్గసుఖమును, కామాతురితాతిరేకమునన్ - కామ= కోర్కియందలి, ఆతురితాతిరేకమునన్ = తొందరయొక్క యతిశయముచేతను, భజించున్=కోరును, తత్ప్రకారమ్ముల్ =ఆరీతులు, నార్యులకున్ =నీచులకు, ఇంపగున్ =ఇష్టమగును. అపథ్యాన్నభోజనాదులవలె నాసన్ననాశనము కలదగుటచే నాకభోగమును బుద్ధిమంతు లంగీకరింపరని భావము.

తా. ఓసుందరీ! కర్మసంపాదితమైన యాయువు పోయినప్పుడే యది సంప్రాప్తమగుచుండునుగనుక నాకసుఖ మెంతమాత్రము హితకరముకాదు ప్రారంభకాలమునందే సుఖాభిలాషగల సామాన్యజనుఁడు దానిని కోరుచుండును. అట్టిమార్గములన్నియుఁ గామాభిలాషులైన నీచులకే రుచించుచుండునుగాని తక్కినవారికి రుచింపవు.

వ. అనిపలికి యింద్రదూతికావాక్యంబులకు మనసువెట్టిన బోటికత్తియలతలం పెఱింగి వారివదనంబులు వీక్షించియిట్లనియె.

టీ. అని, పలికి = ఇంద్రదూతికకుఁ బ్రత్యుత్తరమిచ్చి, ఇంద్ర...వాక్యంబులకున్ =ఇంద్రదూతిక పలికిన వాక్యములకు, మనసుపెట్టిన=ఇష్టపడిన, బోటికత్తియలతలంపు=చెలికత్తెల యభిప్రాయమును, ఎఱింగి = తెలిసికొని, వారివదనంబులు=వారిముఖంబులు, వీక్షించి=చూచి, ఇట్లనియెన్ =ఇట్లుపలికెను.

తే. మీాతలం పే నెఱుంగుదు నే మిన్నకుండుఁ
డంబుజాననలార ! యానేయాస ముడిగి
యే ననాదిసంచారిణి నై యైనయాత్మ
హేతుపం క్తికి విధికి న నే ధీనబుద్ధి.　　137

టీ. అంబుజాననలార = పద్మమువంటి ముఖంబులుగల చెలిమికత్తియలార, మీతలంపు=మీయభిప్రాయమును, ఏను, ఎఱుంగుదున్, ఆయాసము=ప్రయాసము, ఉడిగి=విడిచి, మిన్నకుండుఁడు=ఊరకుండుఁడు, ఏను, అనాదిసంచారిణి=అనాదిగా వచ్చుచున్నది, ఐనయాత్మహేతుపంక్తికిన్=అయినట్టి నాదేహపరంపరలకుఁ గారణములగు కర్మపరంపరలకును, విధికిన్=దైవమునకును, అధీనబుద్ధిన్-అధీన=లోఁబడిన, బుద్ధిన్=బుద్ధిగలదానను.

తా. ఓచెలికత్తెలారా! మీతలఁపు నేనెఱుంగుదు, మాటలాడ శ్రమపడక యూరకుండుఁడు. నేననాదిగా జన్మహేతువులై వచ్చుచున్న కర్మపరంపరలకును, దైవమునకును లోఁబడినదానను గాని స్వతంత్రనుగాను. కాన నా కుపదేశింప నవసరములేదు.

క. నియతి యచేతన యఖిలము
నియతిపరాధీన మిట్టినిజ మెఱిఁగినచో
నియతివశున్ నియమించుట
నియతిగుఱిచి గర్హసేత నిష్ఫల మరయన్. 138

టీ. అరయన్=ఆలోచింపఁగా, నియతి=దైవము, అచేతన = చేతనము లేనిది, అఖిలము = సమస్తలోకము, నియతిపరాధీనము = దైవాధీనమయినది, ఇట్టినిజము = సమస్తము దైవాధీనమైనదన్నసత్యమును, ఎఱిఁగినచోన్= తెలిసికొన్నచో, నియతివశున్=దైవాధీనుని, నియమించుట=శాసించుటయు, నియతిగుఱించి = దైవమునుగూర్చి, గర్హసేత=నిందించుటయు, నిష్ఫలము= వ్యర్థము.

తా. దైవ మచేతనము. సమస్తము దైవమునకధీనమయియుండును. ఇట్టి సత్యమును దెలిసికొన్నచో నియతి కధీనమయియుండుటచేఁ బరతంత్రమగును గాన నట్టిదానిని నిందించుటయు, నచేతనమయిన దైవమును నిందించుటయు నాలోచింప వ్యర్థము.

క. లోకంబున నాకీటం
బాకెటభవెరి యెల్లయాత్మలకు నభీ

ష్టాకాంక్ష లొక్కచందము
యీకీ లెఱుఁగంగవలదె హృదయములోనన్. 139

టీ. లోకంబునన్ = ప్రపంచకములో, ఆకీటంబు = పురుగు మొదలుకొని, ఆకైటభవైరి = విష్ణుమూర్తిపర్యంతమునుగల, ఎల్లయాత్మలకున్ = ఎల్లజీవులకును, అభీష్టాకాంక్షలు = ఇష్టవస్తువుల నపేక్షించుటలు, ఒక్కచందము = ఒక్కవిధముగానేయుండును. ఈకీలు = ఈమర్మము, హృదయములోనన్ = మనస్సులో, ఎఱుఁగంగవలదె = తెలిసికొనవలదా? పురుగు మొదలు విష్ణువుపర్యంతముగల సమస్తజీవులకుఁ దమతమయభీష్టవస్తువులు ప్రాప్తించినచో సమానమగు నానందంబు నే చెందుదురు? దేవేంద్రునికంటె నలుఁ డన్నివిధంబులచేతను దక్కువవాఁడే యయినను నా కభీష్టుండగుటచే నధికమగు నానందమే కలుగుచున్నది. నలునికంటె గొప్పవాఁడయిన యింద్రుండు లభించినను నాకభీష్టుండు కానిహేతువున నా కానందము కలుగ నేరదని భావము.

తా. లోకములోఁ బురుగు మొదలు విష్ణువువఱకుఁ గల సమస్తప్రాణికోటికి వస్తువు లందములుకాకపోయినను జిన్నవయినను, నిరుపయోగములుగాఁ గానవచ్చుచున్నను, "లోకోభిన్నరుచిః" యన్నట్లు వారివారిమనంబులకు హితమయి విలభించినచో వారివారికిఁ బరిపూర్ణానందము కలుగును. ఈరహస్యము నందఱును దెలిసికొనవలయును.

తే. కొన్నిజీవులు చిదిపి తాఁ గ్రొల్లొటికి బ్రదుకుఁ
గొన్ని నునుసోఁగవెన్నెల క్రోలి పొదలు
భిన్నరుచులైనవారికిఁ బ్రీతి సరియ
తగవు గా దిందులోన నేకతరగర్హ. 140

టీ. కొన్నిజీవులు = కొన్నిప్రాణులు, చిదిపి = ముక్కలుజేసి, తాల్ = తాలను, కొఱికి = తిని, బ్రదుకున్ = జీవించును, కొన్ని = మఱికొన్నిజీవులు, నునుసోఁగ వెన్నెలన్ = మృదువయి దీర్ఘమగు వెన్నెలను, క్రోలి = త్రావి, పొదలున్ = వర్ధిల్లును, భిన్నరుచులు = వేఱువేఱు రుచులుగలవి, ఐనవానికిన్ = ఐనజీవజంతు

వులకు, ప్రీతి=తృప్తి, సరియ = సమానమే, ఇందులోన్ = ఇట్టివానిలో, ఏకతర గర్హ =ఒకదాని నిందించుట, తగవుగాదు=న్యాయము గాదు.

తా. సఖులారా! లోకములో కొన్ని జీవులు చాలుదిని బ్రదుకును, మఱి కొన్ని మృదువగు వెన్నెలను దిని బ్రదుకును, వేఱు వేఱు వస్తువుల కిష్టపడుచున్న జీవులకు తృప్తిఁజెందుట సమానమే. వెన్నెలల గ్రోలువాని కెట్టితృప్తియు నెట్టి యానందము గల్గునో, రాలుదినువానికిఁగూడ నట్టితృప్తియు నట్టియానందము గల్గుచున్నది. వానిలో నొకదానిని నిందించుట' నెంతమాత్రము తగవుకాదు. కావున నింద్రుని వరించినవారి కెట్టియానందము గల్గునో నలునివరించిన నాకు నట్టియానందమే గల్గును. అట్లుండ నలుని వరించి యింద్రుని తిరస్కరించినందు లకు మీ రన్యథా తలంతురేల?

తే. అగ్రమార్గజాగ్రన్నిభృతాపదంధు
బంధుసంరక్షణము పాడి కే బాంధవులకు
నైనకార్యంబు గానికార్యమును దెలిసి
యాడుఁడా యేను మీమాటకే కడ్డమాడ. 141

టీ. అగ్ర... రక్షణము - అగ్రమార్గ=మార్గముయొక్క పురోభాగమునందు, జాగ్రత్ =ప్రకాశించుచున్న, అనఁగా సమీపమున నున్నదనుట, నిభృత= నియతిమైన, ఆపదంధు = ఆపదయనెడు కూపముగల, బంధు=చుట్టములను, సంరక్షణము=రక్షించుట, బాంధవులకున్ =చుట్టములకు, పాడి = న్యాయము, అనఁగా మార్గమధ్యమందున్న కూపమునఁజూడక యందుఁ గూలుటకు సిద్ధముగ నున్న వానిని దప్పించి రక్షించినట్లు బంధువులు తమచుట్టములకు సమీపించియు న్న యాపదనుండి వారిని తప్పించుట న్యాయమనిభావము. ఐనకార్యంబున్ = ఇదివఱకు జరిగినకార్యమును, కానికార్యమును= ముందుకాఁబోవు కార్యమును; లేక; ఐనకార్యంబున్ =తగినకార్యమును, కానికార్యమును = తగనికార్యము ను, తెలిసి=ఎఱిఁగి, ఆడుఁడా=మాటలాడుఁడీ; ఏను=నేను, మీమాటకున్ =మీ వాక్యమునకు; అడ్డమాడన్ =ఆటంకము చెప్పను.



357. ఒక చెలియ దేవేంద్రునే వరింపుమనఁగా దమయంతి నలునే వరింతునని చెప్పుట.

తా. ఓ చెలులారా ! మార్గము నెదుటిభాగమునందున్న కూపమును జూడక యందుఁబడి చావసిద్ధులైన బంధువులను రక్షించుట పాడియైనట్లు ముందు సమీపించుచున్న యాపదల నెఱుఁగక యందుఁబడి చావసిద్ధముగానున్న బంధువులనురక్షించుట బంధువునకు హితమైనకార్యము. కావున నే నట్టియాపదనొంద సిద్ధముగానున్న చోఁజుట్టాలగుమీరు నన్నందుండి తప్పించి రక్షించుట యుచితమే. కాని నే నట్టిస్థితిని బొందనప్పుడు మీయీయుపదేశంబులతో నేమిప్రయోజనము? ఇదియునుంగాక తగినకార్యమేదియో ; తగనికార్యమేదియో చక్కఁగ తెలిసికొని మాటలాడుఁడు. అట్లయినచో మీమాటకే నెంతమాత్ర మాటంకము చెప్పను.

వ. అని సఖులనెల్ల నివారించి పురుహూతదూతికం గనుంగొని మఱియు నిట్లనియె. 142

టీ. సులభము.

ఉ. స్వర్పతిచిత్తవృత్తి గలుషత్వమునొందునొ యన్భయంబు నా
కేర్పడలేదు విన్ము దివిజేశ్వరదూతిక ! సప్తతంతుభా
గార్పణ మాచరించి కరమాదరణంబున నేను రాజకం
దర్పుఁడునైషధాధిపుఁడుదన్నునుపాస్తియొనర్పఁజాలుటన్.

టీ. దివిజేశ్వరదూతిక = ఓయింద్రదూతికా ! నేనును, రాజకందర్పుఁడు=రాజులలో నందగాఁడగు; నైషధాధిపుఁడు=నలమహారాజును, కరము=మిక్కిలి, ఆదరణంబునన్ =ప్రేమచేత; సప్తతంతుభాగార్పణము=యజ్ఞభాగసమర్పణను, ఆచరించి=చేసి, అనఁగా యజ్ఞభాగముల నర్పించి యనియర్థము. తన్నున్ ; ఆదేవేంద్రుననుట, ఉపాస్తి=ఉపాసన; ఒనర్పన్ ; చాలుటన్ = చేయఁగలిగియుండుటచే, స్వర్పతిచిత్తవృత్తి=ఇంద్రుని మనోవ్యాపారము; కలుషత్వమున్ =కలంతను, ఒందునో=పొందునేమో; అనుభయంబు=అన్నభయము; నాకున్ , ఏర్పడన్ =స్పష్టముగా; లేదు.

తా. ఓయింద్రదూతికా! నే నిట్లు తిరస్కరించుటవలన నింద్రునికిఁ గోపము వచ్చునన్నభయము నా కెంతమాత్రము లేదు, ఒకవేళ గోపము వచ్చినను నేను

నలమహారాజును వరించి యతనితోఁగూడ యాగములనాచరించి యజ్ఞభాగములనింద్రునకర్పించి యతనినుపాసనఁజేసి కోపమును శాంతింపఁజేయఁగలను.

చ. తనహృదయాధినాయకుని కేదకఁగఁదక్కొరు సన్నుతింపఁగా
వినుట పతివ్రతంబునకు కే విగ్రహ మిట్టిది ధర్మశాస్త్రవా
సన యటుగాన యోదివిజ కే శంభళి! యింకిటఁబట్టి నీకు మీ
యనిమిషరాజుపాదములకేయానసుమీమఱి యేమివల్కినన్.

టీ. ఓదివిజశంభళీ=ఓ యింద్రదూతికా ! తనహృదయాధినాయకునిక్=తనమనోనాయకుని, తక్కఁగక్=తప్ప, తక్కొరుక్=మఱియొకనిని, సన్నుతింపఁగాక్=నుతింపఁగా, వినుట=ఆలకించుట, పతివ్రతంబునకుక్=పాతివ్రత్యమునకు, విగ్రహము=విరోధి, అనఁగా భంగముకలిగించునదని యనుట, ధర్మశాస్త్రవాసన=ధర్మశాస్త్రముల సమాచారము, ఇట్టిది=ఇటువంటిది, అటుగానక్=ఆకారణముచే, ఇంకిటబట్టిక్=ఇఁకమీఁద,మఱి=అధికము, ఏమిపల్కినక్ = ఏమిచెప్పినను, నీకుక్, మీయనిమిషరాజు పాదములయానసుమీ=మీదేవేంద్రునిపాదములతోడని తెలుసుకొనుము.

తా. ఓయింద్రదూతికా! తనభర్తనుదక్క వేఱొకని వర్ణించుచుండఁగా; విన్నచో నది పాతివ్రత్యమునకు భంగముగలిగించు నని ధర్మశాస్త్రసమ్మతము కావున నిఁకమీఁద నీవేమియు మాటలాడకుము.అట్లుమాటలాడుదువేని, మీదేవేంద్రునిపాదములతోడు.

వ. అని తెగనాడి యచ్చేడియ సముచితప్రకారంబున బిడౌజసునిదూతికను వీడుకొల్పె. అగ్నియమవరుణుల సంచారికలునుఁ దమతమకు నదియ యుత్తరంబుగాఁ గైకొని యయ్యుత్తమాంగనం దగినతెఱంగున నామంత్రణంబుచేసి చనిరి. అంతరిక్షంబుం డైనధరణీకాంతుం డావృత్తాంతంబంతయు నెఱింగి సంతోషభరితాంతఃకరణుండై యక్కాంతారత్నంబునుం గనుంగొనియె నప్పుడు.

టీ. అని తెగనాడి=ఇట్లుతిరస్కరించి; అచ్చేడియ=ఆదమయంతి, సఖుచి తత్ప్రకారంబునన్=తగిననరీతిచే, బిడౌజసుదూతికను=ఇంద్రదూతికను, వీడు కొల్పెన్=పంపించెను. అగ్నియమవరుణుల సంచారికలును=అగ్నియమవరుణుల దూతికలును, తనుకుందమునన్, 'అదియ=ఆయింద్రదూతికకుఁ జెప్పినదియే,ఉత్తరంబుఁగాన్=ప్రత్యుత్తరంబుగా, కైకొని=చేసికొని, అయ్యుత్తమాంగనన్= ఉత్తమురాలగు నాదమయంతిని, తగినతెఱంగునన్=తగినరీతిచే, ఆమంత్రణంబుచేసి=గౌరవముతో విడిచి;చనిరి=పోయిరి.అంతర్హితుండు=తిరస్కరిణీవిద్యచే,నొరులకుఁ గానఁబడకయున్నవాఁడు,ఐన ధరణీకాంతుండు=ఐననలమహారాజు, అవృత్తాంతంబు, అంతయున్, ఎఱింగి, సంతోషభరితాంతఃకరణుండై=సంతోషముచే నిండినచిత్తము కలవాఁడై, అకాంతారత్నంబున్=స్త్రీరత్నంబగు నాదమయంతిని; కనుంగొనియెన్, అప్పుడు.

తే. ముదితక్రొమ్మేనికాంతిలోఁ మునిఁగె మొదల
నంత నానందరసవార్ధియందుఁ దేలె
బిదప సమ్మోదబాష్పాంబుబిందుధార
యందు నవగాహనముచేసె నధిపుదృష్టి. 146

టీ. అధిపుదృష్టి=నలమహారాజుచూపులు, మొదలన్ = మొట్టమొదట, ముదితక్రొమ్మేనికాంతిలోన్ = దమయంతియొక్క క్రొత్తశరీరకాంతిలో; మునిఁగెన్=క్రుంకులిడెను, అంతన్=తరువాత, ఆనందరసవార్ధియందున్=ఆనందరససముద్రమునందు, తేలెన్=ఈఁదులాడెను, పిదపన్=తర్వాత, సమ్మో... యందున్-సమ్మోద=ఆనందమువలనఁగలిగిన, బాష్పాంబు = కన్నీటియొక్క; బిందుధారయందున్=బిందువులపంక్తియందు, అవగాహనముచేసెన్=స్నానమాడెను. అనగా నలమహారాజు మొదట దమయంతి ప్రత్యవయవమును జూచి తర్వాతఁ దాదృశదర్శనమునకు ఫలమైన యానందము ననుభవించి పిమ్మట నానందాతిశయమువలన నానందబాష్పము కలవాఁడాయెననిభావము. అలం— పర్యాయోక్తి.

తా. నలుని చూపులు దమయంతియవయవములనుజూచి తరువాత నందువలనఁ గలిగిన యానందసముద్రమునఁ దొప్పదోఁగి పిదప నానందబాష్పధారయందుఁ దానములాడెను.

తే. మానవతిమూర్తి యాపాదమస్తకముగఁ
దివుట వీక్షించి నిషధపృథ్వీకళత్రుఁ
డపుడు బ్రహ్మాద్వయప్రమోదాతిశాయి
మన్మథాద్వైతసుఖవార్ధి మగ్నుఁడయ్యె. 147

టీ. నిషధపృథ్వీకళత్రుఁడు = నిషధదేశాధీశ్వరుఁడగు నలుఁడు, మానవతిమూర్తిన్ = దమయంతియొక్క యాకారమును, ఆపాదమస్తకముగన్ = పాదము మొదలు శిఖపర్యంతము, తివుటన్ = అక్కఱతో, వీక్షించి= చూచి, అపుడు = ఆసమయమందు, బ్రహ్మా...మగ్నుఁడు-బ్రహ్మాద్వయ = అద్వితీయమైన లేక నిరుపమానమైన-బ్రహ్మసంబంధమయిన, ప్రమోద=ఆనందమును, అనఁగా బ్రహ్మానందమనుట, అతిశాయి=అతిక్రమించిన, మన్మథాద్వైతసుఖ = అద్వితీయమైన మన్మథసుఖమనెడు, వార్ధి=సముద్రమందు, మగ్నుఁడు= మునిఁగినవాఁడు,అయ్యెన్ =ఆయెను. ఇటఁ గవీశ్వరుండు బ్రహ్మానందసుఖముకంటె మన్మథసుఖమే యధికమని వక్కాణించెను. అలం—పర్యాయోక్తి.

తా. నలుఁడు దమయంతి యాకారమును బాదాదిశిఖపర్యంతము వేడుకతోఁజూచి యప్పుడు బ్రహ్మానందమును మించెడు మన్మథానందమును పొందెను.

చ. సుదతిముఖేందుమండలముసొంపున రాగరసాంబురాశి య
భ్యుదయముఁ బొందియెంతయునుబ్బున వేలనతిక్రమించుదుర్
మదిఁగడు భీతిబొందినక్రమంబున భూవరుదృష్టి సేరె న
మ్మదగజరాజయానకుచమండలతుంగమహీధ్రశృంగమున్.

టీ. సుదతి...సొంపునన్ - సుదతి = మంచిదంతములు గల్గినదమయంతియొక్క, ముఖేందుమండలము = చంద్రమండలమువంటి ముఖముయొక్క, సొంపునన్ = కాంతిచేత, రాగరసాంబురాశి = దమయంతియందు జనించిన

యనురాగరసమనెడు సముద్రము, అభ్యుదయముఀ=అభివృద్ధిని,ఎంతయుఀ= మిక్కిలి, పొంది, ఉబ్బునఀ = అతిశయముచే, వేలఀ=తీరమును లేక గట్టును; అతిక్రమించుడుఀ = ఉల్లంఘించినతోడనే, భూవరదృష్టి = నలుని చూపు, మదిఀ = మనమునందు; కడుఀ = మిక్కిలి, భీతి=అనురాగ సముద్రమందు మునుఁగుదు నేమో యనుభయమును, పొందినక్రమమునఀ=పొందిన దేమోయనునట్లు ; అమ్మద . . . శృంగముఀ-అమ్మదగజరాజయాన = మదకరీంద్రమువంటినడకగల యాదమయంతియొక్క, కుచమండల = స్తనమండలమనెడు; తుంగ = పొడుగయిన, మహీధ్ర=పర్వతముయొక్క; శృంగము= శిఖరము; చేరెఀ = చేరెను. అనఁగా;చంద్రోదయకాలమున సముద్రము మిగులవృద్ధిఁజెంది, గట్టునతిక్రమించి వచ్చుచుండుటచూచి మనుష్యుఁడు మిక్కిలియున్నతమగుస్థలమును నాశ్రయించినట్టు లనురాగసముద్ర మభివృద్ధిచెంది గట్టు నతిక్రమించి వచ్చుచుండుటనుజూచి,నలునిచూపులు దమయంతి స్తనములనెడు యున్నతపర్వతము నాశ్రయించెనని భావము. మఱియు నలనిదృష్టి దమయంతి కుచములపైఁ బడెనని ఫలితార్థము. అలం—సమాసోక్తి. ఉత్ప్రేక్ష.

తా. దమయంతిముఖచంద్రబింబముయొక్క కాంతిచే, దమయంతియందుద్భవిల్లిన, నలుని యనురాగసముద్రము మిక్కిలి యభివృద్ధిఁజెంది యతిశయముచేఁ గట్ల నతిక్రమించెను. అదిచూచి నలునిదృష్టియాయనురాగసముద్రము తన్ను ముంచునన్నభయముచేతంబోలె నత్యున్నతములగు దమయంతి స్తనపర్వతశిఖరములను జేరెను.

చ. మగువముఖేందునందమృతమధ్యమునఀ మునుఁగంగఁ బాఱియో, మగువకుచద్వయంబునదుమం బడి రాయిడి దందసిల్లియో, మగువగభీరనాభిబిలమార్గము దూఱి పరిభ్రమించియో, సొగపున రాజనందనుని చూపులు నిల్చుఁ దదంతరంబులన్.　　149

టీ. రాజనందనుని చూపులు=నలరాజుదృష్టులు; మగువముఖేందునందుఀ= దమయంతిముఖచంద్రబింబమునందలి ; అమృతమధ్యమునఀ = సుధారసము

లో, మునుఁగంగన్, పాఱి, ఓ=మునిఁగిపోవుటంబట్టియో, మగువ, కుచద్వయం బునడుమన్ = దమయంతి స్తనద్వయముయొక్క నడుమను,పడి, రాయిడిన్ =రాపిడిచే, దంపసిల్లియో = అడఁగిపోవుటంబట్టియో; మగువ...మార్గము– మగువ=దమయంతియొక్క, గభీర=లోఁతైన, నాభిబిలమార్గము = నాభిరంధ్రమార్గమున, దూఱి=ప్రవేశించి, పరిభ్రమించియో = భ్రాంతిచెందుటచేత నో; తదంతరంబులన్ = వానిమధ్యప్రదేశములందు, సాగపునన్ = పారవశ్యముచే, నిల్చున్=నిల్చిపోవుచుండును. ఇటఁ గవీశ్వరుఁడు దమయంతియవయవములను జూచి నలునిదృష్టులు తనివిచెందక మగిడిరాలేకయుండఁగా నవి దమయంతిముఖేందుసుధారసమందు మునిఁగిపోవుటచేతనో దమయంతి కుచద్వయమధ్యమునఁ బడి రాపిడిచే నలఁతనొందుటచేతనో,దమయంతినాభిబిలమును సొచ్చి భ్రాంతిచెంది దారితెలియకపోవుటచేతనో మగిడిరాలేకపోవుచున్నవి. లేనిచో దదీయావయవములను జూచి వచ్చుట కింతవిళంబము గానేల యని యుత్ప్రేక్షించెను.

తా. నలమహారాజుచూపులు దమయంతి ముఖచంద్రునియందుఁ దొణకులాడుచున్న యమృతసముద్రమునందు మునింగిపోయిరయో లేక యామె కుచమండలములమధ్యమునఁబడి మిక్కిలి యిఱిమికొనిపోయి యలఁతనొందిరయో లేక యామెనాభిబిలమును జొచ్చి భ్రాంతిఁజెంది దారి తెలిసికొనలేకపోయిరయో పారవశ్యమున నిలిచిపోయెను.

ఉ. కాంతమెఱుంగుచన్నులకుఁ గ్రమ్మఱిక్రమ్మఱివచ్చుచుండి యం
గాంతరసన్నివేశములకై యటయేఁగియు నేఁగలేక భూ
కాంతునిదృష్టి దిగ్భ్రమముకైకొనఁబోలు బలే తదీయప
ర్యంతమునం దలందినకురంగమదంబును జిమ్మఁజీఁకటిన్.150

టీ. భూకాంతునిదృష్టి= నలమహారాజుచూపులు, కాంత మెఱుంగుచన్నులకున్ = దమయంతియొక్క కాంతిమంతములగు చన్నులకు, క్రమ్మఱి క్రమ్మఱి=మరలిమరలి, వచ్చుచుండి, అంగాంతరసన్నివేశములకై = ఇతరావయవములయొక్క ప్రదేశములకై, అట = అయాప్రదేశములకు, ఏఁగియున్ =

పోయియును, ఏఁగలేక = పోలేక, తదీయపర్యంతమునందున్ = ఆ స్తనముల యొక్క పార్శ్వములందు, అలందినకురంగమదంబు = పూసినకస్తూరియను, చిమ్మచీఁకటిన్ = గాఢాంధకారమునందు, బలే-బళిరే, దిగ్భ్రమమున్ = దిగ్భ్రాంతిని, కైకొనఁబోలున్ = పొందినదికాఁబోలు. అనఁగా-నతనిచూపులు దమయంతిసుందరవర్తుల స్తనములనువిడిచి మఱియొకయవయవమును జూడ నిష్టపడకుండెనని భావము.

తా. నలునిచూపులు దమయంతిమెఱుంగుపాలిండ్లకు మాటిమాటికి వచ్చుచు, మఱియొకయవయవమునకుఁ బోఁదలంచియు వానివిడిచిపోలేక స్తనపర్యంతములందుఁ బూసినకస్తూరి యను గాఢాంధకారమునందు దిగ్భ్రాంతి చెందినది కాఁబోలు. లేనిచో నాస్థలమునుండి మఱియొకస్థలమున కేల పోరాదు.

క. రమణీనితంబచక్ర
భ్రమణంబునఁ జిఱ్ఱదిరిగి ౯ వడఁ బాఱియె భూ
రమణునిచూపు పరిష్వం
గ మొనర్చెఁ దదూరుకదళికా స్తంభములన్. 151

టీ. భూరమణునిచూపు = నలునిచూపు, రమణీనితంబ చక్రభ్రమణంబునన్ = దమయంతియొక్క నితంబమను చక్రముయొక్క తిరుగుటచేత, జిఱ్ఱతిరిగి=సుడివడఁదిరిగి, పడన్, పాఱియె=పడుటచేతనుగాఁబోలు, తదూరుకదళికా స్తంభములన్ = రంభా స్తంభసదృశములగు నాదమయంతి తొడలను, పరిష్వంగము ఒనర్చెన్ = కౌఁగిలించుకొనెను. అనఁగా నలునిచూపు లానెని తంబబింబమును జూచి యామెయూరువులఁ జూడ నందుఁ బ్రవేశించినవని భావము.

తా. దమయంతి నితంబబింబ మనుచక్రము జిఱ్ఱ దిరుగుటచేఁ దదాధేయములగు చూపులుగూడఁ దిరిగిపోయి యావేగమును సహింపలేక యచటనుండి క్రిందికి జాఱి తదూరుకాండములను గౌఁగిలించుకొనెను.

ఉ. నేత్రము నేను జీరయును ౯ నేత్రమ చీరకునాశ్రయింపఁగాఁ
బాత్రతగల్గె నాకు నిట ౯ పాత్రత లేదని నామసామ్యవై

చిత్రికతంబునఁ బలిమిఁ జేకొనినట్టులు రాజుదృష్టి యా
క్షత్రియకన్యచారుకటిచక్రమునూరుయుగంబుదూఁకొనెన్.

టీ. నేనుఁ, నేత్రమఁ = నేత్రశబ్దవాచ్యమను, చీరయుఁ = వస్త్రము కూడ, నేత్రమ= నేత్రశబ్దముచే చెప్పఁబడినది; (మఱియు నాచ్ఛాదనమనియు నర్థము.) చీరకుఁ =వస్త్రమునకు, ఆశ్రయింపఁగాఁ =నితంబమును,నూరుయుగ్మ మును నాశ్రయించుటకు,పాత్రతగల్గెఁ =అర్హతగల్గెను, నాకుఁ =రాజదృష్టికి నుటు, ఇట=నితంబోరుయుగ్మమునందు, పాత్రత=ఆశ్రయింపయోగ్యత,లేదని, నామసామ్యమైచిత్రికతంబునఁ = నామసామ్యముయొక్క విచిత్రతవలన, అనఁగా నేత్రశబ్దమునకుఁ గన్నని యు,వస్త్రమనియు,నర్థముగలదు కావున రెం డును, నేత్రశబ్దవాచ్యత్వరూప సామ్యముగలవగుటచే ననిభావము. రాజుదృ ష్టి=నలరాజు చూపు, బలిమిఁ =బలాత్కారముచే, చేకొనినట్టులు=దమయం తినితంబోరుయుగ్మము నాశ్రయణముగైకొన్నదానివలెనే, ఆక్షత్రియకన్య=ఆ దమయంతియొక్క,కటిచక్రముఁ =నితంబమండలమును, ఊరుయుగంబుఁ = తొడలజంటను, దూఁకొనెఁ =అంటుకొనిపోయెను. అనఁగా వస్త్ర మేవిధముగ నేత్రమో (ఆచ్ఛాదనమో) నేను నట్లే నేత్రమనైయుండఁగా దమయంతినితం బోరువుల నాశ్రయింపఁ జీరకేకాని నాకేలపాత్రతలేదో చూచెద ననునట్టులు బలాత్కారముచే నామెనితంబోరుయుగ్మమునం దాసక్తమాయెనని భావము. మఱియు నలునిచూపులు దమయంతియూరువులను నితంబమును జూచుచున్నవని ఫలితార్థము.

తా. వస్త్రమునకు నేత్రమను నామముగలదు. నాకు నట్టినామముగలదు. అట్లుండఁ జీరకు నాశ్రయణము గల్గియుండుటయు నాకులేకుండుటయు యుక్త ముగాదు, నామసామ్యమువలన నాకు నట్టియాశ్రయణ ముండవలయును, ననిపలుకుచు, రాజుదృష్టిబలాత్కారముచే తదాశ్రయణమును చేకొనునట్టులు దమయంతి నితంబమందును నూరుయుగ్మమందును నాసక్తమయ్యెను.

వ. ఇత్తెఱంగున సఖీపరివారపరివృత యగుననక్కాంతం గనుంగొ
ని యంతరతంబున,

టీ. ఇత్తెఱంగునన్ = ఈరీతిగా, సఖీపరివారవృత = చెలికత్తెలచేతను పరివారముచేతను బలిసియున్నది; అగునకాన్ కాంతన్ =ఐనదమయంతిని, కనుంగొని=చూచి, అంతర్గతంబునన్ = మనంబున.

క. వితతాప్రతిమాకారా
ద్భుతరూపవిలాసవిభవభూషిత యగునీ
రతిబోటి తేటపఱుచుం
జతురాననహస్తశిల్పచాతుర్యంబున్. 154

టీ. వితతా...భూషిత - వితత=ప్రసిద్ధమైన,అప్రతిమ=సాటిలేని, ఆకార= ఆకారముయొక్కయు, అద్భుత = ఆశ్చర్యకరమైన, రూపవిలాస=సౌందర్యవిలాసముయొక్క, విభవ = సంపదచే, భూషిత=అలంకరింపఁబడినది, అగునీరతిబోటి = ఐనయీదమయంతి, చతురాననహస్త చాతుర్యంబున్ -చతురానన=బ్రహ్మయొక్క, హస్త=చేతియొక్క; శిల్పచాతుర్యంబున్ =సృష్టివిశేషమందలి నేర్పరితనమును, తేటపఱుచున్ = ప్రకటనచేయును.

తా. ప్రసిద్ధమై నిరుపమానమైన, యవయవ సౌష్ఠవముయొక్కయు, నాశ్చర్యకరమైన సౌందర్యవిలాసముయొక్కయు సంపదచే, నలంకృతయైన యీ సుందరి బ్రహ్మయొక్కసృష్టిచాతుర్యమును, వెల్లడిచేయుచున్నది.

తే. యౌవనాంభోధరోద్భూత హావభావ
వారిధారాభిపూర్ణ శృంగారసరసి
యబ్జభవసృష్టివిద్యారహస్యభూమి
నిఖిలలావణ్యసీమ యీనీరజాక్షి. 155

టీ. ఈనీరజాక్షి=ఈదమయంతి; యౌవన...సరసి-యౌవన=లేఁబ్రాయమనెడు, అంభోధర = మేఘముపలన, ఉద్భూత = పుట్టిన, హావభావ = హావము భావమున నెడు శృంగారవిలాసములనెడు,వారిధారా=నీటిధారలచే,అభిపూర్ణ=నిండిన, శృంగారసరసి=శృంగారప్రవాహము, అబ్జభవసృష్టివిద్యారహస్యభూమి — అబ్జభవ = బ్రహ్మయొక్క, సృష్టివిద్యారహస్య = సృష్టిచాతుర్య

రహస్యములకు, భూమి=నిలయమైనది, ఈసరజాక్షీ= ఈ స్త్రీ), నిఖిలలావణ్య సీమ=సమస్తలావణ్యములకు నిధియైనది, అనఁగా నీదమయంతి మేఘమువలనఁ గలిగిన నీటిధారలచేఁ బరిపూర్ణముగా నిండిననదివలెనే,యౌవనమువలనఁ గలిగిన హావభావాదిశృంగారవిలాసముచే నిండిన సౌందర్యముకలదనియు ; బ్రహ్మ సృష్టి రహస్యములకెల్ల నిధియైనదనియు భావము.

తాత్పర్యము:—స్పష్టము.

తే. సాటి జంబేటిజంబాలజాలమునకుఁ
బాటి నూత్నహారిద్రావిభంగమునకుఁ
దరము సౌదామినీదామధామమునకుఁ
కరముఁ బొలుపొందుదీనియంగములకాంతి. 156

టీ. కరము=మిక్కిలి, పొలుపొందు=ప్రకాశించు, దీనియంగములకాంతి= ఈస్త్రీయొక్క యవయవములకాంతి, జంబేటిజంబాలజాలమునకున్ = బంగారపురాశికి, సాటి=సమానము, నూత్నహారిద్రావిభంగమునకున్—నూత్న= క్రొత్తదైన; హారిద్రా =పసుపుయొక్క, విభంగమునకున్ =తునుకకు, పాటి= సమానము; సౌదామినీదామధామమునకున్ = మెఱపుమాలలయొక్క కాంతికి, తరము=సమానము;

తా. మిక్కిలి ప్రకాశించు నీదమయంతిదేహకాంతి బంగారమునకును, పసుపునకును, మెఱపుగుంపులకాంతికిని సమమగును.

ఉ. చంచలనేత్ర మేనినునుఁజాయకు సాటి యొనర్పఁగాఁదగుం
గాంచనకేతకీకుసుమగర్భదళంబులు ధూళి బ్రుంగవే
సంచితభీతి నీసరసిజాక్షితనుద్యుతి కోడి గాదె సే
వించెను వారిదుర్గ మరవిందవరాటకచక్రవాళముల్. 157

టీ. కాంచన...దళంబులు—కాంచన=బంగారపు, కేతకీకుసుమ= మొగలిపూవులయొక్క, గర్భదళంబులు = లోపలిరేకులు, ధూళిన్ =పుష్పపరాగములో, బ్రుంగవేని=మునుఁగకపోయినచో, అనఁగా నాధూళిసంబంధములేనిచో

ననుట. చంచల... చాయకున్ — చంచలనేత్ర = చలించునేత్రములుగల దమయంతియొక్క, మేని=శరీరముయొక్క, నునుఁజాయకున్ = నున్ననికాంతికి, సాటి=సామ్యము, ఒనర్పఁగాఁదగున్ = చేయఁదగును. ఈసరసిజాక్షితనుద్యుతికిన్ = ఈదమయంతియొక్క తనుకాంతికి, ఓడి= లోఁబడిపోయి, అంచిత=అధికమైన, భీతిన్ కాదె=భీతిచేతనేకదా, అరవిందవరాటకచక్రవాళముల్ — అరవిందవరాటక=పద్మకర్ణికలయొక్క, చక్రవాళముల్ = సమూహములు, వారిదుర్గమున్ =జలదుర్గమును, సేవించెను=పొందెను.

తా. బంగారపుమొగలిపూవుల లోపలిదళములు తదీయపరాగసంపర్కము లేనిచో దమయంతిశరీరకాంతికి, సరిఁజేయవచ్చును. ఇంతియకాక తామరదుద్దులు దమయంతిశరీరకాంతి కోడిపోయి శత్రువులచేఁ బరాజితులైనప్పుడు దుర్గాశ్రయణముజేసెడి రాజులపగిది మిక్కిలి భయములో జలదుర్గమును బ్రవేశించినవి. లేనిచోఁ దామర లెల్లప్పుడు నీటిలోనే యుండనేల ?

తే. ఇంద్రుఁ డింతికి రక్షగా నిడఁగఁబోలు
నాభరణవజ్రమూర్తి వజ్రాయుధంబు
నాతఁ డంతటఁబోక బాణాసనంబు
నిఖిలమణిదీప్తి యనుపేర నిలుపఁబోలు. 158

టీ. ఇంద్రుఁడు=దేవేంద్రుఁడు, ఇంతికిన్ =దమయంతికి, ఆభరణవజ్రమూర్తి= అలంకారరూపముగానున్న వజ్రములే యాకారముగాఁగల, వజ్రాయుధంబు= తనవజ్రాయుధమును, రక్షగాన్, ఇడఁగఁబోలు=ఉంచెనుగాబోలును. అనఁగా దమయంతియందభిలాషగలిగి యామె కితరులనుండి యపాయము గలుగకుండుటకై, రక్షనిమిత్తముంచిన వజ్రాయుధమో యనునట్లు దమయంతి దాల్చిన వజ్రమణిపంక్తి ప్రకాశించుచున్నదనిభావము. ఆతఁడు=ఆయింద్రుఁడు, అంతటఁబోక=అంతతోనూరకుండక, నిఖిలమణిదీప్తియనుపేరన్ =సమస్తమణికాంతులనెడుపేరితో, బాణాసనంబున్ =తనచాపమునుగూడ, నిలుపఁబోలున్ =ఉంచెనుగాఁబోలును, అనఁగా దమయంతి దాల్చిన యాభరణములందు రాణించుచున్న పలువిధములగు రత్నకాంతు లింద్రధనుస్సువలె నానావర్ణమిశ్రితమై యున్నవనిభావము.

తా. ఇంద్రుఁడు దమయంతికి రక్షగాఁబెట్టిన వజ్రాయుధమో యనునట్లు దమయంతి దాల్చిన వజ్రమణులును, నాసాటితో దమయంతికి రక్షచాలదని పిమ్మట యుంచినచాపమో యనునట్టులు దమయంతి దాల్చిన సమస్తరత్నముల కాంతియుఁ బ్రకాశించెను.

తే. నెమిలిపింఛమ్ముతోడ నీరమణివేణి
చెలిమిసేయుట బగగొంట కె దెలియ నరిది
యందుఁ బువ్వులబూజించినట్టి తెఱఁగు
నర్ధచంద్రప్రహారచిహ్నములకలిమి. 159

టీ. అందుర్ = ఆనెమలిపింఛమునందు, పూవులర్ = పుష్పములచే, పూజించినట్టి తెఱఁగు = పూజించినట్టులును, అర్ధ...కలిమి - అర్ధచంద్రప్రహార = మెడఁబట్టి గెంటుటలవలన కలిగిన, చిహ్నముల = గుఱుతులయొక్క, కలిమి, ఉండుటంబట్టి యు; ఈరమణివేణి = ఈదమయంతియొక్కజడ, నెమిలిపింఛములోడ, చెలిమి చేయుటర్ = స్నేహముజేసియుండుటను, పగగొంటర్ = శత్రుత్వము వహించి యుండుటను, తెలియర్ = తెలిసికొనుట, అరిది = అశక్యము, అనఁగా నెమిలి పింఛమందున్న పుష్పములవంటి మచ్చలను, దమయంతివేణి నెమిలిపింఛ ముతో స్నేహముచేసి, పూజించిన పుష్పములున్నట్టుగాను, నందున్న యర్ధ చంద్రులవంటి మచ్చలను, నామెవేణి దానితోఁ బగగొని మెడఁబట్టి గెంటుటచే గలిగిన మచ్చలనుఁగాను, నుత్ప్రేక్షించెను. ఈచెప్పుటచే, దమయంతివేణి నెమ లిపింఛములో సమమైగాని, లేక దానిజయించిగాని యున్నదనిభావము.

తా. దమయంతివేణి, నెమిలిపింఛముతోఁ జెలిమిచేసియున్నదో, లేక పగ గొనియున్నదో, తెలిసికోలేను. ఏమనఁగా నందు మైత్రిచేఁ బూజఁజేసిన పుష్ప ములోయున్నట్లు మచ్చలుగలవు. పగచే మెడఁబట్టిగెంటినట్లు చిహ్నములును గలవు. అందుచే నేభావమును పొందినదో తెలిసికొన వలనుపడకున్నది.

తే. అలకతిమిరాభిదృశ్యఫాలార్ధచంద్ర
మెల్లత యిది కృష్ణపక్షాష్టమీత్రియామ

దీనిఁ బ్రాపున నేల సాధింప కుండు ?
విషమబాణుండు త్రిజగతీవిజయసిద్ధి.　　160

టీ. అలక...చంద్ర-అలక=ముంగురులనెడి, తిమిర=చీఁకటిచే, అభిదృశ్య=చూడఁదగిన, ఫాల=లలాటమనెడి, అర్ధచంద్ర=అర్ధచంద్రుఁడుగల, మెలఁత, ఇది=ఈదమయంతి, అనఁగా నిండుచంద్రునితోఁ బోల్పఁదగినదమయంతిమొగము ముంగురులనెడి చీఁకట్లచే సాఁబాలావృతమగుటచే నామెలలాటమర్ధచంద్రునివలె నున్నదని భావము.కృష్ణపక్షాష్టమీత్రియామ=కృష్ణపక్షాష్టమి నాఁటి రాత్రివంటిది, కృష్ణపక్షాష్ట మీచంద్రునివంటిదగు నలకావృతయగు ఫాలార్ధచంద్రుఁడుకలది కావున నిటసామ్యము యుక్తమయినది. విషమబాణుండు=మన్మథుఁడు, త్రిజగతీవిజయసిద్ధిన్=త్రిలోకజయప్రాప్తిని, దీనిప్రాపునన్=కృష్ణపక్షాష్టమివలెనున్న దమయంతిసాయమున, ఏల=ఎందులకు,సాధింపకుండును=సాధింపమానును-అనఁగా సాధించుననుట.కృష్ణపక్షాష్టమినాఁడు జైత్రయాత్రకు బయలువెడలినచోఁ దప్పక జయసిద్ధి కలుగునని పండితులందురు. ఇందులకుఁ బ్రమాణము. శ్లో॥ జయబావిజిగీషూణాం యాత్రాయామసితాష్టమీ।శ్రవణేనాపిరోహిణ్యా జయయోగోయుతాయది॥

తా. ముంగురులనెడి తిమిరముచేఁ జూడఁబడుచున్న ఫాలార్ధచంద్రుఁడుగలదమయంతి కృష్ణపక్షాష్టమివంటిది. కావున దీనిసాయముచే మన్మథుఁడు ముల్లోకములను జయింపఁగలఁడు.

తే. హరునికోపాగ్నిఁ బొగచూరి ♦ మరునిచాప
మసితకేసరపరివేష ♦ మైననాఁడు
హృదయమోహనశక్తి నీ ♦ యిందువదన
యంచితభ్రూలతారేఖ ♦ కైనయుపమ.　　161

టీ. మరునిచాపము = మన్మథధనుస్సు, హరునికోపాగ్నిన్ = ఈశ్వరునికోపాగ్నిహోత్రముచే, పొగచూరి = పొగఁబట్టి, అసితకేసరపరివేషము-అసిత=పొగచూరుటచే నల్లఁబడిన, కేసర = కింజల్కములయొక్క, పరివేష

ము=మండలముకలది, ఐననాఁడు=ఐనకాలమునందె, హృదయమోహనశక్తి—హృదయ=యువజన హృదయములను, మోహనశక్తి=మోహింపఁజేయు శక్తి గల, ఈయిందుపదన... రేఖకున్ — ఈయిందుపదన = ఈదమయంతియొక్క, అంచిత=ఒప్పుచున్న, భ్రూలతారేఖకున్=కనుబొమకు, ఐనయుపమ=తగినయుపమానము, సామాన్యముగాఁ గవులు మన్మథచాపమును స్త్రీలకనుబొమతోఁ బోల్చుచుందురు. కాన కనుబొమలు నల్లగాఁ గానవచ్చుచుండుటచే, మన్మథుని విల్లయిన పుష్పముయొక్క కేసరములు హరునినయనాగ్నిచే మన్మథుఁడు దహింపఁబడినకాలమందుఁ బొగచూరి నల్లఁబడియుండినప్పుడే యామదనచాపము దమయంతికనుబొమలకుఁ దగినయుపమానమని భావము.

తా. మరునిచాపము హరుని నయనాగ్నిచేఁ బొగచూరి నల్లనికేసరములు గలయప్పుడే జగన్మోహనాకారయగు దమయంతి కనుబొమకుఁ దగినయుపమానమగును.

తే. సాయకంబులు మూఁట ముజ్జగము గెలువఁ
 బాలుపెట్టి శేషించినబాణయుగళి
 మదనుఁ డేతద్దృగంభోజపదమునందు
 గౌరవం బొప్పఁ బట్టంబు గట్టెఁ బోలు. 162

టీ. సాయకంబులు, మూఁటన్=మూఁడు బాణములచేతను, ముజ్జగమున్=మూఁడులోకములను, పాలుపెట్టి=ఆబాణత్రయంబునకుఁ బంచియిచ్చి, శేషించినబాణయుగళిన్=మిగిలిన రెండుబాణములను, మదనుఁడు = మన్మథుఁడు, ఏతద్దృగంభోజపదమునందున్= ఈ దమయంతి నేత్రపద్మములనెడి మహాస్థానమందు, గౌరవంబు ఒప్పన్ = గౌరవము కలుగునట్లుగా, పట్టంబున్, కట్టెన్, పోలున్=పట్టాభిషేకము చేసెను గాఁబోలును? అనఁగా మన్మథునికిఁ బాణములైదు. అందులో మూఁడు మూఁడులోకములను జయింపఁగా నతఁ డామూటికి మూఁడులోకములను బంచియిచ్చి మిగిలినబాణముల రెండింటికిని నీదమయంతి నేత్రపద్మములనుపదంబులం దభిషేకముచేసెను గాఁబోలు. కావున నే

యామె నేత్రములు మన్మథబాణములవలె యువజనహృదయంబులను సంచలింపఁ జేయుచున్నవని భావము.

తా. మన్మథుఁడు తనబాణములలో మూఁడు మూఁడులోకములను జయింపఁగా వానికి వానిని బంచియిచ్చి తక్కిన రెండుబాణములను దమయంతి నేత్రపద్మము లనుపదములందుంచి పట్టాభిషేకము చేసెను గాఁబోలు.

తే. అతివ ముష్టిప్రతిగ్రహాకర్హావలగ్న
సందియము లేదు నలరాజు కే చాపయష్టి
యట్టుగాకున్నఁ గురియంగ నెట్టు నేర్చెఁ
బ్రకృతిశాతకటాక్షనారాచవృష్టి. 163

టీ. ముష్టి...లగ్న-ముష్టి = పిడికిలిచే, ప్రతిగ్రహ = గ్రహించుటకు, లేక పట్టుకొనుటకు, అర్హా=తగిన, అవలగ్న=నడుముగల, అతివ=ఈదమయంతి, నలరాజు చాపయష్టి=మన్మథునిచాపమే, సందియము, లేదు, అట్టుగాకున్నన్ = దమయంతి మన్మథునిచాపమే కానిచో, ప్రకృతి...వృష్టిన్—ప్రకృతి=స్వభావముచేత, శాత=వాఁడియయిన, కటాక్ష=కడకంటిచూపులను, నారాచ=బాణములయొక్క, వృష్టిన్=వర్షమును, కురియంగన్=వర్షించుటకు, ఎట్టు నేర్చెన్ = ఏరీతి నేర్వఁగలిగెను. ఈచెప్పుటచే దమయంతినడుము పిడికిటిలోని కిముడుచున్నదనియు, నామెశరీరము మన్మథధనువువలె నున్నదనియు, నామె చూపులు మరునారాచములవలెఁ దీక్ష్ణములయినవియుఁ దెల్లమగుచున్నది.

తా. పిడికిటిలోని కిముడుచున్న నడుముగలదమయంతి మన్మథచాప మను టకు సందియములేదు. అది సత్యముకానిచో స్వభావముచేతఁ దీవ్రములగు కడకంటిచూపులనెడి బాణవర్షము నేలగురియించును?

క. చలదింద్రనీలగోళా
మలకోమలతారతారక మండలములు ప
క్ష్మలము లుపాంత శ్వేతం
బులు చపలములు తొర! మెఱుఁగుఁగ బోఁడిననములున్. 164

టీ. పక్ష్మలములు=దట్టమగు కనురెప్పవెండ్రుకలు కలవియు, ఉపాంతశ్వేతంబులు = ప్రాంతప్రదేశములందుఁ దెల్లఁదనముకలవియు, చపలములు = మిగులఁ జంచలస్వభావములు గలవియు, మెఱుఁగుఁబోఁడినయనముల్=అయిన దమయంతినేత్రములు, చలత్...మండలములు—చలత్ = చలించుచున్న, ఇంద్రనీలగోళ=ఇంద్రనీలమణి గోళకములవలె, అమల=స్వచ్ఛములును, కోమల=మృదువయినవియు, తార=స్థూలములయిన, తారమండలములు=వర్తులమగు నల్లగ్రుడ్లుగలవియయి, ఔర=ఎంతయాశ్చర్యమును గొలుపుచున్నవి.

తా. సాంద్రములగు రెప్పవెండ్రుకలుగలిగి ప్రాంతములందుఁ జంద్రకాంతివలె శ్వేతములయి చపలములయిన దమయంతినేత్రములు, చలించుచున్న యింద్రనీల గోళకములవలెనున్న స్థూలములగు నల్లగ్రుడ్లుకలిగి యాశ్చర్యము గొలుపుచున్నవి.

మ. దళదిందీవరకాంతిఁ బంచషదళత్వక్పాటనానంతరో
జ్జ్వలరంభాతరుగర్భసంపుటలసచ్ఛాయాకలాపంబుతోఁ
గలయంగూర్చి చతుర్ముఖుం డొనరిచెం గాబోలు నాకర్ణశ
ష్కులికాపాంగములైనయాచిగురుటాకుంబోఁడినేత్రాబ్జముల్.

టీ. చతుర్ముఖుండు=బ్రహ్మ, ఆకర్ణశష్కులికాపాంగములు = కర్ణాంతములవఱకు వ్యాపించిన ప్రాంతములుగలవి, ఐనయాచిగురుటాకుంబోఁడినేత్రాబ్జముల్=అయినట్టి దమయంతియొక్క నేత్రపద్మములు, దళదిందీవరకాంతి=వికసించిన నల్లఁగలువలయొక్క కాంతిని, పంచష...కలాపంబుతోన్ - పంచష = అయిదాఱయిన, దళ=దళములయొక్క, త్వక్=చర్మములను, అనఁగాఁ బైనున్నతొక్కలననుట, పాటనా = బ్రద్దలుగొట్టుటయొక్క, అనంతర=తరువాత, ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, రంభాతరు=అనఁటిచెట్టుయొక్క, గర్భసంపుట=లోపలనున్నమట్టలయొక్క, లసత్=ప్రకాశించుచున్న, ఛాయా = కాంతియొక్క, కలాపంబుతోన్=సముదాయముతో, కలయన్, కూర్చి=చేర్చి, ఒనరించెన్, కాఁబోలున్=చేసెను గాఁబోలును.

తా. బ్రహ్మ కర్ణాంతమువఱకు వ్యాపించిన దమయంతి నేత్రములు వికసించిన నల్లఁగలువల కాంతిపుంజమును, రంభాగర్భదళముల కాంతిసముదాయమును జేర్చి సృజించెను గాఁబోలును.

చ. కలువలనుం జకోరములఁ 
 గారుమెఱుంగుల గండుమీల వె
న్నెలలను దమ్మిరేకులను 
 నిర్మలమౌక్తికరత్నశుక్తులం
దలఁచి పయోజగర్భుఁడు సు 
 ధారసధారలు రెంటిలో విసం
బులు చిలికించి చేసె కొకో 
 పొల్పెసలారఁగ దీనినేత్రముల్.

టీ. పయోజగర్భుఁడు=బ్రహ్మ,కలువలనున్, చకోరములన్=చకోరపక్షులను, కారుమెఱుంగులన్=వర్షాకాలపు మెఱపుఁదీఁగలను, గండుమీలన్= పెద్దచేఁపలను,వెన్నెలలను,తమ్మిరేకులను=పద్మదళములను,నిర్మల... శుక్తులన్=నిర్మల-స్వచ్ఛమయిన, మౌక్తికరత్నశుక్తులన్=ముత్తెపుచిప్పలను,తలఁచి=స్మరించి,రెంటిలోన్ =రెండునేత్రములలోన్,సుధారసధారలు=అమృతధారలు,విసంబులు, చిలికించి=వర్షించి, పొల్పు=అందము, ఎసలారఁగన్=ఒప్పునట్లుగా, దీనినేత్రముల్=దమయంతి నేత్రములను, చేసెనోకో=రచించెను గాఁబోలు, సుధారసముచిలుకుటచే నామె నేత్రములు మొదట మనోహరముగానుండి విసముచిల్కుటచేఁ దరువాత మిక్కిలి బాధించుచున్నవని తెలియఁదగినది. మఱియు సుధారసము తెల్లనిదనియు, విషము నల్లనిదనియుఁ బ్రసిద్ధి. కావున నీమె నేత్రములు సితాసితకాంతులచే రచింపఁబడినవనియు భావము.

తా. బ్రహ్మ కలువలు, చకోరములు, గండుమీలు మొదలగు రమ్యోపమానవస్తువులన్నిఁటిని దలఁచుకొనుచు, సుధారసవిషంబుల నందుఁ జిల్కి చేసెను గాఁబోలు. లేనిచో ముందు మనోహరముగానుండి పిమ్మట బాధింపనేల ?

తే. శ్రవణపుటకూపవినిపాత 
 సాధ్వసమున
నిగిడి యవ్వలి కటుపోక 
 నిల్చెఁగాక
యధికచపలస్వభావంబు 
 లైనయట్టి
దీనికన్నులు దలచుట్టు 
 దిరిగిరావె.     167

టీ. అధికచపలస్వభావంబులు=మిక్కిలి చంచలస్వభావములుకలవి, ఐనట్టిదానికనుల్=ఐన యీదమయంతి నేత్రములు, నిగిడి=ముందుకుజరిగి, శ్రవణ... సాధ్వసమునన్=శ్రవణపుట=కర్ణపుటములనెడు, కూప=నూతులందు, వినిపాత=పడుటమేమోయనెడి, సాధ్వసమునన్ = భయముచేత, అవ్వలికిన్ =అవతలి భాగమునకు, అటుపోక=ఆమార్గమునకు పోకుండ, నిల్చెఁగాక=నిలిచియుండెనుగాని, తలచుట్టున్ = శిరస్సునకుచుట్టు, తిరిగిరావె = తిరిగిరాకుండనుండునా? అనఁగా దమయంతి నేత్రములు కర్ణములవఱకు వ్యాపించియున్నవని భావము.

తా. మిక్కిలి చపలస్వభావముగల దమయంతి నేత్రములు తలచుట్టుఁ దిరిగి రావలయునని తలంచి, బయలువెడలి కర్ణపుటములవఱకు నిర్గమించి యాకర్ణపుటములను నూతులుగా భ్రమించి, ముందడుగిడిన నందుఁ గూలుదుమేమోయని భయముచే నిలిచిపోయెను. లేనిచోఁ, దలచుట్టును దిరిగివచ్చియుండును.

క. కేదారములో శిశిర
ప్రాదుర్భావమునఁ జొచ్చి పడసినయురుపు
ణ్యోదయముననో కో యీశా
తోదరికిం గన్నులగుచు నున్నవి దమ్ముల్. 168

టీ. తమ్ముల్=పద్మములు, కేదారములోన్=తటాకములో, శిశిరప్రాదుర్భావమునన్=శిశిరఋతుప్రారంభమునందు, చొచ్చి=ప్రవేశించి,అనఁగా దపంబు చేసి యనిభావము. పడసినయురుపుణ్యోదయమునన్, ఒకో=పొందినపుణ్యము లపెంపుచేతను గాఁబోలును, ఈశాతోదరికిన్=ఈదమయంతికి, కన్నులు, అగుచున్, ఉన్నవి. అనఁగా దమయంతి నేత్రములు పద్మసంకాశములై యున్నవని భావము.

తా. తామరపూవులు శిశిరకాల ప్రారంభదశయందుఁ దటాకములో నిలిచి ఘోరతపం బాచరించి యాతపఃఫలంబుపెంపుచేత నేకాఁబోలు దమయంతికి నేత్రము లగుచున్నవి. లేనిచో వానికట్టిస్థితి సంభవించుట కష్టము. ఉత్ప్రేక్ష.

తే. త్రిభువనన్యస్తసాయకశ్రీత యుఁ డైన
మరునిశిలపుష్పతూణ మీమగువముక్కు

మానితశ్వాసనవసౌరభానుమేయ
పుష్పమయబాణయుగళాభిపూర్ణ మగుట. 169

టీ. మానిత...పూర్ణము-మానిత = ఒప్పుచున్న, శ్వాస=నిట్టూర్పుగాడ్పుల యొక్క, నవ=క్రొత్తదగు, సౌరభ = పరిమళముచే, అనుమేయ= ఊహింపఁదగిన, పుష్పమయ=పుష్పమయములయిన, బాణయుగళ=బాణయుగళముచే, అభిపూర్ణము=నిండినది, అగుటక్=ఐనకారణముంబట్టి, ఈమగువముక్కు =ఈ దమయంతినాసిక, త్రిభువనన్యస్తసాయకత్రితయుఁడు= ముల్లోకములయందుం బఁబడిన బాణత్రయముకలవాఁడు. అనఁగా ముల్లోకములనుజయించుటకై మూఁడుబాణములను వానియెడఁబ్రయోగించియున్నవాఁడని భావము. ఐనమరుని...తూణము—ఐన, మరుని=మన్మథునియొక్క, తిలపుష్ప = నూవుఁబువ్వనెడి, తూణము=అమ్ములపొది, మన్మథుఁడు తనబాణములైదింటిలో మూఁడు లోకములను గెలుచుటకై మూఁడుబాణములు వాడుకొని తక్కిన రెండుబాణములకై నువ్వుపువ్వుతోఁగావించుకొన్న యొకపొదియె దమయంతిముక్కుగానున్నది. ఎట్లన రెండుబాణములుంచుటకు రెండురంధ్రములుగలిగియు దమయంతి పద్మినీజాతిస్త్రీ యగుటచే నందునుండి సౌరభముతోఁగూడిన గాలి వచ్చుచునుండుటంబట్టి యందుఁ దన రెండుబాణములు పెట్టియున్నాఁడని యూహింపవచ్చునని భావము. ముక్కు నువ్వుపువ్వువలె సొగసై తావితోఁగూడిన యూర్పుగాడ్పుగలిగి మోహనములగునంట.

సీ. నిబిడశైశవయౌవనసీయసంధ్యావేళ
    యాననచంద్రబింబామృతంబు
లపనామృతాంశుబాలప్రభాజాలంబు
    బంధుజీవనలతాబాంధవంబు
పరిపక్వబింబికాఫలవిడంబనముద్ర
    విద్రుమద్రుమలతావినిమయంబు
మదననారాచకోకామలహింగుళచ్ఛాయ
    యస్మన్మనోనురాగాంకురంబు

తే. మహితలావణ్యగుణజాయమానబహుళ
మాధురీచిత్రశోభాసమన్వితంబు
ప్రార్థనాకల్పపాదపప్రాజ్యఫలము
తియ్యపూఁదేనియలఁగ్రోవి యీ దీనిమోవి. 170

టీ. దీనిమోవి=ఈదమయంతి యొక్క యధరోష్ఠము, సిబిడ... వేళ—సిబిడ = సాంద్రమైన, శైశవయౌవనీయ = బాల్యయౌవనముల సంబంధమయిన, సంధ్యావేళ=సంధ్యాసమయము,అనఁగా సంధ్యాసమయము రక్తవర్ణముగానుండుటచే దమయంతి యెఱ్ఱని పెదవి శైశవయౌవనములయొక్క సంధ్యావేళవలె నున్నదని భావము. దీనిమోవి, ఆననచంద్రబింబామృతంబు=ముఖచంద్రబింబమువలనఁ గలిగిన యమృతరసము, అనఁగా నమృతమువలె మధురముగానుండునని భావము. దీనిమోవి, లపనామృతాంశుబాలప్రభాజాలంబు—లపన=ముఖమనెడి, అమృతాంశు=చంద్రబింబముయొక్క, బాల=లేఁతనయిన, ప్రభాజాలము= కాంతిసమూహము, అనఁగా నుదయకాలమందుఁ జంద్రునికాంతు లెఱ్ఱగానుండును గాన దమయంతిమోవికి సాటి కావచ్చునని భావము. దీనిమోవి, బంధుజీవలతాబాంధవంబు= మంకెనతీఁగెకుచుట్టము, దీనిమోవి, పరిపక్వ... ముద్ర—పరిపక్వ=పండిన, బింబికాఫల = దొండపండును, విడంబన = అనుకరించుచున్న, ముద్ర=స్వరూపముకలది, అనఁగా దొండపండుతో సమానమైనదని భావము. దీనిమోవి, విద్రుమద్రుమలతావినిమయంబు=పగడపుదీవెకుమార్పఁబడినది.అనఁగా సమానమైనది,మదన... ఛాయ—మదన=మన్మథునియొక్క, నారాచ=బాణములయొక్క, అనఁగా జివురుయొక్కయనుట, కోమల=మృదువయిన, హింగుళచ్ఛాయ=ఎఱ్ఱనికాంతులుగలది,అనఁగాఁ జిగురువలెనే కోమలమయి యెఱ్ఱనికాంతులుగలదై యున్నదనిభావము.అస్మన్మనోనురాగాంకురంబు=నాయొక్క మనస్సులోనుండు ననురాగపుమొలక, దీనిమోవి, మహిత... సమన్వితంబు—మహిత=ఒప్పుచున్న, లావణ్యగుణ=సౌందర్యగుణమువలన, జాయమాన=పుట్టిన, బహుళ=విస్తారమైన, మాధురీ=చక్కఁదనముయొక్క, చిత్ర=ఆశ్చర్యకరమైన, శోభ=కాంతితో, సమన్వితంబు = కూడుకొన్నది, దీనిమోవి. ప్రార్థనాకల్ప

పాదపప్రాజ్యఫలము—ప్రార్థనా=కోరుకొనుటకు, కల్పపాదప=కల్పవృక్షసంబంధమయిన, ప్రాజ్య=అతిశయమైన లేక గొప్పదయిన, ఫలము=ఫలమువంటిది, అనఁగాఁ గల్పవృక్షఫలము ప్రార్థనార్హమైనట్టు,నిదియు నట్లగుచున్నదనిభావము. దీనిమోవి,తియ్యపూఁదేనియలక్రోవి=తియ్యనిపూఁదేనియలకు నిలయమైనది.

తా. స్పష్టము.

ఉ. భాసురమధ్య రేఖ కిరుపక్కియలందును మోవి కించిదు
చ్ఛ్వాసమునొందియున్నయది చంద్రనిభాస్యకునేనొకప్డు ని
ద్రాసమయంబులం గలలరాకల నీకలకంఠిఁ గూడివ
క్త్రాసవ మానియాని దశనాంకుర మొత్తఁగ దారసోద్ధతిన్.

టీ. నేను, ఒకప్డు=ఒకసమయమందు, నిద్రాసమయంబులన్=నిద్రపోవుసమయములందు, కలలరాకలన్=స్వప్నములయందు, ఈకలకంఠిన్=ఈదమయంతిని, కూడి, వక్త్రాసవము=అధరామృతము, ఆనియాని = త్రావిత్రావి, రసోద్ధతిన్ = రసాతిశయముచే, దశనాంకురమ్ము = దంతముయొక్కకొనను, ఒత్తఁగన్=నొక్కఁగా,అనఁగా దంతక్షతముచేయఁగా, చంద్రనిభాస్యకున్=దమయంతికి,భాసురమధ్యరేఖకున్=అధరోష్ఠమధ్యమందు ప్రకాశించుచున్నరేఖకు, ఇరుపక్కియలన్=రెండువైపులను,మోవి, కించిదుచ్ఛ్వాసము=కొంచెముబ్బియుండుటను, ఒంది, ఉన్నయది.

తా. నేనొక్కొక్కసమయమున దమయంతియొక్క నిద్రాసమయములందు స్వప్నములలోఁ గనఁబడికలసి, యధరామృతమును త్రావి రసాతిశయముచే దంతక్షతము చేయుటచేతఁ గాబోలు మధ్యరేఖ కిరుప్రక్కలయందు మోవి కొంచెమున్నతమైయున్నట్లున్నది.

ఉ. ఈమెలఁదీఁగెబోఁడికృప యేర్పడఁగాఁ దన లేఁతనవ్వులో
వేయవపాలపాంగములవెంటఁబ్రసాదముచేసినన్నిశా [లం
నాయకుఁడెంతయుంబ్రియముసంగయికోఁడొకొనాల్గుదిక్కు
బ్రాయపు జందిరీకల్వడిగఁబాఱఁగవై చుచునప్పదార్థమున్.

టీ. ఈమెలఁదీఁగెబోఁణికృప=ఈదమయంతియొక్కదయ,ఏర్పడఁగాన్=స్పష్టమగునట్లుగా, తనలేఁతనవ్వులోన్=తనచిఱునవ్వులో, వేయవపాలు=సహా

ప్రాంశము, అపాంగములవెంటన్ =కడకంటిచూపులమూలమున, ప్రసాదము చేసినన్ =ఇచ్చినచో, నిశానాయకుఁడు=చంద్రుఁడు, నాల్గుదిక్కులన్ =నాల్గు దిక్కులందును, ప్రాయపుచంద్రికల్ =విస్తారమైనవెన్నెలలను, వడిగన్ =శీఘ్రముగా, పాఱఁగన్, వైచుచున్ =విసర్జించుచు, అప్పదార్థమున్ =దమయంతి మందహాసలేశమును,ఎంతయున్ =మిక్కిలి,ప్రియము. నన్ =ప్రేమతో, కయికోఁడో కో = స్వీకరింపఁడా? అనఁగా స్వీకరించుననుట, దమయంతి దరహాసములో వేయవపాలిచ్చినచో దాని నెంతయో ప్రేమతోఁ దీసికొని తనచంద్రికలు విస్తారములైనను నుత్తమమయినవి కాకపోవుటచే వానిని నాల్గుదిక్కులందును బాఱవైచును. లోకము పనికివచ్చుపదార్థమునుస్వల్పమయిననుగైకొని పనికిమాలినపదార్థము కొండంతయున్నను బాఱవైచుట కలదు. అట్లె చంద్రుఁడు శ్రేష్ఠ పదార్థమగు దమయంతిదరహాసలేశము తన కలవడినచో దానినందుకొని తనచంద్రికలు వ్యర్థపదార్థములగుటచే నాల్గుదిక్కులందును బాఱవైచును. అనఁగా నిండుపండువెన్నెలలు దమయంతిదరహాస లేశమునకయినను సాటిరావనిభావము.

తా. ఈదమయంతి చంద్రునియందు దయగలిగి తనచిఱునవ్వులో వేయవయంశమును గడకంటిచూపులచే నొసంగినచోఁ దననిండువెన్నెలలను నాల్గుదిక్కులందును బాఱవైచి యాదమయంతీదరహాసలేశమును బ్రేమతోఁ దీసికొనియుండును.

తే. దాడిమీపక్వఫలబీజతతుల గెలిచి
దంతకురువిందపంక్తి యీతరుణి కమరు
సాంధ్యశీతాంశుమండలస్యందమాన
నవసుధారసబిందుబృందంబుఁబోలె. 173

టీ. దంతకురువిందపంక్తి=కెంపుపాదులవంటి దంతములవరుస, దాడిమీ... తతులన్ —దాడిమీ=దాడిమములసంబంధమయిన, పక్వ=పండిన, ఫల=పండులందున్న, బీజ=విత్తులయొక్క, తతులను=సమూహములను, గెలిచి=జయించి, సాంధ్య...బోలెన్ —సాంధ్య=సంధ్యాకాలసంబంధియగు,శీతాంశుమండల=

చంద్రమండలమునుండి, స్యందమాన=స్రవించుచున్న, నవ = క్రొత్తదయిన, సుధారస = అమృతముయొక్క, బిందు= చుక్కలయొక్క, బృందంబుఁబోలెన్=సమూహమువలె, అనఁగాఁ గొంచెము రక్తవర్ణముగల దమయంతిదంతపంక్తి సాయంకాలరక్తిమచేఁ గొంచె మెఱ్ఱఁబాఱి యున్న చంద్రునుండి స్రవించుచున్న యమృతబిందుసందోహమువలెనున్నదనిభావము. ఈతరుణికిన్= ఈదమయంతికి, అమరున్=ఒప్పును.

తా. ఎఱ్ఱనికెంపువంటి దంతపంక్తి సాయంకాలచంద్రబింబమువలనఁ గారుచున్న యమృతబిందుసందోహమునుబోలి దమయంతికి నలరును.

తే. మాటి కుద్వేగరాగాదిమార్జనమున
నతివిశుద్ధంబు లయినదంతాంకురములు
విమలముక్తావళీసమానములు దాల్చు
నీసరోజాక్షి ముఖపద్మకేసరములు.　　174

టీ. మాటికిన్ = సారెసారెకును, ఉద్వేగరాగాదిమార్జనమునన్—ఉద్వేగ= అధికమయిన, రాగాది=రక్తిమాదులయొక్క, మార్జనమునన్ =తుడుచుటచేతను, అనఁగాఁ దాంబూలాదిరాగాదులు పోవునట్లు ధావనముచేసి కడుగుటచేత, అతివిశుద్ధంబులు=మిక్కిలి శుభ్రములు, అయిన దంతాంకురములు=అయినట్టిదంతములు, విమలముక్తావళీసమానములు—విమల= స్వచ్ఛమైన, ముక్తావళీ= ముత్తెములహారముతో, సమానములు=సమమయినవియు, ముఖపద్మకేసరములు= ముఖపద్మమునకుఁ గింజల్కములవలెనున్నవానిని, ఈసరోజాక్షి=ఈదమయంతి, తాల్చున్=ధరించును. అనఁగా నీమెదంతములు ముత్తెములవరుసను బోలియున్నవనియు, నామెముఖపద్మమునందుండు కింజల్కములవలెను బ్రకాశించుచున్నవని భావము.

తా. దమయంతిదంతములు సంతతమును బరిధావనముచేయుటచే నతిశుద్ధములయి స్వచ్ఛములయిన ముత్తెములవరుసను సమానములయి యామెముఖపద్మమందుండు కేసరములవలెఁ బ్రకాశించుచున్నవి.

తే. వరశిరీషప్రసూనకేసరశిఖాగ్ర
పేలవంబుగ మేను గల్పించి ధాత
కలితసుకుమారసర్గప్రకర్షుఁ డగుచు
నిలిపె మార్దవ మీయింతిపల్కులందు. 175

టీ. ధాత=బ్రహ్మ, వర...పేలవంబుగన్=వర=శ్రేష్ఠములయిన, శిరీషప్రసూన=దిరిసెనపువ్వులయొక్క, కేసర=కింజల్కములయొక్క, శిఖాగ్ర=కొట్టకొనలవలె, పేలవంబుగన్=మృదువుగ, మేను=శరీరమును, కల్పించి=నిర్మించి, కలిత...ప్రకర్షుఁడు—కలిత=ఒప్పుచున్న, సుకుమార=మృదువయిన, సర్గ=సృష్టి చేఁగలిగిన, ప్రకర్షుఁడు=అతిశయముకలవాఁడు, అనఁగా మృదువగుసృష్టిని జేయఁదలంచినవాఁడని భావము. అగుచున్, ఈయింతిపల్కులందున్=ఈదమయంతివచనములందు, మార్దవమును=మెత్తఁదనమును, నిలిపెన్ = స్థాపించెను. అనఁగా దమయంతిశరీరము శిరీషపుష్పకింజల్కములవలె మృదువయినది, మాటలును మిక్కిలి మృదువయినవి.

తా. బ్రహ్మ,దమయంతిశరీరము శ్రేష్ఠమయిన శిరీషపుష్పకింజల్కాగ్రములవలె మృదువయినట్టుగాఁజేసి, మృదుపదార్థములను గల్పించుటచే నుత్కర్షము వహించినవాఁడయి దీనిపల్కులనుగూడ మృదువుగానుండునట్లు చేసెను.

ఉ. పచ్చనివృక్షవాటికలపండులభిక్ష భుజించి నిచ్చలున్
వచ్చి పఠింపఁబోలుఁ బ్రతివారముఁ గోకిలబ్రహ్మచారి పెం
పచ్చుపడంగ నీసరసిజాక్షిముఖద్విజరాజునొద్దఁ దా
విచ్చల సత్ప్రసూనశరవేదరహస్యము లైనపల్కులన్.176

టీ. కోకిలబ్రహ్మచారి = కోయిలయనెడి బ్రహ్మచారి, ప్రతివారమున్ = ప్రతిదినమును, పచ్చని...భిక్షన్—పచ్చని వృక్షవాటికల = పచ్చని తరుపంక్తులయొక్క, పండులభిక్షన్=ఫలములనెడి భిక్షను, నిచ్చలున్=నిత్యమును, భుజించి=తిని, వచ్చి, పెంపు, అచ్చుపడంగన్=పెంపు స్పష్టమగునట్టుగా, అనఁగాఁ బెంపుచెందునట్లనుట, విచ్చలన్=జన్మిదములు వ్రేళ్ళకుమెలివేసి వల్లె

వేయుచు, సత్ప్రిసూనశరవేదరహస్యములు = మన్మథవేదరహస్యములు, ఐనప లుక్కులఁ = అయినట్టిమాటలను, ఈసరసిజాక్షిముఖద్విజరాజునొద్దఁ = ఈదమయంతియొక్క ముఖమనెడి చంద్రునియొద్ద, లేక, బ్రాహ్మణశ్రేష్ఠునియొద్ద, పఠింపఁ బోలుఁ = నేర్చెను గాఁబోలును. అనఁగా బ్రహ్మచారులు గృహస్థుల యింట భిక్షమెత్తుకొనుచు నొకద్విజరాజునుజేరి యద్వైతప్రతిపాదకమగు నుపనిషద్వాక్యములను జనువుకొందురు. అట్లె,కోయిలయు వృక్షములిచ్చుపండ్ల నిచ్చలుభుజించుచు నీదమయంతిముఖ మనెడిద్విజరాజు నాశ్రయించి మన్మథవేదరహస్యములగు పలుకులను బ్రతిదినమును బఠించెను గాఁబోలు. లేనిచో దమయంతికంఠధ్వనివంటికంఠధ్వని కోయిల కెట్లు సంభవించినదనిభావము. ఈచెప్పుటచే దమయంతిపలుకులు కోయిలపలుకులను మించుచున్నవని ఫలితార్థము.

తా. కోయిలయనెడి బ్రహ్మచారినిత్యమును వృక్షవాటికలం దిరుగుచు నా వృక్షములిచ్చు ఫలభిక్షనుగైకొని భుజించి ప్రతిదినమునుబోయి దమయంతిముఖ మనెడి ద్విజరాజునొద్ద మన్మథవేదరహస్యము లగుపలుకులను జన్నిదములు వ్రేళ్లను మెలివేసి వల్లెవేయుచు సంతతము నేర్చెనుగాఁబోలు.

తే. దీనికంఠంబునందు వాగ్దేవి యుండి
వీణ మొరయించుచున్నది వీను లలర
నదియ ముఖమున వాగ్భావ మాశ్రయించి
యమృతధారాప్రవాహరూపముగ నిల్చె. 177

టీ. వాగ్దేవి=సరస్వతి, దీనికంఠంబునందుఁ = ఈదమయంతికంఠమునందు, ఉండి=నివసించి, వీనులు, అలరఁ = చెవులకింపుగా, వీణ, మొరయించుచున్నది=మ్రోయించుచున్నది. అదియ=ఆవీణాధ్వనియే, ముఖమునఁ, వాగ్భావము=వాక్స్వరూపమును, ఆశ్రయించి=పొంది,అమృత...పముగఁ =అమృతధారా=సుధారసధారలయొక్క,ప్రవాహరూపముగఁ = ప్రవాహరూపముగా,నిల్చెఁ = మాటినెలకొనెను. అనఁగా దమయంతికంఠధ్వని సరస్వతీవీణాకంఠధ్వనివలె నున్నదనియుఁ, బలుకులు సుధారసప్రవాహములను బోలుచున్నవనియు భావము.

తా. దమయంతి కంఠమునందు సరస్వతినిలిచి వీణియ మ్రోయింప నది వా గ్రూపముగా వెలువడి యమృతప్రవాహములను బోలుచున్నది.

తే. అబ్జగర్భుండు సుషమాసకమాప్తియందు
నెత్తి చూడంగఁ బోలు నీకయింతివదన
మంగుళీయంత్రణక్రియాకభంగి నమరెఁ
జిబుకమున నుండునానిమ్నకసీమసంధి. 178

టీ. అబ్జగర్భుండు=పద్మమే యుత్పత్తిస్థానముగాఁగలవాఁడు, సుషమాసమాప్తియందున్=ఉత్కృష్టశోభానిర్మాణముయొక్క సమాప్తియందు, 'ఈయింతివదనము=దమయంతిముఖమును, ఎత్తి, చూడంగన్, పోలు=పరికించునిమిత్త మంగుళియంత్రముచే నెత్తిచూచెను గాఁబోలు. అనఁగా శిల్పిమొదలగువారు తామొకవస్తువును నిర్మించినప్పుడు తదీయవస్తునిర్మాణపూర్తి కాఁగానే దానియందేవేని లోపములున్నవేమో యని చూచుట కంటె యంటనట్లు పట్టుకొని పరిశీలించి చూచుటగలదు. అట్లె బ్రహ్మయు దమయంతివదనమును బూర్తి చేసి యందేవేని లోపములున్నవేమోయని చూడఁదలచి యట్లు చూచుటకు నంటియంటనట్లు వ్రేళ్లతోఁబట్టుకొని మీఁదికెత్తె ననిభావము. అట్లెత్తినప్పుడు, చిబుకమునన్ = పెదవిక్రిందిభాగమునందు, ఉండు... సంధి—ఉండు=ఉన్నట్టి, ఆనిమ్నసీమ=లోఁతుగానున్న ప్రదేశముయొక్క, సంధి=రెండింటికి మధ్యనుండుభాగము, అంగుళీ .. భంగిన్—అంగుళీ=వ్రేలియొక్క, యంత్రణక్రియాభంగిన్ =ముద్ర వేసినట్లు, అమరెన్ = ఒప్పెను. అనఁగాఁ బరీక్షార్థము బ్రహ్మ వ్రేళ్లతో వదనమును జూచుచుండఁగా నతని వ్రేలిముద్రవలె నామె చిబుకమునందుండు సెలవులు ప్రకాశించె ననిభావము.

తా. దమయంతి చిబుకమునందుండు సెలవులు బ్రహ్మ యామెవదనమును నిర్మించినపిమ్మటఁ బరీక్షార్థము వ్రేళ్లతోఁ బైకెత్తి చూచుచుండఁగాఁ బడిన యతనివ్రేలిముద్రలవలెఁ బ్రకాశించెను.

క. కమలాధిరాజ్యపదవీ
సమధిష్ఠితమీవధూటికచారుముఖాంభో

జము మఱి యటు గాదననే
నిమిత్తమున సేవఁ జేయుఁ నేత్రాంబుజముల్. 179

టీ. ఈవధూటిచారుముఖాంభోజము = ఈదమయంతిసుందరవదనపద్మము, కమలాధిరాజ్యపదవీసమధిష్ఠితము—కమల=పద్మములయొక్క, అధిరాజ్య=సామ్రాజ్యముయొక్క, పదవీ=స్థానమునందు, సమధిష్ఠితము = పట్టాభిషిక్తమయినది. అనఁగా సకలకమలములకు రాజాధిరాజయిన దనిభావము. మఱి, అటు, కాదనన్=అట్లుకానిచో, నేత్రాంబుజంబులు = నేత్రపద్మములు, ఏనిమిత్తమునన్=ఏకారణముచేత, సేవచేయున్ = సేవించుచున్నవి. అనఁగా దమయంతి మోము వానికన్నింటికి రాజరాజు కావుననే నేత్రపద్మములు సేవించుచున్నవి. లేకపోయిన నేల సేవింపవలెను?

తా. ఈదమయంతి మొగము సకలకమలములకును రాజరాజని చెప్పవచ్చును. కావుననే నేత్రపద్మములు సంతతమును సేవించుచున్నవి.

చ. కమలము తండ్రి యైనయుదకంబు గళానిధి మిత్ర మైనయ
ద్దమును నహర్నిశంబు నుపధారణ సేసి వహించెనోసుమీ
క్రమమున నీవధూమణిముఖ ప్రతిబింబవిలాససంపదన్
సముచితలీల యాచితకచారువిభూషణరాజి కై వడిన్. 180

టీ. కమలము=పద్మము, తండ్రి, ఐనయుదకంబును = అయినట్టి జలమును, అనఁగాఁ బద్మములు నీటియందుఁ బుట్టునుగాన వాని కవి జనకములని తెలియఁ దగినది. కళానిధి=చంద్రుఁడు, మిత్రము, ఐనయద్దమును=అయినట్టియద్దమును, ఇటఁ జంద్రునకును నద్దమునకును మైత్రియుండినట్లు కవులు వర్ణించుట ప్రసిద్ధిలేకపోయినను నద్దమాకారమునఁ జంద్రునితో నించుమించుగా సాటియగుటచేతను,లోకములో సమానవస్తువులకు మైత్రియుండుటచేతను, గవి వానికి మైత్రియున్నట్లు చేకొనియె. అహర్నిశంబును=దివారాత్రములు, ఉపధారణ, చేసి=ఆశ్రయించి,క్రమమునన్=క్రమముగా, ఈవధూ... సంపదన్ = ఈవధూమణి= ఈవ

మయంతియొక్క, ముఖ=ముఖముయొక్క, ప్రతిబింబ=ప్రతిఫలనముయొక్క, విలాస=లీలలయొక్క, సంపదన్ =సమృద్ధిని, సముచితలీలన్ =తగినరీతిచే, యాచితక...కైవడిన్ —యాచితక=ప్రార్థనవలన లభ్యమయిన, చారు = సుందరమయిన, విభూషణ = అలంకారములయొక్క, రాజికైవడిన్ = పంక్తినివలెను, వహించెను, ఓ, సుమీ=తాల్చెనుగాఁబోలును. అనఁగా దమయంతి మొగము పద్మచంద్రు లభ్యసింపఁదగిన, విలాసములు కలదని చెప్పుటచే నది పద్మచంద్రులకంటెను సుందరతరమయినదని స్పష్టమగుచున్నది.

తా. కమలము దివారాత్రములు తనతండ్రియగునీటి నాశ్రయించియుఁ, జంద్రుఁడు తనకు మిత్రమగు నద్దము నాశ్రయించియుఁ, గ్రమముగా జలదర్పణములందుఁ బ్రతిఫలించిన దమయంతిముఖప్రతిబింబసంబంధియగు విలాససంపదను నెరువుదెచ్చుకొన్న యలంకారపంక్తినివలెనే తాల్చెనుగాఁబోలును.

సీ. రాహుదంష్ట్రాంకురక్రకచఘాతంబుల
 నొక్కొకమరి నొప్పి నొందకున్నఁ
బరివేషమిష మైనపాశబంధంబున
 బహువారములు గట్టువడక యున్నఁ
బ్రతిమాసమును గుహూరాత్రివేళలయందు
 నత్యంతనాశంబు నందకున్నఁ
బలవత్కళంకకజ్జలపంకసంకర
 స్ఫూర్తిమాలిన్యంబుఁ బొరయకున్నఁ
తే. గాక సరిపోలఁజాలునే కమలవైరి
యనధిగతదోష మైనయీ యతివ మొగము
మధురబింబాధరోష్ఠంబు మాఱుగాఁగ
నమృతపూరంబు గలిగినయంతమాత్ర. 181

టీ. రాహు...ఘాతంబులన్ —రాహు=రాహుగ్రహముయొక్క, దంష్ట్రాంకుర=క్రకచ=ఱంపమువంటి కోఱపండ్లయొక్క, ఘాతంబులన్ = దెబ్బలచే, ఒ

క్కొక్కమఱిన్=ఒక్కొకపర్యాయము, నొప్పి=బాధను, ఒందక,ఉన్నన్= పొందకపోయినచో, అనఁగాఁ జంద్రుఁ డొక్కొక్కప్పుడు రాహువుచే గ్రసింపఁబడి తనచక్కఁదనమునంతను బోఁగొట్టుకొనుచుండును, అట్లు చంద్రుఁడు రాహువుచేఁ గ్రసింపఁబడకయున్నచో ననిభావము. పరివేషమిషము=వలయాకారరేఖనెపము, ఐనపాశబంధంబునన్ = అయినట్టిపాశబంధముచే, బహువారములు=అనేకపర్యాయములు, కట్టుపడక, ఉన్నన్=బంధింపఁబడకయుండినచో, అనఁగాఁ జంద్రుఁ డప్పుడప్పుడు పరివేషయుక్తుఁడగుట సహజము. అట్టిదానిని గవి యిట్లు చెప్పుచున్నాఁడు. చంద్రుఁడు వలయాకారరేఖ యను పాశముచే బంధింపఁబడి దోషసంయుక్తుఁ డగుచున్నాఁడు. కాని యట్టిదోషమును బొందనిచో ననిభావము. ప్రతిమాసమును=ప్రతినెలయందును,కుహూరాత్రివేళలయందున్=అమావాస్యరాత్రులయందు,అత్యంతనాశంబున్=మిక్కిలి నాశమును, అందక,ఉన్నన్=పొందకుండినచో,అనఁగాఁ జంద్రుఁడు ప్రతినెలయందును నమావాస్యరాత్రులందుఁ దనకాంతిని బూర్తిగ నాశనముచేసికొనుచుండును, అట్లు తనకాంతిని నాశనము కావించుకొననిచో ననిభావము. బలవత్...మాలిన్యంబు_బలవత్ = అధికమయిన, కళంక కజ్జలపంక = కాటుకబురదవంటి మచ్చచే, సంకర=మిశ్రితమగుటవలన, స్ఫూర్తి=స్పష్టమగుచున్న, మాలిన్యంబున్=దోషమును, పొరయక, ఉన్నన్=పొందకపోయినచో, అనఁగాఁ జంద్రునకుఁ గాటుకబురదవంటి మచ్చయుండుటచే నతఁడు దోషములకుప్పయని యందఱికి స్పష్టమగుచున్నది. అట్టిదోషములేనిచో ననిభావము. కాక=వెనుకఁజెప్పఁబడిన దోషములు లేకపోయినంగాని,కమలవైరి=పద్మములకు శత్రువు,అనఁగాఁ జంద్రుఁడనుట,అనధిగతదోషము=పొందఁబడని దోషములుకలది, అనఁగా నిర్దోషమైనదనుట. ఐనయీయాయతివమొగము=అయినట్టి దమయంతివదనమును, మధురబింబాధరోష్ఠంబు=తియ్యని దొండపండువంటి యధరోష్ఠమునకు, మాఱుగాఁగ=బదులుగా, అమృతపూరంబు=సుధారసము, కలిగినయంతమాత్ర=కలిగినంతమాత్రముచే, సరి=సామ్యము, పోలఁజాలునే = పొందఁగలుగునా? పొందలేఁడనుట. అనఁగా దమయంతివదనకమలము చంద్రునిఁ దిరస్కరించుచు నిస్సమమైయున్నదని భావము.

తా. చంద్రుఁ డొకొక్కప్పుడు అంపమునుబోలుచున్న రాహువుదంష్ట్రి లనడుమఁజిక్కి తన పెంపు గోల్పోవుచున్నాడు. ఒకొక్కప్పుడు పరివేషమనెడిపాశబంధముచేఁగట్టఁబడి తనయతిశయమును బోఁగొట్టుకొనుచున్నాఁడు. ప్రతినెలయందును నమావాస్యరాత్రులందుఁ దనకాంతిని సర్వమును విడుచుచున్నాఁడు. మఱియుఁ గాటుకబురదవంటి మచ్చగలవాఁడయి జనులచే దోషములకుప్ప యని వాడుకొనఁబడుచున్నాఁడు. చంద్రుఁ డిట్లన్నివిధములచేతను నయోగ్యుఁడయియుండఁగా నతఁడు దమయంతియధరోష్ఠమునకు మాఱుగా నమృతము గలిగినంతమాత్రమున దమయంతివదనమునకు సరి గాఁజాలఁడు.

సీ. సకలశాస్త్రౌఘనిష్యందధారాసార
నవసుధారసవాగ్ప్రణాళులొక్కొ
రతిపంచబాణదైవతయుగ్మపూజనా
వసరనైవేద్యపూపంబులొక్కొ
ధన్యరేఖాంచితైతద్భ్రూలతావేణు
శాఖాశిఖాత్వగంశంబులొక్కొ
బలభేదిముఖచతుర్బ్రహ్మర్షిరుద్భోన్మనగ్ని
ప్రతిబంధవాగురాపాశమొక్కొ
తే. యధికదీర్ఘకటాక్షబాణాగ్రకషణ
శాణచక్రప్రసాదానుసారసరళ
భర్మతాటంకనేపథ్యభాసురములు
దీనివీనులు శ్రీకారమానదములు. 182

టీ. అధిక . భాసురములు-అధిక=మిక్కిలి, దీర్ఘ=నిడుపైన, కటాక్ష=కడకంటిచూపులనెడి, బాణాగ్ర=బాణములకొనలను, కషణ = సానపెట్టుటకుఁదగిన, శాణచక్ర=సానపట్టుటకుఁదగిన చక్రములయొక్క, ప్రసాద=నైర్మల్యమును, అనుసార=అనుసరించుచున్నవియు, సరళ=సుందరములయినవియును, భర్మతాటంక=బంగారపు చెవులపోగులనెడి, నేపథ్య= అలంకారములచేత,

భాసురములు=ప్రకాశించుచున్నవియును, శ్రీకారమానదములు=శ్రీయను నక్షరముయొక్క గర్వమును దొలఁగించునవియునగు, దీనివీనులు=ఈదమయంతిచెవులు, సకల...ఒక్కొ-సకలశాస్త్రౌఘ=సమస్తమయిన శాస్త్రిముల సమూహములనుండి, నిష్యంద=కాఱుచున్న, ధారాసార = ధారాసంపాతమువలెనున్న, నవ=నూతనమయిన, సుధారస=అమృతమనెడి, వాః=నీటియొక్క, ప్రణాళులొక్కొ=నిర్గమనద్వారములలె నున్నవి. అనఁగా సకలశాస్త్రిముల నుండి స్రవించుచున్న యమృతరసమునకుఁ గాలువలవలె నొప్పుచున్నవని భావము. రతి...ఒక్కొ-రతిపంచబాణ=రతి మన్మథులనెడి, దైవతయుగ్మ=దేవతాద్వంద్వముయొక్క, పూజన=పూజయందు, అవసరనైవేద్య=ఆసమయమున కనుగుణమగు నైవేద్యమైన,పూపంబులొక్కొ=అప్పములోయనునట్లును నున్నవి. అనఁగా దమయంతిచెవులు రతిమన్మథులకునొనరించు పూజలందు నవసరనైవేద్యముగానుంచిన యప్పములోయనున ట్లొప్పుచున్నవి. ధన్య...ఒక్కొ-ధన్య=శ్రేష్ఠమైన, రేఖా=రేఖలచే అంచిత=ఒప్పుచున్న, ఏతత్=ఈ, భ్రూలతావేణు=కనుబొమలనెడి వెదురుయొక్క, శాఖా=కొమ్మలయొక్క, శిఖా=కొనలందున్న, త్వగంశంబులొక్కొ = చర్మములోయనునట్టు లొప్పుచున్నవి. అనఁగా నీమెచెవులు కనుబొమలనెడి వెదుళ్లయొక్క శాఖాగ్రములందుండు చర్మములవలె నొప్పుచున్నవని భావము. బలభేది...పాశమొక్కొ—బలభేది=ఇంద్రుఁడు, ముఖ=మొదలుగాఁగల, చతుర్బర్హిర్ముఖ = నలుగురుదిక్పాలుర యొక్క,ఉన్మనః=మనస్సులను,ప్రతిబంధ=బంధించెడి, వాగురాపాశమొక్కొ=వల యోయనునట్లుగా నొప్పుచున్నది- అనఁగా దమయంతిచెవులు దిక్పాలుర నల్వురను మోహములో ముంచినవని తాత్పర్యము.

తే. పదియునెనిమిదివిద్య లీకపద్మనయన
శ్రవణములరెంట నర్ధమర్ధము గ్రహించె
నంతరుత్కీర్ణగంభీరకహార లేఖ
యదికదా వీనులందుఁ దోకమ్మిదవలెక్క. 183

టీ. ఈపద్మనయన=పద్మములవంటి నేత్రములుగల యీదమయంతి, పదియు నెనిమిదివిద్యలు, శ్రవణములరెంటన్ =రెండుచెవులచేతను, అర్ధమర్ధము = సగముసగము, గ్రహించెన్ =స్వీకరించెను. అంతర్ ... లేఖ=అంతః-లోపలనుండి, ఉత్కీర్ణ=వ్యాపించియున్నదియు, గంభీరహారలేఖ=లోఁతైనదియు, మనోహరమ యినదియునగు గీత,అదికదా=ఆగీతయేకాదా? వీనులందున్ =చెవులందు, తొమ్మిదపలెక్క=నవసంఖ్యనుదెల్పు యంకెయయియున్నది-అనఁగా దమయంతిచెవులు తొమ్మిదంకెవలెనున్నవని భావము.

తా. ఈదమయంతి పదునెనిమిదివిద్యలను రెండుచెవులచేతను, తొమ్మిదితొమ్మిదిచొప్పున స్వీకరించెను. అట్లామెగ్రహించిన విద్యాసంఖ్యను దెలియఁజేయుటకు లిఖించిన తొమ్మిదంకెలవలె నామెచెవులు రాణించుచున్నవి.

తే. అపటుశోభితమాణవకాభిరామ
యంచితోర్ధ్వక, యాలింగ్యకతాతిహృద్య
యద్భుతైకనిదాన, శోభాస్పదంబు,
కంబుబిబ్బోకవతి దీనికంఠలక్ష్మి. 184

టీ. దీనికంఠలక్ష్మి=ఈదమయంతికంఠశోభ, అపటుశోభిత = బ్రహ్మచారిచే శోభితము కాకపోయినను, మాణవకాభిరామ=బ్రహ్మచారిచే మనోహరమయినది. ఇట, "పటు" "మాణవక" శబ్దములు బ్రహ్మచారిపర్యాయములు కావున బ్రహ్మచారితో శోభింపనిది బ్రహ్మచారితో శోభించుటయెట్లని విరోధము. ఇందులకుఁ బరిహారము. అపటుశోభిత-అపటుకంఠమునకు వెనుకనున్న ముచ్చిలిగుంటచే, శోభిత=ప్రకాశించుచున్నది. మాణవకాభిరామ=మాణవక=ఇఱువదిపేటల ముత్యాలహారముచే, అభిరామ=మనోహరమైనది, అనఁగా దమయంతికంఠము ముచ్చిలిగుంటచేతను, ముత్యములహారముచేతను, ప్రకాశించుచున్నదని భావము. మఱియు, దీనికంఠలక్ష్మి=ఈదమయంతికంఠశోభ, అంచితోర్ధ్వక-అంచిత=ఒప్పుచున్న, ఊర్ధ్వక = ఊర్ధ్వకమనువాద్యవిశేషము కలదయినను, ఆలింగ్యతాతిహృద్య=ఆలింగ్యమనెడి వాద్యవిశేషముయొక్క ధరముచే మనో

హారమయినది. ఇట=ఊర్ధ్వకమను వాద్యవిశేషముకలిగి యాలింగ్యమనెడి వాద్యవిశేషముయొక్క ధర్మముకలుగుట యెట్లని విరోధము. శ్లో "మృదంగా మురజాభేదా స్త్వంక్యాలింగ్యోర్ధ్వకా స్త్రియః" అను నమరసింహునివాక్యము స్మరణీయము. ఇందులకు, అంచితోర్ధ్వక=ఒప్పుచున్న మీఁదిభాగములుగలదియు, ఆలింగ్యతాతిహృద్య=కౌఁగిలింతకుఁ దగియుండుటచే మనోహరమైనది. అనఁగా దమయంతికంఠ మొప్పుచున్నయూర్ధ్వభాగముగలిగి యాలింగనయోగ్యమయి యున్నదని భావము. అద్భుతైకనిదాన=ఆశ్చర్యములకు ముఖ్యస్థానము. శోభాస్పదంబు=కాంతికిఁజోటైనది, కంబుబిబ్బోకవతి=శంఖముయొక్క విలాసముల వంటి విలాసములుకలది.

తా. ఈదమయంతికంఠము ముచ్చిలిగంటచేతను ముత్యాలహారములచేతను బ్రకాశించుచు, నొప్పుచున్న యూర్ధ్వభాగముగలిగి యాలింగనయోగ్యమయి యుంటచే మిగుల మనోహరమయి యాశ్చర్యమునకు స్థానమయి మిక్కిలి శోభకలదై శంఖముయొక్క విలాసములవంటి విలాసములుకలదై యొప్పుచున్నది.

క. కవితాగానప్రియవా
గ్వివరణ సీమావిభాగ విధి రేఖలు నా
ధవళాక్షికంఠసీమం
బ్రవిమల రేఖాత్రయంబుఁ బ్రస్ఫుటమయ్యెన్. 185

టీ. ధవళాక్షికంఠసీమన్—ధవళాక్షి = తెల్లనికన్నులుగల దమయంతియొక్క, కంఠసీమన్=కంఠప్రదేశమందు, ప్రవిమలరేఖాత్రయంబున్=స్వచ్ఛమయిన మూఁడురేఖలును, కవితా...రేఖలు—కవితా=కవిత్వమునకును, గాన=సంగీతమునకును, ప్రియవాక్=మధురవాక్యములకును, వివరణసీమ=ప్రత్యేకముగా సరిహద్దులను, విభాగ = ఏర్పఱుచుటకయిన, విధిరేఖలు = బ్రహ్మసంబంధమయినగీతలు, నాన్=అనునట్లుగా, ప్రస్ఫుటము, అయ్యెన్=ఏర్పడినవి. మఱియు లోకములో నొకస్థలమునుగుఱించి వివాదపడునప్పుడు, తగినవ్యవహారవిదుఁడు, వారలవివాదమును దీర్చుట కాస్థలమును విభజించి యొండొరులకు సంబంధములేనట్లు చే

యును,అట్లై దమయంతికంఠము నాశ్రయించియున్నకవిత్వము, గానము,ప్రియ వాక్కులును, గంఠసీమనిమిత్తము వివాదపడుచుండఁగా బ్రహ్మ వానివివాదము తీర్చుటకై భాగములుచేసి వానికేర్పఱిచిన హద్దులనునట్లుగాఁ గంఠమందు గీత లొప్పుచున్నవి. ఈచెప్పుటచే దమయంతి, కవిత్వము, గానము, ప్రియవాక్కులను గలిగియున్నదనియుఁ గంఠమందు మూఁడురేఖలుగలదనియు ఫలితార్థము.

తా. స్పష్టము.

క. కాంతాబాహుద్వంద్వా
త్యంతపరాజయసమాశ్రితాంభోదుర్గా
భ్యంతరము లైనబిసముల
కంతర్నిర్వ్యథనకలన యెది యెట్లొక్కో 186

టీ. కాంతా...తరములు—కాంతా=దమయంతియొక్క, బాహుద్వంద్వ= భుజద్వయముచేఁగల్గిన, అత్యంతపరాజయ=మిక్కిలి పరాభవముచే, సమాశ్రిత=ఆశ్రయింపఁబడిన, అంభోదుర్గ= జలదుర్గముయొక్క, అభ్యంతరములు=మధ్యప్రదేశముగలవి, ఐనబిసములకు=అయినతామరతూండ్లకు, అనఁగాఁ దామరతూండ్లు దమయంతి బాహువులచేఁ జయింపఁబడి యాపరాభవమును సహింపలేక జలములో మునిఁగియున్నవని భావము. అంతర్నిర్వ్యథనకలనము= లోపటను దుఃఖములేకపోవుట, ఎట్లొక్కో=ఏలాగునవోకదా, అనఁగాఁ బరాభవమునొందిన తామరతూండ్లకు దుఃఖములేకపోవుట యెట్లనివిరోధము. అంతర్నిర్వ్యథనకలనము=లోపలఁ గన్నముగలదనిచెప్పినచో నిందులకుఁ బరిహారము గలుగును. ఇట "నిర్వ్యథన" శబ్దమునకు, దుఃఖములేకపోవుటయనియు, రంధ్రమనియు నర్థముండుటచే, మొదట విరోధము కల్పించి, పిమ్మటఁ బరిహారముచేసెను. తామరతూండ్లకు లోపలఁ గన్నములుండుట స్వభావసిద్ధము. ఈచెప్పుటచే దమయంతిభుజములు తామరతూండ్లకంటెను మిక్కిలి సుకుమారములయినవని భావము.

తా. స్పష్టము.

క. తరుణి యతిలులితపర్వ
స్మరపంచశరీసమానకమహనీయనఖాం
కురమృదులాంగుళివిలస
త్కరపంకజయుగళి దీనిఁ గొ దరమెనుతింపన్.    187

టీ. తరుణి=దమయంతి, అతి ... యుగళి—అతిలులిత=మిక్కిలినునుపు సేయఁబడిన, పర్వ = గణుపులుగలదియగు, స్మర = మన్మథునియొక్క, పంచశరీ= అయిదుబాణములతోను, సమాన = సమమయిన, మహనీయ = ఒప్పుచున్న, నఖాంకుర=నఖాగ్రములుగల, మృదుల=మెత్తని, అంగుళి = వ్రేళ్లుగల, విలసత్ = ప్రకాశించుచున్న, కరపంకజయుగళి = పద్మములవంటి రెండుచేతులు గలది. దీనిన్ =ఈదమయంతిని, నుతింపన్ =స్తోత్రముచేయుటకు, తరమె=శక్యమగునా? అనఁగా దమయంతివ్రేళ్లు మన్మథబాణములవలెను, అవిచేయి మన్మథునియమ్ములపొదివలెను, ప్రకాశించుచున్నవని భావము.

తా. ఈదమయంతి మిగుల నున్ననిగణుపులుగల, మన్మథు నిబాణపంచకమువంటివ్రేళ్లతో నొప్పుచున్న హస్తపద్మములు కలది. అట్టి దమయంతిని బొగడఁ దరముకాదు.

తే. జలరుహాననదోర్లీల గొ గెలువఁబోలుఁ
గేలిమై నీమృణాళికాకిసలయములఁ
గాక యివియేల మిన్న కేకొకరణి మునుఁగుఁ
గీర్తిఁ బొలియఁగ బహుళదుష్కీర్తియందు.    188

టీ. జలరుహానన=పద్మమువంటి ముఖముగల దమయంతియొక్క, దోర్లీల= బాహువిలాసము, కేలిమై = విలాసముచే, ఈమృణాళికాకిసలయములన్ = ఈచిగురుతామరతూండ్లను, గెలువన్, పోలున్ = జయించెను గాఁబోలును, కాక, ఇవి=తామరతూండ్లు, మిన్నక, కీర్తి, పొలియఁగన్ =నశించునట్లుగా, బహుళదుష్కీర్తియందున్ = విస్తారమైన బురదయనెడి చెడుకీర్తియందని

యర్థము-చెడుబురదయందని భావము కీర్తియనఁగా యశమును బురదయునగును. ఏకరణిఁ మునుఁగుఁ=ఎందులకు మునుఁగును? అనఁగా దమయంతి బాహువుల చేనే తామరతూండ్లు నిక్కముగ జయింపఁబడుటచేత నే దుష్కీర్తియందుమునుఁగుచున్నవని భావము. లేక, దుష్కీర్తి నల్లగానుండునని వర్ణించుట కవిసమయసిద్ధము. కావున నల్లగానుండుబురదలో సహజముగాఁ బుట్టి యందే వసించుచున్న తామరతూండ్లను దమయంతిబాహువులలోఁ బోలలేకపోవుటచేతనే బురదయనెడి దుష్కీర్తిపాలయినట్లు లుత్ప్రేక్షించెను. అనఁగా దమయంతి బాహువులు తామరతూండ్లను మించియున్నవని భావము.

తా. స్పష్టము.

సీ. గంధవారణకుంభ ✽ గౌరవస్ఫురణంబు,
కనకకుంభములకుఁ ✽ గల్గెనేని
లికుచకోమలకాంతి ✽ లీలావిశేషంబు,
చక్రవాకములందు ✽ జరిగెనేని
మాలూరసౌభాగ్య ✽ మహిమానుభావంబు,
దాడిమీఫలములఁ ✽ దగిలెనేని
నసకలోన్మీలిత ✽ ప్రసవగుచ్ఛచ్ఛాయ,
యబ్జకోరకముల ✽ కబ్బెనేని
తే. గాని సరిఁజేయఁగారాదు ✽ వానివాని
హారినిర్ఝరసలిలధా ✽ రావఘాత
కాంచనాచలశృంగభా ✽ గంబు లగుచు
రాజితము లైనదీనివ ✽ క్షోజములకు 189

టీ. గంధ...స్ఫురణంబు—గంధవారణ = గంధజాతియేనుఁగుయొక్క, కుంభ=కుంభస్థలములయొక్క, గౌరవ=గొప్పతనముయొక్క, స్ఫురణంబు=అతిశయము, కనకకుంభములకుఁ=బంగారపుకుండలకు, కలిగెనేని=సంభవించినచో, అనఁగా నేనుఁగులకుంభస్థలముయొక్క గొప్పతనము బంగారుకుండలకు సంభ

వించినచో ననిభావము. లికుచ...విశేషంబు—లికుచ = నిమ్మపండ్లయొక్క, కోమలకాంతి=మృదుకాంతులయొక్క,లీలావిశేషంబు=విలాసాతిశయము, చక్రవాకములందుఁ=చక్రవాకపక్షులందు, జరిగెనేని=సంభవించినచో, అనఁగా నిమ్మపండ్లును సాటిదెచ్చుటకు వానికిదమయంతి కుచములవలెఁ బరస్పర మొరసికొనియుండుటలేదు కాన వలనుపడదు. చక్రవాకముల కట్టిగుణమున్నను దమయంతీకుచకాంతి వానికి లభింపలేదు. కావున నిమ్మపండ్లకాంతి చక్రవాకములకు లభించినచో సామ్యముచేయఁదగియుండునని భావము. మాలూర...భావంబు—మాలూర = మారేడుపండ్లయొక్క, సౌభాగ్య=సౌందర్యముయొక్క, మహిమానుభావంబు=మహిమాతిశయము, దాడిమీఫలములఁ = దానిమ్మపండ్లయందు, తగిలెనేని=లభించినచో, అనఁగా దాడిమఫలములకు మారేడుపండ్లసౌందర్యాతిశయ మలవడినచో దమయంతికుచములకు సాటిచేయవచ్చునని భావము. అసకల...ఛాయ—అసకలోన్మీలిత=సంపూర్ణముగా, వికసింపని, ప్రసవగుచ్ఛచ్ఛాయ=పూలగుత్తులయొక్కకాంతి, అబ్జకోరకములకుఁ = తామర మొగ్గలకు, అబ్బెనేని=సంభవించినచో, కాని=గజకుంభాదులందున్న గౌరవాదులు కనకకలశాదులకు లభించినప్పుడేకాని, వానిఁ వానిఁ = ఆయావస్తువులను, హారి...భాగంబులు—హారి = మనోహరములయిన, నిర్ఝర = సెలయేళ్లయొక్క, సలిలధారా = ఉదకధారలచే, అవధౌత=కడుఁగఁబడిన, కాంచనాచల=బంగారుకొండయొక్క, శృంగభాగంబులు= శిఖరప్రదేశములుకలవి, అగుచుఁ, అనఁగా సెలయేళ్లనీటిచేఁ జక్కఁగఁగడుగఁబడిన బంగారుకొండశిఖరములవలె దమయంతికుచము లొప్పుచున్నవని భావము. రాజితములు=ప్రకాశించుచున్నవి. ఐనదీనివక్షోజములకుఁ=అయినట్టి యీకాంతకుచములకు, సరి, చేయఁగాన్, రాదు=సాటిచేయవలనుపడదు.

తా. కరికుంభముల యాకారవిశేషము బంగారుకుండలకును; నిమ్మపండ్లకాంతి చక్రవాకపక్షులకును, మారేడుపండ్లసౌందర్యము దాడిమీఫలములకును,బూలగుత్తులకాంతి తామరమొగ్గలకును, గలిగినచో నాకనకకలశాదులను, సెలయేళ్ల

నీటిచే శుభ్రములైన బంగారుకొండశిఖరములవలెనున్న దమయంతికుచములకు సరిపోల్పవచ్చును.

తే. నలువ సన్నంబుగా దీనినడుము కినిసి
యావనమునకునిచ్చె నాయంశమెల్ల
నది యుపాదానమునఁగదా యది సృజించె
నున్నతము లైనయేతత్పయోధరముల 190

టీ. నలువ = బ్రహ్మ, కినిసి = కోపించి, అనఁగా నేదోకారణముచే దమయంతి మధ్యముపై కోపమువహించి, దీనినడుము = దమయంతినడుము, సన్నంబుగాన్ = కృశించునట్లుగా, ఆయంశమెల్లన్ = ఆమధ్యభాగమందలి సారమునెల్లను, యావనమునకున్ = శేఁబ్రాయమునకు, ఇచ్చెన్ = ఇచ్చెను. అనఁగా లోకములోఁ బ్రభువైనవాఁడయిన నొకమనుష్యుఁడువిరుద్ధప్రవర్తనుఁడయినచో వానిధనాదులనెల్లగొని వాడు కృశించునట్లు శిక్షవిధించి యాధనాదులను వానిబంధువులకొసంగుట చూచుచున్నాము. అట్లెబ్రహ్మకు దమయంతి మధ్యముపైఁ గోపముండుటచే దానిసారమునంతయుఁ దీసి యావనమునకిచ్చెనని భావము. అది=ఆయావనము, ఉపాదానమునన్, కదా=దానినుపాదానకారణముగాఁ జేసికొని, ఉన్నతము = ఎత్తైనవి, ఐనయేతత్పయోధరములన్ = అయినట్టి దమయంతికుచములను, సృజించెన్ = పుట్టించెను. యావనమువయించినతోడనే కుచములేర్పడును. దానిఁ గవి యిట్లుత్ప్రేక్షించెను. అనఁగా దమయంతినడుము సన్నముగానున్నదనియుఁ గుచము లున్నతముగానున్నవనియు భావము.

తా. బ్రహ్మ నడుముపయికోపించి యది కృశత్వమొందునట్లుగా నాసారమునంతను యావనమునకు నీయఁగా నది యాసారము నుపాదానముగాఁజేసికొని యున్నతములయిన పయోధరములను నిర్మించినది కాఁబోలు.

చ. అరయ ననంగరాజ్యవిభవాభ్యుదయంబు ప్రకార మిట్లుపో
కర మురుదైన యీనుదతికౌను వళిత్రితయంబుచే నిరం

తరమయి యాక్రమింపఁబడెఁ దానికిఁదోడొకొప్రొద్దునుం బయో
ధరములు చూచుచున్నయవి దర్పవిజృంభణలీల యేర్పడన్.

టీ. కరము=మిక్కిలి, అరుదు=ఆశ్చర్యమును గలిగించు,ఐన ఈసునతికౌను=ఈదమయంతిమధ్యము,వళిత్రితయంబుచేన్ = వళులనఁబడు మూడురేఖలచే, నిరంతరము, అయి =అవకాశములేనిదయి, ఆక్రమింపఁబడెన్, అనఁగా దమయంతిమధ్యము వళిత్రయముచేఁ బ్రకాశించుచున్నదని భావము. దానికిన్,తోడు=అందులకు సాయముగా,అనఁగా మధ్యమును వళిత్రయ మాక్రమించుకొనుటకు సాయముగానని భావము. పయోధరములు= స్తనములు, దర్పవిజృంభణలీల= గర్వాతిశయముయొక్క విలాసము,ఏర్పడన్=స్పష్టమగునట్లుగా, ఒకప్రొద్దున్=ఒకసమయమును, చూచుచున్నయవి=ఆలోచించుచున్నవి. అనఁగాఁ దానును దగినసమయమాలోచించి యామధ్యముపయిఁబడి యాక్రమించుకొనవలెనని చూచుచున్నవని భావము. అరయన్=ఆలోచింపఁగా, అనంగ రాజ్యవిభవాభ్యుదయంబు ప్రకారము—అనంగ=మన్మథునియొక్క, రాజ్యవిభవ=రాజ్యసంపదయొక్క, అనఁగా యౌవనముయొక్క యనుట. అభ్యుదయంబు=అభివృద్ధియొక్క, ప్రకారము=రీతి, ఇట్లపో=ఈరీతిగానే యుండును గాఁబోలును. అనఁగా మంచిరాజు రాజ్యములోఁ బ్రబలుఁడు దుర్బలుని నాక్రమించినప్పుడు దుర్బలపక్ష మవలంబించి యాప్రబలుని గర్వపరిహారము చేయుటగలదు. అంతియకాని తక్కినవారు ప్రబలుపక్ష మవలంబించి యాదుర్బలు నాక్రమించుకొనఁ జూడరు. ఇట్లుండ వలరాజు రాజ్యములో (యౌవనములో) దుర్బలమగు మధ్యమును వళిత్రయ మాక్రమించుకొనఁగాఁ బయోధరములు దుర్బలమగు మధ్యముపక్ష మవలంబించి ప్రబలుని గర్వమడంచుటకు బదులుగాఁ దాము నామధ్యము నాక్రమించుటకే చూచుచుండెను. మన్మథునిరాజ్యములో న్యాయాన్యాయ పరిశీలన మిట్టులేయుండును గాఁబోలు. అనఁగా దమయంతి మధ్యము వళిత్రయముచే నాక్రాంతమయినదనియుఁ గుచములున్నతము లనియు ఫలితార్థము.

తా. మిగుల నాశ్చర్యముగొలుపు నీదమయంతినడుము వళిత్రయముచే మిక్కిలి యాక్రాంతమయియుండఁగా దానికిసాయము పాలిండ్లు గర్వాతిశయ

ము స్పష్టమగునట్లుగాఁ దాముసు సామర్థ్యము నాక్రమించుటకే యాలోచించుచున్నవి. ఆలోచింపఁగ మన్మథునిరాజ్యమందు న్యాయమార్గానుసరణ మిట్లేయుండును గాఁబోలును.

తే. ప్రబలవక్షోజహేమకుంభములు చూచి
లలితరోమావలీరజ్జులతికఁ జూచి
నాభికూపంబుఁ జూచి నాకనయనయుగము
తృప్తి వహియించుచున్నది దీనియందు. 192

టీ. నానయనయుగము = నా నేత్రద్వంద్వము, ప్రబల...కుంభములు—ప్రబల=గొప్పవయిన, వక్షోజహేమకుంభములు=బంగారుకుండలవంటి కుచములనుఁ చూచి, లలిత...లతిక—లలిత=సుందరమయిన, రోమావళీరజ్జులతికను=లతవంటి నూఁగారును, చూచి, నాభికూపంబుక్=నూతివలె లోఁతైనపొక్కిలిని, చూచి, దీనియందుక్=ఈదమయంతియందు, తృప్తి, వహించుచున్నది=తనివిచెందుచున్నది.

తా. స్పష్టము.

తే. నాభియుత్పాటితాలాన నవ్యబిలము
రోమవల్లరిశృంఖలాదామకంబు
కామమదవారణమున కీకంబుకంఠి
వలుఁదచనుదోయి గిరివప్రవాస్తుభూమి. 193

టీ. నాభి=దమయంతియొక్కపొక్కిలి, ఉత్పాటితాలాన నవ్యబిలము—ఉత్పాటిత=పెల్లగింపఁబడిన, ఆలాన=గజబంధనకాష్ఠముయొక్క, నవ్య=క్రొత్తదగు, బిలము=రంధ్రము. అనఁగా దమయంతిపొక్కిలి యేనుఁగునుగట్టెడికొయ్యయూడఁదీయఁగాఁ బడినరంధ్రమువలె నొప్పుచున్నదని భావము. రోమవల్లరి=నూఁగారు, శృంఖలాదామకంబు=ఏనుఁగునుబంధించు గొలుసువంటిది, ఈకంబుకంఠివలుఁదచనుదోయి=ఈదమయంతియొక్క స్థూలమయిన కుచద్వంద్వము,

కామమదవారణంబునకున్ =మన్మథుఁడనెడి మదపుటేనుఁగునకు, గిరివప్రవాస్తుభూమి—గిరివప్ర=కొండచరియలకుఁ గ్రిందిభాగమునందలి; వాస్తు=నివసింపఁదగిన, భూమి=ప్రదేశము, అనఁగా నీదమయంతి వలుఁదయగు కుచద్వంద్వము మన్మథుఁడను మదపుటేనుఁగునకు నివాసయోగ్యములగు మంటిదిబ్బలవలె నొప్పుచున్నదని భావము. మదించిన యేనుఁగు శయనించుస్థలమందుఁ బ్రక్కల కొత్తిగిలునిమిత్తము మంటిదిమ్మలుండుట ప్రసిద్ధము.

తా. దమయంతినాభి యేనుఁగు కట్టుగొయ్యనూఁడఁదీయఁగాఁ బడినరంధ్రమువలెను, నూగారు, బంధనపుగొలుసువలెను, జనుదోయి మదనుఁడను మదపుటేనుఁగు నివసించుప్రదేశమునం గల మంటిదిబ్బలవలెను బ్రకాశించుచున్నది.

తే. ప్రతిఫలించుప్రవేణికాభారఖచిత
మల్లికలు రాజితాక్షరమాలికలుగ
శంబరారాతివిజయశాసనసువర్ణ
పట్టికయుఁ బోలె నొప్పు నిప్పడఁతివీఁపు. 194

టీ. ప్రతిఫలించు...మల్లికలు-ప్రతిఫలించు = ప్రతిబింబించుచున్న, ప్రవేణికాభార=జటాభారమునందు, ఖచిత=కూర్పఁబడిన, మల్లికలు=మల్లెపూవులు, రాజితాక్షరమాలికలుగన్ =వెండియక్కరముల పంక్తివలెను, ఇప్పడఁతివీఁపు, శంబరా...పట్టికయున్—శంబరారాతి=మన్మథునియొక్క విజయశాసన=జయశాసనసంబంధమయిన, సువర్ణపట్టికయున్, పోలెన్ =బంగారపు పలకవలెను, ఒప్పున్ =ప్రకాశించును, దమయంతివీపు బంగారపుపలకవలెను, నందుఁ బ్రతిఫలించిన జటాభారమునందుగల మల్లెపూవులు మన్మథుని జయశాసనముల సంబంధమగు వెండియక్షరముల పంక్తివలెను నొప్పుచుండెను. ప్రతిబింబించినమల్లెపూవులనుటచే దమయంతిశరీరము లావణ్యపరిపూరితమయి యద్దమువలె బింబగ్రహణార్హమయి యున్నదని తెలియవచ్చుచున్నది. దమయంతివేణియందు ముడువఁబడిన మల్లెలు మన్మథుని జయశాసనాక్షర పంక్తులనియు, దమ

యంతివీఁపు మన్మథుని జయశాసనఫలకమువలె నున్నదనియుఁ జెప్పుటచే వానిఁ జూచినవారికందఱికిని మోహము కలిగింపఁజాలి యున్నదని భావము.

తా. దమయంతిజడయందు ముడువఁబడిన మల్లెపూవులు వీఁపునందుఁ బ్రతిబింబింపఁగా నవి మదనుని జయశాసనసంబంధమగు వెండియక్షరములవలెను, వీఁపు జయశాసనము వ్రాయఁదగిన ఫలకమువలెను నొప్పుచున్నది.

క. తనజనకుఁడు శౌరి సుద
ర్శనచక్రమునను జయించె జగమని మరుఁ డీ
వనిత యదర్శనకటితటి
ఘనచక్రంబున జయింపఁ గాఁదలఁచు జుమీ? 195

టీ. మరుఁడు=మన్మథుఁడు, తనజనకుఁడు=తనతండ్రియగు, శౌరి=విష్ణుమూర్తి, సుదర్శనచక్రమునన్=సులభముగా దర్శింపఁదగిన చక్రాయుధముచే, జగము=లోకమును, జయించెన్, అని=అనియూహించి, ఈ...చక్రంబునన్—ఈవనిత=ఈదమయంతియొక్క, అదర్శన=వస్త్రావృతమగుటచేఁ జూడవలనుపడని, కటితటచక్రంబునన్ = నితంబచక్రముచే, జయింపఁగాన్ = జయించుటకు, తలఁచున్, చుమీ=ఆలోచించును. అనఁగా దమయంతినితంబబింబము మరునిచక్రమువలె నున్నదని భావము. తండ్రిచక్రము సులభముగాఁ జూడదగియున్నదగుటచే దానికిఁ బ్రతీకారము చేయవచ్చును. కాని యితనిచక్రము దర్శింప వలనుపడమిచేఁ బ్రతీకారము చేయ వలనుపడదు. కాన జగమును నిరాటంకముగా జయింపవచ్చును. ఈచెప్పుటచే దమయంతినితంబము మదనోద్దీపక మగుచుఁ జక్రమువలెనున్నదని భావము.

తా. తనతండ్రియగు విష్ణుమూర్తి లోకమును జక్రముచే జయించుచుండెనని తలంచి తానును దమయంతినితంబచక్రముచే జగంబును జయింప నూహించెను.

శా. ఏదే నొక్కమనోహరాంగకముచేనీయిందుబింబాస్యహే
లాదర్పంబునఁ బిప్పలచ్ఛదము గెల్వంగాఁ దలంచెం జుమీ

లేదే నన్యమహీజపత్రములు వ్రాఁకెలెంగాక యేలా భయ
ప్రాదుర్భావమునం జలించు నది నిర్వాతప్రదేశంబునన్. 196

టీ....పిప్పలచ్ఛదము=రావియాకు.

తా....

తే. చిగురుఁబోఁడి భ్రూవల్లరి కి చిత్ర రేఖ
యింతినాస తిలోత్తమ కి యింత నిజము
చెలువయూరుకాండద్వయీకి సృష్టిరంభ
మానినీమణిమధురోక్తి కి మంజుఘోష. 197

టీ. చిగురుబోఁడి భ్రూవల్లరి=దమయంతియొక్క కనుబొమలు, చిత్రరేఖ=చిత్రమయిన రేఖలుగలది, మఱియుఁ జిత్రరేఖయను నచ్చరవంటిది. ఇంతినాస=దమయంతియొక్క నాసిక, తిలోత్తమ=తిలపూవులలో నుత్తమమువంటిది. అనఁగా దమయంతి నాసికశ్రేష్ఠమైన నువ్వుపువ్వువలె మనోహరముగా నున్నదని భావము. మఱియు దమయంతి నాసికతిలోత్తమయను నప్సరసవలె నున్నదనియు నర్థము స్ఫురించుచున్నది. ఇంత నిజము = ఇదియంతయు సత్యమే, చెలువయూరుకాండద్వయీసృష్టి=దమయంతియొక్కతొడలజతయొక్కనిర్మాణము, రంభ=అనఁటికంబమే, అనఁగా దమయంతియొక్కతొడలు రంభాస్తంభములను బోలుచున్నవని భావము. మఱియు దమయంతితొడలు రంభయను నప్సరసవలె నున్నదనియు నర్థము. మానినీమణిమధురోక్తి = దమయంతియొక్క మధురమైన భాషణములు, మంజుఘోష = మృదువయిన ధ్వనికలది. అనఁగా దమయంతిమాటలు మిగులమృదువయినవని భావము. మఱియు దమయంతిమాటలు, మంజుఘోష = మంజుఘోషయను నప్సరసనుబోలుచున్నదనియునర్థము. దమయంతియొక్కొక్కయవయవమే యొక్కొకదేవతాస్త్రీని బోలుచున్నదని చెప్పుటచే దేవతాస్త్రీలకంటెను నధికమగు సౌందర్యవిశేషము గలదనియు నొక్కొక్కయవయవమునకే దేవతాస్త్రీలు సాటివత్తురో రారో

యని చెప్పవలసియుండ దమయంతికి సాటిదెచ్చుట మిగులఁ బరిహాసాస్పదమ
నియు భావము.

తా. స్పష్టము.

గీ. ఊరుకాండద్వయమున నీయుత్పలాక్షి
సమదవారణరాజహస్తంబు గెలిచె
నదియ కారణమునఁగదా యధికలజ్జఁ
బొంది ముడిఁగించు నది యాస్యపుష్కరంబు. 193

టీ. ఈయుత్పలాక్షి=కలువలవంటి నేత్రములుగల దమయంతి, ఊరుకాండ
ద్వయమునన్=తొడలజతచేత, సమద...హస్తంబున్ - సమద=మదముతోఁ
గూడిన, వారణరాజ=గజశ్రేష్ఠముయొక్క, హస్తంబున్=తొండంబును, గెలి
చెన్=జయించెను. అది యకారణమునన్ కదా = అట్లు దమయంతియూ
రువులచేఁ జయింపఁబడినది కావున నేకదా అధికలజ్జన్ = సిగ్గుపెంపును,
పొంది = చెంది, ఆస్యపుష్కరంబు = తుండాగ్రంబును? మఱియు ముఖ
పద్మమనియువర్థము. ముడిఁగించున్ = ముణుచుకొనుచుండును. ఏనుఁగునకుఁ
దుండాదండమును జుట్టగాఁజుట్టుట స్వభావము. అనఁగా లోకములో శత్రువు
లచేఁ బరాజితులయినవారు నలువురిలో మొగమెత్తి తిరుగలేక ముఖమును
ముడుఁచుకొనుచుందురు. అట్లే యేనుఁగు తుండాదండము దమయంతితొడలచే
జయింపఁబడుటచే మొగమెత్తలేక సిగ్గున ముణుఁచుకొనునని భావము. ఈచెప్పు
టచే దమయంతితొడలు గజతుండములకంటెను మనోహరముగా నున్నవని ఫలి
తార్థము. అలం. అపహ్నవము.

తా. ఈదమయంతి తనతొడలచే మదపుటేనుఁగు తుండాగ్రంబును జయిం
చినది. కావున నది తనతుండాగ్రమును సిగ్గుచే ముడుఁచుకొనుచుండును.

తే. వనిత నానారదాహ్లాదవదనకమల
నీలకుంతల కుచశైలశీలి భృగువు

చామ శ్రీమహాభారతసర్గకార్య
కారణవ్యాసలలితోరుగౌరమహిమ. 199

టీ. వనిత=దమయంతి, నానా...కమల-నానారద=నారద మహామునిని, ఆహ్లాది=సంతోషపెట్టెడి, వదనకమల=ముఖపద్మముకలది, అనఁగా నారదమహామునికిఁగూడ మోహము కలిగించుముఖపద్మముకలదని భావము. "నానారద" అనుచోట రెండునఙ్ తత్పురుషము లున్నవని యెఱుఁగునది. న+నారద—అనారద=నారదుఁడు కానివాఁడు. న+అనారద—నానారద=నారదుఁడుకానివాఁడు కాఁడనియర్థము. అనఁగా నారదుఁడే యని భావము. మునులను గూడ మోహింపఁజేయుచున్నదనుటచే దమయంతి సౌందర్యాతిశయము వ్యక్తమగుచున్నది. వనిత=దమయంతి, నానా...కమల-నానారద=అనేకములగు దంతములచే, ఆహ్లాది=యౌవనవంతుల మనస్సున కానందముగొలుపుచున్న, వదనకమల=ముఖపద్మముకలదని యర్థాంతరము, నీలకుంతల=నల్లనిముంగురులు గల దమయంతి, కుచశైలశీలి భృగువు—కుచశైల= స్తనములనెడి పర్వతములను, శీలి=కోరుచున్న, భృగువు=భృగుమహాముని గలది. అనఁగా దమయంతి భృగుమహామునికిని మోహము కలిగించుకుచములు కలదనుట. మఱియు మునులకుఁ బర్వతాశ్రయణము సహజము కావున భృగువు దమయంతీకుచములనే పర్వతములుగా భ్రమించి కోరుచున్నాఁడని భావము. మఱియు, నీలకుంతల, కుచశైలశీలి భృగువు—కుచశైల= స్తనపర్వతములయొక్క, శీలి=ఉత్తమమయిన, భృగువు=చరియలు లేక తటములు కలదని యర్థాంతరము, అనఁగా దమయంతి స్తనములు పెద్దచఱియలు గలిగి మనోహరముగానున్నవని భావము. చామ=దమయంతి, శ్రీ...మహిమ—శ్రీ=శోభాయుక్తమయిన, మహాభారత=భారతగ్రంథమనెడి, సర్గకార్య = నిర్మించుకార్యమునకు, కారణ = హేతువయిన, వ్యాస = వ్యాసమహర్షికి, లలిత=సుందరములయిన, లేక, మనోహరమయిన, ఊరు=తొడలయొక్క, గౌరమహిమ=తెల్లనికాంతులయొక్క మహిమ కలది. అనఁగా దమయంతి తనతొడలయొక్క గౌరకాంతిమహిమచే వ్యాసునికి మోహముగలిగించుచున్నదని భావము. వ్యాసుఁడు రంభావనవాసి కావున దమయంతితొడలను

గాంచి రంభాస్తంభములని భ్రమచెంది యాశ్రయించుచున్నాఁడని భావము. మఱియు, చామ=దమయంతి, శ్రీమహః... మహిమ-శ్రీ=శోభాయుక్తమయిన, మహోభా=ఎక్కుడుకాంతి గల, రతి=సంభోగముయొక్క, సర్గకార్య=నిర్మాణ కార్యమునకు, కారణ=హేతువయిన, వ్యాస=విస్తృతములయిన, లలిత=సుందరములయిన, ఊరు=తొడలయొక్క, గౌరమహిమ=గౌరకాంతులయొక్క యతిశయముకలది. అనఁగా దమయంతితొడలు సురతసంపాదకములై, సుందరములై, కావుననే, యువమనోహరములయి, గౌరకాంతికలవై, ప్రకాశించుచున్నవని భావము.

తా. ఈదమయంతివదనకమలము నానావిధదంతములచేతను, నొప్పుచున్నది. ఈమెయుచములు గొప్పతటములచేఁ బ్రకాశించుచున్నవి. ఈమెతొడలు సురతసంపాదకములయి గౌరకాంతులచే మిగుల మనోహరమయినవి.

చ. సుదతి మనంబునం దలఁచి చూడఁ జతుర్దశి యానరుంధతీ
మదనపురంధ్రి దైత్యరిపు మానవతీ నవమాతృకాజన
త్రిదశవరేణ్యభామలకు దివ్యమహామహిమానుభావసం
పద నటుగాక గుల్భపరిపాటి నదృశ్యత సంఘటిల్లునే! 200

టీ. దివ్య... సంపదన్—దివ్య=శ్రేష్ఠమయిన, మహత్=ఉత్కృష్టమగు, మహిమ=గొప్పతనముయొక్క, అనుభావసంపదన్ = ప్రభావసమృద్ధిచే, మనంబునన్=మదియందు, తలఁచి చూడఁగన్ = ఆలోచించిచూడఁగా, సుదతి=మంచిదంతములుగల దమయంతి, అరుంధతీ... భామలకున్—అరుంధతీ = వసిష్ఠునిభార్యకును, మదనపురంధ్రి=రతీదేవికి, దైత్యరిపుమానవతీ=లక్ష్మీదేవికిని, నవమాతృకాజన=బ్రహ్మాణిమొదలగుతొమ్మండ్రుగురుమాతలకును, త్రిదశవరేణ్యభామలకున్=శచీదేవికిని,చతుర్దశి=పదునాల్గుసంఖ్యను బూరించునది. ఔన్=అగును. అనఁగా నిదివఱకుఁ బదుముగ్గురు గలరు. ఈమె పదునాల్గవదియని భావము. దమయంతిపైని జేర్కొనఁబడిన మహానుభావురాండ్రతోఁ బోల్పదగిన దనుట తెల్లమగుచున్నది. నవమాతృక లెవరనఁగా శ్లో॥ బ్రహ్మాణీచైవ మాహేశీ కామారీ వైష్ణవీ తథా । వారాహీ నారసింహీ చ మాహేంద్రీ చండికా తథా । మహా

లక్ష్మీరితి ప్రోక్తాః క్రమేణైతా నవాంబికాః॥ అని యెఱుంగునది. అటుకాక దమయంతి యరుంధతి మొదలగునుత్తమ స్త్రీలతోఁ బోల్పఁదగినది కానిచో, గుల్ఫపరిపాటికిన్=చీలమండయొక్క రీతిచే,అదృశ్యత=దర్శనాభావము సంఘటిల్లునే=సమకూడునా? అనఁగా నరుంధత్యాదులకువలె దమయంతి చీలమండలు మాంసముచేఁ గప్పఁబడినవి. కావున వారిసామ్యము నొందుచున్నదని భావము. స్త్రీలచీలమండలు మాంసముచేఁ గప్పంబడియుండుట సులక్షణ మని సాముద్రికులు చెప్పుదురు.

తా. ఆలోచింపఁగా దమయంతి గొప్పప్రభావముచే నరుంధతికిని, రతీదేవికిని, లక్ష్మికిని, నవమాతృకలకును, శచీదేవికిని సమానురాలని చెప్పవచ్చును. కావుననే వారికివలె దమయంతికిఁ గూడఁ జీలమండలు మాంసముచేఁ గప్పఁబడి కానరాకున్నవి.

సీ. పల్లవంబులు దీని పదకాంతిలవము లై
పల్లవశబ్దలాభంబు నొందెఁ
బవడంబుమీఁదికోపమునవో యీకాంత
పాదంబు లత్యంత పాటలములు
శుద్ధపార్ష్ణులు గానఁ జూడ దీనంఘ్రులు
కరియూథపతియాన గరిమ గెలిచెఁ
దోయజభ్రాంతినో యీయింతియడుగుల
నలువ వ్రేప్పఁ బాయకున్న దియె లక్ష్మి
గీ. తరుణిపదములయది యలక్తకరసంబొ
కాక త్రైలోక్యభామాని కాయమాళి
భాగవిన్యాససంలగ్న బహుళనూత్న
చారుసీమంతసీమసిందూరరజమొ. 201

టీ. పల్లవంబులు=చిగుళ్లు, దీనిపదకాంతిలవములై=ఈ దమయంతి పాదకాంతియొక్క లేశముకలదై, పల్లవశబ్దలాభంబున్=పల్లవ యనుపదలాభమును,

ఒందెన్ = పొందెను. అనఁగా దమయంతి పదములకాంతిలో లవమాత్రము చిగుళ్లకుఁ గలుగుటచేత నే పల్లవము లని పిలువఁబడుచున్నవని భావము. పల్ + లవ=పల్లవ యని సంధివలన నీరూప మేర్పడును. కానఁ గవి పల్లవశబ్దమును శ్లేషించి యుత్ప్రేక్షించెను. ఈ చెప్పుటచే దమయంతియడుగులు చిగుళ్లవలె మనోహరమయినవని తెల్లమగుచున్నది. పవడంబుమీఁది కోపమునన్ + ఓ, క్రోధము చేత నే కాఁబోలు, ఈకాంతపాదంబులు=ఈదమయంతియడుగులు, అత్యంతపాటలములు=మిక్కిలి రక్తవర్ణముకలవి, లోకములోఁ గోప మావహించినప్పుడు శరీరమెఱ్ఱవాఱుట సుప్రసిద్ధము కావున నేదోకారణమునఁ బవడముమీఁదదమయంతిపాదములు కోపమునహించియుండుటచేత నెఱ్ఱవాఱుటఁగాఁ గవి స్వతస్సిద్ధమయిన రక్తవర్ణముగల దమయంతిపాదముల నుత్ప్రేక్షించెను. చూడన్ =ఆలోచింపఁగా, దీనంఘ్రులు=ఈ దమయంతిపదములు, శుద్ధపార్ష్ణులు=పగులుట మొదలగుదోషములు లేనిమడమలు గలవి. కానన్ = కావున, కరియూథపతియానగరిమన్=గజశ్రేష్ఠముయొక్క గమనాతిశయమును, గెలిచెన్ = జయించెను. అనఁగా దమయంతిపాదములు విపాదికాది దోషములులేనివనియు, గమనము కరీంద్రమును ధిక్కరించుచున్నదనియు ఫలితార్థము. ఈపాదమున "దీని యంఘ్రులు" అని యుండుటకు బదులుగా "దీనంఘ్రులని" ప్రయోగింపఁబడియె కాని సంధి యట్లుండరాదు. పెక్కుప్రతులలో నట్లే కానవచ్చుచున్నది. ఆలోచింపఁ గవి నిరంకుశత్వముచేఁ బ్రయోగించెనని తోఁచెడిని. తోయజభ్రాంతినో=పద్మమనెడి భ్రాంతి చేతఁగాఁబోలు, లక్ష్మి, ఈ యింతియడుగులన్ = ఈ దమయంతిపాదములను, నలువొప్పన్ =అందము గులుకునట్లుగా, పాయక ఉన్నదియే=విడువకున్నదియే, లక్ష్మీదేవి దమయంతిపాదములను బద్మముగా భ్రమించి కాఁబోలును విడువఁజాలకున్నది. దమయంతిపదములు పద్మములవలె లక్ష్మీస్థానములయి యున్నవని భావము. తరుణిపదములయది=దమయంతిపాదములం దున్నది. అలక్తకరసంబొ=లాక్షారసమో, కాక=లాక్షారసముకాక, త్రైలోక్య...రజమొ-త్రైలోక్య=ముల్లోకములందుఁగల, భామానికాయ = స్త్రీసమూహములయొక్క,

మాళిభాగ=శిరఃప్రదేశములందు, విన్యాస=ఉంచుటచే, సంలగ్న=అంటికొనియున్న, బహుళ=విస్తారమయిన నూత్న=క్రొత్తదయిన, చారు=సుందరమయిన, సీమంతసీమన్=పాపటయందున్న, సిందూరరజమో=సిందూర పరాగమో=అనఁగా దమయంతి తనపాదములను ముజ్జగంబులఁ గల స్త్రీలమూర్ధములందుంచఁగా వారిమూర్ధంబులందున్న సిందూర మంటుకొనఁగా నవ్విధంబుగాఁ బ్రకాశించుచున్నవేమో యని భావము. దమయంతి సమస్తస్త్రీలలో మూర్ధన్యురాలనియు, పాదములు లత్తుక కలిగి యొప్పుచున్నవనియు ఫలితార్థము.

తా. స్పష్టము.

తే. శిశిరకాలంబునందు నిశ్శేష మయిన
జలజసస్యంబు సృజియింపఁ దలఁచి బ్రహ్మ
యాచరింపఁడె యీకాంతయాస్యహస్త
పాదసౌభాగ్యములయందుఁ బంచభిక్ష. 202

టీ. బ్రహ్మ, శిశిరకాలమునందున్=శిశిరఋతువునందు, నిశ్శేషము=మిగులులేనిది, అనఁగాఁ బూర్తిగా నశించినదని యనుట, అయిన జలజసస్యంబు=అయినట్టి తామరపైరును, సృజియింపన్=మగుడ సృజించుటకు, ఈకాంత ...ములయందున్-ఈ కాంత=ఈ దమయంతియొక్క, ఆస్య=ముఖముయొక్కయు, హస్త=చేతులయొక్కయు, పాద=పాదములయొక్కయు, సౌభాగ్యములయందున్=సౌందర్యములందు,పంచభిక్షన్=మధుకరవృత్తిని, ఆచరింపఁడె=చేయఁడే, శిశిరఋతువునందుఁ బూర్తిగ నాశనముచెందిన పద్మములను మరల సృజింపనెంచి యందులకుఁదగిన సౌందర్యమును యాచింపఁదలంచి యీ దమయంతి పాదములు, చేతులు, ముఖము, నాఁబడునైదింటియొద్ద బిచ్చమెత్తుకొనిపోయి పద్మములను సృజించెనని భావము. ఈచెప్పుటచే దమయంతిపాదములం దుండు కాంతియొక్క లేశమమాత్రమె పద్మములందుఁ గానవచ్చుచున్నట్లు స్పష్టమగుచున్నది. పంచభిక్షయనఁగా మధుకరవృత్తి తుమ్మెద యొక్కొకపుష్పమునకుఁ బోయి కొంచెముకొంచెము తేనెను సంపాదించి తృప్తిచెందును. అట్లె బ్రహ్మ [illegible] యైదు[illegible] కొంచెము

యాచించి యాహారాదులను సంపాదించి యందువలనఁ దృప్తిచెందును. మధుకరసంబంధమగువృత్తి కాన మాధుకరి యనఁబడును. అయిదుగృహములందు భిక్షను చేకొనుటకే పంచభిక్ష యందురు. బ్రహ్మ దమయంతి పాదములు చేతులు ముఖము నాఁబడునైదింటియొద్ద భిక్షమెత్తెనుగానఁ బంచభిక్ష నాచరించె నని తెలియఁదగినది.

తా. స్పష్టము.

క. వినుతయశః పాదాంగు
ష్ఠనఖాస్యములందుఁ బూర్ణశశిచంద్ర చతుష్కం
బును ధరియించుటనొకొ యీ
వనిత చతుష్షష్టికళలవాసనకెక్కెన్. 203

టీ. ఈవనిత=ఈదమయంతి, వినుత - లందుఁన్ - వినుత=కొనియాడఁబడుచున్న, యశః=కీర్తియందును, పాదాంగుష్ఠనఖ = కాలిబొటనవ్రేళ్ల గోళ్లయందును, ఆస్యములందుఁన్ = ముఖమందును, పూర్ణచంద్ర చతుష్కంబును = నలుగురు పూర్ణచంద్రులను, ధరించుటనొకొ = తాల్చుటచేతఁగాఁబోలు, చతుష్షష్టికళలవాసనకున్ =అఱువదినాల్గువిద్యలయందలి ప్రసిద్ధికి,ఎక్కెన్ =పొందెను, అనఁగా దమయంతి యఱువదినాల్గువిద్యలను నేర్చినదనియు, నామెకీర్తియుఁ గాలిబొటనవ్రేళ్ల గోళ్లును, ముఖమును, బూర్ణచంద్రులవలె నొప్పుచున్నదనియు భావము. చంద్రునకుఁ బదునాఱుకళలుండును. కానఁ గీర్త్యాదులగు నాలుగింటియందును నాలుగు పూర్ణచంద్రబింబము లుండుటచే 4×16=64 అఱువది నాల్గుకళలసంఖ్యకు సరిపోవుచున్నదని తెలియఁదగినది.

తా. తనకీర్తియందును, గాలిబొట్టనవ్రేళ్లగోళ్ల రెంటియందును, ముఖమునందును, షోడశకళలుగల చంద్రులు నలుగురు చంద్రులుండుటచేతనే కాబోలును దమయంతి యఱువదినాల్గు కళలును గలిగియున్నది.

చ. అని చికురాదియుం బదనఖాంతముఁగాఁ జిగురాకుఁబోఁడి నె
మ్మనమున సంస్తుతించి మనసునఁ దన్మహావిలాసకలావినిర్జితా

తనుఁడును నవ్వధూమణికిఁ దత్సమయంబునఁ జూపవేఁడియో
య్యన దిగఁద్రాఁచె భూపతి దిశాధిపకల్పిత మైనశాంబరిన్.

టీ. అసమాను...డును-అసమాన=సాటిలేని, విలాసకళా=విలాససంపదచే, వినిర్జిత = జయింపఁబడిన, అతనుఁడుఁ=మన్మథుఁడుగల, భూపతి=నలరాజు, అని=యిట్లని, చికురాదియుఁ=కేశకలాపముమొదలు, పదనఖాంతముగాఁ=కాలిగోటియొక్క యంతమువఱకు, చిగురాకుబోఁడి=చిగురువంటి శరీరము గల దమయంతిని, నెమ్మనమునఁ=నిండుమనస్సులో, సంస్తుతించి = స్తోత్రముచేసి, తత్సమయంబునఁ = ఆసమయమందు, అవ్వధూమణికిఁ = ఆదమయంతికి, చూపఁ, వేఁడి=తన్నుఁజూపుటకిష్టపడి, దిశాధిపకల్పిత=దిక్పాలురచే నిర్మింపఁబడినది,అయినశాంబరిఁ=అయినట్టి తిరస్కరణీవిద్యను, దిగఁద్రాఁచెఁ=మిక్కిలిద్రాఁచెను. అనఁగాఁ దిరస్కరిణీవిద్య నవలంబింపక యుండె నని భావము.

తా. విలాససంపదలచే మన్మథుని జయించిన నలుఁడు దమయంతిని గేశాదిగఁ బాదనఖాంతముదాఁక వర్ణించి తనస్వస్వరూపము నాసమయంబున నామెకుఁ జూపఁదలంపుగలవాఁడయి యింద్రాదు లిచ్చినతిరస్కరిణీవిద్యను ద్రాఁచిపుచ్చెను.

ఉ. భానుసమానమానగుణబంధుర బంధురమానిదాన దా
నానుకృతాంబువాహధనదాంబుదవాహన కామధేనుసం
తానకకర్ణ కర్ణసుఖదాయివచోరచనాధురీణ రీ
ణానతరాజరాజమకుటాంఘ్రిసరోరుహభావితాత్మకా. 205

టీ. భానుసమాన = సూర్యునితో సమమయినతేజస్సు కలవాఁడా, మానగుణబంధుర—మాన = చిత్తౌన్నత్యమనెడి, గుణ=గుణముచేత, బంధుర=ప్రకాశించువాఁడా, బంధు...దాన-బంధు = చుట్టాలయొక్క,రమా=లక్ష్మికి,నిదాన=కారణమయినవాఁడా, అనఁగాఁ జుట్టాలకు భాగ్యమిచ్చి పోషించువాఁడని యనుట, దాన...కర్ణ-దాన=దానముచే, అనుకృత = అనుసరింపఁబడుచున్న, అంబువాహ = నీటినివహించునది, అనఁగా మేఘమనుట, ధనద = కుబేరుఁడు, అంబుదవాహన=ఇంద్రుఁడు, కామధేను...సంతానకవృక్షము,

కర్ణ = కర్ణుఁడుగలవాఁడా, అనఁగా మామిడిసింగనామాత్యుఁడు మేఘాదులతో సమానమయినవితరణగుణము గలవాఁడనుట, కర్ణ...రీణ - కర్ణ=చెవులకు, సుఖ = సౌఖ్యమును, దాయి = ఇచ్చుచున్న, వచోరచనా = వాగ్రచనలయొక్క, ధురీణ=భారమువహించినవాఁడా, అనఁగాఁ జెవులకింపయినమాటలనాడుటయందు మిక్కిలి నేర్పుగలవాఁడనుట, రీణానతరాజ = పరాజితులై నమస్కరించుచున్నరాజులు గలవాఁడా! రాజ...త్మకా-రాజమకుట = శివునియొక్క, అంఘ్రిసరోరుహ = పదపద్మములందు, భావిత = పొందింపఁబడిన, ఆత్మకా=మనస్సుగలవాఁడా, అనఁగా నీశ్వరపాదముల ధ్యానించువాఁడనుట, రాజకిరీటములం దుంచఁబడినపాదపద్మములు గలిగి వెలయుచున్న మామిడిసింగనామాత్యా! రాజ=రాజులయొక్క, మకుట = కిరీటమందున్న, అంఘ్రిసరోరుహ=పాదపద్మములచే, భావిత=నుతింపఁబడుచున్న, ఆత్మకా=శరీరముకలవాఁడా, అని యర్థాంతరము అనఁగా రాజులందఱు వచ్చి మామిడిసింగనార్యునకు మ్రొక్కునపుడు వానిమకుటములందుఁ బాదము లుండవచ్చునని భావము.

తా. సూర్యునితో సమానుఁడవయి, చిత్తౌన్నత్యముచేఁ బ్రకాశించుచు బంధువులకుఁ దనసంపదలనొసంగుచు దానగుణముచే మేఘమును గుబేరుని జీమూతవాహునిఁ గామధేనువును, గల్పవృక్షమును గర్ణుని ననుకరించుచుఁ జెవుల కింపయినమాట లాడుచుఁ బరాజితులైనశత్రురాజులు గలవాఁడవై, శంకరునిపదపద్మముల ధ్యానించుచున్న యోమామిడిసింగనామాత్యా!

క. కమలభవవంశపావన
విమలాంతఃకరణ బాహువిక్రమకేళీ
యమళార్జునమదభంజన
సమరార్జున నిరభిసంధిసౌజన్యనిధీ. 206

టీ. కమలభవవంశపావన=బ్రహ్మవంశమును బవిత్రము చేయువాఁడా, విమలాంతఃకరణ=నిర్మలమయినమనస్సు గలవాఁడా, బాహు...భంజన - బాహువిక్రమకేళీ = భుజములపరాక్రమ మనెడి లీలయందు, యమళార్జున మదభంజన=జంటమద్దులను విరిచినవాఁడా, కృష్ణునివంటివాఁడా

యనుట, సమరార్జున=యుద్ధమందర్జునునితోఁ బోల్పదగినవాఁడా, నిరభిసంధి ...నిధీ-నిరభిసంధి=నిష్కపటమయిన-నిర్వ్యాజమయినయనుట, సౌజన్య=సుజనత్వమునకు, నిధీ = చోటయినవాఁడా.

తా. బ్రహ్మవంశమును బావనముచేయువాఁడవును, నిర్మలమగు నంతఃకరణముగలవాఁడవును, కృష్ణునితో సమాన మగుబాహువిక్రమము గలవాఁడవును, నర్జునునివలె యుద్ధముఁజేయువాఁడవును, నధికముగ సౌజన్యముకలవాఁడవును, నగు సింగనామాత్యా!

స్రగ్విణి. తల్లమాంబాసుతా ధైర్యహేమాచలా
పల్లవాదిత్యసౌభాగ్యభాగ్యోదయా
పల్లవస్త్రీకుచప్రాంతభాగద్వయీ
గల్లపాళీలసత్కామముద్రాంకురా. 207

టీ. తల్లమాంబాసుతా=తల్లమాంబికయొక్క కుమారుఁడా, ధైర్య హేమాచలా = ధైర్యగుణమునకు మేరుపర్వతమువంటివాఁడా, పల్లవా...దయా=పల్లవాదిత్య=పల్లవాదిత్యుఁడనెడి రాజుయొక్క, సౌభాగ్య=మంచిభాగ్యమువలనఁ గలిగిన, భాగ్యోదయా=భాగ్యాభివృద్ధి కలవాఁడా-అనఁగాఁ బల్లవాదిత్యునాశ్రయణమువలన భాగ్యసంపన్నుఁడయ్యెనని భావము. పల్లవ...కురా-పల్లవస్త్రీ= స్త్రీలయొక్క, కుచ= స్తనములయొక్క, ప్రాంతభాగద్వయీ = రెండుప్రాంతభాగములందును, గల్లపాళీ=చెక్కులయందును, లసత్ =ఒప్పుచున్న, కామ=మన్మథసంబంధమైన, ముద్రాంకురా=ముద్రలుకలవాఁడా, అనఁగా నధికముగా స్త్రీసుఖం బనుభవించువాఁడని భావము.

తా. స్పష్టము.

గద్యము. ఇది, శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్యపుత్త్ర సకలవిద్యాసనాథ శ్రీనాథభట్టప్రణీతం బయినశృంగారనైషధకావ్యంబునఁ దృతీయాశ్వాసము.



శ్రీరస్తు.

# శృంగారనైషధము

## చతుర్థాశ్వాసము.



మచ్చరణాంభోరుహ
చామీకరకటకఘటిత సమదారాతి
స్తోమ దయారఘురామ ర
మామందిరలసదపాంగ మామిడిసింగా. 1

టీ. శ్రీమత్ ...స్తోమ = శ్రీమత్ = శోభాయుక్తమైన, చరణాంభోరుహ = పాదపద్మములందున్న, చామీకర = బంగారపుసంబంధమయిన, కటక = కడియమునందు, ఘటిత = కూర్పఁబడిన, సమద = మదముతోఁగూడిన, అరాతి=శత్రువులయొక్క, స్తోమ=సమూహముగలవాఁడా, అనఁగా శత్రురాజులందఱీతనిపరాక్రమంబునకోర్వఁజాలకవచ్చి పాదాక్రాంతులగుచున్నారనుట. లేక, తనపాదమునందున్న కడియమునందు శత్రువుల విగ్రహములు చెక్కఁబడియుండుటచే నట్లు చెప్పఁబడెనని గ్రహించునది. దయారఘురామ=కరుణారసమునకు దశరథరామునితో సామ్యమందినవాఁడా, రమా...పాంగ - రమా=లక్ష్మీదేవికి, మందిర = నివాసస్థల మయిన, లసత్ = ఒప్పుచున్న, అపాంగ=కడకంటిచూపులు కలవాఁడా, అనఁగా లక్ష్మీసూచకము లగుచూపులుగలవాఁడనుట, [illegible]

తా. శోభాయుక్తమయిన పాదపద్మములందు వెలయుచున్న బంగారపు కడియములందుఁజెక్కించిన గర్వితులగు శత్రుసమూహములు గలవాఁడును, గరుణారసమున సముద్రమువంటివాఁడును, లక్ష్మీప్రదములగుచూపులు గలవాఁడును నగు మామిడి సింగనామాత్యా.

వ. అవధరింపు మివ్విధంబున విబుధమాయాంధకారంబు మారం బగుటయుం గట్టెదుర నాజగజెట్టి జవనికవాయం దట్టినం బొడసూపు బహురూపుతెఱంగున జలధరతిరోధానంబు వాసినం బ్రకాశించునాహిమధామునిపగిది నవిద్యావరణంబు విరిసినం దోఁచుపరమాత్మునిప్రకారంబున దోహదపలాలజాలంబువిరిసినం బ్రేక్షణీయం బగుపుండ్రేక్షుకాండంబుభంగిఁ బరమాద్భుతాస్తనిమేషముద్రుండును, నిర్ణిద్రరోమప్రరోహుండును, నిశ్చలాంగుండును, వైశాఖస్థానకలితుండును, నిర్వికారుండునునై భీమభూపాలపుత్త్రికకు నేత్రవిషయీభావంబు భజియించె. అప్పు డప్పుడమిఱేనిం గనుంగొని సంభ్రమంబును భయంబును లజ్జయు మనంబునం బెనంగొనంగ, నంగనాజనులు సమయసముత్థానఝుళంఝుళాయమానమణితులాకోటివాచాటీభవత్సభాభవనాళిందంబుగా నందఱుం బ్రత్యుత్థానంబు సేసిరి. ధీరోదాత్తగావున నయ్యాదిగర్భేశ్వరి సమున్నతకనకాసనంబున ము న్నున్నయునికిన యుండి యనిర్వచనీయం బైనయానందంబు డెందంబున ననుభవించుచు నెవ్వండ వెందుండి యేతెంచితి వెట్లు వచ్చితి వని యడుగకుండి మరలఁ జంద్రుండో యుపేంద్రుండో జయంతుండో యని సందియంబందుచు మొదల హంసంబు నరసబిసినీపలాశంబువిూఁదఁ జరణాగ్రంబున లిఖియించినరూపినం జూచి

నచిత్రరూపంబులతో రూపంబు సంఘటించుటంజేసి యీతం
డు నిషధరాజని యెఱింగియు శుద్ధాంతసదనప్రవేశంబు దు
ర్లభంబు గావున మిగుల విశ్వసింపక నిమేషనిస్స్పృహంబు
లైనవిలోచనంబుల సాద్భుతంబును సకౌతుకంబును సాను
రాగంబునుంగా విలోకించుచు. 2

టీ. అవధరింపుము=ఆలింపుము, ఇవ్విధంబునన్ =ఈవిధముగా, విబుధాంధకారంబు = దేవకలతిరస్కరిణీవిద్యాబలముచేఁ గలిగినచీఁకటి, దూరంబు అగుటయున్ = దూరమయిపోఁగా, అనఁగా నశింపఁగా ననుట, కట్టెదురన్ = ఎట్టయెదుట, అజగజెట్టి = బిరుదువేసికొన్న యానలుఁడు, జవనిక = తెరచీర, పాయందట్టినన్ = తొలఁగింపఁగా, పొడసూపుబహురూపు తెఱంగునన్ = కానవచ్చుచున్న వేషధారివలెను, జలధరతిరోధానంబు = మేఘములయొక్క ప్రతిబంధము, పాసినన్ = పోఁగా, ప్రకాశించునాహిమధాము పగిదిన్ =ప్రకాశించుచున్న చంద్రునివలెను, అవిద్యావరణంబు=అజ్ఞానమనెడి ప్రతిబంధము, విరిసినన్ =విడిపోఁగా, తోఁచు పరమాత్మునిప్రకారంబునన్ = ప్రత్యక్షమగు పరబ్రహ్మముచందంబునను, దోహదపలాలజాలంబు=దోహదము కొఱకు వేయఁబడిన ఆకుపోఁచగుంపు, విరిసినన్ = నశింపఁగా, ప్రేక్షణీయంబు=చూడఁదగినది, అగుపుండ్రేక్షుకాండంబుభంగిన్ =అయినతెల్లనిచెఱకుగడవలెను, పరమ...ముద్రుండును-పరమాద్భుత=మిక్కిలియాశ్చర్యముచే, అస్త=నాశనముచెందిన, నిమేషముద్రుండును = ఱెప్పపాటులుగలవాఁడును, అనఁగా నాశ్చర్యముచే ఱెప్పవాల్పక చూచుచుండెనని భావము నిర్భిద్రరోమప్రరోహుండును-నిర్భిద్ర=మొలకలెత్తిన లేక వికసించిన, రోమప్రరోహుండును= పులకలుగలవాఁడును, నిశ్చలాంగుండును=చలింపనిదేహముకలవాఁడును అనఁగా నాశ్చర్యాతిశయముచే నిశ్చలుఁడైయున్నాఁడనిభావము, వైశాఖస్థానకలితుండును-వైశాఖస్థాన=విలుకాఁడు నిలిచియుండు నడుగులభేదముచే,కలితుండును= ఒప్పుచున్నవాఁడును, అనఁగా నలుఁడు విలుకాఁడు నిలిచియున్నట్లు నిలిచియున్నవాఁడనిభావము, విచిత్రాకారుండును = జగన్మోహనాకారులగు నప్పటిస్త్రీలను

జూచినను వికారముచెందనివాఁడును, ఐ, భీమభూపాలపుత్రికకున్ =భీమరాజు కూఁతురగుదమయంతికి, నేత్రవిషయీభావంబు= నేత్రములకుఁ బ్రత్యక్షమగుట, భజించెన్ = పొందెను, అనఁగా దమయంతి నేత్రములకు నలుఁడు కానవచ్చె నని భావము. అప్పుడు, అప్పుడుమిఁ దనిన్ = ఆరాజును, అనఁగా నలునినను ట, కనుంగొని, సంభ్రమంబునన్ =తొట్రుపాటును, భయంబును, లజ్జయు, మనంబునన్, పెనఁగొనన్ = మల్లడిగొనుచుండఁగా, అంగనాజనంబులు= స్త్రీ జనంబులు, సమయ...అళిందంబుగాన్—సమయ = అకాలమునకుఁ దగు నట్టుగా, సముత్థాన = లేచుటచేత, ఝుళఝుళాయమాన = ఝుళఝుళమని ధ్వనిచేయుచున్న, మణి = రత్నమయమయిన, తులాకోటి = అందెలచేత, వాచాటీభవత్ = మిక్కిలిగా ధ్వనిచేయుచున్నదయిన, సభాభవన = సభా మండపమును,అళిందంబుగాన్ =నడవయుఁగలుగునట్టుగా, అనఁగా నలునిఁజూచి చెలికత్తెలందఱును దిగ్గునలేచినప్పుడు వారికాళ్ల నున్నరతనంపుటందియలు ఝుళ ఝుళమని ధ్వనులుచేయఁగా నాధ్వనులచే సభామందిరమును, దలవాకిటికిని నడిమివాకిటికి నడుమనుండు ప్రదేశమును నిండినవనిభావము. అందులోఁ గొం దఱు సిగ్గుచేతనో భయముచేతనో సభాభవనమునుండి వెడలి పైకిఁబోఁగా నా ప్రదేశముగూడ ధ్వనులతోనిండియుండుట సంభవించుటచేఁ గవి యిట్లుచెప్పె ను. అందఱున్ =చెలికత్తెలందఱును, ప్రత్యుత్థానంబు, చేసిరి=లేచిరి. అయ్యా దిగర్భేశ్వరి = భూమికి నధిపతియగునాదమయంతి, ధీరోదాత్త = గంభీర స్వభావంబు గలది, కావునన్ , సమున్నతకనకాసనంబునన్ = మిక్కిలియె త్తగు బంగారపుగద్దెయందు, మున్ను = నలునిఁజూడకపూర్వము, ఉన్నయుని కిన్+అ = ఉన్నరీతిగానే, ఉండి = కూర్చుండి, అనిర్వచనీయంబు=చెప్పఁ దరముకానిది, ఐనయానందంబు = అయినట్టి యానందమును, డెందంబునన్ = మనస్సునందు, అనుభవించుచు, ఎవ్వండవు, ఎందుండి ఏతెంచితివి = ఎచ్చ టనుండి యేరీతిగావచ్చినాఁడవు, అని, అడుగక, ఉండి=అడుగుట మానివేసి, మరలన్, చంద్రుండో, ఉపేంద్రుండో = విష్ణుమూర్తియో, కంతుండో = మన్మథుండో, జయంతుండో = ఇంద్రునిపుత్రుండగు జయంతుఁడో, అని,

సందియంబు = సంశయంబును, అందుచున్ = పొందుచు, మొదట=మొట్ట మొదట, హంసంబు, సరసబిసినీపలాశంబుమీఁదన్, సరస=రసముతోఁ గూడిన, బిసినీపలాశంబుమీఁదన్=తామరపాకుమీఁద, చరణనఖాగ్రంబునన్= కాలిగోటికొనచే, లిఖియించి = వ్రాసి, చూపినన్=కనఁబఱుపఁగా, చూచి నచిత్రరూపంబుతోన్ = చూచినట్టి చిత్తరువుబొమ్మతో, రూపంబు=ఆపురుషునిరూపను, సంఘటించుటన్ చేసి=సరిపోలుటచేత, ఈతండు = ఈపురుషుఁడు, నిషధరాజు = నలుండు, అని యెఱింగియున్ =అని తెలిసికొనియుండియును, శుద్ధాంతసదనప్రవేశంబు = అంతఃపురగృహమును బ్రవేశించుట, దుర్లభంబు = లభింపరానిది. అనఁగా నంతఃపురములోనికి వచ్చినపురుషుని నలమహారాజుగా మొదట నిశ్చయించి, తరువాత నరమాత్రునికిఁ బ్రవేశింపరానితన యంతఃపురంబులోనికిఁ నలుఁడెట్లు రాఁగలఁడని సందేహించెనని భావము. కావునన్, మిగులన్, విశ్వసింపక = నమ్మక, నిమేషనిష్ప్రహంబులు= ఱెప్పవాల్చుటయం దుపేక్షవహించినవి-అనఁగా ఱెప్పపాటులేనివనియర్థము. ఐనవిలోచనంబులన్=అయినట్టి నేత్రములచేత, సాద్భుతంబును = ఆశ్చర్యముతోఁ గూడినట్లుగాను, సకౌతుకంబును = వేడుకతోఁగూడినట్లుగాను, సానురాగంబునుగాన్ = అనురాగముతోఁ గూడినట్లుగాను, విలోకించుచున్ = చూచుచు.

తే. అతివమిథ్యావలోక నాభ్యాసకలన
నిజముగా రాజుఁ జూచియు నెమ్మనమునఁ
దాల్పదయ్యెను శాలీనతాభరంబు
తథ్యమిథ్యావివిక్తి ముగ్ధలకుఁ గలదె. 3

టీ. అతివ = దమయంతి, మిథ్యా...కలనన్—మిథ్యా = భ్రాంతిచేఁ జూడఁబడుచున్న నలుని, అవలోకన=చూచుటయందలి, అభ్యాస = అలవాటునందలి, కలనన్ = నేర్పుచే, నిజముగాన్ = సత్యముగా,రాజును, చూచియున్, నెమ్మనంబునన్, శాలీనతాభరంబున్=మిక్కిలిపిఱికితనమును, తాల్పదయ్యెను = ధరింపలేకపోయెను, ముగ్ధలకున్ = జ్ఞానహీనలకు, తథ్యమిథ్యావివిక్తి=సత్యాసత్యముల వివేకము, కలదే=కలుగునా? అనఁగాఁ గలుగదనుట.

తా. దమయంతి సంతతము నలుని స్మరించుకొనుచు భ్రాంతిచే నలరూపమునగనుఁగొనుచు నున్నదగుటచే నాయభ్యాసము చేత నేఁడు సత్యనలునిఁజూచి యును, నిజముగా నలుఁడని నిశ్చయింపలేకపోయెను. ఆలోచింపఁగా లోకములో మూఢురాండ్రికు సత్యమేదియో, యసత్యమేదియో తెలియునా? అలం- అర్థాంతరము.

ఉ. కేవలసాధ్వసంబున సఖీజను లూరక యుండఁగా మనో
భావపిధానయత్నపరిపాటి యనాదరముద్రచేఁ దిరో
భావము నొందఁ జేసి ముఖపద్మ మొకించుక వ్రాల్చి పల్కె నా
నావిధచిత్రవాక్యరచనాచణ భీమతనూజ నేర్పునన్. 4

టీ. సఖీజనులు=దమయంతి చెలికత్తెలు, కేవల సాధ్వసంబునన్=మిక్కిలి భయముచేత, ఊరక, ఉండఁగాన్=మాటలాడక యుండఁగా, మనో...పాటి-మనోభావ=మనస్సునందలి యభిప్రాయమును, పిధాన=కప్పుటయందలి, యత్న=ప్రయత్నించుటయొక్క, పరిపాటి=వరుస, లేక అనుక్రమము, అనాదరముద్రచేన్=తిరస్కారముచే, తిరోభావమున్-ఒందన్=అంతర్ధానమొందునట్లుగా, లేక, నశించునట్లుగాఁ జేసి, అనఁగాఁ బరపురుషుఁ డంతఃపురములోఁ బ్రవేశించుటవలనఁ గల్గినయవమానముచే దమయంతి తనమనంబులో నున్న యభిప్రాయమును గప్పిపుచ్చుట మానినదని భావము. ఒకించుక=ఒకకొంచెము, ముఖపద్మమున్=వదనపద్మమును వ్రాల్చి, క్రిందు సేసి, నానా...చణ-నానావిధ = అనేకవిధములగు, చిత్రవాక్య=అద్భుతవాక్కులను, రచనా=చెప్పుటచేత, చణ=ప్రసిద్ధురాలగు, భీమతనూజ=దమయంతి, నేర్పునన్=నేర్పుచేత, పలికెన్=సంభాషించెను.

తా. చెలికత్తెలు మిగుల భయముచెంది మాటలాడక యూరకుండఁగాఁ దిరస్కారముచే మనోభిప్రాయమును గప్పి పుచ్చనేరక కొంచెము ముఖంబు వ్రాల్చి యనేకవిధములగు చిత్రవాక్యము లాడుటయందు సుప్రసిద్ధురాలగు దమయంతి యిట్లు చెప్పెను.

సీ. ప్రణతమౌళిమణిప్రభానికాయంబుతోఁ
బానీయమున నర్ఘ్యపాద్య మీఁగి
యత్యంతమధురవాక్యప్రపంచములతో
శర్కరాదులమధుపర్క మీఁగి
*ప్రవిమలం బైనసద్భావవైభవముతోఁ
బృథులకాంచనరత్నపీఠ మీఁగి
పరమసేవావిధావిరచితాంజలితోడఁ
బ్రముదితం బగుమనఃపద్మ మీఁగి

తే. యాతిథేయుల కభినవయాతుఁడైన
యతిథి తనయింటి కేతెంచునపుడు చేయు
సత్క్రియాచారవిధికలాసరణి యంద్రు
ధర్మశాస్త్రోపనిషదర్థ మర్మవిధులు. 5

టీ. ప్రణత...నికాయంబుతోఁ - ప్రణత=వంచిన, మౌళి=కిరీటమండలి, మణిప్రభా=రత్నకాంతులయొక్క, నికాయంబుతోఁ=సమూహముతో, పానీయమునన్=జలముచే, అర్ఘ్య=పూజకుఁదగిన జలమును, పాద్య=పాదప్రక్షాళనమునకుఁ దగినజలమును, ఈఁగి=ఇచ్చుటయును, అనఁగా నతిథులు తనయింటికివచ్చినప్పుడు తాను కేవలము జలముచేతనే యర్ఘ్యపాద్యంబులీయక తనతల యతనిపాదములు సోఁకునట్లుగాను,దనశిరోభూషణములందున్న రత్నకాంతిసమూహ మాయతిథిపాదంబులు ప్రకాశించునట్లుగాను జేసి వినయసంపదను గూడఁ గనిపింపఁజేయవలెనని భావము. అత్యంత...ప్రపంచములతోఁ-అత్యంత=మిక్కిలి, మధుర=తియ్యని, వాక్యప్రపంచములతోఁ=వాక్య సమూహములతో, శర్కరాదులన్=పంచదార మొదలగు పదార్థములచేత, మధుపర్క

---

* ప్రణుతచూళీరత్నఘృణినికాయంబులో, అని పాఠాంతరము.

† పరిపూర్ణయౌవనప్రభవైభవముతోడ, అని పాఠాంతరము.

ము=మధురోపహారములను, ఈగి=ఇచ్చుటయు, అనఁగా నతిథులకుఁ గేవలము పంచదార మొదలగువానిచేత నే తృప్తిపొందింపక, శ్రావ్యములై మధురములై, మృదువులయియున్న వచనరచనలచేతఁగూడఁ దృప్తిపొందింపవలయును. ప్రవిమలంబు=మిక్కిలి నిర్మలమైనది, ఐన సద్భావవైభవముతోఁ=అయినట్టి మంచిస్వభావముయొక్క సమృద్ధితో, పృథుల...పీఠము-పృథుల=గొప్పదయిన, కాంచనరత్న=బంగారముతోను రత్నములతోను జేయఁబడిన, పీఠము=ఆసనము, ఈగి=ఇచ్చుటయును, అనఁగా అతిథులు వచ్చినప్పుడు బంగారుపీఠమును మాత్రమే యీయక నిర్మలమగు తన సుస్వభావమును గూడ నీయవలయును, పరమ...తోడన్...పరమ=అధికమయిన, సేవావిధా = సేవలయందుండెడి రీతులచేత, విరచిత=కట్టఁబడిన, అంజలితోడన్=దోసిలితో, ప్రముదితంబు=మిక్కిలి సంతోషము గలది, అగుమనఃపద్మంబును = అయినట్టి హృదయపద్మమును, ఈగి=ఇచ్చుటయును. అనఁగా నతిథులకు దోసిటితోఁ బుష్పంబుల నర్పించుటయే కాక తనమన స్సనెడిపద్మమును సంతోషపూర్వకముగా నర్పింపవలయునని భావము. లేక, తన మనఃపద్మము నిచ్చునప్పుడు పలురకములగు సేవలుచేయుచు, దోసిలికట్టి వినయమును జూపవలెనని భావము. అభినవాయాతుఁడు = క్రొత్తగా వచ్చినవాఁడు, ఐనయతిథి = అయినట్టియతిథి, తమయింటికిన్, ఏతెంచునప్పుడు = వచ్చునప్పుడు, అతిథేయులకున్ = గృహస్థులకు, చేయు... సరణి-చేయు=చేయునట్టి, సత్క్రియా=సత్కారములను, ఆచార=ఆచరించుటయనెడి, విధి = పనియొక్క, కలాసరణి = చాతుర్యముయొక్క రీతియని, అనఁగా గృహస్థులాచరింపవలసిన పనులని భావము. ధర్మ...విదులు—ధర్మశాస్త్ర=ధర్మశాస్త్రముల యొక్కయు, ఉపనిషత్=వేదాంతవాక్యముల యొక్కయు, అర్థ = అర్థములందలి, మర్మ=రహస్యములను, విదులు=తెలిసినవారు, అంద్రు=చెప్పుదురు.

తా. ధర్మశాస్త్రరహస్యములను, వేదాంతరహస్యములను, దెలిసినపండితులు, క్రొత్తగా నతిథులు తమయింటికి వచ్చునప్పుడు తమశిరస్సు నతిథిపాదములకు సోఁకునట్లు మ్రొక్కి తమశిరోరత్నకాంతులచే నతిథిపాద

ములను ప్రకాశింపఁజేయుచు నర్ఘ్యపాద్యముల నిచ్చుటయు, శర్కరాదులచే మధూపహారము లిచ్చునప్పుడు మిక్కిలి మధురమగు వాక్యముల నుడువుటయు, మిక్కిలి మంచిస్వభావముతోఁ గాంచనమయమును రత్నమయమును నగుపీఠము నిచ్చుటయును, బలురకము లగుసేవలను జేయుచు దోసిలి కట్టి తమమనఃపద్మముల నతిథుల కర్పించుటయు, నీమొదలగునవి చేయుట, గృహస్థులకు సత్కారముల నాచరింపఁదగినరీతి యని పలుకుదురు.

తే. అనఘ! యిదె హేమరత్నసింహాసనంబు
   నిచ్చ గలదేనిఁ గూర్చుండు మిందు వచ్చి
   కాక కార్యాంతరాసక్తికారణముగ
   నేఁగఁ దలఁచినవాఁడవొ యెచటి కైన. 6

టీ. అనఘ=పాపములేనివాఁడా! హేమరత్నసింహాసనంబు = బంగారము చేతను రత్నములచేతను నిర్మింపఁబడిన సింహాసనము, ఇదె=ఇదిగో, ఇచ్చగలదేని=ఇష్టమున్నచో, ఇందు=ఇచ్చటికి, వచ్చి, కూర్చుండుము, కాక=అట్లు కానిచో, కార్యా...ముగన్-కార్యాంతర=మఱియొక కార్యమందలి, ఆసక్తి =శ్రద్ధయొక్క, కారణముగన్=కారణముండుటచే, అనఁగా మఱియొక కార్యము నెఱవేర్చుకొనవలెనని యాసక్తి యుండుటవలన నని భావము, ఎచటికిన్ ఐనన్=ఏప్రదేశమున కైనను, ఏఁగన్ తలఁచినవాఁడవు ఓ = వెడలఁ దలంచి యున్నావా?

తా. పాపరహితుఁడ వగునోపురుషవరేణ్యా! బంగారపుసింహాసన మిదిగో, ఇష్టమున్నచో వచ్చి కూర్చుండుము. లేక మఱియొక కార్య ముండుటవలన నెచ్చటికైన నేఁగఁదలంచియున్నావా?

తే. నవశిరీషసుమంబులకైనవకమునకు
   నన్నదమ్ములు వోనినీయడుగుఁదమ్ము
   లెంతదూరంబు నడపింపనిచ్చగించె
   నొకొ? నిర్దయ మైననీయుల్ల మిపుడు. 7

టీ. నవశిరీషసుమంబుల నవకమునకున్—నవ = నూతనములయిన, శిరీష సుమంబుల=దిరిసెనపు పువ్వులయొక్క, నవకంబునకున్=మార్దవమునకు, అన్న దమ్ములు వోని=అన్నదములవలె నున్న, అనఁగా శిరీషపుష్పములవలె మిక్కిలి మృదులములయినవని భావము, నీయడుగుఁదమ్ములు = నీపాదపద్మములను, నిర్ద యము=దయలేనిది, ఐననీయుల్లము=అయినట్టి నీహృదయము, ఇపుడు=ఈ సమయమందు, ఎంతదూరంబు, నడిపింపన్ = నడుచునట్లు చేయుటకు, ఇచ్చ గించెన్ ఒక్కో=తలంచెనో కో, అనఁగా నీవిపుడింకను నెంతదూరమేఁగెదవని భావము.

తా. ఓపురుషవరేణ్యా! కోమలములగు శిరీషపుష్పంబులవలె నతిమృదుల ములయి యున్ననీపాదపద్మములను కఠినమయిననీమానస మెంతదూరము దాఁక నడిపింపఁదలంచెనో చెపుమా ?

సీ. ఏదేశముననుండి • యెచ్చోటి కేఁగెదు
సంకేత మెయ్యది • సంజ్ఞ నీకు
రక్షాధికృతజన • వ్రాతపాలిత మైన
శుద్ధాంత మెబ్బంగిఁ • జొచ్చితిపుడు
ఫలమేమియొక్కో యీ • పటుసాహసమునకు
మము గృతార్థలఁ జేయు • క్రమము దక్క
నాభీలదావారి • కాంధంకరణి యైన
శక్తి నీ కేవిద్య • సంభవించె.

తే. ఐలుఁడవొ యైలబిలుకూర్మి • యాత్మజుఁడవొ
పంచబాణుండవో దేవ • పతిసుతుఁడవొ
చంద్రుఁడవొ యింకఁ జెక్కు • భాషణము లేల
నిజము దప్పక చెప్పుము • నిషధపతివొ. 8

టీ. ఏదేశముననుండి = ఏస్థలంబుననుండి, ఎచ్చోటికిన్, ఏఁగెదవు = వెళ్లె

దవు. నీవు, సంకేతము = నిర్ణీతమైనదగు, సంజ్ఞ=పేరు, ఎయ్యది=ఎటు వంటిది, రక్ష...పాలితము—రక్షా=సంరక్షించుటయందు, అధికృత=అధికార ముగల, జన=జనులయొక్క, వ్రాత = సమూహముచేత, పాలితము=పరిపాలింపఁబడినది, అనఁగా రక్షకభటులచే రక్షింపఁబడుచున్నదని భావము. ఐన, శుద్ధాంతము = అయినట్టి యంతఃపురము, ఇపుడు, ఎబ్భంగిన్ = ఏరీతిగా, చొచ్చితి=ప్రవేశించితివి. మమున్=చెలికత్తెలను దన్నుననుట, కృతార్థలన్ = కృతకృత్యలఁగా, చేయుక్రమము=చేయునట్టిరీతి, తక్కన్, ఈపటుసాహసంబునన్=రక్షకభటులకుఁ గానరాకుండ నంతఃపురంబును బ్రవేశించుట యనుసాహసకృత్యమునకు, ఫలము=ప్రయోజనము, ఏమియొక్కొ=ఏమిటియో, అనఁగా నీరాకకుఁ బ్రయోజనము నన్నును నాచెలికత్తెలను గృతకృత్యలఁగాను బవిత్రురాండ్రఁగాను జేయుట యనునొకటి స్పష్టము. అంతియకాక రక్షకభటుల నతిక్రమించి యంతఃపురంబులోఁ బ్రవేశించుటకు మఱియు నేమి ప్రయోజనమో తెలియకున్నది. ఆభీల...కరణి—ఆభీల=భయంకరులైన, దౌవారిక=ద్వారపాలురకు, అంధంకరణి=గ్రుడ్డివారలనుగాఁ జేయునది, ఐనశక్తి= అయినట్టి సామర్థ్యము, నీకున్, ఏవిద్యన్=ఏవిద్యచేత, సంభవించెన్=కలిగెను. ఐలుఁడవో=పురూరవశ్చక్రవర్తివో? ఐల...యాత్మజుఁడవో = కుబేరుని ముద్దుకుమారుఁడగు నలకూబరుఁడవో? పంచబాణుండవో = మన్మథుండవో? దేవపతిసుతుఁడవో = దేవేంద్రునికుమారుఁ డయిన జయంతుఁడవో? చంద్రుఁడవో=చందమామవో? ఇంకన్, పెక్కుభాషణంబులు = పెక్కుమాటలు, ఏల=ఎందుకు, నిషధపతివో=నలమహారాజవో? నిజము = సత్యము, తప్పక= తప్పిపోకుండ, చెప్పుము=తెలియఁబఱుపుము.

తా. ఓమహాత్మా! నీవెందుండివచ్చుచున్నావు? ఎచ్చటికేఁగుచున్నావు? నీపేరేమి? రక్షణోద్యోగమందున్న జనసమూహములచేఁ బాలింపఁబడుచున్న యీయంతఃపురము నెట్లు చొచ్చితివి? నీవు మమ్ములఁ గృతార్థురాండ్రనుగా జేయుటకే కాక మఱియు నెందులకు నీ యీసాహసకృత్యమునకుఁ జేసితివో. దౌవారికులనందఱను గ్రుడ్డివారలనుగాఁ జేయునంతటిశక్తి నీకెట్లు లభించినది?

నీవు పురూరవశ్చక్రవర్తివా? నలకూబరుఁడవా? మన్మథుండవా? జయంతుండవా? చంద్రుండవా? లేక నలమహారాజవా? అసత్యమాడకుండఁ జెప్పుము.

క. ఆరయ నీయుదయమునకుఁ
గారణ మై యేకులంబు ? గాంభీర్యమునం
దారాపతిఁ గన్న పయః
పారావారంబుతోడఁ ? బ్రతిఘటియించెన్. 9

టీ. ఆరయన్ = ఆలోచింపఁగా, నీయుదయమునకున్ = నీపుట్టుకకు, కారణమై = హేతుభూతమై, ఏకులంబు = ఏవంశము, గాంభీర్యమునన్ = గాంభీర్యగుణముచే, తారాపతిన్ = చంద్రుని, కన్న పయఃపారావారంబుతోడన్=కనినపాలసంద్రముతో, ప్రతిఘటియించెన్ = సామ్యమునుజెందెను? అట్టినీవంశ మేదని యభిప్రాయము.

తా. పురుషవరేణ్యా! నీవేకులంబుననుదయించితివి? ఆలోచింపఁగానాకులము గాంభీర్యగుణముచేఁ జంద్రునిఁ గాంచినపాలసముద్రమును బోలుచున్నది?

తే. మానవుఁడ వైతివేని నిమ్మహి కృతార్థ
విబుధలోకంబె లోకంబు ? వేల్పవేని
భువనములకెల్ల మీఁదధోభువన మీవు
భుజగరాజాన్వయమునందుఁ ? బుట్టితేని. 10

టీ. నీవు, మానవుఁడవు, ఐతివేని=అయినచో, ఇమ్మహి=ఈభూమి, కృతార్థ=చరితార్థమైనది, లేక, నీవు, వేల్పవేని=దేవతవైనచో, విబుధలోకంబె = దేవలోకమే, లోకంబు=మంచిలోకము, ఈవు, భుజగరాజాన్వయమునన్ = సర్పరాజవంశమందు, పుట్టితి వేని=పుట్టినచో, అనఁగా నీవు నాగకుమారుఁడవయినచోననుట, అధోభువనము=పాతాళలోకము. భువనములకున్, ఎల్లన్=లోకములకన్నిటిలోను, మీఁదు=ఉన్నతమయినది అనఁగా శ్రేష్ఠమైనదనుట.

తా. ఓమహాత్మా! నీవుమానవుఁడవా! అట్లయిన నీభూలోకము కృతార్థమయినది. కాక నీవు దేవతవైనచో స్వర్గలోక మన్నిలోకములకంటె శ్రేష్ఠమైన

దేయగును. అట్లుకాక నీవు సర్వరాజువంశమందుఁ బుట్టినచోఁ బాతాళలోకము పవిత్రమైనది.

ఉ. వానిఁ బ్రశంససేయఁదగు • వాఁడు కృతార్థతముండు వానిచే
నీనిఖిలంబు పావన మ•హీనకృపావిభవం బెలర్ప నె
వ్వానిగృహాంగణంబునకు • వచ్చినత్రోవరజంబులందు నీ
మానితపాదయుగ్మక మ•మర్చుఁ బ్రఫుల్లసరోజదామమున్.

టీ. అహీనకృపావిభవంబు=గొప్పదయాసమృద్ధి, ఎలర్పన్ =ఒప్పునట్లుగా, ఎవ్వానిగృహాంగణంబునకున్ = ఏమనుష్యునియొక్క యింటిముంగిలి వాకిటికి, వచ్చినత్రోవరజంబులందున్ =వచ్చినట్టిమార్గమందున్న ధూళులయందు, నీమానితపాదయుగ్మకము=పూజనీయమయిన నీపాదద్వంద్వము, ప్రఫుల్లసరోజదామమున్ =వికసించినపద్మములయొక్క మాలికను, అమర్చున్ =కూర్చునో, అనఁగా నెవరియింటికినీ వేఁగుదువోయనిభావము. ఇట 'పాదయుగ్మము తామరపూవుల మాలికను గూర్చు చున్న'దనిచెప్పుటచే నతనిపాదములు తామరపూవులను బోలు చున్నవనియు ధూళులందు నడిచినచ్చుటచే నాజాడలు పద్మమాలికను బోలు చున్నవనియుఁ దెల్లమగుచున్నది. వానిన్ =ఆపురుషుని, ప్రశంస చేయన్ తగున్ = స్తోత్రముచేయవచ్చును, వాఁడు=ఆపురుషుఁడు, కృతార్థతముండు= మిక్కిలికృతార్థుఁడైనవాఁడు, వానిచేన్ =అట్టిపురుషునిచే, ఈనిఖిలంబు = ఈసమస్తమును, పావనము=మిక్కిలి పవిత్రమైనది.

తా. ఓపురుషసత్తమా ! అధికమగుదయారస మొప్పునట్టుగా నెవరియింటి యొక్క ముంగిలి వాకిటియందున్న ధూళులందు నీపాదయుగళము వికసించిన తామరపువ్వులమాలికను విరచించునో, వాఁడే కొనియాడఁదగినవాఁడు. వాఁడే కృతార్థుఁడు. వాఁడేయీసమస్తమును బవిత్రముగాఁ జేయఁదగినవాఁడు.

వ. గుణాద్భుతం బైనపదార్థంబు వర్ణింపకునికి యసహ్యాశల్యం బైనవాగ్జన్మవైఫల్యంబు. ధూర్జటిజటాకిరీటాలంకారం బైన శశాంకునిసౌకుమార్యంబును నమృతంబునకు నుత్పత్తిస్థా

నం బగుపయోనిధానంబుగాంభీర్యంబును విశ్వవిశ్వంభ
రాంభోజకర్ణికాయమానం బగుసువర్ణాహార్యంబుధైర్యం
బును విభ్రమభ్రూలతాభంగలీలావిజితసుమనస్సాయకవిలా
సరేఖాసారంబై నిర్వికారంబై నయాకారం బెవ్వరియందును
గలదె? మేము కృతార్థుల మైతిమి. మాజన్మంబులు సఫలం
బులయ్యె. మావిలోచనంబులు భాగ్యంబులు సేసె. వీనులు
భవదుదంతశ్రవణకుతూహలాధీనంబు లయి యున్నయవి
వాగమృతంబు వానికిం బ్రసాదింపు మనుటయు. 12

టీ. గుణాద్భుతంబు=గుణములచే నాశ్చర్యకరమైనది, ఐనపదార్థంబుగా=
అయినట్టివస్తువును, వర్ణింపక, ఉనికి=వర్ణనముచేయకుండుట, అసహ్యశల్యం
బు=సహింపఁదరముకాని శల్యమయినది, ఐనవాగ్జన్మవైఫల్యంబు=అయినట్టివా
క్కులయొక్కయు జన్మముయొక్కయు వ్యర్థత్వమైనదియే - అనఁగా లోకమున
వర్ణింపఁదగినవస్తు వున్నప్పుడు దానిఁజూచి వర్ణింపకుండుట హృదయశల్యము
వలె సహింపరానిదయి యుండును, మఱియు నట్లు వర్ణింపనివాని వాగింద్రియ
మును జన్మంబును వ్యర్థములే. ధూర్జటి...కారంబు—ధూర్జటి = ఈశ్వరుని
యొక్క, జటా=జటలకును, కిరీట=కిరీటంబునకును, అలంకారంబు=భూషణ
మైన, శశాంకునిసౌకుమార్యంబును=చంద్రునియొక్క మృదులత్వమును, అమృ
తంబునకుగా, ఉత్పత్తిస్థానంబు=పుట్టునకుఁ జోటయినది, అగుపయోనిధానం
బు=అయినట్టిపాలసంద్రముయొక్క, గాంభీర్యంబును = లోఁతు గలిగియుండు
టను, విశ్వ...మానంబు-విశ్వ=సమస్తమయిన, విశ్వంభరా= భూమియనెడి,
అంభోజ=పద్మమునకు, కర్ణికాయమానంబు=తామరపూవుదుద్దువలె నున్నది,
అనఁగాఁ బద్మాకారముగల భూమండలమునకుఁ గర్ణికవలె నొప్పుచున్నదని భావ
ము. అగుసువర్ణాహార్యంబు=అయినట్టి బంగారుకొండయొక్క, ధైర్యంబును=
నిశ్చలత్వమును, అనఁగాఁ బూర్వులు భూమికిమధ్యంబున బంగారుకొండగల
దనియు, నది భూమియనెడి పద్మమునకు దుద్దువలె నొప్పుచున్నదనియు నది

సమస్తపర్వతములలోను నుత్కృష్టమయినదనియును జెప్పుదురు. పూర్వులలో నెకొందఱుభూమధ్యరేఖయే మేరుపర్వతమనిచెప్పుదురు. దానియొక్కనిశ్చలత్వమునునవిభావము. విభ్రమ...సారంబు-విభ్రమ=విలాసములుగల, భ్రూలతాభంగ=లతవంటి కనుబొమలయొక్క ముడిచేతను, లీలా=విలాసముగా, విజిత=జయింపఁబడిన, సుమనస్సాయక=పూవులే బాణములుగాఁ గలవానియొక్క, అనఁగామన్మథునియొక్కయనిభావము. విలాసరేఖా=లీలాసమృద్ధియొక్క, సారంబై=నిగ్గుగలదై, నిర్వికారంబు=వికారములులేనిది, ఏనయాకారంబు=అయినట్టిరూపము, ఎవ్వరియందును=ఎవరియందైనను, కలదె=కలుగునా? అనఁగా విలాససమృద్ధిచే విలాసముగా మన్మథుని జయింపఁ జాలిననీసుందరరూపము మఱెవ్వరియందును లేదనిభావము. మేము, కృతార్థులము, ఐతిమి, మాజన్మంబులును=మాపుట్టువులును, సఫలంబులు=ఫలముతోఁ గూడినవి, అయ్యెన్, మావిలోచనంబులు=మానేత్రములు, భాగ్యంబులు=శుభకర్మములను, చేసెన్, వీనులు=మాచెవులు, భవత్...ధీనంబులు. భవత్=నీయొక్క, ఉదంత=వృత్తాంతమును, శ్రవణ=వినుటయందు, కుతూహల=వేడుకకు, అధీనంబులు=లొంగినవి అయి, ఉన్నయవి, వాగమృతంబు=నీవాక్యసుధారసమును, వానికిన్=ఆచెవులకు, ప్రసాదింపుము అనఁగా వీనులవిందు గొలిపెడి నీచరిత్రమును దెలుపుమని భావము. అనుటయున్=అని చెప్పఁగా.

ఉ. అంకిలి లేక యప్పు డరుణాధరపల్లవనిర్గతంబు లై [వ్రా
పంకరుహాయతాక్షినునుఁబల్కులు తేనియలొల్కుచున్ శ్ర
లాకృతు లై నృపాలుమది లగ్నములయ్యె వినోదలీలకై
మం కెనపూవుచాపమున మన్మథుఁ డేసినతూపులోయనన్.

టీ. అప్పుడు=ఆసమయమందు, అంకిలి లేక=అడ్డు లేకుండ, అరుణాధరపల్లవనిర్గతంబులు-అరుణ=ఎఱ్ఱని, అధరపల్లవ=చిగురువంటి యధరోష్ఠమునుండి, నిర్గతంబులై=బయలువెడలినవై, పంకరుహాయతాక్షి=పద్మమువలెవిశాలములగునేత్రములు గలదమయంతియొక్క, నునుఁబల్కులు=మృదువచనములు, తేనియలు, ఒల్కుచున్=స్రవించుచు, శ్రవోలంకృతులై=చెవులకలంకారభూ

తములై, నృపాలుమదిన్=నలరాజుచిత్తమందు, వినోదలీలకై=వినోదార్థమై, మంకెనపూవుచాపమునన్= మంకెనపూవనెడి వింటివలన, మన్మథుఁడు, ఏసిన తూపులో అనన్=ప్రయోగించినబాణములో యనునట్లు, లగ్నములయ్యెన్=తాఁకెను. ఇటనెజ్జనియధరోష్ఠమునుండి వెలువడుచున్నమాటలు మంకెనపూవు వింటినుండి ప్రయోగించుబాణములవంటివాయెనని చెప్పుటచే దమయంతిమాటలు నలునికిమన్మథబాణములవలెనే మోహమునముంచెనని తెలియవచ్చుచున్నది. దమయంతి యధరోష్ఠము మంకెనపూవుతోఁ బోల్పఁబడెను. మాటలు మదన బాణములతోఁ బోల్పఁబడెను.

తా. ఆసమయమున నిరాటంకముగా నెజ్జనియధరోష్ఠమునుండి బయలు వెడలినదమయంతివచనంబులు తేనియలను స్రవింపఁజేయుచుఁ జెవుల కలంకారము లయి మన్మథుఁడు; వినోదముకై మంకెనపూవులను విల్లుగాఁజేసికొని ప్రయోగించినబాణములవలె నలరాజుమనసునందు సక్తమాయెను.

వ. అనంతరంబ దమయంతీశాసనంబున సఖీజనంబు కనకాసనంబు నెట్టిన. 14

టీ. సులభము.

ఆ. అవ్వరాసనంబునందు నాసీనుఁడై
యర్కుఁ డుదయశిఖరియందుఁబోలెఁ
గొనియె నిషధరాజు వనజాతముఖులచే
నాతిథేయ మయినయర్ఘ్యపూజ. 15

టీ. అర్కుఁడు=సూర్యుఁడు, ఉదయశిఖరియందుఁ బోలెన్=ఉదయపర్వతమునందువలెను, అవ్వరాసనంబునందున్=దమయంతిచెలికత్తెలిచ్చినయాబంగారపుసింహాసనమునందు, ఆసీనుఁడై= కూర్చుండినవాఁడై, నిషధరాజు=నలుఁడు, ఆతిథేయము=అతిథులకుఁ దగియున్నది, అయినయర్ఘ్యపూజ=అయినట్టియోగ్యమయినపూజను, వనజాతముఖులచేన్ = పద్మములవంటిముఖములుగల దమయంతిచెలికత్తెలచేత, కొనియెన్=స్వీకరించెను.

తా. ఆసమయంబున నుదయపర్వతశిఖరంబునందు సూర్యునివలె నలరాజు దమయంతి చెలికత్తె లిడినబంగారపుసింహాసనమునందుఁ గూర్చుండి ప్రకాశించుచు నతిథులకుఁ దగినయోగ్యమయినపూజను స్వీకరించెను.

వ. ఇట్లు సంభావితుండై యంభోరుహాక్షులు తన్నుఁ వీక్షించుచు సంజాతకౌతుకంబున వింజమాఁకిడినభంగి నూరకుండ నప్పుణ్యశ్లోకుండు ప్రావృషేణ్యపయోధరధ్వానగంభీరం బైన యెలుంగున దమయంతి నుద్దేశించి. 16

టీ. ఇట్లు=ఈరీతిగా, సంభావితుండై=గౌరవింపఁబడినవాఁడై, అంభోరుహాక్షులు=పద్మమువంటికన్నులు గలచెలులు, తన్నున్, వీక్షించుచు=చూచుచు, సంజాతకౌతుకంబునన్=పుట్టినవేడుకచే, వింజము= వింధ్యపర్వతము, ఆఁకిడినభంగిన్=నిరోధింపఁబడినట్టుగా ఊరకుండన్=మాటలాడకయుండఁగా, ఆప్పుణ్యశ్లోకుండు=పుణ్యమయినకీర్తిగల యానలరాజు, ప్రావృషే...గంభీరంబు= ప్రావృషేణ్య=వర్షాకాలసంబంధమయిన, పయోధర = మేఘముయొక్క, ధ్వాన=శబ్దమువలె, గంభీరంబు, ఐనయెలుంగునన్=అయినట్టికంఠధ్వనితో, దమయంతిని ఉద్దేశించి=దమయంతినిగూర్చి, అని పైపద్యముతో నన్వయము.

సీ. ఏను దిక్పతులయాశ్రీస్థానంబునందుండి
యరుగుదెంచితి నీకు శ్రీ నతిథి నగుచుఁ
బ్రాణంబులునుబోలె శ్రీ నంతరంగమునందుఁ
దత్కార్యభరమును శ్రీ దాల్చినాఁడఁ
జరితార్థమును జేయఁ శ్రీ జనునాదుదూత్యంబు
నాతిథ్యసత్కార శ్రీ మదియ నాకుఁ
గాలయాపన సేయఁ శ్రీ గాదు నిశ్చయముపైఁ
గర్తవ్యమగునట్టిశ్రీ కార్యమునకు

తే. నుల్ల మిప్పు డేకాగ్ర మై శ్రీ యున్నయదియొ?
యవసరం బౌనె? దేవరశ్రీహాస్యమునకు

వింతవారలు లేరుగా ? నింత నంత
నువిద! మనవార లే కదా ? యున్న వారు.　　17

టీ. ఏను, దిక్పతులయాస్థానంబునందుండి=దిక్పాలు రగునింద్రాగ్నియమ వరుణులయాస్థానంబునుండి, నీకుఁ, అతిథిని, అగుచుఁ, అరుగుదెంచితిని = వచ్చితిని, అనఁగా దిక్పాలురసభనుండి నీవలనఁ గార్యము నెఱవేర్చుకొనుని మిత్తము నీయొద్దకు వచ్చితిని, అంతరంగంబునందుఁ = హృదయమందు, ప్రాణంబులునుబోలెఁ = ప్రాణములనువలె, తత్కార్యభరమును=ఆదిక్పాలురకార్య మనుబరువును, దాల్చినాఁడఁ=చేయ నిచ్చగించితిని, అనఁగాఁ దా నెఱవేర్చుకొనవచ్చినపని తనప్రాణమువంటి దని చెప్పుటచే నది తనకు మిక్కిలి ప్రియ మయినపయినట్టు తోఁచుచున్నది. నాదుదూత్యంబు=దూతనై వచ్చిననాకార్యంబు,చరితార్థమునుఁ=సఫల మగునట్టుగా, చేయఁ చనుఁ = చేయఁదగును, అదియ=అట్లు చేయుటయే, నాకుఁ, అతిథ్యసత్కారము= అతిథిపూజాసత్కారము, కాలయాపన = వృథాగాఁ గాలమును బుచ్చుట, చేయఁ=చేయుటకు, కాదు. అనఁగాఁ గాలమును వృథచేయుటవలనఁ బ్రయోజనము లేదు. నిశ్చయము=నిక్కము, పైఁ=మీఁద, కర్తవ్యము=చేయఁదగినది, అగునట్టికార్యమునకుఁ=అయినట్టిపనికి,ఉల్లము=చిత్తము, ఇప్పుడు, ఏకాగ్రమై=నిశ్చలమై, ఉన్నయదియే=ఉన్నదా? దేవరహస్యమునకుఁ=దేవతలు పంపినరహస్యవార్తను వినుటకు, అవసరంబు=సమయము,ఔనె=అగునా, ఇంతఁ అంతఁ=ఈపాటి యాపాటి, దూరములో, వింతవారలు=క్రొత్తవారలు, లేరుగా=లేరుగదా, ఉవిద=దమయంతి, ఉన్నవారు = ఇచ్చట నున్నవారు, మనవారలే కదా?

తా. ఓ సుందరీ! నేను దిక్పతులయాస్థానమునుండి యొకకార్యము నెఱవేర్చుకొన నీయొద్ద కేతెంచితిని. ఆదేవతలకార్యమును నాప్రాణమువలెఁ జూచుకొనుచుందును, కాన నాదూతకార్యము నేఁఱవేర్పవలెను. అట్లు నెఱవేర్చుటయే నా కతిథిసత్కారము. అంతకంటె మఱియేదియు లేదు. కాలయాపనము చేయుటకు వలనుపడదు. నామాట నిశ్చయము. ముందు జరు

గవలసినపనికై నీచిత్తము స్థిరమై యున్నదియా? దేవతలరహస్యములను దెలియఁజేయనిది సమయమగునా? ఈసమీపమునఁ గ్రొత్తవార లెవ్వరును లేరుగదా? ఇచ్చట నున్నవారందఱును మనవారలే యగుదురా?

క. నాకౌకఃప్రవరులు ని
న్నాకాంక్షించినప్రయోజనాంశము దిర మై
యాకర్ణింపుము చెప్పెద
నాకర్ణపుటాయతాక్షి! యవధానమునన్. 18

టీ. ఆకర్ణపుటాయతాక్షి = చెవులపర్యంతమును వ్యాపించియున్న కన్నులు గలదమయంతీ, నాకౌకఃప్రవరులు= స్వర్గమేస్థానముగాఁ గలవారు అనఁగా దేవత లనుట, వారిలో శ్రేష్ఠు లగు నింద్రాగ్నియమవరుణులు, నిన్నున్, ఆకాంక్షించిన ప్రయోజనాంశము=కోరుకొనుచున్న సమాచారమును, చెప్పెదన్=చెప్పుచున్నాను, తిరమై=నిశ్చలముగానుండి, అవధానమునన్=సావకాశముగా, ఆకర్ణింపుము=ఆలకింపుము.

తా. కర్ణపుటములవఱకు వ్యాపించినకన్నులు గల దమయంతీ! యింద్రాగ్నియమవరుణులు నిన్ను వరింపఁదలంచుకొని నీకుఁ గొన్నివార్తలు పంపినారు. వాని నీకుఁ దెలియఁజెప్పెద; సావకాశముగా నాలకింపుము.

వ. పాకశాసనపావకపరేతరాజపాశపాణులు పుత్తేరం బని వూని వచ్చితి. చిత్తగించి యక్కార్యంబు వినుము. అప్పరమపురుషులు పరిషన్మధ్యంబునం బంకజాసనుతనూభవునివలనం ద్రిభువనమోహనంబులైననీరూపలావణ్యవిలాసవిభ్రమాది గుణంబులు విని వినుకలివలవంత నెంతయుఁ జలించి పంచేషులుంఠితధైర్యవిత్తంబు లగుతమచిత్తంబులం గలవృత్తాంతంబు లంతయుం దెలియంజెప్పిరి. ఇప్పు డయ్యాశాపతులాశాపాశంబులఁ గట్టువడినారు. వారియందును సంక్రందనుండు. 19

టీ. పాక...పాణులు=పాకశాసన=పాకుఁడనురాక్షసునిఁ జంపినవాఁడు, అనఁగా నింద్రుఁ డనుట, పావక=అగ్నిహోత్రుఁడు, పరేతరాజ=యముఁడు, పాశపాణులు=పాశము హస్తమందుఁ గలవారు. అనఁగా నింద్రాగ్నియమ వరుణు లనుట, పుత్తేరఁగ=పంపగా, పని పూని=కార్యము గలిగి, వచ్చితిఁగ, చిత్తగించి=చిత్తమును సావకాశముగఁ జేసికొని, అక్కార్యంబుఁగ=ఆకార్యమును, వినుము. అప్పరమపురుషులు=ఆపురుషశ్రేష్ఠులు, పరిషన్మధ్యంబునఁగ=సభామధ్యంబునందు, పంకజాసనుతనూభవువలనఁగ=బ్రహ్మకుమారుఁ డగునారదునివలన, త్రిభువనమోహనంబులు=ముల్లోకంబులను మోహింపఁజేయఁ జాలినవి. వివ...గుణంబులు-నివ, నీయొక్క, రూప=ఆకారము, లావణ్యా=సౌందర్యము, విలాస=శృంగారచేష్టలు, విభ్రమ=లీలలు, ఆది=మొదలుగాఁగల, గుణంబులు,విని=ఆలకించి, వినుకలివలవంతఁగ=వినుటవలనఁబుట్టినమన్మథబాధచే, ఎంతయుఁగ=మిక్కిలి,చలించి=పీడితులయి,పంచేషు...విత్తంబులు-పంచేషు=అయిదుబాణములు గలమన్మథునిచే, లుంఠిత=అపహరింపఁబడిన, ధైర్యవిత్తంబు=ధైర్యమనెడిధనము గలవి, అగు తమచిత్తంబులఁగ=అయినట్టి తమ మనస్సులందు, కలవృత్తాంతంబులు, అంతయుఁగ=ఉన్నట్టి వృత్తాంతముల నెల్లను, తెలియఁగ చెప్పిరి=విశదమగునట్లు చెప్పిరి. ఇప్పుడు, ఆయ్యాశాపతులు=ఆదిక్పాలురు, ఆశాపాశంబులఁగ=ఆశ లనెడిపాశములచేత, కట్టుపడినారు=బంధింపఁబడిరి. అనఁగా నీవు తమ్మును వరించి సుఖము కలిగింతుననునాశ గలవారైరని భావము. వారియందును=ఆదిక్పాలురయందును, సంక్రందనుండు=దేవేంద్రుండు.

తే. నందనోద్యానవీథికాంతరములందుఁ
బూర్ణచంద్రాస్య! విహరింపఁ బోవ వెలుచుఁ
గల్పతరుపల్లవంబులు గమిచి మేసి
కోకిలం బెప్డు గూయునో కొసరి యనుచు. 20

టీ. పూర్ణచంద్రాస్య=పున్నమచందమామవంటిముఖము గల యోదమయంతీ! కల్పతరుపల్లవంబులు=కల్పవృక్షములచిగుళ్లు, కమిచి=కబళించి, మేసి=

తిని, కొసరి = ఒక్కొక్కటిచొప్పున, కోకిలంబు, ఎప్డు = ఏసమయమందు, కూయునో, అనుచు = అని తలంచుచుఁ, నంద...లందుఁ, నందన=నందన మను పేరు గల, ఉద్యాన=పూవులతోఁటయొక్క, వీథికా=చెట్లపంక్తులయొక్క, అంతరములందుఁ = మధ్యప్రదేశములందు, విహరింపఁ=సంచరించుటకు, పోవఁ=వెళ్లుటకు, వెఱచుఁ=భయపడును; అనఁగా విరహులకు కోకిలాలాపము మన్మథోద్దీపక మగును, కాన నాకోయిలకూఁతలను విని సహింపలేక నందనవనవిహారమును మానుచున్నాఁడని భావము.

తా. ఓదమయంతీ! దేవేంద్రుండు నీయెడఁబాటువలన మిగుల బాధపడుచుఁ గల్పవృక్షముల చిగుళ్లను దిని కోయిలలు కూయునేమో యనుభయముచేత నందనవనమందు విహరింప భయపడుచుండును.

తే. పరమ మగుకోటి కెక్కె నోపద్మనయన!
నవనవం బైననీజవ్వనంబుతోన
యసమబాణునిచాపంబునందు గుణము
భామ! నీయందు సుత్రామునిప్రేమగుణము. 21

టీ. ఓపద్మనయన= పద్మములవంటి నేత్రములు గలయోదమయంతీ! భామ! నవనవంబు=మిక్కిలి క్రొత్తది,ఐననీజవ్వనంబుతోఁ+అ=అయినట్టినీయౌవనముతోడనే, అసమబాణునిచాపంబునందుఁ= మన్మథునిచాపమందు, గుణము= అల్లెత్రాడును, నీయందుఁ, సుత్రామునిప్రేమగుణము = దేవేంద్రునిప్రేమయనెడిగుణమును, పరమము=మిక్కిలి గొప్పది, అగుకోటికిఁ=అయినట్టివింటికొప్పునకును, రెండవపక్షమందు, గొప్పదగు నుత్కర్షమునకు, ఎక్కెఁ=పొందెను. అనఁగా నీకుఁ బూర్ణయౌవనము వచ్చునప్పటికి నీసహాయమున లోకమును జయించుటకు మన్మథుఁడు విల్లెక్కువెట్టెననియు. దేవేంద్రునకుఁ బ్రేమము హెచ్చెననియు భావము.

అలం. తుల్యయోగిత; సహోక్తి.

తా. ఓదమయంతీ! మిక్కిలి నూతన మగుయౌవనముతోడనే మన్మథుని

చాపమునం దల్లెతా్రిడును, నీయందు దేవేంద్రునిపే్రిమగుణమును, వింటి కొప్పును మిక్కిలియుత్కర్షమును గ్రిమముగాఁ బొందెను.

ఉ. ఆరసిచూచి తాపమునఁ యందునురూపమునందుఁబూర్ణిమా
తారక రాజుగాఁదలఁచి ! తన్వి! భవద్విరహాతురుండు జం
భారి నిగుడ్చు(భ్రాంతినుదయావసరంబుల నొద్ద నుండి రో
షారుణ మైనలోచనసహస్రము బాలసహస్రభానుపై న్.22

టీ. తన్వి=దమయంతీ ! భవద్విరహాతురుండు=నీవియోగముచే పీడితుఁడయిన, జంభారి=దేవేంద్రుఁడు, ఉదయావసరంబులన్=ఉదయకాలములందు, ఒద్దన్ = నికటమున, ఉండి, ఆరసి చూచి = నిదానించిచూచి, తాపమునయందున్=వేఁడిమియందును, రూపమునందును=ఆకారమునందును, భ్రాంతిన్=భ్రమచే, పూర్ణిమా తారక రాజుగాన్ = పున్నమచంద్రునిఁగా, తలంచి=భావించి, బాలసహస్రభానుపైన్=బాలసూర్యునియందు, రోషారుణము=కోపముచే నెఱ్ఱనివి, ఐనలోచనసహస్రము=అయినట్టి వేయికన్నులను, నిగుడ్చున్=ప్రసరింపఁజేయును, ఉదయకాలమందు సూర్యుఁడెఱ్ఱగాను గొంచెము తాపముగలిగించువాఁడునై యుండును. చంద్రుఁడుగూడ నుదయకాలమం దెఱ్ఱగాఁగానవచ్చుచు విరహులకుఁ దాపము గలిగించువాఁడు నై యుండును. ఆకారణమున నింద్రుఁడు దమయంతీవియోగముచేఁబీడితుఁడై బాలసూర్యునిఁగాంచి యతఁడు తాపమునందును రూపమునందును జంద్రునివలెఁ గానవచ్చుచుండుట చేత భ్రాంతి చెంది బాలసూర్యునిగాఁ దలంచి కోపముచే నెఱ్ఱ నైనవేయిగన్నులను బ్రసరింపఁజేయును.

తా. ఓదమయంతీ! నీవియోగముచే పీడితుండై దేవేంద్రుం డుదయకాలములందు బాలసూర్యునిఁ జూచి యతఁడు తాపముచేతను, నాకారముచేతను నుదయకాలపుపున్నమచంద్రునితోఁ బోలుటచే భ్రాంతిచే నతనిఁ జంద్రునిగా నూహించి కోపముచే నెఱ్ఱనివేయిలోచనములను నతనిపైఁ బఱపి చూచును.

తే. మూఁడుకన్నులవేల్పుతో ! మోహరించి

నేఁడు దేహంబు లేక యు న్నాఁడు దాను
వేయిగన్నులవేల్పుతోఁ విగ్రహించి
వనిత! యిం కేమి గానున్న వాఁడొ మరుఁడు. 23

టీ. వనిత=దమయంతీ! మరుఁడు=మన్మథుఁడు, తాను, మూఁడుకన్నుల వేల్పుతోన్=మూఁడుకనులుగలయీశ్వరునితో, మోహరించి=విరోధించి, అనఁగా నతని నెదుర్కొని యని భావము. నేఁడున్ = ఇప్పటికిని, దేహంబు లేక ఉన్నాఁడు. పూర్వము బ్రహ్మచర్యవ్రతము పూనియున్న యీశ్వరునికి మోహము కలిగింపఁబోయి యెదుర్కొని యతనికంటిమంటలపాలయి యున్నాఁ డని తెలియఁదగినది. వేయిగన్నులవేల్పుతోన్ = వేయి నేత్రములు గలయట్టిదేవేంద్రునితో, విగ్రహించి=విరోధించి, ఇంకన్, ఏమిగాన్=ఏమగుటకు, ఉన్నవాఁడొ=అనఁగా లోకములో దేహత్యాగంబుకంటె మించినయాపద మఱియొకటి యుండదు. మూఁడుకన్నులవేల్పుతో విరోధించినప్పు డట్టియపాయమును బొందినప్పుడు వేయినేత్రములు గలవేల్పుతో విరోధించినప్పు డెట్టియవస్థ సంప్రాప్తమగునో తెలియదని భావము. ఈచెప్పుటచే నింద్రుండు మదనపీడితుఁ డగుచున్నాఁ డని ఫలితార్థము.

తా. ఓదమయంతీ ! పూర్వము మన్మథుండు ముక్కంటితో విరోధము కల్పించుకొని దేహము దగ్ధము గావించుకొని యశరీరుఁడై యున్నాడు. ఇప్పుడు వేయికన్నులు గలయింద్రునితో విరోధముసంపాదించియున్నాఁడు. ఇఁక నెట్టియాపద సంప్రాప్తమగునో తెలియదు.

చ. చిలుకలువల్కునో చెవులు చిల్లులు వ్రోవఁగనంచు నెన్నఁడున్
వెలలఁడు నందనోపవన వీథులకై యటు వాళిభాగని
ర్మలశశిరేఖమీఁదియప రాధమునన్ గజదైత్యశాసనుం
గొలువఁడు పాకశాసనుఁడు గోమలి నీపయికూర్మి పెంపునన్.

టీ. పాకశాసనుఁడు=పాకాసురునిఁ జంపినవాఁడు అనఁగా నింద్రుఁడనుట, చిలుకలు, చిల్లులు పోవఁగన్=చిల్లులు పడునట్లుగా, పల్కునో=భాషించునేమో,

అంచుక్ =అని తలంచుచు, నందనోపవనవీథులకై =నందనవనమందున్న వృక్ష పంక్తులందు విహరించుటకై, ఎన్నఁడుక్ =ఎప్పుడును, వెలలఁడు=బయలు వెడలఁడు, అటు=ఆరీతిగా నే, కోమలి=దమయంతి, నీపయికూర్మి పెంపునక్ =నీ మీఁదనున్న ప్రేమాతిశయము చే,మౌళి ... అపరాధమునక్-మౌళి=శిరంబునందున్న,నిర్మల=కళంకరహితమయిన,శశిరేఖ=చంద్రలేఖపైనున్న,అపరాధమునక్ =దోషము చేత,అనఁగా విరహులకుఁ జంద్రరేఖదుఃఖోపాదకమగునుగాన తనకు దుఃఖము గలిగించుచంద్రునిఁ దలను ధరించియుండుటచేత నని భావము, గజదైత్యశాసనుక్ =గజాసురునిజంపినవానిని (అనఁగా నీశ్వరుని),కొలువఁడు= సేవింపఁడు, అనఁగా నీపై ప్రేమముంచి యీశ్వరభజనము నైన మానుకొనుచున్నాఁడనుటచే నీశ్వరునిభజించుటకంటె మిక్కిలిగా దమయంతిని ప్రేమించుచున్నాఁడనియుఁ దెలియవచ్చుచున్నది.

తా. ఓదమయంతీ! నీయెడఁ బాటుచే బాధపడుచు దేవేంద్రుండు, నందనవనవిహారమున కేఁగినఁ జెవులు చిల్లులు పడునట్లు చిలుకలు పలుకు నేమోయని తలంచి యట్లు చేయ మానుచున్నాఁడు. అట్లె నీపయి ప్రేమాతిశయమున విరహముచేఁ బీడితుఁ డగుచుండుటచేఁ దనకుఁజంద్రుఁడు బాధగలిగించునని తలంచి యాచంద్రునిఁ దలయందుఁ దాలిచినశంకరుని సేవించుట మానెను.

తే. స్మరశిలీముఖకుసుమ కేసరపరాగ
 ధూళిపాళికఁ జిలికించెఁ దూర్పుదిక్కు
 ఇంతి వేగమ్ము లును గానఁ డింద్రుఁ డిపుడు
 నీవిలాసంబు పెంపు వర్ణింపఁ దరమె. 25

టీ. ఇంతి=దమయంతీ! స్మర ... పాళిక -స్మర=మన్మథునియొక్క, శిలీముఖ =బాణములయిన, కుసుమ=పుష్పములయొక్క, కేసర=కింజల్కములయొక్క, పరాగ=రజమనెడి, ధూళిపాళికక్ = దుమ్ముయొక్క-పంక్తిని, తూర్పుదిక్కు, చిలికించెక్ =ఒలుకఁజేసెను. అనఁగా మన్మథునిపుష్పబాణములపరాగముచేతఁ దూర్పుదిక్కు నింపఁబడి యంధకారబంధురముగాఁ జేయఁబడుచున్నదని భావము. ఈ చెప్పుటచే మన్మథుఁడు దేవేంద్రుని విరహబాధించుచున్నట్లు తెలి

యవచ్చుచున్నది. ఇప్పుడు, ఇంద్రుఁడు, వేగన్నులను=వేయి నేత్రములచేతను, కానఁడు=చూడలేఁడు,ఆచీఁకటిలో నతనికి వేయిగన్నులున్నను జూడలేక గ్రుడ్డి వానివలె నున్నాఁడని భావము. నీవిలాసంబు పెంపుఁగ్ = నీకాంతి పెంపును, వర్ణింపఁగ్ =వర్ణించుటకు, తరమే=శక్యమగునా? వేయిగన్నులు గలయింద్రుని సైతము కామాంధకారమున ముంచి గ్రుడ్డి వానిగాఁ జేసిననీసౌందర్యము నెన్న నెవ్వరికిఁ దరమగును?

తా. ఓదమయంతీ! మన్మథుఁ డింద్రునిపై ప్రయోగించినపుష్పబాణముల పరాగము తూర్పుదిక్కును గప్పి యంధకారబంధురముగాఁ జేయుటచే నిం ద్రుఁ డిపుడు వేగన్నులు గలిగియుఁ జూడలేక యున్నాఁడు. ఇంద్రునిఁ గా మాంధునిగాఁ జేసిననీసౌందర్యము నెవ్వరు గొనియాడఁగలరు?

తే. విరహతాపప్రశాంతికై విబుధపతికి
నార్ద్రపర్యంకవిధికిఁగా నపచయింపఁ
బరులలేములు వాపంగఁ బాలుపడిన
యమరతరువుల కొదవెఁ బుష్పములలేమి. 26

టీ. విబుధపతికిన్ =ఇంద్రునికి, విరహతాపప్రశాంతికై = వియోగమువల నఁ గలుగువేఁడిమిని బోఁగొట్టుటకై, ఆర్ద్రపర్యంకవిధికిన్ కాన్-ఆర్ద్ర=త డిగానుండు, పర్యంక=పానుపులయొక్క, విధికిఁగాన్ =రచించునిమిత్తము,అప చయింపన్ =పూవులను గోయఁగా,అనఁగా నింద్రుండు విరహతాపమును సహిం పలేక యుండఁగా నతనికిఁ బూలపాన్పుల రచింపఁదొడఁగిరి. ఆపాన్పులపై నిం ద్రుఁడు శయనింపఁగా నతని మేనివేఁడిమిచేఁ బూలపాన్పులు మొరమొరలాడుచు మర్మరధ్వనులు చేయసాగెను. అందుచే నతనికి మగుడ క్రొత్తపానుపుల ర చించుటకుఁ గల్పవృక్షములనుండి పూవులనుగోయఁగా నని భావము పరులలే ములు=ఇతరులబీదతికములు, పాపన్ కన్ =పోఁగొట్టుటకు, పాలుపడిన=ప్రయ త్నించుచున్న,అమరతరువులకున్ =కల్పవృక్షములకు,పుష్పములలేమి=పూలులే కపోవుట. ఒదవెన్ =కలిగెను. ఇతరులబీదతనములు నశింపఁజేయు కల్పవృక్ష

ములకుఁ బుష్పదారిద్ర్యము కలిగినదని భావము. ఈచెప్పుటచే నింద్రునితాపాతి శయము తెల్లమగుచున్నది.

తా. దమయంతీ! నీవియోగతాపమువలనఁ బీడితుఁడయిన యింద్రునితాపమును దొలఁగింప రచించుతల్పములకయి కల్పవృక్షములనుండి పుష్పములు గోయ మొదలిడిరి. అందువలనఁ బరులబీదఱికములను దొలఁగింపఁజాలిన కల్పవృక్షములు పుష్పములేకపోవుటయనుబీదతన మనుభవించుచున్నవి.

మ. వినువైదర్భి భవద్వియోగదవథూర్వేగంబు వారించుచున్
దినముల్ పుచ్చుచు నున్నవాఁడు విబుధాధీశుండు మందాకినీ
కనకాంభోరుహనాళకల్పితనవాకల్పంబులం జారునం
దనమందారతరుప్రవాళమయచింతారత్నతల్పంబులన్. 27

టీ. వైదర్భి=ఓదమయంతి, విను, విబుధాధీశుండు=దేవతల కధిపతియగు నింద్రుఁడు, భవత్ ... వేగంబున్—భవత్=నీసంబంధమగు, వియోగ=ఎడఁబాటనెడి, దవథు=అగ్నియొక్క, ఉద్వేగంబున్=ఉద్ధతిని, వారించుచున్=తొలఁగించుచు, మందాకినీ—కల్పంబులన్-మందాకినీ=గంగానదియందున్న, కనకాంభోరుహ=బంగారపు పద్మములయొక్క, నాళ=తూండ్లచేతను, కల్పిత=కల్పింపఁబడిన, నవ=నూతనములయిన, ఆకల్పంబులన్=భూషణములచేతను, చారు...తల్పంబులన్— చారు=సుందరములయిన, నందన=నందనవనమందున్న, మందారతరు=కల్పవృక్షములయొక్క, ప్రవాళమయ=చిగుళ్లచే నిండిన, చింతారత్న=చింతామణులనెడి, తల్పములన్=పానుపులందును, దినముల్, పుచ్చుచునున్నవాఁడు=జరుపుచున్నాఁడు. అనఁగా నీవియోగబాధను సహింపలేక యతికష్టముచేఁ గాలమును బుచ్చుచున్నాఁడని భావము. ఈపద్యము మొదటిపాదమందుఁ గొన్ని ప్రతులలో "దవథుద్వేగం" బనియుఁ గొన్నిట 'దవఘూర్వేగం' బనియు పాఠము కానవచ్చుచున్నది. కాని వానికంటె దవథూద్వేగంబని సవరణచేసికొన్న మిక్కిలి యుక్తముగా నుండునని తలఁచి యట్లు చేయఁబడెను.

తా. దమయంతీ! ఇంద్రుఁడు నీవియోగాగ్నితాపమును సహింపలేక గంగానదియందున్న మృణాళములను నాభరణములగాఁ దాల్చుచు మందారతరువులపల్లవముచేఁ నింపఁబడినచింతామణితల్పములందును నతికష్టముచేఁ గాలము బుచ్చుచున్నాఁడు.

ఉ పుష్పధనుర్లతామధుపపుంజగుణక్వణనం బొనర్చి వా
స్తోష్పతికర్ణముల్ మనసిజుండు చెవుడ్పడఁ జేసె నక్కటా
గీష్పతి యేమి చెప్ప నిటఁ క్రింద బలారికిఁ గామవిక్రియా
దుష్పథవృత్తికిఁ మనసుదూర్పమికై బహునీతిశాస్త్రముల్.

టీ. మనసిజుండు=మన్మథుఁడు, పుష్ప...క్వణనంబున్-పుష్ప= పూవనెడి, ధనుర్లతా=లతవంటివింటియొక్క, మధుప=తుమ్మెదలయొక్క, పుంజ=సమూహమనెడి, గుణ=నారియొక్క, క్వణనంబు=చప్పుడు, ఒనర్చి=చేసి, అక్కటా=అయ్యయ్యో! వాస్తోష్పతికర్ణముల్ = దేవేంద్రునిచెవులను, చెవుడ్పడఁజేసె = చెవుడుకలుగునట్లు చేసెను. అనఁగా మన్మథుండు నీవియోగముచే బాధపడుచున్న యింద్రునిఁ దనపూవింటియందున్న తుమ్మెదచాలనెడి నారినిమ్రోయించి యతనికిఁ జెవుడుగలుగునట్లు చేసెనని భావము. ఈచెప్పుటచే మన్మథుఁ డింద్రుని మిగుల బాధపెట్టుచున్నట్లు తెలియవచ్చుచున్నది. గీష్పతి=బృహస్పతి, ఇట,క్రిందన్ = ఇంతకుముపు, కామ...వృత్తికిన్- కామవిక్రియా=మన్మథవికారమనెడి, దుష్పథ=చెడుమార్గమందు, వృత్తికిన్=ప్రవర్తించుటకు, మనసు, దూర్పమికై=ప్రవేశముచేయకుండుటకై, అనఁగాఁ గామవికారము నొందకుండ నుండుటకని భావము, బహునీతిశాస్త్రముల్=పెక్కులు నీతిశాస్త్రవాక్యములను, బలారికిన్ = బలాసురుని శత్రువునకు, అనఁగా దేవేంద్రునకనుట, చెప్పన్=ఉపదేశింపఁగా, ఏమి=ఏమిప్రయోజనము. అనఁగా వ్యర్థమనుట.

తా. దమయంతీ! మన్మథుఁడు తనపూవింటియందున్న తుమ్మెదచాలనెడి నారి మ్రోయించి యింద్రునిఁ జెవిటివానిగాఁ జేసెను. అయ్యయ్యో! అతని కామవికారమును జూచి బృహస్పతి దానిఁ దొలఁగించుటకయి నీతివాక్యములఁ బెక్కుల నుపదేశించినను వఠనికి వినఁబడవు. దేమిలాభము కలదు?

తే. చెలువ జంభారియాసకుఁ గొలఁది యేది
తా సహస్రాక్షుఁడై యుండి దైన్యవృత్తి
నభిలషించుచునున్నవాఁ డాత్మలోనఁ
జంచలం బైననీకటాక్షాంచలంబు. 29

టీ. చెలువ=దమయంతీ! తాన్=ఇంద్రుఁడనుట, సహస్రాక్షుఁడైయుండి=వేయుకన్నులుకలవాఁడయి యుండియు, దైన్యవృత్తిన్=దీనత్వముచే,ఆత్మలోనన్=మనస్సులో, చంచలంబు=చలించుచున్నది, ఐననీకటాక్షాంచలంబు=అయినట్టి కడకంటిచూపును, అభిలషించుచున్, ఉన్నాఁడు = కోరుచున్నాఁడు, జంభారియాసకున్=దేవేంద్రునియాసకు, కొలఁది=మితి, ఏది=ఎక్కడిది? లేదనుట, వేయి నేత్రములు కలవాఁడయి యుండియు, రెండు నేత్రములు మాత్రమే గలదమయంతి చలించు కడకంటిచూపులను దీనత్వమున యాచించుటచే నింద్రునకుఁ గల పేరాశ వ్యక్తమగుచున్నది. అనఁగా నింద్రుండు, నీవియోగమున బాధపడుచు దాళఁజాలక నీయనుగ్రహమును గోరుచున్నాఁడని ఫలితార్థము.

తా. ఓదమయంతీ! దేవేంద్రుఁడు తాను వేయినేత్రములు గలవాఁడయ్యును, యస్థిరమైన నీకడకంటిచూపుల నాత్మలోఁ గోరుచున్నాఁడు. అతని యాశకు మితియెక్కడనున్నదో చెప్పుమా.

అవ: వెనుకటిపద్యములచే నింద్రునివిరహావస్థను జెప్పి యిప్పు డగ్నిదేవునివిరహావస్థను గవి వర్ణించుచున్నాఁడు.

క. ఏ వేల్పు సోమపీథులు
సేవింతురు ముఖ్యతనువు శివునకు నేవే
ల్పేవేల్పు వెలుఁగులకు గని
యావేలుపు నిను వరింప నాకాంక్షించెన్. 30

టీ. దమయంతీ! ఏవేల్పున్=ఏదేవతను,సోమపీథులు=యాగము చేసినవారు, సేవింతురు=భజింతురో, ఏవేల్పు=ఏదేవత, శివునకున్=ఈశ్వరునకు, ముఖ్యత

సవు=ప్రధానమగుశరీరమో, ఏవేల్పు, వెలుఁగులకున్=కాంతులకు, గని=స్థానమో, ఆవేలుపు=ఆదేవత, అనఁగా నగ్నిదేవుఁడనుట, నినున్, ఆకాంక్షించెన్=కోరుచున్నాఁడు.

తా. ఓదమయంతీ! యాగముల నొనరించినబ్రాహ్మణోత్తములచే సంతతము సేవింపఁబడుచు, నీశ్వరునకు శరీరభూతుఁడయి కాంతులకు గనియైయున్న యగ్నిహోత్రుఁడు నీయందనురాగము గలవాఁడయి కోరుచున్నాఁడు.

ఉ. స్థాణువిలోచనాంచలము కైదాఁపుగఁ దీవ్రతరార్చులన్ నిజ
  ప్రాణముఁ గొన్ననాఁటిపగ కైయాత్మఁ దలంచియొనీకటాక్షదృ
క్కోణముప్రాపున న్మరుఁడుకైకొల్కొనిపంతమెలర్పఁగాఁ గొనెన్
  బాణదశార్ధపాతమునఁ కైబానకుభూరిమనోభిమానమున్.31

టీ. మరుఁడు=మన్మథుఁడు, స్థాణువిలోచనాంచలము=ఈశ్వరునికడకన్ను, దాఁపుగన్=సాయముగా, తీవ్రతరార్చులన్=భయంకరమైన మంటలచేత, నిజప్రాణమున్=తనయుసుఱును, కొన్ననాఁటిపగన్=పుచ్చుకొన్నప్పటిశత్రుత్వమును, ఆత్మన్=మనంబునందు, తలంచియో=ఆలోచించియే కాఁబోలును, నీకటాక్షదృక్కోణముప్రాపునన్=నీకడకన్నులసాయము చేత, కొల్కొని=విజృంభించి, పంతము=పట్టుదల, ఎలర్పన్=కలుగునట్లుగా, బాణదశార్ధపాతమునన్=అయిదుబాణములప్రయోగముచే, పావకు...మానమున్—పావకు=అగ్నిహోత్రునియొక్క, భూరి=గొప్పదగు, మనోభిమానమున్ = మనోగర్వమును, కొనెన్=అపహరించెను. అనఁగాఁ బూర్వమీశ్వరుఁడు బ్రహ్మచర్యము పూనియున్నప్పుడు మరుఁడతని బాధింపఁగా నతఁడు తనయగ్నినేత్రముచేఁ జూచి భస్మముచేసెను. అప్పు డగ్నిశంకరునినేత్రముసాయమునఁ దన్ను భస్మముచేసెఁగదా యని మనంబునఁ బగవహించి యిప్పుడు నీనేత్రములప్రాపుచే నతిశయించి యతనిగర్వము నపహరించినాఁడని భావము. అగ్నిహోత్రుఁడు నిన్నుఁ గోరి మిగుల మన్మథవ్యథలపా లగుచున్నాఁడని ఫలితార్థము.

తా. పూర్వ మగ్ని యీశ్వరునినేత్రముల నాశ్రయించి తన్ను భస్మము

చేసె నన్నుకసి మనంబున నుంచికొని మన్మథుఁ డిప్పుడు నీ నేత్రము నాశ్రయించి బాణపంచకము ప్రయోగించి పంతముతో నతనిమనోగర్వము హరించెను.

తే. ఉవిద సోమరసం బన్న కనోకిలించు
నడిచిపడు నాజ్యహోమమంత్రాహుతులకు
నిచ్చ సేయఁడు మనములో కనిధ్మములకుఁ
బావకుండును బాల నీకైవిరాళి. 32

టీ. ఉవిద=దమయంతీ! బాల! పావకుండును=అగ్నియును, నీపైవిరాళిన్=నీవియోగముచే,సోమరసంబు = సోమలతవలనఁ దీయఁబడినరసము, (యాగములందీరసము నుపయోగింతురు), అన్నన్=అనఁగా, ఓకిలించున్=అసహ్యపడును,ఆజ్యహోమమంత్రాహుతులకున్—ఆజ్య= నేతికిని, హోమమంత్ర=హోమము చేయునప్పటి మంత్రములకును, ఆహుతులకున్ = హోమద్రవ్యములకును, అడిచిపడున్=మండిపడును. అగ్నిలో నాజ్యాదులు పోసినప్పుడు మండుట సుప్రసిద్ధము. అట్టిదాని దమయంతీవియోగపీడితుఁడగు నగ్నికి నాజ్యాదు లసహ్యములగుటచే వానిపేరు చెప్పినచోఁ గోపమున మండిపడుచున్నాఁడని భావము. మనములోన్, ఇధ్మములకున్=సమిధలకు, ఇచ్చచేయఁడు=కోరఁడు. అనఁగా విరహాతిశయముచే నన్నపానంబులు గొనలేదని ఫలితార్థము.

తా. ఓదమయంతి! యగ్నిహోత్రుఁడు నీవియోగముచేఁ బీడితుఁ డగుటచే సోమరసమునుజూచి యసహ్యపడుచున్నాఁడు. నాజ్యాదిహవిస్సులపేరు విన్నంతమాత్రమున మండిపడుచున్నాఁడు. సమిధలను భుజింపఁదలంపఁడాయెను.

తే. తరుణి యాత్మప్రతాపసంతప్తుఁ జేసి
పుష్పనారాచుఁ డగ్నికి కబుద్ధి సెప్పె
నాత్మవత్సర్వభూతాని కయనెడునీతి
నన్యతాపంబు శిఖి మానుకనట్లు గాఁగ. 33

టీ. తరుణి=దమయంతి ! అపుష్పనారాచుండు=పువ్వులే బాణములుగాఁగలవాఁడు-అనఁగా మన్మథుఁడనుట, ఆత్మ...తప్తున్— ఆత్మ=తనయొక్క, ప్ర

తాప=పరాక్రమముచే, సంతప్తుర్ = సంతాపముగలవానిగా, చేసి, ఆత్మవత్ = తన్నువలెనే, సర్వభూతాని=అన్నిభూతములను, పశ్యతి=(అధ్యాహారము)చూచుచున్నాఁడు. అనెడినీతిక్ =అను నీతిప్రకారము, అన్యతాపంబుక్ =ఇతరులను దపింపఁజేయుట, శిఖ=అగ్ని, మానునట్లుగాఁగ, అగ్నికిక్, బుద్ధిచెప్పెక్ = బుద్ధివచ్చునట్లుచేసెను.అనఁగా నగ్ని సమస్తమును దపింపఁజేయుచుండును.మన్మథుఁడు తనపరితాపముచే నగ్నికి సంతాపముగలిగించి నీ విప్పుడు సంతాపమును జెంది బాధపడునట్లుగానే నీవలన సంతాపమును బొంది సమస్తము బాధపడుచున్నది. కావున నిఁకమీఁద"ఆత్మవత్సర్వభూతాని"యని స్మరించికొని యన్యతాపంబుచేయుట మానుమని యగ్నికి బుద్ధిచెప్పి పుచ్చెనని భావము. ఈ చెప్పుటచే నగ్నిహోత్రుఁడు మన్మథసంతాపముచే బాధపడుచున్నాఁడనుట స్పష్టము.

తా. సులభము.

క. కుసుమాయుధుబాణంబులఁ
గనుగంది భవద్వియోగకలుషత నర్చా
వసరంబుల నర్చకు లిడు
కుసుమములకు వెఱచు నహ్ని కువలయనేత్రా. 34

టీ. కువలయనేత్రా=కలువలవంటినేత్రములు గలయోదమయంతీ! వహ్ని=అగ్నిహోత్రుఁడు, కుసుమాయుధుబాణంబులక్ =పూవులే యాయుధములు గాఁ గలవాని అనఁగా మన్మథునియొక్క, బాణంబులక్ = బాణములచేత, కనుగంది=వాడి,భవద్వియోగకలుషతక్-భవత్ =నీయొక్క, వియోగ=ఎడఁబాటువలనఁ గలిగిన, కలుషతక్ =వికారముచేత, అర్చావసరంబులక్ =పూజాసమయములందు, అర్చకులు=పూజకులు, ఇడుకుసుమములకుక్ = ఇచ్చెడు పుష్పములకు, వెఱచుక్ =భయపడుచుండును. అనఁగా మన్మథునికుసుమబాణంబులు మిక్కిలి తన్ను నొప్పించుటచే నాబాధను మఱవఁజాలక యగ్నిపూజకులు పూజించెడిపుష్పములు తనశరీరముపైఁ బడ నవి మన్మథుఁడు ప్రయోగించినబాణములని తలంచి మిక్కిలి భయపడుచుండునని భావము.

తా. ఓదమయంతీ! అగ్ని మన్మథునికుసుమబాణములచే మిక్కిలి బాధింపఁబడి నీవియోగవికారముచేఁ బూజాసమయములందుఁ బూజకులు పూజించు పూవులనుగూడ మన్మథునిబాణము లనియే తలంచి భయపడుచుండును.

ఉ. బాలిక నీవు హేతువుగ ♦ భానుకులాభరణంబు దక్షిణం
బేలెడురాజు ధర్మములు ♦ కెల్లను గందువ ధర్మరాజు లోఁ
దోలుమనోభవాగ్నిఁ దన ♦ తాలిమి యాహుతి గాఁ గ్రమం
బునన్, వేలుచున్నవాఁడభిని ♦ విష్టను ఖైక ఫలాభికాంక్షియై.

టీ. బాలిక=ఓదమయంతీ! నీవు హేతువుగాన్=నిన్నుంబట్టి, అనఁగా నిన్ను వరింపఁ గోరి యని భావము. భానుకులాభరణంబు=సూర్యకులమున కలంకారమువంటివాఁడు, దక్షిణంబు=దక్షిణపుదిక్కును, ఏలెడిరాజు = పరిపాలించువాఁడును, ధర్మముల కెల్లను=ధర్మములకన్నిటికిని, కందువ=చోటయినవాఁడును, ధర్మరాజు=యముఁడు, లోన్=హృదయములోపల, తోలుమనోభవాగ్నిన్=పుట్టిన మన్మథాగ్నియందు, తనతాలిమి=తనధైర్యమును, క్రమంబునన్=క్రమముగా, ఆహుతిగాన్=హోమపదార్థముగా—లేక యాజ్యాదిహవిస్సుగాను, వేల్చుచున్నవాఁడు=హోమముచేయుచున్నాఁడు. అనఁగా యముఁడు నీవలని సుఖము నపేక్షించి మన్మథతాపముచే ధైర్యమును బోఁగొట్టుకొని వర్తించుచున్నాఁ డని భావము.

తా. ఓదమయంతీ! సూర్యవంశమున కలంకారమువంటివాఁడును, దక్షిణదిక్కును బాలించువాఁడును ధర్మములకు స్థానభూతుఁడును, నగు యముఁడు హృదయములోఁ బ్రభవించినమన్మథాగ్నికిఁ దనధైర్యమును హోమమును జేయుచున్నాఁడు.

క. చండజ్వరజర్జరమును
గాండుగమును నైన మేను ♦ బాలిక దాల్చెన్
దండధరుఁ డిపుడు సుమనః
కాండోజ్జ్వకీర్తిభారకలితుఁడపోలెన్. 36

టీ. బాలిక=ఓదమయంతీ ! దండధరుఁడు=యముఁడు, ఇపుడు = ఈసమయమందు, చండజ్వరజర్జరమును-చండ=తీవ్రమయిన, జ్వర = ఉష్ణత్వముచే, జర్జరమును=శిథిలమయినదియు, పాండురమును=తెల్లనిదియు, ఐనమేనుల్ = అయినట్టిశరీరమును, సుమనః...పోలెన్-సుమనఃకాండ=పుష్పములే బాణముగాఁగలవానియొక్క - అనఁగా మన్మథునియొక్క, ఓజః=ప్రతాపముయొక్కయు, కీర్తి=యశముయొక్కయు, భార=అతిశయముచే, కలితుఁడపోలెన్ = ఒప్పుచున్నవాఁడువలెను, తాల్చెన్=ధరించెను. నీవియోగమును పైపఁజాలక సతతమును నిస్స్మరించుటచేత,రక్తమెండిపోవుటంజేసి తెల్లనిదియు మన్మథసంతాపమువలన శిథిల మయినదియు, నగు యమునిశరీరము మన్మథునికీర్తిప్రతాపములవలె నున్నదని భావము. ఈచెప్పుటచే యముఁడు దమయంతీవిరహముచే మిగులఁ బీడితుఁడగుచున్నట్లు తెలియవచ్చుచున్నది.

తా. ఓదమయంతీ ! తీవ్రమయిన మన్మథసంతాపముచే శిథిలమయినదియు,విరహమువలనఁ దెల్లనిదియును, నగుటచే మన్మథుని తేజస్సువలెను, గీర్తివలెను నొప్పుశరీరమును యముఁ డిపుడు ధరించుచున్నాఁడు. అలం. ఉత్ప్రేక్ష.

క. బిసరుహలోచన సంధ్యా
ఘుసృణసమాలంభకర్మకుతుకారంభ
వ్యసనసముజ్జృంభిత యగు
దెస యేలెడురాజు నిన్ను ధృతిఁ గామించెన్. 37

టీ. బిసరుహలోచన-బిసరుహ = పద్మమువంటి, లోచన = నేత్రములుగల దమయంతీ, సంధ్యా...జృంభిత-సంధ్యా=సాయంకాలమందు,ఘుసృణ=కుంకుమును, సమాలంభ=పూసికొనుటయనెడి, కర్మ=పనియందున్న, కుతుక=వేడుకయొక్క, ఆరంభ=అతిశయమందలి, వ్యసన=ఆసక్తిచేత, సముజ్జృంభిత=అతిశయించుచున్నది, అగుదెసన్=అయినదిక్కును, అనఁగాఁ బడమటిదిక్కు ననుట, ఏలెడురాజు = పరిపాలించురాజు అనఁగా వరుణుఁ డనుట, ధృతిన్=సంతోషముచే, నిన్నున్, కామించెన్=వరించెను. అనఁగా సాయం

కాలరాగముచేఁ బ్రకాశించుచున్న పడమటిదిక్కును పాలించువరుణుఁడు నిన్నువరించెనని భావము.

తా. స్పష్టము.

క. మదిరాక్షి జలధి నశ్వా
వదనోత్థిత మైనహవ్యవాహమపోలెన్
హృదయస్థానస్థిత మగు
మదనానల మబ్ధిరాజుమద మణఁగించెన్. 38

టీ. మదిరాక్షి=ఓదళుయంతీ, జలధిన్=సముద్రమందు, అశ్వావదనోత్థితము=అశ్వ యనునాఁడుగుఱ్ఱమునోటినుండి పుట్టినది, ఐన హవ్యవాహమపోలెన్=అయినట్టి యగ్నిహోత్రునిచందమునసే, హృదయస్థానస్థితము=హృదయమందున్నది, అగు మదనానలము=అయినట్టి మన్మథాగ్నిహోత్రము, అబ్ధిరాజుమదము=వరుణునియొక్కగర్వమును, అణఁగించెన్=నశింపఁజేసెను. సముద్రమధ్యమందు బడబ యనునొకగుఱ్ఱము గలదనియు దానినోటినుండి యగ్ని యుదయించి సముద్రపునీ రెచ్చ కుండునట్లు హరించుచు నున్నదనియు నభివర్ణింతురు. సముద్రమందు బడబాగ్ని ప్రజ్వలించుచు నీటి నింకించుచున్నట్లు వరుణుని హృదయములో మదనాగ్ని యుదయించి యతనిమదము హరించుచున్నదని భావము. వరుణుని మదనానలము బడబాగ్నితోఁ బోల్చుటచే నది దుస్సహమయినదియు, దీర్ఘమయినదియు, నెల్లప్పుడును మండుచున్నదియునై యున్నట్లు తెలియవచ్చుచున్నది. అలం. అతిశయోక్తి.

తా. స్పష్టము.

తే. తరుణి తద్భుజమధ్యమధ్యంబునందు
నవమృణాళకదండఖండంబు మెఱయుఁ
దన్మనోమగ్నమదనాస్త్రతతులచేత
నాక్షణంబ శతచ్ఛిద్రమైనభంగి. 39

టీ. తరుణి=దమయంతీ! తత్ ...నందుర్ - తత్ =ఆవరుణునియొక్క, భుజ మధ్య=వక్షఃస్థలముయొక్క, మధ్యంబునందుర్ =మధ్యభాగమునందు, నవమృణాళకదండ=తామరతూండ్లయొక్క, ఖండంబు=ముక్క, అనఁగా దమయంతీవియోగతాపమును దొలఁగించుటకయి వరుణుని హృదయమునందుఁ జేర్పఁబడినతామరతూఁడు, తత్ ...తతులచేతర్ - తత్ = ఆవరుణునియొక్క, మనస్=చిత్తమునందు, మగ్న=మునిఁగిన, మదనాస్త్రతతులచేతర్ = మన్మథబాణములయొక్క సమూహములచేత, అక్షణంబ=అప్పుడే, శతచ్ఛిద్రము=నూఱురంధ్రములు గలది, ఐనభంగిర్ =అయినట్టుగా, మెఱయుర్ =ప్రకాశించును. తామరతూఁడునకు స్వాభావికముగా నున్నరంధ్రములు వరుణునిహృదయమందు లగ్నములయినప్పుడు మన్మథబాణములచేఁ గలిగినవని యుత్ప్రేక్షించెను ఇట్లు మన్మథుఁడు వరుణునిశరీరమంతటను బాణపరంపరను గ్రుచ్చుటచే నది తాపశాంతికై యుంచిన తామరతూఁడునకుఁగూడ దగిలి శతరంధ్రములుగలదానిగాఁ జేసెనని చెప్పుటచే నతనిశరీరమంతయు బాణభిన్నమైనట్లు తోఁచుచున్నది. అనఁగా వరుణుఁడు మన్మథపీడితుఁడయి యున్నాఁడని భావము.

తా. దమయంతీ! తాపశాంతికై వరుణునిహృదయమందుఁ జేర్పఁబడిన లేఁత తామరతూఁడు వరుణునిమనంబున లగ్నమయిన మన్మథబాణములచే ననేకరంధ్రములు గలిగియున్నట్లు ప్రకాశించెను.

వ. ఈచందంబున ద్రిలోకతిలకు లగునాదిశావల్లభులు భవదాయల్లకభరంబను వెల్లి మునుంగం బొఱలుచు నెల్లి నీస్వయంవరమహోత్సవం బని విని తపనసంకాశంబు లైనవిమానంబు లెక్కి యేతదర్థంబున నిజశుద్ధాంతకాంతాజనంబు విరహసంతాపభాజనంబుగా నిశితనిస్త్రింశనీకాశం బగునాకాశంబు డిగ్గి పాదార్పణానుగ్రహంబున మహీమండలంబు గృతార్థంబుగా నిప్పు డిప్పురంబున కనతిదూరంబున నున్న

వారు. యదృచ్ఛాగతుం డై ననన్నుం గనుంగొని నామనం
బున సందేశాక్షరంబులు వ్రాసి జంగమ లేఖంబు గావించి
నీసకాశంబునకుం బుత్తెంచిరి. కుసుమశరభిల్ల శరశల్యవిశ
ల్యాపధీవల్లి వగునిన్నుం బరిష్వంగంబు సేయను, ననంగ
లీలాలహరీతుషారం బగునీశరీరంబుసోఁకున నంతరంగపరితా
పం బపనయింపను, నిపీతపీతదర్పంబు లగునీయంగంబు ల
సాంగంబులకు లేపం బొనర్పను, ప్రసవనారాచశరాసనా
భవిభ్రమభ్రూవిలాసం బగునీముఖశ్రీసముల్లాసంబునకు ను
ల్లసిల్లను, సుమనఃకోదండచండాలసంస్పృష్టిదోషదూషితు
లగుతమ్ము నీకటాక్షవిక్షేపసాంద్రచంద్రాతపాలోకంబులనభి
షేకింపను, భవచ్చరణకమలసేవాహితమహత్త్వంబున మ
దనాపమృత్యుదేవతవలన నిజప్రాణంబులకుఁ బరిత్రాణంబు
గావింపనుం దలంచుచున్నవారు కుశలప్రశ్నపూర్వకంబు
గా నాగీర్వాణులు నీకుం జెప్పు మనినపలుకులు గొన్ని
గలవు వాని నాకర్ణింపుము. 40

టీ. ఈచందంబునన్, త్రిలోకతిలకులు = ముల్లోకములకు నలంకారముల
యంటివారు, అగునాదిశావల్లభులు = అయినదిక్పాలురు, భవదాయల్లకభరం
బు - భవత్ = నీయొక్క, ఆయల్లకభరంబును - వియోగభారమును, అనువెల్లిన్ =
అనెడి ప్రవాహమునందు, మునుగంబాఱుచు = క్రుంకులిడుచు, ఎల్లిన్ = రేపటి
దినము, నీస్వయంవర మహోత్సవంబు = నీస్వయంవరమనెడి గొప్పయుత్సవను,
అని = అగునని, విని, తపనసంకాశంబులు = సూర్యునితో సమానములు, ఐనవిమా
నంబులు, ఎక్కి, ఏతదర్థంబునన్ = ఇందు నిమిత్తము - లేక ఈకారణముచేత
ను. నిజశుద్ధాంతకాంతాజనంబు = తమయంతఃపుర స్త్రీలు, విరహాసంతాప
భాజనంబుగా = వియోగతాపమునకుఁ బాత్రములగుచుండగా అనఁగాఁ నిందాది
దులు నిజగృహంబుల నెడఁబాసివచ్చుటచే నంతఃపుర స్త్రీలు వియోగపీడితలగు

చున్నారని భావము. తమప్రాణములకంటెఁ బ్రియులగు తమయంతఃపురస్త్రీల
ను విడిచి స్వయంవరంబునకు వచ్చియున్నారని చెప్పుటచే దిక్పాలురకు దమ
యంతియందుఁ గలప్రేమాతిశయము వెలువడుచున్నది. నిశితని స్త్రింశనీకాశంబు-
నిశిత=వాఁడియగు, నిస్త్రింశ=ముప్పది యంగుళములపొడవు గలఖడ్గములో,
నీకాశంబు=సమానమైనది, అగునాకాశంబున్ =అయినట్టియాకాశమును, డిగ్గి=
దిగి, పాదార్పణానుగ్రహంబునన్ =పాదములనుంచుట యనెడి యనుగ్రహము
చే, మహీమండలంబు=భూవలయము, కృతార్థంబుగా=చరితార్థముగా, ఇప్పుడు,
ఇప్పురంబునకున్, అనతిదూరంబునన్ =సమీపమున, ఉన్నవారు. యదృచ్ఛాగ
తుండు=స్వేచ్ఛచే వచ్చుచున్నవాఁడు, ఐననన్నున్ = అయినట్టినన్నును, కనుం
గొని, నామనంబునన్ =నాయొక్కమనస్సునందు, సందేశాక్షరంబులు=వార్తాసం
బంధు లగునక్షరంబులను, వ్రాసి=అనఁగా సందేశవాక్యంబులను నాకుఁ దెలియఁ
జేసి యని భావము. జంగమలేఖంబు=నడుచుచున్నలేఖను, కావించి=చేసి, అనఁ
గా నలునిమనం బనుఫలకమునందు సందేశవర్ణములు లిఖించి పంపించుటచే నలుం
డే యొకలేఖవలెనున్నాఁడని భావము. నీసకాశంబునకున్ =నీదగ్గఱకు, పుత్తెం
చిరి=పంపిరి. కుసుమ...వల్లివి-కుసుమశర=మన్మథుఁడనెడి, భిల్ల=వేఁటగానియొ
క్క, శరశల్య = ఏదుఁబందిముల్లువంటి బాణములవలనఁ గలిగినగాయములకు,
విశల్యౌషధీవల్లివి=విశల్య యనుపేరుగల యోషధీలతవు, అగునిన్ను, పరిష్వం
గంబుచేయను=కౌఁగిలించుకొనుటకును, అనఁగా విశల్యౌషధితో సమానురా లగు
దమయంతిశరీరమును గౌఁగిలించుకొని యాసంబంధంబున మన్మథునిబాణముల
చేఁ గలిగినగాయములు మాన్చుకోఁదలంచుచున్నారని భావము. విశల్యౌషధి
సంపర్కముచే గాయములబాధ తొలఁగునట్లు దమయంతి శరీరసంబంధముచే
మన్మథతాపము తొలంగునని ఫలితార్థము. అనంగలీలాలహరీతుషారంబు-అనంగ
లీలా=మన్మథవిలాసములయొక్క, లహరీ=ప్రవాహముయొక్క, తుషారంబు=
=లేశముచే అగు, నీశరీరంబుసోఁకునన్ =శరీరముయొక్క తాఁకుడుచే, అంత
రంగ పరితాపంబు=హృదయమందుండు సంతాపమును, అపనయింపను=తొలం
గించుటకును, అనఁగా జలప్రవాహంబును జెంది యగ్ని సంతాపమును దొలఁగిం

చుకొనునట్లు దిక్పాలురు మన్మథవిలాసముల ప్రవాహమువలెఁ బ్రకాశించు చున్న దమయంతిశరీరంబు తాఁకున మన్మథసంతాపమును దొలంగింపఁదలం చుచున్నారనుట-నిపీత...దర్పంబులు-నిపీత=పూర్తిగా గ్రహించిన, పీత=పసు పురంగుయొక్క, దర్పంబులు=సౌందర్యగర్వము గలవి, అగు నీయంగంబులు= అయిన నీ యవయవములను, అపాంగంబులకున్ = కడకన్నులకు, లేపంబు, ఒసర్పన్ =పూయుటకును, అనఁగాఁ బసుపురంగుకంటె మిక్కిలి పచ్చనైన నీయవయవములను జూచుట కనియర్థము.ప్రసవ... విలాసంబు-ప్రసవనారాచ= మన్మథునియొక్క, శరాసన=వింటితో, అభ=సమానమయిన, విభ్రమ=విలా సములుగల,అనఁగా మదనచాపమువలెఁ బ్రకాశించుచున్నవని భావము. భ్రూ= కనుబొమలయొక్క, విలాసంబు=ప్రకాశముగలది, అగు నీముఖశ్రీసముల్లా సంబునకున్ =అయినట్టినీముఖలక్ష్మియొక్క కాంతివిశేషంబునకు, ఉల్లసిల్లన్= సంతోషించుటకును, సుమనః ... దూషితులు-సుమనః కోదండ=పువ్వే చాపము గాఁగలవాఁడు, అనఁగా మన్మథుఁడనెడి, చండాల=చండాలునియొక్క, సం స్పృష్టి=సంపర్కముచేఁ గలిగిన, దోష=పాపముచే, దూషితులు=నిందితులై న, తమ్మున్ =ఇంద్రాదులననుట, నీకటాక్ష ..ఆలోకంబులన్ - నీకటాక్ష=నీకడ కంటిచూపులయొక్క, విక్షేప=కదలిక లనెడి, సాంద్ర=దట్ట మయిన, చం ద్రాతప=వెన్నెలయొక్క, ఆలోకంబులన్ =కాంతులందు, అభిషేకింపను = తానమాడుటకును, అనఁగా మన్మథుఁ డను చండాలునిసంపర్కముచేఁ గలిగిన దోషమును బొందినతాము సుధారసంబుల స్రవింపఁజేయు వెన్నెలలకీడు వచ్చు నీకడకంటిచూపులందుఁ దానమాడి తద్దోషంబును బాపికొనఁ జూచుచున్నా రనుట. నీకడకంటి చూపులను బొంది మన్మథబాధను దొలంగింప నెంచుచు న్నారని ఫలితార్థము. భవత్ ... మహత్వంబునన్-భవత్ =నీయొక్క, చరణ కమల=పాదపద్మములయొక్క, సేవా= సేవించుటవలన, ఆహిత=పొందఁబడి న, మహత్వంబునన్ =మహిమచే, మదనాపమృత్యుదేవతవలనన్ =మన్మథుఁ డనెడి యపమృత్యువువలన, నిజప్రాణంబులకున్, పరిత్రాణంబును=రక్షణను, కావింపన్ =చేయుటకును, అనఁగా నీపాదసంపర్కమువలన మదనతాపంబు

చల్లార్చుకొని ప్రాణములు దక్కించుకొని బ్రదుకఁగలరని భావము. తలంచుచున్నవారు, కుశలప్రశ్నపూర్వకంబుగాన్ = కుశలప్రశ్నము ముందు గలుగునట్లుగా, ఆగీర్వాణులు=ఆదేవతలు, నీకున్, చెప్పుము, అనినపలుకులు, కొన్ని కలవు. వానిన్ =ఆమాటలను, ఆకర్ణింపుము=వినుము.

క. ఆదిత్యుల మగుమాకును
 నీదోర్లతికాయుగంబు నీ నిర్భరసుఖవ
 ర్షోదయకారణ మై సం
 పాదించుం గాక తరుణి నీ పరివేషంబుల్. 41

టీ. తరుణి=దమయంతీ! ఆదిత్యులము=అదితిసంతతివారము, అగుమాకును = అయినట్టిమాకుఁ గూడ, నీదోర్లతికాయుగంబు = లతలవంటినీబాహుయుగము, నిర్భర... కారణమై - నిర్భర=అధికమగు, సుఖ=సౌఖ్యమనెడి, వర్షోదయ=వర్షముగలుగుటకు, కారణమై=హేతువై, అనఁగా నధికములగు సుఖసమృద్ధులఁ గలిగింపఁగారణమై యని భావము, సూర్యపక్షమందు. నిర్భర సుఖ=అధికమగుసుఖము గలిగించెడి, వర్ష =వానయొక్క, ఉదయ=కలుగుటకు, కారణమై,అనఁగా నధికసుఖము గలిగించువానలకుఁ గారణమై యని భావము. సూర్యపరివేషముగట్టినచో వాన గురియుట సుప్రసిద్ధము, పరివేషంబున్=వలయాకారరేఖలను, సంపాదించుంగాక, అనఁగా నాదిత్యుఁడగు సూర్యునిపరివేషము సుఖవర్షమునకుఁ గారణములైనట్లు, లాదిత్యులమగు మాకు నీబాహాయుగళము పరివేషములను సంపాదించి మాకత్యంతము సుఖముల వర్షించుఁగాక యని భావము. అనఁగా నీబాహుయుగళమును మాకుఁ బెనవేసి కౌఁగిలించిన నత్యంతసౌఖ్య మలవడునని ఫలితార్థము.

తా. ఓదమయంతీ! ఆదిత్యుఁడగు సూర్యునికి లోకసుఖకరము లగువర్షములకుఁ గారణము లయినపరివేషంబులు గలుగునట్లు లాదిత్యుల మగు మాకుఁ గూడ నీబాహులతలు సుఖవర్షదాయక మగు పరివేషంబులను సంపాదించుఁ గాక.

శా. ఔదాసీన్యము నుజ్జగించి విను వాక్యం బస్మదీయంబు మి
థ్యాదోషం బొకయింత లేమి కఖిలాంతర్యామి త్రైలోక్యమ
ర్యాదాస్థాపకుఁ డంగజుండు గతి యీయర్థంబు నిక్కంబునీ
పాదాంభోజరజఃప్రసాదములు మాప్రాణంబు లబ్జాననా!

టీ. అబ్జాననా=పద్మమువంటిముఖము గలదమయంతీ! ఔదాసీన్యముఁన్=నిర పేక్షత్వమును-ఊరకుండుటను, ఉజ్జగించి=మాని, అస్మదీయంబు = మాసంబంధ మైన, వాక్యంబుఁన్, వినుము, మాప్రాణంబుల్, నీపాదా... సాదములు-నీపా దాంభోజ=నీపాదపద్మములయందలి, రజః=పరాగముయొక్క, ప్రసాదములు= అనుగ్రహముకలవి-అనఁగా మాప్రాణంబులు నీయనుగ్రహమున కధీనములైయు న్నవని భావము. నీవు మమ్ము వరించిన బ్రదికెదము లేనిచో మరణింతుమని తాత్పర్యము. ఈయర్థంబు=ఈమాకోరిక, నిక్కంబు=సత్యమైనది, మిథ్యాదో షంబు=అసత్యమాడుటయనెడితప్పు, ఇంత=కొంచెమైనను, లేమికి=లేకపోవు టకు, అఖిలాంతర్యామి=అందఱిహృదయములందును బొందియున్నవాఁడును, త్రైలోక్యమర్యాదాస్థాపకుఁడు = మూఁడులోకములందును మర్యాదలను స్థా పించినవాఁడును, అగు అంగజుండు=మన్మథుఁడు, గతి=దిక్కు, అనఁగా సాక్షి యనుట. ఓదమయంతీ! ఈమాకోరిక యసత్యమని తలంచెదవేమో? అట్లు త లంపకుము మేమసత్యము కొంచెమేనియుఁ బలుకలే దనుటకును, నీనిమిత్తమై యత్యంతపీడను బొందుచున్నా మనుటకును, నందఱిలోను వసించియున్న మన్మథుఁడే సాక్షి యని భావము.

తా. ఓదమయంతీ! ఇఁక నూరకుండక మావాక్యము వినుము. మాప్రాణ ములు నీపాదపద్మముల కధీనములైయున్నవి. ఈమాట సత్యము. అసత్యమని త లంపకుము. మేమెంతమాత్రము నసత్యమాడలేదని నిర్ణయించుటకు నందఱిలోను న్నవాఁడును, మూఁడులోకముల మర్యాదలను స్థాపించువాఁడును నగుమన్మ థుండే సాక్షి. మన్మథసాక్షిగా మే మసత్యమాడలేదు. అలం. అతిశయోక్తి.

శా. మాదివ్యత్వము నీకు నిత్తుమని సంభావింప సిగ్గయ్యెడిఁ
వైదర్భీ! భవదీయరూపవిభవైశ్వర్యంబు మాభూమియం

దేవీ? దీనికిఁ బ్రత్యయం బదియపో కే యేమెల్లనుం గూడి నీ
పాదాంభోజము లాశ్రయించెదము తాత్పర్యంబుసంధిల్లఁగన్.

టీ. వైదర్భి=ఓదమయంతీ, మాదిత్యత్వము=మాయమరత్వము, అనఁగాఁ జావులేకుండునట్టి శక్తిని, నీకుక్, ఇత్తుము, అని సంభావింపక్ = అని గౌరవించుటకు, సిగ్గు, అయ్యెడిక్=కలిగెడిని, మీమానవులకు దుర్లభమగు మాయమరత్వమును నీకిచ్చి గౌరవించెదమని చెప్పుటకు సిగ్గుగలుగుచున్నదని భావము. మాభూమియందుక్=స్వర్గమందు, భవదీయ...శ్వర్యంబు-భవదీయ=నీసంబంధియగు, రూపవిభవ=రూపసంపదయొక్క, ఐశ్వర్యంబు=గొప్పతనము, ఏదీ=ఎచ్చటఁగలదు, అనఁగా నిన్నుఁబోలినసౌందర్యవతులు మాలోకమందు లేరని భావము. దీనికిక్=ఇట్లనుటకు, ప్రత్యయంబు=విశ్వాసార్హమైనది. ఇదియపో=ఇదేసుమీ! ఏము ఎల్లనుక్, కూడి=మేమందఱమును ఏకీభవించి, తాత్పర్యంబు=ఆసక్తి, సంధిల్లఁగక్=కలుగునట్లుగా, నీపాదాంభోజములు=నీపాదపద్మములను, ఆశ్రయించెదము=ఆశ్రయించుచున్నాము. స్వర్గలోకమందుండి యమరుల మనిపించికొనియున్న మేము మదనబాధకోర్వలేక నీయనుగ్రహంబు సంపాదించుకొనినంగాని బ్రదుకమని నిశ్చయించుకొని నీపాదపద్మముల నాశ్రయింపవచ్చినారము. నీవేమాకుఁ బ్రాణదానముచేసి యమరత్వ మిచ్చుటకుఁ దగియుండఁగా నీకు మేమమరత్వ మిచ్చెదమనుటకు సిగ్గుగలుగుచున్నది. తానాపద నుత్తరించికదా పరులను దాఁటింపవలయునని భావము.

తా. ఓదమయంతీ! మాయమరత్వమును నీకిచ్చి గౌరవించెదమనుటకు సిగ్గుగలుగుచున్నది. నీవలె రూపసంపదగలిగినయువతి స్వర్గలోకమం దెక్కడను లేదు. ఇందులకు మేమందఱమును గూడి బ్రదుకనిచ్చ చేవచ్చి నీపాదము లాశ్రయించుటయే ప్రబలదృష్టాంతము. నీదయవలన బ్రతుకఁదలఁచిన మేము నీకమరత్వ మెట్లీయఁ గలుగుదుము? అలం. కావ్యలింగము. అతిశయోక్తి.

మహాస్రగ్ధర. త్వదరాళభ్రూలతాద్వంద్వమున మదనుఁ డోకత
న్విధన్వితత్వ మొందెం, ద్వదుదంచన్మందహాసోకే దయమువనిత
కంఠదర్పు జైత్రాస్త్రుఁజేసెం, ద్వదపాంగాలోకన శ్రీకేతరుణి

మరుని మ,త్స్యధ్వజుంగా నొనర్చెం, త్వదధీనం బెల్ల సామర్
థ్యము రతిపతికిం ౕ దా(మ్రబింబాధరోష్ఠీ. 44

టీ. ఓతన్వీ=ఓదమయంతీ, మదనుఁడు=మన్మథుఁడు, త్వద...మునక్—త్వత్=నీసంబంధులయిన, అరాళ=వంకరలైన, భ్రూలతా=లతలవంటి కను బొమలయొక్క, ద్వంద్వమునక్=ద్వయముచే,ధన్విత్వము=ప్రశస్తమగు ధనుస్సుగలవాఁడగుటను, ఒందెక్=పొందెను. అనఁగాఁ బూర్వము మన్మథుఁడు తనచాపముతోను, బాణములతోను, ధ్వజముతోడను నీశ్వరునిచే దహింపఁబడెను. ఆమన్మథుఁడు నీదయవలన మామనములందుఁ బుట్టుచున్నాఁడు. అతనికి యుద్ధసాధనములు కావలయును గాన నీకనుబొమలే మన్మథునకు చాపములగుచున్నవని భావము. ఈచెప్పుటచే దమయంతికనుబొమలు సౌందర్యవంతములనియు మోహజనకము లగుచున్నవనియు స్పష్టమగుచున్నది. చాపములగుచున్నవని చెప్పుటచేఁ బూర్వముకంటె నిప్పుడాధిక్యము సూచింపఁబడుచున్నది. వనిత, త్వత్...ఉదయము-త్వత్ = నీయొక్క, ఉదంచిత్ = ప్రకాశించుచున్న, మందహాస=చిఱునవ్వుయొక్క, ఉదయము=ఆవిర్భావము లేక పుట్టుక, కందర్పక్=మన్మథుని, జైత్రాస్త్రక్=జయింపఁదగిన బాణములు గలవానిఁగా, చేసెక్=నీచిఱునవ్వే మన్మథునికి లోకముజయింపఁదగిన బాణమగుచున్నదని భావము. తరుణి, త్వదపాంగాలోకనశ్రీ-త్వత్=నీయొక్క, అపాంగాలోకన = కడకంటిచూపులయొక్క, శ్రీ=లక్ష్మి, మరునిక్ = మన్మథుని, మత్స్యధ్వజుక్=చేఁపయే ధ్వజముగాఁ గలవానిఁగా, ఒనర్చెక్ = చేసెను. అనఁగా నీకడకంటిచూపులే మన్మథునకు కేతువగుచున్నదని భావము, స్త్రీల నేత్రములు చేఁపలను బోలియుండును. కాన దమయంతిచూపులు మత్స్యధ్వజునిఁగాఁ జేయుచున్నవని ఫలితార్థము. తామ్రబింబాధరోష్ఠీ=మిక్కిలి యెఱ్ఱనైన దొండపండువంటిపెదవి గల దమయంతీ, రతిపతికిక్, ఎల్లసామర్థ్యము=శక్తియంతయు, త్వదధీనంబు=నీకధీనమయినదే, అనఁగా నీప్రాపుంట చేతనే మన్మథుఁడు మగుడ మామనంబుల నుదయించి సమస్తమును జయింపఁగలుగుచున్నాఁడని భావము.

తా. ఓదమయంతీ ! నీకనుబొమలు మన్మథునకుఁ జాపములగుచున్నవి. నీ మందహాసము బాణమగుచున్నది. నీకడకంటిచూపే యతనికి ధ్వజమగుచున్నది. పెక్కేల? మన్మథునికిఁ గలిగినసామర్థ్యమంతయు నీవలననే సుమీ-
అలం. సహోక్తి. అతిశయోక్తి.

శా. నీలావణ్య పయోధియందు నలరుల్ నేత్రాబ్జముల్ నీమనో
జ్ఞాలాపంబులయందుఁ గర్ణములు నీయాలింగనప్రక్రియా
కేలిన్మేనులు నీముఖాస్వదనసక్తిన్నాలుకల్ మాకు నో
బాలాస్వప్న సమాగమంబుల నిశాపర్యంతయామంబులన్.

టీ. ఓబాలా=ఓదమయంతీ, నిశాపర్యంతయామంబులన్=రాత్రులయొక్క కడజాములందు,స్వప్నసమాగంబులన్=స్వప్నసంభోగములందు, మాకున్, నే త్రాబ్జముల్=కనుదమ్ములు, నీలావణ్యపయోధియందున్=నీసౌందర్య సముద్ర మందు, అలరున్=ఒప్పుచున్నవి, కర్ణములు=చెవులు, నీమనోజ్ఞాలాపంబులయందున్=నీమనోహరములయిన వాక్కులందును, మేనులు=శరీరములు, నీయాలింగన ప్రక్రియాకేలిన్=నిన్నుఁ గౌఁగిలించుకొనుట యనెడిక్రీడయందును,నాలుకల్, నీముఖాస్వదనసక్తిన్=నీముఖమునాస్వాదింప నాసక్తియందును, అలరున్=ఒప్పుచున్నవి. ఓసుందరీ! స్వప్నమందుఁ జూడఁబడిన నీసౌందర్యాదులచే మేము మిక్కిలి మోహితులమై సంతతము నీసమాగమమునే కోరుచున్నాము. ఇట గ్రంథకర్త యింద్రాదులు స్వప్నమందు దమయంతినిజూచి మోహమందినట్టులు చెప్పియున్నాఁడు. ఇంద్రాదిదేవతలకు స్వప్నావస్థ సంభవించుటయే యసంభవము. అట్లుండ దమయంతిని జూచుట యెట్లు ? అనుప్రశ్నము కలుగుట కవకాశమున్నది. కానియింద్రాదుల కిక్కడ స్వప్నావస్థ సంభవింప కపోయినను మోహాతిశయమువలనఁ గలుగునున్మాదావస్థ సంభవించును గాన యప్పుడు దమయంతిని జూడ వీలగుచున్నది. అప్పుడు 'నిశాపర్యంతయామంబులన్'' అనిచెప్పుట వ్యర్థమనితలంపరాదు పగటిపూఁటకంటె రాత్రులందు మోహమధికమగును గాన దత్సూచకముగా నాపదమును బ్రయోగింపవచ్చు.

టీ. ఓదమయంతీ ! ప్రతిరాత్రియందును స్వప్నావస్థయందు నీసౌందర్య

సముద్రమందు నేత్రపద్మములును, నీమధురవాక్కులందు వీనులును, నీయాలింగనములందు శరీరములును, నీముఖము నాస్వాదించుటందు నాలుకలును ఒప్పుచున్నవి. అలం. రూపకము. దీపకము.

వ. అని బృందారకచతుష్టయంబు నీతోఁ జెప్పుమనెం గావున.

క. సురసార్థవాచికస్ర
క్పరిపాటీవిశదరసనపత్త్రుఁడ నగున
న్నరవిందపత్త్రలోచన
చరితార్థునిఁ జేయు కార్యసాఫల్యమునన్. 47

టీ. అరవిందపత్రలోచన=పద్మపత్రములవంటి నేత్రములు గల దమయంతీ! సురస...పత్రుఁడను, సురసార్థ=మంచిరసముగల యర్థములతోనొప్పుచున్న, వాచికస్రక్=సందేశవచనముల పంక్తియొక్క, పరిపాటీ = అనుక్రమముచే, విశద=స్వచ్ఛమైన, రసన=నాలుకయనెడి, పత్రుఁడను=పత్రముకలవాఁడను, ఇట"రసనపత్రుఁ" డనుట చింత్యము. రసనాపత్రుఁడని యుండవలెనని తోఁచెడిని, అగునన్నున్=అయిననన్నును, కార్యసాఫల్యమునన్=కార్యమును సఫలముచేయుటచే,చరితార్థునిఁజేయు=కృతార్థునిఁగాఁజేయుము. అనఁగా నింద్రాదిదేవతలలో నొకనివరించి నాసందేశమును సఫలముచేసి నన్నుఁగృతార్థునిఁగాఁ జేయుము.

తా. ఓదమయంతీ! మంచిరసార్థములు గల సందేశవచనపంక్తులయను క్రమముచే నమలమయిన నాలుకయనెడి పత్రికను దెచ్చినట్టి నన్ను, నింద్రాదులలో నొకని వరించి కార్యమును సఫలముగాఁజేసి చరితార్థునిఁగాఁ జేయుము.

చ. అమరపతి న్వరించెదవొ హవ్యవహు న్వరణం బొనర్చెదో, శమనునిఁ జెట్టవట్టెదవొ సాగరవల్లభుఁ బెండ్లియాడెదో,ప్రమదము గౌతుకంబు,ననురాగము పెంపును సొంపుమీఱఁగాఁ, గమలదళాక్షి యొక్కరునిఁగైకొనుమాయనుమాన మేటికిన్.

టీ. కమలదళాక్షి = పద్మములవంటి నేత్రములు గల దమయంతీ! అమర

పతిన్ =దేవేంద్రుని, వరించెదవో=పెండ్లియాడెదవో, హవ్యవహున్ =అగ్నిని, వరణంబు-ఒనర్చెదవో=వరింతువో, శమనునిన్ =యమధర్మరాజును, చెట్టపట్టెదవొ=వరించెదవో, సాగరవల్లభున్ =వరుణుని, పెండ్లియాడెదో, ప్రమదము=సంతోషము, కౌతుకంబు=వేడుకయు, అనురాగము పెంపును=ప్రేమాతిశయమును, సొంపును=చక్కఁదనమును, మీఱఁగాన్ =మీఱునట్లుగా, ఒక్కరునిన్ =ఒకని, కైకొనుమా=వరింపుమా, అనుమానము=సందేహము, ఏటికిన్ =ఎందుకు.

తా. దమయంతీ ! దేవేంద్రునివరించెదవో, యగ్నినివరించెదవో, యమునిఁ బెండ్లాడెదవో, వరుణునిఁబెండ్లియాడెదవో, చక్కఁగనాలోచించి, సంతోషము, వేడుకయుఁ, బ్రేమాతిశయము ప్రకాశించునట్లు ననుమానమువిడిచి యొకనిఁ బెండ్లియాడుము.

వ. అనిన విని యయ్యంబుజాక్షి యక్షిభ్రూవిక్షేపవిభ్రమంబున ననాదరంబు దెల్పుచు నలవోకగా దిగీశసందేశం బాకర్ణించి యారాజకుమారున కిట్లనియె. 49

టీ. అనినన్ =అని నలుఁడు పల్కఁగా, అయ్యంబుజాక్షి = పద్మములవంటి నేత్రములుగల యాదమయంతి, విని, అక్షిభ్రూవిక్షేపవిభ్రమంబునన్ -అక్షి=నేత్రములయొక్కయు, భ్రూ=కనుబొమలయొక్కయు, విక్షేప = చలనముల వలనఁ గలిగిన, విభ్రమంబునన్ =విలాసముచే, అనాదరంబున్ = తిరస్కారమును, తెల్పుచు,అలవోకగాన్ =అనాదరముతో,దిగీశసందేశంబు=ఇంద్రాదుల వర్తమానమును, ఆకర్ణించి=విని, ఆరాజకుమారునకున్ = ఆనలరాజునకు, ఇట్లు నియెన్ =ఇట్లుపలికెను.

తా. స్పష్టము.

తే. ప్రశ్న మొక్కటి యొక్కటికిఁ బ్రతివచనము
యుక్తి యనుకూలమై యుండఁ దుభయమునకు
నేను నీవంశనామంబు లెవ్వి యనిన
నెవ్వరినొ ప్రస్తుతించితి వింతతడవు. 50

టీ. ప్రశ్నము = అడిగినప్రశ్నము, ఒక్కటి=ఒకటియైయున్నది, ప్రతివచనము=దానికి నీవిడినప్రత్యుత్తరము, ఒకటి=మఱియొకటియైయున్నది. ఉభయమునకున్ =ప్రశ్నప్రత్యుత్తరములకు, యుక్తి, అనుకూలమై=తగినదై, ఉండదు, ఉండలేదు, నేనడిగినదానికి సమాధానము చెప్పలేదని భావము. నేను, నీవంశనామంబులు=నీకులము, నీపేరును, ఎవ్వి=ఏవి, అనినన్ =అనిపలుకఁగా, ఇంతతడవు=ఇంతసేపును, ఎవ్వరినో=అదెవ్వరినో,ప్రస్తుతించితివి=స్తోత్రముచేసితివి, ఇట "నెవ్వరినో ప్రస్తుతించితివి" అని చెప్పుటచే నింతకు ముందు నలుఁడు వర్ణించిన దిక్పాలురచరిత్రమును సుంతయేనియు నాహరముతో వినకుండినట్లు తెలియవచ్చుచున్నది.

తా. ఓరాజకుమారా! అడిగినప్రశ్న మొక్కటి. ఆప్రశ్నమునకు ప్రత్యుత్తరము మఱొకటి. ఆరెండింటికిని యుక్తియనుకూలమై యుండలేదు. నీవంశమును నీపేరును దెలుపుమనఁగా నింతసేపు నెవరినో యనవసరముగా వర్ణించితివి.

క. ఒకచోటఁ బ్రకాశించియు
నొకచోట నిగూఢ యగుచు నొదవించెం గా
తుకలక్ష్మి నీసరస్వతి
ప్రకటయు గూఢయును నగుసరస్వతి వోలెన్. 51

టీ. ప్రకటయు=స్పష్టముగాఁగానవచ్చుచున్నదియు,గూఢయును=ఒకచో స్పష్టముగాఁ గానరాకున్నదియు, నగుసరస్వతివోలెన్ =అయినట్టిసరస్వతీనదివలెను, నీసరస్వతి=నీవాక్కు, ఒకచోటన్ = ఒకప్రదేశమందు, ప్రకాశించియున్ =స్పష్టమగుచు, అనఁగా నేనడిగినప్రశ్నమునకుఁ దగినట్టుచెప్పుచు, ఒకచోటన్ =ఒకప్రదేశమందు, నిగూఢ=కనఁబడనిది, అనఁగా నాయడిగినప్రశ్నమునకుసుంతేనియు సంబంధింపకుండునటులు చెప్పుటచే నదృశ్యమానమయినదనియు ననిభావము. కౌతుకలక్ష్మి=మిక్కిలివేడుకను, ఒదవించెన్ =కలిగించెను.

తా. ఒకచోటఁ గానవచ్చుచు నొకచోట నదృశ్యమానయగుచు నున్న సరస్వతీనదివలెనే నీవాక్కొకచో నాయడిగినప్రశ్నమునకు సంబంధించినదగుటచేఁ గానవచ్చుచు, నొకచో నాయడిగినప్రశ్నమునకు సంబంధింపనిదగుట

చేఁ గానరాకయునుండి నాకు వేడుకను బుట్టించుచున్నది. అలం. ఉత్ప్రేక్ష, ఉపమ.

తే. అధికతరు లైనఁగాని దిశాధిపతులు
కౌతుకము నాకు నీవంశకథలయందు
దప్పిగొన్నట్టివారికి గాదప్పి దీఱ
సలిలపూరంబు హితవొ యాజ్యంబు హితవొ. 52

టీ. దిశాధిపతులు=దిక్పాలురు, అధికతరులు=మిక్కిలిగొప్పవారు, ఐనఁగాని=అయినను, నాకున్, నీవంశకథలయందున్=నీకులకథలయందు, కౌతుకము=వేడుక, అనఁగా దేవతలు నీకంటెగొప్పవారైనను నీవంశకథల వినుటకే నాకువేడుక. అంతియకాని దేవతలవృత్తాంతముతో నాకుఁబనిలేదు. గొప్పవారి వంశకథలు విడిచినావంశకథలు వినుటవలననీకుఁ బ్రయోజన మేమని పల్కెదవేని చెప్పెదవినుము, దప్పిగొన్నట్టివారికిన్ = దగ గొని యున్న మానవులకు, ఆదప్పిదీఱన్=ఆదగను దొలఁగించుకొనుటకు, సలిలపూరంబు=జలప్రవాహము, హితవొ=ప్రియమైయుండునో, ఆజ్యంబు= నేయి, హితవొ=ప్రియమయియుండునో, యోజింపుము(అధ్యాహారము)=ఆలోచింపుము.

తా. ఓపురుషవరేణ్యా ! నీకంటె దిక్పాలురు పూజ్యులైనను, నీవంశకథలందున్నకౌతుకము నాకు దేవతలకథలందు లేదు. పరమపుణ్యులైన దేవతలకథలనువిడిచినాకథలనువినిన ప్రయోజన మేమని యందువేని చెప్పెదవినుము, వాని యం దాధిక్యమున్నను దప్పిగొని యున్నమనుష్యుల కాదప్పి తొలఁగించుకొన జలము హితమైయుండునా, నేయి హితమైయుండునా యోజింపుము. అట్లె నీచరిత్రము తక్కువైనదైనను నాకు దానినే వినవలయునని కోరిక. అలం. రూపకము, అర్థాంతరము.

వ. ఏను జేసినప్రశ్నంబునకు నుత్తరంబు నీమీఁద నప్పైయున్న యది. ఇప్పుడైన నాఋణంబుఁ దీర్చుకొనుము. భవాదృశంబైననాయకరత్నంబు నేవంశంబు భరించె? ఏవర్ణంబులు

నీపుణ్యనామంబునకుం బ్రకాశకంబు లైనయవియని పరిమి
తంబుగాఁ బలికి కుండినన రేంద్రనందన యూరకుండుటయు
నన్నిషధమండలాధీశ్వరుండు. 53

టీ. ఏను, చేసినప్రశ్నంబునకున్, ఉత్తరంబు = ప్రత్యుత్తరము, నీమీఁదన్, అప్పై, ఉన్నది, అనఁగా నాయడిగినప్రశ్నమునకు నీవు తగినట్టు ప్రత్యుత్తర మీయకపోవుటచే నాకప్పు తీర్పవలసి యున్నదని భావము, ఇప్పుడైనన్, నాబుణంబున్, తీర్చుకొనుము, భవాదృశంబు=నీవంటివాఁడు, ఐననాయకరత్నంబున్ =అయినట్టినాయకమణిని, ఏవంశంబు=ఏకులము, భరించెన్ = తాల్చినది, అనఁగా నేవంశంబునఁ బుట్టితివని భావము, ఏవర్ణంబులు=ఏయక్షరములు, నీపుణ్యనామంబునకున్ =నీపవిత్రమయిననామమునకు, ప్రకాశకంబులు, ఐనయవి, అని, పరిమితంబుగాన్, పలికి, కుండిననరేంద్రనందన = దమయంతి, ఊరకుండుటయు=ఊరకుండఁగా, అన్నిషధమండలాధీశ్వరుండు = ఆనిషధాధీశ్వరుం డయినయానలమహారాజు.

తా. స్పష్టము.

ఉ. తామరసాక్షి వంశకథ దవ్వుల నుండఁగనిమ్ము చెప్పఁగా
దేమిటికన్న నైజముగుహీనత గల్గినఁ జెప్ప టొచ్చెము
ద్దామతగల్గెనేని నుచితంబయి యుండదు సెప్పికొంట నేఁ
డీమెయిఁ బ్రేష్యభావము వహించినికృష్టత నేఁగు దెంచుటన్.

టీ. తామరసాక్షి=పద్మములవంటి నేత్రములు గల దమయంతీ! వంశకథ= నావంశవృత్తాంతము, దవ్వులన్ - ఉండన్ - ఇమ్ము=దూరముగానుండనీ, చెప్పన్ =చెప్పుటకు, కాదు=తగదు, అనఁగాఁ జెప్పఁగూడదనుట, ఏమిటికిన్ అన్నన్ =ఎందుచే ననఁగా, నైజము= స్వకీయమయినది, అగుహీనతన్ =అయినట్టి చిన్నతనము, కల్గినన్ = కలిగియున్నచో, అనఁగా నీచకులమయినచో ననుట, చెప్పుట, ఒచ్చెము = అవమానకరము, ఉద్దామత = గొప్పతనము, కల్గెన్ ఏనిన్ =కల్గినచో, నేఁడు, ఈమెయిన్ = ఈరీతిగా, ప్రేష్యభావము=

సేవకత్వము లేక దూతత్వము, వహించి, నికృష్టతన్=హీనత్వముచే, ఏగుదెంచుటన్=వచ్చియుండుటచే, చెప్పికొంట, ఉచితంబు=తగినది, అయి,ఉండదు.

తా. ఓదమయంతీ! వంశవృత్తాంతమును జెప్ప వలనుపడదు. కావున దాని దూరముగా నుంపుము. ఏమనఁగా, నాకుల మొకవేళ హీనమయిన దయినచోఁ జెప్పికొనుట యవమానకరము. నాకులము గొప్పదయినచో నేనిట్లు సేవకుఁడనై యిచ్చటి కిప్పు డీరీతిగా వచ్చుటచేఁ జెప్పికొంట తగియుండదు.

తే. ఇంతమాత్రంబు సెప్పెద ♦ నెఱిఁగికొనుము
నృపతికన్యవు గడుమాన ♦ నీయ వగుట
మైత్రి కలసేయఁ దగ దేను ♦ మనుజవిభుఁడ
రాజవంశకరీరుండ ♦ రాజవదన. 55

టీ. రాజవదన=దమయంతీ! నృపతికన్యవు = రాజనందనవును, కడున్ = మిక్కిలి, మాననీయవు=పూజనీయురాలవును, అగుటన్ = అయియుండుటచే, ఇంతమాత్రంబు=స్వల్పముమాత్రమే, చెప్పెదన్, ఎఱిఁగికొనుము = తెలిసికొనుము, మైత్రికిన్ = స్నేహమునకు, అలచేయన్=భేదముచేయుటకు, తగదు, ఏను, మనుజవిభుఁడన్=రాజను,రాజవంశకరీరుండన్=చంద్రవంశమనెడి వెదురుపొదకు వెదురుబోడువంటివాడను, అనఁగాఁ జంద్రవంశమందుఁ బుట్టినవాఁడనని భావము.

తా. ఓదమయంతీ! నీవు రాజకుమారికవు; నీవు పూజనీయురాలవు. స్నేహితులపట్ల కపటముచేయరాదు. కొంచెము చెప్పెదను, తెలిసికొనుము. నేను మానవేశ్వరుఁడను.చంద్రవంశమనెడి వెదురుపొదకు వెదురుబోడువంటివాఁడను. అలం. రూపకము.

ఉ. పేరడుగం దలంచెదవు ♦ భీమతనూభవ యావిచారముం
దూరముసేయు మెవ్వరికి ♦ దోసము తాఁదనపేరుసెప్ప టా
చారపరంపరాస్థితికి ♦ శాస్త్రము మూలము శాస్త్రచోదితా
చారవివేకహీనుఁ డగు ♦ జాల్మునిమెత్తురె? పండితోత్తముల్.

టీ. భీమతనూభవ=ఓదమయంతీ, పేరు=నానామము, అడుగఁగ, తలం చెదవో=అడుగఁదలంచియున్నావేమో, అవిచారముగ=ఆయాలోచనము,దూరము చేయుము=దూరముగా నుంచుము, తాఁ, తనపేరు, చెప్పుట=చెప్పికొనుట, ఎవ్వరికిఁ=ఎవ్వారికయినను, దోసము=పాపజనకము, ఆచారపరంపరాస్థితికిఁ=ఆచారములయొక్క క్రమ ముండుటకు, శాస్త్రము, మూలము=కారణము, శాస్త్ర...హీనుఁడు—శాస్త్ర=శాస్త్రముచేత, చోదిత=ప్రేరితమైన, ఆచార=ప్రవర్తనలయందలి, వివేక=జ్ఞానముచే, హీనుఁడు=శూన్యుఁడు, అగు జాల్మునిఁ=అయినట్టినీచుని, పండితోత్తముల్=పండితశ్రేష్ఠులు, మెత్తురె=మెచ్చుకొందురా? మెచ్చుకొనరనుట.

తా. దమయంతీ!నాపే రడుగఁదలంచియున్నావా? అట్లయిన నావిచారమును దూరమునునుంచుము. ఎవఁడయినను దనపేరు తానుజెప్పికొనుట పాపము. ఆచారపరంపర నిలుచుటకు శాస్త్రమేమూలము.శాస్త్రముచేఁ బ్రేరితములగు నాచారములను దెలిసికొననినీచుని పండితోత్తములు మెచ్చుకొనరు.

వ. అదియునుఁ గాక.　　57

టీ. అదియునుంగాక=మఱియును.

క. కువలయనేత్ర సమక్ష
　వ్యవహారంబునకు యుష్మదస్మత్పదముల్
　శ్రవణశ్రావణ యోగ్యము
　లవుచుండఁగఁ బేరుసెప్ప నడుగఁగనేలా?　　58

టీ. కువలయనేత్రి=కలువవంటికన్నులు గలదమయంతీ! యుష్మదస్మత్పదముల్=నీవు నేను అనుపదములు, సమక్షవ్యవహారంబునకుఁ = సన్నిధానమందు నిర్వర్తించుకొనెడి వ్యవహారమునకు, శ్రవణ...యోగ్యములు-శ్రవణ=వినుటకును,శ్రావణ=వినిపించుటకును,యోగ్యములు=తగినవి; అవుచుండఁగఁ, పేరు, చెప్పఁ=చెప్పుటకును, అడుగఁ=అడుగుటకును, ఏలా=ఎందుకు?

తా. కలువవంటికన్నులు గలదమయంతీ! సన్నిధానమందు వ్యవహారములను జక్కఁబెట్టుకొనుటకు యుష్మదస్మచ్ఛబ్దములు (అనఁగా నేను నీవు అను

పదములు) వినుటకును, వినిపించుటకును, దగియుండఁగాఁ బేరడుగుటవలన నేమిప్రయోజనము.

సీ. అని శారదం బైన ♦ వనమయూరము వ్రాలె
నహితాపకారకుం ♦ డతఁడు వలుక
రాజహంసియుఁబోలె ♦ రమణీలలామంబు
పదములం దనురాగ ♦ ముదయ మొంద
సమయోచితంబుగా ♦ సారస్య మొప్పారఁ
బలికె నిట్లని మహీ♦పాలుతోడ
నన్వయం బెఱిఁగించి ♦ యభిధాన మెఱిఁగింప
కునికి మ మ్మాదరిం♦చిన తెఱంగె?
తే. యనఘ! మము నీవు వంచింప ♦ నభిలషించె
దేము నేరమె వంచింప ♦ నిపుడు నిన్నుఁ
బేరు సెప్పిన నీ కనా♦చారమేని
మాకు న్యాయంబె నీతోడ ♦ మాటలాడ. 59

టీ. అని=ఈప్రకారముగా, అహితాపకారకుండు-అహిత=శత్రువులకు, అపకారకుండు = అపకారముచేయువాఁడు, అనఁగా శత్రువులను జంపువాఁడని భావము. నెమిలిపక్షమందు: అహితాపకారకుండు - అహి=పాములకు, తాప=సంతాపమును, కారకుండు=చేసెడిది, అనఁగా పాములను జంపునదనియర్థము. అతఁడు=ఆనలరాజు, శారదంబు=శరత్కాలమందలిది, ఐనవనమయూరమువోలెన్=అయినట్టి యడవినెమిలివలెను, పలుకన్ = సంభాషింపఁగా, అనఁగా నెమిలి వర్షకాలమందుఁగూసి శరత్కాలమందు మౌనముదాల్చియుండుట సుప్రసిద్ధము. కావున నట్లె నలుఁడు చెప్పవలసినది చెప్పి మౌనముదాల్చియుండెననిభావము. ఇట నలుఁడుపలికెనని చెప్పినను శారదం బైన మయూరముతోఁ బోల్చుటచే మౌనముదాల్చెననియే కవియభిప్రాయము. ఇట్లు చెప్పుట సంస్కృతమునకుఁగూడ సరిగానున్నది. శ్లో॥ అదోయమాలప్య శిఖీవశారదో

బభూవతూష్ణీ మహీతాపకారకః॥ అని యున్నది.రమణీలలామంబు= స్త్రీలక లంకారమువంటిదగు దమయంతి, రాజహంసియుఁ-బోలెన్ =రాజహంసివలె ను, పదములందున్ =నలునివాక్యములందుఁగల ప్రతిపదమునందును, అనురాగ ము= ప్రేమ, ఉదయము-ఒందన్ =జనింపఁగా, అనఁగా నలుఁడు పలికినప్రతి పదమును దమయంతి కనురాగమును గలిగించె నని భావము. హంసిపక్షమందు:- పదములందు = కాళ్లయందు, అనురాగము = ఎఱ్ఱఁదనము, ఉదయమొం దన్=జనింపఁగా, అని యర్థము. సమయోచితంబుగాన్ = సమయమునకుఁ దగునట్టుగా, సారస్యము = సరసపుఁదనము, ఒప్పారన్ = ఒప్పునట్లుగా, ఇట్లని=ఈరీతిగా, మహీపాలుతోడన్ = నలునితో, పలికెన్ = సంభాషిం చెను. అనఁగా శరత్కాలమురాఁగానే నెమిలి ధ్వనిచేయక యూరకుండును, రాజహంసలు,ధ్వనిచేయును. అట్లె నలుఁ డూరకుండెననియు దమయంతి మాట లాడుచుండెననియు భావము. మఱియు నలుఁడుపలికిన ప్రతిపదము నామె కను రాగముకలిగించుటచే నతం డూరకున్నను దానూరకుండలేక సంభాషించె నని తెలియఁదగినది. అన్వయంబు=కులమును, అనఁగాఁ గులము పేరును, ఎఱిఁగించి= తెలిపి, అభిధానము=నీపేరును, ఎఱిఁగింపక-ఉనికి=తెలుపకుండుట, మమ్మున్, ఆదరించినతెఱంగె=ఆదరించినవిధమా, అనఁగా గాదనుట, వంశము పేరు చెప్పినట్లు నీపేరునుగూడఁ దెలిపినచో నే మమ్మాదరించిన ట్లగును కానిచో నాదరింపలేదనుట, అనఘ=పాపరహితుఁడ వగునోపురుషవరేణ్యా ! మమ్మున్, నీవు, వంచింపన్ =మోసపుచ్చుటకు, అభిలషించెదు=కోరుచున్నావు, ఇపుడు, మేము, నిన్నున్, వంచింప నేరమే, పేరు చెప్పినన్ = నీపేరు చెప్పినచో, నీకున్, అనాచారమేని=ఆచారముకాదని తోఁచినచో, నీతోడన్=పరపురు షుఁడవును క్రొత్తగా వచ్చినవాఁడవును నగునీతో, మాటలాడన్, మాకు, నాయంబె=న్యాయమగునా? అనఁగాఁ గాదనుట.

తా. శత్రువుల కపకారముచేయునట్టి నలుఁ డటు పలికి సాములకుఁ దా పముగలిగించునదియు శరత్కాలమందలిదియు నగుమయూరమువలెనే యూర కుండఁగా రాజహంసివలెనే దమయంతి నలుఁడు పల్కినవాక్యములందలి ప్రతి

పదమునందు ననురాగముచెందుచు సమయానుకూలముగా నలరాజుతో నిట్లని యెను. ఓరాజా! నీవంశముపేరు చెప్పి నీపేరు చెప్పకుండుటచే మమ్ము నాద రింపలేదనియే భావించెదము. నీవు మమ్ము వంచించిన మేనుమాత్రము నిన్ను వంచింపలేమా? నీపేరుచెప్పుటయే నీకు నాచారవిరుద్ధమైనచోఁ బరపురుషుఁడ వైననీతో మాటలాడుట మా కాచారవిరుద్ధము కాదా! కావున మాతోడ మాటలాడకుము. అలం. శ్లేష. ఉపమ.

తే. అన్యపురుషులతోడ నేయ్యంపుగోష్ఠి
యధిప! మముబోఁటిరాజకన్యకల కగునె
యది కులాబలాచారసహాసనాస
హాతిసాహసకౌతూహలావసథము. 60

టీ. అధిప=ఓరాజా, అన్యపురుషులతోడన్ = పరపురుషులతో, నెయ్యం పుగోష్ఠి=సరసప్రసంగము, మముబోఁటిరాజకన్యకలకున్ = మావంటిరాజకు మారికలకు, అగునె=తగునా? అది=అట్లుసంభాషించుట, కులా...వసథము— కులాబలా=కులస్త్రీలయొక్క, ఆచార=ప్రవర్తనముతోడ, సహాసన=ఒకచోఁ గూర్చుండుటకు-పొత్తునకనుట-పొసఁగియుండుటకని భావము. అసహా=సైఁప నిదియు, అతిసాహస=మిక్కిలిసాహసము కలదియు నగు, కౌతూహల=వేడు కకు,ఆవసథము = గృహమువంటిదియు, (అగునని) అధ్యాహారము - అనఁగా కులస్త్రీకిఁ బరపురులతోడిగోష్ఠి కులకాంతల యాచారమునకు నెంతమాత్ర మును బొసఁగనియతిసాహసపువేడుక యని యర్థము. ఇట్లు పరపురుషు లతో సంభాషించుట కులాంగనల కాచారదూష్యమగునని యగుటయే కాక మిక్కిలి సాహసకార్యము గూడనగుచున్నది. కావున నీపేరు చెప్పుట నీ కాచారముకానిచోఁ గులాంగనలమగుమాకు నీతోడసంభాషించుట యాచార విరుద్ధముకాదా అని భావము. "అది యగును గులాచారసహాసనాస" అని పెక్కింటి ప్రతులలోఁ బాఠము కానవచ్చుచున్నది. కాని మూలములో, శ్లో॥ కులాబలాచారసహాసనాసహా॥ అని యుండుటచే నీపాఠమే మూలాను సారముగానున్నదని యెంచి తక్కినవి యుపేక్షింపఁబడె.

తా. స్పష్టము.

క. తగవే కులకన్యలకును
మగవారలతోడ రూపకమహనీయులతో
మిగులంగఁ దడవు లోపలి
నగళులలో మాటలాడ నయతత్త్వనిధీ. 61

టీ. నయతత్త్వనిధీ—నయ=నీతియొక్క, తత్త్వ = యాథార్థ్యమునకు, నిధీ=తావయినయోమహనీయా, రూపమహనీయులతోన్—రూప=సౌందర్యముచే, మహనీయులు=పూజ్యులు, అనఁగా మిగులసౌందర్యముగలవారలైనయని భావము. మగవారలతోడన్=పురుషులతో, మిగులంగన్=మిక్కిలి, తడవు= ఆలస్యముగా, అనఁగాఁజాలసేపనియర్థము, లోపలినగళులలోన్ = అంతఃపురములలో, మాటలాడన్ = సంభాషించుట, కులకన్యలకును = కులస్త్రీలకు, తగవు+ఏ=న్యాయమా? అనఁగాఁగాదనుట, మగవారితోనే మాటలాడరాదు. అందును సౌందర్యవంతులగుపురుషులతో బొత్తిగా మాటలాడరాదు. అందును అంతఃపురంబున మాటలాడుట మిక్కిలికూడదు. అందును ఘంటలకొలఁది కాలము మాటలాడుట మఱింతకూడదు. కావున నీతోమాటలాడుట మాకుఁ దగదని భావము.

తా. ఓపురుషవరేణ్యా! పూజనీయ మగునిట్టిసౌందర్యము గలనీతో, నిట్టి యంతఃపురములలో, నింతకాలము మాటలాడుటమావంటిరాజకన్యలకుఁ దగదు. అలం. కావ్యలింగము.

వ. అనిన విని ప్రతిబంధరచనాచాతుర్యంబును మనంబునం దభినందించుచుఁ బ్రత్యుత్తరంబు వేఱొండు వెదకి పొడగానలేక యాలోకోత్తరచరిత్రుండు విదర్భరాజపుత్త్రిం గనుంగొని నేత్రాంచలంబుల నలంతినవ్వు దొలంకాడ నిట్లనియె.

టీ. అనినన్=అని దమయంతి పలుకఁగా విని, ప్రతిబంధరచనాచాతుర్యంబును = నిషేధించుటయందలి నేర్పరితనమును, మనంబునందున్, అభినందిం

చుచుఁ=పొగడుచు, అనఁగా దమయంతి చెప్పిన ప్రతిషేధవాక్యముల నాలించి మిక్కిలి పొగడుచునని భావము. ప్రత్యుత్తరంబు, వేఱొండు=మఱియొకటి, వెదకి, పొడగానలేక=కనుఁగొనలేక, ఆలోకోత్తరచరితుండు=లోకము నతిక్రమించిన ప్రవర్తనము గల యానలుఁడు, విదర్భరాజపుత్త్రిన్ = దమయంతిని, కనుఁగొని = చూచి, నేత్రాంచలంబులన్ = కనుఁగొనలయందు, అలంతినవ్వు = చిఱునవ్వు, తొలంకాడన్=వెలయుచుండఁగా, ఇట్లు. అనియెన్ = ఈరీతిగాఁ బలికెను.

సీ. వామాక్షి మాక్షికస్వాదుపేశల మైన
పలు కేల యొరులపైఁ బాఱవైవఁ
జంచద్రసామృతస్నానపేశల మైన
దృగ్విలాసముఁ జేర్పు దివిజులందు
సఫలంబుసేయు మత్సమధికాయాసంబు
నేను జెప్పినకార్య మిచ్చగించి
దేవతాపతిభక్తిఁ దిరముగా మతి నిల్పి
ప్రకటకల్యాణవై భవము నొందు.

తే. వెలఁది నామీఁదఁ గడుఁగృపావిలసనంబు
నాటిచూచిన చూపు మన్ననయ చాలు
నాకుఁగా నుద్ధరింపుము నాకవిభుల
హస్తములు మోడ్చి వేఁడెద నాదరమున. 63

టీ. వామాక్షి = సుందరమయినకనులు గలదానా, మాక్షికస్వాదుపేశలము=తేనెవలెను మధురమైనదియును మృదువైనదియు, ఐనపలుకు = అయినట్టి మాటను, ఒరులపైన్ = ఇతరులపై, పాఱవైవన్, ఏల=ఎందుకు, చంచద్రసామృతస్నానపేశలము—చంచత్=ప్రకాశించుచున్న, రస=అనురాగమనెడి, అమృత=సుధారసమునందు, స్నాన=అభిషేకముచే, పేశలము=మృదువైనది, ఐనదృగ్విలాసము=అయినట్టి నేత్రవిలాసమును, దివిజులందున్ = దేవతలందు,

చేర్పుము=పొందింపుము. అనఁగాఁ బ్రేమసహితమగు చూపుతో దేవతలను జూచి యందులో నొకరిని వరింపుమని భావము. నేను, చెప్పిన కార్యముఁ, ఇచ్ఛగించి = అభిలషించి, మత్సమధికాయాసంబు = మిక్కిలి యధికమయిన నాప్రయాసము, సఫలంబు చేయుము = ఫలింపఁజేయుము. అనఁగా దేవతలను వరించి నాకార్యమును నెఱవేర్పుమనిభావము, మదిఁ, దేవతాపతిభక్తిఁ= ఇంద్రాదులందు పతిభక్తిని, తిరముగాఁ=నిశ్చలముగా, నిల్పి=స్థాపనచేసి, ప్రకటకల్యాణవైభవమును-ప్రకట=ప్రసిద్ధమైన, కల్యాణవైభవము = వివాహమహోత్సవమును, బొందుము. వెలఁది = దమయంతీ, నామీఁదఁ, కడుఁ= మిక్కిలి, కృపావిలసనంబుఁ=దయావిలాసమును, నాటి=మొలవేసి, చూచినచూపు = చూచినట్టిచూపుయొక్క, మన్ననయ=గౌరవమే, చాలుఁ = సరిపోవును, ఆదరమునఁ = ప్రేమతో, హస్తములు=చేతులను, మోడ్చి=ముకుళించి, వేఁడెదఁ = ప్రార్థించెదను, నాకుఁగాఁ = నానిమిత్తము, నాకవిభులఁ = ఇంద్రాదులను, ఉద్ధరింపుము = పెండ్లియాడి మదనతాపవిచారసముద్రమునుండి లేవఁదీయుము.

తా. ఓదమయంతీ! మధురసమువలెనే మధురమయిన వాక్యములతో నొరులకుఁ జెప్పనేల ? అనురాగమనెడి యమృతంబువంటుఁ దానమాడుటచే మిక్కిలిమృదులమైన నీకటాక్షాంచలమును దేవతలపై నుంపుము. నేను జెప్పిన కార్యమును చేసి నాయాయాసమును ఫలింపఁజేయుము. దేవతలందుఁ బతిభక్తి నుంచి పెండ్లియాడుము. మిక్కిలియనురాగసహితమగుచూపుతో నన్నుఁజూచి దయారసమును నాపైనుంచితివి. ఆగౌరవమే నాకుఁ జాలును. దోసిటఁబట్టి ప్రార్థించుచున్నాను; నానిమిత్తమై దేవతలను బాధలనుండి యుద్ధరింపుము.

తే. ఇందుబింబాస్య నారాక ♦ కెదురుచూచు
నయనములు వేయు విరియించి ♦ నాకభర్త
యుదిలకొనుచున్నవా రాత్రి ♦ నున్నముగురుఁ
గాలయాపన సేయఁగాఁ ♦ గాదు నీకు.　　　64

టీ. ఇందుబింబాస్య [illegible] దమయంతీ ! నా

కభర్త=దేవేంద్రుఁడు, నయనములువేయు = సహస్రనేత్రములను, విరియించి= తెఱచికొని, నారాకకై = నేవచ్చునిమిత్తము, ఎదురుచూచుచున్, ఉన్నముగురు =తక్కిన ముగ్గురును, ఆర్తిన్=మదనతాపముచే, ఉడిలకొనుచున్నవారు= చింతనొందుచున్నవారు, నీకున్, కాలయాపన=కాలక్షేపము, చేయఁగాన్, కాదు=చేయ వలనుపడదు.

తా. ఓదమయంతీ! దేవేంద్రుఁడు తనవేయినేత్రములను దెఱచికొని సంతత మును నానిమిత్తము చూచుచుండును. తక్కినయగ్నియమవరుణులు గూడఁ బీడనొంది మిగులఁ జింతిలుచున్నారు. కాలక్షేపముచేయక వెంటనే యొక రిని వరింపుము.

చ. హరిహయుఁడేమియయ్యెనొకో! యామదనానలతాపవేదనన్
వరుణుఁడువిప్రయోగమునఁ వాఁడఁడె? యింతకు దండపాణిదా
విరహభరంబునన్మిగులఁ వేఁగఁడె? నొవ్వఁడెవీతిహోత్రుఁడుం
బరిసరకేళికావనసమాగతమందసమీరణంబులన్. 65

టీ. ఆమదనానలతాపవేదనన్=ఆమన్మథాగ్నిసంబంధి యగు సంతాపము వలనఁ గలిగిన బాధచే, హరిహయుఁడు=దేవేంద్రుఁడు, ఏమియయ్యెనొకో= ఎట్టి దురవస్థను జెందియున్నవాఁడో, విప్రయోగమునన్ = వియోగముచేత, వరుణుఁడు, వాఁడఁడె=కాంతిదక్కఁడా? అనఁగా విరహతాపమును బొందు ననుట, ఇంతకున్=ఈపాటికి, దండపాణి=యముఁడు, తాన్, విరహభరంబు నన్=నీవియోగాతిశయముచే, మిగులన్=మిక్కిలి, వేఁగఁడె=తాపమునొం దఁడా, వీతిహోత్రుఁడున్=అగ్నిహోత్రుఁడును,పరిసర... సమీరణంబులన్- పరిసర=సమీపముననున్న, కేళికావన=ఉద్యానవనములనుండి, సమాగత=వచ్చు చున్న, మందసమీరణంబులన్=మందమారుతములచే, నొవ్వఁడె=బాధనొం దఁడా, అనఁగా బొందుననుట.

తా. ఓదమయంతీ! ఈపాటికింద్రుఁడు నీవియోగతాపముచే మిగుల బా ధనొందక మానఁడు. వరుణుఁడును వియోగముచే మిగులఁ గాంతిహీనుఁడై చూపట్టును. యముఁడును వియోగతాపముచే మిక్కిలి బాధచెందును. అగ్ని

హోత్రుఁడు కూడ నీపాటికి మందమారుతప్రసారములచే మిగుల బాధచెంది యుండును. కానఁ గాలయాపనము చేయ వీలుపడదు.

వ. అనిన విదర్భరాజకన్యక యిట్లనియె.　　66

తే. కలికినవ్వు ప్రగల్భతాకారణంబు
　　కాదుకా దంట వాచావిగర్హణంబు
　　పలుకకుంట తిరస్కారకలనముద్ర
　　గాన ప్రత్యుత్తరం బిచ్చుదాన నీకు.　　67

టీ. కలికినవ్వు=అందమైననవ్వు, ప్రగల్భతాకారణంబు—ప్రగల్భతా=ధృష్టత్వమునకు, కారణంబు=హేతువు, అనఁగా నీవంటివానిఁ బరిహసించుట కొంటెతనమునకు హేతువగునని భావము. కాదు కాదు అంట=వలదువలదని నిషేధించుట, వాచావిగర్హణంబు=వాఙ్నిందయగును, పలుకకుంట=సంభాషింపకుండుట, తిరస్కారకలనముద్ర=పరిభవసూచక మయినది, కాన, నీకున్, ప్రత్యుత్తరంబు, ఇచ్చుదానన్=ఇచ్చుచున్నాను. అనఁగా మహనీయుఁడవగు నిన్నుఁ బరిహసించినను, వలదని నిషేధవచనము పలికినను నేప్రత్యుత్తరం బీయకపోయినను నీకవమానకరముగా నుండును. కాన ప్రత్యుత్తర మిచ్చుచున్నానని భావము.

తా. పరిహాసము కొంటెతనమునకుఁ గారణమగును. కాదుకా దనువచనము నిందాజనక మయినది. మాఱు మాటాడకుండుట తిరస్కారము కలిగించును. కాన నీకిప్పుడు దేవతాసందేశమునకుఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నాను.

సీ. అమరాంగనాసంగమాభిశోభితుఁడైన
　　　　హరి కేల మానుషీపరిచయంబు
　　కామింతునే యేను వైమానికాధీశు
　　　　హస్తిఁ గామించునే హరిణరమణి
　　యారకూటకలాపమర్హమే కలవాని
　　　　కే నర్హ నే నిర్జరేశ్వరునకు

నఖిలలోకాధీశుఁ డైన యమరేంద్రుఁ డెక్కడ
నే నెక్కడ వరాటి నెన్నిచూడ

తే. నలపతివ్రత నైన యేఁ దలఁప నొరునిఁ
దివిరి నిందించియేఁ బ్రస్తుతించియేని
నలినబిససూత్రమును బురంధ్రులతలంపు
సమముగ ద్రెయ్యును లవచాపలమున నైన. 68

టీ. అమర...శోభితుఁడు - అమరాంగనా=దేవతాస్త్రీలయొక్క, సంగమ=కూటమిచే, అభిశోభితుఁడు=ప్రకాశించువాఁడు, ఐనవారికిన్=అయినట్టిదేవేంద్రునకు, మానుషీపరిచయంబు=మనుష్యస్త్రీ సంపర్కము, ఏల=ఎందుకు, అనఁగా సౌందర్యవంతురాండ్రగు దేవతాస్త్రీలసంపర్కముచే సంతసము చెందుచుండునకు మనుష్యస్త్రీపరిచయంబుతో నేమియుఁ బ్రయోజనము లేదని భావము. ఏను,వైమానికాధీశున్=దేవేంద్రుని, కామింతునే=వరింతునా? హరిణరమణి=ఆఁడులేడి, హస్తిన్=ఏనుఁగును కామించునే=వరించునా ? లేడియేనుఁగును బెండ్లియాడుట యసంగతమయినట్లె నేనింద్రుని బెండ్లియాడుటయు నసంగతమని భావము. కలవానికిన్ = ద్రవ్యవంతునకు, ఆరకూటకలాపము = ఇత్తడితోఁజేసిన యలంకారము, అర్హమే = తగునా ? ఏను, నిర్జరేశ్వరునకున్ = దేవేంద్రునకు, అర్హనే = తగుదునా? అనఁగా ధనవంతునికి త్తడియలంకారము తగనట్టులు దేవేంద్రునకు నేనెంతమాత్రమును దగనని భావము. అఖిలలోకాధీశుఁడు = అన్నిలోకములకును బ్రభువు అగు,అమరేంద్రుండు = దేవేంద్రుఁడు, ఎక్కడ, ఎన్నిచూడన్=ఆలోచింపఁగా, వరాటిన్=ముడుకబట్టవంటి, నేను ఎక్కడ అనఁగా బెద్దముడుకబట్ట గొప్పవారికెట్లు యుక్తముకాదో యట్లె నేను నాదేవేంద్రునకుఁ దగనని భావము. నలపతివ్రతన్ = నలుఁడు భర్తయని వ్రతము పూనియున్నదానను, ఐన నేను= అయినట్టి నేను, తివిరి=ప్రయత్నించి, నిందించియేని=నిందించినప్పటికిని, ప్రస్తుతించియేని = నుతించినప్పటికిని, ఒరునిన్, తలంపను, నలినబిససూత్రము ను =

తామరతూఁడులోనున్న దారమును, పురంధ్రులతలంపును=అంతఃపుర స్త్రీల కోర్కియును, సమము=సమానమయినది, లవచాపలమునన్ ఐనన్=స్వల్ప మాత్రపు చాపలముచేతనైనను, త్రెయ్యును=ముక్కలగును.

తా. సురస్త్రీసంపర్కముగల యింద్రునకు మనుష్య స్త్రీసంభోగముతో నేమిలాభము? ఒక వేళ నతఁడిష్టపడినను నాఁడు లేడి యేనుఁగును వరింపనట్లు నే నాయింద్రుని వరింతునా? ఒక వేళ సేవకించినను నిత్తడిసొమ్ము ద్రవ్యవంతునకుఁ దగనట్లె దేవేంద్రునకు నేను దగుదునా? లోకాధీశుఁడైన యింద్రుఁ డెక్కడ, నసర్హనైన నే నెక్కడ, కావున నన్ను నిందించినను బొగడినను నలునిఁదప్ప నే నొరుని వరింపను. ఇంతియకాక యంతఃపుర స్త్రీలతలంపు తామరతూఁడు దారమువంటిది. కాన స్వల్పమగు చాపలముచేతనైనను ముక్కలగును. అట్లె మాయభిప్రాయముగూడ నేమాత్రము వికటముగానున్నను విచ్ఛిన్నమగును.

చ. అటుదగు నేను రేశ్వరునియంతటివాఁ డఖిలాప్సరోంగనా
　విటుఁ డొకమర్త్యభామినికి వేడుక సేయుచు నున్నవాఁడు వి
　స్ఫుటబహురత్నభూషణవిభూషితు లయ్యెడురాచవారికిన్
　గటకట! యారకూటకటకంబురుచించునొ కాక యొక్కెడన్.

టీ. సురేశ్వరునియంతటివాఁడు=దేవేంద్రుఁ డంతగొప్పవాఁడు, అఖిలాప్సరోంగనావిటుఁడు=అచ్చరలకందఱకును మనోహరుఁడు, ఒకమర్త్యభామినికిన్=మనుష్య స్త్రీకొకదానికి, వేడుకచేయుచున్నాఁడు = ఉత్కంఠకలవాఁ డగుచున్నాఁడు - అనఁగా నచ్చరలసాంగత్యముననిశంబును వర్తించునింద్రుఁ డంతగొప్పవాఁ డొకమనుష్య స్త్రీని వరింపఁ దలంచుచున్నాఁడు. అటుతగు నే = అట్లువరించుట తగునా? విస్ఫుట...భూషితులు—విస్ఫుట=మిక్కిలి గొప్పవగు, బహు=నానావిధములగు, రత్న=మణిమయములగు, భూషణ=అలంకారములచే, విభూషితులు=అలంకృతులగువారు, అయ్యెడిరాచవారికిన్ = అయినట్టిరాజపుంగవులకు, కటకట = అయయ్యో! ఒక్కెడన్=ఒకప్పుడయినను, ఆరకూటకటకంబు=ఇత్తడికడియము, రుచించునొకాక=ఇష్టమయ్యెడునా, అనఁగా నిష్టముకా దని భావము.

తా. మిక్కిలి విలువగలిగిన నానావిధరత్నమయంబులగు నలంకారంబుల ధరించిన రాజులకు నిత్తడికడియము రుచింపనిచందంబున సౌందర్యవతు లగు నచ్చరలతోఁ గూడి సుఖించినయింద్రునకు నే నిష్టురాలనెట్లగుదును?

మ. వినుమీ నాదుప్రతిజ్ఞతత్పరత నుర్వీనాథ! యే నైషధేం
ద్రు నవశ్యంబు వరింతునా ధరణినాథుం డాత్మ నన్నొల్లఁడే
ననుమానింపక యిత్తు నవ్విభునకుం బ్రాణంబు సద్భక్తిమై
ననలోద్బంధనవారిమజ్జనవిధివ్యాపారపారీణతన్. 70

టీ. ఉర్వీనాథ = ఓరాజా, నాదుప్రతిజ్ఞతత్పరతన్ = నేనొనర్చుప్రతిజ్ఞ యందలియాసక్తిని, వినుమీ=ఆలకింపుమా, ఏను, నిషధేంద్రున్ =నలరాజును, అవశ్యంబు=తప్పకుండ, వరింతున్ = పెండ్లాడుదును, ఆధరణినాథుండు=ఆన లుఁడు, ఆత్మన్=మనస్సులో, నన్నున్, ఒల్లఁడేని=అంగీకరింపనిచో, సద్భ క్తిమైన్=మంచిభక్తిచే, అనల...పారీణతన్—అనల=అగ్నిలోఁ బడుట, ఉద్బంధన=ఉరివెట్టుకొనుట, వారిమజ్జన=నీటిలోమునుంగుట, విధి=పనులసం బంధియగు, వ్యాపార=వ్యాపారమందలి, పారీణతన్=నిపుణత్వముచే, అవ్విభు నకున్=ఆనలరాజునకు, ప్రాణంబున్, ఇత్తును.

తా. ఓరాజా! నాప్రతిజ్ఞవిధము నాలింపుము. ఏను దప్పక నలమహారాజు ను వరింతును, ఆమహాత్ముఁడు నన్ను వరింపనిష్టపడనిచో నతనియందు మిగులభ క్తిగలదాననై యగ్నిలోఁబడికాని, యురివేసికొనికాని, నీటిలోమునిఁగికాని మృతినొంది యానలునకుఁ బ్రాణములర్పించెదను.

తే. అనుచుఁ దీక్ష్ణంబుగా భీమతనయ పలుక
నెలుఁగువినువేడ్కఁ గోయిల యేచినట్లు
విబుధరాజప్రసంగంబు విస్తరించి
మఱియుఁ బలికింపఁ దలఁచి యమ్మనుజవిభుఁడు. 71

టీ. అనుచున్, భీమతనయ=దమయంతి, తీక్ష్ణంబుగాన్ = కఠినముగా, ప లుకన్=భాషింపఁగా, కోయిల, ఏచినట్లు=విజృంభించిన విధమున, అనఁగాఁ

కోకిలధ్వనివలెనే మధురముగానున్నదని భావము. ఎలుగు=కంఠధ్వనిని, వినువేడ్కన్=వినవలెనన్న కుతూహలముచే, విబుధరాజుప్రసంగంబు = దేవేంద్రుని ప్రసంగంబును, అనఁగా నింద్రునిచరిత్రమును, వి స్తరించి=స్పష్టముగాఁ జెప్పి, మఱియున్=ఇంకను,పలికింపన్=దమయంతి యింకను భాషించునట్లు చేయుటకు, తలఁచి=నిశ్చయించి, అమ్మనుజవిభుఁడు=అనలరాజు, అని పైపద్యములో నన్వయము.

తా. అని యిట్లు దమయంతి కఠినముగాఁ బలుకఁగా, కోయిలకంఠధ్వనివలెనున్న యామెకంఠధ్వనివినవలెనని తలంచి దేవేంద్రునికథ చెప్పియింకను నామెచే మాటాడింపఁదలంచి యానలుఁడు.

వ. వెండియు దమయంతి నుద్దేశించి.　　72

క. నిఱుపేదయింటి కేటికిఁ
బఱతెంచునిధాన మట్లుఁ బఱతెంచిన నా
నిఱుపేద యభాగ్యతఁ దలు
పిఱియఁగ నిడుఁ గాక చొరఁగ నిచ్చునె దానిన్.　　73

టీ. నిధానము=పెన్నిధి, నిఱుపేదయింటికిన్ = పెద్దదరిద్రునియింటికి, ఏటికిన్=ఎందులకు, పఱతెంచున్=వచ్చును, అట్లుపఱతెంచినన్=అట్లు వచ్చినచో, ఆనిఱుపేద=ఆ దరిద్రుండు, అభాగ్యతన్=దురదృష్టముచే, తలుపున్, ఇఱియఁగన్=దగ్గఱపడునట్లుగా, ఇడుఁగాక=పెట్టుకొనునుగాని, దానిన్=ఆనిధానమును, చొరఁగన్, ఇచ్చునె=లోనికిఁబోనిచ్చునా? అనఁగాఁ బోనీయఁడనుట, నిధానము తనయింటికి వచ్చుచున్నను బరమదరిద్రుఁడు తనదురదృష్టముచే నదిలోపలికి రాకుండునట్లు తలుపుమూసికొనును. అట్లైనదమయంతీ! నీవును, పెన్నిధివంటియింద్రుండు వచ్చి నిన్నపేక్షించుచుండఁగా నీదురదృష్టముచేఁ దిరస్కరించుచున్నావని భావము.

తా. నిఱుపేదవాని యింటికి నిధి రానేరాదు. ఒకవేళవచ్చినను, వానిఱుపేద తనదురదృష్టముచే నింటితలుపును దగ్గఱగా బంధించుకొనునుగాని లోపలికి రానీయఁడు.

సీ. ముగ్ధత్వమునఁ జంద్రముఖి పరాఙ్ముఖి వయ్యె
దేల భాగ్యంబు నిన్నెదురుకొనఁగ
నమృతాంధసుల నొల్లనను మానవియుఁ గల్గె
నీలాగుఁ గంటిమే కాలగతుల
యాగాదిదుర్లభ మైన దేవత్వంబు
నీ కొల్లఁ బాటయ్యె నేఁడు చూడ
రసయోగమున సువర్ణత్వ మొందుట మేలో
యినుము దాఁ దాన యైయునికి మేలో

తే. యకటకట! సర్వగీర్వాణమకుటఘటిత
మణివిభాభాసమానకోమలపదాబ్జు
సురగణాధీశు నొల్లవే నరుని నొకని
నలభిషించెదు నిన్నేమి యనఁగఁ గలను. 74

టీ. చంద్రముఖి=చంద్రునివంటిముఖముగల దమయంతీ! భాగ్యంబు=అదృష్టదేవత, నిన్నున్, ఎదురుకొనఁగన్=అభిముఖియైవచ్చుచుండఁగా, ముగ్ధత్వమునన్=అవివేకముచే, పరాఙ్ముఖివి=విముఖురాలవు, అయ్యెదు ఏల=అగుచున్నావేల? అమృతాంధసులన్=దేవతలను, ఒల్లన్=వరింపను, అను మానవియు=అనిపలుకునట్టి మనుష్యస్త్రీయు, కలిగెన్, ఈలాగు=ఈవిధమును, కాలగతులన్=కృతాదియుగకాలములందు, కంటిమే=చూచితిమా? దేవతలే ప్రేమతో వరింతుమని రాఁగాఁ దిరస్కరించిన మనుష్యస్త్రీల నిదివఱకెన్నఁడుఁ జూడలేదని భావము. యాగాదిదుర్లభంబు = యజ్ఞములచేతనగూడ పొందశక్యముకానిది, ఐనదేవత్వంబు = అయినట్టియమరత్వము, నేఁడు, చూడన్ = ఆలోచింపఁగా, నీకున్, ఒల్లఁబాటు = అపేక్షింపకయుండుట, అయ్యెన్, అనఁగాఁ బెక్కులు యాగంబులు చేసినను బొందఁ దరముగాని దేవత్వము సులభముగా వచ్చుచుండఁగా దాని నీ వపేక్షింప కున్నావు. ఇనుము, రసయోగమునన్ = రసాదిసంబంధముచేత, సువర్ణత్వము = బంగారమగు

టను, ఒందుట, మేలో = శ్రేయస్కరమో, తాను, తానయ్యె, ఉనికి= ఉండుట, మేలో=శ్రేయస్కరమో॥అనఁగా నినుము రసాదిసంబంధంబునుబొంది బంగారై లోకములో గౌరవము నొందుట మేలుకాని యప్పటిరూపము తో నుండుట మేలుకాదు.అట్లే-మానవ స్త్రీవయిన నీవు దేవేంద్రాదిసంబంధముచే నమరత్వము నొంది జగంబున సన్నుతినొందుట జగంబున మంచిది కాని మా నవత్వముననే యుండుట యంతమంచిదికాదు.అకటకట=అయ్యయ్యో, సర్వ గీర్వాణ ..అబ్జుఁ - సర్వగీర్వాణ= అందఱదేవతలయొక్క, మకుట=కిరీటము లందు, ఘటిత=కూర్పఁబడిన, మణి=రత్నములయొక్క, విభా=కాంతులచేత, భాసమాన=ప్రకాశించుచున్న, కోమల=మృదువయిన, పదాబ్జు=పాదపద్మము లుకలవాఁడగు, సురగణాధీశుఁ =దేవేంద్రుని,ఒల్లక =వరింపక, నరుఁ ఒకని= ఒకమనుష్యుని, అభిలషించెదు=కోరుచున్నావు, నిన్ను, ఏమనంగఁ కలదు= ఏమనఁగలవాఁడను.

తా. దమయంతీ! భాగ్యదేవత నిన్నెదుర్కొనుచున్నట్లు దేవతలు స్వయ ముగానిన్నుఁ గోరివరించుచుండఁగా నవివేకముచే నేల వలదనెదవు. దేవతలనువ రింపనిష్టపడనిమానవ స్త్రీ లెచ్చటనైన యుందురా? నేనెప్పుడును గనివినియుండ లేదు. యాగాదులొనరించియును బొందఁదరముకానిదేవత్వము నిష్టపడకున్నా వేల? రసాదిసంబంధముచే నినుము బంగారై నటులింద్రాదిసంబంధముచే దేవ త్వమొందుటమంచిది. అయ్యయ్యో! దేవతలకందఱకును వందనీయుఁడగు దే వేంద్రుని వరింపక యొకమనుష్యుని వరించుచున్నావు. నిన్నేమందును?

సీ. రజ్జువల్లరిమీఁదఁ జ్రబణయంబు గలదేని
　　　నంతరిక్షుం బేలుకోహారి వరించు
నగ్ని కాహుతి గాఁగఁ జ్నాత్మఁ గోరెదవేని
　　　జాతవేదునియదృష్టము ఫలించు
సలిలప్రవేశంబు జ్ సమ్మతించెదవేని
　　　నంబుధీశ్వరుఁడు పుణ్యంబు సేయు

నెబ్భంగిఁ బ్రాణ ముపేక్షించి తేనియు
వైవస్వతుని కబ్బు వాంఛితంబు
తే. ఘట్టకుటికాప్రభాతంబుక్రమముచేత
దమసహోదరి! నీకు నయ్యమరవరుల
నొల్లననియును దుదిఁ బొందకుండ రాదు
సమ్మతింపుము నామాటఁ జలము మాని. 75

టీ. రజ్జువల్లరిమీఁదన్ =తీఁగెవంటి త్రాటియందు, ప్రణయంబు=ప్రేమ, కలదేని=ఉన్నచో, అంతరిక్షంబు=ఆకాశమును, ఏలుహరి = పరిపాలించునట్టి యింద్రుఁడు, వరించున్ = పెండ్లాడును: అనఁగా నీవురివోసికొని మృతి చెందినచో నాకసమునందే నీవట్లు చేయవలయును గావున దానికధిపతియైన యింద్రుని చేతికిఁ జిక్కెదవు. అప్పుడింద్రుఁడు తప్పక నిన్నుఁ బెండ్లియాడునని భావము. ఆత్మన్ =నీదేహమును, అగ్నికిన్, ఆహుతి గాఁగన్ =హోమద్రవ్యముగా, కోరెదవేని= అభిలషించినచో, జాతవేదుని=ఆయగ్నియొక్క, అదృష్టము, పుణ్యము, ఫలించున్ =పండును, అనఁగా నీవు నలుఁడువరింపలేదన్న కోపముచే నగ్నికిని దేహము నర్పింపఁదలంచెదవేని నతఁడు పూర్వపుణ్యపరిపాకంబుచే నిన్నుఁ దప్పక పొందితన యభిలాషము తీర్చుకొనును. సలిలప్రవేశంబు=జలప్రవేశమును, సమ్మతించెదవు ఏని =అంగీకరించినచో, అంబుధీశ్వరుఁడు=వరుణదేవుఁడు, పుణ్యంబు, చేయున్ = చేసియుండును, ఓదమయంతీ! నీదేహమును విసర్జింప నెంచి జలములోఁ బ్రవేశించినచో నిన్నుఁ బొంది వరుణుఁడు దనకోర్కెఁ దీర్చుకొనును, ఎబ్భంగిన్ =ఏరీతి చేతనైనను, ప్రాణము, ఉపేక్షించితేని=విడువఁదలంచుకొన్నచో, వైవస్వతునికిన్ =యమునికి, వాంఛితంబు=కోరిక, అబ్బున్ =నెఱవేఱును, ప్రాణము లేరీతిఁ జచ్చిన యమదర్శనము చేయకతీఱదు కాన నీవు యమునియొద్దకుఁ బోయినప్పు డాతఁడు నిన్నుఁ దప్పక వరింపక మానఁడు. దమసహోదరి = ఓదమయంతీ, నీకున్, అయ్యమరవరులన్ = ఆదేవతాశ్రేష్ఠులను, ఒల్లన్ అనియున్ = వరింప నిష్టపడనన్నను, ఘట్టకుటికాప్రభాతంబు క్రమముచేతన్ = ఘట్టకుటికాప్రభాత న్యాయముచేత, తుదిన్ =కడకు, పొందక=ఆయిందాదులను వరిం

పకుండ, ఉండరాదు. చలము=పంతము, మాని=విడిచి, నామాటన్ =నావాక్య
మును, సమ్మతింపుము=అంగీకరింపుము, ఓదమయంతీ ! నీవిపుడు దేవతలను వరింప
నిష్టపడకున్నను గడకువారినే పొందవలెను గావున నిప్పుడు విచారించి నామా
టవిని దేవతలను వరింపుము. "ఘట్టకుటికాప్రభాతన్యాయము" అనఁగా నొక
బండివాఁడు ఘట్టాధికారులకుఁ జెల్లింపవలసిన సుంకము చెల్లింపకుండఁ దెల్ల
వాఱకమున్నే దాఁటిపోవలయునని యెంచి సందుదారులం బడి యతిత్వరతోఁ
బయనముచేయుచుఁ దెల్లవాఱునప్పటి కాఘట్టమునొద్దకే చేరెను. తానాయా
సపడి సుంకముగూడఁ జెల్లించెను. ఓదమయంతీ! అట్లె నీవు దేవేంద్రాదులను
వరింప నిష్టపడక జలాదులచేఁ బ్రాణత్యాగము చేసినను గడకు వారిచెంతకే
చేరుదువని భావము.

తా. ఓదమయంతీ ! నీ వురిపోసికొనికాని, జలములోఁజొచ్చిగాని, అగ్ని
లోఁ బడికాని, ప్రాణములు విడుతునని పల్కుచున్నావు. కానియురిపోసికొని
చచ్చినప్పుడాపనియాకసమునందు జరిగింపలెనుగాన దానికధిపతియైన యింద్రుఁ
డువరించును. అగ్నిలోబడిన నతఁడువరించును. జలములలోఁ (జొచ్చి)న జలము
లకధిపతియైన వరుణుఁడు వరించును. ఏవిధమున నీవు ప్రాణముల విడిచినను
యముని జేరక తీఱదు కావున నతఁడు నిన్ను దప్పక వరించును. మొదట నీవు వరింప
కున్నను గడకువారినే పొందవలెను. కావున పంతమువిడిచి నామాటవిని దేవతల
ను బెండ్లియాడుము.

తే. ఒల్లననుమాట కర్థ మోకయుత్పలాక్షి
వలతుననుమాట గాదుగా కవక్రరీతి
విధి నిషేధరూపంబు భావించియున్న
విధియ యగు వ్యంగ్యవాసనావిలసనమున. 76

టీ. ఓయుత్పలాక్షి=కలువవంటికన్నులుగల దమయంతీ,ఒల్లన్ =వరింపన్,
అనుమాటకున్ =అనుపదమునకు, వక్రరీతిన్ =విరుద్ధార్థముచే, లేకవిరుద్ధమగు
రీతిచే, వలతున్ =వరింతును, అనుమాట, కాదుకదా=అయియుండదుగదా ?
విధి=విధిశాస్త్రము, నిషేధరూపంబున్ = నిషేధస్వరూపముగా, భావించి,

ఉన్నన్ = తలపోయుచున్నను, వ్యంగ్యవాసనావిలసనమునన్ = వ్యంగ్యార్థమాభాసించుటచే, విధియయగున్ =విధివంటిదేయగును. శ్లో॥ నిశ్శేషచ్యుతచందనం స్తనతటం నిర్మృష్టరాగోధరో । నేత్రే దూరమనంజనే పులకితాతన్వీతవేయంతనుః । మిథ్యావాదిని దూతిబాంధవజనస్యాజ్ఞాతపీడాగమే । వాపీంస్నాతుమితోగతాసిన పునస్తస్యాధమస్యాంతికమ్॥ ఒకనాయిక తనప్రియునిఁ గొనివచ్చుటకు దూతికను బంపఁగా నది యతనియొద్దకుఁ బోయి యతనితో సురతసుఖము ననుభవించి మగిడి నాయికయొద్దకు వచ్చి సంభోగచిహ్నములను స్నానవ్యాజముచేఁ గప్పుచుండఁగా నాయిక దాని కపటవర్తన మెఱింగి దానితో నిట్లనుచున్నది. ఓదూతీ! నీ స్తనములందలిగంధ మంతయు దొలంగినది. పెదవియందలి యెఱ్ఱఁదనము పోయినది కన్నులకాటుక పోయినది. నీశరీరము కృశించి పులకలుగలదైయున్నది. పాపను. నీవు నాయొద్దనుండి స్నానార్థము బావికిఁ బోతివి. అంతేకాని నీ వాయధమునిచెంత కేఁగ నేలేదు. అని నాయికపల్కెను. ఇట నాయిక దూతిక కాముకునిచెంత కేఁగలేదని నిషేధరూపముగా బలికినను నది దూతి కాముకునిచెంత కేఁగినదనెడి విధిరూపార్థము నే వ్యంగ్యముచేఁ దెలియఁజేయుచున్నది. అట్లె దమయంతీ! నీవును దేవతలనిష్టపడనట్లులు పైకిఁ గనఁబడుచున్నను,మనంబులో నిష్టపడకయుండవని తలంచెదనని భావము.

వ. ఇవ్విధం బగు నేని. 77

సీ. వెలఁది! యైరావతద్విపకుంభకుచకుంభ
సంభారహారిదధీశ్వరుని వలతొ
జలజాక్షి! నిఖిల తేజస్విలోకములకు
నగ్రగణ్యుం డైన యనలు వలతొ
తరుణి! లోకానేకధర్మసంస్థాపన
ప్రాగల్భ్యనిధి ధర్మరాజు వలతొ
పల్లవాధరి! విధిప్రథమసర్గాధ్యక్షు
సప్తపాథోనిధిస్వామి వలతొ

తే. వైభవం బిచ్ఛగించి పావనతఁ గోరి
ధర్మశీలత యర్థించి నిర్మలత్వ
మాసపడి వీరి నలువురయందు నొకని
వేఁడుమా చూచెదము నీవివేకశక్తి. 78

టీ. వెలఁది=ఓదమయంత, ఐరావత... శ్వరునిన్-ఐరావతద్విప=ఐరావతమ నెడిదిగ్గజముయొక్క,కుంభ=కుంభంబులనెడి, కుచకుంభ=కుచకుంభముయొక్క, సంభార=పెంపుగల,హరిత్=దిక్కునకు,అధీశ్వరునిన్=అధిపతియగు నింద్రుని, వలతువు+ఒ=వరింతువా? అనఁగాఁదూర్పుదిక్కునకధిపతియగు నింద్రునివరింతువా? చెప్పుమని భావము. జలజాక్షి=పద్మములవంటి నేత్రములుగల దమయంతీ! నిఖిలతేజస్విలోకమునకున్ = సమస్తమయిన తేజఃపదార్థములకును, అగ్రగణ్యుండు=ప్రధానుఁడు, ఐనయనలున్=అయినయగ్నిహోత్రుని, వలతో=వరింతువో? ఓదమయంతీ! సమస్తతేజఃపదార్థములలో నుత్కృష్టుఁడగు నగ్నిహోత్రునివరింతువేమో చెప్పుము. తరుణి=దమయంతీ! లోక...రాజున్-లోక=జగమందు, అనేక=సమస్తమయిన, ధర్మ=ధర్మములను, సంస్థాపన=స్థాపించుటయందుఁగల,ప్రాగల్భ్య=ప్రౌఢికి, నిధి=స్థానమయిన, ధర్మరాజున్=యముని, వలతో=వరింతువా? అనఁగా సకలధర్మములను స్థాపించుటయందుగల నేర్పునకు నిధియైన యమధర్మరాజును వరింతువేమో చెప్పుము. పల్లవాధరి = చిగురువంటిపెదవి గల దమయంతీ! విధి...అధ్యక్షున్—విధి = బ్రహ్మయొక్క, ప్రథమసర్గ = మొదటిసృష్టియగు జలములకు, అధ్యక్షున్= అధిపతియగు, సప్తపాథోనిధిస్వామిన్ = ఏడు సముద్రములకును నధిపతియగువరుణుని వరింతువా? అనఁగా, "అపఏవససర్జాదౌ" అని యుండుటంబట్టి బ్రహ్మకు మొదటిసృష్టి యగుజలములకును సముద్రములకును నధిపతి యగువరుణదేవుని వరింతువేమో చెప్పుము. వైభవంబు = సంపదను, ఇచ్ఛగించి, పావనతన్ = శుచిత్వమును, కోరి, ధర్మశీలతన్ = ధర్మస్వభావము కలిగియుండుటను, అర్థించి=అపేక్షించి, నిర్మలత్వము=స్వచ్ఛతను, ఆసపడి, వీరి నలువురయందును=ఈ నలువురిలోను, ఒకనిన్=ఒక పురు

షుని, వేఁడుమా=కోరుకొనుమా ? నీవివేకశక్తిన్=నీ తెలివియొక్క యతిశయమును, చూచెదము. అనఁగా, వైభవము గలయింద్రుని వరింతువా ? శుచిత్వము గలయగ్నిని వరింతువా? ధర్మస్వభావుఁ డయినయముని వరింతువా? లేక నిర్మలత్వము గలిగినవరుణుని వరింతువా ? వీరిలో నీ కిష్టుఁడయిన వానిని వరింపుమా ! నీసామర్థ్యమును జూచెదనని భావము.

తా. స్పష్టము.

తే. అని నృపాలుండు వలుక హస్తాంకసుప్త
కోమలైకకపోల యై యామృగాక్షి
వినియె నొకరీతి నొకభంగి వినవిదయ్యె
వలసియును నొల్లకయును దద్వాక్యసరణి. 79

టీ. అని, నృపాలుండు = నలరాజు, పలుకన్ = పలుకఁగా. ఆమృగాక్షి= ఆదమయంతి, హస్త...కపోలయై—హస్తాంక = హస్తతలమందు, సుప్త= నిద్రించిన, కోమల = మృదువయిన, ఏక = ఒకటియైన, కపోలయై=చెక్కిలి కలదై, తద్వాక్యసరణి=ఆ నలునివాక్యములరీతి, వలసియున్=అపేక్షించియు, ఒకరీతిన్, వినియెన్=ఆలకించెను, ఒల్లకయును = ఇష్టములేక, ఒకభంగిన్ = ఒకరీతిగా, వినివిదయ్యెన్=ఆలకించినదాయెను. అనఁగా నతనివాక్యము లతిశ్రావ్యములయి యుంటచే వినవలయునని కోరికగలిగినదనియుఁ దన కప్రియములయిన దేవతల వృత్తాంతము చెప్పుటచే వాని విననొల్లక యొకరీతిని విన నిష్టపడకుండెననియు నెఱుంగునది.

తా. అని యిట్లు నలుఁడు పలుకఁగా నాదమయంతి తన వదనమును హస్తతలమందుఁ జేర్చి యానలునివాక్యము లతిమధురముగానుండుటచే నొకరీతిగా వినెను. ఇంద్రాదుల చరిత్రమును విన నిష్టములేక యాతనివాక్యములందుఁ దిరస్కారము గలుగుటచే విన నిష్టపడదయ్యెను.

వ. చింతాక్రాంత యై యొక్కింతతడవు తల వంచుకొని విచారించి పదంపడి నిట్టూర్పు నిగిడించి యాయిందువదన యారాజకందర్పునిం గనుంగొని సవిషాదంబుగా ని ట్లనియె. 80



478. దమయంతి నలునిమాట విని చింతా
క్రాంతయై తలవంచుకొనుట.

టీ. ఆయిందువదన = చంద్రునివంటిముఖము గల దమయంతి, చింతా క్రాంతయై = విచారముచేఁ జుట్టఁబడినదై, ఒక్కింతతడవు = కొంచెము సేపు, తల, వంచుకొని, విచారించి, పదంపడి = తరువాత, నిట్టూర్పును, నిగిడించి = పుచ్చి, ఆరాజకందర్పునిన్ = మన్మథునివంటి యా నలమహారాజును, కనుంగొని = చూచి, సవిషాదంబుగాన్ = విచారముతోఁగూడ, ఇట్లనియెన్ = ఇట్లు పలికెను.

తా. స్పష్టము.

ఉ. నీచరితంబు చూడ నతికనిష్ఠుర మయ్యెడు లోకపాలదు
ర్వాచికసూచికాంకురపరంపరఁ దూర్చెదు మాటిమాటికిన్
నా చెవులందు నీకుఁ దగునా యిటు సేయఁగఁ దప్పు మంటి బా
ధాచరణంబు నైజము గదా తలపోయఁగృతాంతదూతకున్.

టీ. నీచరితంబు = నీప్రవర్తనము, చూడన్ = ఆలోచింపఁగా, అతినిష్ఠురము = మిక్కిలి క్రూరమయినది, అయ్యెడున్ = అగుచున్నది, మాటిమాటికిన్, నా చెవులందున్, లోక...పరన్ - లోకపాల = దిక్పాలురయొక్క, దుర్వాచిక = దుష్టములగు సందేశవాక్యములనెడి, సూచిక = సూదులయొక్క, అంకుర = కొనలయొక్క, పరంపరన్ = వరుసలను, తూర్చెదు = గ్రుచ్చుచున్నావు. ఇటు సేయన్ = ఇట్లుచేయుట, నీకున్, తగునా? తప్పు = ఆదిక్పాలుర చరిత్రమునుజెప్పుట మానుమని, అంటిన్ = అని పలికితిని, తలపోయన్ = ఆలోచింపఁగా, కృతాంతదూతకున్ = యమదూతకు, బాధాచరణంబు = బాధకలిగించుట, నైజముకదా = స్వాభావికము గదా? యమదూతకు ప్రాణుల బాధపెట్టుటయే యానందకరము. అట్లె నీవు యమునికి దూతవై వచ్చితివి కావున నే కఠినత్వము వహించి వలదనుచున్నను బాధపెట్టుచుంటివని భావము.

తా. ఓయీ! నీప్రవర్తనము జూడఁగా మిగులఁ గ్రూరమయినట్లు తోఁచుచున్నది, నా చెవులు చిల్లులుపడునట్లు దేవతలసందేశవాక్యము లనెడి సూదులచే నేల పొడిచెదవు! వలదని పలికితిని, అట్టనుచున్నను నిట్లు చేయుట

తగునా? ఔను. ఆలోచింపఁగా నీవు యమదూతవు. పరుల బాధపెట్టుటయే యమదూతలకు స్వాభావికము. అట్లుండ నీవెట్లుమానుదువు.

సీ. ఇదె యెల్లి కల్యాణ ✱ మేతెంచుచున్నది
యీయవాచికవార్త ✱ లిపుడు మాను
వర్ణింపు నిషధభూ✱వరునిన్నోపితివేని
నీదోష మఖిలంబు ✱ నెడలుఁగాన
యుండు నీ విచ్చోట ✱ నూరట నేఁ డెల్లి
సురల కిప్డేమివే✱గిరము వచ్చె
నలునిరూపచ్ఛాయ ✱ దిలకించె నీయందు
హంస సూపినచిత్ర ✱ మాత్మఁ దలఁప

తే. హస్తములు మోడ్చి వేఁడెద ✱ ననఘ నిన్ను
మాను మిటు వింటివే నీకు ✱ మాన్యమేని
పాకశాసనముఖ్యదిక్✱పాలవర్య
పాణిపీడనకార్యసంప్ర✱ార్థనంబు. 82

టీ. ఇదె=ఇదిగో, ఎల్లి = రేపు, కల్యాణము = స్వయంవర మహోత్సవము, ఏతెంచుచున్నది = వచ్చుచున్నది, ఈయవాచికవార్తలు = చెప్పరాని దుష్టములగు దేవతల సందేశవచనములు, ఇపుడు, మాను=విడువుము. రేపు కల్యాణమహోత్సవము జరుగఁదలఁచియున్నది. కావున నా మంగళమునకుఁ దగినట్లు మంగళవాక్యములే పలుకుముకాని దిక్పాలుర సందేశములనెడు నమంగళవాక్యములు పలుకకుమని భావము. ఓపితివేనిన్ = శక్తుఁడవైనచో, నీదోషము=నీపాపము, అఖిలంబు=సమస్తమును, ఎడలుగాని = తొలఁగిపోవును గాన, నిషధభూవరునిన్ = నలరాజును, వర్ణింపుము. ఓయీ! పుణ్యాత్ముల చరిత్రము విన్నను వర్ణించినను పాపములు తొలంగునని పెద్దలందురు. కావునఁ బుణ్యాత్ముఁడగు నలరాజును వర్ణింపశక్తిగల్గినచో వర్ణింపుము, నీపాపము లన్నియుఁ దొలఁగిపోవునని భావము. నేఁడు, ఎల్లి=రేపు, సురలకున్, ఇప్డు, ఏమి

వేగిరమువచ్చె=ఏమితొందర వచ్చినది. నీవు, ఇచ్చోటన్, ఊఱటన్=విశ్రాంతి గైకొనుచు, ఉండుము=నిలువుము, ఒకటి రెండుదినములలో దేవతలకు తొందరలేదు కావున నిటవిశ్రమించియుండుమని భావము. హంస=రాజహంసము, చూపిన చిత్రము=చూపిన చిత్రపటమును, ఆత్మన్=మనస్సులో, తలఁపన్=ఆలోచింపఁగా, నీయందున్, నలునిరూపచ్ఛాయ=నలునిశరీరకాంతి—లేక—నలుని రూపముపోలిక, తిలకించెన్=చూపట్టెను. అనఘ=పాపరహితుఁడా! హస్తములు=చేతులు, మోడ్చి = ముకుళించి, నిన్నున్, వేఁడెదన్=ప్రార్థించెదను, ఇటు = ఈ నావాక్యము, వింటివే = వినుచున్నావా? నీకున్, మాన్యమేని = గౌరవింపఁదగినదయినను, పాక...ప్రార్థనంబు—పాకశాసన=దేవేంద్రుఁడు, ముఖ్య=మొదలుగాఁగల, దిక్పాలవర్య=దేవతాశ్రేష్ఠులయొక్క, పాణిపీడన=వివాహమనెడి, కార్య=పనినిగూర్చి, సంప్రార్థనంబున్= ప్రార్థించుటను, మానుము=విడువుము.

తా. రేపు నాకుఁ గల్యాణము కానున్నది. అందులకుఁ దగినట్లు మంగళవాక్యము లాడుము. కాని దేవతలయమంగళసందేశములు చెప్పకుము, నీపాపములన్నియుఁ దొలఁగిపోవును. కావున నీకు శక్తి గలిగినచో నలుని వరింపుము. నేఁడురేపు ఇంతలో దేవతల కేమితొందర? ఇటనే విశ్రాంతి చెందుచుండుము. ఆనాఁడు హంసయిచ్చిన చిత్రపటమును దలంచుకొనఁగా నలునిరూపము నీయందున్నట్లు తోఁచుచున్నది. బద్ధాంజలినై వేఁడుచున్నాను. ఇటు వినుము. దేవతలను వరింపుమని ప్రార్థించుట విడిచిపెట్టుము.

క. ఈరీతి నాతలోదరి
సారతరసుధారసౌరసప్రసవరసా
సారసరసోక్తిసరణి మ
హారాజకుమారునకు నుకేపాయన మొసఁగెన్. 83

టీ. ఆతలోదరి=ఆదమయంతి, ఈరీతిన్=ఈవిధముగా, సార...సరణిన్-సారతర=మిక్కిలిశ్రేష్ఠమయిన, సుధారస=అమృతరసమునకు, ఔరస=పుట్టినవగు, అనఁగా నమృతరసము...ప్రసవములయొక్క,

రసే=ఆసేవనముయొక్క, ఆసార=జడివానవలె, సరస=రసముతోఁగూడియున్న, ఉక్తి=మాటలయొక్క, సరణిన్=రీతిచే, అనఁగానమృతముతో సమానమయి నపుష్పరసముయొక్క ధారలవలె సరసములగు మాటల ననుట, మహీరాజ కుమారునకున్=అనలమహీజునకు, ఉపాయనమున్ = కానుకను, ఒసఁగెన్ = ఇచ్చెను. అనఁగా మధురముగాఁ బలికెనని భావము.

తా. ఆదమయంతి యావిధముగా నానలమహీరాజునకు నమృతసారము తో సమానమయినపుష్పాసవముపలె సరసములగు వాక్పరంపరను గానుక గానిచ్చెను.

ఉ. మైత్రియుఁ బ్రేమయున్ మనసుమచ్చికయు న్మెఱయన్విరాటరా
ట్పుత్రిక పల్కఁగ న్నిషధభూపతి దైవతకార్యకల్పనా
సూత్రము దప్పనీ కెలమిసొంపు మదిం దలకొల్పి చిత్రవా
క్చిత్రశిఖండినందనుఁడు చేడియ నల్లనఁ జూచి యిట్లనున్.

టీ. విరాటరాట్పుత్రిక = దమయంతి, మైత్రియున్ = స్నేహమును, ప్రేమయున్=ఆదరమును, మనసుమచ్చికయున్ = మనస్సుయొక్కచనవును, మెఱయన్=ప్రకాశింపఁగా, పల్కఁగన్=సంభాషింపఁగా, దైవతకార్యకల్పనాసూత్రము=ఇంద్రాదుల కార్యముయొక్క వ్యవస్థను, తప్పన్ ఈక=తప్పి పోకుండఁజేసి, ఎలమిసొంపును=సంతోషాతిశయమును, మదిన్=మనస్సునందు, తలకొల్పి=నిలుమనట్లు చేసి, చిత్ర ... నందనుఁడు-చిత్ర=మధురములగు, వాక్= మాటలందు, చిత్రశిఖండినందనుఁడు=బృహస్పతివంటివాఁడు, అనఁగా మధురముగా మాటాడుటయందు బృహస్పతిని బోలినవాఁడని భావము. నిషధభూపతి=నలుఁడు, చేడియన్=దమయంతిని, చూచి, అల్లనన్ = మెల్లగా, ఇట్లు, అనున్=పలుకుచుండెను.

తా. స్నేహము, ప్రేమము, మనస్సుయొక్క చనవు మిగులఁ బ్రకాశించు నట్లుగా దమయంతి పలుకఁగా మధురముగా సంభాషించుటయందు బృహస్పతిని బోలిననలుఁడు దేవతలకార్యము చెడకుండఁజేయుచు, సంతోషాతిశయము కలవాఁడై దమయంతిని జూచి యిట్లనియెను.

సీ. హరి కల్పవృక్షంబుఁ బ్రార్థించి నినుఁ గోరి
దివికి రావించిన దిక్కు గలదె
సర్వకామద మైనసప్తతంతువున ని
న్నగ్ని గైకొనఁగ నేమనఁగఁగలదు
తనయొద్ద నున్నవాతాపితాపసుచే
నిను నార్కి వరముగాఁ గొనిన నెట్లు
కాంక్షించి యడిగినఁ గామధేనువు నిన్నుఁ
ద్యాగంబుగా నీదె యంబుపతికిఁ
తే. గాన నిను మేను జెప్పినక్రమము లెస్స
యతివ వరియింపు వేల్పులయందు నొకని
భక్తి దివిజులచిత్తంబు పట్టుకున్న
నంతరాయంబు పుట్టుఁ గార్యముల కెల్ల. 85

టీ. హరి=ఇంద్రుఁడు, కల్పవృక్షంబున్, ప్రార్థించి=యాచించి, నినున్, కోరి=అపేక్షించి, దివికిన్=స్వర్గపురంబునకు, రావించినన్ = రప్పించుకొన్న చో, దిక్కుగలదె=మఱియొకగతి గలదా? అనఁగా;నీవు దేవేంద్రుని వరింపక పోయినను నతఁడు సకలవాంఛలను దీర్చుకల్పవృక్షమును బ్రార్థించి నిన్నుఁ గోరికొని స్వర్గంబునకుఁ దెప్పించుకొన్నచో నీకు దిక్కేమి కలదు? నీవు నలు నెట్లు వరింతువు? అని భావము. సర్వకామదము=సకలవాంఛలను నిచ్చునది, ఐనసప్తతంతువునన్=అయినట్టియాగమునందు, అగ్ని, నిన్ను, కైకొనఁగన్= చేపట్టినట్టైన, ఏమనఁగన్, కలదు=ఏమని చెప్పఁగలను, యాగము సమస్తమ యినకోర్కులను నెఱవేర్చును. అట్టియాగమువం దగ్ని నిన్నుఁ గైకొన్నచో నిఁక నేమిచేయఁగలుగుదువు? కావున నిప్పుడె యగ్నిని వరించుట మంచిదని భావము. తనయొద్దన్, ఉన్నవాతాపితాపసుచేన్=ఉన్నట్టి యగస్త్యమహ ర్షిచే, నినున్, అర్కి = యముఁడు, వరముగాన్, కొనినన్=తీసికొన్నచో, ఎట్లు=ఏమిగతి? ఓదమయంతీ ! నీవు యముని వరింపకపోయినను నతఁడు తన

దిక్కున నాశ్రయించియున్న యగస్త్యుని బ్రార్థించి నిన్నుఁ బొందుటకు వరం బుగొన్నచో నప్పుడు నీవేమిచేయఁగలవు? కావున నిప్పుడే వరింపుమనిభావము. ఈపాదములో "తనయొద్దనున్న" అని కవియేలచెప్పెను? అగస్త్యుఁడు యము నియొద్దనే యుండునా? అని సంశయింపం బనిలేదు. అగస్త్యుఁడు వింధ్యుని గర్వమడంప దేవతాప్రార్థనముచొప్పునను దక్షిణదిక్కునందె యుండును గా న దక్షిణదిక్కు నేలెడియముని కతఁడు దగ్గఱగా నుండవచ్చును. కామధేను వున్, కాంక్షించి=ప్రార్థించి, అడిగినన్ =అడిగికొన్నచో, నిన్నున్, అంబు పతికిన్ =వరుణునకు, త్యాగంబుగాన్ =దానముగా, ఈదె= ఈయదా? అనఁగా నిచ్చునుట,నీవు వరుణుని వరింపకున్నను నతఁడు కామధేనువును గోరి నిన్నుఁ బొందఁగలఁడనిభావము. కాన, వినుము, ఏను= నేను, చెప్పినక్రమము=ఉపదేశిం చినమార్గము, లెస్స=మేలయినది. అతిన, వేల్పులయందు, ఒకని, వరింపుము= పెండ్లియాడుము. భక్తి, దివిజులచిత్తంబు=దేవతలమనస్సును, పట్టకున్న=ఆక ర్షింపకున్నచో,అనఁగా దేవతలందు భక్తిగల్గియుండనిచో, కార్యములకెల్లన్ = అన్నిపనులకును, అంతరాయములు, విఘ్నములు, పుట్టున్ =కలుగును.

తా. ఓదమయంతీ ! నీవింద్రాదులను వరింపనని పంతములాడుచున్నావు. కాని యింద్రుఁడు కల్పవృక్షమును యాచించి నిన్నుఁ జేకొన్నచో నేమి చే యుదువు? సమస్తవరములను నెఱవేర్చుయాగమువలన నిన్ను వహ్ని పొందఁ గలిగినచో నేమి చేయుదువు? అగస్త్యునిఁ బ్రార్థించి యముఁడు వరముగా నిన్నుఁ బొందినచో నీవేమిచేయుదువు. వరుణుఁడు కామధేనువును యాచించి నిన్నుఁ బొందినచో నీక దిక్కేది. కావున నామాటవిని దేవతలలో నొకని వరింపుము. దేవతలందు మనకు భక్తిలేనిచో మనకార్యములన్నియు విఘ్నము లచే నశింపకమానవు.

వ. అని పల్కిన నప్రతివిధానంబైనప్రియావాప్తివిఘాతంబున హృదయంబు గలంగిన. 86

టీ. స్పష్టము.

సీ. ప్రవిమలాక్షినభోనభస్యాంబుదములను

నవవృష్టిధారలై కేయవతరిల్లి
యాకర్ణదీర్ఘ నేత్రాంభోరుహములకుఁ
గమనీయనాళభావము భజించి
కలితకజ్జలతముక్తాహారలతలలో
హరినీలరత్ననాయకతఁ దాల్చి
లలితవక్షోజకుట్మలచుంబనంబున
మధుపదంపతులసామ్యంబు వడసి

తే. వేఁడియశ్రులు నిగుడంగ వెక్కి వెక్కి
యేడ్వఁ దొడఁగె లతాంగి పృథ్వీశుమ్రోల
మృదులపరివేదనాతురోన్మిశ్రమధుర
కంఠకాకువికారకాకలిక యలర. 87

టీ. వేఁడియశ్రులు=వెచ్చని దమయంతికంటి నీరు, ప్రవిమల...ములకున్-ప్రవిమల=మిక్కిలి స్వచ్ఛమయిన, అక్షి=నేత్రములనెడి, నభోనభస్య=శ్రావణ భాద్రపదమాసములందలి, అంబుదములకు=మేఘములకు, నవవర్షధారలై=క్రొత్తనీటిధారలై, అవతరిల్లి=జాఱుచున్నవై, "నవవర్షధారలై" అనుపదములోని నవపదమునకు సారస్యమేమనఁగా మేఘముల వర్షధారలు తెల్లనివై పడుచుండును. ఇట దమయంతికాటుక కన్నులనుండి వచ్చుచుండుటచే నానీరు నల్లనిదై ధారారూపముగాఁ బడుచున్నను నల్లగానె కనఁబడును. కాన నిదివఱకు లేని, వర్షధారలని గ్రహించునది. లేక ఇదివఱకుఁ బ్రతిబంధాదులుండుటచేఁ గురియక యిప్పుడాప్రతిబంధము దొలంగుటచే వెచ్చుగాఁ గురియువర్షము పగిది దమయంతియశ్రువు లప్పుడే యుదయమందెను గాన నవవర్షధారలనియుఁ జెప్పవచ్చును. ఆకర్ణ...ములకున్-ఆకర్ణ=చెవులపర్యంతము, దీర్ఘ=సోగలైయున్న, నేత్రాంభోరుహములకున్ = నేత్రపద్మములకు, కమనీయనాళభావమున్-కమనీయ = మనోహరమైన, నాళభావమున్ = నాళత్వము, భజించి=పొంది, అనఁగా దమయంతికన్నీరు ధారలుగాఁ బడుచుండుట

చే నాధారలు నేత్రములనెడి పక్ష్మములకుఁ గాడలవలె నొప్పుచున్నవని భావము. కలితకజ్జలతఁ=ఒప్పుచున్న కాటుక కలవగుటచే, ముక్తాహారలతలోఁ=తీగెలవంటి ముత్యాలహారములలో, హరినీలరత్ననాయకతఁ=ఇంద్రనీలమనెడి నాయకరత్నమై యుండుటను, తాల్చి=ధరించి, అనఁగా దమయంతికాటుకకంటినీరు ముత్యాలహారములలోఁ బడినప్పుడు నాయకరత్నమై యుండినయింద్రనీలమో యనునట్లు ప్రకాశించె నని భావము. లలితవక్షోజకుట్మలచుంబనంబునఁ-లలిత=సుందరము లైన, వక్షోజ= స్తనము లనెడి, కుట్మల=మొగ్గలయొక్క, చుంబనంబునఁ=తాఁకుటయందు, మధుపదంపతులసామ్యంబు=తుమ్మెదలదంపతులతో సమానత్వమును, పడసి=పొంది, అనఁగా దమయంతి నల్లనివేఁడికన్నీరు కుచములపైఁ బడినప్పుడు తామరమొగ్గలపై చరించుతుమ్మెదలవలెఁ బ్రకాశించెనని భావము. నిగుడంగఁ=ప్రవహింపఁగా, లతాంగి = లతవంటి శరీరముగల దమయంతి, పృథ్వీశు మ్రోలఁ = నలమహారాజునెదుట, మృదుల...కలిక-మృదుల=కోమలమయిన, పరివేదన=దుఃఖమునుసూచించు,అక్షర=వర్ణములతో, ఉన్మిశ్ర=కూడిన, మధుర=శ్రావ్యమయిన, కంఠ = గళమునుండి వెలువడిన, కాకు=గద్గదమైన, వికార = స్వభావమును మీఱిన, కాకలిక= అవ్యక్తమధుర ధ్వని, అలరఁ = ఒప్పునట్లుగా, వెక్కి, వెక్కి, ఏడ్వఁ, తొడఁగెఁ=రోదనముచేయ నారంభించెను. అనఁగా దమయంతి నలునియెదుట వేఁడికన్నీటిని గార్చుచు నతిమృదుమధురధ్వనులు వెడలునట్లుగా నేడువ నారంభించెను. ఇందు మొదటిపాదమున నతిశయోక్తి, 2 వ పాదమునరూపకము. 3 వ పాదమున ఉత్ప్రేక్షారూపకములును, 4 వ పాదమందు, ఉత్ప్రేక్షయు నలంకారములు.

తా. నలుఁడు చెప్పినవాక్యములకుఁ దగినసమాధానము చెప్పలేక యవ్యక్తమధురధ్వనులు వెలువడుచుండఁగా వేఁడికన్నీరు ధారలయి ప్రవహింపఁగా రోదనముచేయ నారంభించెను. అప్పుడు వేఁడికన్నీరుకాటుకచే నల్లఁదనము గలిగి దమయంతినేత్రము లనెడి శ్రావణ భాద్రపదమాసములందలి మేఘములకు నూతనవర్షధారలై యామెనేత్రము లనెడి పద్మములకు నాళములవలె నొ

ప్పారుచు, కజ్జలకాంతి కలవగుటచే ముక్తాహారలతలలోఁ బడినప్పుడు నాయకరత్నమయిన యింద్రనీలముతో సమానమగుచు, నామెకుచములందుఁ బడినప్పుడు తామరమొగ్గలపైఁ బడినతుమ్మెదలవలె నలరుచుఁ గనఁబడసాగెను.

వ. ఇట్లు గద్గదికానిరుద్ధకంఠనాళయై యబ్బాలయశ్రుకణంబులు గొనగోళ్లమీటుచుం దల వాల్చి యేడ్చుచున్నఁ గనుంగొని దివిజోపకారకార్యప్రయోజనసంస్తంభితం బైనవిప్రలంభవేదనాభరం బప్పు డుద్దీపితం బై భరింపం గొలఁదిగామి విశ్వంభరావల్లభుండు మనంబున సంక్షోభించి విభ్రాంతుండై తన్నును దనవచ్చినకార్యంబునుం దన్నుఁ బుత్తెంచినవేల్పులను మఱచి యవస్థావశంబున నుచితానుచితవివేకంబులు దప్పుటయు భావనానిరూఢంబు లైనప్రియావిలాపంబులు వికల్పించుచు నిట్లనియె. 88

టీ. ఇట్లు=ఈరీతిగా, గద్గదికానిరుద్ధకంఠనాళ యై = గద్గదస్వరముచేత కట్టఁబడినకంఠము కలదయి, అబ్బాల=ఆదమయంతి, అశ్రుకణంబులు=కన్నీరు, కొనగోళ్లన్=గోటికొనలచే, మీటుచున్=తూలించుచు, తల, వాల్చి, ఏడ్చుచున్నన్, కనుంగొని=చూచి, దివిజ... స్తంభితంబు-దివిజ = దేవతలకు, ఉపకార=ఉపకారరూపమైన, కార్య=పనియొక్క, ప్రయోజన = కార్యఫలముచే, సంస్తంభితంబు = నిరోధింపఁబడినది, ఐన విప్రలంభవేదనాభరంబు=అయినట్టి వియోగమువలనఁ గలిగిన బాధాతిశయము, అప్పుడు=దమయంతి యేడ్చుచున్నప్పుడు, ఉద్దీపితంబై=అధికమైనదై, భరింపన్=సహించుటకు, కొలఁదికామిన్=అలవి కాకపోవుటచే, విశ్వంభరావల్లభుండు = నలరాజు, మనంబునన్, సంక్షోభించి=చలించి, లేక, తల్లడిల్లి, విభ్రాంతుండై=భ్రాంతి చెందినవాఁడై, తన్నునున్, తనవచ్చినకార్యంబును = తాఁ జేయవచ్చినపనిని, తన్నున్, పుత్తెంచినవేల్పులను=పంపినదేవతలను, మఱచి, అవస్థావశంబునన్, ఉచితానుచితవివేకంబులు = యుక్తాయుక్తజ్ఞానము, తప్పుటయున్ = చెడి

పోవుటచే, భావనానిరూఢంబులు=ధ్యానమందున్నవి, ఐనప్రియావిలాపంబులు=అయినదమయంతిపరివేదనలను, వికల్పించుచున్=అడుగుచు, ఇట్లనియె.

క. ఏమిటికి కేడ్చెద వానన
తామరసం బెత్తి చూడు తరుణీ! నన్నుం
గోమలకటాక్షవీక్షా
దామకమున వీరసేనుతనయుని నలునిన్. 89

టీ. తరుణీ=ఓదమయంతీ! ఏమిటికిన్=ఎందుకు, ఏడ్చెదవు=విలపించుచున్నావు, ఆననతామరసంబున్=ముఖపద్మమును, ఎత్తి, కోమల...దామకమునన్-కోమల = మృదువయిన, కటాక్షవీక్షా = క్రేఁగంటిచూపు లనెడి, దామకమునన్ = పూవులదండచే, వీరసేనుతనయునిన్ = వీరసేనమహారాజకుమారుఁడనైన, నలునిన్, నన్ను, చూడుము. అనఁగాఁ బూలదండవలె నెడతెగక యుండునట్టి చూపులపరంపరచే నన్నుఁ జూడుమా యని భావము.

తా. ఓదమయంతీ! నీవిక్లెందుల కేడ్చెదవు.? నీముఖపద్మమును నెత్తి పూవులదండవలెనే పంక్తిగా బయలు వెడలు నీకడకంటిచూపులచే వీరసేనకుమారుఁడను నలుఁ డనుపేరు గలవాఁడను నగునన్నుఁ జూడుము.

తే. కాంత! యశ్రుబిందుచ్యుతికైతవమునఁ
దివిరి బిందుచ్యుతకకేలిఁ దవిలె దీవు
సారెసారెకు నాదుసంసారమును స
సారముగఁ జేయుచు మసారసారనయన. 90

టీ. కాంత=దమయంతీ! మసారసారనయన-మసార = శ్రేష్ఠములైన యింద్రనీలమువలె నల్లని, నయన=కన్నులుగలది, "మసారతారనయన" అను పాఠమున, ఇంద్రనీలమువంటినల్లగ్రుడ్లు గలనేత్రముగలదని యర్థము. అశ్రుబిందుచ్యుతికైతవమునన్= కన్నీటిబిందువులను రాల్చుటయనెడి మిషచేత, సారెసారెకున్= మాటిమాటికిని, నాదు సంసారము=నాసంసారమును, ససారముగన్=సారమగువస్తువులతోఁ గూడినట్టుగా, చేయుచున్, ఈవు=నీవు,

తివిరి=యత్నించి, బిందుచ్యుతకకేలి - బిందు=సంసారశబ్దములో నున్న యనుస్వారమును, చ్యుతక = తీసివేయుటయనెడి, కేళిక = ఆటయందు, తవిలెదు=కుతూహలపడుచున్నావు. ఓదమయంతీ! మనోహరముగాఁ గన్నీటిబిందువులనురాల్చుచు, నందుచే నాకానందము గల్గించుచు, నాసంసారమును సారభూతముగఁ జేసి సంసారశబ్దములో నున్న బిందువును దీయుటయందాసక్తిగలదాన వగుచున్నావు. అనఁగాదమయంతి కన్నీరుగార్చుటగూడ మనోహరముగా నుండె నని భావము. సంసారశబ్దములోని బిందువును దీసినచో ససారమగును. కాన నాసంసారమును ససారముగఁ జేయుచున్నదానవు కావున బిందుచ్యుతకకేలియందుఁ దనరుచున్నావని నలుఁడు బిందుచ్యుతిశబ్దము శ్లేషించి చెప్పెను. అలం. అపహ్నుతి, ఉత్ప్రేక్షయు.

తా. గతార్థము.

వ. చెలువ! చెక్కుటద్దంబునం జేయిఁజేర్చి యేల చింతించెదవు? ఏటికిం బల్లవపాటలం బైనయధరంబు బీటలెగయ వేఁడినిట్టూర్పుగాడ్పులు నిగిడించెదవు? ఏకతంబున గద్గదిక నొందెదవు? ఏకారణంబున నశ్రుకణంబులురుల నేడ్చెదవు? సంతాపంబునకు నేది హేతువు? తప్పనాడంగదా? ఆత్మనివ్హావంబపరాధంబొకో? శుద్ధాంతప్రవేశంబు దోసంబా? దేవదూత్యంబు ప్రత్యవాయంబా? చెప్పుము. సేవకులకుం దప్పు గలదే? కలదేనియుం గిరీటమాణిక్యమయూఖపుంజంబులఁ జరణకంజంబుల నివాళించెద ననుగ్రహింపుము. కృపాదృష్టిదానంబునకు బద్ధముష్టివి గాకుము. వదనంబు వికసించుంగాక. హృదయంబు ప్రసన్నంబుగావలయు. సృక్వభాగంబుల మందహాసలవంబులు గందళించుం గావుత. భ్రూలతాంచలంబులు లీలాచంచలంబు లయ్యెడు. అపాంగప్రాంగణంబులం దరంగితంబు లగుకలికిచూపులు నాపయిం బొల

యింపుము. బాష్పధారావృష్టివ్యపాయంబున దరహసిత
చంద్రికాలోకంబు ప్రకాశింపం దగు. మధురవచోమృతం
బు చెవులకుం జవి చూపుము. ఆలింగనం బపేక్షించెద.
చుంబనంబు దయసేయుము. కుచంబులకుం బరిచర్య సేయ
నిమ్ము. నఖాంకురనవశశాంక రేఖాభ్యుదయంబు పయోధ
రోత్సేధశిఖరికూటంబున ఘటియింపం జేయ ననుమతింపు
మని మన్మథోన్మాదంబునం బలికి యారాజమన్మథుండు. 91

టీ. చెలువ =దమయంతి, చెక్కుటద్దంబులన్, చేయి, యిడి, ఏల చింతిం
చెదవు=ఎందులకాలోచించెదవు? పల్లవపాటలంబు= చిగురువలెనే యెఱ్ఱఁదన
ముగలిగినది, ఐనయధరంబు=అయినట్టిపెదవి, బీఁటలు, ఎగయన్ =బ్రద్దలగున
ట్లుగా, వేఁడినిట్టూర్పుగాడ్పులు=వెచ్చనినిట్టూర్పుగాలులను, ఏటికిన్, నిగిడిం
చెదవు. ఏకతంబునన్ =ఏకారణముచేత, గద్గదికన్ =గద్గదస్వరమును, ఒందె
దవు, ఏకారణంబునన్, అశ్రుకణంబులు=కన్నీటిబిందువులు, ఉరులన్ =రా
లునట్లుగా, ఏడ్చెదవు, ఈసంతాపంబునకున్ = నీవిట్లుశ్రమచెందుటకు, ఏది,
హేతువు,తప్పన్ =మర్యాదకువిరుద్ధముగా, ఆడన్, కదా=సంభాషించియుం
డనుగదా, ఆత్మనిహ్నవంబు = ఒరులెఱుఁగకుండ మాఱువేషముదాల్చివచ్చుట,
అపరాధంబు-ఒక్కో=నేరమా? శుద్ధాంతప్రవేశంబు = అంతఃపురప్రవేశము,
దోసంబో=పాపహేతువా? దేవదూత్యంబు=దేవతలకు దూతనగుట, ప్రత్యవా
యంబు - ఒ=పాపములకు హేతువగునా? చెప్పుము, సేవకులకున్ =పరిచారకు
లకు, తప్పు=నీచకార్యములు చేయుటవలనదోషముకలదే? కలదేనియున్ =ఒక
వేళ నేదేని దోష మున్నచో, కిరీటమాణిక్యమయూఖపుంజంబులన్ - కిరీట=
కిరీటమందున్న, మాణిక్య=రత్నములయొక్క, మయూఖపుంజంబులన్ =కిరణస
మూహములచే, చరణకంజంబులన్ =పాదపద్మములను, నివాళించెదను=ఆరతె
త్తెదను. అనఁగా నాకిరీటము నీపాదములు సోఁకునట్లు మ్రొక్కెదననిభావము.
అనుగ్రహింపుము=దయఁజూడుము. కృపాదృష్టిదానంబునకున్ =కనికరపుచూ
పులను [illegible] లుబ్ధురాలవు,

కాకుము, వదనంబు=నీముఖంబు, వికసించుంగాక, హృదయంబు, ప్రసన్నంబు=
నిర్మలమైనది, కావలయును, సృక్వభాగంబులన్=ఓష్ఠప్రాంతములందు, మంద
హాసలవంబులు=చిఱునవ్వుయొక్క లేశములు;కందళించున్, కావుతన్, మొల
చుంగాక=అనంగా మందహాసము చేయుదువుగాకయని యర్థము.భ్రూలతాంచ
లంబులు=కనుబొమ్మలకొనలు,లీలాచంచలంబులు=విలాసములచేఁ జలించునవి. ఐ
య్యెడన్=అగుంగాక, అపాంగప్రాంగణంబులన్=కడకన్నులనెడి నాలుగిళ్ల
వాకిళ్లనుండి,తరంగితంబులు=తొలంకాడుచున్నవి, ఆగుకలికిచూపులు=అయినట్టి
సుందరములగుచూపులు, నాపయిన్, పొలయింపుము = ప్రసరింపఁజేయుము.
అనంగాఁ గడకన్నులతోఁ జూడుము. బాష్పధారావృష్టివ్యపాయంబునన్ -
బాష్పధారా=కన్నీటిధారలనెడి, వృష్టి=వర్షముయొక్క, వ్యపాయంబునన్=
తిరోధానముచే, దరహసితచంద్రికాలోకంబున్ = చిఱునవ్వనెడి వెన్నెలయొ
క్క కాంతి,ప్రకాశింపన్-తగున్=ప్రకాశించుంగాక, మధురవచోమృతంబు=
తియ్యనియమృతమువంటి మాటలను, చెవులకున్, చవి, చూపుము=వినిపింపుము.
ఆలింగనంబున్=కౌఁగిలింతను, అపేక్షించెదన్=కోరుచున్నాను. చుంబనంబున్
దయఁజేయుము=ముద్దుపెట్టుకొననిమ్ము. కుచంబులకున్, పరిచర్యన్=సేవను, చే
యన్,ఇమ్ము, అనంగా స్తనమర్దనసేయ నిమ్మని భావము నఖ...దయంబు-నఖాం
కుర=నఖక్షతములనెడి, నవశశాంకరేఖా = బాలచంద్రలేఖలయొక్క,అభ్యుద
యంబునకున్=అభివృద్ధికి లేక ఉదయించుటకు,పయోధరోత్సేధశిఖరికూటంబు
నన్-పయోధర= స్తనములనెడి, ఉత్సేధ=ఎత్తయిన, శిఖరి = పర్వతముయొ
క్క, కూటంబునన్=శృంగమునందు, ఘటియింపన్ చేయ, అనంగా నీ స్తన
ములపై నఖక్షతము లనుజేయ,అనుమతింపుము అని, మన్మథోన్మాదంబునన్ =
మదనతాపమువలనఁ గలిగినవెఱ్ఱితనముచే, పలికి, ఆరాజమన్మథుండు.

తా. స్పష్టము.

తే. కొంతతడ వివ్విధంబున భ్రాంతిఁ బొంది
యంత సంప్రాప్తసంస్కారుఁ డగుచు నాతఁ
డమరకార్యంబు విచ్ఛిన్న మగుటఁ దలఁచి

యంతరంగంబులోన నిట్లనుచు నుండె. 92

టీ. కొంతతడవు=కొంతకాలము, ఇవ్విధంబునన్ = ఈరీతిగా, భ్రాంతిన్ = భ్రమను, పొంది, అంతన్ = ఆతరువాత, సంప్రాప్తసంస్కారుఁడు=పొందిన యనుభూతసంస్కృతి కలవాఁడై, అనఁగాఁ దాననుభవించుచున్న యవస్థను తెలిసికొనియని యర్థము. అగుచున్, ఆతఁడు=ఆనలుఁడు, అమరకార్యంబు= దేవతలకార్యము, విచ్ఛిన్నము=చెడిపోయినది, అగుటన్, అనఁగా జెడిపోయినట్లనిభావము. తలఁచి=ఆలోచించి, అంతరంగంబులోనన్ = మనస్సులో, ఇట్లు, అనుచున్, ఉండెన్.

తా. నలరాజీప్రకారము కొంతసేపు మోహవశంబున సంభాషించి జ్ఞానము తెచ్చికొని, దేవతలకార్యము చెడిపోయినట్లు గ్రహించితనలో నిట్లనుకొనియెను.

క. ఏమి యని తలఁతురో కో ను
త్రామప్రముఖు లగుసుర లెడఁదన్ నిఖిలాంత
ర్యాములు దమకార్యం బే
నీమెయి విభ్రాంతి బొంది కెయిటు సెఱుచుటకున్. 93

టీ. నిఖిలాంతర్యాములు=సమస్తజంతువులయొక్క లోపలను సంచరించుచుండు, సుత్రామప్రముఖులు=దేవేంద్రుఁడు మొదలగువారలు, అగుసురలు= అయినదేవతలు, ఎదన్ =మనస్సులో, తమకార్యంబున్ =ఆదేవతలకార్యమును, ఏను, ఈమెయిన్ = ఈరీతిగా, విభ్రాంతిన్ = మిక్కిలి మోహమును, పొంది, ఇటు= ఈలాగున, చెఱుచుటకున్ =పాడుచేసినందులకు, ఏమి—అని—తలఁతురు ఒకో=ఏమనిభావించుదురో? అనఁగా విరుద్ధముగాఁదలంపకమానరని భావము.

తా. సమస్తభూతములయొక్కహృదయముల నెఱింగి ప్రవర్తించుచున్న యింద్రాదిదేవతలు నేనీరీతిని భ్రాంతిచెంది కార్యమును జెఱుచుటను తెలిసికొని తమచిత్తములలో విరుద్ధముగా భావింపకమానరు.

క. పేరు ప్రమాదవశంబునఁ
బేరుగొనుట కల యమ్మెకె బృందారకకా

ర్యారంభోదయమున కది
యారూఢం బైనవిఘ్నమై ఫలియించెన్. 94

టీ. ప్రమాదవశంబునన్=పొరపాటుచే, పేరున్=నామమును, పేరుకొనుట=చెప్పుట, కల్ల=మోసము, లేక, అపరాధము, అయ్యెన్=నేను దమయంతితో నా పేరు చెప్పి మిక్కిలియపరాధమును జేసితిని, అది=నా పేరు చెప్పుటయె, బృందారక కార్యారంభోదయమునకున్ = దేవతలయొక్క కార్యము ఫలించుటకు, ఆరూఢంబు=స్థిరమైనది, ఐన విఘ్నమై= అయినట్టియంతరాయమై, ఫలించెన్=నిలిచెను, అనఁగా నా పేరును జెప్పుటయే దేవతలకార్యము నెఱవేఱకుండుటకు ముఖ్యకారణము.

తా. ప్రమాదమున నేను నలుఁడనని దమయంతితోఁ జెప్పుట మిక్కిలియపరాధము. అదియే దేవతలకార్యమును బూర్తిగా నశింపఁజేయుటకుఁ బ్రధాన కారణ మాయెను.

ఉ. ఆదిఁ బరోపకారపరులై చరియించినయట్టియాంజనే
యాదులఁ బోలనైతి నిపు డక్కట దైవతకార్యసిద్ధివి
చ్ఛేదము నొందె నేమి యని చెప్పుదు నింక నమర్త్యపంక్తికు
న్మాదులుసంఘటింపఁగసమర్థులెయెందును రాయబారముల్.

టీ. ఆదిన్=పూర్వకాలమునందు, పరోపకారపరులు=ఇతరులకుపకారము చేయుటందు నాసక్తిగలవారలు, ఐ, చరియించినయట్టియాంజనేయాదులన్= ప్రవర్తించిన హనుమంతుఁడు మొదలగువారలను, పోలనైతిన్ =సరిచెందలేక పోయితిని. అనఁగా నాంజనేయాదులు కార్యములను నెఱవేర్చివచ్చి మెప్పును జెందినట్లు నేనును దేవతలకార్యమును నెఱవేర్చి మెప్పొందలేకపోయితినని భావము. అక్కట=అయ్యో, ఇప్పుడు, దైవతకార్యసిద్ధి=దేవతలకార్యము ఫలించుట, విచ్ఛేదమునొందెన్=నశించినది, అమర్త్యపంక్తికిన్ =దేవతాసమూహమునకు, ఇంకన్, ఏమి, అని, చెప్పుదున్, ఎందును=ఎప్పుడైనను, ఉన్మాదులు= వెఱ్ఱులైనవారలు, రాయభారముల్=సందేశములను, సంఘటింపఁగన్ =నెఱవేర్చుటకు, సమర్థులు=శక్తిగలవారగుదురా? అనఁగా కారనుట.

తా. పూర్వము పరోపకారముచేసి ఖ్యాతిగాంచిన హనుమంతుఁడు మొదలగువారితో సామ్యము చెందలేకపోతిని. అయ్యో! ఇప్పుడు దేవతలకార్యము నశించినది. ఈవార్త నాయింద్రాదులకేమని చెప్పుదును. లోకములో నెచ్చోటనైనను మోహముపొందినవారు రాయబారపుకార్యముల నెఱవేర్పఁజాలరుకదా! అలం=అర్థాంతరము.

తే. వగవ నేటికి నే మనఁ వచ్చు నిపుడు
చేతనాహానిఁ గార్యంబు చిన్నఁబోయెఁ
జేతనాహాని దైవంబుచేత వచ్చె
దైవగతి దాఁటవచ్చునే దేవతలకు. 96

టీ. ఇపుడు, వగవన్=దుఃఖించుట, ఏటికిన్ = ఎందుకు, ఏమి అనన్ వచ్చున్=ఏమనితలంపను, చేతనాహానిన్=నేను దేవతలదూతనుఅనెడి బుద్ధిలేకపోవుటచే, కార్యంబు,చిన్నఁబోయెన్=నశించెను. చేతనాహాని=తాదృశబుద్ధినాశనము, దైవంబుచేతన్,వచ్చెన్=కలిగెను,అనఁగా దైవమువలననే నాకప్పు డట్టిబుద్ధినాశము కలిగినది. దేవతలకున్=దేవతలకైనను, దైవగతి=దైవముయొక్కరీతిని, దాఁటవచ్చునే = దాఁటుటకు వీలగునా!

తా. ఇట్లువగచిన నేమిలాభము? ఇపుడేమనవచ్చును? చేతనము లేకపోవుటచేత నే కార్యంబు నశించినది. నాకట్లు చేతనము లేక వివేకము నశించుట దైవమువలన సంప్రాప్తమయినది. ఆదైవగతిని దేవతలకైనను దాఁటవలను పడదు. అలం. అర్థాంతరము.

తే. అని విచారించుచుండె నయ్యవనినాథుఁ
డంతకయ మున్న నలునిఁగా నతని నెఱిఁగి
యెదురుగద్దియ డిగ్గి పృథ్వీశతనయ
యవనికాంతరమున నోలమాసగొనియె. 97

టీ. అయ్యవనినాథుఁడు=ఆనలమహారాజు,అని=ఇట్లుపలికి,విచారించుచుండెన్, అంతకయమున్న=నలుఁడు తిరిగి వివేకమును బొందకమునుపే, అతనిన్=ఆదూతను,నలునిఁగాన్=నలరాజునుగా, ఎఱింగి=తెలిసికొని, ఎదురుగద్దియ=ఎదురు

గానున్న పీఠమును, డిగ్గి=డిగి, పృథ్వీశతనయ=దమయంతి, యవనికాంతరమునన్ =యవనికయొక్క మధ్యమందు, ఓలమాసగొనియెన్ =తిరోధానముచెందెను.

తా. నలుఁడట్లు విచారించుచుండఁగా దమయంతి యతని నలునిఁగా నెఱింగి యెదురుగానున్న పీఠమును దిగి తెరచాటున దాఁగుకొనెను.

క. ఆనందబాష్పధారల
వానకుఁ బులకములయుద్భవములకుఁ దగ న
మ్మానిని గదంబలతికకుఁ
దా నెచ్చెలిపోలె నుండెఁ దదవసరమునన్.　　98

టీ. తదవసరమునన్ =ఆసమయమందు, అమ్మానిని, దమయంతి, తాన్, ఆనందబాష్పధారలవానకున్ =సంతోషమువలనఁ గలిగినకన్నీటివర్షమునకు, పులకములయుద్భవమునకున్ =పులకలుగలుగుటకు, తగన్ =ఒప్పునట్లుగా, కదంబలతికకున్ =కడిమిచెట్టుతీగెకొమ్మకు, నెచ్చెలిపోలెన్ =చెలికత్తియవలెను, ఉండెన్, అనఁగా దమయంతియతని నలునిగా నెఱిఁగి యధికానందముచెంది మెయి నిండ పులకలుకలదై దట్టముగఁ బూచినకదంబశాఖవలె నుండెనని భావము.

తా. ఆదమయంతి యానందబాష్పవర్షమునకుఁ బులకాంకురములకును దట్టముగఁ బూచినకదంబశాఖకుసమమై ప్రకాశించెను.

వ. ఇత్తెఱంగున నమ్మెఱుంగుబోఁడి తెరమఱుంగున నుండియు లజ్జావశంబునఁ బలుకనేరక సమయోచితంబు లగుభాషణంబులు చెలికత్తియకుం గఱపి పుత్తేర నబ్బోటి నిషధరాజుం జేరి యిట్లనియె.　　99

టీ. ఇత్తెఱంగునన్ =ఈరీతిగా, అమ్మెఱుంగుబోఁడి=మెఱుపువంటి శరీరముగల దమయంతి, తెరమఱుంగునన్ =తెరచాటున, ఉండియు, లజ్జావశంబునన్ =సిగ్గుచేత, పలుకన్, నేరక=పలుకఁజాలక, సమయోచితంబులు=సమయమునకుఁ దగినవి, అగుభాషణంబులు=అయినమాటలను, చెలికత్తియకు, కఱపి=నేర్పి, పుత్తేరన్ =పంపఁగా, అబ్బోటి=ఆచెలికత్తె, నిషధరాజున్ = నలుని, చేరి=సమీపించి, ఇట్లు అనియెన్.

తా. సులభము.

తే. అర్థిసాధారణమునకు ◊ నభయ మిత్తు
వజ్రపాతంబు ఘోర మై ◊ వచ్చినపుడ
యతనుపూఁదూపులకు భయం ◊ బంది యున్న
నాకు నభయంబుఁ గృపసేయ ◊ నీకు బరువె. 100

టీ. వజ్రపాతంబు=వజ్రాయుధపుదెబ్బ, ఘోరమై = భయంకరమైనదై, వచ్చినపుడ=వచ్చినసమయమందె, అర్థిసాధారణమునకున్ = సామాన్యయాచకులకు, అభయము=అభయప్రదానము, ఇత్తువు, అనఁగాఁ 'బ్రాణములనైననిచ్చి రక్షించువాఁడవు, అతనుపూఁదూపులకున్ = మన్మథబాణములకు, భయంబు, అంది యున్న=పొందినట్టి, నాకున్=దమయంతికనుట, అభయంబును=భయాభావమును, కృపచేయన్=దయతోనిచ్చుటకు, నీకున్,బరువె=భారమా? అనఁగా మిక్కిలి భయంకరమగు వజ్రాయుధంబుననుండియే సామాన్యయాచకులకు నభయము నిచ్చుచున్న నీకు మన్మథపూలబాణంబులనుండి భయమునుదప్పించు టనఁగ నీకేపాటికార్యము?

తా. ఓనలమహారాజా! భయంకర మగు వజ్రాయుధముదెబ్బకు భయపడి నీకు శరణుచొరఁగా నట్టిసామాన్యయాచకులఁ గృపతోఁ జూచి వారికి భయము లేకుండఁ జేయుచున్నావు. అట్లుండ శరీరములేని యోధుఁడువేయు పువ్వుబాణములనుండి నాకు సంప్రాప్తమగు భయమును దొలఁగించుట నీకెంత కార్యము? అలం—అర్థాపత్తి.

ఆ. ఆత్మకాండకారుఁ ◊ డగువసంతునకు నె
య్యంపుఁజుట్ట మైన ◊ యంగభవుని
నిందుమదిఁ దలంపు ◊ చండాలజాతిగా
వానికై యభీతి ◊ దాన మొసఁగు. 101

టీ. ఆత్మకాండకారుఁడు-ఆత్మ=తనకు, కాండ=బాణములను,కారుండు=చేసెడివాఁడు, అగువసంతునకున్ = అయినవసంతునకు, నెయ్యంపుఁజుట్టము=

మాలవానిఁగా, నిండుమదిన్, తలంపును, వానికై=వానినుండి, అభీతిదానము=అభయప్రదానము,ఒసఁగు=ఇమ్ము. అనఁగా కాండకారత్వమనఁగాఁ జండాలధర్మము. అట్టిధర్మము కలవాఁడు కాండకరుఁ డనిపించుకొనును; వసంతుఁడు కాండకారుండు కావున నతని కాప్తబంధు వగు మన్మథుండుగూడ నట్టివాఁడే. అందుచే మన్మథుఁడు చండాలుఁడు. అట్టివానినిఁ జంపినను దోషములేదు. కాన మన్మథునిఁ జంపి నాకభయప్రదాన మిమ్మని భావము.

తా. తనకు బాణములను (చండాలధర్మము) నిచ్చువసంతునకు నెచ్చెలియైన మన్మథుని మనంబులోఁ జండాలునిఁగా నెఱింగి వానిఁ జంపి నాకభయ మిమ్ము.

మ. అనుచున్ సారఘుసారసారిణికి నెయ్యంపుంజెలింబోనితి
 య్యనివాక్యంబులబోఁటిభీమసుతమాత్రై యేర్పడం బల్కఁగన్
 మనమహ్లాదముఁ బొందుచుండఁగను భూనాథుండు గంభీరతన్
 వినఁడయ్యెన్ సురరాజకార్యఘటనా విఘ్నంబు వాటిల్లుటన్.

టీ. బోఁటి=దమయంతిచెలికత్తె, అనుచున్=ఈరీతిగా, సారఘుసారసారిణికి-సారఘుసార=మధురససారముయొక్క, సారిణికిన్=నదికి, నెయ్యంపుంజెలిన్=చెలికత్తెను, పోనితియ్యనివాక్యంబులన్=పోలినట్టితియ్యనిమాటచేత, అనఁగామధురసమువలెనే యాబోఁటివాక్యములు మిగులమాధుర్యము గలిగి వర్తించుచున్నవని భావము. భీమసుతమాత్రై=దమయంతికిఁ బ్రతినిధియై, ఏర్పడన్=స్పష్టముగా, పల్కఁగన్=సంభాషింపఁగా, భూనాథుండు=నలరాజు, మనము=తనమనస్సు, ఆహ్లాదము = ఆనందము, పొందుచుండఁగన్, గంభీరతన్=గాంభీర్యముచే, సుర...విఘ్నంబు—సురరాజ=దేవేంద్రునియొక్క, కార్య=పనిని,అనఁగా దమయంతి నొప్పించుటయనెడుదాని నని భావము.ఘటనా=సమకూర్చుటయందు, విఘ్నంబు=అంతరాయము, పాటిల్లుటన్=సంభవించుటంబట్టి, వినఁడు-అయ్యె = దమయంతిచెలికత్తెవాక్యములను వినలేదు.

తా. దమయంతిచెలికత్తె యిట్లు మధురసమువలెనే మిక్కిలి తియ్యఁగా నున్నవాక్యంబులచే దమయంతికి మాఱుగా నలునికిఁ జెప్పఁగా నతనిమనంబా

మాటలువిననానందము చెందుచున్నను, దేవేంద్రునికార్యమునకు విఘ్నముగల్గిన దన్నవిచారముచే వానిని వినలేదు.

వ. చెలికత్తెయుం గ్రమ్మఱి దమయంతీసమీపంబునకు వచ్చె నప్పుడు. 103

టీ. స్పష్టము.

ఉ. నిక్కపుదూత సామి ధరణీపతిముందట నేమి యంటినో
వెక్కలు మాటలే ననుచు భీమతనూభవ నెమ్మనంబునన్
ద్రుక్కుచునుండె నైషధుఁడు నంగడుఁ జింతవహించె విన్ననై
యక్కట! దేవకార్యమిటులాఁడిఁబోయెనెయంచునాత్మలోన్.

టీ. భీమతనూభవ=దమయంతి, నెమ్మనంబునన్=నిండుమనస్సునందు, నిక్కపుదూత=నిజముగాదూతవలెవచ్చినవాఁడును, సామి=ప్రభువునగు, ధరణీపతి ముందటన్=నలరాజునెదుట, ఏను, వెక్కలుమాటలు, ఏమి, అంటినో=ఏమి పల్కియున్నానో? అనఁగా దమయంతినలునికడఁజాలకాలము మాటలాడెను గాన నామాటలాతని కేవయిన వికటముగానుండెనేమో యని యనుట, ద్రుక్కుచునుండెన్=విచారించుచుండెను. నైషధుఁడునున్=నలరాజును, విన్ననై=చిన్నఁబోయినవాఁడయి, దేవకార్యము, ఇటులు, ఆఁడిన్ పోయెనె=వ్యర్థమయినదే, అనుచున్=ఆత్మలోన్, చింత, వహించెన్=విచారింపనారంభించెను.

తా. దూతయై వచ్చిననలునియెదుటఁ వెక్కలు మాటలాడితిని, ఏమివికటపుమాట లాడియున్నానో యని దమయంతి విచారమునొందుచుండెను. అప్పుడు నలరాజును దేవతలకార్యమున కిట్లు విఘ్నమయ్యెఁగదా యని మనంబున విచారింపఁ జొచ్చెను.

ఉ. ఆసమయంబునం గనకహంసము హంసపథంబు డిగ్గి యు
ద్భాసితకాంతి నల్దిశలఁ బర్వఁగ నచ్చటి కేఁగుదెంచెఁ జిం
తాసముపేతులై విగతధైర్యత నివ్వెఱఁ గంది యున్నయా
రాసుతురాజకన్య ననురాగమెలర్పఁగ నూఱడింపఁగన్. 105

టీ. ఆసమయంబునన్ =నలదమయంతు లిట్లు విచారముపొందుచున్న సమయములో, కనకహంసము=వెనుక వీరలకన్యోన్య మనురాగముగలిగించినబంగారు హంస, హంసపథంబు=సూర్యునిమార్గమునుండి, అనఁగా నాకాశమునుండియనుట, డిగ్గి=దిగి, ఉద్భాసితకాంతి=మిక్కిలిప్రకాశించుకాంతి, నల్దిశలన్ = నాల్గుదిక్కులందున్, పర్వన్ కన్ =వ్యాపించుచుండఁగా, చింతాసముపేతులు=విచారముతోఁ గూడినవారై, విగతధైర్యతన్ =ధైర్యముపోయినవా రగుటచే, నివ్వెఱఁగు=నిండుభయంబును, అంది, ఉన్నయారాసుతున్ = ఉన్నట్టి నలుని, రాజకన్యన్ =దమయంతిని, అనురాగము=ప్రేమను, ఎలర్పఁగన్ =అతిశయించునట్లుగా, ఊఱడింపఁగన్ =ఓదార్చుటకు, అచ్చటికిన్ =నలదమయంతులున్నచోటికి, ఏఁగుదెంచెన్ =వచ్చెను.

తా. అంతట వెనుకటిబంగారుహంస యాకాశమునుండిదిగి, తన ఱెక్కల కాంతులంతటనువ్యాపించుచుండఁగా, మిక్కిలివిచారమును భయంబును బొంది యున్న నలదమయంతులను దనప్రేమాతిశయము వెల్లడియగునట్లు లూఱడించుట కచ్చటికేతెంచెను.

వ. ఏఁగుదెంచి,పూర్వపరిచయంబున నుర్వీకాంతుని చేతను దమయంతిచేతను సంతోషసంభ్రమసహితంబుగా నుపలాలనంబు వడసి యమ్మరాళంబు నలున కి ట్లనియె.    106

టీ. ఏఁగుదెంచి=వచ్చి, పూర్వపరిచయంబునన్ =పూర్వమునందలి చనవుచే, ఉర్వీకాంతు చేతను=నలునిచేతను, దమయంతిచేతను, సంతోషసంభ్రమ సహితంబుగాన్ = సంతోషమును, తొట్రుపాటును గలుగునట్లుగా, ఉపలాలనంబు=మన్ననను, పడసి=పొంది, అమ్మరాళంబు=ఆహంసము, నలునకున్, ఇట్లనియెన్ .

శా. నీయంతఃకరణంబు నిర్మలము వర్ణింపంగ శక్యంబె నీ
భూయస్త్వంబు జగత్ప్రసిద్ధములు నీపుణ్యప్రభావంబు లే
లాయీలాగునఁజింతనొందెదవు కార్యావాప్తియాఁ గాదఁటే
యాయింద్రాదులు నీనిజం బెఱుఁగ రే యబ్జారివంశాగ్రణీ.

టీ. అబ్జారివంశాగ్రణీ = చంద్రవంశజులలో శ్రేష్ఠుఁడవయిన నలరాజా! నీయంతఃకరణంబు=నీచిత్తము,నిర్మలము=దోషరహితమయినది,నీభూయస్త్వంబుల్ =నీగొప్పతనమును, వర్ణింపంగన్ = కొనియాడుటకు, శక్యంబె=తరమగునా? అనఁగాఁ గాదనుట. నీపుణ్యప్రభావంబులు=నీయదృష్టమును సామర్థ్యమును, జగత్ప్రసిద్ధములు = జగంబునవాసికెక్కినవి, ఏలా-ఈరీతిని-చింతన్-పొందెదవు=ఎందులకు నీవిట్లు విచారముపొందెదవు? కార్యావాప్తి=కార్యసిద్ధి, కాన్=అగును, కాదటె=కాకపోవునా? ఆయింద్రాదులు=దేవేంద్రుఁడు మొదలగువారు, నీనిజంబుల్=నీతత్త్వమును, ఎఱుంగరే=తెలిసికొనరా? అనఁగా నీతత్త్వము నింద్రాదు లెఱిఁగి యానందింతురుకాని నీవు వారికార్యములను జెఱిచితివని కోపింపరు కాన నీవందులకయి విచారింప నవసరము లేదనిభావము.

తా. ఓనలరాజా! నీచిత్తము నిర్మలమైనది నీగొప్పతనము నెవ్వరును వర్ణింపలేరు; నీయదృష్టమును నీసామర్థ్యమును జగంబున నతిగాంచినవి; నీ కార్యసిద్ధికాలేదని విచారమునొందకుము. దేవతలు నీతత్త్వమును దెలిసికొని నిన్ను నుతింతురుగాని నిందింపరు.

వ. అని వైదర్భిఁ గనుంగొని. 108

తే. అమ్మ దమయంతి యంతరంగమ్ములోన
మాను సందియ మీతండె మగఁడు నీకు
నాఁడె దా నానతిచ్చినవాఁడు బ్రహ్మ
తద్వచనమున కన్యథాత్వంబు గలదె. 109

టీ. అమ్మ, దమయంతి, అంతరంగంబులోనన్ = మనంబునందు, సందియము=శంకను-అనఁగా నలుఁడు నాకుభర్త యగునా కాఁడా యనుసందేహము నని భావము. మాను=విడువుము. నీకున్, ఈతండు = ఈనలుఁడే, మగఁడు, బ్రహ్మ, నాఁడె=పూర్వమందె, ఆనతిచ్చినవాఁడు=దమయంతికి నలుఁడే భర్త యనిచెప్పినవాఁడు. తద్వచనమునకున్=ఆబ్రహ్మవాక్యమునకు, అన్యథాత్వంబు=వేఱుగా నగుట, కలదే=కలదా? అనఁగా బ్రహ్మవాక్య మెన్నఁటికిని దిరుగదనుట.

తా. ఓదమయంతీ! మనస్సులోనిసందేహమును విడిచిపెట్టుము. నలుఁడే నీకు భర్త కాఁగలఁడు. నీకు నలుఁడేభర్తయని బ్రహ్మ పూర్వమందే చెప్పినాఁడు. ఆతనిపలుకెప్పుడైనఁ దిరుగునా?

వ. అని యయ్యిద్దఱ నుద్దేశించి దంపతులకు మేలు గావలయు. ఉత్తరకర్మంబవిఘ్నం బగుంగాక. నాకును సరసిజాసనప్రసాదంబున సకలభూతాంతర్వర్తనంబులు దెలివిపడి యుండు. ఇప్పుడు చింతాభరంబులం గలంగినమీయంతరంగంబులవిషాదం బపనయింప వచ్చితి. పోయివచ్చెద నని సముచితప్రకారంబున నయ్యిరువురచేత ననుజ్ఞాతుండై పతంగపుంగవుం డరిగె ననంతరంబ. 110

టీ. అని, అయ్యిద్దఱన్ = ఆనలదమయంతులనిరువురను, ఉద్దేశించి, దంపతులకున్, మేలు, కావలయును = కలిగెడుఁగాక, ఉత్తరకర్మంబు = మీఁద వివాహాదికార్యము, అవిఘ్నంబు = విఘ్నములేనిది, అగున్, కాక, నాకును, సరసిజాసనప్రసాదంబునన్ = బ్రహ్మయనుగ్రహంబువలన, సకలభూతాంతర్వర్తనంబులు = అన్నిభూతములమనస్సులలో నున్నప్రవర్తనములు, తెలివిపడి, ఉండున్ = తెలిసియుండును, ఇప్పుడు, చింతాభరంబులన్ = విచారాతిశయములచే, కలంగిన = కలఁతచెందిన, మీయంతరంగంబులవిషాదము = మీమనస్సులలో నున్న విచారము, అపనయింపన్ = తొలఁగించుటకు, వచ్చితిని, పోయివచ్చెదను, అని, సముచితప్రకారంబునన్ = తగినరీతులచేత, అయ్యిరువురచేతన్ = ఆయిద్దఱిచేతను, అనుజ్ఞాతుండై = సెలవుపొందినవాఁడై, పతంగపుంగవుండు = పక్షిశ్రేష్ఠుఁడగు నాహంసరాజు, అరిగెన్ = పోయెను. అనంతరంబ = తరువాత.

క. కనకమరాళం బీక్రియ
　ననుకంపను బుద్ధిసెప్పి యరిగినవెనుకన్
　మనమునఁ జింతాభరములు
　జనపతికి విలాపవతికిఁ జయ్యన వాసెన్. 111

టీ. కనకమరాళము = బంగారుహంస, ఈక్రియన్ = ఈరీతిగా, అనుకంపన్=దయచే, బుద్ధిచెప్పి, అరిగినవెనుకన్=పోయినతరువాత, జనపతికిన్ = నలునకును, విలాసవతికిన్ = ఒయ్యారములు గలదమయంతికిని, మనమునన్, చింతాభరములు=విచారాతిశయములు, చయ్యనన్=వేగముగా, పాసెన్=తొలఁగిపోయెను.

తా. కనకహంసము దయతోవచ్చి యిట్లు చెప్పిపోయినతరువాత నలదమయంతులకు మనములలో నున్నవిచారంబులు నశించెను.

వ. అప్పుడు నృపాలుండు హేమమరాళసాంత్వనాలాపబలంబున
నెట్టకేలకు మనంబునం జేవదెచ్చుకొని దిక్పాలురం దలంచి
నమస్కరించి యి ట్లనియె. 112

టీ. అప్పుడు, నృపాలుండు=నలుఁడు, హేమమరాళసాంత్వనాలాపబలంబునన్=బంగారుహంస చెప్పిన యోదార్పుమాటలసామర్థ్యముచే, ఎట్టకేలకున్=అతికష్టముచే, మనంబునన్, చేవ=ధైర్యమును, తెచ్చుకొని, దిక్పాలురన్, తలంచి=ధ్యానించి, నమస్కరించి, ఇట్లు, అనియెన్.

ఉ. భావములో నదంభ యగుభక్తికిసంతస మందుఁడొండె నొం
డే విధియింపుఁ డిప్పుడ కడిందిగ దండము దప్పు గల్గనే
నీవిరహానలంబునకు నింకిట నేమియు నోర్వలేఁజుఁడీ
దేవతలార! మన్మథునితీవ్రశరంబులు గాఁడి పాఱఁగన్. 113

టీ. దేవతలార! భావములోన్=మనస్సులో, అదంభ=నిష్కపట, అగుభక్తికిన్, సంతసము, అందుఁడు-ఒండెన్ = పొందియుండినను సరియే, ఒండేన్=కానిపక్షమున, తప్పు=నావలని నేరము, కల్గెనేని=ఉన్నచో, ఇప్పుడ=తత్క్షణమునందే, కడిందిగన్=అధికముగా, దండము=శిక్ష, విధింపుఁడు = చేయుఁడు, మన్మథునితీవ్రశరంబులు=వాఁడియయిన మన్మథబాణములు, కాఁడి=వాటి, పాఱఁగన్=లోపలికిఁ జొచ్చిపోవుచుండఁగా, ఈవిరహానలంబునకున్=ఈవిరహాగ్నిహోత్రమునకు, ఇంకన్, ఇటన్ = ఈమీఁద, ఓర్వన్-లేను-చుఁడీ=సహింపలేను జుఁడీ.

తా. ఓదేవతలారా! కాపట్యములేని నామనోభక్తికి సంతసించిన సంతసింపుఁడు; లేక నావలన నేరమున్నచో నందుల కెక్కుడుగా శిక్ష విధించిన విధింపుఁడు. మన్మథునివాఁడిబాణములు నన్ను హింసించుచున్నవి. ఇఁకమీఁద నీవియోగాగ్నికి సహింపలేను.

వ. అనంతరంబ తిరస్కరిణీతిరోహితయై యుండి యక్కుండినేంద్రనందన రాజనందనున కిట్లనియె. 114

అ. తిరస్కరిణీతిరోహిత=తెరచేత మఱుఁగుపడినది, తా. స్పష్టము.

ఉ. ఓరజనీకరాన్వయపయోధినిశాకర యేఁ బతివ్రతన్
కూరిమి మీఱ నొక్కరునిఁ గోరి వరింపఁగ నున్నవారి కె
వ్వారికి నెగ్గుగాఁ దలఁపవచ్చునె నిన్ను వరింతు నెల్లి బృం
దారకులున్ నృపాలురును దక్కినవారునుజూచుచుండఁగన్.

టీ. ఓ...నిశాకర-రజనీకరాన్వయ=చంద్రవంశ మనెడి, పయోధి=సముద్రమునకు, నిశాకర=చంద్రునివంటివాఁడా! ఏన్, పతివ్రతన్=పతియె వ్రతముగా కలదానను, కూరిమి=ప్రేమము, మీఱన్ = అతిశయించునట్లు, ఒక్కరునిన్, కోరి, వరింపఁగన్=పెండ్లియాడఁగా, ఉన్నవారికిన్ = మిగిలినవారికి, ఎవ్వారికిన్=ఎట్టివారికయినను, ఎగ్గుగాన్=నిందాకార్యముగా, తలఁపవచ్చునే=అనఁగాఁ దలఁపరాదనుట. ఎల్లి = రేపు, బృందారకులున్=దేవతలును, నృపాలురును=రాజులును,తక్కినవారును=తక్కిన వచ్చినజనములును,చూచుచుండఁగా, నిన్నున్, వరింతును.

తా. ఓచంద్రవంశాగ్రణీ! నేను పతివ్రతను. అట్టిపతివ్రత తన కిష్టుఁడగు వాని వరించికొనఁగాఁ దక్కినవా రందులకు విరుద్ధముగాఁ బ్రవర్తింపరాదు. రేపు దేవతలును రాజులును దక్కినవారును జూచుచునుండ నిన్ను వరించెదను. విచారము నొందకుము.

గీ. ఎల్లలోకధర్మంబులు నెఱిఁగియుండి
యేల సేయుదు రమరేంద్రు లీరసంబు

నాది వారికి వందనంబాచరించి
తదనుమతి నిన్ను వరియింతుఁ దథ్య మిదియ. 116

టీ. అమరేంద్రులు=దేవతలు, ఎల్లలోకధర్మంబులు=లోకధర్మముల నన్నింటిని, ఎఱిఁగి-ఉండి=తెలిసికొనియుండి, ఈరసంబు = అసూయను, లేక కోపమును, ఏలచేయుదురు=ఎందుకు చేయుదురు? ఆదిన్ =మొదట, వారికిన్ =ఆ దేవతలకు, వందనంబు=నమస్కారమును, ఆచరించి=చేసి, తదనుమతిన్ =ఆదేవతలయాజ్ఞచేత, నిన్నున్, వరియింతున్ = పెండ్లియాడుదును, ఇదియ=ఈ యర్థమే, తథ్యము=నిక్కువము.

తా. ఓధరణీంద్రా! లోకధర్మంబుల నన్నింటిని దెలిసియున్న దేవతలిందుల కేల కోపము చెందుదురు? మొట్టమొదట నాదేవతలకు నమస్కారము చేసి వారి యనుమతిని బొందియే నిన్నుఁ బెండ్లియాడెదను. ఇదే నిశ్చయము.

మ. అను చన్యోన్యము పెద్దయేనితడ వేకాంతంబున న్వారు వో
యినపోక ల్వినుచంతరిక్షగతులై యింతంతటం గానరా
క నిగూఢాకృతి నున్న దేవతలు దత్కాలంబునన్ రాజనం
దను నంతర్హితుఁ జేసి చేరి రతఁడుం దారు న్నిజస్థానమున్.

టీ. అనుచున్, అన్యోన్యము=పరస్పరమును, పెద్దయేనితడవు = చాలసేపు, ఏకాంతంబునన్ =రహస్యస్థలమందు, వారు=ఆనలదమయంతులు, పోయినపోకల్ =పోవుచున్న ప్రవర్తనలు, వినుచున్ =ఆలకించుచు, అంతరిక్షగతులై=ఆకాశమందున్నవారై, ఇంతంతటన్ =ఇచ్చట నచ్చటను, కానరాక=కనఁబడక, నిగూఢాకృతిన్ =ప్రచ్ఛన్నాకారముతో, ఉన్న దేవతలు=ఉన్నట్టి యింద్రాదులు, తత్కాలంబునన్ =ఆకాలమునందు, రాజనందనున్ = నలరాజును, అంతర్హితున్-చేసి=అంతర్ధాన మగునట్లు లొనర్చి, అతఁడున్ =ఆనలుఁడును, తారున్ =ఆయింద్రాదులును, నిజస్థానమున్ =స్వస్థలమును, చేరిరి = పొందిరి. అనఁగాఁ దౌలుత నలుని రాయబారిగాఁ బంపినస్థలము నని యర్థము.

తా. ఈరీతి నలదమయంతు లన్యోన్యమును జాలసేపు రహస్యస్థలమందుండి చేసిన సల్లాప [illegible] ముఁ బ్రచ్ఛ

న్నులయియుండి విన్నవారయి యింద్రాదులు, నలుని నంతర్ధానము గావించి యతనితో స్వస్థలమును జేరిరి.

తే. నలునిదూతత్వ మిబ్భంగిఁ దెలియఁజూచి
తన్మనశ్శుద్ధి కొంది రాత్మల ముదంబుఁ
దమ్ము నక్కాంత వరియింపఁ దలఁపులేమి
ఖేద మందుచు నుండి రింద్రాదిసురలు.    118

టీ. ఇంద్రాదిసురలు, నలుని దూతత్వము=నలుని రాయబారము, ఇబ్భంగిన్=ఈరీతిగా, తెలియన్-చూచి = తెలిసికొని, ఆత్మలన్ = మనస్సులలో, తన్మనశ్శుద్ధికిన్ = ఆనలుని నిర్మలాంతఃకరణమునకు, ముదంబున్ = సంతసంబును, ఒందిరి, అక్కాంత=ఆదమయంతి, తమ్మున్=ఆ యింద్రాదుల ననుట, వరియింపన్=వరించునని,తలఁపు=కోరిక,లేమిన్=లేకపోవుటచే, అనఁగా దమయంతి తమ్ము వరించునన్నయాశ లేకపోవుటచే నని యర్థము, ఖేదము- అందుచునుండిరి=దుఃఖించుచుండిరి.

తా. ఈరీతిగాఁ బ్రవర్తిల్లిన నలుని రాయబారపు వృత్తాంతమును నింద్రాదులు తెలిసికొని నలునిమనశ్శుద్ధికి సంతసమునొందిరి. మఱియు దమయంతి తమ్ము వరించునన్నయాశ లేకపోవుటచే దుఃఖమును బొందుచుండిరి.

వ. అనంతరంబ కామరూపం బగునాసుత్రామాదిచతుష్టయం బుపాయాంతరంబున దమయంతి వరియింపం దలంచి వంచనానైపుణంబున నలరూపంబులు ధరించి స్వయంవరకాలంబు ప్రతీక్షించుచుండిరి. నిషధరాజును భోజరాజాధికారపురుషనిర్దిష్టం బై నరమ్యస్థలంబున సపరివారుండై బృందారకానుమతి వడసి వసియించె నయ్యవసరంబున.    119

టీ. అనంతరంబ = నలునిరాయభారము ముగిసినపిమ్మట, కామరూపంబు -అగు=ఇష్టమగురూపమును ధరింపఁగల, ఆసుత్రామాదిచతుష్టయంబు=ఇంద్రుఁడు మొదలగు నానల్వురుదేవతలును, ఉపాయాంతరంబునన్ =మఱొకయుపా

యముచేతను, వరియింపఁగ్, తలంచి, వంచనానైపుణంబునఁ = కాపట్యమందలి నేర్పుచేత, నలరూపంబులు, ధరించి, స్వయంవరకాలంబును, ప్రతీక్షించుచుండిరి = వేచియుండిరి. నిషధరాజును, భోజ...నిర్దిష్టంబు-భోజరాజ = విదర్భరాజు యొక్క, అధికారపురుష = ఉద్యోగస్థులచే, నిర్దిష్టంబు = చూపఁబడినది, ఐన రమ్యస్థలంబునఁ = అయినట్టి మనోహరమగుచోటునందు, బృందారకానుమతిఁ = దేవతలయాజ్ఞను, పడసి = పొంది, వసియించెఁ, అయ్యవసరంబునఁ = ఆసమయమందు.

మ. చతురంగధ్వజినీసమేతు లగుచుం ◆ శస్త్రాస్త్రవిద్యానిధుల్
రతిరాజప్రతిమానమూర్తులు శరద్రాకేందుబింబాననుల్
చతురంభోధిపరీతవిశ్వవసుధా ◆ చక్రంబునం గల్గురా
సుతులెల్లం జనుదెంచి రవ్విభవముం ◆ జూడంగ నొక్కుమ్మడిన్.

టీ. శస్త్రాస్త్రవిద్యానిధుల్ = ఆయుధవిద్యకును విలువిద్యకును దావులైన వారును, రతిరాజప్రతిమానమూర్తులు = మన్మథునితో సమానమగునాకారములు గలవారును, శరద్రాకేందుబింబాననుల్ = శరత్కాలచంద్రునివంటి ముఖములు కలవారును, చతుర్...చక్రంబునఁ-చతుర్ = నాలుగయిన, అంభోధి = సముద్రములచేత, పరీత = చుట్టుకొనఁబడిన, విశ్వ = సమస్తమయిన, వసుధాచక్రంబునఁ = భూవలయమందు, కల్గురాసుతుల్ = కలయట్టిరాజకుమారులు, చతురంగ ధ్వజినీసమేతులు = రథ గజ తురగ పదాతు లనునాలుగవయవములతోఁ గూడినసేనతోఁ గూడినవారు, అగుచుఁ, ఒక్కుమ్మడిఁ = ఒక్కమాఱుగా, ఆ వ్విభవముఁ = ఆస్వయంవరమహోత్సవమును, చూడంగఁ, చనుదెంచిరి = వచ్చిరి.

తా. ధనుర్విద్యాదులకు నిదానులును, మన్మథునివంటిరూపసంపద గలవారును, శరత్కాలచంద్రునివంటిమోములు గలవారును, చతుస్సముద్రముద్రితమగు భూచక్రమునయున్నవారునునగు రాజకుమారులందఱును సేనలతోఁ గూడికొని యొక్కమాఱుగా నాస్వయంవరమహోత్సవమును జూడవచ్చిరి.

తే. రాజవరశేఖరుఁడై యొండె ◆ రాని వాఁడు

కామబాణంబులకు గుఱి కాగానివాఁడు
సప్తసాగరమధ్యభూచక్రమునను
నృపకుమారుండు లేఁడు పసన్నిదమునకును.    121

టీ. రాజవంశజుఁడై=రాజవంశమందుఁ బుట్టినవాఁడై,ఉండి,రానివాఁడును=స్వయంవరమహోత్సవమునకు రానట్టివాఁడును, కామబాణంబులకున్=మన్మథబాణములకు, గుఱి = లక్ష్యము, కానివాఁడును, అనఁగా స్వయంవరమునకు వచ్చి మదనతాపమునొందనివాఁడునని యర్థము. సప్తసాగరమధ్యభూచక్రమునన్=సప్తసముద్రములచేఁ బరివేష్టితమగు భూవలయమందు, పసన్నిదమునకును=పందెమునకైనను, నృపకుమారుండు, లేఁడు. అనఁగా నందఱును దమయంతిగుణంబులకుఁ బట్టుపడి మదనతాపము నొందుచు స్వయంవరమును జూడ వచ్చినవారే యని భావము.

తా. స్పష్టము.

క. కొందఱు తరుణి వరింపన్
గొందఱు బల్మిని హరింపఁ గొందఱు చూడన్
గొందఱు రోషింపను నృప
నందను లేతెంచి రుబ్బుకొన స్మహమునకున్.    122

టీ. కొందఱు, తరుణిన్=దమయంతిని, వరింపన్ = పెండ్లియాడుటకును, కొందఱు, బల్మిని=బలాత్కారముచే, హరింపన్ = అపహరించుటకును, కొందఱు చూడన్ = కొంద ఱామహోత్సవమును జూచుటకును, కొందఱు, రోషింపన్=కోపించుటకును అనఁగా నొకరాకొమరుఁడు దమయంతిని వరించినచో వానితోడఁ బోరాడి దమయంతిని గైకొనవలెనని భావము. నృపనందనులు=రాజకుమారులు, ఉబ్బునన్=సంతోషముతో, మహమునకున్=స్వయంవరమహోత్సవమునకు, ఏతెంచిరి=వచ్చిరి.

తే. తిలలు పై నెత్తి చల్లిన క్రిందఁ బడని
యంతసందడి పెండ్లిపోవకలందుఁ గలిగె

నఖిలదేశంబులందుండి • యవనిపతులు
వైభవాలోకనమునకు • వచ్చుచుండ. 123

టీ. తిలలు=నువ్వులు, పైన్=మీఁద, ఎత్తి, చల్లినన్=చల్లినప్పటికిని, దిగు వన్=క్రిందను, పడనియంతసందడి=రాలనంతటిసమ్మర్దము,అఖిలదేశంబులందుండి, అవనిపతులు=రాజులు, వైభవాలోకనమునకున్=ఆస్వయంవరమును జూచుటకు, వచ్చుచుండన్=రాఁగా, పెంద్రోవలందున్=రాజవీథులందు, కలిగెను.

తా. స్పష్టము.

క. తఱచగు పెనుసందడిలో
నిఱుకటమునఁ బడినవృపతి • యీనిగ్రహమున్
దొలఁగుట యభీప్సితార్థం
బఱిచేతికి వచ్చినట్ల • యని వెత కుడుచున్. 124

టీ. తఱచగు=దట్టముగానున్న, పెనుసందడిలోన్ = ఆపెద్దసమ్మర్దములో, ఇఱుకటమునన్ = ఇఱుకుస్థలమందు, పడినవృపతి=ఉన్నరాజు, ఈనిగ్రహమున్ =ఈనిరోధమును లేక ప్రతిబంధమును, తొలఁగుట=తొలఁగించుకొనుట, అభీప్సితార్థంబు=దమయంతిని వరించుటయనెడి యిష్టము, అఱిచేతికిన్, వచ్చినట్లు =వచ్చినవిధమె, అని, అనఁగా నీనిరోధమునుండి తప్పించుకొనఁజాలినచో దమయంతిని వరించునట్లు సంతసింతునని భావము. వెత కుడుచున్=విచారించుచుండును.

తా. స్పష్టము.

తే. వెనుకముందటిసమ్మర్ద • మునఁ గరంబు
దండసిలి మధ్యమున నున్న • ధరణివిభుఁడు
యంత్రసిద్ధార్థభావంబు • నలమికొనియు
దను నసిద్ధార్థుఁగా మదిఁ • దలఁచుచుండు. 125

టీ. వెనుకముందటిసమ్మర్దమునన్=వెనుకముందఱ నున్న సమ్మర్దమందు, కరంబు=మిక్కిలి, దండసిలి, ... వెనుకనుండియు,

ముందు నుండియు వచ్చుజనులసమ్మర్ద ముమధ్యమున, ఉన్నధరణివిభుఁడు=ఉన్న రాజు, యంత్రసిద్ధార్థభావంబు=యంత్రమునందు సిద్ధార్థభావంబును, (అనఁగా సిద్ధార్థత్వంబును) రెండవపక్షమందు (ఆవగింజవలెయుండుటను,) అలమికొని యున్ = పొందియు, తనున్, అసిద్ధార్థుఁగాన్ = కృతార్థుఁడుగానట్లు, మదిన్, తలఁచుచుండున్ =అనఁగాసమ్మర్దమందున్నరాజు యంత్రములోనియావ గింజవలె నలఁగఁగొట్టఁబడి దమయంతిని వరించుటయందు నిరాశచేసికొని యుండెనని భావము. యంత్రసిద్ధార్థుఁడయ్యు, అసిద్ధార్థుఁడగు టెట్లనిన విరోధము యంత్రసిద్ధార్థుఁడనుపదమున కాయంత్రమందు నొక్కఁబడినయావగింజవలె నున్నవాఁడని చెప్పుటచే విరోధపరిహారమగును, సమ్మర్దముచే నారాజుయంత్రములోని యావగింజవలెనే నలఁగినవాఁడగుటచే నిఁకఁ దనకు దమయంతి లభించు టెక్కడయని నిరాశచేసికొనెనని భావము. అలం...విరోధాభాసము.

ఉ. కోటిభుజంగపుంగవులు కొల్వఁగ వందిజనంబు ముందటన్
చాటువు లుగ్గడింప ఫణసంభృతరత్నదిశావిభాసి యై
వీటిజనంబు లెల్లఁ దను విస్మయమొంది కనుంగొనంగఁ గ
ర్కోటకుఁ డేఁగుదెంచె మదఘూర్ణితపాటలనేత్రపద్ముఁడై.

టీ. కోటిభుజంగపుంగవులు=కోటిసంఖ్యగలసర్పరాజులు, కొల్వఁగన్ =సేవించుచుండఁగా, వందిజనంబు=వందిమాగధులు, ముందటన్ =ముందుభాగమునందుండి, చాటువులు=చాటుపద్యములను, ఉగ్గడింపన్ = చదువుచుండఁగా, ఫణ...విభాసియై—ఫణ=పడగలందు, సంభృత=ధరింపఁబడియున్న, రత్న=మణులచే, దిశా = దిక్కులందు, విభాసియై = ప్రకాశించుచున్నవాఁడయి వీటిజనంబులెల్లన్ =పురజనులందఱును, విస్మయము=ఆశ్చర్యము,ఒంది, తనున్, కనుంగొనన్ =చూడఁగా, మద...పద్ముఁడై -మద=మద్యపానమదముచే, ఘూర్ణిత=తిరుగుచున్న, పాటల=ఎఱ్ఱని, నేత్రపద్ముఁడై=నేత్రపద్మములుగలవాఁడై, కర్కోటకుఁ డనుపేరుగల సర్పరాజు, ఏఁగుదెంచెన్ =వచ్చెను.

తా. కోటిసంఖ్యగల సర్పశ్రేష్ఠులు తన్నుఁ బరివేష్టించి కొలుచుచుండఁగా వందిమాగధులు తనముందుభాగమున నుండి చాటుపద్యములను జదువుచుండఁగా

దనపడగలందున్న రత్నములచే దిక్కులను బ్రకాశింపఁజేయుచుఁ బురజనులం దఱునునచ్చెరుపడి తన్నుఁ జూచుచుండఁగా మత్తుచేఁ దిరుగుచున్నవియును, నెఱ్ఱనివియునగు నేత్రములు గలవాఁడై కర్కోటకుఁడు దమయంతీస్వయంవర మహోత్సవమునకు వచ్చెను.

మ. ప్రమథాధీశభుజాంతరస్థలఘనప్రాలంబహారం బద
భ్రమనోజ్ఞాకృతి వచ్చె వాసుకి ఫణాపర్యంతమాణిక్యమం
జుమయూఖాంకురపుంజమంజులనభస్కుండైభుజంగాంగనా
సముదాయం బిరువంకఁ బాడఁగయశస్సంగీతగాథావళుల్.

టీ. ప్రమథా...హారంబు—ప్రమథాధీశ= ఈశ్వరునియొక్క, భుజాంతర స్థల=వక్షఃస్థలమందు, ఘన=గొప్పదగు, ప్రాలంబ=పేరుగా వేసికొనిన, హారంబు=తానశమైనవాఁడగు,వాసుకి=వాసుకి యనెడి సర్పరాజు, అదభ్రమనోజ్ఞాకృతిన్-అదభ్ర=అధికమగు,మనోజ్ఞ=సుందరమైన, ఆకృతిన్=ఆకారముచే, ఫణా...నభస్కుండై—ఫణా=పడగలయొక్క,పర్యంత=ప్రాంతములందున్న, మాణిక్య=రత్నములయొక్క, మంజు=సుందరమైన, మయూఖ = కిరణముల యొక్క, అంకుర=మొలకలయొక్క, పుంజ = సముదయముచే, మంజుల= సుందరమైన, నభస్కుఁడై=ఆకాశముకలవాఁడై, అనఁగా వాసుకియొక్కపడ గలందున్న రత్నములకాంతిసమూహములచే నాకాశభాగము మిక్కిలి ప్రకాశించుచున్నదని భావము. భుజంగాంగనాసముదాయంబు=నాగకన్యకల సమూహములు, ఇరువంకన్ = రెండుప్రక్కలందును, యశస్సంగీతగాథావళుల్=యశోగానసంబంధులగు చరిత్రములపంక్తులను, పాడఁగన్ = పాడుచుండఁగా, వచ్చెన్=స్వయంవరస్థానమునకు, వచ్చెను.

తా. ఈశ్వరునివక్షఃస్థలమందు ముత్యాలసరమువలె వ్రేలాడుచున్న సర్ప రాజయినవాసుకి తనపడగలందున్న రత్నములకాంతులచే నాకాశమును గప్పుచునాగకన్యకలు తనకిరుప్రక్కలనిలిచి తనయశంబును గానముచేయుచుండఁగా మిక్కిలిసుందరమగు నాకారముతో నాస్వయంవరస్థానమునకు వచ్చెననుట.

వ. ఇంద్రాగ్నియమవరుణు లేతెంచిరి. తక్కినదిక్పాలురు రా

రై రి. అది యెట్టి దనిన.　　128

టీ. ఇంద్రాగ్నియమవరుణులు=ఇంద్రుఁడు అగ్ని యముఁడు వరుణుఁడు అనుదిక్పాలురు, ఏతెంచిరి (అప్పటికి) వచ్చిరి; తక్కినదిక్పాలురు = మిగిలిన నలుగురుదిక్పాలురు అనఁగా నిర్రుతి వాయుదేవుఁడు కుబేరుఁడు ఈశానుఁడు అనుదిక్పాలురు, రారైరి. అది=ఆరాకుండుట, ఎట్టిది అనినన్=ఏవిధమనఁగా.

తా. స్పష్టము.

సీ. రాజునొజ్జలమంత్రరక్షాబలంబున
　　రాఁ బొందు గాదయ్యె రాక్షసునకు
దమయంతితోడి నేత్రస్పర్థకతమున
　　నిజవాహనము రామి నిలిచె గాలి
తనరూపు కైలాసదర్పణంబునఁ జూచి
　　వ్రీడఁ గుబేరుఁ డెల్వడలఁ డయ్యె
నర్ధనారీశ్వరుం డగుట నీశానుండు
　　సామేనియంకిలిఁ జాఁగకుండెఁ

తే. దాను వహియించుధాత్రి నెద్దానఁ బెట్టి
వచ్చు? నటుగాన శేషుండు వచ్చు టుడిగె
ముదిసి ముప్పునఁ బెండ్లికై మొగము వెల్వఁ
దగవు గాదని రాఁడయ్యెఁ దాత వేల్పు.　　129

టీ. రాజు...బలంబునన్-రాజు=విదర్భరాజుయొక్క, ఒజ్జల=గురువులయొక్క, మంత్ర=మంత్రములయొక్క, రక్షాబలంబునన్=రక్షకత్వబలముచే, రాక్షసునకున్=నైఋతికి, రాన్=రాక, పొందు కాదు - అయ్యెన్=వలనుపడకుండెను. అనఁగా నైఋతి రాక్షసుఁడుకావున విదర్భరాజుగురువులు వేదమంత్రములను జదువుచుండుటచే నాస్థలమునకు రా శక్తిగలవాఁడు కాకుండె ననిభావము. దమయంతితోడి నేత్రస్పర్థకతమునన్=దమయంతి నేత్రములతో విరోధము కలదగటచే, నిజవాహనము=తనవాహనమైనలేడి, రామిన్=రాకుండుటచే,

గాలి=వాయువు, నిలిచె=రా మానెను. అనఁగా లోకములో నెవ్వరును దమ శత్రువులయింటికిఁ బోరు. అట్లే దమయంతి నేత్రములు లేళ్లను జయించినవి కావున తమకు శత్రువగుదమయంతి యున్నచోటికి లేళ్లువచ్చుట యసంభవము. అందుచే వాయువు తనవాహనము రాకపోవుటచేఁ దానునువచ్చుట మానెనని భావము. కుబేరుఁడు, తనరూపు = తనసౌందర్యము, కైలాసదర్పణంబునన్ =కైలాసపర్వత మనునద్దమందు, చూచి, వ్రీడన్ =సిగ్గుచే, అనఁగా దమయంతిసౌందర్యమునకుఁ దనసౌందర్యము సరిపడకయుండుటచేఁ గలిగినసిగ్గుచే, ఇలు, వెడలఁడు-అయ్యె=బయలుదేఱఁడాయెను, ఈశానుండు, అర్ధనారీశ్వరుండగుట=సగముశరీరము స్త్రీస్వరూపముగలవాఁడగుటంబట్టి, సామేనియంకిలిన్ =సగము శరీరము నే కలిగియుంటిననెడి క్షోభముచే,చాఁగక ఉండెన్ =బయలు వెడలఁడాయెను. శంకరుఁ డర్ధనారీశ్వరుఁడుకాన తన సగమయిన పురుషశరీరముతోఁ బోవ నిష్టపడకుండెను. తాన్, అనఁగా శేషుఁ డనుట, వహియించు ధాత్రి=మోయుచున్నభూమి, ఎద్దానన్ =ఏయాధారమునందు, పెట్టి వచ్చున్, అటుకానన్ =ఆహేతువుచే, శేషుఁడు, వచ్చుట, ఉడిగె=మానెను, అనఁగా శేషుఁడు సంతతమును భూమిని మోయుచున్నాఁడు కాన నాభూమిని మోచునట్టివాఁడు మఱియొకఁడు లేకపోవుటచేఁ దానువచ్చుటమానెనుట. తాతవేల్పు =బ్రహ్మదేవుఁడు, ముదిసి=ముసలివాఁడయి,ముప్పునన్ =చావసిద్ధముగ నున్న సమయంబున, పెండ్లికై, మొగము,వెల్వన్ =బయటఁబెట్టుటకు,తగవు=న్యాయము, కాదు, అని, రాఁడు అయ్యెన్ = వచ్చుట మానెను. బ్రహ్మ పెద్దకాలమునఁ బెండ్లిచేసికొనుట న్యాయముగాదని మానివేసెనని భావము.

తా. విదర్భరాజుగురువులమంత్రబలముచే నైఋతి రాలేకపోయెను. దమయంతి నేత్రములతో స్పర్థపడినలేడి రాకపోవుటచే వాయువు మానెను. కైలాసమనెడియద్దమందుఁ దనరూపుచూచుకొని సిగ్గుచేఁ గుబేరుఁడు రాఁడాయెను. అర్ధనారీశ్వరుఁడగుటచే నీశ్వరుఁడురాలేదు. తా మోయుచున్నభూమిని మోయువాఁడు మఱియొకఁడు లేకపోవుటచే శేషుఁడు రాలేదు. ముదుసలితనమునఁ బెండ్లియాడుట న్యాయము గాకపోవుటచే బ్రహ్మ రాలేదు. కాని తక్కిన దేవత లందఱును వచ్చి రనుట.

తే. ఇట్లు త్రైలోక్యవాసులు నేఁగుదెంచి
రమ్మహోత్సవమునకు నయ్యవసరమునఁ
బ్రసవసాయకనారాచపక్షజాల
మహితవాతూలతూలాయమాను లగుచు. 130

టీ. ఇట్లు=ఈరీతిగా, అయ్యవసరమునన్ = ఆసమయమందు, త్రైలోక్య వాసులున్ =మూఁడులోకములం దున్నవారందఱును, ప్రసవ...మానులు-ప్రసవ సాయక=పుష్పములే బాణములుగాఁ గల మన్మథునియొక్క, నారాచ=బాణ ములయొక్క, పక్ష=ఱెక్కలయొక్క, జాల=సమూహముయొక్క,మహిత= గొప్పదయిన, వాతూల=పెనుగాలికి, తూలాయమానులు=దూదివంటివారలు, అనఁగా మదనునిచేఁ బీడితులయిన హృదయములు గలవారలై యని భావము. అగుచున్, ఏఁగుదెంచిరి=వచ్చిరి.

తా. ఈవిధంబుగా నాసమయమున మూఁడులోకములందును నున్నవార లాస్వయంవరమహోత్సవమునకు మదనబాణముల పక్షములగాలికి దూదివంటి వారలయి వచ్చిరి.

వ. అప్పుడు కనకమయరమ్యహర్మ్యనివేశంబులం గ్రథకైశికా ధీశ్వరుండు విడియింప నభినవాభ్యాగతు లగు మూఁడులో కంబులరాజులును విడిసిరి. ఆరాజసమాజంబు కుండిననగ రంబునందుఁ బుండరీకాక్షుజఠరంబునందు భువనత్రయంబు ను గుంభసంభవుహస్తాంభోరుహంబునందు నంభోధిచతు ష్టయంబును బంచాక్షరియందుఁ బరమేశ్వరుండునుంబో లె ననంబాధం బై యుండె. నానావిచిత్రచిత్రంబు లగుపుర భవనభిత్తిభాగంబులతోడి ప్రతిస్పర్ధంబోలె నాకాశభాగం బు మూర్ధాభిషిక్తమకుటరత్నప్రభాభారంబులచేతఁ గిమ్మీ రితం బయ్యె. అమ్మహోత్సవాడంబరం బవలోకింప నంబరం బునఁ బీతాంబరత్ర్యంబకులు దేవతాకదంబంబులు గొలు

వఁ గొలువ్వుండిరి. కంటకిలితహృదయారవిందం బై నసనకసనంద నాదియోగీంద్రబృందంబును మందపాల, బక, దాల్భ్య, రైభ్యక, భరద్వాజ, గౌతమ ప్రభృతిమహర్షి సందోహంబు ను దగిననెలవుల నుండి విలోకించుచుండె. సముత్తుంగమం గళమృదుమృదంగనినాదభంగీతరంగితసంగీతప్రసంగంబు వి బుధవారాంగనాజనంబు, నభోరంగంబునఁ బ్రవర్తించె నెడియు. 131

టీ. అప్పుడు=ఆసమయమున, కనక...నివేశంబులన్-కనకమయ=బంగా రుమయ మయిన,రమ్య= మనోహరములయిన, హర్మ్యనివేశంబులన్ = మేడల యందు, క్రథకైశికాధీశ్వరుండు=విదర్భరాజు, విడియింపన్, అభినవాభ్యా గతులు=క్రొత్తగావచ్చినవారలు, అగు మూఁడులోకంబుల రాజులును,విడిసిరి= బసచేసిరి. ఆరాజసమాజంబు=ఆరాజులసమూహము, కుండిననగరంబునందున్, పుండరీకాక్షుజఠరంబునందున్ =విష్ణుమూర్తి యుదరంబునందు, భువనత్రయం బును=ముల్లోకంబులును, కుంభసంభవుహస్తాంభోరుహంబునన్ =అగస్త్యమహా మునిపద్మమువంటి చేతియందు,అంభోధిచతుష్టయంబును=నాల్గుసముద్రములును, పంచాక్షరియందు=శివపంచాక్షరీమంత్రమునందు, పరమేశ్వరుండునుంబోలెన్ =ఈశ్వరుఁడునుబోలె, అసంబాధంబై = శ్రమలేనిదై, లేక, సమ్మర్దములేక ఉండిరి. అనఁగాఁ గుండినపురము మూఁడులోకవాసులును స్వేచ్ఛగా నివసించు టకుఁ జాలినంతవైశాల్యము గలదని భావము. నానావిచిత్రచిత్రంబులు=అనేకవి ధములుగా నాశ్చర్యముగొలుపు పలురకపురంగులు గలవి,అగుపురభవనభిత్తిభా గంబులతోడి=అయినట్టిపట్టణమునందలియిండ్లగోడలతో,ప్రతిస్పర్థంబోలెన్ = మచ్చరముచేతంబోలె,ఆకాశభాగంబు,మూర్ధా...భారంబులచేతన్—మూర్ధా భిషిక్తుల=రాజులయొక్క, మకుట=కిరీటములందలి, రత్నప్రభా=రత్నకాంతు లయొక్క, భారంబుచేన్ =సమూహముచే, కిమ్మీరితంబు=నానావర్ణములుగల ది, అయ్యెన్, అనఁగా గోడలు నవరత్నమయంబులు గావున నానావర్ణములు గలవియైయుండె. రాజుల కిరీటములు గూడ నవరత్నమయంబులు గావునఁ

ధత్కాంతులాకాశమును గప్పునప్పుడదియు నానావర్ణములు గలదియాయెను. ఆకాశమిట్లు నానావర్ణమగుట గోడతో విక్షోభించుటచేతనని కవి యుత్ప్రేక్షించెను. అమ్మహోత్సవాడంబరంబుక్ = ఆగొప్పమహోత్సవమును, అవలోకింపన్ = చూచుటకు, అంబరంబునన్ = ఆకాశమునందు, పీతాంబరత్ర్యంబకులు = విష్ణుమహేశ్వరులు, దేవతాకదంబంబులు = దేవతాసమూహములు, కొలువన్ = సేవించుచుండఁగా, కొల్వుండిరి = సభచేసిరి, కందళితహృదయారవిందంబు = సంతోషముచే మొలకలెత్తిన హృదయంబులు గలది, ఐనసనకసనందనాదియోగీంద్ర బృందంబును = అయిన సనకాదియోగీంద్రుల సమూహమును, పుంపపాల ...సందోహంబును—మందపాలుఁడు, బకుఁడు, రైభ్యకుఁడు, భరద్వాజుఁడు, గౌతముఁడు, ప్రభృతి = మొదలుగాఁ గల, మహర్షి సందోహంబును = మునీశ్వర సమూహములును, తగిననెలవులన్, ఉండి, విలోకించుచుండెన్ = చూచుచుండెను, సముత్తుంగ...ప్రసంగంబు-సముత్తుంగ = అధికమయిన, మంగళ = శుభప్రదమైన, మృదు = ఇంపైన, లేక, శ్రావ్యమయిన, మృదంగనినాద = మద్దెల చప్పుడులయొక్క, భంగీ = రచనలచే, తరంగిత = నిండియున్న, సంగీతప్రసంగంబు = సంగీతగోష్ఠిని, విబుధవారాంగనాజనంబు = దేవతాస్త్రీసమూహములు అనఁగా నచ్చరలనుట. నభోరంగంబునన్ = ఆకాశమనెడి నాట్యస్థలమునందు, ప్రవర్తించె.

చ. మగువలు భూమిపాలురకు మాటికిమాటికి వైచుకుంచెల
న్నెగసినమారుతౌఘములు నిర్భర సౌరభ సంప్రదాయ మిం
పుగ నిడి వాసధూపములఁ బ్రోదియొనర్చుచు నిచ్చెనర్చనల్
గగనమున న్మహోత్సవముఁ గన్గొన వచ్చిన దేవపంక్తికిన్.

టీ. మగువలు = స్త్రీలు, భూమిపాలురకున్ = రాజులకు, మాటికిన్ మాటికిన్, వైచు, కుంచెలన్ = చామరములచే, ఎగసిన మారుతౌఘములు = వెడలుచున్న గాలి సమూహములు, నిర్భర...దాయము—నిర్భర = నిండయిన, సౌరభ = పరిమళము యొక్క, పరంపరను, ఇంపుగన్ = ఒప్పునట్లుగా, ఇడి, వాసధూపములన్ = పరిమళధూమములచే, ప్రోది ఒనర్చుచున్ = వృద్ధిపొందించుచును, గగనము

నన్ =ఆకాశమున, మహోత్సవము=ఆస్వయంవరమహోత్సవమును, కన్గొనన్,. వచ్చినదేవపంక్తికిన్ =వచ్చినదేవతలపంక్తికి, అర్చనల్ =పూజలను, ఇచ్చెన్,. అనఁగా రాజులకిచ్చిన పరిమళపుధూమములు, చామరములగాలులచే నాకసంబునఁ జెదరుచున్నవని భావము.

తా. స్త్రీజనంబులు మాటిమాటికిని నృపాలకోటికి వీచుచున్న చామరములగాలులు, నిండగు పరిమళము నిచ్చుచున్నవాసనార్థమగు ధూపములను బోషించుచు, నాస్వయంవరమునుజూడ నెంచివచ్చి యాకసమున నిలిచియున్న దేవతలకుఁ బూజలు సలుపుచున్నవి.

తే. అల్లనల్లన వీచె మంచాంతరములఁ
జంచదవనీంద్రచయచంద్రచందనాను
లేపనైపథ్యకుసుమమాలాపరాగ
గంధవహమైనచల్లనిగంధవహము. 133

టీ. మంచాంతరములన్ =తల్పములమధ్యములందు, చంచత్ ...వహము- చంచత్ =ప్రకాశించుచున్న, అవనీంద్రచయ = రాజసమూహములయొక్క,. అనఁగా రాజులు పూసికొనియున్న యని భావము. చంద్ర=పచ్చకప్పురము, చందనానులేపన=మంచి గంధపు పూఁతలును, నైపథ్యకుసుమమాలా=అలంకారార్థము దాల్చిన పూలదండలయొక్క, పరాగ=ధూళి, లేక పుప్పొడియొక్క,. గంధ=పరిమళమును, వహము=దాల్చినది, ఐన చల్లని గంధవహము=అయినట్టి చల్లని వాయువులు, అల్లనల్లనన్ =మెల్లమెల్లగా, వీచెన్ =ప్రసరించెను.

తా. అప్పుడు రాజులు వసించిన తల్పంబులమధ్యభాగంబులందు, సకల రాజులును ధరించిన పచ్చకప్పురమును, మంచిగంధంబును, నలంకారార్థమయిన పూలదండలయొక్క పరాగగంధంబును వహించిన చల్లని వాయువులు మెల్లమెల్లగా వీవ నారంభించెను.

సీ. పైపై మహాశ్చర్యపర్యుత్సుకంబులై
తనమీఁద నృపులనేత్రములు వ్రాల
నలినాప్తుసన్నిధి నక్షత్రములు వ్రాలె

రాజులు దనప్రమోలఁ గ్రబ్రభలఁ దొఱఁగ
నఖిలలోకమనోజ్ఞ కైమై యొప్పుతనమూర్తి
చిత్తసంభవు నైనఁ సిగ్గువఱుపఁ
దనప్రాభవము దేవతాకోటి నైనను
బాణిపద్మములు మోడ్వంగఁ జేయ

తే. వలపు మిగులఁ బతింవరావరణయోగ్య
రమ్యశృంగారకలితుఁడై రాజవీథి
నల్ల నేతెంచి యొక్కసింహాసనంబు
నధివసించెను నలుఁడు మంచాగ్రభూమి. 134

టీ. నలుఁడు, పైపైఁ=మీఁదుమీఁదుగా, మహాశ్చర్యపర్యుత్సుకంబులై=ఆశ్చర్యముచే వేడుకపడుచున్నవయి, తనమీఁదఁ, నృపులనేత్రములు, వ్రాలఁ=పడుచుండఁగా, అనఁగా రాజులందఱును మిక్కిలి వేడుకయు నాశ్చర్యమును గలిగి, తన్నుఁ జూచుచుండఁగా నని భావము. నలినాప్తుసన్నిధిఁ=సూర్యుని సన్నిధానమందు, నక్షత్రములువోలెఁ, రాజులు, తనప్రమోలఁ=తన యెదుట, ప్రభలఁ=కాంతులను దొఱఁగఁ=పోఁగొట్టుకొనుచుండఁగా, అనఁగా సూర్యునిచెంత నక్షత్రములు కాంతివిహీనము లయినట్లు దనసన్నిధియందు రాజులందఱును గాంతివిహీను లగుచున్నారని భావము. అఖిలలోకమనోజ్ఞమై=సమస్తలోకములలోను మిక్కిలిసౌందర్యము కలదై, ఒప్పుతనమూర్తి=ప్రకాశించునట్టి తనయాకారము,చిత్తసంభవునైనఁ=మన్మథునినైనను,సిగ్గువఱుపఁ=సిగ్గుపడునట్లు చేయుచుండఁగా, అనఁగా నలుని యాకారరేఖ సౌందర్యవంతుఁడని ప్రసిద్ధికెక్కిన మన్మథునకుఁగూడ సిగ్గును గలిగించుచున్నదని భావము. తనప్రాభవము=తన సామర్థ్యము, దేవతాకోటి నైనఁ=దేవతాసమూహముల నైనను, పాణిపద్మములు, మోడ్వంగఁ చేయఁ = మోడ్చునట్లు చేయుచుండఁగా, అనఁగాఁ దాను దేవతలచేతను గూడ నమస్కరింపఁదగిన సామర్థ్యము గలవాఁడని భావము. వలపు=కోర్కి, మిగులఁగఁ=అతిశయించునట్లుగా, పతిం

వరం...కలితుఁడు—పతింవరా=కన్యకను, వరణ=వరించుటకు, యోగ్య=తగిన, రమ్య=మనోహరమైన, శృంగార=సౌందర్యముతో, కలితుఁడు=ఒప్పుచున్న వాఁడు, ఐ, రాజవీథిన్ = రాజమార్గమునుండి, అల్లన్=మెల్లగా, ఏతెంచి=వచ్చి, మంచాగ్రభూమిన్ = మంచెలకు మొదటనున్న ప్రదేశమందు, ఒక్క సింహాసనంబున్ =ఒకసింహాసనమునందు, అధివసించెను=కూర్చుండెను.

తా. అంతట నలమహారాజు రాజులందఱును వేడుకపడి తన్నుఁ జూచుచుండఁగా, సూర్యునియెదుట నక్షత్రములవలెను తనయెదుట రాజులందఱును గాంతిహీను లగుచుండ, తనసుందరాకారము మన్మథునికిఁగూడ సిగ్గు పుట్టించుచుండఁగా దేవతలకైనను నమస్కరింపఁదగిన ప్రభుత్వము కలవాఁడై స్వయంవరోత్సవమునకుఁ దగిన వేషమును ధరించి, రాజవీథినుండి మెల్లమెల్లన నేతెంచివచ్చి యొక్కసింహాసనమునందుఁ గూర్చుండెను.

తే. కదిసి పరిపాటిమణిమంచకములమీఁద
రాకుమారకులై యున్న నాకవిభులు
నలునిపైఁ దమకంబును దెలియఁ జూచి
తారు నవ్వేళ నలరూపధారులైరి. 135

టీ. కదిసి=స్వయంవరప్రదేశమునకు వచ్చి, పరిపాటిన్ =క్రమముగా, మణిమంచకములమీఁదన్=రత్నమయము లయినమంచకములమీఁద, రాకుమారకులు ఐ, ఉన్న నాకవిభులు=ఇంద్రాదులు, నలునిపైన్ =నలరాజునందున్న, తమకంబును=దమయంతిమోహమును, తెలియఁజూచి=తెలిసికొనుట కిష్టపడి, తారు, అవ్వేళన్, నలరూపధారులు=నలరూపములను ధరించినవారలు, ఐరి=అనఁగాఁ దాము నలరూపములను దాల్చినచో నలునిదప్ప నొరునిఁ బెండ్లియాడననియున్న దమయంతి మోహముచేఁ దమలో నెవరినైనను జూచినలునిగాభావించి వరించునేమోయని తెలిసికొనుటకు నలరూపధారులైరని భావము.

తా. స్వయంవరస్థలమందుఁ గ్రమముగా రత్నఖట్వాములపై రాకుమారులుగా నున్నయింద్రాదులు దమయంతికి నలునిపై నున్నతమకమును జూచి తామునలరూపములు దాల్చినచో వరించునేమో యనుతలంపున నలరూపధారులైరి.

ఉ. ఈసకలంబునం గలమహీపతివర్గము నున్న నుండనీ
యాసభ యొప్పెనప్డు నిషధాధిపుచేతఁ జతుర్దిగీశచే
వాసవలోకదివ్యవనవాటిక సర్వనగాఢ్య యయ్యు ను
ద్భాసితలక్ష్మి నొందునకదా యలకల్పకపంచకంబుచేన్.

టీ. ఈసకలంబునన్, కలమహీపతివర్గము=ఉన్నరాజులసమూహము, ఉన్నన్ ఉండనీ=ఉండిననుండుఁగాక, ఆసభ, అప్డు, నిషధాధిపుచేతన్=నలుని చేతను, చతుర్దిగీశచేన్ = నల్వురుదిక్పాలురచేతను, ఒప్పెన్=ప్రకాశించెను, వాసవలోకదివ్యవనవాటిక=స్వర్గలోకములోనున్న నందనవనము, సర్వనగాఢ్య యయ్యున్=అన్నివృక్షములతోను నిండియున్న దయ్యును, ఉద్భాసితలక్ష్మిన్= అధికమయినకాంతిని, అలకల్పకపంచకంబుచేన్=ఆయయిదింటికల్పవృక్షముల చేతనే, ఒందున్ కదా=పొందునుగదా.

తా. నందనవన మనేకవృక్షములతోనిండినను గల్పవృక్షములచేతనే యధిక కాంతిని బెందుచున్నట్లు లాసభ సమస్తరాజులతో నిండినను కేవలము నలుని చేతను, నింద్రాదులచేతను మాత్రమే ప్రకాశించెను.

వ. ఇవ్విధంబున సుమేరుభూధరకూటసన్నిభంబు లగుహాటకమంచకంబులమీఁదఁ గర్కోటకవాసుకిప్రభృతు లగుపాతాళభువనవాసులును మేధాతిథిప్రధాను లగువసుధాలోకవాస్తవ్యులును బాకశాసనపరేతరాజముఖ్యు లగుత్రివిష్టపనిలయులును సుఖోపవిష్టులై యుండుటఁ గనుంగొని సంతుష్టాంతరంగుండై భీమభూపతి తనడెందంబులోన నీయున్న యందఱు బృందారకసంకీర్తనీయచరిత్రులు వీరికులశీలవృత్తవిభవంబు లెఱింగి వర్ణించి దమయంతికిఁ జూపి చెప్పం ద్రైలోక్యజనని నిత్యప్రగల్భవాచాలభగవతీదేవి దక్కం దక్కినవారు నేర రని విచారించి యమ్మహాదేవి నిట్లని ప్రస్తుతించె. 137

టీ. ఇవ్విధంబునన్, సుమేరుభూధరకూటసన్నిభంబులు=మేరువుపర్వత

ములయొక్క శృంగంబులతోఁ బోలుచున్నవి, అగుహాటకమంచంబులమీఁదన్ = అయినట్టిబంగారుమంచములందు, కర్కోటక వాసుకి ప్రభృతులు=కర్కోటకుఁడువాసుకిమొదలగువారు, అగుపాతాళభువనవాసులును=అయినట్టిపాతాళలోకవాసులును, మేధాతిథిప్రధానులు= మేధాతిథిమొదలగువారు, అగువసుధాలోకవాస్తవ్యులును, పాకశాసనపరేతరాజముఖ్యులు = ఇంద్రయమాదులు, అగుత్రివిష్టపనిలయులును = అయినట్టిస్వర్గలోకవాసులును, సుఖోపవిష్టులై= సుఖముగాఁగూర్చుండినవారయి, ఉండుటన్, కనుంగొని, సంతుష్టాంతరంగుండై=సంతోషించినమనస్సుకలవాఁడై, భీమభూపతి, తనడెందంబులోనన్, ఈయున్నయంతటను, బృందారకసంకీర్తనీయచరిత్రులు= దేవతలచే నుతింపఁదగినప్రవర్తనలుకలవారు, వీరికులశీలవృత్తవిభవంబులు=వీరియొక్క వంశంబులును సత్ప్రవర్తనములును, చరిత్రమును, సంపదలను, ఎఱింగి, వర్ణించి, దమయంతికిన్, చూపి, చెప్పన్=చెప్పుటకు, త్రైలోక్యజనని=మూఁడులోకములకుఁదల్లియు,నిత్యప్రగల్భవాచాల=ఎల్లప్పుడును ప్రగల్భవాక్కులుగలదియు,భగవతిదేవి=సరస్వతీదేవి, తక్కన్ = విడిచి, తక్కినవారు, నేరరు, అనివిచారించి=ఆలోచించి, అమ్మహాదేవిన్=ఆసరస్వతిని, ఇట్లు, అని, ప్రస్తుతించెన్= పొగడెను.

దండకము – జయజయ జనయిత్రి ! కల్యాణసంధాత్రి ! గాన్ధర్వ విద్యాకళాకర్ణనాళాం త్రివేదీవళీం సారసాహిత్యసౌహిత్య నిర్వర్తితప్రోల్లసద్భక్తరజ్గా మనేకాభిచారక్రియాఘోరహోమ ధూమావళీమేచకాథర్వణామ్నాయరోమావళీం కల్పశిక్షా కుచాకల్పసాక్షాచ్చరిత్రాం నిరుక్తప్రియోక్తిం భుజద్వంద్వతామశ్నువానేన సంశోభితాం ఛన్దసాజాతివృత్తప్రభేదప్రభిన్నేనవిద్యామయీంత్వాం భజే. భగవతిగుణదీర్ఘ ఘా వ్యోద్భవాం సంతతిం సందధానం మహాశబ్దనిష్పాదకవ్యాక్రియాశాస్త్రకాఞ్చీకలాపం కటీమణ్డలే బిభ్రతీం జ్యోతిషాహారదణ్డేన

తారోదయస్ఫూర్తివిద్యోతమానేన విభ్రాజితామాత్మపతభా
నురాగాన్వితాభ్యా ముభాభ్యాంచ పూర్వోత్తరాభ్యాం మ
హాదర్శనాభ్యాం ప్రతిష్ఠాపితోష్ఠప్రవాళాం పరబ్రహ్మకర్మార్థవే
దప్రభేదాద్ద్విధాయస్స్వధాద్వంశరీరం ప్రతిష్ఠాం పరాంప్రాప్త
యాచారుమీమాంసయా మాంసలేనోరుయుగ్మేన సమ్యక్ప
రాచ్ఛాదనం లాలయన్తీం ముహుః పత్త్రిదానే గుణాన్వీత
పూగాసకృల్లక్ష్ణ్డానఘ్రాత్రిఢిమాఢౌకమానేన దన్తాత్మనాతర్కశా
స్త్రేణ కామప్యభిఖ్యాం ముఖే ఖ్యాపయన్తీం ధ్రువం దేవి
వన్దేతమాం త్వామహం. ద్రుహిణగృహిణీమత్స్యపద్మాది
సంలక్షితం పాణిపద్మం త్వదీయం పురాణమ్, శిరస్త్రావకం ని
ర్మలం ధర్మశాస్త్రమ్, దలాభ్యాం భ్రువావ్రాం క్రియామ
న్త్రరాజస్య, త్వద్బిన్దునాచిత్రకం ఫాలభాగే తదర్ధేన్దునా తే
విరిఞ్చిర్విపఞ్చీకలక్వాణచాపం ప్రణిన్యేస్వయమే. భవతు
మనుశుభం భారతి! త్వత్ప్రసాదాదసాధారణా త్సత్క్రి
పాధారిభూతం ప్రభాతమ్. నమ స్సోమసిద్ధాన్తకాన్తాననా
యై నమ శ్శూన్యవాదాత్మమధ్యాన్వితాయై నువిజ్ఞానసామ
స్త్ర్యహ్నాత్పఙ్కజాయై నమస్తేస్తు సాకారతాసిద్ధిభూమ్నే న
మస్తేస్తు కైవల్యకల్యాణసీమ్నే నమ స్సర్వగీర్వాణచూడా
మణిశ్రేణిశోణప్రభాజాలబాలాతపస్మేరపాదాంబుజాయై, న
మస్తేశరణ్యై నమస్తే వరేణ్యై నమ శ్శర్మదాయై నమ శ్శా
శ్వతాయై నమో విశ్రుతాయై నమ శ్శారదాయై నమ శ్శా
రదాయై నమస్తే నమస్తే నమః.　　138

టీ. కల్యాణసంధాత్రి=మంగళములను గలిగించునట్టి, జనయిత్రి=ఓతల్లీ!
జయజయ = సర్వోత్కర్షతో [illegible] సౌందర్య [illegible] -

గాంధర్వవిద్యాకళా=సంగీతశాస్త్రమనెడి, కంఠనాళాం=మెడగలిగినట్టియు, త్రివేదీవళీం=ఋగ్యజుస్సామవేదము లనెడి, వళీం=వళులు గలట్టియు, అనఁగా నుదరరేఖలనుట, ఉదరమందు మూఁడురేఖలుండుట భాగ్యసూచకమని సాముద్రికప్రసిద్ధము. సార...తరంగాం - సార=శ్రేష్ఠమయిన, సాహిత్య=శబ్దార్థములకూడికయొక్క, సౌహిత్య=తృప్తిచే, నిర్వర్తిత=సమకూర్పఁబడు, ప్రోల్లసత్=మిక్కిలిప్రకాశించు, దృక్తరంగాం= తరంగములవంటిచూపులుగలట్టియు, అనఁగాసరస్వతికిశబ్దార్థములే నేత్రములని భావము. అనేక...వళీం - అనేక=పలువిధములయిన, అభిచారక్రియా=హింసారూపకమగు క్రియలనిమిత్తమయిన, హోమ=ఆహుతిచేయుటవలనఁ గలిగిన, ధూమావళీ=పొగలపంక్తిచేత, మేచక=నల్లనైన, అధర్వణామ్నాయ=అధర్వవేదమనెడి, రోమావళీం=నూఁగారుగలట్టియు,అధర్వవేదోక్తములగు నభిచారహోమాదులవలనఁగలుగు ధూమపంక్తిచే నల్లనైన యధర్వవేదమనునూఁగారు గలదనుట. కల్ప...చరిత్రాం - కల్ప=కల్పసూత్రములును, శిక్షా=శిక్షాగ్రంథమును, అక్షర=శాశ్వతమైన, ఆకల్ప = అలంకారములునుగాను, సాక్షాచ్చరితాం=స్వీయచరిత్రమును గలట్టియు, అనఁగాసరస్వతికిఁ గల్పసూత్రములు భూషణములు, శిక్షాగ్రంథము తనచరిత్రమును దెలుపుచున్నదియు నగుచున్నదని భావము. నిరుక్తప్రియోక్తిం=వేదార్థమును నిర్వచనముచేసెడి నిరుక్తిగ్రంథమనెడి, ప్రియోక్తిం=సరసాలాపములుగలదియు అనఁగా నిరుక్తి సరస్వతికి మాటలగుచున్న వని భావము. భుజద్వంద్వతాం=బాహుద్వయభావమును, అన్నవాసేన=పొందినదియు, జాతివృత్త...భిన్నేన-జాతివృత్త=జాతులు-వృత్తములు-నాఁబడుపరిభేదభేదముచే, పరిభిన్నేన=భేదముపొందియున్న, ఛందసా=ఛందశ్శాస్త్రముచే, సంశోభితాం = ప్రకాశించుచున్నట్టియు, అనఁగా జాతివృత్తములభేదముచే రెండువిధములయిన ఛందశ్శాస్త్రము సరస్వతికి భుజము లగుచున్నవని భావము. విద్యామయీం=విద్యాస్వరూపురాలవగు, త్వాం=నిన్నును, భజే=సేవించుచున్నాను. భగవతి = ఓభగవంతురాలా! గుణదీర్ఘభావోద్భవాం-గుణ = ప్రతిసూత్రములయొక్క, దీర్ఘభావన=దైర్ఘ్యమువలన, ఉద్భవాం=పుట్టి

నదియు, వ్యాకరణపక్షమందు, గుణ...ఉద్భవాం-గుణ=గుణములు, దీర్ఘ=దీర్ఘములు, భావ=భావప్రత్యయములు మొదలగువానివలన, ఉద్భవాం=కల్గిన, సంతతిం=సమూహమును, అనఁగా శబ్దజాలమనుట, సందధానం = ధరించుచున్నట్టియు, మహా...కలాపం—మహాత్ = గొప్పవయిన, లేక, అనేకములయిన, శబ్ద=శబ్దజాలమును, నిష్పాదక=పుట్టించుచున్న, వ్యాక్రియాశాస్త్రి=వ్యాకరణశాస్త్ర మనెడి, కాంచీకలాపం=మొలత్రాటిని, కటీమండలే=మొలయందు, బిభ్రతీం=ధరించుచున్నట్టియు, అనఁగా వ్యాకరణ మామెకు మొలత్రాడగుచున్నదని భావము. తార...మానేన—తార=నక్షత్రములయొక్క, ఉదయ=ఉదయించుటలనుబట్టి, స్ఫూర్తి=శుభాశుభఫల కథనముచే, విద్యోతమానేన=ప్రసిద్ధమయిన, హారపక్షమందు, తార...మానేన—తార=మధ్యమణియొక్క, ఉదయస్ఫూర్తి=కాంత్యతిశయముచే, విద్యోతమానేన=ప్రకాశించుచున్నదియు, జ్యోతిషా=జ్యోతిశ్శాస్త్ర మనెడి, హారదండేన=ముత్యాలహారముచే, విభ్రాజితాం = ప్రకాశించుచున్నదియు, ఆత్మపక్షానురాగాన్వితాభ్యాం = తనపక్షమం దభినివేశముతోఁ గూడికొన్నట్టియు అనఁగా వాదిప్రతివాదులు తాము వాదించునదియె యుచితమైనదని యభినివేశముతోఁ గూడికొనుచుందురని భావము. ఓష్ఠపక్షమందు-ఆత్మ=తమయొక్క, పక్ష=పార్శ్వములందు, అనురాగ=ఎఱ్ఱదనముచే, అన్వితాభ్యాం = కూడికొన్నవియు, ఉభాభ్యాం=రెండయిన, పూర్వోత్తరాభ్యాం = పూర్వపక్షము-ఉత్తరపక్షము- అనెడి, మహాదర్శనాభ్యాం=మహాశాస్త్రిములచేత, ప్రతిష్ఠా...ప్రవాళాం-ప్రతిష్ఠాపిత = స్థాపనచేయఁబడుచున్న, ఓష్ఠప్రవాళాం=చిగురువంటి పెదవులు గలిగినట్టియు అనఁగాఁ బూర్వపక్షోత్తరపక్షము లామెపెదవు లగుచున్నవని భావము. పర...భేదాత్—పరబ్రహ్మార్థ = పరబ్రహ్మమునుమాత్రిమే చెప్పుచున్నట్టియు, కర్మార్థ=కర్మకలాపమే ప్రియోజనము గలట్టియు, వేద=వేదములయొక్క, ప్రిభేదాత్ = భేదమువలన, స్వం=స్వకీయమైన, శరీరం=దేహమును, ద్వివిధా=రెండువిధములుగా, విధాయ=చేసి, అనఁగా జ్ఞానకాండకర్మకాండములను దెలుపువేదములయొక్క భేదముచే మీమాంసయుఁ బూ

ర్వమీమాంసయనియు నుత్తరమీమాంసయనియు రెండువిధము లైనదని భావము. పరాం=గొప్ప దగు, ప్రతిష్ఠాం=స్థితిని, ప్రాప్తయా=పొందిన, చారుమీమాంసయా=ఒప్పుచున్న మీమాంసయనెడి, మాంసలేన=బలిసిన, ఊరుయుగ్మేన=రెండుతొడలచేతను, సమ్యక్పరాచ్ఛాదనం - సమ్యక్=లెస్సగా, పర=ఉత్కృష్టమైన, ఆచ్ఛాదనం-వస్త్రమును=మీ మాంసపక్షమందు - సమ్యక్...దనం=లెస్సగా పరులను దిరస్కరించుటను ననియర్థము, లాలయంతీం = అంగీకరించుచున్నట్టియు, అనఁగాఁ బూర్వమీమాంసోత్తరమీమాంసలు సరస్వతికిఁ దొడలై విలసిల్లుచున్నవని భావము. ముహుః = మాటిమాటికి, పత్రదానే—పత్ర=ప్రతిజ్ఞానపత్రముయొక్క, దానే=ఖండించుటయందును, గుణా...మానేన—గుణాన్విత = గుణవంతులయొక్క, అనఁగాఁ బండితులయొక్క యనుట, పూగ=బృందమును, అసకృత్ = అనేకపర్యాయములు, ఖండన=ఖండించుటయందలి, ప్రౌఢిమ=నైపుణ్యముచే, ఆఘొకమానేన=ప్రవర్తించుచున్న, దంతపక్షమందును, గుణా...మానేన—గుణ = కషాయాదిగుణములచే, అన్విత=కూడికొన్న, పూగ=పోకచెక్కను, అసకృత్ = మాటిమాటికిని, ఖండన=ఖండించుటయందలి, ప్రౌఢి=నేర్పుచే, ఆఘొకమానేన=వర్తించుచున్న, దంతాత్మనా = దంతరూపమయిన, తర్కశాస్త్రేణ = తర్కశాస్త్రముచే, కామపి=అనిర్వాచ్యమయిన, అభిఖ్యాం=కాంతిని, ముఖే=ముఖమందు, ఖ్యాపయంతీం=ప్రకటనచేయుచున్నట్టియు, అనఁగాఁ బ్రతివాదుల ప్రతిజ్ఞాపత్రమును పండితసమూహమును వాదముచే నిరాకరించుటయందు నేర్పుగల తర్కశాస్త్రము నాగవల్లీదళములను బోఁకచెక్కలను ఖండించుటయందు సమర్థములయినదంతము లగుచున్నవని భావము. త్వాం=నిన్నును, ధ్రువం=నిశ్చయముగా, వందేతమాం=నమస్కరించుచున్నాను, ద్రుహిణగృహిణి=బ్రహ్మభార్యవగు సరస్వతీ, మత్స్య...లక్షితం—మత్స్య=మత్స్యపురాణము, పద్మ=పద్మపురాణము, ఆది=మొదలగువానిచే, సంలక్షితం = కూడికొని యున్నదియు యును, హస్తపక్షమందు - మత్స్య...లక్షితం=మత్స్యరేఖ, పద్మరేఖ మొదలగువానిచే నొప్పుచున్నదియు, పురాణం=పురాణములను, త్వదీయం = నీసం

బంధ మయిన, పాణిపద్మం = హస్తపద్మమును, నిర్మలం = దోషరహితమైన, ధర్మశాస్త్రిము, తావకం, శిరః=నీశిరస్సు, ఓంక్రియామంత్రరాజస్య = ఓంకారమంత్రరాజముయొక్క, దలాభ్యాం=దళములచేతను, భ్రువౌ=కనుబొమలను, తద్బిందునా = ఆ ఓంకారములోనున్న, బిందువుచేత, ఫాలభాగే = నుదుటియందు, చిత్రకం=బొట్టును, తదర్ధేందునా=ఆయోంకారములో నున్న యర్ధచంద్రరేఖచేత, విపంచీ కలక్వాణచాపం = వీణియవలెనే యవ్యక్తమధురధ్వనులను జేయుచాపమునుగాను, విరించిః=బ్రహ్మ, తే=నీకు, స్వయం=స్వయముగా, ప్రణిన్యే=నిర్మించెను. భారతి, అసాధారణాత్ = గొప్పదయిన, త్వత్ప్రిసాదాత్=నీయనుగ్రహమువలన, సత్కృపాధార భూతం=మంచిదయకుఁ గారణభూతమైనదియు, ప్రభూతం=గొప్పదయిన, శుభం=మంగళము, భవతు=అగుఁగాక, 'సోమ...ననాయై, సోమసిద్ధాంత=చంద్రసిద్ధాంతమనెడి, కాంత=మనోహరమైన, ఆననాయై=ముఖముగలనీకు, నమః = నమస్కారము, శూన్య... తాయై-శూన్యవాద=నాస్తికవాదమే, ఆత్మ=రూపముగాఁగల, మధ్య=నడుములో, అన్వితాయై=కూడిన నీకు, నమః=నమస్కారము, అనఁగాఁ గృశించిన యుదరముగలదని భావము, సువిజ్ఞాన...జాయై-సువిజ్ఞాన=నిరాకారజ్ఞానముయొక్క, సామస్త్య=సంపూర్ణతయే, హృత్పంకజాయై=హృదయపద్మముగల, తే=నీకు, నమః=నమస్కారము. సాకారతా సిద్ధిభూమ్నే=సాకారతా=సౌత్రాంతికమతముయొక్క, సిద్ధి=ఫలమునకు, భూమ్నే=స్థానభూతమైన, సౌత్రాంతికుఁడనువాఁడు, నీల పీతాదిజ్ఞానములయొక్క ఐక్యమే ముక్తి యని చెప్పెను. అట్టిమతమున నీవే స్థానమవనిభావము. తే, నమః= నమస్కారము, కైవల్యకల్యాణసీమ్నే=మోక్షమనెడి కల్యాణమునకు, సీమ్నే=నిలయమవయిననీకు, నమః,సర్వ...జాయై-సర్వ=సమస్తమైన,గీర్వాణ=దేవతలయొక్క, చూడామణి = శిరోరత్నములయొక్క, శ్రేణి= పంక్తులచే, శోణ = ఎఱ్ఱని, ప్రభాజాల=కాంతిసమూహ మనెడి, బాలాతప=సూర్యకాంతిచే, స్మేర= వికసించిన, పాదాంబుజాయై=పాదపద్మములు గలనీకు, నమః, శరణ్యై=రక్షకురాల వగు నీకు, నమః, వరేణ్యై=శ్రేష్ఠురాలవగు నీకు, నమః, శరద్దాయై=

సుఖమునిచ్చు నీకు, నమః, శాశ్వతాయై=స్థిరముగా నుండెడి నీకు, నమః, విశ్రుతాయై=ప్రసిద్ధురాలవగు నీకు నమః, శారదాయై=శారదవయిన, తే=నీకు, నమః=నమస్కారము.

వ. అని ప్రస్తుతించిన. 139

మ. జగతీనాథునిముందటన్నిలిచె సాక్షాత్కారముంబొందియా
జగదేక స్తవనీయశారద శరచ్చంద్రాతపాలోకము
న్నగవుందేటయు దివ్యదేహరుచియు న్సమ్మేళనం బొంది చె
ల్వగుచుండ న్గరుణాపరాయణత నయ్యాస్థానమధ్యంబునన్.

టీ. అయ్యాస్థానమధ్యంబునన్=ఆసభామధ్యమున, ఆ...నీయ=లోకములో ముఖ్యముగా నుతింపఁదగిన, శారద=సరస్వతి, శరత్...కమున్-శరత్=శరత్కాలసంబంధియైన, చంద్రాతప=వెన్నెలవంటి, ఆలోకమున్=ప్రకాశము వంటిప్రకాశము గల, నగవుందేటయు = తేట యైననవ్వును, దివ్యదేహరుచియున్=మనోహరమైన దేహకాంతియును, సమ్మేళనంబు, ఒంది=మిశ్రమయి, చెల్వు=అందము, అగుచుండన్=కులుకుచుండఁగా, కరుణాపరాయణతన్=దయాధీనురాలగుటచే,జగతీనాథునిముందటన్=భీమరాజు చెంగట, సాక్షాత్కారమున్, పొంది=ప్రత్యక్షమై, నిలిచెన్, అనఁగా సరస్వతి ప్రత్యక్షమాయెనని భావము.

తా. లోకమునకంతకును గొనియాడఁదగిన యాసరస్వతి, శరత్కాలచంద్రికవలెఁ బ్రకాశించుచున్న మందహాసమును, దేహకాంతియును మేళనము చెంది ప్రకాశించుచుండఁగా నాసభలో భీమరాజునెదుట ప్రత్యక్షమైనిలిచెను.

శా. లాటీచిత్తసరోమరాళ కుకురీలావణ్యలోలాత్మ క
ర్ణాటీనృత్తకళావిలోకనసమారంభప్రియంభావుకా
భోటీనేత్రచకోరచంద్ర మగధీపుష్పాస్త్ర చోళీకుచా
ఘాటస్థాపితమన్మథాంకకుహాలీగాఢాంకపాళిప్రియా. 141

టీ. లాటీ...మరాళ—లాటీ=లాటదేశ స్త్రీల, చిత్త=మనస్సనెడి సరః=

సరస్సునకు, మరాళ=హంసమువంటివాఁడా! కుకురీ...లాత్మ—కుకురీ=కుకురదేశ స్త్రీల, లావణ్య=సౌందర్యమందు, లోల = ఆసక్తమగు, ఆత్మ=మనస్సు గల వాఁడా! కర్ణాటీ...భావుకా=కర్ణాటీ=కర్ణాటస్త్రీల, నృత్తకళా=నాట్యచాతుర్యమును, విలోకన=చూచువిషయమయి, సమారంభ=త్వరపడుటయందు, ప్రియంభావుకా = ఇష్టపడుచున్నవాఁడా! భోటీ...చంద్ర—భోటీ=భోటదేశ స్త్రీల, నేత్ర=కన్నులనెడి, చకోర=చకోరపక్షులకు, చంద్ర=చంద్రునివంటి వాఁడా! మగధీపుష్పాస్త్ర = మగధదేశ స్త్రీలకు మన్మథునివంటివాఁడా! చోళీ...మన్మథాంక—చోళీ=చోళదేశ స్త్రీలయొక్క, కుచ = స్తనములయొక్క, ఆఘాట=ప్రదేశమునందు, స్థాపిత=ఉంపఁబడిన, మన్మథాంక=మదనచిహ్నములుగలవాఁడా! కుహళీ...ప్రియా—కుహళీ = కుహళదేశ స్త్రీలయొక్క, గాఢ=బిగువయిన, అంకపాళి=కౌఁగిలింతయందు, ప్రియా=ఇష్టముకలవాఁడా!

తా. స్పష్టము.

క. మందారమంజరీమక
రందసుధామాధురీధురాధుర్యవచ
స్సందర్భరూపరేఖా
కందర్పా! పాండ్యరాజగజపంచాస్యా! 142

టీ. మందార...సందర్భ—మందార=మందారపువ్వులయొక్క, మంజరీ=గుత్తులయొక్క, మకరందసుధా = అమృతతుల్యమయిన మకరందముయొక్క, మాధురీ=తియ్యఁదనముయొక్క, ధురాధుర్య=బరువును మోయుచున్న, వచస్సందర్భ=వాక్సందర్భము కలవాఁడా! అనఁగా నమృతతుల్యములయినవాక్కులుగలవాఁడా! రూపరేఖాకందర్పా=సౌందర్యరేఖకు మన్మథునివంటివాఁడా! పాండ్య...పంచాస్యా—పాండ్యరాజ=పాండ్యదేశపురాజనెడి, గజ=ఏనుఁగునకు, పంచాస్యా=సింహమువంటివాఁడా!

తా. స్పష్టము.

మాలిని. హరిచరణసరోజధ్యాననిష్ఠాగరిష్ఠా
ధరణిభరధురీణాధఃకృతాహార్యవీర్యా

తరుణకమలనేత్రా! తల్లమాంబాసుపుత్రా
విరహితమదశంకా! వీరనారాయణాంకా! 143

టీ. హరి...గరిష్ఠా—హరి=విష్ణుమూర్తియొక్క, చరణసరోజ=పాదపద్మములను, ధ్యాన=సంస్మరించుటయందలి,నిష్ఠా=నియమముచే, గరిష్ఠా=శ్రేష్ఠుఁడయినవాఁడా! ధరణి...వర్యా—ధరణి = భూమియొక్క, భర = బరువును, దిధీర్షా=ధరింపఁదలంపుచే, అధఃకృత=క్రిందుగాఁజేయఁబడిన, అహార్యవర్యా=మేరుపర్వతముగలవాఁడా! తరుణకమలనేత్రా= లేఁతతామరవంటికన్నులు గలవాఁడా! తల్లమాంబాసుపుత్రా=తల్లమాంబాదేవియొక్కకుమారుఁడా! విరహితమదశంకా=లేనిగర్వసందేహముగలవాఁడా! అనఁగా నితనికిఁ గర్వముగలదాయనుశంకకుఁగూడ నవకాశములేనివాఁడా! వీరనారాయణాంకా = వీరనారాయణుఁ డనుబిరుదము గలవాఁడా!

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్యపుత్త్ర సకలవిద్యాసనాథ శ్రీనాథభట్టప్రణీతం బైనశృంగారనైషధంబునందుఁ జతుర్థాశ్వాసము.





శ్రీరస్తు.

# శృంగారనైషధము

## పంచమాశ్వాసము.



శ్రీపాదాంభోరుహాసం
స్థాపితమణిమకుటకటక ఝుళఝుళనినదా
టోపవికంపితవిమత
క్ష్మాపాలకులాంతరంగ ! మామిడిసింగా. 1

టీ. శ్రీపాదా...తరంగ - శ్రీ=శోభాయుక్తములయిన, పాదాంభోరుహ=పాదపద్మములందు, సంస్థాపిత=ఉంపఁబడిన, మణిమకుట=రత్నకిరీటములయొక్కయు, కటక=కడియములయొక్కయు, ఝుళఝుళనినద=ఝుళఝుళధ్వనులయొక్క, ఆటోప=అతిశయముచేత, వికంపిత=విశేషముగాఁ జలింపఁజేయఁబడుచున్న, విమతక్ష్మాపాల=శత్రురాజులయొక్క, కుల=సమూహముయొక్క, అంతరంగ=మనస్సులుకలవాఁడా!మామిడిసింగా!అనఁగా సామంతప్రభువులువచ్చి మామిడిసింగనపాదపద్మములను దమకిరీటములును జేతికడియములును దాఁకునట్లు చేయుచు నమస్కరింపఁగా రత్నమయములయినవానియొక్క ధ్వనులు విని శత్రువులు మిగులభయపడుచున్నారనుట. ఈచెప్పుటచే మామిడిసింగనమంత్రి సమస్తసామంతులచేతను నమస్కరింపఁబడుచుండె ననియు, శత్రువులకు భయము కలిగించుచున్నాఁ డనియు భావము.

తా. స్పష్టము.

వ. అవధరింపుము. 2

తే. అట్లు సాక్షాత్కరించినయఖిలజనని
భారతీదేవిఁ జూచి భూపాలకుండు
నమ్మహాస్థానమున నున్నయఖిలజనులుఁ
జేతు లెత్తి ప్రణామముల్ చేసి రర్థి. 3

టీ. అట్లు=ఆరీతిగా, సాక్షాత్కరించిన యఖిలజననిన్ =ప్రత్యక్షమయినలోకములతల్లిని, భారతీదేవిన్ =సరస్వతీదేవిని, చూచి, భూపాలకుండున్ =భీమరాజును, అమ్మహాస్థానమునన్ =ఆగొప్పసభయందు, ఉన్నయఖిలజనులు=ఉన్నట్టి జనులందఱును, అర్థిన్ = ప్రీతిచే, చేతులు, ఎత్తి, ప్రణామముల్ =నమస్కారములు, చేసిరి.

తా. సరస్వతీదేవి యట్లు ప్రత్యక్షమగుచుండుటను జూచి యాసభయందున్నవా రందఱును, భీమరాజును, లేచి చేతులెత్తి సంతసముతో నమస్కరించిరి.

వ. అప్పుడు భోజరాజు తత్కాలవేద్యంబు లగుశకునస్వరాదుల యానుకూల్యం బెఱింగి నిజతనూజ నమ్మహాదేవికి నప్పగించువాఁడై యంతఃపురపరిచారికాజనంబుల నియోగించిన. 4

టీ. అప్పుడు=ఆసమయమందు, భోజరాజు=విదర్భరాజు, తత్కాలవేద్యంబులు=ఆకాలమందుఁ దెలియఁదగినవి, అగుశకునస్వరాదులయానుకూల్యంబు—అగు=అయిన, శకున=శుభనిమిత్తములయొక్కయు, స్వరాదుల=ధ్వనులయొక్కయు, ఆనుకూల్యంబు=అనుకూలత్వమును, ఎఱింగి = తెలిసికొని, నిజతనూజన్ =తనకుమారికను, అమ్మహాదేవికిన్ = ఆసరస్వతీదేవికి, అప్పగించువాఁడై=అప్పగింపఁదలంపుగలవాఁడై, అంతఃపురపరిచారికాజనంబులన్ =అంతఃపురమందుండు దాసీజనమును, నియోగించినన్ =ఆజ్ఞాపింపఁగా, అని వైపద్యముతో నన్వయము.

సీ. అఖిలదిగ్దేశరాజన్యకన్యకాక్రియా

మహనీయతరసిద్ధ మంత్రవిద్య
యాకారరేఖాస మభ్యుత్థితానన్య
సాధారణాశ్చర్య జలధివేల
నేపథ్యహీరప్ర భాపూరనిర్మల
వారిబింబితనిజ స్వచ్ఛకాంతి
సంకల్పభవదూత సదృశకర్ణాకల్ప
కల్హారసౌరభా గతమదాళి

తే. బహువిరోధిమణిప్రభా పల్లవాగ్ర
మల్లసంగ్రామఖురళికా మండలాయ
మానవానాపరిష్కార మహితగాత్రి
మనుజపతిపుత్త్రి యాస్థానమునకు వచ్చె. 5

టీ. అఖిల...విద్య-అఖిల=సమస్తమయిన, దిక్=దిక్కులందుఁగల, దేశ=దేశములందున్న, రాజ=రాజులను, ఆకర్షణ=సమీపమునకుఁ గొనితెచ్చుటయనెడి, క్రియా=పనికి, మహనీయతర=మిక్కిలి పూజ్యమైనదియు, సిద్ధ=జపాది పురశ్చరణముచే స్వవశీకృతమై ఫలోన్ముఖమైనదియు, నగు, మంత్రవిద్యా=మంత్రవిద్యతో సమానురాలును, అనఁగా ఫలసిద్ధినొందిన మంత్రముచే తనుంబోలెఁ దన సౌందర్యముచే నందఱ చిత్తమును నాకర్షించుచున్నదని భావము. ఆకార...జలధివేల - ఆకారరేఖా = నిజస్వరూపమువలన, సమభ్యుత్థిత=కలిగిన, అనన్యసాధారణ = అన్యసామాన్యముకాని, ఆశ్చర్య=అద్భుతరసమనెడి, జలధి = సముద్రమునకు, వేల = ఒడ్డువంటిది - అనఁగా నెల్లరకు నబ్బురంబును బుట్టించునాకారవిశేషము కలదని భావము. నేపథ్య...కాంతి- నేపథ్య=అలంకారములందు స్థగితములయిన, హీర = ఆఱుకోణములు గల మణులయొక్క, ప్రభాపూర=కాంతిసమృద్ధి యనెడి, నిర్మలవారి=స్వచ్ఛమయినజలమందు, బింబిత=ప్రతిఫలించుచున్న, నిజస్వచ్ఛకాంతి = స్వకీయదేహకాంతిగలది, అనఁగా దమయంతి తా ధరించినయాభరణంబులందు వెల

యు మణుల కాంతులందుఁ బ్రతిఫలించుచున్నదని భావము. సంకల్ప...మదా
ళి-సంకల్పభవ=మన్మథునియొక్క, దూతసదృశ=దూతతో సమమైనదియు,
కర్ణాకల్ప=కర్ణాలంకారముగా నుంచుకొన్న, కల్హార=సుగంధముగల్గిన కలువ
యొక్క, సౌరభ=సువాసనచే, ఆగత=వచ్చుచున్న, మదాళి=మదించిన తు
మ్మెదలుగలది. అనఁగా దమయంతి యలంకారార్థము చెవియందు సువాసనగల
కలువనుంచుకొనఁగా నాకలువయొక్క మంచివాసనలచే నాకర్షింపఁబడి తు
మ్మెదలు వచ్చుచుండెను. అవి మన్మథదూతలవలె నొప్పుచున్నవని భావము.
బహు...గాత్రి-బహు=అనేకములైన, విరోధి=విరుద్ధవర్ణములు గల, మణిప్ర
భా=మణికాంతులయొక్క, పల్లవాగ్ర=అంకురములయొక్క, మల్లసంగ్రామ=
మల్లయుద్ధమునకు, ఖురళికామండలాయమాన=గరిడీశాలలై యాచరింపఁబడిన,
నానాపరిష్కార=అనేకవిధములైనయలంకారములచే, మహిత=ఒప్పుచున్న,
గాత్రి=శరీరముకలది, అనఁగా నొక్కొక్కయాభరణమునందుఁ బలురకములగు
రతనములు దాపియుండుటచే వానికాంతులు పరస్పరమిళితములై యుండెను.
పలువిధములగు నాకాంతులొండొంటితో నొరసికొనుట మల్లయుద్ధము
గాను నాయలంకారములు మల్లయుద్ధముచేయఁదగిన స్థలములుగాను నొప్పు
చున్నవనిభావము. దమయంతి నానావిధాలంకారంబులను దాల్చియొప్పుచున్న
దనిభావము. మనుజపతిపుత్రి = భీమరాజకుమారికయగు దమయంతి, ఆస్థా
నమునకుఁ=సభకు, వచ్చెను.

తా. తనసౌందర్యాతిశయముచే సమస్తరాజన్యులమనంబుల నాకర్షించి
నదియుఁ, దనయాకారవిశేషముచేఁ జూపఱకధికాశ్చర్యము కలిగించుచున్న
దియు, దనయలంకారరత్నకాంతులందుఁ దనస్వచ్ఛదేహకాంతి ప్రతిబింబిం
చుచుండఁ గర్ణాలంకారభూతమైన కలువయొక్కవాసనకై వచ్చినతుమ్మెదలు
మన్మథదూతలవలెఁ దనరారుచుండఁగా నానావిధములగు రత్నకాంతులు
పరస్పరము మిళితములయి మల్లయుద్ధమొనర్చుటకుఁ దగిన స్థలములుగాఁ జే
యఁబడిన యలంకారంబులను దాల్చి దమయంతి సభామందిరంబునకు వచ్చెను.

తే. అతివ ప్రీతావదాతాదు[illegible]పాసితమణి

దీప్తికల్పితదేహోపదేహ యగుచు
సారగోరోచనాగంధసారఘుస్నృణ
మృగమదాలేపపునరుక్తి మేలుకొలిపె. 6

టీ. అతివ=దమయంతి, పీత ... దేహ-పీత=పచ్చనివియు,అవదాత= తెల్లనివియు,అరుణ=ఎఱ్ఱనివియు,అసిత=నల్లనివియు, నగు, మణి=రత్నములయొక్క, దీప్తి=కాంతులచే, కల్పిత=నిర్మింపఁబడుచున్న,దేహోపదేహ=శరీరానులేపనము కలదై,సార ... పునరుక్తి-సార=ప్రశస్తమైన,గోరోచనా=గోరోచనముయొక్కయు,గంధసార=పచ్చకర్పూరముయొక్కయు,ఘుస్నృణ=కుంకుముయొక్కయు, మృగమద=కస్తూరియొక్కయు, ఆలేప=పూఁతయొక్క,పునరుక్తి=నిరర్థకములగుటను, మేలుకొలిపె=వెల్లడించుచుండెను. అనఁగా దమయంతి గోరోచనమును, కర్పూరమును, కుంకుమును, గస్తూరిని, శరీరమందుఁ బూసికొనియుండెను. మఱియు నామె పచ్చనివియు, తెల్లనివియు, నెఱ్ఱనివియు, నల్లనివియు, నగుమణులచేఁ గూర్పఁబడినయలంకారములను ధరించెను. దమయంతిదాల్చిన పలువిధములగు రత్నములకాంతులు ప్రబలి గోరోచనాదులగు పూఁతలను వ్యర్థములైనట్లు చేయుచున్నవి. అనఁగా రత్నకాంతులు వ్యాపించి గోరోచనాదులపూఁతలకంటెఁ జక్కఁగాఁ బ్రకాశించుచున్న వని భావము. అలం. యథాసంఖ్యము. సామాన్యము.

తా. స్పష్టము.

సీ. కర్పూరకస్తూరికాప్రవాహంబులు
ప్రవహింప లోచనప్రాంగణములఁ
గించిద్దిగంబరీకృతరదద్యుతిపెంపు
పలుకుబోటికి నైన భ్రాంతి గాఁగ
భూషామణివ్యాజమున నంగకంబుల
జనులచూపులు వినిశ్చలత నిలువ
మహనీయలావణ్యమధువు నెమ్మనముల
నాకంఠముగఁ గ్రోలనవనిభుజులు

తే. నలుఁ బ్రసూనచాపంబున కెు గెలువలేని
యంగభవునకు శక్రకబ్రాణాసనంబు
బహువిభూషణరత్నశోభాభిషమునఁ
దాను గల్పించుచంద మంకెదంబు నొందె. 7

టీ. లోచనప్రాంగణములన్-లోచన = నేత్రములయొక్క, ప్రాంగణములన్ = ముంగిలిభాగములందు, కర్పూర...బులు-కర్పూర = తెల్లనికాంతులయొక్కయు, కస్తూరికా=నల్లనికాంతులయొక్కయు, ప్రవాహంబులు = ధారలు, ప్రవహింపన్ =పాఱుచుండఁగా, అనఁగాఁ దెల్లనివియు, నల్లనివియు నగు దమయంతిచూపులు కప్పురముయొక్కయుఁ గస్తూరియొక్కయుఁ బ్రవాహములవలె నున్నవనిభావము. ఇటఁ జూపులు ప్రవాహమువలె నున్న వనిచెప్పుటచే నామె చూపు లెడతెగక వచ్చుచున్నవని తెలియుచున్నది. కించిత్...పెంపు - కించిత్ =కొంచెము, దిగంబరీకృత=స్పష్టమగుచున్న, రద=దంతములయొక్క, ద్యుతి= కాంతులయొక్క, పెంపు=అతిశయము, పలుకుబోటికి నైనన్ =సరస్వతీదేవికైనను, బ్రాఁతిగాఁగన్ =దుర్లభమగుచుండఁగా,అనఁగాఁ జిఱునవ్వు నవ్వినప్పుడు కొంచెము వెలువడిన దమయంతిపలుకుదురుయొక్క తెల్లనికాంతులు సరస్వతిదేహకాంతులను మించుచున్న వని భావము. అంగకములన్ =దమయంతి యవయవములందు, జనులచూపులు, భూషామణివ్యాజమునన్ =ఆభరణములందలి రత్నముల నెపముచేత, నిశ్చలతన్ =చలింపకుండ, నిలువన్ =నిలుచుచుండఁగా, అనఁగా దమయంతియవయవములను జనులు చూచుచుండఁగా వారిచూపు లాభరణములందలి రత్నములవలె నిశ్చలములయియున్నవని భావము. ఈచెప్పుటచే జనులు ఱెప్పవాల్పక చూచుచుండి రనియును, నవి యాభరణములందలిమణులవలె నే యవయవమందున్న వచ్చట నేకాని మఱియొక యవయవము పైకిరాలేక నిశ్చలములై యున్నవనియుఁ దెలియఁదగినది. అవనిభుజులు=రాజులు, నెమ్మనములన్ =నిండుమనస్సులతో, మహనీయలావణ్యమధువున్ =కొనియాడఁదగిన సౌందర్యమనెడి మధురసమును, ఆకంఠముగన్ =కుత్తుకబంటిగా, గ్రోలన్ =త్రావుచుండఁగా, అనఁగా రాజులందఱును

నామెసౌందర్యము నిండుమనస్సులతోఁ జూచుచున్నారని భావము. నలుఁ=నలమహారాజును, ప్రసూనచాపంబునన్=పూవింటిచే, గెలువలేని యంగభవునకున్=జయింపలేని మన్మథునకు, తాను=దమయంతి యనుట, బహు...మిషమునన్—బహు=అనేకములగు, విభూషణ=అలంకారములందలి, రత్న=మణులయొక్క, శోభామిషమునన్=కాంతుల నెపముచే, శక్రబాణాసనంబుఁ=ఇంద్రచాపమును, కల్పించుచందము=నిర్మించునట్లు, అందంబుఁ=సౌందర్యమును, ఒందెన్=పొందెను. అనఁగా మన్మథుఁడు పుష్పచాపముచే నలుని జయింపలేకుండఁగా దమయంతి తనయలంకారములందలి నానావిధరత్నములయొక్క కాంతులమిషచే నింద్రచాపమును గల్పించుచున్నట్లు ప్రకాశించెనని భావము. ఈచెప్పుటచే దమయంతి నలరాజును లోఁబఱచుకొనఁజాలినంతసౌందర్యము కలదనియు, ఇంద్రధనుస్సునందువలెఁ బలువిధములగు రంగులుగల మణులచే నొప్పుచున్నదనియుఁ దెల్లమగుచున్నది. అలం అతిశయోక్తి.

మహాస్రగ్ధర. చతురత్వం బొప్పఁగా నప్సరస లుభయపార్శ్వంబులం బాడుచుఁ రాఁ, జతురంతస్థై ర్యయానస్థ యయి
తరుణి యాస్థానముం జొచ్చి వచ్చెన్, శతపత్రాక్షీకరాబ్జో
చ్చలితధవళరుక్చామరాళీమరాళీ,కృతలీలాలాస్యకేళీకిసల
యితకలాఖేలనం బొప్ప మీఱన్. 8

టీ. తరుణి=దమయంతి, చతురత్వంబు=నేర్పరితనము,ఒప్పఁగాన్=ప్రకాశించుచుండఁగా, అప్సరసలు=అచ్చరలు, ఉభయపార్శ్వంబులన్ = రెండు ప్రక్కలయందును, పాడుచున్=గానముచేయుచు, రాన్=వచ్చుచుండఁగా, చతురంతస్థయై=పల్లకీయందుఁ గూర్చుండినదై, శత...ఖేలనంబు-శతపత్రాక్షీ=పద్మములవంటి నేత్రములు గల స్త్రీలయొక్క,కరాబ్జ = హస్తపద్మములచే, ఉచ్చలిత=వీచఁబడుచున్న, ధవళ=తెల్లని, రుక్=కాంతులు గల, చామరాళీ=వింజామరలపంక్తి యనెడి, మరాళీ=ఆఁడుహంసలచే, కృత=చేయఁబడుచున్న, లీలా=విలాసార్థమైన, లాస్యకేళీ = నాట్యమనెడి యాటకు, కిసలయిత=చిగురు చేయఁబడిన, అనఁగా నతిశయించుచున్న దనుట. కలాఖే

లనంబు=నాట్యవిలాసములు, ఒప్పమీఱన్=ప్రకాశించుచుండఁగా, ఆస్థానంబున్=ఆసభామధ్యమును, చొచ్చి, ప్రవేశించి, వచ్చెన్, అనఁగా దమయంతి కిరుపార్శ్వంబులందును వీవఁబడుచున్న వింజామరలచలనములు హంసలుచేయుచున్న నాట్యములను మించుచున్నవనుట.

తా. దమయంతి దేవతాస్త్రీలు తన కిరుపార్శ్వంబులందుఁ బాడుచు వచ్చుచుండఁగా మఱికొందఱు స్త్రీలు హంసలవంటి తెల్లనివింజామరలు పట్టికొని వీచుచుండఁగాఁ బల్లకిలోఁ గూర్చుండి సభలోనికి వచ్చెను. అలం. ఛేకానుప్రాసము. రూపకాతిశయోక్తి.

సీ. దవ్వుదవ్వులఁ గన్ను ♦ తనివి వోవఁగఁ జూచి
పరమాద్భుతం బాత్మఁ ♦ బాదుకొల్పి
సకలాంగకంబులు ♦ జాదుకోఁ బులకించి
చే మొకించుక యెత్తి ♦ చిత్త మిడిసి
కదియ నాసాశిఖా♦గ్రమునఁ దర్జని మోపి
మూర్ధంబు గంపితం♦బుగ నొనర్చి
కడచెప్ప లొరయంగఁ ♦ గనుఁదమ్ము లరమోడ్చి
బొమదోయి యొక్కింత ♦ పొడవుసేసి

తే. లలనసౌందర్యరేఖావి♦లాసమునకు
నిచ్చ మెచ్చనిరా జొక్కఁ♦డేని నరిది
యమ్మహాస్థానమున నున్న♦యఖిలవార్ధి
వలయితాశేష మేదినీ♦శ్వరులయందు. 9

టీ. అమ్మహాస్థానమునన్=ఆమహాసభయందు, ఉన్న... అందున్-ఉన్న=నివసించియున్నట్టి, అఖిల=సమస్తమైన, వార్ధి=సముద్రములచే, వలయిత=చుట్టఁబడిన, అశేష=సమస్తమైన, మేదినీశ్వరులయందున్=రాజులందు, దవ్వుదవ్వులన్=దూరదూరముగా, కన్ను=నేత్రము, తనివి వోవఁగన్=తృప్తిచెందునట్లుగా, చూచి, పరమాద్భుతంబు=... ఆశ్చర్యము, ఆత్మన్=మన

స్సునందు, పాదుకొల్పి=నిలుకడగాఁ జేసికొని, సకలాంగకంబులు=అన్ని యవయవములును, జాదుకోఁగ=దట్టముగా, పులకించి = గగుర్పాటుచెందఁగా, చేయి, ఒకించుక=కొంచెము,ఎత్తి, చిత్తము=మనస్సు,ఇడిసి=వికృతిముగాఁ జేసికొని, నాసాశిఖాగ్రమునఁగ=ముక్కుకొనయందు, తర్జనిఁగ=చూపుడువ్రేలిని, కదియఁగ=దగ్గఱగా,మోపి,మూర్ధంబుఁగ=శిరస్సును,కంపితంబుగఁగ, ఒనర్చి=చలింపఁజేసి, కడ ఱెప్పలు=కంటికడ ఱెప్పలు, ఒరయంగఁగ = రాపాడునట్లుగా, కన్నులు, అరమోడ్చి=సగముమూసి, బొమదోయి=కనుబొమలజత,ఒక్కింత=కొంచెము, పొడవు చేసి=నిగిడించి, లలన సౌందర్యరేఖావిలాసమునకుఁగ = దమయంతియొక్క సౌందర్యాతిశయమునకు, ఇచ్చఁగ=కోర్కెచే, మెచ్చనిరాజు=పొగడనిరాజు, ఒక్కఁడేని=ఒకఁడైనను, అరిది=లేఁడు.

తా. ఆసభలోనికి వచ్చిన దమయంతిని దూరముగాఁ దృష్టి చెందునట్లు చూచి మిక్కిలి యచ్చెరుపడి శరీరమంతయుఁ బులకాంకురములచే నిండఁగా, చేయి కొంచెమెత్తి,మనంబును వికృతముగాఁ జేసికొని, ముక్కుకొనయందుఁ జూపుడువ్రేలుంచి, తలపంకించి, కడఱెప్పలల్లార్చుచు కన్నులరమోడ్చి, కనుబొమలను మీఁదికినిగిటి, యామెసౌందర్యమును మెచ్చుకోనిరాజామహాసభలోనున్న సమస్తరాజులలోను నొకఁడేనియు లేఁడు.

వ ఇట్లు రాజులు పరమాశ్చర్యంబు నొందుచు నంతర్గతంబున.

టీ. స్పష్టము.

తే. తరుణివదనంబె సాక్షాత్సుధాకరుఁడు
లలి నభంబుశశాంకుండు లాక్షణికుఁడు
ముఖ్య మగుకామచాపంబు ముదితబొమలు
పువ్వు గుణమాత్రవృత్తి సద్బుద్ధిఁ దలఁప.    11

టీ. తరుణివదనంబె=దమయంతిముఖమె, సాక్షాత్సుధాకరుండు=ప్రత్యక్షసుధాంశువు కాని,నభంబు శశాంకుండు=ఆకాశమందున్న చంద్రుండు,లలిఁగ=మిక్కిలి,లాక్షణికుఁడు=కలంకముతోఁ గూడుకొన్నవాఁడు. కావున చంద్రుఁడు స్వయముగా నప్రమానము కాఁడేరఁడు.తక్కువగుణములు కలవాఁడగుటచే

నుపమేయమే యగును. అనఁగాఁ గవిసంకేతమందుఁ బ్రసిద్ధోపమానముగా స్వీకరింపఁబడుచంద్రుఁడు దమయంతిముఖమం దున్న కొన్నిలక్షణములు మాత్రమే కలవాఁడు కావున మిక్కిలి వర్తులమై, యధరోష్ఠసంబంధి యగునమృతము గలదై యున్న దమయంతిముఖమే చంద్రునికంటె నధికగుణములు కలదై యున్నదనిభావము. లేక వేఱొకవిధముగ నర్థము చెప్పవచ్చు:—తరుణివదనంబె=దమయంతిముఖమే, సాక్షాత్సుధాకరుండు=అభిధావృత్తిచే సుధాంశుఁడగుచున్నది. ఓష్ఠసంబంధియగు సుధాపూరము కలదగుటచే సుధాంశుపదముచే దమయంతిముఖమే ముఖ్యవృత్తిచేఁ జెప్పబడుచున్నదని భావము. శబ్దముల కభిధావృత్తిచేతను లక్షణావృత్తిచేతను నర్థనిర్ణయము చేయఁబడుచున్నది. శబ్దముచ్చరింపఁబడఁగానే యేయర్థ ముపస్థిత మగునో యాయర్థ మభిధావృత్తిచే వచ్చినది. శబ్ద ముచ్చరింపఁబడినతోడనే యర్థోపస్థితి కలుగకున్నప్పుడే యర్థము కల్పితమగునో యది లక్షణావృత్తిచే వచ్చినది. ఇక్కడ సుధాంశుపద ముచ్చరింపఁబడినతోడనే యోష్ఠసంబంధి యగు సుధాపూరము గలదగుటచే దమయంతివదనమె దాని కర్థ మని యభిధావృత్తిచేఁ జెప్పఁబడుచున్నదనిభావము. వేఱొకవిధమైన యర్థము. నభంబుశశాంకుండు = ఆకాశమం దున్నచంద్రుఁడు, లలిన్ = మిక్కిలి, లాక్షణికుఁడు = లక్షణావృత్తివశమువలన సుధాంశువని పిలువఁబడుచున్నాఁడు. అంతేకాని యభిధావృత్తిచేఁ జెప్పఁబడలేదు. మఱియు దమయంతిముఖ మభిధావృత్తిచేతను సుధాంశు వని చెప్పఁబడుచున్నది. చంద్రుఁ డభిధావృత్తిచే శశాంకుఁడని పిలువఁబడుచున్నాఁడు కాని సుధాంశువని పిలువఁబడుట లక్షణావృత్తిచేతనే, కావున దమయంతిముఖమునకుఁ జంద్రునకును నెక్కుడు భేదము కలదని భావము. ముదితబొమలు=దమయంతి కనుబొమలు, ముఖ్యము=అభిధావృత్తిచేఁ జెప్పఁబడునది, అగు కామచాపంబు=అయినట్టి మన్మథచాపము, పువ్వు=కాముసికిఁ జాపమని చెప్పఁబడుచున్నపుష్పము, సద్బుద్ధిన్-తలఁపన్=ఆలోచింపఁగా గుణమాత్రవృత్తి-గుణమాత్ర=ఆ కనుబొమలం దున్న వక్రతోన్నాదకత్వములలో నేక దేశమగు యున్నాదకత్వము మాత్రముచేత నే, వృత్తి=వర్తిం

చుచున్నది. దమయంతి కనుబొమలు వక్రములై మోహజనకములై యున్నవి. పుష్పము కేవలము మోహజనకమయ్యే యున్నది. కావున మదనచాపమనఁగా, నధికగుణములు గలదగుటచే దమయంతికనుబొమలే యభిధావృత్తిచేఁ జెప్పఁబడునుగాని తక్కువ గుణములుగల పుష్ప మట్లు చెప్పఁబడ నేరదు. లేక గౌణ వృత్తిచేత నే యట్లు చెప్పఁబడు ననవచ్చును. అనఁగా దమయంతివదనము చంద్రుని మించుచున్నదనియు బొమలు స్మరచాపంబులను మీఱుచున్నవనియు ఫలితార్థము.

తా. ఓష్ఠబింబసంబంధియగు సుధారసము కలుగుటచే దమయంతివదనమునకే యభిధావృత్తిచేత సుధాంశు వని యర్థము. ఆకాశమందున్న చంద్రునకు సుధాంశువన్నయర్థము లక్షణావృత్తిచేత నే కలుగుచున్నది. కాని యభిధావృత్తిచేఁ గాదు. అట్లే కామచాపమనఁగా వక్రత్వాదిగుణములు గల దమయంతికనుబొమలకే చెల్లునుకాని వక్రత్వము లేక మోహజనకత్వము మాత్రము కలిగినపుష్పమునకుఁ జెల్లదు. అలం. అతిశయోక్తి.

చ. మడువక ముష్టియోగ్య మగుమధ్యములో నెలవంక యైనయ
 ప్పడఁతుకభ్రూలతాధనువుఁబట్టి మనోభవుఁ డింతనుండియుఁ
 విడుచున కాని మానఁ డిది నిక్కము షట్పదకీట జుష్టమై
 యుడుగకకమ్మదూళినుసియొల్కుచున్న పురాణచాపమున్.

టీ. మనోభవుఁడు=మన్మథుఁడు, ఇంతనుండియుఁ=ఇఁక మీఁద, మడువక=ఎక్కుడింపక, ముష్టియోగ్యము=పిడికిలిచేఁ బట్టుటకుఁ దగియున్నది, అగు మధ్యములోఁ=అయినట్టి మధ్యభాగమునందు, నెలవంక=వంకరగీత, ఐనయప్పడఁతుక భ్రూలతాధనువు=గలయట్టి దమయంతియొక్క కనుబొమలనెడి వింటిని, పట్టి=స్వీకరించి, షట్పదకీట జుష్టము=షట్పదము లనెడిపురుగులు గలిగినదై;, కమ్మదూళినుసి=పుష్పపరాగమనెడి చూర్ణమును, ఒల్కుచుఁ=వెడలఁద్రోయుచు, ఉన్నపురాణచాపముఁ=ఉన్నట్టిప్రాఁతవింటిని, విడుచుఁ+అ-కాని=విడిచిపెట్టునుకాని, మానఁడు, ఇది నిక్కము=ఇది సత్యము. లోకములోఁ గఱ్ఱలకుఁ బురుగుపట్టి గుండగాఁజేసి బలహీనములఁగాఁ జేయుటకలదు. ఇట మ

న్మథునిపూవిల్లు తుమ్మెదలనెడి పురుగులకిక్కయై పుష్పపరాగమనెడి చూర్ణము రాల్చుచు నుండెనుగాన నది ప్రాఁతపడి దుర్బలమై యున్నది. కావున మన్మథుండు దానివిడిచి సమర్థమైన దమయంతికనుబొమ లనెడి ధనువును స్వీకరింపకమానఁ డని భావము.

తా. స్పష్టము. అలం. అతిశయోక్తి.

తే. మగువతాటంకయుగ్మంబు మన్మథునకు
లక్ష్యయుగ్మంబు గాఁబోలు లలిఁ దలంపఁ
గడఁగి సవ్యాపసవ్యమార్గణము లేయ
నైనరంధ్రంబు గాదె తదంతరంబు. 13

టీ. లలిన్=మిక్కిలి, తలంపన్=ఆలోచింపఁగా, మన్మథునకున్, మగువతాటంకయుగ్మంబు=దమయంతి కర్ణభూషణములు, లక్ష్యయుగ్మంబు=లక్ష్యమై చేయఁబడినకుండలాకారరేఖలుగాఁ బోలును, అనఁగా ధానుష్కులు లక్ష్యమును సరిగా భేదించుటకై దూరమున నొకబల్ల నుంచి దానిమధ్యను గుండ్రాలాకారరేఖ రచించి, దానినిగొట్ట నభ్యసించుచుందురు. సరిగా నావర్తులాకారరేఖను దూసికొనిపోవునట్లు కొట్టినచో వాఁడు విలుకాండ్రలో నుత్తముఁ డనఁబరఁగు. అట్లే మన్మథునకు దమయంతి తాటంకయుగ్మము లక్ష్యయుగ్మమై యొప్పుచున్నదనిభావము. తదంతరంబు=ఆతాటంక యుగ్మకముయొక్క యవకాశము. కడఁగి=ప్రయత్నించి, సవ్యాపసవ్య మార్గణములు=కుడియెడమతట్టులనుండి బాణములు, ఏయన్=కొట్టఁగా, ఐనరంధ్రంబు=అయినట్టికన్నమే కదా? అనఁగా మన్మథుఁడు దమయంతిబొమలను చాపముగాఁ జేసికొని యామెకటాక్షములను బాణములగాఁ జేసికొని, తాటంకయుగ్మమును లక్ష్యముగాఁ జేసికొని విలువిద్య నభ్యసించుచుండఁగా, నామె తాటంకయుగ్మముయొక్క మధ్యనున్న యవకాశము మన్మథునిబాణములు దూసికొని పోవుటవలనఁ గల్గినరంధ్రమువలె నొప్పుచున్నదని భావము. దమయంతితాటంకయుగ్మమును జూచినమాత్రనే కామోద్రేకము గలుగుచున్న దని ఫలితార్థము. కటాక్షములు తాటంకములందు నిగుడు ననుటచే కన్నులు కర్ణాంతాయతములని తెలియునది.

తా. ఆలోచింప దమయంతికర్ణభూషణములు మన్మథునకు లక్ష్యభూత ము లైన కుండలాకారరేఖలుగాఁ బోలును, ఆతాటంకములమధ్యనున్న యవ కాశము మన్మథుఁడు వేసినబాణమువలనఁ గల్గినరంధ్రమే.అలం.రూపకోత్ప్రేక్ష.

క. రతిపంచబాణజాయా
పతికేళీసౌధశిఖరపర్యంతసమం
చితకాంచనకలశము లీ
శతపత్త్రదళాయతాక్షిచారుస్తనముల్. 14

టీ. ఈశతపత్త్ర... స్తనముల్-ఈశతపత్త్రదళాయతాక్షి = పద్మపత్త్రముల వంటి నేత్రములు గల దమయంతియొక్క, చారుస్తనముల్ = సుందరములగు కుచములు, రతి...కలశములు - రతిపంచబాణ=రతిమన్మథు లనెడి, జాయా పతి=దంపతులయొక్క, కేళీ=క్రీడలకుఁ దగిన, సౌధ= మేడలయొక్క, శిఖర= కొనలయొక్క, పర్యంత=ప్రాంతములందు, సమంచిత=ఒప్పుచున్న, కాంచన కలశములు = బంగారుకుండలు అనఁగా గోపురాదులయగ్రములందు విలసిల్లు బంగారుకుండలవలె నొప్పుచున్న వని భావము.

తా. దమయంతిసుందరకుచములు, రతిమన్మథుల సౌధాగ్రములందుఁ బ్ర కాశించు బంగారుకుండలవలెఁ బ్రకాశించుచున్నవి. అలం. రూపకము.

క. ఈసుదతి శిరీషకుసుమ
కేసరసుకుమార దీనిఁ గృతమతి నెమ్మైఁ
జేసెనొకో నలువ కుశా
భ్యాసకఠోరంబు లైనహస్తాబ్జములన్. 15

టీ. ఈసుదతి = ఈదమయంతి, శిరీష...మార—శిరీష = దిరిసెనపువ్వు యొక్క, కేసర=కింజల్కములవలె, సుకుమార=కోమలత్వముకలది. నలువ = బ్రహ్మ, కుశాభ్యాసకఠోరంబులు=దర్భలసంబంధముచేఁ గఠినములైన; హస్తాబ్జ ములన్=హస్తపద్మములచేతను, కృతమతిన్=నిపుణమగుబుద్ధిచే, దీనిన్=ఈ దమయంతిని, ఎమ్మైన్=ఏవిధముగా, చేసెనొకో=నిర్మించెనో.

తా. ఈదమయంతి దిరిసెనపువ్వుకేసరములవలె సుకుమార మయినదేహము కలది. ఇంతసుకుమారమయిన యీ దమయంతిని బ్రహ్మ దర్భలసంబంధముచేఁ గఱకయిన చేతులచే నెట్లు నిర్మించెనో కదా.

క. చనుఁగవ ఘనమో జఘనము
ఘనమో యని నడిమిచక్కిఁ గమిచి విధి గరం
బునఁ దూఁచె దీనిఁ గాకి
ట్లనువుపడునె వళులపేరఁ నంగుళిరేఖల్. 16

టీ. విధి=బ్రహ్మ, చనుఁగవ= స్తనద్వయము, ఘనమో=పెద్దదియో, జఘనము=పిఱుందు, ఘనమో=పెద్దదియో, అని=అని యోజించి, నడిమిచక్కిన్=మధ్యభాగమునందు, కమిచి=గట్టిగాఁబట్టుకొని, కరంబునన్=చేతితో, తూఁచెను=తూఁచియుండవచ్చును, కాక=అట్లు చేతితోఁ దూఁచనిచో, వళులపేరన్=వళులమిషచే, అంగుళిరేఖల్=వ్రేలిజాడలు, అనువుపడునే=సమకూడునా? సమకూడవని భావము.

తా. బ్రహ్మ దమయంతిని సృజించి యామెచనుఁగవ పెద్దదియో జఘనము గొప్పదియో చూడవలెనని దమయంతిమధ్యమును వ్రేళ్లను బట్టి తూఁచెను. అట్లు తూఁచునప్పుడు బ్రహ్మయంగుళు లామెనడుమ నొత్తుకొనుటచే రేఖలు గానవచ్చెను. అవియె వళులవలెఁ బ్రకాశించుచున్నవి. అలం అతిశయోక్తి.

వ. అని ప్రస్తుతించుచుండ ఘంటాపథంబున నేఁగుదెంచి యమ్మచ్చెకంటి తండ్రిపంపునఁ జతురంతయానంబు డిగ్గి భారతీదేవికిఁ బ్రణామంబు చేసిన. 17

టీ. అని, ప్రస్తుతించుచుండఁగా=రాజులు నుతించుచుండఁగా, ఘంటాపథంబునన్=రాజమార్గంబున, ఏఁగుదెంచి=వచ్చి, అమ్మచ్చెకంటి=ఆదమయంతి, తండ్రిపంపునన్=తండ్రియాజ్ఞచేత, చతురంతయానంబు=పల్లకీని, డిగ్గి, భారతీదేవికిన్=సరస్వతికి, ప్రణామంబు చేసినన్=నమస్కరింపఁగా.

క. ఆశాస్యము లెనయనే

కాశీర్వాదంబు లొసఁగి శ్రీ యఖిలేశ్వరి లో
కేశకుటుంబిని శారద
యాశశిబింబాస్యమాళి శ్రీ నక్షత లిడియెన్. 18

టీ. అఖిలేశ్వరి=సమస్తమున కధిపతియును, లోకేశకుటుంబిని = లోకమున కధిపతి యైనబ్రహ్మభార్యయు, అగు,శారద=సరస్వతీదేవి, ఆశాస్యములు=కోరఁదగినవి, ఐనయనేకాశీర్వాదములు=అయినట్టిపెక్కులాశీర్వాదములు, ఒసంగి=ఇచ్చి, ఆశశిబింబాస్యమౌళిన్ = చంద్రబింబమువంటిమొగము గల యాదమయంతియొక్క శిరస్సునందు, అక్షతలు, ఇడియెన్=ఉంచెను.

తా. సకలమున కధిపతియును, బ్రహ్మభార్యయు నగుసరస్వతి యాదమయంతికిఁ గావలసినవరముల నొసంగి యామెశిరస్సుపైని నక్షత లుంచెను.

వ. ఇట్లు దీవించి చతురంతయానం బెక్క ననుజ్ఞ ప్రసాదించి. 19

తే. అవనిపతికన్యచతురంత శ్రీయానమునకు
దక్షిణపుదిక్కునం దుండి శ్రీ దయ దలిర్పఁ
బలికె సనకాదియోగీంద్ర శ్రీభావ్యమాన
చరణపంకజ యైనయా శ్రీసరసిజాక్షి. 20

టీ. సనక ... పంకజ-సనక=సనకుఁడు, ఆది=మొదలుగాఁగల, యోగీంద్ర=యోగీశ్వరులచే, భావ్యమాన=నుతింపఁబడుచున్న, చరణపంకజ=పాదపద్మములు గలది, ఐనయాసారసాక్షి = అయినట్టి పద్మములవంటి నేత్రములు గల సరస్వతి, అవనిపతికన్య=దమయంతియొక్క, చతురంతయానమునకున్=పల్లకీకి, దక్షిపుదిక్కునందున్, ఉండి, దయ=కరుణ, తలిర్పన్ = ఒప్పునట్లుగా, పలికెన్.

తా. సనకాది యోగీశ్వరులచే నుతింపఁబడుచున్నపాదపద్మములు గల సరస్వతి యాదమయంతిపల్లకీకి దక్షిణమునం దుండి యిట్లు పలికెను.

ఉ. తోయజ్యాలి వీరె వేలుపులు శ్రీతూర్పునముప్పదమూఁడుకోటు లీ
యయ్యల వేఱువేఱఁగొని శ్రీయాడఁగఁ బట్టు సహస్రవర్షముల్

నెయ్యా మెలర్ప నిం దొకరికనిక వరియింపఁ దలంచితేని నా
దయ్యము నెత్తికోలు తుదికిఁ దాఁకుట గాదె సరోజలోచనా.

టీ. సరోజలోచనా-సరోజ=పద్మమువంటి, లోచనా= నేత్రములుగల దమయంతీ! తొయ్యలి! తూర్పునన్,వీరె=ఈకనఁబడుచున్నవారే, వేలుపులు=దేవతలు, ముప్పదిమూఁడుకోటులు=ముప్పదిమూఁడుకోటులసంఖ్యగలవారు. ఈయయ్యలన్=ఈదేవతలను, వేఱువేఱన్=ప్రత్యేకముగా,కొనియాడఁగన్=స్తోత్రముచేయుటకు, సహస్రవర్షముల్ = వేయుసంవత్సరంబులు, పట్టున్=కావలసియుండును, ఇందున్=ఈదేవతలందు, ఒకరినిన్=ఒక్కని, నెయ్యము=స్నేహము, ఎలర్పన్=ఒప్పునట్లు-గా, వరియింపన్, తలంచితేని=పెండ్లియాడ నిష్టపడినచో, ఆదైవము నెత్తికోలు=ఆదైవప్రయత్నము, తుదిదాఁకుట కాదె=సమాప్తియగుటయేకదా ? అనఁగా నీదేవతలలో నొక్కనివరించి దైవసంకల్పము సఫలముగావింపు మని భావము.

తా. ఓదమయంతీ! ఈతూర్పుభాగమునం దున్నవారె ముప్పదిమూఁడుకోటుల దేవతలును, ఆదేవతలచరిత్రములను జెప్పుటకు వేయువత్సరంబులు పట్టును. ఈదేవతలలో నీ వొక్కరిని బెండ్లియాడెదేని యాదైవసంకల్పము నెఱవేఱుటే చుమా.

క. సంతానవాటికలునుం
జింతామణివేదికలును సిద్ధరసధునీ
సంతానంబులు వీరికిఁ
గాంతా విశ్రాంతికౌతుకస్థానంబుల్. 22

టీ. కాంతా=ఓదమయంతీ! సంతానవాటికలునున్ = కల్పవృక్షవనవీథులును, చింతామణి వేదికలును=చింతామణిమయము లయినయరుఁగులును, సిద్ధరసధునీ సంతానంబులు=మనోరథములను సమకూర్పఁజాలిన రసప్రవాహముల సమూహములును, వీరికిన్=ఈదేవతలకు, విశ్రాంతి కౌతుకస్థానంబుల్ = విశ్రమస్థానములును క్రీడాస్థలములునై యున్నవి. వీరిలో నొకని వరింతువేని మానవులకు దుర్లభములగు నిట్టిస్థలములందు విహరింపఁగలవని భావము.

తా. ఓదమయంతీ! ఈదేవతలకుఁ గల్పవృక్షవనవీథులును, చింతామణిమయము లయినయరుఁగులును, సిద్ధరసముతోనిండిన నదులును గలవు. నీవు వీరిలోనొకని వరింతువేని యట్టిపుణ్యస్థలములందు విహరించుభాగ్యము కలుగును.

క. అనిమిషత నిన్నుఁ జూడఁగ
నినుమడి యగు నట్టు లొకని కీవేల్పులలో
విను మమృతాస్వాదనమును
నినుమడి యగుఁగాక యధర మీ నొసఁగంగన్. 23

టీ. ఈవేల్పులలోన్ = ఈదేవతలలో, ఒకనికిన్ = ఒకదేవతకు, నిన్నున్, చూడఁగన్ = చూచుటచే, అనిమిషత = రెప్పవాల్పకుండుట, ఇనుమడి=ద్విగుణము, అగున్, అనఁగా మొదటనే రెప్పపాటు వారికిలేదు. ఆపైని దమయంతిని రెప్పవాల్పకుండఁ జూచుటచే నాయనిమిషత్వము రెండింత లగునని భావము. అట్టులు=ఆరీతిగానే, అధరము=అధరామృతమును, ఈవు, ఒసఁగంగన్ = ఇయ్యఁగా, అమృతాస్వాదనమును = అమృతపానమును, ఇనుమడియగుఁగాక=రెండురెట్లధికమగుఁగాక, అనఁగా దేవతలు మొదట మోహినియిచ్చినయమృతము గ్రావిరి. ఇప్పుడు నీవు దేవతలలో నొకని వరించితి వేని యాదేవతకు నీ విచ్చినయధరామృతమును గ్రావుటచే నమృతాస్వాదనము గూడ నినుమడించును. అలం. అతిశయోక్తి.

తా. ఓదమయంతీ! ఈదేవతలు నిన్నుఁ జూచుటచే రెట్టించినయనిమిషత్వము గలవారగుచున్నారు. ఇప్పుడు నీవు వీరిలో నెవరి నేని వరించి యధరామృతమును నిత్తువేని యమృతాస్వాదనముగూడ రెండురెట్లు గలవారలగుచున్నారు.

వ. అనిన విని యబ్బాల కేలుదోయి మొగిడ్చి ఫాలంబునం గీలుకొలిపి వేలుపులకు వందనం బాచరించె నప్పుడు శిబికాధరస్థు లగుపురుషులు సమాసన్ననాయకముఖవిషాదానుమేయం బగుదమయంతీమనోవిరాగం బెఱింగి ప్రావృషేణ్యపయోవాహంబులు రాజహంసావలిం బల్వలాంతరంబులవలనం

బాపి మానససరోవరంబునుంబోలె మాంజిష్ఠమంజిమవి
గాహిపదోష్ఠలక్ష్మి యగునయ్యంగన భుజంగపుంగవుఁ గదియం
గొనివచ్చిరి. కంజభవుభామయు నప్పద్మదళాక్షికిం బన్న
గాధ్యక్షునిం జూపి యిట్లనియె. 24

టీ. అనినన్ =సరస్వతి యట్లు పలుకఁగా, విని, అబ్బాల= ఆదమయంతి, కేలుదోయి=హస్తద్వంద్వమును, మొగిడ్చి=ముకుళించి, ఫాలంబునన్ =నుదుటి యందు, కీలుకొలిపి=ఉంచి, వేలుపులకున్ =దేవతలకు, వందనంబుఆచరించెన్ = నమస్కరించెను, అప్పుడు=ఆసమయమందు, శిబికాధరస్థులు=పల్లకికిఁ గ్రిందు గానున్నవారలు, అగుపురుషులు=అయినపురుషులు, సమాసన్న... మేయంబు- సమాసన్న=సమీపమున నున్న, నాయక=నాయకులయొక్క, ముఖ=ముఖము లందున్న, విషాద=విచారముచే, అనుమేయంబు=ఊహింపఁదగినది, అగు ద మయంతి మనోవిరాగంబు=అయినట్టి దమయంతి వైరాగ్యంబును, ఎటింగి, ప్రా వృషేణ్య పయోవాహంబులు=వర్షాకాల మేఘములు, రాజహంసావళిన్ =రాజ హంసల పంక్తిని, పల్వలాంతరంబులవలనన్ =అల్పసరస్సుల నడిమిప్రదేశముల నుండి, పాపి=తొలఁగించి, మానససరోవరంబునుంబోలెన్ =మానస మను పేరు గలసరోవరమునుం బోలె, మాంజిష్ఠ...లక్ష్మి-మాంజిష్ఠ=మిక్కిలి యెఱుపుగల పచ్చనివన్నె గలవస్త్రిముయొక్క, మంజిమ=సౌందర్యమును, విగాహి=పొం దుచున్న, పద=కాళ్లును, ఓష్ఠలక్ష్మి=ఓష్ఠసంపదయుఁ గలది - ఈవిశేషణము కాళ్లును ముక్కును నెఱ్ఱగానుండు రాజహంసలకును సమము - అగు అయ్యంగ నన్ =ఆదమయంతిని, భుజంగపుంగవున్ = సర్పశ్రేష్ఠుని, కదియన్ =సమీపిం చునట్లు, కొనివచ్చిరి. కంజభవుభామయున్ =బ్రహ్మభార్యయయిన సరస్వతి యును, అప్పద్మదళాక్షికిన్ =పద్మదళములవంటి నేత్రములుగల ఆదమయం తికి, పన్నగాధ్యక్షునిన్ =సర్పరాజును, చూపి, ఇట్లు, అనియెన్.

క. పరిరంభలగ్నగిరిజా

సురుచిరకుచఘుసృణపట్టసూత్రాంకముతోఁ

దరళాక్షి వీఁడు చంద్రా
భరణునకుఁ బ్రహ్మసూత్రపదవి భజించెన్.      25

టీ. తరళాక్షి=చలించు నేత్రములుగల దమయంతీ! పరిరంభ...సూత్రాంకములతోన్-పరిరంభ=కౌఁగిలించుకొనుటయందు, లగ్న=సక్తమయిన, గిరిజా=పార్వతియొక్క, సురుచిర = మిక్కిలి సుందరమైన, కుచ= స్తనములందున్న, ఘుసృణ=కుంకుమమనెడి, పట్టసూత్ర = పట్టునూలియొక్క, అంకములతోన్ = చిహ్నములతో, వీఁడు=ఈసర్పరాజు, చంద్రాభరణునకున్=చంద్రుని శిరోభూషణముగాఁగల శంకరునియొక్క కంఠమునందు, బ్రహ్మసూత్రపదవిన్= యజ్ఞోపవీతత్వమును, భజించెన్=పొందెను. అనఁగా నీశ్వరునకు యజ్ఞోపవీతమై యున్నాఁడని భావము. పార్వతి స్తనకుంకుమము తగులుటచే పట్టునూలి పోఁగులఁ బెనఁగిన జందెమువలె నున్నాఁడనుట.

తా. ఓదమయంతీ! కౌఁగిలించుకొనుటచే సక్తమైన పార్వతియొక్క సుందరకుచములందున్న కుంకుమముగల పట్టునూలియొక్క చిహ్నములతో, వీఁడు శంకరునకు యజ్ఞోపవీతమైయున్నాఁడు. అలం. రూపకము.

తే. పాణికంకణమై యోగపట్ట మయ్యె
గంధగజయాన కోటీరబంధ మయ్యె
వింటికిని నారి యై పెక్కువిధములందు
భూతభర్త భజించు నీభుజగవిభుఁడు.      26

టీ. గంధగజయాన=గంధజాతి యేనుఁగుయొక్క గమనమువంటి గమనముగల దమయంతీ! ఈభుజగవిభుఁడు = ఈసర్పరాజు, పాణికంకణమై=చేతికడియమై, యోగపట్టమయ్యె=యోగపట్టెయయ్యెను, కోటీరబంధము అయ్యెన్ =జటలనుగట్టెడు త్రాడయ్యెను, వింటికిని నారియై, పెక్కువిధములందు = పెక్కురీతులచేత, భూతభర్తన్=శంకరుని, భజించున్ = సేవించును.

తా. ఓదమయంతీ! ఈసర్పరాజీశ్వరునకుఁ జేతికడియ మగుటయందును, యోగపట్ట మగుటయందును, జటలకుఁ గట్టుత్రాడగుటయందును, వింటికి నారి యగుటయందును, వరించుచు నాశంకరుని సేవించుచున్నాఁడు.

తే. హరజటాజూటచంద్రరేఖామృతంబు
నబల ! నీ దగుదంతచ్ఛదామృతంబు
సమముగా రెండుజిహ్వలఁ జవులు చూచి
నేర్చుఁబో వీఁడు చవి వాసి నిశ్చయింప. 27

టీ. అబల=ఓదమయంతి ! వీఁడు=ఈసర్పరాజు, హర...మృతంబున్-హర=ఈశ్వరునియొక్క, జటాజూట=జటాభారమునం దున్న, చంద్రరేఖ=బాలచంద్రునం దున్న, అమృతంబును, నీది, అగు...తంబున్ = అయిన అధరోష్ఠమునందలి యమృతమును, సమముగాన్, రెండుజిహ్వలన్=రెండునాలుకలచేతను, చవులు=రుచులను, చూచి=ఆస్వాదించి, చవివాసిన్ = రుచియొక్క తారతమ్యమును, నిశ్చయింపన్=నిర్ణయించుటకు, నేర్చుఁబో=సమర్థుఁడగును జుమా? అనఁగా నోదమయంతీ ! వీఁడు చంద్రరేఖయందున్న యమృతమే మధురముగా నుండునో, నీయధరామృతమే యెక్కువమధురముగా నున్నదియో రెండునాలుకలచే రెండింటి నొక్కమాఱే చవిచూచి నిశ్చయించి చెప్పఁగలఁడు. ఇట్టిసామర్థ్యము మఱియొకనికి లభింపదు. కావున నితని తప్పక వరింపవలసినదనిభావము.

తా. స్పష్టము.

ఉ. భావజకేళివైభవముపట్టున నీచిగురాకుమోవి యా
శీవిషనాయకుం డితఁడు సేవ యొనర్చు టనర్థకారి కా
దోవనజాక్షి ! యయ్యమృతముున్నది నీయధరంబులోన నే
లా వెఱవన్ సుధారసమునందు, విషంబు పరిస్ఫురించునే.28

టీ. ఓవనజాక్షి=పద్మములవంటి నేత్రములు కలదమయంతీ ! ఇతఁడు=ఈ, ఆశీవిషనాయకుండు = కోఱయందు విషము గలసర్పముల కధిపతి, అనఁగా సర్పరాజనుట, భావజకేళివైభవము పట్టునన్=మన్మథకేళి సమయమునందు, నీచిగురాకుమోవిన్=పల్లవమువంటి నీయధరోష్ఠమును, సేవ యొనర్చుట=పానము చేయుట, అనర్థకారి కాదు... నీయధరంబులో

నన్ =నీపెదవియందు, అయ్యమృతము, ఉన్నది, వెఱవన్ = భయపడుటకు, ఏలా=ఏమియవసరము, సుధారసమునందున్ =అమృతమునందు, విషంబు, పరిస్ఫురించునే=తెలియవచ్చునా? లేక, శక్తిగలిగియుండునా? అనఁగా నుండదనుట.

తా. ఓదమయంతీ! కోఱయందు విషముగలవాఁ డయినను నితఁడు సంభోగమునందు నీ యధరపానము చేసినప్పటికి నపాయము కలిగింపదు. నీయధరమునం దమృతమున్నదికాన నెంతమాత్రమును భయపడకుము. ఏమనఁగా నమృతమునందు విషమెంతమాత్రమును స్ఫురింపదు. అలం. పరికరము. కావ్యలింగము. విరోధము.

చ. ఫణఫలకంబు విచ్చి కడుఁ బ్రన్ననిమే నెగయంగఁ జేయుచు
న్మణిమయపీఠమధ్యమునఁ నాల్కలు గ్రోయుచు నున్నవాసు
కిన్, ఫణికులసార్వభౌముఁ గని భామినిమైఁ బులకించుభా
వుకుల్, ప్రణయవికారమో భయముభంగియొ యంచు మ
దిం దలంపఁగన్. 29

టీ. భామిని=దమయంతి, ఫణఫలకంబున్ =పలకవంటి పడగను, విచ్చి=విప్పి, కడున్ =మిక్కిలి, ప్రన్ననిమేను=మృదులమైన దేహమును, ఎగయంగన్ =ఎగురునట్లుగా, చేయుచున్, నాల్కలు, క్రోయుచున్ =ఆడించుచు, లేక, విషమముగాఁ జాఁచుచు, మణిమయపీఠమధ్యమునన్ = రత్న పీఠముయొక్క మధ్యభాగమునందు, ఉన్నవాసుకిన్, ఫణికులసార్వభౌమున్ =సర్పరాజును, కని, భావుకుల్ =అభిప్రాయమును దెలిసికొనువారు, ప్రణయవికారమో=సర్పరాజునుజూచి మోహించుటచేతనే యట్లు శరీరము పులకిత మగుచున్నదియో, భయము భంగియొ=సర్పరాజును జూచుటవలనఁ గలిగినభయముచేతనే శరీరమును బులకితమగునట్లు చేయుచున్నదో, అంచున్, మదిన్, తలంపఁగన్ =ఆలోచించునట్లగా, మైన్ =శరీరమును, పులకించున్ =గగ్గురుపాటు గలుగునట్లు చేయును.

తా. పడగవిప్పి మిక్కిలి మృదు... దేహ... మెగయునట్లు చేయుచు,

నాలుకలను విషమముగాఁ జేయుచు,రత్నపీఠమందుఁ గూర్చుండియుండినసర్ప రాజయిన వాసుకిని జూచి దమయంతి పులకితశరీర యయ్యెను. ఆ మెయభి ప్రాయమును దెలియఁగోరువారు దమయంతి ప్రణయవికారముచేత నే పుల కలుగలదయ్యెనో, లేక భయముచేత నే పులకలుగలదయ్యెనో యని యూహిం పఁజొచ్చిరి.

తే. తమ్ము వరియింప కునికి దీర్ఘమ్ము రోఁజు
నహులఁ ద్రేఁకించి నడచిరి యానధరులు
దీర్ఘ నిశ్వాసధారాప్రతీపపవన
వికటహాహానినాదావశకునశంక. 30

టీ. తమ్ముఁ, వరియింపక ఉనికిఁ=తమ్మును వరింపక పోవుటచేత, దీర్ఘమ్ము రోఁజునహులఁ=నిట్టూర్పుపుచ్చుచున్న సర్పములను,త్రేఁకించి=తప్పించి,యాన ధరులు=పల్లకిని ధరించువారలు, దీర్ఘ...శంక-దీర్ఘనిశ్వాసధారా=నిట్టూర్పు ప్రవాహమనెడి, ప్రతీపపవన=ప్రతికూలవాయువును, వికట=వికారములయిన, హాహానినాద=హాహాకారములు ననెడి, అవశకునశంకఁ=దుశ్శకునము గలుగు ననెడి భయముచే, నడచిరి=సర్పముల విడిచిపోయిరి. అనఁగా శుభమును గూ ర్చి ప్రయత్నించునపుడు ప్రతికూల వాయువును, హాహాకారములును, దుశ్శకు నములని పలుకుదురు. దమయంతి తమ్ము వరింపకపోవుటచే విడిచెడి నిట్టూర్పు వాయువులును, దుఃఖసూచకమయిన హాహాకారములును దుశ్శకునములు గావున నట్టి దుశ్శకునములను దొలంగించికొనిపోయిరి అని భావము. అలం రూపకము, ఉత్ప్రేక్ష.

తా. దమయంతి సర్పరాజులను వరింపకపోవుటచే వారు నిట్టూర్పులనుబు చ్చుచు హాహాకారములను జేసిరి. ప్రతికూలముగా వచ్చునిట్టూర్పువాయువులను హాహాకారములను గాంచి యవి దుశ్శకునములని తలంచి పల్లకిని మోయువార లు వానిని దొలంగించుకొనునిమిత్తము సర్పరాజులను దప్పించికొనిపోయిరి.

తే. ప్రకటమందాక్షసంకుచత్పక్ష్మము లైన
యురగములమొదుఁ బాపి యక్షియుగ్మలాక్షి

యానధుర్యులు గదియించి రవనిభుజులఁ
గాల నళిఁ దమ్మిఁ బాపి చెంగలువఁ బోలె.  31

టీ. యానధుర్యులు=పల్లకిని మోయువారలు, అయ్యుత్పలాక్షిన్=కలువల వంటి నేత్రములుగల దమయంతిని, ప్రకట...ఫణము-ప్రకట=స్పష్టమయిన, మందాక్ష=సిగ్గుచే, సంకుచత్=ముడుఁచుకొనియున్న, ఫణములు = పడగలు గలవి, ఐనయురగములయొద్దు=అయినట్టిసర్పరాజులయొక్కయొద్దను, పాపి=తొలఁగించి, కాలను, అళిన్=తుమ్మెదను, తమ్మిన్=పద్మమును, పాపి=తొలఁగించి, చెంగలువన్ పోలెన్=కలువనుబోలెను, అవనిభుజులన్=రాజులను, కదియించిరి=సమీపింపఁజేసిరి.

తా. కాలను తుమ్మెదను బద్మమునుండి తొలఁగించి చెంగలువను జేర్చినట్లు యానధుర్యులు సిగ్గుచేతఁ బడగలను సంకోచించుకొని యున్నసర్పములనుండి దమయంతిని దొలఁగించి రాజులకడకుఁ దెచ్చిరి.

వ. అప్పుడు పలుకుబోటి వరాటరాజకన్యం గనుఁగొని.  32

టీ. స్పష్టము.

ఉ. ధీరతఁ బుష్కరాదు లగుదీవుల నన్నిటనుండి వచ్చి యు
న్నా రిదె శీతభానుఇనవనాయకవంశజు లైనరాజబృం
దారకు లిమ్మహారథులఁ దప్పక యిందఱిఁ జూడవమ్మ శృం
గారరసైకసర్గరసికద్వ్యణుకోదరి యాదరంబునన్.  33

టీ. శృంగారరసైకసర్గరసికద్వ్యణుకోదరి...శృంగారరస+ఏక=కేవలము శృంగారరసమునే, సర్గ=నిర్మించుటయందు, రసిక=ప్రీతిగలదియు, ద్వ్యణుక=ద్వ్యణుకమువలెఁ గృశించిన, ఉదరి=మధ్యముగల యోదమయంతీ! పుష్కరాదులు=పుష్కరము మొదలగునవి, అగుదీవుల నన్నిటనుండి=అయినట్టి ద్వీపములనుండి, ధీరతన్=ధైర్యముచే, శీత...శజులు=చంద్రసూర్యవంశమందుఁబుట్టినవారు, ఐనరాజబృందారకులు=ఐనట్టి రూపవంతులగురాజులు, ఇదె=ఇదిగో, వచ్చియున్నారు = వచ్చియున్నవారు, ఆదరంబునన్ = ప్రేమతో, ఇమ్మహారథులన్=ఈశూరులను, తప్పక, ఇందఱిన్, చూడుము+అమ్మ.

తా. ఓదమయంతీ! సూర్యచంద్ర వంశములందుఁ బుట్టిన రాజశ్రేష్ఠులు పుష్కరము మొదలగుద్వీపములనుండి ధైర్యముచే వచ్చియున్నారు. నీ వాదరంబుతో వీరినందఱను దప్పక చూడుము. అలం. రూపకము.

తే. తరుణి నిస్తంద్రపుష్కరదళనిభాక్షి
పుష్కరద్వీప మేలు నీభూభుజుండు
నిర్మలస్వాదుసలిలాంబునిధివిహార
మమరు నీతండు నీవును నాచరింప. 34

టీ. తరుణి, నిస్తంద్ర... భాక్షి-నిస్తంద్ర=వికసించిన, పుష్కర=పద్మము యొక్క, దళ=రేకులవంటి, అక్షి = నేత్రములుగల దమయంతీ! ఈభూభుజుండు=ఈరాజు, పుష్కరద్వీపమును, ఏలుక్=పాలించువాఁడు. నీవును, ఈతండును, ఆచరింపక్=చేయఁగా, నిర్మల... విహారము-నిర్మల=స్వచ్ఛమైన, స్వాదుసలిలాంబునిధి=మంచినీళ్లసముద్రమునందు, విహారము=విహరించుట, అమరుక్=ఒప్పును, అనఁగా నీరాజును నీవు వరించినచో మంచినీళ్లసముద్రమునందు విహరించు భాగ్యము నీకు లభించు నని భావము. 'అతివ యీతండు నీవును నాచరింపు' మని పాఠాం. నీవును ఇంతఁడును నావిహారమును గావింపుఁ డని యర్థము.

తా. వికసించిన పద్మముయొక్క దళమువంటి నేత్రములు గల దమయంతీ! ఈరాజు పుష్కరద్వీపమును బరిపాలించువాఁడు. నీ వీతని వరింతువేని యీనిద్వీపమునకు సమీపముననున్న మంచినీళ్లసముద్రమందు విహరించు భాగ్యము కలుగును.

క. భౌమ మగునాకభవనము
భామిని సావర్తభావశోభ వదద్భుతనా
భీమండల యీనృపసు
త్రాముఁడు పాలించుదీవి ప్రథితవిభూతిన్. 35

టీ. సావర్త... మండల-సావర్తభావ=సుడియొక్క దర్శనముచే, భవత్=

అగుచున్న, అద్భుత = ఆశ్చర్యము గల, నాభీమండల = చక్రమువంటి నాభి గల, భామిని = ఓదమయంతీ! సలక్షణమై గంభీరమగు నాభికూపము గలది యనిభావము. ఈనృపసుత్రాముఁడు = ఈరాజదేవేంద్రుండు, పాలించుదీవి= పరిపాలించుద్వీపము, ప్రథితవిభూతిన్ = ప్రసిద్ధమగు నైశ్వర్యముచే, భూపము=భూలోకమందున్నది, అగునాకభవనము=ఐనట్టి స్వర్గలోకము. అనఁగాఁ బుష్కరద్వీపము భూతలస్వర్గమువలె నున్న దనిభావము. రాజును సుత్రాముని వంటివాఁ డనుటచే నతనిదీవిని స్వర్గమువంటి దనుట తెలియునది.

తా. ఓదమయంతీ! ఈరాజదేవేంద్రుండు పరిపాలించుచున్న ద్వీపము సమస్తైశ్వర్యములు కలదై భూతలస్వర్గమువలె నున్నది.

శా. అందుండున్ హిమవారిశీతలతలన్యగ్రోధవీథిన్ శతా
నందుం డంబుజదివ్యమందిరములోనం గర్ణికాపీఠికన్
సందర్శింపఁగ వచ్చి యున్ననిను నాసర్వేశుఁ డీక్షించి యా
నందంబు న్మది నొందుఁగాక నిజనానాశిల్పవైచిత్రికిన్. 36

టీ. అందున్ = అపుష్కరద్వీపమందు, హిమ...వీథిన్—హిమవారి = మంచునీటిచే, శీతల=చల్లని, తల=క్రిందుప్రదేశముగల, న్యగ్రోధ=మఱ్ఱిచెట్టు యొక్క, వీథిన్ =ప్రదేశమందు, శతానందుండు=బ్రహ్మ, అంబుజ...లోనన్ = అంబుజ=పద్మమనెడి, దివ్యమందిరములోనన్ =సుందరగృహములోనున్న, కర్ణికాపీఠికన్ =కర్ణిక యనెడి పీఠమునందు, ఉండున్ = నివసించును, సందర్శింపఁగన్ =చూచుటకు, వచ్చి, ఉన్ననినున్ =ఉన్నట్టి నిన్నును, ఆసర్వేశుఁడు = ఆబ్రహ్మ, ఈక్షించి=చూచి,నిజనానాశిల్పవైచిత్రికిన్-నిజ=తనసంబంధియగు, నానా=అనేకవిధములయిన, శిల్ప=సృష్టియొక్క, వైచిత్రికిన్ = ఆశ్చర్యమునకు, మదిన్ =మనస్సునందు, ఆనందంబున్ =సంతసమును, ఒందుఁగాక=చెందునుగాక, అనఁగా నాబ్రహ్మ తనచే సృజింపఁబడిన నీసౌందర్యమును, నీవు నీ కనుకూలుఁ డగుభర్తనుబొంది యానందము నొందుటను, జూచి తనసృష్టిలో నతిసౌందర్యము ననుకూలదాంపత్యము ఘటించినందుల కమితానందము చెందు ననిభావము. ఈచెప్పుటచే వటవృక్షమాద్వీపమునకు సమీపమున నుండుననియు,

నచ్చట నే విష్ణువును, నతనినాభియందుఁ బద్మమును నందు బ్రహ్మయును నుండు ననియుఁ దోఁచుచున్నది. నీవీతని వరించి బ్రహ్మకుసైతమానందము గొలుపునట్టి దాంపత్యమును వహింపుమని భావము.

తా. ఓదమయంతీ! ఆపుష్కరద్వీపమందు చల్లనిఛాయ నొసంగెడి మఱ్ఱిచెట్టు గలదు. అచ్చటనున్న పద్మమనెడి గృహమునం దున్న కర్ణికాపీఠమున బ్రహ్మ నివసించును. అతఁడు తన్నుఁ జూడవచ్చిననిన్నుఁ జూచి, యనుకూలుఁ డయిన భర్తతో నచ్చట వసించినందులకును, తనసృష్టిలో నినుబోఁటి సౌందర్యవతియు ననుకూలదాంపత్యము నలవడినందులకును మనంబున నానందమును జెందును గాక.

క. ఆవటమహీరుహం బా
దీవికి ఫలపత్రచిత్రదీప్తిస్ఫురణన్
భూవల్లభవరనందన
భావింపఁగఁ బించెగొడుగుభంగి భజించున్. 37

టీ. భూవల్లభవరనందన = రాజకుమారికవయిన యోదమయంతీ! భావింపఁగన్ = ఆలోచింపఁగా, ఆవటమహీరుహంబు = ఆమఱ్ఱిచెట్టు, ఫలపత్రచిత్రదీప్తిస్ఫురణన్ — ఫల = పండ్లయొక్కయు, పత్ర = ఆకులయొక్కయు, చిత్రదీప్తి = విచిత్రకాంతులయొక్క, స్ఫురణన్ = అతిశయముచే, ఆదీవికిన్ = ఆపుష్కరద్వీపమునకు, పించెగొడుగుభంగిన్ = నెమలిపురితోఁ జేయఁబడిన గొడుగువిధమును, భజించున్ = పొందును. అనఁగా ఫలపత్రములతోఁ గూడినయామఱ్ఱిచెట్టాద్వీపమునకు నెమిలిపురితోఁ జేసినగొడుగువలెఁ దనర్చును; ఇట్టివిశేషములు గల పుష్కరద్వీపమున కధిపతి యగు నీతని వరించుట మేలని భావము.

తా. ఓదమయంతీ! చిత్రకాంతులు గల ఫలపత్రాదులతోఁ గూడినయామఱ్ఱిచెట్టాద్వీపమునకుఁ బించెగొడుగువలె నొప్పుచున్నది. అలం. ఉత్ప్రేక్ష.

వ. అని పలికి, భ్రూవల్లరీవేల్లనవికారంబు చూచి యప్పల్లవాధర యతని నొల్లమి యెఱింగి యదివ్యాంగనాతిలకంబు. 38

టీ. అని=ఈరీతిగా, పలికి=పుష్కరద్వీపాధిపతినిగూర్చి చెప్పి, భూ్రి... వికారంబున్ —భ్రూవల్లరీ = కనుబొమతీఁగయొక్క, వేల్లనవికారంబు=చలించిన మాఱుపాటును, చూచి, అప్పల్లవాధర = చిగురువంటిపెదవి గల దమయంతి, అతనిన్=ఆరాజును, ఒల్లమిన్ = వరింపకుండుటను, ఎఱింగి= తెలిసికొని, అద్రివ్యాంగనాతిలకంబు=ఆదేవతాస్త్రీలలో శ్రేష్ఠురాలగు సరస్వతి, అని పైపద్యముతోనన్వయము.

తే. లలన పొమ్మవ్వలికి నని పలుకుటయును
పుష్కరద్వీపపతి యాస్యపుష్కరమునఁ
దదనవాప్తిజఘనపరితాపవహ్ని
చిహ్న మగుకార్ష్ణ్యధూమ మీక్షింపఁబడియె.	39

టీ. లలన=దమయంతి, అవ్వలికిన్=మఱియొకరాజునొద్దకు, పొమ్ము, అని పలుకుటయును=అని పలుకఁగానే, పుష్కర...పుష్కరమునన్—పుష్కర=ద్వీపాధిపతియొక్క ముఖపద్మమందు, తత్...చిహ్నము-తత్ = ఆదమయంతిని, అనవాప్తి = పొందలేకపోవుటచే, పుట్టిన, ఘన = గొప్ప,పరితాప= సంతాపమనెడి, వహ్ని = అగ్నిహోత్రమునకు, చిహ్నము = లక్షణమైనది, అగుకార్ష్ణ్యధూమము= అయినట్టి నల్లఁదనమనెడి పొగ, ఈక్షింపఁబడియెన్= చూడఁబడెను. అనఁగాఁ దమయంతి తన్ను విడిచిపోయినతోడనే యారాజు మొగము కాంతిహీనమయి వెలవెలఁబోయె నని భావము. అలం. రూపకము.

తా. సరస్వతి దమయంతిని జూచి "మఱియొకరాజును జూడఁబొ"మ్మని చెప్పినతోడనే దమయంతి తన్ను వరింపలేదుగదా యన్నవిచారముచే నాతని మొగము కాంతిహీన మయినది.

క. రాజాంతరాభిముఖ మా
రాజముఖి విమానవాహరయమునఁ జనియెన్
రాజీవగర్భగేహిని
భోజకులాభరణ మైనపొలఁతుకతోడన్.	40

టీ. ఆరాజముఖి=చంద్రునివంటి మొగముగల యాదమయంతి, విమానవాహరయమునన్ - విమానవాహ = పల్లకిని మోయువారియొక్క, రయమునన్ = వేగముచేత, రాజాంతరాభిముఖము = మఱియొకరాజున కభిముఖముగా, చనియెన్ = వెళ్లెను, రాజీవగర్భ గేహిని = బ్రహ్మభార్య యగుసరస్వతి, భోజకులాభరణము = భోజవంశమునకు నలంకారము, ఐనపాలఁతుకతోడన్ = అయినట్టి దమయంతితో, అని పైదానితో నన్వయము.

తా. దమయంతి మఱియొకరాజును జూడఁబోవఁగాఁ జూచి సరస్వతి భోజవంశమున కలంకార మగుదమయంతితో.

వ. ఒక్కరాజుం జూపి యి ట్లనియె. 41

క. ఏకాతపవారణముగ
శాకద్వీపాంతరంబు సర్వముఁ బుణ్య
శ్లోకుఁ డితఁడు పాలించు ని
శాకరముఖ! హవ్యుఁ డండ్రు జనపతి నితనిన్. 42

టీ. నిశాకరముఖి=చంద్రునివంటి ముఖముగల దమయంతీ! పుణ్యశ్లోకుఁడు=పవిత్రమగు కీర్తిగల, ఇతఁడు = ఈరాజు, శాకద్వీపాంతరంబు=శాకద్వీపమునకు మధ్యమునందున్న, సర్వమున్ = సమస్తభూమిని, ఏకాతపవారణముగన్ =ఏకచ్ఛత్రాధికారముగా, పాలించున్ = పరిపాలించును, జనపతిన్ - ఇతనిన్ = ఈరాజును, హవ్యుఁడు=హవ్యుఁడనునామము గలవాఁడని, అండ్రు= పలుకుదురు.

తా. ఓదమయంతీ! పవిత్రకీర్తి గలయీరాజు శాకద్వీపము నంతటిని నేకచ్ఛత్రముగాఁ బాలించును. ఇతని హవ్యుఁ డని పిలుచుచుందురు.

క. రమణి! రమణీయతనుతా
వమతాతను నతనుకీర్తి వైభవు నితనిన్
గమల గమలాత్మఁబోలెన్
బ్రమదం బారఁగ వరింపు పరికించి తగన్. 43

టీ. రమణి=ఓదమయంతీ! రమణీ...తనుర్-రమణీయ=సుందరమైన, తను తా=శరీరము గలవాఁడగుటచే, అవమత=అవమానింపఁబడిన, అతనుర్=మన్మథుఁడు గలవాఁడును, అతనుకీర్తివైభవుర్-అతను=విస్తారమైన, కీర్తివైభవుర్=కీర్తిసంపదగలవాఁడును, నగునితనిర్ = ఈరాజును, కమల=లక్ష్మి, కమలాక్షుఁ బోలెర్=విష్ణుమూర్తినిబోలెను, ప్రమదంబు=సంతోషము, ఆరఁగర్ = నిండునట్లుగా, తగర్, పరికించి=ఆలోచించి, వరింపు=పెండ్లియాడుము.

తా. ఓదమయంతీ! విస్తారమయినకీర్తి గలిగి సుందరశరీరముచే మన్మథునిఁ దిరస్కరించుచున్న యీరాజకుమారుని, లక్ష్మి నారాయణునింబోలె, సంతోషాతిశయముచే వరింపుము.

తే. వీనిఁ గులశీలశాలి శాలీనతాన
తంబు నాననచంద్రబింబంబు నెత్తి
బాల వీక్షింపు మేచకోత్పలపలాశ
మాలికలఁ బోలులలితదృగ్జాలకముల. 44

టీ. బాల=ఓదమయంతీ! శాలీనతానతంబు=లజ్జచే వంపఁబడిన, ఆననచంద్రబింబంబుర్ = ముఖచంద్రబింబమును, ఎత్తి, మేచక...మాలికలర్-మేచక=నల్లని,ఉత్పల=కలువలయొక్క,పలాశ =రేకులయొక్క, మాలికలర్=దండలను, పోలు...జాలకములర్=పోలుచున్న సుందరమగు చూపులపంక్తులచేత, కుల శీలర్ = మంచికులముచేతను మంచిప్రవర్తనముచేతను, శాలిర్=ఒప్పుచున్న, వీనిర్=ఈరాజకుమారుని, వీక్షింపుము=చూడుము.

తా. ఓదమయంతీ ! నీవు ముఖచంద్రబింబము నెత్తి నల్లఁగలువరేకుల పంక్తులను బోలినచూపులపంక్తులచేఁ గులశీలములచే నొప్పుచున్న యీరాజకుమారుని వీక్షింపుము.

సీ. అతినిర్జరేశ్వరంబై యనశ్వరమైన
యైశ్వర్యమున రాజ్య మనుభవింపు
చంచచ్ఛుకచ్ఛదచ్ఛాయాశ్రయం బగు

శాకవృక్షమునీడఁ జలుపు క్రీడ
పాలమున్నీటిలోఁ ఫణిరాజశయ్యపైఁ
బవ్వళించినశార్ఙ్గపాణిఁ గొలువు
పొడుపుగుబ్బలిమీఁదఁ బూర్ణిమారాత్రులం
దొనరింపు చంద్రాతపోత్సవంబు

తే. లలఘుసైనికసంఖ్యసంఖ్యాగ్రవిజిత
దానవానీకుఁ డయినయాధరణివిభుని
లలితసౌభాగ్యరేఖాకళావిలాస
శక్తి భర్త్సితమత్స్యలాంఛనునిఁ గూడి. 45

టీ. అలఘుసైనికసంఖ్యన్ -అలఘు=బలిష్ఠులైన, సైనిక=సైనికులయొక్క, సంఖ్యన్ =సంఖ్యచేత, సంఖ్యాగ్ర... నీకుఁడు- సంఖ్యాగ్ర= యుద్ధభూమియొక్క యెదుట, విజిత = జయింపఁబడిన, దానవానీకుఁడు = రాక్షససమూహములు గలవాఁడు,అయినయాధరణివిభునిన్ =ఐనట్టియీరాజును,లలిత...లాంఛనునిన్ -లలిత=మనోహరమయిన, సౌభాగ్యరేఖా=సౌందర్యరేఖయొక్క, కళావిలాసశక్తిన్ =కాంతిలీలయొక్క సామర్థ్యముచేత, భర్త్సిత=తిరస్కరింపఁబడిన, మత్స్యలాంఛనునిన్ =మన్మథుని, కూడి, అనఁగా సౌందర్యముచే మన్మథుని మించుచున్న యీరాజకుమారుని వరించియనుట, అతినిర్జరేశ్వరంబు, ఐ= ఇంద్రు నతిక్రమించుచున్నదై, అనశ్వరంబు=నాశనములేనిది, ఐనదైశ్వర్యమునన్ = ఐనట్టి సంపదచే, రాజ్యము, అనుభవింపు = పరిపాలింపుము, చంచత్ ... యాశ్రయంబు - చంచత్ = ప్రకాశించుచున్న, శుక=చిలుకయొక్క, ఛద=రెక్కలయొక్క, ఛాయా=కాంతివంటికాంతికి, ఆశ్రయంబు=ఆధారమైనది, అగుశాకవృక్షమునీడన్ =అయినట్టి శాకవృక్షముయొక్క నీడయందు, క్రీడచలుపు=ఆటలాడుము, పాలమున్నీటిలోన్ = పాలసముద్రమందు, ఫణిరాజశయ్యపైన్ =భుజగతల్పముపయి, పవ్వళించినశార్ఙ్గపాణిన్ =శయనించియున్న విష్ణుమూర్తిని, కొలువు=సేవింపుము. నీ వీరాజకుమారుని వరించినచో నచ్చు

టికి సమీపమున నున్న పాలసంద్రములో పన్నగరాజుపైఁ బవ్వళించిన విష్ణువును ప్రత్యక్షముగా సేవించుభాగ్యము లభించును. పొడుపుగుబ్బలిమీఁదన్ = ఉదయపర్వతముపై, పూర్ణిమారాత్రులందున్ = పున్నమరాత్రులందు, చంద్రాతపోత్సవంబులు-చంద్రాతప = వెన్నెలలఁగూర్చిన ఉత్సవంబులు, ఒనరింపుము= చేయుము. అనఁగా నీతనిద్వీపమునకు సమీపముననున్న యుదయపర్వతముపై చంద్రికోత్సవములఁ జేసికొనవచ్చును.

తా. దమయంతీ! ఈరాజు యుద్ధములందుఁ బెక్కురరాక్షసులను జయించినవాఁడు. ఇతఁడు సౌందర్యముచే మన్మథుని మించినాఁడు. ఇట్టివానిని వరించి, యింద్రునియైశ్వర్యంబును మించి నాశనము లేక యున్న సంపదలచే రాజ్యమును బాలింపుము. చిలుకఱెక్కలకాంతివంటి కాంతి గలిగిన శాకవృక్షమునీడ నాడుకొనుము. పాలసంద్రములో సర్పరాజశయ్యపై శయనించి యున్న విష్ణువును సేవింపుము. పున్నమరాత్రులం దుదయపర్వతముపైకిఁ బోయి చంద్రికోత్సవంబులు చేయుము. ఇట్టిలాభములు పెక్కులు కలవు. కావున నీరాజకుమారునిఁ దప్పక వరింపుము.

ఉ. వావిరి దుగ్ధవారిధి యశేవశ్యము నీవిలసత్కటాక్షవీ
క్షావికటాయితంబు ననిశంబు నొనర్చుచు నుండుఁగాక వే
లావనవాటికాతరుపలాశతతిప్రతిబింబచుంబినా
నావిధనిర్మలోర్మినటనస్ఫుటచారిమచాపలంబులన్. 46

టీ. వేలా...చాపలంబులన్ - వేలా=తీరమునందున్న, వనవాటికా=వనపంక్తులందున్న, తరు=చెట్లయొక్క, పలాశతతి = పత్రసమూహములయొక్క, ప్రతిబింబ=ప్రతిఫలనమును, చుంబి=పొందుచున్న, నానావిధ = పలురకములయిన, నిర్మల=స్వచ్ఛములైన, ఊర్మి=తరంగములయొక్క, నటన=నాట్యములచే- లేక సంచారములచే, స్ఫుట=స్పష్టమైన, చారిమ=సౌందర్యముగలిగిన, చాపలంబులన్ =చాంచల్యంబులచేతను, దుగ్ధవారిధి= పాలసంద్రము, వావిరి= అత్యంతము, నీవిలసత్ ..వికటాయితంబును-నీ, విలసత్కటాక్షవీక్షా=ప్రకాశించుచున్న కడకంటి చూపులయొక్క, వికటాయితంబును = విలసితమును,

అనిశంబును=ఎల్లప్పుడును, అనశ్యము=తప్పకుండ, ఒనర్చుచునుండుఁగాక= అనుకరించుచుండునుగాక; అనఁగా క్షీరమయములగుటచేఁ దెల్లనివియును, తీరస్థములగు తరుబృందములు ప్రతిఫలించుటచే నల్లనివియు, నైనక్షీరసాగర తరంగములు, సితాసితకాంతులచే మనోహరమైన నీకడకంటిచూపులతోఁ దుల్యము లగుఁగాక.

తా. ఓ దమయంతీ! తీరములం దున్నతరుబృందంబుల ప్రతిబింబములచే నీలము లైన తరంగములయొక్క సౌందర్యచపలత్వంబులచే క్షీరసాగర మవశ్యమును, నెల్లప్పుడును, సితాసితములయిన నీకటాక్ష విలసితంబులతోఁ దుల దూఁగుగాక. అలం. ప్రతీపము.

తే. అమృతమధురంబు లగుగాడ్పు లాని యాని
బొజ్జఁ బెంచిన పెనుఁబాఁపసెజ్జమీఁదఁ
బద్మలోచన యీమహీపాలుఁ డేలు
పాలమున్నీటిలో శౌరి పవ్వళించు. 47

టీ. పద్మలోచన=పద్మములవంటి నేత్రములఁగల దమయంతీ, ఈమహీపాలుఁడు=ఈరాజు, ఏలుపాలమున్నీటిలోన్=పరిపాలించుచున్న పాలసంద్రములో, అమృతమధురంబులు=అమృతమువలెఁ దియ్యగానున్నవి, అగుగాడ్పులు=అయినట్టిగాలులను, ఆనియాని=మిక్కిలిభక్షించి, బొజ్జ, పెంచినపెనుఁబాఁపసెజ్జమీఁదన్=పెంచినట్టి సర్పరాజనెడి తల్పముపై, శౌరి=విష్ణుమూర్తి, పవ్వళించున్=నిద్రించును. అనఁగా నీరాజును బెండ్లాడుదువేని యీతనిరాజ్యములో పాలసంద్రమున్నది కాన నందున్న విష్ణుమూర్తి నెల్లప్పుడును సేవించుభాగ్యము గలుగునని భావము.

తా. ఓ దమయంతీ! ఈరాజు పాలించుపాలసముద్రములోనే యమృతమువంటిగాలులను దిని బొజ్జపెంచిన సర్పరాజనెడి శయ్యపై విష్ణువు నిద్రించును.

తే. లలితకాశ్మీరభవసమాలంభకరప
పాటలం బైననీముఖాబ్జంబుతోడ

నొరయుఁగాక భవత్కేళీకయోగ్యమైన
పొడుపుగుబ్బలిఁ బొడతెంచుకపూర్ణవిధుఁడు. 48

టీ. లలిత...పాటలంబు—లలిత=సుందరమైన, కాశ్మీరభవ=కుంకుమయొక్క, సమాలంభకర్మ=పూసికొనుటచే, పాటలంబు=ఎఱ్ఱనైనది, ఐననీముఖాబ్జంబుతోడన్=అయినట్టినీముఖపద్మముతో, భవత్కేళియోగ్యము=నీక్రీడలకుపయోగించునది, ఐనపొడుపుగుబ్బలిన్=అయినట్టియుదయపర్వతముమీఁద, పొడతెంచుపూర్ణవిధుఁడు=ఉదయించునట్టి పూర్ణచంద్రుఁడు, ఒరయున్ కాక=రాచుకొనుఁగాక-మచ్చరించుఁగాక యనుట. అనఁగా నీవీతని వరింతువేని యుదయకాలచంద్రునిఁ జూచుచు నుదయపర్వతమం దాడుకొనుభాగ్యంబు గలుగునని భావము. ఉదయకాలమునఁ జంద్రుఁడెఱ్ఱగానుండును గాన యుపమ సరిపోవును. అలం. సందేహము.

తా. ఓదమయంతీ! కుంకుమపూఁతచేఁ బాటలమయిన నీముఖపద్మముతో నుదయపర్వతముపైఁ జూపట్టు పూర్ణచంద్రుఁడు సామ్యమును జెందుఁగాక!

క. లీలాచంక్రమవేళలఁ
బాలా నీచరణలాక్షఁ బ్రథమాద్రిశిలా
జాలములఁ గృతకగైరిక
బాలాతపశంక లనువుపఱుచుంగాతన్. 49

టీ. బాలా=ఓదమయంతీ! నీచరణలాక్ష=నీపాదములందుండు లత్తుకపూఁత, లీలాచంక్రమవేళలన్=విలాసార్థమై మిక్కిలి తిరుగుసమయములందు, ప్రథమాద్రిశిలాజాలములన్=ఉదయపర్వతమందుండు శిలాసమూహములందు, కృతకగైరికబాలాతపశంకలు-కృతక=కృత్రిమమయిన, గైరిక=గైరికాదిధాతువులయొక్కయు, బాలాతప=లేఁతయెండయొక్కయు, శంకలు=సందియములను, అనువుపఱుచుంగాతన్=కలిగించుఁగాత-ఇట 'లేఁతయెండ' లనుటచేత లీలాచంక్రమము ప్రాతఃకాలమం దనుట వ్యంజితము.

తా. ఓదమయంతీ! నీవుదయపర్వతమందు లీలార్థమొతయు విహరించు

నప్పుడు నీపాదములందున్న లత్తుక, యం దుండురాలకంటుకొనుటచే నవి బాలాతపములచేత నట్లున్నవో, లేక కృత్రిమగైరికాదులో యనుసందేహము కలుగఁగాత. అలం. భ్రాంతిమంతము.

వ. అని పలికి యప్పుడు గంధవాహులుఁబోని విమానవాహు
లు లబ్ధగుణప్రసిద్ధి యగునాలలనాలలామం బరిమళలక్ష్మినిం
బోలెఁ బ్రదేశాంతరంబునకుం దోడ్తేర నవ్వాఙ్మయదేవత
హేమోపమేయకాంతియుం గురువిందసకాంతిదంతియు నగు
నయ్యెంతి కి ట్లనియె. 50

టీ. అని పలికి, అప్పుడు, గంధవాహులుంబోని విమానవాహులు=వాయువులుంబోని పల్లకీని ధరించినవారు, లబ్ధగుణప్రసిద్ధి=పొందఁబడినగుణప్రఖ్యాతి కలది, అగునాలలనాలలామన్ =అయినట్టి యాదమయంతిని, లబ్ధగుణ ప్రసిద్ధి యగు=గుణప్రఖ్యాతిని బొందినట్టిది, అగు, పరిమళలక్ష్మినింబోలెన్ = పరిమళసంపదనువలె, ప్రదేశాంతరంబునకున్ = మఱియొకస్థలమునకు, తోడ్తేరన్ = కొనిపోఁగా, అవ్వాఙ్మయదేవత=ఆసరస్వతి, హేమోపమేయకాంతియున్ = బంగారముతోఁ బోల్పఁదగినకాంతికలదియు, కురువిందసకాంతిదంతియు = మాణిక్యములతో సమమయినదంతములుకలదియు, అగునయ్యెంతికిన్ =అయినట్టి దమయంతికి, ఇట్లనియెన్.

క. మహిళాలలామ ! బాహా
బహువారనివారితారిపార్థివు నితనిన్
జహదజహల్లజ్జాసం
గ్రహదృగ్జాలములఁ జూడు క్రౌంచాధిపతిన్. 51

టీ. మహిళాలలామ = స్త్రీలలో శ్రేష్ఠురాలవగు దమయంతీ! బాహా... పార్థివున్ -బాహా=బాహువులచే,బహువార=అనేకపర్యాయములు, నివారిత= జయింపఁబడిన, అరిపార్థివున్ =శత్రురాజులుగలవాఁడును, క్రౌంచాధిపతిన్ = క్రౌం[illegible] . . . జాలములన్ -

జహత్ =విడుచుచున్నదియు, అజహత్ =విడువనిదియునగు, లజ్జను,సంగ్రహ=స్వీకరించుచున్న,దృగ్జాలములన్ =చూపులసమూహములచే, చూడుము. లజ్జను విడుచుట రాజదర్శనముకొఱకు; విడువకుండుట స్త్రీస్వభావానుగుణ్యముంబట్టి

తా. ఓదమయంతీ! ఈరాజు నిజబాహుబలములచే శత్రురాజులను గెల్చినవాఁడు. ఇతఁడు క్రౌంచద్వీపమును బాలించువాఁడు. విడిచియు విడువని సిగ్గుగలచూపులతో నితనిఁ జూడుము.

తే. మండలాకారవేష్టనాఖండవితత
పాండుదధిమండపాథోధిమండితంబు
పడఁతి యేతద్భుజాదండపాలితంబు
క్రౌంచ మనుదీవి సుగుణసంఘములనీవి. 52

టీ. పడఁతి=దమయంతీ! మండల...మండితంబు—మండలాకార = వర్తులాకారమయిన, వేష్టన = చుట్టుకొనుటచే, అఖండ = తెంపులేనిదియు, వితత=విస్తరించియున్నదియు, పాండు = తెల్లనిదియు, నగు, దధిమండపాథోధి = పెరుఁగుమీఁగడగల సముద్రముచే, మండితంబు = అలంకరింపఁబడినదియు, సుగుణసంఘములనీవి=సుగుణసమూహముల ముల్లెఅయినదియు, నగు, క్రౌంచమనుదీవి=క్రౌంచమనెడిద్వీపము, ఏతద్భుజాదండపాలితంబు=ఈరాజు బాహుదండములచేఁ బాలింపఁబడుచున్నది.

తా. మండలాకారముగాఁ జుట్టియుండుటచే నఖండమై తెల్లనిదైన పెరుఁగుసముద్రముచే నలంకృత మై సుగుణములకు నిధియై యున్న క్రౌంచద్వీప మీరాజేంద్రునిచేఁ బాలింపఁబడుచున్నది. అలం. రూపకము.

క. దర్భదళపూజనంబుల
గర్భజనిక్లేశ ముడుపు కరుణాభరణున్
నిర్భరమతి సేవింపు వి
దర్భాధిపతనయ యచటికితరుణేందుధరున్. 53

టీ. విదర్భాధిపతనయ=విదర్భరాజకుమారికయయిన దమయంతీ! దర్భదళ

పూజనంబులన్=కుశాగ్రముల పూజలచేతనయితను, అంతస్వల్పపూజకయినను అనుట. నిర్భరమతిన్=నిండయినమనస్సుతో, గర్భజనిక్లేశము = సంసారదుఃఖమును, ఉడుపుకరుణాభరణున్=నాశనముచేయునట్టి కరుణాళువును, అచటి=ఆక్రౌంచద్వీపమందున్న, తరుణేందుధరున్ = బాలచంద్రుని ధరించినయీశ్వరుని, సేవింపుము=భజింపుము.

తా. ఓదమయంతీ! దర్భపోఁచలచే పూజించినమాత్రకును సంసారదుఃఖములను దొలంగించునంతటికరుణ గలయీశ్వరునిఁ బూజించుచు నిండుమనస్సుతోఁ గొలువుము.

తే. అబల పాదార్పణానుగ్రహమును నిన్నుఁ
ప్రార్థనము చేయఁ గలదు క్రౌంచాచలంబు
పటుతరస్కందబాణసంపాతవివర
కలితనిర్గమకలహంసకలకలముల. 54

టీ. అబల=ఓదమయంతీ! క్రౌంచాచలంబు=క్రౌంచపర్వతము, పటు...కలకలములన్-పటుతర=మిక్కిలి సమర్థములయిన, స్కందబాణ=కుమారస్వామియొక్క బాణములయొక్క, సంపాత=దెబ్బలవలనఁ గలిగిన, వివర=రంధ్రమునుండి,కలిత=ఒప్పునట్లుగా,నిర్గమ=వెడలివచ్చుచున్న,కలహంస కలకలములన్-కలహంసలయొక్క కలకలధ్వనులచేత, పాదార్పణానుగ్రహమును- పాద=అడుగులను, అర్పణ=ఉంచుటయనెడి, అనుగ్రహమును=దయను, నిన్నున్,ప్రార్థనము చేయఁగలదు=యాచింపఁగలదు. అనఁగా హంసధ్వనులచేఁ దనయందు నీవు సంచారము చేయవలయునని క్రౌంచపర్వతము కోరక మానదని భావము.

తా. ఓదమయంతీ! క్రౌంచపర్వతము కుమారస్వామిబాణఘాతములచేఁ బడిన రంధ్రమునుండి వెడలుచున్న హంసలయొక్క ధ్వనులచేతఁ దనయందు విహరింపవలయునని నిన్నుఁ బ్రార్థనచేయకమానదు. ఇట ఉత్ప్రేక్ష గమ్యము.

క. ఘటియింపు మచట హాటక
ఘటకోటి వతంసకములు గా ధూర్జటికిన్

గుటిలాలక కలధౌత
స్ఫటికశిలామయములయిన ప్రాసాదంబుల్. ౫౫

టీ. కుటిలాలక=వంకరయయిన ముంగురులు గల దమయంతీ! హాటకఘట కోటి=పసిఁడికుండలయొక్క సమూహములు, వతంసకములుగాన్=శిరోభూష ణములు కాఁగా, కలధౌత...మయములు-కలధౌత=కాంచనమయములును, స్ఫ టికశిలామయములును=పటికరాలచే నిర్మితములును, అగు ప్రాసాదంబుల్= అయినదేవాలయములను, ధూర్జటికిన్=ఈశ్వరునికి, ఘటియింపుము=నిర్మింపుము.

తా. ఓదమయంతీ! ఆక్రౌంచద్వీపమందుఁ బసిఁడికుంభములు శిరోభాగము లం దొప్పుచున్నవియు బంగారుచేతను స్ఫటికశిలలచేతను నిర్మితములును, నగు నాలయములను శంకరునకుఁ గట్టింపుము.

చ. పొలఁతి లలి న్మలిమ్లుచులపోలిక నీరతికేళిజన్మని
ర్మలతరఘర్మబిందుమయమౌక్తికమండనముల్ హరించుఁ గా
కలసగతిన్ జలద్దధిరసాంబుధితుంగతరంగమాలికా
వలిపృషతచ్ఛటాచమరవాలకరంబితమారుతౌఘముల్. ౫౬

టీ. పొలఁతి=దమయంతి, చలత్...మారుతౌఘముల్, చలత్=చలించు చున్న, దధిరసాంబుధి=పెరుఁగుసముద్రముయొక్క, తుంగ=ఎత్తైన, తరంగ మాలికా=తరంగపంక్తులయొక్క, ఆవలి=వరుసలయొక్క, పృషత=బిందువు లయొక్క, ఛటా=సమూహములనెడి, చమరవాల=వింజామరలతోడి, కరంబిత =కూడికగల, మారుతౌఘముల్ = మలయమారుతసమూహములు, అలసగ తిన్=మందగమనముచే, లలిన్=ఒప్పునట్లుగా, మలిమ్లుచులపోలికన్=దొంగల వలె, నీ...మండనముల్-నీ, రతికేళి=సంభోగమునందు, జన్మ=పుట్టిన, నిర్మ లతర=మిక్కిలి స్వచ్ఛములయిన, ఘర్మబిందుమయ = చెమటబిందువులనెడి, మౌక్తిక=ముత్యములయొక్క, మండనములు=అలంకారములు, హరించుఁగాక= అపహరించుఁ గావుత -; ఒకయింటికిఁ బరిచితులయినవారితోఁ గూడియే దొం గలు తెలియకుండఁ బ్రవేశింతురు గాన మందమారుతములను జామరముల

తోఁ గూడి చొచ్చినవనుట. అనఁగా దమయంతీ! నీవీరాజును జేపట్టినచోఁ బెరుఁగుసముద్రముయొక్క తరంగముల బిందుసమూహములతోఁ గూడినమలయమారుతములు సంభోగమందుఁ గలిగిన చెమటలను హరించు నని భావము.

తా. ఓదమయంతీ! పెరుఁగుసముద్రమునం దుత్పన్నములయిన తరంగపంక్తులబిందుసమూహములనెడి చామరములతోడ బయలువెడలు మలయమారుతములు మందమందముగా వచ్చి, దొంగలవలెనే సంభోగమందు నీకు జనించిన చెమటబిందువులనెడి ముత్యముల యలంకారముల నపహరించుఁగాక. అలం. రూపకానుప్రాణిత మయినయుపమ.

తే. జాలపాదవేషంబు వేళంతజాల
లంఘనాభ్యాసభవ మైనలాఘవమున
సాగరంబులు దాఁటి దిక్సమితిఁ గడచుఁ
గమలలోచన యీరాజు విమలయశము. 57

టీ. కమలలోచన=పద్మములవంటి నేత్రములు గల దమయంతీ! ఈరాజు విమలయశము=ఈరాజు స్వచ్ఛకీర్తి, జాలపాదవేషంబు=హంసయొక్క యాకారమువంటి యాకారముకలదై, వేళంత...భవము-వేళంతజాల= పడియలసమూహములను, లంఘన=దాఁటుటరూపమైన, అభ్యాస=అలవాటుచే, భవము=గల్గినది,ఐనలాఘవమునన్ =అయినట్టి చులుకఁదనముచేత, సాగరంబులు=సముద్రములు,దాఁటి, దిక్సమితిన్ =దిక్కుల సమూహమును, కడచున్ =అతిక్రమించును. అనఁగా నీరాజుకీర్తి మొదటఁ దనద్వీపమందు వ్యాపించి క్రమక్రమముగా దిక్కుల నతిక్రమించి పోవు నని భావము. ఇతని యశస్సిపుడిపుడే వ్యాపించుచున్నదని యందలి యల్పత్వమును సూచించుటచే అనాదరమును సూచితము.

తా. ఓదమయంతీ! ఈ రాజేంద్రునియశము హంసవేషమును దాల్చి యొకపల్వలమునుండి మఱొకపల్వలమునకు దాఁటునట్టి యలవాటుచేత సముద్రములను దాఁటి దిక్కులనుగూడ నతిక్రమించిపోవును.

వ. అనిన విని యాగంధగజగామిని నిజహృదయానుబంధం బవ్వ

సుంధరాధిపునియందు సంధింపదయ్యె నది దైవవశం బవ్వ
డంసావతంసశిబికాంశు లగుపురుషు లప్పురుషప్రకాండునిస
మీపంబువలన రత్నాకరంబువలనం దుషారమయూఖలేఖ
లేఖానుజీవిపురుషులుంబోలెఁ గొనిచని గిరీశప్రభావుం డగు
నొకమహానుభావుం గదియించిరి. తత్సమయంబున నఖిల
జగదంచితపాదపద్మ యగునప్పద్మసంభవుగేహిని యవ్వరా
రోహం కి ట్లనియె. 58

టీ. అనినన్, విని, అగంధగజగామిని=గంధగజమువంటినడక గలదమయం
తియొక్క, నిజహృదయానుబంధంబు=స్వకీయమైన హృదయసంబంధము, అ
వ్వసుంధరాధిపునియందున్=అరాజేంద్రునియందు, సంధింపదయ్యెన్=ప్రవే
శింపదాయెను. అనఁగా దమయంతిమనం బారాజేంద్రుని వరింప నిష్టపడలేదని
భావము. అది=అట్లు వరింపకుండుట, దైవవశంబు=దైవాధీనమయినది. అనఁ
గా దైవయత్నము లేకపోవుటచే నక్కార్యము సఫలముకాలేదని ఫలితా
ర్థము. అప్పుడు, అంసావతంస శిబికాంశులు = బుజముల కలంకారభూతము
లయిన పల్లకికాంతులు గలవారు, అగుపురుషులు, అప్పురుషప్రకాండునిసమీ
పంబువలనన్=ఆపురుషశ్రేష్ఠునిసమీపమునుండి, రత్నాకరంబువలనన్=సము
ద్రమునుండి, తుషారమయూఖలేఖన్=చంద్రలేఖను, లేఖానుజీవి పురుషులుం
బోలెన్=దేవతలయొక్క సేవకపురుషులవలె నే,కొని,చని,గిరీశప్రభావుండు=ఈ
శ్వరునితో సమమయిన ప్రభావముగలవాఁడగు,ఒకమహానుభావున్=ఒకమహా
పురుషుని, కదియించిరి=సమీపింపఁజేసిరి. తత్సమయంబునన్=ఆసమయమందు
అఖిలజగదంచిత పాదపద్మ-అఖిల=సమస్తమైన, జగత్ = లోకముచేత, అం
చిత=పూజింపఁబడుచున్న, పాదపద్మ=చరణకమలములు గలది, అగు పద్మసం
భవుగేహిని=అయినట్టి సరస్వతి, అవ్వరారోహకున్=ఆదమయంతికి, ఇట్లని
యెన్=ఈరీతిగాఁ బలికెను. అలం. ఉపమ.

చ. నవవిదళత్కుశేశయసనాభిశయద్వయ యివ్వసుంధరా

ధవుఁడు కుశాంకితం బగుప్రధానపుదీవి కధీశుఁ డీతనిన్
దివురుటఁ బరిగ్రహించి సముదీర్ణవసంతసమాగమంబులం
దువిద! పరిగ్రహింపుము ఘృతోదధితీరవనీవిహారముల్. 59

టీ. నవ...ద్వయ-నవ=నూతనముగా, విదళత్=వికసించిన, కుశేశయ=ప
ద్మములో, సనాభిశయద్వయ=సగోత్రములైన-అనఁగా సమానములైన-చేతు
లుకల,ఉవిద=ఓదమయంతీ! ఇవ్వసుంధరాధవుఁడు=ఈభూపాలుఁడు, కుశాం
కితంబు=కుశయను నామముగలది, అగుప్రధానపు దీవికిన్=అయినట్టి శ్రేష్ఠమైన
ద్వీపమునకు, అధీశుఁడు=అధిపతి, ఈతనిన్=ఈరాజును,తివురుటన్=ప్రయత్న
ముచే, పరిగ్రహించి=పరిణయమాడి, సముదీర్ణ...సమాగమంబులందున్-సము
దీర్ణ=కోరఁదగిన, వసంత సమాగమంబులందున్=వసంతకాల ప్రారంభసమ
యంబులందు, ఘృతో...విహారముల్=ఘృతోదధి = నేతిసముద్రముయొక్క,
తీర=ఒడ్డునందుఁగల, వనీ=ఉద్యానవనములందు, విహారముల్ = విహరించుట
లను, పరిగ్రహింపుము=పొందుము. అనఁగాఁ గుశద్వీపాధిపతియగు నీరాజేం
ద్రునిఁ బెండ్లి యాడెదవేని వసంతసమయంబులందు, ఘృతసముద్రతీర వనము
లందు విహరించి సౌఖ్యంబు లనుభవింపవచ్చునని భావము.

తా. పద్మమువంటిచేతులు గల దమయంతీ! ఈరాజు కుశద్వీపమును బరిపా
లించుచుండును. ఇతని వరించినచో నితనితోఁ గూడి వసంతకాలములందు ఘృ
తసముద్రతీరములందు విహరించి సుఖ మనుభవింపవచ్చును. అలం. ఉపమ.

మ. పటువాతూలతరంగడోలనచలత్పత్త్రాసిధారాపరి
త్రుటితాంభోధరగర్భనిస్సృతపయస్స్రోతశ్ఛటాసేచన
స్ఫుటసంవర్ధిత మభ్రచుంబిశిఖరాభోగం బతిస్వచ్ఛ మ
చ్చట నీకుం గనుపండువయ్యెడిఁగుశస్తంబంబుబింబాధరా.

టీ. బింబాధరా=దొండపండువంటి యధరోష్ఠము గల దమయింతీ! అచ్చ
టన్=ఆకుశద్వీపమందు, పటు...వర్ధితము పటు=సమర్థమైన, వాతూలతరం
గ=వాతపరంపరలయొక్క, డోలన=సంచారములచేత, చలత్ = సంచలించు

చున్న, పత్రాసిధారా=ఆకులనెడి కత్తులవాదులచేత, దర్భయాకులు వాఁడులు గనుక 'అసి' యని రూపణము. పరిత్రుటిత = విదారింపఁబడిన, అంబోధర =మేఘములయొక్క, గర్భ=లోపలనుండి, నిస్సృత=స్రవించిన, పయః=నీటి యొక్క, స్రోతశ్ఛటా=ధారలసమూహములయొక్క, సేచన=తడుపుటలచేతను, స్ఫుట=మిక్కుటముగా, సంవర్ధితము=వర్ధింపఁబడుచున్నదియు, అభ్రచుంబి శిఖరాభోగంబు = ఆకాశము నంటుచున్న శిఖరాగ్రములు కలదియు, అతిస్వచ్ఛము=మిక్కిలి స్వచ్ఛమైనదియు, అగు కుశ స్తంబంబు=దర్భగుల్మము, నీకుఁ, కనుపండువు అయ్యెడుఁ=కనులపండువు లొనర్చెడిని.

తా. ఓదమయంతీ! సమర్థమయిన వాయుపరంపరల సంచారములచేఁ జలించుచున్న పత్రముల కొనలచేత విదారింపఁబడిన మేఘముల గర్భములనుండి స్రవించుచున్న జలప్రవాహములచే వర్ధింపఁబడుచున్నదియు నాకాశము నొరయుచున్న కొనలుగలదియు మిక్కిలి స్వచ్ఛమైనదియు నగుకుశ స్తంబంబు నీకుఁ గనులపండువు లొనర్చును.

శా. ఆనందంబును బొందు మిందునిభవక్త్రా! మందరక్షోణిభృ
న్నానాకందరమందిరాంగణములన్ యాదోధిమాథానుసం
ధానప్రోత్థితసింధురాడ్దుహితృపాదన్యాససంభావనా
పౌనఃపున్యపవిత్రకాంచనశిలాపర్యంతభాగంబులన్. 61

టీ. ఇందునిభవక్త్రా=చంద్రునితో సమానమగు వదనము గల యో దమయంతీ! మందర...గణములన్-మందరక్షోణిభృత్ = మందరపర్వతముయొక్క, నానా=అనేకవిధములైన, కందరమందిరాంగణములన్ = గుహలనెడు మందిరములయొక్క ముంగిళ్లయందును, యాదోధి...భాగంబులన్-యాదోధి, సముద్రముయొక్క, మాథ+అనుసంధాన=మథించుటలచేత, ప్రోత్థిత=పుట్టిన, సింధురాడ్దుహితృ=లక్ష్మీదేవియొక్క, పాదన్యాస=పాదములు పెట్టుటయనెడి, సంభావనా=గౌరవముచేత, పౌనఃపున్య=మాటిమాటికిని, పవిత్ర = పరిశుద్ధములైన, కాంచనశిలా పర్యంతభాగంబులన్=బంగారపుశిలల భాగంబులందును, ఆనందంబును, పొందుము. అనఁగా దమయంతీ! ఈకుశద్వీపాధిపతిని వరింతు

వేని మందరపర్వత గుహలయందును, మథనకాలమం దుదయించిన లక్ష్మీదేవి పాదపద్మముల జాడలచేఁ బవిత్రములైన కాంచనశిలలయందును నితనితో విహరించి యానందంబును బొందుము. "ఇట" అన్ని ప్రతులలోను, "ఆనందంబునఁ బొందుము" అని తృతీయాంతపాఠము గానవచ్చుచుండెను. అయినను "పత్యాసహావహ విహారమయైర్విలాసై, రానంద మిందుముఖి మందరకందరాసు" అని "ఆనందమావహ" అని ద్వితీయాంతపాఠము సంస్కృతమునఁ గానవచ్చుటచేఁ దదనుసారముగా "ఆనందంబును బొందు" మని దిద్దఁబడెను.

తా. స్పష్టము.

తే. కనకకేతకదళగోత్రతనుగాత్రయష్టి
వ్యాళతనుఘృష్టికృతవలీవలయ మగుట
మహితసోపానమును బోనిమందరాద్రి
యింపు పుట్టించుఁగాక మీయిద్దఱకును. 62

టీ. కనక...యష్టి-కనకకేతకదళ=బంగారు మొగలి రేకుయొక్క, గోత్ర=సంతతియైన, గాత్రయష్టి=యష్టివంటిశరీరము గల దమయంతీ! వ్యాళ...వలయము-వ్యాళ=వాసుకియొక్క, తనుఘృష్టి=శరీరపురాపిడి చేత, కృత=చేయఁబడిన,వలీ=ఒత్తుడుగీఱలయొక్క, వలయ=మండలముకలది,అగుట=అయియుండుటచే-అనఁగా పూర్వము దేవతలు వాసుకియను సర్పరాజును మందరపర్వతమునకుఁ జుట్టి పాలసంద్రమును మథించిరి. అవ్వాసుకిశరీరఘర్షణములవలన నాపర్వత మచ్చటచ్చట లోఁతుగా గుంటలుపడెను. శరీరము తాఁకినచోట్ల గుంటలు పడి తక్కినచోట్ల నెత్తుగానుండుటచే నాపర్వతము కట్టఁబడినసోపానపంక్తులు గలిగినట్లు ప్రకాశించుచున్నదని భావము. అదియే యుత్తరార్ధమున చెప్పుచున్నాఁడు. మహితసోపానమును బోని=ఒప్పుచున్న సోపానపంక్తిని బోలు, మందరాద్రి=మందరపర్వతము, మీయిద్దఱకు, ఇంపు పుట్టించుఁగాక=ఆనందము కలిగించుఁగాక. అలం. ఉత్ప్రేక్ష.

తా. బంగారు మొగలిదళంబువంటి శరీరముగల దమయంతీ! వాసుకియొ

క్క- శరీరఘర్షణములచే ఒత్తుడుగీఱలు పడి సోపానపంక్తి గల్గినట్టు లొప్పుచున్న మందరపర్వతము మీయిరువురుదంపతులకు సంతసను గల్గించుఁగాక.

తే. ప్రకటఫణివేష్టఘృష్టిమార్గములు డిగ్గి
వలితమై పాఱునిర్ఘరామలజలంబు
పాఁపతఱిత్రాడు పెనఁగొన్నభావ మొంద
మగువ నీ కింపుఁ బుట్టించు మందరాద్రి. 63

టీ. మగువ=ఓదమయంతీ! ప్రకట...మార్గములు—ప్రకట = స్పష్టమైన, ఫణి=వాసుకియొక్క, వేష్టఘృష్టి = చుట్టుకొనుటవలనఁ గలిగిన సంఘర్షణముల, మార్గములు=త్రోవలు, డిగ్గి=దిగి, వలితమై = వలయాకారరేఖలుగలదై, పాఱునిర్ఘరామలజలంబు = పాఱుచున్న సెలయేళ్లనీరు, పాఁపతఱిత్రాడు = వాసుకి, పెనఁగొన్నభావము=చుట్టుకొన్నవిధమును, ఒందుక=పొందుచుండగా, మందరాద్రి, నీకుక, ఇంపుపుట్టించుక=సంతసముగలిగించును. అనఁగా వాసుకిశరీరసంఘర్షణములచే మందరపర్వతమునకు జుట్టును వలయాకారరేఖలేర్పడినవి. ఆపర్వతశిఖరంబునుండి ప్రవహించుచున్న సెలయేళ్లనీరు వలయాకారరేఖలలోఁ బడిపోవునప్పుడు వాసుకి చుట్టుకొనియున్నట్టేయుండి నీకనులకానందము గొలుపునని భావము. వారిధారలు తెల్లగానుండుటచే గాన వాసుకిశరీరమున కుపమానము సరిపడును. అలం. ఉత్ప్రేక్ష.

తా. ఓదమయంతీ! మందరపర్వతము వాసుకి చుట్టుకొనుటవలనఁ బడిన వలయాకారరేఖలందుండి సెలయేళ్లనీరు ప్రవహించుచుండ నానీరు పాఁపతాఁడు పెనఁచుకొన్నట్లుండుటచే గాననీకదియానందంబుగొలుపును.అ.భ్రాంతిమంతము

ఉ. నీవదనంబుచేత రజనీపతి నీచనుదోయిచేత నై
రావణకుంభయుగ్మము సురద్రుమపంచకకోమలప్రవా
ళావలి నీకరాంఘ్రియుగళాధరపల్లవరాగలక్ష్మిచే
భావనచేయుఁ బో మథనపర్వత మిట్టిభవత్ప్రసంగతిన్.

టీ. మథనపర్వతము=మందరపర్వతము, ఇట్టిభవత్ప్రసంగతిక = ఇట్టినీస

హావాసనుచేత, అనఁగా, నీవదనంబుచేతన్ = నీముఖముచే, రజనీపతిన్ = చంద్రుని, నీచనుదోయిచేతన్, ఐరావణకుంభయుగ్మమును=ఐరావతకుంభంబులను, నీకర...లక్ష్మిచే-నీకర=నీచేతులయొక్కయు, అంఘ్రియుగళీ=పాదయుగళముయొక్కయు, అధరపల్లవ=చిగురువంటియధరోష్ఠముయొక్కయు, రాగలక్ష్మిచేన్=ఎఱ్ఱనికాంతిసంపదచే,సుర...వలిన్-సురద్రుమపంచక=కల్పవృక్షలైదింటియొక్క, కోమల=మృదువైన,ప్రవాళావళిన్ = చిగుళ్లసమూహమును, భావనచేయన్ పో = తలంచుకొనుఁగాక, అనఁగా సముద్రమథనకాలమునఁ జంద్రుఁడు,ఐరావతము,కల్పవృక్షములు మొదలగునవి పుట్టినవి. ఇప్పుడు మందరపర్వతము నీవదనంబుచూచి చంద్రుని, నీకుచకుంభములచేత నైరావతకుంభంబులను, నీకరచరణాధర కాంతిచేఁ గల్పవృక్షపల్లవంబులను దలంచుకొనుఁగాక. నిన్నుఁజూచి చిరకాలంబుక్రిందటఁ జూచినయావస్తువులను స్మరించుకొనుఁగాకయని ఫలితార్థము. చంద్రునిఁబోలువదనము కలదగుటచేతను, నైరావతకుంభములఁబోలిన స్తనంబులు గల దగుటచేతను, గల్పకపల్లవంబులఁ బోలినకరచరణాధరంబులుగలదగుటచేతను' దమయంతి నిరుపమానసౌందర్యవంతురా లని తెలియవచ్చుచున్నది. అలం—స్మరణ.

తా. స్పష్టము.

వ. అనిన విని యక్కలహంసగమన, మీామాంసశిశిరకరావతం, మునిఁబోలె, నవ్విపులాంసు భజియింప నాసింపదయ్యె.అవ్వైదర్భితలం పెఱింగి యాచతుర్భుజునికోడలు, గనుసన్న చేయ జన్యజనం బక్కన్య నన్యరాజన్యసమీపంబు నొందించె. అప్పుడు భారతీదేవి దమయంతి కిట్లనియె. 65

టీ. అనినన్, విని, అక్కలహంసగమన = అంచవంటిగమనము గల దమయంతి, మీామింస=పూర్వమీామాంస, శిశిరకరావతంసునింబోలెౕ=శంకరునివలెను, అవ్విపులాంసున్ =గొప్పమూఁపులుగల యారాజును, భజింపన్ = సేవించుటకు, ఆసింపదయ్యెన్ =కోరదయ్యెను, ఆచతుర్భుజునికోడలు=విష్ణువుకోడలగు, సరస్వతి, ఆవైదర్భితలంపు = ఆదమయంతియిష్టమును, ఎఱింగి= తెలిసి

శాని, కనుసన్న, చేయఁగా=చేయఁగా, జన్యజనంబు = సేవకజనంబు, అక్కన్యక = ఆదమయంతిని, అన్యరాజన్యసమీపంబును = మఱియొకరాజుసమీపమును, ఒందించెన్, అప్పుడు, భారతీదేవి, దమయంతికి, ఇట్లనియెన్. ఇట 'మీమాంస' యనఁగా పూర్వమీమాంస ; కర్మకాండప్రధానమయినది. ఇది కర్మమునకే ప్రాధాన్యము నొసంగి యీశ్వరు నంగీకరింపదని తెలియునది.

తా. స్పష్టము.

తే. చపలలోచన వైరినిష్కృపకృపాణ
　　పాణి ప్రత్యగ్రఘాణితప్రతిమవాణి
　　వీఁ డధీశుఁడు శాల్మలద్వీపమునకు
　　లలితమధువార్ధికాంచీకలాపమునకు.　　66

టీ. చపలలోచన=చలించుచున్న నేత్రములుగల యోదమయంతీ ! వైరి... వాణి- వైరి=శత్రువులందు, నిష్కృప=దయారహితమైన, కృపాణ = కత్తి, పాణి=చేతియందుఁగలవాఁడును, ప్రత్యగ్ర... వాణి-ప్రత్యగ్ర = నూతనమయిన, ఘాణిత=కండచక్కెరతో, ప్రతిమ=సమానమయిన, వాణి = వాక్కుకలవాఁడుసునగు, వీఁడు=ఈరాజు, లలిత...కలాపమునకున్-లలిత=సుందరమైన, మధువార్ధి=సురాసముద్రమే, కాంచీకలాపమునకున్ = మొలత్రాడుగాఁగల, శాల్మలద్వీపమునకు, అధీశుండు-అధిపతి.

తా. చలించుచున్న నేత్రములుగల దమయంతీ! శత్రువులందు దయారహితమైన ఖడ్గము చేతియందుఁ గలవాఁడై, కండచక్కెరవలెఁ దీపయినపలుకులుగల యీరాజు సురాసముద్రముచేఁ బరివేష్టితమైన శాల్మలీద్వీపమును బరిపాలించును.

క. ఆసవజలనిధినాయకు
　　వాసవసన్నిభు విశుద్ధవంశజు నితనిన్
　　వాసికి నవతిలసుమనో
　　నాసికి యెదిరింప వశమె నరనాథులకున్.　　67

టీ. నవతిలసుమనోనాసికి=నూతనమయిన నువుపూవువంటి నాసికగల యో దమయంతీ! ఆసవజలనిధినాయకుఁ=సురాసముద్రమునకు విభుఁడయినవాఁడు ను, వాసవసన్నిభుఁ=దేవేంద్రునితో సమానుఁడైనవాఁడును,విశుద్ధవంశజుఁ= నిర్మలవంశమందుఁ బుట్టినవాఁడును నగు, ఇతనిఁ=ఈరాజును, వాసిఁ= కీర్తివిషయమై, ఎదిరింపఁ=మాఱ్కొనుటకు, నరనాథులకుఁ=తక్కినరాజు లకు, వశమే=తరమగునా?

తా. నువ్వుపువ్వువంటి నాసికగల యోదమయంతీ! సురాసముద్రాధిపతి యును నింద్రసమానుఁడు నిర్మలవంశసంభవుండును నగు నితనికిఁ గీర్తియందు నృపాలకులు సాటిచెందలేరు.

ఉ. ఈసున నేకహేలన మహీసురుఁ డొక్కరుఁ డొక్కవార్ధియా
పోసన మెత్తుచోఁ దిగులు వుట్టి పయోనిధిపంచకంబు సం
త్రాసము నొందునప్డు మొగతప్పనియంబునిధాన మెద్దియం
దాసవపానకేళిఁ గొనియాడు మతండును నీవు నెమ్మదిన్.

టీ. మహీసురుఁ డొక్కరుఁడు=అగస్త్యమహాఋషి, ఈసునఁ=కోపము చేత, ఏకహేలన=ఒక్కలీలచేతనే, ఒక్కవార్ధిఁ=ఒకసముద్రమును, అనఁగా క్షారసముద్రమును, ఆపోసనము ఎత్తుచోఁ=త్రావునప్పుడు, పయోనిధి పంచ కంబు=తక్కిన యైదుసముద్రములును దిగులు, పుట్టి=భయపడి, సంత్రాసము= భయంబు, ఒందునపుడు=పొందుచున్న సమయమందు, అనఁగా నగస్త్యుఁ డుప్పుసముద్రమును బానముచేయఁగాఁ జూచి తక్కినసముద్రము లన్నియును, ఉప్పుసముద్రంబునే పానము చేసినవానికి క్షీరాదిసముద్రంబుల మగుమముఁ బానముచేయుట యెంతపనికి యని భయమొందుచుండఁగా నని భావము. ఎద్ది=ఏది, మొగతప్పని యంబునిధానము=పౌరుషమును విడువనిసముద్ర మేదో, అనఁగాఁ దక్కిన సముద్రములు భయపడుచుండఁగా నీసురాసముద్రము భయ ముచెందలేదని భావము. "న సురాం పిబే" త్తని నిషేధమున్నది కావున విప్ర సత్తముండయిన యగస్త్యుండు సురను బానముచేయలేఁడని నిశ్చయించి యా

సురాసముద్ర మెంతమాత్రమును భయంబుచెందలేదు. అందుఙ్=ఆసురాసముద్రమందు, నెమ్మదిఙ్=నిండుమనంబుతోఁ, ఆతండును, నీవును, ఆసవకేలిఙ్ = సురాపానక్రీడ, కొనియాడుము=సన్నుతింపుము. అనఁగా నీవారాజకుమారునితోఁ గూడ మద్యపానక్రీడ సలిపి యానందింపుమని భావము.

తా. ఓదమయంతీ! అగస్త్యమహాముని సముద్రమును బానముచేయుటను దక్కినసముద్రంబులన్నియును భయంబుచెందినవి కాని యేసురాసముద్రమెంతమాత్రమును భయంబుచెందలేదో యామద్యసముద్రమందు నీవును నారాజేంద్రుఁడును సంతసము దీరునట్లు మద్యపానక్రీడ సలుపుము. అలం. వ్యతిరేకము.

క. ఏలాలతాగృహంబుల
　బాలా! విహరింపు మీనృపాలునితోడఙ్
　హాలారసమయసాగర
　వేలావనముల నిదాఘవేలాదినముల్.　　69

టీ. బాలా=ఓదమయంతీ! ఈనృపాలునితోడఙ్ = ఈరాజేంద్రునితోఁ, ఏలాలతాగృహంబుల=ఏలకిలతలపొదిరిండ్లలోను, హాలా...వనములఙ్=హాలారసమయ సాగర=సురాసముద్రమునకు సమీపమందున్న, వనములఙ్= తోఁటలందును,నిదాఘవేలాదినముల్=వేసవికాలపుదినములతోఁ, విహరింపుము=సంచరింపుము.

తా. ఓదమయంతీ! నీవీనృపాలునితోఁ గూడి వేసవికాలములందు, ఏలాలతామందిరంబులలోను, సురాసముద్రమునకు సమీపమందున్న తోఁటలయందును సంతసంబున విహరింపవచ్చును.

వ. శాల్మలిగుల్మలాంఛితంబైనయమ్మహాద్వీపంబునకు దీపంబునుంబోలె నోషధీలతాజ్వాలాకలాపదీపితనభఃక్రోడంబును, జూడామిళజ్జలదకజ్జలంబును, నగుద్రోణాచలంబు నీకు విహారస్థానం బగుంగాక, సరససారసకోశమృద్విష యాతని నుద్వాహమ్ము గమ్ము.　　70

టీ. శాల్మలిగుల్మలాంఛితంబు=శాల్మలిపొదచే నొప్పుచున్నది, ఐనయమ్మహా ద్వీపంబునకున్ =అయినట్టి యాశాల్మలి ద్వీపమునకు, దీపంబునుంబోలెన్ =దీపమువలె, ఓషధీలతా...క్రోడంబును-ఓషధీలతా=మృతసంజీవిన్యాదులగు నోషధీలతలయొక్క, జ్వాలా=కాంతులయొక్క, కలాప=సమూహముచేత, దీపిత=ప్రకాశింపఁజేయఁబడుచున్న, నభఃక్రోడంబును=గగనమధ్యభాగము గలదియు, చూడా...కజ్జలంబును—చూడా=శిఖరములందు, మిళత్ =సంక్రమించియున్న, జలద=మేఘంబులనెడి, కజ్జలంబును=కాటుకగలదియు, అగుద్రోణాచలంబు=అయినట్టిద్రోణపర్వతము. నీకు విహారస్థానంబగుఁగాక, సరస... మృద్వి-సరస=సుందరములైన,సారసకోశ=పద్మములవలె, మృద్వి=మృదువయిన శరీరము గలదానా! ఈతనినే, ఉద్వాహస్సు కమ్ము = పెండ్లియాడుము. అలం. రూపకానుప్రాణితమైన యుత్ప్రేక్ష.

ఉ. నావుడు లోచనాంతములచే నవ్వె విదర్భతనూజ దాన ను
ద్భావిత మయ్యె నానృపతిపై ననురాగములేమి యప్డు వా
గ్దేవి విమానవాహకతతిన్ నడపించెను వేఱొక్కపృ
థ్వీవరుఁ డున్నపట్టునకు వేడుక యుల్లమునం దలిర్పఁగన్.

టీ. నావుడున్ =సరస్వతియిట్లు పలుకఁగానే, విదర్భతనూజ=దమయంతి, లోచనాంతములన్ = నేత్రాంతములచే, నవ్వెన్ , దానన్ =ఆనవ్వుటచే, ఆనృపతిపైన్ =ఆరాజేంద్రునిపై, అనురాగము=ప్రేమలేకపోవుట, ఉద్భావితము= ఊహింపఁబడినది, అయ్యెన్, అనఁగా దమయంతియిట్లు నవ్వినతోడనే యారాజునువరింప నిష్టములేనట్టు సరస్వతి తెలిసికొనెనని భావము, అప్డు=ఆసమయమందు, వాగ్దేవి=సరస్వతి, విమానవాహకతతిన్ =విమానమును మోచువారిని, వేడుక,ఉల్లమునన్ =హృదయమునందు,తలిర్పఁగన్ =చివురొత్తగా, వేఱొక్కపృథ్వీవరుఁడు=వేఱొకరాజు,! ఉన్నపట్టునకున్ =ఉన్నస్థలమునకు,నడపించెను.

తా. సరస్వతి యిట్లు పలుకఁగా విని దమయంతి లోచనాంతములచేత నవ్వెను. సరస్వతియదిచూచి మనంబున వేడుక యుప్పతిల్లునట్లుగా మఱియొక రాజుచెంతకు విమానవాహకుల నడపించెను.

వ. ఇట్లు నడపించి కాశ్మీరపంకనిభలగ్నజనానురాగుండును, శ్రీ
ఖండలేపనై పథ్యమయ దిగ్విజయ కీర్తిరాజి రాజద్భుజుండును,
నగునమ్మహీభుజునిం జూపి. 72

టీ. ఇట్లు, నడపించి, కాశ్మీర...రాగుండును-కాశ్మీరపంకనిభ= కుంకుమ పంకమిషచేత, లగ్న=సంగమించియున్న, జనానురాగుండును= ప్రజానురాగముగలవాఁడును, అనఁగా నధికమయినజనానురాగము కలవాఁడని భావము, శ్రీఖండ...భుజుండును- శ్రీఖండలేపనై పథ్యమయ= చందనానులేపనమనెడియలంకారరూపమైన, దిగ్విజయకీర్తిరాజి = దిగ్విజయమువలనఁ గల్గిన యశస్సమూహముచే, రాజత్ = ప్రకాశించుచున్న, భుజుండును=బాహువులు కలవాఁడును=అనఁగా దిగ్విజయంబువలనఁ గల్గినకీర్తిని జందనానులేపంబుగా శరీరంబున ధరించినవాఁడని భావము. కీర్తి తెల్లగానుండును. కాన చందనంబుతో సరిపోల్పఁబడెను.అనురాగ మెఱ్ఱగానుండునుగాన కుంకుమపంకముతోఁ బోల్పఁబడెను.అగు నమ్మహీభుజుక్ =అయినట్టియారాజును, చూపి, అని పైపద్యముతో నన్వయము.

క. వీక్షింపు సరోజేక్షణ
యిక్షురసాంభోధిజలపరీతం బగునా
ప్లక్షద్వీపంబున క
ధ్యక్షుం డీరాజు చెలి సహస్రాక్షునకున్. 73

టీ. సరోజేక్షణ=పద్మములవంటి నేత్రములు గలయోదమయంతీ! ఇక్షు...పరీతంబు—ఇక్షురసాంభోధి=ఇక్షుసముద్రముయొక్క, జల=నీటిచే, పరీతంబు= చుట్టుకొనినది, అగునాప్లక్షద్వీపంబునకుక్ = అయినట్టిప్లక్షద్వీపమునకు, ఈ రాజు, అధ్యక్షుండు = అధిపతి, సహస్రాక్షునకుక్ = దేవేంద్రునకు, చెలి= స్నేహితుఁడు.

తా. ఓదమయంతీ ! ఈరాజేంద్రునిఁ జూడుము. ఇతఁ డిక్షుసముద్రజలముచే నావృతమయిన ప్లక్షద్వీపంబున కధిపతి, దేవేంద్రునకు స్నేహితుఁడు. ఇతని వరించుట యుక్తము.

ఉ. పొంపిరివోవుభక్తినిరుపూటలు రాత్రులు శీతభాను ద
ర్శింపక యారగింపఁడు విశిష్టత వీఁడు భుజించుఁగాక వం
చింపక యింతనుండియును జేడియ నీవదనేందుబింబముం
బొంపెసలారఁగాఁ దనకుఁ జూడఁగ నబ్బుట దర్శరాత్రులన్.

టీ. వీఁడు= ఈరాజు, విశిష్టతన్ =గొప్పవ్రతముచే, పొంపిరివోవుభక్తిన్ = ఎడతెగనిభక్తిచేత, ఇరుపూఁటలున్ = ఉదయమధ్యాహ్నకాలములందును, రాత్రులు=రాత్రులయందును, శీతభానున్ =చంద్రుని, దర్శింపక =చూడకుండ, ఆరగింపఁడు=తినఁడు, చేడియ=ఓదమయంతీ, పొంపు ఎసలారఁగాన్ =సొంపు చెలంగునట్లుగా, తనకున్ =ఆరాజునకనుట, నీవదనేందుబింబమున్ = నీవదనచంద్రబింబమును, చూడఁగన్ అబ్బుటన్ = చూచెడిభాగ్య మలవడుటచే, ఇంతనుండియున్ =ఇఁకమీఁద, దర్శరాత్రులన్ =అమావాస్యరాత్రులందు సైతము, వంచింపక=వ్రతభంగముచేసికొనకుండ, భుజించుఁగాక = తినుఁగాక. ఓదమయంతీ! ఈరాజునకు "చంద్రునిజూడకుండ భుజింప" నసెడివ్రతము కలదు. నీ వితని వరింతువేని నెల్లప్పుడును నీముఖచంద్రునిఁజూచుభాగ్యమలవడును; దానయమవసనిశలందు సైతము వ్రతభంగముచేసికొనకుండ భుజింపఁగలఁడు. చంద్రుని మించిననీవదనంబును జూచియే భుజించునని ఫలితార్థము. ఈచెప్పుటచే దమయంతివదనసౌందర్యము నిరుపమానం బని తెలియవచ్చుచున్నది.

తా. ఓదమయంతీ! ఈరాజు నిండైనభక్తి కలవాఁడై చంద్రునిఁ జూడకయున్నఁ భుజింపనని వ్రతముపట్టెను. ఇఁకమీద నీవదనచంద్రునిఁ జూచుచుండును గాన నమావాస్యరాత్రులందుఁ గూడ వ్రతలోపము లేకుండ భుజింపఁగలఁడు.

వ. ఇక్షురసోదధివేలావిహారంబును, ప్లక్షశాఖాప్రేంఖోళనక్రీడావినోదంబును, విశాలాపులినవేదికాప్రదేశపర్యటనంబును, మనంబున కింపు వుట్టింపఁగలయవి. ఇతనిఁ బరిగ్రహింపు మనిన నాసరోజాక్షి వైరాగ్యరూపంబు లగువీక్షణంబుల నతని వీక్షించె. ... ... ...కాణ

యగువాణి యన్నీలవేణితలం పెఱింగి యంసస్థలస్థితసమాన
విమానదండు లగుపురుషప్రకాండులం బదండు పదం డని
నడిపించి జంబూద్వీపభూపాలలోకంబుఁ గదియించి. 75

టీ. ఇక్షు...విహారంబును-ఇక్షురసోదధి=చెఱకురసపుసముద్రముయొక్క, వేలా=తీరములందు, విహారంబును=విహరించుటయును, ప్లక్ష...వినోదంబును-ప్లక్షశాఖా=జువ్వికొమ్మలకు బంధింపఁబడిన, ప్రేంఖోళన=ఉయ్యేలయొక్క, క్రీడా=ఊఁగుటయనెడి, వినోదంబును=ఆటయును,విపాశా...పర్యటనంబును-విపాశా=విపాశానదియొక్క, పులినవేదికాప్రదేశ = ఇసుకతిన్నెలప్రదేశముల యందు, పర్యటనంబును=విహారంబును, మనంబునకుఁ, ఇంపు = సంతసము, పుట్టింపఁగలయవి = కలిగింపఁగలవు. ఇతనిఁ, పరిగ్రహింపుము=పెండ్లియాడుము, అనినఁ=అని పల్కఁగా, ఆసరోజాక్షి=ఆదమయంతి, వైరాగ్యరూక్షంబులు=ఆసలేమిచేత పరుషములయినవి, అగు, వీక్షణంబులఁ=అయినచూపులచేత, అతనిఁ=ఆరాజును, వీక్షించెఁ=చూచెను. వాణీ...నిక్వాణ-వాణీ=వాక్కుయొక్క, గుణోదయ = మాధుర్యాదిగుణోత్పత్తిచేతను, తృణీకృత=తిరస్కరింపఁబడుచున్న, పాణివీణా=చేతియందున్న వీణయొక్క, నిక్వాణ=ధ్వనిగలిగినది - అనఁగా వీణాధ్వనులను దిరస్కరించువాక్కు గల్గిన దని భావము. అగువాణి=అయినసరస్వతి, అన్నీలవేణితలంపు=ఆదమయంతి యభిప్రాయము,ఎఱింగి,అంస...దండులు—అంసస్థల=భుజశిరస్సులందు, స్థిత=ఉన్నట్టి, సమాన=తుల్యమైన, విమానదండులు=పల్లకీవండిగలవారు - దండిని సమముగా మోచుచున్నవారనుట, అగు పురుషప్రకాండులఁ = అయినట్టివాహకులను, పదండు, పదండు అని, నడిపించి, జంబూద్వీపభూపాలలోకంబుఁ = జంబూద్వీపవాసు లగురాజసమూహమును, కదియించి=పొందించి.

ఉ. నేరెటిదీవి నేలుధరణీవరముఖ్యులు వీరె కంటె యు
న్నారు మనోరథంబులు మదినంబునఁ బాయక సంచరింపఁగా
నీరజపత్త్రనేత్ర యొకనిన్ వరియింపుము వీరిలోన దై
త్యారి వరించునిందిరక్రియం బరినందితచిత్తవృత్తి వై. 76

టీ. నీరజపత్రనేత్ర = పద్మదళములవంటి నేత్రములుగల దమయంతీ! వీరె= ఈకూర్చున్నవారె, నేరెటిదీవిక్ =జంబూద్వీపంబును, ఏలుధరణీవరముఖ్యులు =పరిపాలించుచున్న రాజముఖ్యులు, కంటె=చూచితివా ? మనోరథంబులు = కోర్కులు, మనంబునక్ =మనస్సునందు, పాయక = విడువక, సంచరింపఁగాక్ =విహరించుచుండఁగా, ఉన్నారు, అనఁగాసర్వకాలంబులందునునిన్ను వరింపవలెనన్నకోర్కితోనున్నారు. వీరిలోనక్, ఒకనిక్, పరినందితచిత్తవృత్తివై= సంతసించుచున్న చిత్తవ్యాపారముగలదానవై, దైత్యారిక్ =విష్ణువును, ఇందిరక్రియక్ =లక్ష్మీదేవివలెను, వరింపుము=పెండ్లియాడుము.

తా. పద్మపత్రములవంటి నేత్రములు గల దమయంతీ! ఈకూర్చుండినవారు జంబూద్వీపనివాసులగు భూపాలకులు, మనంబున నిన్ను వరించుకోరికి వదలకుండనున్నారు. కావున వీరిలోనొకని లక్ష్మీదేవి నారాయణునింబోలె సంతోషించిన చిత్తముతో వరింపుము.

క. సుందరి ! జంబూద్వీపము
నందలిభూపాలసముదయంబును గంటే
పొం దొప్ప ధరణి వ్రాలిన
కందర్పజగంబువోలెఁ గడు నొప్పారెన్. 77

టీ. సుందరి=ఓదమయంతీ! జంబూద్వీపమునందలిభూపాలసముదయంబును =జంబూద్వీపమందున్నరాజసమూహమును, కంటే = చూచితివా ? పొందు, ఒప్పక్,ధరణిక్ =భూమిపై, వ్రాలినకందర్పజగంబువోలెక్ =మన్మథలోకము వలెను-అందఱును మన్మథులవలె ననుట. కడుక్ =మిక్కిలి, ఒప్పారెక్ =ప్రకాశించెను.

తా. ఓదమయంతీ ! జంబూద్వీపనివాసు లగు నీరాజలోకమును జూచితివా? భూమి కవతరించినమన్మథసమూహమువలెఁ దనరారుచున్నది.

తే. దీవు లాఱును దనుఁ జుట్టుఁ దిరిగి కొలువ
దీవులకు రాజు నేరెటిదీవి యొప్పు

మేరుకైలాసగిరులు బంగారుగొడుగు
ధవళవరచామరంబు నై తనకుఁ దనర. 78

టీ. దీవులకురాజు=అన్నిదీవులకు నధిపతియగు, నేరెటిదీవి=జంబూద్వీపము, దీవులాఱును=ఆఱుదీవులును, తనున్=జంబూద్వీపమునునట, చుట్టున్, తిరిగి, కొలువన్=సేవించుచుండఁగా, మేరుకైలాసగిరులు = మేరుకైలాసపర్వతములు, బంగారుగొడుగు=కనకచ్ఛత్రముగాను, ధవళవరచామరంబును-ఐ=తెల్లనిమేలివింజామరయునై, తనకున్ = నేరెటిదీవికనుట, అమరన్ =ఒప్పుచుండఁగా, ఒప్పన్ =వెలయుచుండును. అనఁగా రాజులకు ఛత్రచామరాదు లుండవలెను. కాన ద్వీపరాజైనజంబూద్వీపమునకు మేరుపర్వతము గొడుగుగాను, కైలాసము తెల్లనివింజామరగాను బ్రకాశించుచున్నవని భావము.

తా. ఓదమయంతీ! ద్వీపములాఱింటికిని రాజైనజంబూద్వీపము దనకుఁజుట్టును దక్కినద్వీపములు జలిసికొలుచుచుండఁగా, మేరుకైలాసపర్వతములు ఛత్రచామరములై తనరుచుండఁగాఁ బ్రకాశించుచుండును.

ఉ. ఓవనితాలలామ! లవణోదధిచక్రపరీత మైనయా
దీవికి రాజజంబువు ప్రదీపితలాంఛన మన్నగంబుశా
ఖావలి వ్రేలియాడెడిమహాఫలముల్ గని వారణంబు లౌ
గావని పందెముల్ సలుపఁగా గమకింతురు సిద్ధదంపతుల్.

టీ. ఓవనితాలలామ=ఓదమయంతీ! లవణోదధిచక్రపరీతము = వలయాకారముగా నున్నయుప్పుసముద్రముచే నావృతము, ఐనయాదీవికిన్ = అయినట్టియాద్వీపమునకు, రాజజంబువు=ఆ జంబూవృక్షము, ప్రదీపితలాంఛనము=ప్రకాశించుచున్న చిహ్నము, అన్నగంబు శాఖావలిన్ =ఆ జంబూవృక్షము కొమ్మలసమూహములందు, వ్రేలియాడెడి మహాఫలముల్ =వ్రేలాడుచున్న పెద్దపండ్లను, కని=చూచి, సిద్ధదంపతుల్ =సిద్ధద్వంద్వంబులు, వారణంబులు=ఏనుఁగులు, 'ఔన్, కావు' అని, పందెముల్ సలుపఁగాన్ గమకింతురు = పందెము వేయుటకుఁ బ్రయత్నించుచుందురు. అనఁగా నాజంబూవృక్షము కొమ్మ

లందు (వ్రేలాడుఫలంబులను గాంచి యవి ఫలములని కొందఱును, కా దేనుఁగు లని కొందఱును, పందెములు వేయఁదొడఁగిరి. ఈచెప్పుటచే నాజంబూఫలములు గజములంతలేసి యున్నవని ఫలితార్థము.

తా. ఓసుందరీ! ఉప్పుసముద్రముచేఁ జుట్టఁబడిన యాద్వీపమునకు, జంబూవృక్షము గొప్పలాంఛనము. ఆవృక్షపుకొమ్మలందు వ్రేలాడుఫలములను జూచి సిద్ధదంపతు లేనుఁగు లని భ్రమచెందుచున్నారు. అలం. (భ్రాంతిమత్తు.)

వ. కంబుకంఠి! జగదలంకారం బగుజాంబూనదంబు తినకు జంబాలజాలంబుగా జాంబవద్రవంబు సుధామధురాంబుపూరంబుగా జంబూసరిత్ప్రవాహంబు జంబూద్వీపంబునందుఁ బ్రవహించు. ఈద్వీపంబున నంతరాంతరంబుల నెంతయుం బ్రసిద్ధు లగువసుధాకాంతులు నిన్నంతరంబులం గోరి వీరె సభాభ్యంతరంబున నున్నవారు. విమతయూవతిమాళివతంసతమాలమాలికోన్మీలన్నీలతమతమఃప్రకరతస్కరభాస్కరు లగువీరియం దొక్కరునియందు నీడెందంబు కంజళితానందంబయ్యె నేని, వానిఁ జూపుము. ఆభూపాలకునికులబలాచారశూరతావివేకవైభవంబు లభివర్ణించెద ననిన నబ్బాల శాలీనతావశంవద యై వదనారవిందంబు వంచి యూరకుండె. అట్లున్నం గాంచి విరించిపట్టపుదేవి బుజ్జగించి యాలజ్జావతికి నుజ్జయినీవల్లభుం జూపి యిట్లనియె. 80

టీ. కంబుకంఠి=శంఖమువంటికంఠము గల దమయంతీ! జగదలంకారంబు=లోకంబున కలంకారభూతమ్ము, అగుజాంబూనదంబు = అయినట్టి బంగారము, తినకుక్ =జంబూనది కనుట, జంబాలజాలంబుగాక్ =బురదసమూహము కాఁగా, జాంబవద్రవంబు = నేరెడుపండ్లరసము, సుధామధురాంబుపూరంబు = యమృతమువలె నున్న తియ్యనినీరపూరము కాఁగా, జంబూసరిత్ప్రవాహంబు=జంబూనదీప్రవాహము, జంబూద్వీపమునందు, ప్రవహించుక్ = పా

బుచుండును. ఈద్వీపంబున, అంతరాంతరంబులన్ = అన్నిచోట్లను, ఎంత యున్ = మిక్కిలి, ప్రసిద్ధులు = ప్రఖ్యాతికాంచినవారు, అగువసుధాకాంతులు = అయినట్టిరాజులు, నిన్నున్, అంతరంబులన్ = మనంబులలో, కోరి = అపేక్షించి, వీరె, ఈసభాభ్యంతరంబునన్ = ఈసభామధ్యమందు, ఉన్నవారు, విమత...భాస్కరులు—విమత = శత్రువులయొక్క, యోషిత = స్త్రీసమూహముయొక్క, మౌళి = శిరస్సులందు, సతంస = అలంకారములుగా నుంచుకొన్న, తమాల మాలికా = తమాలపుష్పములనెడి, ఉన్మీలత్ = ప్రకటితమగుచున్న, నీలతమ = కడునల్లని, తమః ప్రకర = చీఁకట్లసమూహమును, తస్కర = నశింపఁజేసెడి, భాస్కరులు = సూర్యులు, అగువీరియందున్ = అయినట్టి యీ పురుషులయందు, ఒకరుని యందున్, అనఁగా శత్రుస్త్రీలకు శిరోభూషణములుగా నున్నతమాలపుష్పమాలిక లనెడిచీఁకట్లను హరింప సూర్యునివంటివారనిభావము. ఈచెప్పుటచే వారు శత్రువులకు మృత్యురూపు లని ఫలితార్థము. నీడెందంబు, కందళితానందంబు = మొలకలెత్తినయానందము కలది, అయ్యెన్ ఏని = అయినచో, వానిన్, చూపుము, ఆభూపాలకుని...వైభవంబు—ఆభూపాలకుని = ఆరాజుయొక్క, కుల = వంశంబును, బల = సత్త్వమును, ఆచార = ప్రవర్తనమును, శూరతా = శౌర్యంబును, వివేకవైభవంబును = వివేకసంపదను, అభివర్ణించెదను = తెలియఁజేసెదను, అనిన్, అబ్బాల = ఆదమయంతి, శాలీనతావశంవదయై = లజ్జావశురాలయి, వదనారవిందంబు = ముఖపద్మము, వంచి, ఊరకుండెన్, అట్లున్నన్ = అట్లుండఁగా, కాంచి, విరించిపట్టపుదేవి = సరస్వతి, బుజ్జగించి = లాలించి, ఆలజ్జాళికిన్ = సిగ్గుపడుచున్న దమయంతికి, ఉజ్జయినీవల్లభున్ = ఉజ్జయినీపురాధిపుని, చూపి, ఇట్లనియెన్.

తే. సవిధలీలావనీస్థాయి శశిమౌళి
చంద్రికాధౌతకలధౌతసౌధజాల
యుజ్జయిని రాజధాని యోకయుత్పలాక్షి
భావసంభవనిభున కీభూవిభునకు. 81

టీ. ఓయుత్పలాక్షీ = కలువవంటినేత్రములు గల దమయంతీ! భావసంభవ

నిభునకున్ = మన్మథునితో సమానుఁడైన, ఈభూవిభునకున్ = ఈ రాజునకు, సవిధ...జాల—సమీపమందున్న, లీలావనీ=ఉద్యానవనమునందు, స్థాయి= నివసించియున్న, శంభు=శంకరునియొక్క, మౌళి = కిరీటమందున్న చంద్రుని యొక్క, చంద్రికా=వెన్నెలచేత, ధౌత=శుభ్రపఱుపఁబడిన, కలధౌత=సువర్ణమయమైన, సౌధజాల = మేడలసమూహముగల, ఉజ్జయిని=ఉజ్జయినీనగరము, రాజధాని=ప్రధాననగరము.

తా. ఓదమయంతీ! మన్మథునితో సముఁడైన యీ రాజేంద్రునకు, సమీపమందున్న యుద్యానవనమందున్న యీశ్వరుని శిరోభాగమందున్న చంద్రుని కాంతిసంతతులచే శుభ్రపఱుపఁబడిన బంగారుమేడలుగలయుజ్జయిని ప్రధాననగరమై యొప్పుచున్నది.

ఉ. తామరసాక్షి శంకరుఁడు తత్పురి నాత్మకిరీటచంద్రరే
ఖామృతవృష్టి మన్మథనవాంకురముల్ సృజియించుఁగామినీ
కాముకభావసీమములకందువపట్లను నిట్టివాఁడటే
యేమిటికిన్ దహించె నిటలేక్షణవహ్నిఁ దనీయ దేహమున్.

టీ. తామరసాక్షి=పద్మములవంటి నేత్రములు కలదమయంతీ! శంకరుఁడు=ఈశ్వరుఁడు, తత్పురిన్=ఆయుజ్జయినియందు, కిరీట ..వృష్టి—కిరీటచంద్రరేఖా= కిరీటమందున్న చంద్రకలయొక్క, అమృతవృష్టిన్ = అమృతవర్షము చేతను, కామినీ...పట్లను—కామినీకాముక = యువతీయువజనము యొక్క, భావసీమములకందువపట్లను = అంతరంగప్రదేశము లనెడి సంకేతస్థలములందు, మన్మథనవాంకురముల్=మన్మథప్రాదుర్భావములను, సృజియించున్=కలిగించుచుండు అనఁగా నుజ్జయినికి సమీపమున శంకరుఁడున్నాఁడనియు, నతనికి శిరోభూషణమై వెలయు చంద్రరేఖనుండి యమృతము గురియుచుననియు, ఆయమృతకిరణవర్షముచేత నాపురియందుండు కామినీకాముకులకు మన్మథోద్దీపక మగుచున్నదనియు భావము. చంద్రికలు మన్మథసంతాపము నభివర్ధించుట ప్రసిద్ధము. పూర్వము శంకరుఁడు మన్మథుని దహించినను, నిప్పుడు శిరశ్చంద్రచంద్రికలచేఁ దత్పురవాసులకు మన్మథప్రాదుర్భావము కలిగించు

టచే నీశ్వరుఁడు మగుడ మన్మథుని సృజించుట స్పష్టమగుచున్నది. ఇట్టివాఁడటే = ఇటువంటివాఁడైన యీశ్వరుండు, నిటలేక్షణవహ్నిన్ = ఫాలనేత్రవహ్ని చేత, తదీయదేహమున్ = ఆమన్మథునిదేహమును, ఏమిటికిన్, దహించెన్ = ఎందులకు దహనము చేసెను. అనఁగాఁ దన శిరశ్చంద్రచంద్రికలచే మగుడ బ్రదికించుచున్న యీశ్వరుఁడు ఫాలనేత్రముచే మదనదేహము నేల దహించెనో తెలియకున్నది. అనఁగా వేలకొలఁది మన్మథు లుదయించుటచేత, నిష్ఫలముగా నొక్కని దహించెనని తెల్లమగుచున్నది. అలం. విరోధాభాసము.

తా. ఓదమయంతీ! శంకరుఁడు తన తలయందున్న చంద్రునియమృతవృష్టిచే యువతీయువజనుల మానసములందు మన్మథప్రాదుర్భావమును గల్గించుచున్నాఁడు. మన్మథుల నిట్లు సృజించుచున్న శంకరుఁ డెందులకయి మన్మథుని దహించెనో తెలియకున్నది.

తే. వెలఁది వీఁ డేలునుజ్జనికేళిటియందు
వెఱతు రలుగంగ సతు లాత్మకేళిభులతోడ
బాహ్యవనవీథికాస్థాయిభర్గమౌళి
బాలహరిణాంకకోమలప్రభలయాజ్ఞ. 83

టీ. వెలఁది = దమయంతి! వీఁడు = ఈరాజు, ఏలునుజ్జనిటియందున్ = పరిపాలించుచున్నయుజ్జయినీనగరమందు, బాహ్య... యాజ్ఞన్ — బాహ్య = వెలుపటిభాగమందున్న, వనవీథికా = ఉద్యానవనమందు, స్థాయి = ఉన్నట్టి, భర్గ = శంకరునియొక్క, మౌళి = శిరస్సునందున్న, బాలహరిణాంక = లేఁతచంద్రునియొక్క, కోమల = నూతనములైన, ప్రభలయాజ్ఞన్ = కాంతులయానతిచేతను, సతులు = స్త్రీలు, ఆత్మవిభులతోడన్ = తమపతులతో, అలుగంగన్ వెఱతురు = ద్వేషింపభయపడుచుందురు. అనఁగా సంతతము శంకరుని శిరశ్చంద్రచంద్రిక లతిమనోహరముగానుండి మన్మథోద్దీపకము లగుచుండుటచే నట్టిసమయములందు భర్తృవియోగము సహింప సమర్థురాండ్రు కాక భర్త లెట్టియపరాధములు చేసినను సహింతురే కాని కోపింపనోపరు. అనఁగా దమయంతీ! నీ వీతని వరిం

తువేని సర్వరాత్రులందును మనోహరము లగువెన్నెలలో విహరించు భాగ్యము లభించు నని భావము.

తా. ఓదమయంతీ! ఈరాజేలుచున్నయుజ్జయినియందుఁ, దత్పురంబునకు సమీపమందున్న వనములోనున్న శంకరునితలపైనున్న బాలచంద్రుని చంద్రికలు వెలయుచుండుటచే స్త్రీలు తమభర్తలతో విరోధింప భయపడుచుందురు.

ఉ. యాచకకోటి యీతనియుదారతపేర్మి సమృద్ధినొంది యా
చ్ఞాచరణంబు వీడ్కొనినయాత్మలముచ్చటఁ బొందదేవతా
నైచికియుం సురద్రుమము నైజగుణవ్యసనంబులం బయ
స్సేచనలీలఁ బల్లవభుజిక్రియఁ దీర్చు మిథఃప్రసంగతిన్. 84

టీ. ఈతనియుదారతపేర్మిన్ = ఈరాజుయొక్క దాతృత్వాతిశయముచే, యాచకకోటి = యాచకసమూహము, సమృద్ధిన్ = సంపదను, ఒంది = పొంది, అనఁగా సంపన్నులై, యాచ్ఞాచరణంబు = యాచనావృత్తిని, వీడ్కొనినయాత్మలన్ = విడిచిపెట్టిన మనస్సులతో, ముచ్చటన్ పొందన్ = సంతుష్టులై యుండఁగా-అనఁగా యాచకులు మహాసంపన్నులై యుండుటచేఁ గోరఁదగినవస్తువు లేనివారై సంతుష్టాంతరంగులై యుండఁగా నని భావము, దేవతానైచికియున్ = కామధేనువును, సురద్రుమము = కల్పవృక్షమును, మిథఃప్రసంగతిన్ = పరస్పరసాంగత్యముచే-ఒకటితోనొకటికలిసి యనుట. పయస్సేచనలీలన్ = తనపాలచేఁ దడుపుటను, పల్లవభుజిక్రియన్ = చిగుళ్లను భుజించుటకిచ్చుటను, నైజగుణవ్యసనంబులన్—నైజ = స్వాభావికమైన, గుణ = దానగుణమందలి, వ్యసనములన్ = అతివుతూహలములను, తీర్చున్ = తొలంగించుకొనును. కామధేనుకల్పవృక్షములకు దానగుణము స్వాభావికమైనది. అవి యర్థులకు దానమొనర్పకుండ నుండలేవు. ఈరాజుదాతృత్వముచే సమస్తయాచకులును సంపన్నులై సంతసించుచుండుటచేఁ గామధేనుకల్పవృక్షముల కర్థులే లేకపోయిరి. అందుచే నవి యొండొరుల కర్థులై (చెట్టుకు నీళ్లుకావలయును గాన) కామధేనువు తనపాలను గల్పవృక్షమున కీయఁగాఁ (ఆవు చిగుళ్లు మేయును గాన) గల్ప

వృక్షము కామధేనువునకుఁ జిగుళ్లచే నాతిథ్యము చేయుచు నిట్లు తమదాన ప్రసంగంబులు నొండొరులయందు నెఱపుచు దానగుణమునందుఁ దమకుఁ గల యత్యాసక్తిని దొలంగించుకొనుచుండెను. అనఁగా నీరాజు దానగుణముచే మిక్కిలి ప్రఖ్యాతుఁడని ఫలితార్థము.

తా. ఓదమయంతీ! ఈరాజు యాచకుల కమితములగుసంపద లొసంగి వారలను సంపన్నులను జేయఁగా వారు యాచ్ఞావృత్తి విడిచి సంతుష్టాంతరంగులై యుండఁదొడంగిరి. కామధేనుకల్పవృక్షము లిట్లు తమకు యాచకులు లభింపకపోవుటచేతను, దమకు స్వాభావికమైన దానమును జేయకుండ నుండ లేక పోవుటచేతను, దమలోఁ దాము యాచకత్వమును వహించి, కామధేనువు పాలచేఁ గల్పవృక్షమును దడుపుచుండెను. కల్పవృక్షము తనచిగుళ్లను దానికాహారముగా నిచ్చుచుండెను. ఇట్లవి తమదానవ్యసనమును దొలఁగించు కొనుచున్నవి.

శా. క్షోణీనాథుఁ డితండు దానగుణవిస్ఫూర్తిం బ్రవర్తిల్లఁగా
మాణిక్యాచలమెట్లుగైకొనదొకో కమాకద్భుతం బయ్యెఁ గ
ల్యాణీ! నిర్వ్యయరత్నసంపదుదయోదగ్రత్వముఁ యాచక
శ్రేణీవర్జనదుర్యశోబిషిత క్రీడావనమ్రత్వమున్. 85

టీ. కల్యాణీ!=మంగళప్రదురాలవగు నోదమయంతీ! ఇతండు=ఈ, క్షోణీనాథుండు=రాజు, దానగుణ విస్ఫూర్తిక్=దానగుణాతిశయముచే, ప్రవర్తిల్లఁగాక్=ఒప్పుచుండఁగా, నిర్వ్యయ...ఉదగ్రత్వముక్ - నిర్వ్యయ=వ్యయములేకపోవుటచే, రత్నసంపత్=రత్నసమృద్ధియొక్క, ఉదయ=పరివృద్ధిచేతను, ఉదగ్రత్వముక్=ఉన్నతమైన శిఖరములు గల్గియుండుటను. అనఁగా రోహణపర్వతము యాచకులకుఁ దనశృంగంబులందున్న రత్నరాసులను బంచి యిచ్చుచున్నచో శృంగములు తఱిఁగియుండును. కాని యీరాజు సమస్తయాచకులకును ధనసమృద్ధు లొసంగుచుండుటంజేసి యాచకులు లభింపకపోవుటచే రోహణము తనశృంగములందున్న రత్నములను వ్యయము చేయలేకపోయెను. అందువలన శృంగములు రత్నములచే నిండి యున్నతములై యుండెనని భా

వము. యాచక...నిబిడతర్ - యాచక = యాచకులయొక్క, శ్రేణీ=పంక్తి యొక్క, వర్జన=లేకపోవుటచేతఁ గలిగిన, దుర్యశః = అపకీర్తిచేత, నిబిడిత =దట్టము గావింపఁబడిన-అనఁగా మిక్కిలి అతిశయించిన-అనఁగా నీరాజుదాన ములసెంపుచే భూమియందు యాచకులను లేకుండఁజేసెను. అందువలన యాచ కులు లేకపోవుటవలనఁ గలిగెడి గొప్పయపకీర్తి రోహణపర్వతమునకు వచ్చు చున్నది. అట్టియపకీర్తి గలుగుట నని భావము. వ్రీడావనమ్రత్వముక్ =లనరత్న సంపదలు నిర్వ్యయముగా నుండిపోవుటచేతను, యాచకులను జేరఁదీయలేక పోవుటచేతను, గలుగుసిగ్గుచే వంగియుండుటను, మాణిక్యాచలము = రోహణ పర్వతము-ఇది మేరుశిఖరములలో నొకటి, ఏల, కైకొననోకో = పొందలేదో, మాకున్, అద్భుతంబయ్యెక్ =ఆశ్చర్యము గలిగించెడిని, అనఁగా రోహణప ర్వతము సమస్తయాచకులకును రత్నసంపదలను బంచియిచ్చి లనరత్నములను వ్యయము చేయలేకపోవుటచేఁ గలిగినసిగ్గుచే వంగినదయ్యు, రత్నవ్యయము లేమిచే పొడవయ్యు నున్నది. ఇట్లు పొడవుగా నిక్కియుండుటయు వంగి కొని యుండుటయు నను రెండువిరుద్ధదశలచే మాకాశ్చర్యము కలుగుచున్న దని భావము.

తా. ఓదమయంతీ! ఈరాజు యాచకుల కమితముగా దానమొనర్చుచుం డఁగా మేరువు లనరత్నసంపదలను యాచకులకు వ్యయము చేయలేకపోవుట చేఁ బెమ్పెరుఁగుచున్న రత్నములచే నున్నతమైనశిఖరములు కలదగుచున్నవి. కాని యాచకులను జేరదీయ లేకపోవుటవలనఁ గలిగిన యపకీర్తులచేఁ బొడ మినసిగ్గుచే నమ్రభావమును బొందకున్నది. ఔన్నత్యమును నమ్రత్వ మనురెం డునుబొందుట మా కాశ్చర్యము గలుగుచున్నది. అలం. అతిశయోక్తి.

వ. దమయంతి! దాంతిశాంత్యాదిగుణసంతానములకు విశ్రాంతి ధామం బైనయీయవంతిపతియందు నీయంతరంగం బను రాగవంతి యయ్యెనేని శిప్రానదీసలిలకేళియు మహాకాళస్థిత వృషభధ్వజభజనంబును, విశాలానగరీసౌధసింహాసనాధిరోహ ణంబును, నీకు సంభవింపఁగలయది యని పలికి పలుకుం

దొయ్యాలి యూరకుండె. కుండినావనిపురందరప్రియనందన
యును, దూష్ణీంభావంబున నవ్విశ్వంభరాభర్తమీఁదఁ గటా
క్షవీక్షణం బావర్తింపదయ్యె నప్పుడు. 86

టీ. దమయంతి, దాంతి... సంతానంబులు - దాంతి=ఇంద్రియనిగ్రహము, శాంతి=ఓర్పు, ఆది=మొదలైన, గుణసంతానములకున్=గుణసమూహములకు, విశ్రాంతిధామంబు=క్రీడాభవనము, అనఁగా దాంత్యాదిగుణముల కాకరుఁడై యనిభావము. ఐనయీయవంతిపతియందున్=అయినట్టి యీయవంతీశ్వరునియందు, నీయంతరంగంబు=నీమనస్సు, అనురాగవంతము=ప్రేమకలది, అయ్యెనేని, శిప్రానదీసలిలకేళియున్=శిప్రయనెడినదియందు జలవిహారముసల్పుటయును, మహా... భజనంబును-మహాకాళ=మహాకాళమనెడి పుణ్యక్షేత్రమందు, స్థిత=ఉన్నట్టి, వృషభధ్వజ=శంకరునియొక్క, భజనంబును=సేవయును, విశాల... రోహణంబును-విశాలనగరీ = విశాలాపురమందున్న, సౌధ=మేడయందున్న, సింహాసన=రాజపీఠికయందు, ఆరోహణంబును=అధిష్ఠించుటయు, నీకున్, సంభవింపఁగలయది=లభింపఁగలదు. అని, పలికి, పలుకుందొయ్యాలి=సరస్వతి, ఊరకుండెన్, కుండినావని పురందర ప్రియనందనయున్=కుండిన రాజ్యంబున కధిపతి యైనభీమరాజునకుఁ బ్రియకుమారిక యగుదమయంతియు, తూష్ణీంభావంబునన్=మౌనముచే, అవ్విశ్వంభరాభర్తమీఁదన్=ఆరాజుపైని, కటాక్షవీక్షణంబు=కడకన్ను, ఆవర్తింపదు అయ్యెన్= ప్రసరింపఁ జేయలేదు. అప్పుడు, అని పైపద్యముతో నన్వయము.

తే. మాళవాధీశమకుటాగ్రమణులయందు
భీమనందనరూపంబు బెరసి యునికిఁ
దదవ్విరక్తి పరీక్షించి తారు దార
యరిగి రవలకుఁ జతురంతయానధరులు. 87

టీ. చతురంతయానధరులు=పల్లకినివహించినవారు, మాళవా... యందున్=మాళవాధీశ=అవంతినాథునియొక్క, మకుటాగ్ర=కిరీటముకొనలయం దుండిన,

మణులయందుఁ=రత్నములందు, భీమనందనరూపంబు=దమయంతిరూపము, బెరసి=పొంది, ఉనికిఁ=ఉండుటచేత, తద్విరక్తిఁ=ఆమెవిరాగమును, పరీక్షించి=తెలిసికొని, లేక, చూచి, తారుతారు+అ=తమకుఁదామే, అవలకుఁ, అరిగిరి=వెడలిరి. అనఁగా నద్దము మొదలగువానియందు వస్తువుల ప్రతిబింబము లభిముఖముగా నుండుట సహజము. కావున దమయంతి మాళవరాజున కభిముఖి యైయుండెను. అప్పుడు దమయంతిరూప మామాళవాధీశుని కిరీటరత్నములందుఁ బ్రతిఫలించెను. ఆప్రతిబింబము దమయంతి కభిముఖముగా నుండును గాన దమయంతిపై పునను యానధరులకు మాళవరాజునకు విముఖమైయున్న ప్రతిబింబమును జూచి దమయంతి యతనికి విముఖురాలయ్యెనని తలంచి వెడలిరని భావము.

తా. యానధరులు మాళవాధీశునికిరీటమణులందు దమయంతిప్రతిబింబమును జూచి యామెవిరాగము నెఱిఁగి యావలకుఁ జనిరి.

తే. గోతి ! గాంగేయపీతవక్షోజకుంభ
యభ్రవాహినియనుబోలె నరుగుదెంచె
యానధరవర్గసగరపౌత్త్రానువృత్తి
భూవరాంతర మనుమర్త్యభువనమునకు. 88

టీ. గాంగేయ పీతవక్షోజకుంభ-గాంగేయ=బంగారమువలె, పీత=పచ్చని, వక్షోజకుంభ=కుచకుంభములుగల, గోతి=స్త్రీ, అనఁగా దమయంతి యనుట, గాంగేయ-...కుంభ-గాంగేయ=కుమారస్వామిచేతను, భీష్మునిచేతను, పీత=పానముచేయఁబడిన, వక్షోజకుంభ=కుచకుంభములు గల, అభ్రవాహినియును బోలెఁ=గంగానదివలెనే, యాన...వృత్తిఁ- యానధర = వాహకులయొక్క, వర్గ=సమూహమనెడి, సగరపౌత్ర=భగీరథుని, అనువృత్తిఁ=అనుసరించుటచే, భూవరాంతరము=మఱియొకరాజు, అనుమర్త్యభువనమునకుఁ=అనెడి భూలోకమునకు, అరుగుదెంచెను, అనఁగా స్వర్గలోకమునుండి భగీరథుని ననుసరించి భూలోకమునకు వచ్చినగంగానదివలె దమయంతి యానధరుల ననుసరించి యారాజును విడిచి మఱియొకరాజును జొందెనని భావము.

తా. బంగారువలెఁ బచ్చనికుచకుంభములు గల దమయంతి కుమారస్వామి చేతను భీష్మునిచేతను పానముచేయఁబడిన కుచకుంభములు గల గంగానదివలె యానధరులనెడి భగీరథునననుసరించి వేలోకరాజనెడి మానవలోకమునకు వచ్చెను.

వ. అప్పుడు మత్స్యలాంఛనచాపరేఖానీరాజితభ్రూవిలాస యగు
నారాజకన్యకతోడ వాగ్దేవి యి ట్లనియె. 89

టీ. అప్పుడు, మత్స్య...విలాస - మత్స్యలాంఛన = మన్మథునియొక్క, చాపరేఖా=వింటిచేత, నీరాజిత=నీరాజనమీయఁబడుచున్న, భ్రూవిలాస=బొమలకాంతులు గలది. అనఁగా మన్మథచాపములను మించుచున్న కనుబొమలు గలదని భావము. అగు నారాజకన్యతోడన్=అయినట్టి దమయంతితో, వాగ్దేవి=సరస్వతి, ఇట్లనియెన్-ఎక్కువవస్తువునకుఁ దక్కువదానిని దిగ దుడిచివైతురు గాన దమయంతికనుబొమలు మదనచాపము నతిశయించిన సౌందర్యము గలది యని భావము. అలం. వ్యతిరేకము.

క. వ్రీడావతి! యీభూపతి
గౌడబిడౌజుండు వీఁడు కమనీయరతి
క్రీడారహస్యకోవిద
చూడామణి తెప్ప లెత్తి చూడుము వీనిన్. 90

టీ. వ్రీడావతి=లజ్జగలిగినదానా- దమయంతీ! ఈభూపతి=ఈరాజు, గౌడబిడౌజుండు=గౌడదేశాధిపతి, వీఁడు, కమనీయ...మణి- కమనీయ=మనోహరమైన, రతిక్రీడా=మన్మథక్రీడలయందలి, రహస్య=గుట్టులను, కోవిద=తెలిసినవారిలో, చూడామణి=తలమానికమువంటివాఁడు. వీనిన్=ఈరాజును, తెప్పలు, ఎత్తి=కనుతెప్ప లెగయించి, చూడుము.

తా. లజ్జాస్వభావము గల దమయంతీ! ఇతఁడు గౌడదేశాధిపతి. ఇతఁడు సంభోగక్రీడలందలిరహస్యముల నెఱిఁగినవారిలో మిన్న. వీనిని గన్ను విచ్చి చూడుము.

ఉ. పంకజనేత్ర వీనిపరిపాండురకీర్తిభరంబుచేఁ గురం
గాంకరుచుల్ తృణీకృతము లైనవి నిక్కువ మట్లుగానినాఁ

డంకము డాసియున్నె యమృతాస్పద మైనతదంతరంబునఁ
రంకు వసంకుచత్ప్రణయశక్తిఁ దదంకురచర్వణార్థ మై. 91

టీ. పంకజనేత్ర=పద్మములవంటి నేత్రములు గల దమయంతీ ! వీని పరిపాండురకీర్తి భరంబుచేఁ=ఇతనితెల్లనికీర్తిసముదాయముచే, కురంగాంకరుచుల్=చంద్రునికాంతులు, తృణీకృతము లైనవి=తిరస్కరింపఁబడినవి, గడ్డిపోఁచలు చేయఁబడినవి, నిక్కమము=సత్యము, అట్లుకానినాఁడు=అట్లు కానిసమయమందు, రంకువు=లేడి, అమృతాస్పదము=సుధారసమునకుఁ జోటైనది, నీటికి స్థానభూతమైనదని వేఱొకయర్థము. ఐన తదంతరంబునఁ=అయినట్టియాచంద్రునిమధ్యమందు, అసంకుచత్ప్రణయరక్తిఁ=సంకోచము నొందని ప్రేమమందలి యాసక్తిచేతను, తదంకురచర్వణార్థము — తత్ = ఆ తృణములయొక్క, అంకుర=చిగుళ్లను, చర్వణార్థమై=తినుటకై, అంకము=ఒడిని, డాసి, ఉన్నె=ఉండునే? తృణజలసమృద్ధి గల్గినచోట్ల వసించుట లేళ్ల కిష్టము. ఆరాజుకీర్తులచేఁ జంద్రకాంతులు తృణములుగా చేయఁబడుటచేతను, జంద్రునియందు స్వతస్సిద్ధముగా నమృత(జల)ముండుటచేతను, తృణజలసమృద్ధి మిక్కుటముగ కలది కావుననే లేడి చంద్రునియందు వసింప నిష్టపడుచున్నదని భావము. అతనికీర్తి చంద్రకాంతులను మించుచున్నదని ఫలితార్థము.

తా. దమయంతీ! ఈరాజుకీర్తిభరంబుచే నిక్కముగాఁ జంద్రకాంతులు తృణములుగా చేయఁబడినవి. స్వతస్సిద్ధముగా నమృతము గలచంద్రునియందుఁ దత్కాంతితృణము లుండుటచేతనే లేడి వానియంకురములను దిన నట నివసించుచున్నది.

తే. కువలయశ్యాముఁ డైనయీశయవనివిభుని
యిటియుకౌఁగిటిలో నుండు హేమగౌరి!
కుసుమబాణాసనునిసేన కొప్పులోనఁ
దవిలి యొప్పారుసంపెంగకదండవోలె. 92

టీ. హేమగౌరి=బంగారువలె గౌరవర్ణము గలదమయంతీ ! కువలయశ్యాముఁడు=నల్లగలువవలె నల్లనిశరీరము గలవాఁడు, ఐన...కౌఁగిటిలోఁ-ఐన,

-ఈయవనివిభుని= ఈరాజుయొక్క, ఇఱియు కౌఁగిటిలోన్-బిగికౌఁగిటిలో, కుసుమబాణాసనుని నేసకొప్పులోనన్ =మన్మథుని కేశపాశములో, తవిలి=తవు లొ్కని, ఒప్పారు సంపెంగదండవోలెన్ =ఒప్పుచున్న సంపంగెదండవలె, ఉండు, సంపెంగపూవు పసుపువన్నె గాన దానితో బంగరువన్నె గలదమయంతికి సామ్యము. అనఁగా నితనిఁ బెండ్లాడి యపారసుఖము లనుభవింపుమని భావము.

తా. బంగారువంటిదేహకాంతి గలదమయంతీ! నల్లగలువవలె శ్యామలవర్ణముగల యీరాజేంద్రుని బిగికౌఁగిటిలో మన్మథునికొప్పులో నున్న సంపెంగదండవలె నుండుము. అలం. ఉపమ.

చ. లలన! యితండు సమ్ముఖమిళద్రిపుకుంజరకుంభమౌక్తిక
చ్ఛలమున వైరిలక్ష్మిచలిచన్నులమీఁద నిజప్రతాపసం
కలనసముత్థితంబు లగుఘర్మకణంబులఁ బాయమీటు ని
ర్మలనిజశాతహేతినఖరంబున నాజివిహారభూములన్. 93

టీ. లలన=ఓదమయంతీ! ఇతండు=ఈరాజు, ఆజివిహారభూములన్ =యుద్ధభూమియనెడి విహారభూములందు, నిర్మల...నఖరంబునన్-నిర్మల=స్వచ్ఛమైన, నిజ=తనయొక్క, శాత=వాఁడియైన, హేతి=కత్తియనెడి, నఖరంబునన్= గోటిచేతను, వైరిలక్ష్మిచలిచన్నులమీఁదన్ =పగవారిలక్ష్మియొక్క చల్లనిచన్నులపయిని, నిజ...సముత్థితంబులు-నిజ=తనయొక్క, ప్రతాపసంకలన= తేజముయొక్క సంపర్కముచే, సముత్థితంబులు=పుట్టినవి, అగు ఘర్మకణంబులన్ =అయినట్టి చెమటబిందువులను, సమ్ముఖ...చలమునన్-సమ్ముఖ=యుద్ధమున కభిముఖములై, మిళత్ =కూడవచ్చుచున్న, రిపుకుంజర=శత్రుగజములయొక్క, కుంభ=కుంభస్థలములందున్న, మౌక్తిక=ముత్యము లనెడి, ఛలమునన్ =మిషచేత, పాయన్ మీటున్ =తొలంగించును. అనఁగా నీరాజు యుద్ధములం దభిముఖముగా వచ్చు గజములను డాసి తననిశాతకరవాలముచే వాని కుంభస్థలంబులను జీల్చి యందలి ముత్యములను నేలపైకి దొరఁగించెనని భావము. దానిని గవి యిట్లు వర్ణించుచున్నాఁడు. కత్తిచేఁ జీల్పఁబడిన గజకుంభస్థలంబులనుండి నేలను రాలుచున్న

ముత్యములా రాజుయొక్క ప్రతాపాతిశయముచే వైరిలక్ష్మీ కుచకుంభములందుఁ బుట్టి గోటిచేఁ జిమ్మఁగా నేలకు రాలుచున్న చెమట బిందువులవలె నొప్పుచున్నవి" ఇట నారాజును నాయకునిఁగాను, వైరిలక్ష్మిని నాయికనుగాను, గజకుంభములను వైరిలక్ష్మి కుచకుంభములనుగాను, గజకుంభస్థ ముత్యములను, చెమట బిందువులనుగాను, ఖడ్గమును గోటినిగాను, నిరూపించెను. అనఁగనాయకుఁడు కత్తిచే గజకుంభములను జీల్చి తదంతర్గతము లగుముత్యములురాల్చుట, నాయకుఁడు నాయికకుచకుంభంబులందు వేఁడిమివలనఁ బొడమిన చెమటబిందువులను గోటితో బాఱఁజిమ్ముచున్న ట్లుండెనని చెప్పఁబడినది. 'ఆజివిహారభూములన్' అనుటచే వైరిలక్ష్మి శత్రురాజులను వదలి అభిసారికవలెఁ బ్రతాపవంతుఁ డయిన యీరాజును కలచి యుద్ధభూమి యనెడివిహారస్థలమందుఁ గూడినదయ్యె నని యుఁ దనవేఁడిమిచే నామెకుచములం గలిగిన చెమటబిందువులను నుపచారముగాఁ బాయమీటి దానికెంతేయుఁ గైవసముచేసికొన్నాఁ డనియు వ్యంజితము.

తా. ఓదమయంతీ! ఈరాజు తనచేతికత్తి యనెడిగోటిచేతఁ, దనప్రతాపాతిశయముచే వైరిలక్ష్మిగుబ్బచన్నులందుఁ బుట్టినచెమటబిందువులను శత్రువులకరికుంభములందుండి జాఱుచున్న ముత్యములనెపమునఁ దొలఁగించుచున్నాఁడు. ఇట అపహ్నుతియు రూపకమును ఉత్ప్రేక్షయు నలంకారములు.

తే. అతివ యాజానుదీర్ఘబాహాప్రతాప
సమధిగతదిగ్విభాగుఁ డీజనవిభుండు
సప్తతంతుయశఃపటవ్యాప్తనిఖిల
భువనుఁ డీతనిచరిత మద్భుతకరంబు. 94

టీ. అతివ=ఓదమయంతీ! ఈజనవిభుండు=ఈరాజు, ఆజాను...విభాగుఁడు —ఆజాను=జానువులపర్యంతము, దీర్ఘ=పొడుగైన, బాహా = బాహువులవలన నుదయమందిన,ప్రతాప= తేజంబుచే,సమధిగత=పొందఁబడిన, దిగ్విభాగుఁడు= దిగంతములు కలవాఁడు, మఱియు, సప్త...భువనుఁడు - సప్తతంతు=యజ్ఞములు చేయుటవలనఁ గల్గిన, యశః=కీర్తియనెడి, పట=వస్త్రిముచే, వ్యాప్త=కప్పఁబడిన, నిఖిల=సమస్తములైన, భువనుఁడు=లోకములు గలవాఁడు,

అనఁగా నాజానులంబులగు బాహువుల ప్రతాపముచే దిక్కులను జయించినవాఁడనియు, యాగము లాచరించి సకలలోకములను గప్పఁజాలిన కీర్తిని సంపాదించినవాఁడనియు భావము. ఈతనిచరితము=ఇతనిచరిత్రము, అద్భుతకరంబు=ఆశ్చర్యమును గల్గించునది, ఎట్లాశ్చర్యకరమగుననఁగా, "కారణగుణాః కార్యే సంక్రామంతి" అనుదానివలనఁ గారణమందుండిన గుణములే కార్యమం దుండుట సహజము. తంతువులందుండు గుణమే పటమందుండును. కాన, జానువులవఱకు మాత్రమే వ్యాపించిన బాహువులవలన దిగంతములవఱకు వ్యాపించెడి ప్రతాపము కలుగుట యాశ్చర్యము. ఆజానుబాహువులు మహారాజలక్షణము గాన యట్టిశుభలక్షణముచే ప్రతాపము మెఱసి దిక్కుల జయించినాఁ డని యాశ్చర్యపరిహారము. అట్లె, సప్త ... భువనుఁడు — సప్త=ఏడైన, తంతు=నూలిపోఁగులచేఁ గలిగిన, యశఃపట=కీర్తిపటముచే, వ్యాప్త=వ్యాపించిన, నిఖిలభువనుఁడు=సకలలోకములును గలవాఁడు, అనఁగా నేడు పోఁగులచేఁ జతుర్దశభువనములం గప్పఁజాలిన పటమును సృజించుట యాశ్చర్యకరము కావున నీతనినడవడి యాశ్చర్యకర మని చెప్పవచ్చును. సప్తతంతువులనఁగా యజ్ఞములు గాన యజ్ఞజనితకీర్తిచే లోకములఁ గప్పినాఁ డని యిట యాశ్చర్యపరిహారము.

తా. దమయంతీ! ఈరాజు జానువులపర్యంతము వ్రేలాడు బాహువులచే సమస్తదిక్కులను జయించెను. యాగములుచేసి చతుర్దశభువనములను గప్పఁజాలినంత కీర్తిని సంపాదించెను. ఈతనిచారిత్ర మాశ్చర్యకరము.

వ. అనిన విని యయ్యరవిందాస్య యాదాస్యసంవిదవలంబితశూన్యముద్రాముద్రితం బైనచూపునం జూచి యాభూపాలునిం బ్రతిషేధించె. ఆక న్నెఱింగి ద్రుహిణగృహిణి విమానవాహవ్యూహంబునకుఁ గనుసన్న చేసి వేఱొక్కరునిం జేరంబోవ నియమించి యారాజన్యుం జూపి విదర్భరాజకన్యక కిట్లనియె.

టీ. అనిన౯, విని, అయ్యరవిందాస్య=పద్మమువంటి మోము గలదమయంతి యొక్క, ఔదాస్య...ముద్రితంబు-ఔదాస్యసంవిత్ = ఉపేక్షతోఁగూడిన బుద్ధిచేత, అవలంబిత=స్వీకృతమైన, శూన్యముద్రా = ప్రేమలేకపోవుటయనెడి గుఱుతుచే, ముద్రితంబు=చిహ్నితము, అయినచూపున౯=అయినట్టిచూపుచేత, చూచి, అనఁగా నంతసేపు సరస్వతి వర్ణించినను, దమయంతికన్నెత్తిచూడక పోవుట చేతనే యామె మనోవిరాగంబు స్పష్టమగుచున్నదని భావము. ఆభూపాలుని౯=ఆరాజును, ప్రతిషేధించె౯=నిరాకరించెను. ఆకన్ను=చూపుజాడ, ఎఱింగి=తెలిసికొని, ద్రుహిణగృహిణి=సరస్వతి, విమానవాహవ్యూహంబున కు౯=పల్లకిని మోచువారి సమూహమునకు, కనుసన్న చేసి=కంటిచే సైగచేసి, వేఱొక్కరుని౯, చేరఁ బోవ౯=చేరుటకు, నియమించి=ఆజ్ఞాపించి, ఆరాజన్యు౯=ఆరాజును, చూపి, విదర్భరాజకన్యకకు౯=దమయంతికి, ఇట్లనియె౯= ఇట్లు చెప్పెను.

సీ. తెఱవ! ప్రత్యర్థిపార్థివ సార్థపాథోధి
 సమ్మాథమంథరక్ష్మాధరంబు
పృథుఁ డనునృపతి యీపృథ్వీశ్వరుం డేలు
 మథుర నాకము జంభమథనుపగిది
నశ్మశ్రుఁ వైన యీయన ముఖాబ్జంబుతో
 నంకకర్బురుఁ డైన యమృతకరుఁడు
సరిపోవఁజాలఁడు చానకాంతిస్ఫూర్తి
 నటు సగము మిత నిబాహాహరణమును

తే. వైరిధరణీశమశకసంహారమునకు
శాత్రవకళత్రనేత్రాంబుజన్మమునకుఁ
గారణం బైనధూమరేఖయును బోని
ఘనశరాసనగుణకిణాంకము ధరించు. 96

టీ. తెఱవ=దమయంతీ! ప్రత్యర్థి...క్ష్మాధరంబు - ప్రత్యర్థిపార్థివ=శత్రురా

జులయొక్క, సార్థ=సమూహమనెడి,పాథోధి=సముద్రమును, సమ్మాథ=మథించుటయందు,మంథరక్ష్మాధరంబు=మందరపర్వతమువంటివాఁడు. అనఁగా నీరాజు మందరపర్వతము సముద్రమును మథించినట్లు శత్రురాజులను మర్దించుచున్నాఁడని భావము. ఈపృథ్వీశ్వరుండు=ఈరాజు, పృథుఁ డనునృపతి=పృథువనుపేరుగలవాఁడు, నాకముఁ=స్వర్గలోకమును, జంభమథనుపగిది=ఇంద్రునివలె, మథురన్=మథురానగరమును, ఏలున్=పరిపాలించును. అంకకర్బురుఁడు=అంకముచే విచిత్రుఁడు, ఐనయమృతకరుఁడు=అయినట్టి చంద్రుఁడు, చారుకాంతిస్ఫూర్తిన్=మనోహరమైన కాంతిసంపదచే, అశ్మశ్రుపు=గడ్డము మీసాలవెంత్రుకలులేని, ఈయనము ఖాబ్జంబులోన్=ఇతని ముఖపద్మముతో, సరివోవన్ చాలఁడు=సాటిచెందఁజాలఁడు. అనఁగా మచ్చతోఁగూడిన చందమామ శ్మశ్రువు లేని యీతనివదనంబునకు సాటి రాఁడు; ఇతనిమొగము నిష్కళంకచంద్రబింబమువలె నొప్పుచున్నదనియు,నితఁడు యౌవనప్రాదుర్భావదశయందున్నాఁడనియు ఫలితార్థము. అటు, చూడు=అవైపు చూడుము, ఇతనిబాహారణములును=ఇతనిబాహువు లనెడినిప్పుచిలుకకట్టులు, వైరి... హారమునకున్—వైరిధరణీశ=శత్రురాజులనెడి, మశక=దోమలయొక్క, సంహారమునకును=నాశనమునకును, శాత్రవ... జన్మమునకున్-శాత్రవకళత్ర=శత్రురాజభార్యలయొక్క, నేత్రాంబు=కన్నీటియొక్క,జన్మమునకున్=ఉత్పత్తికిని, కారణంబు=హేతువు,ఐనధూమరేఖయును బోని=అయినట్టి పొగపంక్తినిబోలిన, ఘన...కిణాంకము—ఘన=గొప్పదైన, శరాసన=ధనుస్సుయొక్క, గుణ=నారివలనఁగలిగిన, కిణాంకము=మచ్చను, ధరించున్=తాల్చును, అనఁగా శత్రువులనెడి దోమలనాశమునకును, శత్రుభార్యలకన్నీటికిని, ధూమరేఖవంటి వింటినారివలన కలిగిన కిణమనెడి మచ్చగలవాఁ డని భావము. ధూమరేఖసంబంధమువలన దోమలు నశించుటయుఁ, గన్నీరు కాఱుటయు సైజము. శత్రువులు నశించుటచే వారిభార్యలేడ్చుచున్నారని ఫలితార్థము.

తా. దమయంతీ! ఈరాజు శత్రువులనెడిసముద్రమును మథించుటకు మందరపర్వతమువంటివాఁడు. ఇతనిపేరు పృథువు; దేవేంద్రుఁ డమరావతినింబోలె

నితఁడు మనురను బరిపాలించును. మచ్చగలిగినట్టి చంద్రుఁడు కాంతిసంపదచే శ్మశ్రువులేని యితనివదనంబునకు సాటిరాఁడు. ఆవైపుచూడుము. ఇతనిబాహువులు శత్రువు లనెడి దోమలనాశనమునకును, శత్రుభార్యలకన్నీటి యుదయమునకును హేతువైన ధూమరేఖవలె నున్న వింటినారిదెబ్బ మచ్చను ధరించుచున్నవి. అలం. వ్యతిరేకము.

చ. అలికులవేణి! కాళియమహాహ్రద మన్కమనీయనాభితో
జలనిధినేమిభామినికిఁ జక్కని మేచకరోమరాజి నా
నలిఁ బ్రవహించుచున్న యమునానదియందు నితండు నీవును
జలుపుదుగాక గ్రీష్మదివసంబులయందుఁ బయోవిహారముల్.

టీ. అలికులవేణి = తుమ్మెదలసమూహమువంటి జడగల దమయంతీ! ఇతండు, నీవును, కాళియమహాహ్రదము= కాళియునిమడుగు, అన్ కమనీయ నాభితోన్, అయినట్టి మనోహరమైనపొక్కిలితో, జలనిధి నేమిభామినికిన్ =భూమి యనెడియువతికి, చక్కని... రాజి- చక్కని=సుందరమైన, మేచక=నల్లని, రోమరాజి=నూఁగారు, నాన్ =అనునట్లుగా, నలిన్ =ప్రీతితో- మిక్కుటముగా, ప్రవహించుచున్న యమునానదియందును = పాఱుచున్న యమునానదియందు, గ్రీష్మదివసంబులయందున్ = వేసవిదినములందు, పయోవిహారముల్ = జలక్రీడలను, చలుపుదుగాక= చేయుదురుగాక, అనఁగా భూమియనెడి స్త్రీకి, కాళియహ్రదము నాభివలెను యమునానది నూఁగారువలెను నొప్పుచున్నదని భావము. యమునానది నల్లగానుండు నని ప్రసిద్ధిగలదు కాన నూఁగారుతో నుపమానము సరిపడును. ఇట నీవును, ఇతండును జలక్రీడలను జలుపుదుగాకయనియుండుట (అనఁగా బహువచనమునకు మాఱుగా నేకవచనము వాడుట) సమంజసమే.

తా. నల్లనికేశపాశముగలదమయంతీ! కాళియహ్రదమనెడి నాభికూపములో భూనాయిక నూఁగారువలె నొప్పుచుఁ బ్రవహించుచున్న యమునానదిలో వేసవికాలమందు వీనితోఁ గూడి జలక్రీడలను జలుపుము.

క. గోవర్ధనాద్రితటములఁ
 బ్రావృట్కాలముల విపినబర్హిణనటన
 ప్రావీణ్యము వీక్షింపుం
 డీవును నీతండు వేడ్కకలిం బెసలారన్. 98

టీ. ఈవును, ఈతండును, వేడ్కలు=కోర్కులు, ఇం పెసలారన్=అతిశయించునట్లుగా, గోవర్ధనాద్రితటములన్ = గోవర్ధనపర్వతపుఁ జఱియలందు, ప్రావృట్కాలములన్=వర్షాకాలములందు, విపిన... ప్రావీణ్యము—విపినబర్హిణ=వనమయూరములయొక్క, నటనప్రావీణ్యము = నాట్యమందలి నేర్పును, వీక్షింపుఁడు= చూడుఁడు-నెమిళ్లు వర్షాకాలమందు నటనము సేయుట ప్రకటము.

తా. ఓదమయంతీ! నీవును నితండును గలిసి వర్షకాలములందు గోవర్ధన ప్రాంతములందు వనమయూరములు చేయుచున్న నర్తనముయొక్క చాతుర్యమును వీక్షింపుఁడు.

ఉ. పూవులభూరిసౌరభము పూని భరంపడి యేఁగుదెంచు బృం
 దావనసంచరిష్ణుఁడు సదాగతిపాంథుఁడు దప్పిపెంపునన్
 ద్రావఁగలండు బాలువిధంబునఁ జిత్రకగంధసారపం
 కావిలమైనను గువలయాక్షి భవద్రతిఘర్మతోయమున్.

టీ. కువలయాక్షి=కలువలవంటి నేత్రములు గల దమయంతీ! పూవులభూరిసౌరభము=పుష్పములయొక్క యెక్కుడగు పరిమళము, పూని=వహించి, భరంపడి = అభరమును వహించుటచే శ్రమచెంది, ఏఁగుదెంచు = వచ్చుచున్నట్టి, బృందావనసంచరిష్ణుఁడు=బృందావనమందు సంచరించు స్వభావము కలవాఁడు, సదాగతిపాంథుఁడు=వాయువనెడి బాటసారి, దప్పిపెంపునన్ = పిపాసయొక్క పెంపుచేతను, చిత్రకగంధసారపంకావిలము - చిత్రక = బొట్టుయొక్క, గంధసారపంక = చందనపు బురదచేత, ఆవిలము = కలుషము, ఐనను=అయినప్పటికిని, భవద్రతి ఘర్మతోయమున్-భవత్ = నీయొక్క, రతి=సంభోగమందలి, ఘర్మ=ఉక్కచే బొడమిన, తోయమున్=జలమును,

బాలునివిధంబునన్ = బాలకునివలె, త్రావఁగలండు = పానముచేయఁగలఁడు, విశేషముగా దప్పిగొనియున్న బాలుఁడు జలమెంతకలుషముగానున్నను, నిశ్శంకముగాఁ బానముచేయును. ఇందు పూవులతావియొక్క భారమువహించినవాఁడని, చెప్పుటచే వాయువునకు సౌరభత్వమున్నట్లును, భారము వహించిన వాఁడు మందముగా నడుచుట సహజము కావున వాయువునకు మాంద్యమును, ఆరామాదులనుండి వచ్చుగాలి శీతలముగానుండు నని యనుభవసిద్ధము కాన "బృందావనసంచరిష్ణు" వనదానిచే శైత్యమును జెప్పఁబడియె. ఈచెప్పుటచే శైత్య సౌరభ్యమాంద్యయుక్తమైనవాయువని స్పష్టమగుచున్నది. అట్టివాయువు గంధపుఁబూఁతలచేతఁ గలుషితమైనను నీరతి ఘర్మతోయమును నిర్విశంకముగా నశింపఁజేసి నీకు సుఖము గలిగింపఁజేయును. పెద్దజరువెత్తికొని యడవిఁబడివచ్చుబాటసారికి దప్పిగలుగునట్లు పూవుఁభూరిసౌరభము దాల్చి బృందావనమునం గ్రుమ్మరివచ్చువాయువునకును దప్పికలిగెనని భావము. బాలుఁడు ముందువెనుకఁ జూడక కలుషజలమునేని త్రాఁగునట్లే బడలినబాటసారియుఁ ద్రాగునని తెలియునది. సదాగతిపాంథుఁడు, అనుచోట సదాగతి యనఁగా నెల్లప్పుడును గమనముకలవాఁడని యర్థము. పాంథుఁడనఁగా నెల్లప్పుడునుబయనముచేయువాఁడని యర్థము. ఇట్లు చెప్పుటచే నెల్లకాలమును దాదృశసుఖకరవాయువు లభించుచున్నది. కావున వీని వరించి తత్సౌఖ్య మందు మని భావము. 'భవద్రతిఘర్మతోయమున్' అనుటచే రతిప్రయుక్త మయినశ్రమమునకు చల్లనిగాలి మిక్కిలి సుఖావహము గాన అపేక్షణీయము.

తా. ఓదమయంతీ! పుష్పములందలితావిని వరించి కావుననే యాయాసఖిన్నుఁడై బృందావనమందు సంచరణస్వభావము గలవాఁ డగు వాయు వను బాటసారి మిక్కిలి దప్పిచెంది గంధపుఁబూఁతచేతఁ గలుషిత మైనను సంభోగంబులందు నీశరీరమందుఁ బొడముచెమ్మటను బాలునివలె నిశ్శంకముగాఁ బానముచేయును. అలం. కావ్యలింగము. రూపకము. ఉపమ.

క. పాటించి యితని వేఁడిన
    చాటుకవీశ్వరులహస్తకజలజంబులకున్

హాటకదీనారములు వ
రాటకసంఘాతములు వరారాటేంద్రసుతా !　100

టీ. వరాటేంద్రసుతా=విరాటదేశాధిపతికుమారిక వగునో దమయంతీ ! పాటించి=తన్నుఁజేరి, ఇతనిన్ = ఈరాజును, వేఁడినచాటుకవీశ్వరులు = వేఁడుచున్నట్టియుఁ జాటుపద్యములు రచించుచున్నకవిచంద్రులయొక్క, హస్తజలజంబులకున్ =హస్తపద్మములకు, హాటకదీనారములు=బంగారునాణెములు, వరాటకసంఘాతములు= తామరదుద్దులసమూహములు అనఁగా నీరాజు కవీశ్వరుల కమితముగా బంగారునాణెములను బంచియిచ్చునని భావము. ఈచెప్పుటచే నలఁడు గొప్పదానశాలి యని స్పష్టమగుచున్నది. తామరదుద్దులు పచ్చగా నుండునుగాన దీనారములతో నుపమింప సరిపోవుచున్నది.

తా. ఓదమయంతీ ! తన్ను సమీపించి వేఁడుచున్నకవీశ్వరులచేతు లనెడి పద్మములకు నితఁడిచ్చు బంగారునాణెములు తామరదుద్దులసమూహము లై చెలంగును. అలం. రూపకము.

తే. అనిన విని యను ద్రావాల్చెఁ బక్ష్మాంచలములు
బాల తద్భావ మెఱిఁగి వాగ్భామ యపుడు
మఱియు నొకమానవేంద్రుసమక్షమునకు
నిందుబింబాస్యఁ దోడ్తెచ్చి యిట్టు లనియె.　101

టీ. అనినన్ = అనిపల్కఁగానే, వినియున్ = సరస్వతివర్ణనావాక్యములు విని యు, బాల=దమయంతి, పక్ష్మాంచలములు=కనుఱెప్పలకొనలు, ద్రావాల్చెన్ = మూసెను. తద్భావము=ఆమెయభిప్రాయమును, వాగ్భామ=సరస్వతి, ఎఱిఁగి= తెలిసికొని, అప్పుడు, మఱియు నొకమానవేంద్రు సమక్షమునకున్ =మఱియొక రాజేంద్రునొద్దకు, ఇందుబింబాస్యన్ = చంద్రునివంటిముఖము గలదమయంతిని, తోడ్తెచ్చి=కొనివచ్చి, ఇట్టులు అనియెన్ =ఇట్లు పలికెను.

తా. అని యిట్లు సరస్వతి వర్ణించుచుండ విని దమయంతి యూరకుండెను. సరస్వతి యామెతలఁపు తెలిసికొని వేఱొకరాజేంద్రునికడకుఁ గొనిపోయి యిట్లు చెప్పెను.

వ. మత్తకాశిని! యితండు కాశిరాజు. ఇతనిరాజధాని ముక్తిక్షేత్రం బగువారణాసి. ఇతనికులదైవతం బఖిలభువనస్థుం డగు ధూర్జటి. ఇతనివిహారదీర్ఘిక త్రిలోకసంతాపనిర్వాపణి యగు గీర్వాణతటిని. ఇతనిసత్రశాల విశాలాక్షీకేళిభవనంబు. ఇతని భుజాస్తంభదంభోళి రిపునృపాలబాలానయనాంబువృష్టిధారా సమేతంబు. 102

టీ. మత్తకాశిని! ఇతండు, కాశిరాజు, ఇతనిరాజధాని, ముక్తిక్షేత్రంబు= ముక్తినొసంగుపుణ్యక్షేత్రము అగువారణాసి. ఇతనికులదైవతంబు, అఖిలభువనస్థుండు - అఖిల=సమస్త, భువనస్థుండు=లోకములందుఁ గలవాఁడు-సర్వలోకవ్యాపి, ఐనధూర్జటి=అయినట్టిశంకరుఁడు, ఇతనివిహారదీర్ఘిక=ఇతని క్రీడాసరస్సు, త్రైలోక్యసంతాపనిర్వాపణి=మూఁడులోకముల సంతాపమును దొలంగించునది, అగుగీర్వాణతటిని=అయినట్టిగంగ, ఇతనిసత్రశాల = ఇతనిభోజనశాల, విశాలాక్షీకేళిభవనంబు=విశాలాక్షియొక్క క్రీడాభవనము. ఇతనిభుజాస్తంభదంభోళి-ఇతని= ఈరాజుయొక్క, భుజాస్తంభ=భుజాస్తంభమనెడి, దంభోళి =వజ్రాయుధము, రిపు...సమేతంబు—రిపునృపాల = శత్రురాజులయొక్క, బాలా=స్త్రీలయొక్క, నయనాంబు=కన్నీరనెడి, వృష్టిధారా=వర్షధారలతో, సమేతంబు=కూడియున్నది. అనఁగా నీరాజు తనబాహాబలముచే శత్రురాజులఁ జంపఁగా వారిభార్య లేడ్చుచున్నారని భావము. ఇంద్రాయుధము వర్షమునకుఁ గారణమగుచున్నట్టు లీరాజేంద్రుని బాహాస్తంభంబులు శత్రుస్త్రీల కన్నీటికిఁ గారణము లగుచున్నవని భావము. అలం. రూపకము.

చ. సకియ! యితండు నీవలుఁదకోచన్నులఁ గేవల నొత్తుఁగాతఁ గిం
శుకముకుళాభిరామతలు కొనుంకము పట్టునఖాంకురాంకముల్
ప్రకుపితశాంకరీచరణకోపంకజకుంకుమపంకసంకర
ప్రకటనిరంకశంకరకపర్దశశాంకకళాంకకారముల్. 103

టీ. సకియ=దమయంతి ! ఇతఁడు=ఈకాశిరాజు, ప్రకుపిత...కారముల్ -

ప్రకుపిత=మిక్కిలి కోపము చెందిన, శాంకరీ=పార్వతీదేవి యొక్క, చరణపంకజ=పాదపద్మములందలి, కుంకమపంక=కుంకుమబురద చేత, సంకర=కలిసియున్నట్టియు, ప్రకట=ప్రసిద్ధమైనదియు, నిరంక=మచ్చలేనిదియు నగు, శంకరకపర్దశశాంకకళా=ఈశ్వరునిజటాజూటమందున్న బాలచంద్రరేఖతో, అంకకారములన్=ద్వంద్వయుద్ధము చేయుచున్నవి. అనఁగాఁ బార్వతీదేవి ప్రణయకోపము వహించియున్నప్పుడు శంకరుఁడు పార్వతిపాదములపైఁ బడెను. ఆమెయప్పటికిని శాంతింపక కుంకమపూఁతచే వెలయు కాలితో శంకరుని శిరంబు తన్నెను. ఆసమయంబున శంకరునిశిరంబున నున్నదియు, నిష్కళంకమైనదియు నగు చంద్రరేఖకుఁ బార్వతి కాలు తగులఁగాఁ దత్సంబంధియగు కుంకుమ యారేఖ కంటుకొనెను. అట్టిదానిని గలహించుచున్నవనఁగా కావునఁ గొంచెము రక్తవర్ణము గల్గియున్నదాని మించుచున్నవని భావము. కింశుకముకుళఅభిరామతలు=మోదుగు మొగ్గలయొక్క-మనోజ్ఞతలను, సుంకముపట్టు = పన్నుగాఁగొనెడి-మోదుగు మొగ్గలకన్న మిక్కిలిసుందరములయిన యనుట. నఖాంకురాంకములన్-నఖాంకుర=గోటికొనలయొక్క, అంకములన్=చిహ్నములను, అనఁగా నఖక్షతములననుట, నీవలుఁదచన్నులఁ గేవలన్=గొప్పవైన నీకుచములప్రక్క, ఒత్తున్ కాక=గ్రుచ్చుఁగాక. అనఁగా నీరాజు సంభోగమందు నీ స్తనంబులందు నఖక్షతముల నించుఁగాత యని భావము. ఇతనితోఁ గూడి సుఖింపుమని ఫలితార్థము.

తా. ఓసమయంతీ! కోపించినపార్వతిదేవిపాదపద్మములం దున్న కుంకుమ బురదచే మిళితమైన యీశ్వరుని శిరమందున్న బాలచంద్రరేఖ కెనవచ్చు చు, మోదుగుమొగ్గలవలె మనోహరములైన నఖక్షతముల నీరాజేంద్రుండు నీకుచములందు నించుఁగాక. అలం. ఉపమ.

తే. అతివ! సంగ్రామరంగసంగతవిరోధి
నృపశిరోధిశిరాకాండకనివహాఖండి
చండభుజదండమండితకమండలాగ్ర
జాగ్రదుగ్రప్రతాపుఁ డీకజనవిభుండు. 104

టీ. అతివ=ఓదమయంతీ! ఈజనవిభుండు=ఈరాజు, సంగ్రామ...ప్రతాపుఁడు—సంగ్రామరంగ=యుద్ధరంగమందు, సంగత=అభిముఖులై వచ్చిన, విరోధినృప=శత్రురాజులయొక్క, శిరోధిశిరాకాండ=గొంతుక్రోవికాఁడలయొక్క,నిసహ=సమూహమును, ఖండి=ఖండించుటయందు, చండ=భయంకరమైన, భుజదండ=బాహుదండమునందు, మండిత = ఒప్పుచున్న, మండలాగ్ర = కత్తియందు,జాగ్రత్=ప్రకాశించుచున్న, ఉగ్ర=భయంకరమైన,ప్రతాపుఁడు=ప్రతాపముకలవాఁడు. అనఁగా శత్రువుల ఛేదింపఁజాలినపరాక్రమముచే నొప్పువాఁడని భావము. ఈపద్యములో "నృపశిరోధిశిరఃకాండ" అని కొన్ని ప్రతులలోను, "నృపశిరోధిగరుత్కాండ" అని కొన్నిప్రతులలోను గాన వచ్చుచున్నది. ఈరెండుపాఠములను సమన్వయోపయోగములు కాలేదు. ('శిరాకాండ' అని దిద్దఁబడినది.)

తా. ఓదమయంతీ! ఈరాజు యుద్ధరంగములందుఁ దారసిల్లిన శత్రురాజుల కంఠనాళముల ఖండించుటయందు సమర్థమై, భుజదండమందు వెలయుచున్న ఖడ్గంబునఁ బ్రకాశించు భీకరప్రతాపము కలవాఁడు.

క. దశశతదృగర్వగర్వ
 ప్రశమనహేలాధురీణపటువేగనిరం
 కుశసైన్యతురగరింఖా
 విశకలితదిగంతధరణి వీఁడు లతాంగీ! 105

టీ. లతాంగీ=లతవంటిశరీరముగల దమయంతీ! వీఁడు=ఈకాశీరాజు, దశ...ధరణి—దశశతదృక్=వేగన్నులవాని - అనఁగా నింద్రునియొక్క యనుట, అర్వ=గుఱ్ఱముయొక్క, అనఁగా నుచ్చైశ్శ్రవముయొక్క యనుట, గర్వ=అతిశయమును, ప్రశమనహేలా=శాంతి పొందించుటయనెడి విలాసముయొక్క, ధురీణ=భారమువహించిన, పటు=సమర్థమైన, వేగ=వేగము కలవి. అనఁగా నుచ్చైశ్శ్రవమును మించుచున్న వేగము కలవని భావము, నిరంకుశ = అడ్డులేని, సైన్యతురగ=సేనయందున్న యశ్వములయొక్క, రింఖా=డెక్కలచేత, విశకలిత=చూర్ణము చేయఁబడిన, దిగంతధరణీ=దిక్కులయొక్క అంతప్రదేశములు

కలవాఁడు. అనఁగా నతఁడు నిరాటంకముగా దిగంతములవఱకుఁ బోయి శత్రువుల జయించినవాఁ డని భావము.

తా. ఓదమయంతీ! ఉచ్చైశ్శ్రవమును మించినవేగము గలిగి సమర్థములై యున్న యితనిసేనలోని గుఱ్ఱములు దిగంతములవఱకు భూమిని నలియఁద్రొక్కినవి. అట్టియీరాజును వరింపుము.

వ. అని వర్ణించుచుండ దమయంతికి నిజమహోత్సవాగతానేకలోకశోభావలోకనకుతూహలంబునం బరాకు వహించి యుండె. అవ్విధం బక్కాశిరాజునకుం గ్లేశావహం బయ్యె. సరస్వతీదేవియు వేఱొక్కనరదేవోత్తముం జూపి యి ట్లనియె. 106

టీ. అని, వర్ణించుచుండఁగా = ఈసరస్వతి కాశిరాజుగుణసముదయమును నుతించుచుండఁగా, దమయంతి, నిజ...కుతూహలంబునన్ —నిజ=తనయొక్క, మహోత్సవ=స్వయంవర మహోత్సవమునిమిత్తము, ఆగత=వచ్చిన, అనేక=పెక్కురగు, లోక=జనులయొక్క, శోభా=సొబగును, అవలోకన=చూచుట యందలి, కుతూహలంబునన్ = వేడుకచేత, పరాకు, వహించి, ఏమఱి, ఉండెన్, అవ్విధంబు, ఆకాశీరాజునకున్, క్లేశావహంబు=కష్టము కలిగించునది, అయ్యెన్, సరస్వతీదేవియు, వేఱొక్కనరదేవోత్తమున్=మఱియొక రాజును, చూపి, ఇట్లనియెన్.

తే. ఈనృపాలుఁ డయోధ్యాపురీశ్వరుండు
 పేరు ఋతుపర్ణుఁ డాకర్ణచారునయన !
 వీని వరియింపు సముదీర్ణవిధసువర్ణ
 కేతకీగర్భపర్ణాతిపీతవర్ణ. 107

టీ. ఆకర్ణచారునయన!=చెవులవఱకు వ్యాపించిన నేత్రములు కలదానా! ఈ నృపాలుఁడు= ఈరాజు, అయోధ్యాపురీశ్వరుండు=అయోధ్యానగరాధిపతి, పేరు=ఇతనినామము,ఋతుపర్ణుఁడు, సముదీర్ణ...వర్ణ—సముదీర్ణవిధ=ఎక్కువైనరీతిగల, అనఁగా మెఱుఁగైన యని భావము, సువర్ణకేతకీ = బంగార

మొగలిచెట్టుయొక్క, గర్భపర్ణ = గర్భదళములకంటె, అతిపీత = మిక్కిలి పీతవర్ణముగల, పర్ణక్ = చాయగల, వీక్ష = ఈరాజును, వరింపుము.

తా. ఓదమయంతీ! యీరాజయోధ్య కధిపతి. పేరు ఋతుపర్ణుఁడు. గేదంగి రేకులకంటెఁ బచ్చనిచాయగల యితని వరింపుము.

ఉ. వారివిహారవేళఁ జెలువా! చెలువారెడినీచనుంగవన్
సారపుఁదారహారములచందముఁ గైకొనుఁగావుతం జమ
త్కారము క్రొత్తయై మెఱయఁగ దత్తటసీమపరిస్రుతుటత్సదా
సారవసారవూర్మిభవసారవరాంబుపృషత్కదంబముల్.

టీ. చెలువా=ఓదమయంతీ! వారివిహారవేళన్ = జలక్రీడ సలుపునపుడు, చెలువారెడి నీచనుంగవన్=ఒప్పుచున్న నీకుచకుంభములందు, తత్తట...కదంబముల్—తత్తటసీమన్=ఆ స్తనప్రాంతములందు, పరిస్రుతటల్ = విఱుగుచున్న, సదా=ఎల్లప్పుడును, సారవ=ధ్వనితోఁగూడిన, సారవ=సరయూనది సంబంధులగు, ఊర్మి=తరంగములవలన, భవ=పుట్టిన, సార=గొప్పవయిన, వర = శ్రేష్ఠమైన, అంబు=నీటియొక్క, పృషత్కదంబముల్=బిందుసమూహములు, చమత్కారము=అద్భుతరసము, క్రొత్తయై=నూతన మై, మెఱయన్ = ప్రకాశించునట్లుగా-సూత్రము లేకయే హారములవలె నుండుటచే నాశ్చర్యమనుట. సారపుఁ దారహారములచందము = శ్రేష్ఠమైన ముత్యాలహారములరీతిని, కైకొనుఁగావుతన్ =స్వీకరించును గాక. అనఁగా జలక్రీడలు సల్పునప్పుడు నీ స్తనముల ప్రాంతముల విశీర్ణమగుచున్న నీటిబిందువులు చూపఱకు దారము లేకయే వింతగానున్న ముత్యాలహారమువలెఁ జూపట్టునుఁ గాక ; సరయునదీభవములు సారయవములని రూపనిష్పత్తి గావలసి వచ్చినను, "దాండి నాయనహాస్తినాయన" అనుసూత్రములోనిపతించుటవలన "సారవ" అనురూపము సిద్ధించినది. ని'దేవికాయాంసరయ్వాంచ భవేదావిక సారవా" అని యమరకోశము.

తా. ఓదమయంతీ! జలక్రీడాసమయములందు సుందర మైననీచనుఁగవయందుఁ దత్ప్రాంతములందు విఱుఁగుచున్న సరయూనదీతరంగముల సంబంధు

లగు జలబిందువులు చూపఱకు నీస్తనములపై సూత్రము లేకున్న హారములవలె వింతయై కనుపట్టుఁగాక. అలం. భ్రాంతిమంతము.

తే. ఇతనితాత భగీరథుం డతులమహిమ
నవనిఁ బ్రవహింపఁగాఁ జేసె నభ్రగంగ
నితఁడు త్రైలోక్యమునఁ బ్రవహింపఁ జేసెఁ
గీరభాషిణి! వరధర్మకీర్తిగంగ. 109

టీ. ఇతనితాత=ఈఋతుపర్ణునితాత, భగీరథుండు = భగీరథుఁ డనురాజు, అవనిన్=భూలోకమందు, అతులమహిమన్=సాటిలేని సామర్థ్యముచే, అభ్రగంగన్=ఆకాశనదిని, ప్రవహింపఁజేసెన్=పాఱించెను. అనఁగా సగరుఁడు హయమేధము చేయుచుండఁగా నింద్రుఁ డాయశ్వము నపహరించెను. దానిఁ గనుఁగొనఁబోయి సగరపుత్రులు సముద్రములను ద్రవ్వి పాతాళమునకుఁ బోయి తమచే నవమానితుఁడైన కపిలుని కోపాగ్నికిఁ గాష్ఠము లైరి. వారల కుత్తమ లోకములు గల్గుటకై భగీరథుఁడు గంగానదిని గొనివచ్చి భూలోకమునఁ బ్రవహింపఁజేసె. కీరభాషిణి=చిలుకవంటి పలుకులు గల దమయంతీ! ఇతఁడు=ఈరాజు, వరధర్మకీర్తిగంగన్—వర=శ్రేష్ఠమైన, ధర్మ = ధర్మములవలనఁ గల్గిన, కీర్తిగంగన్=యశస్సనెడి గంగానదిని, త్రైలోక్యమునన్=ముజ్జగములందును, ప్రవహింపన్, చేసెన్, అనఁగా నితఁ డధిక మగుకీర్తి కలవాఁడని భావము.

తా. ఓదమయంతీ! ఇతనితాత భగీరథుఁడు గంగానదిని గొనివచ్చి భూలోకమునఁ బాఱించెను. ఇతఁడు కీర్తిగంగను ముజ్జగములందును బాఱించెను.

చ. కవివచనంబు లీతనియగాధయశఃకలశాంబురాశిలోఁ
లవములువోలె డిందు విమలం బగుపీనిగుణప్రతానముం
దివిరి దిగంతసంపుటతటిన్ బుధమండలి లెక్కవ్రాయుఁ దా
నవము భజించువైరినరనాథయశఃఖటికాకలాపముల్. 110

టీ. ఈతని...రాశిలోన్—ఈతని=ఈరాజుయొక్క, అగాధ = లోఁతైన, యశః=కీర్తియనెడి, కలశాంబురాశిలోన్=క్షీరసముద్రములో, కవివచనంబు

లు=కవీశ్వరులవాక్కులు, లవములునోలెన్=లేశములవలె, డిందున్=నాశన మగును. అనఁగా నీతనికీర్తిని కవివర్యులు నుతింప సమర్థులుకాకుండిరని భావము. విమలంబు=నిర్మలమైనది, అగు వీనిగుణప్రతానమున్=అయినట్టివీనిగుణసమూహమును, బుధమండలి=పండితసమూహము, తివిరి=ప్రయత్నించి, దిగంత సంపుటతతిన్=దిగంతము లనెడి సంపుటనిచయమందు, లెక్కవ్రాయన్=లెక్కించుట కంకెలువేయఁగా, వైరి......కలాపముల్—వైరినరనాథ=శత్రురాజులయొక్క, యశఃఖటికా=కీర్తియనెడి లేఖన ద్రవ్యముయొక్క, కలాపముల్=సమూహములు, తానవమున్=కృశత్వమును, భజించున్ = పొందును. అనేకములైన యంకెలను వ్రాసినచో లేఖనద్రవ్యములు-అనఁగా కలములు. నాశన మొందును. ఇతనిగుణము లనంతము లగుటచే గణించుటకు శక్యముకాదని భావము. అనఁగా నితనికీర్తియుండట శత్రుకీర్తులు ప్రకాశింపలేదని ఫలితార్థము.

తా. ఓదమయంతీ! యితనికీర్తియనెడి లోఁతైన పాలసంద్రములోఁ గవీశ్వరులవర్ణనలు లేశములై నశించును. ఇతని నిర్మల గుణములను బండితసమూహము దిగంతము లనెడి సంపుటములందు లెక్కలు వ్రాయఁగా శత్రుపులకీర్తి యనెడి కలములు కృశించుచున్నవి. అలం. రూపకము.

శా. అంభోజానన ! వీని నెట్లు నుతి సేయ న్వచ్చు నేతత్తనూ
సంభూతం బగురోమసంఘము మహాసత్త్వాంకురశ్రేణి య
త్తంభాటోపవిజృంభమాణరిపుదోస్స్తంభోరుకుంభీనసా
రంభస్తంభనమంత్ర మీతనికరోదశ్వేళ యాలంబునన్.

టీ. అంభోజానన=పద్మమువంటిముఖము గలదమయంతీ ! వీనిన్ = ఈరాజును, ఎట్లు=ఏరీతిగా, నుతి చేయన్ వచ్చు=స్తోత్రముచేయఁ గూడును? ఏతత్తనూసంభూతంబు=ఈరాజుయొక్క శరీరమందుఁ బుట్టినది.అగురోమసంఘము=అయినట్టిరోమసమూహము, మహా...శ్రేణియే—మహత్=గొప్పదైన, సత్త్వ=వీరరసముయొక్క, అంకురశ్రేణియె=మొలకలయొక్కవరుసయే. అనఁగా నితనిరోమములు లోపలనున్న వీరరసముయొక్క యంకురములే. కావుననే వీరరసోత్సాహముచే నితఁడు రోమాంచముకలవాఁడగుచున్నాఁడు. ఆలంబునన్=

యుద్ధమందు, ఈతని కఠోరత్వేళ=శ్రవణదుస్సహమైన యితనిసింహనాదము, అస్తంభ...మంత్రము—అస్తంభ = ఉగ్రమయిన, ఆటోప = అతిశయముచేతను, విజృంభమాణ=అతిశయించుచున్న, రిపు=శత్రువులయొక్క, దోస్తంభ బాహుస్తంభము లనెడి, ఉరు=గొప్పవయిన, కుంభీనస = సర్పములయొక్క, ఆరంభ=సంచారమును, స్తంభన=నిర్బంధించుటయందు, మంత్రము=మంత్రతుల్యమైనది. అనఁగా గారుడమంత్రమువలన సర్పములు కట్టఁబడినట్లు వీనిసింహనాదము విన్నప్పుడు శత్రువులహస్తములు కట్టఁబడుచున్న వని భావము. ఇతని నామమును విని భీతినొందిన శత్రువులబాహువులు యుద్ధముకొఱకు సాఁగవనుట. శుద్ధి పొందినవైదికమంత్రములవలన సర్పములు కట్టఁబడునని ప్రసిద్ధి.

తా. ఓవనుయంతీ! ఈతనిశరీరమం దునయించినరోమసమూహము, వీరరసముయొక్క యంకురములసమూహమే. యుద్ధరంగములం దితనిసింహనాదము, శత్రువులబాహువు లనెడిసర్పరాజులను నిర్బంధించుటకు వైదికమంత్రమువంటిది. అలం. ఉత్ప్రేక్ష. కావ్యలింగము. రూపకము.

శా. గంభీరప్రతిపక్షరాడపయశఃశ్రీకాళిందియుక్ వీనిదో
స్తంభోద్భూతయశోభ్రగంగయు నవిక్ శ్రీసంశ్లేషముం బొం
దు నా,సంభేదంబునఁ గ్రుంకి కాంచును మహాశ్రీక్షత్త్రంబు రం
భాపరీ,రంభానందని కేతనందనవిహారశ్రీప్రౌఢివిస్రంభముల్.

టీ. గంభీర...కాళిందియుక్—గంభీర = లోఁతైన అపకీర్తిపక్షమున మిక్కిలియైన, ప్రతిపక్షరాట్ = శత్రురాజులయొక్క, అపయశః = అపకీర్తి యనెడి, కాళిందియుక్ = యమునానదియును, వీని...గంగయుక్—వీని = ఇతనియొక్క, దోః స్తంభ = బాహుస్తంభములవలన, ఉద్భూత = పుట్టిన—స్తంభములవలె నిడుదలును దృఢములునయిన బాహువుల బలిమిచేఁ గలిగినట్టి, యశోభ్రగంగయుక్ = కీర్తియనెడి గంగానదియును, సంశ్లేషముక్ పొందుక్ = కలియును, ఆసంభేదంబునక్ = ఆసంగమస్థలమందు, అనఁగా. గంగాయమునానదీ సంగమస్థలమైన ప్రయాగయం దని భావము. లేక ఆసంభేదంబునక్ = ఆయుద్ధమునందు, మహాక్షాత్త్రింబు = గొప్పక్షత్త్రియ

సమూహము, అనఁగా క్షత్రియభటులనుట, క్రుంకి= తానమాడి, యుద్ధపక్ష మందుఁ జచ్చి, రంభా...విస్రంభముల్ - రంభా= రంభయనెడి యచ్చరయొక్క, పరీరంభ=ఆలింగనంబువలనఁ గల్గిన, ఆనంద = ఆనందమునకు, నికేత = నివాసభూతమైన, నందన = దేవోద్యానమందు, విహార = విహరించుటయందలి, ప్రౌఢి=దిట్టమైన, విస్రంభముల్ = నమ్మకములను, కాంచును = పొందును. అనఁగా—సందేహములేక యట్టివిహారము నొందుననుట. గంగాయమునానదులు గలిసినచోటఁ దానమాడినవారు నందనవనమందు రంభాదులతోఁ గూడి విహరింతురని వేదములందుఁ జెప్పఁబడినది. అట్లె యుద్ధమందుఁ గూలిన వారుగూడ స్వర్గమందు సకలసుఖంబులనుభవింతురని చెప్పఁబడినది. యుద్ధమనెడి ప్రయాగలో ఋతుపర్ణునియొక్క కీర్తిగంగయు శత్రువులయపకీర్తి యమునయుఁ గూడఁగా నందు దేహంబు వదలినక్షత్రియులు స్వర్గమును జేరుచున్నారని భావము. ఇందువలన ఋతుపర్ణునికీర్తి యభ్రగంగవలెనున్నదనియు, యుద్ధంబులందుఁ బెక్కండ్ర శత్రువులను గూల్చుచున్నాఁడనియుఁ దెలియఁదగినది. అలం. రూపకము.

తా. దమయంతీ! సంగరములందుఁ బాఱుటవలనఁ గల్గిన యపకీర్తి యనెడి యమునానదియు, నితనిబాహుపరాక్రమమువలన నుదయించిన కీర్తియనెడి గంగానదియుఁ గలిసినస్థలమందుఁ గ్రుంకులిడిన క్షత్త్రియవీరులు స్వర్గమునకేఁగి నందనవనమం దచ్చరులతోఁగూడి విహరించుభాగ్యంబును బొందుదురు.

శా. తాదృగ్దీర్ఘవిరించివాసరకరత్వంబుం బ్రతిష్ఠించుచున్
యాదోధం దననీడబాడబముగా నాకాశసంవ్యాప్యరి
త్యాదారిస్థిరకీర్తితారకముల న్మాయించు చేతత్ప్రితా
పాదిత్యుండు వెలుంగుఁ బద్మముఖివాక్చాగోచరప్రక్రియన్.

టీ. పద్మముఖి = పద్మమువంటిముఖము గలదమయంతీ! ఏతత్ప్రతాపాదిత్యుండు = ఇతనిప్రతాపమనెడి సూర్యుఁడు, తాదృక్...కరత్వంబున్ - తాదృక్ =అటువంటి, దీర్ఘ = పొడుగైన, విరించివాసర=బ్రహ్మదినముయొక్క— పగటిని, కరత్వంబున్ = చేయుటను, ప్రతిష్ఠించుచున్ = స్థాపించుచు,

పదునాలుగు. మన్వంతరములకాలము బ్రహ్మకు దిన మగుచుగాన యాదినము దీర్ఘమని చెప్పవచ్చును. దినమును జేయువాఁడు సూర్యుఁడుగాన బ్రహ్మదినంబును గూడ సూర్యుఁడే చేయవలెను. కాని చతుర్దశ మన్వంతరములకాలము పరిమాణముగలయట్టిదినమును సామాన్యసూర్యుఁడు నిర్మింపఁజాలఁడని తలంచి యాసూర్యునికంటె విలక్షణుఁడును, చిరకాలస్థాయియును, మిక్కిలిప్రకాశముగలవాఁడును, నగు నేతత్ప్రతాపసూర్యుఁడు నిర్మితుఁడయ్యెనని భావము. తన్నీడ= ఆప్రతాపసూర్యునినీడ, యాదోధిన్ = సముద్రమునందు, బాడబముగన్ = బడబాగ్నిహోత్రమగుచుండఁగా, బడబాగ్నియాప్రతాపాదిత్యుని ప్రతిబింబము వలెనుండెను. ఇట్టిబడబాగ్నిని బ్రతిబింబముతోఁ బోల్చుటచేతను, ప్రతిబింబముకంటెను స్వతస్సిద్ధవస్తువునం దధికగుణముండుట సహజమగుటచేతను, నీరాజప్రతాపము బడబాగ్నిని మీఱుచున్నదని తోఁచుచున్నది. ఆకాశ... తారకములన్- ఆకాశ=ఆకాశమందు, సంవ్యాపి=వ్యాపించియున్న, అరిక్ష్మాధర=శత్రురాజులయొక్క, స్థిర=శాశ్వతములైన, కీర్తితారకములన్=కీర్తులనెడి నక్షత్రములను, మాయించుచున్=నశింపఁజేయుచు, వాచామగోచరప్రక్రియన్=వాక్కులనతిక్రమించినరీతిచే, వెలుఁగున్= ప్రకాశించుచుండును. శత్రురాజులకీర్తులను నక్షత్రములతోఁ బోల్చుటచే నవి మిక్కిలి స్వల్పములని తోఁచుచున్నది. ఇతనిప్రతాపసూర్యుని యెదుట శత్రువులకీర్తులు తిరస్కరింపఁబడుచున్న వని భావము. అలం. ఉత్ప్రేక్ష, రూపకము.

తా. ఓదమయంతీ! ఈ రాజుప్రతాపమనెడి యాదిత్యుఁడు బ్రహ్మదేవునిదినమును జేయ సమర్థుఁడై, బడబాగ్నిహోత్రము తనకుఁ బ్రతిబింబమై ప్రతిఫలింపఁగా నాకాశమందు వ్యాపించియున్న శత్రువుల కీర్తినక్షత్రములఁ దిరస్కరించుచు, వాక్యముల కందనివాఁడై ప్రకాశించుచున్నాఁడు.

క. అన వినియు విననియట్ల
జ్జననాథతనూజ యున్నచందము గని య
మ్మనువంశాగ్రణియవలకుఁ
జన నసుమతిఁజేసె నలువసతి వాహతతిన్. 114

టీ. అనన్ = సరస్వతియట్లుపలుకఁగా, అజ్జనవాథతనూజ=ఆదమయంతి, వినియున్, వినమియట్లు=వినకుండినట్లు, ఉన్నచందము=ఉన్నట్టిరీతిని, కని= చూచి, అమ్మనువంశాగ్రణి యనలవున్ =ఆరాజేంద్రునియవతలకు, చనన్ = వెళ్లుటకు, స్వనలువసతి = భారతి, వాహతతిన్ =వాహకసమూహమును, అనుమతి చేసెన్ =ఆజ్ఞాపించెను.

తా. సరస్వతి యట్లు చెప్పినపలుకులు వినియు వినకుండున ట్లుండఁగా సరస్వతి యామెమనోవిరాగంబుం జూచి యారాజేంద్రుని పిడిచిపోవుటకు యానధరుల నాజ్ఞాపించి.

వ. ఇట్లనుమతించి. 115

ఉ. అక్కడ నొక్కభూపతి ననంగునికంటెను రూపసంపదన్
జక్కనివానిఁ జూపి సరసత్వముమై మధురస్వరామృత
న్యక్కృతమత్తకోకిల సనాతని తామరచూలిదేవి యా
క్రక్కసజవ్వనిం గరము గారవమొప్పఁగఁ జూచి యిట్లనున్.

టీ. అక్కడన్ =ఆస్థలమందు, అనంగునికంటెను=మన్మథునికంటె, రూపసంపదన్ =సౌందర్యసమృద్ధిచే, చక్కనివానిని=అందముగలవాఁడగు, ఒక్కభూపతిని= ఒకరాజకుమారుని, చూపి, మధురస్వరామృత= ఇంపైనధ్వనియనెడి యమృతముచేత, న్యక్కృత=తిరస్కరింపఁబడుచున్న, మత్త=మదించిన, కోకిల=కోవిలగలదియు,అనఁగాఁ గోకిలధ్వనికంటె మధురమైనస్వరముగలదని భావము. సనాతని=నాశనరహితురాలైన, తామరచూలిదేవి=సరస్వతి, సరసత్వముమైన్ =సరసత్వముచే, ఆక్రక్కసజవ్వనిన్ =కఠినపు యౌవనవంతురాలైన దమయంతిని—ఎట్టివానిని ఒల్లక గడుసయినదానిని, కరము = మిక్కిలి, గారవము, ఒప్పఁగన్ =ఒప్పునట్లుగా, చూచి, ఇట్లనున్ =ఇట్లు చెప్పెను.

తా. కోకిలస్వరమును మించుచున్న స్వరము గలదియు, నాశరహితురాలునగు సరస్వతి యాప్రాంతమున సౌందర్యసంపదచే మన్మథుని మించుచున్నయొకరాకుమారుని నవయౌవనవతి యగుదమయంతికిఁ జూపి గౌరవ మొప్పునట్లుగాను సరసముగాను నిట్లుపలికెను.

తే. పాండ్యభూపాలుఁ డీతండు కో పద్మనయన
యితని వీక్షింపు నిజకటాక్షేక్షణముల
మానశాలిని శాలీనతానత మగు
నాననాంభోజ మెత్తు కో మీఁ యత్తరమున.    117

టీ. పద్మనయన=పద్మములవంటి నేత్రములుగలదానా! ఈతండు=ఈరాజు, పాండ్యభూపాలుండు=పాండ్యదేశపురాజు, నిజకటాక్షేక్షణములన్=స్వకీయమైన కడకంటిచూపులచేత, ఇతనిన్, వీక్షింపుము=చూడుము, మానశాలినీ=అభిమానముచే నొప్పుచున్నదానా! శాలీనతానతము = సిగ్గుచే వంపఁబడినది. అగు నాననాంభోజము = అయినట్టి ముఖపద్మమును, అత్తరమునన్=త్వరతో, ఎత్తుమీ.

తా. ఓదమయంతీ! ఇతఁడు పాండ్యదేశాధిపతి. ఈసభామధ్యమున సిగ్గుచే నమ్రమైన నీవదనకమలమునెత్తి నీకడకంటిచూపులతో నీతని వేగ చూడుము.

ఉ. ఈసకలావనీతలము కో నెక్కటిఁ దాన పరిభ్రమించి య
భ్యాసపరంపరాపరత కో నభ్రమున న్విహరింపఁగోరియో
లాసిక కీర్తివిభ్రమక కోలాగరిమ న్నటియించు చుండునీ
రాసుతు వంశరత్నముఁ దికోరంబుగఁ జెంది యమందలీలలన్.

టీ. ఇందు కీర్తిపరముగాను లాసికాపరముగాను నర్థద్వయము తెలియునది-కీర్తి=కీర్తియనెడి, లాసిక=బొమ్మరిది, ఎక్కటిన్=అసహాయముగా, ఈ సకల అవనీతలము-సమస్తమైన యీభూమండల మని కీర్తిపరమయిన యర్థము-కలలతో-అనఁగా నర్తనాది కలల కౌశలములోఁ గూడిన-అనఁగా నట్టి కౌశలము నెఱుంగఁజాలిన, వారుండుచోట నని లాసికాపరమయిన యర్థాంతరము. తాను+అ=తానొక్కరే - పఱొకరికీర్తి పొడసూపునట్లుగా నని కీర్తిపరమైన యర్థము-వేఱొకదొమ్మరిది తలసూపకుండునట్లు గానని లాసికాపరమైన యర్థాంతరము. పరిభ్రమించి=తిరిగి (కీర్తిపరము)- గిఱగిఱఁదిరిగి మొగ్గవ్రాలి (లాసికాపరము), అభ్యాసపరంపరా పరతన్=పడితగని యలవాటు చేయుటయందలి

ఆసక్తిచేత, అభ్రమునన్=స్వర్గమం దని యర్థము-ఆకాశమందని యర్థాంతరము, విహరింపన్=సంచరించుట కని యర్థము-క్రీడించుట కని యర్థాంతరము, కోరెదో=అపేక్షించియే కాఁబోలు, వంశరత్నమున్=కులమందు శ్రేష్ఠుఁడయిన యని యర్థము- మేటి వెదురయిన యని యర్థాంతరము, ఈరాకుమరున్=ఈరాజకుమారుని, తిరంబుగాన్=గట్టిగా, చెంది=అవలంబించి, యని యర్థము-ఎక్కి యని యర్థాంతరము. విభ్రమకలాగరిమన్=విహరించు కలయందలి యతిశయముచేత నని యర్థము-గిఱగిఱం దిరుగుపట్టి శిల్పముయొక్క యతిశయముచేత నని యర్థాంతరము, అమందలీలలన్=అతిశయించిన ఆటలను, నటించున్=ఆడుచున్నది. అనఁగా దొమ్మరిది మొదట భూమిపయినుండి పెక్కు విద్యలాడి పిమ్మట వెదురుగడ యొక్క మింటియందుఁ బలువిధముల నటనము చేయును. కీర్తియనెడి దొమ్మరిది భూతలమం దన్నిచోట్లను ఆడి, తరువాత ఆకాశమందు నయితేను నవలంబనము లేకయే యాడుట గలుగుటకై యభ్యాసముకొఱకు నీరాజనెడి మేటి వెదురుగడ నాశ్రయించి యిచ్చకొలఁది విద్యలాడుచున్నది. అనఁగా నీరాజు నాశ్రయించినకీర్తి భూమి యంతయుఁ బర్వి స్వర్గమునందును విహరించుచున్న దని తాత్పర్యము. అలం. పర్యాయము. అప్రస్తుతప్రశంస.

తా. ఓదమయంతీ! ఇతనికీర్తినర్తకి సమస్తభూమండలమునందును సంచరించి యభ్యాసవశమున గగనమందుఁగూడ విహరింపనెంచియే కాఁబోలును, విద్యాతిశయముచే నీరాజనెడి వెదురును నూఁతగా ననంతములైన లీలలం జూపుచు నృత్యముచేయుచున్నది అలం. రూపకము.

తే. ఇతనిరిపురాజరాజి యేకేటిదరుల
నడవులకవులు దప్పక కరిగి యరిగి
యనుగుణంబులు కాలమార్యత కడవులైన
యాత్మనగరంబులను యదృచ్ఛానువృత్తి. 119

టీ. ఇతనిరిపురాజరాజి=ఇతనిశత్రురాజులయొక్క సమూహము, ఏకేటిదరులన్=ప్రతినద్యంతములను, అడవులకవులు=ప్రతివనమును, అరిగి అరిగి =

పోయి పోయి, బహుకాలశూన్యతన్ = చిరకాల మెవ్వరును నుండక పోవుటచే, అడవులు=వనములు, వినయాత్మనగరంబులకున్=తమపట్టణములను, యదృచ్ఛానువృత్తిన్=స్వేచ్ఛావృత్తిచేత, అరుగున్ = పోవుచుండును. వన బుద్ధిచేతనే తమపురములను బ్రవేశించుచున్నారు. అనఁగా నితనిశత్రువులు ప్రతిసంవత్సర మొక్కొకయడవియందుఁ గాఁపురము చేయుచు నొకవనము నుండి వేఱొకవనమునకుఁ బోవుచు నట్లుపోవునపుడు వనములై యున్న తమపురములనే పొందుచున్నారు. శత్రువులను బురంబులనుండి తఱిమివేయుటచే వారిపురములు జనశూన్యములై యడవులై యున్న వని ఫలితార్థము.

తా. దమయంతీ! ఈరాజుశత్రురాజులు ప్రతివత్సర మొక్కొక్కవనము నందు నివసించుచుఁబోయిపోయి, కొంతకాలమునకు జనశూన్యమగుటచే నడవులైనతమపురములను వనబుద్ధిచేతనే ప్రవేశించుచున్నారు. అలం. పర్యాయము.

స్రగ్ధరా. ఆలోకాలోక మేదినీన్యమలమలయజోదారవిస్ఫారకీర్తిన్
ఖేలాకూపారపారాఖిలజనవినుతాక్షీణచాపప్రతాపున్
బాలా వీక్షింపువీనిం బదయుగయుగపత్పాతిభూపాతిభూమ
శ్చూడాహారత్నోడుపఙ్క్తిస్సులభపరిచయారస్తోకనందన్నఖేందున్.

టీ. బాలా=దమయంతీ! ఆలోకా...కీర్తిన్-ఆలోకాలోక = చక్రవాళ పర్యంతముగల, మేదినీ= భూకాంతకు, అమల=స్వచ్ఛమైన, మలయజ=మంచి గందపుపూఁత యయినదియు, ఉదార=గొప్పదగునదియు, విస్ఫార=ప్రకాశించు చున్న, కీర్తిన్=యశస్సుగలవానిని, ఖేలా...ప్రతాపున్-ఖేల=రమ్యమైనదియు, అకూపారపార=సముద్రముయొక్క అవ్వలితీరమందున్న, అఖిలజన=సమస్తజనులచేతను, వినుత=కొనియాడఁబడుచున్న, అక్షీణ=గొప్పదియైన, చాపముయొక్క ప్రతాపము గలవానిని, అనఁగా నితని ధనుఃప్రతాపము సముద్రపునవ్వలి తీరములవఱకు వ్యాపించినదనిభావము. పద...నఖేందున్-పదయుగ = చరణ ద్వయమందు, యుగపత్=ఒక్కమాఱుగా, పాతి=పడుచున్న, అనఁగా నమస్కరించుచున్న యనుట. భూప=రాజులయొక్క, అతిభూమః = మిక్కిలి తఱుమగా...

ర్యలతోఁడ, సులభపరిచయ=సులువయినకూడికచేత, అస్తోక=మిక్కుటముగా, నందత్=సంతసించుచున్న-(నఖపరముగా) చెలువు గులుకుచున్న, నఖేందున్ =నఖములనెడి చంద్రులుగలవానిని—అనఁగాఁ దనపాదములందుఁ బడుచున్న సమస్తరాజులయొక్క శిరములందున్న రత్నంబులకాంతులచే వర్ధిల్లుచున్న నఖకాంతులుగలవాఁడును గీర్తిమంతుఁడును, ప్రతాపవంతుఁడును నని భావము. వీనిన్=ఈరాజును, వీక్షింపుము = చూడుము, అనఁగా సమస్తరాజులచేతను మ్రొక్కఁబడుచున్నయితనిఁ బోలినభూపాలుండు లేఁడు కావున నీతని వరింపుమని యభిప్రాయము.

తా. ఓదమయంతీ! చక్రవాళపర్వతముచేఁ జుట్టఁబడిన భూమికి మంచి గందపుఁబూతవలె వెలయుచున్న యుదారమైన కీర్తిగలవాఁడును, సముద్రతీరములవఱకు వ్యాపించిన యుగ్రమైన ప్రతాపము గలవాఁడును, పాదపద్మములం దొక్కమాఱుగాఁ బడిన రాజులశిరోరత్నములచే సంవర్ధితమైననఖకాంతులు గలిగినవాఁడును, నగు వీనిని, వీక్షించి పెండ్లియాడుము.

శా. భంగాకీర్తిమషీమలీమసతమప్రత్యర్థిపృథ్వీపతి
త్వంగత్తిందుకకాననాంతరములన్ వర్తిల్లునత్యుల్లస
ద్భంగిన్ వీనిప్రతాపవహ్ని జగదుత్సంగంబునన్ దత్స్ఫులిం
గాంగారంబులుభానుఁడున్ శిఖియుజంభారాతిదంభోళియున్.

టీ. వీనిప్రతాపవహ్ని=వీని ప్రతాపాగ్నిహోత్రము, భంగ... కాననాంతరములన్-భంగ=పరాజయముచే, అకీర్తి=దుష్కీర్తియనెడి, మషీ=మసిచేత, మలీమసతమ=మిక్కిలి మలినీభూతులైన, ప్రత్యర్థిపృథ్వీపతి=శత్రురాజులనెడి, త్వంగత్=వడఁకుచున్న, తిందుకకాననాంతరములన్ = నల్లతుమికిచెట్లయొక్క మధ్యమందు, అత్యుల్లసద్భంగిన్=మిక్కిలి ప్రకాశించురీతిచే, వర్తిల్లున్= ప్రవర్తించుచుండును. తత్స్ఫులింగాంగారంబులు=ఆప్రతాపాగ్నియొక్క యగ్నికణములు, జగదుత్సంగంబునన్=జగత్తునొడియందు—అనఁగానడుమ, భానుఁడున్=సూర్యుఁడును, శిఖియున్=అగ్నిహోత్రుఁడును, జంభారాతి దంభోళియున్=దేవేంద్రునివజ్రాయుధము నై యున్నవి. అనఁగాఁ దిందుకకాననములు

నల్లగా నుండును, శత్రురాజులును దుష్కీర్తియనెడి మసిచే మలినీభూతులై నల్లగానున్నారు. తిందుకవనము దగ్ధమగునప్పుడు ఛిటచ్ఛిటమను ధ్వనిని జేయుచుఁ బెద్దయగ్నికణములను జిమ్ముచుండును. సూర్యుఁడును, వహ్నియును, వజ్రాయుధమును, నేతత్ప్రతాపాగ్నియొక్క కణములే. ఈచెప్పుటచే నితనిప్రతాపాగ్ని సూర్యాదులను మించుచున్నట్లు స్పష్టమగుచున్నది. ఆప్రతాపాగ్నికిఁ గణములయిన సూర్యాదులే దుస్సహతేజస్కులగు సూర్యాదు లగుచుండఁగా నాప్రతాప మెట్లుండునో యెవ్వరు చెప్పగలరు.

తా. ఓదమయంతీ! ఇతనిప్రతాపవహ్నిపరాజయమువలనఁ గలిగిన దుష్కీర్తియనెడి మసిచేత నల్లని శరీరములు గలిగి నల్లతుమికిచెట్లను బోలిన శత్రురాజులమధ్యమందుఁ బ్రకాశించుచుండును. ఆతిందుకచెట్లను దహించునప్పు డుదయించినయగ్నికణములె సూర్యుఁడును వహ్నియునును, వజ్రాయుధమునై యున్నారు. అలం. రూపకసంకీర్ణమగు నుత్ప్రేక్ష.

శా. ఏణీలోచన! యేతదుగ్రసమరప్రేక్షోపసన్నామర
శ్రేణీమధ్యచరుండు వైన్యుఁడు గిరిక్షేపార్థమై కైకొనుం
బాణిం జాపము వీనిదంతిబలముల్ పైపై ననిన్ జంగమ
క్షోణీధ్రంబులు వోలె ధాత్రియెడఁగై కొంచున్ విజృంభింపఁగన్.

టీ. ఏణీలోచన=ఆఁడులేడి నేత్రములవలె విశాలమగునేత్రములు గల దమయంతీ! వీనిదంతి బలముల్=వీని గజబలములు, అనిన్ పైపైన్=యుద్ధంబున మీఁదుమీఁదుగా, జంగమక్షోణీధ్రంబులువోలెన్=నడగొండలవలె, ధాత్రియెడ=భూమియొక్క యవకాశమును, కైకొంచున్=స్వీకరించుచును, విజృంభింపన్కన్=అతిశయింపఁగా, ఏతత్ ...చరుండు-ఏతత్=ఈరాజుయొక్క, ఉగ్ర=భయంకరమైన, సమర=యుద్ధమును, ప్రేక్షా=చూచుటకు, ఉపసన్న=వచ్చిన, అమర=దేవతలయొక్క, శ్రేణీ=పంక్తులయొక్క, మధ్య=మధ్యభాగమునందు, చరుండు=వర్తించుచున్నవాఁడు, వైన్యుఁడు=పృథురాజు, గిరిక్షేపణార్థమై=పర్వతములను జిమ్మటకై, పాణిన్=చేతిచేత, చాపమున్, కైకొనున్=దీసికొనును అనఁగా [illegible] పృథురాజు

యుద్ధభూమియందు నడగొండలవలె వర్తిల్లుచున్న యితనియేనుఁగులను జూచి కొండలని భ్రమచెంది పూర్వమువలెనే తనకోపముచేతఁ గొండలను బాఱఁజిమ్మి సమమట్టముగాఁ జేయుటను వింటిని గైకొనక మానఁడు. పూర్వము భూమి పర్వతములచే నిండి నివసించుటకును సస్యాదులను బండించుటకు నుపయోగింప కుండఁగా నాపృథురాజు తనవింటికొప్పుచే భూమిని సరిమట్టముగాఁ జేసె నని భాగవతప్రసిద్ధము.

తా. లేడికన్నులవంటికన్నులు గల దమయంతీ ! ఈరాజేంద్రునియేనుఁగులకదుపులు యుద్ధభూమియందు నడగొండలవలె సంచరించుచుండఁగా నీతని యుద్ధమును జూచుటకు వచ్చిన సురలలో నున్న పృథురాజాయేనుఁగులను బర్వతములను భ్రమించి వానినిజిమ్ముటకై చేతితోఁ జాపము తీసికొనకమానఁడు. అలం. గమ్యోత్ప్రేక్ష భ్రాంతిమంతము.

శా. ఆదైత్యాంతకువక్షు మన్గృహము శూన్యత్వైకదోషస్ఫుటా
సీదన్మర్కటకీటజాతకృతకశ్వేతాతపత్రీభవ
త్తాదృఙ్నిర్మలకౌస్తుభాభరణరత్నస్ఫూర్తిగాఁ బాసి యా
హ్లాదం బొప్ప వసించు శ్రీ యితనిబాహామధ్యసౌధస్థలిన్.

టీ. ఆదైత్యాంతకువక్షును = ఆవిష్ణుమూర్తి వక్షఃస్థలము, అన్గృహము= అనెడి మందిరము, శూన్య...స్ఫూర్తిగా-శూన్యత్వ=లక్ష్మీశూన్య మగుట యనెడి, ఏక=ముఖ్యమయిన, దోష=తప్పుచే, స్ఫుట=స్పష్టముగా, ఆసీదత్ =నివసించుచున్న, మర్కటకీట=సాలెపురుగులచే, జాత=పుట్టిన, కృతక =కృత్రిమమైన, శ్వేతాతపత్రీభవత్ =సాలెపట్టె (తెల్లగొడుగు) అగుచున్న, తాదృక్ =అటువంటి, నిర్మల=స్వచ్ఛమైన, కౌస్తుభ=కౌస్తుభమనెడి, ఆభరణరత్నస్ఫూర్తిగాక్ =అలంకారరత్నముయొక్క కాంతి గలదియగునట్లుగా, పాసి=విడిచి, ఆహ్లాదంబు=సంతోషము, ఒప్పక్ =ఒప్పునట్లుగా, ఇతని బాహామధ్యసౌధస్థలిక్ =ఇతని బాహువులమధ్యభాగ మనెడి సౌధమందు, వసించుక్ =ఉండును. జనశూన్యములయిన గృహములలో సాలెపురుగులు ప్రవేశించి తెల్లనివియు మండలాకారములు గలవియువగు పట్టులను బెట్టును. అట్లె లక్ష్మి తనవాసమైన విష్ణువ

క్షమనెడి గృహంబును విడుమటచే నాగృహము సాలెపురుగుల కాలవాలమై తెల్లనిపట్లతోఁ గూడియుండెను. అందులోనొకపట్టె కౌస్తుభరత్నము. కావున నిట్టి దోషభూయిష్ఠమగు గృహములో నుండ నభిలషింపక లక్ష్మి యితనివక్షః స్థలసౌధమందు నివసించెనని అనఁగా లక్ష్మి యితనియందు స్థిరముగా నున్నదని భావము. కౌస్తుభము ఎఱ్ఱనిదయ్యు తెల్లనిదిగా నిట వర్ణించుట తేజోహీనత్వ మును బట్టి యనితెలియునది. విష్ణువక్షమును గృహమనియు రాజు బాహామధ్య మును సౌధమనియుఁ జెప్పుటచే లక్ష్మికి విష్ణువుకంటె నీరాజే రంజకుఁ డనుట వ్యంజితము.

తా. విష్ణుమూర్తివక్షఃస్థల మనెడి గృహమున శూన్యత్వరూపదోషముచే నిశ్శంకముగా నివసించుచున్న సాలెపురుగులచే నల్లఁబడిన తెల్లనివియు వలయా కారములగునవియు నగుపట్టులలో నొకపట్టె కౌస్తుభరత్నము. అట్టి దోషభూ యిష్ఠమైన గృహమును విడిచి లక్ష్మి యితని వక్షఃస్థలియనెడి మేడ నివసించు చుండెను. అలం. పర్యాయము. రూపకము.

మ. ఘనసిందూరవిముగ్ధమూర్ధము ధృతస్కంధావధిశ్యామికం
　బును బాధోధరమార్గగామియును నై పూఁబోణి యీరాజనం
　దనగంధద్విప మాజిలోఁ జరమసంధ్యాకాలమునోల్చె నె
　ర్థి నిరోధించు విరోధి బాహుజభుజాతేజస్సహస్రాంశులన్.

టీ. పూఁబోణి=ఓపద్మయంతి! ఈ రాజనందన గంధద్విపము=ఈరాజేంద్రుని మదపుటేనుఁగు, ఆజిలో=యుద్ధములో, ఘన...మూర్ధము-ఘన=గొప్పనయిన, సిందూర=సిందూరపరాగముచేత, విముగ్ధ=సుందరమైన, మూర్ధము=శిరస్సుగలది, సంధ్యాకాలపక్షమందు, ఘన...మూర్ధము-ఘన=దట్టమయిన, సిందూర=కుంకు మకాంతివంటి కాంతిచే, విముగ్ధ=సుందరమయిన, మూర్ధము=మీఁది భాగము గలది. సిందూరముచే నందమైన యారాజకుమారుని గజముయొక్క శిరోభాగ ము సంధ్యాకాలరాగముతోఁ గూడిన యాకాశభాగమువలె నొప్పుచున్నదని భావము. ధృత...శ్యామికంబును-ధృత=ధరింపఁబడిన, స్కంధావధి = కంద మలవఱకును వ్యాపించిన, శ్యామికంబును=నల్లదనము గలిగినట్టి సంధ్యా

కాలనుగూడ నిశాముఖమందు వ్యాపించు చీఁకటిచేఁ గొంతవఱకు నల్లఁగానుం డును, పాథోధరమార్గగాహియును = ఏనుఁగు మిక్కిలి యెత్తుగానుండుటచే, పాథోధరమార్గ=ఆకాశమార్గమును, గాహియును=పొందినదియును, సంధ్యా కాలరక్తిమయు నాకాశమందె యుండును, చరమసంధ్యాకాలమున్ పో లెన్=సాయంకాల సంధ్యవలెను, అర్థిన్=ప్రీతిచే, విరోధి...సహస్రాంశు లన్-విరోధి=శత్రువులయిన, బాహుజభుజా=క్షత్రియులయొక్క, తేజః= ప్రతాపమనెడి, సహస్రాంశులన్=సూర్యులను, నిరోధించున్= అరికట్టును, కాంతిరహితముగాఁ జేయును. సిందూరరజముచే నేనుఁగుశిరోభాగము మాత్ర మెఱ్ఱగా నుండి, తక్కిన శరీరభాగమంతయును నల్లగానుండును. సాయంసమ యంబునఁ బశ్చిమదిక్కునందు రక్తిమగలిగియుండి తూర్పుభాగమునందుఁ జీఁక టిచే నావృతమై నల్లగానుండును. కాన గజంబున కుపమ తగియుండెను. సా యంకాలసంధ్య చూపట్టినప్పుడు సూర్యుఁ డదృశ్యుఁడై యున్నట్లు వీనియే నుఁగు చూపట్టినతోడనే శత్రురాజులతేజము లదృశ్యము లైనవని భావము.

తా. దమయంతీ! సిందూరపరాగముచే నెఱ్ఱనిమూర్ధము గల్గి భుజశిరస్సుల వఱకును నల్లగా నుండి, మిక్కిలి యెత్తు గలదగుటచే నాకాశము నొరయు చున్నవీనిమదపుటేనుఁగు, సాయంకాలసంధ్యవలెఁ దనరారుచు శత్రురాజుల ప్రతాపమనెడి సూర్యులను నిరోధించుచున్నది. అలం. ఉత్ప్రేక్ష. రూపకము.

క. కీర్తిధనుఁ డైనయీతని
మార్తురకని కరుగ నరుగ నీ మగువ బెడంగై
మార్తాండమండలంబున
గర్తమయం బైనత్రోవ నీ గానఁగవచ్చున్. 125

టీ. మగువ=ఓదమయంతీ! కీర్తిధనుఁడు=యశమేధనముగాఁ గలవాఁడు, ఐనయీతనిమార్తురకున్=అయినట్టి యితనిశత్రువులకు, అనికిన్=యుద్ధమునకు, అరుగన్ అరుగన్=పోవఁగాఁ బోవఁగా, మార్తాండమండలంబునన్= సూర్య మండలమందు, బెడంగై=గొప్పదై, గర్తమయంబు = పల్లముతోఁ గూడినది, ఐనత్రోవన్=అయినట్టిమార్గము, కానఁగన్ వచ్చున్=కనఁబడును. అనఁగా

నాసన్నమరణులకు సూర్యునియందు ఛిద్రము గానంబడును. ఇతని శత్రురాజులకు నితనిని దలపడరాఁగానే సూర్యునందు ఛిద్రము గనఁబడుటచే వెంటనే మరణము కలుగునసుట. శత్రువుల నవలీల నతిశీఘ్రముగ నితఁడు గూల్చునట్టి మహాతేజుఁ డని ఫలితార్థము.

తా. స్పష్టము.

చ. ఎదిరిచి సమ్ముఖం బయినయింతటిలోనన యేమిచిత్రమో
కదనముఖంబునందు విముఖత్వము గైకొనునర్కదీప్తిచే
నదరులు వాఱుచున్ బెడిద మైనయదఃకరవాలధారచే
విదళిత మై శిరోధి పడ వీరవిరోధిమహీశుఁ డుద్ధతిన్. 126

టీ. వీరవిరోధిమహీశుఁడు=వీరుఁడయిన శత్రుభూపాలుఁడు, ఉద్ధతిన్=దర్పముచే, ఎదిరిచి = ఎదిరించి, సమ్ముఖంబు=అభిముఖుఁడు, అయినయింతటిలోనన=అయినస్వల్పకాలములోనే, ఏమి చిత్రమో = అదేమి చిత్రమో కాని, అర్కదీప్తిచేన్=సూర్యకాంతిచే, అదరులు=కాంతికణములు, వాఱుచున్=నిర్గమింపఁజేయుచు,అనఁగా సూర్యకాంతిలో ధగధగలాడుచు, బెడిదము=భయంకరము, ఐనయదఃకరవాలధారచేన్-ఐన=అయినట్టి, అదః=ఈరాజుయొక్క, కరవాల=కత్తియొక్క, ధారచేన్=అంచుచే, విదళితమై, శిరోధి=మెడ, పడన్=పడిపోఁగా, కదనముఖంబునందున్=యుద్ధభూమియందు, విముఖత్వము=పరాఙ్ముఖత్వమును,కైకొనున్=స్వీకరించును. సమ్ముఖుఁడయినవాఁడు, పరాఙ్ముఁడగుట యెట్లని విరోధము, విగతమైనముఖముగలవాఁడని చెప్పినచో విరోధమున కాభాసమగును అనఁగా శత్రువులు సమ్ముఖమునకు వచ్చునంతలోనే యితనిచేఁ జంపఁబడుచున్నా రని భావము.

తా. ఓదమయంతీ ! శత్రురాజు దర్పముతో నెదిరించి సమ్ముఖుఁ డైనంత మాత్రముననే సూర్యకిరణసంపర్కముచే ధగధగలాడుచు భయంకర మైన యితనికరవాలధారచే మెడ ఖండింపఁబడఁగా విగతశిరస్కుఁ డై మృతి నొందుచున్నాఁడు. అలం—విరోధాభాసము.

వ. అనియె నప్పుడు సమీపంబున డాసి యున్నయంతఃపురదాసి

యౌదాసీన్యగర్భం బైనవైదర్భితలం బెఱింగి వేఱొక్క దెస
చూపి "అక్క యిటుగనుంగొనుము సౌధాగ్రంబునందు
నటియించు కేతనపటాంచలంబునం జలంబు గొని యొక్క
కాకి గాహనమునకై కాకారవంబుతోడం గాలూఁదఁదలంచి
యనువు గాక చీకాకుపడఁచున్నయది " యనుచు నప్రస్తుత
భాషణంబులం బరిహాసంబు పుట్టించిన. 127

టీ. అనియెన్ = సరస్వతి పలికెను, అప్పుడు = ఆసమయమున, సమీపంబునన్, డాసి, ఉన్నయంతఃపురదాసి, ఔదాసీన్యగర్భంబు = ఉపేక్ష గర్భమందు గలది, ఐన వైదర్భితలంపు = అయినట్టి దమయంతియభిప్రాయమును, ఎఱింగి = తెలిసికొని, వేఱొక్కదెసచూపి, అక్క = ఓదమయంతి, ఇటు, కనుంగొనుము = చూడుము, సౌధాగ్రమునందున్ = మేడయొక్క కొనయందు, నటియించుకేతనపటాంచలమునన్ = చలించుచున్న పతాకచీరయొక్క కొనయందు, చలంబు = పంతము, కొని, ఒక్కకాకి, గాహనమునకై = ప్రవేశముకొఱకు, కాకారవంబుతోడన్ = కా కా అనుధ్వనితో, కాలూఁదన్ = నివసించుటకు, తలంచి, అనువుకాక = వలనుపడక, చీకాకుపడుచున్నది = వికారముచెందుచున్నది; అనఁగాఁ జలించుచున్నపటాంచలమందుఁ గూర్చుండఁ బ్రయత్నించుకాకిప్రయత్న మెట్లువ్యర్థమో యట్లె యనురాగము లేని దమయంతియందు శృంగారచేష్ట భావించుట యనుచితమని భావము. సరస్వతి వర్ణించుచుండఁగా దమయంతి వినియు విననట్లూరకుండెను. పాండ్యరాజదిచూచి "మౌనమర్థాంగీకార" మ్మను వచనముచొప్పున దమయంతి యూరకుండుటచూచి తనయం దనురాగముపూనుచున్న దనుకొని శృంగారచేష్టలు చూపనారంభించెను. వానిచేష్టలను దమయంతియింగితంబును నెఱింగి, యంతఃపురదాసి కాకమిషంబున నిట్లు చెప్పె. అనుచున్, అప్రస్తుతభాషణంబులన్ = అప్రస్తుత వచనములచేతను, పరిహాసంబున్ = నవ్వును, పుట్టించిన్ = పుట్టింపఁగా, అనఁగా నన్యాపదేశంబునఁ బాండ్యరాజు నభిప్రాయంబు తెలిపి సభ్యులకు నవ్వు గలిగించె నని భావము.

తే. దాసి చేసినయప్పరిహాసమునకు
హాసపరిపాండురం బైనయక్కొలువున
నానృపాలుముఖమ్లాని గానఁబడియె
నలుపు గానఁగఁబడుఁ గదా తెలుపులోన. 128

టీ. దాసి, చేసినయప్పరిహాసమునకున్ = చేసినట్టి కేరడమునకు, హాసపరిపాండురంబు = నవ్వుచే నంతటను దెల్లనైనది, ఐనయక్కొలువునన్ = అయినట్టి సభయందు, నవ్వు తెల్లగానుండునని కవిసమయసిద్ధము. కావున దాసివచనంబులు విని సభలోనివారు నవ్వుచుండుటచే సభకు శ్వేతత్వము స్థాపింపఁబడియె నని భావము. ఆనృపాలుముఖమ్లాని = ఆరాజుయొక్క ముఖము వాడిపోవుట, కానఁబడియె = చూడఁబడెను. ఆరాజు శ్యామలకాయుఁడు— దాసి పలికిన కేరడములకును, సభాసదుల పరిహాసమునకును, మఱింత కాంతి దఱిగినవాఁడై మాడిపోయెను. కలకల నవ్వుచున్న సభాసదులలో విచారపరీతుఁ డైనపాండ్యరాజుముఖకాంతి హీనత్వము స్పష్టముగాఁ గానవచ్చెను. మ్లాని నల్లఁగానుండు నని వర్ణించుట కవి సమయసిద్ధము కావున హాసవిలసితములై తెల్లనై యున్న సభ్యులవదనముల లో విచారభిన్నమై కావుననే నల్లనిదై యున్న యారాజువదనంబు స్పష్టముగాఁ దెల్లమయ్యె. నలుపు, తెలుపులోనన్, కానంగఁబడుగదా = కనఁబడును గదా?

తా. అంతఃపురదాసి చేసినయాపరిహాసమునకు నవ్వుచున్నవియుఁ దెల్లనివియు, నగు కొలువువారివదనములలో విచారఖిన్న మై నల్లనిదై యున్నయా రాజువదనంబు స్పష్టముగాఁ గానవచ్చె. తెలుపులో నలుపు స్పష్టముగాఁ జూపట్టునుగదా? అలం. అర్థాంతరన్యాసము.

వ. అప్పుడు. 129

క. ఆరాజుపట్టు వాసి మ
హారాజిక సిద్ధసుర సమర్చితచరణాం
భోరుహ భారతి యొక్క మ
హారాజసమీపమునకు నల్లనఁ జనియెన్. 130

టీ. మహా...రుహ—మహారాజిక=మహారాజికమనెడి దేవతాగణముచేత ను - ఇన్నూట యిఱువది యార్వురగు మహారాజికు లనెడి దేవతలసమూహము మహారాజిక మని చెప్పఁబడుచున్నది. సిద్ధ= యోగసిద్ధులచేతను, సుర=దేవత లచేతను, సమర్చిత=పూజింపఁబడుచున్న, చరణాంభోరుహ= పాదపద్మములు గల, భారతి, ఆరాజుపట్టు=ఆరాజుస్థానమును, పాసి=విడిచిపెట్టి, ఒక్కమహా రాజుసమీపమునకున్=ఒకరాజేంద్రునివరికి, అల్లనన్, చనియెన్.

తా. సమస్తసురలచేఁ బూజింపఁబడుసరస్వతి దమయంతి నారాజునుండి మఱియొకరాజును బొందించి మెల్లఁగా నిట్లనియె.

వ. చని మహేంద్రగిరి యేలు నన్నరేంద్రునిం జూపి దమయంతి కి ట్లనియె. **131**

చ. నరనుతు నిమ్మహేంద్రగిరినాథు వరింపుము రూపసంపదన్
దొరయు నితండు నీకు నొకదోసమునుం గల దప్పురంబునన్
గరిమఁ గళింగజంబు లగుగంధగజంబులకుంభరాజితోఁ
గరకరి పుట్టఁగాఁ గలదు కామిని! నీవలిచన్నుదోయికిన్. **132**

టీ. కామిని=ఓదమయంతి ! నరనుతున్ = జనులచేఁ బొగడఁబడెడి, ఇమ్మ హేంద్రగిరినాథున్= ఈమహేంద్రగిరిపతిని, వరింపుము. ఇతండు, రూపసంప దన్ = రూపసమృద్ధిచేత, నీకున్=నీతోడ, దొరయున్ = సమానుఁడగును. అప్పురంబునన్=ఆమహేంద్రగిరియందు, ఒకదోసమునున్,కలదు. నీవలిచన్ను దోయికిన్=చల్లని నీకుచద్వయికి, గరిమన్=అతిశయముచే, కళింగజంబులు= కళింగదేశమునందుఁ బుట్టినవి. అగు గంధగజంబుల కుంభరాజితోన్=అయి నట్టి గంధజాతి యేనుఁగుల కుంభముల పంక్తితో, కరకరి=ద్వేషము, పుట్టఁ గాఁగలదు. ఆగంధగజకుంభములు నీకుచములతో సామ్య మొందఁ దలంచియు నొందలేక తిన్మాలమునఁ గలహము వహించుచని భావము. ఇందువలన మహేం ద్రనాథునకు గజసమృద్ధి గలదనియు, దమయంతికుచములు గజకుంభముల మీ ఱుచున్నవనియు, స్పష్ట మగుచున్నది. అలం. లేశము.

తా. ఓదమయంతీ! మహేంద్రపురనాథుం డగునీరాజకుమారుని వరింపుము. సౌందర్యవంతుఁడైనయితని వరించుట యుక్తమే. కాని నీకచట నొకయనర్థము సంభవింపక మానదు. ఆపురమం దున్న గంధగజంబులకుంభంబులు నీకుచంబులసామ్యము నొందఁ దలంచియుఁ బొందలేక పోవుటచే వానికి విరోధము సంభవింపక మానదు.

చ. గజపతి వచ్చె నంచు నొకఁ డొకగంధగజంబు గుఱించి యొక్కఁ డ
క్కజపడి పల్కినన్ వెఱచి కాననభూమికి భీతిఁ బాఱి దా
రిజడత నిద్రలోఁ గలవరింప నిజోక్తియ నేర్చి కీరముల్
గజపతి వచ్చె నా విని కలంగుదు రీతనిశత్రు లచ్చటన్. 133

టీ. ఒక్కఁడు=ఒకపురుషుఁడు, గజపతి, వచ్చెన్, అంచున్, ఒకగంధగజంబు గుఱించి=ఒకగంధజాతియేనుఁగును గూర్చి, అక్కజపడి=ఆశ్చర్యపడి, పల్కినన్=పలికింపఁగా, వెఱచి=భయపడి, కాననభూమికిన్=వనభూమికి, భీతిన్=భయముచే, పాఱి, దారిజడత = దారినడచినందునఁ గలిగినజడత్వము చేత, నిద్రలో, కలవరింపన్=గజపతివచ్చెన్ అని కలవరింపఁగా, నిజోక్తియ= తానన్నపలుకునే, నేర్చి=అభ్యసించి, కీరముల్=చిలుకలు, గజపతి, వచ్చెన్, నాన్=అనఁగా, అచ్చటన్=ఆవనమందును-పట్టణమందే కాక యడవియందు ననుట. ఈతనిశత్రువులు, విని, కలంగుదురు=భయం బొందుదురు. అనఁగా నితఁడు సమస్తశత్రువులను జయించినశూరుం డని భావము.

తా. పౌరులలో నెవ్వరేనియు నొకగంధగజంబు వచ్చుటను జూచి గజపతి వచ్చెనని చెప్పఁగా నీతనిశత్రువులు భయంబునఁ గాననంబులకుఁ బోయి యచ్చట దారినడచినబడలికచే నిదురింపుచు గజపతి గజపతి యని కలవరింపఁ దొడం గిరి. ఆవనములోనున్నచిలుకలు వారన్నమాటను నేర్చికొని వేఱొకప్పు డామా టనే పలుకఁగా వారు విని యాపదమంచు సయితము తమపట్టణమందుంబోలె భయంబందు చున్నారు.

తే. వీనిరిపుకాంత పతిఁ బాసి కానలోన

జెంచుపూబోఁడులును దానుఁ జెలిమిచేసి
చెప్పఁ దమదేశవార్తలు చెప్పుచోటఁ
జల్లనై యుండు మాభూమిచంద్రుఁ డంచు. 134

తా. వీనిరిపుకాంత=ఇతనిశత్రునిభార్య, పతిన్ = భర్తను, పాసి=విడిచి, కానలోనన్, చెంచుపూఁబోఁడులును = భిల్లస్త్రీలును, తానును, చెలిమి=స్నేహము,చేసి, తమదేశవార్తలుచెప్పుచోటన్ = తమతమదేశవృత్తాంతములు చెప్పుకొనునప్పుడు,మాభూమిచంద్రుఁడు=మాదేశమున నున్నచంద్రుఁడు, చల్లనై యుండున్, అంచున్=చల్లగా నుండునని, చెప్పన్=చెప్పుచుండును. అనఁగా గజపతి శత్రువులఁ జయింపఁగా వారు తమభార్యలను విడిచి పలాయితులైరి. అప్పుడు వైరిస్త్రీలు తమతమ భర్తలను వెదకుచు నడవులఁ బడిపోయినప్పు డీ మార్గమధ్యమందుఁ జెంచుస్త్రీలు గానరాఁగా వారితో స్నేహము చేసికొను చుందురు. అప్పుడు వారంద ఱొక్కచోఁ గూర్చుండి యిష్టగోష్ఠిసలుపుచుఁ దమతమదేశవృత్తాంతములను జెప్పుకొనుచున్నప్పుడీతని శత్రుస్త్రీలు మాదేశమునఁ జంద్రుఁడు చల్లనికిరణములు గలవాఁడని యత్యద్భుతముగాఁ జెప్పుచుందురు. శత్రుస్త్రీలు తమదేశములం దున్నప్పుడు తమతమ భర్తలతోఁ గూడికొనియుండుటచే వారికిఁ జంద్రుండు చల్లనివాఁడై యుండెననియు. వారిప్పుడు భర్తల నెడఁబాసి యడవులలోఁ ద్రిమ్మరుచుండుటచేఁ జంద్రుఁడు వారికి వెచ్చనికిరణములు గలవాఁడుగా కానవచ్చుచుండెననియు, నందుచే వారాదేశమందుఁ జంద్రుఁడు వేఁడికిరణములఁ గలవాఁడని తలంచి "ఈదేశమందుఁ జంద్రుఁడు వేఁడికిరణములు గలవాఁడు కాని మాదేశమందుఁ జల్లనికిరణములు గలవాఁడై యుండు" నని చెప్పుచుందురు. 'చంద్రః చండకరాయతే' ఇత్యాదులంబట్టి విరహార్తులకు చంద్రుఁడు వేఁడిగానుండుట ప్రకటము.

తా. వీనిశత్రుకాంతలు భర్తలను బాసి కానలంజేరి చెంచుస్త్రీలతో స్నేహముచేసి తమతమదేశములందుండు నద్భుతములనుగూర్చి ముచ్చటించుకొనునప్పుడు తమభూమియందుఁ జంద్రుఁడు చల్లనికిరణములు గలవాఁ డైనట్లు చెప్పుచుందురు.

## మహాస్రగ్ధర.

రతిఁ గ్రీడాహంససమ్మోహగ్రహిలశిశుభృశప్రార్థితోన్నిద్రతారా
పతి యై దుఃఖించుసద్యఃప్రసృమరనిజదృగ్బాష్పధారాగతేందు
ప్రతిబింబప్రాప్తలాభప్రమదితసుత యై రంజిలున్ రాత్రు లేత
త్ప్రతిపక్షక్షోణిపాలప్రమద గిరిదరీప్రాంతకాంతారభూమిన్.

టీ. ఏతత్ ... ప్రమద - ఏతత్ = ఈరాజుయొక్క, ప్రతిపక్షక్షోణిపాల= శత్రురాజుయొక్క, ప్రమద= స్త్రీ, గిరి ... భూమిన్ - గిరిదరీ=పర్వతగుహలయొక్క, ప్రాంత=దాపటి, కాంతార=దుర్గమమార్గముయొక్క భూమిన్ —ప్రదేశమందు, రాత్రులు=నిశాసమయములందు, రతిన్ =కోరికచేత, క్రీడా ... పతియై-క్రీడాహంస=ఆటహంస యనెడి, సమ్మోహ=భ్రాంతిచే, గ్రహిల=ఈహంస నాది నాకిమ్మనెడి యాగ్రహముగల, శిశు=పసిబాలునిచే, భృశ = మిక్కిలి, ప్రార్థిత=ప్రార్థింపఁబడుచున్న, ఉన్నిద్ర = ఉదయించిన, తారాపతియై=చంద్రుఁడుగలదై, దుఃఖించున్ = ఏడ్చును; అనఁగా వారు పూర్వ మున్నతసంపదలలో నుండినప్పుడు తనబాలుఁడు హంసబొమ్మతో నాడుకొనుచుండెను. ఈరాజుచేఁ దఱిమివేయఁబడి పురంబులలో నుండఁజాలక శత్రుస్త్రీ పర్వతకందరమందు దాఁగియుండి పవలెల్లఁ గడపి, రాత్రియందు గుహనుండి పైకిరాఁగా నామెకుమారుఁ డుదయించుచున్న చంద్రునిఁ జూచి, "ఇదే నాక్రీడాహంస దాని నాకి"మ్మని యేడ్వఁగాఁ గుమారునిరోదనమును శాంతింపఁ జంద్రుని సంపాదింపలేక యందువలనఁ దనపూర్వస్థితి జ్ఞప్తికి రాఁగా దుఃఖింప నారంభించె నని భావము. సద్యః ... సుతయై-సద్యః=తత్కాలమందు, ప్రసృమర= నిర్గమించిన, నిజ=తనయొక్క, దృక్ = నేత్రములయొక్క, బాష్పధారా= నీటిధారయందు, గత=పొందిన, ఇందుప్రతిబింబ=చంద్రప్రతిబింబముచే, ప్రాప్త=పొందఁబడిన, లాభ=ఫలము కల్గుటచే, ప్రమదిత=సంతుష్టుఁడైన, సుతయై=కుమారుఁడుగలదై, రంజిలున్ =సంతసించుచుండును. అనఁగాఁ గుమారుని దురవస్థను జూచి [illegible] ప్రసవించుకన్న

ట్టియందుఁ జంద్రుఁడు ప్రతిఫలించెను. ఆప్రతిబింబమును జూచి శాలకుఁడు తన హంసబొమ్మ యని తలఁచి సంతసింపఁగా నామెయు సంతసించె నని భావము.

తా. ఓదమయంతీ! ఈతనిశత్రువుభార్య భయవివశ యై పురంబు విడిచి పర్వతగుహలలో దాఁగి పవలు కడపి రాత్రిసమయమందుఁ బైకి రాఁగా నుద యించుచున్నచంద్రునిఁ జూచి దానిబాలకుఁడు క్రీడాహంసమునుగా భ్రమించి నాహంసమును దెమ్మని యేడ్చెను. అందువలనఁ దల్లి దమపూర్వస్థితి స్మరించు కొని దుఃఖింపఁగా నాయేడ్పుటవలన స్రవించెడి కన్నీటియందుఁ జంద్రుఁడు ప్రతిఫలింపఁగా దానిం జూచి 'యిదె నాహంసబొమ్మ' యని బాలుఁడు సంత సింపఁగా వారును సంతసించుచుందురు. అలం. భ్రాంతిమంతము.

ఉ. యజ్జలదేవతాస్ఫటికహార్మ్యము శేషుఁడు, మజ్జగంబులుఙ్
మజ్జనమాచరించుఁ బలుమాఱును నెందు,యదీయవాఃకణం
బజ్జలజారి, యట్టివిమలాద్భుతకీర్తిమహాబ్ధిపూర్తముఙ్
సజ్జనవర్ణనీయము నొకప్పె నితండు వసుంధరాస్థలిన్. 136

టీ. శేషుఁడు=అనంతుఁడు, యజ్జల...హార్మ్యము-యజ్జల దేవతా—ఏకీర్తి సముద్రముయొక్క జలదేవతకు, స్ఫటికహార్మ్యము=స్ఫటికమయమైన మేడ యో, అనఁగా విష్ణురూపిణియైన జలదేవతకు పటికపురాలతోఁ గట్టినమేడవలె శేషుఁ డొప్పుచున్నాఁ డని భావము, ఎందుఙ్=ఏకీర్తిసముద్రమందు, ముజ్జ గంబులుఙ్=మూఁడులోకములును, పలుమాఱును=మాటిమాటికి, మజ్జనము=స్నా నము, ఆచరించుఙ్=చేయునో, యదీయ...కణము-యదీయవాఃకణము=ఏస ముద్రసంబంధి యగు నుదకబిందువు, అజ్జలజారి=ఆచంద్రుఁడో! ఆతని కీర్తిసము ద్రములో ముల్లోకములవారును దానము లాడుదు రనియు దానినీటిచుక్కవలెఁ జంద్రుఁ డొప్పుచున్నాఁడనియు భావము. చంద్రుఁడొకచుక్కయై యున్నాఁ డని చెప్పుట చే నతనికీర్తిసముద్రముకంటె నతిస్వల్పుఁడై యున్నాఁ డని భావ ము. అట్టి...పూర్తముఙ్-అట్టి, విమల=స్వచ్ఛమైన, అద్భుత=ఆశ్చర్యమును గ ల్గించు, కీర్తి=యశస్సనెడు మహాబ్ధి=సముద్రముచే పూర్తముఙ్=

తటాకమును, ఈతండు=ఈరాజు, వసుంధరాస్థలిన్ =భూమండలమందు, సజ్జనవర్ణనీయముగన్ =సజ్జనులచేఁ గొనియాడఁబడునట్లుగా, ఒనర్చెన్ =చేసెను. అనఁగా నీతని కీర్తిసముద్రము సముద్రమును మించుచున్న దని భావము. ఆలోచింప సముద్రముకంటె దీనికిఁ గల్గిన యాధిక్యమేమనఁగా సముద్రము "పర్వణి స్పృశేత్" అనువచనమును బట్టి పర్వకాలమందె ముట్టఁగొనఁదగినది. ఈకీర్తిసముద్రము సర్వకాలములందును స్పర్శనీయమై యున్నది. సముద్రము భూలోకమునందు మాత్రమే యుండుటచేఁ గొందఱకే స్నానార్హమగుచున్నది. ఇది లోకత్రయమువారికిని స్నానార్హ మగుచున్నది. కావున నిదియె యుత్కృష్టమైనదని భావము. అనఁగా నీరాజు మహాకీర్తిమంతుఁ డని తెలియఁదగినది.

తా. దేనియందు జలదేవతయైననారాయణునికి శేషుఁడు మేడవలె నున్నాఁడో, దేనియందు మూఁడులోకములును స్నానము చేయునో, దేని నీటిబొట్టువలెఁ జంద్రుఁ డొప్పునో, అట్టి నిర్మలమయిన కీర్తిసముద్రమును తటాకముం బోలె నీరాజు భూమియందు నిర్మించెను. అలం. రూపకము.

శా. ఆమోదాశ్రుభరంబు వెల్లిగొన నెట్లాలించుఁ గర్ణంబులన్
రోమాంచంబు వహించు నేకరణి నీరోమాంకురం బైనమైన్
భూమీచక్రము పూని యెట్లు దలలూఁపుం బన్నగస్వామిది
క్కామత్క్రాంతివిధి వీనికీర్తి ఫణభృత్కాంతాజనుల్ పాడఁగన్.

టీ. ఫణభృత్కాంతాజనుల్ = నాగస్త్రీలు, దిక్కామత్క్రాంతివిధిన్ =దిక్కుల నతిక్రమింపఁజాలినరీతిచే, వీని కీర్తిన్ =ఈరాజుకీర్తిని, పాడఁగన్ = నుతించుచుండఁగా, పన్నగస్వామి=అనంతుఁడు, ఆమోదాశ్రుభరంబు=ఆనందబాష్పములయొక్క పెంపు, వెల్లిగొనన్ =ప్రవహించునట్లుగా, కర్ణంబులన్ =చెవులచే, ఎట్లు, ఆలించున్ =ఏరీతిగా వినును? అనంతునకుఁ గన్నులే చెవులు. అవి తెఱచినప్పుడు చూచును మూసినప్పుడు వినును. కాన యానందబాష్పములు వెల్లిగొని కన్నులందెఱచినచో వినుట తటస్థింపదు. కాన యానందబాష్పములు వచ్చుచున్నను ప్రతిబంధించుకొనుచున్నాఁ డని భావము. నీరోమాంకురఁబు = వెంట్రుకమొలకలు లేని, మైన్ =శరీరమందు, ఏకరణిన్, రోమాంచఁబు=గగ్గు

రుపాటును, వహించుక్ = తాల్చును. భూమిచక్రము = భూమండలమును, పూని, తలలు, ఎట్లుఁబుర్, అనఁగాఁ దలలపై భూమండల ముండఁగా నేరీతిగాఁ జలింపఁజేయును? అనఁగా 'నారాజుకీర్తిని వినుటవలనఁ గల్గినయానందంబు నేవిధముగానైనను వెలిపుచ్చలేకుండె నని భావము. గానరసమునకు ఆనందబాష్పములును బులకలును మెప్పుచేఁ దలయూఁచుటయు సహజములు.

తా. శేషుఁడు నాగకన్యక లీతనికీర్తిని బాడు చుండఁగా నానందబాష్పము విడువవలయునన్న వానిచేఁ గన్నులు దెఱవంబడి వినుటకు వీలుపడదు గాన యానందబాష్పములను బుచ్చకుండును. శరీరమున రోమములులేని కారణమున రోమాంచముచేతనైనను దెలుపలేకపోయెను. తలలపై భూచక్ర ముండుటచేఁ దల లూఁచియైనను దనయానందంబును బ్రకటింపలేకపోయెను.

ఆ. అనిన నల్ల నవ్వె నబ్జాయతాక్షియు
నది విరక్తి యగుట నాత్మ నెఱిఁగి
యానవాహసమితి నవలోకసంజ్ఞ న
వ్వలికి జరుగఁ బనిచె వాగ్వధూటి. 138

టీ. అనినన్ = అని సరస్వతి పలుకఁగా, అబ్జాయతాక్షియున్ = పద్మముల వంటి నేత్రములుగల దమయంతియు, అల్లన్, నవ్వెన్ = నవ్వెను. అది, విరక్తి = ఆరాజునం దనురాగములేకపోవుట, అగుట, ఆత్మన్, ఎఱింగి = తెలిసికొని, వాగ్వధూటి = సరస్వతి, యానవాహసమితి = శిబికావాహకులసమూహమును, అవలోకసంజ్ఞన్ - అ = కనుసన్న చేతనే, అవ్వలికిన్ జరుగన్ పంచెన్ = అవతలికిఁ బోవ నానతిచ్చెను.

తా. ఈనవాక్యములు విని దమయంతి నవ్వుటచే నామె కారాజునందు వల పుదయింపలేదని తెలిసికొని సరస్వతి వాహకులను నాస్థలమునుండి వేఱొకస్థలమునకుఁ బంపెను.

వ. అప్పోటవేఱొకరాజుఁ జూపి యారాజవదనకు రాజీవభవుని దేవి యిట్లనియె. 139

టీ. స్పష్టము.

తే. ఇతఁడు నేపాళభూపాలుఁ డిగురుఁబోఁడి
వీని వీక్షింపు కడకంటివీక్షణమునఁ
బడఁతి యేతత్ప్రతాపాగ్నిఁ బడియె నేఁ బ
తంగుఁ డంగీకరించుఁ బతంగవృత్తి. 140

టీ. ఇగురుఁబోఁడి=చిగురువంటిశరీరము గల దమయంతీ ! ఇతఁడు=ఈరాజు, నేపాళభూపాలుఁడు=నేపాళదేశరాజు, కడకంటివీక్షణమునన్=కడకంటిచూపుచే, వీనిన్, వీక్షింపుము=చూడుము. పడఁతి, పతంగుఁడు=సూర్యుండు ఏతత్ప్రతాపాగ్నిన్=వీనియొక్క ప్రతాపమనెడియగ్నిలో, పడియెన్ ఏని=పడినచో, పతంగవృత్తిన్=మిడుతరీతిని, అంగీకరించున్=స్వీకరించును. అనఁగా తోడనే భస్మమైపోవునని యర్థము. సూర్యునకు పతంగుఁడను పేరుగలదని భావము. పతంగునకు పతంగవృత్తి గలుగుట విరుద్ధము; శలభవృత్తియని యందులకుఁ బరిహారము. అనఁగా నీతనిప్రతాపము సూర్యుని మించుచున్నదని భావము. అలం. విరోధాభాసము అతిశయోక్తి.

తా. ఓ దమయంతీ ! ఇతఁడు నేపాలదేశపురాజు. నీకడకన్నులతో వీనిం జూడుము. సూర్యుఁడు వీనిప్రతాపాగ్నిలోఁ బడినచో మిడుతవంటివాఁ డగుచున్నాఁడు!

తే. ఉభయపౌలస్త్యవాసైకయోగ్యములును
నుభయసంధ్యాప్రభాలంకియోజ్జ్వలములు
నైనదిగ్భాగములయందు వీనికీర్తి
పద్మలోచన! నృత్యంబు పరిఢవించు. 141

టీ. పద్మలోచన=పద్మములవంటి నేత్రములు గల దమయంతీ ! వీనికీర్తి=ఈరాజుకీర్తి నర్తకి, ఉభయ...యోగ్యములును—ఉభయ = ఇద్దఱయిన, పౌలస్త్య = రావణకుబేరులయొక్క, వాస = నివాసమునకు, ఏక = ముఖ్యముగా, యోగ్యములును=తగియున్నవియును, అనఁగా దక్షిణమందు రావణుఁడును

ను త్తరమునఁ గుబేరుఁడును నుండిరి కాన దక్షిణోత్తరదిక్కు లని ఫలితార్థము.
ఉభయ—జ్వలములు-ఉభయ= రెండయిన, సంధ్యాప్రభా=సంధ్యారాగములనె
డి, అలంక్రియా=అలంకారములచేత, ఉజ్జ్వలములు = ప్రకాశించుచున్నవి.
దీనిచే తూర్పుపడమరలు గ్రాహ్యములు, ఐనదిగ్భాగములయందుఁ, అయినట్టి
నాల్గుదిక్కులందును, నృత్యంబుఁ=నాట్యమును, పరిఢవించును = చేయును.
నలుదిక్కుల వ్యాపించినకీర్తిగలవాఁడని భావము. అలం. పర్యాయోక్తము,
సమాసోక్తియు.

తా. ఓదమయంతీ ! వీనికీర్తినర్తకి దక్షిణోత్తరదిక్కులందును బూర్వ
పశ్చిమదిశలందును నాట్యంబు సల్పుచున్నది.

మ.శరధిప్రోద్ధృతి శింజినీఘటన మాకర్ణబ్రగహాకృష్టి యం
బరవీథీగతి లక్ష్యభేద మవనీపాతంబు లక్షింపరా
కరివక్షఃస్థలరంధ్రపంక్త్యనుమితం బౌ నాజిరంగంబులం
దరవిందానన ! వీనిబాణనికరం బత్యద్భుతప్రౌఢిచేన్. 142

టీ. అరవిందానన=పద్మమువంటిమోము గల దమయంతీ ! అత్యద్భుత ప్రౌ
ఢిచేన్ = మిక్కిలి యాశ్చర్యమును గల్గించు, నేర్పుచే, శరధిప్రో
ద్ధృతి=అమ్ములపొదినుండి తీయుటయు, శింజినీఘటనము=నారియందుఁగూర్చు
టయు, ఆకర్ణబ్రగహాకృష్టి-ఆకర్ణబ్రగహా = కర్ణములపఱకు, ఆకృష్టి=ఆకర్షించు
టయు, అంబరవీథీగతి=ఆకసమందుఁ బఱతెంచుటయు, లక్ష్యభేదమః=గుఱిని
భేదించుటయు, అవనీపాతంబు=భూమియందుఁ బడుటయును, లక్షింపరాక=
చూచుటకు వలనుపడక, అరి...అనుమితంబు-అరి=శత్రువులయొక్క, వక్షఃస్థ
ల=ఱొమ్ములందున్న,రంధ్రపంక్తిన్=కన్నములవరుసచే,అనుమితంబు=ఊహింప
నఁదగినది, ఔన్=అగుచుండును. అనఁగా శత్రువులకుఁ బడినగాయములు
చూచి 'బాణములే వచ్చి తాఁకకపోయిన నీరంధ్రము లెట్లు పడియుండు' నని
రంధ్రములను బట్టి యీరాజు బాణములఁ బ్రయోగించుచున్నాఁడని తెలియవ
చ్చుచున్నది. అంతియ కాని యతనిబాణసంధానాదులవలనఁ దెలియరే దని
భావము. అనఁగా నధికమగు శరలాఘవము గలవాఁ డని ఫలితార్థము.

తా. ఓ దమయంతీ! ఇతం డతిప్రౌఢితో శరయుద్ధము చేయుచుండఁగా నమ్ములపొదినుండి బాణ మెప్పుడు తీసెనో తెలియఁబడదు. ఎప్పుడు నారియందుఁ గూర్చెనో యెప్పు డవి కర్ణాంతముదాఁక లాగివిడువఁబడినవో, యెప్పుడాకాశమునుండి పోవుచున్నవియో, యెప్పుడు లక్ష్యమును భేదించుకొని భూమియందుఁ బడినవో యెవ్వరికిని దెలియదు. శత్రువులకుఁ దగిలినగాయముల వలననే తెలిసికొనవలసి యున్నది.

మహాస్రగ్ధర.

పతితప్రత్యర్థిపృథ్వీపతిముఖకమలోపాశ్రయమ్లానిభృంగ
ప్రతిబింబాంకంబు లేతత్పదనఖవిధుబింబంబులీరాజు దాల్చుం
బ్రతివీరప్రాణవాతప్రకరనవసుధాపానపీనంబునత్యుగ్రవ
ద్భుతశౌర్యాడంబరంబుగ్భుజభుజగయుగంబున్మహాసంగరో

టీ. ఏతత్...బింబంబులు—ఏతత్ = ఈరాజుయొక్క, నఖవిధుబింబంబులు= గోళ్లనెడి చంద్రబింబములు, పతిత...అంకంబులు-పతిత = పాదములందుఁ బడుచున్న, ప్రత్యర్థిపృథ్వీపతి=శత్రురాజులయొక్క, ముఖకమల=ముఖపద్మములను,-ఉపాశ్రయ=ఆశ్రయించియున్న, మ్లాని=పరాజయమువలనఁ గలిగిన కాంతిహీనత్వమనెడి, భృంగ=తుమ్మెదయొక్క, ప్రతిబింబాంకంబులు=ప్రతిబింబ మనెడి మచ్చ గలిగినటువంటివి, కమలమందుఁ దుమ్మెదవలెఁ బరాజితులైన రాజుల ముఖములందుఁ గాంతివిహీనత కలదు. మ్లానత నల్లగానుండు నని వర్ణించుట కవిసమయసిద్ధము. కావున భృంగసామ్యము సరిపడినది. ఆభృంగంబు ప్రతిబింబములె మచ్చలవలె నున్నవి. ఆరాజుపాదనఖములు నిష్కలంకచంద్రులవలె నొప్పుచు నున్నవి. వానియందు పరాజితులయిన రాజులముఖకమలములందున్న కాంతిహీనత్వ మనెడి తుమ్మెదప్రతిబింబములు కళంకములవలె నొప్పుచున్నవి. అనఁగా శత్రురాజులు చిన్నఁబోయిన మోములతో వచ్చి యతనికాలిగోళ్లు తాఁకునట్లు నమస్కారము చేయుచున్నా రని భావము. ఈరాజు, ప్రతి...పీనంబుగ్-ప్రతివీర=శత్రురాజులయొక్క, ప్రాణవాత=ప్రాణవాయువుల యొక్క, ప్రకర=సమూహ మనెడి, నవసుధాపాన=ప్రశస్తమగు నమృతపాన

ముచే, పీనంబు=బలిసినవియును, అత్యద్భుత శౌర్యాడంబరంబుల్=మిక్కిలి యాశ్చర్యమును గల్గించు శౌర్యముచే నతిశయించుచున్నవియును, నగు, భుజ భుజగ యుగంబుల్=బాహువులనెడి సర్పద్వయమును, మహాసంగరోర్విన్ = గొప్పయుద్ధమునందు, తాల్చున్ = ధరించును. అనఁగా నీతనిబాహువులు శత్రువులప్రాణవాయువులను గ్రోలుసర్పరాజులవలె నొప్పుచున్న వని భావము.

తా. దమయంతీ! పరరాజు లీతనిచేఁ బరాజితులై చిన్నవోయినమోముల తో వచ్చి యితనిపాదములకుఁ దమవదనంబులు సోఁకునట్లు మ్రొక్కుచున్నా రు. ఈరాజుబాహువులు శౌర్యప్రోజ్జ్వలము లై శత్రురాజులప్రాణవాయువు లపహరింప సమర్థములగు సర్పరాజులవలె నున్నవి. అలం. రూపకము.

మ. హరిదంతద్విపదంతకుంతముల కన్వాదేశ మాశీవిషా
భరణోత్తంససుధాంశురేఖకు ననుప్రాసంబు కైలాసభూ
ధరకూటస్ఫటికోపలప్రతతి కధ్యాహార మిమ్మేదినీ
శ్వరదేవేంద్రునిసాంద్రనిర్మలయశోజాలంబు లీలావతీ! 144

లీలావతీ!=ఓదమయంతీ ! ఈ...జాలంబు-ఈ మేదినీశ్వరదేవేంద్రుని = ఈ రాజ దేవేంద్రునియొక్క, సాంద్ర=దట్టమయిన, నిర్మల=స్వచ్ఛమైన, యశో జాలంబు = యశస్సమూహము, హరి...ములకున్-హరిత్ = దిక్కులయొక్క, అంత=కొనలయందున్న, ద్విప=ఏనుఁగుల యొక్క, దంతకుంతములకున్=కుంత మనెడి యాయుధమువంటి దంతములకు, అన్వాదేశము=పునరుపాదానము—పు నరుక్తి, అనఁగా దిగ్గజములదంతములను మించి యితనికీర్తిప్రకాశించుచున్న దని భావము,ఆశీవిష...రేఖకున్-ఆశీవిష=సర్పములు,ఆభరణ=అలంకారములుగాఁ గలుగునీశ్వరునికి,ఉత్తంస=శిరోభూషణమైన,సుధాంశురేఖకున్=చంద్రరేఖకు, అనుప్రాసంబు = పునరుచ్చారణము అనఁగా నితనికీర్తి యీశ్వరునిచంద్రకళకు సాటియగుచున్నదని భావము. కైలాస...ప్రతతికిన్-కైలాసభూధర=కైలా సపర్వతముయొక్క, కూట=శిఖరములందున్న, స్ఫటికోపల=పటికపురాలయొ క్క, ప్రతతికిన్=సమూహమునకు, అధ్యాహారంబు=శేషముప పూరణము నను;

అనఁగాఁ గైలాసమునందున్న స్ఫటికశిలలసమూహమును బూరించుచున్న దని చెప్పుటచే, వాని మించుచున్న దని తెలియవచ్చుచున్నది.

తా. ఓదమయంతీ! ఈరాజదేవేంద్రునికీర్తిజాలము దిగ్గజములదంతములను మించి, ముక్కంటితలయం దున్న చంద్రరేఖను సరిసచ్చుచు వెండికొండయం దున్న పటికపురాలలోపమును బూర్తి చేయుచు, నొప్పుచున్నది. అలం. రూపకము. అతిశయోక్తి.

సీ. ఇతనిహేతిశతఘ్నికై నెబ్బంగి నెదిరించు
నరివీరశతము సంగరమునందు
లక్షభేదనకళాదక్షు నీతని నెట్టు
లహితయోధులలక్షలాక్రమించు
నీక్షణాజితపద్ము నితని నేక్రమమున
విహతపద్మము లగపింపఁజాలు
సర్వపరచ్ఛిద్రాళికర్తు నీతని నెవ్వి
ధంబున రిపుపరార్ధము జయించుఁ
తే. గాన సంఖ్యోపగమన మొక్కటియు దిక్కు
వీనిపగఱకు మాటలు వేయు నేల
కార్తికీతిథియామినీకాలపూర్ణ
చంద్రమండలసంకాశచారువదన. 145

టీ. కార్తికీ...వదన - కార్తికీతిథి=కార్తికపున్నమవాఁటి, యామినీకాల=రాత్రిసమయమందలి, పూర్ణ=నిండయిన, చంద్రమండల=చంద్రబింబంబుతో, సంకాశ=సమానమైన, చారు=సుందరమయిన, వదన=ముఖముకల దమయంతీ! ఇతనిహేతి=ఇతనియాయుధమైన, శతఘ్నికై=నూఱుగురను జంపుదానిని, నూర్గురను జంపుతని యాయుధమనుట. శతఘ్నియనఁగా నినుపముండ్లు గలదై నాల్గుమూరల నిడివిగానుండు కఱ్ఱ, సంగరమునందు=యుద్ధమునందు, అరివీరశతము=శతసంఖ్యాకులయిన శత్రువులు, ఎబ్బంగికై=ఏరీతిగా, ఎదిరించుఁ=

=మార్కొనును. అతనిశతఘ్నియె నూర్వురను జంప సామర్థ్యము గలిగియు
న్నప్పు డట్టిదాని యుద్ధముచేయు నీరాజేంద్రుని నూర్వురుసంఖ్యగల శత్రువు
లెట్లు మార్కొనఁగలుగుదురు? అనఁగా మార్కొనలే రని భావము. లక్ష...
దక్షున్-లక్షభేదన=లక్షమందిని భేదించుటనెడి, కళా=చాతుర్యమందు, ద
క్షున్=నేర్పుగల, ఈతని నని యర్థము—లక్షమనఁగా గురి-గురికిఁ గొట్టుట
యందు నేరుపుగలవాని నని భావము. ఎట్టులు, అహితయోధులలక్షలు=లక్షసంఖ్య
గల శత్రువీరులు, ఆక్రమించున్=ఆక్రమింపఁగలుగును, లక్షలకొలంది వీరులను
జంపెడి యీరాజును, లక్షమందిశత్రువు లెల్లదెరించి యుద్ధము చేయఁగ
లుగుదురు? ఈక్షణ జితపద్మున్=నేత్రములచే జయింపఁబడిన, పద్మున్ =
పద్మమనెడి సంఖ్యగలవానిని, అనఁగాఁ జూపుచేతనే పద్మసంఖ్య గల యో
ధులను జయించుచున్నవాఁడని యర్థము—పద్మమనఁగా తామర గనుక కన్ను
లచేఁదామరలను జయించినాఁడని భావము. ఇతనిన్, ఏక్రమమునన్=ఏరీతిగా,
విమతపద్మములు=పద్మసంఖ్యగల శత్రువులు, అంగవింపన్ చాలున్=బాధింపఁ
గలదు. చూపుచేతనే పద్మసంఖ్య గల శత్రువులను జయించుచున్న యితని
పద్మసంఖ్యాకు లయిన శత్రువు లెట్లెదురుకొనఁగలరు? సర్వ...శక్తున్-సర్వ
=సమస్తమైన, పర=శత్రువులను, ఛిదా=ఛేదించుటయందు, శక్తున్=సామ
ర్థ్యముగల, ఈతనిన్, రిపుపరార్థము=పరార్థసంఖ్యగల శత్రువులని యర్థము—శ
త్రువులైన యన్యులలో సగమని భావము. ఎవ్విధంబునన్ = ఏరీతిగా, జయిం
చున్=జయింపఁగలుగును? అనఁగా శత్రువయిన ప్రతివానిని నితఁడు సంహరిం
చుచుండఁగాఁ బరార్థసంఖ్యగలవారైనను శత్రువు లేమి చేయఁగలుగుదురు?
గాన, వీనిపగఱకున్=ఇతని శత్రువులకు, మాటలు, వేయు నేల=వేయుమాట
లెందుకు? సంఖ్యాపగమనము=లెక్కనుండి తొలఁగుట - లెక్కలేనివా రగుట
యని యర్థము-సంఖ్యయనఁగా యుద్ధమును గనుక యుద్ధమునుండి పాఱిపోవుట
యని భావము. ఒక్కటియ=ఒక్కటియే, దిక్కు, శౌర్యవంతుఁడైన యితఁడు
పలాయితు లగువారిని జంపఁడు. కావున యుద్ధమునుండి పాఱిపోవుటయే జీవ
నోపాయము తక్క వేఱొక్కయుపాయము లే దని భావము.

తా. శరత్కాల పూర్ణిమయందలి చంద్రబింబమువంటిముఖము గల దమయంతీ! నూర్వురను జంపుచున్నశతఘ్నిని దాల్చిన యితని నూర్వురు శత్రువులెట్లు జయింపఁగలుగుదురు? లక్షలకొలంది శత్రువులను జంపందగిన చాతుర్యము గల యితని లక్షమాత్రసంఖ్యగల శత్రువు లేమి చేయఁగలరు? నేత్రముచేతనే పద్మసంఖ్య గలశత్రువులను గూల్చునీతనిని బద్మమాత్రమే సంఖ్యగాఁ గల వైరు లెట్లు చంపఁగలుగుదురు. పరార్థసంఖ్యగల శత్రువులను జయించునితనిని, శత్రువులందు సగముమందియెట్లు జయింపఁగలుగుదురు? కాన నితని మ్రోలఁబడిన శత్రువులకు యుద్ధమునుండి పాఱిపోవుట దక్క వేఱొక జీవనోపాయము లేదు. అలం. పరిసంఖ్య.

తే. అనుచు నిబ్భంగి నొత్తి చెప్పినను వినియు
　　ను త్తరము లేక యూరక యున్నఁ జూచి
　　యన్యరాజన్యు గుఱిచేసి యరిగె వాణి
　　యానధుర్యవ్రజంబు, తోఁ నరుగుఁదేర.　　146

టీ. వాణి=సరస్వతి, అనుచున్, ఇబ్భంగిన్=ఈరీతిగా, ఒత్తి చెప్పినను=దృఢముగాఁ జెప్పినను, వినియున్=ఆలకించియు, ఉత్తరములేక=ప్రత్యుత్తరమీయకుండ, ఉన్నన్=ఉండఁగా, చూచి, అనఁగా దమయంతి విరాగతపొందియుండుటను చూచి యని యర్థము, యానధుర్యవ్రజంబు=శిబికావాహకులు, తోన్=తనతో, అరుగుదేరన్=రాఁగా, అన్యరాజన్యున్=మఱియొక రాజును, గుఱి చేసి=లక్ష్యము చేసి, అరిగెన్=పోయెను.

తా. సరస్వతి తా నెంతబోధించినను వినక దమయంతి యతనియందు విరాగత పూనియుండఁగాఁ జూచి వాహకులతోఁ గూడి మఱియొకరాజుం గూర్చి పోయెను.

వ. ఇవ్విధంబునం గామరూపాధిపుం డైన కామరూపాధిపుం జేరం
　　జని వాగధిదేవత యవ్వనితావతంసంబున కిట్లనియె.　　147

టీ. ఇవ్విధంబునన్=ఈరీతిగా, కామరూపాధిపుండు=మన్మథునికంటె

రూపమున నధికుఁడయినవాఁడు, ఐన కామరూపాధిపుఁన్=అయినట్టి కామరూపదేశమున కధిపతిని, చేరన్, చని, వాగధిదేవత=సరస్వతి, అవ్వనితా వతంసంబునకున్=ఆదమయంతికి, ఇట్లు, అనియెన్.

తా. స్పష్టము.

తే. ఇతఁడు ప్రాగ్జ్యోతిషాధీశుఁ డిందువదన!
వీరచూడావతంసంబు వీనిఁ జూడు
మలసవలితంబు వ్రీడాభరాకులంబుఁ
జంచలము నైననీదు నేత్రాంచలమున. 148.

టీ. ఇందువదన=చంద్రునివంటి మొగము గలదానా! ఇతఁడు=ఈరాజు, ప్రాగ్జ్యోతిషాధీశుఁడు=ప్రాగ్జ్యోతిష దేశమున కధిపతి, వీరచూడావతంసంబు=వీరులలో శ్రేష్ఠుఁడైన, వీనిన్ = ఈరాజును, అలసవలితఁబు = మందమైనదియును, బరివర్తితమైనదియును, వ్రీడాభరాకులఁబు = లజ్జాతిశయముచేఁ దొట్రుపాటు పడుచున్నదియు, చంచలమును=చాంచల్యము కలదియు, ఐన నీదు నేత్రాంచలమునన్=అయినట్టి నీకడకంటిచేత, వీనిన్, చూడుము.

తా. ఓదమయంతీ! ఇతఁడు ప్రాగ్జ్యోతిషాధిపతి. మందములై, పరివర్తితములై, లజ్జాసంకులములై, చంచలములైన నీకడకన్నులచేత, వీరశ్రేష్ఠుఁడైన వీనిఁ జూడుము.

శా. క్రూరాసిత్రుటితారివారణఘటాకుంభాస్థికూటస్థలీ!
రారాజన్నవమౌక్తికోత్కర కిరాతరంభక్రమోజ్జృంభియై
యీరాజన్యకరంబు పోరులఁ గరం బేపారు సత్కీర్తి బీ
జారోపం బొనరించుభంగి హయరింఖాగ్రక్షుతక్షోణులన్.

టీ. ఈరాజన్య కరఁబు = ఈరాజేంద్రుని చేయి, పోరులన్=యుద్ధములందు, క్రూరా...జృంభియై-క్రూర=వాఁడియైన, అసి=ఖడ్గముచే, త్రుటిత=ఛేదింపబడిన, అరివారణఘటా=శత్రువుల గజసమూహములయొక్క, కుంభ=గండస్థలములయొక్క, అస్థికూటస్థలీ=ఎముకలసమూహమునందు, రారాజత్=

మిక్కిలి ప్రకాశించుచున్న, నవమౌక్తిక = క్రొత్త ముత్యములయొక్క, ఉత్కర=సమూహమును, కిర=చల్లుటయొక్క, ఆరంభక్రమ = ప్రారంభించుటయందు, ఉజ్జృంభియై=అతిశయించియున్నదై, హయ...క్షోణులన్-హయ=గుఱ్ఱములయొక్క, రింఖా=డెక్కలయొక్క, అగ్ర=కొనలచేత, క్షత=నలియఁగొట్టఁబడిన, క్షోణులన్=భూములందు, సత్కీర్తి...రోపంబున్-సత్కీర్తి=మంచి యశస్సుయొక్క, బీజ=విత్తులయొక్క, ఆరోపంబు=చల్లుటను, ఒనరించుభంగిన్=చేయుచున్నట్లు, కరంబు=మిక్కిలి, ఏపారున్=ఒప్పుచున్నది.. ఇట రాజు కరము సేద్యగాఁడు, ఆసిచేయి, గజకుంభముత్యములే విత్తనములు, హయరింఖలే నాఁగటికఱ్ఱులు, రణభూమియే పొలము, కీర్తియే పంట. అనఁగాఁ బ్రాగ్జ్యోతిషాధిపతి యుద్ధములందు భయంకరఖడ్గంబునుదాల్చి శత్రువుల మదగజములయొక్క కుంభస్థలంబులను జీల్చి యందున్న ముత్యములను భూమిపైకిఁ జిమ్ముచుండఁగా, నాచిమ్మఁబడినముత్యములు కీర్తి యనెడి వృక్షమును మొలపించుటకుఁ జల్లినయశోబీజములవలె నున్నవని కవి యుత్ప్రేక్షించెను. లోకములోఁ గృషీవలుఁడు వృక్షోత్పాదకములయిన బీజములను దున్నిన భూమియందుఁ జల్లుట సుప్రసిద్ధము. అట్లె యీరాజును, గుఱ్ఱముల డెక్కలచే నలియఁగొట్టఁబడిన యుద్ధభూములందు గజకుంభములందున్న ముత్యములనెడి యశోబీజంబులను జల్లుచుండెను. ఈచెప్పుటచే నీరాజు శత్రుగజములను మిక్కుటముగాఁ గూల్చి బహుళమగు యశంబును సంపాదించెనని స్పష్టమగుచున్నది.

తా. ఓదమయంతీ ! ఈరాజేంద్రునికరంబు రణములందు, శత్రువులమదగజంబులఁ గూల్చి తత్కుంభస్థలంబులందుండు ముత్యంబులను దీసి చల్లుచు నశ్వఖుర పుటంబులచే క్షుణ్ణమైన భూములందు యశోబీజంబులను జల్లుచున్న కరణిఁ బ్రకాశించుచున్నది. ఇట్టి మహాకీర్తిచే నొప్పుచున్న యీరాజేంద్రుని వరించుట యుత్తమము. అలం. ఉత్ప్రేక్ష.

స్రగ్ధర.

రాజీవాక్షీ! ప్రహారక్షిప్రసవదసృగసుహృత్కృత్తాంసువంశాళినేత
త్తేజోధూమధ్వజంబుల్ క్కి తిరిగితిరిగి రోక్కధించుదుస్సాధలీలన్

రాజావర్తోపలాంశుప్రతిమతదుదితప్రాజ్యధూమంబు గారా
రాజన్నాసీరవాజివ్రజఖురజరజోరాజి, ఘోరాజిభూమిన్.

టీ. రాజీవాక్షీ=పద్మములవంటి నేత్రములుగల దమయంతీ ! ఘోరాజిభూమిన్ =భయంకరమైన యుద్ధభూమియందు, రారాజత్ ... రాజి-రారాజత్ = మిక్కిలి ప్రకాశించుచున్న, నాసీర= సేనాముఖమందున్న, వాజివ్రజ=గుఱ్ఱపు గుంపులయొక్క, ఖుర=డెక్కలవలన, జ=పుట్టినట్టి, రజోరాజి=పరాగపంక్తి, రాజావర్త...ధూమంబుగాన్-రాజావర్త=రాజావర్త మను పేరుగల, ఉపల= నల్లమణులయొక్క, అంశు=కాంతులతో, ప్రతిమ=సమానమైనదియు, తదుదిత =అతని ప్రతాపానలమువలన నుదయించిన, ప్రాజ్య=గొప్పదయిన, ధూమంబు గాన్ =పొగయగుచుండఁగా, ఏతత్ ...ధ్వజంబుల్-ఏతత్ = ఈ రాజుయొక్క, తేజో ధూమధ్వజంబుల్ =ప్రతాపమనెడి యగ్నిహోత్రములు, ప్రహార...వంశాళిన్-ప్రహార=ఖడ్గముల దెబ్బలచేత, స్రవత్ =కారుచున్న, అసృక్ =రక్తముకల, అసుహృత్ =శత్రువులనెడి, వంశ=బొంగు వెదుళ్లయొక్క, ఆళిన్ = పంక్తిని, దుస్సాధలీలన్ =శత్రువులకు సాధింప శక్యముకానిరీతిచే, తిరిగి తిరిగి= మిక్కిలి చుట్టుముట్టి, రోధించున్ =ఆవరించును. భయంకర సమరమునందు తన చేతిఖడ్గంబుచే నఱకఁబడి, రక్తసిక్తంబులగుశరీరంబులఁ దాల్చినశత్రువీరులనెడి తడిసిన కట్టెలచేఁ బ్రజ్వలించుచున్న యితని ప్రతాపాగ్నికిఁ, దనసేనాముఖమందు వాజిసమూహముల డెక్కలచే నుద్ధూతంబు లయిన పరాగములు గొప్ప ధూమము లగుచున్నవని భావము. లోకములోఁ దడిసిన కాష్ఠములు దగ్ధమగు నప్పుడు పొగగుంపు లెక్కుడుగా నుదయించుట సహజము. అట్లె యిచ్చట "స్రవదసృగసుహృత్" అను పదముచే రక్తసిక్తులయినశత్రువు లని యర్థము వచ్చుచున్నది కాన తాదృశశత్రువు లనెడి తడిసిన వెదుళ్లను దహించుట వలన నితనిప్రతాపవహ్నినుండి ధూమము మిక్కుటముగా వెలువడవచ్చును. ఇతనిగుఱ్ఱపువరుసలవలన నుత్పన్నమైన పరాగ మీ రాజుప్రతాపాగ్నికి ధూమ మగుచున్నదని యూహించుటచేఁ, బ్రతాపాగ్నివలన ధూమబాహుళ్యమును దానివలనఁ బరాగబాహుళ్యమును, నందువలన గుఱ్ఱపువరుసలపెంపును దెలియ

నచ్చుచున్నది. ఇతఁడు పెక్కండ్రశత్రువులఁ గూల్చె ననియు, నశ్వములు పెక్కులు గల వనియు ఫలితార్థము. అలం. రూపకము.

వ. అనియె నాసమయంబున సమీపవర్తిని యగు తాంబూల కరండవాహిని దమసహోదరిభావం బెఱింగి భారతీదేవి నుద్దేశించి యో దేవి యీవసుధావల్లభునిమీఁద నిప్పల్లవాధరకు నుల్లంబు పల్లవింపదు. వచనపరిశ్రమంబు వలదు. వాఁడె యుత్కలదేశాధీశ్వరుఁ డమ్మహీశ్వరుగుణకలాపంబు లభివర్ణింపు మనుటయు. 151

టీ. అనియెన్, ఆసమయంబునన్, సమీపవర్తిని=దాపుననున్నది, అగు తాంబూల కరండవాహిని=అయిన తాంబూలపు పెట్టెను వహించిన దాసి, దమసహోదరి భావంబు=దమయంతి యభిప్రాయంబును, ఎఱింగి, భారతీదేవిన్ =సరస్వతిని, ఉద్దేశించి, ఓదేవి ! ఈ వసుధావల్లభునిమీఁదన్ =ఈరాజేంద్రునిమీఁద, ఇప్పల్లవాధరకున్ =ఈ దమయంతికి, ఉల్లంబు=మనస్సు, పల్లవింపదు=చిగుర్పదు అనఁగా నపేక్ష లేదు. వచనపరిశ్రమంబు=మాటలు పలుకుటవలనఁ గల్గు నాయాసము, వలదు. వాఁడె, ఉత్కలదేశాధీశ్వరుండు=ఉత్కలదేశాధిపతి, అమ్మహీశ్వరుగుణకలాపంబులు = ఆరాజుయొక్క సద్గుణంబులను, అభివర్ణింపుము, అనుటయున్ =అనిచెప్పఁగా, అని పైపద్యము నన్వయము.

క. భారతి రతీశకల్పుని
నారాజకుమారుఁ గదియ నరిగి గభీరో
దారమృదుమధురభాషల
నారమణీమణికి నిట్టు లనియెం బ్రీతిన్. 152

టీ. భారతి=సరస్వతి, రతీశకల్పునిన్ =మన్మథునితో సమానుఁడగు, ఆరాజకుమారున్ =ఆ రాజపుత్రుని, కదియన్ అరిగి=సమీపమున కేఁగి, గభీర .. భాషలన్-గభీర=అర్థగాంభీర్యము గలిగినవియు, ఉదార=గొప్పతనము గలవియు, మృదు=మృదులమైన, మధురభాషలన్ =తియ్యని మాటలచేత, ప్రీ

తిన్ =సంతోషములో, అరమణీమణికిన్ =ఆ దమయంతికి, ఇట్టులు, అనియెన్ =ఇవ్విధముగాఁ బలికెను.

తా. అంతట భారతి మన్మథునితో సమానుఁడయిన యారాజకుమారుని సమీపించి మృదుమధురభాషణములతో దమయంతి కి ట్లనియె.

క. ఇతఁ డుత్కలదేశాధిపుఁ
డతివ! విలోకింపు మితని నానమ్రక్ష్మా
పతితతికిరీటకోటీ
శతమఖమణిమధుపచుంబిచరణాంబుజునిన్. 153

టీ. అతివ=ఓదమయంతీ! ఇతఁడు=ఈరాజు, ఉత్కలదేశాధిపుఁడు = ఉత్కలదేశమున కధిపతి, ఆనమ్ర...బుజునిన్ - ఆనమ్ర=నమస్కరించుచున్న, క్ష్మాపతితతి = రాజసమూహముయొక్క, కిరీటకోటీ=కిరీటములయొక్క కొనలందున్న, శతమఖమణి=ఇంద్రనీలరత్నము లనెడి, మధుప=తుమ్మెదలను, చుంబి=తాఁకుచున్న, చరణాంబుజునిన్ =పాదపద్మములు గలవాఁడగు, ఇతనిన్ =ఈరాజును, విలోకింపుము=చూడుము.

తా. ఓదమయంతీ! ఇతఁ డుత్కలదేశాధిపతి. నమస్కరించుచున్న శత్రువుల సమూహముల కిరీటములకొనలం దున్న యింద్రనీలరత్నము లనెడి తుమ్మెదలు తాఁకుచున్నపాదపద్మములు గలయితనిఁ జూడుము. అలం. రూపకము.

మ. చెమరించుం దుహినచ్ఛటాచ్ఛలమునన్ శీతాంశుబింబంబు రే
కుముదంబెన్నఁడు నిద్రవోదెపుడు నీకొప్పం బ్రవేశించు మ
ల్లిమతల్లీ నవమాలికాకుసుమముల్ లీలావతీ! వీనిదు
ర్దమదోర్దండయశఃప్రకాండవిభవారంభంబు జృంభించినన్.

టీ. లీలావతీ=విలాసములు గల దమయంతీ! వీని...రంభంబు-వీని=ఈరాజుయొక్క, దుర్దమ=దమింపఁ దరము గాని, దోర్దండ=బాహుపరాక్రమమువలన నుద్భవించిన, యశఃప్రకాండ=గొప్పకీర్తియొక్క, విభవారంభంబు=మహిమయొక్క అతిశయము, జృంభించినన్ = అతిశయింపఁగా, అనఁగా నీతని

కీర్తి సమస్తలోకములందుఁ గల తెల్లనివస్తువులను జయింప సమకట్టి లోకంబునఁ బ్రవర్తిల్లుచుండఁగా, రే=రాత్రియందు, శీతాంశుబింబంబు = చంద్రమండలము, తుహినచ్ఛటాచ్ఛలమునన్ =మంచుసమూహ మనెడి నెపముచే, చెమరించున్ =చెమటలఁ గార్చును; అనఁగాఁ జంద్రబింబ మితనికీర్తిని జూచి భయపడి మంచునెపముచేఁ జెమటలు వెలిపుచ్చుచున్న దని భావము. కుముదంబు=తెల్లకలువ, ఎన్నఁడున్ =ఎప్పుడును, నిద్రవోదు=నిద్రవొందదు; అనఁగాభయముచేఁ దెల్లఁగలువ రాత్రులందు నిద్దురవోకుండునని భావము. మల్లి... కుసుమములు-మల్లీమతల్లీ=ఉత్తమమైన మల్లెయొక్కయు, నవమాలికా=విరజాజిలతయొక్కయు, కుసుమములు=పువ్వులు, నీకొప్పున్ =నీ కేశపాశమును, ఎపుడున్, ప్రవేశించున్ =చొచ్చి (దాఁగి) యుండును. అనఁగా మల్లెపువ్వులను విరజాజులును, భయముచే నీకొప్పులో దాఁగి వర్తిల్లుచున్న వని భావము. చంద్రాదులకు స్వతస్సిద్ధముగానుండు హిమస్రవణాదులను నీరాజుకీర్తిని జూచుటవలనఁ గలుగుచున్న వని చెప్పఁబడియె. ఈరాజేంద్రునికీర్తి చంద్రాదులకంటెను మిక్కిలి తెల్లగానున్న దని ఫలితార్థము. బలవంతుఁడు పయినెత్తఁగా బలహీనుఁడు చెమర్చుటయు, నిదురపోకుండుటయు దాఁగికొనుటయు సహజములు.

తా. ఓదమయంతీ ! ఈరాజేంద్రునిసత్కీర్తి ముల్లోకంబుల జయింప సమకట్టి వర్తింపుచుండఁగా భయముచేఁ జంద్రుఁడు హిమ మనెడి నెపమునఁ జెమటలు గార్చుచుండును. రాత్రులందెన్నఁడును గుముదము నిద్రవోదు. మల్లికాకుసుమములును విరజాజిపువ్వులును నీకొప్పులో దాఁగికొనుచున్నవి. అలం. అతిశయోక్తి.

స్రగ్ధర. పైపైఁ దుఃఖావధట్టాశ్వప్రఖరఖురపుటీపాతవిక్షుద్యమాన
క్ష్మాపృష్ఠోత్థితప్రోద్ధత...రణారణరజస్స్కాండధారాంధకారం
బాపూర్ణంబైన ఘోరాహవముఖముల నశ్జ్రాక్షీ ! యీరా
జుబాహా, టోపం బీక్షింపరాకుండుటకు నుఱుఁగుచుండుర్
దివిన్ దేవషండమ్ముల్

టీ. అబ్జాక్షి=పద్మములవంటి నేత్రములు గల దమయంతీ! ఘోరాహవముఖములన్ =భయంకరయుద్ధారంభములందు, పైపై ..కారంబు-పైపై = మీఁదుమీఁదుగా, తుఃఖారఘట్టా=తురంగశ్రేష్ఠములసమూహముయొక్క, ప్రఖర=మిక్కిలితీక్ష్ణమైన, ఖురపుటీ = డెక్కచిప్పలయొక్క, పాత=పడుటచేత, విక్షుద్యమాన=నలియఁగొట్టఁబడిన, క్ష్మాపృష్ఠ=భూతలమునుండి, ఉత్తిష్ఠత్ =ఎగయుచున్న, అంధంకరణ=గ్రుడ్డితనముచేయుచున్న, రణరజస్కాండధారా=యుద్ధపరాగముయొక్క, సమూహపుపరంపర యనెడి, అంధకారంబు=చీఁకటి, ఆపూర్ణంబు=నిండైనది, ఐనన్ =కాఁగా, ఈరాజుబాహాటోపంబున్ = ఈరాజుయొక్క, బాహుపరాక్రమాతిశయమును, దివిన్ = ఆకాశమునందు, దేవపంక్తుల్ =దేవతాసమూహములు, ఈక్షింపన్ రాకుండుటకున్ =చూడ నలవిగాకుండుటకు, మఱుఁగుచుండున్ = పరితపించుచుండును; దేవతలీతనియుద్ధమును జూడఁ గుతూహలులై వచ్చి చూచుచుండఁగా నితనిగుఱ్ఱపుదళములవలన నెగయఁగొట్టఁబడినపరాగము లోకమును గప్పి యంధకారబంధురముగాఁ జేసి యొరుల కాయుద్ధము కానరాకుండఁ జేయుచున్న దని భావము. ఈచెప్పుటచే నితని కశ్వబల మధికముగా నున్నట్టు తెలియవచ్చుచున్నది. అల. రూపకము. అతిశయోక్తి.

తా. ఓదమయంతీ! యితని గుఱ్ఱపుదళముల డెక్కలచేఁ జూర్ణీభూతమైన భూమినుండి లేచిన పరాగము లోకము నావరించి చీఁకట్లు క్రమ్మినట్లు చేసి యితనియుద్ధమును జూడఁ గుతూహలముతో వచ్చి యాకసమునందుండు దేవతలకుఁ గాన రాకుండఁ జేయుచుండును.

మ. అసమానస్థిరదానవైభవకళాహంకారసింహాసనా
గ్రసమాసీనుఁడు వీఁడొకండు కలుగంగా నర్థియాచ్ఞారస
వ్యసనాభావమహాభవత్ఫలభరవ్యాజంబున స్నగ్రమై
యొసఁగన్ క్రందన శాఖడెందమునయం దెక్కించు మందారమున్.

టీ. అసమాన...సీనుఁడు-అసమాన=సాటిలేని, స్థిర=నిశ్చలమైన, దానవైభవ=దానసమృద్ధియందలి, కళా = చాతుర్యముచేఁ గల్గిన, అహంకార=అహం

కారమనెడి, సింహాసన=సింహాసనముయొక్క, అగ్ర=కొనయందు, సమాసీనుఁడు=కూర్చుండినవాఁడు, అనఁగా వితరణగుణమందు నిరుపమానుఁ డని భావము, వీఁడు ఒకండు=ఈరాజొకఁడు, కలుగన్ కాన్=ఉండఁగా, సంక్రందననశాఖి=కల్పవృక్షము, అర్థి...జంబునన్-అర్థి = యాచకులయొక్క, యాచ్ఞారస=అడిగికొనుట యనెడి, వ్యసన=అత్యాసక్తియొక్క, అభావ=లేకపోవుటచే, బహూభవత్ = అధికమగుచున్న, ఫల=పండ్లయొక్క, భర=బరువనెడి, వ్యాజంబునన్=మిషచేత, నమ్రమై=వంగినదై, డెందంబునయందున్ = మనసునందు, మందాక్షమున్ = సిగ్గును, ఎసన్ = మిక్కిలి, ఎక్కించున్= తాల్చును. అనఁగా నీరాజు సమస్తయాచకులకోర్కులను దీర్చి యుండుటచే లోకమున యాచకులే లేకపోయిరి. అందువలనఁ దనఫలములకు విని యోగములేక పోవుటచేఁ గల్పవృక్షము సిగ్గుచెంది వర్తించుచున్నదని భావము. ఫలభరాతిశయముచే వంగినకల్పవృక్ష మితనిదానగుణమును జూచి సిగ్గుపడి తల వంచుకొనుచున్న దని కవి వర్ణించెను. కల్పవృక్షాదులను మించినవితరణగుణముకలవాఁ డని ఫలితార్థము.

తా. ఓదమయంతీ! ఈరాజు సాటిలేని దానగుణము కలవాఁడై సమస్త యాచకుల కోర్కులను నెఱవేర్చుచుండఁగా నది చూచి కల్పవృక్షము తనకు యాచకులు లేక పోవుటచేఁ దఱుగనిపండ్లభార మనెడి మిషచే వంగి డెందమునం దెక్కుడగుసిగ్గును బొందుచున్నది. అలం. రూపకము, అపహ్నుతి. అతిశయోక్తి.

మ. కలుచం గోశబిలంబు వెల్వడి యదఃఖడ్గాహి పై వచ్చుచోఁ
జలనం బించుక లేక యీతనిరిపుక్ష్మాపాలసంఘాత మో
చెల! హస్తాంబురుహాంగుళీమయమహాసిద్ధౌషధీపల్లవాం
చలము ల్మేసి భజించు జాంగుళికతన్ సంగ్రామరంగంబులన్.

టీ. అదః ఖడ్గాహి=ఈరాజుఖడ్గ మనెడి సర్పము, కలుచన్=కోపముచే, కోశబిలంబు= ఒరయనెడి పుట్టకన్నమునుండి, వెల్వడి=బయలుదేఱి, పైవచ్చుచోన్=తమపైకి విజృంభించునప్పుడు, ఈతని...సంఘాతము—ఈతని=ఈరాజు

యొక్క, రిపుక్ష్మాపాల=శత్రురాజులయొక్క, సంఘాతము=సమూహము, చల నంబు ఇంచుక లేక=భయముచేఁ గొంచెమైనను జలింపక, సంగ్రామరంగంబులన్=యుద్ధరంగములందు, ఓచెల=అయ్యయ్యో! హస్తాంబు...చలముల్—హస్తాంబురుహ=హస్తపద్మములయొక్క, అంగుళీమయ=అంగుళీరూపము లయిన, మహత్=గొప్పవయిన, సిద్ధౌషధీ=సిద్ధౌషధీలతలయొక్క, పల్లవాంచలముల్=కొనచిగుళ్లను, మేసి=తిని, జాంగులికతన్=విషవైద్యత్వమును, భజించున్=పొందును. అనఁగా నాసర్పమువలనఁ గల్గినవిషమునకు వైద్యము చేసికొనుచు న్నా రనుట. సర్పము నోటియందు మహౌషధి నుంచుకొని యున్నవారిని సమీపించి కఱచి చంపదు. అట్లె యితనిఖడ్గము, చేతిలోనున్న శస్త్రములను విడిచి దైన్యముచే నోటిలో నంగుళీపర్వ మ్ముంచుకొని యున్నవారిని జంపదు. ఈ చెప్పటచే నితఁడు భయపడినవారిని శరణాగతు లగువారిని రక్షించును గాని తక్కినవారిని రక్షింపఁడని తెల్లమగుచున్నది. పుట్టనెక్కినవారిని, పూరిగఱచినవారిని నోట వ్రేళ్లిడుకొన్నవారిని జంపరామి నిట తెలియునది. అలం. రూపకము.

తా. ఓదమయంతీ! యితనిఖడ్గ మనెడి సర్పము కోపముతో నొఱ యను బిలమునుండి వెడలి తమపైకి విజృంభించుచుండుట చూచి యితనిశత్రువులు భయంబున స్తంభీభూతులై తమయంగుళీపర్వములనెడి సిద్ధౌషధీపల్లవంబుల నోటిలో నుంచుకొని విషవైద్యు లగుచున్నారు.

వ. అని పలికి పలుకుబోటి వరాటరాజకన్యకం గనుంగొని య
ప్పుడ య్యింతియంతరంగంబు నిరంతరస్మరణపరణిధారావాహిజ్ఞానధారాసమారూఢనిషధపరివృఢం బగుట నెఱింగియు నెఱుంగనిచందంబు భావించుచుఁ బ్రస్తావోచితప్రకారం బునం జతురంతయానధరులం బదంబుపదఁ గని యుత్కలాధీశ్వరుఁ గడచి యసమసమరవిస్మృమరచమూసముదాంధగంధ సింధురఘటావమధుశీకరాసారహారినీహారసమయకంపితారా

తిహృదయకమలుండును, మదవదరిచూడాకుసుమిందకందళ
కిరణసంస్పర్శసందీపిత చరణారవిందుండును, గరళకరాళకర
వాలధారానికృత్తగళద్రక్తరిపుసుభటనటారబ్ధనాట్యాద్భుతా
లోకహృష్టత్రివిష్టపనివాసుండును, నగునొక రాసుతుం జూపి
దేవి! యితం డు కీకటాధీశ్వరుం డిస్సుహీపతిపుంగవునపాంగరం
గస్థలలాస్యలంపటంబు లగుకటాక్షవీక్షణంబుల నిరీక్షింపుము.

టీ. అని, పలికి, పలుకుబోటి=సరస్వతి, వరాటరాజకన్యకన్ = వరాటదేశ రాజుకుమారిక యగు దమయంతిని, కనుంగొని=చూచి, అప్పుడు=ఆసమయం బున, అయ్యింతి యంతరంగంబు=ఆదమయంతియొక్క చిత్తంబు, నిరంతర... పరివృఢంబు-నిరంతర=ఎడతెగని, స్మరణసరణి=జ్ఞప్తిమార్గమునొక్క, ధారా వాహి=విడువక పయిపయిసాఁగుచున్న,జ్ఞానధారా=ప్రవాహరూపముగానున్న జ్ఞానమందు, సమారూఢ=అధిష్ఠించిన, నిషధపరివృఢంబు=నిషధరాజుగలది, అగుటన్=అయియుండుటను, అనఁగా దమయంతి యెల్లప్పుడును నలరాజునే స్మరించుచుండుటచే సంతతస్మరణవలనఁ గల్గినసంస్కారజ్ఞానమందు నలరాజే కానవచ్చుచుండెనని భావము. ఎఱింగియు=దమయంతి నలునియందే తనచిత్త మును బ్రవేశింపఁజేసిన దని తెలిసికొనియు, ఎఱుంగనిచందంబునన్ = తెలిసికోని విధంబు, భావించుచున్=కనఁబఱచుచు, ప్రస్తావోచితప్రకారంబునన్ =ఆప్ర సంగంబున కుచితమగురీతి చే,చతురంతయానధరులన్ =పల్లకినిమోయుచున్నవా రిని, పదంపు, పదండు, అని, ఉత్కలాధీశ్వరున్ =ఉత్కలదేశాధీశ్వరుని, కడచి=దాఁటి,అసమ...కమలుండు-అసమ=సాటిలేని, సమర=యుద్ధమందు, విస్ఫురమర=విజృంభించిన, చమూ=సేనయందలి, మదాంధ = మదముచే గ్రుడ్డి వయిన, గంధసింధురఘటా=గంధజాతియేనుఁగులసమూహములయొక్క, ఐమ ఘు=మదముయొక్క, శీకర=తుంపురులయొక్క, ఆసార=జడివాన యనెడి, హారి=మనోహరమైన, నీహారసమయ=హేమంతముచే, కంపిత=చలింపఁజేయఁ బడుచున్నట్టి, అరాతి=శత్రువులయొక్క, హృదయకమలుండును=మనఃపద్మ

ముకలవాఁడును, అనఁగా హేమంతసమయమునకుఁ బద్మములు భయపడుచున్న ట్టు లారాజు మదగజము లుమియుచున్న మదాసారముచే శత్రుహృదయములు భయపడుచున్నవని భావము. ఈచెప్పుటచే నీరాజునకు గజబల మధికముగా నున్నట్టు తెల్లమగుచున్నది. మదవత్ ... అరవిందుండు—మదవత్ =గర్వించిన, అరి=శత్రువులయొక్క, చూడా=కేశపాశమందున్న, కురువింద=కెంపులయొ క్క, కందళ=అంకురములయొక్క, కిరణసందోహ = కిరణసమూహముచేత, సందీపిత=ప్రకాశించుచున్న,చరణారవిందుండును=పాదపద్మములు కలవాఁడు- అనఁగా సమస్తశత్రువులను జయించి వారిచే నమస్కారములు కొనుచు న్నాఁడని తాత్పర్యము. గరళ ... నివాసుండును—గరళ=విషమువలె, కరాళ= భయంకరమైన, కరవాల=కత్తియొక్క, ధారా=అంచుచే, నికృత్త=నఱుకఁ బడినట్టియు, గళత్ =కారుచున్న, రక్త=నెత్తురుగల, రిపుసుభట=శత్రుభటు లనెడి, నట=నటులచేతను, ఆరబ్ధ=ప్రారంభింపఁబడిన, నాట్య=నృత్యమనెడి, అద్భుత=వింతను, ఆలోకన= చూచుటచేత, హృష్ట=సంతసించిన, త్రివిష్టపని వాసుండును=మూడులోకములఁ గలజనులు కలవాఁడు, అనఁగా నీరాజు శత్రు వులను నఱకఁగా వారు ఖండితాంగులై యుద్ధభూమియందు నాట్యము చేసి చూపఁ బ్ర కద్భుతంబును గల్గించుచున్నారని భావము. ఖండితులయ్యు నితని శ త్రువులు నాట్యముచేయుచున్నారని చెప్పుటచే నితనిఖడ్గలాఘవము వ్యక్తమగు చున్నది. అగు నొక్కరాసుతుల్ =అయినట్టి యొక రాజకుమారుని, చూపి, దేవి! ఇతండు, కీకటాధీశ్వరుఁడు=కీకటదేశపురాజు, ఇమ్మహీపతిపుంగవుక్ = ఈరాజపుంగవుని, అపాంగ ..లంపటంబులు- అపాంగ=కడకన్నులనెడి, రం గస్థల=రంగస్థలమందు, లాస్య=నర్తనముచేయుటయందు, లంపటంబులు=ఆస క్తికలవి, అగు కటాక్షవీక్షణంబులక్ =అయినట్టి చూపులచేత, నిరీక్షింపుము= చూడుము.

స్రగ్ధర.

లీలంగట్టించెఁ బెక్కుకీర్తుల్ నెలవులఁ జెలువుకీర్వీఁడు సాంద్రచంద్రదుమాళీ
వ్యాలీఢోద్యం [illegible] కీర్తిలక్ష్మీ

మూలంబుల్ నీలనీలాంబుజదళదళనామోదమేదస్విపాథః
కేళీలోలద్విజాళీకృతమధురకలక్రేంక్రియాసంకులంబుల్. 159

టీ. వీఁడు=ఈరాజు, సాంద్ర...స్వాంతముల్ - సాంద్ర=దట్టమైన, ద్రుమాళీ=తరుపంక్తులచే, వ్యాలీఢ=వ్యాప్తమైన, ఉపాంత=తీరములు గలదగుటచే, శాంత=శమింపఁజేయఁబడిన, వ్యథ=గ్రీష్మతాపముగల, పథికజనస్వాంతముల్=పథికులచిత్తములు గలవియు, అనఁగా వృక్షపంక్తులచే నిండినయాతటాకతీరములు పథికులసంతాపమును దొలంగించుచు సంతసంబును గూర్చు చున్నవని భావము. కీర్తిలక్ష్మీ = కీర్తిసంపదకు, మూలంబుల్=నిదానము లయినవియు, నీల...కులంబుల్—నీల=నీలమణువలె నల్లనైన, నీలాంబుజ=నల్లకలువలయొక్క, దళ=రేకులు, దళన=విరుటచేఁ గల్గిన, ఆమోద=పరిమళముచే, మేదస్వి=పోషింపఁబడిన, అనఁగా నధికపరిమళము గల యని యర్థము, పాథః=ఉదకములయొక్క, కేళీ=విహారమునందు, లోల=ఆసక్తిగల, ద్విజాళీ=పక్షిపంక్తులచే, కృత=చేయఁబడుచున్న, మధుర=తియ్యని, కల=అవ్యక్తమధురమైన, క్రేంక్రియా=క్రేంకారధ్వనులచే, సంకులంబుల్=నిండినవియు,నగు, చెఱువుల్, పెక్కుల్, నెలవులన్=అనేకస్థలములందు,లీలన్=విలాసముగా, కట్టించెన్=నిర్మించెను. ఇతఁడు రమణీయములును సుఖజనకములును నగు చెఱువులను ద్రవ్వించి ధార్మికుఁ డని ఖ్యాతిచెందె నని భావము.

తా. ఈరాజు తీరములందుఁ జెట్లు దట్టముగాఁ గల్గి పథికజనులగ్రీష్మతాపమును దొలంగించునట్టివియుఁ గీర్తికి కారణములయినట్టివియు, వికసించినకలువలపరిమళముచే సువాసితము లయిన జలమందు విహరించుచున్నపక్షుల క్రేంకారధ్వనులచే నిండినవియు నగు చెఱువులఁ బెక్కుచోట్లఁ ద్రవ్వించెను.

మహాస్రగ్ధర.

మహిళాసీమంతముక్తామణి యితనియశోమండలీపూర్ణరా
కా, తుహినాంశుల్ దాడిమై వర్తులు వడిఁ దనపైఁ దో
మ్మిగానంచుఁ జుమ్మీ, నుహిగోళచ్ఛాయమాయామయగణి

తకళాకమాత్రలక్ష్యాంగకుండై, గ్రహవీథిఁ దుర్గవీథిం గ
ప్రభ చెడి యొదుఁగుఁగ్ గ రాహురాహుత్తుఁ డోటన్. 160

టీ. మహిళా...మణి—మహిళా= స్త్రీలయొక్క, సీమంత = పాపటలం దున్న, ముక్తామణి=ముక్తామణివంటిదానా! అనఁగా నో స్త్రీరత్నమా యని యనుట, రాహురాహుత్తుఁడు=రాహువనెడి రౌతు, ఇతని...అంశుల్—ఇతని= ఈరాజుయొక్క, యశోమండలీ=కీర్తిసముదాయమనెడి, పూర్ణ=నిండయిన, రాకాతుహినాంశుల్=పున్నమచంద్రులు, తనపైన్, వడిన్ = శీఘ్రముగా, దొమ్మిగా=అందఱు చంద్రులును గలసి, దాడిమై=దండెత్తి, ఐత్తురు అంచున్ చుమీ=వత్తురేమోయనియే సుమీ, మహి...గకుండై—మహిగోళ=భూగోళము యొక్క, ఛాయ=నీడయనెడు, మాయామయ = కపటస్వరూపమైన, గణిత కళామాత్ర = జ్యోతిశ్శాస్త్రముచేతనే, లక్ష్య = చూడఁబడుచున్న, అంగ కుండై=శరీరముకలవాఁడై, గ్రహవీథిన్=గ్రహమార్గమం దని యర్థము-దాఁ గుట కనువుగా గ్రహముల గృహములో నని భావము. ప్రభ చెడి=కాంతితఱిగి, ఓటన్=భయముచే, దుర్గవీథిన్=కోటలోని గృహవీథియందు-ఒకగృహమున నలువురకు తెలియని ప్రదేశమందనిభావము, ఒదుఁగున్ =దాఁగియుండును. అనఁ గా రాహు విదివఱకుఁ జంద్రునొక్కనిని జూచి జయించుచుండువాఁడు. ఇప్పు డీరాజు కీర్తిచంద్రులు లెక్క కెక్కువ యయి విలసిల్లిరి. అది చూచి రాహు వొక్కచంద్రుని జయింపఁగల్గును గాని యిందఱుచంద్రు లొక్కమాఱువచ్చిన జయించుట మిక్కిలి కష్టమని భావించి రాహువు గ్రహవీథియం దుండఁజాలక వారికిఁ గనఁబడకుండనుండ నెంచి భూచ్ఛాయరూపమయిన మాయామయ శరీ రమును, ధరించెనని యర్థము. భూగోళచ్ఛాయయే రాహు వని జ్యోతిశ్శాస్త్రం బునఁ జెప్పఁబడినది. లోకములో నొకఁడు శత్రువులకుఁ దెలియఁబడకుండ రూ పాంతరము దాల్చుట లోకప్రసిద్ధము. అట్లే రాహువు చంద్రులకు భయపడి గ్రహవీథి విడిచి భూచ్ఛాయరూపమును దాల్చెనని భావము. ఈచెప్పుటచే నీరాజుతో సముఁడగు యశస్వి లోకమున లేఁడని ఫలితార్థము. అలం. ఉ త్ప్రేక్ష, వ్యతిరేకము.

తా. ఓదమయంతీ ! రాహు వీ రాజేంద్రుని కీర్తిపూర్ణచంద్రులను జూచి వీరందఱొక్కపరి తనపైకి దాడివెడలివచ్చినఁ దాను నిల్చుట కష్టమని భావించియే భయముచే భూచ్ఛాయరూపమంది, కేవలము గణితశాస్త్రమునకు మాత్రమే ప్రత్యక్షమగుచు గ్రహవీథిని దుర్గవీథిని నొదిఁగియుండెను.

మహాస్రగ్ధర.

తరుణీ దామోదరీయోదరకుహరదరీస్థాన మీవిశ్వధాత్రీ
శ్వరుకీర్తుల్ నించి పాఱన్ జటులగతి జగజ్జాలముల్ దేలి
యాడన్, మురజిన్నాభిప్రణాళీముఖమున ధవళాంభోజ మ
స్మేరం గాదా, నెరపై తత్పూరమంతర్నిబిడమయి బహిర్ని
ర్గమంబు న్భజించెన్. 161

టీ. తరుణీ! ఓదమయంతీ ! ఈవిశ్వధాత్రీశ్వరుకీర్తుల్ = ఈరాజేంద్రుని కీర్తులు, దామో...స్థానము-దామోదరీయ= విష్ణుసంబంధి యగు, దరీ=గుహవంటి, ఉదరకుహర=గర్భములోపలి, స్థానమున్ =ప్రదేశమును, నించి=నిండించి, పాఱన్ =ప్రవహింపఁగా, చటులగతిన్ =సమర్థమయినగతితో, జగజ్జాలముల్ =విష్ణుగర్భములో నున్నలోకములన్నియు, తేలియాడన్ =తేలిపోవునట్లుగా, తత్పూరము=ఆకీర్తిప్రవాహము, నెరపై =అచ్చటనిండినదై, కానన్ =కావుననే, అంతర్నిబిడమయి=లోపల మిక్కిలి సాంద్రమయి, మురజిత్...ముఖమునన్ = మురజిత్ =విష్ణునియొక్క, నాభిప్రణాళీముఖమునన్ =బొక్కిలియనెడి తూముమూలమున, ధవళాంభోజము= తెల్లఁదామరపూవు, అస్మేరన్ = అనుమిషచే, బహిర్నిర్గమంబున్ భజించున్ కాదా=పైకి వచ్చునుగదా, అనఁగా నితనికీర్తి విష్ణుగర్భకుహరములోనున్న లోకములను నుంచి యచ్చట చోటు చాలమిచే విష్ణు నాభియను కాలువమూలమునఁ బైకివచ్చుచున్న దని భావము. ఈచెప్పుటచే నితనికీర్తి మిక్కిలి గొప్పదని స్పష్టమగుచున్నది.

తా. ఓ దమయంతీ ! యీరాజచంద్రుని కీర్తిసమూహములు ప్రపంచ మంతయుఁ గల విష్ణుజఠరకుహరమును నిండెను. అందలిలోకములు దానియం

దుఁ దేలెను. అనంతర మాపూరము లోపల నిండి చోటుచాలక విష్ణుమూర్తి పొక్కిలి యనుకాలువమూలమున బయలువెడలినది. దానినే దెల్లతామరపూ వని వ్యవహరింతురు. అలం. రూపకము. అతిశయోక్తి. ఉత్ప్రేక్ష.

వ. అనిన విని యనాదరముద్రాముద్రితంబైనహృదయంబు
తో నవ్విద్రుమాధర కీకటాధీశ్వరుం గటాక్షింప కుండిన.

టీ. అనినన్ =సరస్వతి యట్లు పలుకఁగా, వినియున్, అనాదర...ముద్రితంబు—అనాదరముద్రా=తిరస్కార ముద్రచేత, ముద్రితంబు=చిహ్నితము, ఐనహృదయంబులోన్ =అయినట్టి చిత్తములో, అవ్విద్రుమాధర= పగడమువంటి యధరోష్ఠముగల దమయంతి, కీకటాధీశ్వరున్ =కీకటదేశాధిపతిని, కటాక్షింపక, ఉండినన్ =చూడకుండఁగా, అని పైపద్యముతో నన్వయము.

ఉ. వేసట లేక భీమపృథివీపతినందనయాననాంబుజో
ల్లాసవిరక్తిముద్ర పదిలంబుగఁ గన్గొని యాదినాంతసం
ధ్యాసమయాధిదేవత పితామహుపట్టపుదేవి గీకటుం
బాసి చనం దలంచె మణిపంచనలీమణిమంచవీథికిన్. 163

టీ. ఆ... దేవత—ఆదినాంతసంధ్యాసమయ=సాయంకాలసంధ్యకు, అధిదేవత=అధిదేవతయును, పితామహుపట్టపుదేవి=బ్రహ్మరాణియైన యాసరస్వతి, వేసట=ఆయాసము లేక, భీమపృథివీపతినందన=దమయంతియొక్క, ఆననా...ముద్ర-ఆననాంబుజ=ముఖపద్మముయొక్క, ఉల్లాస = సంతోషమందలి, విరక్తిముద్ర=అనురాగము లేకపోవుటను, పదిలంబుగ=జాగరూకతతో, కన్గొని=చూచి, లేక తెలిసికొని, కీకటున్ =కీకటాధీశ్వరుని, పాసి=విడిచి, మణి=అవతలనున్న; పంచ...వీథికిన్ —పంచనలీ=అయిదుగురునలులు నధివసించియున్న, మణి=రత్నమయమైన, మంచవీథికిన్ =ఆసనము లున్నప్రదేశమునకు, చనన్ తలంచెన్ =వెడలనిష్టపడెను.

తా. సాయంకాలసంధ్య కధిదేవత యగు నాసరస్వతి యలమట చెందక దమయంతి కాకీకటాధీశ్వరునియం దనురాగంబు లేదని యెఱింగి నలుఁడును,

నలవేషధారులై యున్న యింద్రాదులును నుపవేశించినప్రదేశమునఁ జన వలె నని తలంచెను.

వ. అప్పుడు సరస్వతీదేవినిర్దేశంబున యానధుర్యులు రాజసమాజంబువలనం బాపి భోజరాజకన్యకను నిషధరాజపంచకంబునుం గదియించుటఁ బరిమళంబులు నందనోద్యానతరుషండంబులవలనఁ బాపి మధుపమాలికం గల్పపాదపపంచకంబునుం గదియించినచందంబునఁ దోఁచె ననంతరంబ నలాకృతిధరులైనయాలోకపాలురం జూపి క్రమంబున. 164

టీ. అప్పుడు, సరస్వతీదేవి నిర్దేశంబునన్ = సరస్వతియాజ్ఞ చొప్పున, యానధుర్యులు = పల్లకి మోచువారు, భోజరాజకన్యకను = దమయంతిని, రాజసమాజంబువలనన్ = ఆరాజులవలన, పాపి = తొలఁగించుకొని పోయి, నిషధరాజపంచకంబున్ = నలపంచకమును, గదియించుటన్ = సమీపింపఁజేయుటను, పరిమళంబులు = సువాసనలు, నందనోద్యానతరుషండంబులవలనన్ = నందనవనమందున్న యితరవృక్షసమూహములనుండి, మధుపమాలికన్ = తుమ్మెదలపంక్తిని, కల్పపాదపపంచకంబును = అయిదయిన కల్పవృక్షములను, కదియించినచందంబు = సమీపింపఁజేసినట్టిరీతి, తోఁచెన్ = కనుపట్టెను. అనంతరంబు-అ = తరువాత, నలాకృతిధరులు - నలరాజురూపమును ధరించినవారు, ఐనయాలోకపాలురన్ = అయిన యాదిక్పాలకులను, చూపి, క్రమంబునన్ = వరుసగా అని పైపద్యముతో నన్వయము.

గీ. వాణి యిట్లను నక్కరణివాణి కెలమి
గూఢశబ్దార్థసంశ్లేషరూఢి మెఱయు
నిర్జరాధీశ్వరులకును నిషధపతికి
వర్ణనావాక్యరచన నన్వయము గలుగ. 165

టీ. వాణి = సరస్వతి, నిర్జరాధీశ్వరులకును = ఇంద్రాదులకును, నిషధపతికిన్ = నలునకును, వర్ణనావాక్యరచనన్ = వర్ణించుటయందలి వాక్యరచనచేత,

అన్వయము=సంబంధము, కలుగన్=కలుగునట్లుగా, గూఢ...రూఢి-గూఢ=గుప్తములైన, శబ్దార్థ=శబ్దార్థములయొక్క, సంశ్లేష=కలయికయందు, రూఢి=నిర్ణయము, మెఱయన్=ప్రకాశింపఁగా, అనఁగా వివిధములైన పదములు సంధివశమున నొకశబ్దమునం దిమిడియుండుటయుఁ బెక్కర్థంబు లొక్కపదమునకు వాచ్యములగుటయు అట్టిశబ్దార్థశ్లేష నెల్లడియగునట్లుగా నని భావము. ఎలమిన్=సంతోషములో, అక్కరవాణికిన్=ఆదమయంతికి, ఇట్లు అనున్=ఇట్లు పలికెను.

తా. ఆసరస్వతి తనవర్ణనాచాతుర్యముచే నింద్రాదులకును, నలరాజునకును సంబంధ మలవడునట్లు శబ్దార్థంబుల శ్లేషించుచు సంతసములో దమయంతి కిట్లు పలికెను.

చ. అతివ! యపవ్యపాయుని ననల్పవిలోచనపంకజాతుఁ బ్రీ
ణితనిజవీరసేనుని వినిర్జితసర్వమహీభృదావళిన్
హతమదవద్విరోధిబలు నాత్మచమూచరవారణానన
స్రుతమదగంధి యుద్ధమహిఁ జూడుము వీని మహేన్మహేంద్రునిన్.

టీ. ఇంద్రపరమైన యర్థము: అతివ=ఓదమయంతీ! అపవ్యపాయునిన్-అ+పవి+అపాయము, అని పదవిభాగము. వజ్రాయుధమునకు ఎడఁబాటు లేనివాని, ఎప్పుడును వజ్రాయుధము చేతఁ గలవాని ననుట. అనల్ప...జాతు-అనల్ప = పెక్కయిన, విలోచనపంకజాతున్ = నేత్రపద్మములు కలవాఁడు, అనఁగా సహస్రాక్షుఁ డనుట, ప్రీణిత ... సేను-ప్రీణిత = సంతోషింపఁజేయఁబడిన, నిజ=స్వకీయమైన, వీరసేనున్=వీరసైన్యము కలవాఁడు, అనఁగాఁ దనసైన్యమునకు సంతసము గల్గించుచున్నవాఁ డనుట. వినిర్జిత...వళిన్-వినిర్జిత=జయింపఁబడిన, సర్వ=సమస్తమైన, మహీభృదావళిన్=పర్వత సమూహము గలవాఁడు, హత...బలున్-హత=కొట్టఁబడిన, మదవత్=గర్వించిన, విరోధి=శత్రువయిన, బలున్=బలాసురుఁడు గలవాఁడు-అనఁగా బలాసురునిఁ జంపినవాఁ డని భావము. ఆత్మ...మహిన్-ఆత్మ=తనయొక్క, చమూ=సేనయందు, చర=సంచరించుచున్న, వారణానన=విఘ్నేశ్వరు ముఖమునుండి,

సృత=స్రవించుచున్న, మద=మదముయొక్క, గంధి=వాసన గల, యుద్ధమ హీన్=యుద్ధభూమిగల, వీనిన్=ఈ, మహిన్=భూమికి దిగివచ్చిన, మహేం ద్రునిన్=దేవేంద్రుని, చూడుము.

తా. వజ్రము నెప్పుడును ధరించువాడును, సహస్రలోచనములు గలవాఁడును, తనసైన్యమును సంతసింపఁజేయుచున్నవాఁడును, బర్వతములజయించినవాఁడును, విరోధియైనబలాసురుని జంపినవాఁడును, తనసైన్యమందుఁ దిరుగుచున్న గజముఖునిమదగంధముచే వాసిత మైన యుద్ధభూమి గలవాఁడును, భూమికి దిగివచ్చినవాఁడు నగు దేవేంద్రునిఁ జూడుమా?

టీ. నలపరమైన యర్థము. అతివ=ఓ.దమయంతీ! అపవ్యపాయునిన్=తొలఁగిన అపాయముగలవాఁడును, అనల్ప...జాతున్-అనల్ప=పెద్దవగు,విలోచనపంకజాతున్=నేత్రపద్మములు గలవాఁడును, ప్రీణిత నిజవీరసేనున్=సంతుష్టునిఁగాఁ జేసినతండ్రి యగు వీరసేనుఁడు గలవాఁడును, వినిర్జిత...వళిన్-వినిర్జిత=జయింపఁబడిన, సర్వ మహీభృదావళిన్=సమస్త రాజబృందము గలవాఁడును, హత...బలున్—హత=చంపిన, మదవత్=మదించిన, విరోధిబలున్=శత్రుసైన్యము గలవాఁడును, ఆత్మ...మహిన్—ఆత్మ=తనయొక్క, చమూచర=సేనయందు సంచరించుచున్న, వారణ=ఏనుఁగులయొక్క, ఆనన=ముఖములనుండి, స్రుత=స్రవించుచున్న, మదగంధి=మదపరిమళము గల, యుద్ధమహిన్=యుద్ధభూమిగలవాఁడును, అనఁగా నితనికి మదగజబల మెక్కుడుగాఁ గల దని భావము. వీనిన్=ఈ, మహిన్=భూమియందు, మహేంద్రునిన్=ఇంద్రతుల్యుఁడయిన నలుని, చూడుము.

తా. ఓదమయంతీ! నిరపాయుఁడును, విశాలమైన నేత్రములు గలవాఁడును, దన జనకుఁడగు వీరసేనుని సంతసింపఁజేయుచున్నవాఁడును, సమస్తరాజులను జయించినవాఁడును, శత్రుసైన్యములఁ గూల్చుచున్నవాఁడును, నధిక మయిన గజబలము గలవాఁడును భూమియందు దేవేంద్రతుల్యుఁడైనవాఁడునగు నలునిఁ జూడుము.

సీ. భాస్వరరూపసంశోభిన్నుఁ డుద్దతిమంతుఁ

డధికప్రతాపసమన్వితుండు
హేతిసంభూతప్రభూతభూతియుతుండు
శుచి ధనంజయుఁడు విస్ఫూర్తిశాలి
నానామహాసమిన్మధ్యప్రదీప్తుండు
సతతంబు విబుధసంతతికి ముఖము
లాలితబాలప్రవాళ తామ్రకరుండు
తనకు శాత్రవసముత్కరము తృణము
తే. తామరసపత్రనేత్ర యీతఁ డనలుఁడు
లావు గలవాఁడు లోకపాలకులలోన
బహుతరస్నేహరుచి మహాబలసహాయ
సంపదుద్దాముఁ డెలమి వీక్షింపు మితని. 167

టీ. అగ్నిపర మగునర్థము: తామరసపత్రనేత్ర=పద్మదళములవంటి నేత్రములు గల దమయంతీ! భాస్వరరూప సంపన్నుఁడు = దేదీప్యమాన మయిన రూపసంపదగలవాఁడు, ఉద్గతిమంతుఁడు=ఊర్ధ్వగమనముగలవాఁడు. అనఁగా సంతతంబు నితఁ మంట లుప్పరంబునకెగయుట స్వభావసిద్ధము. అధికప్రతాప సమన్వితుండు=మిక్కిలి గొప్పదగు నుష్ణస్పర్శము గలవాఁడు, హేతి...యుతుండు-హేతి=జ్వాలలవలన, సంభూత=పుట్టిన, ప్రభూత = అధిక మయిన, భూతి=భస్మముతో, యుతుండు=కూడియున్నవాఁడు. అనఁగాఁ దనజ్వాలల చేఁ బార్థివవికారములగు సమస్తవస్తువులను దహించి యధికమగు భస్మముగల వాఁడగుచున్నాఁడనుట, శుచి = పవిత్రతగలవాఁడు, ధనంజయుండు=ధనంజయుఁ డనుపేరుగలవాఁడు, విస్ఫూర్తిశాలి=మిక్కిలి యదటుచే నొప్పువాఁడు, నానా...ప్రదీప్తుండు-నానా=పలువిధంబులయిన, మహత్ = గొప్పవయిన, సమిత్ =కాష్ఠములయొక్క, మధ్య=నడుమ, ప్రదీప్తుండు=ప్రకాశించుచున్న వాఁడు,అనఁగా గొప్పదారువులను దహించుచుఁ బ్రకాశించువాఁడు, విబుధ సంతతికి=దేవతాసమూహమునకు, సంతతము=ఎల్లప్పుడును, ముఖము=నోరగు

చున్నవాఁడు—అనఁగా యజ్ఞాదులందుఁ దనయందు హోమము చేయఁబడినహవి
స్సును దేవతలకిచ్చుచు వారికి ముఖమువంటివాఁడగుచున్నాఁడని భావము.'అగ్ని
ముఖావై దేవా' అనఁగా దేవతలగ్నియే ముఖముగాఁగలవారు అని వేదప్రమా
ణము, లాలిత...కరుండు-లాలిత = మనోహరమైన,బాల = లేఁతయైన, ప్ర
వాళ=చిగుళ్లవంటి, కర=కిరణములుగలవాఁడు, తనకున్, తృణము, శాత్రవస
ముత్కరము=శత్రుసమూహము. అనఁగా తృణము నవలీల భస్మము చేయఁగల
వాఁడని భావము. ఇతండు=ఈవర్ణింపఁబడినవాఁడు, అనలుండు=అగ్నిహో
త్రుఁడు, లోకపాలకులలోనన్=దిక్పాలురలో, లావుగలవాఁడు=సామర్థ్యము
కలవాఁడు, బహుతరస్నేహరుచి = విస్తారమగు తైలముచేఁగల్గిన కాంతివిశే
షము గలవాఁడు,మహాబల...ఉద్దాముఁడు-మహాబల=వాయువుయొక్క,సహా
యసంపత్ =సహాయసమృద్ధిచే,ఉద్దాముఁడు=అడ్డులేనివాఁడు,అనఁగా వాయు
ప్రేరితమైనయగ్నిని నెవ్వరును శాంతింపఁజేయ లేరని భావము. ఇతనిన్=ఈ
యగ్నిహోత్రుని, వీక్షింపుము=చూడుము.

తా. స్పష్టము.

నలపరమైనయర్థము. భాస్వర...సంపన్నుఁడు—భా = దీప్తితోను, స్వర=
మధురమైనకంఠస్వరముతోను, రూప=సౌందర్యముతోను, సంపన్నుఁడు=కూడి
యున్నవాఁడు, ఉద్గతిమంతుఁడు=అభ్యుదయముకలవాఁడు,అధికప్రతాప సమ
న్వితుండు=గొప్పక్షాత్రతేజస్సుగలవాఁడు, హేతి...యుతుండు - హేతి=ఆ
యుధములవలన, సంభూత=పుట్టిన, ప్రభూతభూత=అధికైశ్వర్యములో, యు
తుండు=కూడియున్నవాఁడు, అనఁగా నాయుధంబున శత్రురాజులం జంపి వి
స్తారమగునైశ్వర్యమును సంపాదించుచున్నవాఁడని భావము. శుచిధనంజ
యుండు-శుచి=స్వధర్మముచేతనే, ధనంజయుండు=ధనము నార్జించినవాఁడు.
అనఁగా నలుఁడు తనక్షాత్రధర్మముచేతనే ధనమార్జించెనని భావము. విస్ఫూర్తి
శాలి=జ్ఞాపకశక్తిచే నొప్పువాఁడు, నానా...ప్రదీప్తుండు—నానా = అనేక
ములయిన, మహాసమిత్=గొప్పయుద్ధములయొక్క, మధ్య=నడుమను, ప్రదీ
ప్తుండు=ప్రకాశించువాఁడు, సతతంబు, విబుధసంతతికిన్=పండితసమూహ

మునకు, ముఖమువంటివాఁడు. అనఁగాఁ బండితులలో నగ్రగణ్యుఁడని భావము, లాలిత...కరుండు=మనోహరమైన లేఁతచిగుళ్లవలె నెఱ్ఱనిచేతులుకలవాఁడు,తన కుర్=అనలునకు, శాత్రవసముత్కరము=శత్రుసమూహము, తృణసమానము = అనఁగ శత్రువు లితనికిఁ దృణమువలె సులభముగా నున్మూలింపఁదగినవా రని భావము. ఈతండు - అ - నలుఁడు, అని పదవిభాగము; ఈతండ = ఇతఁడే నలుండు, లోకపాలకులలోనర్ = దిక్పాలురలో, లావు = బలము, కలవాఁడు, బహుతర...ఉద్దాముఁడు, బహుతర = మిక్కిలిగొప్పదగు, స్నేహరుచి= మైత్రీప్రకాశముగల, అనఁగా నధికస్నేహముగల యని భావము. ఈచెప్పుటచే నితనిస్నేహితులు నిష్కపటులని తెల్లమగుచున్నది. మహాబల= గొప్పబలవంతులయొక్క, సహాయసంపత్ =సహాయసమృద్ధిచే, ఉద్దాముఁడు=అడ్డులేనివాఁడు. అనఁగా నిష్కపటులగు బలవంతుల తోడ్పాటుండుటచే నితఁ డడ్డులేకుండఁ బ్రవర్తించుచున్నాఁడని భావము, లేక, బహుతర...ఉద్దాముఁడు—బహుతర=మిక్కిలిగొప్పదగు, స్నేహ=స్నేహము, రుచి=ఇచ్ఛ అనఁగా జయేచ్ఛయని భావము. మహాబల=గొప్పబలము వీనియొక్క, సహాయసంపత్ = సహాయసమృద్ధిచే, ఉద్దాముఁడు=అడ్డులేనివాఁడు. అనఁగా స్నేహాతిశయము జయేచ్ఛ, గొప్పబలమునుండుటచే నందఱను వశపఱుచుకొని నిరర్గళుండై ప్రవర్తించుచున్నాఁడని భావము. ఎలమిర్=సంతోషముతో, ఇతనిర్=ఈనలుని, వీక్షింపుము=చూడుము.

తే. పరభయంకరపటుగదాశ్రప్రహరణుండు
దండనిపుణుండు సమవర్తి కి ధర్మరాజు
మిత్రనందనుఁ డంభోజకినేత్ర ! చూడు
మితని దక్షిణనాయకు కి నింపు మీఱ. 168

టీ. అంభోజనేత్ర ! ఇతఁడు, పర...ప్రహరణుండు - పర = ఇతరులకు, భయంకర=భయముకల్గించు, పటు=సమర్థమైన, గద=రోగములను, అప్రహరణుండు=అంతటను బ్రయోగించువాఁడు. అనఁగా నితఁడు పెఱవారి పై

భయంకరములగు రోగములను బ్రయోగించుచు బాధించునని భావము. దండని పుణుండు=దండమనెడి తన యాయుధమందు మిక్కిలి నేర్పరి, సమవర్తి=అందఱియందు సమముగాఁ బ్రవర్తించువాఁడు, ధర్మరాజు, మిత్రనందనుఁడు=సూర్యుని కుమారుఁడు, ఇతనిన్=ఈ, దక్షిణనాయకున్=దక్షిణదిక్కున కధిపతి యగుయముని,ఇంపు=అనురాగము, మీఱన్ చూడుము. నలపరమైన యర్థము:- పర...ప్రహరణుండు—శత్రువులందు భయంకరమైన గద యనునాయుధమును బ్రయోగించువాఁడు, దండనిపుణుండు=ప్రజలను శాసించుటయందు నేర్పు గలవాఁడు, సమవర్తి=అందఱియందు సమానముగాఁ బ్రవర్తించువాఁడు, ధర్మరాజు=బ్రహ్మచర్యాదిరూపమగు ధర్మమునందు సమర్థుఁడు, మిత్రనందనుఁడు = మిత్రులను సంతసింపఁజేయువాఁడు, ఇతనిన్=ఈ, దక్షిణనాయకున్, దక్షిణనాయకుఁడనఁగాఁ బెక్కండ్రుభార్య లున్నప్పు డందఱియందును సమానానురాగంబున వర్తించువాఁడు. అట్టినలుని,ఇంపు,మీఱన్=అనురాగ మొప్పునట్లు, చూడుము.

తా. స్పష్టము.

క. ధవళాక్షి! చూడు మీతని
భువనాధీశ్వరు నపారభూరిగభీర
త్వవిశేషనిధి నదీనునిఁ
బ్రవిమలతరవారి నధికబలసత్త్వాఢ్యున్. 169

టీ. ధవళాక్షి=తెల్లనినేత్రములు గల దమయంతీ! భువనాధీశ్వరున్=జలముల కధిపతియైనట్టియు, అని "జీవనం భువనం వనం" అని యమరకోశము, అపార...నిధిన్—అపార=హద్దులేనివాఁడును, భూరి=గొప్పదయిన, గభీరత్వవిశేష=గాంభీర్యగుణాతిశయమునకు, నిధిన్=స్థానమైనవాఁడును, నదీనునిన్=నదులకధిపతియైనవాఁడును, ప్రవిమలతరవారిన్=మిక్కిలినిర్మలమగుజలము గలవాఁడును,అధికబలసత్త్వాఢ్యున్-అధికబల=గొప్పబలముగల, సత్త్వ=జలజంతువులచే, ఆఢ్యున్=నిండినవాఁడును, అగు, ఈతనిన్=ఈవరుణదేవుని, చూడుము.

నలపరమైనయర్థము. ధవళాక్షీ! భువనాధీశ్వరుఁ=లోకమున కధిపతియు, అపార...నిధిఁ-అపార=విస్తారమైన, భూరి=బంగారము, గభీరత్వవిశేష=గాంభీర్యగుణము, నిధి=నిధులును గలవాఁడు, ఇప్పుడు, "అదీనుని" అని పదవిభాగము, అదీనుఁ=దైన్యగుణము లేనివానిని, ప్రవిమలతరవారి—ప్రవిమల=స్వచ్ఛమైన, అనఁగా ధగధగలాడుచున్న, తరవారిఁ=కత్తి గల్గినట్టియు, అధికబలసత్త్వాఢ్యు-అధిక=గొప్పదగు, బల=దేహబలసామర్థ్యముచేతను, సత్త్వ=ప్రయత్నముచేతను,ఆఢ్యుఁ=నిండినవాఁడును, నగు. ఈతనిఁ=ఈనలరాజును, చూడుము. అనఁగా నధికమగుదేహబలమును, యుద్ధాదులం దధికమగు ప్రయత్నమును గల్గి వర్తించునలరాజును వరింపు మని భావము.

వ. అని యాఖండలు గుఱించియు నగ్ని నుద్దేశించియు నంతకు లక్షించియు నంబుపతింగూర్చియుఁ ద్రిభువనార్చితచరణారవింద యగునరవిందభవుదేవి తదీయమాయారూపంబులకు ననురూపంబుగాఁ బ్రత్యేకంబ యుభయార్థవచనసమర్థంబులగువర్ణనావాక్యంబులం బ్రబోధించిన విదర్భధాత్రీపతిపుత్త్రి నేత్రశ్రోత్రంబులం జూచియు వినియు నితం డితం డని నిర్ణయింపనేరక డెందంబు డోలాందోళనంబు నొంద విధిపజ్జ నిషేధంబుత్రోవనుం బోవనితలంపున నిలింపనిషధరాజులను నలువుర విస్మయస్మేరంబు లగువిలోకనంబుల నవలోకించునది క్రమంబున భారతినిర్దేశంబున నైసర్గికవిలాసభాసమానుం డును ననమానరూపరేఖావిడంబితశంబరారాతియు నగు నిషధభూపతిం జూచె నప్పుడు. 170

టీ. అని, ఆఖండలుఁ గుఱించియు=ఇంద్రునిగూర్చియు, అగ్నిఁ, ఉద్దేశించియు, అంతకుఁ, లక్షించియు, అంబుపతింగూర్చియు = వరుణునిగూర్చియు, త్రిభువన...వింద—త్రిభువన = మూఁడులోకములవారిచేతను, అర్చిత=పూజింపఁబడుచున్న, చరణారవింద=పాదపద్మములు గలది, అగు నరవిందభవు

దేవి=అయిన సరస్వతీదేవి, తదీయమాయారూపంబులకున్ = ఆయింద్రాదుల మాయాకారములకు, అనురూపంబుగాన్ =తగునట్లుగా, ప్రత్యేకంబ=వేర్వేఱు గానే, ఉభయార్థవచనసమర్థంబులు=రెండర్థములు గలవచనములచే సమర్థము లయినవి, అగువర్ణనావాక్యంబులన్ =అయిన వర్ణించుచున్న వాక్యములచేత, ప్రబోధించినన్ =తెలుపఁగా, విదర్భధాత్రీపతిపుత్రి = దమయంతి, నేత్రశ్రోత్రంబులన్ =కన్నులచేతను, చెవులచేతను, చూచియున్ =ఇంద్రాదులరూపము లఁ గనుఁగొనియు, వినియున్ =వారిగుణవర్ణన మాలించియు, ఇతండు ఇతండు అని=ఇతఁడే నలుఁ డని,నిర్ణయింపన్ నేరక=నిశ్చయింపలేక, డెందంబు=దమయంతిమనస్సు, డోలాందోళనంబున్ = ఉయ్యెలవలెఁ జాంచల్యమును, ఒందన్ =పొందఁగా, అనఁగా నలరూపధారు లయినయింద్రాదులను జూచి వారిలో నెవఁడు నలుండో నిశ్చయింపలేక దమయంతిచిత్తము మిక్కిలి చలించి పోయెనని భావము. విధిపజ్జను=సరస్వతీ నియోగముచొప్పున వారిలో నొకని వరించుటకుఁగాని, నిషేధంబుత్రోవను=వల దని నిషేధించుటకుఁగాని, పోవని తలంపునన్ =వెళ్లనికోర్కిచే, అనఁగా దమయంతి సరస్వతి చెప్పినచొప్పునఁ జేయుటకుఁగాని, వలదని నిషేధించుటకుఁ గాని సమర్థురాలు కాలేదనిభావము. నిలింపనిషధరాజులను = దేవత లను నలరాజును, నలువురన్, విస్మయస్మేరంబులు = ఆశ్చర్యమువలన వికసిల్లినవి, అగు విలోకనంబులన్ = అయినట్టి చూపులచేత, అవలోకించునది = చూచుచుండిన దమయంతి, క్రమంబునన్, భారతీదేవి నిర్దేశంబునన్ = సరస్వతి నియోగముచేత, నైసర్గిక ... మానుండును—నైసర్గికస్వభావసిద్ధమైన, విలాస=కాంతులచే, భాసమానుండును = ప్రకాశించువాఁడును, అసమాన... రాతియున్ —అసమాన=సాటిలేని, రూపరేఖా=సౌందర్యసంపదచే, విడంబిత=అనుకరించుచున్న, శంబరారాతియున్ = మన్మథుఁడు గలవాఁడును,అగునిషధభూపతిన్ =అయిననలరాజును, చూచెన్, అప్పుడు.

క. శారద మధురాలాపవి
 శారద యింద్రాగ్నిశమనపాశిలిలేశనుతి

ద్వారమున నిషధపతిఁ గై
వారం బొనరింపఁ దొడఁగె వాచాప్రౌఢిన్. 171

టీ. మధురాలాపవిశారద = మధురవాక్యములు పలుకుటందు నేర్పుగల, శారద=సరస్వతి, ఇంద్ర... ద్వారమునన్ =ఇంద్రాగ్నియమవరుణుల నుతించు నట్లుగా, నిషధపతిన్ =నలరాజును, వాచాప్రౌఢిన్ =వాక్చాతుర్యముచే, కైవారంబు=స్తోత్రము, ఒనరింపన్ తొడఁగెన్ =చేయ నారంభించెను.

తా. మధురాలాపములు పల్కుటయందు చాతుర్యముగల సరస్వతి, యింద్రాదులకుఁ గూడ నర్థము సరిపోవునట్లు నలరాజును వాక్చాతుర్యముచే స్తోత్రము చేయ నారంభించెను.

తే. నలిననేత్ర! ప్రత్యర్థిదానవశతాహి
తాత్మచేష్టాగరిష్ఠతఁ దరసి చూడ
నితఁడు జీమూతవాహనుఁ డింత నిక్క
మింపు పొంపిరివోవ వీక్షింపు మితని. 172

టీ. నలిననేత్ర=పద్మములవంటి నేత్రములు గల దమయంతీ ! ప్రత్యర్థి...గరిష్ఠతన్—ప్రత్యర్థి=ప్రతియాచకుని గూర్చియు, దానవశతా = దానపరాధీనత్వముచే, అనఁగా దానగుణముచే యాచకులకు వశుండగుచున్నవాఁడని భావము. ఆహిత=చేయఁబడిన, చేష్టా=యాచకుల కనుకూలమగువ్యాపారమందలి, గరిష్ఠతన్ =గొప్పతనముచే, అరసిచూడన్ =ఆలోచింపఁగా, ఇతఁడు=ఈమహారాజు, జీమూతవాహనుఁడు = జీమూతవాహనుఁ డనురాజునకు సాటి వచ్చువాఁడు, అనఁగా నీరాజు దానగుణముచే జీమూతవాహనున కెనవచ్చు నని భావము. ఇంత నిక్కము=ఇది సత్యము, ఇంపు=ఆనందము, పొంపిరివోవన్ =అతిశయించునట్లుగా, ఇతనిన్, వీక్షింపుము=చూడుము. ఇంద్రపరమైన యర్థము. నలిననేత్ర! ప్రత్యర్థి ...గరిష్ఠతన్ - ప్రత్యర్థి=శత్రువులయిన, దానవశత=నూఱులసంఖ్యగల రాక్షసులకు, అహిత=ప్రతికూలమయిన, చేష్టా= వ్యాపారముచే, గరిష్ఠతన్ =శ్రేష్ఠత్వమును, అరసి చూడన్, ఇతఁడు=ఈమహారాజు,జీమూత

వాహనుఁడు=మేఘములు వాహనములుగాఁ గలవాఁడు అనఁగా నింద్రుఁడే యనుట. ఇట్టి యింద్రునిఁ జూడుము. జీమూతవాహనుఁ డనునొక విద్యాధరనాయకుఁడు పామునురక్షించుటకై తనప్రాణముల నిచ్చినమహోదాత. (కథాసరిత్సాగరము. 12-లం. 23-త.)

తా. ఓదమయంతీ! ప్రతియాచకునికిని దానగుణముచే వశుండై యాయాచకుల కనుకూలవ్యాపారము చేయుచున్నయీరాజు జీమూతవాహనునితో సమానుఁడు. ఆనంద మతిశయించునట్లు లితనిఁ జూడుము.

వ. మఱియు నితండు హుతవహుండునుంబోలె బహువిగాఢ మఘవదధ్వరాజ్యాభిషేక వికస్వర తేజోవిరాజితుం డీశాన మూర్తి భేదంబును దండధరుండునుం బోలెఁ బరప్రాణోత్క్రాంతి దాన సమర్థశక్తిసంపన్నుండును సంజ్ఞానందకరుండును వరుణుండునుంబోలెఁ బ్రతికూలవాత ప్రచారచటుల వాహినీ సహస్ర సంసేవితుండును బ్రచేతసుండు నితనిం గనుంగొను మిప్పురుష పంచకంబునందు నీకుం గన్నిచ్చకు వచ్చునతని వరియింపు మని పలికి పలుకుందొయ్యలి యూరకుండె నప్పుడు మాయానిషధరాజకాయచ్ఛాయాంతర్వర్తులగు విబుధచక్రవర్తుల నలువుర నతిక్రమించి పంచమకోటి యగు నలునియందుఁ బురాకృతపరిపాకవాసనావశంబుననో పరమపాతివ్రత్యగుణగౌరవంబుననో జాత్యంతరసంగతి గ్రహణంబుననో యక్కురంగలోచనచూపు నెలవుకొనియె వెండియు.　　　173

టీ. మఱియుఁన్, ఇతండు=ఈరాజు, హుతవహుండునుంబోలెన్=అగ్నిహోత్రునివలె, బహు...రాజితుండు-బహు=మిక్కిలి, విగాఢ=సేవింపఁబడిన, మఘవత్=దేవేంద్రునియొక్క, అధ్వ=మార్గముగల, అనఁగా దేవేంద్రుం డొనరించుచున్నపాలనపద్ధతిగల, రాజ్యాభిషేక=దొరతనమందలి అభిషేకమువలనఁ

గలిగిన, వికస్వర=ప్రకాశించుచున్న, తేజః=తేజస్సుచే, విరాజితుండు=ప్రకాశించు చున్నవాఁడు, ఈశానమూర్తిభేదంబును-ఈశాన=ఈశానుఁ డనెడిలోకపాలకునియొక్క, మూర్తిభేదంబును=అపరస్వరూపుఁడును,అనఁగా రాజు లోకపాలురయంశములవలనజనించు నన్నప్రఖ్యాతికలవాఁడు. అందులకుఁ బ్రమాణము, శ్లో॥ "అష్టాభి ర్లోకపాలానాం మాత్రాభి ర్నిర్మితో నృప" అని చెప్పఁబడియున్నది. అగ్నిపక్షమందు, బహు...విరాజితుండు-బహు=పెక్కుసారులు, విగాఢ=ప్రవేశించిన, మఘవత్=ఇంద్రుఁడుగల-ఇంద్రున కుద్దేశింపఁబడినట్టి యనుట, అధ్వర=యజ్ఞములందు, ఆజ్యాభిషేక=ఘృతప్రవాహముచే,వికస్వర=ప్రకాశించుచున్న,తేజః=కాంతిచే, విరాజితుండును=ప్రకాశించుచున్నవాఁడును,ఈశానమూర్తిభేదంబును=శంకరుని యష్టమూర్తులలో నొకటియును, దండధరుండునుంబోలెన్=యమునివలె, పర...సంపన్నుండును, పర=శత్రువులకు, ప్రాణోత్క్రాంతి=మరణమును, దాన=ఇచ్చుటయందు, సమర్థ=తగియున్న, శక్తి=శక్తిచే, సంపన్నుండు=కూడుకొని యున్నవాఁడును, సంజ్ఞానందకరుండును—సంజ్ఞ=చక్కఁగాఁ దెలిసినవారికి,అనఁగాఁ బండితులకనుట-లేక తన పేరిచేతనే,ఆనందకరుండు=ఆనందముకలిగించువాఁడును; యమపక్షమందు-పర...సంపన్నుఁడును-ఇతరుల ప్రాణముల నపహరింపఁజాలిన శక్తిచే నొప్పుచున్న వాఁడును, సంజ్ఞానందకరుండును=తల్లి యైన సంజ్ఞాదేవి కానందము గల్గించువాఁడు నని యర్థము. వరుణుండునుం బోలెన్ = వరుణదేవునివలె, ప్రతి...సేవితుండును-ప్రతికూలవ్రాత = ఎదురుగాలియొక్క, ప్రచార = ప్రసరణముగల, చటుల = వేగముగల, వాహినీ = సేనలయొక్క, సహస్ర = వేయింటిచే, సంసేవితుండును= సేవింపఁబడు చున్నవాఁడును, అనఁగా సేనలుఁడు శత్రువుల సంహరింపఁజాలిన సేనలు కలవాఁడు, ప్రచేతసుండును = గొప్పమనస్సుగలవాఁడును; వరుణపక్షమందు—ప్రతికూల...సేవితుండును - ప్రతికూల=తీరములనుగూర్చి, వాత=గాలియొక్క, ప్రచార = ప్రోపుడుగల, చటుల=వేగముగల, వాహినీసహస్ర=వేయినదులచేత, సంసేవితుండును= సేవింపఁబడుచున్నవాఁడును, ప్రచేతసుండు=ప్రచేతసుఁ డను పేరు గలవాఁడును. అనఁ

గాఁ బ్రతితీరమును గాలిచేఁ ద్రోపువడి ప్రవహించు నదీసమూహముచే సేవింపఁబడుచున్నాఁడఁట. అగు, ఇతనిన్ = ఈరాజును, కనుంగొనుము. ఇప్పురుష పంచకంబునందున్ = ఈ యైదుగురయందును, నీకున్, కన్నిచ్చకు వచ్చునతని=కంటికి వచ్చినవానిని, వరియింపుము, అని పలికి, పలుకుంబోయ్యాలి= సరస్వతి, ఊరకుండె, అప్పుడు, మాయానిష...ర్వర్తులు - మాయానిషధరాజ= మాయా నలునియొక్క, కాయచ్ఛాయా=శరీరకాంతిలో, అంతర్వర్తులు= వర్తించుచున్నవారు, అగు విబుధ చక్రవర్తులన్ =అయినట్టి యింద్రాదులను, నలువురన్, అతిక్రమించి=దాఁటి, పంచమకోటి = అయిదవపక్షమందున్న వాఁడు, అగు నలునియందున్, పురాకృ...వశంబుననో—పురాకృత సుకృత= పూర్వజన్మపుణ్యముయొక్క, పరిపాక=పంటయొక్క, వాసనా=సంస్కార మునకు, వశంబునన్ =అధీన మగుటచేతనో, పరమ...గౌరవంబునన్ +ఓ— పరమ=గొప్ప, పాతివ్రత్యగుణ=పాతివ్రత్య మనెడిగుణముయొక్క, గౌరవం బుననో=అతిశయముచేతనో, జాత్యంతర సంగతి గ్రహణంబుననో=జన్మాంతర పు(తమయిద్దఱ)సంపర్కమును గ్రహించుటచేతనో, అక్కురంగలోచన చూపు =ఆదమయంతి చూపు, నెలవుకొనియెన్ =స్థిరపడియెను, ఖెండియున్.

క. ద్వాపర మపుడు విదర్భా
ధిపాలతనూజమనసు కీ గలఁగించెఁ గలి
ద్వాపరములు నలదమయం
తీపరిణయమునకు సమ్మతింపనివె కదా? 174

టీ. అపుడు=ఆ స్వయంవరసమయమందు, ద్వాపరము=సందేహము, విద ర్భక్ష్మాపాలతనూజ మనసున్ =ఆదమయంతి చిత్తమును, కలఁగించెన్ =బాధిం చెను, కలి ద్వాపరములు = కలిపురుషుఁడును సందేహమును, నలదమయంతీ పరిణయమునకున్ =నలదమయంతుల వివాహమునకు, సమ్మతింపనివె కదా?= ఇష్టపడనివె కదా? ఇచ్చట, కలిద్వాపరములు=కలియుగ ద్వాపరయుగము లనియు నర్థము వచ్చుచున్నది. ఆయర్థమునందు నలదమయంతులు కలియుగ ద్వాపరంబులలో లేనివారు కావున వారిపెండ్లి నవి యంగీకరింపలేదని భావము.

తా. ఆస్వయంవరసమయమందు సందేహము దమయంతిచిత్తమును బాధించెను. కలిముందు నలుని బాధించెడిని. కలిపురుషుడును సందేహమును, నలదమయంతుల పరిణయమును నిష్టపడనివే కదా?

చ. స్ఫురదవలేపతన్ నిషధభూపతు లేవురు కారణంబుగాఁ
బరువడినొయ్యనొయ్యయుగపత్పరిమోహయమాణబాణుఁడై
మరుఁడువిదర్భరాజసుతమానసముం గలఁగింపఁబూనుచున్
శరములసంఖ్యకున్ ఫలము సమ్మతిఁగాంచి నటింపకుండునే.

టీ. మరుఁడు, స్ఫురదవలేపతన్ = ఉద్రేకించినగర్వము గలవాఁ డగుటచే, నిషధభూపతులు = నలరాజులు, ఏవురు కారణంబు గాన్ = ఆ యైదుగు రను బురస్కరించుకొని, లేక యాయైదుగురను హేతువు గాఁ జేసికొని, పరువడిన్ = క్రమముగా, ఒయ్యన్, ఒయ్యన్ = మెల్లమెల్లగా, యుగ ... బాణుఁడై = యుగపత్ = ఒక్కమాటే, పరిమోహయ మాణ = మోహము కల్గించుచున్న, బాణుఁడై = బాణములు కలవాఁడై, విదర్భరాజసుతమానసమున్ = దమయంతిచిత్తంబును, కలఁగింపన్ = చలింపఁ జేయుటకు, పూనుచున్ = సమకట్టుచు, శరముల సంఖ్యకున్ = బాణసంఖ్యకు, ఫలమున్ = సాఫల్యమును, సమ్మతిన్ = ప్రియముచే, కాంచి = పొంది, నటింపకుండునే = నటింపఁడా? అనఁగాఁ దనబాణముల సంఖ్యకు సాఫల్యమును బొందక మానఁ డని భావము. ప్రత్యేకముగా నైదుగురయందును దమయంతి కనురాగము గలుగుటకు నైదుగురను బ్రత్యేకముగాఁ బురస్కరించుకొని యొక్కొక్క బాణము దమయంతిపయిఁ బ్రయోగించుటచే నామెకు నలత్వబుద్ధిచే నైదుగురయందును వేఱువేఱ ననురాగ మొక్కమా రుదయించెను గాన తనబాణసంఖ్యకుఁ దగినఫలము మరునకు లభించెనని భావము. మఱియు నామె కయిదుగురయందు నొక్కమాఱు సమమగు ననురాగ ముదయించినది కనుక నె వారిలో నెవ్వరిని వరింపలేక సందిగ్ధమానస యయ్యె. నలేతరులయం దనురాగ ముదయించుటచే నా పాతివ్రత్యము భగ్నమయిన దని చెప్పరాదు. నలత్వబుద్ధిచేతనే యాయనురాగ ముదయించినది కాన నట్టిదోషంబున కవకాశము లేదు.

తా. స్పష్టము.

చ. వెలయఁగఁ బంచనైషధవిభేదము నేర్పఱుపంగలేక యా
కులత వహించి యిట్టితఱిఁ గూరిమినెచ్చెలియొద్ద నుండినం
దెలియఁగఁజూపి చెప్పనకదే యని డెందమునం దలంచె నిం
పలర నరాళకేశి యమరాలయహేమమరాళపుంగవున్.

టీ. అరాళకేశి=వక్రములైన కేశములు గల దమయంతి, వెలయఁగన్=బాగుగా, పంచనైషధన్=ఆయైదుగుర నలులయొక్క, విభేదము, ఏర్పఱుపంగలేక=చేయలేక, అనఁగా సమానాకారములతోఁ బొల్చుచున్నయాయైదుగురలో వీఁడు సత్యనలుం డనెడివిభాగము చేయలేక, అని భావము. ఆకులతన్ వహించి=తొట్రుపడి, ఇట్టితఱిన్=ఇట్టిసమయమందు, కూరిమినెచ్చెలి=ఆప్తస్నేహితుఁ డగుహంస, ఒద్దన్, ఉండినన్, తెలియఁగన్=స్పష్టమగునట్లుగా, చూపి, చెప్పనకదే=వీఁడే నలుండని తెలియఁజెప్పనుగదా, అని, డెందమునన్=మనమందు, ఇంపు అలరన్=ప్రేమ యొప్పునట్లుగా, అమరా...పుంగవున్=సత్యలోకవాసి యైన బంగారుహంసశ్రేష్ఠమును, తలంచెన్=స్మరించుకొనెను.

తా. ఆదమయంతి యాయైదుగురలోను నలుం డెవ్వండో తెలిసికోలేక యిట్టి సమయమునందుఁ బూర్వము తనకు నలునిగుణములు వర్ణించి చెప్పిన హంసరాజము సమీపముననున్న నానలునిఁ దెలిసికొని నాకుఁ జెప్పనుగదా యని యాహంసంబును దలంచుకొనెను.

వ. శంకాలతావితానం బనేకనలావలంబి యగుచుం బ్రబ్బినం
గడునిబ్బరం బగువిభ్రమంబున నావిదర్భసుభ్రూలలామం
బు నెమ్మనంబున నిట్లని వితర్కించు.  177

టీ. శంకాలతా వితానంబు=శంక లనెడి తీఁగలప్రాఁకులు, అనేకనలావలంబి = అనేకనలరాజుల నాశ్రయించినది; లతాపక్షమున-అనేకములగుతృణముల నాశ్రయించినది. అగుచున్ ప్రబ్బినన్=వర్ధిల్లఁగా, కడున్, నిబ్బరంబు=

దృఢము, అగువిభ్రమంబునన్ =అయినభ్రాంతిచే, ఆవిదర్భసుభ్రూలలామంబు= ఆదమయంతి, నెమ్మనంబునన్, ఇట్లు, అని, వితర్కించెన్ =సందేహించె.

సీ. ద్వివిధచంద్రమతిప్రతీతియో కాక తి
స్వచ్ఛపదార్థోపసర్పణంబొ
యంగులీముఖపీడితాక్షివిక్రియ యొక్కొ
మకరాంకుశాంబరీమహిమ యొక్కొ
విరహకాలోద్భ్రాంతివిభవానువృత్తియో
రూపింప నలువిశ్వరూప మొక్కొ
గణుతింప వేల్పులకపటనాటక మొక్కొ
భారతీపరిహాసభంగి యొక్కొ

తే. కాక యీయేవురందు నొక్కరుఁడు నలుఁడొ
మారుఁ డొక్కఁడొ యొకఁడు పురూరవుండొ
వరుస నున్నయీచక్కనివా రిరువురు
దేవతావైద్యయుగ్మంబొ తెలియరాదు. 178

టీ. ద్వివిధ...ప్రతీతియో-ద్వివిధ=రెండుతెఱంగులైన, చంద్రమతి = చంద్రులనెడి బుద్ధియొక్క, ప్రతీతియో=తోఁచుటయో, అనఁగా నొకనలునియందనేకనలబుద్ధి యొకచంద్రునియందు ద్విచంద్రబుద్ధివలెనే భ్రాంతివలనఁ గలిగినది కాఁబోలు నని భావము. కాక, అతిస్వచ్ఛపదార్థోపసర్పణంబు ఓ= అద్దమువలె బింబగ్రాహకములైన స్వచ్ఛపదార్థములసమీపమం దుండుటయో- అనఁగా నద్దమువంటి స్వచ్ఛపదార్థములచెంత నుండుటచేత, నలుప్రతిబింబము లిట్లు కానవచ్చుచున్నవి కాఁబోలునని భావము. అంగుళీముఖ=వ్రేలికొనచేత, పీడిత=పీడింపఁబడిన, అక్షి=కంటియొక్క, విక్రియయొక్కొ=వికారమో, మకరాంకుశాంబరీమహిమయొక్కొ=మన్మథుని మాయాప్రభావమో, విరహ... వృత్తియొ-విరహకాల=వెనుకటి విరహకాలమందలి, ఉద్భ్రాంతివిభవ=ఎక్కుడుభ్రాంతియొక్క, అనువృత్తియొ=అనువర్తించుకొనుటయో, అనఁగా విరహ

వస్థయందు సంతతము నలస్మరణమె యుండుటచే నేదిక్కుఁజూచినను దమయంతికి నలుఁడే కానవచ్చుచుండెనని వర్ణింపఁబడినది. ఆయవస్థయిప్పుడు మగుడఁ దనకు వచ్చెను గాఁబోలునని తలంచెనని భావము. రూపింపన్=ఆలోచింపఁగా, నలువిశ్వరూపమొక్కొ=నలుఁడుదాల్చినవిశ్వరూపమొ,అనఁగానలుఁ డంతటఁ దానయైయుండెనో, గణుతింపన్, వేల్పులకపటనాటకమొక్కొ=దేవతలాడించుచున్న మాయానాటకమొ, భారతీపరిహాసభంగియొక్కొ=సరస్వతియొక్క పరిహాసపురీతియొ-అనఁగా సరస్వతి నలుఁ దప్ప వేఱొకని వరింపనని వర్తించుచున్నదమయంతిని మోసపుచ్చి మఱియొకని వరింపఁజేసి తరువాతఁ బరిహాసము చేయుటకై సరస్వతి యిట్లు చేసినది కాఁబోలునని భావము. కాక, ఈయేవురందున్=ఈయైదుగురయందును. ఒక్కరుఁడు, నలుఁడో=నలమహారాజుగాఁబోలును,ఒక్కఁడు=మఱియొక్కఁడు, మారుఁడో=మన్మథుఁడుకాఁబోలును,ఒకఁడు=వేఱొకఁడు, పురూరవుండో, వరుసన్=క్రమముగా, ఉన్న, ఈచక్కని వారిరువురును, దేవతావైద్యయుగ్మంబో=అశ్విదేవతలో, తెలియన్, రాదు= అలవిగాదు.

తా. ఒకనలునకు మాఱుగా నింతమంది నలులు గానవచ్చుట, యొక్కచంద్రునియందు వివిధచంద్రబుద్ధిని గల్గించు భ్రాంతిచేతనో, లేక నిర్మలపదార్థముల చెంతనుండుటచేతనో, లేక వ్రేలికొనచేఁ గన్ను నలుపుకొనుటవలనఁ గల్గిన వికారముచేతనో, మన్మథునిమాయామహిమవలననో, సంతతస్మరణముచే నన్నిచోట్ల నలునిఁ జూపించి విరహావస్థ మగుడ సంప్రాప్తమగుటచేతనో, నలుఁడు విశ్వరూపము దాల్చుటచేతనో, దేవత లాడించు కపటనాటకముచేతనో, సరస్వతీదేవి తనప్రభావముచేత నన్నుఁ బరిహసించుటకై యిందఱనలులనుసృజించుటచేతనో, తెలియరాకున్నది. వీరిలో నొకఁడు నలుఁడు. రెండవవాఁడు మరుఁడు. మూడవవాఁడు పురూరవుఁడు. తక్కిన యిరువురు నశ్విదేవతలు నగుదురెమో, యింతేనియుఁ దెలియరాకున్నది.

గీ. విబుధవరులేని ప్రణమిల్లి కేల్ వేఁడికొందు
నలుని వారేల యిత్తురు కేని నాకు నతని

మదనశోషణ బాణసంపాతపీత
ఘనకృపాసింధుగహ్వరాకారమతులు. 179

టీ. విబుధవరులేని=ఈమంచకములం దున్నవారు దేవతలయినచో, ప్రణమిల్లి=నమస్కరించి, నలునిన్=నలరాజును, వేఁడికొందున్= యాచించెదను. అనఁగా నీమంచెలందున్నవారు నేనూహించినట్లు నలమన్మథపురూరవాదులు కాక దేవతలే యైనచో నమస్కరించి నలుని నా కర్పింపుఁడని ప్రార్థించెదను, మదన... మతులు-మదన=మన్మథునియొక్క, శోషణ=శోషణ మను పేరుగల, అనఁగా నెండింపఁజేయునదని యర్థము, బాణ=అస్త్రముయొక్క సంపాత=పడుటచే, పీత=శోషింపఁజేయఁబడిన, ఘన=గొప్ప దగు, కృపాసింధు=దయాసముద్రము గలవారగుటచే, గహ్వరాణి=లోఁతయినగోతులవంటి,ఆకార=రూపముగల, మతులు=మనస్సుగలవాఁరు, అగు, వారు=ఆదేవతలు,నాకున్, అతనిన్,ఏల? ఇత్తురు?=ఎందుల కొసంగుదురు? అనఁగా నిత్యపూజనాదులచే నా ప్రార్థన మొసంగని దేవత లిప్పట్టునఁ గామాయత్తచిత్తులై కావున నే మదనశోషణాస్త్రముచే నెండిరసహీనములై కావున నే దయాహీనము లైయున్న చిత్తములు గలవారై యుండి నాకోర్కియేల నెఱవేర్తురు? కానవారిఁ బ్రార్థించుట తగద నిభావము. ఇందుఁ గొన్నిప్రతులలో “ నలునివార లెయిత్తురు నాకునతని” అని పాఠములు గనఁబడుచున్నను, నలుని వారేల యిత్తురన్న పాఠమే మూలమునకు సరిగానుండుటచే నట్లు దిద్దఁబడెను. మూలము-శ్లో॥ యాచే నలం కిమమరానథవా తదర్థం। నిత్యార్చనాద పి మమాఫలినై రలంపైః। కందర్పశోషణ శిలీముఖపాతపీత। కారుణ్యనీరనిధిగహ్వరఘోరచిత్తైః॥ అని యున్నది.

తా. స్పష్టము.

క. మంచకమధ్యస్థితను
ద్వంచకపంచకమునందుఁ బరుసమెయిఁ బరీ
క్షించెద నే నొక్కించుక
పంచజనసుపర్వలక్ష్యపర్వశ్రేణిన్. 180

టీ. మంచక...పంచకమునందుఁ-మంచకమధ్య=మంచెలనడుమ, స్థిత = ఉన్నట్టి, మద్వంచక=నన్ను మోసపుచ్చెడి, పంచకమునందుఁ=ఐదుగురయందును, వరుసమెయిన్=క్రమముగా, నేను, ఒక్కించుక=కొంచెము, పంచ... శ్రేణిన్ — పంచజన = మనుష్యులయందును, సుపర్వ = దేవతలయందును, లక్ష్య=చూడవలసిన, పర్వ=గుఱుతులయొక్క, శ్రేణిన్=వరుసను, పరీక్షించెదన్=పరిశీలించిచూచెదను, అనఁగా మానవులకును, దేవతలకును, భేదమును జూపించు ముఖ్యమైన చిహ్నములను—అనఁగాఁ జెమట పట్టుట నిమేషము భూస్పర్శము, పుష్పాదులు వాడుట, మొదలగునవి మానవుల కుండును. దేవతలకుండవు. కాన యట్టివానిని నేను జక్కఁగాఁ బరిశీలించిచూచి నలుని గుర్తించెదనని భావము.

తా. అంతట దమయంతి మంచకగతులై సమానాకారులై నలుని గుర్తింపకుండ మోసపుచ్చు నీయయిదుగురయందును, నేను దేవమానవులకుండు ముఖ్యచిహ్నములను బరిశీలించి నలుం డెవఁడో తెలిసికొందును.

వ. అనుచు నేవురం గలయం గనుంగొని యందు.　　181

టీ. స్పష్టము.

మ. ధరణింబొందనికోమలాంఘ్రికమలద్వంద్వంబులుఁ ఘర్మశీ
　కరయుక్తంబులు గానిఫాలములు వక్షఃకక్షోణులంబత్త్రకే
　సరముల్ గందనిపూవుదండలు నిమేషవ్యాఖ్యఁ గైకోనిదృ
　క్సరసీజంబులునల్వురందుఁగనిమెంగాంతాలలామంబొగిన్.

టీ. కాంతాలలామంబు=దమయంతి, ధరణిన్=భూమిని, పొందని కోమలాంఘ్రికమలద్వంద్వంబులున్ = తాఁకనిమృదువయిన పాదపద్మయుగళమును, ఘర్మశీకరయుక్తంబులు=చెమ్మటబిందువులతోఁ గూడినవి, కానిఫాలములు=కానట్టి నుదుళ్లను,వక్షఃకక్షోణులన్=వక్షఃప్రదేశములందు,పత్త్రకేసరముల్=దళములును, గింజల్కములును, కందనిపూవుదండలును=వాడిపోనిపుష్పమాలికలును, నిమేషవ్యాఖ్యన్ = అప్పపాటువ్యాఖ్యానమును-అనఁగా నలుఁడనిచెప్పుటను, కై

కోనిదృక్సరసీజంబులు=పొందని నేత్రపద్మములును, ఒగిన్=వరుసఁగా, నల్వురందున్, కనియెన్=చూచెను. అనఁగా పాదములు భూమిని దాఁకకుండుట, చెమ్మట వొడముకుండుట, పూలదండలు వాడకుండుట నిమేషములేకపోవుట, అనుమానవులకు లేని యీలక్షణంబులు నల్వురయందుఁ, జూచెనని భావము.

తా. ఆదమయంతి పుడమినిసోఁకనిపాదపద్మములను, చెమ్మటలేని ఫాలములను లొమ్మునందు వాడని పుష్పమాలికలు ఱెప్పపాటును బొందని నేత్రపద్మములును నల్వురయందున్నట్లు చూచెను.

వ. కని యైదవనాఁడు నిషధరాజగుట యెఱింగి దేవతాప్రసాదంబు లేక యేకార్యంబు ఫలింపనేరదు. ప్రదక్షిణప్రక్రమణాలవాలవిలేపధూపానరణాంబుసేకంబుల ననేకంబు లగుఫలంబు లీఁజాలుటం జేసి వేల్పులు కల్పద్రుమకాననంబులు సుపర్వులకుం జేయునమస్య * సర్వార్థసిద్ధిసాధకసమస్య విబుధసేవ యఖిలాభీష్టప్రదానసురభి యనుచు సభాజనం బెల్ల విస్మయం బంది కనుంగొనుచుండ దివిజసభాజనంబునకుం బ్రారంభించి వైశద్యహృద్యంబు లగుప్రస్తుతిప్రసూనస్తబకంబుల నింద్రాంది దేవచతుష్టయంబుసంతుష్టి నొందించి తత్ప్రసాదలబ్ధంబైనబుద్ధివిభవంబున నమర్త్యవిలక్షణంబు లగుధరణీక్షోదసంస్పర్శనంబును, ప్రస్వేదబిందునిష్యందనంబును, కుసుమమాల్యమ్లాని యాదిగాఁ గలచిహ్నంబులను సందేహంబు వాసి మనంబునకుం జూపునకును సంవాదంబు సమకూడినం గందర్పమందాక్షంబులకు వశంవద యై చంచలం బగుకటాక్షాం

* ఇటఁజెక్కింటిప్రతులలో "సర్వార్థసిద్ధిసంధానసమస్య" అని యున్నప్పటికిని సర్వార్థసిద్ధ్యంగమిథః సమస్యా అనుమూలమున కనుగుణముగా సర్వార్థసిద్ధిసాధకసమస్యయని మార్చఁబడె.

చలం బతనిమూర్తిఁ బాయను డాయనుం జాలక యట్లాడ
ననంతరంబ. 183

టీ. కని, ఐపవాఁడు, నిషధరాజగుట=నలుండగుట, ఎఱింగి, దేవతాప్రసాదంబు=దేవతలయనుగ్రహంబు, లేక, ఏకార్యంబు=ఎట్టిపనియైనను, ఫలింపనేరదు=సిద్ధిపొందఁజాలదు, వేల్పులు=దేవతలు, ప్రదక్షి... సేకంబులన్—ప్రదక్షిణప్రక్రమణ=చుట్టుదిరుగుటయనెడి,ఆలవాల=పాదులచేతను, విలేప=చందనాదుల పూఁతయనెడి, విలేప=తెలికపిండిపూఁత చేతను, ధూప=సాంబ్రాణిధూపమనెడి, ధూప=దోహదధూపముచేతను, ఆవరణ=అంగదేవతాపరివేష్టనమనెడి, ఆవరణ=చుట్టుకంచెచేతను, అంబుసేకంబులన్=స్నానమనెడి, అంబుసేకంబులన్=నీటఁ దడుపుటలచేతను-నీరుపోయుటలచేత ననుట, వృక్షములకుఁ గూడ తత్సంబంధిదోషములను దొలంగించుటకు, విడంగాదిలేపములును, దోహదధూపములు గలిగి యుండునని వృక్షాయుర్వేదమందుఁ జెప్పఁబడినది. అనేకంబులు అగుఫలంబులన్=పెక్కుఫలములను, దేవతాపక్షమందుఁ గార్యసిద్ధులను, ఈజాలుటం జేసి=ఇచ్చుటకు సమర్థములగుటచే, కల్పద్రుమకాననంబులు=కల్పవృక్షవనములు, అనఁగాఁ బోషితమైనకల్పవృక్షములవలెఁ బూజితులగు దేవతలు సమస్తాభీష్టములను నెఱవేర్చుచున్నారని భావము. సుపర్వులకున్=దేవతలకు, చేయునమస్య=చేసెడినమస్కారము, సర్వా... సమస్య=సర్వ-అశేషమైన, అర్థసిద్ధి=కార్యసిద్ధులయొక్క, సాధన=సాధనములయొక్క, సమస్య=సంగ్రాహకమైనది. అనఁగా దేవతలకుఁజేసిననమస్కారము కార్యసిద్ధి కనుకూలములగు సాధనంబులనన్నింటిని సమకూర్చి కార్యమును ఫలింపఁజేయునని భావము. విబుధసేవ=దేవతాభజనము, అఖిలాభీష్టప్రదానసురభి=సమస్తవాంఛితంబులను నొసంగఁ గామధేనువువంటిది, అనుచున్=అనిపల్కుచు, సభాజనంబు ఎల్లన్=సభాసదులందఱును, విస్మయము=ఆశ్చర్యము, అంది కనుంగొనుచుండన్, దివిజసభాజనంబునకున్=దేవతలను బూజించుటకు, ప్రారంభించి=మొదలిడి, వైశద్యహృద్యంబులు=(స్తోత్రపరముగా) తెలివిడిచే (స్తబకపరముగా తెల్లఁదనముచే) మనోహరములైనవి, అగు ప్రస్తుతి ప్రసూన స్తబకంబులన్ = అయిన స్తోత్రము

లనెడి పుష్పగుచ్ఛములచే, ఇంద్రాదిదేవచతుష్టయంబును, సంతుష్టిఁ బొందించి=సంతోషపఱచి, తత్ప్రసాదలబ్ధంబు = వారియనుగ్రహమువలన లభించినది, ఐనబుద్ధివిభవంబునన్ = అయినట్టిబుద్ధి సమృద్ధిచే, అమర్త్యవిలక్షణంబులు=దేవతలకు లక్షణములుగానివి, అగు ధరణిక్షోదసంస్పర్శంబును=అయిన ధరాపరాగము దాఁకుట, ప్రస్వేదబిందునిష్యందంబును=చెమటబిందువులు స్రవించుటయు,కుసుమమాల్యమ్లాని=పుష్పమాలికలువాడుటయు,ఆదిగాన్ = మొదలైన, చిహ్నంబులను=గురుతులచే, సందేహంబు, పాసి=విడిచి, మనంబునకున్, చూపునకున్, సంవాదము=సమరసత్వము-సరిపడుట, సమకూడినన్ =లభించినప్పటికి, కందర్పమందాక్షములకున్ =మన్మథునకును సిగ్గునకును, వశంవదరై=లొంగినదై, చంచలంబు=చలించుచున్నది, అగుకటాక్షాంచలంబు = అయినకడకంటిచూపు, అతనిమూర్తిన్ =నలాకారమును, పాయను=విడుచుటకును, డాయను=సమీపించుటకును, చాలక=సమర్థముకాక, అట్టాడన్ = నడయాడుచుండఁగా, అనంతరంబ=తరువాత, అనఁగా మన్మథార్తమగు మనస్సు నలమూర్తిని డాయుటకుచూపుతోఁ జెప్పుచున్నను, లజ్జాతిరేకముచే నది యట్లు చేయకుండెను. అల. స్వభావోక్తి.

ఉ. భావములోనికీలు పరిపాటిఁ బరిస్ఫుటతన్ విలాసమున్
ప్రోవఁగ వేడ్కతో నిషధభూపతికై యెడయాడుదృష్టి ల
జ్జావతి యెట్టకేల కొకచందమున న్మగిడించి చేర్చె వా
గ్దేవిముఖేందుబింబమునఁ దివ్యము నెయ్యమునుందలిర్పఁగన్.

టీ. లజ్జావతి=లజ్జాస్వభావముగల దమయంతి, భావములోని=ఆత్మలోనున్న, కీలు=మర్మము-వలపు, పరిపాటిన్ =మీఁదుమిక్కిలిగా, పరిస్ఫుటతన్ =స్పష్టముగా,విలాసమున్ =చూపుయొక్క విలాసమును, ప్రోవఁగన్ =రక్షింపఁగా—మనసులోని వలపుమీఁదుమిక్కిలి చూపునకు విభ్రమము గలిగింపఁగా ననుట, నిషధభూపతికై=నలరాజుకై, వేడ్కతోన్ , ఎడయాడుదృష్టిన్ =సంచరించుచున్న దృష్టిని, ఎట్టకేలకున్ =అతికష్టముచే, ఒకచందమునన్ =ఒకరీతిచే, మగిడించి=

మరలించి, తియ్యము=ప్రియము, నెయ్యమునన్ = స్నేహమును, తలిర్పఁగన్ = అతిశయించునట్లుగా, వాగ్దేవిముఖేందుబింబమునన్ = సరస్వతిముఖపద్మమందు, చేర్చెన్ = ప్రవేశింపఁజేసెను. అనఁగా మనస్సునం దనురాగము గలస్త్రీ తన భావమును చూపులవిభ్రమముచేఁ బ్రకటించుట సహజము. దమయంతియు నట్టి విలాసంపుఁజూపునే నలునినుండి సరస్వతిముఖమందు నిగిడ్చి తాను నలుని వరించుటను దెలిపె ననిభావము.

వ. భారతీదేవియు నయ్యంగనయింగితం బెఱింగి తదీయహస్తంబు నిజహస్తంబునం గీలుకొలిపి యుల్లంబు పల్లవింప నిలింపనిషధరాజులం గనుంగొని కనుఁగొనల నలంతినవ్వొలయ నిట్లను నింద్రాగ్నియమవరుణులు కరుణాతరంగితంబు లగునంతరంగంబులతో నీయింతి ననుగ్రహింప వలయు.

టీ. భారతీదేవియున్, అయ్యంగనయింగితంబు=ఆదమయంతి హృదయాభిప్రాయమును, ఎఱింగి==తెలిసికొని, తదీయహస్తంబున్=దమయంతిచేతిని, నిజహస్తమునన్, కీలుకొల్పి=పట్టుకొని, ఉల్లంబు=మనస్సు, పల్లవింపన్ = చిగుర్పఁగా, అనఁగా సంతసింపఁగాననుట, నిలింపనిషధరాజులన్=నలవేషధారులైనయింద్రాదులను, కనుంగొని, కనుఁగొనలన్ = కడకన్నులందు, అలంతినవ్వు=మందహాసము, ఒలయన్=వ్యాపింపఁగా, ఇట్లు, అనున్, ఇంద్రాగ్నియమవరుణులు, కరుణాతరంగితంబులు=దయాతరంగములుకలవి, అగునంతరంగంబులతో=అయినచిత్తములతో, ఈయింతిన్=దమయంతిని, అనుగ్రహింప వలయున్=దయఁజూడవలయును.

ఉ. ఎట్టు వరించు సాధ్వి మిముఁ గేనిందఱ దేవచతుష్టయంబునం దెట్టొకనిం దగంగ వరియించి తదన్యుల ధిక్కరించి వే ఱెట్టఁగనేర్చుఁ గావున వరించి కృతార్థతఁ బొందుఁగాకమీ యట్టిమహానుభావు భవదంశసముద్భవు నైషధాధిపున్.

టీ. సాధ్వి=పతివ్రత, ఇందఱన్=ఇంతమందిని, ఎట్టు=ఏరీతిగా, వరించున్

=పెండ్లియాడును, అనఁగాఁ బతివ్రత యేకభర్తృకయై యుండవలెను గాన మిమ్మందఱను వరించుట తగదు. దేవచతుష్టయంబునందుఁ=మీనల్వురు దేవతలందును, తగంగన్=అర్హమగునట్లుగా, ఒకనిన్, వరియించి, తదన్యులన్=తక్కినవారిని, ధిక్కరించి=తిరస్కరించి, ఎట్టు=ఏరీతిగా, వేర్వెట్టఁగన్=వేఱుపఱుచుటకు-లేక పేర్వెట్టఁగన్=పీఁడునాకుఁ గావలయునని నామనిర్దేశము చేయుటకు, నేర్చును, కావునన్, మీయట్టిమహానుభావున్=మీవలె గొప్పప్రభావము గలవానిని, భవదంశసముద్భవున్ = మీయంశములవలనఁ బుట్టినవానిని, నైషధాధిపున్=నలరాజును, వరించి, కృతార్థతన్=చరితార్థత్వము, అందుఁగాక, అనఁగా చిరకాలమునుండి యభిలషించుచున్న నలరాజును వరించి దమయంతి కృతార్థురా లగునుగాక యని భావము.

తా. ఓదేవతలారా! పతివ్రతయగు దమయంతి మిమ్మందఱ నెట్లు వరించు? అట్లని సమానప్రభావము గలమీలో నొకని వరించి తక్కినవారి నెట్లు తిరస్కరింపఁగల్గు? కావున మీతో సమానుఁడును. మీయంశములఁ బుట్టినవాఁడు నగు నలుని వరించి దమయంతి చరితార్థ యగుఁగాక.

వ. అనిన విని లోకపాలచతుష్టయంబు కమలవిష్టరభామినీ నిర్దేశంబును నిషధదేశాధీశచిత్తశుద్ధిపరీక్షణంబును దమయంతీ పరమపాతివ్రత్యగుణగౌరవంబునుం గారణంబుగా మనంబులం బ్రసాదంబు వహించి నలాకారమాయాకంచుకంబులు దిగఁద్రోచి, భీమోద్భవాసాత్త్వికభావాలోకనాపేక్షం బోలెఁ జక్షుస్సహస్రంబుతో సహస్రాక్షుండును, గామాంధకారగర్వనిర్వాపణదీపికా చక్రవాళంబునుం బోనికీలాజాలంబుతోఁ గీలియును, సద్యోనిర్వాణమదనాగ్నిధూమంబుంబోని ధూమ్రమదేహచ్ఛాయామండలంబుతో దండధరుండును, నిరవకాశం బైనయాశాపాశంబునుం బోనిపాశంబుతోడం బాశపాణియు, నిజరూపంబులు గైకొని రప్పుడు కందర్పదర్పాప

హారపారీణం బైనవీరసేనతనయుమనోహరాకారంబు మాని
వైమానికులు దమనిక్కంపురూపులు చేపట్టుట సామ్రా
జ్యంబు విడిచి భిక్షాటనంబు పాటించినవిధంబునను యౌవ
నంబుఁ బరిత్యజించి వార్ధకం బంగీకరించినభంగినిం దోఁచెఁ
బేరోలగం బున్నభూపాలవర్గంబు గనుంగొనుచుండ రూపాం
తరపరిగ్రహం బొనర్చి యింద్రాదు లింద్రజాలవిద్యావిదుల
చందంబు నొందిరి యనంతరంబ. 187

టీ. అనినన్=అనఁగా, లోకపాలచతుష్టయంబు=ఇంద్రాగ్నియమవరుణులు నల్వురును, విని=ఆలించి, కమల...నిర్దేశంబును—కమలవిష్టరభామినీ=సరస్వతి యొక్క, నిర్దేశంబును=ఆజ్ఞయు, నిషధ...శుద్ధియు—నిషధదేశాధీశ=నలునియొక్క, చిత్తశుద్ధి=మనస్సుయొక్కనైర్మల్యమును, పరీక్షణంబు = చూచుటయు, దమయంతీ... గౌరవంబును—దమయంతీ=దమయంతియొక్క, పరమ=ఎక్కుడగు, పాతివ్రత్యగుణ=పతిని దైవముగా నెంచుగుణముయొక్క, గౌరవంబును= అతిశయమును, కారణంబుగాన్ = వారనుగ్రహించుటకుఁ గారణములగుచుండఁగా, మనంబులన్ = చిత్తములయందు, ప్రసాదంబు=అనుగ్రహము, వహించి=పూని, నల...కంచుకంబులు — నలాకార=నలరూపములనెడు, మాయాకంచుకంబులు = మాయకవచములను, దిగఁద్రోచి = విడిచి, భీమ...అపేక్షం బోలె - భీమోద్భవా = దమయంతియొక్కయు, సాత్త్వికభావ = మిక్కిలి యనురాగమువలనఁ గలుగు, శ్లో॥ స్తంభస్స్వేదోథరోమాంచ స్స్వరభంగోథ వేపథుః। వైవర్ణ్యమశ్రుప్రలయ ఇత్యష్టౌ సాత్త్వికాస్స్మృతాః॥ అనుభావముల యొక్క, ఆలోకన=చూచుటయందైన, అపేక్షంబోలెన్ = కోర్కిచేతంబలె, సహస్రాక్షుండు=ఇంద్రుఁడు, చక్షుస్సహస్రంబుతోడను = వేయినేత్రములతోడను, కామా...చక్రవాళంబునుంబోని—కామ=మన్మథసంబంధియైన, అంధకార=చీఁకటియొక్క, గర్వ=ఉబ్బును, నిర్వాపణ=పోఁగొట్టుటకు, దీపికాచక్రవాళంబునుంబోని=కరదీపికాసమూహమువంటి (కాగడాలవంటి), కీలాజాలంబులతోన్=మంటలగుంపుతో, కీలియున్=అగ్నిదేవుండును, సద్యో...ధూమం

బుంబోని, సద్యః=అప్పుడు, నిర్వాణ=ఆఱిపోయిన, మదనాగ్ని= మన్మథాగ్ని యొక్క, ధూమంబుంబోని=పొగవంటి, ధూమ్ర... మండలంబులతో—ధూమ్ర= నల్లనగు, దేహచ్ఛాయా, శరీరకాంతులయొక్క, మండలంబులతోన్ =సమూహము తో, దండధరుండును=యముఁడును, నిరవకాశంబైన=అయిలి లేని, ఆశాపాశం బునుంబోని = కోర్కె యను త్రాటివంటి, పాశంబులోడన్ =పాశమను నాయు ధవి శేషముతో, పాశపాణియున్ =వరుణుండును, నిజరూపంబులు=నిక్కంపు రూపంబులు, కైకొనిరి=ధరించిరి, అప్పుడు=ఆసమయమున, కందర్ప... పారీ ణంబు, కందర్ప=మన్మథునియొక్క, దర్ప=మదముయొక్క, అపహార=పోఁగొ ట్టుటయందు, పారీణంబు= నేర్పుగలది, ఐన వీరసేనతనయు మనోహరాకారం బు=అయినట్టి నలుని సుందరమగు రూపమును, మాని=విడిచి, వైమానికులు= దేవతలు, తమని...పట్టుట=తమనిజరూపములఁగొనుట. సామ్రాజ్యంబు=చక్రవర్తి పదవిని, విడిచి=మాని, భిక్షాటనంబు=తిరిపమెత్తుట, పాటించినవిధంబునను=లె క్కించినరీతిని, యానసంబు = లేఁబ్రాయము, పరిత్యజించి = విడిచి, వార్ధ కంబున్ = ముదుసలితనమును, అంగీకరించిన భంగినిన్ = సమ్మతించినగతిని, తోఁచెన్=తోఁచెను,! పేరోలగంబున్న భూపాలవర్గంబు=సభయందున్న రాజ సమూహము, కనుంగొనుచుండన్=చూచుచుండఁగా, ఇంద్రాదులు=దిక్పతులు నల్వురును, రూపాంతర పరిగ్రహంబున్ =మఱియొక రూపమును, ఒనర్చి = పొంది, ఇంద్రజాల విద్యావిదుల చందంబును=మంత్రవిద్యలయందు నేర్పుగల వారిమార్గమును, ఒందిరి = పొందిరి. అనఁగా నింద్రాదిదేవతలు దమయంతియం దుఁ బొందుపఱిచిన డెందంబుల నూడఁదీసికొని స్వస్వరూపంబులు దాల్చి నిలి చిరని భావము. అల. రూపకోత్థాపితమైన యుత్ప్రేక్ష.

తా. స్పష్టము.

తే. క్షీరనీరవిభేదంబు సేసినట్టి
హంసియునుబోలె హంసవాహనుని దేవి
లీల దిక్పాలనిషధభూపాలవరుల
భేద మేర్పడఁ జేసి సంప్రీతి యెసఁగ. 188

టీ. హంసవాహనునిదేవి = సరస్వతి, క్షీరనీరవిభేదంబు=పాలిది యనియు నీరిదియు నన్న విభాగమును, చేసినట్టి హంసియనుబోలె=చేసినయాఁడుహంస వలె, లీలన్ =విలాసముతోడ, దిక్ ... భేదము—దిక్పాల=ఇంద్రాదులయొక్కయు, నిషధభూపాలవరుల=నలునియొక్కయు, భేదము=ఏర్పాటు, ఏర్పడన్ = స్పష్టముగ, చేసి, సంప్రీతి=ప్రేమ, ఎసఁగన్ =ఒప్పునట్లుగా నని మీఁదివచన ముతో నన్వయము.

తా. పాలును నీరును నేకముచేసినను వాని వేఱువేఱుగ విభాగించుట హంసకు సహజగుణము. అట్లే యీసరస్వతియు కృత్రిమనలులును నలుఁడును సమాకృతులై కలిసియుండ నలుని వేఱుగా విభాగించి నలవేషధరులై వానితోఁగలసి యున్ననిర్జరుల వేఱు చేసినదై.

వ. దమయంతి కిట్లనియె. 189

తే. వీరె యాఖండలాదులు విబుధవరులు
వాఁడె నిషధాధినాథుండు వనజవదన !
భక్తి సొంపార వీరికిఁ బ్రణతి సేయు
మింపు పెంపారఁగా వరియింపు మతని. 190

టీ. వనజవదన=పద్మమువంటి మొగము గలయోదమయంతీ! ఆఖండలాదులు= ఇంద్రుఁడు మొదలుగాఁ గల, విబుధవరులు=దేవతలలో నుత్తములు, వీరె=యీ కనుపట్టువారె, నిషధాధినాథుండు=నిషధదేశాధీశుఁ డగునలుఁడు, వాఁడె=అతఁడె, భక్తిసొంపారన్ —భక్తి=నమ్రభావముయొక్క, సొంపు=అతిశయము, ఆరన్ =నిండునట్లుగా, వీరికిన్ = ఇంద్రాదులకు, ప్రణతిసేయుము=నమస్కరింపుము, ఇంపు=సంతోషముయొక్క, పెంపు=అతిశయము, అరఁగాన్ =నిండు నట్లుగా, అతనిన్ =ఆనలుని, వరియింపుము=పెండ్లియాడుము.

వ. అని యోంకారభద్రపీఠికాలంకారం బగుపంకజాసనునిరాణి సియోగింపం గంకణఝుణఝుణత్కారం బంకురింప నాశశాంకవదన వేల్పులకుం గేలుదోయి యెత్తి నమస్కరించె. 191

టీ. అని, పలికి, ఓంకారభద్ర పీఠికాలంకారంబు—ఓంకార = ప్రణవమ నెడి, భద్రపీఠిక=మంగళప్రదమగు లేక కనకమయమగు సింహాసనమునకు, అలంకారంబు=ఆభరణంబు, అగు పంకజాసనురాణి=అయిన సరస్వతి, నియోగింపఁగ్ =నియమింపఁగా, కరక ... త్కారంబు=హస్తాభరణములయొక్క ఝణ ఝణ యనుధ్వని, అంకురింపఁగ్ = పుట్టునట్లుగా, ఆ... వదన—చంద్రునివంటి ముఖముగల యాదమయంతి, కేలుదోయి యెత్తి = రెండుచేతుల నెత్తి, వేల్పులకుఁగ్ =ఇంద్రాదులకు, నమస్కరించెఁగ్ =వందన మొనర్చెను. అలం. రూపకము.

శా. సౌందర్యాపరమత్స్యలాంఛన కళాసర్వజ్ఞ యర్థార్థిమా
కందారామవసంత సంతత మహాకారుణ్యపాథోనిధీ
మందారద్రుమమంజరీమధుఝరీమాధుర్యమాధుర్యవా
క్సందర్భాస్వదమానమానసకవిగ్రామా బుధగ్రామణీ !

టీ. సౌందర్య...లాంఛన—సౌందర్య = సొగసుఁదనమందు, అపర = రెండవ, మత్స్యలాంఛన = మన్మథుఁడా! కలాసర్వజ్ఞ—కలా=విద్యలయందు, సర్వజ్ఞ = శివుఁడా! అర్థా...వసంత - అర్థార్థి = యాచకులనెడి, మాకందారామ = మామిడితోఁపునకు, వసంత = వసంతుని వంటివాఁడా! సంత... నిధీ-సంతత=ఎల్లపుడును, మహాకారుణ్యా = గొప్పదయకు, పాథోనిధీ=సముద్రునివంటివాఁడా! మందార...కవిగ్రామా - మందారద్రుమ=కల్పవృక్షము యొక్క, మంజరీ=పూలగుత్తులయొక్క, మధు=తేనెయొక్క, ఝరీ=ప్రవాహముయొక్క, మాధుర్య, మా=ఎక్కుడగు రుచియొక్క, ధుర్య=భారము వహించుచున్న, అనఁగా నతిమధురము లయిన వని భావము. వాక్ =వాక్కులయొక్క, సందర్భ=రీతిని, ఆస్వదమాన=ఆకర్షించుచున్న, లేక యనుభవించుచున్న, మానస=మనస్సులుగల, కవి=కవులయొక్క, గ్రామా=సమూహము కలవాఁడా! బుధగ్రామణీ=పండితశ్రేష్ఠుఁడా!

తా. సౌందర్యమున రెండవమన్మథుఁడవై విద్యలచే సర్వజ్ఞత్వమును సంపాదించి, వసంతుఁడు మామిడితోఁపును వికసింపఁజేసినట్లు యాచకులకు ధనా

దుల నొసంగి సంతసింపఁజేయుచు, దయాసముద్రుఁడవై, కల్పవృక్ష పుష్పముల మకరందముయొక్క మాధుర్యమును మించుచున్న వాక్సందర్భమున రసానుభవము చేయుచున్న కవులకు నాశ్రయుఁడవయిన యోమామిడి సింగనామాత్యా! అలం. రూపకము.

క. వీరావతార రక్షణ
నారాయణరూప రాయనారాయణ కం
ఠీరవవిక్రమ వితరణ
పారాయణ యుభయవంశపావనచరితా! 193

టీ. వీరావతార=వీరరసస్వరూపా, రక్షణ నారాయణరూప=కాపాడుట యందు విష్ణునివంటి వాఁడా, రాయనారాయణ = రాజులలో విష్ణుమూర్తీ, ఇది బిరుదపదము; కంఠీరవవిక్రమ = సింహమువంటి పరాక్రమము కలవాఁడా, వితరణ పారాయణ—వితరణ = దానమిచ్చుటయందు, పారాయణ= ఆసక్తికలవాఁడా, ఉభయ...చరితా—ఉభయవంశ=మాతాపితరుల యన్వయములను, పావన=పవిత్రములుగాఁ జేయు, చరితా=చరిత్రలు గలవాఁడా!

తా. మామిడి సింగనామాత్యుఁడు, పరాక్రమశాలియు, నార్తుల రక్షించువాఁడును, బలము గలవాఁడును, విష్ణుస్వరూపుఁడును, దాతయు, పవిత్రమగుచరిత్ర గలవాఁడును. రూపకము. ఉపమ.

మాలిని. అవనగుణవిహారా యంగనాచిత్తచోరా
భువనభరితకీర్తీ పుణ్యకల్యాణమూర్తీ
కవికువలయచంద్రా గౌరవశ్రీమహేంద్రా
యవితథపటుకోపా యప్రతీపప్రతాపా! 194

టీ. అవన...విహారా-అవన=రక్షించుట యను, గుణ=గుణమునందు, విహారా=సంచరించువాఁడా, అంగనా...చోరా- అంగనా=స్త్రీలయొక్క, చిత్త= మనస్సును, చోరా=దొంగిలించువాఁడా, భువన-కీర్తీ-భువన=పదునాలుగు భువనములందును, భరిత=నిండిన, కీర్తీ=యశముగలవాఁడా! పుణ్య...మూర్తీ=పు

ణ్య=పవిత్రమును, కల్యాణ=శుభప్రదమునగు, మూర్తీ = శరీరముగలవాఁడా! కవి...చంద్రా - కవి=కవీశ్వరులనెడి, కువలయ=కలువలకు, చంద్రా=చంద్రుని వంటివాఁడా! గౌరవశ్రీ మహేంద్రా-గౌరవ=పూజ్యతచేతను, శ్రీ=సంపదచే తను, మహేంద్రా=ఇంద్రునివంటివాఁడా! అవితథపటుకోపా-అవితథ = వ్యర్థ ముకాని, పటు=సమర్థమగు, కోపా=కోపముకలవాఁడా! అప్రతీప ప్రతాపా= అప్రతీప=అడ్డులేని, ప్రతాపా= తేజస్సు కలవాఁడా!

తా. జనుల నెల్లపుడు రక్షించువాఁడవై, సౌందర్యము గలవాఁడవై, ఎక్కుడుగఁ గీర్తితో నొప్పుచు, చాలభోగము లనుభవించుచు వ్యర్థముకాని కోపముగలవాఁడవయి, నిరర్గళమగు ప్రతాపముగల యోమామిడిసింగనామాత్యా!

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్త్ర సకలవిద్యాసనాథ శ్రీనాథభట్టప్రణీతం బైనశృంగారనైషధ కావ్యంబునందుఁ బంచమాశ్వాసము.





శ్రీరస్తు.

# శృంగారనైషధము

## షష్ఠాశ్వాసము.



(శ్రీ) గురుశంకరమానిద
యాగౌరవనిత్యవర్ధితాన్వయ! కరుణా
సాగర! విజయరమైకస
మాగమలీలానుషంగ! శ్రీమామిడిసింగా! 1

టీ. శ్రీ...న్వయ - శ్రీ=శోభాయుతుఁడును, గురు=ఉపదేశికుఁడును నగు, శంకరమాని=శంకరుఁడను పేరుగల యోగియొక్క, దయాగౌరవ=కారుణ్యాతిశయముచే, నిత్య=ఎల్లప్పుడును, వర్ధిత=వృద్ధి పొందింపఁబడుచున్న, అన్వయ=వంశముగలవాఁడా? కరుణాసాగర = దయారసమునకు, సముద్రునివంటివాఁడా? విజయ...షంగ - విజయరమా=జయలక్ష్మితో, ఏక=ముఖ్యముగా, సమాగమలీలా=కలిసికొనుట యనెడి విలాసముయొక్క, అనుషంగ=కూడిక కలవాఁడా? అనఁగా సర్వదా యెచ్చటికేఁగినను విజయములను బడయుచున్నాఁడని భావము. మామిడిసింగా?

తా. శంకరాచార్యులనెడి యోగి కారుణ్యాతిశయముచే వర్ధిల్లుచున్న వంశముగలవాఁడా! దయకునికి పట్టయినవాఁడా! ఎల్లప్పుడును విజయలక్ష్మిసంపన్నుఁడవై వెలయునట్టి యో మామిడిసింగనామాత్యా!

వ. చిత్తగింపుము. 2

ఉ. మానితలీల నల్లన విమానము డిగ్గి వినూత్నరత్నసో
పానపరంపరాసరణి భారతిహస్తముఁ గేలనూఁది పం
చాననమధ్య కాంచనమయం బగుమంచక మెక్కి చేర్చె న
మ్మానవనాథుకంఠమున మంగళనవ్యమధూకదామమున్.

టీ. పంచాననమధ్య = సింహముయొక్క నడుమువంటి నడుముగల దమయంతి, భారతిహస్తమున్ = సరస్వతీదేవి చేతిని, కేలన్ = తన చేతిచే, ఊఁది = ఆనుకొని, వినూత్న...సరణిన్ - వినూత్న = క్రొత్తవగు, రత్న = మణిమయములగు, సోపానపరంపరా సరణిన్ = మెట్లవరుసగల మార్గముచే, మానితలీలన్ = శ్లాఘనీయమగు విలాసముతో, అల్లన్ = మెల్లఁగా, విమానము, డిగ్గి = దిగి, కాంచనమయంబు = కనక మయమయినది, అగు మంచకము = అయినట్టి మంచెను, ఎక్కి, మంగళ...దామమున్ - మంగళ = శుభప్రదమైన, నవ్య = నూతనమైన, మధూకదామమున్ = ఇప్పపూవుల దండను, అమ్మానవనాథుకంఠమునన్ = ఆరాజు కంఠమునందు, చేర్చెన్ = వేసెను.

తా. సింహముయొక్క నడుమువంటి నడుముగల దమయంతి సరస్వతీదేవి హస్తమును దనహస్తముచే నానుకొని రత్నమయమగు మెట్లవరుస వెంబడిని నుతింపఁదగిన లీలతో మెల్లఁగా దిగి యాస్వయంవరణ మాలిక నానలరాజు మెడయందు వైచెను.

వ. ఇట్లు దమయంతీకరార్పితంబై దూర్వాంకురాలంకృతంబును, మకరాంకపాశసంకాశంబును, మధుపఝంకారసంకులంబును, నుదారతారకానికరాకారంబును నై. 4

టీ. ఇట్లు, దమయంతీ...తంబై—దమయంతీ = దమయంతియొక్క, కర = చేతిచే, అర్పితంబై = ఉంపఁబడినదై, దూర్వా ..తంబును-దూర్వాంకుర = గఱిక మొలకలచే, అలంకృతంబును = అలంకరింపఁబడినదియు, మకరా...సంకాశంబును-మకరాంక = మన్మథునియొక్క, పాశ = పాశాయుధవిశేషముతో, సంకా

శంబును=సరియైనదియును, అనఁగా మన్మథపాశమువలె మోహసంజనకమయి వెలయుచున్నదని భావము, మధుప...సంకులంబును—మధుప = తుమ్మెదలయొక్క, ఝుంకార = ఝుంకారధ్వనులచే, సంకులంబును = నిండియున్నదియు, ఉదార...కారంబును—ఉదార=గొప్పవగు, తారకా=నక్షత్రములను, నిరాకారంబును=తిరస్కరించుచున్నదియును, ఐ.

తే. ధారుణీపతినిద్దంపుఁ బేరురమున
నమరెఁ బ్రతిబింబమును దానునలరుదండ
బాహ్యమునఁ గొంతకొంత యభ్యంతరమునఁ
గీలుకొని యున్నమదనబాణాళిపోలె. 5

టీ. అలరుదండ—అలరు=పూవులయొక్క. దండ=మాలిక—ధారు...పేరురమునన్—ధారుణీపతి=నలునియొక్క, నిద్దంపు=నిర్మలమైన, పేరురమునన్=విశాలమగు వక్షస్థలమునందు, తాను=అపూలదండయు, ప్రతిబింబమును=దాని నీడయు, కొంత=కొంతభాగము, బాహ్యమునన్=వెలుపలను, కొంత=మఱికొంతభాగము, అభ్యంతరమునన్=లోపలను, కీలుకొనియున్న=నాటియున్నట్టి, మదనబాణాళిపోలెన్=మన్మథబాణపంక్తివలె, అమరెన్=ప్రకాశించెను, ఈ పద్యమున స్వచ్ఛంబగు నలునియురమున ప్రతిబింబించిన పూలదండను మన్మథుఁడు పుష్పశరుఁడగుటచే నతని లోనాటినశరములోయని కవియుత్ప్రేక్షించినాఁడు.

తా. నలుని వక్షఃస్థలమందలి పూవుదండయు దానిప్రతిబింబమును గొంత లోపల నాటియుఁ గొంతపయిని నున్నమన్మథుని బాణపంక్తివలె నుండెను.

క. తెఱవ పులకాంకురంబులు
గిఱికొన నవ్వేళఁ జూడ్కికి ముదం బొసఁగెన్
గఱకుఁబువు మొగ్గతూపులు
గిఱికొన్నమనోజఖురళికిం బ్రతినిధి యై. 6

టీ. అవ్వేళన్=నలునిమెడలోఁ బూలదండ వేయునప్పుడు, తెఱవ=దమయంతి, పులకాంకురంబులన్=రోమాంకురములు, గిఱికొనన్=అలమఁగా, అనఁగాఁ

జిరకాలాభిలషితుఁడగు నలుని సందర్శించి యతని మెడలోఁ బూలదండ వేసిన ప్పుడు దమయంతికి సాత్త్వికభావములు నిండెనని భావము. కఱకు...తూపు లన్—కఱకు=వాడియైన, పువుమొగ్గతూపులన్=పూలమొగ్గలనెడి బాణము లచే, గిఱి...శరధికిన్—గిఱికొన్న=నిండిన, లేక ఆవృతమైన, మనోజ=మన్మ థునియొక్క, ఖురళికిన్=గరడికి—మూలమున 'శరోపాసనవేదికేవ' అని యు న్నదిగాన 'శరధికిన్' అను ముద్రితపాఠమునకంటె 'ఖురళికిన్' అను పాఠమే సమంజసము, ప్రతినిధియై=సమానమై, చూడ్కికిన్=దృష్టికి, ముదంబు, ఒసం గెన్ = ఇచ్చెను. అనఁగాఁ జూపఱను సంతసింపఁజేసె ననిభావము. ఇందు రోమాంచమనెడి సాత్త్వికభావము సూచితమయ్యె.

తా. స్వయంవరణవేళ దమయంతి పులకాంకురములచే నిండినదై వాడియై నపూలమొగ్గలనెడి బాణములచే నావృతమగుచు, మన్మథుని గరడీకి సాటివచ్చు చుఁ జూపఱకు ముదముగొల్పెను.

ఉ. ధరణిపుచక్కఁగట్టెదురఁ దా దామరసాక్షికిఁ జేష్ట నష్టతం
బొరసె మనోనురాగపరిపూర్తి నొకించుక సేపు నిర్భర
స్మరశరపుంఖసంఘటితషట్చరణప్రమదాగరుచ్ఛటా
స్ఫురదనిలావతారమునఁ బోరనఁ దా మొదలెత్తెనో యనన్.

టీ. ధరణిపుచక్కకట్టెదురన్=ఒప్పుచున్ననలరాజు నెట్టయెదుట, తామ రసాక్షికిన్ = ఆదమయంతికి, మనోనురాగ పరిపూర్తిన్ = మనస్సునందలి కోరికనిండుటచే, ఒకించుక సేపు = కొంచెముకాలము, చేష్ట = ఆలోకనాది చేష్ట, నిర్భర... తారమునన్—నిర్భర=భరింపశక్యముగాని, స్మరశర=మన్మథ బాణములయొక్క, పుంఖ = క్రిందికొనలందు, సంఘటిత = కూర్పఁబడిన, షట్చరణ ప్రమదాగరుచ్ఛటా = ఆఁడుతుమ్మెదలయొక్క ఱెక్కల గుంపుల వలన, స్ఫురత్=అతిశయించిన, లేక ప్రసరించిన, అనిల=వాయువుయొక్క, అవతారమునన్=ఉత్పత్తిచే, అనఁగా విజృంభణంబుచే, బోరనన్=ఆకస్మిక ముగా, తాన్=ఆచేష్ట, మొదలెత్తెనో యనన్ = ఉన్మూలమయినదన్నట్టుగా, నష్టతన్, పొరసెన్=నశించెను. అనఁగా నలమహారాజుచెంతను దమయంతి

స్తంభమనెడి సాత్త్వికభావము గలదయి చేష్టదక్కియుండఁగా గవి, మన్మథ బాణముల మూలములందుఁ గట్టఁబడిన తుమ్మెద ఱెక్కలగాలిచే నది మొదలంట నెగురఁగొట్టంబడి నశించినదేమో యన్నట్లులా చేష్టను గూర్చి యుత్ప్రేక్షించెను.

తా. స్పష్టము.

ఉ. ఆహరిణాక్షియిడ్డయలరారెడుపువ్వులదండ జాతకౌ
తూహలతన్ స్పృశించునెడఁదోఁచెఁ గరంబునఘర్మబిందుసం
దోహము తేని కవ్విధము దోఁపఁగఁజేసె నెఱిన్ భవిష్యదు
ద్వాహమహోత్సవంబునకుదర్పకుఁడిచ్చినహస్తతోయమున్. 8

టీ. నలుఁడు (కర్త), కరంబునన్ = చేతితో, ఆహరిణాక్షి...దండన్ — అహరిణాక్షి=ఆదమయంతి, ఇడ్డ=ఇచ్చిన, అలరారెడుపువ్వులదండన్ =ఒప్పుచున్న పూవులదండను, జాతకౌతూహలతన్ =పుట్టినవేడుకచే, స్పృశించునెడన్ = తాఁకినప్పుడు, ఘర్మబిందు సందోహము=చెమట బిందువులయొక్క సమూహము, తోఁచెన్ =పుట్టెను, తేనికిన్ =ఆనలరాజునకు, అవ్విధము=ఆస్వేదోదయము, నెఱిన్ =ఆచారముచే, భవిష్యదుద్వాహమహోత్సవమ్మునకున్ = కాఁబోయెడి వివాహమహోత్సవమునకు, దర్పకుఁడు=మన్మథుఁడు, ఇచ్చినహస్తతోయమున్ =ఇచ్చిన కన్యాదానజలముగా, తోఁపఁగన్, చేసెన్ =తోఁచునట్లుచేసెను. అనఁగా దమయంతియిడిన పూలదండను వేడ్కనలుఁడు స్పృశింపఁగాఁ జేతచెమట బిందువులు పుట్టెను. అది ముందువచ్చు వివాహమునందు దర్పకుఁడిచ్చిన కన్యాదాన జలమనెడిబుద్ధిని దోఁపఁజేసెనని భావము. నలునకు స్వేదమనెడి సాత్త్విక భావ ముదయించెనని ఫలితార్థము. మన్మథుఁడు పోసిన జలధారయనుటచే దమయంతి తనంతవలచి నలుని వరించుట వ్యంజితము.

తా. నలుఁడు దమయంతి వైచినపూలదండను స్పృశింపఁగాఁ జేతియందుఁ జెమ్మట యుదయించె. అదిముందు వచ్చెడి వివాహమున మన్మథుఁ డొసఁగిన కన్యాదాన జలమని యతనికిఁ దోఁచించెను.

ఉ. చిత్తజుపువ్వుఁదూపుల రచించినతుమ్మెద ఱెక్కగాలిచే

నత్తఱి నేకువత్తి యగుసంగన దూలినఁ దూలెఁ గాక య
త్యుత్తమధీరతాగుణసమున్నత మేరు మహీధరంబు భూ
భృత్తిలకుండు నైషధుఁడు బిట్టు చలించెఁ గదా తదాహతిన్.

టీ. అత్తఱిన్=దమయంతి స్వయంవరణ మాలికను నలునిమెడలో వైచిన ప్పుడు, ఏకువత్తి=దూదివలె మెత్తని శరీరముగలది, అగుసంగన = అయినదమయంతి, చిత్తజుపువ్వు తూపులన్=మన్మథుని పుష్పమయములగు బాణములందు, రచించిన తుమ్మెద ఱెక్కగాలికిన్=కంకపత్రములుగాఁ గట్టిన తుమ్మెదల ఱెక్కలగాలిచేత, తూలినన్=ఎగురఁగొట్టఁబడినను, తూలెన్ గాక=ఎగురఁ గొట్టఁబడెనుగాక, అనఁగా నెంతస్వల్పవాయువు ప్రసరించినను దూదితూలిపోవుట యుక్తము. కావున దూదివలె మెత్తనిశరీరముగల దమయంతి మన్మథబాణముల ఱెక్కల గాలిచేఁ దూలఁగొట్టఁబడుట యుచితమేయని భావము. తదాహతిన్=ఆమన్మథబాణ వాయుపాతముచే, అత్యుత్తమ...మహీధరంబు—అత్యుత్తమ=మిక్కిలిశ్రేష్ఠమైన, ధీరతాగుణ=ధైర్యమునందు, సమున్నత మేరు మహీధరంబు=గొప్ప మేరుపర్వతమునంటివాఁడును, భూభృత్తిలకుండు=పర్వతములలో శ్రేష్ఠుఁడును, నలపక్షమున రాజశ్రేష్ఠుఁడు, నైషధుఁడు=నలరాజు, బిట్టు =మిక్కిలి, చలించెఁగదా=చలించినాఁడుగా యని యాశ్చర్యము. దూదివలె మెత్తనిశరీరముగల దమయంతి మన్మథ బాణవాయువునకుఁ దూలినను, బర్వతమువలె ధైర్యశాలియగు నలుఁడు చలించుట యాశ్చర్యకరమని భావము. ఆనల దమయంతు లిర్వురకును సమానానురాగమును, సాత్వికభావములును గల్గె నని భావము. అలం. రూపకము. విభావన.

తా. స్పష్టము.

క. బిట్టు ఘనస్తంభంబున
గట్టువడెన్ నిషధరాజు కాముని చేతన్
బిట్టుఘనస్తంభంబున
గట్టువడం దగును రాజు గజరాజువలెన్. 10

టీ. కామునిచేతన్=మన్మథునిచే, నిషధరాజు=నలరాజు, బిట్టు=మిక్కిలి, ఘనస్తంభంబునన్=గొప్ప స్తంభమం దని యర్థము- స్తంభమనెడి సాత్త్వికభావమునందని భావము. కట్టువడెన్ = బంధింపఁబడెను, ఇది యుచితమే, ఏలన, రాజు=రాజయినవాఁడు, బిట్టు, ఘనస్తంభంబునన్=గొప్పకంబమునందు, గజరాజువలెన్ = ఏనుఁగులరాజువలెన్ - మేటియేనుంగువలె, కట్టువడంచగును. ఏనుఁగులకు రాజయినది స్తంభమునఁ గట్టువడుటం బోలె మనుజులకు రాజయినవాఁడును స్తంభమునఁ గట్టువడుట యుచితమే యని భావము. అనఁగా నలుఁడు దమయంతి కరస్పర్శమువలనఁ గల్గిన స్తంభమను సాత్త్విక భావమువలన మిక్కిలి నిర్వ్యాపారుఁడై యుండెనని ఫలితార్థము.

తా. మన్మథునిచే నలరాజు, దృఢముగా స్తంభంబున బాధింపఁబడిన గజరాజువలె స్తంభమనెడి సాత్త్విక భావమందు బంధింపఁబడెను.

వ. ఇవ్విధంబున.

తే. పెద్దకాలంబునకు మనో౽భీప్సితంబు
సఫల మగుటయు నత్యంత సమ్మదమున
సొంపుదళుకొత్త నున్నయాదంపతులకుఁ
గరుణ దీవన లిచ్చె నిర్జరగణంబు. 11

టీ. పెద్దకాలంబునన్=దీర్ఘకాలమునకు, మనఃఅభీప్సితంబు=మనస్సులోని కోరిక, సఫలముఅగుటయు=నెఱవేఱినట్టిది కాఁగా, అత్యంతసమ్మదమునన్= మిక్కుటమయినహర్షముతో, సొంపు=సౌభాగ్యము, తళుకొత్తన్ = ప్రకాశించునట్లుగా, ఉన్న=ఆదంపతులకు, నిర్జరగణంబు=దేవతాసమూహము, కరుణన్=దయచేత, దీవనలుఇచ్చెన్=ఆశీర్వచనములు గావించెను.

తా. సుగమము.

వ. వెండియు నిషధమండలాధీశ్వరుండు దమకుం జేసిన దూతకృత్యంబునం గానం బడిన చిత్తశుద్ధికారణంబుగా, నమ్మహీపతి కమరపతి ప్రత్యక్షుంబైన యాకారంబుతో యాగంబులందు

హవిర్భాగంబు భుజియించు వాఁడయ్యె హుతవహుం డిచ్ఛానురూపంబునం బ్రభవింప ననుమతించె ధర్ముం డక్షయప్రహరణంబులును ధర్మైకనిరతబుద్ధియు నొసంగె వరుణుండు దలఁచినచోట జలంబులు సంభవింపను ధరియించిన పుష్పంబులు వాడకుండను ననుగ్రహించె. అప్పుడు భారతీదేవి, నానాభువనసమాగతానేక భూవరవర్ణనాప్రసంగోచితం బైనమానుషాకారంబుమాని వీణాపుస్తకపాణియు, రోహిణీరమణచూడామణియు నై కుందేందుతుషారహార ధవళంబగు దివ్యరూపంబు ధరించె. అందఱు దమయంతి నుద్దేశించి. 13

టీ. వెండియున్, నిషధమండలాధీశ్వరుండు=నలరాజు, తమకున్ =ఇంద్రాదులకనుట, చేసిన దూతకృత్యంబునన్ =చేసినదూతత్వమందు, కానం...కారణంబుగాన్ =కానవచ్చిన చిత్తశుద్ధి హేతువుచే, అమ్మహీపతికిన్ = నలునకు, అమరపతి=ఇంద్రుండు, ప్రత్యక్షంబు=కంటికి గానవచ్చునది, ఐనయాకారంబుతోన్ =అయినట్టి యాకారముతో, అనఁగా స్వస్వరూపముతో ననుట, యాగంబులందున్ =నలుఁడొనర్చిన యజ్ఞంబులందు, హవిర్భాగంబు, భుజియించు వాఁడు, అయ్యెన్ =హవిర్భాగములను దిననంగీకరించెను, హుతవహుండు=అగ్ని, ఇచ్ఛానురూపంబునన్ =నలునియిష్టమున కనుకూలమగునట్లు, ప్రభవింపన్ =ఉద్భవించుటకు, అనుమతించెన్ =అనఁగా నలుండు గోరినచోట యగ్నిప్రత్యక్షమగుట కిష్టపడెనని భావము. ధర్ముండు=ధర్మరాజు, అక్షయప్రహరణంబులును=అక్షయమగుబాణములును, ధర్మ...బుద్ధియున్-ధర్మగుణమునందు, ఏక=ముఖ్యముగా, నిరత=ఆసక్తమగు, బుద్ధియున్ =బుద్ధిని, ఒసంగె. వరుణుండు, తలఁచినచోటన్ =తలంచిస్థలమునందె, జలంబులు, సంభవింపను=సంభవించుటకును, ధరియించిన పుష్పంబులు, వాడకుండన్ =వాడిపోకుండుటకును, అనుగ్రహించె, అప్పుడు, భారతీదేవి, నానా...చితంబు-నానాభువన = అనేకలోకములనుండి, సమాగత=వచ్చిన, అనేకభూవర=సమస్తరాజులయొక్క, వర్ణనా

ప్రసంగ=వర్ణించుటయనెడి ప్రసంగమునకు, ఉచితంబు=తగినది, ఐనమానుషా కారంబున్=అయినట్టి మనుష్యాకారమును, మాని=విడిచి, వీణాపుస్తకపాణి యు=వీణయును, పుస్తకమునుహస్తమందుఁగలదియు, రోహిణీ...మణియున్-రోహిణీరమణ=చంద్రుఁడు, చూడామణియున్=శిరోభూషణముగాఁ గలఁది యు, ఐ, కుంద...ధవళంబు-కుంద=మల్లెలు, ఇందు=చంద్రుఁడు, తుషార = మంచు, హార=ముత్యములహారములు, వీనివలె, ధవళంబు=తెల్లనిది, అగుదివ్య రూపంబు=అయినట్టి దేవతాస్వరూపమును, ధరించె, అందఱున్=ఆదేవతలం దఱును సరస్వతియును, దమయంతిన్, ఉద్దేశించి.

ఉ. ఆదిమశక్తి యైన తుహినాచలరాజతనూజ వోలె ము
త్తైదువ వై నిజేశ్వరునియర్ధశరీరము పాలుగొమ్ము నీ
పాదసరోరుహంబు లతిభక్తి భజింతురు గాక యెప్డు బ్ర
హ్మాదిక దేవతాసదృశులైనమహామహిమండలేశ్వరుల్. 14

టీ. ఆదిమశక్తి=మూలప్రకృతి, ఐన...వోలెన్-అయినట్టి హిమవంతుని కూతురగు గౌరీదేవివలె, ముత్తైదువవై=వృద్ధసువాసినివై, నిజేశ్వరునియర్ధశరీర ము=నీప్రాణేశ్వరుఁడగు నలుని సగముదేహమును, పాలుగొమ్ము=పంచుకొనుము. అన్యోన్యప్రేమముచే పురుషుని యర్ధశరీరముం బోలె నుండుమనుట - పార్వతి నిజముగా నే పతి యర్ధశరీరము గొన్నది. ఎప్డున్=ఎల్లప్పుడు, బ్రహ్మాదికదేవతా సదృశులు = బ్రహ్మమొదలగు సురలతో సమానులు, ఐనమహామహిమండలేశ్వ రుల్= అయిన గొప్ప రాజులందఱును, నీపాదసరోరుహంబులు = నీపాదప ద్మములను,అతిభక్తిన్=మిక్కిలిభక్తితో, భజింతురుగాక=సేవించుచుందురు గాక, అనఁగా బ్రహ్మాది దేవతలు శంకరయుతు రాలయిను పార్వతిని సేవించు నట్లు నలరాజయుక్తు రాలవగునిన్ను భూమింగల రాజులందఱును సేవింతురు గాక యని భావము. నలునిభజించుట మూలమునఁ దదర్ధమయిన దమయంతిని గూడ భజించినట్టె యగు నని భావము.

తా. ఓదమయంతీ! మూలప్రకృతియైన పార్వతివలెనే వృద్ధసువాసినివై

భర్తృగౌరవంబును బొందుము. పార్వతిని బ్రహ్మాదిదేవతలవలె నిన్నురాజులందఱును సేవింతురు గాక.

మ. అని వైదర్భిఁ బ్రసాదగర్భమధురవ్యాహారసందర్భసం
జనితానందనుఁ జేసి నెయ్యమున నాశక్రాదిబృందారకుల్
వనితారత్నముచేతఁ గైకొనిరి సేవాహస్తపద్మాంజలుల్
ఘనరత్నాంచితహేమకంకణఝుణత్కారంబుతోరంబుగన్.

టీ. అని, వైదర్భిన్=దమయంతిని, ప్రసాద...నందను-ప్రసాద=ప్రసాదగుణము, లేక యనుగ్రహము. గర్భ=లోననిమిడియున్న, మధుర=తియ్యని, వ్యాహార=మాటలయొక్క, సందర్భ = ప్రసంగముచే, సంజనితానందనన్=పుట్టినయానందమగలదానిఁగా, నెయ్యమునన్=ప్రేమతో, చేసి, ఆశక్రాదిబృందారకుల్=ఆయింద్రాదిదేవతలు, వనితారత్నముచేతన్=ఆదమయంతిచే, ఘన... త్కారంబు—ఘన=గొప్పవగు, రత్న=మణులచే, అంచిత=ఒప్పుచున్న, హేమకంకణ=బంగారుకడియములయొక్క, ఝుణత్కారంబు=ఝుణఝుణధ్వని,తోరంబుగన్=అధికమగునట్లుగా, సేవాహస్తపద్మాంజలుల్, సేవా=తమ్ముసేవించుటయందలి, హస్తపద్మాంజలుల్=చేమోడ్పులను, కైకొనిరి=అనఁగా రత్నమయకంకణధ్వనులు చెలంగునట్లుగా దమయంతి యొసర్చు నమస్కారములను స్వీకరించి రని భావము.

తా. ఇంద్రాదిదేవత లట్లు దమయంతిని గూర్చి యనుగ్రహ పూర్వములును మధురములును నైనవాక్ప్రసంగములుచేసి సంతసింపఁజేసి చేతుల నున్న రత్నకంకణ ఝుణత్కారంబులు వెలయునట్లుగా దమయంతి యిచ్చిన నమస్కారములను గైకొనిరి.

వ. అనంతరంబ నిషధమహీకాంతుం గనుంగొని సరస్వతీ దేవి యిట్లనియె. 16.

టీ. స్పష్టము.

ఉ. నేమముతోడ విశ్వధరణీభువనాధిప, సంతతంబుఁ జిం

తామణిమంత్రరాజము ప్రధానము మంత్రకదంబకంబులో
మామక మమ్మహామనువు మానితభంగి భజింపు మీవు చిం
తామణి కామధేనువిబుధద్రుమసన్నిభ మాశ్రితాళికిన్. 17

టీ. విశ్వ... ధిప-విశ్వ=సమస్తమైన, ధరణీభువనాధిప=భూలోకనాయకా, మామకము=నాసంబంధియైనది, చింతామణి మంత్రరాజము=చింతామణియనెడి గొప్పమంత్రము, మంత్రకదంబకంబులోన్=మంత్రసమూహములో, ప్రధానము=ముఖ్యమైనది. ఈవు, నేమముతోడన్=నియమముతో, సంతతంబున్=ఎల్లప్పుడు, అమ్మహామనువున్=ఆమహామంత్రమును, మానితభంగిన్=ఒప్పుచున్నరీతిచే, భజింపుము=సేవింపుము-అనఁగా జపింపుమనుట. అది, ఆశ్రితాళికిన్=ఆశ్రయించినవారికి, చింతా...సన్నిభము-చింతామణి=చింతామణియను దేవతారత్నముతోను, కామధేను=కామధేనువుతోను, విబుధద్రుమ = కల్పవృక్షముతోను, సన్నిభము=సమానమైనది.

తా. భూలోకాధిపతి వగునోనలరాజా! నాసంబంధియగు చింతామణి మంత్రము సమస్తమహామంత్రములలో ముఖ్యమైనది. నీవామంత్రమును నియమయుతుండవయి యెల్లప్పుడును జపింపుము. అది చింతామణికామధేను కల్పవృక్షములవలె నాశ్రితులకు సకలాభీష్టంబులను నొసంగును.

మ. సకలంబై హిమరుక్కళాభరణమై సవ్యాపసవ్యార్ధయు
గ్మకరూపంబయి శైవమై గతకళంకంబై శివంబై యుపా
సకచింతామణియై ప్రసిద్ధభగవచ్ఛబ్దాభిధేయార్థమై
యొకమంత్రంబు మదీయ మొప్పు నది నీకుర్వీశ యే నిచ్చితిన్.

టీ. ఉర్వీశ=ఓనలరాజా! సకలంబై=అణిమాద్యష్టైశ్వర్యములుగలదై, లేక చతుష్షష్టికలలతోఁ గూడినదై, హిమరుక్కళాభరణమై=చంద్రకల యలంకారముగాఁగలదయి, సవ్యా...రూపంబయి-సవ్యార్ధ=దక్షిణపుసగమందును, అపసవ్యార్ధ=ఎడమసగమందును, యుగ్మకరూపంబై=పురుషస్త్రీస్వరూపముగలదై-అనఁగా నర్ధనారీశ్వరుఁడనుట తెల్లమగుచున్నది, శైవమై=శివసంబంధియై, గ

తగళంకంబై =నిష్కళంకమై, శివంబై = సౌమ్యాకారముగలదై, ఉపాసకచింతామణియై=తన్నుపాసించిన జనమునకుఁ జింతామణివంటిదయి, అనఁగాఁ జింతామణి కోరిన వరములనిచ్చుచున్నట్లు మంత్రమును సకలార్థములనిచ్చుచున్నదని భావము. ప్రసిద్ధ ..యార్థమై—ప్రసిద్ధ=ప్రఖ్యాతిగాంచిన, భగవత్ శబ్ద=భగవంతుఁడను శబ్దమునకు, అభిధేయార్థమై=వాచ్యార్థమై,అనఁగా భగవత్పదమున కభిధచేనామంత్రమే యర్థము తక్కినవి లక్షణచే మాత్రమే చెప్పఁబడుచున్నవని భావము. మదీయము=నాది- నేనేదేవతగాఁ గలది, అగు, ఒక మంత్రంబు, ఒప్పున్, అది, నీకున్, ఏన్, ఇచ్చితిన్.

తా. ఓనలరాజా! సమస్తకళల కిక్కయై,చంద్రచూడమై, యర్ధనారీశ్వర రూపమున నొప్పుచు శివసంబంధియై, నిష్కళంకమై, మంగళప్రదమై, యుపాసకుల వాంఛలను దీర్చునదై భగవత్పదముచే వాచ్యమై నాసంబంధియగు నొకమంత్రము నిచ్చుచున్నాను.

ఇందు దేవతామంత్రస్వరూపమును యంత్రస్వరూపమును సూచితములు. మంత్రము-సకలంబు=కకారలకారములతోఁగూడినది. హిమరుక్కలాభరధము. చంద్రకలగలది. అనుస్వారముగలది-'క్లీ'అను నక్షరమును 'ం' అను అనుస్వారమును గలది. ఈయనుస్వారమనే చంద్రకలవలె వ్రాయుటగలదు. సవ్యా...రూపంబయి=ఎడమకుడిప్రక్కల సమానమయిన యక్షరద్వయముగలది ప్రసిద్ధ...యార్థమై 'హర'శబ్దమందలి హకార రేఫములు స్వరూపముగాఁగలది. యంత్రము-భగవచ్ఛబ్దముచే త్రికోణాకారములుగలది యని యర్థము. ఒక త్రికోణమువ్రాసి దానిపయిని తలక్రిందగా మఱొకత్రికోణరేఖ గీచినచో కుడియెడమ సగములు కనఁబడును. దానిలో నడిమి కోణవట్టమందు మంత్రరాజము లిఖింపఁదగును.

వ. ఇది చింతామణి మంత్రం బేతదుద్ధారప్రకారంబు రహస్యంబుగా నిప్పుడుపదేశించితి గురుపరంపరాసంప్రదాయ క్రమంబున సకీలకంబుగా సిద్ధసారస్వతసంసిద్ధికారణం బైనయిమ్మహావిద్య నెఱింగికొనుము. 19

టీ. ఇది=ఈచెప్పినది, చింతామణి మంత్రంబు=చింతామణియను పేరుగల ది. ఏతదుద్ధార ప్రకారంబుఁ=దీని ఉద్ధారప్రక్రియను,రహస్యంబుగాఁ, ఉప దేశించితిఁ,గురు...క్రమంబునఁ—గురుపరంపరా=గురుపరంపరవలన వచ్చిన, సంప్రదాయ=రహస్యములయొక్క, క్రమంబునఁ = వరుసచేత, సకీలకంబు గాఁ =కీలకమయినయక్షర విశేషములోఁగూడ, సిద్ధ...కారణంబు=చదువ కయేతనంతట సిద్ధించువాఙ్మయముయొక్క ప్రాప్తికి,కారణంబు=హేతుభూత ము, ఐనయిష్మహావిద్యఁ=అయినట్టి యీగొప్పవిద్యను, ఎఱింగికొనుము=తెలి సికొనుము.

క. ఆచారపరత వేకువ
లేచి పఠింపుము కుమారశేఖర్షభయీ
శ్రీచింతామణిమంత్రము
ప్రాచికి నభిముఖుఁడవై శుభం బొడఁగూడున్. 20

టీ. కుమారశేఖర్షభ=రాజకుమారదేవేంద్రా! వేకువఁ=తెల్లవాఱుజామున, లేచి=మేల్కని, ప్రాచికిఁ = తూర్పుదిక్కునకు, అభిముఖుండవై, అచారపర తఁ=నియమాసక్తితో,ఈచింతామణి మంత్రముఁ=ఈచింతామణిమంత్రరా జమును, పఠింపుము=జపింపుము, శుభంబు= మేలు, లేక, మంగళము. ఒడఁగూ డుఁ=కలుగును.

తా. ఓనలరాజా ! నీవు వేకువనే లేచి తూర్పున కభిముఖుండవై యీచిం తామణిమంత్రము నేమముతో జపింపుము. దానివలన నీకు సమస్తశుభంబులు గలుగును.

శా. సర్వాంగీణ రసామృత స్తిమిత వాక్ఛావీచివాచస్పతుల్
గర్వోన్నద్ధ విరోధిరాడుదధివాగ్గాంభీర్య కుంభోద్భవుల్
స్వర్వామాసదృశాంగనాజనమనస్సంచార పంచాస్త్రు లం
తర్వాణుల్ నృపయస్మదీయమగుచింతారత్న విద్యాధరుల్.

టీ. నృప=ఓరాజా! అస్మదీయము=మాసంబంధి, అగుచింతారత్న విద్యా

ధరుల్=అయినట్టి చింతామణిమంత్రము జపించువారు. సర్వాం...స్పతుల్-సర్వాంగీణ=అంగమంతటను, అనఁగా ప్రత్యక్షరమందుననుట, రసామృత=అమృతవంటి రసముచేత, స్తిమిత=తడిసియున్న, వాచావీచి=తరంగముల వంటి వాకులకు, వాచస్పతుల్=బృహస్పతివంటివారును, గర్వ...ద్భవుల్—గర్వ=మదముచే, ఉన్నద్ధ=అతిశయించిన, విరోధిరాట్=శత్రురాజులనెడి, ఉదధి=సముద్రమందున్న, వాగ్గాంభీర్య=వాక్కులనెడి గాంభీర్యమునకు, కుంభోద్భవుల్=అగస్త్యునివంటి వారును, అనఁగా నగస్త్యుఁడు సముద్రజలమును ద్రావిగాంభీర్యమును వెలిపుచ్చినట్లు చింతామణ్యుపాసకులును దమశత్రువులవాక్కుల నవలీల ఖండించి వారి పాండిత్యలాఘవమును వెలిపుచ్చఁగలరని భావము. స్వర్వా...పంచాస్త్రులు-స్వర్వామా=దేవతాస్త్రీలతో,సదృశ=సమానలగు, అంగనాజన=స్త్రీజనముయొక్క, మనస్సంచార=మనోవృత్తికి, పంచాస్త్రులు=మన్మథునివంటివారు, అంతర్వాణుల్=విద్వాంసులును నగుదురని యధ్యాహారము.

తా. ఓరాజా! మాయీచింతామణి మంత్రమును జపించినవారు రసభూయిష్ఠములగు వాక్కులు పల్కుటలో బృహస్పతి కెనయగుదురు. అగస్త్యుఁడు సముద్రజలము పానముచేసినట్లు ప్రతివాదుల వాక్యముల నవలీల ఖండింపఁగల్గుదురు. దేవతాస్త్రీలవంటి స్త్రీలకు మనోహరులై పండితులై యుందురు.

సీ. కబరికాభరముపైఁ ♦ గన్నెగేదంగిపూ
రేకుతోఁగూడ రేకరేనిఁ బొంది
లలితకస్తూరికా ♦ తిలకమధ్యంబున
సొబగొందు ముత్యాల ♦ చుక్కనిలిపి
కుదురునిండినమించి ♦ గుబ్బచన్నులమీఁద
జిలుఁగు దువ్వలువ గం ♦ చెలయఁ దొడిగి
యచ్చవెన్నెలచాయ ♦ నవఘుళింపఁగఁజాలు
నిద్దంపువెలిపట్టు ♦ నెఱికగట్టి
తే. యంచకొదమలఁ బూన్పిన ♦ యరదమెక్కి

యుపనిషద్వీథి విహరించుచున్న నన్ను
మహితచింతామణీదివ్యమంత్రమూర్తిఁ
దలఁప సారస్వతం బయత్నమునఁ గలుగు. 22

టీ. కబరికాభరముపైన్ = కేశపాశముపై, కన్నెగేదంగి పూ రేకు తోన్ కూడన్ = లేఁతపచ్చని మొగలిపూవు దళముతోఁ గూడ, రేరేనిన్ = చంద్రుని, చెరివి=చెక్కి, అనఁగా గేశపాశమునఁ బచ్చమొగలిపూవు రేకును, జందమామను దాల్చియనిభావము లలిత... మధ్యంబునన్ —లలి త= మనోహరమైన, కస్తూరికాతిలక=కస్తూరిబొట్టుయొక్క, మధ్యంబునన్ =మధ్యభాగము నందు, సొబగు, ఒందు=సుందరమైన, ముత్యాలచుక్క = ముత్యాలబొట్టును, నిలిపి=ఏర్పడఁజేసి, కుదురు=స్థానమును, నిండిన=నిండెడునట్లు వర్ధిల్లిన, మించు= కాంతిగల, గుబ్బ చన్నులమీఁదన్ =పాలిండ్లపై, జిలుఁగు దువ్వలువ=సన్నని దుకూలంపు, కంచెలయున్ =రవికయును, తొడిగి=ధరించి, అచ్చవెన్నెలచాయన్ =స్వచ్ఛమైన వెన్నెలరంగును, అవఘళింపఁగన్ =తిరస్కరించుటకు, చాలు... నెఱికె—చాలు=సమర్థమైన, నిద్దంపు=మృదువైన, తెలిపట్టు నెఱిక= తెల్లనిపట్టువస్త్రమును, కట్టి=ధరించి - అనఁగాఁ జంద్రికకంటె మిక్కిలి తెల్లనైన పట్టువస్త్రమును ధరించియని భావము. అంచకొదమలన్ = లేఁబ్రాయముగల హంసలను, పూన్చినయరదము=పూనిచినట్టి రథమును,ఎక్కి, ఉపనిషద్వీథిన్ = వేదాంతమార్గమందు, విహరించుచున్న నన్నున్ = తిరుగుచున్నట్టి నన్నును, మహిత... మూర్తిన్ =మహిత=పూజ్యమైన, చింతామణీ = చింతామణియను పేరుగల,దివ్య=దేవసంబంధియగు,మంత్రమూర్తి =మంత్రస్వరూపమును,తలఁపన్ స్మరించినచో, సారస్వతంబు=సమస్తవిద్యలును, అప్రయత్నమునన్ =ప్రయత్నమక్కఱలేకుండఁగనే, కలుగున్ =లభించును. చింతామణి మంత్రము జపించువారికి సమస్తవిద్య లనాయాసముగా లభించునని భావము.

తా. ఓనలరాజా! బాలచంద్రుని పచ్చమొగలిరేకును గేశపాశమున ధరించి, కస్తూరీతిలకమును ముత్యాలబొట్టును బెట్టుకొని, గబ్బిగుబ్బలపై రైకను దువ్వలువనుదాల్చి, పండు వెన్నెలల నిరసింపఁజాలిన తెల్ల పట్టువస్త్రము

గట్టి హంసలు లాగుచున్నరథంబుపైఁ గూర్చుండి వేదాంతమార్గమునఁ జరించు చున్న నన్ను స్మరించినవానికి నప్రయత్నముగా సమస్తవిద్యలును లభించును.

క. ఎంతజడుఁడైనఁ గానీ
చింతామణిమంత్రరాజసేవాపరుఁ డ
బ్దాంతంబునఁ గవితాసి
ద్ధాంతరహస్యోపనిషదుపాధ్యాయుఁ డగున్. 23

టీ. చిం...పరుఁడు—చింతామణి = చింతామణియను, మంత్రరాజ = గొప్ప మంత్రముయొక్క, సేవాపరుఁడు = కొలువనాసక్తిగలవాఁడు, ఎంత జడుఁడైనఁ గానీ—ఎంత తెలివిలేనివాఁడైనను, అబ్దాంతంబునన్ = ఒకసంవత్సరముకడపట, కవితా...ఉపాధ్యాయుఁడు—కవితా- కవిత్వముయొక్క, సిద్ధాంత-నిశ్చయములయొక్క, రహస్య=రహస్యములనెడి, ఉపనిషత్ = ధర్మములకు, ఉపాధ్యాయుఁడు=చెప్పెడు వాఁడు, అగున్.

తా. మూఢుఁడైనను నీచింతామణీ మంత్రమును జపించినచో నొకవత్సరములోనే పండితుఁడగును.

క. వైదర్భివోలెఁ గవితా
వైదర్భి నరేంద్ర నీకు వశమయ్యెను సూ
ర్యోదయవేళ జపింపు కృ
తాదరమున నస్మదీయమగు మంత్రంబున్. 24

టీ. నరేంద్ర=ఓనలమహారాజా, సూర్యోదయవేళన్ = ప్రభాతసమయంబున, కృతాదరమునన్ = ఆసక్తితో-అస్మదీయము=మాసంబంధి, అగు మంత్రంబున్=అయిన మంత్రమును, అనఁగా చింతామణి మంత్రమును ననుట, జపింపు=జపింపుము, నీకున్=అరీతినొనర్చునీకు, కవితావైదర్భి=కవిత్వమందలి కష్టసాధ్యమగు వైదర్భియనెడిరీతి, వైదర్భివోలెన్=దమయంతివలెనే-వశమయ్యెడున్=అలవడును-అనఁగాఁ జింతామణి మంత్రము నుపాసించువారికిఁ గవిత్వము సులభసాధ్యమని భావము.

తా. ఓనలమహారాజా! ప్రాతఃకాలంబున నాదరముతో నీచింతామణిమంత్రమును జపించినచో వైదర్భివోలె వైదర్భీరీతియును వశమగును.

సీ. కలియుగంబందును గాశ్మీరభూమిలో
మత్పీఠమున ధరామరుఁడు పుట్టు
శ్రీహీరుఁ డనఁగ శేషాహియంశంబున
నతఁడు మామల్లదేవ్యాఖ్య యైన
తనభార్యయందుఁ జింతామణీమంత్రచిం
తనఫలంబుగ నొక్కతనయుఁ గాంచుఁ
గల్పించు నతని కాకాశవాగ్దేవి తా
శ్రీహర్షుఁ డనియెడు చిహ్నంబు
తే. వానికీరేడు విద్యలు వచ్చియుండు
వాఁడు ఖండనకారుండు వాఁడు సుకవి
కావ్యముఖమున వానిచేఁ గలుగు నీకు
నిర్మలంబైన సత్కీర్తి నిషధరాజ. 25

టీ. కలియుగంబందును = కలియుగమందు, కాశ్మీరభూమిలోన్ = కాశ్మీరదేశములో, శేషాహియంశంబున = శేషాంశమున, మత్పీఠమునన్ = చింతామణిపీఠమున, ధరామరుఁడు = బ్రాహ్మణుఁడు, శ్రీహీరుఁడనఁగన్ = శ్రీహీరుఁడను పేర, పుట్టున్ = పుట్టఁగలఁడు, అతఁడు = శ్రీహీరుఁడు, చింతామణి మంత్రచింతనఫలంబుగన్ = చింతామణి మంత్రమును జపించినందులకు ఫలమగునట్లుగా, మామల్లదేవ్యాఖ్య = మామల్ల దేవియను పేరుగలది, ఐనతనభార్యయందున్ = అయినతన సతియందు, ఒక్కతనయున్ = ఒకకుమారుని, కాంచున్ - కనఁగలఁడు, అతనికిన్ = ఆబాలునకు, తాన్ = స్వయముగా, ఆకాశవాగ్దేవి = అశరీరవాణి, శ్రీహర్షుఁ డనియెడు చిహ్నంబున్ = శ్రీహర్షుఁడనెడి పేరును, కల్పించున్ = అనగా శ్రీహర్షుఁడని పేరుపెట్టును, వానికిన్ = ఆశ్రీహర్షునకు, ఈరేడువిద్యలు = శ్లో... "అంగాని వేదా శ్చత్వారో మీమాంసా న్యాయవి స్తరః। ధర్మశాస్త్రం పురాణంచవి-

ద్యాహ్యేతాశ్చతుర్దశ" అనునీపదునాలుగు విద్యలును, వచ్చియుండుక్, వాఁడు=శ్రీహర్షుఁడు, ఖండన కారుండు=ఖండన ఖండఖాద్యమనెడు ఖండన గ్రంథమును చేయువాఁడు, సుకవి=బాగుగాఁ గవిత్వముచెప్పఁగలవాఁడు, వాని చేక్ =అట్టి శ్రీహర్షునిచేత, కావ్యముఖముగక్ =కావ్యమార్గముగా, నీకుక్, నిర్మలంబు=నిష్కళంకంబు, ఐన సత్కీర్తి = ఐనట్టి మంచియశము, కలుగుక్ = కలుగఁగలదు, అనఁగాఁ జింతా మణిమంత్రఫలముఁ జెప్పవశముగాదనుట.

తా. ఓనలరాజా! కలియుగమందుఁ గాశ్మీరదేశములో చింతామణీ పీఠమునందు శేషాంశముచే శ్రీహీరుఁడను బ్రాహ్మణుఁడు పుట్టును. అతఁడు మామల్లదేవియను తనభార్యయందు శ్రీహర్షుఁడను తనయునిఁ గాంచును. ఆశ్రీహర్షుని చేఁ జేయఁబడిన కావ్యములచే నీకు మంచికీర్తి గలుగును.

క. నిను దమయంతిని ఋతుప
ర్ణునిఁ గర్కోటకుని నెవ్వరేరు దలంతురు మే
ల్కనునప్పు డుషఃకాలం
బున నృప కలికల్మషములు పొందవు వారిన్. 26

టీ. నృప=ఓనలరాజా, ఉషఃకాలంబునక్ = ప్రభాతసమయంబునందు, మేల్కనునప్పుడు=నిద్రనుండిలేచునపుడు, ఎవ్వరు, నినుక్=దమయంతిని, ఋతుపర్ణునిక్=ఋతుపర్ణుఁడను రాజర్షిని, కర్కోటకునిక్, తలంతురు=స్మరింతురో, వారిక్ =అట్టివారిని, కలికల్మషములు=కలికాలదోషంబులు, పొందవు=అంటవు.

తా. ఓనలరాజా! ప్రభాత సమయంబున నెవ్వరు నిన్నును, దమయంతిని, ఋతుపర్ణునిఁ, గర్కోటకుని స్మరింతురోవారికిఁ గలికాలదోషము లంటవు.

వ. హరియునుంబోలె గలికలుషహారి గుణసంకీర్తనుండవు పుణ్యశ్లోకుండవు నగుము పోయివచ్చెదను. పునర్దర్శనంబయ్యెడు నని పలికి యద్దేవి దమయంతిం జూచి దేవతలుం దానును మఱియును. 27

టీ. స్పష్టము.

సీ. సకలపుణ్యాంగనా ౯ జనశిరోమణి వైన
　　నీకుఁ బాతివ్రత్య ౯ నియతిఁ జేసి
సాధింప రానియా ౯ శాస్యంబు గలుగునే
　　యైనదేవతల మై ౯ నట్టిమాకు
ప్రత్యక్షమై మనో ౯ రథ మీక పోరాదు
　　మర్త్యుల కటుగాన ౯ మగువ వినుము
నీదుపాతివ్రత్య ౯ నియమంబునకుఁ దప్పు
　　ఖలుఁడు భస్మంబగుఁ ౯ గాత యపుడ
తే. కామరూపుల మగు మమ్ముఁ ౯ గాంచి నీవు
డెందమునఁ జాల నాశ్చర్య ౯ మంది తిపుడు
నిక్క మిది యాది గాఁగ నో ౯ నీరజాక్షి
కామరూపిణి వగుము మా ౯ కరుణఁ జేసి.　　　28

టీ. ఓనీరజాక్షి = పద్మములవంటి నేత్రములు గల ఓదమయంతీ, సకల... శిరోమణివి — సకల=సమస్తమయిన, పుణ్యాంగనాజన=పుణ్యస్త్రీజనమునకు, శిరోమణివి=శిరోభూషణమవు, ఐననీకు=ఐనట్టినీకు, పాతివ్రత్యనియతిన్ = పతివ్రతాధర్మనిష్ఠచేత, సాధింపరానియాశాస్యంబు=సంపాదింపఁదగని కోరిక, కలుగునే = ఉండునా? లేదనుట. ఐనన్ = ఐయినప్పటికిని, దేవతల మైనట్టిమాకు=దేవతలమైనమాకు, మర్త్యులకున్ = మానవులకు, ప్రత్యక్షమై= కనఁబడి, మనోరథము=కోర్కి, ఈక=ఇయ్యక, పోరాదు = పోఁగూడదు, అటుగాన=అట్లగుటచేత, మగువ=ఓదమయంతీ, వినుము. నీదు పాతివ్రత్య నియమంబునకున్=నీపాతివ్రత్యనియతికి, తప్పుఖలుఁడు=అతిక్రమించునీచుఁడు- అనఁగా నీపాతివ్రత్యమునకు భంగముగల్గించువాఁడు, అపుడ=తత్క్షణముననే, భస్మంబవుఁగాత=భస్మమగుఁగాక, ఇపుడు,నీవు, కామరూపులము=కోరినయా కారముగలవారము, అగుమమ్మున్=అగునట్టిమమ్ము, కాంచి=చూచి, డెందమునన్=మానసమందు, చాలన్=మిక్కిలిగా, ఆశ్చర్యము = అచ్చెరుపాటును,

అందితి=పొందితి, నిక్కము=నిజము, ఇదియాదిగాఁగన్ =ఇదిమొదలుగా, మా కరుణఁజేసి=మాదయచేత, కామరూపిణివి = నీకిష్టమగు రూపముకలదానవు, అగుము.

తా. ఓదమయంతీ! పుణ్యస్త్రీలలో వన్నెకెక్కు నీకు పాతివ్రత్యముచే నల పడనిది లేదు. దేవతలమైన మేము మానవులకుఁగనఁబడి వరములియ్యకపోరాదు. కావున నిన్నెదిరించుదుష్టుఁడు భస్మమగును. ఇంతియకాక మా కామరూపములఁ గాంచివెఱఁగుపడితివి గావున మాకృపచే నీకిచ్చవచ్చురూపము గలుగుచుండును.

వ. అనిపలికి పలుకుబోటియు హరికృపీటభవశమన శంబరపతు లంబరమునకు జాంబూనద విమానారూఢులై యెగసిరి సమ యసముత్థానంబునం గ్రందుకొను రాజనందనులయందియల లమొరపంబుతోడ గెడబెరసి దేవదుందుభిధ్వానంబు రోదసీకుహరంబునం దీటుకట్టె విద్యాధరహస్తముక్తంబైన పుష్పవర్షంబు హర్షోత్కర్షంబు నాపాదించె. అప్పుడు కల్యా ణవిభవలక్ష్మీప్రతిష్ఠాసమానుం డగునిషధరాజు నిజశిబిర ప్రతిష్ఠాసమానుండయ్యె దమయంతియుఁ గన్యాసహస్రంబు గొల్వ నాత్మ మందిరంబునకుం జనియె ననంతరంబ. 29

టీ. అని, పలికి, పలుకుబోటియు = సరస్వతియు, హరి...పతులు=హరి, ఇంద్రుఁడు, కృపీటభవ=అగ్నియు, శమన=యముఁడు, శంబరపతులు=వరుణుఁ డును, జాంబూనదవిమానారూఢులు = బంగారువిమానముల నెక్కినవారు, అయినవారై, అంబరంబునకున్ = ఆకసమునకు, ఎగసిరి=పోయిరి, దేవదుం దుభిధ్వానంబు=దేవదుందుభులమ్రోఁత, సమయసముత్థానంబునన్ =ఒక్కతటి లేచునెడ, క్రందుకొను=వ్యాపించునట్టి, రాజనందనుల యందియలమొరపంబు తోడన్ =రాజులయందెల చప్పుళ్లతో, గెడబెరసి=ఏకీభవించి, రోదసీకుహరం బున్ =భూనభోంతరాళంబును, దీటుకట్టెన్ =నిండించెను, విద్యాధరహస్తము క్తంబు=విద్యాధరులచే విడువఁబడినది, ఐనపుష్పవర్షంబు=ఐనట్టిపూవులవాన,

హర్షోత్కర్షంబు = మిక్కుటమగుసంతసమును, ఆపాదించెన్ = చేసెను, అప్పుడు=ఆసమయమున, కల్యాణ...మానసుండు—కల్యాణ=వివాహముయొక్క, విభవ=వైభవమనెడి, లక్ష్మీప్రతిష్ఠా=లక్ష్మియొక్క ప్రతిష్ఠచేత, అసమానుఁడు=సాటిలేనివాఁడు, అగునిషధరాజు=అయినట్టినలుఁడు, నిజశిబిరప్రతిష్ఠాసమానుఁడయ్యె—నిజశిబిర = తనదండు విడిసినచోట, ప్రతిష్ఠా=ఉనికిని, అసమానుండు = గోరువాఁడు, అయ్యెన్, అనఁగా నలుండును తనవిడిది కరుదేరఁగోరె ననిభావము. కన్యాసహస్రంబుగొల్వన్ = వేయిమందికన్యకలు గొలుచుచుండ, దమయంతియున్, ఆత్మమందిరంబునకున్=తనగృహమునకు,చనియెన్=పోయెను, అనంతరంబ=తరువాత.

మ. తమయంశంబగు మేదినీరమణునిన్ ధాత్రిన్ విసర్జించి యాయమవృత్రాశులు గడు విన్ననై చసిరి ముక్తాంశత్వఖేదంబునన్
మమతాసంపద యెట్టిదో యెడనెడన్ వక్రాననాంభోజయై
దమయంతిం గనుఁగొంచు నేఁగె వినతాంతర్వాణి శ్రీవాణియున్.

టీ. ఆయమవృత్రాశుల్=ఆయింద్రాగ్నియమవరుణులు, తమయంశంబు=అనగా. "అష్టాభిర్లోకపాలానాం మాత్రాభి నిర్మితోనృపః' అన్నట్లు లోకపాలురయంశమయిన, మేదినీరమణునిన్=నలుని, ధాత్రిన్=భూమియందు, విసర్జించి=విడిచి, ముక్తాంశత్వఖేదంబునన్=(దేహ)భాగమునువిడుచు దుఃఖముతో-ఒకయవయవమును గోసి విడిచి భూమిని వదలిపోయినంత దుఃఖముతో ననుట, కడున్=మిక్కిలి, విన్ననై=చిన్నతనముగలవారై, పోయిరి. అనఁగా వినతాంతర్వాణి-వినత=భక్తులైన, అంతర్వాణి=శాస్త్రజ్ఞులుగలదగు, శ్రీవాణియున్=సరస్వతియు, వక్రాననాంభోజయై-వక్ర=పెడకుఁద్రిప్పిన, ఆననాంభోజ=ముఖపద్మముకలది, ఐ=అయినదై, ఎడనెడన్=మాటిమాటికి, దమయంతిన్-కనుంగొనుచున్=చూచుచు, ఏగెన్, పోయెను. మమతాసంపద=తనవారనెడి యభిమానసంపద, ఎట్టిదో=ఎటువంటిదో గదా? అనఁగా సరస్వతి దమయంతితో నొకటిరెండుదినము లున్నంతమాత్రమున నామె తనదని విడిచి యతికష్టముతో

నేఁగెను. దమయంతియెడఁగల ప్రేమచే మాటికిమాటికి వెనుకఁ దిరిగిచూచుచు సరస్వతియు నేఁగెనని భావము.

తా. స్పష్టము.

ఉ. మంచకవాటికాశిబిరమధ్యమునందు ధనార్థికోటికిం
గాంచనవర్షముల్గురిసెఁ గంఠవిలోలమధూకమాలికో
దంచితుఁ డోషధీపతికులాగ్రణి వంది జనంబులో విశే
షించి విదర్భజాస్తవనశీలుర మిక్కిలి గారవించుచున్. 31

టీ. కంఠ...దంచితుఁడు-కంఠ = గళమందు, విలోల = చలించుచున్న, మధూకమాలికా=ఇప్పపూవులదండచే, ఉదంచితుఁడు = ప్రకాశించువాఁడు, ఓషధీపతికులాగ్రణి=చంద్రవంశరాజులలో నగ్రేసరుండగు నలరాజు, వందిజనంబులోన్ =కైవారముచేయువారిలో, విశేషించి=విస్తరించి, విదర్భజాస్తవనశీలురన్ =దమయంతిని స్తోత్రముచేయువారిని, మిక్కిలి = అధికముగా, గారవించుచున్ =బహుమానించుచు,అనఁగా నలుఁడు వందిమాగధులను గౌరవించెననియు, నందులో దమయంతిని నుతించువారి కధికముగా గారవము చేసెననియు భావము. దీనిచే నలునకుఁ దమయంతిపైఁగల ప్రేమాతిశయము వెలువడుచున్నది. మంచక...మధ్యమునందున్ =మంచకవాటికా, మంచెలున్నస్థలమందున్న, శిబిర=విడిపట్టుయొక్క, మధ్యమునందున్—ధనార్థికోటికిన్ =ధనమునుగోరుచున్న యాచకసమూహమునకు, కాంచనవర్షముల్ = బంగారువర్షములను, కురిసెన్ =కురిపించెను. అనఁగా యాచకుల కధికముగా ధనమొసంగెనని భావము.

తా. నలరాజు వందిజనమునకు బహుమానములుగావించి యందులో దమయంతిని నుతించినవారి కధికముగా బహుమతులొసంగి యాస్వయంవరస్థలమున నున్న శిబిరములను జుట్టికొనియున్న యాచకుల కధికముగా ధనమొసంగెను.

వ. అప్పుడు గొంద ఱసూయాపరాయణు లైనరాజు లారాజకుమారుంజూచి చూపోపక 'యత్యుచ్ఛ్రియః పతనహేతు'

వనెడువారు "నతిసర్వత్రగర్హిత" మ్మనెడువారును "కాముకస్యకుతోలజ్జా" యనువారును."సంగమోవిప్రయోగాంత" యనువారునై యుండి రప్పుడు. 32

టీ. అప్పుడు=దమయంతి నలునివరించినప్పుడును - దేవతలు నలదమయంతులకు వరములొసంగినప్పుడును, అసూయాపరాయణులు=పెఱవారిగుణములందు దోషారోపణముచేయ నాసక్తిగలవారు, ఐనరాజులు, కొందఱు, ఆరాచకుమారుక =ఆనలుని, చూడ, చూపోపక=చూడసహింపలేక, అనఁగా నలునకట్టియపూర్వగౌరవమును, దమయంతీప్రాప్తియుఁ గల్గినందులకు సహింపలేనివారనిభావము. అత్యుచ్ఛ్రయః=మిక్కిలిఉన్నతి,పతనహేతుః=పాటునకు మూలము అనెడువారునుజూచి సంపలేక తమమనంబును సమాధానపఱుచుకొనుటకు ఇంతశ్రేయస్సు గలవాఁడు తప్పక కష్టములు పాలుగాక మానఁడనియు, దమకట్టి కష్టపూర్వక మగుశ్రేయస్సు రాకపోవుటయే యుచితమనియు మనంబును సమాధానపఱుచుకొనుచున్నారు. "అతి ... వారును-అతి=మిక్కిలి, సర్వత్ర=ప్రతిదానియందును, గర్హితంబు=నింద్యము, అనెడివారును=అనిపల్కుచున్నవారును. అనఁగా నెందులోను నమితత్వముండఁగూడదని పెద్దలు చెప్పుచున్నారు. అట్టి యమితత్వదోషము గలగౌరవమం దున్నదనియు, దాదృశదోషయుతమగుశ్రేయస్సక్కఱలేదనియుఁ దలంచి యట్లు పలుకుచున్నారు. "కాముకస్య=కామాంధునకు, లజ్జ=సిగ్గు, కుతః=ఎక్కడిది. అనెడివారును, అనఁగా నారాజులు "ఛీ! ఈనలరాజు మిక్కిలి కాముకుఁడు. కాముకునకు సిగ్గుగల్గుట యరిదిగదా! అతఁడు కాముకుఁడే కాకపోయిన నింతమంది రాజలోకము చూచుచుండఁగా నొకయువతిచే దండవేయించుకొనునా? అని యుద్దేశించి నలునికంటెఁ దామే త్రపావంతులనియు యోగ్యులనియుఁ దలంచుకొనుచు నట్లుపల్కిరని భావము. సంగమోవిప్రయోగాంతః. సంగమః=కూడిక, లేక, పొందు,విప్రయోగాంతః=ఎడఁబాయుటఅంతమందుఁగలది,అనెడివారును. అనఁగా నారాజులు "ఈనలుఁడు దమయంతీసంగమము లభించినదని సంతసించుచున్నాఁడు కాని తరువాతి వమ్మువిరహబాధను ఎఱుంగకున్నాఁడు"దని

యు సంగమము వియోగముతోఁగూడివచ్చునని పెద్దలుచెప్పినవాక్యము నెఱుంగకున్నాఁడనియు, మొదట నట్టిసంతసముగల్గి తర్వాత వియోగదుఃఖమొందుటకంటె నాసంగమము లేకపోవుటయే యుచితమనియు, గాన నలునికంటెఁ దామే సుఖవంతులనియుఁ దలఁచుకొనుచున్నారని భావము. ఐ, యుండిరి. ఇట్టి యనిష్టవాక్యములను బల్కుచునుండిరి. అప్పుడు=ఆసమయమున అని పై పద్యముతో నన్వయము.

ఉ. నైషధుఁ డంతరంగమున నవ్వుచునుండు విరోధు లాడుదు
ర్భాషణముల్ వినిన్ విననిభంగి నదట్టిద విద్విషన్మృషా
దోషగుణాధిరోపణ మదోషతఁ దెల్పుచు నుండుఁగాన త
ద్దూషణమెప్డువిన్నఁబరితోషముఁ జెందుమనీషియాత్మలోన్.

టీ. నైషధుఁడు=నలుఁడు, విరోధులు, శత్రువులు=ఆడు దుర్భాషణముల్, పలుకునట్టు దుర్వాక్యములను, వినిన్ వినని భంగిన=వినియు వినని రీతిగనే, అంతరంగమునన్=చిత్తమందు, నవ్వుచుండున్=సంతసించుచుండును, అదిఅట్టిద=అట్టిదే,విద్వి...రోపణము-విద్విషత్=శత్రులయొక్క,మృషా=అసత్యమను,దోషగుణ=దుష్టగుణముయొక్క, అధిరోపణము=ఆరోపించుట, అదోషతన్=దోషము లేకపోవుటను, తెల్పుచునుండును=తేటపఱుచుచుండును, కాన=అట్లగుటచే, మనీషి = విద్వాంసుఁడు, తద్దూషణము = ఆదూషణమును, ఎప్డు, విన్నన్=ఏసమయమున విన్నప్పటికిని, ఆత్మలోన్, పరితోషము = సంతసము, పొందున్ = చెందుచుండును, అనఁగా విరోధులు తమయం దారోపించిన దోషములు తమ్ము నిర్దోషులని లోకమునకుఁ జాటుచుండును గాన పండితుఁడు దురాలాపముల విని సంతసించును గాని విచారింపఁడు.

తా. స్పష్టము—అలం. అర్థాంతరన్యాసము.

క. క్రించు లగురాజతనయులు
వంచింపక యాడుదురపవాదోక్తుల లోఁ

గొంచు నృపాలునిమ్రోలన
పంచమహాశబ్దములును బహుళము లయ్యెన్. 34

టీ. క్రించులు=అల్పులు,అగు రాజతనయులు=అయినరాజకుమారులు, వంచింపక=సంకోచములేక, అడుదురపవాదోక్తులన్=పలుకుచున్న దుష్టవాక్యములను, లోఁగొంచున్ = వినఁబడకుండఁజేయుచు, పంచమహాశబ్దములును = ఢక్కామృదంగాదులగు నైదు విధము లగుధ్వనులును, నృపాలునిమ్రోలన్ = నలరాజు నెదుట, బహుళములు, అయ్యెన్=మిక్కుటముగా వాయింపఁబడెను- అనఁగా శుభకార్యాదులందుఁ జెడువాక్యములు వినఁబడకుండుటకును, తుమ్ము మొదలగు నశుభసూచకధ్వనులు వినఁబడకుండుటకును మంగళవాద్యఘోషములను జేయించుచుందురు. అట్లె యిచ్చట నలరాజు శిబిరప్రవేశరూపశుభకార్యమునందును మంగళవాద్యములు వాయింపఁబడె. ఆధ్వనులు నీచులయిన రాజకుమారులు నలునిఁగూర్చి పలుకుచున్నయనిష్టవచనములు వినఁబడకుండ వ్యాపించెను.

తా. స్పష్టము.

వ. ఇవ్విధంబున నిషధరాజు శిబిరంబు ప్రవేశించె నట విదర్భమహీవల్లభుండు. 35

టీ. స్పష్టము.

సీ. కార్తాంతికులఁ బిల్చి కర్పూరసమ్మిశ్ర
తాంబూలదానపూర్వంబు గాఁగ
జాంబూనదాంబరప్రక్షంచనంబులఁ
బూజించి భూపాలపుంగవుండు
సర్వలక్షణకలాసంపూర్ణ మై యుద
యాస్తనిర్దోషమై యతిశయిల్లు
శోభనాంశము మీరు శోధించి చెప్పుఁడా
యని పల్కవారును నట్టిలగ్న

తే. మరసి చేపట్టి యాసన్న మయ్యె దేవ
శుభముహూర్తంబు కాలసంశుద్ధి లెస్స
పిలువఁ బంపుము వేవేగ పెండ్లికొడుకు
ననిన నట్టుల కాకంచు నాప్తజనుల. 36

టీ. భూపాలపుంగవుండు=విదర్భరాజు, కార్తాంతికులన్ = సిద్ధాంతులను, పిల్చి, కర్పూర...గాఁగన్-కర్పూర = పచ్చకప్పురముతో, సమ్మిశ్ర=కూడిన, తాంబూలదాన=తాంబూలమునిచ్చుట, పూర్వంబుగాఁగన్ =ముందు గలుగున ట్లుగా, జాంబూనద...బులన్ -జాంబూనద=బంగారముచేత, అంబర=వస్త్రి ములచేత, లేక బంగారుబట్టలచేతను, స్రక్ =పుష్పమాలికలచేత, చందనంబు లన్ =మంచిగంధముచేతను, పూజించి, అనఁగా ముందుగాఁ దాంబూలమి చ్చి పిమ్మట సువర్ణాది బహుమానముల నిచ్చి గౌరవించియని భావము. మీఁదు, స ర్వలక్షణకళాసంపూర్ణము, ఐ=సమస్తలక్షణసంపదలచే, సంపూర్ణమై=నిండిన దయి, ఉదయాస్తనిర్దోషమై=గురుశుక్రాది గ్రహములయుదయాస్తమయాదు లగు దోషములతో రహితమై, అతిశయిల్లుశోభనాంశము=ఒప్పుచున్న శుభము హూర్తమును, శోధించి=విమర్శనుచేసి, చెప్పుఁడా= తెలియఁజేయుఁడీ, అని, పల్కన్ =అని భీమరాజుపల్కఁగా, వారును=అజ్యౌతిషికులును, అట్టి లగ్న మున్ =అట్టి శుభముహూర్తమును, చేపట్టి = సంగ్రహించి, లేక, ఆలోచించి, దేవ=ఓవిదర్భరాజా, శుభముహూర్తంబు = వివాహలగ్నము, ఆసన్నము, అయ్యెన్ =మిక్కిలి సమీపించెను. కాలసంశుద్ధి=కాలపరిశుద్ధి, లెస్స=మిక్కిలి బాగున్నది. పెండ్లికొడుకున్ =పెండ్లికుమారుఁడగునలుని, వేవేగ, పిలువన్, అంపుఁడు. అనినన్ =అనిపల్కఁగా, అట్టులెకాక=అట్లేచేసెదమని, అంచున్, భీమరాజు, ఆప్తజనులన్ =తన స్నేహితుల నని పైపద్యముతో నన్వయము.

తా. భీమరాజు జ్యౌతిషుకులను బిలిపించి ముందుగాఁ గర్పూరపు తాంబూ లమిచ్చి, సువర్ణాంబరాదుల నొసంగి గౌరవించి యుదయాస్తమయాది దోష ములు లేక సమస్తశుభలక్షణ సంశోభితమగు శుభలగ్నంబును శోధించి చెప్పు వలయునని కోరెను. అంతవారొక శుభలగ్నము నాలోచించి భీమరాజుతో

దేవా! శుభముహూర్తదాపయినదనియు, ముహూర్త మన్నివిధముల చేతను యుక్తముగానున్నదనియుఁ బెండ్లికొడుకుఁ బిల్వఁబంపుఁడనియు చెప్పిరి. అంత భీమరాజు స్నేహితులనుఁ బంపి.

వ. అంతఁ గుమారునిం దోడ్తేర నియమించె నటమున్న కన్యాంతఃపురంబున. 37

టీ. స్పష్టము.

తే. కువలయాక్షులు ముత్యాలచవికలోనఁ
జలక మార్చిరి నిజకులాచారసరణిఁ
బసిఁడిపీఠంబునం దుంచి పద్మనయనఁ
జెలువ మగుగన్నెరాకమ్ము చేతి కిచ్చి. 38

టీ. కువలయాక్షులు=కలువలవంటి నేత్రములు గల స్త్రీలు, ముత్యాలచవికలోనన్ = ముత్యములమండపములో, పసిఁడిపీఠంబునన్=బంగారు పీఁటయందు, పద్మనయనన్=పద్మములవంటి నేత్రములు గల దమయంతిని, ఉంచి=కూర్చుండఁబెట్టి, చెలువము=అందమైనది, అగు, గన్నెరాకమ్ము=గన్నేరాకువంటియలుగుగల యొకబాణమును, చేతికిన్, ఇచ్చి, నిజకులాచారసరణిన్-నిజ=దమయంతియొక్క కులాచారసరణిన్=కులాచారప్రకారముగా, జలకమార్చిరి = స్నానముచేయించిరి-అనఁగా విదర్భవంశమునం దుదయించిన స్త్రీలకు మంగళస్నానములు చేయించునప్పుడు గన్నేరాకువంటి యలుగుగల బాణము చేతికిచ్చునాచారము కలదు. కాన చెలికత్తెలు దమయంతి కట్టికులాచారప్రకారమున స్నానముచేయించిరి. లేక మంగళస్నానము లాచరించునప్పుడు బాణముచేతి కిచ్చునాచారము సామాన్యముగా క్షత్రియులలో 'శరః క్షత్రియయా గ్రాహ్యః' అను వచనముచొప్పునఁ గలదు. అప్పుడు క్షత్రియకులాచారప్రకారముగా నని చెప్పవలయును.

తా. దాసీజనము ముత్యాలమండపములో బంగారు పీఁటపై దమయంతిని గూర్చుండఁబెట్టి గన్నెరాకువంటిబాణమును జేతికిచ్చి కులాచారప్రకారముగా స్నాన మాడించిరి.

తే. గంధజలపూరితంబు లై కమలముఖుల
కరములం దున్న మణిహేమకలశములకుఁ
జెలువ మగుభీమకన్యచన్నులకు నోడి
దాస్యమున నీళ్లుమోచుచందంబు గలిగె. 39

టీ. గంధజలపూరితంబులు - గంధజల=చందనపు నీటిచేత, పూరితంబులు=నిండింపఁబడినవి, ఐ=అగునట్టి లేక ఐన, కమలముఖుల=చెలికత్తియలయొక్క, కరములందు=హస్తములందు, ఉన్నమణిహేమకలశములకున్ = ఉన్నట్టిమణిమయములగు బంగారు గిండులకు, చెలువము = సొగసైనవి, అగుభీమకన్య=అయినట్టి దమయంతియొక్క, చన్నులకున్ = పాలిండ్లకు, ఓడి = వీగిపోయి, దాస్యమునన్=దాసవృత్తితో, నీళ్లుమోచుచందంబున్ = నీళ్లుమోచికొనురీతి, కలిగెన్=అబ్బెను. అనగా గంధజలములతో నిండియున్న బంగారుకలశములను దమయంతిచన్నుల కోడియే యీనీళ్లుమోచికొనఁగల్గె లేకున్న నీళ్లుమోవ నేల? అని కవి యుత్ప్రేక్షించినాఁడు.

తా. చెలులు పరిమళమిళితములగు జలములతో నిండినబంగారుకలశములఁ గొని దమయంతికి జలకమార్పవచ్చిరి. అలం. ఉత్ప్రేక్ష.

గీ. చెలువ వినివృత్తసలిలాభిషేచనయును
జంద్రికాపాండుపరిధానశాలినియును
నగుచు వర్షాశరత్తులయంతరమున
నొప్పుసంధ్యాధిదేవత కుద్ది యయ్యె. 40

టీ. చెలువ=దమయంతి, వినివృత్తసలిలాభిషేచనయును—వినివృత్త=నెఱవేర్పఁబడిన, సలిలాభిషేచనయును=జలస్నానము గలదియని దమయంతీ పరముగానర్థము—వర్షము కురియుటగలది యని సంధ్యాధిదేవతాపరము, చంద్రికా... శాలినియును-చంద్రికా=వెన్నెలవలె, పాండు=తెల్లని,పరిధాన=వస్త్రముచే, శాలినియును=ప్రకాశించునది యని దమయంతీపరముగా—వెన్నెలయనెడు తెల్లని వలువచే నొప్పుచున్నది యని సంధ్యాధిదేవతాపరముగా, అగుచు, వర్షాశరత్తుల

యంతరమునన్ =వర్షాకాల శరత్కాలములయొక్క మధ్యమందు,ఒప్పుసంధ్యాధిదేవతకున్ =ఒప్పుచున్న సంధ్యాకాలదేవతకు,ఉద్ది=సాటి,అయ్యెన్, అనఁగా వర్షాకాలము నీటిని వర్షించుచుండును.శరత్కాలము చంద్రకాంతులచే మిక్కిలి ప్రకాశించుచుండును. ఈవర్షా శరత్కాలములకు మధ్యమున నున్న దినముల యొక్క సంధ్యాకాలము వారిబిందుపూరితమును, చంద్రికావిరాజితము నై యుండును. స్నానముచేసి పరిశుభ్రవస్త్రమును ధరించిన దమయంతి వర్షాకాల శరత్కాల సంధ్యాధిదేవతవలె నుండె నని భావము.

తా. మంగళస్నానము చేసి చంద్రికవలెఁ బరిశుభ్ర మయినవస్త్రము ధరించిన దమయంతి వస్త్రపరిధానమునకుఁ బూర్వము వర్షాకాలసంధ్యాధిదేవతవలెను, దదనంతరము శరత్కాలసంధ్యాధిదేవతవలెను బ్రకాశించెను. అలం. ఉపమ.

క. సమధికచామర నిర్జయ
సముపార్జితవిమలకీర్తిశౌక్తికముక్తా
సముదయశంక ఘటించెం
గమలాననచికురవారికణకోరకముల్. 41

టీ. కమలానన చికురవారికణకోరకముల్-కమలానన=పద్మమువంటి ముఖముగలదమయంతియొక్క,చికుర=తలవెండ్రుకలందున్న, వారికణకోరకముల్ =పూమొగ్గలఁబోలు నుదకకణములు, సమధిక...శంకన్-సమధిక=అధికమగునట్టిదియు, చామరనిర్జయ=చామరముల జయించుటచేత, సముపార్జిత=సంపాదింపఁబడినదియునగు, విమల=నిష్కళంకమగు, కీర్తి=కీర్తియనెడు, శౌక్తిక ముక్తాసముదయ=ముత్యముల సమూహములనెడి, శంకన్=సందేహమును,ఘటించెన్=కూర్చెను. అనఁగా దమయంతికేశపాశమువలన జాఱు నుదకబిందువులు ముత్యములవలె నుండుటచే చామరములజయించి యాకేశపాశము సంపాదించిన ముక్తాఫలసముదయమువంటి కీర్తులే యివియని యుత్ప్రేక్షించె. అలం. రూపకాతిశయోక్తిమూల యగునుత్ప్రేక్ష.

క. నునుతాత మెఱుఁగువెట్టిన

కనకశలాకయునుబోలెఁ గన్నియ యొప్పెఁ
దను వగుతడి యొత్తుమణుం
గున నొయ్యన మేనితడి యిగుర్పఁగ నొత్తన్. 42

టీ. కన్నియ=దమయంతి, తనువు=సన్ననిది, అగుతడియొత్తు మణుంగునన్=అయినట్టి తడి యొత్తుకొనెడి వస్త్రముచే, ఒయ్యనన్=మెల్లఁగా, మేనితడి=శరీరమందున్నతడి, ఇగుర్పఁగన్=పోవునట్లుగా, ఒత్తన్=తుడువఁగా, నునుసానన్=నున్ననిశాణమునందు, మెఱుఁగువెట్టినకనకశలాకయునుబోలెన్ = సంఘర్షణచేసి పూర్వముకంటె నధికముగాఁ బ్రకాశించునట్లు మెఱుఁగుపెట్టిన బంగారుకణికవలె, ఒప్పెన్=ప్రకాశించెను. అనఁగా దమయంతి శరీరము బంగారుకణికవలెను, దడియొత్తుకొనువస్త్రము సానఱాతివలెను వెలయుచుండె నని యర్థము. శాణసంఘర్షణమువలన బంగారుకణికకుఁ గాంతి హెచ్చినట్లు తడియొత్తుకొనెడి వస్త్రపుసంఘర్షణముచే దమయంతిశరీర మధికముగాఁ బ్రకాశించెనని భావము.

తా. స్పష్టము. అలం. ఉపమ.

ఉ. వాసనఁ గేతకీదళముక్రంకఁ గళంకము లేని పైఁడి య
భ్యాసము చేసెనేని యగునప్డు సమానము గంధసారచ
ర్చాసురభీకృతం బగుచుఁ జారుతటిల్లతికామతల్లికా
భాసురవర్ణ మైననరపాలతనూభవదేహయష్టితోన్. 43

టీ. కళంకము=మాలిన్యము, లేనిపైఁడి=లేనట్టి బంగారము, కేతకీదళమువంకన్=మొగలిపూవునొద్ద, వాసన=పరిమళమును, అభ్యాసము=సంపాదించుటను, చేసెనేనియున్=చేసినయెడల, అప్డు, గంధసారచర్చాసురభీకృతంబు - గంధసార=మంచిగంధముయొక్క, చర్చా=పూఁతచేత, సురభీకృతంబగుచు=పరిమళింపఁబడుచు, చారుతటిల్లతికామతల్లికాభాసురవర్ణము-చారు=సుందరమైన, తటిల్లతికామతల్లికా=శ్రేష్ఠమైనతీఁగవంటిమెఱుపువలెను, భాసుర=ప్రకాశించు,వర్ణము=కాంతిగలది, ఐననరపాలతనూభవదేహయష్టితోన్=ఐనట్టి దమయంతియొ

క్క సన్ననగు దేహముతో - అనఁగా కృశాంగముతో, సమానము, అగును అభూతోపమ అలంకారము.

తా. పరిమళించుచుఁ బ్రకాశించుచున్నయా దమయంతిదేహమునకుఁ బరిమళము లేక ప్రకాశించు బంగారము మొగలిపువ్వు కడవాసన గడించికొనిన సాటి యగును.

వ. తదనంతరంబ కనకవేదికాంతరంబునం బసిండిపీఠమున నునిచి ప్రతిప్రతీకంబును బ్రతికర్మనిర్మాణకర్మఠం బైనసైరంధ్రికాజనం బప్పురంధ్రీరత్నంబుం బ్రయత్నంబున నలంకరింపం దొణంగె. అం దొకముద్దియ మదనాంధకారపటారంభణతంతుసంతతి యగుకుంతలమంజరికి నధివాసధూపధూమంబొసంగె. ఒక్కయలివేణి పెన్నెఱివేణిపై నెగయుచున్న ధూపధూమాంకురంబు గనుంగొని కుటిలకచచ్ఛటాభ్రాంతిఁ గొనగోళ్ల దువ్వంబోయినఁ జెలులు నవ్విరి. ఒక్కయిందువదన గళిందకన్యకాభంగభంగురంబైననెఱిదుఱుమునం జెంగలువలు దుఱిమె. ఒక్కకుటిలాలకి లలాటపట్టంబునం గేశాంబుదవిద్యుద్దండంబుగాఁ బసిండిపట్టంబు గట్టె. ఒక్కవరవర్ణిని చూర్ణాలకంబులనునీలకజ్జలంబులకు దీపజ్వాలంబుగా మనశ్శిలాచిత్రకంబు నొసల నస్తొత్తించె. ఒక్కతన్వంగి యనంగలీలావశంబున నపాంగప్రాంగణంబునకు నిగుడుకనీనికానీలమణులకుం గిరణకందళికలనుసందేహంబు నాపాదింపం జాలునట్లుగా నీలాంజనరేఖలు వాలారుంగలికికన్నులకొలుకులు వెడలందీర్చె. ఒక్కబోటి తాటంకమణిమహఃకలాపంబులను మరుపలాశకుసుమచాపంబులకుఁ దూపులుంబోలెనిందీవరావతంసంబులు చెవులం బొందుపఱిచె. ఒక్కవిలాసినినాసాతిలప్రసూనంబు నం

ప్రసూనశరగుళికాశరంబునుం బోని ముక్తాఫలకలాపంబుఁ దాపించె.ఒక్కనితంబిని యధరబింబంబున యావకంబమర్చె. ఒక్కకలకంఠకంఠికంఠకందలికయందుఁగంటసరిఁ దొడిగె. ఒక్కమెలనాగ వక్షోజభాగంబునం బద్మరాగపదకంబుఁ బదిలపఱిచె. ఒక్కలేమ హేమమయ వినూత్నరత్న మేఖలాదామంబు జఘనసీమంబునం గట్టె. ఒక్కపూఁబోణి పైఁడియందియలు చరణారవిందంబులందమర్చె.ఒక్కమత్తకాశిని యడుగు నెత్తమ్ములం గ్రొత్తలత్తుక హత్తించె.మఱియు సాంగోపాంగంబుగాఁ బ్రత్యంగంబునంగనలు ముత్యాలజల్లి చెండిరంపుఁ జేరుచుక్క,చిన్నిపూజేకులు, పాలికలు, మకరికాపత్రభంగంబులు హారంబులుం, గేయూరంబులుఁ, గంకణంబులు, మద్దియలు, వీరమద్దియలు, పాయపట్టంబు లాదిగాఁ గలయలంకారంబుల నలంకరించిరి. ఇవ్విభూషణంబులచేత, భాగ్యంబుచేత నీతియు, ధర్మంబుచేత విభూతియు, వితరణంబుచేత విఖ్యాతియుంబోలె, నన్నాతి యతిశయిల్లె నయ్యవసరంబున. 44

టీ. తదనంతరంబు+అ = మంగళస్నానముచేయించి తడియొత్తినపిమ్మట, కనకవేదికాంతరంబునన్ =బంగారుటరుఁగుయొక్క నడిమిభాగమున, ఉనిచి= దమయంతిని గూర్చుండఁబెట్టి, ప్రతిప్రతీకంబును = ప్రత్యవయవంబును, ప్రతికర్మ...కర్మఠంబు—ప్రతికర్మ=అలంకరించుటను, నిర్మాణ = చేయుటయందు, అనఁగా నలంకరించుటయందనుట, కర్మఠంబు= నేర్పు గలది, ఐన-సైరంధ్రికాజనంబు=అయినట్టిపరిచారికాజనము, అప్పురంధ్రీరత్నంబున్ = ఆదమయంతిని, ప్రయత్నంబునన్, అలంకరింపన్ తొడంగెన్ =అలంకరింపమొదలిడె. అందు= ఆయలంకరించుటలో, ఒకముద్దియ, మదన...తతి-మదనాంధకార=కామాంధకారమనెడి, పట=వస్త్రమును,ఆరంభణ= నేయుటకుఁదగిన,తంతు= దారములయొక్క, సంతతి=సమూహమయినది, అగుకుంతలమంజరికిన్ = అయినట్టి కేశ

పాశమునకు, అధివాసధూపధూమంబు = అధికపరిమళముగల గంధద్రవ్యధూప ములను, ఒసంగన్, ఒక్కయలివేణి, పెన్నెఱివేణిపై = పెద్దకేశపాశముపై, ఎగ యుచున్న ధూపధూమాంకురంబున్ = పైకిఁబోవుచున్నధూపపుఁబొగను, కనుం గొని, కుటిలకచచ్ఛటాభ్రాంతిన్ = వంకరవోయిన తలవెండ్రుకలసమూహ మను భ్రాంతితో, కొనగోళ్లన్, దువ్వన్, పోయినన్ = దువ్వయత్నింపఁగా, చెలు లు = అచ్చటి స్త్రీలు, నవ్విరి = దానిమూఢత్వమును జూచి నవ్వికొనిరి. ఒక్కయిం దువదన, కళింద...భంగురంబు - కళిందకన్యకా = యమునానదియొక్క, భంగ = తరంగములవలె, భంగురంబు = వక్రమయినది, ఐననెఱిదురమునన్, అయినట్టి మనోహరమగు కేశపాశమునందు, చెంగలువలు = చెంగల్వపూవులను, తుఱిమె = అలంకరించె. ఒక్కకుటిలాలక, లలాటపట్టంబునన్ = నుదుటియందు, కేశాంబుదవిద్యుద్దండంబుగాన్ = కేశములనెడి మేఘమునకు మెఱపుదీవియ య గునట్లుగా, పసిండిపట్టంబు = బంగారుతీగను, కట్టెన్, ఒక్కవరవర్ణిని, చూ ర్ణాలకంబులు = వక్రములగుముంగురులు, అను నీలకజ్జలంబులకు = అనెడి నల్లని కా టుకలకు, దీపజ్వాలంబుగా = దీపశిఖ యగునట్టుగా, మనశ్శిలాచిత్రకంబు = మణి సిల యనుద్రవ్యముతోనైన బొట్టును, నొసలన్ = ఫాలమునందు, హత్తించెన్ = చేర్చెను. అనఁగా స్త్రీలు కాటుక చేయుటకు దీపముపెట్టి దాని నినుపతీగ తో మూయుదురు. అట్లు చేసిన కొంతసేపటి కాదీపపుపొగ యాతీగనకం టుకొని కాటుక యగును. ఇక్కడ దమయంతి నుదుటఁబెట్టిన మనశ్శిలాసం బంధియగు నెఱ్ఱనిబొట్టు దీపజ్వాలవలెను, దమయంతి ముంగురులు పైతీగ నంటుకొనియున్న కాటుకవలెను బ్రకాశించుచుండెనని భావము. ఒక్కతన్వంగి, అనంగలీలావశంబునన్ = మన్మథవిలాసముల కధీనములగుటచే, అపాంగప్రాం గణంబులకున్ = కడకన్నులకు, నిగుడుకనీనికానీలమణులకున్ = ప్రసరించుచున్న నల్లగ్రుడ్లనెడి యింద్రనీలరత్నములకు, కిరణకందళికలు = కిరణాంకురములు, అనుసందేహంబు = అనునట్టిసంశయమును, ఆపాదింపన్ = చేయుటకు, చాలున్ అట్లుగాన్ = సమర్థములగునట్లుగా, నీలాంజనరేఖలు = నల్లనికాటుకగీతలు, వాలారుంగలికికన్నుఁగొలుకులు-వాలారున్ = వాడియైనట్టియు, కలికి = మనో

హారములైనవియు, నగుకన్నులకొలుకులు, వెడలఁ, తీర్చెఁ=దిద్దెను, అనఁగా నీలాంజనరేఖలు దమయంతికనీనికలనెడి యింద్రనీలమణులకాంతు లనెడి భ్రాంతిని గల్గించుచున్న వని భావము. ఒక్కబోటి, తాటంక...కలాపంబు- తాటంక=కర్ణభూషణములందున్న, మణి=రత్నములయొక్క, మహః=కాంతులయొక్క,కలాపంబు=సమూహము,అగుమరు పలాశకుసుమచాపంబునకుఁ= అయినట్టిమన్మథునియొక్క మోదుగుపూవనెడి చాపమునకు, తూపులంబోని= బాణములవలెనున్న, ఇందీవరావతంసంబులు = నల్లఁగలువలనెడి యలంకారంబులు, చెవులఁ, పొందుపఱిచెఁ, అనఁగా నొకచెలికత్తె దమయంతిచెవులందు రెండునల్లఁగలువపూవుల నుంపఁగా నవి యామబాణములవలె నొప్పుచున్నవని భావము. ఒక్కవిలాసిని, నాసాతిలప్రసూనంబునఁ = నువ్వుపువ్వవంటి నాసికయందు, ప్రసూనశరగుళికాశరంబును = మన్మథునియుండబాణమును, పోనిముక్తాఫలకలాపంబుఁ = పోలుచున్న ముత్యమనెడి యలంకారమును,తాపించెఁ = చేర్చెను. అనఁగా ముక్కునకు ముక్కఱ చేర్చెనని భావము. ఒక్కనితంబిని, అధరబింబంబునఁ =అధరోష్ఠమునందు, యావకంబుఁ=లత్తుకను, అమర్చెఁ = చేర్చెను, ఒక్కకలకంఠకంఠి, కంఠకందళికయందుఁ =మోమువలె మృదువయిన కంఠమందు, కంటసరిఁ = తొడిగెఁ - వేసెను, ఒక్కయెలనాగ, వక్షోజభాగంబునఁ = స్తనపార్శ్వములందు, పద్మరాగపదకంబుఁ = పద్మరాగమయమయినపతకమును, పదిలపఱిచెఁ = చేర్చెను, ఒక్కలేమ, హేమమయమేఖలాదామంబుఁ = స్వర్ణవికారమయిన మొలత్రాటిని, జఘనసీమంబునఁ = జఘనప్రదేశమున, కట్టెఁ, ఒక్కపూఁబోణి, పైఁడియందియలు = బంగారపుటందెలు, చరణారవిందంబులఁ = పాదపద్మములందు, అమర్చెఁ-ఒక్కమత్తకాశిని, అడుగుదమ్ముల=పాదపద్మములందు, క్రొత్తలత్తుక=నూతనమైన లత్తుకను, లేక పారాణిని, హత్తించెఁ, మఱియు, సాంగోపాంగంబుగాఁ =పూర్ణముగా, ప్రత్యంగంబులఁ = ప్రత్యవయవములందును, అంగనలు, ముత్యాలజల్లి =ముత్యాలకొప్పువల, చెందిరము= చేరుచుక్క=సిందూరపు పాపటబొట్టును, చిన్నిపూరేకులు=అనునట్టి యొక

యలంకారవిశేషము. బాలికలు = బొగడలు, లేక కమ్మలు, దుద్దులు మొదలగు
నవి. మకరికాపత్రభంగంబులు=మకరాకారము లగుపత్రరచనలు, హారంబులు,
కేయూరములు=బాహుపురులు, కంకణంబులు=కడియములు, మద్దియలు, వీర
మద్దియలు=కాలిబొటనవ్రేళ్లమట్టెలు, పాయపట్టంబులు=అందెలు, ఆదిగాన్=
మొదలగునవి, కలయలంకారములన్=కలయట్టియలంకారములచే, అలంకరిం
చిరి, ఇవ్విభూషణంబులచేతన్=ఈయలంకారములచే, అన్నాతి=ఆదమయం
తి, భాగ్యంబుచేతన్=ఐశ్వర్యముచే, నీతియు, ధర్మంబుచేతన్, భూతియు=
సంపదయు, వితరణంబుచేతన్=ఈవిచే, విఖ్యాతియుంబోలెన్=ప్రసిద్ధియువ
లె, అతిశయిల్లెన్=ప్రకాశించెను. అయ్యవసరంబునన్, అని పైపద్యముతో
నన్వయము.

ఉ. అంతర మెట్టిదో యని నిజాస్యముతోఁ బ్రతివెట్టి రోహిణీ
కాంతుఁ బరీక్ష సేయుటకుఁగా నటు పట్టినభంగి లీల న
య్యింతిధరించెభూషణము లెల్లవహించినయంతమీఁద శు
ద్ధాంతవధూటియొక్కతె ప్రియంబుననిచ్చినమించుటద్దమున్.

టీ. అయ్యింతి=ఆదమయంతి,భూషణములెల్లన్=అలంకారములన్నియు,
వహించినయంతమీఁదన్=ధరించినతరువాత, శుద్ధాంతవధూటి, ఒక్కతె=ఒక
యంతఃపురదాసి, ప్రియంబునన్ = వేడ్కతో, ఇచ్చిన, మించుటద్దమున్=
ప్రకాశించుచున్నయద్దమును, లీలన్=విలాసముతో, నిజాస్యముతోన్=తనవద
నముతో, రోహిణీకాంతున్=చంద్రుని, ప్రతివెట్టి = ప్రతినిధిగాఁజేసి, అంత
రము=తనవదనమునకును జంద్రునకునుగల తారతమ్యము, ఎట్టిదో= ఎటువంటి
దోయని, పరీక్ష చేయుటకుఁగాన్=పరీక్షించునిమిత్తము, అటుపట్టినభంగిన్=
ఆరీతిపట్టుకొన్నదేమోయనునట్లు, ధరించెన్, అనఁగా, దమయంతిచేతఁ బట్టిన
యద్దము-దమయంతి నిజవదనచంద్రముల తారతమ్యము చూచుటకయి తనచే
తితోఁబట్టుకొన్న చంద్రునివలెఁ బ్రకాశించుచున్నదని భావము. అలంకరించు
కొన్నపిమ్మట నద్దమునుచూచుకొనుట వాడుకయైయున్నది. ఆవాడుకచొప్పున
దమయంతి స్వీయాలంకారసౌందర్యము చూచుటకద్దముపట్టెనని ఫలితార్థము.

తా. ఆదమయంతి సమస్తాలంకరణములును ధరించుకొన్నపిమ్మటఁ దనయంతఃపురపరిచారిక వేడ్కతో నిచ్చిన మించుటద్దమును విలాసముతో ధరించె. అట్లుధరించినయద్దము దమయంతి తనవదనమునకుఁ జంద్రుండు సాటి యగునే మోయనియెంచి రెండింటి తారతమ్యమును బరీక్షింప నెంచి చేతితోఁబట్టుకొన్న చంద్రబింబమువలెఁ బ్రకాశించెను. అలం. ఉత్ప్రేక్ష.

తే. నవచతుర్విధశృంగార * మవధరించి
యమ్మహాదేవివిప్ర పుణ్యాంగనలకు
సకలపూజలు వేడ్కతో * సరగఁ జేసి
మోడ్పుఁగే లెత్తి ఫాలంబు * మోపి మ్రొక్కె. 46

టీ. అమ్మహాదేవి=ఆదమయంతి, నవ...శృంగారము-నవ=క్రొత్తగా, చతుర్విధ=నాల్గువిధములగు, శృంగారము=సౌందర్యమును, అవధరించి=స్వీకరించి, విప్రపుణ్యాంగనలకున్ = వృద్ధబ్రాహ్మణ స్త్రీలకు, సరగన్ = ఒప్పునట్లుగా, వేడ్కతోన్, సకలపూజలును = సమస్తమగుపూజలును, చేసి, మోడ్పుకేలు= అంజలిని, ఎత్తి, ఫాలంబున్=ఫాలతలమందు, మోపి=ఉంచి, మ్రొక్కెన్= నమస్కరించెను.

తా. ఇట్లు దమయంతి క్రొత్తగా నాల్గువిధములగు శృంగారమును స్వీకరించి పుణ్యురాండ్రగు విప్రస్త్రీలకు వేడ్కతో, నొప్పునట్లుగా, సమస్తవిధములగు పూజలను గావించి దోసిలిపట్టి నొసటఁ జేర్చి, నమస్కరించెను.

ఉ. అంతర మొప్ప శోభనస * మాగత బాంధవభూమిపాలశు
ద్ధాంతనితంబినీనివహ * మప్డు ప్రణామ మొనర్చె భీమభూ
కాంతునికూర్మి కన్యకకుఁ * గౌతుకభూషణభూషితాంగి క
త్యంతఝుణత్కృయారవణ * హాటకనూపుర పారిహార్యమై. 47

టీ. అప్డు = విప్రాంగనలకు నమస్కారము చేసి నిలిచినతరువాత, శోభన...నివహము-శోభన=వివాహమహోత్సవనిమిత్తము, సమాగత=వచ్చిన, బాంధవ=బంధువులయిన, భూమిపాల=రాజులయొక్క, శుద్ధాంతనితంబినీనివ

హము=అంతఃపుర స్త్రీసమూహము, అంతరము=సమయము, ఒప్పన్ =ఒప్పునట్లు, అత్యంత...హార్యమై, అత్యంత=మిక్కిలి, ఝుణత్క్రియా = ఝుణత్కారము చేత, రవణ= మొరయుచున్న, హాటక =కనకవికారమైన, నూపుర=అందెలును, పారిహార్యము ఐ=బంగారుసూడిగాజులునుగలవారై, అనఁగా నితరరాజస్త్రీలు దమయంతికి నమస్కరించుచున్నప్పుడు వారి నూపురములును, గాజులును మిక్కిలి ఝుణత్కారములఁ జేసెననిభావము. కౌతుక భూషణభూషితాంగికిన్ =మంగళార్థ మయినయలంకారములచే నలంకృతయగు శరీరము గల, భీమ భూకాంతుని కూర్మికన్యకున్ =దమయంతికి, ప్రణామము ఒనర్చెన్ =చేసెను.

తా. వివాహమహోత్సవమునకువచ్చినరాజస్త్రీలు సమయానుగుణముగా వచ్చి తమనూపురములును గాజులును ఝుణత్కారములను వెలువరించునట్లుగా నలంకృత యగుదమయంతికి మ్రొక్కిరి.

వ. అట కుమారుండును మంగళాభిషేకానంతరంబ యాకల్పక
 ల్పనాశిల్పపారగ లగుప్రౌఢాంగనాజనంబులవలన వివా
 హోచితం బగుశృంగారం బంగీకరించె నప్పుడు. 48

టీ. అట = శిబిరమందు, కుమారుండును=నలుఁడును, మంగళాభిషేకానం తరంబ=మంగళస్నానమైనతోడనే, ఆకల్పకల్పనాశిల్పపారగులు - ఆకల్ప= అలంకారముయొక్క, కల్పనాశిల్ప=కల్పనావ్యాపారముయొక్క, పారగలు= గట్టునొందినవారలు, అనఁగా ననేకరీతుల నలంకరింప నేర్తు రనుట. అగు ప్రౌఢాంగనాజనంబులవలన = అగునట్టి ప్రౌఢలగు స్త్రీలవలన, వివాహోచి తంబు, వివాహమునకుఁ దగినది, అగుశృంగారంబు=అగునట్టి యలంకారమును, అంగీకరించెన్ =కైకొనెను. అప్పుడు=ఆసమయమున, అని మీఁదిపద్యముతో నన్వయము. మంగళస్నాన మాచరించిన వెనుక నొక్కొకనిముసమున ననేకభం గుల బుద్ధిచాతురిచే నలంకరింపఁగలుగు ప్రౌఢాంగనలు వివాహమునకుఁ దగున లంకారముతో నలు నలంకరించి రని భావము.

తే. అభినవోచిత తాలవృంతానిలమున
 నల్లనల్లనఁ దడి యార్చి యతివ యొత్తు

ధారుణీనాయకుని కేశభారమునకు
నగరుధూపాధివాసనంబు నాచరించె. 49

టీ. అతివ యోర్తు=ఒకయంగన, అభినవోచిత తాలవృంతానిలమునన్-అభినవ=నూతనమై, ఉచిత=తగినట్టి, తాలవృంత=వీవనఅనఁగా, విసనకఱ్ఱయొక్క, అనిలమునన్ =గాలిచేత, అల్లనల్లనన్ =మెలమెల్లగా, తడిఆర్చి=పోఁగొట్టి, ధారుణీనాయకుని కేశభారమునకున్, ధారుణీనాయకుని=నలునియొక్క, కేశభారమునకు=కేశపాశమునకు, అగరుధూపాధివాసనంబు=అగరుధూపముచే వాసన పట్టించుటను, ఆచరించెన్ = చేసెను.

తా. ఒకచేడియ విసనకఱ్ఱయొక్కగాలిచేఁ దడి నింకించి నలుని కేశములకు నగరుధూప మొసంగెను.

ఉ. వెన్నెల కుప్పసం బిడినవింతవిలాసము వాసి కెక్కఁగాఁ
గిన్నరకంఠి యోర్తు మరుకీర్తియుఁ బోనిపటీరపంకము
న్విన్నను వొప్పఁగా నలఁదె నిద్దపుఁజాయమెఱుంగునం బదా
ర్వన్నెపసిండితోడ నొరవచ్చునృపాలునియంగకంబులన్. 50

టీ. కిన్నరకంఠి=కిన్నెర యనువాద్యవిశేషముయొక్క ధ్వనివంటిధ్వని గల్గినది, ఓర్తు=ఒక స్త్రీ, వెన్నెల...విలాసము—వెన్నెలకుప్పసంబు = వెన్నెలచొక్కా, ఇడినవింతవిలాసము = తొడిగినట్టి యద్భుతమైన యొఱపు, వాసికిన్ = ప్రసిద్ధికి, ఎక్కఁగాన్ =ప్రసిద్ధిచెందునట్లుగా,మరుకీర్తియున్ =మన్మథునికీర్తిని, పోని పటీరపంకమున్ =పోలుచున్న మంచి గంధపుబురదను, నిద్దపుఁజాయమెఱుంగునన్ = నున్ననిదేహవర్ణముయొక్క కాంతిచే, పదార్వన్నెపసిండితోడన్ =పదాఱువన్నె బంగారముతో, ఒరవచ్చు...యంగకంబునన్ = సాటిచెందిన నలరాజునవయవమునందు,విన్ననువు= నేర్పు, ఒప్పఁగాన్ = ఒప్పునట్లు, అలందెన్ =పూసెను. ఇట మంచిగంధమునకు వెన్నెలకుప్పసము విలాసముచెప్పుటవలన, పలుచనయు తెలుపును "మరుకీర్తిని" నను సామ్యమువలన నున్మాదకరత్వమును గలదని తెలియఁదగినది. అలం. ఉత్ప్రేక్ష. ఉపమ.

తా. కిన్నెరస్త్రోతవంటి కంఠధ్వని గల యొకయువతి, వెన్నెలచొక్కా తొడిగినట్లుగాఁ బలుచనై మన్మథునికీర్తివలె నలరుచున్న మంచిగంధమును కాంతియందుఁ బదాఱవన్నె బంగారమున కెనవచ్చుచున్న నలరాజుశరీర మున నేర్పు వెలయునట్లుగాఁ బూసెను.

చ. లలితకలాపకోమలకలాపకలాపకలాపలాపపే
శలమృదుకేశమంజరులు సన్నపుగోళ్లను జిక్కువాపి చెం
గలువలు జాజులుం గలయఁ గమ్మని పువ్వులసేసకొప్పుదా
పలి కొరుగంగఁ బెట్టె నొకభామిని నైషధభూమిభర్తకున్.

టీ. ఒకభామిని=ఒకస్త్రీ, నైషధభూమి భర్తకున్=నలరాజునకు, లలిత ...మంజరులు—లలిత=సుందరములయిన, కలాప=అలంకారములు గలవియు, కోమల = లేఁత్రాయము గల, కలాపకలాప = పింఛెలసమూహములయొక్క, కలా=పెంపును, అపలాప = నిరాకరించునట్టి, పేశల = మనోహరమైనవియు, మృదు = మెత్తనివియు, కేశమంజరులు = కేశములను, సన్నపుగోళ్లన్ = కొనగోళ్లతో, చిక్కు = మెలికలు, పాపి = తొలఁగించి, చెంగలువలు = ఎఱ్ఱఁగలువలును, జాజులు=జాజిపూవులు, కలయన్=కూడికొనఁగా, కమ్మనిపు వ్వులన్ = మిక్కిలి సువాసనగల పుష్పములచేత, దాపలికిన్ = ఎడమప్ర క్కకు,ఒరుగన్ కన్=ఒరుగునట్లుగా, సేసకొప్పు=సిగను, పెట్టెన్=అమర్చె ను. అనఁగాఁ బరిమళవంతంబులగు పువ్వులు ముడిఁచి సిగపెట్టెనని భావము.

తా. ఒకభామిని సుందరాలంకారములు గల్గి నెమిలిపింఛెముల నీసడింపఁజా లినదయి మనోహరమై, మృదులమైయున్న కేశపాశమును గొనగోళ్లతోఁ జిక్కుదీసి కలువలు, చెంగలువలు మొదలగు పరిమళవంతములగు పువ్వులు ము డిచి యెడమభాగమున కొరుగునట్లుగా సిగ నమర్చెను.

చ. రాజనిభాస్యయొూర్తు నవరత్నకిరీటము సంఘటించె ని
ర్వ్యాజమనోజ్ఞమైనమహీవల్లభుమూర్ధమునందు నప్పు డా

రా జనుకల్పశాఖికదికిరత్నమయం బగుపువ్వుగుత్తిపే
రోజ వహించి కన్నులకు కీనుత్సవముంబొనరించెనెంతయున్.

టీ. ఓర్తు=ఒక తెయయిన, రాజనిభాస్య = చంద్రునివంటిముఖము గల స్త్రీ, నిర్వ్యాజమనోజ్ఞము = నిష్కపట మగుసౌందర్యముగలది—అనఁగా సహజసౌందర్యముకలదనుట, ఐనమహీవల్లభు మూర్ధమునందున్ =అయినట్టి నలరాజు శిరస్సునందు, నవరత్నకిరీటము = క్రొత్తరత్నములతోఁ గూర్పఁబడినకిరీటము, సంఘటించెన్ =ఉంచెను. అప్పుడు=అట్లుంచినప్పుడు, అది = ఆరత్నకిరీటము, ఆరాజను కల్పశాఖికిన్ = ఆనలరాజనెడి కల్పవృక్షమునకు, రత్నమయంబు= రత్నవికారమైనది, అగుపువ్వు గుత్తిపేరోజన్ =అయినపుష్పగుచ్ఛ మనెడి గొప్పవిధమును, అనఁగాఁ బెద్దఖ్యాతిననుట,వహించి, కన్నులకున్, ఎంతయున్ = మిక్కిలి, ఉత్సవమున్ =ఆనందంబును, ఒనరించెను=చేసెను. సామాన్యవృక్షాదులు బాలపుష్పపల్లవాదియుక్త మగు గుత్తిని గనుచున్నవి. కల్పవృక్షము రత్నఫలములు గలదనుటచే రత్నమయమంజరి నీనుచున్నది. కాన నలుని శిరంబున నుంచినరత్నమయకిరీటము కల్పవృక్ష కుసుమమంజరివలె నున్న దని భావము. నలరాజు శిరంబుననున్న రత్నకిరీటకాంతులు మంజరిరూపముగా మీఁదికెగయుచున్న వని ఫలితార్థము.

తా. ఒక స్త్రీ సహజసౌందర్యము గల నలరాజుశిరంబున రత్నమయకిరీటంబు నుంపఁగా నది కల్పవృక్షమునుండి యుత్పన్నమగుచున్న రత్నపుష్పగుచ్ఛమువలెఁ బ్రకాశించి చూచువారికిఁ గనులపండువు లొనరించె. అలం. రూపకోత్థాపితము ఉత్ప్రేక్ష.

మ. పదియార్వన్నెపసిండిపట్ట మవనీశపాలావతంసంబు నె
న్నుదుటంగట్టెలతాంగియోర్తుకడపీశము లోఁక నేర్పొప్పఁగా
నది లీలాపరివేషచక్రవలయార్ధాకారతం బొందె న
ప్పదసీయానవచంద్రమండలముచంద్రాధిక్యముంబొందుటన్.

టీ. లతాంగి=లతవంటిశరీరము గల్గ, ఓర్తు=నేర్పు, ఒప్పఁగాన్ =పదియార్వ

న్నె పసిండి పట్టము=పదియాఱువన్నె బంగారుతోఁ జేయఁబడిన బిరుదము, అనఁగా వీరపురుషులు ధరింపఁదగినదియు, చెవులవెనుకభాగముదాఁక వ్యాపించునదియు నై నొసటఁ గట్టెడి బంగారు రేకును "పట్టము" అను పేరుతో వ్యవహరింతురు. కడవీనుల్=చెవులపశ్చాద్భాగములు, సోఁకన్=సోఁకునట్లుగా, అవనీ...నుదుటన్-అవనీపాలావతంసంబు=నలరాజుయొక్క, నెన్నుదుటన్=నిండయినఫాలమునందు, కట్టెన్=బంధించెను. అప్డు, అవనీయాననచంద్రమండలము = ఆనలరాజుయొక్క ముఖచంద్రమండలము, చంద్రాధిక్యమున్ = చంద్రునికంటె గొప్పదగుటను, పొందుటన్=పొందుటచే—అనఁగా నానలునివదనము చంద్రునికంటెఁ బెద్దదగుటచే నని భావము. అది=ఆకట్టినపట్టము, లీలా...కారమున్-లీలా=విలాసార్థ మగు, పరివేషచక్ర=సూర్యచంద్రాదుల కొకప్పుడు చుట్టును ఏర్పడుచుండు గుండ్రముగా గానవచ్చు తేజోవలయముయొక్క, అర్థాకారమున్=సగముభాగమును, పొందెన్. అనఁగా నలునివదనము చంద్రమండలముకంటె నధికమగుటచేఁ జంద్రునిచుట్టు నున్న పరివేష మతనివదనమును జుట్టివచ్చుటకుఁ జాలకయున్నట్టు లాపట్టమొప్పుచుండెనని భావము. ఆపట్టము నలవదనమునకుఁ బరివేషమువలె నున్నదనియు, నల్పమగు నాయలంకారము చుట్టివచ్చుటకుఁ జాలకపోవుటచే నుభైకదేశమగు ఫాలమందు మాత్రమే గానవచ్చుచున్న దనియు ఫలితార్థము. ముఖమునకుఁ జాలక సగమువఱకే చంద్రపరివేషము వచ్చినదో యనునట్లది చూపట్టెనని భావము.

తా. ఒక స్త్రీ చెవులకొనవఱకుఁ దాఁకునట్లు పసిఁడి పట్టమును నలరాజు ఫాలమునఁ గట్టఁగా నది చంద్రునికంటె గొప్ప దగునతనివదనమునకుఁ జాలకున్న యర్థచంద్రపరివేషమువలెఁ గానవచ్చెను. అలం. ఉత్ప్రేక్ష.

శా. భామాయోజిత కుండలాభరణము ల్గ్భానూవలంబంబులై
　భూమీవల్లభసూనుద్రేలు చెవులం దోలాడ్రె గండస్థలీ
　సీమాంతప్రతిబింబమండలయుగశ్రీసంవిభాగంబుతో
　గామస్యందన హేమచక్రయుగయుగ్మంబున్విడంబించుచున్.

టీ. భూమీ... చెవుల౯ — భూమీవల్లభసూను=నలరాజుయొక్క, వ్రేలుచెవుల౯=వ్రేలాడుచున్న చెవులందు, భామా... భరణముల్ — భామా=ఒక స్త్రీ చేత, యోజిత=కూర్పఁబడిన, కుండలాభరణముల్ = కుండలము లనెడియలంకారములు, భామావలంబంబులై=కాంతిసంపద కాస్పదములై, గండ... భాగంబులో౯ — గండస్థలీ=చెక్కిళ్లయొక్క, సీమాంత=ప్రాంతములందు, ప్రతిబింబమండలయుగ = మండలాకారముగానున్న ప్రతిబింబముల జతయొక్క, శ్రీ=శోభయొక్క, సంవిభాగంబులో౯=ఏర్పాటుతో, కామ... యుగ్మంబు౯ — కామస్యందన=మన్మథరథముయొక్క, హేమ = సువర్ణవికారమైన, చక్రయుగ్మంబు౯=నాల్గుచక్రములను, విడంబించుచు౯=అనుకరించుచు, పొల్పారె౯=ప్రకాశించెను. అనఁగా నలునిచెవులందున్న రెండుకుండలములును, నతని చెక్కిళ్లయందుఁ బ్రతిబింబించిన ప్రతిబింబములతో నాల్గయి మన్మథుని రథచక్రములను బోలుచున్న వని భావము. నలునిచెక్కుల నిద్దంపుజిగి యిట వ్యంజితము.

తా. నలరాజు వ్రేలాడుచెవులందుంచిన కుండలములు కాంతి సంపన్నములయి గండస్థలమందుఁ బ్రతిఫలించిన కుండలములతోఁ గూడ నాల్గయి మన్మథునిరథమున కమర్పఁబడిన నాల్గుచక్రములవలె నొప్పుచున్నవి. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. ఇందునిభాస్యయోర్తు గదిసి యించెఁ గుమారుని పేరురంబునం
గందక యాణిపాణియను గల్గినతోరపుఁ దారహారము౯
జిందిలిపాటులేక యదనీయముఖేందువినిర్గళత్సుధా
తుందిలబిందుబృందములతో యమఁగై కొనియుండెనో యనన్.

టీ. ఇందునిభాస్య=చంద్రునివంటిమోము గల, ఓర్తు, చిందిలిపాటు=వేగిరపాటు, లేక=లేకుండ, కందక=అలసటచెందక, అదనీయ... తోయము౯ — అదనీయ=అతనిదైన, ముఖేందు=ముఖచంద్రమండలమునుండి, వినిర్గళత్=జాఱుచున్న, సుధా=అమృతమయమైన, తుందిల=పెద్దవయిన, బిందుబృందముల=బిందుస

మూహముల, తోయమున్ =జలమును, కైకొని=స్వీకరించి, ఉండెనోయనన్ =
ఉన్న దేమోయన్నట్లు, ఆణిపాణియున్ =గుండ్రనయు నీరును, కల్గిన, తోరపు
తారహారమున్ =పెద్దముత్యాలహారమును, కుమారుని పేరురంబునన్ =నలరాజు
వక్షఃస్థలమున, కదియించెన్ =చేర్చెను. తారహారమునందున్న ముత్యాలద్రవము
నిట్లూహించుచున్నాఁడు. "నలరాజుహారము ముఖైకదేశమగు చుబుకమును
దాఁకును. అప్పు డాముఖచంద్రుని సంబంధు లగుసుధాబిందువులను గొనివచ్చెను.
కావున నే యిది ద్రవములోనొప్పుచున్నదని యుత్ప్రేక్షించుచున్నాఁడు.ఇందు
'అవనీయ' అనుటకు 'ఎడసేయు' నని ముద్రితగ్రంథము లందలి పాఠము. అది
మూలానుసారము గాదు.

తా. ఒకచెలువ పెద్దది యగునొక తారహారము నలుని ముఖచంద్రునిసంబంధి
యగు నమృతబిందువులను గైకొనివచ్చెనేమో యనునట్లు ద్రవముతోఁ
గూడినదానిని నలనివెడందవక్షమునఁ జేర్చెను. అలం. ఉత్ప్రేక్ష.

గీ. తరుణసైరంధ్రికా ప్రయత్నమునఁ జేసి
యతనిఁవ్రేళ్లు సముద్రంబు లయ్యె నపుడు
ఘనసమూహంబు కమలాభికాంక్షఁ జేసి
తద్వితీర్ణికిఁ జను టన్వితంబు గాఁగ. 56

టీ. ఘనసమూహంబు = పెద్దలయొక్కసమూహము, అనఁగా యాచక
సమూహ మను రెండవపక్షమున మేఘసమూహమనియు కమలాభికాంక్షన్ =
లక్ష్మియందలికోర్కి చే, అనఁగా ధనాభిలాషచేనని భావము. రెండవపక్షమున,
కమలాభికాంక్షన్ చేసిలనీటియందలికోర్కిచే; తద్వితీర్ణికిన్ = ఆనలరాజు
వితరణగుణమునకు, రెండవపక్షమున, ఆసముద్రునివితరణగుణమునకు, చనుట=
పోవుట, అన్వితంబుగాఁగన్ = సమన్వయమగునట్లుగా, అతనిఁవ్రేళ్లు=ఆనలుని
చేతివ్రేళ్లు, తరుణ... చేసి — తరుణ = మధ్యవయస్సులోనున్న, సైరంధ్రికా
= అలంకరించెడి స్త్రీయొక్క, ప్రయత్నమునన్ చేసి= యత్నమునుబట్టి,
సముద్రంబులు=ముద్రతోఁగూడినవి, అపుడు=ఆ యలంకరించెడి సమయమునఁ

అయ్యెన్, రెండవపక్షమున సాగరములయ్యెనని భావము. అనఁగా ఘనసమూహము కమలాభిలాషచే సముద్రమును సమీపించుచున్నట్లు నలుని వితరణగుణమును విని ఘనసమూహము కమలాభిలాషచే నలునిచెంతకు వచ్చుచుండిరి. కాన యతనివ్రేళ్లు సముద్రములగుట యుక్తమె. వితరణగుణమందుఁ బ్రసిద్ధములగు నతనిచేతివ్రేళ్ల కుంగరంబులు వెట్టిరని ఫలితార్థము.

తా. స్పష్టము.

క. అలవఱిచె నృపతికరముల
నలికుంతల యొకతె కంకణాభరణంబుల్
నలహస్తకల్పకములకు
వలయము లవియాలవాలవలయము లయ్యెన్. 57

టీ. అలికుంతల=తుమ్మెదలవంటి కేశపాశము గల, ఒకతె = ఒకయంగన, నృపతికరములన్ = నలునిచేతులయందు, కంకణాభరణంబుల్ = కంకణములనెడి, యాభరణవిశేషములు, అలవఱిచెన్=పొందించెను - అనఁగా నలంకరించె ననుట. నలహస్తకల్పకములకున్ - నల=నలునియొక్క, హస్త = చేతులనెడి, కల్పకములకున్=కల్పవృక్షములకు, వలయములు, అవి=ఆకడియములు, ఆలవాలవలయములు = వ్రట్టుపపాదులు - అయ్యెన్=అనఁగా దానమిచ్చుటలోఁ గల్పవృక్షములవలెనున్న యీతనిచేతికి నకి యలంకరించిన వలయములు పాదులవలె నొప్పుచుండె నని భావము. అలం. రూపకోత్థాపితగమ్యోత్ప్రేక్ష.

తా. ఒకకాంత నలునిచేతులకుఁ గంకణముల నలంకరించెను. అప్పుడా హస్తములు పాదులతోఁ గూడినకల్పవృక్షమువలెఁ బ్రకాశించెను.

మ. భుజదండంబున నొక్కభామదొడిగెన్ భూభర్తకున్బాహురిది
గ్విజయారంభ విజృంభణార్జితమహాకీర్తిప్రతాపప్రభా
వ్రజశంకావహనూత్నవజ్రమణిరుగ్వ్యాపారదుర్వారమున్
త్రిజగల్లోచనపర్వదానకలనాధీరంబుఁ గేయూరమున్. 58

టీ. ఒక్కభామ=ఒకయంగన, భూభర్తకున్ = నలునకు, భుజదండంబు

నక్ = దండమువంటి భుజమందు, భూరి...దుర్వారముక్ - భూరి=విస్తారమగు, దిగ్విజయ=దిక్కులజయించుటయొక్క, ఆరంభవిజృంభణ=ప్రారంభాతిశయమందు, ఆర్జిత=సంపాదింపఁబడిన,మహాత్ =గొప్పదియగు, కీర్తిప్రతాప=కీర్తియొక్కయు ప్రతాపముయొక్కయు, ప్రభావ్రజ=కాంతిసమూహమనెడి, శంకావహ=భ్రాంతిని కలిగించుచున్న,నూత్న=క్రొత్తదియగు, వజ్రమణిరుక్-వజ్ర=వజ్రములయొక్కయు, మణి=పద్మరాగమాణిక్యములయొక్కయు, రుక్ = కాంతియొక్క, వ్యాపార=ప్రవర్తనచే,దుర్వారము=నిరతిశయమైనది.అనఁగా ప్రకాశముకలదనుట-వజ్రకాంతులు తెల్లగానుండుటచేతను, పద్మరాగకాంతులెఱ్ఱగానుండుటచేతను దత్సామ్యములగు కీర్తిప్రతాపములను శంక గలుగుచుండెనని భావము. వజ్రప్రభ కీర్తివలెను పద్మరాగప్రభ ప్రతాపమువలె నుండె ననుట. త్రిజగ...ధీరంబుక్-త్రిజగత్ =మూఁడులోకములయందుండు జనులయొక్క, లోచన= నేత్రములకు, పర్వ=ఉత్సవముయొక్క, దానకలనా=ఇచ్చుటయందు, ధీరంబుక్ =తగినదియునగు, కేయూరముక్ =బాహుపురిని, తొడిగెక్, అలం. యథాసంఖ్యము, భ్రాంతిమంతము.

తా. ఒకభామ నలుని చేతికి, దిగ్విజయారంభమందే సంపాదింపఁబడిన కీర్తిప్రతాపము లనునట్టిభ్రాంతినిఁబుట్టించు వజ్రమాణిక్యకాంతులు గలదియు, మూఁడుజగములలో నుండుజనుల కానందమిచ్చునట్టిదియు నగుబాహుపురిని గట్టె.

వ. ఇట్లు శృంగారం బంగీకరించి. 59

ఉ. ఔచితి గావున న్నిలువుటద్దమునందు నిజాస్యబింబముక్
జూచెనె కాని మున్న యతిశోభనరూపవిలాసపుష్పనా
రాచుఁడు రా జలంకృతివిశేషమునందు నిజాభిరమ్యతక్
జూచినవాఁడు భూషణవిశుద్ధమహామణిమండలంబునన్. 60

టీ. అతిశోభన...నారాచుఁడు - అతిశోభన=మిక్కిలి ప్రకాశించునట్టి, రూపవిలాస-రూప=రూపమందును, విలాస=కాంతియందును, పుష్పనారాచుఁడు=మన్మథుఁడగు, రాజు=నలుఁడు, నిజాస్యబింబముక్ = తనముఖమును,

నిలువుటద్దమునందున్, ఔచితిగావునన్=ధర్మముగావున, అనఁగా ఆచార మనుట, చూచెనె కాని=చూచినాఁడే కాని, మున్న=ఇంతకుమునుందే, అలంకృతి విరామమునందు=అలంకారముతీరినపుడు, భూషణ... మండలంబునన్, భూష ణ=అలంకారములయొక్క, విశుద్ధ=శుభ్రమగు, మహామణి = గొప్పమణుల యొక్క, మండలంబునన్=సమూహమందే, నిజాభిరమ్యతన్=తనసౌందర్య మును, చూచినవాఁడు=చూచియేయుండెను. అనఁగా ఆచారము గనుక అద్ద మునఁ దనమోముమాత్రము చూచెనుగాని, ఇంతకుమున్ను తన్నలంకరించినపుడే తనసౌందర్యమును భూషణములయందుండు మణిసంతతులలోఁ జూచె నని భావము. ఈచెప్పుటచే నలునియలంకారము లమితము లగురత్నములను దాల్చె నని తెల్లమగుచున్నది. అలం. సమాధి.

తా. స్పష్టము.

తే. రాజు దొడిగినదివ్యాభరణచయంబు
నెల్లవారును రతిఁ జూచు టేమి చెప్ప
నొరిమ నొండొంటిఁ జూచు నాభరణములును
విమలహరినీలమణివిభావీక్షణముల. 61

టీ. రాజు=నలరాజు, తొడిగిన, దివ్యాభరణచయంబున్=మనోహరములగు నాభరణసమూహమును, ఎల్లవారున్=అందఱును, రతిన్=ప్రీతితో, చూచుట, ఏమిచెప్పన్=అందఱును నలరాజునలంకారముల జూచుచున్నా రని చెప్పుట యొకవింత కాదని భావము. ఆభరణములును=నలరాజుదాల్చినయలంకారములు గూడ, ఒరిమన్=అనుకూల్యముతో, ఒండొంటిన్=ఒకదానినొకటి, విమల... వీక్షణములన్-విమల=నిర్మలములయిన, హరినీలమణివిభా = ఇంద్రనీల మణుల కాంతులనెడి, వీక్షణములన్=చూపులచే, చూచున్ = చూచుకొనుచున్నది. అనఁగా నామాభరణములే యొండొంటియొక్కయందమును, నింద్రనీలకాంతు లనెడి చూపులతోఁ జూచుకొనుచుండెననిభావము. అచేతనములగు వస్తువులే తమ యొండొంటిశోభను జూచుచున్నప్పుడు తక్కిన జనములు వానిని జూతు రని వేఱె చెప్పవలయునా?

తా. నలరాజు దాల్చినయలంకారములు తమయందలి యింద్రనీలముల కాంతు లొండొంటిపై నొలయఁగా నల్లనిచూడ్కులతోఁ బరస్పరశోభను వీక్షించు చున్నవని పైచెప్పవలసియున్నప్పుడు తక్కినవారు చూచుట యొక వింతయా. అలం=అర్థాపత్తి.

వ. అనంతరంబ వార్ష్ణేయనియాత్మకం బైనరథం బెక్కి యమ్మహారథుండు జిష్ణుండును, గిరీటియు, విజయుండును, నగుటం జేసి ధనంజయుం డనం బొలిచి, రాజమార్గంబునఁ జనునప్పుడు పౌరాంగనలయందు. 62

టీ. ఇట నలపరముగను నర్జునపరముగను నర్థద్వయము- అనంతరంబుల=ఇట్లలంకరించుట పూర్ణ మైనపిమ్మట, వార్ష్ణేయనియంతృకంబు= వార్ష్ణేయుఁడను పేరుగలసారథినడుపుచున్నది, కృష్ణుఁడు నడుపుచున్నదని యర్జునపక్షమునఁ జూచికోవలయును, ఐనరథంబు, అమ్మహారథుండు=ఆనలరాజు, జిష్ణుండును=జయస్వభావముగలవాఁడును, కిరీటియు=కిరీటముగలవాఁడును, విజయుండును = విశేషించి జయము గలవాఁడును, అర్జునపక్షమున "జిష్ణుఁడు, కిరీటి, విజయుఁడు" అనునామము లర్జునునకు సుప్రసిద్ధములై నవి. అగుటంజేసి=అయియుండుటంబట్టి, ధనంజయుండు అనఁన్ పొలిచి=అర్జునుండన నొప్పి, రాజమార్గంబునన్ = రాజవీథినుండి, చనునప్పుడు=పోవుచున్నపుడు, పౌరాంగనలయందు=పురస్త్రీలయందు,అని పై పద్యముతో నన్వయము.

సీ. తమ్ములము సేయుచో నొక్క కతలిరుఁబోణి
రాకుమారునిఁ జూచుపరాకుకతన
మడిచి తాంబూలపత్రంబు గా మాఱుగాఁగఁ
గఱచెఁ గెంగేలినడి కేలి కమలదలము. 63

టీ. ఒకతలిరుఁబోణి=ఒకకాంత, రాకుమారునిన్ =నలుని, చూచుపరాకుకతనన్ = చూచుటవలనఁగల్గిన పారవశ్యముచే, తమ్ములముసేయుచోన్ = తాంబూలము చేసికొనుచున్నప్పుడు, తాంబూలపత్రంబు మాఱుగాఁగన్ =

తములపాకసకమాఱుగా, కెంగేలినడి = కెంపువంటియతిచేతిలోనున్న, కేలికమల=విలాసపద్మముయొక్క, దలము= ఆకును, మడిచి, కఱచెను=కొఱికెను. నలదర్శనముచే మన్మథవికశరాలయి తాంబూలపత్రమునకు బదులుగాఁ గమలదళమునిన నారంభించెను. ఈచెప్పుటచే దానికి నలునియం దుదయించిన రతిశయానురాగము స్పష్టమగుచున్నది.

మ. జవరా లొర్తు ప్రియోపనాయక భుజాసంశ్లేషలీలాసుఖ
వ్యవసాయంబుసమాజసంకటమునం బ్రార్థించికైకొంచుభూ
ధవదేవేంద్రునిఁ జూచె హేమకలశద్వైరాజ్యసంపత్తివై
భవశుంభత్కుచకుంభపీఠిఁ బులకప్రారంభ మేపారఁగన్.

టీ. జవరాలు ఓర్తు=ఒకయువతి, సమాజసంకటమునన్=జనసమూహముయొక్క సమ్మర్దమునందు, ప్రియో...వ్యవసాయంబున్=ప్రియ-ఇష్టుఁడయిన, ఉపనాయక=జారునియొక్క, భుజా=బాహువును, సంశ్లేషలీలా=కౌఁగిలించుకొనుటయనెడి విలాసమువలనఁగల్గిన, సుఖవ్యవసాయంబున్ = సుఖవ్యాపారమును, ప్రార్థించి=యాచించి, కైకొంచు = స్వీకరించుచు, హేమ... పీఠిన్ - హేమకలశ=బంగారుకుండలయొక్క—కుండలమీఁదఁగల, ద్వైరాజ్య=ఎదిరిరాజు తనముయొక్క, సంపత్తివైభవ = సంపత్సమృద్ధిచే, శుంభత్ = ప్రకాశించుచున్న, కుచకుంభపీఠిన్ = స్తనములయొక్క ప్రదేశమందు, అనఁగా రెండు బంగారుకడలతో ప్రతిభటించు చెలువుచేఁ బ్రకాశించు చున్నవనుట - ఆకలశముల మించుచున్నవని భావము. పులకప్రారంభము = గగురుపాటు, ఏపారఁగన్=వర్ధిలునట్లుగా,భూధవదేవేంద్రునిన్=నలుని, చూచెన్=కనుఁగొనెను. కామశాస్త్రప్రకారమున వివాహాదులు జారులకు సమయముగాన యొకస్త్రీ తనప్రియునిఁజూచి యాజనసమ్మర్దమును దానుసహింపలేనట్లును, దనకు సాయముగా వానిభుజదండమును గౌఁగిలించుకొని సుఖము ననుభవించుచుఁ గుచపార్శ్వములందు రోమాంచము గలది యాయెనని భావము.

తా. ఒకయువతి యాజనసమ్మర్దమునందుఁ దనప్రియునిఁజూచి జనసమ్మర్దముచేత నలఁగుచున్న తన్నుఁ దప్పింపవలయునని కోరుచున్నట్లు నటించి వాని

భుజమును గౌఁగిలించుకొని సుఖమనుభవించుచుఁ గావుననే రోమాంచముగల దయి నలునిఁ జూచెను.

తే. ఒక్కతరళాక్షి యప్సరోయువతి వోలెఁ
జూచెఁ గనుఱెప్ప వెట్టక రాచవారి
రాజసంబున నలరాచరాచవారు
తేఁటిఱెక్కలగఱియమ్ముఁ దీడుకొనఁగ.　　　65

టీ. ఒక్కతరళాక్షి=చంచల నేత్రములుగల స్త్రీ యొకతె, రాచవారిన్ = నలరాజును, కనుఱెప్పవెట్టక = కనుఱెప్ప వేయకుండ, నలరాచ...యమ్మున్ - నలరాచరాచవారు=మన్మథుఁడనెడిరాజు, రాజసంబునన్ =రజోగుణమువలనఁ గల్గినదానిచే-అనఁగా గర్వముచే ననుట, తేఁటిఱెక్కలగఱియమ్మున్ =తుమ్మెద ఱెక్కలే పక్షములుగాఁ గలబాణమును, తీడుకొనఁగన్ =పదనుపెట్టునట్లుగా, అప్సరోయువతివోలెన్ =అప్సరః స్త్రీవలె, చూచెన్ =కనుఁగొనెను. అనఁగా నొక స్త్రీయచ్చరవలె నిర్నిమేషలోచనయై నలరాజు నతిశయముతోఁ జూచె ను. అప్పుడు ఱెప్పపాటులేని యామెచూపులు తుమ్మెదఱెక్కలుగట్టిన మన్మ థునిబాణములవలె నున్నవని భావము. ఇక్కడ నా స్త్రీచూపు మదనబాణ మువలెను, నామెకనుఱెప్పలు తుమ్మెదఱెక్కలవలెను నున్నవని తెలియునది. 'రాజసము' నలునివలె మన్మథుఁడును రాచవాఁడు; గాన ఆరాచవానిని మెచ్చి నందులకు ఈరాచవానికి రాజసము.

తా. ఒక చంచలాక్షి యచ్చరవలె నిర్నిమేషయై తననేత్రములు తుమ్మెద ఱెక్కలు కట్టఁబడిన మదనబాణముల సరిపోలఁ దదేకదృష్టితో నలరాజును జూచెను. అలం. ఉపమ. ఉత్ప్రేక్ష.

గీ. ఎల్లచిగురాకుఁబోండ్లకు నెంత వేడ్క
యంత వేడుక దనలోన నతిశయిల్ల
నొక్కగుబ్బలకొమరాలు చక్క వచ్చి
కనియె నొడలెల్లఁ గన్నులై మనుజవిభుని.　　　66

టీ. ఒక్కగుబ్బలకొమరాలు=గొప్ప స్తనములు గలయొకయువతి, ఎల్లచిగురాకుఁబోండ్లకున్=ఆపురములోనున్న సకల స్త్రీలకును, ఎంతవేడ్క=ఎంతకౌతూహలమో, అంతవేడుక=అంతకౌతూహలము, తనలోనన్=తనమనసులో, అతిశయిల్లన్=వృద్ధిపొందఁగా, అనఁగా నలరాజును జూడవలె నన్నయుత్కంఠ యాపురస్త్రీలకందఱకు నెంతగలదో యంతయుత్కంఠ తనమనస్సున వర్ధిల్లుచుండఁగా నని భావము. చక్కన్, వచ్చి, ఒడలెల్లన్=శరీరమందంతటను, కన్నులై=కన్నులుగలదై, మనుజవిభుని=నలరాజును, కనియెన్=చూచెను, శరీరమందొక్కొకభాగమును నేత్రముగాఁ గల్పించుకొనిచూచెనని చెప్పుటచే నాస్త్రీలలామ దర్శనౌత్సుక్యము మిక్కుటముగా గలదని తెలియవచ్చుచున్నది. అన్నిచిగురాకుబోరడ్లకుఁ గల యంతవేడుకయుఁ గలది గాన వారికిఁగలయన్నికన్నులును దానొక్కతియే యొడలందెల్లఁ గలిగి చూచెనని చమత్కారము.

తా. ఒకయువతి పురమునంగల స్త్రీలకెంతవేడుక యుండునో యంతవేడుకతో వచ్చి వారందఱ కెన్నికన్నులతో యన్నికన్నులతోఁ జూచునట్లునలరాజునధికాసక్తితోఁ జూచెను. అలం. అతిశయోక్తి.

మ. జిలుఁగుంబయ్యెదజీరువాఱియెడలన్ శృంగారపత్త్రాంకురం
 బులతో నొక్కచకోరలోచనకుచంబుల్ పూర్ణకల్యాణమం
 గళకుంభంబులునూత్నపల్లవవిభంగశ్రీసమేతంబులై
 నలలిం జెన్నెసలారె నైషధమహీనాథావలోకంబునన్. 67

టీ. నైషధమహీనాథావలోకంబునన్=నలమహారాజును జూచుటయందు-అనఁగా నలరాజును జూచుటకుఁ ద్వరగాఁ బోవుసమయమున నని యర్థము, జిలుఁగుంబయ్యెద=సన్ననిపైఁటకొంగు, జీరువాఱి=జాఱి,ఎడలన్=తొలఁగిపోఁగా, ఒక్కచకోరలోచనకుచంబుల్ = చకోరమువంటి నేత్రములుగలయొకస్త్రీయొక్క స్తనములు, శృంగారపత్త్రాంకురంబులతోన్=ఆ స్తనములందు రచింపఁబడియున్న మకరికాపత్త్రములచే, పూర్ణకల్యాణమంగళకుంభంబులు-పూర్ణ=నిండయిన, కల్యాణ=వివాహాదిమహోత్సవమందలి, మంగళకుంభంబులు=మంగళావహములగు కుంభంబులు, అనఁగా వివాహాది శుభకార్యములందు జలపూ

ర్ణములై నూతనపల్లవాదులతోఁ గూడియున్నకుంభంబులను మంగళార్థ ముంచుటకలదు. అట్టికుంభంబు లని భావము. నూత్న...లలిన్-నూత్న=క్రొత్తవగు, పల్లవ=చిగుళ్లయొక్క, విభంగ=భాగములయొక్క, శ్రీ=సంపదతో, సమేతంబులు=కూడికొన్నవి, ఐనలలిన్=అయినచందమున, చెన్ను ఎసలారెన్=ప్రకాశించెను, అనఁగా నలరాజును జూడఁ ద్వరగాఁబోవుచుండ నొకతరుణీమణి పయ్యెద జాఱిపోయెను. అయిన నది నలసందర్శనోత్సుకత్వముచేఁజూడకుండెను. అప్పుడు విలాసార్థము లిఖించుకొన్న మకరికాపత్రములుగలదానికుచములు, క్రొత్తవగు చిగుళ్లచే నొప్పుచున్నవియు, మంగళార్థముంపఁబడినవియు నగు పూర్ణకుంభములు రాజున కెదురుగా మంగళార్థము తేఁబడినవానివలె నొప్పుచుండెనని భావము.

తా. నలరాజును జూడవేగముగాఁబోవు నొక స్త్రీపైఁట జాఱిపోవుటచేఁ గానవచ్చు కుచములు మకరికాపత్రములుగల వగుటచే నూతనపల్లవాదులతో నిండిన మంగళకుంభములను బోలుచుండెను. అలం. ఉత్ప్రేక్ష.

సీ. కలికిచూపులు రత్నకలికాకలాపంబు
గుబ్బచన్నులు హేమకుంభవితతి
మెఱుఁగుఁజెక్కులు క్రొత్తమించుటద్దంబులు
పాణియుగ్మంబులు పల్లవములు
వెలఁదిమందస్మితంబులు కమ్మఁబువ్వులు
పలుకులు వల్లకీకలకలములు
పరిపాటలోష్ఠబింబములు తేనియతొలల్
తనుకాంతి యొలగంధంపుఁబసుపు
తే. గాఁగ సౌభాగ్యవివిధమంగళపదార్థ
వర్గములు గ్రంత నడచుభావంబు దోఁచెఁ
బౌరకాంతలు రాజకుమారదర్శ
నోత్సవంబున కేతెంచుచున్నయపుడు. 68

టీ. పౌరకాంతలు=పురస్త్రీలు, రాజకుమారదర్శనోత్సవంబునకున్ =నలరాజును జూచుటయనెడియుత్సవమునకు, ఏతెంచుచున్నయపుడు=వచ్చుచున్నప్పుడు, కలికిచూపులు=మనోజ్ఞములగుచూపులు, రత్నకలికాకలాపంబు గాఁగన్ =రత్నపుమొగ్గయొక్కసమూహములును, గుబ్బచన్నులు, హేమకుంభవితతి గాఁగన్ =బంగారుకుండలసమూహమును గాను, మెఱుఁగుచెక్కులు, క్రొత్తమించుటద్దములు గాఁగన్ =ప్రకాశించెడిక్రొత్తయద్దములగుచుండఁగా, పాణియుగ్మంబులు=చేతులు, పల్లవములు గాఁగన్ =చిగుళ్లగుచుండఁగా, వెలఁదిమందస్మితంబులు=స్త్రీలచిఱునవ్వులు, కమ్మపువ్వులు గాఁగన్ =సుగంధము గలపువ్వులగుచుండఁగా, పలుకులు=మాటలు, వల్లకీకలకలములు గాఁగన్ =వీణాధ్వనులగుచుండఁగా, పరిపాటలోష్ఠబింబంబులు=అంతటను నెఱ్ఱఁదనము గలయధరోష్ఠములు, తేనియతోలల్ గాఁగన్ = తేనెతోలలనెడిభక్ష్యములగుచుండఁగా, తనుకాంతి= మేనిచాయ, ఓలగందంపు పసుపు గాఁగన్ =పూఁతతావిపసుపగుచుండఁగా, సౌభాగ్యవర్గములు-సౌభాగ్య=శుభప్రదములగు, వివిధ=నానావిధములగు, మంగళపదార్థవర్గములు=మంగళవస్తుసంచయములు, క్రంతి=పెండ్లికొడుకువారు పెండ్లికూఁతువారికిఁ గొనిపోయెడి ప్రధానద్రవ్యములు, నడచుభావంబు=ప్రవర్తించుచున్నరీతిని, తోఁచెన్ =కన్పట్టెను, అనఁగా, వివాహములందుఁ బెండ్లికొడుకువారు బెండ్లికూతువారికి మంగళకరములగు వస్తువులను గొనిపోయి యిచ్చుట లోకాచారము. నలరాజుతరలి వచ్చున్నప్పుడుచూడవచ్చిన స్త్రీలమనోహరావయములు నలపక్షమువారు దమయంతిపక్షమువారు గొనిపోవుచున్నమంగళద్రవ్యములవలె నున్న వని వర్ణింపఁబడెను. సామాన్యముగాఁ బెండ్లివారు మంగళవాద్యము చెలంగుచుండఁగా, రత్నములు, బంగారుకుండలు, అద్దములు, పల్లవములు, పువ్వులు, మధురపదార్థములును, బసుపు మొదలగునవి గొనిపోవుదురు అట్లె నలుఁడు గొనిపోవుచున్న వస్తుసమూహమెట్టిదనఁగా, స్త్రీలచూపులు రత్నములవలెను, స్తనములు బంగారుకుండలవలెను, చెక్కులద్దములవలెను, చేతులు పల్లవములగతిని, చిఱునవ్వులు మనోహరపుష్పములవలెను, నధరబింబములు మధురపదార్థముల చందమునను దనుకాంతి పసుపుపగిదిని జూపట్టుచుండెను. అందు స్త్రీలు పరస్పర

మాడుకొనెడివాక్యములు వీణాధ్వనిరూపము లగు మంగళనినాదములచందంబున నొప్పెనని భావము. ఉత్ప్రేక్ష.

తా. స్పష్టము.

స్రగ్ధర.

ఈతండే పాడిజాణం డితఁడె మగలరా జీతఁడే ధీరుఁ డంచున్
జేతోమోదంబునం జూచిరి పురయువతుల్ చిత్తసంజాతమూర్తిన్
జ్యోతిష్టోమాదియజ్ఞశ్రుతఫలనిఖిలక్షోణిసామ్రాజ్యలక్ష్మీ
పాతివ్రత్యైకదీక్షాఫలుని నిషధభూపాలు దిక్పాలమిత్రున్.

టీ. పురయువతుల్ =పట్టణమందలి యౌవనముగల స్త్రీలు, ఈతండే = ఈ నలుఁడే, పాడిజాణండు = స్వభావము చేతె - నేర్పరి, తక్కినవారి నేర్పు తెచ్చికొన్నదనుట, ఇతఁడె = ఈనలుఁడే, మగలరాజు, ఈతఁడే, ధీరుఁడు, అంచున్ = అని పల్కుచు, చేతోమోదంబునన్ = మనస్సంతుష్టితో, చిత్తసంజాతమూర్తిన్ = మన్మథునియొక్క యాకారమువంటి యాకారము గలవానిని, జ్యోతి... ఫలము - జ్యోతిష్టోమ=జ్యోతిష్టోమము, ఆది=మొదలు గాఁగల, యజ్ఞ=యాగములకు, శ్రుత=వినఁబడుచున్న, ఫల=ఫలమైన,నిఖిలక్షోణి=సమస్తభూమండలముయొక్క,సామ్రాజ్యలక్ష్మీ=సార్వభౌమలక్ష్మియొక్క, పాతివ్రత్య=పతివ్రతాధర్మ మనెడి, ఏక = ముఖ్యమైన, దీక్షా=నియమమునకు, ఫలము=ఫలమైనవానిని, అనఁగా జ్యోతిష్టోమాదియాగములు చేసినవాఁ డగుటచే నలునియందు సార్వభౌమలక్ష్మి యవ్యభిచరితమతి యై వర్తించుచున్న దని భావము. సామ్రాజ్యలక్ష్మియే పతివ్రతయై నలునిఁ గొల్చుచున్న దని చెప్పుటవలన నితఁడు సామ్రాజ్యలక్ష్మిని నిరసించుచున్నను నది యితనిఁదప్ప నొరునిఁ జేర దని తెల్ల మగుచున్నది. దిక్పాలమిత్రున్ = దేవతలకు మిత్రుఁడై యున్నవానిని, నిషధభూపాలున్ = నలుని, చూచిరి. చిత్తజుని రూపుగలవాఁడు గాన పాడిజాణండు; నిఖిలక్షోణిభర్త గాన మగలరాజు; దిక్పాలమిత్రుఁడు గాన ధీరుఁడు.

తా. పురయువతు లితఁడే పుట్టుజాణఁ డితఁడే శూరులకు రాజితఁడే ధీరుఁడని పల్కుచు మనస్సంతోషముతో మన్మథునివంటి యాకారముగల్గి జ్యోతిష్టోమాదియాగములవలనఁ గల్గిన సామ్రాజ్యముగలవాఁడయి రాజులకు హితుఁడై వర్తించు నలరాజును జూచిరి.

వ. అప్పుడు పౌరాంగనలు తమలోన. 70

మ. తనకుందాన పురందరాదిదివిజేంద్రవ్రాత మేతెంచి ని
ల్చిన సంప్రీతి వరాటకన్యక వరించెం గావున న్ఫాలలో
చనకోపానలదగ్ధ మన్మథమహాసామ్రాజ్యకంఠీరవా
సనమెక్కందగు వీఁ డకుంఠితవిలాసప్రౌఢభావంబునన్. 71

టీ. పురందరాది దివిజేంద్రవ్రాతము=ఇంద్రాది దేవతల సమూహము, తనకుందాన=తనంతటతానే—తమంతటఁదామే యనుట. బహువచన విశేష్యమునకు రాఁదగిన 'తమ'కుమారుగా 'తన వచ్చుటయుఁగలదు. 'అందఱుఁ,దనతనమది నున్న(భార.విరాట.౧ఆ.౬×)ఏతెంచి=స్వయంవరస్థానముకువచ్చి,నిల్చినన్ = ఉన్నప్పటికిని, వరాటకన్యక=దమయంతి, ఇతనిన్ (అధ్యాహారము),సంప్రీతిన్ =అధికానురాగముతో, వరించెన్ =భర్తగాఁదీసికొనెను, కావునన్ =జగత్ప్రసిద్ధులగు నింద్రాదిదేవతలను సైతము నిషేధించి యీనలుని వరించినది కావున, వీఁడు=ఈనలుఁడు, అకుంఠితవిలాస ప్రౌఢభావంబునన్ = నిరతిశయమయిన విలాసములందలి చాతుర్యముచే, ఫాల...ఆసనము-ఫాలలోచన=రుద్రునియొక్క, కోపానల=కోపాగ్నిచే, దగ్ధ=దహింపఁబడిన, మన్మథ=మన్మథునియొక్క,మహాసామ్రాజ్య=గొప్పసామ్రాజ్యముయొక్క-అనఁగా నిరతిశయసౌందర్యముయొక్క యనుట, కంఠీరవాసనము=సింహాసనమును, ఎక్కఁదగున్ = అధిష్ఠింపనర్హుఁడు. నిరతిశయమయినసౌందర్యమనెడి రాజసింహాసనమున మన్మథుండు గూర్చుండఁదగియుండెను. కాని యతఁడు శంకరునికంటిమంటల నశించినప్పటినుండియునది సావకాశమైయుండెను. ఈనలుఁడు దేవేంద్రాదుల మించిన సౌందర్యముగలవాఁడు కాన వీఁడే యాసింహాసనమెక్కఁ దగినవాఁడు.

కాని తక్కినవారు తగరని భావము. నలుఁడు రెండవమన్మథుఁడే యని ఫలితార్థము.

తా. ఇంద్రాది దేవతలు దమకుఁదామే దమయంతిని వరింపవలెనని వచ్చి యెదుటనున్నను వారినివిడిచి యాబిడ నలునివరించినది. కావున నితఁడే నిరతిశయసౌందర్యవంతుఁడు. సాటిలేనిసౌందర్యముచే నీశ్వరునిచే దగ్ధుఁడయిన మరునిస్థాన మలంకరింపఁదగినవాఁ డీతఁడే.

సీ. సుద్యుమ్నుఁడనురాజు • సుదతియై యెవ్వానిఁ
　　　ప్రథమసీమంతగ • ర్భమునఁ గాంచె
　ప్రగహరాజుగారాపు • రాణివాసం బైన
　　　గంధర్వి యెవ్వారి • కన్నతల్లి
　యిన్నూఱుమున్నూఱు • నేనూఱుగన్నులు
　　　గలవేలు పెవ్వానిఁ • గన్నతండ్రి
　రజతాచలం బేలు • రాజుపట్టపుదేవి
　　　గోరి యెవ్వనిఁ గాంచె • గొడ్డునీఁగి
తే. యాపురూరవుఁ డాద్రను • లాజయంతుఁ
　డాపుల స్త్యునిమనుమఁ డీ • యధిపుతోడ
　సాటి యగుదురె నిఖలవి • శ్వంబులోన
　భావసమ్మోహనాతిసౌ • భాగ్యరేఖ.　　　72

టీ. నిఖలవిశ్వంబులోనన్ = సమస్తమైనభూవలయమునందును, భావ... రేఖన్-భావ=చిత్తములను, సమ్మోహన=మిక్కిలి మోహింపఁజేయు, అతిసౌభాగ్యరేఖన్ =గొప్పసౌందర్యరేఖచే, సుద్యుమ్నుఁడనురాజు, సుదతియై= స్త్రీయై, ఎవ్వానిన్ =ఏపురూరవుని, ప్రథమసీమంత గర్భమునన్ = మొదటికాన్పున, కాంచెన్ =కనెనో, పూర్వము సుద్యుమ్నుఁడనురాజు వేఁటకేఁగి యలసి యొకవనము సొచ్చి పార్వతీదేవి యిచ్చినశాపము నెఱుంగక యచ్చటికొలనిలోఁ దానమాడఁగా స్త్రీరూపమువచ్చె. అప్పుడామెనుజూచి బుధుఁడు మోహించి సంభో

గింపఁగా, నామె కతనివలనఁ బుహూరవుఁడనెడి యతిసుందరుఁ డగుకొమారుఁ డు గల్గెను. గ్రహరాజుగారాపురాణివాసంబు=సూర్యుని ముద్దుభార్య, ఐనగంధర్వి=అయినట్టిగోడిగ, ఎవ్వారిక్=ఏయశ్విసుతులను, కన్నతల్లి=కాంచినజననియో. అనఁగా సూర్యుఁడు గోడిగరూపున నున్నసంజ్ఞాదేవియందుఁ బుట్టించినవారశ్విదేవతలని తెలియునది. ఇన్నూఱు=రెండువందలు, మున్నూఱు = మూఁడు వందలు, ఏనూఱు=ఐదువందలు, కన్నులుగలవేల్పు=నేత్రములుగలయింద్రుఁడు, అనఁగా వేయునేత్రములు గలయింద్రుఁడనిభావము. ఎవ్వానిక్=ఏజయంతుని, కన్నతండ్రి=కాంచినజనకుఁడో, రజతాచలంబు=వెండికొండను, ఏలురాజుపట్టపుదేవిక్=పరిపాలించెడి కుబేరునిభార్య, కోరి, గొడ్డు=గొడ్రాలితనమును, ఈఁగి=విడచి, ఎవ్వనిక్=ఏనలకూబరుని, కాంచెను=కనెనో, అనఁగా కుబేరునిభార్య సంతానములేకపోవుటచే మిక్కిలి విచారమునొంది పార్వతి నారాధించి యామె యనుగ్రహమున నెవ్వనిఁగాంచెనోయని భావము. ఆపుహూరవుఁడు, ఆదస్రులు=ఆదేవవైద్యులు, ఆజయంతుఁడు, ఆపులస్త్యునిమనుమఁడు=ఆనలకూబరుఁడు, ఈయధిపులోడక్=ఈనలరాజుతో, సాటి యగుదురే=సామ్యమొందఁగలరా? అనఁగా లేరనుట.

తా. ఈభూమిలో సౌందర్యసంపదచే, నిళకును బుధునకును బుట్టినపుహూరవుఁడయినను, సూర్యునికిని గంధర్వికిని గల్గినయశ్విసుతు లయినను, దేవేంద్రుని కొడుకయిన జయంతుఁడయినను, కుబేరుపట్టపుదేవికి నుదయించిన నలకూబరుఁడయినను నీనలరాజుతో సాటి చెంపలేరు.

మ. సమయోత్కంఠితకంఠలోఠివరణస్రగ్భూషణుం డై నయీ
దమయంతీవరుఁ జూచి యద్దివికి సుత్రాముండు వ్రీళాకుంటపం
తము నిర్లజ్జతఁ బోయినం దనునిరర్థప్రార్థనుం దొంటినె
య్యమునం జేరఁగ నేలయిచ్చుశచియాకాంత్మాంతఃపురోద్దేశమున్.

టీ. సుత్రాముఁడు=దేవేంద్రుఁడు, సమయ...షణుండు-సమయ=స్వయంవరకాలమున, ఉత్కంఠిత=నలునియందధికోత్కంఠ గలదియగు, కంఠ=అతని కంఠమున, లోఠి=దొరలుచున్న, వరణస్రక్=స్వయంవరణమాలికయే, భూష

ణుండు=ఆభరణముగాఁ గలవాఁడు, ఐనదమయంతీపరుఁ=అయినట్టి నలరాజు
ను, చూచి, అస్థవికిఁ=ఆస్వర్గమునకు, పోకుంట=వెళ్లకుండుట, పంతము=పౌ
రుషము, అనఁగా నింద్రుఁడు తాను త్రిలోకాధిపతియయ్యు, నమరుఁడయ్యు
దమయంతిని వరింప వచ్చి విఫలీకృతమనోరథుఁడై మర్త్యుఁడయిన నలరాజునకై
నను సాటిరాక యుండెను. అట్టిసమయమున దేవేంద్రుఁడు పౌరుషశాలియేయైన
చో స్వర్గమున కేఁగక మర్త్యలోకముననుండుటే సముచితము. నిర్లజ్జతఁ=త్రపా
విహీనతచే, పోయినఁ=స్వర్గమున కేఁగినను, నిరర్థప్రార్థనుఁ=వ్యర్థమగుకోర్కి
గల, తన్నుఁ=ఇంద్రుననుట, శచి, తొంటివెయ్యమునఁ=వెనుకటియనురాగ
ముతో, ఆత్మాంతఃపురోద్దేశముకు=తనయంతఃపురములోనికి, ఏల, చేరఁగఁ
ఇచ్చుఁ=ఎందులకురానిచ్చును,అనఁగా రానీయదనుట,తనభర్త వేఱొకకాంత
పై ననురక్తుఁడయినట్టు తెలిసినప్పుడే స్త్రీ భర్తపైతొంటియనురాగమును విడు
చు. అట్లుండఁ బతి వేఱొకకాంతనుగోరియుఁ దానిఁ బొందలేక యవమానముచెం
దివచ్చినప్పు డనురాగముండదని వేఱచెప్పవలయునా? కావున దేవేంద్రుఁడు నిర్ల
జ్జత నవలంబించియైన స్వర్గమును జేరకపోవుట యుచితమని భావము. ఇంద్రా
దులకంటెను నలుండు సౌందర్యాదులచే వెన్నెకెక్కియుండెనని ఫలితార్థము.

తా. స్పష్టము.

మ. విబుధేంద్రావరణప్రసాదితశచీవిశ్రాణితాశీర్వచ
స్తబకవ్రాతములుఁ దిగీశపురుషార్థప్రక్రమోపార్జిత
ప్రబలఖ్యాతియుఁ బూఁటకాఁపులుసుఁడీ భావించిచూడంగ ని
య్యబలారత్ననృపాలరత్నములనిత్యైశ్వర్యసంపత్తికిన్. 74

టీ. భావించి చూడంగఁ=ఆలోచించిచూడఁగా, ఇయ్యబలారత్ననృపా
లరత్నముల నిత్యైశ్వర్యసంపత్తికిఁ=స్త్రీపురుషరత్నములయిన యీనలదమ
యంతుల యైశ్వర్యసమృద్ధికి, విబుధ...వ్రాతములుఁ-విబుధేంద్ర = దేవేం
ద్రుని, అవరణ=వరింపకపోవుటచే, ప్రసాదిత=సంతసింపఁజేయఁబడిన, శచీ=
శచీదేవిచే, విశ్రాణిత=ఈయఁబడిన, ఆశీర్వచస్తబకవ్రాతములుఁ=ఆశీర్వచన
సమూహములును, అనఁగా, దమయంతి దేవేంద్రుని వరింప మానెను. అదిగని

శచి తనకు సపత్నియైయుండ నిష్టపడనందుల కానందించి దమయంతి కనేకవిధములగు నాశీర్వచనముల నిచ్చెనని భావము. దిగీశ...ఖ్యాతియుఁ-దిగీశ=దిక్పతులయొక్క, పురుషార్థ=దమయంతికి సందేశమును గొనిపోవుట యనెడి కార్యమునొక్క, ప్రక్రమ=ప్రారంభముచే, ఉపార్జిత=సంపాదింపఁబడిన, ప్రబల=అధికమగు, ఖ్యాతియుఁ, ప్రసిద్ధియు, అనఁగా నలుఁడు దేవతలకు మహోపకారముచేసి సంపాదించినప్రఖ్యాతి యని భావము. పూఁటకాఁపులు సుఁడీ=నలదమయంతుల కైశ్వర్యసమృద్ధిని దప్పక యీయవలసినవి చుమీ! అనఁగా నలునిచే సంతోషింపఁ జేయఁబడినదిక్పతులును నింద్రుని వరింపమిచే సంతసింపఁజేయఁబడిన శచియు, నీనలదమయంతుల కైశ్వర్యమృద్ధిని గలిగింపకమానరని భావము.

తా. దేవేంద్రుని వరింపమిచే సంతసించి శచీదేవి దమయంతి కిచ్చిన యాశీర్వచనములును, దిక్పతుల దూత్య మాచరించి నలుఁడు సంపాదించి కొన్న ఖ్యాతియును, నలదమయంతుల నిత్యైశ్వర్యముల నభివృద్ధిచేయఁ బ్రతిభువులై యున్నవి.

శా. చేసెం గావలయు న్విరించి నిఖిలస్త్రీపుంససంయోజనా
భ్యాసప్రౌఢి ప్రకాశ మొందఁ గడు లియ్యం బైనసంసర్గ మి
ట్లాసంసారపురంధ్రిపూరుషమిథోహార్దోదయప్రేమముల్
పోసెం గావలయు న్స్మరుండు హృదయాంభోజంబులన్వీరికిన్.

టీ. విరించి=బ్రహ్మ, వీరికిఁ=నలదమయంతులకు, నిఖిలస్త్రీపుంస...ప్రౌఢి-నిఖిల=సమస్తమగు, స్త్రీపుంస = స్త్రీపురుషులయొక్క, సంయోజనా=కూర్చుటయందైన, అభ్యాసప్రౌఢి=అభ్యాసమందలి నేర్పు, ప్రకాశమొందఁ=ప్రకాశించునట్లుగా, కడులియ్యంబు = మిక్కిలి కలసినట్టిది, ఐనసంసర్గము=అయినకూడికను, చేసెంగావలయుఁ=చేసియుండవచ్చును, అనఁగా అనేకములగు ననుకూలదాంపత్యములఁగూర్చి యందలి తారతమ్యములనుగాంచి మిక్కిలి యభ్యాసము చేసి యీయనుకూలదాంపత్యము గూర్చెఁగాఁబోలునని భావము ఇట్లు, స్మరుండు=మన్మథుఁడు, వీరికిఁ=ఈనలదమయంతులకు, ఆసంసార...

ప్రేమముల్ - ఆసంసార=సృష్టిమొదలుకొని, పురంధ్రిపూరుష=స్త్రీపురుష లయొక్క, మిథః=అన్యోన్యములగు, హార్దోదయ=సంతోషోదయమును, ప్రేమ ముల్ =ప్రేమమును, హృదయాంభోజంబులన్ = హృత్పద్మములయందు, పోసెంగావలయున్, పోసియుండవచ్చును, అనఁగా మన్మథుఁ డిదివఱ కనేక స్త్రీ పురుషులకు నన్యోన్యహార్దప్రేమలజనింపఁజేసెఁ గావున నాయభ్యాసముచే హార్దప్రేమల వీరిహృదయములఁ బోసెఁగాఁ బోలునని భావము. విరించిమన్మథు లట్టి యభ్యాసము కలవారు గనుక అనుకూలదాంపత్యాన్యోన్యానురాగములఁ గూర్పఁగలిగి రనుట, అలం. ఉత్ప్రేక్ష. ఈనలదమయంతులం దనుకూలదాంప త్యమనియు వారలహార్దప్రేమలు నిరుపమానము లయినవనియు ఫలితార్థము.

శా. వైదర్భీబహుజన్మనిర్మలతపోవర్ధిష్ణుతల్లోచనా
స్వాదప్రౌఢవిలాసుఁ డీవసుమతీచక్రేశపుష్పాయుధుం
డాదిత్యాలయసార్వభౌమసుకృతాహంకారదుష్ప్రాపభై[న్.
మీదాంపత్యమునం జిరాయువయినెమ్మిం బొందుఁ గాకెంతయు

టీ. వసుమతీ... పుష్పాయుధుండు-వసుమతీచక్ర=భూచక్రమునకు, ఈశ=ప్ర భువులలో,అనఁగా రాజులననుట, పుష్పాయుధుండు=మన్మథునివంటివాఁడయిన నలుఁడు, వైదర్భీ=దమయంతియొక్క, బహు... విలాసుఁడు—బహు=అనేక ములయిన,జన్మ=పుట్టువులందలి, నిర్మల=స్వచ్ఛమైన,తపః=తపస్సుయొక్క,వర్ధి ష్ణు= పెరుఁగుచున్నదియు,తత్ =ఆమెయొక్క,లోచనాస్వాదప్రౌఢవిలాసుఁడు -లోచన=నేత్రములకు, ఆస్వాద=రుచికల్గించుటందు,అనఁగా నానందము కల్గిం చుటయం దనిభావము,ప్రౌఢ=నేర్పుగల, విలాసుఁడు=కాంతులుగలవాఁడు. అ నఁగా హరునికంటిమంటలచే నశించినశరీరముగలమన్మథుఁడు దమయంతి తపం బుపెంపుచే నేత్రగోచరమై సుందరమై యధికానందకరమై యున్నయీనల రూపమును బొందె నని భావము. నలుఁ డపరమన్మథునివలె నున్నాఁడని ఫలి తార్థము. ఆదిత్యా... దాంపత్యమునన్ —ఆదిత్యాలయ = స్వర్గలోకమునకు

సార్వభౌమ=చక్రవర్తియైన దేవేంద్రునియొక్క, సుకృతాహంకార=పుణ్యాతిశ యనుచే, దుష్ప్రాప=పొందనలవిగాని, భైమీ=దమయంతితోడి, దాంపత్య మునన్=దాంపత్యముచేత, అనఁగా నింద్రాదులకు సైతము దుష్ప్రాప యను టచే దమయంతి దేవతాకాంతలకంటెఁగూడ నధికసౌందర్యవంతురాలనియు, నట్టి దమయంతిని బొందఁ గలుగుటచే నలుఁ డింద్రాదులకంటెను బుణ్యాత్ముఁ డనియుఁ దెలియవగినది. ఇలన్, చిరాయువు అయి=దీర్ఘాయుర్దాయముగల వాఁడయి, ఎంతయున్ = మిక్కిలి, నెమ్మిన్=సంతసమును, ఒందుఁగాక= పొందును గాక.

తా. రాజకుమారమన్మథుఁడగు నీనలుఁడు దమయంతి తపంబు పెంపుచే లోచనానందకర మగువిలాసములు కలవాఁడు. ఇంద్రాదులకుఁ గూడ దుర్లభ మయినయీచెలువతోడి దాంపత్యమున భూమిలో సంతసంబునఁ జిరకాలము జీవించుఁగాక.

శా. సంబంధం బిటు గూడునే రమణికిన్ క్ష్మాభర్తకు న్నేత్రప
ర్వంబై యుండె స్వయంవరం బసితగౌరస్మేరదృగ్గోచులన్
బింబోష్ఠీనివహం బమోఘకుతుకప్రేమంబులన్వీరి మా
ఘం బాడించెనఘాతిఘాతియమునాగంగౌఘయోగంబునన్.

టీ. రమణికిన్=దమయంతికిని, క్ష్మాభర్తకున్=నలునకును, సంబంధంబు=వి వాహసంబంధము, ఇటు=ఇంత బాగుగా, కూడునే=సంఘటనము తగునుగదా! అనఁగా నీయిరువురును సౌందర్యాదులచే నొకరికొకరు తీసిపోకపోవుటచే వీరిసంఘటనము మిక్కిలి యుత్తముగా నున్నదని భావము. ఇటు "గూడునే" అనుచోట ఏకారము మెచ్చుకొనుటను దెలుపును. ఇందులకుఁ బ్రయోగము "నాయాడినమాటలకు నయ్యుధిష్ఠిరుండు పలికినవచనంబు లింత యొప్పునే యని యగ్గించిన" భార. ఉ. అట్లె యిచ్చటను, నలదమయంతులకుఁ మిక్కిలి మంచి సంఘటనము సమకూరినదని మెచ్చుకొనుటనే యేవకారము తె లుపుచున్నదని తెలియఁదగినది. స్వయంవరంబు, నేత్రపర్వంబై=నేత్రానంద కరమై, ఉండెన్, అనఁగా నీస్వయంవర మహోత్సవమున మిక్కిలి యనుకూ

దాంపత్యము సమకూడుటచే నిదియు మిక్కిలి యభినందనీయమై యున్నదని భావము. బింబోష్ఠీని వహంబు=స్త్రీసమూహము, అమోఘకుతుక ప్రేమంబులన్=వ్యర్థముకాని వేడుకచేతను, ప్రేమముచేతను, అసిత...రోచులన్— అసిత=నల్లనివియు, గౌర=తెల్లనివియు, నగు, స్మేర=మందహాసముచే వికసించిన, దృక్=నేత్రముల, రోచులన్=కాంతులనెడి, అఘాతి...యోగంబునన్- అఘ=పాపములను, అతిఘాతి=పూర్తిగా నశింపఁజేసెడి, యమునాగంగా, గంగా యమునా నదులయొక్క, ఓఘ=ప్రవాహముయొక్క. యోగంబునన్=కూడిక గల ప్రయాగయనెడి పుణ్యక్షేత్రంబునందు, వీరిన్ = ఈనలదమయంతులను, మాఘముఆడించెను = మాఘస్నానము, చేయించెను. స్త్రీలయొక్క నేత్రముల సితాసితకాంతులు గంగయమునా సంగమమువలె నున్నవనియు, నట్టి పుణ్యక్షేత్రమున మాఘమాసమున స్నానముచేసినవారు మహాపుణ్యాత్ములగుదురనియు, నీనలదమయంతులకు స్త్రీ నేత్రముల సితాసితకాంతులనెడి గంగాయమునా సంగమమున స్నానముచేసి యార్జించుటవలననే పరస్పరసంఘటన మలవడినదనియుభావము. ఈచెప్పటచే స్త్రీలు నలదమయంతులను దనివిదీరని చూపులతో నాపాదమస్తకమును జూచుచున్నారనియు. అట్లుచూచి మాఘమాసంపు ఫలమును—అనఁగా మహాసుకృతమును—వారికిఁ గలుగునట్లు కోరుచున్నారనియు ఫలితార్థము. మాఘమాసమునఁ బ్రయాగయందుఁ దానమాడినవారు మహాపుణ్యలంతులగుదురనుటకుఁ "ప్రమాణము" సితాసితేచయైః స్నాతంమాఘమాసే యుధిష్ఠిర, నతేషాంపునరావృత్తిః కల్పకోటిశతైరపి" అనుభారతవచనము. ఇందు మాఘంబు, ఆడించెన్ అనుచోటఁ గాలవాచకమగుటచే సప్తమికిద్వితీయ వచ్చినదని యెఱుంగునది. ఇందులకు మూలములోఁగూడ "సాస్నైమాఘ మఘాతి ఘాతియమునాగంగౌఘయోగే యథా" అని సప్తమికి ద్వితీయ కానవచ్చుచున్నది. అలం రూపకము. ఉత్ప్రేక్ష.

తే. దివిజపతిఁ బొందనేని రెంటఁడవశచి యగు

ధరణిపతిఁ బొంద దమయంతికేతనము చెడదు

తివిరి శచి యౌట దమయంతి కై యవుటఁ బోల
దింతి యీతారతమ్య మెట్లెఱిఁగెనొక్కొ. 78

టీ. ఇంతి=దమయంతి, దివిజపతిన్ = దేవేంద్రుని, పొందన్, ఏని=వరించి నచో, రెండవశచి=రెండవశచీదేవి, అగున్, అనఁగానింద్రభార్యకు శచియను పేరుగలుగును. కానదమయంతి యింద్రునివరించినచో ముందున్నముఖ్యశచి గాక రెండవ గౌణశచి యగు ననుట, ధరణిపతిన్=నలుని, పొందన్=వరింపఁగా, దమయంతితనము=దమయంతీత్వము, చెడదు = పోదు, ముఖ్యరాలయిన మొదటి దమయంతిగానే యుండును గాని శచిక్రింద అముఖ్యరా లయినరెండవశచిగా నుండదనిభావము. తివిరి = ప్రయత్నించి, శచి యౌట = ఇంద్రభార్యయగుట, అనఁగా నింద్రునివరించి శచీత్వమును బొందుట, దమయంతియవుటన్ = దమయంతియై యుండుటను, అనఁగా నలుని వరించి యిదివఱకున్న దమయంతీత్వమును నిలుపుకొనుటనని భావము. పోలదు = దీనికిసరిగాదు. అనఁగా శచీత్వమును బొందుటకంటె దమయంతియైయుండుటయే శ్రేష్ఠమని భావము. ఈతారతమ్యము = భేదమును, ఎట్లు=ఏరీతిగా, ఎఱిఁగెన్, ఒక్కొ=తెలిసికొన్నదో, “ఇటశచియై యింద్రరాజ్యసుఖము లనుభవించుటకంటె దమయంతియై భూలోకమునవసించి యీలోకసుఖ లనుభవించుట మంచిదికాదని తలంపరాదు. దమయంతి యింద్రుని వరించినచో స్వర్గసుఖప్రాప్తియున్నను, సత్కీర్తి యేమియుండగలుగదు. శచీదేవికేమికీర్తిగలదు? ఎవరైనను నామెనువర్ణించుచున్నారా? లేదు. నలునివరించినచో నింద్రునికంటెను నలుఁడధిక కీర్తిసంపన్నుఁడు కాన నతనివరించి పత్నియైయున్నచో నతనివర్ణించుచుఁ, దత్ప్రసంగముచే దమయంతిని గూడ వర్ణింతురు. దానివలన దమయంతి కధికకీర్తికల్గు. ఆకీర్తిస్వర్గసుఖముకంటెను శ్రేష్ఠమైనది. కానస్వర్గసుఖమును బరిత్యజించి దమయంతి నలునినే వరించినది” అని కొందఱ యభిప్రాయము.

తా. గతార్థము.

శా. స్వారాజప్రముఖామరప్రవరులకై నర్థించి లజ్జాపరీ

హారంబుం బొనరించె రాజులకు సంప్రార్థించి తా దేవస
త్కారం బై యితని న్వరించిన వివేకప్రౌఢిఁ దద్దేవతా
హ్రీరోషాపయశఃప్రమార్జన మొనర్చెన్ భైమి మే లెంతయున్.

టీ. భైమి=దమయంతి, స్వారాజ...వరులన్ - స్వారాజ= ఇంద్రుఁడు, ప్రముఖ=మొదలుగాఁగల, అమరప్రవరులన్ = దేవతాశ్రేష్ఠులను, వర్జించి= విడిచి, రాజులకున్ = నలాతిరిక్తులయిన రాజులకు, లజ్జాపరీహారంబున్=లజ్జా త్యాగమును, ఒనరించెన్=చేసెను. అనఁగా భూలోకవాసులగు రాజవర్యులగు తమలో నలుని వరించినప్పుడు తక్కినవారికి సిగ్గువొడమక మానదు. కాని దమ యంతి స్వర్గలోకావాసులగు నింద్రాదుల నే పరిత్యజించినప్ప డీలోకరాజులను విడిచిపెట్టెననుట వలన నీరాజులకు సిగ్గుపొడమలేదని భావము. ప్రార్థించి = ఇం ద్రాదులనడిగికొని, దేవతాసత్కారంబై = దేవతలొసంగిన బహుమానము గా, ఇతనిన్ = ఈనలుని, వరించిన=చేపట్టిన, వివేకప్రౌఢిన్ =యుక్తాయుక్తజ్ఞానా తిశయముచే, తద్దేవతా...మార్జనము-తద్దేవతా=ఆయింద్రాది దేవతలయొక్క, హ్రీరోష=లజ్జాకోపములయు, అపయశః=అపకీర్తియు, ప్రమార్జనము=తొలంగిం చుటను, ఒనర్చెన్=చేసెను, ఇది, ఎంతయున్, మేలు=మంచిది, తమకంటెఁ దక్కువ వాఁడయిన నలుని దమయంతి వరించుటచే, నలుని సాదృశ్యము పొందలేక పోయితిమిగదా యని దేవతలకు సిగ్గును, నమరులయి లోకాధిపతు లయిన తమ కోర్కిని తమయాజ్ఞచొప్పున నడవవలసిన దమయంతి విఫల ముచేసినది కాన కోపమును, స్వర్గాధిపతులయ్యు సౌందర్యాదులగు నుత్తమ గుణములందు నలునిఁ బోలలేక పోయిరనెడి యపకీర్తియు దేవతలకుఁ గలుగుచుం డఁగా వానిని దమయంతి తన నేర్పుచేఁ దొలంగించెను. ఎట్లనఁగా దమయంతి దేవతలను ప్రార్థించివారి వలన నే నలునిఁ బొందెను. ఇంద్రాదులే నలుని నొసం గుటచేఁ దాము దమయంతిని బొందఁదగిన సామర్థ్యము గలవార య్యును దమయంతి ననుగ్రహించి యిచ్చిరని తెలియవచ్చునుగాన, వారియందుఁ గొంతయుఁ గాని దమయంతి వరింపలేకపోవుట వలన లజ్జగాని యింద్రాదులకు సంభవిం పదు. త్రిలోకాధిపతులగు తమ్ముయాచించి నలుని వరించుటచేఁ దమశాసనమును

ధిక్కరించుటయుఁగాదు; తమకోర్కిని విఫలముజేయుటయునుగాదు. కాన దమయంతి యం దున్నకోపమును బోవును. మఱియు దమయంతి వరింపక పోవుటచే 'నింద్రాదులు నలునికంటెఁ దక్కువవారు; కానిచో దమయంతి యేలవరింపదు' అనెడి యపయశస్సు సంభవించును. కాని వారినడిగి నలునికై కొనుటచే నలునికంటె నింద్రాదులే గొప్పవారైయుండవచ్చుననియు దమయంతి నలుఁడేకావలయునని కోరుటచే నామెయందుఁ దయ యుంచి వారిచ్చినవారనియుఁ దోఁచును. కావున నపకీర్తియుఁ దొలంగెను. ఇట రాజులకు సిగ్గు లేకుండఁజేసి, యింద్రాదులకు లజ్జయుఁ గోపంబును, దుష్కీర్తియును లేకుండఁ జేసి యెవ్వరిమనంబులును విచారపరములు గాకుండఁజేసి తనమనఃప్రియుని నెమ్మితో వరించుటచే దమయంతి వివేకధాటి తెల్లమగుచున్నది.

తా. గతార్థము.

వ. అనుచు నీచందంబునం బ్రగందుకొని యింద్రివరాక్షులు డెందంబు లానందజలధిం దేలియాడంగొనియాడుచు సందర్శనోత్సవం బనుభవింపం గుమారబృందారకుండు కురువింద కందళీసందోహ సుందరకరుం డగుటను హృదయానందుం డగుటనుం బాడమచందురునిం దొరయుచుఁ బురందరహరితక్రీడామందిరం బగునుదయగిరికందరంబునుం బోనికనక స్యందనంబుపై హరిద్రాభంగరంగంబుల భంగింప నంగలించు నఖిలాంగకంబులం దొడిగినమంగళాభరణంబులం గీలింపఁబడినయింద్రనీలంబులమెఱుంగులచెఱంగులు పౌరాంగనాపాంగదృక్తరంగంబుల నాలింగనంబుసేయం గంకణఝణఝణత్కారంబు తోరంబుగాఁ బంకజాక్షులు వీచువీచోపులం బాడమునన్నగరువలిపొలపంబుల నున్నంబులై నున్నకురులు పొలుపార, మందగమనంబున వందిసందోహసంకీర్తనంబును, మాగధమధురగానంబును, బాఠకపఠనరవంబును, మ

నంబు రంజింపం జేయ, ముందఱం జనుమూర్ధాభిషిక్తులమణికి రీటంబు లనునడదివియలతోడం గూడి గంధతైలధారాభిషేకప్రదీపితం బగుకరదీపికాసహస్రంబు, నాసీరగత తురుష్కారఖరఖురఘట్టనంబులం బుట్టినధరణీపరాగంబునదట్టంబైన సంధ్యాంధకారంబు దూరంబుసేయం గరి ఘటాగ్రైవేయ ఘంటికాటంకారరవంబులఁ బ్రోదిసేయుచుఁ బుంఖానుపుంఖంబులుగా శంఖకాహళభేరీమృదంగ వేణువీణా నినాదంబులు రోదసీకటాహంబు నుద్ఘాటింపం బటుత్పట్టపటపతాకాభిరామంబును, నముత్తంభితరంభా స్తంభసంభారంబును, గర్పూరసాంసు విరచితరంగవల్లీమతల్లికావేల్లితప్రాంగణంబును గస్తూరీకర్దమాలిప్తవితర్దికాద్వితయోపశోభితంబును, బుణ్యాంగనాకరకిసలయావలంబిత చూతపల్లవలాజాక్షతాది శోభనపదార్థసార్థంబును నైనరాజమందిరంబు చేరం జనుదెంచు నప్పుడు.

టీ. ఈచందంబునన్ = ఈప్రకారముగా, అనుచున్ = పల్కుచు, ఇందీవరాక్షులు = కలువలవంటి నేత్రములుగల స్త్రీలు, క్రందుకొని = సమూహముగానుండి, డెందంబులు = మనస్సులు, ఆనందజలధిన్ = ఆనందసముద్రమునందు, తేలియాడన్ = ఈఁదులాడుచుండఁగా, అనఁగా నధికసంతోషములు గల వయియుండఁగా, కొనియాడుచున్ = నలదమయంతులను నుతించుచు, సందర్శనోత్సవంబు = నలరాజును జూచుటయనెడి యుత్సవమును, అనుభవింపంపన్ = అనుభవించుచుండఁగా, కుమారబృందారకుండు = రాజకుమారవరుఁడు, కురువింద .. కరుండు—కురువింద = పద్మరాగములయొక్క, కందళ = మొలకలయొక్క, సందోహ = సమూహమువలె, సుందర = అందమైన, కరుండు = చేతులుగలవాఁడు, అగుటను = అయియుండుటచేతను, చంద్రపక్షమందు, ఉదయకాలమునఁజంద్రుఁ డెట్లుగా నుండునుగాన కురువిందములవంటి సుందరమగు కిరణములు గలవాఁడనియర్థము, హృదయానందుండగుటన్ = మనస్సున కానందము గల్గించు

వాఁడగుటచేతను, పొడము చందురునిఁ = ఉదయకాలచంద్రుని, దొరయుచుఁ =సమానమగుచు, పురందరహరిత్ క్రీడామందిరంబు-పురందరహరిత్ = తూర్పుదిక్కనెడి స్త్రీకి, క్రీడామందిరంబు= క్రీడాగృహము, అగునుదయగిరికందరంబునఁ =అయినట్టి పొడుపుకొండగుహను, సోనికనకస్యందనంబుపైఁ =సరిపోలుచున్న బంగారు రథముపైని, అధివసించి=కూర్చుండి, హారిద్రాభంగ రంగంబులఁ =పసపుఖండములయొక్క రంగును, భంగింపఁ =తిరస్కరించుటకు, అంగలించునఖిలాంగకంబులఁ = ప్రయత్నించుచున్నయవయవములందు, అనఁగాఁ బసపుఖండములవలెఁ బచ్చనియంగములందని భావము. తొడిగిన మంగళాభరణంబులు = తాల్చిన శుభప్రదమగు నలంకారములు, కీలిం... చెఱంగులు — కీలింపఁబడిన = అలంకారములందు స్థగితములై యున్న, ఇంద్రనీలంబుల= ఇంద్రనీలమాణిక్యములయొక్క, మెఱుంగుల = కాంతులయొక్క, చెఱంగులు=కొనలు, పౌరాంగనాపాంగ దృక్తరంగంబులఁ =పౌర స్త్రీల కడకంటిచూపులను, ఆలింగనంబు, చేయఁ =అలమికొనుచుండఁగా, కంకణఝణత్కారంబు = కడియముల ఝణంకారధ్వనులు, తోరంబుగా=వర్ధిల్లునట్లుగా, పంకజాక్షులు= స్త్రీలు, వీచువీచోపులఁ =వీచుచున్నవింజామరలవలన, పొడము సన్నగరువలిపొలపంబులఁ =ఉదయించు మందమారుతప్రసారములచే,నున్నంబులైన=త్రోయఁబడిన, నున్నఁగురులు=మెత్తనికేశములు, పొలుపారఁ =కదలి ప్రకాశించుచుండఁగా, మందగమనంబునఁ =మెల్లని నడకతో, వందిసందోహ సంకీర్తనంబును=వందిజనముల పొగడ్తలును, మాగధమధురగానంబులఁ =వంశవీర్యాదులనుబొగడి జీవించెడి జనులయొక్క, తియ్యనిపాటలును, పాఠకపఠనరవంబును=పాఠకజనములయొక్క ధ్వనియును, మనంబుఁ,రంజింపఁజేయఁ = సంతసింపఁ జేయుచుండఁగా, ముందఱఁ =నలరాజునకుఁ బురోభాగమున, చనుమూర్ధాభిషిక్తుల=నడుచుచున్న గొప్పరాజులయొక్క, మణికిరీటంబులు=రత్నకిరీటములు, అనువడదివియలతోడఁ = అనెడినడచుచున్న దీపములతో, అనఁగా మూర్ధాషిక్తులగు రాజులు ముందుగా నడుచుచుండఁగా వారి శిరంబులపై నున్నరత్నకిరీటములు నడచుచున్నదివిటీలవలె నున్నవని భావము. కూడి=కలిసి,

గంధ... దీపితంబు-గంధతైల=వాసననూనెయొక్క, ధారా=ధారలయొక్క, అభిషేక=పోఁతలచే, సిక్త=తడుపఁబడినవియు, దీపితంబు=వెలిగింపఁబడినది, అగురుకరదీపికాసహస్రంబు=అయిన దివిటీలసమూహము, నాసీర... ఘట్టనంబున-నాసీర=సేనాముఖమును,గత=పొందిన, తుఖార=గుఱ్ఱములయొక్క,ఖర=వాడియైన, ఖుర=డెక్కలయొక్క, ఘట్టనంబునన్=సంఘర్షణముచే,పుట్టినధరణీపరాగంబునన్=పుట్టినట్టి భూపరాగముచే, దట్టంబు, ఐనసంధ్యాంధకారంబున్=అయినట్టి సాయంకాలపు చీఁకటిని, దూరంబు, చేయన్=పాఱఁదోలుచుండఁగా, కరి... టంకారంబులన్—కరిఘటా=ఏనుఁగు మొత్తములయొక్క, కంఠ=గలమందున్న, గ్రైవేయ=కంఠాభరణములయొక్క, ఘంటికా=ఘంటలయొక్క, టంకారరవంబులన్=ధ్వనులను, ప్రోది చేయుచు=వృద్ధిఁబొందించుచు, పుంఖాను పుంఖంబుగాన్=మిక్కిలిదట్టముగా, శంఖ... నినాదంబు—శంఖ=శంఖములయొక్కయు, కాహళ=కాహళమను వాద్యవిశేషము యొక్కయు, భేరీ=భేరియొక్కయు, మృదంగ=మద్దెలలయొక్కయు, వేణు=పిల్లఁగ్రోవులయొక్కయు, వీణా=వీణలయొక్కయు,నినాదంబు=ధ్వని,రోదసీకటాహంబును=భూమ్యాకాశముల కర్పరమును, ఉద్ఘాటింపన్=పగులఁగొట్టుచుండఁగా, పట... పతాకాభిరామంబును=పటపటనిశబ్దించుపట్టు గుడ్డజెండాలతోమనోహరమైనదియు,సముత్తంభిత... సంభారంబును-సముత్తంభిత=ఎత్తఁబడిన,రంభాస్తంభ=అనఁటి కంబములయొక్క, సంభారంబును=సమూహము గలదియు, కర్పూర... వేల్లితంబును-కర్పూరపాంసు=కప్పురపుచూర్ణముచే,విరచిత=రచింపఁబడిన,రంగవల్లీమతల్లికా=శ్రేష్ఠములయిన ముగ్గులచేత, వేల్లిత=పరివృతములైన, ప్రాంగణంబులును = ముంగిళ్లుగలదియు, కస్తూరీ... శోభితంబును—కస్తూరీకర్దమ=కస్తూరి బురదచే, ఆలిప్త=పూయఁబడిన, వితర్దికాద్వితయ=రెండరుఁగులచేత, ఉపశోభితంబును=ప్రకాశించుచున్నదియు, పుణ్యాంగనా... సార్థంబును—పుణ్యాంగనా = పేరంటాండ్రయొక్క, కరకిసలయ = పల్లవములవంటి చేతులచే, అవలంబిత=పట్టుకొనఁబడిన, చూతపల్లవ=మామిడిచిగుళ్లును, లాజ=పేలాలును, అక్షతలు=పచ్చని తండులములు, ఆది=మొదలైన, శోభనపదార్థ=

మంగళ పదార్థములయొక్క, సార్థంబు=సమూహముగలదియు, ఇనరాజమందిరంబుక్=అయినట్టి రాజగృహమును, చేరఁ=సమీపింపఁగా, చనుదెంచునప్పుడు=వచ్చుచున్న సమయమందు.

ఉ. చేరెను లగ్నవేళ యతిశీఘ్రము రమ్మని విన్నవింపఁ బు
త్తేరఁగ నంతనంతఁ జనుదెంతురు కుంతలగౌడచోళగాం
ధారముఖావనీశులు విదర్భనరేంద్రుని యాజ్ఞఁ బాదసం
చారమునన్ శశాంకకులసంభవుపాలికి భక్తినమ్రులై. 81

టీ. లగ్నవేళ=ముహూర్తకాలము, చేరెక్=సమీపించెను, అతిశీఘ్రము=మిక్కిలి వడిగా, రమ్ము, అని, విన్నవింపఁక్=మనవిచేయుటకు, పుత్తేరఁగాన్=పంపఁగా, కుంతల...వనీశులు - కుంతల=కుంతల దేశాధిపతియు, గౌడ=గౌడరాజు, చోళ=చోళభూపతియు, గాంధార ముఖావనీశులు=గాంధారరాజు మొదలగువారు, విదర్భనరేంద్రుని యాజ్ఞన్=భీమభూపాలుని యనుమతిచే, పాదసంచారమునక్=కాలి నడకతోన్, భక్తినమ్రులై=భక్తిచే వంగినవారై, శశాంక కులసంభవు పాలికిన్=చంద్రవంశ సంభూతుఁడయిన నలరాజునొద్దకు, అంతన్, అంతన్ = అంతటంతట, చనుదెంతురు=వచ్చుచుందురు. దేశాధీశ్వరులే శుభసందేశహరులై భక్తినిజూపుచు భయమున దూరముననే నిలుచుచున్నారని చెప్పుటచే నలునియొక్క వైభవము వెల్లడి యగుచున్నది. విదర్భరాజునాజ్ఞన్, వచ్చుచున్నా రనుటచే, వీరందఱును విదర్భరాజున కంకితులై యున్నారని తేలుచున్నది. ఆరాజులు పాదసంచారమున వచ్చుచున్నా రనుటచే నలుని గౌరవాతిశయము తెల్లమగుచున్నది.

తా. ''ముహూర్తకాలము సమీపించినది త్వరగా రావలయు''నని విదర్భరాజు పంపఁగాఁ గుంతల గౌడాదిదేశాధీశ్వరు లాతనియాన తలఁదాల్చి కాలినడతో నలునిచెంతకు వచ్చి కొంతదూరమున నిలుచుందురు.

సీ. యామవేదండకర్ణానిలస్ఫాలన
విలసితభ్రూవల్లి వేల్లనముగఁ

దోరణమాలికాహీరాంకురచ్ఛాయ
  వెలఁది లేఁజిఱునవ్వు మొలక గాఁగఁ
బ్రోదిరంభాస్తంభములమోసుటాకులు
  లలిఁ బచ్చపట్టుచేలంబు గాఁగ
వీతెంచుమృదువేణువీణానినాదంబు
  కలికితీయనినున్నపలుకు గాఁగఁ
తే. బేరఁటాండ్రుదురు హస్తపంకేరుహములఁ
బూఁచి యెత్తినకనకంపుఁ బూజెగుండ
లున్నతస్తనములు గాఁగ నొప్పు మిగిలెఁ
దరుణియునుబోలె నృపగృహద్వారభూమి.   82

టీ. యామ...స్ఫాలన - యామ = ఒక్కొక్క జామమునకు రాజద్వారము చెంతనిలుచు, వేదండ = ఏనుఁగుయొక్క, కర్ణానిల = చెవులవలనఁ గల్గిన గాలియొక్క, స్ఫాలన = కదలిక, విలసిత...మునన్ - విలసిత = ప్రకాశించుచున్న, భ్రూవల్లి = లతవంటి కనుబొమలయొక్క, వేల్లనమునన్ = చలనముగాను—కనుబొమ విభ్రమముగా ననుట, తోరణ...ఛాయ - తోరణమాలికా = మాలికవంటి తోరణమందున్న, హీరాంకుర = వజ్రపు మొలకలయొక్క, ఛాయ = కాంతి, వెలఁది = స్త్రీయొక్క, లేఁజిఱునవ్వుమొలకగాఁగన్ = మందహాసపు అంకురము లగుచుండఁగా, ప్రోదిరంభాస్తంభముల మోసుటాకులు=అలంకారార్థ మచ్చటఁ బాఁతినయనఁటిచెట్టుల లేఁతయాకులు, లలిన్=ఒప్పునట్లుగా, పచ్చపట్టు చేలంబుగాఁగన్=ఆకుపచ్చని కట్టు పుట్టమగుచుండఁగా, వీతెంచు...నినాదంబు-వీతెంచు=పఱతెంచుచున్న, మృదు=మధురమైన, వేణు=వాంశికములయొక్కయు, వీణా=వీణెలయొక్కయు, నినాదంబు=ధ్వని, కలికి తీయనినున్న పలుకుగాఁగన్ = స్త్రీయొక్క మధురమైన మృదువయిన మాట యగుచుండఁగా. పేరఁటాండ్రుదురు=ముత్తైదువలగు స్త్రీలు హస్తపంకేరుహములన్=పద్మములవంటి చేతులందు, పూఁచి, ఎత్తి

నకనకంపుఁ బూజెకుండలు=పట్టుకొన్న కనకవికారములై చిత్రించిన కుండలు, ఉన్నత స్తనములు గాఁగన్=పెద్ద స్తనము లగుచుండఁగా, నృపగృహద్వార భూమి=రాజమందిరముయొక్క సింహద్వారము నొద్దిభూమి, తరుణియును బోలెన్=కాంతయువలె, ఒప్పుమిగిలెన్=ప్రకాశించెను. అనఁగా రాజగృహ ద్వార భూమి నలరాజునెదుర్కొనుటకు యువతీరూపము దాల్చినట్లు లుండె నని భావము. వివాహాదులందు మంగళార్థము చిత్రితములయిన కుండలుపయో గింతురు. వానిఁ బూజెకుండలందురు.

తా. జానుబేనఁగు కర్ణానిలముయొక్క కదలిక భ్రూవిక్షేపమువలెను, తోరణములందున్న వజ్రమణికాంతులు చిఱునవ్వువలెను, విలాసార్థము పాఁతి నయఁటిచెట్ల యాకులాకుఁ బచ్చని వస్త్రమువలెను వీణాదిధ్వనులు మధుర వచనంబుల వలెను, పేఁరటాంద్రడు పట్టుకొనియున్న పూజెకుండలు స్తనములవ లెను నుండుటంబట్టి యాద్వారభూమి యొక స్త్రీవలెఁ బ్రకాశించెను.

ఉ. శంబరవైరిమూర్తి జలశేజద్విషదన్వయచక్రవర్తి ర
మ్యం బగుమందయానమున శ్రీనర్థిమెయిం జనుదెంచెఁ గేతుచీ
నాంబరవల్లి వేల్లనవిహారతరంగితవారివాహమా
ర్గం బగురాజమందిరముశ్రీప్రాంగణభూమికి సమ్మదంబునన్.

టీ. శంబరవైరిమూర్తి - శంబర=శంబరాసురునికి, వైరి=శత్రువు యొక్క, అనఁగా మన్మథునియొక్క యని యర్థము, మూర్తి=ఆకారమువంటి యాకా రము గలవాఁడును, జల...వరి-జలజద్విషత్=పద్మములకు విరోధి, అనఁగాఁ జంద్రునియొక్క, అన్వయ=వంశమందుఁ, బుట్టిన, చక్రవర్తి=సార్వభౌముఁడ యిన నలరాజు, కేతు...మార్గంబు- కేతు=ధ్వజములందున్న, చీనాంబరవల్లి= పలుచని పొడుగయిన వస్త్రములయొక్క, వేల్లన=కదలికయనెడి, విహార=సం చారములచే, తరంగిత=తరంగములు కలదిగాఁ జేయఁబడిన, వారి వాహమా ర్గము=ఆకాశమార్గము కలది, అనఁగాఁ దెల్లని పలుచని వస్త్రములు ధ్వజముల కొనలందుండుటచే నవి తరంగములవలెఁ బొడసూపుచు నాకసమును, దరంగ ములు గలదానినిగాఁ జేయుచున్నవని భావము. జండాలచే రాజద్వారమేకాక

మీఁది యాకాశముకూడ నలంకరింపఁబడెనని భావము. అగు రాజమందిరపు ప్రాంగణ భూమికిన్=అయినట్టి రాజమందిరముయొక్క ముంగిలి వాకిటికి, సమ్మదంబునన్=సంతసముతోను, అర్థిమెయిన్=అపేక్షతో, రమ్యంబగు = చూపఱకు మనోహరమైన, మందయానమునన్= మెల్లని నడకతో, చనుదెంచెన్=వచ్చెను.

తా. మన్మథునితో సాటియగు నాకారముగల నలుఁడు కొనలందు బద్ధములగు సన్నని వస్త్రముల విహారములచే నాకాశమును దరగలుగలదిగాఁజేయు ధ్వజములతోఁ బ్రకాశించు రాజమందిరముయొక్క వాకిటికి సంతసంబుచేతను బ్రేమముతోను మెల్లగా వచ్చెను.

తే. ఎదురుగా నేఁగుదెంచుచో నింద్రట మయ్యెఁ
బెండ్లి యిరువంక చుట్టంపుఁ బెద్దలకును
నాభిముఖ్యౌచితీసమ్యగర్హణార్హ
భాషణాలింగనాదిసంభావనముల. 84

టీ. ఎదురుగాన్=ఒండొరులకభిముఖముగా, ఏగుఁదెంచుచోన్=వచ్చునప్పుడు, పెండ్లి... పెద్దలకును - పెండ్లి=పెండ్లికరుగుదెంచిన, ఇరువంక=రెండుపక్షముల యందలి, చుట్టంపు=బంధువులగు, పెద్దలకున్=వయస్సు మీఱినవారికి, అభిముఖ్య... భావనములన్ - అభిముఖ్య=ఎదురుకోలుయొక్క, ఔచితి=తగవుచేత, సమ్యక్ = చక్కఁగా అర్హణ = పూజించుటయు, అర్హభాషణములన్=తగినట్లు సంభాషించుటయు, ఆలింగన=కౌఁగిలించుకొనుటయు, ఆది=మొదలుగాఁగల, సంభావనములన్=గౌరవముల చేతను, ఇంద్రటము=నిర్బంధము, అయ్యెన్=ఆయెను, అనఁగా నిరువంకఁ జుట్టంబులు నెదురొక్కనునప్పుడు పెద్దలకుఁగూడ నికటములో నలఁగుట యాయెనని భావము.

తా. రెండుపక్షముల పెండ్లి పెద్దలకును, బరస్పర మెదురొక్కనునప్పుడు, నెదురుసనుట, పూజించుట, యుక్తముగా మాటాడుట, కౌఁగిలించుట మొదలగు గౌరవములు చేసికొనుటచే మిక్కిలి సమ్మర్దమాయెను.

మ. దమయంతీప్రియసోదరుండు దముఁ డాద్వారప్రదేశంబు నె
య్యమునం గాల్నడ నేఁగుదెంచెఁ బరిచర్యాయుక్తిగా రాపువి
య్యముఁ దోడ్కొంచరుగంగఁ గంచుకపరీహారంబునం దారహా
రము దోరంబుగఁ బేరురంబున విహారక్రీడ వాటింపఁగన్.

టీ. దమయంతీ ప్రియసోదరుండు=దమయంతికి ముద్దుతమ్ముఁడగు, దముం డు=దముఁడనువాఁడు, కంచుకపరీహారంబునన్ = చొక్కాను బరిత్యజించుటచే, తారహారము=ముత్యముల హారము, తోరంబుగన్=మిక్కిలిగా, పేరురంబునన్=విశాల వక్షస్థలంబునందు, విహారక్రీడ=విహారమును, వాటింపఁగన్= చేయుచుండఁగా, అనఁగా గమనవేగమువలనను, చొక్కాను విడుచుటచే తను ముత్యాలహారము వక్షస్థలమం దాడుచున్నదని భావము. ఆద్వారప్రదేశంబు=పెండ్లికొడుకున్న ద్వారము మొదలుకొని, నెయ్యమునన్ = స్నేహముతో, కాల్నడన్=కాలినడకచేఁ, పరిచర్యాయుక్తిన్=శుశ్రూషతోడి కూడికతో, గారాపువియ్యము=తన ముద్దు బావమఱఁదిని, తోడ్కొంచున్, అరుగన్ = లోపలికి తోడ్కొనిపోవుటకు, ఏఁగుదెంచెన్ = నలుని కెదురుగావచ్చెను. అల్లునియందు గౌరవముంబట్టియు శుభకాల నియతినిబట్టియు కాలినడతోరా క. పరిచర్యయనఁగా అర్ఘ్యాది సమర్పణము. పైపద్యముతో నన్వయము.

తా. దమయంతికి ముద్దుసోదరుఁడగు దముఁడు ద్వారము మొదలుకొని ప్రేమముతో వినీతవేషమునకై కవచమును బరిత్యజించుటచే ముత్యాలహారము బలిసిన యురమునందుఁ జలించుచుండఁగా, తన ముద్దు బావమఱఁదికిఁ బరి చర్య చేయుచు లోపలికిఁ గొనిపోవ కాలినడ నెదురువచ్చెను.

తే. సైన్యముల నెల్ల వెలి నుండఁ జాటఁ బనిచి
వలయుపడవాళ్ల రాకుమారులను దొరల
నిషధరాజును గొలిచి రా నియతిఁ జేసె
నపుడు మొగసాలఁ గ్రథకైశికావనిపుఁడు. 86

టీ. క్రథకైశి కావనిపుఁడు=క్రథకైశిక దేశమున కధిపతియగు భీమరాజు,

అపుడు, మొగసాలన్ = మొదటి తలవాకిటియొద్ద, సైన్యములన్, ఎల్లన్ = సై న్యముల నన్నింటిని, వెలినుండన్ = ఆద్వారమునకు వెలుపట నుండుటకు, చాటన్, పనిచి = తెలుప నాజ్ఞాపించి, నలయు పడవాళ్ళన్ = కావలసిన సేనాధిపతులను, రాకుమారులను, దొరలన్ = దేశాధిపతులను, నిషధరాజును = నలరాజును, కొలిచి, రాన్ = సేవించుచు రావలసినదని, నియతిన్ = ఆజ్ఞను, చేసెన్.

తా. అట్లు నలుఁడు ద్వారము ప్రవేశించి లోనికి వచ్చునప్పు డాతని వెంబడించి సైన్యములులోని కరుగుచుండఁగా భీమరాజు మొదటి వాకిటనే సైన్యములు వెలి నుండవలయుననియు, ముఖ్యులయిన సేనాధిపతులును, రాజకుమారులును దేశాధీశ్వరులును నలునిఁ గొల్చుచు రావలయుననియు నాజ్ఞాపించె.

వ. తదనంతరంబ యభ్యంతర కక్ష్యాంతరవిభాగంబున నరదంబు డిగ్గి పుణ్యాంగనావిహిత నీరాజనాది మంగళోపచారుఁడై గారాపువియ్యంపు ముంజేయి కరతలంబున నవలంబించి యల్లనల్లన నడిచి బంధుజన పరంపరాపరివేష్టితంబై పురోహిత బ్రాహ్మణసహితంబై పురంధ్రీనికురుంబ సంబాధభరితం బైన వివాహ మంటపంబు చేరం జను దెంచి దూరంబున నెదురుగావచ్చు భీమభూపాలునకు నభివాదనంబు సేసి యతం డునుప సమున్నత కనకాసనంబున నాసీనుండై. 87

టీ. తదనంతరబు+అ = ఆద్వారము గడచినపిమ్మట, నలుఁడు, అభ్యంతర కక్ష్యాంతర విభాగంబునన్ — అభ్యంతర = లోపలనున్న, కక్ష్యాంతర = వాకిళ్లయొక్క, విభాగంబునన్ = హద్దునందు, అరదంబున్, డిగ్గి, పుణ్యా...చారుఁడై — పుణ్యాంగనా = పుణ్యస్త్రీలచే, విహిత = ఈయఁబడిన, నీరాజన = కర్పూరహారతియనెడి, మంగళోపచారుఁడై = మంగళోపచారము కలవాఁడై, గారాపువియ్యంబు = తన ముద్దు బావమఱఁదియగు దమునియొక్క, ముంజేయి, కరతలంబునన్, అవలంబించి = ఊఁతఁగాఁ గైకొని, అల్లనల్లనన్ = మెల్లమెల్లఁగా, నడిచి, బంధు...వేష్టితంబై — బంధుజన = చుట్టములయొక్క, పరంపరా = పం

స్త్రులచే, పరివేష్టితంబై=ఆవరింపఁబడినదై, పురోహిత బ్రాహ్మణసహితంబై= పురోహితులతోను, బ్రాహ్మణులతోను, గూడుకొన్నదై, పురంధ్రీ...భరితంబు-పురంధ్రీ=అంతఃపుర స్త్రీలయొక్క, నికురుంబ=సమూహములయొక్క, సంబాధ=సమ్మర్దముచే, భరితంబు = నిండినది, ఐన వివాహమంటపంబుఁ, చేరఁ=చనుదెంచి, దూరంబునఁ, ఎదురుగావచ్చు భీమ భూపాలునకుఁ = తన కభిముఖముగా వచ్చుచున్న భీమరాజునకు, అభివాదనము చేసి=నమస్కరించి, అతండును=నలుఁడును, సమున్నత కనకాసనంబునఁ =ఎత్తయిన బంగారుగద్దియపై, ఆసీనుండై=కూర్చుండి.

తా. స్పష్టము.

ఉ. పారణచేసెరాజు మధుపర్కపుఁదేనియ మామభీమ ధా
త్రీరమణుండుమంత్రసము దీరణపూర్వముగాఁగఁబోయఁద
త్పారణ భోజభూపతిసుతామధురాధర చుంబనక్రియా
పారణకున్నిదానమయి భావమునువ్విళులూరఁ జేయగన్.

టీ. రాజు=నలరాజు, భీమధాత్రీరమణుండు=భీమరాజు, మంత్రసముదీరణపూర్వముగాఁగఁ=మంత్రోచ్చారణ పూర్వకముగా, పోయఁ=చేతిలోపోయుచుండఁగా, మధుపర్కపు తేనియఁ=దధిఘృతయుక్తమయిన తేనియను, పారణచేసెఁ=త్రావెను. తత్పారణ=ఆత్రావుట, భోజ...పారణకుఁ-భోజభూపతిసుతా=దమయంతియొక్క, మధురాధర=తియ్యని యధరోష్ఠముయొక్క, చుంబనక్రియా=ముద్దుకొనుట రూపమయిన, పారణకుఁ=త్రోలుటకు, నిదానమయి=కారణమై, అనఁగా దమయంతీ మధురాధరోష్ఠ పానమునకు హేతుభూతమై యని భావము. భావమును = చిత్తమును, ఉవ్విళులూరఁ, ఊట లూరించుచుండఁగా, అనఁగా నెప్పుడు దమయంతి యధరోష్ఠమును ముద్దిడి పానముచేయుదునని చిత్తము తత్తఱపడునట్లుగా, పారణచేసెఁ, అని వెనుకవాక్యముతో నన్వయము.

తా. భీమభూపాలుఁడు మంత్రోచ్చారణ పూర్వకముగా దధిఘృత సహి

తమగు తేనియను జేతిలోఁబోయఁగా దానిని ద్రావెను. ఆమధురసపానము ద మయంతి యధరోష్ఠపానమును జేయవలయునని భావము నుదయింపఁజేసెను.

చ. సకల ధరాధినాధునకుఁ జంద్రనిభాస్యకుఁ గేలుఁదామరల్
ప్రకటముగాఁగఁ గట్టుపడెఁ బావనకౌతుకసూత్రరక్షచే
నొకటి పరోపఘాతకము నొక్కటి పంకజకాంతితస్కరం
బొకమరియేల కట్టువడకుండు మహీపతియాజ్ఞ గల్గినన్. 89

టీ. సకల ధరాధినాధునకున్=సమస్తమగు భూతలమునకు నధిపతియగు నలునకును, చంద్రనిభాస్యకున్=చంద్రునివంటి ముఖముగల దమయంతికిని, పావన...రక్షచేన్ - పావన=పవిత్రమైన, కౌతుక సూత్రరక్షచేన్=కంకణపు దారముచే, కేలుఁదామరల్ = హస్తపద్మములు, ప్రకటముగాఁగన్ = స్పష్టముగా, కట్టుపడెన్=బంధింపఁబడెను. అనఁగా దేశాచార ప్రకారముగా వారిచేతులందు బర్హిస్సంబంధియగు తోరములను గట్టిరి. ఒకటి=ఆ రెండింటిలో నొకటియగు నలునిచేయి, పరోపఘాతకము=పరులను బాధించునది, రెండవపక్షమున, శత్రువులను సంహారించునదని యర్థము. ఒకటి=మఱియొకటి యగు దమయంతి చేయి, పంకజకాంతి తస్కరంబు=పద్మముల కాంతిని హరించినది; రెండవపక్షమునఁ బద్మములను మించియున్నదని భావము. ఒకటి పర హింస చేసినదియు, రెండవది దొంగతనము చేసినదియు, గావున నపరాధములు చేసియున్నవి. మహీపతి యాజ్ఞ=రాజాజ్ఞ, కల్గినన్=చేయఁబడినచో, ఒకమఱి=ఒక్కమాఱుగా ఏలకట్టు పడక, ఉండున్=ఎందులకు బంధింపఁబడవు? అపరాధులను రాజాజ్ఞచే రాజపురుషులు బంధించుట యాచారము. అట్లై వీరిచేతు లపరాధము చేసినవి కాన భీమరాజాజ్ఞచొప్పునఁ బురోహితులు బంధించిరని భావము. అనఁగా భీమరాజు సెలవుగైకొని వివాహార్థము వారిచేతులకు రక్షాబంధంబులు గట్టిరని ఫలితార్థము.

తా. వివాహకాలమున నలదమయంతుల చేతులు వివాహదీక్షాకంకణములచే బంధింపఁబడె. వానిలో నొకటి పరోపతాపకము. రెండవది పద్మకాంతి తస్కరమును గాన రాజాజ్ఞచే నేల బంధింపఁబడవు? అలం. హేతూత్ప్రేక్ష.

తే. నృపతిచేతికి మీఁదుగాఁ నెలఁతచెయ్యి
గీలుకొనఁజేసె నొకపేరఁటాలపడఁతి
యదియ పుణ్యాహవాచనావాప్తియయ్యె
భావి యగునంబుజాక్షీపుంభావమునకు. 90

టీ. ఒక పేరటాలపడఁతి = ఒక పేరంటాలు, నృపతిచేతికి మీఁదుగాన్ = నలరాజుచేతికి మీఁదుగా, నెలఁతచెయ్యి=దమయంతి హస్తమును, కీలుకొనన్ చేసెన్=హత్తించెను, అదియ=అహత్తించుటె, భావి=ముందువచ్చెడిది, అగు నంబుజాక్షీపుంభావమునకున్ = అయినట్టి దమయంతి పురుషాయిత రతము నకు, పుణ్యాహ వాచనావాప్తి-పుణ్యాహ వాచనా=పుణ్యాహమని చెప్పించు టయొక్క, అవాప్తి=పొందుట, అయ్యె. పురుషాయితమందు స్త్రీలచేతులు మీఁదుగానుండును. కాన యిచ్చట వివాహసమయం దాచారముచొప్పున దమ యంతి చేతిని నలునిచేతిపై నుంపఁగా నది ముందు జరుగఁబోవు పురుషాయిత క్రియకుఁ గూడ బుణ్యాహమును జెప్పించుచున్నట్లుండెను. శుభకర్మములకు ముందు తత్సిద్ధికొఱకుఁ బుణ్యాహవాచనముచేయుట ప్రకటము.

తా. వివాహసమయమం దొక పేరఁటాలు వచ్చి దమయంతిచేతిని నలుని చేతిపై నుంచెను. అట్లుంచుట ముందు జరుగఁబోవు దమయంతి పురుషాయి తమునకుఁ గూడ నాదినమే పుణ్యాహమని చెప్పించినట్టు లుండెను.

వ. తదనంతరంబ. 91

ఉ. వాసికినెక్కు కూర్మిజనవల్లభుఁ డిచ్చెను వైరసేని క
బ్జాసనవంద్య దుర్గ తనకర్థి వరంబుగ నిచ్చె నెద్ది యు
క్కాసరరక్తబీజ మధుకైటభశుంభ నిశుంభ చండముం
డాసురకంఠఖండన విహారమహోగ్రము మండలాగ్రమున్.

టీ. వాసికిన్=ప్రఖ్యాతికి, ఎక్కు కూర్మిన్=పొందినప్రేమతో, జనవల్లభుఁ డు=భీమరాజు, తనకున్, అబ్జాసన వంద్య=బ్రహ్మచే నుతింపఁదగినదగు, దుర్గ= దుర్గాదేవి, అర్థిన్=ప్రీతితో, వరంబుగన్=వరరూపముగా, ఏద్ది=ఏఖడ్గమును,

ఇచ్చెన్=ఒసంగెనో, అక్కా-సర...దండమున్-ఆ=ప్రసిద్ధిచెందిన, కాసర=మహిషాసురుఁడు, రక్తబీజ=రక్తబీజుఁడు, మధు=మధుఁడు, కైటభ=కైటభాసురుఁడు, శుంభ=శుంభుఁడు, నిశుంభ=నిశుంభుఁడు, చండ=చండుఁడు, ముండ=ముండుఁడు, అను, అసుర...మహోగ్రము- అసుర=రాక్షస సమూహములయొక్క, కంఠ=మెడలను, ఖండన=ఛేదించుటయనెడి, విహార=క్రీడచే, మహోగ్రమున్=మిక్కిలి భయంకర మగునదియు, నగు, మండలాగ్రమున్=కత్తిని,వైరసేనికిన్=వీరసేనుని కుమారునకు, అనఁగా నలునికనుట, ఇచ్చెన్.

తా. ప్రఖ్యాతివహించిన భీమరాజు వివాహసమయమున, మహిషాసురుఁడు, రక్తబీజుఁడు, మధుకైటభులు, శుంభనిశుంభులు మొదలగురక్కసుల కంఠముల ఖండించి యప్పటి విహారముచే భయంకరమయినదియుఁ, బూర్వము దుర్గాదేవి తనకు వరరూపముగా నిచ్చినదియునగు ఖడ్గమునల్లునకు బహుమతిగా నొసంగెను.

క. సంతోషంబున ధరణీ
కాంతుం డల్లునకు నిచ్చెఁ గారా మారం
జింతామణిదామకముం
జింతితకామప్రదాన శిక్షాక్షమమున్. 93

టీ. ధరణీకాంతుండు = భీమరాజు, సంతోషంబునన్ = సంతసముతో, గారాము=ప్రేమము, ఆరన్ = నిండునట్లుగా, చింతిత...క్షమమున్—చింతిత=కోరిన,కామ=కోర్కెని, ప్రదాన=ఇచ్చుటయందలి, శిక్షా = నేర్పునందు, క్షమమున్=సమర్థమైన, చింతామణిదామకమున్=చింతామణులతోఁ గూర్పఁబడిన హారమును, అల్లునకున్=నలరాజునకు, ఇచ్చె.

తా. భీమరాజుకోరిన కోర్కెలనిచ్చుటయందు సమర్థమగు చింతామణిహారమును సంతోషముతోను,ప్రేమముతోనుఁ, దనయల్లుఁడగు నలునకొసంగెను.

తే. జముని నాలుకతో నెకసక్కెమాడఁ
దమకపడు క్రొత్తవెడి మొసళము కటారి

భీమనృపుఁ డిచ్చె గారాపుఁ బెద్దపెండ్లి
కొడుకుఁ గుఱ్ఱకు నైషధక్షోణిపతికి. 94

టీ. జమునినాలుకతోఁ=యమునినాల్కతో, ఎకసక్కెమాడఁ=పరిహాస ముచేయుటకు, తమకపడు=ఆసక్తిగల, క్రొత్తపైఁడిమొలముకటారి=క్రొత్త బంగారు పూఁతగలకత్తిని, గారాపుఁబెద్దపెండ్లికొడుకుగుఱ్ఱకు=అల్లారు ముద్దయిన యల్లుఁడయిన కుమారునకు నైషధక్షోణిపతికిఁ=నలరాజునకు, ఇచ్చెఁ=ఒసంగెను. 'కొడుకుఁగుఱ్ఱ' ప్రయోగములు గానవచ్చుచున్నవి. సీ...కొడుకుఁ గుఱ్ఱఁడు చన్నుఁగుడుపకట్లుండ విచారించి మేదరసాని యపుడు. పరమ. 1-ఆ. మొలాముచేతనే కత్తికి జముని నాలుకతో సాటి. అలం. ఉపమ.

తా. స్పష్టము.

తే. వీరమాహేశ్వరాచార పారగునకుఁ
దనకు శశిమాళి యిచ్చిన కనకరథము
కామగమనంబు నైషధక్ష్మావరునకు
మామ యిచ్చెను మాయని మహి నుతింప. 95

టీ. మామ=భీమరాజు, నైషధక్ష్మావరునకుఁ=నలరాజునకు, మహి=భూజనులు, మాయని=వహ్వారేయని, నుతింపఁ=పొగడునట్లుగా, కామగమనంబుఁ= స్వేచ్ఛవచ్చినగమనము గలదియు, వీర...పారగునకుఁ—వీరమాహేశ్వరాచార=వీరశైవాచారములయొక్క, పారగునకుఁ = పారముపొందిన, తనకుఁ, శశిమాళి=చంద్రుని ధరించినవాఁడు, అనఁగా నీశ్వరుఁడనుట, ఇచ్చినకనక రథము=ఇచ్చినట్టిబంగారురథమును, ఇచ్చెఁ.

తా. భూజనులు వహ్వారేయని నుతించునట్లు వీరశైవాచారములందలి నైపుణ్యమునకు సంతసించి తనకు శంకరుం డొసంగినదియుఁ గామగమనముగల దియునగు కనకరథమును భీమరాజల్లునకిచ్చెను. అలం. కావ్యలింగము.

క. అల్లునికి నిచ్చె ధరణీ
వల్లభుఁ డనురక్తి నమరవల్లభుహరితో

నుల్లస మాడంజాలెడు
తెల్లనియొకకత్తలానితేజీహయమున్.  96

టీ. ధరణీవల్లభుఁడు=భీమరాజు, అనురక్తిన్=అనురాగముతో, అమరవల్లభుహరితోన్ = దేవేంద్రుని గుఱ్ఱమగు నుచ్చైఃశ్రవముతో, ఉల్లసమాడన్ = పరిహాసములు చేయుటకు, చాలెడు=సరిపోయెడు, అనఁగా నుచ్చైఃశ్రవము వలెఁ దెల్లనిదని భావము. తెల్లని, ఒకకత్తలానితేజీహయమున్ = ఒకప్రశస్తమగు గుఱ్ఱమును, అల్లునికిన్, ఇచ్చెను. కత్తలానియనఁగాఁ, దెల్లనిగొరిజలతోను, దోఁకతోను, వెండ్రుకలతోను వెలయుచల్లని గుఱ్ఱమనియర్థము. అయిన నిచ్చట నుచ్చైఃశ్రవమువలెఁ దెల్లనిదని విశేషణమిచ్చుటచే కత్తలాని పదమునకు సామాన్యహయమను నర్థము గ్రహింపవలెను. లేక యుచ్చైశ్శ్రవముతో సరిపచ్చు తెల్లని గొరిజ మొదలగునవి గలదని యర్థము చెప్పినను యుక్తమనియే తోఁచుచున్నది.

తా. భీమరాజల్లుని కుచ్చైశ్శ్రవమువలెఁ దెల్లని మేలుజాతి గుఱ్ఱము ననురాగముతో నొసంగెను.

తే. ప్రథమజామాత కిచ్చె భూపాలతిలకుఁ
డగ్నిశోభంబులైన దివ్యాంబరములు
సౌహృదంబు ఘటింప వైశ్వానరుండు
తనకు నెయ్యవి పుత్తెంచెఁ దాను మొదల.  97

టీ. భూపాలతిలకుఁడు = రాజశ్రేష్ఠుఁడయిన భీమరాజు, తనకు, సౌహృదంబు=స్నేహమును, ఘటింపన్=నెఱపుటకై, వైశ్వానరుండు=అగ్నిహోత్రుఁడు, తాన్, మొదలన్=స్వయంవరమునకు వచ్చినపుడు, ఎయ్యవి=ఏవస్త్రములను, పుత్తెంచెన్=పంపెనో, అట్టివియును, అగ్నిశోభంబులు = అగ్నియొక్క శోభవంటి శోభగలవియు, ఐనదివ్యాంబరములు=అయినట్టిమనోహరమగు వస్త్రములు, ప్రథమజామాతకున్=మొదటియల్లునకు, ఇచ్చెన్,ఇందు మూడవపాదంబునఁ జెక్కినట్టి ప్రతులలో "సహృదయంబున నిచ్చివైశ్వానరుండు" అని

పాఠము గానవచ్చుచున్నది. సహృదయశబ్ద మనన్వితము, సంస్కృతములో "యస్సాహృదనాటినాగ్నినా" అనియున్నది కాన తదనుగుణముగా, నిందుండు టుచిత మనియిట్లు దిద్దఁబడెను.

తా. భీమభూపాలుఁడు దమయంతిపై ననురాగమును జూపుచు మొదటఁ దనకేవ స్త్రీములను బంపెనో యగ్నివలెఁ బ్రకాశించు నామనోహరవస్త్రము లను దనయల్లున కొసంగెను.

తే. మలఁచి యేకాండముగ నొక్కమానికమున
వేడ్క నెద్దాని నిర్మించె విశ్వకర్మ
యట్టిదేవేంద్ర దత్తమహార్ఘనూత్న
వీటికాపేటి మామ భూవిభున కొసఁగె. 98.

టీ. విశ్వకర్మ=దేవతలశిల్పి, మలఁచి=తటిమెఁబట్టి, ఏకాండముగన్=అఖండముగా-అతుకులులేకుండ, ఒక్కమానికమునన్=ఒక్కరత్నముచేత, వేడ్కన్=ఆదరములో, ఎద్దానిన్=ఏపెట్టెను, నిర్మించెన్=చేసెనో,అట్టి... పేటి-అట్టి=అటువంటిదియును, దేవేంద్ర = ఇంద్రునిచే, దత్త=ఈయఁబడిన, మహార్ఘ=మిక్కిలివిలువఁగల, నూత్న = క్రొత్తదయిన, వీటికాపేటిన్ = తాంబూలపుఁబెట్టెను, మామ, భూవిభునకున్=నలరాజునకు, ఒసంగెన్ = ఇచ్చెను.

తా. విశ్వకర్మ యింద్రునిపంపునఁ దొలిచి యొక్కరత్నముచేతనే యఖండముగా నేపెట్టెను నిర్మించి యింద్రుని కొసంగఁగా నతఁడు దమయంతియందలి ప్రేమాతిశయముచేఁ దనకిచ్చెనో యాపెట్టెను మామ యల్లునకుఁ గానుకగా నొసంగెను.

మ. పవనాహారవిషంబు సోఁకదు యదాపమ్యాంబునంగేకిఁ గే
కివిలాసంబునఁ దాండవారభటిసంక్రీడించుటన్ క్ష్వేళ మ
భ్యవహారించెఁ గపాలి యన్న మతియేలా చెప్పఁ దచ్ఛుక్తియ
న్నవ గారుత్మత భుక్తిపాత్రమొసఁగెన్రా జాత్మజాభర్తకున్.

టీ.  ...త్మతపాత్రము

యొక్క యుపమానముగల దగుటచే, పవనాహారవిషంబు=సర్పవిషము, సోఁక దు = ఆవేశింపఁదో, అనఁగా నెమిలియాపాత్రముకాంతికి సరియగు కాంతిని దాల్చుటచేతనే సర్పముల విషమానెమిలి కెక్కదని భావము. మఱి=ఇంకను, కపాలి=శివుడు, కేకివిలాసంబులన్ =(ఆపచ్చతాపళ్లెరమును బోలిన) నెమలిలీల తో, తాండవారభటిన్ =ఉద్ధతమగునాట్యాతిశయముచే, సంక్రీడించుటన్ = ఆడుటచే, క్ష్వేళము= కాలకూటవిషమును,అభ్యవహరించెన్ =తినెను. అనితచ్ఛ క్తిం=పళ్లెరమునకుఁ గల (విషమును హరించు) శక్తిని, చెప్పన్ = ఎన్నుటకు, ఏలా=ఎందులకు. అనఁగా అన్నన...పాత్ర - ఆ=అట్లు ప్రసిద్ధమైనవ=క్రొత్త దైన, గారుత్మత=గరుడపచ్చలతోఁ జేయఁబడిన, భుక్తిపాత్రన్ =భోజనపాత్ర మును, రాజు=భీమరాజు, ఆత్మజాభర్తకున్ =అల్లునకు, ఒసంగెను.

తా. గరుడపచ్చతాతిపళ్లెరము భీమరాజు అల్లున కిచ్చెను. దాని వన్నె వంటివన్నె గలది గాన నెమిలి పామును దిన్నను విష మొందదు. అనెమిలివలె నాట్యము సేయుటచే శివుఁడును గాలకూటవిషమును మ్రింగఁ గలిగినాఁ డని యర్థము. ఆపచ్చరాపళ్లెరమును బోలినవానికిని, ఆపోలినవానిని బోలినవానికి నేవిషము సోఁకకుండఁగా నాపళ్లెరము విషము హరించుటను జెప్పవలెనా యని భావము. మరకతము విషహరమని ప్రసిద్ధి. అలం. ఉత్ప్రేక్ష. అర్థాపత్తి.

చ. గరిమ వరాటరాజు తనకోఁగాఁదిలియల్లున కిచ్చె ఘోటికా
కరటిపటీరహీరగణికామణికాంచనముఖ్యవస్తువుల్
పరిణయదక్షిణార్థమయి ప్రౌఢతమీఱఁగ నప్పదార్థముల్
సరిఁ బరిపాటి నెన్నఁగ నశక్యము గీష్పతియంతవానికిన్.100

టీ. వరాటరాజు=భీమరాజు, తనగాదిలియల్లునకున్ =తనముద్దుటల్లునికి, పరి ణయ దక్షిణార్థమయి=వివాహకాలమున వరదక్షిణ నిమిత్తము, ఘోటికా... వస్తువుల్ -ఘోటికా=గుఱ్ఱములు,కరటి=యేనుఁగులు, పటీర=మంచిగంధపుతును కలు, హీర=వజ్రమణులు, గణికా=భోగపుస్త్రీలను, మణి=రత్నములను, కాం చన=బంగారును, ముఖ్య=మొదలగు, వస్తువుల్ =పదార్థములను, గరిమన్ =అతి శయముచే, ఇచ్చెన్, అప్పదార్థముల్ = ఆశ్రేష్ఠమగువస్తువులను, ప్రౌఢత=

నేర్పు, మీఱఁగాన్ = అతిశయించునట్లుగా, సరిన్ = సరిగా, పరిపాటిన్ = క్రమముగా, ఎన్నఁగన్ = స్తోత్రముచేయుటకు, గీష్పతియంతవానికిన్ = బృహస్పతియంత గొప్పవానికిఁగూడ, అశక్యము = తరముకాదు. అనఁగా నిరుపమానములును వర్ణనాతీతములునగు వస్తువుల నిచ్చెనని భావము.

తా. భీమరాజు తనయల్లునికి, హయములు, గజములు, మంచిగంధము, వజ్రములు, భోగస్త్రీలు, రత్నములు, కాంచనము మొదలగు పెక్కువస్తువులను గొప్పతనముతో నొసంగెను. ఆవస్తువులను సరిగాఁ గ్రమముగా నేర్పొప్పఁగా వర్ణింప బృహస్పతికైనను దరముకాదు. అలం. అతిశయోక్తి. ఉదాత్తము.

సీ. భక్తిప్రదక్షిణప్రక్రమంబులఁ జేసి
 రాశుశుక్షణికి నుపాసనంబు
నంశుకగ్రంథికల్యాణక్రియాచార
 మాచరించిరి మందహాస మెసఁగ
నత్రిపత్నిఁ జూచిరి యాకాశమండలా
 స్థానరత్నంబు నౌత్తానపాదిఁ
ద్రైలోక్యపతి దేవతాఫాలతిలకంబుఁ
 దివిని యరుంధతీదేవిఁ గనిరి
తే. బ్రాహ్మణోత్తమపుణ్యాపుణ్యసంధిసవర్గ
మంగళాశీర్వచోయుక్తమహిమశోభ
నాక్షతారోపణంబుల నాదరించి
రంబుజాక్షియు నిషధదేశాధిపతియు. 101

టీ. అంబుజాక్షియున్ = పద్మములవంటి నేత్రములుగల దమయంతియు, నిషధదేశాధిపతియున్ = నిషధదేశరాజగు నలుండును, భక్తిప్రదక్షిణ ప్రక్రమంబులన్ = భక్తితోఁగూడిన ప్రదక్షిణముగా నడచుటలచేత, ఆశుశుక్షణికిన్ = అగ్నికి, ఉపాయనంబు = కానుకను, చేసిరి, అనఁగా - సఖ్యమునకై సప్తపదిగావించిరనుట. ఏడడుగులు నడిచెదరని సఖ్యము గలుగునందురు. వధూవరు లందులకై

యగ్నిచుట్టు నేడడుగులు పెట్టి రనట. మందహాసము=చిఱునగవు, ఎసఁగన్=అతిశయించునట్లుగా, అంశుక ... చారము-అంశుకగ్రంథి=వధూవరుల చేలాంచములను ముడివేయుటయనెడి, కల్యాణ=వివాహసంబంధియగు, క్రియా=పనియొక్క, ఆచారము=మరియాదను, ఆచరించిరి. అనఁగా వివాహములందు దంపతులకు నెడఁబాటు కలుగమికై చేలాంచలములకు ముడివేయు నాచారము కలదు. నలదమయంతు లాయాచారము ననుసరించిరని భావము. ఆకాశ...రత్నంబు-ఆకాశమండల = వలయాకారముగా నున్న యాకాశమనెడి, ఆస్థాన=సభకు, రత్నంబు=అలంకారమువంటివాఁ డగు, ఔత్తానపాదిన్ = ధ్రువుని, అభ్యున్నతి=మెడనున్నతముగాఁజేసి, చూచిరి- వధూవరుల స్థిరదాంపత్యముకొఱకనుట. త్రైలోక్య... తిలకఁబు-త్రైలోక్య=మూడులోకములందునుఁగల, పతిదేవతా=పతివ్రతలగు స్త్రీలయొక్క, ఫాల=నొసల్లకు,తిలకంబు=తిలకమువంటిది, అనఁగా సమస్తపతివ్రతలలోను నుత్కృష్టురాలగునదని భావము. అరుంధతీదేవిన్, తివిరి=ప్రయత్నించి,కనిరి=చూచిరి-ఇది పాతివ్రత్యముకొఱకు. బ్రాహ్మ... రోపణంబులన్-బ్రాహ్మణోత్తమ=బ్రాహ్మణశ్రేష్ఠుల యొక్కయు, పుణ్య=పవిత్రురాండ్రయిన, పురంధ్రి=ముత్తైదువులయొక్కయు, వర్గ = సమూహముయొక్క,మంగళ=శుభప్రదములగు,ఆశీర్వచః=ఆశీర్వచనముల చేత, యుక్తమహిమ=కూడినసుహిమగలవగు, శోభన=శుభప్రదములగు,అక్షత=అక్షింతలయొక్క, ఆరోపణంబులన్=ఉంచుకొనుటలను, ఆదరించిరి=మన్నించిరి. బ్రాహ్మణులును బుణ్యస్త్రీలును నాశీర్వచించుచు నొసంగిన యక్షతలను ధరించిరని భావము.

తా. నలదమయంతులు వహ్నికిఁ బ్రదక్షిణ నమస్కారము లాచరించిరి. చేలాంచములను బురోహితుఁడు ముడివేయుచుండఁ జిఱునగవులో నంగీకరించిరి. ఆకాశమునకు రత్నమువంటి ధ్రువునిఁగాంచిరి. ప్రతివ్రతాతిలకమైన యరుంధతిని జూచిరి. బ్రాహ్మణోత్తములును బుణ్యాంగనలగు ముత్తైదువులును నాశీర్వచించి యొసంగిన యక్షతలను తలలపై వహించిరి.

ఉ. కంకణనిక్వణంబు మొగసికట్టఁగఁగా నసియాడ రత్నతా
టంకవిభూషణంబులు వడిఁడంకఁ గుచంబులు బరాయిడింపఁగాఁ

బంకజనేత్ర గౌతమునిపంపున లాజలు దోయిలించి ధూ
మాంకునియందు వేల్చెదరహాసము ఱెప్పలలోన దాఁచుచున్.

టీ. పంకజనేత్ర=దమయంతి, కంకణనిక్వణంబు=కంకణములధ్వని, మొగ కట్టఁగన్=మ్రోఁగుచుండఁగా, కౌను=నడుము, అసియాడన్ = కదలుచుండఁగా, రత్నతాటంకవిభూషణంబులు=రత్నమయము లయినకర్ణభూషణములు, వడంకన్ = చలించుచుండఁగా, కుచంబులు = స్తనములు, రాయిడింపఁగా=ఒకదానినొకటి యొరసికొనుచుండఁగా, లాజలు = పేలాలను, గౌతమునిపంపునన్ = గౌతమమహర్షి యానతిచే, దోయిలించి = దోసిలితోఁదీసి, దరహాసమున్ = మందహాసమును, ఱెప్పలలోనన్=కనుఱెప్పలలో, దాఁచుచున్=దాఁగునట్లుచేయుచు, ధూమాంకునియందున్=పొగయెలక్షణముగాఁ గలవానియందు-అనఁగా నగ్నియం దనుట. వేల్చెన్=హోమముచేసెను.

తా. దమయంతి పురోహితుఁ డగుగౌతముండు చెప్పినట్లుగాఁ బేలాలను దోసిలితోఁ బట్టికొని కంకణముల చప్పుడు వెలువడుచుండ, నడు మూఁగులాడుచుండ, రత్నమయము లగుకర్ణభూషణములు కదలుచుండ, స్తనము లొరసికొనుచుండఁగా, పొడముచున్నమందహాసమును గనుఱెప్పలచేఁ గప్పిపుచ్చుచు నగ్నియందు హోమము చేసెను.

సీ. చెక్కుటద్దములపైఁ జెఱలాడునప్పుడు
కస్తూరికాపత్రకములఁబోలె
శ్రవణపాశములలోఁ జిక్కఁగి పాఱునప్పు
లలితతమాలపల్లవముఁ బోలెఁ
గలికికన్నులలోనఁ గొలుపారునప్పుడు
నవలీలనీలాంజనంబువోలె
ఫాలభాగంబుపైఁ బఱితెంచునప్పుడు
కమనీయచూర్ణాలకములఁ బోలె

తే. నప్పు డావరితాజ్యధారాభిషార

పరిమిళల్లాజనవశమీపల్లవాగ్ర
హుతహుతాశనజిహ్వాసముత్థ మగుచు
హోమధూమంబు బాలపైఁ నొయ్యఁ బొలసి. 103

టీ. హోమధూమంబు, ఆవర్జి... సముద్ధము - ఆవర్జిత=ఈనల దమయంతు లచే విడువఁబడు, ఆజ్యధారాభిఘార= నేతిధారపోఁతలయందు, పరిమిళత్ = పరిమళించుచున్న, లాజ=పేలాలచేతను, నవశమీపల్లవాగ్ర=క్రొత్తజమ్మిచివురుల చేతను, హుత=హోమము చేయఁబడిన, హుతాశన=అగ్నిహోత్రముయొక్క, జిహ్వా=జ్వాలలవలన, సముత్థము=పుట్టినది, అగుచున్, ఒయ్యన్=క్రమముగా, చెక్కుటద్దములపైన్=అద్దములవంటి చెక్కిళులమీఁద, చెలఁగాడునప్పుడు= తిరుగునప్పుడు, కస్తూరికాపత్రకములఁబోలెన్=మకరికాపత్రములవలెను, అనగా-ధూమము మకరికాపత్రములును బోలి నల్లగా నుండుటచే స్త్రీలలంకరించికొను మకరికాపత్రములవలె నుండెనని దాని నుత్ప్రేక్షించినాఁడు. ఈ రీతిగనే క్రిందిమూఁడుపాదములలోను స్త్రీలలంకరించుకొను నల్లనికాంతులు గల యాభరణవిశేషములుగాఁ బొగను త్ప్రేక్షించెను. శ్రవణపాళములలోన్=చెవుల దరినుండి, చాఁగిపాఱెడునపుడు=సాగిపోవునపుడు, లలితతమాలపల్లవముఁబోలె= సుందరమగు కానుగుచిగురువలె - తమాలపల్లవము నల్లగా నుండును - స్త్రీలు దానికర్ణభూషగాఁ దాల్చుచుందురు. కలికికన్నులలోనన్ = సొగసయిన నేత్రములందు, పొలుపారునప్పుడు=ప్రకాశించునప్పుడు, నవలీలనీలాంజనంబు వోలెన్=క్రొత్తవిలాసముగల నల్లనికాటుకవలె- స్త్రీలు నల్లనికాటుకను కన్నుల నిడుకొనుటప్రసిద్ధియే, ఫాలభాగంబుపైన్=లలాటముమీఁద, పఱతెంచునప్పుడు =ప్రసరించునెడ, కమనీయచూర్ణాలకములఁబోలె=మృదులములగు ముంగురుల వలె, సౌందర్యవతు లగుసతులు లలాటముపై వ్రేలునట్లు ముంగురులఁ బెనుచు చుండుటగలదు, బాలపైన్=దమయంతిపైని, పొలసి=పర్వి, వెనుకనన్వయము.

తా. నేయి మొదలగువానిచే వృద్ధినొందిన హోమధూమము దమయంతికి చెక్కులపై మకరికాపత్రములవలెను, కర్ణములయందు తమాలపల్లవములవలె

ను, నేత్రములయందు కాటుకవలెను, మోమునందు ముంగురులవలెను ప్రకాశించెను. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. కాంచన ముద్రికామణినికాయకరాళవలన్మయూఖరే
ఖాంచల చక్రచుంబిత నఖాంకుర మైన నృపాలుచేట్టఁ బ
ట్టించెఁ బ్రమోదసంపద ఘటిల్లఁగ నొక్కపురంధ్రి నవ్యరో
మాంచము గ్రొత్తలేఁ జెమరుకొనయ్యిరుగేలనుసంభవింపగన్.

టీ. ఒక్కపురంధ్రి = ఒక ముత్తైదువ, ప్రమోద సంపద = సంతోషాతిశయము, ఘటిల్లఁగన్ = సంభవించుచుండఁగా, అయ్యిరు గేలను=ఆయిరువురి చేతులందును, నవ్యరోమాంచమును = క్రొత్తగగుర్పాటును, క్రొత్త లేఁజెమరు=క్రొత్తయైన చిఱుచెమటయు, సంభవింపఁగాన్ = సంభవించు చుండఁగాను, కాంచనము...నఖాంకురము - కాంచన=సువర్ణవికారమయిన, ముద్రికా=యుంగరములందున్న, మణి=రత్నములయొక్క, నికాయ=సమూహము యొక్క, కరాళ=దట్టములయిన, వలత్ =వ్యాపించుచున్న, మయూఖరేఖా=కిరణపంక్తులయొక్క, అంచల=కొనలయొక్క, చక్ర=వలయముచే, చుంబిత=ముద్దిడఁబడుచున్న-ఆవరింపఁబడిన, నఖాంకురము=గోళ్లుగలది, ఐన నృపాలుచేట్టన్ = అయినట్టి రాజుయొక్క చేతిని, పట్టించెన్ =దమయంతిని బట్టుకొనునట్లు చేసెను, అనఁగా నలునిచేయి వ్రేళ్లయందున్న యంగుళీయక రత్నముల కాంతి సంపదచే మిళితములగుచున్నగోళ్లు గలదని భావము—ఇట్ల వధూవరుల కరగ్రహణము కౌతుకాగారమునకుఁ బోవుటకు

తా. ఒకపురంధ్రి బంగారపు టుంగరములందున్న రత్నముల కాంతులచే వెలుగొందు నఖములుగల నలునిచేతిచే దమయంతిచేతిని బట్టుకొనునట్లు చేసెను. అప్పుడు వారికి సంతోషాతిశయము సంభవించెను. వారిరువుర చేతులందును, గగుర్పాటు, క్రొత్తచెమ్మట మొదలగు సాత్వికవికారములు ప్రబలెను.

వ.ఇట్లు పాణిగ్రహణంబొనర్చి పురంధ్రీజనవిలోకనార్థంబు సహస్రరంధ్రీకృతంబుగాఁ జేయఁబడిన కౌతుకాగారంబు ప్రవేశించి.

టీ. ఇట్లు, పాణిగ్రహణంబు=కరగ్రహణమును, ఒనర్చి=చేసి, పురంధ్రీజన విలోకనార్థంబు = ముత్తైదువలు చూచునిమిత్తము, సహస్రరంధ్రీకృతంబు = వేయిరంధ్రములు గలదిగా చేయఁబడిన, కౌతుకాగారంబు=వివాహమందిరము, ప్రవేశించి, చేరి, అని పైపద్యముతో నన్వయము.

తా. స్పష్టము.

గీ. దశశతాక్షుండు తొడుగు కుందనపుఁ బైఁడి
కంకటముఁబోలు వేజాలకములయింటి
మధ్యభాగంబునందు శ్రీమంచమెక్కి-
రంబుజాక్షియు నిషధ దేశాధిపతియు. 106

టీ. అంబుజాక్షియు=దమయంతియు, నిషధ దేశాధిపతియు=నలరాజును, దశశతాక్షుండు=వేయు నేత్రములు గలవాఁడు, అనఁగా నింద్రుఁడనుట, తొడుగు కుందనపుఁ బైఁడికంటకము=ధరించెడి మేలిమి బంగారు కవచమును— వేయికన్నులుదెలియుటకై వేయిరంధ్రములు గలిగియున్న కవచమును, పోలు...భాగంబునన్ - పోలు = సరియగుచున్న, వేజాలకముల యింటి=వేయి కిటికీలుగల మందిరముయొక్క, మధ్యభాగంబునందున్=నడుమ, శ్రీమంచమున్=శోభాయుక్తమగు మంచెను, ఎక్కిరి=అధిష్ఠించిరి. "అనఁగా వధూవరులు వివాహాదినములం దొక్కచోఁ దిని "ఏకత్రశయనం త్రిరాత్రం బ్రహ్మచర్యం'' అని యిరువురును సంభోగాదులను విడిచి యొక్కచోట శయనింపవలయును గాన నలదమయంతు లట్టిమందిరము చేరి శయనించిరి' అనికొందఱు.

తా. దేవేంద్రుండుఁ దొడిగిన వేయు నేత్రములుగల కవచమువలె వేయి కిటికీలతో వెలయు నమ్మందిరము ప్రవేశించి మంచమారోహించిరి.

వ. అనంతరంబ భోజకులాభరణంబులగు దమదమను లిరువంకఁ
బెండ్లిచుట్టంబులకు భోజనంబులు వెట్టం గట్టడఁ జేసిరప్పుడు.

టీ. స్పష్టము.

సీ. పట్టాంశుకములపైఁ బన్నీరు ప్రోక్షించి

చేయార్చి చాఁపట్లు గ చేయువారు
మక్కళించినతావు గ మంజిళ్ల పెందెర
లుంగరంబులఁబట్టి గ యొత్తువారు
నగరుధూపముఁబెట్టి గ యభ్యంతరం బైన
గగనావకాశంబుఁ గ బొగపువారు
వెండియెడ్డనలపై గ వెలచితెచ్చిన పైఁడి
పళ్లెంబు లాయత్త గ పఱుచువారు

తే. రంకు మృగరోమ కృతనూత్న గ రత్నకంబ
ళాది నానావిధా భ్యర్హి గ తాసనములు
పెట్టువారునునై రిందు గ బింబవదన
లుభయబాంధవ భోజనో గ ద్యోగవేళ. 108

టీ. ఉభయబాంధవ భోజనోద్యోగ వేళన్ = ఇరువంక చుట్టములును భుజించునట్టి సమయమునందు, ఇందు బింబవదనలు = చంద్రబింబమువంటి మోములుగల స్త్రీలు, పట్టాంశుకములపైన్ = పట్టు వస్త్రములమీఁద, పన్నీరున్ = సుగంధిజలమును, ప్రోక్షించి = చల్లి, చేయార్చి = చేతితో యల్లార్చి తడిసిబోఁగొట్టి, చాఁపట్లు = అప్పడములవలెచదునైనవిగా, చేయువారు, మక్కళించిన... పెందెలు-మక్కళించిన = నిగిడించిన, తావు, మంజిళ్లు = మేలయినచిత్రవస్త్రములయొక్క, పెందెరలు = పెద్దతెరలను, ఉంగరంబులన్ పట్టి = దండెములందలి యినుప యుంగరములనుబట్టి, = ఒత్తువారును = ఒకమూలకు తోయువారును, అగరు ధూపమున్, పెట్టి, అభ్యంతరంబు = ఆ నడుమనున్నది, ఐన గగనావకాశంబును = అయినట్టి యాకాశ ప్రదేశమును, పొగపువారు = పొగపట్టించువారును, అనఁగా భోజనసమయమున దుర్గంధము లేకుండ నుండుటకై పరిమళ వర్ధకములగు ధూపములు వేసి యామధ్య గగనము మిక్కిలి పరిమళవంతముగావించుచున్నవారును, వెలచి = తోమి, తెచ్చిన పైఁడిపళ్లెంబులు = కొనివచ్చిన బంగారపు పళ్లెములను, వెండి ఎడ్డనలపైన్ = వెండి బల్లలపై, ఆయత్తపఱుచువారు

=సిద్ధము చేయుచున్న వారును, రంకు... తాసనములు—రంకుమృగ=ఒక విధమగు మృగముయొక్క, రోమ=కేశములచే, కృత = చేయఁబడిన, నూత్న = క్రొత్తవియగు,రత్నకంబళ=రత్నకంబళములు, ఆది=మొదలయిన, నానావిధ =అనేక విధములయిన, అభ్యర్హిత=పూజనీయములగు, ఆసనములు, పెట్టువారును, ఐరి. అనఁగా స్త్రీలు భోజనంబులకుఁ దగిన ప్రయత్నములు చేయుచున్నవారైరని భావము.

తా. స్పష్టము.

క. వ్రయ్యవడకుండ నాడిరి
వియ్యపు మేలంబు లుభయ విధబాంధవులున్
నెయ్యంబునఁ దియ్యంబున
నొయ్యనఁ జతురాక్షరాధి కోక్తిప్రౌఢిన్.　　　109

టీ. ఉభయవిధ బాంధవులున్ =రెండువంకల చుట్టములును, ఒయ్యనన్ = మెల్లగా, నెయ్యంబునన్ తియ్యంబునన్ =స్నేహ ప్రియములచే, చతురాక్షరాధి కోక్తిప్రౌఢిన్-చతుర = నేర్పునుసూచించెడి, అక్షర=వర్ణములచే, అధిక=గొప్పవగు, ఉక్తి=మాటలయందలి, ప్రౌఢిన్ =నిపుణతచే, వియ్యపు మేలములు=వియ్యంకు లాడుకొనెడి పరిహాసవాక్యములు,వ్రయ్యవడక, ఉండన్ =తునుకక్రిందఁబడకుండునట్టుగా, ఒకమాటనైన విడువకయని యర్థము. ఆడిరి=పలికికొనిరి.

తా. ఇరువంకల చుట్టములును, స్నేహయుతములగు ప్రియవచనములను జతురవాక్యములందలి నేర్పు వెల్లడియగునట్లు మాటకు మాట విడువక పరిహాసము లాడికొనిరి.

సీ. సర్వతోముఖపిపాసకుఁ దప్పిపడియెదు
　　కామమోదనము నిక్కముగవలయు
నీముఖంబున మాకు నెఱయంగ సుఖమబ్బుఁ
　　గాంచు గావుత నిన్నుఁ గమలయోని
యనులోమమున లెస్స పనిచేసి కొంటిప్డు

భగవదారాధన ♦ ప్రాప్తినిధివి
విద్వజ్జనులు నిన్ను ♦ విషయించి వత్తురు
కలమధురములు నీ ♦ గళరవములు
తే. అనుచు నెయ్యంపువియ్యంబు ♦ లల్ల నల్ల
సరసవర్గోక్తి చాతుర్య ♦ సౌష్ఠవమున
గోష్ఠి సలిపిరి తమలోనఁ ♦ గొంతప్రొద్దు
భోజనాగార పర్యంత ♦ భూములందు. 110

టీ. సర్వతో ముఖ పిపాస=జలమును ద్రావనిచ్చు—(అసభ్యార్థము-సర్వతః=అంతటను, ముఖపిపాస=అధరాభిలాష. కామము+ఓదనము=ఇష్టమైన యాహారము—(కామ+మోదనము = మదనానందనము.) నీముఖంబునన్=నీవలన—(నీ నోటిచేత) నెఱయంగన్ సుఖము=నిండుగాసుఖము—(నెఱ=నిండయిన అంగసుఖము=అవయవ సౌఖ్యము.) అనులో...టివి—తలవెంట్రుకలు చక్కఁగా సవరించుకొంటివి. భగ...నిధివి-భగవత్సేవ కలుగుటకు పట్టయినవాఁడవు. విషయించి=గూర్చి—(రమించుటకై), గళరవములు=గొంతు ఎలుఁగులు—(మణితములు.)

తా. స్పష్టము.

చ. లలన యొకర్తువగ్గు కృకలాసము చేరఁగఁదెచ్చి వంచనన్
నలునకుఁ గుంచెవట్టు నెలనాగపదద్వయ మధ్యమంబునన్
నిలిపినఁ గాలుఁద్రాఁక నది ♦ నీవియసీమకుఁ దోఁకిభామినుల్
గలకలనవ్వ నూడ్చ నది ♦ గట్టినపుట్ట ముపాయశూన్యతన్.

టీ. లలన, ఒకర్తు=ఒక స్త్రీ, వగ్గుకృకలాసము=చిక్కిన తొండను, వంచనన్=మోసముచే, చేరఁగన్, తెచ్చి=సమీపమునకుఁ గొనివచ్చి, నలునకున్=నలరాజునకు, కుంచె వట్టునెలనాగపదద్వయ మధ్యమంబునన్=వింజామర వీచుచున్న యొక స్త్రీయొక్క రెండుకాళ్ల నడిమి ప్రదేశమున, నిలిపినన్=ఉంపఁగా, అది=ఆతొండ, నీవియసీమకున్=పోఁకముడిదాపునకు, కా

లు ప్రాఁకన్ = కాలిమీఁదుగా ప్రాఁకి పోఁగా. అది=ఆ స్త్రీ), ఉపాయశూన్యతన్ = వేఱొక యుపాయము లేకపోవుటచే, తోడి భామినుల్ = తనతో నున్న స్త్రీలు, కలకలనవ్వన్ = పకపక నవ్వునట్లుగా, కట్టుపుట్టమున్ = కట్టు వస్త్రమును, ఊడ్చెన్ = వదలెను.

తా. ఒక స్త్రీ పరిహాసమునకై యెవ్వరికిఁ దెలియకుండ నొకబక్క తొండను దెచ్చి నలునకుఁ జామరము పట్టియున్న యొక స్త్రీ కాళ్లనడుమ నుంచెను. ఆతొండ కాలిమీఁదుగాఁ బ్రాఁకి పోఁకముడియొద్దకుఁ బోఁగా నది భయమున మెలపు తప్పి కోకవిడిచి దిగంబర యయ్యె. దానిని జూచి యచ్చటివారు నవ్విరి.

చ. అలికులవేణి యోర్తొకనిహస్తములన్ ముఖమజ్జనాంబువుల్
గలఁతియనెత్తిపోయ నవికార్చుచునుండె నతండు దోయిటన్
నెలకొని దానిక్రొమ్మెఱుఁగుకి నిద్దపుఁజెక్కులు ముద్దువెట్టుకోఁ
గెలవులవారిచూపు గిలిగిల్లు మొఱంగఁగ వేళఁగోరుచున్.

టీ. అలికులవేణి=తుమ్మెద గుంపువంటి జడగల, ఓర్తు=ఒక స్త్రీ, ఒకనిహస్తములన్ = ఒకని చేతులలో, ముఖమజ్జనాంబువుల్ = ముఖప్రక్షాళనోదకమును, గలఁతియన్ = గిండిచెంబుతో, ఎత్తి, పోయన్ = పోయుచుండఁగా, అతఁడు= ఆపురుషుఁడు, నెలకొని=నిలుచుండి, దానిక్రొమ్మెఱుఁగు నిద్దపుచెక్కులు=ఆ స్త్రీ యొక్క నూతనవిలాసములుగల నున్నని చెక్కలను, ముద్దు, పెట్టుకోన్= ముద్దు పెట్టుకొనుటకు, కెలవులవారిచూపు=ప్రక్కనున్న వారియొక్క చూపులయొక్క, గిలిగిల్లు = చక్కిలిగింతలను మొఱంగన్, కన్ = వంచించుటకు, వేళన్ = సమయమును, కోరుచున్ = అభిలషించుచు, అనఁగాఁ దనప్రక్కనున్నవారు తనవైపు చూడకుండ నుండునట్టి సమయము ప్రతీక్షించునని భావము. అవి=ఆయుదకములను, కార్చుచునుండెన్ = క్రిందికిఁ బడిపోవునట్లు చేయుచుండెను. అనఁగా నా స్త్రీ జలముపోయుట పూర్తియైనచో వెడలిపోవును. కాన నామె నిలువఁ బెట నెంచి తనసమీపపువారు చూడ

కుండ నుండుసమయమును గోరుచు నా స్త్రీ పోసిననీటిని దోసిటినుండి క్రిందికిఁ బోనిచ్చుచుండెనని భావము.

తా. ఒక యువతీమణి ముఖమజ్జనార్థము జలము గిండిలోఁ బోయుచుండగా వాఁడు దానిచెక్కులు ముద్దువెట్టుకొననెంచి తనప్రక్క నున్నవారు చూడకుండ నుండు సమయమునకై వేచియుండి యామె పోసెడి జలమును క్రిందికి విడుచుచుండెను.

ఉ. అవ్వలిదిక్కు మోముగఁ బ్రియంబున నొండులతోడ ముచ్చటల్
ద్రవ్వుచు నొక్క కోమలి పరాకున నుండఁగ ధూర్తుఁ డొక్కరుం
డివ్వలవచ్చి వంచనమెయి న్నునుమించు మెఱుంగుటద్దమున్
నవ్వుచుఁ బెట్టె దానిచరణంబులకు న్నడుమైన మేదినిన్. 113

టీ. అవ్వలిదిక్కు = పెడదిక్కుగా, మోము, అయి = మోముంచుకొని, ప్రియంబునన్ = వేడుకతో, లేక, ఇష్టముతో, ఒండులతోడన్ = పరులతో, ముచ్చటల్, త్రవ్వుచున్ = ముచ్చటించుచు, అనఁగా నిష్టగోష్ఠి సలుపుచునని భావము. ఒక్కకోమలి = ఒక కాంత, పరాకునన్ = ఏమఱిపాటుతో, ఉండఁగన్, ధూర్తుఁడు, ఒక్కరుండు = ఒకధూర్తుఁడు, నవ్వుచున్, ఇవ్వల = ఆ స్త్రీకి వెనుకభాగమునుండి, వచ్చి, వంచనమెయిన్ = మోసముచే, దాని చరణంబులకున్ = ఆ స్త్రీ పాదములయొక్క, నడుమైన మేదినిన్ = మధ్యస్థమగు భూమియందు, నునుమించు మెఱుంగుటద్దమున్ = నున్నని ప్రకాశించెడి మెఱుఁగుటద్దమును, పెట్టెన్ = ఉంచెను. దానియందుఁ బ్రతిఫలించెడి గోప్యావయవములను జూచు నుద్దేశముతో నట్లుచేసెనని భావము.

తా. ఒక స్త్రీ పెడకుమొగ ముంచుకొని మఱియొక స్త్రీతో మాటలాడుచుండఁగా వెనుకనుండి యొకధూర్తుఁడు నవ్వుచువచ్చి మోసముచే నొకయద్దమునుదెచ్చి దానిపాదములకు నడుమ నుంచెను.

తే. ఓమెయేమెయి దేమే మెఱిలేమ యేమె
మేఘపుష్పంబుఁ దేవంచు మేలమాడ

మేమె మేమెలు తఱుచయ్యె౯ మేలుమేలు
మేఁక మేఁకన సభవారు ౯ మిగుల నగిరి. 114

టీ. ఓమే=ఓబాలా! ఏమె, ఇదియేమె, ఏమె = ఎందుచేతనే, మేఘపుష్పంబు=జలమును, తేవు, అంచు౯=తేకుండనున్నావని, మేలము=పరిహాసము, ఆడ౯=పలుకఁగా, మేమె మేమెలు=మేయనెడి యక్షరములు, తఱుచు, అయ్యె౯=అధికముగాఁ బలుకఁబడినవి. మేఁక మేఁక, అనఁగా సభవారు=అచ్చట భుజించుచున్నవారందఱును, మిగుల౯, నగిరి=నవ్విరి.

తా. వడ్డించునప్పుడొక స్త్రీని మఱియొకఁడు 'ఓమె' 'ఏమే' 'ఇదేమే' 'మేఘపుష్పంబును దేవు' అని పలుమాఱు 'మే' అనునక్షరములు వచ్చునట్లుమఁగఁగా నది 'మేమే' అనుచున్నాఁడు ఇతఁడు 'మేక మేక' యని పరిహాసముచేసెను. అందుల కచటివారు నవ్విరి.—లేక యొక స్త్రీ మఱియొకస్త్రీతో మేఘపుష్పము తేవేమియని పల్కఁబోయి, మే మే మే మేఘపుష్పమని మేయను నక్షరములు పరిహాసమునకుఁ బలుకఁగా మేఁకవలె నఱచుచున్నదని పలుకుచు నచ్చటివారందఱును నవ్విరి. అనికొంద అర్థము సేసెదరు.

ఉ. లాలనఁ గ్రొత్తబెబ్బులికళాసము వెట్టిరి యాసనంబుగా
గోలయుసాధు వైనయొక ౯ కోమటికిన్నిషధేంద్రుబచ్చుకు౯
మేలపుమై వడిందమసమీపపుఘూర్తులు తత్పురస్థ్సలాం
గూలత యవ్వణిక్కునకుఁ ౯ గోశవిజృంభణ శంక సేయఁగన్.

టీ. నిషధేంద్రుబచ్చుకు౯=నలరాజుకోశాధికారియైన, గోలయు=ముగ్ధుఁడును, సాధువు=సజ్జనుఁడును, ఐనయొకకోమటికి౯=అయినట్టియొక కోమటివానికి, లాలన౯=బుజ్జగముతో, ఆసనంబుగా౯=ఆస్తరణముగా, క్రొత్తబెబ్బులి కళాసము=క్రొత్తదగు పెద్దపులిచర్మమును, మేలపుమైనడి౯=పరిహాసపువిధముగా, తమ సమీపపు ఘూర్తులు = ఆకోమటికి సమీపమునఁ గూర్చుండిన పెంకివాండ్రు,తత్పురస్థలాంగూలత౯—తత్=ఆతోలుయొక్క, పురస్థ=ముందుభాగమునను, లాంగూలత౯=తోకగలదైయుండుట, అవ్వణిక్కునకు౯=ఆకో

మటికి, కోశవిజృంభణశంకన్ = కోశము విజృంభించినదోయను సందేహమును, చేయఁగన్ = చేయునట్లుగా, పెట్టిరి=వేసిరి. నలరాజు కోశాధికారియు మిక్కిలి గోలయునైన యొకకోమటివానికిఁ దోఁకతోనున్న పెద్దపులిచర్మమును దెచ్చి తోఁకను ముందుభాగమునకుండునట్లు వేసిరి. అది వాఁడాలోచింపక దాని పైఁగూర్చుండఁగాఁ దోఁకముందునకు వ్యాపించియుండెను. వాఁ డట్లుండఁగా సమీపముననున్న ధూర్తులాయాసనముముందుగా నిగిడియున్న తోఁకను జూచి వాని మూడవపాదము వలెనున్నదని నవ్విరి. కాని వాఁడెఱుంగకపోయెె. అందుచేత నేవాఁడు గోలయు సాధువునని యనుటకుఁదగియుండెను.

తా. స్పష్టము.

తే. వెడమఱలి చూచె నొకచంద్రబింబవదన
వేడ్కదళుకొత్త నొకరాజవిటకుమారుఁ
బెడమఱలి యేసె వాని నప్పుడ మరుండు
సానఁ బెట్టిన మోహనాస్త్రంబుఁ దొడిగి. 116

టీ. ఒకచంద్రబింబవదన=చంద్రునివంటి ముఖముగల యొకయువతి, వేడ్క=కోరిక, తళుకొత్తన్ = చిగుర్పఁగా ఒకరాజవిటకుమారున్ = విటుఁడగునొకరాజకుమారుని, వెడమఱలి=ప్రక్కకుఁదిరిగి, చూచెన్, అప్పుడ = ఆక్షణమందే, మరుండు=మన్మథుఁడు, సానన్, పట్టిన మోహనాస్త్రింబున్ = సానపట్టిన మోహింపఁజేయు బాణమును, తొడిగి=సంధించి, వెడమఱలి=ప్రక్కకుఁదిరిగి, వేసెన్=కొట్టెను. అనఁగా నొకయువతి వెనుకకుఁ దిరిగి యొకరాజకుమారుని విలాసముతోఁ జూడఁగా నాచూపులకువాఁడు సంచలితహృదయుఁడై మన్మథవశుం డయ్యెనని భావము.

తా. ఒకయువతి ప్రక్కకుఁదిరిగి కోరిక లీరికలెత్త నొకరాజకుమారునిఁజూచెను. ఆ క్షణమందె మన్మథుఁడు సానఁబట్టినబాణము సంధించికొట్టి వాని చంచలహృదయునిఁగాఁ జేసెను.

ఉ. ఇంచిన భక్తినొక్కతరళేక్షణ నైషధభూమిభర్తమ
న్నించుచువరూథినీపతికి నేరుపు మీఱఁగ వట్టివేళ్లఁ గా

వించిన తాళవృంతమునన్ వీచుచు నుండెఁ జెమర్చుచుండె నా
చంచలనేత్ర క్రొమ్మెఱుఁగుఁజన్నులబింకముఁ జూచియాతఁడున్.

టీ. ఒకతరళేక్షణ=ఒకచంచలాక్షి, ఇంచినభక్తిన్=ఒప్పిదమయిన భక్తితో, నైషధభూమి భర్త=నలరాజు, మన్నించు వరూథినీపతికిన్=గౌరవించెడి సేనానాయకునకు, పట్టివేళ్లన్=ఒకవిధమగు వేళ్లతో, కావించిన తాళవృంతమునన్=నిర్మించిన వీవనతోడ, నేరుపు, మీఱన్=నైపుణ్య మతిశయించునట్లుగా, వీచుచు నుండె=వీచుచుండెను, ఆతఁడున్=అ సేనానాయకుఁడు, ఆచంచల...బింకము - ఆచంచలనేత్ర=చలించు నేత్రములుగల యా స్త్రీయొక్క, క్రొమ్మెఱుఁగు=క్రొత్త కాంతులుగల, చన్నులబింకము=చన్నులయొక్క యందమును, చూచి, చెమర్చుచు నుండెన్=చెమ్మటలఁ గార్చుచున్నవాఁడయ్యెను, ఆసేనానాయకునకు మొదట ఘర్మమువలనఁ గల్గిన చెమ్మట నార్చుటకై యొక యువతిని నియమింపఁగా నది విలాసముతో వీచుచుండెను. కాని యాచెమట లింకలేదు. గాలి తగులుచున్నప్పుడు చెమ్మట నశింపకుండు టేమియనఁగా వాఁడా స్త్రీ స్తనముల యందమును జూచి స్వేదమను సాత్త్వికభావము గలవాఁడగుటచే నట్లు చెమటలు గలవాఁడయి దానిపని యెప్పటికిని ముగియకుండఁ జేయుచుండెనని భావము.

తా. ఒకయువతి భక్తిగలదయి నలరాజు సేనానాయకుని చెమట లార్ప పట్టివ్రేళ్లతోఁ గట్టిన వీవనతో వీచుచుండె. వాఁడు దాని స్తనముల పొంకమును జూచి చెమర్చుచుండె.

వ. ఇట్లు హస్తపాదప్రక్షాళన గండూష ముఖమజ్జనంబు లాచరించి బంధువులు తమతమ నిర్దిష్టంబు లగునర్హాసనంబులఁ గూర్చుండి చతుర్విధాహారంబులు భుజియింపం దొడంగి రప్పుడు. 118.

తే. పచ్చ జామాసికంబులన్ పళ్లెరములఁ
బచ్చగందనికూరలేన్ గ్రుడమ్మిఁ జూచి

వెట్టరని పెండ్లిపెద్దలు కెపెడము వెట్టఁ
బెట్టుటకు నంగనలకును కబట్టెఁ దడవు. 119

టీ. పచ్చఱామానికంబుల పళ్లెరములన్ = మరకత మాణిక్యములతోఁ జేసిన పళ్లెములందు, పచ్చగందని కూరలు=పసరురంగు చెడనికూరలు, ఏర్పడమిన్ = స్పష్టముగాఁ గానరాకుండుటను, జూచి, పెట్టరని=వస్తువులు పెట్టలేదని, పెండ్లిపెద్దలు=పెండ్లినడపువారిలోఁ బెద్దలు, పెడము = పెడమొగము, పెట్టన్ = పెట్టఁగా—కోపింపఁగా, పెట్టుటకు=వడ్డించుటకు అంగనలకున్ = స్త్రీలకు, తడవు=ఆలస్యము, పట్టెన్ =ఆయెను. అనఁగా స్త్రీలు పచ్చనికూరలు దెచ్చి యాకూరలతో సమానవర్ణముగల పళ్లెములందుఁ బెట్టిరి. కాని వారికావస్తువులు గానరాలేదు. అందులకు వారికిఁ గోపమువచ్చి పెడముఖము పెట్టిరి. ఆ స్త్రీలదితెలిసికొని యావస్తువులం దుంపఁబడినవనియు నాపాత్రములును గూరలును సమానవర్ణము గలవగుటచే మీరు తెలిసికోలేక పోవుచున్నారనియు సమాధానము చెప్పుటకు వారి కెంతయో కాలము పట్టుచుండెను. వారట్లు చెప్పుచుండినను బెండ్లిపెద్దలు నమ్మకపోవుటచే మఱిమఱి చెప్పవలసివచ్చెను. అందుచే వారికిఁజాలకాలము పట్టుచుండెను.

తా. స్పష్టము.

మ. నివసద్బాష్ప మఖండితాఖిలము నిర్ణిక్తం బసంత్యక్తమా
ర్దవ మన్యోన్య మసంగతం బమృతసారస్యంబు గౌరం బగౌ
రవమూమోదనమోదనం బమృతపర్యాయంబుసంబంధిబాం
ధవభూపాలసుతుల్ భుజించిరి వయోదర్పానురూపంబుగన్.

టీ. సంబంధ...సుతుల్ - సంబంధ = సంబంధులను, బాంధవ=చుట్టములగు, భూపాలసుతుల్ = రాజకుమారులు, వయోదర్పానురూపంబుగన్ =తమయొక్క ప్రాయము సత్తువననుసరించి, నివసద్బాష్పము = నివసించుచున్న వేడిమిగలదియు, అనఁగాఁ గొంచెము వెచ్చగానున్నదనుట, అఖండితాఖిలము=పాకమునందు ముక్కలుగాని విరుగని ... కొక్కటియును

ఖండితమైనది లేదు, పాకావస్థలోఁ గూడ విశేషము గలియఁబెట్టక పోవు టచే ముక్కలుగాలేదని భావము. నిర్ణిక్తంబు=చక్కఁగాఁ గడుగుటచేఁ బియ్యమునంటిన తవుడు పోవును గాన నిర్మలమైనదియు, అసంత్యక్తమార్దవము=మెత్తఁదనమును విడువనిదియు, అన్యోన్యము=పరస్పరమును, అసంగతము=కలియనిదియు, అహృతసారస్యంబు=హరింపఁబడని రుచిగలదియు, గౌరంబు=తెల్లగానున్నదియు, అగౌరవము=స్థూలముగా నుండనిదియు, ఆమోదనము=హర్షము కలిగించునదియు, అమృతపర్యాయంబు=అమృతముతో సమానమయిన దియు, నగు, ఓదనంబు=అన్నమును, భుజించిరి=తినిరి.

తా. పెండ్లికివచ్చిన చుట్టములందఱును వెచ్చనిదియు, ఖండితము గానిదియు, నిర్మలమైనదియు, మృదువయినదియు, నొకదానితో నొకటి కలియనిదియు, సరసమైనదియు, వెన్నెలవలె ధవళమైనదియు, సన్ననిదియు, నామోదము కలిగించునదియు నమృతముతో సమమైనదియు నగు నన్నమును దమతమ ప్రాయంబునకుఁ దగినట్టుగా భుజించిరి.

సీ. గోధూమసేవికా ♦ గుచ్ఛంబు లచ్ఛాచ్ఛ
　　　ఖండశర్కరలతోఁ ♦ గలపి కలపి
గుజ్జుగాఁ గాఁచిన ♦ గోక్షీర పూరంబు
　　　జమిలి మండేఁగలపైఁ ♦ జల్లి చల్లి
మిరియంబుతోఁ గూడ ♦ మేళవించిన తేనెఁ
　　　దోరంపు లడ్వాలు ♦ దోఁచి తోఁచి
పలుచఁగా వండిన ♦ వలిపంపుఁ జాఁపట్లు
　　　పెసరపప్పులతోడఁ ♦ బెనఁచి పెనఁచి
తే. గోవ జవ్వాదిఁ గస్తూరిఁ ♦ గొఱఁత పఱుచు
వెన్నపడిదెంబు జొబ్బిల ♦ విఁదిచి విఁదిచి
వారయాత్రికు లనుమోద ♦ వంతు లగుచు
వలచి భుజియించి రొగిఁ బిండి ♦ వంటకముల. 121

టీ. గోధూమ...గుచ్ఛంబులు - గోధూమసేవికా=గోధుమ చూర్ణమును, శాలునుగలిపి చేసిన భక్ష్యవిశేషములయొక్క., గుచ్ఛంబులు=గుత్తులను—గుత్తులవలెనున్న వానిని, అచ్చాచ్ఛఖండ శర్కరలతోన్ =మిక్కిలి స్వచ్ఛమైన కండ చక్కెరలతో, గలపి,కలపి=మిక్కిలి సంయుక్తమగునట్లు చేసి, ఇటఁ గలపి శబ్దము భృశార్థమున ద్విరుక్తమైనదని తెలియఁదగినది. 'లల్లార్చిఖండశర్కఫలతోన్' అనుపాఠమున వానినాడించి చక్కెరలో గలిపినారనుట, గుజ్జుగాన్ = చిక్కఁగా, కాఁచిన గోక్షీరపూరంబు=కాఁగఁబెట్టిన యావుపాలను, జమిలి మండెఁగలపైన్ =జతగానున్న గోదుమపూరీలపై, చల్లి, చల్లి=మిక్కిలి ప్రోక్షించి, మిరియంబుతోఁ గూడన్ =ఒకదినుసు సంబారువుతోఁగూడ, మేళవించినతేనె=కలపిన మధురసమందు, తోరంపులడ్వాలన్ = పెద్దవగు లడ్డులనెడి భక్ష్యవిశేషములను, తోఁచి,తోఁచి, పలుచఁగాన్ , వండిన వలిపంపుచాఁపట్టు=వండినట్టి సన్నని బట్టవలె నున్నయొక దినుసు పిండివంటకమును, పెసరపప్పులతోడన్ , పెనఁచి, పెనఁచి=కలియఁగూర్చి-అనఁగా వానిని జక్కఁగాఁ బెసరపప్పుతోఁ గలుపుటచేఁ బెద్దవగుచున్నవని భావము. గోవజవ్వాది=మనోజ్ఞమగు సంకుమదమును, కస్తూరి=కస్తూరిని, కొలఁతపలుచు వెన్నపడిదంబు=తక్కువగాఁ జేయఁజాలిన వెన్నతోఁజేసిన ద్రవ పదార్థము, జొబ్బిల్లన్ =నిండునట్లుగా, విద్రిచి, విద్రిచి=మిక్కిలివిదిలిచి,వారయాత్రికులు=పెండ్లివారు, అనుమోదపంతులు=మిక్కిలి సంతసము గలవారు అగుచున్ , వలచి=ప్రియపడి, పిండివంటకములు = భక్ష్యవిశేషములను, భుజియించిరి = తినిరి.

తా. పెండ్లికివచ్చిన చుట్టములు సంతోషవంతులై గోధుమచూర్ణముతోను, చాలతోనుజేసినభక్ష్యవిశేషమును నిర్మలమగు కండచక్కెరతోఁగలిపి, చిక్కఁగాఁగాఁచిన యావుపాలను గోదుమపూరీలపైఁ జల్లుకొని, మిరియమనెడి సంబారువులో మిశ్రముచేసిన తేనెయందు బెద్దవగు లడ్డులను దోఁచుకొని,పలుచఁగా వండినచాఁపట్లనెడి యప్పడమువంటియొక దినుసు భక్ష్యవిశేషములను బెసరపప్పులతో మిళితముగాఁజేసి, సువాసనచే మనోహరమగు జవ్వాజిని, కస్తూరినిమించియుండునట్టి వెన్నతోఁజేసిన ద్రవ పదార్థము నిండునట్లుచేసి పిండివంటకములు నాప్యాయమున ముతో భక్షించిరి.

చ. తరుణులు చంచలాలతలు తత్కరభాండనికాయ మంబుదో
త్కరములు పాలుఁ దేనెలు ఘృతంబులు వాన లఖండఖండశ
ర్కరలును ద్రాక్షపండ్లు వడగండ్లును శోభనభుక్తివేళ దో
ల్కరిసమయంబు పేరెలమి గైకొనకుండునె భోక్తృసస్యముల్.

టీ. తరుణులు=యువతులు, చంచలాలతలు = మెఱుపుదీవియలు, తత్కర భాండనికాయము=వారిచేతులలో నుండెడి కుండలసమూహములు, అంబుదో త్కరములు=మేఘముల గుంపులు, పాలు, తేనెలు, ఘృతంబులు = నేతులును, వానలు=వర్షములు, అఖండఖండశర్కరలును=ముక్కలుగాని కండచక్కెరలు ను, ద్రాక్షపండ్లును, వడగండ్లు, శోభనభుక్తివేళ=ఆపెండ్లిభోజనముల సమ యము, తొల్కరిసమయంబు=వర్షారంభకాలము, భోక్తృసస్యముల్ = భుజిం చువారనెడి పైరులు, పేరెలమిన్ = పెద్దసంతసమును, కైకొనక, ఉండునె = స్వీకరింపకుండునా? అనఁగనుండవనుట, తొలకరిసమయము సస్యముల కానం దముగొలిపినట్లుగా పెండ్లివారు భోజనము చేయువేళ మిక్కిలి వారికానంద ము గొలిపెనని భావము.

తా. స్త్రీలు మెఱఁపు దీఁగెలవలెను, వారిచేతులనుండు భాండములు మేఘం బులవలెను, పాలు తేనె నేయి మొదలగునవి వర్షములవలెను, గండచక్కెరలు ను ద్రాక్షపండ్లును వడగండ్లవలెను, భోజనసమయము తొలకరివలెను ప్రకాశిం చుచుండ, భోక్తలనెడి సస్యములు మిక్కిలి యానందమును గాంచకుండునా? అలం. రూపకము.

క. అరుదుగ నపు డొక్కొకయెడ
మరకతమణిపాత్ర గగనమండల మయ్యెన్
జిరువడములపాసెము శశి
ధరుఁ డయ్యెం జుక్క లయ్యె ద్రాక్షఫలంబుల్.　　123

టీ. అపుడు=భుజించునెడ, అరుదుగన్=అచ్చెరువగునట్లుగా, ఒక్కొక యెడన్=ఒక్కొకచోట, అనగా పాయసము వడ్డించినచోట్లననుట, మరక

తమణిపాత్ర = మరకతపుమణులచేతను కూర్పఁబడినపాత్ర, గగనమండలము=అంతరిక్షము, అయ్యెన్, చిరువడములపాసెము = చిరువడములతోవఁడించినపాయసము, శశధరుఁడు=చంద్రుఁడు, అయ్యెన్, ద్రాక్షఫలంబుల్=ద్రాక్షఫలములు, చుక్కలు=నక్షత్రములు, అయ్యెన్=అయినవి. చిరువడముతోఁగూడిన పాయసము శశముతోఁ గూడినచంద్రునివలె నున్నదనుట.

తా. భోజనములు సేయునపుడు పెండ్లివారు భుజించు మరకతపు పాత్రము ఆకాశమువలెను దానియందలి పాయసము చంద్రునివలెను, ఆపాత్రములయందుండు ద్రాక్షఫలములు నక్షత్రములవలెను నుండెను.

సీ. అమృతరసోపమం బైన కమ్మనియాన
వాలపాయసము జంబాల మయ్యె
గరుడపచ్చలచాయ గల పచ్చగందని
కూగలు శైవలాంకురము లయ్యె
మంచులప్పల మించుమండెంగ ముడుపులు
పొరలి తెట్టువగట్టు నురువు లయ్యె
గప్పురంబుల యొప్పుఁదప్పు వట్టఁగఁజాలు
ఖండశర్కరలు సైకతము లయ్యె
తే. నొలుపుఁబప్పులతీరంబు లుగలఁబడగఁ
బూరియలు లడ్డువంబులు పొరలిపాఱ
విమలశాల్యోదనంబుపై వెల్లిసూపు
నాజ్యధారాప్రవాహసాహస్రమునకు. 124

టీ. ఒలుపుపప్పులతీరంబులు=చాయపప్పులనెడి యొడ్లు, ఉరలఁబడఁగన్=దొరలిపోవఁగా, పూరియలు, లడ్డువంబులును, పొరలి, పాఱన్ = దొర్లిపోవునట్లుగాను, విమలశాల్యోదనంబుపైన్ = స్వచ్ఛమైన వరియన్నముపై, వెల్లిసూపు=ప్రవహించు, ఆజ్యధారాప్రవాహసాహస్రమునకున్ = ఘృతధారలనెడి ప్రవాహసమూహములకు, అమృతరసోపమంబు=అమృతముసాటివచ్చునది. ఐన

...పాయసము-ఐన = అయినట్టి, కమ్మని=మధురమైన, అనవాలపాయసము= ఇవురఁగాఁచిన పాలతోఁజేసిన పాయసము,జంబాలము=బురద, అయ్యె. అనఁగా నాజ్యప్రవాహమునకుఁ బాయసము బురదవలె నొప్పుచున్నదని భావము. గరుడపచ్చలచాయ=మరకతములకాంతి, కలపచ్చగందని కూరలు = కలిగినపసరుచెడని కూరలు, శైవలాంకురములు = నాఁచుఁదీఁగలు, అయ్యెన్, మంచులప్పలన్=మంచుకుప్పలను, మించు = అతిక్రమించు, మండెంగమడుపులు = గోదుమపూరీలమడతలు, పొరలి=ప్రవహించుటచేఁ గలిగి, తెట్టవగట్టు = ప్రోవగునురువులు, అయ్యెన్, మంచువలెఁ దెల్లనిపూరీల మడుతలు ప్రవాహవశమున ప్రోవయిననురుఁగువలెఁ బ్రకాశించెననిభావము. కప్పురంబులయొప్పన్= కర్పూరముయొక్క యందమును, తప్ప, పట్టఁగిన్చాలు = తిరస్కరింపఁ జాలిన, ఖండశర్కరలు = కండచక్కెరలు, సైకతములు = ఇసుముతిన్నియలు, అయ్యెన్,

తా. భోజన సమయములం దమితముగా నేతిని వడ్డించుచుండఁగనది ప్రవాహమయి పాఱుచుండెను. ఆప్రవాహవేగమునకుఁ బప్పుముద్దలనెడి తీరములు శిథిలమయి పడుచుండెను. బూరియలు లడ్డువులు మొదలగునవి దొరిలిపోవుచుండెను. మఱియు నాఘృతప్రవాహమునకు నమృతమువంటి క్షీరాన్నము బురదయగుచుండెను. మరకతమాణిక్యములవంటి చాయగలకూరలు నాఁచుదీవె లగుచుండెను. కుప్పలవలెనున్న పూరీలును నురువులగుచుండెను.కప్పురముకంటెఁ దెల్లనివగుకండచక్కెర లిసుకతిన్నియ లవుచుండెను. అలం. రూపకము.ఉపమానము.

ఉ. ఆదరణంబుతోనభినవాజ్యవిపాండుర ఖాండశర్కరా
క్షోదసమన్వితంబుగ విశుద్ధహిరణ్మయ భాజనంబులం
బైదలు లర్థిమై నిడఁగ బంధుజనుల్ భుజయించి రన్నపూ
ర్ణాదరహాసచంద్రకిరణంబులఁ బోలినపాయసాన్నముల్. 125

టీ. బంధుజనుల్=చుట్టములు,విశుద్ధహిరణ్మయభాజనంబులన్=నిర్మలమయినబంగారు పాత్రములందు, పైదలులు= స్త్రీలు, అర్థిమైన్=ప్రీతితోను, ఆదరణంబుతోడన్=ఆదరముతోడను, అభినవ...సమన్వితంబుగన్=అభినవాజ్య=

క్రొత్తనేతితోను, విపాండుర=మిక్కిలి తెల్లనిదగు, ఖండశర్కరాక్షోద=కండ చక్కెరపొడితోను, సమన్వితంబుగన్=కూడియున్నట్టుగా, అన్నపూర్ణ . . కిరణంబులన్-అన్నపూర్ణా=అన్నపూర్ణాదేవియొక్క, దరహాస చంద్రకిరణంబులన్=మందహాసచంద్రికలను, పోలినపాయసాన్నములన్=సరిపోవుచున్న క్షీరాన్నములను, ఇడఁగన్, పెట్టఁగా, భుజియించిరి=తినిరి.

తా. స్త్రీలాదరముతోడను, బ్రీతితోడను, సద్యోఘృతమును దెల్లని పంచదారపొడిని, నన్నపూర్ణాదేవి చిఱునవ్వువలెనే మిక్కిలి తెల్లనిపాయసాన్నములను బంగారుపాత్రములలో నుంపఁగాఁ బెండ్లివారు తృప్తిగా భుజించిరి.

గీ. ఆరగించి రసాధారణానురక్తి
వారయాత్రికు లగుపెద్దవరుసవారు
దివుట శశిలాంఛనక్రవ్యతేమనంబు
నసమశరకేతనవ్యంజనామృతంబు. 126

టీ. వారయాత్రికులు=పెండ్లికొడుకుతోడి వారు, అగుపెద్దవరుసవారు=అయినట్టి పెండ్లిపెద్దలు, తివుటన్=కోరికిచే, శశిలాంఛనక్రవ్యతేమనంబు_శశి=చంద్రునకు, లాంఛన=చిహ్నమయిన మృగముయొక్క, క్రవ్య=మాంసముచేఁ జేయఁబడిన, తేమనంబున్=మజ్జిగపులుసును, అసమ...అమృతంబు-అసమశర=మన్మథునికి, కేతన=ధ్వజలాంఛనమగుమత్స్యముచేఁ జేయఁబడిన, వ్యంజనామృతంబు = అమృతతుల్య మగు కూరయు, అసాధారణానురక్తిన్ =అధికమైనయనురాగముతో, ఆరగించిరి = తినిరి. ఇట " శశిలాంఛన " అనియు "అసమశర" యనియు విశేషణములు చేర్చుటచే,పదార్థములు చంద్రాదులందున్న సుధాసంబంధంబుచే మిక్కిలి మధురములుగానున్నవని తెల్లమగుచున్నది. మంచిదినుసుగానుండుటకై చంద్రుని కుందేలును మరునిచేపనుదెచ్చి వండిపెట్టిరనుట. కావుననే యా పెద్దలు 'అసాధారణానురక్తిని' దినుట.

తా. పెండ్లికివచ్చిన చుట్టములు మృగమాంసముతో సిద్ధమైన మజ్జిగపులుసు మత్స్యములచే సిద్ధమైన వ్యంజనములను నధికానురాగముతోఁ బూర్తిగాఁ దినిరి.

క. సేవించి రొకటిఁ దొలఁగం
ద్రోవక జంబీరరసముతోఁ నూనియతో
నావంబెట్టిన కిటిము
ద్రావలయములయతిమధురరసఖండంబుల్. 127

టీ. వారయాత్రికులు, అధ్యాహారము, ఒకటిన్ = ఒకముక్కను, తొలఁగన్, త్రోవక = పరిహరింపకుండ, జంబీరరసముతోన్ = నిమ్మపండ్లరసముతోను, నూనియతో = తైలముతోడను, ఆవన్ = ఆవరసముతో, పెట్టిన...ఖండంబుల్-పెట్టిన = మిళితముచేసిన, కిటి = అడవిపందులయొక్కయు, ముద్రావలయముల = గుండ్రములయిన ఖండములయొక్క, అతిమధుర = మిక్కిలి కమ్మందనముగల, రస = రుచియొక్క, ఖండంబుల్ = ముక్కలగువానిని, సేవించిరి = భక్షించిరి. అడవిపందిమాంసము మధురము.

తా. ఆ పెండ్లివారు నిమ్మపండ్ల రసముతోను, నూనెతోను, నావరసముతోను, గలిపి వండినట్టి యడవిపందులయొక్క మాంసఖండంబుల నొకదానిని విడువక యనుభవించిరి.

క. ఆమిష మనామిషముగ న
నామిష మామిషముగాఁ గుహక మార్గకళా
సామర్థ్యంబునఁ జేసిన
తేమనములు మనములం బ్రతిష్ఠించె రుచుల్. 128

టీ. కుహకమార్గకళా సామర్థ్యమునన్-కుహకమార్గ = వంచనామార్గమందలి, కళా = చాతుర్యమందలి, సామర్థ్యంబునన్ = శక్తిచే, ఆమిషమున్ = మాంసమును, అనామిషముగన్ = మాంసముగానిదానినిగాను, అనామిషమున్ = మాంసముగానిదానిని, ఆమిషముగాన్ = మాంసముగాను, చేసిన తేమనములు = వండిన మజ్జిగపులుసులు, రుచుల్ = రుచులను, మనములన్ = మనస్సులలో, ప్రతిష్ఠించెన్ = స్థాపనచేసెను. అనఁగాఁ గలిగించెననుట. వస్తువులందున్న స్వాభావికరుచులను మాటిచిక్రొత్తరుచుల గల్గింపఁజాలిన పాకచాతుర్యము

సిద్ధమయిన తేమనములు వారి మనంబుల కెక్కుడు రుచికరములయ్యెనని భావము.

తా. మాంసములందు మాంసరుచి కాకుండఁ గ్రొత్తరుచి గలుగునట్లుగాను, మాంసముకాని పదార్థములందు మాంసపురుచి కలుగునట్లుగాను, పాకచాతుర్యముచే వండువారు సిద్ధపఱిచిన తేమనములను దృప్తిగా భుజించిరి.

చ. అసమసుధారసహ్రదము ♦ నందలి రొంపులనంగ మంచునం
బిసికిన పంచదారలనఁ ♦ బేరినమీఁగడతో మనంబులన్
బసిగొనఁజేయువాహరిపు ♦ బక్కెయణీదధిపిండఖండముల్
మెసగిరి కంఠదఘ్నముగ ♦ మిక్కిలి వేడుక వారయాత్రికుల్.

టీ. వారయాత్రికులు=పెండ్లివారు, మిక్కిలి, వేడుకన్, అసమ...రొంపులు—అసమ=సాటిలేని, సుధారస = అమృతముయొక్క, హ్రదమునందలి=మడుఁగులోనున్న, రొంపులు=బురదలు, అనంగన్=అనునట్టుగా, మంచునన్=హిమజలముతో, పిసికిన పంచదారలన=ముద్దచేసిన చక్కెరలనఁగా, పేరినమీఁగడతోను, మనంబులన్ పసి, కొనన్ చేయు=రుచికలిగించు, వాహ...ఖండముల్—వాహరిపు బక్కెయణీ = తెలుపిబఱ్ఱెలయొక్క, దధిపిండ = పెరుగుముద్దలయొక్క, ఖండముల్ = ముక్కలను, కంఠదఘ్నముగన్ = గొంతుబంటిగా, మెసఁగిరి = తినిరి.

తా. పెండ్లికి వచ్చినబంధువులు సాటిలేని యమృతరసముయొక్క మడుఁగునకు బురదలవలెఁ జెలంగుచున్నవై మంచుతో ముద్దచేసిన పంచదారలను, పేరికొనియున్న మీఁగడలను, మదికి రుచులుగొలుపుతెలుపిబఱ్ఱెలయొక్క పెరుఁగుముద్దలను మిక్కిలివేడుకతో భుజించిరి.

తే. మిసిమిగల పుల్లపెరుఁగుతో ♦ మిళితమైన
యావపచ్చళ్లు చవిచూచి ♦ రాదరమునఁ
జుఱ్ఱుమని మూర్ధములు దాఁకి ♦ మెఱ్ఱఁదనముఁ
బొగలు వెడలింప నాసికా ♦ పుటములందు. 130

టీ. మిసిమిగల పుల్ల పెరుఁగుతోన్ = వెన్నగల్గిన పుల్లని పెరుఁగుతో, మిళితము = మిశ్రితము, ఐనయావపచ్చళ్లు = అయినట్టి యావఁబెట్టినపచ్చళ్లు, ఆదరమునన్ = ప్రేమముతో, చుఱ్ఱుమని, మూర్ధములు = శిరస్సులకు, తాఁకి = ఎక్కి, నాసికాపుటములందు = ముక్కుచెరమలయందు, ఎఱ్ఱఁదనమును, పొగలును, వెడలింపన్ = గల్గించునట్లుగాను, చవిచూచిరి = ఁ నంజుకొనిరి.

తా. ఆపెండ్లివారు వెన్నగల పుల్లని పెరుఁగుతో నావరసమును మిళితము చేసి సిద్ధపఱిచిన పచ్చళ్లనత్యాదరముతోఁ దినిరి. అంత వానికారము తలకెక్కెను. నాసికాపుటము లెఱ్ఱఁబడి పొగలను వెడలించెను.

చ. అవికయుఁబట్టుపుట్టము చెఱంగుమఱుఁగయియున్కిఁ జేసిగా
రవపరిమాణముం దెలియలేరామికి ముచ్చిరుచున్నయొక్కపల్లవునకుఁజూపె నొక్కతె విలాసముతోఁ దనతోరపుంజనుంగవపొడవింత పొమ్మనినకైవడిఁ బానకహేమకుంభమున్.

టీ. ఒక్కతె = ఒకస్త్రీ, అవికయు, పట్టుపుట్టపుచెఱంగున్ = పట్టువస్త్రముయొక్కకొనయు, మఱుంగయి = చాటయి, ఉన్కిఁజేసి = ఉండుటచేత, గౌరవపరిమాణమున్ = దాని స్తనము లెంతగొప్పవో యనుకొలఁదిని, తెలియన్, రామికిన్ = తెలిసికొనలేకపోవుటకు, ముచ్చిరుచున్న యొక్కపల్లవునకున్ = దుఃఖిచుచున్న యొకజారునకు, విలాసముతోన్ = లీలతో, తనతోరపుంజనుంగవపొడవు = తనగొప్పదగు స్తనద్వయముయొక్క పరిమాణము, ఇంత = ఇంతయున్నది, పొమ్ము, అనఁగా నా స్తనము లింతలేసియున్నవిసుమీ యనిభావము. అనినకైవడిన్ = అనిచెప్పుచున్నట్లు, పానకహేమకుంభమున్ = పానకముతో నిండిన బంగారపుఁగుండను, చూపెన్ = కనఁబఱిచెను. అనఁగాఁ నొకస్త్రీ పానకకుంభమును బట్టుకొని పానకమును వడ్డించుచుండెను. కవి దాని నుత్ప్రేక్షించుచున్నాఁడు. “ఒకజారుఁడు అవికయు, పైఁటకొంగును జాటయియుండుటచే దాని స్తనము లెంతలేసి పరిమాణము గలవియో యని తెలియఁజాలక తడఁబడుచుండుట గని యాస్త్రీ నా స్తనము లీకుంభములంత లేసియున్నవి యని తెలియఁజేయుచున్నట్లుగా నాజారున కాకుంభమును జూపెను.

తా. స్పష్టము. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. ఎట్టివినీతుఁడో యొకరుఁ డేణవిలోచన బంతి వెంట మా
ర్వెట్టఁగ దానివక్త్రశశిబింబముఁ జూడఁగ నోడి తాల్మిమై
బట్టముగట్టెఁ దచ్చరణపద్మయుగాంతర చంద్రమశ్శిలా
కుట్టిమభూమిభాగమునకుం దనమంజుల దృష్టిపాతమున్.

టీ. ఒకరుఁడు=ఒకపురుషుఁడు, ఏణవిలోచన = ఒకస్త్రీ, బంతివెంటన్ = భుజించుచున్నవారి పంక్తివెంబడిని, మాఱువెట్టఁగాన్ =మాఱువడ్డించుచుండఁగా, దానివక్త్రశశిబింబమున్ =దానియొక్క ముఖచంద్రబింబమును, చూడఁగన్ =చూచుటకు, ఓడి=భయపడి, తాలిమిమైన్ =ఓర్పుచే, తచ్చరణ...భాగమునకున్ —తత్ =దానియొక్క, చరణపద్మ=పాదపద్మములయొక్క, యుగ=జతయొక్క, అంతర=మధ్యముననున్న, చంద్రమశ్శిలా=చంద్రకాంతమాణిక్యమయమైన, కుట్టిమ=కట్టడముయొక్క, భూమిభాగమునకున్ =భూతలమునకు, తనమంజులదృష్టిపాతమున్ = తనదృష్టిప్రసారమును, పట్టము, కట్టెన్ =రాజునుగాఁ జేసెను. అనఁగా దనదృష్టినందే యుంచె ననుట. వాఁడు (అధ్యాహారము.) ఎట్టివినీతుఁడో=ఎటువంటి నీతిమంతుఁడో గదా? వడ్డించుచున్న యొకస్త్రీ మొగమును జూచిన తన నియమమునకు భంగము గల్గునేమో యని భీతిల్లి దానిపాదములకు నమస్కరించుచున్నట్లు క్రిందికిఁ జూడసాగె. ఆలోచింప వాఁడు మిక్కిలి నీతిమంతుండుగదా యని యొకయర్థము. వినీతుఁడు = నీతిహీనుఁ డని రెండవ యర్థము. వాఁ డెట్టినీతివిహీనుఁడో యనిభావము. వాఁడు నీతివిహీనుఁ డెట్లగుననఁగా వాఁడు దానియం దత్యనురాగము గలవాఁడై దాని మొగమును జూచి తాళఁజాలక చంద్రకాంతమయ మయిన కుట్టిమందుఁ బ్రతిఫలించిన దాని గుహ్యావయవములను జూచి యానందించుచుండె. వీఁ డెట్టి నీతివిహీనుఁడో యని భావము.

తా. స్పష్టము.

చ. ఒసపరి జాణఁడొక్కఁ డొకకొయుగ్మలిచేరువ మాఱువెట్టగా

బసనికురంగికాపలలఁ ఫాలి నిజాధరపల్లవంబుపైఁ
బసిగొని చేరఁబట్టి మునిపండుల నొయ్యన నప్పళింపఁగా
ముసిముసినవ్వునవ్వెలఁదిమోము మొకయించుక యోరసేయుచున్.

టీ. ఒసపరి=సుందరుఁడగు, జాణఁడు, ఒక్కఁడు=ఒకరసికుఁడు, ఒకయు గ్మలి=ఒకస్త్రీ, చేరువన్=సమీపమున, మాఱువెట్టఁగా=మాఱువడ్డించుచుండఁ గా, పసనికురంగికా...ఫాలిన్ — ఎఱ్ఱనిలేడిమాంసము ముక్కను, నిజాధరప ల్లవంబుపైన్=తన చిగురువంటి యధరోష్ఠముపయి, చేరన్, పట్టి=చేరునట్లు గాఁబట్టికొని,పసిగొని=వాసననుబట్టి, మునిపండులన్=పంటికొనలచే,ఒయ్యనన్ =మెల్లఁగా,అప్పళింపఁగాన్=నొక్కుచుండఁగా,అది=ఆభామ, మోము=మొగ మును, ఒకయించుక=కొంచెము, ఓరచేయుచున్=పెడకుఁద్రిప్పుచు, ముసిముసి నవ్వు=చిఱునవ్వును, నవ్వెన్, అనఁగా నొకరసికుఁడు వడ్డించుచున్న యొకస్త్రీ యొక్క యధరమును జూచుచు, నొక యెఱ్ఱనిలేడిమాంసఖండమును ముని పంట నొక్కి రుచిననుభవించుచు నిట్టిస్వాదుతరమగుదాని నెప్పుడు ననుభవింపలేదని పలుమాఱు నుతించుచు, దానిచే "నీయధరోష్ఠమునుగూడ నిట్లు పానముచేసి రుచి ననుభవించెద" నని తెలుపుట చేసెననిభావము.

తా. ఒకసుందరుఁడు తనచేరువను వడ్డించుచున్న యొక స్త్రీనిజూచి మాంస ఖండమునుదీసి నోటఁజేర్చి మునిపండులతో నొక్కుచు, దీనివలె నీయధరమును గూడ నొక్కెదనను భావమును వెల్లడించెను. అది తెలిసికొని యాతరుణి కొం చెము మొగము వంచుకొని చిఱునవ్వు నవ్వెను.

క. చలివాలు నవ్వ లడ్డువ
ములు చన్నులు పనసతొలలు మోవులు మండెం
గలు చీరలుగ భుజిక్రియ
వలపించెన్ బెండ్లివారి వనితయుఁబోలెన్. 134

టీ. భుజిక్రియ=భోజనక్రియ, చలివాలు = తెల్లనిపాలు, నవ్వుగన్=మంద హాసముగుచుండఁగా, లడ్డువములు, చన్నులు= స్తనములుగుచుండఁగా, పనసతొ

లలు, మోవులుగన్ = అధరబింబములగుచుండఁగా, మండెంగలు=పూరీలు, చీరలుగన్, వనితయుఁబోలెన్ = యువతివలెనే, పెండ్లివారిన్, వలపించెన్ = మిక్కిలి మోహము గలవారినిగాఁ జేసెను. స్త్రీమందహాసాది విలాసములచేఁ బురుషుల మోహింపఁజేసినట్లు భోజనక్రియ పాయసము మొదలగు పదార్థములచే భోక్తలను దనయధీనులఁగాఁ జేసికొనె నని భావము. అనఁగా బదార్థము లమృతము తోపమానములయి యుండుటచేఁ బెండ్లివా రధికాసక్తితో మెసఁగుచున్నారని ఫలితార్థము.

తా. స్పష్టము. అలం. రూపకము.

తే. పద్మకోశాభి నయహ స్తకిసల్లవంబు
చూపె నొకమచ్చెకంటికి సొబగుఁ డొక్కఁ
డంతయోగిర మడిగెనో యంతలేసి
కొమరుపాలిండ్ల నడిగెనో రమణి నతఁడు. 135

టీ. సొబగుఁడు, ఒక్కఁడు = ఒకసుందరుఁడు, ఒకమచ్చెకంటికిన్ = ఒకస్త్రీకి, పద్మ...పల్లవంబు—పద్మకోశ = తామరమొగ్గను, అభినయ = సూచించు, హస్తపల్లవంబున్ = చిగురువంటి చేతిని, చూపెన్ = కనఁబఱిచెను. అనఁగాఁ దనచేతిని దామరమొగ్గవంటి యాకారము గలదానిగాఁజేసి చూపెనని భావము. అతఁడు = ఆపురుషుఁడు, రమణిన్ = ఆస్త్రీని, ఇంతయోగిరము = తనమడిచిపట్టిన చేయంతయన్నమును, అడిగెనో, లేక, అంతలేసి = అంతలేసియాకారముగల, కొమరుపాలిండ్లన్ = మనోహరములగు స్తనములనే, యడిగెనో = తెలియదని సందేహము. ఒకస్త్రీ వడ్డించుచుండఁగా నొకరసికుఁడు పద్మకోశాకారముగాఁ దనచేతిని జేసి యామెకుఁ జూపెను. వాఁ డట్లు చూపుట యన్నమపేక్షించియడిగెనో, దాని స్తనము లీయవలయునని కోరెనో తెలియరాకున్న దనిభావము.

తా. స్పష్టము. అలం. సందేహము.

తే. చూచెనొకఁడు వయోవశకస్తోకవికచ
కుచసమము నేప యగునొక్కకువలయాక్షి

నుభయ దోర్మూలకూలంకషోరుకఠిన
లలితవక్షోజ సరిలేమ లజ్జఁబొంద. 136

టీ. ఒకఁడు, వయో...సమున్మేష - వయోవశ = వయోవిశేషమువలన, స్తోక = కొంచెముగా, వికచ = వికసిల్లిన—నిక్కగల, కుచ = స్తనములయొక్క, సమున్మేష = కాంతిగలది. అనఁగా నది యౌవనప్రారంభదశయం దుండుటచే స్థూలములుగాని స్తనములు గలదని భావము. అగు నొక్క కువలయాక్షిన్ = అయినట్టి యొక స్త్రీని, ఉభయ...వక్షోజ—ఉభయ=రెండైన, దోర్మూల = భుజమూలములయొక్క, కూలంకష = తటముల నొరయుచున్న, ఉరు=గొప్పవగు, కఠిన=గట్టివైన, లలిత = సుందరములయిన, వక్షోజ= స్తనములుగల, సరిలేమ =దానితో గూడనున్న స్త్రీ, లజ్జన్, పొందన్ = సిగ్గుపడునట్లుగాఁ జూచె. ఆభోజనసమయమున యౌవనప్రారంభదశయం దున్నయొక యువతియు, మధ్యయౌవనమున నుండుటచే నున్నతములగు కుచములుగల వేఱొకతెయు నచ్చటనుండఁగా నొకపురుషుఁ డాబాలిక స్వల్పస్తనములను జూచుచుండెను. ఆసమాచారము సమీపముననున్న రెండవస్త్రీఁజూచి "స్వల్పములగు స్తనములగల ముగ్ధనే యట్లు గాఢముగాఁ జూచుచున్నాఁడుకదా? పృథుకుచల గలిగి ప్రౌఢనై యున్న నన్నింత జూడఁడాయెనని సిగ్గపడి చూచెనని భావము.

తే. ఉష్ణశీతాన్నకబళంబు లొకఁడుసూపఁ
బవలొ రాత్రియొ గెడఁగూడనవసర మని
దాని కుత్తర మొకలతాంగితన్వి యిచ్చె
నధరబింబంబు విఱిచి సంధ్యాగమ మని. 137

టీ. ఒకఁడు=ఒకరసికుఁడు, గెడఁగూడన్=కలియుటకు, అనఁగా సంభోగించుటకనుట, అవసరము=సమయము,పవలొ=పగటిపూఁటయో, రాత్రియొ= రాత్రిపూఁటయొ, అని,మనమన్యోన్యముగూడి వర్తించుటకు రాత్రి సముచితమా, పగలు సముచితమాయని తెలిసికొనుటకనిభావము, ఉష్ణశీతాన్న కబళఁబులు=

వెచ్చనివియు, జల్లనివియునగు నన్నకబళములను, చూపక్=కనఁబఱుపఁగా, పవలు సూర్యకాంతిచే నుష్ణముగలదైయుండునుగాన యుష్ణాన్నకబళము పగటి పూఁటయనియు. రాత్రి శీతలమైయుండును గనుక చల్లని యన్నకబళము రాత్రి పూఁటయనియు గ్రహింపవలయు దానికిక్=వాఁడడిగిన ప్రశ్నమునకు, ఒకలతా తన్వి=ఒక స్త్రీ, సంధ్యాగమము=సంధ్యాకాలము, అని, అధరబింబంబు=అధరోష్ఠమును, విఱిచి, ఉత్తరము, ఇచ్చెక్=ఒసంగెను. ఒకరసికుఁడు నల్వురలోనుండి తన్నుఁ గానవచ్చిన ప్రియురాలినిజూచి తనయభిప్రాయం బొరులకుఁ దెలియకుండ దానికి మాత్రమే తెలుపవలెనని యుష్ణశీతాన్నకబళములను జూపఁగానది పెదవి విఱిచి ప్రత్యుత్తరమిచ్చెను. ఇచ్చటఁ బ్రశ్నోత్తరముల కభిప్రాయమేమనఁగా సంభోగసమయము పవలారాత్రియాయని యాయన్నకబలములను జూపెనని ప్రశ్నాభిప్రాయము, సంధ్యాకాలమెఱ్ఱగానుండును గాన దానికాంతి వంటి కాంతిగల తనపెదవివిఱిచి సంధ్యాసమయము సంభోగమునకు యుక్తసమయమని ప్రత్యుత్తరాభిప్రాయము. రాత్రివెన్నెలయుండును. పవలు సూర్యకాంతియుండును. సంధ్యాసమయ మంధకార మలినమై యుండునుగాన నది యహర్నిశలకంటె యుక్తమైనదని తెలుపుటకట్లు పెదవివిఱిచెను. అలం. సూక్ష్మము.

ఉ. నానదొఱంగి చుంబనమొకండొనర్చుటెకాదొకఁడొక్క చంద్రబిం
బాననమోముచంద్రుఁ జషకాంతరబింబితునింబునఃపునః
పానకపానకర్మము నెపంబునఁ జేసి తదోష్ఠపల్లవం
బానుచునాచరించెనుసమంచితసీత్కృతచూత్కృతంబులన్.

టీ. ఒకఁడు, నాన=సిగ్గును, తొఱంగి=విడిచి, చషకాంతరబింబితునిక్=పానపాత్రమందుఁ బ్రతిబింబించిన, ఒక్కచంద్రబింబానన మోముచంద్రుక్ = ఒక స్త్రీయొక ముఖచంద్రుని, చుంబనము, ఒనర్చుటె = ముద్దువెట్టుకొనుటయే, కాదు, అనఁగా నంతటితో నూరకుండలేదని భావము. పునః... నెపంబునక్ — పునః పునః=మాటిమాటికిని, పానక=పంచదార పానకమును, పాన = త్రావుట యనెడి, కర్మము = పనియొక్క, నెపంబునక్ = చేసి = మిషచే, తదోష్ఠపల్ల

వంబు=ఆప్రతిబింబముయొక్క చిగురువంటి పెదవిని, అనుచున్ = నొక్కుచు, సీత్కృత చూత్కృతంబులన్=సీత్కృతము, చూత్కృతము ననెడి ధ్వనులను, ఆచరించెను. వాఁడట్లు ప్రతిబింబముయొక్క మోవినొక్కుచు సీత్కార ధ్వనులను, చూత్కృతధ్వనులను గూడఁ జేసెను. ఈచెప్పుటచే వాఁడు మన్మథావిష్టచిత్తుండై యొడలెఱుఁగక యాస్త్రీ యధరోష్ఠమునే నొక్కుచుం టినని యనుకొనియితరు లున్నారని యెఱుఁగకపానపాత్రము నోటఁబెట్టుకొని యెయట్లు ధ్వనిచేయ నారంభించెను. సీత్కృతమనఁగా 'సీత్' అనియు చూత్కృతమనఁగా, 'చూత్' అనియు నుచ్చరించునట్లుగా నోటినిబెట్టుకొని పీల్పఁగాఁ బుట్టుధ్వనులని యెఱుంగునది. పానకములోని కారమునకు సీత్కృతి తీపునకు చూత్కృతి. అధరపానపు సీత్కృతచూత్కృతములను పానకపానపు, సీత్కృతచూత్కృతములచేఁ గప్పిపుచ్చుట తెలియునది.

తా. ఒకవిటుఁడు సిగ్గువిడిచి యొకపానపాత్రమునఁ బ్రతిబింబితమయిన యొక స్త్రీయొక్క మోమును ముద్దుగొనుటయేకాకుండ మాటిమాటికిని పానము చేయుచున్నట్లు నటించుచు దాని వాతెఱనొక్కుచు సీత్కార చూత్కార ములఁ జేయనారంభించెను. అలం. అపహ్నవము.

ఆ. పంచదారఁ బొరపి భక్షింపఁగా నెత్త
భావదుష్ట మనుచు బావ నగిన
దొలఁగఁబెట్టె రోషకిలికించితంబుతో
గొమ్మనరఁటిపండ్లు గూర్మిమఱఁది. 139

టీ. కూర్మిమఱఁది=తనముద్దుమఱంది యగునొకఁడు, కొమ్మనరఁటిపండ్లు=ఒక దినుసు కదళీఫలములను, పంచదారన్=చక్కెరయందు, పొరపి=మిళితముగాఁ జేసి, భక్షింపన్=తినుటకు, ఎత్తన్=ఎత్తుచుండఁగా, భావదుష్టము=చెప్పఁదగని యొక చెడువస్తువు వలె నున్నదని మనసునఁ దోఁచు తోఁపికచే దుష్టమ యినది, అనుచున్=అనిపల్కుచు, బావ, నగినన్=నవ్వఁగా, కిలికించితంబు తోన్=రోషముతోడి లజ్జతో, తొలంగఁబెట్టెన్=తినుటమాని దూరముగాఁ

శాలవైచెను. ఒకబావ తనమఱఁది పంచదారతో బొరపి యరఁటిపండ్లను దిను టకు నెత్తఁగా, ఒకనిక్కృష్టవస్తువును దినునట్లుగాఁ దోఁచెడి నని నవ్వెను. అందుల కామఱఁది రోషమును లజ్జయుఁ బిరిగొన దానిని దినక తొలఁగఁ బెట్టెను.

వ. ఇవ్విధంబున శుచియు, మృష్టంబును, బథ్యంబును, నగుభోజ నంబు సేసి పెండ్లి దొరలును సుగంధోదకంబులం జేతులు దొడ సివార్చి ముఖవాసనంబు గైకొని కర్పూరతాంబూలంబులు పరిగ్రహించి దమదమనులప్రియోక్తులకు హర్షించుచు నిజని వాసంబుల కరిగి రప్పుడు. 140

టీ. ఇవ్విధంబునన్ = ఈరీతిగా, శుచియు=శుభ్రమైనదియు, మృష్టంబును= మృదువయినదియు, పథ్యంబును=హితమైనదియు, నగు భోజనంబును=అయినట్టి తిండి ని, చేసి=తిని, పెండ్లిదొరలు=పెండ్లిపెద్దలు, సుగంధోదకంబులన్ =పరిమ ళోదకములచే, చేతులు, తొడసి=తుడిచికొని, వార్చి = ఆచమనముచేసి, ముఖ వాసనంబున్ =నోటికిఁ బరిమళమును, కైకొని=స్వీకరించి, కర్పూరతాంబూ లంబు=పచ్చకర్పూరముతో మిళితముచేసిన తాంబూలమును, పరిగ్రహించి=తీసి కొని, దమ దమనులప్రియోక్తులకున్ =దమ దమనులయొక్క ప్రియవచనములకు, హర్షించుచున్, నిజనివాసంబులకున్, అరిగిరి, అప్పుడు=అట్లు వెళ్లుచున్న సమ యమున, అని వైపద్యములో నన్వయము.

చ. కలికి వరాటరాజు పుడు కర్పూరవీడెము వెట్టె నవ్వుచున్
నలునడపంబువానికి ఫణాధరవల్లి దళాంతరంబునన్
బలితపుఁదేలు మైనమునఁ జేసి బన్ని యతం డది చూచి భీతిఁద
మ్ములు మిలవైచిన న్నగిరిజేమూఁగిన రాజకుమారు లందఱున్.

టీ. కలికివరాటరాజు=వరాటయువరాజు - దముఁడు, అపుడు=తాంబూల ములిచ్చునప్పుడు, ఫణా...రంబునన్ — ఫణాధరవల్లిదళ = తమలపాకుల యొక్క, అంతరంబునన్ =మధ్యమందు, మైనమునన్ =ఒకదినుసు మెత్తనిపదా

ర్థముతో, బలితపుఁదేలు=పెద్దతేలును, పన్ని=నిర్మించి, నలునడపంబు వానికిన్ =
నలరాజునకుఁ దములపాకులుచుట్టి యిచ్చుభృత్యునకు, నవ్వుచున్ = చిఱున
వ్వు చేయుచు, కప్పురవీడెము=కర్పూరమిళితమగు తమ్ములమును, పెట్టెన్=చేతి
లోఁబెట్టెను. అతండు=ఆభృత్యుఁడు, అది=ఆతేలును, చూచి, భీతిన్=భయ
ముతో, తమ్ములమున్, ఇలన్, వైచినన్=గిరవాటు వేయఁగా, మూఁగినరాజ
కుమారులందఱును, నగిరి=నవ్విరి.

తా. దముఁడు పెండ్లివారికిఁ దాంబూలంబు లొసంగుచు నలుని భృత్యునికి
మైనపుఁదేలును దములపాకులలో నుంచి పరిహాసమునకై యిచ్చెను. వాఁడది
చూచి భీతిల్లి పాఱవైవఁగా నచ్చటివారందఱును వాని యవివేకమునకునవ్విరి.

మ. మృదుమృష్టాన్నములీప్రకారమున నెమ్మిన్వారుముప్పొద్దుగొ
న్నిదినంబుల్భుజియించుచుండిరిసమున్నిద్రానురాగంబుతోఁ
బదియాఱేడుల పువ్వుఁబోండ్లనునుపుంజాలిండ్ల కాఠిన్య సం
పదతో రాత్రులుమల్లుసాముమదనోన్మాదంబునం జేయుచున్.

టీ. వారు=పెండ్లివారు, రాత్రులు=రాత్రులందు, సమున్నిద్రానురాగంబు
తోన్=అత్యంతాను రాగముతో, మదనోన్మాదంబునన్=మన్మథవికారముతో,
పదియాఱేడుల... సంపదతోన్-పదియాఱేఁడులుపువ్వుఁబోండ్ల=పదునాఱు
వత్సరంబులు గల యువతులయొక్క, నునుపుం జాలిండ్ల= నున్నని స్తనములయొ
క్క, కాఠిన్య సమృద్ధితోన్ =కఠినత్వ సమృద్ధితో, మల్లుసాము=మల్లయుద్ధ
మును, చేయుచున్, అనఁగా రాత్రులందు యువతీసుఖ మనుభవించుచు నని
భావము. ఈప్రకారమున=వెనుక వర్ణించినట్టుగా, ముప్పొద్దు=మూడుపూఁట
లును, నెమ్మిన్=ప్రీతితో, మృదుమృష్టాన్నములు=మృదువయిన భోజనపదార్థ
ములను, కొన్నిదినంబులు, భుజియించుచుండిరి=తినుచునుండిరి. అట్లు సరసమగు
నన్నమును భుజించుచుఁ గొన్ని దినములు కుండిన నగరమున నున్నవారనిభావము.

తా. ఆపెండ్లివారు రాత్రులందుఁ బదియాఱువత్సరముల ప్రాయముగల యు
వతులతో క్రీడించుచు సరసములగు శాల్యన్నములను మూడుపూఁటలును ప్రీతి
తోఁ దినుచుఁ గొన్ని దినంబు లటనుండిరి.

వ. నిషధమహీవల్లభుండును దమయంతీ పరిణయమహోత్సవం
బివ్విధంబున ననుభవించి దివసచతుష్టయానంతరమున. 143

శా. నారీచిత్తసరోమరాళ,నయచాణక్యా,విరించ్యన్వయ
క్షీరాంభోధిసుధామయూఖ,కవితాసిద్ధాంతసర్వజ్ఞ, జం
భారాతి ద్విపహస్తకాండ నిభబాహాఖడ్గధారాపయో
ధారాశాంత విరోధి భూధవమహోదగ్రప్రతాపానలా. 144

టీ. నారీచిత్త సరోమరాళ-నారీ= స్త్రీలయొక్క, చిత్త= మనస్సనెడి, సరః=సరస్సునకు, మరాళ=హంసవంటివాఁడా ; నయచాణక్యా=నీతియందు చాణక్యునివంటివాఁడా, విరిం... మయూఖ-విరించి=బ్రహ్మయొక్క, అన్వయ= వంశమనెడి, క్షీరాంభోధి=పాలసంద్రమునకు, సుధామయూఖ=చంద్రునివంటి వాఁడా, కవితాసిద్ధాంతసర్వజ్ఞ-కవితా=కవిత్వమందలి, సిద్ధాంత = నిశ్చయ ములయొక్క,సర్వజ్ఞ=సమస్తము నెఱిఁగినవాఁడా! జంభా... భూధవ-జంభారా తిద్విప=ఐరావతముయొక్క, హస్తకాండ=హస్తదండముతో, నిభ =సమాన మగు, బాహా=చేతియందున్న, ఖడ్గధారా=కత్తియంచనెడి, పయోధారా = నీటిదారచేత, శాంత=చల్లార్పఁబడిన, విరోధిభూధవ= శత్రురాజులయొక్క, మహోదగ్ర=తీక్ష్ణమగు, ప్రతాపానలా = ప్రతాపాగ్ని కలవాఁడా. అల. రూపకములు.

క. అరి వీరబసవశంకర
శరణాగత రక్షణాను సంధాన ధురం
ధర, సచివగంధ సింధుర
ధరణీధరశైకదక్షదక్షిణహస్తా. 145

టీ. అరివీరబసవశంకర-అరివీర = శత్రువీరులనెడియెద్దులకు, రుద్రునివంటి వాఁడా-వారినాజ్ఞచొప్పున మెలపువాఁడాయనుట,శరణా...ధర-శరణాగత= శరణుఁజొచ్చినవారియొక్క, రక్షణానుసంధాన=రక్షణనుగూర్చుటయొక్క, ధురంధర = భారమునువహించినవాఁడా, అనఁగా శరణాగతుల రక్షించువాఁ

డా అనుట, సచివగంధసింధుర-సచివ=మంత్రులలో, గంధసింధుర=శ్రేష్ఠుఁడా, ధరణీ...హస్తా-ధరణీ=భూమియొక్క, భరణ=మోయుటయందు, ఏక=ముఖ్యాగా, దక్ష = సమర్థమైన, దక్షిణహస్తా = కుడిభుజము గలవాఁడా, అనఁగా=భూభారమును భరించువాఁ డనుట.

మాలిని. ధరణిభరదిధీర్షాధఃకృత స్తబ్ధరోమ
ద్విరదకమఠరాజోర్వీధ్రదర్వీకరేంద్రా
హరచరణరిరంసావ్యంజితానందసాంద్రా
పరిహృతమతితంద్రా భాగ్యసంపన్మహేంద్రా. 146

టీ. ధరణి...కరేంద్రా-ధరణి = భూమండలముయొక్క, భర=బరువును, దిధర్షా=ధరించునిచ్ఛచే, అధఃకృత=క్రిందుగాఁజేయఁబడిన, స్తబ్ధరోమ=ఆదివరాహమును, ద్విరద=దిగ్గజములును, కమఠరాజ=కూర్మరాజును, ఉర్వీధ్ర=కులపర్వతములును, దర్వీకరేంద్రా=శేషుఁడును గలవాఁడా, హర...సాంద్రా-హరచరణ=శంకరుని పాదములందలి, రిరంసా=క్రీడింపనిచ్ఛచే, వ్యంజిత=ప్రకటితమైన, ఆనంద=సంతోషముచే, సాంద్రా=దట్టమైనవాఁడా! పరిహృతమతితంద్రా = తొలఁగించుకొనఁబడిన బుద్ధిమాంద్యముగలవాఁడా, భాగ్యసంపన్మహేంద్రా=భాగ్యసమృద్ధిచే దేవేంద్రునివంటివాఁడా?

తా. ఆదివరాహముకంటెను, దిగ్గజములకంటెను గూర్మరాజుకంటెను, గులపర్వతములకంటెను శేషునికంటెను మిక్కిలి నేర్పుతో భూభారమును వహించి యీశ్వరపాదధ్యానముచే నధికానందమందుచు,మతిమాంద్యమును దొలంగించుకొని, భాగ్యసంపదకు దేవేంద్రునితో సముఁడవయిన యోమామిడిసింగా!

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్య పుత్త్ర, సకలవిద్యాసనాథ శ్రీనాథ ప్రణీతం బైన శృంగార నైషధ కావ్యంబునందు షష్ఠాశ్వాసము సమాప్తము.

---



శ్రీరస్తు.

# శృంగారనైషధము

## సప్తమాశ్వాసము.

---



రెడ్డి వేమవిశ్వ
క్ష్మారమణ కృపావిశేష సమధిగతైశ్వ
ర్యారూఢ విభవశృంగా,
మారారిపదాబ్జభృంగ, మామిడిసింగా. 1

టీ. శ్రీ...శృంగా-శ్రీ=లక్ష్మీసంయుతుఁడయిన, రెడ్డి=రెడ్డివంశజనితుఁడయిన, వేమ విశ్వక్ష్మారమణ=సమస్తభూమికినధిపతియగు వేమ భూపాలునియొక్క, కృపావిశేష=దయాతిశయమువలన, సమధిగత=పొందఁబడిన, ఐశ్వర్య=సంపదలచే, ఆరూఢ=స్థిరమైన,విభవశృంగా=వైభవము యొక ఔన్నత్యముగలవాఁడా! మారారిపదాబ్జభృంగ=శంకరుని పాదపద్మములందుఁ దుమ్మెదయైనవాఁడా; అనఁగాఁ బద్మమందు సక్తమయి తుమ్మెద తదీయమగు మరందమును బానము చేసినట్లు లితఁ డీశ్వరపాదధ్యానమరందమున సక్తుఁడై యానంద సుఖమును గోరుచున్నాఁడని భావము. మామిడిసింగా=ఓమామిడి సింగనామాత్యా !

తా. వేమభూపాలునిఁ గొలిచి తదీయదయారసమువలన గొప్పసంపదలను బొంది శంకరుని పాదపద్మములను గొలుచుటం దధికాసక్తి గలయోమామిడిసింగనామాత్యా !

వ. వినుము. 2

గీ. పయనమై స్వపురోహితప్రవరుఁడైన
గౌతముండు ప్రస్థానసంగతికిఁ దగిన
మంగళాచార మొనరింపఁ మహీవరుండు
శిబిరమెత్తఁ బడవాళ్లకుఁ జెప్పఁబనిచె. 3

టీ. స్వపురోహిత ప్రవరుఁడు=తనపురోహితులలో శ్రేష్ఠుఁడు, ఐనగౌతముండు=అయినట్టి గౌతముఁడను బ్రాహ్మణశ్రేష్ఠుఁడు, ప్రస్థాన సంగతికిన్ = ప్రయాణసమాచారమునకు, తగినమంగళాచారము = అర్హమగుమంగళక్రియను, ఒనరింపన్=చేయఁగా, మహీవరుండు=నలుఁడు, పయనమై=ప్రయాణోన్ముఖుఁడయి, శిబిరము=సైన్యమును, ఎత్తను=బయలుదేఱించుటకు, పడవాళ్లన్=సేనాధిపతులనుగూర్చి, చెప్పన్, పనిచెన్=చెప్ప నాజ్ఞాపించెను.

తా. నలుఁడు తనపురోహితుఁడగు గౌతముఁడు ప్రయాణమున కనుకూలమయిన మంగళాచారమును జేయఁగాఁ బ్రయాణోన్ముఖుండయి తనసైన్యములఁ గదలింప వలయునని సేనానాయకుల కాజ్ఞాపించెను.

ఉ. పుట్టిననాఁటఁ గోలె నొకప్రొద్దునిజాంకతలంబుఁ బాయకు
న్నట్టియనుంగుఁగూఁతుదమయంతిఁగడుంగడుదూరమన్పుచో
నిట్టివిషాదమాత్మ నుదయించదుకూరిమియల్లు నంపుచో
నెట్టివిషాదమాత్మ నుదయించెనొ మామకు నత్తగారికిన్. 4

టీ. మామకున్=నలునకు మామయగు భీమరాజునకును, అత్తగారికిన్=భీమరాజుభార్యకును, కూరిమినల్లు=ప్రేమాస్పదుఁడగు నల్లుని, అంపుచోన్=పంపించునప్పుడు, ఎట్టివిషాదము=ఎట్టిదుఃఖము, ఆత్మన్=మనంబున, ఉదయించెనో=కలిగెనో, ఇట్టివిషాదము=నలునిఁబంపునపుఁడు గల్గినదుఃఖమువంటి దుఃఖము, పుట్టిననాఁటఁగోలెను=పుట్టినప్పటినుండియు, ఒకప్రొద్దున్=ఒకదినమైనను, నిజాంకతలంబున్=తనతొడను, పాయక=విడువక, ఉన్నట్టియనుంగుకూఁతున్=ఉన్నటువంటిముద్దుల కుమారికను, దమయంతిని, కడున్ కడున్=మిక్కిలిగా

ప్పదగు, దూరము=దూరదేశము, అన్వచోన్=పంపునప్పుడు, ఉదయింపదు = కలుగదు. వృద్ధరాజదంపతులకు ముద్దు టల్లుఁడగునలునిఁ బంపునప్పుడు కలిగినంత విచారము చిన్నప్పటినుండియు దమయొద్దనే పెరిఁగిన ముద్దులకూఁతురగు దమయంతిని బంపునపుడయినను గలుగలేదని భావము. ఈచెప్పుటచే నలుఁడు శౌర్యాది గుణములచే వారికి మిక్కిలి ప్రేమాస్పదుఁ డయినట్టితోఁచుచున్నది.

తా. ఆవృద్ధరాజ దంపతులకుఁ దమయల్లునిఁ బంపునప్పుడు గల్గినంతటి దుఃఖము తమగర్భంబున జన్మించి చిన్నప్పటినుండియుఁ దమయొద్దనే పెరిఁగియున్నతమముద్దుకూఁతురగు దమయంతిని బంపునపుడైనను గలుగలేదు. అలం. విభావన.

ఉ. అక్షయరాజ్యవైభవరమానుభవాభినవప్రభాసహ
స్రాక్షుఁడుగుండినాధిపతియాత్మసుతారమణు న్వినీతతా
లక్షగుణీభవద్గుణకలాపుని నైషధుని న్వరాట దే
శక్షితిమండలావధిగసమ్మతి నంపె సుతద్వయంబుతోన్. 5

టీ. అక్షయ... సహస్రాక్షుఁడు-అక్షయ=నాశనరహితమగు, రాజ్యవైభవరమా=రాజ్యలక్ష్మిని, అనుభవ=అనుభవించుటయందలి, అభినవ=క్రొత్తవయిన, ప్రభా=కాంతులకు, సహస్రాక్షుఁడు=దేవేంద్రునివంటివాఁడు, అనఁగా భీమరాజు సమస్తరాజ్యలక్ష్మి ననుభవించుటలో నింద్రుని వంటివాఁడని భావము. కుండినాధిపతి=భీమరాజు, ఆత్మసుతారమణున్=తనకుమారికి భర్తయైనవాఁడును, వినీతతా...కలాపునిన్-వినీతతా=వినయాతిరేకముచే, లక్షగుణీభవత్=లక్షమడుఁగు లధికమయిన, గుణకలాపునిన్=గుణసమూహముగల వానిని, అనఁగా నలుడు వినయసంపదచే లక్షరెట్లధికములగు గుణసమూహము కలవాఁడని భావము. నైషధునిన్=నలరాజును, సుతద్వయంబుతోన్=తనయిర్వురు కుమారులునగు దమ దమనులతో, వరాటదేశక్షితి మండలావధిగన్=వరాటదేశపు సరిహద్దువఱకును, సమ్మతిన్=సంతసముతో, పంపెన్=సాగనంపెను.

తా. సమస్తమైనరాజ్యలక్ష్మి ననుభవించుటలో రెండవదేవేంద్రుఁడయి భీమ

రాజు తన కుమారులతోఁ గూడుకొని వినయసంపదచే లక్షరెట్లధికమగుగుణస మూహముగల్గిన తనయల్లుని నలుని వరాటదేశపు హద్దువఱకును ముదంబున వెంబ డించి నడిచెను. అల. రూపకము, కావ్యలింగము.

తే. ఆత్మమండల మవధిగాఁ దనుచరించి
యవనినాథుఁడు జామాతఁ దనిపి మరలె
నా ప్రతీరంబు గంధవాహంబు ననిచి
మరలి పోవు తటాకంబుఁ దరఁగ వోలె.　　6

టీ. ఆప్రతీరంబు=తీరమువఱకు, గంధవాహంబున్ = గాలిని, అనిచి=పంపి, మరలిపోవు తటాకంబుతరఁగవోలెన్ =తిరిగివచ్చుచున్న చెఱువులోని కెరటము వలె, అవనినాథుఁడు=భీముఁడు, ఆత్మమండలమవధిగాన్ =తనదేశపుహద్దువఱకు ను, జామాతన్ =అల్లుని, అనుచరించి=వెంబడించి, అనిపి=పంపివేసి, మరలెన్ = తనపురమునకుఁ దిరిగెను.

తా. తటాకములోని తరంగము వాయువును దీరముదనుకఁ బంపితిరిగివచ్చు ను. అట్లెభీమరాజు తనయల్లుఁడగు నలుని తనదేశపు పొలిమేఱవఱకును వెంబ డించి యచ్చటినుండియతని వీడ్కొల్పి తనపురంబున కరుదెంచెను. అలం ఉపమ.

వ. అప్పుడు నిజవియోగజనితక్లేశంబునం గన్నులబాష్పాంబుక ణంబు లురలఁ బ్రణామంబుచేసి తలవాంచి యున్నకూఁతుం గౌఁగిలించుకొని గద్గదస్వరంబునఁ దండ్రి యిట్లనియె.　　7

టీ. అప్పుడు=దమయంతిని విడిచి భీమరాజువెనుకకు మరలునప్పుడు, నిజవి యోగజనితక్లేశంబునన్ =తనయెడఁబాటువలనఁ గల్గినదుఃఖంబుచే,కన్నులన్ = నేత్రములందు, బాష్పాంబు కణంబులు=కన్నీటిబిందువులు, ఉరలన్ =కాఱు చుండఁగా, ప్రణామంబు=నమస్కారమును, చేసి,తలవాంచి = శిరస్సునువంచి, ఉన్నకూఁతున్ ,కౌఁగిలించుకొని, గద్గదస్వరంబునన్ =హీనస్వరముతో, తండ్రి =భీమరాజు, ఇట్లు, అనియెన్.

మ. గురువన్నన్ ధనమన్నఁ బుణ్యమనినన్ గోత్రోదయం బన్న దే
వరయన్నన్ మనమన్నఁ దుష్టియనినన్ వాత్సల్యమన్నన్ నిజే
శ్వరుఁ డన్నం బరమోపకారమనినన్ సర్వంబు నన్నం దలో
దరి నీకు న్నిషధాధినాథుఁడె సుమీ తథ్యంబుగాఁ జెప్పితిన్.

టీ. తలోదరి=కృశించిన యుదరముగల కుమారీ! గురువు, అన్నన్=హితోపదేష్టయనినను, ధనము, అన్నన్, పుణ్యము అనిన, గోత్రోదయంబు=కులాభివృద్ధి అన్నన్, దేవర, అన్నన్=ప్రభువని పల్కినను, మనమన్నన్=మనస్సని చెప్పినను, తుష్టియనినన్=సంతోషమనినను, వాత్సల్యము, అన్నన్, నిజేశ్వరుఁడు=ప్రాణనాథుఁడు, అన్నన్, పరమోపకారమనినన్, సర్వంబున్, అన్నన్=సమస్తమన్నను, నిషధాధినాథుఁడెసుమీ=నలుఁడేసుమీ? తథ్యంబుగాన్ = నిక్కముగా, చెప్పితిన్.

తా. ఓకుమారీ! నీకుగురువు, ధనము, ధర్మము, కులాభివృద్ధి, ప్రభువు, మనస్సు, సంతోషము, వాత్సల్యము, ప్రాణనాథుఁడు, పరోపకారము పెక్కేలసమస్తమును, నలుఁడే కాని లోకంబున వేఱొక్కఁడు లేఁడు. సత్యముగాఁ జెప్పితిని యోజించుకొనుము.

సీ. పాటించి కొలువుము భవనదైవతముల
సవతులఁ గొనియాడు సఖులఁ బోలె
నారాధనము సేయు ముత్తమామల నెప్డుఁ
బరిజనంబులమీఁదఁ గరుణ గలుగు
మలుగకు కోపించి నపుడు నాథునితోడ
మదిలోన నుబ్బకు మన్ననలకుఁ
దోడికోడండ్రతోఁ గూడిమాడి చరింపు
దాసీజనముఁ బ్రోవు తల్లికరణి

తే. బ్రాహ్మణులయందు గురులందు బంధులందు

భక్తివిశ్వాససౌహార్దపరత నెఱపు
భవ్యపతిదేవతాచారపరమపుణ్య
ధర్మమే మఱకుండుమీ తల్లి కాన. 9

టీ. తల్లి కాన=నాతల్లీ, భవన దైవనతములన్ =ఇలువేల్పులను, పాటించి=ఆదరించి, కొలువుము=సేవింపుము, సపతులన్ =సపత్నులను, సఖులంబోలెన్ =చెలికత్తెలవలె, కొనియాడుము=నుతింపుము, ఎప్డున్, అత్తమామలన్, ఆరాధనము, చేయుము=పూజసలుపుము, పరిజనంబులమీఁదన్, కరుణగలుగు=దయగలదానవు కమ్ము, కోపించినపుడు=భర్తకోపించినపుడు, నాథునితోన్=భర్తతో, అలుగకుము, అనఁగా నొకవేళ భర్తకోపించినను నీవతనిఁ గోపింపనలవని భావము. మన్ననలకున్ =గౌరవములకు, మదిలోనన్, ఉబ్బకు=గర్వింపకు, నేనందఱచేత గౌరవింపఁబడుచుంటినని గర్వమొందవలదని భావము. తోడికోడండ్రతోన్, కూడిమాడి=మిక్కిలి కలసిమెలసి, చరింపుము, దాసీజనులన్, తల్లికరణిన్, ప్రోవుము=రక్షింపుము, బ్రాహ్మణులయందున్, గురులందున్, బంధులందున్=చుట్టములందును, భక్తి...పరతన్-భక్తిపరతన్=అనురాగాతిశయమును, విశ్వాస=నమ్మకమును, సౌహార్దపరతన్=స్నేహాతిశయమును, నెఱపుము=చూపుము. అనఁగా బ్రాహ్మణులందు భక్తిని, గురువులందు నమ్మకమును, జుట్టములందు స్నేహమును గల్గి వర్తింపుమనిభావము. భవ్య...పుణ్య-భవ్య = పవిత్రలయిన, పతిదేవతా=పతివ్రతాస్త్రీలయొక్క, ఆచార=ప్రవర్తనలచేత, పరమపుణ్య=గొప్పసుకృతమయిన, ధర్మమున్=వ్రతమును, ఏమఱక ఉండుమీ! అనఁగా పతివ్రతాధర్మమందు శ్రద్ధగల్గియుండుమని భావము.

తా. స్పష్టము.

వ. అని బుజ్జగించి బుద్ధిచెప్పి కూఁతునీడ్కొనితెఱు, దమదమనులుం జెలియలి ననునయించి. 10

ఉ. సంకుమదంబుఁ గస్తురియుఁ జాఁదుఁ బటీరముఁ గప్పురంబును

గుంకుమపువ్వునుం బునుంగుఁ గొజ్జెంగ నీరు ననేకభారముల్
కంకణకంఠికా కటకకాంచిముఖాభరణ వ్రజంబుతోఁ
గొంకక తోడఁబుట్టువులు కూరిమి చెల్లెలి కిచ్చి రిద్దఱున్. 11

టీ. తోడఁబుట్టువులు, ఇద్దఱున్ = దమయంతికి సహోదరులగు దమదమను లిర్వురును, కొంకక = సంకోచింపక, కంకణ... వ్రజంబుతోన్ — కంకణ = ముత్యములు పగడములు మొదలగువానితోఁ గూర్చిన చేసరములు, కంఠికా = కంఠాభరణములును, కటక = బంగారుమురుగులును, కాంచి = మొలత్రాడును, ముఖ = మొదలయిన, ఆభరణవ్రజంబుతోన్ = అలంకారములతోఁగూడ, సంకుమదంబును = జవ్వాదిని, కస్తురియు, చాఁదున్, పటీరము = చందనమును, కప్పురంబునన్, కుంకుమపువ్వును, పునుఁగు = మార్జాలమువలనఁ గల్గినపరిమళవస్తువును, గొజ్జెఁగనీరును = పన్నీరును, అనేకభారముల్ = పెక్కుబారువుల యెత్తుగల పదార్థమును, కూరిమిచెల్లెలికిన్ = ముద్దుసోదరికి, ఇచ్చిరి.

తా. దమదమను లిరువురును దమసోదరియగు దమయంతికి కంకణములు, కంఠాభరణములు, మొలత్రాడు మొదలగు నలంకారములను, పునుఁగు, జవ్వాది, చందనము, కస్తురి, కుంకుమపువ్వు మొదలగు పరిమళవస్తువులను మిక్కుటముగా నొసంగిరి.

సీ. కదళికాచంపకక్రముకపాటలచూత
కంకేళివాటికాసంకులంబు
లక్షీణబహుళపుండ్రేక్షురాజాన్నాది
భూరిసస్యసమృద్ధిభూషణములు
కమలనీలాంబుజకల్హారకుముదాఢ్య
శుంభత్తటాకోపశోభితములు
వివిధాపణస్థలీవిన్యస్తరత్నాది
బహుపదార్థవ్రాతబంధురములు

తే గ్రామములు నూఱు క్రథకై శికంబులోనఁ
బసపు కిచ్చిరి భీమభూపాలసుతులు
దండ్రియాజ్ఞ సహోదరధర్మ మొప్ప
ననుఁగుసైదోడు దమయంతి ననుపునపుడు. 12

టీ. భీమభూపాలసుతులు=భీమరాజు కుమారులయిన దమదమనులు, సహోదరధర్మము=భ్రాతృధర్మము, ఒప్పన్=ఒప్పునట్లుగా, తండ్రియాజ్ఞన్=జనకుని శాసనముచొప్పున, అనుఁగుసైదోడు=తమ ముద్దుసోదరిని, దమయంతిని, అనుపు నపుడు, క్రథకైశికంబులోనన్=క్రథకైశిక దేశములో, కదళికా...సంకులంబు—కదళికా=అనఁటిచెట్లయొక్కయు, చంపక=సంపెంగలయొక్కయు, క్రముక=పోఁకలయొక్కయు, పాటల=కలుగొట్టుచెట్లయొక్కయు, కంకేళి=అశోకములయొక్కయు, వాటికా = పంక్తులచే, సంకులములు=నిండియున్న వియు, అక్షీణ...భూషణములు—అక్షీణ=నాశముపొందని, బహుళ=అనేకము లయిన, పుండ్రేక్షు=నామాల చెఱకు, రాజాన్న=రాజాన్నమనెడి సస్యవిశేషము, ఆది=మొదలయిన, భూరి = విస్తారమైన, సస్య = పైరులయొక్క, సమృద్ధి= సంపదలే, భూషణములు=అలంకారములుగాఁ గలవి. కమల...శోభితములు- కమల=పద్మములు, నీలాంబుజ=నల్లఁగలువలు, కల్హార=సుగంధముగలకలువలు, కుముద=తెల్లఁగలువలు, వీనిచే, ఆఢ్య=నిండినవై, శుంభత్=ప్రకాశించుచున్న, తటాక=చెఱువులచే, ఉపశోభితములు=మిక్కిలిగాఁ బ్రకాశించునవియు, వివిధా...బంధురములు—వివిధ = అనేకములయిన, ఆపణస్థలీ=అంగడివీథులందు, విన్యస్త=ఉంపఁబడిన, రత్న=రత్నములు, ఆది = మొదలయిన, బహుపదార్థ= అనేకపదార్థములయొక్క, వ్రాత=సమూహములచే, బంధురములు=సుందరము లయినవియు,అగు,గ్రామములు, నూఱు=నూఱుగ్రామములను, పసపుకు=పసపు కుంకుమములకుఁగా, ఇచ్చిరి. ఇటఁ 'బసపునకు" అనుటకు మాఱుగాఁ 'బసపు' కనుట చింత్యము.

తా. భీమరాజుకుమారులు దమదమనులును దమ ముద్దుసోదరియగు దమ

యంతి నత్తవారింటికిఁ బనుచునప్పుడు, తండ్రి యనుమతి వడసి, కదళికాదివన ములచేఁ బరివృతములయి పుండ్రేక్షువు, రాజాన్నము మొదలగు సస్యసమృద్ధులచే నలంకృతములయి, పద్మములు వివిధములగు కలువలు మొదలగువానిచేఁ బ్రకాశించెడి తటాకములచే శోభించుచు, పలువిధములగు నంగడివీథులం దుంపఁబడిన రత్నాదిపదార్థములచే విరాజితములును నగు నూఱుగ్రామములు చెల్లెలికిఁ బసపుకుంకుమలకుఁగా నిచ్చిరి.

తే. ఉభయవంశలలామ యయ్యుత్పలాక్షి
యత్తవారింటి కరిగెడునవసరమున
మాతృజనక సఖీజనభ్రాతృవిరహ
మధిపతిప్రేమ జలరాశికౌర్వ మయ్యె. 13

టీ. ఉభయవంశలలామ = రెండువంశములకును నలంకారమువంటిదగు, ఆ యుత్పలాక్షి = ఆదమయంతి, అత్తవారింటికిన్, అరిగెడు నవసరమునన్ = వెళ్లెడిసమయమందు, మాతృ...విరహము—మాతృ=తల్లియొక్కయు, జనక= తండ్రియొక్కయు, సఖీజన = చెలికత్తెలయొక్కయు, భ్రాతృ=సోదరుల యొక్కయు, విరహము=ఎడఁబాటు, అధిపతిప్రేమజలరాశికిన్ =తనపతియైన నలరాజునం దున్నప్రేమమనెడి సముద్రమునకు, ఔర్వమయ్యెన్ = బడబాగ్ని వంటిదాయెను. బడబాగ్ని సముద్రము నింకించునట్లు స్వజనవిరహము భర్తృప్రేమమును హరించెనని భావము. మొదట భర్తృప్రేమ బలీయమయ్యెను. కాని తరువాత మాత్రాదులందలి ప్రేమమే యధికమాయెను. భర్తతోఁ గలిసి యుండుటవలనఁ గలుగునానందము మాని మాత్రాదుల వియోగమును దలంచి దుఃఖించెనని ఫలితార్థము.

తా. ఉభయవంశపవిత్రురాలయిన దమయంతి యత్తవారింటి కేఁగునపుడు పితృమాతృ భ్రాత్రాదుల వియోగము పతిప్రేమను నశింపఁజేసి దుఃఖించునట్లు చేసెను.

వ. ఇవ్విధంబున సంబంధిబంధుజనంబుల సముచితప్రకారంబుల వీడ్కొలిపి కతిపయప్రయాణంబుల. 14

టీ. స్పష్టము.

సీ. ప్రణిధిలోకానీతపరితోషవార్తాభి
నందితామాత్య బృందారకంబు
రాజవీథీ మహాప్రాసాద శిఖరాగ్ర
కీలితాలంకారకేతనంబుఁ
గ్రథకైశికాధీశకన్యావలోకన
వ్యగ్రపౌరవధూసమాకులంబుఁ
గస్తూరికా లేపకర్పూరరంగ వ
ల్ల్యభిరామ మందిరప్రాంగణంబు

తే. సారసారమసారాశ్మతోరణాంశు
చూర్ణకుంతల మాలికాశోభమాన
గోపురశ్రీలలామంబుఁ గూర్మిఁ బురము
డాయనేతెంచె నిషధభూనాయకుండు. 15

టీ. నిషధభూనాయకుండు=నలరాజు, ప్రణిధి.. బృందారకంబు—ప్రణిధి లోక=దూతలసమూహము చేత, ఆనీత = కొనిరాఁబడిన, పరితోషవార్త=నల రాజు వచ్చుచున్నాఁడను సంతోషవార్తచే, అభినందిత=ఆనందితులయిన, అ మాత్యబృందారకంబు=మంత్రిశ్రేష్ఠులుగలదియు,రాజ... కేతనంబు—రాజవీథీ= రాజవీథులందున్న,మహత్=గొప్పవయిన, ప్రాసాద=రాజమందిరములయొక్క, శిఖరాగ్ర=కొట్టకొనలందు, కీలిత = అమర్పఁబడిన, అలంకార=అలంకారార్థ మైన, కేతన=ధ్వజములుగలదియు, క్రథ...కులంబు—క్రథకైశికాధీశకన్యా= దమయంతిని, అవలోకన=చూచుటయందు, వ్యగ్ర=తత్తఱపడుచున్న, పౌర వధూ=పురస్త్రీలచే, సమాకులంబు = నిండియున్నదియు, అనఁగా దమయంతిని జూడ వేడుకతోఁ బురస్త్రీలందఱును సౌధాగ్రములఁ జేరుచున్నారనిభావము. కస్తూరికా... ప్రాంగణంబు-కస్తూరికా లేప=కస్తూరిపూఁతలచేతను,కర్పూరరం

గవల్లీ=కర్పూరచూర్ణముతోఁ బెట్టిన ముగ్గులచేతను, అభిరామ=మనోహరము లయిన, మందిర = ఇండ్లయొక్క, ప్రాంగణంబు = ముంగిలివాకిళ్లుగలదియు, సార...లలామంబు—సారసార=శ్రేష్ఠములయినఅంచులుగల,మసారాశ్మ=ఇంద్రనీలమాణిక్యములయొక్క, తోరణ=మాలికలయొక్క, అంశు=కాంతులనెడి, చూర్ణకుంతలమాలికా = ముంగురులపంక్తులచేత, శోభమాన = ప్రకాశించుచున్న, గోపురశ్రీ=గోపురపుశోభ, లలామంబు=తిలకముగా గలదియు, అనఁగా పురలక్ష్మికి పురద్వారము ముఖముగను, ఇంద్రనీలతోరణకాంతులు చూర్ణకుంతలములుగను నొప్పెననుట. కూర్మిపురము=ప్రేమాస్పదమగు తనపురమును, డాయన్, ఏతెంచెన్=సమీపించెను.

తా. నలరాజు తా నరుదెంచుచున్నట్టు విని యధికానందము నొందుచున్న మంత్రిపుంగవులతోను, రాజవీథులం దున్న ప్రాసాదాగ్రములందుఁ గూర్చిన యలంకారపుఁ గేతనములతోను, దమయంతిఁ జూడ వేడుకపడుచున్న పురస్త్రీలతోను, కస్తూరికాలేపములచేతను, గప్పురపు ముగ్గులచేతను బ్రకాశించు వాకిళ్లతోను, శ్రేష్ఠములయిన యింద్రనీలమాలికల కాంతులనెడి ముంగురులు గలిగి గోపురశోభయను తిలకముతోఁ గూడియున్న తనపురంబును జేరెను. అలం. రూపకము.

తే. కదియ నేతెంచి నైషధక్ష్మావరుండు
దివుటఁ బురలక్ష్మిపై ప్రేమాలుకదృష్టిఁ దివిచె
నాత్మయొక్కింతుకయుఁ బరాకయ్యెనేనిఁ
బ్రాణవల్లభ దన్నేమిక యనునొ యనుచు. 16

టీ. నైషధక్ష్మావరుండు=నలరాజు, కదియన్ = పురమును సమీపించునట్లు, ఏతెంచి, ఆత్మ=తనమనస్సు,ఒక్కించుకయున్ =కొంచెమైనను, పరాకు=మఱచియుండుట, అయ్యేనేని=అయినచో, అనఁగా నొకనిమిషమైనఁ దన్ను మఱచియుండినచో, ప్రాణవల్లభ=దమయంతి, తన్నున్ = ఆనలుని, ఏమి, అనునొ, అనుచున్=ఏమని నిందించుకొనునో యనుకొని, “ఇదివఱకుఁ దన్నే తదేకదృష్టితోఁ జూచి ప్రేమించుచున్న నీవు నీపురమును జూచినతోడనే ప్రేమింపను

న్నావు. ఇదియా నీయనురాగము" అని దమయంతి తన్నుఁగూర్చి యేమితలం చునోయని, తివుటన్ =ప్రయత్నము చే, పురలక్ష్మిపైన్ =నగరశోభపై, వ్రాలు దృష్టిన్ =పడుచున్న చూపును, తివిచెన్ =మగిడించెను. పురశోభను జూచుటకు నేత్రము లువ్విళ్లూరుచునున్నను, వానిమరల్చి దమయంతిపైనే చేర్చెనని భావము. నలుఁడుపురశోభను జూడక సంతతమును దమయంతి నే చూచుచు నామె యనురాగంబునకు బాత్రుఁ డగుచున్నాఁడని ఫలితార్థము.

చ. ఎదురుగ నేఁగుదెంచిరి మహీపతికిం బురివారు సర్వసం
 పదలు ప్రమోదవైభవ సమగ్రతయు న్నెరయంగ మిండ
 తుమ్మెదకదుపుల్ మదోదయముల్ మిక్కిలివేడుకయున్మనంబులం
 బొదలగఁ గ్రొత్తయామనికిఁ బొచ్చెనులేకెదు రేఁగుచాడ్పునన్.

టీ. పురివారు=పురప్రజలు, సర్వసంపదలు=సమస్తసమృద్ధులును, ప్రమోద వైభవసమగ్రతయున్ = సంతోషసంపదయొక్క నిండుతనమును, నెరయం గన్=ఒప్పునట్లుగా, మిండతుమ్మెద కదుపుల్,మగతుమ్మెదల గుంపులు, మదో దయము=మదాభివృద్ధియును, మిక్కిలి వేడుకయును = అధికమయిన కుతుక మును, మనంబులన్=మనస్సులలో, పొదలఁగన్ = వర్ధిల్లుచుండగా, క్రొత్త యామనికిన్ =నూతనముగావచ్చు వసంతఋతువునకు, పొచ్చెము = తక్కువ, లేక, ఎదురేఁగుచాడ్పునన్ =అభిముఖము లయిపోయిన చందమున, మహీప తికిన్ =నలరాజునకు, ఎదురుగన్ =అభిముఖముగ, ఏఁగుదెంచిరి.

తా. మగతుమ్మెదలు మదోదయములు, వేడుకయుఁ జిత్తంబుల వర్ధిల్లుచుం డఁగా నధికానందముతో వసంతఋతువు నెదుర్కొనుచున్నట్లు పురజనులు సమస్తవస్తు సమృద్ధులతోను, నధికమగు సంతోషసమృద్ధితోను నలరాజు నెదుర్కొనిరి. అలం. ఉపమ.

వ. ఇట్లు మంత్రిపురోహితామాత్య దండనాథప్రధానంబుగాఁ
 బౌరజన సమూహంబు దన్నెదుర్కొన సముచిత ప్రకా
 రంబున. 18

శా. ఏమేఁ గ్రొత్తయపూర్వవార్త వినుచే యేమేఁ జెప్పుచుఁ దండనా
థామాత్యాదులు పాదచారమున సేవాసక్తిమైఁ గొల్చి రా
భూమీశాగ్రణి సొచ్చెఁ బట్టణము సంపూర్ణానురాగంబుతో
భామానేత్రచకోర చుంబితముఖప్రాలేయరుగ్బింబుఁడై.

టీ. భూమీశాగ్రణి=నలుఁడు, ఏమేని=ఏదయినను, క్రొత్తయపూర్వవార్త=క్రొత్తసమాచారమును, వినుచుఁ = ఆలించుచు, మంత్రిజనులు చెప్పు క్రొత్త వార్తలను వినుచు, ఏమేఁ=ఏదియైనను, చెప్పుచుఁ=ప్రత్యుత్తరమిచ్చుచు, దండనాథామాత్యాదులు = సేనాధిపతులు మంత్రులు మొదలగువారు, పాదచారమునఁ=కాలినడకను, సేవాసక్తిమైఁ=సేవించుటయందలి యాదరముచే, కొల్చి, రాఁ = వచ్చుచుండఁగా, భామా...బింబుఁడై—భామా = పురస్త్రీల యొక్క, నేత్రచకోర = నేత్రములనెడి చకోరపక్షులచే, చుంబిత=ముద్దుపెట్టుకొనఁబడుచున్న, అనఁగాఁ బానము చేయఁబడుచున్నయనుట, ముఖప్రాలేయరుగ్బింబుఁడై=ముఖచంద్రుఁడు కలవాఁడై, సంపూర్ణానురాగంబుతోఁ = పూర్ణమగు ననురాగముతో, పట్టణము, చొచ్చెఁ=ప్రవేశించెను.

తా. నలరాజు మంత్రిపుంగవాదులవలన నేమయిన క్రొత్తవార్తవిని దాని కేమయిన ప్రత్యుత్తరమిచ్చుచు దండనాథాదులు కొల్చుచుం గాలినడకను వచ్చుచుండఁగాఁ బురస్త్రీలధికానురాగముతోఁ దన్నుఁ జూచుచుండఁగా సంపూర్ణప్రేమముతోఁ బురిఁ బ్రవేశించెను. అలం. రూపకము.

క. సకలధరాధీశ్వరుపైఁ
ప్రకటముగాఁ జల్లి రపుడు పౌరపురంధ్రుల్
సుకుమార బాహువల్లీ
ముకుళకులసకుల్యలాజముక్తాఫలముల్. 20

టీ. పౌరపురంధ్రుల్ = పురస్త్రీలు, సుకుమార.. ఫలముల్—సుకుమార = కోమలములయిన, బాహు=భుజములనెడి, వల్లీ=లతలయొక్క, ముకుళకుల = మొగ్గలసమూహముతో, సకుల్య=తుల్యములయిన, లాజ=పేలాలను, ముక్తా

ఫలములను = ముత్యములనును, ప్రకటముగాన్ = స్పష్టముగా, సకలధరాధీశ్వరుపైన్ =నలరాజుపైని, చల్లిరి=వర్షించిరి. పురస్త్రీలు తమచేతులతో లాజలను, ముత్యములను గుప్పలించి పట్టుకొనఁగా నప్పుడు వారిబాహువులు మొగ్గల గుత్తులతోఁగూడిన లతలను బోలుచుండెను.

తా. పురస్త్రీలు తమచేతులతోఁ బేలాలను ముత్యములను గ్రహించి పురప్రవేశము చేయుచున్న నలునిపైఁ జల్లిరి. అలం. రూపకము. ఉపమయు.

మ. దమయంతీవదనావలోకన సముత్కంఠావలద్భామినీ
సముదాయాననచంద్రబింబ పరిషత్సాన్నిధ్యయోగంబునన్
సముపేతార్థములయ్యెసౌధమణిభాస్వచ్చంద్రశాలావితా
నములుర్వీపతినందనుండు పురఘంటావీథినేతెంచుచోన్. 21

టీ. ఉర్వీపతినందనుండు=నలరాజు, పురఘంటావీథిన్ =పట్టణమందలి రాజవీథినిబడి, ఏతెంచుచోన్ = వచ్చునప్పుడు, సౌధ... వితానములు—సౌధ=మేడలందలి, మణి=రత్నములచే, భాస్వత్ =ప్రకాశించుచున్న, చంద్రశాలా = శిరోభాగములయొక్క, వితానములు=సమూహములు, దమయంతీ...యోగంబునన్—దమయంతీ = దమయంతియొక్క, వదన=ముఖమును, అవలోకన= చూచుటయందలి, సముత్కంఠా=వేడుకతో, వలత్ =సంయుతులైన, భామినీసముదాయ=స్త్రీసమూహములయొక్క, ఆననచంద్రబింబ = ముఖములనెడి చంద్రబింబములయొక్క, పరిషత్ = సంఘముయొక్క, సాన్నిధ్యయోగంబునన్ = సామీప్యసంబంధమువలన, సముపేతార్థములు = సార్థకములగు నామములుగలవి, అయ్యెన్, నలుఁడు దమయంతితోఁ బురప్రవేశము చేయుచున్నప్పుడు దమయంతిని వీక్షించుటకై యప్పురస్త్రీలు పైమేడలకెక్కి చూచుచుండిరి. మేడలయొక్క శిరోగృహములకుఁ, జంద్రశాలలనెడి నామముగలదు. చంద్రయుక్తములగు శాలలుగాన చంద్రశాలలనియర్థము. స్త్రీలవదనచంద్రబింబములందున్నవికాన చంద్రశాలలనెడి నామము సార్థక మయ్యెనని భావము. స్త్రీలు మేడలపైనెక్కి యత్యుత్కంఠతతోఁ జూచుచున్నారని ఫలితార్థము.

తా. నలరాజు దమయంతితోఁ బురిని ప్రవేశించునప్పు డాపురమందలి చంద్రశాలలు దమయంతిం జూడఁ గుతూహలముతో చంద్రశాలనధివసించిన స్త్రీలవదన చంద్రబింబముల సంబంధము గలవగుటచే సార్థకములయ్యె. అలం- నిరుక్తి. రూపకము.

తే. ధరణినాథాననేందు సుధారసంబు
సౌధజాలమృణాళికాజాలకముల
నుత్పలాక్షీకటాక్ష నీలోత్పలములు
ప్రేమమున దప్పి వోవంగఁ బీల్చికొనియె. 22

టీ. ఉత్పలాక్షి ..త్పలములు—ఉత్పలాక్షీ = స్త్రీలయొక్క, కటాక్షనీలోత్పలములు = కడకంటి చూపులనెడి నల్లఁగలువలు, సౌధ... జాలకములన్—సౌధ=మేడలందున్న, జాల=కిటికీలనెడి, మృణాళికా=తమ్మితూండ్లయొక్క, జాలకములన్=రంధ్రములచేత, ధరణి...రసంబు—ధరణినాథ = నలునియొక్క, ఆననేందు=ముఖచంద్రుని సంబంధియగు, సుధారసంబు = అమృతరసమును, ప్రేమమునన్=అధికాదరముతో, దప్పి, పోవంగన్=దాహమునశించునట్లుగా-తృప్తిదీఱునట్లుగా నని భావము. పీల్చికొనియెన్ = త్రావెను. కలువలు నీటి యుపరిభాగమున వర్తిల్లుచున్నను, సరంధ్రములయిన నాళములమూలమున జలమును వలయునంత పీల్చికొని తమసుస్వత్వమును దొలఁగించుకొనును. మఱియు బాలకులు వప్పిగొన్నప్పుడు దూరమునున్న జలమును గమలనాళమును నోటనుంచుకొని దాని రెండవకొననీటనుంచి జలము పానము చేయుదురు. అట్లె యాపురస్త్రీల నేత్రములు నలునిఁజూచి చాలకాలమగుటచేఁ దద్దర్శనమందధికకుతూహలులయి దూరమందున్న నలుని ముఖసౌందర్యామృతమును గనీనికాకాంతిరూపములగు నాళములచేఁ దనివిదీఱఁ గ్రోలుచున్నవని భావము. ఇట స్త్రీలు కేవలము కౌతుకముతోనే చూచుచున్నారు. కాన వారి చూపులు తిన్నఁగా బ్రసరించిన నాళములనుట యుక్తము. స్త్రీలు నలుని సాదరముగాఁ జూచుచున్నారని ఫలితార్థము. అలం. రూపకము.

వ. అప్పుడు.

సీ. నిరుపమాన స్వయంవర మహోత్సవమును
మధుపర్కసత్కారమంగళంబు
గమనీయతరకరగ్రహణహోమంబును
విహరణాగారప్రవేశవిధియు
నుభయబంధుభుజిక్రియోపచారంబును
బ్రాస్థానికస్వస్తిభాషణంబు
హరిణార్థసంభారహారికాకృతియును
నగరసంవేశనానందకళయు

తే. ననెడువృత్తాంతముల నొప్పునధిపచరిత
మాదిమధ్యావసానంబు లవధరించి
యమరముఖ్యులు గురియించిరలరువాన
యిన్నిదినములు దారున్కి యెఱుకపడఁగ. 24

టీ. నిరుపమానస్వయంవరమహోత్సవమును=సాటిలేని దమయంతి నలునివరించుట యనెడి గొప్పయుత్సవమును, మధుపర్కసత్కారమంగళంబు=భీమరాజిచ్చిన వివాహసమయమందలి దధిమధుఘృతరూపమగు మధుపర్కసత్కారమనెడి మంగళకృత్యమును, కమనీయతరకరగ్రహణహోమంబును = మిక్కిలి మనోహరమైన వివాహకాలమునఁ జేయఁదగిన హోమమును, విహరణాగారప్రవేశవిధియుఁ =నలదమయంతులు కౌతుకమందిరంబును బ్రవేశించుట యనెడి కృత్యమును. అనఁగా వివాహకాలము మూఁడురాత్రులును సంభోగాదుల విడిచి యొక్కచో దంపతు లిరువురు శయనింపవలయును. అందుచే నల దమయంతు లావిధిప్రకారము విహారమందిరమున బ్రహ్మచర్యవ్రతనిష్ఠులై శయనించిరి. విహరణాగార అనుపదముచే నీయర్థము తెల్లమయ్యె. ఉభయబంధు భుజిక్రియోపచారంబును=పెండ్లికరుదెంచినయిరుపంకలచుట్టములు సంతుష్టిపూ

ర్వకముగా భోజనంబులు సల్పుటయును, ప్రాస్థానికస్వస్తిభాషణంబు=నిషధ దేశమునకు దమయంతితో వెడలునప్పుడు తత్కాలమునకుఁ దగునట్టుగాఁ బురోహితులు పల్కిన స్వస్తివాచకములును, హరణార్థ...కృతియును, హరణార్థ=దమయంతి కరణమిచ్చుటకయి, సంభార=వివిధవస్తువులయొక్క, హారి కాకృతియును=దెచ్చుటయు, నగరసంవేశనానందకళయు = నలరాజుతోనపురమును బ్రవేశించుటయందలి యానందాతిశయము, అనెడి వృత్తాంతములన్ = ఈ మొదలగు కథలచే, ఒప్పెడునధిపుచరితము=ఒప్పుచున్న నలరాజుచరిత్రమును, ఆది మధ్యావసానంబులు=మొదటను,మధ్యమును,నంతమునను,అవధరించి=పరికించి, అమరముఖ్యులు = దేవతాశ్రేష్ఠులయిన యింద్రాదులు, ఇన్నిదినములు, తారు, ఉన్కి=భూమికిఁ బైగానుండుట, ఎఱుకపడఁగన్ =నలాదులకుఁ దెలియునట్లుగా ననిభావము. అలరువాన=పుష్పవర్షమును, కురియించిరి.

తా. స్వయంవరమహోత్సవము, మధుపర్కగ్రహణము, వివాహహోమము, కౌతుకాగారప్రవేశము పెండ్లివారి భోజనములు నిషధదేశమునకు బయలు వెడలునప్పుడు బ్రాహ్మణులు స్వస్తిచెప్పుటయు నరణమిచ్చుటకు వస్తుజాతమును గొనివచ్చుటయు నిషధరాజధానిఁ బ్రవేశించుట మొదలగు వృత్తాంతములుగల నలచరిత్రము పరికించి యాచర్యలను జూచుచు నచ్చట నేయున్నట్లిందఱును దెలియునట్లు దేవేంద్రాదులు పుష్పవర్షము కురియించిరి.

తే. వికచపౌరాంగనాపాంగ ✱ వీక్షణములు
హర్షితామరకృతపుష్ప ✱ వర్షములును
గురియ,నృపవీథి నరిగి భూ ✱ వరుఁడు సొచ్చె
నీరజాక్షీసమేతుఁడై ✱ నిజగృహంబు. 25

టీ. భూవరుఁడు=నలుఁడు, నీరజాక్షీసమేతుఁడై=దమయంతీ సంయుతుఁడై, వికచ...వీక్షణములు—వికచ = సంతసముచేవికసించిన, పౌరాంగనా=పురస్త్రీలయొక్క, అపాంగవీక్షణములు=కడకంటి చూపులును హర్షిత...వర్షములును—హర్షిత=నలునిచరిత్రమునకు సంతసించిన, అమర=దేవతలచే, కృత=

వర్షింపఁబడిన, పుష్పవర్షములును=పూలవానలును, కురియన్=తనపైదట్టముగాఁబడుచుండఁగా, నృపవీథిన్ = రాజమార్గమునంబడి, అరిగి, నిజగృహంబున్, చొచ్చెన్.

తా. నలరాజు దమయంతీ సమేతుఁడయి పురజనులు తన్నుఁ గుతూహలముతోఁ జూచుచుండ దేవతలు సంతసముతోఁ బుష్పవర్షములు గురియింపఁగా రాజవీథిని బడి పోయి నిజమందిరము ప్రవేశించెను. అల. తుల్యయోగిత.

వ. అట విబుధులు వృథాప్రయోజనంబైన వసుధాధావనప్రయాసఖేదం బనుభవించి పయోధిపాథస్తరంగంబులుం బోలె వచ్చినత్రోవయ పట్టి మరలిరప్పుడు. 26

టీ. అట విబుధులు=ఇంద్రాదిసురలు, వృథాప్రయోజనంబు=నిష్ఫలము, ఐన ...ఖేదంబు—ఐన = అయినట్టి, వసుధాధావన = భూమికి పరుగిడుటవలన గల్గిన, ప్రయాసఖేదంబు=బడలికవలనఁ గల్గినదైన్యమును, అనుభవించి, పయోధిపాథస్తరంగంబులుంబోలెన్ = సముద్రతరంగములవలె, వచ్చినత్రోవయ, పట్టి మరలిరి, అప్పుడు.

తే. స్ఫటికభూమిధ్రములమీఁదఁ బ్రతిఫలించు
నర్కబింబంబులునుబోలె నమరవరులు
కనకరథములమీఁద నాకాశవీథిఁ
జారునైసర్గికప్రభాసౌష్ఠవమున. 27

టీ. అమరవరులు=ఇంద్రాదిదేవతలు, స్ఫటికభూమిధ్రములమీఁదన్=పటికపురాలపర్వతములపై, ప్రతిఫలించు నర్కబింబంబులునుబోలెన్=ప్రతిబింబించుచున్న సూర్యమండలంబుల చందఁబున, ఆకాశవీథిన్=గగనమార్గమునందు, కనకరథములమీఁదన్=బంగారు రథములపై, చారు...సౌష్ఠమునన్—చారు సుందరమయిన, నైసర్గిక=స్వభావసిద్ధమయిన, ప్రభాసౌష్ఠవమునన్ = కాంతి సౌందర్యముచే, మీఁది వచనముతో సంబంధము.

తా. ఇంద్రాది దేవతలు స్ఫటికపర్వతములపై ప్రతిఫలించుచున్న సూర్యబింబములవలె బంగారు రథములపైఁ బ్రకాశించుచు, మనోహరమగు నైసర్గిక కాంతిసంపదతో. అలం. ఉపమ.

వ. చనునప్పుడు. 28

మ. మెఱుఁగుండీఁగలచాయఁ గేతనము క్రొంగ్రొమ్మించారుపీతద్యుతిం
గొఱలం జక్రవిఘట్టనంబునఁ బరిక్షుణ్ణంబులై మేఘముల్
పఱియల్వాయఁగఁ గింకిణుల్మొరయఁగాఁ బాఱెన్నభోవీథి న
త్తఱి జంభాంతకు తేరు మాతలికశాత్రస్తాశ్వవేగంబునన్. 29

టీ. అత్తఱిన్ = ఆకాశమున నట్లరుగునప్పుడు, జంభాంతకు తేరు = ఇంద్రుని రథము. మాతలి... వేగంబునన్ — మాతలి = ఇంద్రసారథియొక్క, కశా = కొరడాలకు, త్రస్త = భయమందిన, అశ్వ = గుఱ్ఱములయొక్క, వేగంబునన్ = జవముచే, మెఱుగుండీఁగలచాయన్ = మెఱపుతీవెలకాంతి చేత, కేతనము = ధ్వజము, క్రొమ్మించారు = క్రొత్తకాంతులచే నొప్పు, పీతద్యుతిన్ = పచ్చనివర్ణముతో, కొఱలన్ = ప్రకాశింపఁగా, చక్రఘట్టనంబునన్ = చక్రసంఘర్షణము చేత, మేఘముల్, పరిక్షుణ్ణంబులై = నలఁగినవై, పఱియల్ పాయఁగన్ = ముక్కలై చెదరిపోవుచుండఁగా, కింకిణుల్ = చిఱుగంటలు, మొరయఁగాన్ = ధ్వనిచేయుచుండఁగా, నభోవీథిన్ = ఆకాశమార్గమున, పాఱెన్ = పర్వెత్తెను.

తా. మాతలికశాఘాతములకు భయమందిన యశ్వములు త్వరగా లాగుచుంటచే నింద్రుని రథము గగనవీథియందుఁ బర్వెత్తెను. అప్పుడు దానియందున్న కేతనము మెఱపుఁదీఁగల పచ్చనికాంతులతోఁగూడి మెఱపుఁదీవెవలెఁ బ్రకాశించుచుండ చక్రసంఘర్షణములచే మేఘములు చూర్ణమై ఖండఖండములుగాఁ జెదరి పోవుచుండెను. చిఱుగంటలు ధ్వనిచేయుచుండెను.

తే. మాటిమాటికి నాకాశమండలమున
నవల నివలఁ బయోవాహనివహమునకు

నమరనాథరథాలంబి యైనధనువు
భాసురస్ఫూర్తి విభ్రమాభరణమయ్యె.　　30

టీ. ఆకాశమండలమునన్, పయోవాహనివహమునకున్ = మేఘముల సమూహమునకు, అవలన్, ఇవలన్ = రెండుప్రక్కలందును, మాటిమాటికిన్ = తెలుచుగా, అమరనాథరథాలంబి—అమరనాథ = దేవేంద్రునియొక్క, రథ = రథమును, ఆలంబి = ఆశ్రయించియున్నది, ఐనధనువు = అయినట్టి చాపము, భాసురస్ఫూర్తి = ప్రకాశించెడి ప్రతిబింబము, విభ్రమాభరణము = విలాసార్థమయిన యలంకారము, అయ్యెన్, అనఁగా నింద్రురథము గగనమండలముపైఁబోవు నప్పుడాయరదమున బద్ధమైన యింద్రచాపము మేఘసమూహముల కిరుచక్కియలందును దఱుచుగా నలంకారమై ప్రకాశించుచుండెనని భావము. మేఘముల కింద్రచాపమే యుత్కృష్టమగు నాభరణము కదా!

తా. స్పష్టము.

క. ధళధళమని జలములలో
బలరిపు వజ్రాయుధంబు ప్రతిబింబింపన్
గెలఁకుల దందడిఁ దిరిగెడి
జలధరముల కపుడు కులిశసంగతి గలిగెన్.　　31

టీ. జలములలోన్ = మేఘములందున్న నీటిలో, బలరిపు వజ్రాయుధంబు = దేవేంద్రుని వజ్రాయుధము, ధళధళమని, ప్రతిబింబింపన్ = ప్రతిఫలింపఁగా, కెలఁకులన్ = పార్శ్వములందు, దందడిన్ = తెలుచుగా, తిరిగెడిజలధరములకున్ = తిరుగుచున్న మేఘములకు, అప్పుడు = ఆసమయమునుండియు, కులిశసంగతి = వజ్రాయుధసంబంధము, కలిగెన్ = అదిమొదలుకొనియే మేఘములు వజ్రాయుధముగలవయిన వగుచున్నవని భావము.

తా. ఇంద్రుడట్లు పోవుచుండఁగా నతనిచేతనున్న వజ్రము మేఘముల జలములోఁ బ్రకాశింపఁగా నప్పటినుండియు నవి సవజ్రములగుచున్నవి. అలం. ఉత్ప్రేక్ష.

తే. వర్ణితం బైనసావర్ణి వంశమునకుఁ
బట్టుగోడు గైనయంభోజ బాంధవునకుఁ
గూడ నేతెంచుగారాపుఁగొడుకుచేతి
దండ మవ్వేళ నాలంబ దండ మయ్యె. 32

టీ. వర్ణితంబు=నుతింపఁబడినది, ఐనసావర్ణివంశమునకున్=అయినట్టి సావర్ణి యనుమనువువంశమునకు, పట్టుగొడుగు=దానివలె రక్షకుఁడయినవాఁడు, ఐనయంభోజబాంధవునకున్=అయినట్టి సూర్యునకు, అనఁగా సావర్ణివంశమునకు మూలకర్తయని భావము. ఉదయాస్తమయములందు సమానవర్ణముగలవాఁడు కాన సూర్యుఁడు సవర్ణుఁడనఁబడును, సవర్ణునికుమారుఁడు సావర్ణియనఁబడును, వానివంశమునకు సూర్యుఁడు మూలపురుషుఁడై వర్తించుచున్నాఁడని యర్థము. మఱియు సావర్ణివంశమునకుఁ గులక్రమాగతమయి రాజచిహ్నమైన ఛత్రమగుచున్నాఁడని రెండవయర్థము. కావున, కూడన్=దాపుగా, ఏతెంచుగారాపుకొడుకుచేతి దండము=వచ్చుచున్న ముద్దుకొడుకయిన యమునిచేతిలోనున్న దండము, అవ్వేళన్=ఆయముఁ డంతరిక్ష మార్గమునఁబడి పోవుచున్నప్పుడు, ఆలంబదండము=చేతనూనెడి కామ, అయ్యె, సావర్ణివంశ్యులకు ఛత్రమయిన సూర్యునికియముని చేతనున్నదండము కామ యయినట్లు ప్రకాశించెనని భావము. ఆయింద్రాదులు మేఘమండలము దాఁటి సూర్యమండలము సమీపించిరని ఫలితార్థము.

తా. ప్రశస్తమయిన సావర్ణివంశమునఁబుట్టినవారికిఁ గులక్రమాగతమై సూర్యమండల రూపమునఁ బొల్చుఛత్రమునకు యమదండ మాలంబదండము వలెనొప్పెను. అలం. రూపకము.

ఆ. అధికదూరమగుట నాకాశలక్ష్మికిఁ
గర్ణపాశమగుచుఁ గరము వెలిచె
దివ్యభవ్యకాంతి దేదీప్యమానమై
పాశపాణిపాణి పాశవల్లి. 33



టీ. పాశ...వల్లి —పాశపాణి=వరుణునియొక్క, పాణి= చేతియందున్న,

పాశవల్లి=లతవంటిపాశము,దివ్య...మానమై—దివ్య=దేవతాసంబంధియగు,భవ్య=ఉత్తమమైన, కాంతి=శోభచే, దేదీప్యమానము, ఐ=ప్రకాశించుచున్నదై, అధికదూరము=మిక్కిలిదూరమయినందున,ఆకాశలక్ష్మికి=దివమనెడిలక్ష్మికి, కర్ణపాశము = చెవి,అగుచున్ = ఒప్పుచు, కరము= మిక్కిలి, పొలిచెన్=ఒప్పెను, వరుణపాశము దివమనెడి లక్ష్మికిఁ గర్ణమువలె వెలయుచున్న దనిభావము.

తా. స్పష్టము. అలం. రూపకము.

తే. పరివహాస్కంధమారుతాస్ఫాలనమున
వీతిహోత్రుండు నర్తించువిధము చూచి
భీమనందన నీతఁడు పెండ్లియాడఁ
బోలునని యభ్రచరకోటి బుద్ధిఁ దలఁచె. 34

టీ. అభ్రచరకోటి=దేవతాగణము, పరి...స్ఫాలనమున్—పరివహ= పరివహమనెడి, స్కంధ=వాయుస్కంధపు, మారుత = గాలియొక్క, అస్ఫాలనమునన్ =తాఁకుటచే, వీతిహోత్రుండు=అగ్ని, నర్తించువిధము = ఆడెడిరీతిని, చూచి,సప్తమారుతములు గగనమునవ్యాపించి సూర్యచంద్రాదుల కాధారభూతమగుచున్నదని పురాణప్రసిద్ధము- ఇంద్రాదిదేవతలు సూర్యాదిమండములనుదాఁటి వాయువునేడవకక్ష్యకుఁ బ్రవేశించినతోడనే యగ్ని మిక్కిలిప్రజ్వలింపసాగెను. అదిచూచి, భీమనందన=దమయంతిని, ఈతఁడు=ఈయగ్ని, పెండ్లియాడన్, పోలు=వరించెనుగాఁబోలు, అని, బుద్ధిన్, తలంచెను వాయువుతాఁకువలన నగ్ని,జ్వాలలచే నాడఁగాజూచి దమయంతి యితనివరించెఁగాఁబోలు లేనిచో నింతసంతోషముతోనర్తించునా అని దేవతలు భ్రమసిరి ఇంద్రాదులు సప్తమారుతములను గడచిరని ఫలితార్థము.

శా. క్షోణీవల్లభుముద్దుఁగన్నెనునుఁబల్కుల్ గోయిలుకోలేమి ని
ర్వాణానందము లైన వీనులకుఁ దత్రాపయంబు గంధర్వరా
డ్వీణానాదమొకింత సమ్మదము గావింపంగ నింద్రాదిగీ
ర్వాణశ్రేణి  నన్.

టీ. ఇంద్రాదిగీర్వాణాధీశచతుష్టయంబు=ఇంద్రుఁడు మొదలయిన దిక్పాలురు నలువురు, క్షోణీవల్లభుముద్దుకన్నె=దమయంతియొక్క, నునుపల్కులన్=మృదువచనములు, క్రోలుకోలేమిన్=వినలేకపోవుటచే, నిర్వాణానందములు=నివృత్తిచెందినయానందముకలవి. వీనవీనులకున్=అయినట్టిచెవులకు, తత్ప్రాయంబు=దమయంతి పల్కులవంటిది, గంధర్వరాడ్వీణానాదము = గంధర్వశ్రేష్ఠులయొక్క, వీణాధ్వని, ఒకింతసమ్మదము = కొంచెమానందమును, కావింపంగన్ = చేయఁగా, తారావీథిన్ = నక్షత్రమార్గమున, దూరంబునన్ = దూరముగా, ఏఁగిరి, ఇంద్రాదులు సప్తమారుతములనుదాఁటి గంధర్వులుండెడి కక్ష్యనుజేరిరని యర్థము. దమయంతి మృదు మధురవచనంబులు వినలేకపోవుటచే నానందరహితములయిన యింద్రాదుల వీనులకు గంధర్వులు చేయువీణానాదము కొంచె మానందమును గల్గించెననుట. గంధర్వుల వీణానాదమైనను దమయంతి పల్కులవలెఁ బూర్ణానందము కలిగింపలేక పోయెనని చెప్పుటచే నామెపల్కులు వీణాధ్వనిని మించుచున్నవని తెల్లమగుచున్నది.

తా. ఇంద్రాది దిక్పాలురాకాశమునఁబోయి పోయి సప్తమారుతములను గడచిపోవునపుడు దమయంతి పల్కులు వినలేకపోవుటచే నానందము లేని తమచెవులకు గంధర్వుల వీణానాదము దమయంతి పల్కులకుఁ గొంచెమీడు వచ్చుచుఁ గొంచె మానందము కల్గింప వినుచుఁబోయిరి అలం. వ్యతిరేకము.

ఉ. చిత్తములోనఁ బాయక వసించిన భోజనృపాలకన్య న
త్యుత్తమురాజుఁ గూర్చి సురకేలూఅటఁబొందిరియెంతయేనియుఁ
జిత్తములోనఁ బాయకవసించిన నిర్మలతత్త్వవిద్య య
త్యుత్తమశిష్యుఁ గూర్చి గురుఁడేమాఱటఁ బొందినయట్టిలాగునన్.

టీ. చిత్తములోనన్=మనమునందు, పాయక = విడువక, వసించిననిర్మలతత్త్వవిద్య=నివసించియున్న స్వచ్ఛమైన యాధ్యాత్మికవిద్య, అనఁగా విద్యజ్ఞానస్వరూపమయినది కావునను, జ్ఞానమాత్మనిష్ఠమైయుండును గావునఁ దత్త్వవిద్య చిత్తము... అత్యుత్తమశిష్యున్ = మిక్కిలి

యోగ్యుఁడయిన శిష్యుని, కూర్చి=పొందించి, గురుఁడు, ఊఱటన్ = నెమ్మదిని, పొందినయట్టిలాగునన్ =పొందినచందమున, సురలు = ఇంద్రాదిదేవతలు, చిత్తములోనన్ = తమమనస్సులో,పాయక,వసించినభోజనృపాలకన్యన్ = నివసించి యున్నదమయంతిని,దమయంతిసౌందర్యాది గుణములకు మోహితులయి సంత తమామెనే చిత్తంబులలో నుంచుకొనిరి. కావునదమయంతి వారిచిత్తములను బాయకుండెననుటయుచితమె, అత్యుత్తమరాజున్ = మిక్కిలి యోగ్యుఁడ యిన నలుని, కూర్చి=జతకూర్చి, ఎంతయేనియున్ =మిక్కిలి, ఊఱటన్=సం తసమును, పొందిరి. మొదట దమయంతీమోహితులయి స్వయంవరమునకేఁగి నను, దమయంతికి నలునియం దనురాగమున్నట్లు తెలిసికొని నలునకిచ్చివేసి, తమ్ము వరింపలేదు గదాయని మచ్చరము సుంతేనియు లేనివారయి, యట్టియో గ్యురాలగు దమయంతి నలుని వశమాయెఁగదా యని విచారమునొంనక యిం ద్రాదులు మిక్కిలి సంతసించిరి. ఈచెప్పుటచే నింద్రాదుల సద్గుణములు వెల్లడి యగుచున్నవి.

తా. తత్త్వవిదుఁడగు గురువు తన విద్యను యోగ్యుఁడయిన శిష్యునకిచ్చి సంతసించినట్లు దేవేంద్రాదులు దమచిత్తమందున్న దమయంతిని నలునకిచ్చి వేసియానందించిరి. అలం ఉపమ.

సీ. పతులుచరియించు \ పదవి నుల్లఘించి
ఘనములు దిరుగుమార్గంబు గడచి
విద్యాధరశ్రేణి \ విహరించుపథ మెక్కి
కరువలి యేఁగెడు \ కక్ష్య సొచ్చి
గ్రహరాజు పాఱెడు \ ఘంటాపథము దాఁటి
చుక్కలు వ్రేడతెంచు \ చక్కి వెడలి
చదలేఱుప్రవహించు \ చాయ యుత్తరియించి
ధ్రువమండలంబువెంక \ ద్రోవనడచి
తే. యూర్ధ్వలోకంబునకుఁ బోవు \ చున్నవారు

భీమభూపాలసుతమీఁదిప్రేమభరము
వీడియును వీడ కాత్మ భావించువారు
వాసవుం డాది యైన గీర్వాణవరులు. 37

టీ. వాసవుండు,=దేవేంద్రుఁడు, ఆదియైన, గీర్వాణవరులు = సురశ్రేష్ఠులు, పక్షులుచరియించుపదవిన్ = పక్షులుతిరుగుచుండెడి మార్గమును, ఉల్లంఘించి=దాఁటి, ఘనములు, తిరుగుమార్గమున్ = మేఘమండలమును,కడచి,విద్యాధర శ్రేణి=విద్యాధరులనెడి యొకతరగతి దేవతలు, విహరించుపథము = సంచరించెడి దారిని, ఎక్కి, కరువలి=గాలి, ఏఁగెడుకక్ష్య = సంచరించెడి స్థలమును, చొచ్చి, గ్రహరాజు= గ్రహముల కధిపతియైన సూర్యుఁడు, పాఱెడుఘంటాపథము=వర్తించుచున్న రాజమార్గమును, దాఁటి, చుక్కలు = నక్షత్రములు, పొడతెంచుచక్కి, అనఁగా నక్షత్రమండలమునసుట, వెడలి, చదలేఱు = ఆకాశగంగ, ప్రవహించుచాయ = పాఱుచున్న ప్రదేశము, ఉత్తరియించి = దాఁటి, ధ్రువమండలంబు, పెంద్రోవ, కడచి=భీమభూపాలసుతమీఁది ప్రేమభరము=దమయంతి మీఁదనున్న ప్రేమాతిశయమును, వీడియు వీడక,ఆత్మన్=చిత్తములందు, భావించువారు = తలంచుచున్నవారయి, ఊర్ధ్వలోకంబునకున్=మీఁదిలోకమునకు, పోవుచున్నవారు. పోవుచుండఁగా,

తా. స్పష్టము

మహాస్రగ్ధర. కని రంతంత న్నభోమార్గమున ఘనతమ
స్కాండ సందేహసంపా
దనలీలాజాగరూకాకృతనువికటటత్నూ
ధామధూమాయితంబుల్
వనరాశ్యంత స్తరంగధ్వనిసమధికదు
ర్వారకోలాహలంబుల్
జనసందోహంబు భూపాలచ్ఛవిఖగధగితా
శాకటాహోదరంబున్. 38

టీ. ఇంద్రాదిసురలు (అధ్యాహారము) అంతంతన్ = కొంతదూరమునలో, నభోమార్గమునన్ = ఆకాశమార్గమునందు, ఘన...ధూమాయితంబున్ — ఘన = సాంద్రమయిన, తమస్కాండ = చీఁకటిగుంపే మోయనెడి, సందేహ = సంశయమును, సంపాదనలీలా = సంపాదించుటయనెడి విలాసమునందు, జాగరూక = అప్రమత్తమైయున్న, అతను = విస్తారమయిన, వికట = విరుద్ధమై, తనూధామ = శరీరరకాంతులచే, ధూమాయితంబు = పొగవలె నాచరింపఁబడుచున్నదియు, అనఁగానుండువచ్చుచున్న జనసమూహము దేహకాంతి చీఁకటులేమోయని భ్రాంతిని బుట్టించుచు పొగగుంపులవలెఁగానవచ్చుచుండె నని భావము. వన...కోలాహలంబున్ — వనరాశి = సముద్రముయొక్క, అంతస్తరంగ = లోని అలల, ధ్వని = చప్పుడుకంటె, సమధిక = అధికమైన, దుర్వార = వారింపఁదరముకాని, కోలాహలంబున్ = కలకలధ్వనులు చేయుచున్నదియు, అనఁగా సముద్రమధ్యమువలె దుర్వారధ్వనులు చేయుచున్నదని భావము. భూషా...దరంబున్ = భూషాచ్ఛవి = అలంకారకాంతులచే, ధగధగిత = ధగధగలాడింపఁబడిన, ఆశాకటాహ = దిఙ్మండలముయొక్క, ఉదరంబున్ = మధ్యభాగముగలదియు, అగు, జనసందోహంబు = జనసమూహమును, కనిరి = చూచిరి.

తా. ఇంద్రాది దేవతలట్లు చనిచని కొంతదూరమునఁ జీఁకటి గుంపులేమోయనెడి సందేహము గల్గించు దేహకాంతులు గలిగి సముద్రమధ్యముకంటె నెక్కుడుగా ధ్వనిచేయుచు నలంకారకాంతులచే దిక్కుల వెలిఁగించుచు వచ్చుచున్న జనసమూహమును జూచిరి. అలం. రూపకములు. ఉపమ.

తే. ఇరులు గవియుచు నేరాశి ♦ మెట్టమెదుర
నల్లనల్లన నేతెంచె ♦ నల్లమంది
గరిమ నాకాశచరుల కా ♦ కాశవీథి
గదలి యెదురుగ వచ్చెనో ♦ కాక యనఁగ. 39

టీ. ఏరాశము = అధికమైన, నల్లమంది = నల్లనిశరీరములుగలజనసమూహము, ఇరులు = చీఁకట్లను, కవియుచున్ = వ్యాపింపఁజేయుచున్, ఆకాశవీథి = ఆకా

కమండలము, కదలి, గరిమన్ = గౌరవముతో, ఆకాశచరులకున్ = ఇంద్రాదిదేవతలకు, ఎదురుగన్ = అభిముఖముగా, వచ్చెనో, కాక = వచ్చినది కాంబోలును, అనఁగన్ = అనునట్లుగా, ఎట్టయెదురన్ = కట్టెదుటికి, అల్లనల్లన్ = మెల్లమెల్లగా, ఏతెంచె.

తా. నల్లని శరీరకాంతులుగల పెద్దజనసమూహము చీఁకట్లవ్యాపింపఁ జేయుచునింద్రాదుల యెదుటికి వచ్చెను. ఆజనసమూహము గగనచరు లయిన యింద్రాదులను నెదుర్కొనుటకై సశరీరమైవచ్చిన గగనమండలమునునట్లు ప్రకాశించెను. అలం=ఉత్ప్రేక్ష.

వ. ఆజనసమూహంబు ముందట. 40

సీ. రతిదేవినెవ్వఁగు । రారాపుఁజన్నులు
గడకన్నులకు నింపు । గడలుకొలుప
గుడుసైన పూవింటి । గూడి కమ్మనితూపు
కటకాముఖపుఁ గేలఁ । గరము మెఱయఁ
గటిమండలంబుపైఁ । గనకంపుఁ జెఱఁగుల
జిలుఁగుఁబచ్చనిపట్టుఁ । జేల మమర
నాలీఢపాదవి । న్యాసంబు శృంగార
వీరాద్భుతములకు । విందు సేయఁ

తే. జిన్నిచిగురాకుఁ జేర్కొలఁ । జేతఁ బట్టి
పేరుటామనిరాచిల్క । తేరునడుప
నుక్కడీఁడయి యేతెంచె । నుక్కుమిగిలి
కలికిగారాపుఁ జెలికాఁడు । కలికిమరుఁడు. 41

టీ. కలికిగారాపుచెలికాఁడు=కలిపురుషునకు అనుఁగుఁ జెలికాఁడయిన, కలికిమరుఁడు = మనోజ్ఞాకారముగల మన్మథుఁడు, రతిదేవి...చన్నులు-రతిదేవి =రతీదేవియొక్క, నెవ్వఁగు = మిక్కిలినిక్కియున్న, రారాపు = ఒండొంటితోనొరసికొనుచున్న, చన్నులు, కడకన్నులకున్ = కటాక్షములకు, ఇంపు=సం

తసమును, గడలుకొలుపఁగ్ =పుట్టించుచుండఁగా, గుడుసు = చక్రాకృతిగాను న్నది, ఐనపూవింటికిన్ =అయినట్టి పుష్పచాపమును, కూడి=కలిసికొని, కమ్మని తూపు=సువాసనగలబాణము,కటకాముఖపుఁ గేలన్ =బొట్టనవ్రేలిని, చూపుడు వ్రేలిని, నడిమిఁవ్రేలిఁగలిపి, యనామికా కనిష్ఠములను గొంచెమువంచి పట్టిన యాకారవిశేషముగల చేతియందు, కరము=మిక్కిలి, మెఱయన్ =ప్రకాశింపఁగా, అనఁగానభినయాదులందును బాణమును సంధించి యాకర్షించునపుడును నంగుష్ఠతర్జనీమధ్యములనేకముగాఁజేసి యనామికాకనిష్ఠములఁ గొంచెముపంగునట్లుగాఁ జేతినుంతురు. అట్లుపట్టుటకుఁ గటకాముఖమని పేరు. కటిమండలముపైన్ =మొలయందు, కనకంపుచెఱఁగుల=కనకమయములయిన యంచులుగల, జిలుఁగు=సన్నని, పచ్చనిపట్టుచేలము = పసుపుపచ్చపట్టువస్త్రము, అమరన్ =ఒప్పుచుండఁగా, అనఁగా బంగారుసరిగంచు కొనలుగలపచ్చని పట్టువస్త్రము మొలయందొప్పుచున్నదని భావము. ఆలీఢపాదవిన్యాసంబు= ఆలీఢముగానుంచిన పాదము, ఆలీఢమనఁగా యుద్ధమందు విలుకాఁడు కుడి కాలువంచి యెడమకాలిపైనిలువఁబడుట, అదియైదువిధములు. ప్రత్యాలీఢము, ఆలీఢము సమపదము, విశాఖము, మండలము, అని వీనిలో నాలీఢముగా నిలువఁబడినవాఁడనిభావము. శృంగార వీరాద్భుతములకున్ = శృంగారరసమునకు, వీరరసమునకు, అద్భుతరసమునకును, విందుచేయన్ = కల్గించుచుండఁగా, మన్మథుఁడట్లునిలుచుట శృంగారాదిరసములను సూచించుచున్నదని భావము. చిన్నిచిగురాకు చేఱ్ఱోకల = చిన్నపల్లవ మనెడి చబుకును, చేతఁబట్టి,పేరుటామని=ప్రసిద్ధిచెందినవసంతుఁడు, రాచిల్కతేరున్ =రాచిల్కయనెడిరథమును, కడపన్ =నడిపించుచుండఁగా, ఉక్కు=శౌర్యము,మిగులన్ = అతిశయింపఁగా, ఉక్కుడీఁడయి=శూరుఁడై,ఏతెంచెన్ =వచ్చెను.

తా. అజనసమూహము ముందట కలికి హితుఁడయిన మన్మథుఁడు రతీదేవి నిక్కుగుబ్బలఁ గడకన్నులతోఁ జూచి యానందించుచు, కటకాముఖముగానుంచిన చేతియందు వంగిన వింటఁగూర్చిన బాణము ప్రకాశించుచుండఁగా మొలయందు బంగారుటంచులు గల పచ్చనిపట్టు చేలమువిరాజిల్లుచుండ

మోఁకరించి నిలువఁబడి శృంగారవీరాద్భుతరసంబులు జనింపఁజేయుచుఁ, చిగురనెడి చబుకుచేతఁ బట్టి వసంతుఁడు నడుపుచున్న రథముపైఁగూర్చుండి శూరుఁడయి వచ్చుచుండఁగా నతనిఁ జూచిరి.

ఉ. చీఁకటితప్పనం బరుల కే చేడియలన్ రమియింప దూతికా
లోకముమాట తీపులకు కే లోపడి భీత్యభిమానలజ్జలన్
బోకడఁబెట్టి ప్రాణమొక కే పోఁకకుఁగైకొనకుండు సాహసుల్
పైకొనిచేరితన్నుభయ కే పార్శ్వములందునుభక్తిఁగొల్చిరాన్.

టీ. చీఁకటితప్పనన్ = జారత్వముచే, పరులచేడియలన్ = పరస్త్రీలను, రమియింపన్ = కూడుటకు, దూతికాలోకముమాటతీపులకు = దూతికలుపలికెడి మధురవాక్యములకు, లోపడి=లొంగిపోయి, భీత్యభిమానలజ్జలన్ - భయమును, గౌరవమును, సిగ్గును, పోకడఁబెట్టి=విడిచిపెట్టి, ప్రాణమొకపోఁకకున్ =ప్రాణమునుపోఁకంతెనను, కైకొనకుండుసాహసుల్ = సరకుఁగొననియట్టి, సాహసముగల కాముకులు, పైకొని=అతిశయించి, చేరి=సమీపించి, ఉభయపార్శ్వములందును=రెండుప్రక్కలను, భక్తిన్ =భక్తితో, తన్నున్, కొల్చిరాన్ = సేవించి వచ్చుచుండఁగా, అనిపైపద్యముతోనన్వయము.

తా. దూతికాజనులు పలికెడి మధురవచనంబులు విని జారత్వముచేఁ బరస్త్రీలతో భోగింపసమకట్టి భయమును, గౌరవమును, సిగ్గునువిడిచి ప్రాణత్యాగమునకు సైతములక్ష్యపెట్టని సాహసముగల కాముకులు తన్నిరుగెలంకులఁ గొల్చివచ్చుచుండఁగా.

తే. బుద్ధదేవపరిస్పర్ధఁ కే బోలెఁ దాల్చె
లోకజిద్భావ మెవ్వాఁడు కే లోక మెఱుఁగ
నీశ్వరునిమీఁదఁ గలిగిన కే యీర్ష్యఁబోలె
నతనుఁడై యేలె నెవ్వఁ డీ కే యఖిలజగము. 43

టీ. ఎవ్వాఁడు=ఏమన్మథుఁడు, లోకము, ఎఱుఁగన్ =లోకము తెలిసికొనునట్లుగా, బుద్ధదేవపరిస్పర్ధన్ పోలెన్ = తనవలె తుదయగు బుద్ధదేవునియందలి పోటి

చేతనువలె, లోకజిద్భావము=లోకమును జయించెడి ధర్మమును, తాల్చెన్ = వహించెను, అనఁగా "మారజిల్లోక జిజ్జినః" అను నభియుక్తోక్తిచొప్పునఁ దన్ను జయించిన బుద్ధునకు లోకజిత్తను నామముకలదు. కావునఁ దన శత్రువుమీఁది కోపచేతనువలె మన్మథుఁడు దానుగూడ లోకమును జయించి లోకజిత్తను నామమును వహించుచున్నాఁడని భావము. మన్మథుఁడు స్వభావసిద్ధముగా లోకజిత్తైయుండఁగాఁ దనశత్రువు మీఁది కోపముచేతఁ గాఁబోలు నితఁడట్లయ్యెనని యుత్ప్రేక్షించెను. ఎవ్వఁడు=ఏమదనుఁడు, ఈశ్వరునిమీఁదన్ = శంకరునిపై, కలిగినయీర్ష్యన్, పోలెన్ = సంభవించిన యీసుచేతనువలె, అతనుఁడై=అశరీరియై, ఈయఖిలజగమున్ = ఈప్రపంచమునంతను, ఏలెన్ = పాలించెనో, మన్మథుఁడు శంకరునికోపాగ్నిచే దగ్ధుండయి యశరీరుఁడయ్యె, అయినను స్త్రీపురుషులకు మనోవికారము కల్గించి సమస్తజీవులఁ బుట్టించి జగత్కర్తయగుచుండెను. ఈశ్వరుఁడు జగత్కర్తయనియు, నశరీరుఁడనియు సిద్ధాంతము. కావున మన్మథుఁడు తన శత్రువగు శంకరుని మీఁది కోపముచేతనువలె నతను జగత్కర్తృశబ్దములను దాల్చుచున్నాఁడని యుత్ప్రేక్షించె.

తా. గతార్థము. అలం. ఉత్ప్రేక్షలు రెండు.

వ. అమ్మదనుండు త్రిభువనైకవీరుండు నాసీరగతుండై నభోమండలంబున గండుమీనుపడఁగ పొలుపారఁ జిగురుజగజంపు గొడుగునీడ వాడని వనమాల వక్షస్థలంబునఁ గ్రాల రతియును దాను నేతెంచిన. 44

టీ. అమ్మదనుండు=అట్టిమన్మథుండు, త్రిభువనైకవీరుండును=ముజ్జగంబులలోను ప్రధానవీరుఁడయిన వాఁడును, నాసీరగతుండును=సేనాముఖమును బొందినవాఁడునునై, నభోమండలంబునన్, గండుమీనుపడఁగ=మీనధ్వజము, పొలుపారన్ = అందముగాఁ గదలుచుండఁగా, చిగురుజగజంపు గొడుగునీడన్ = చిగురులనెడి జాలరులు గల గొడుగుయొక్క నీడయందు, వాడనివనమాలన్ = వాడిపోని వనమాల, వక్షస్థలంబునన్, క్రాలన్ = ప్రకాశింపఁగా, రతియును తాను ఏతెంచిన.

తే. నలునిఁజూచిన పిదప మన్మథునిఁ జూడ
నాకనిలయుల నయనంబు లోకిలించె
నయ్యరోచక మమరవైద్య ద్వయంబు
దీర్పఁజాలునొ చాలదో తెలియరాదు. 45

టీ. నలునిన్ =నలరాజును, చూచినపిదప, మన్మథునిన్, చూడన్ =చూడఁగా, నాకనిలయులనయనంబులు = దేవేంద్రాదుల నేత్రములు, ఓకిలించెన్ =రోఁతచెందెను, అమరవైద్యద్వయంబు=అశ్వికుమారులు, అయ్యరోచకము= ఆరోఁతను, తీర్పన్ =తొలంగించుటకు, చాలునో, చాలదో, తెలియన్, రాదు= ఎఱుఁగఁజాలము. అనఁగా లోకములో నతి మధురపదార్థములను దిని పిమ్మట నేరుచ్య పదార్థమును దిన్నను నోటికిరోఁత గలుగును. అట్టిరోఁత మఱి యొకమందు సేసికొన్నప్పుడే పోవును. అట్లె నలునిఁ జూచిన కన్నులు మన్మథునిఁజూచి రోఁతచెందెను. అట్టి రోతను నశ్విదేవతలయినను దీర్పఁజాలుదు రోలేదో తెలియదనిభావము. ఈచెప్పుటచే నలుఁడు మన్మథునికంటెను మిక్కిలి చక్కని వాఁడని భావము.

తా. గతార్థము.

సీ. కల్టెఱ్ఱసెరల దీర్ఘవిలోచనంబుల
కడల నగ్నిస్ఫులింగంబు లురల
జృంభించి మిగులంగఁ జేవుఱించెడుమేనఁ
బ్రస్వేదజలముఁ గంపంబుఁ బొడమఁ
గుటిలమై చిమ్మచీఁకటి సంఘటించుచు
నిటలభాగమున భ్రూభ్రుకుటి నటింప
నత్యంతగాఢదంతాగ్రపీడనమునఁ
బొట్టవాతెఱ నెత్తురుట్టిపడఁగఁ

తే. గటము లదరంగ మీసాలు గత్తరిల్లఁ
గంఠకుహరంబునందు హుంకార మెసఁగ

నింగి నేలయుఁ దాటింప నే నంగలించు
పగిది నేతెంచెఁ గ్రోధంబు గగనవీథి. 46

టీ. కట్టెఱ్ఱ...కడలన్ - కట్టెఱ్ఱ= మిక్కిలియెఱ్ఱని, సెరల=రక్తరేఖలు గల, దీర్ఘవిలోచనంబులకడలన్ = దీర్ఘములైన నేత్రములయొక్క యంతములందు, అగ్నిస్ఫులింగంబులు=అగ్నికణములు, ఉరలన్ = ఒలుకుచుండఁగా, జృంభించి=ఆవులించి, మిగులంగన్ =మిక్కిలి, జేవుఱించెడు మేనన్ =ఎఱ్ఱవాఱిన శరీరమునందు, ప్రస్వేదజలము=చెమ్మటలును,కంపంబును=వణకును, పొడమన్ = జనించుచుండఁగా, కుటిలమై=వక్రమై, చిమ్మచీఁకటి= దట్టమయిన యంధకారమును, సంఘటించుచున్ =సమకూర్చుచు,భ్రూకుటి=బొమముడి, నిటలభాగమునన్ =నొసటియందు,నటింపన్ =నృత్యము చేయుచుండఁగా,అత్యంత... పీడనమునన్ - అత్యంత=మిక్కిలి, గాఢ=తీవ్రమయిన, దంతాగ్రపీడనమునన్ = పంటికొనయందలి పీడచే, సొట్టవాతెఱన్ = నొక్కులువడిన పెదవియందు, నెత్తురు=రక్తము, ఉట్టిపడఁగన్ = పైకివచ్చుచుండఁగా, కటములు=దవడలు, అదరంగన్ =చలించుచుండఁగా, మీసాలు, కత్తరిల్లన్ = చెదరుచుండఁగా, కంఠకుహరంబునందున్ = కంఠబిలమునందు, హుంకారము=హుంకృతిధ్వని, ఎసఁగన్ =ఒప్పుచుండఁగా, నింగి, నేలయున్ = భూమ్యాకాశములు, తాటింపన్ =కొట్టునట్లుగా, అంగలించుపగిదిన్ = ఉత్సాహముచూపించునట్లు, క్రోధంబు=కోపము, గగనవీథిన్ =ఆకాశమునందు, ఏతెంచెన్ =వచ్చెను.

తా. మిక్కిలి యెఱ్ఱని రేఖలచే విలసిల్లు నేత్రాంతములం దగ్నికణములు రాలుచుండ, నావులించుటచే మిక్కిలి యెఱ్ఱవాఱిన శరీరమునందుఁ జెమ్మటలును, గంపమును గల్గుచుండఁగా, నొసటియందు బొమముడి మిక్కిలి వంకరగానుండి గాఢాంధకారములఁ గల్గించుచు నటించుచుండఁగా, మిక్కిలి గాఢముగాఁ గొఱుకుటచేత, నొక్కులువడిన పెదవియందు, నెత్తురుగాఱుచుండ, దవడలుచలించు చుండఁగా, హుంకారము చేయుచు, భూమ్యాకాశములు ముట్టునట్లుత్సాహము చూపుచుఁ గ్రోధంబు గగనమండలమునుండి వెలి తెంచెను. అలం. ఉత్ప్రేక్ష అతిశయోక్తి

స్రగ్ధర. ఆక్రోశాక్రోశఘోషంబయి వికటకఠో
రాట్టహాసోద్భటంబై
వక్రభ్రూవల్లరీసంవలనభయదమై
స్ఫారనిశ్వాసధారా
చక్రంబై రక్తరూక్షేక్షణమయి విగత
క్షాంతియై నిర్దయంబై
యాక్రోధం బభ్రవీథిన్ హఠగతి నమృతా
హారులన్ ధిక్కరించెన్. 47

టీ. ఆక్రోశ...ఘోషంబయి - ఆక్రోశ = ఒక క్రోశదూరముదాఁక వినవచ్చెడి, ఆక్రోశఘోషంబయి = తిట్లఘోషముకలదై, వికట...ద్భటంబై - వికట=విరుద్ధమును, కఠోర=దుస్సహమైనదియు, నగు, అట్టహాస = పెద్దనవ్వుచే, ఉద్భటంబై =భయంకరమైనదై, వక్ర...దమై-వక్ర=కుటిలమైన, భ్రూవల్లరీ=లతవంటి కనుబొమయొక్క, సంవలన=తిరుగుటచే, భయదంబై =భయమునిచ్చుచున్నదై, స్ఫారనిశ్వాసధారాచక్రంబై -స్ఫార=వర్ధిల్లుచున్న, నిశ్వాసధారా = ప్రవాహరూపమయిన నిట్టూర్పుగాలియొక్క, చక్రంబై =సమూహముకలదై, రక్తరూక్షేక్షణమయి=ఎఱ్ఱని వికృతములయిన చూపులుగలదయి, విగతక్షాంతియై=పోయినయోర్పుగలదై, అనఁగా నోర్పులేనిదని భావము. నిర్దయంబై =దయావిరహితమై, ఆక్రోధంబు= వెనుకవర్ణించిన క్రోధము, హఠగతిన్ =బలవంతపునడచే, అభ్రవీథిన్ =ఆకాశవీథియందు, అమృతాహారులన్ = అమృతమే యాహారముగాఁ గలవారిని-దేవతలననుట, ధిక్కరించెన్ =తిరస్కరించెను.

తా. దూరముగా వినఁబడున ట్లెక్కుడుగా ధ్వనిచేయుచు దుస్సహమును వికటమునైన పెద్దనవ్వుచే భయంకరమై, కుటిలమయిన బొమముడియొక్క తిరుగుటచే భీకరమై, విస్తారముగా నిట్టూర్పుగాలులఁబుచ్చుచు నెఱ్ఱని వికృతములయిన చూపులు గలిగి, యోర్పులేనిదయి దయారహితమయి బలాత్కారముతో నాక్రోధ మింద్రాదుల నాకసమునఁ గానవచ్చెను.

ఉ. ఈసునఁ బుష్పసాయకుని కేటునకుం గడు దూరమైన దూ
ర్వాసుని నెమ్మనంబునఁ దిరంబుగ మన్నెము దన్ని రాజ్య సిం
హాసన మెక్కకుండఁ దను కానఁగినక్రోధముఁ జూచి భీతిమై
వాసవుఁడొయ్యనొయ్యన జెక్రవాలిచె తెప్పలు వేయుఁగన్నులన్.

టీ. ఈసునన్ = వైరముచే, పుష్పసాయకుని యేటునకున్ = మన్మథుని బాణఘాతమునకు, కడున్ = మిక్కిలి, దూరము = లోఁగనివాఁడు, అనఁగాఁ గామునికి వశముగానివాఁడు, ఐనదూర్వాసుని నెమ్మనంబునన్ = రుద్రునియపరావతారమయిన దూర్వాసునియొక్క హృదయమునందు, తిరంబుగన్ = నిలుకడఁగా, మన్నెముదన్ని = రాజ్యమేలుచు, అనఁగాఁ గామము ప్రవేశింపనేరని దూర్వాసుఁడు కామునిజయించి, వర్తించినట్టును మిక్కిలి యధికమగు కోపముగలవాఁడనియు లోకవిదితము. రాజ్యసింహాసనము = స్వర్గరాజ్య సింహాసనమును, ఎక్కకుండన్ = అధిష్ఠింపకుండ, ఆఁగినక్రోధమున్ = ఇంద్రునినిల్వఁజాలినకోపమును, చూచి, భీతిమైన్ = భయముచే, వాసవుడు = ఇంద్రుఁడు, ఒయ్యనొయ్యన్ = మెల్లమెల్లగా, వేయుకన్నులన్ = వేయు నేత్రములందును, ఱెప్పలు, అఱ్ఱవాలిచెన్ = సగముమూసికొనెను, దూర్వాసుండు కోపమున కునికిపట్టగుటచేత నేయతనికిఁ ద్రిలోకములును భయపడుచుండు, ఒకప్పుడింద్రుండు దూర్వాసుడిచ్చిన పుష్పమాలికను నైరావతముక్రిందవైచి త్రొక్కఁగా నా ఋుషి రాజ్యభ్రష్టుండగునట్లు శపించెనన్నకథ యిట ఊహ్యము. ఇంద్రుఁడు దూర్వాసుని మనసున నుండి తన్ను రాజ్యభ్రష్టునిఁ జేయించినట్టిక్రోధమును జూచి భయముచేఁ గన్నులు మూసికొనెను.

తా. కామునికి వశముగాని దూర్వాసునిఁ దానువశము గావించికొని యతని మనంబున నిలుకడగానుండి తన్ను రాజ్యభ్రష్టునిఁ జేసిన కోపమును జూచి యింద్రుండు భయముచేఁ గన్నుల నిమీలించెను.

తే. మందునఁట దాను హృదయమర్మములఁ దవిలి
కన్నుఁగవ నంధకారంబు క్రగవయుటెట్టు

రాగమొనరించు నఁటతా విరక్తి యెట్లు
తనప్రభావంబు క్రోధంబు తాన యెఱుఁగు. 49

టీ. తాను=ఆకోపము, హృదయ మర్మములన్=హృదయములను, మర్మస్థానములను, తవిలి=చొచ్చి, మండునఁట=ప్రజ్వలించుచుండునట, కన్నుఁగవన్=నేత్రద్వయమునందు, అంధకారము=చీఁకటి, కవయుట, ఎట్లు=వ్యాపించుట యేరీతిగా నగును, అనఁగా జ్వాలలు ప్రకాశించునప్పుడు చీఁకటియుండుటయ సంభవము, అట్లుండఁ గ్రోధాగ్నిజ్వాల మండుచున్నను గన్నులకుఁ జీఁకట్లు క్రమ్ముటయెట్లని విరోధము. విస్తారముగాఁ గోపము విజృంభించినప్పుడు, కన్ను గానక గ్రుడ్డివానివలె నయుక్తకార్యము లాచరించును గానఁ గ్రోధావిష్ట మనస్కున కేమియుఁ దెలియదని చెప్పుటచేఁ బరిహారము. క్రోధంబు, రాగము=అనురాగమును, ఒనరించునఁట=కల్గించునఁట, తాన్, విరక్తియెట్లు=రాగములేని దగుటయెట్లు, అనురాగము కల్గించున దనురాగము లేక పోవుట యెట్లని విరోధము, కోపమువచ్చినప్పుడు శరీరమెఱ్ఱఁబడును, సమస్తవస్తువులను నిరసించి విరక్తిపూనును కాన రాగము గల్గించునది రాగములేనిదె ట్లగునన్న వాక్యమునకుఁ గోపమున శరీరాదులందెఱ్ఱఁ దనమును గల్గించి తక్కిన వస్తువులందు విరక్తిని బుట్టించునని చెప్పుటచేఁ బరిహారమగును.క్రోధంబు, తనప్రభావంబు=తనశక్తి, తాన, ఎఱుఁగున్=తానే తెలిసికొనును, ఇట్టి విరుద్ధ ధర్మములు గల్గివర్తించు క్రోధ శక్తి నెవ్వరును దెలిసికోలేరని భావము.

తా. గతార్థము. అలం. విరోధాభాసము.

మ. భ్రుకుటీ కాల భుజంగ రాజతరుణీ ఫూత్కారశంకావహా
ధికనిశ్వాస సమీరణధ్వనులు సం తీక్ష్ణాగ్రదంతావళీ
శకలీభూతనిజాధరోష్ఠరుధిర స్రావప్రతిద్వంద్విర
క్తకటాక్షుల్ దన పారిపార్శ్వకులుగా దర్పంపుఁ బెంపేర్పడన్.

టీ. భ్రుకుటీ...ధ్వనులు—భ్రుకుటీ=బొమముడి యనెడి, కాలభుజంగరాజతరుణీ=నల్లనిభుజంగ కన్యకయొక్క, ఫూత్కార=ఫూత్కారధ్వనుల నెడి, శం

క=సందేహమును, అవహ=కలిగించెడి, అధికనిశ్వాస = నిట్టూర్పులయొక్క, సమీరణ=గాలియొక్క, ధ్వనులు=నినాదములు గలవారును, అనఁగా ఆక్రోధమునకు సేవకులయిన జనులుచేయుచున్న ధ్వనులు దనబొమముడియనెడి నల్లత్రాఁచుయొక్క పూత్కార ధ్వనులనెడి శంకను గల్గించుచుండెనని భావము. తీక్ష్ణా...కటాక్షుల్—తీక్ష్ణ=వాడియైన, అగ్రదంత=దంతాగ్రములయొక్క, అవళీ=పంక్తిచే, శకలీభూత=చూర్ణముగాఁ జేయఁబడిన, నిజ=తనయొక్క, అధరోష్ఠ=పెదవియొక్క, రుధిరస్రావ=రక్తస్రావముయొక్క, ప్రతిద్వంద్వి=సామ్యముగల, రక్త=ఎఱ్ఱని, కటాక్షుల్=కడగన్నులు గలవారు, ఆక్రోధమును గొల్చుచున్న సేవకుల కడకన్నులు సంతతమును దంతాగ్రములచేఁ జూర్ణముగాఁ జేయఁబడిన పెదవియొక్క రక్తస్రావమున కీడువచ్చుచుండెనని భావము. అటువంటిజనులు, తనపారిపార్శ్వకులు=తనయనుచరులు, కాన్=అగుచుండఁగా అనఁగా గ్రోధమును వహించి మిక్కుటముగా ధ్వనులు సల్పెడివారును దంతదష్టమయిన పెదవి నెత్తురువలెఁ గన్నులుగలిగినవారునగు జనులు దన్నుఁ దాసులయి కొల్చుచుండఁగా, దర్పంబు పెంపు=గర్వాతిశయము, ఏర్పడన్=స్పష్టమగునట్టుగా, పైవచనముతో నన్వయము.

తా. కోపావిష్టమనస్కులై బొమముడివేసి సర్పములు పూత్కరించినట్లు నిట్టూర్పులను విడుచుచు నెక్కుడుగా ధ్వనిఁజేయుచు దంతాగ్రములతో పెదవిగఱచుచు నెఱ్ఱని నేత్రములుగలవారై యున్న జనులు తన్నుఁగొల్చుచుండఁగా.

వ. ఇట్లేతెంచె ననంతరంబ. 51

తే. హస్తములు విస్తరించుచు నొఱపలుకుచుఁ
గంఠగద్గదికావ్యక్తకాకువికృతి
రాలువడఁ బండ్లిగిల్చుచు డీలుపాటుఁ
బ్రకటదైన్యంబుఁ దోఁప లోభంబు వచ్చె. 52

టీ. లోభంబు=లోభమనెడి గుణము, హస్తములు=చేతులు, విస్తరించుచు =చాఁచుచు, [illegible]

కంఠగద్గదికా=డగ్గుత్తిక పడినకంఠ ధ్వనియొక్కయు, అవ్యక్త=స్పష్టముకాని, కాకు=కాకుస్వరములయొక్కయు, అనఁగా శోకభయాదులవలనఁ గల్గిన ధ్వనులయొక్కయు ననుట, వికృతిన్=వికారముచే, అఱపలుకుచు = అర్ధవాక్కులాడుచు, రాలుపడన్=తడఁగి పోవుచుండఁగా అనఁగా గద్గదస్వరము చేతను భయాదులవలనఁ గల్గిన యవ్యక్తధ్వనులచేతను,వాక్కులు స్పష్టముగా వెలువడకుండెనని భావము. బండ్లు,ఇగిల్చుచున్=పైకిఁదెఱచుచు, డీలుపాటు=భయశోకాదులచేఁ గల్గినసత్వనాశనమును, ప్రకటదైన్యంబు = స్పష్టమయిన దీనత్వమును, తోఁపన్=తోఁచునట్లు చేయుచు వచ్చెన్, కామ క్రోధాదుల తోఁగూడివచ్చెను.

తా. చేతులుచాఁచి కనఁబడినవానినెల్ల దేహియని యడుగుచుఁ గద్గదస్వరముచేతను భయాదులవలనఁ గల్గినవికారధ్వనులచేతను మాటనోటినుండి నిండుగాఁబలుక నేరక, పండ్లు దెఱచుచు, బలహీనత్వము దైన్యము తెల్లమగునట్లు చేయుచు లోభమువచ్చెను.

సీ. కడుపు మండించునాఁకటి చిచ్చుసెగ దాఁకి
  గవరన్నైయున్నక న్నగనలవారు
భోగించువారలఁ బుల్కు పుల్కునఁజూచి
  మెల్లన గుక్కిళ్లు మ్రింగువారు
కుక్షింభరిత్వంబు కొలఁది కగ్గలముగాఁ
  గూడెంత వెట్టినఁ గుడుచువారు
ప్రాణగొడ్డములైన పరమసాహసములఁ
  బరుల సొమ్ములకాస పడెడువారు
తే. పాముకు బలివెట్టని ప్రతినవార
  లీఁగకెన్నఁడు నే నిలి యిడనివారు
ధనముగాఁ బున్నదయ్యాలఁ దఱుమువారు
  బలిసి లోభంబు నిరువంకఁ గొలుచువారు.

అవ. వెనుకటిపద్యముచే లోభము గుణములు చెప్పి యిప్పుడు దానిఁ గొల్చువారిని నిరూపించుచున్నాఁడు.

టీ. కడుపుక౯, మండించునాఁకటిచిచ్చు సెగ=మండఁజేయుచున్న యాకలి యనెడి యగ్నియొక్క, జ్వాలలు, తాఁకి=వ్యాపించుటచే, గవరనై = ఎఱుపు కాంతిగలవై, ఉన్నకన్గనలవారు=ఉన్నట్టి నేత్రములుగల యట్టిజనులును, అనఁగా ధనము వ్యయమగునని యెంచి యాహారాదులను జాలినంత గొనకపోవుటచే క్షుధాగ్నిహోత్ర జ్వాలలు వ్యాపించుటచే నేత్రము లెఱ్ఱపడుచున్నవని భావము. భోగించువారలక౯=అనుభవించుచున్నవారిని. పుల్కుపుల్కునక౯, పులుకుపులుకు కనునది ఱెప్పలు మూసిమూసి తెఱచుచుఁ జూచుటయందలి వర్తించును. చూచి, మెల్లనక౯, గ్రుక్కిళ్లు మ్రింగువారు=గుటకలువేయువారును, ధనవ్యయమగునని తామనుభవింపక యితరులను భవించుచుండఁగా ఱెప్పలరమోడ్చిచూచి యూట లూరువారును నని భావము. కుక్షింభరిత్వంబు= పొట్టపోషించుకొనుట, కొలఁదికి=మితికి, అగ్గలముగాక౯=అధికముకాఁగా, కూడు = అన్నము, ఎంత వెట్టినక౯, కుడుచువారు=తినువారును, ప్రాణగొడ్డములు= ప్రాణములనారించునవి, ఐనపరమసాహసములక౯=అయినట్టి పెద్దసాహసకృత్యములచేత, పరులసొమ్ములకు౯=ఇతరులధనములకు, ఆసపడెడువారు. అనఁగాఁ రేవలము ధనార్జనమే మదినిడుకొని ప్రాణాపాయకరమగు పనులొనరించి పరధనములకాసించువారును. పాముననుక౯,బలి=ఉపహార=పెట్టుమనిప్రతిజ్ఞ గలవారు. ఎన్నఁడుక౯=ఒకప్పుడయినను, ఈఁగకుక౯,ఇలిక౯=ఎంగిలిమెతుకును, ఇడనివారు-పెట్టనివారును, పామునకుబలి ఈఁగకు ఇలి పెట్టఁ డనుట లోభులను గూర్చినలోకోక్తి. ధనము, కాఁపున్నదయ్యాలక౯ తఱుమువారు = ధనమునకు పిశాచమువలెఁ గాఁపున్నవారును ఇరువంక౯=రెండుప్రక్కలందును, బలిసి, లోభంబును, కొలుచువారు = సేవించువారు, వెనుకవర్ణించిన గుణములుగలవారు లోభాసక్తు లని ఫలితార్థము.

మ. కమియుంబాపములొందురెండువరుసంకొగల్పింపఁగాఁజాలుకోపముఁగ్రామంబును నిచ్చుమెచ్చుకయహంభావంబుతోనుండు

బం,చమహాపాతకసంగ్రహైకఘటనాకే చాతుర్యధుర్యంబులో
భములోభంబుగదా గుణద్విరదరాట్పంచాస్యమూహింపగన్.

టీ. వరుసన్ = క్రమముగా, పాపములు = మహాపాపకృత్యములు, ఒండు=
ఒకదానిని, రెండు= రెండింటిని, కమియన్ =పర్వునట్లుగా, అనఁగా సంభవించు
నట్లుగా,కల్పింపఁగాన్ =ఒనర్చుటకు, చాలు=సమర్థమయిన, కోపము, కామం
బును = కోపకామముల రెండింటిని, మహాపాతకములలోఁ గోప మొకపాప
మును, గామము రెండింటినిమాత్రమే చేయఁగలవనిభావము. ఎట్లనఁగాఁ
గోపాధీనుఁడయి యొకఁ డొకబ్రాహ్మణునిఁ జంపుననియనుకొనుఁడు. అప్పుడు
వానికి మహాపాతకములలో నొకబ్రహ్మహత్యనుమాత్రమె సమకూర్పఁగలదు.
అట్లె కామాంధుండయి నరుఁడు గురుభార్యతోఁ గ్రీడించును. కాన గురుతల్ప
గమనరూప మగుమహాపాతక మొకటి సంభవించును. ఆస్త్రీ కామమువలన
నొకవేళ దానిభర్తను వధించినచో బ్రహ్మహత్యగూడ సంభవించునుగాన కామ
ము రెండుమహాపాతకముల చేయును. పంచమహాపాతక = ఐదుపాతకములను,
సంగ్రహ=సంపాదించుటయందును, ఏకఘటనా=మిళితముగాఁ జేయుటయం
దు-అనఁగాఁ బంచమహాపాతకములను నొకదానియందుఁ గూర్చుట యందునని
భావము, చాతుర్య=వానియందుఁ గలచాతుర్యముచే, ధుర్యంబు=శ్రేష్ఠమయి
నది, పంచమహాపాతకములను సమకూర్పసమర్థమయినదగుటచే నన్నింటికంటె
నుత్కృష్టమయినదనిభావము, అయిన,లోభంబు=లోభగుణము,ఇచ్చమెచ్చక=
ఒకటి రెండుమహాపాతకములనే చేయఁగల కామక్రోధములను మెచ్చుకొనక,
అహంభావంబుతోన్ = అహంకారముతో, ఉండున్ =వర్తించు, ఊహింపఁ
గన్ =ఆలోచింపఁగా, లోభంబుగదా=లోభగుణమే కదా, గుణ...భాస్య
ము—గుణ = గుణములనెడి, ద్విరదరాట్ = ఏనుఁగు మిన్నలకు, పంచాస్య
ము = సింహమువంటిది. అనఁగా నన్నింటిగుణములను నశింపఁజేసి తానొ
క్కటియె యహంభావముతో వర్తిన ది యీలోభముతప్ప వేఱొక్కటి
లేదని భావము. లోభము పంచమహాపాతకముల నెట్లు చేయించు నన
ధనాదిలోభముచే బ్రహ్మవధయును, సురాపానేయమును జేయును. రసలోభ

ముచే సురాపానము చేయును. కామలోభములవలన గురుతల్పమును జేయును, వీని సమకూర్పవలెనన్న బుద్ధితో వీని నాచరించువానితో స్నేహించి వర్తించు. కాన మహాపాపపంచకము సమకూరె. నాల్గయిదువిధములగు ప్రతులలోఁ జూచినను నీపద్యము మిక్కిలి తప్పులు వడియున్నది. మొదటిపాదమును "పాపము లొండురెండ"నియు, రెండవపాదమును, "కామము, క్రోధంబును నిచ్చ మెచ్చక యహంకారముతో" నని యతివిరహితముగాను, నాల్గవపాదములోఁ "లోభము, లాభంబనియును," పాఠములు కాననచ్చుచున్నవి. ఈపద్యము కేవలము మూలమున కనురూపముగాఁ దెనిఁగింపకపోయినను మూఁడుసంతులు దాని ననుసరించియున్నది. కాన తదనుగుణంబుగా మార్చుట యుచితమని తదనుసారముగా నీపద్యమును సంప్రతించితిని. దీనికిమూలము "ఏకద్వికరణే హేతూ మహాపాతకపంచకే నత్యణేమవ్యతేకోపకామాయః పంచకారయక్ ॥" అని యున్నది. ఇందుఁ "గోపకామా" అని యుండుటచే" కోపము కామంబును నని దిద్దవలసివచ్చె. అట్లు చేయునిచో "ఏకద్వికరణే" ఒకపాపమును, రెండు పాపములనువరుసఁగా జేయుచున్నవి యనిచెప్పుటచే వానినట్లుమార్పకతీఱదు. రెండుపక్షములందును యతిచెడుచున్నదికాన "యహంభావంబుతో" నని సంప్రతింపఁబడియె. మూలమున లోభ మన్నిగుణములకంటె గొప్పదనిభావము వచ్చుచున్నది కాన దానిని మనంబులోనుంచుకొనియె శ్రీనాథుండు "లోభంబుగదా గుణద్విరదరాట్పంచాస్య"మని రచించెననియూహించి దిద్దవలసివచ్చె.

అలం. అతిశయోక్తి.

సీ. ఇన్నియింద్రియములుఁ నెవ్వానికి గృహంబు
లట విశేషంబు జిహ్వాంచలంబు
సంప్రార్థనాధీనఁ చాటూక్తి యెవ్వాని
కాజన్మసంసిద్ధమైనమతము
పాత్రహస్తములపైఁ బడుదాన జలవృష్టి

యన్యవిత్తాపేక్షయాత్తవిత్తాపరి
త్యాగ మెవ్వనియంతరంగగుణము

తే. జారచోరాది ధూర్తవిహారభూమి
దైన్యకార్పణ్యజలరాశిధవళకరుఁడు
కలిమహారాజు నెచ్చెలికాఁడు లోభుఁ
డతఁడు సురలకు జోహారువనుచు మ్రొక్కె. 56

టీ. ఎవ్వానికిన్ = ఏలోభునకు, ఇన్నియింద్రియంబులు = ఇంద్రియములన్ని యును, గృహంబులు = మందిరములగుచున్న వియో, అట = అట్లు మందిరము లగుటలో, జిహ్వాంచలంబు = రసనేంద్రియము, విశేషంబు = అతిశయించినదో లోభున కన్నియింద్రియంబులును గృహంబులగుచున్నను రసనేంద్రియమనెడి గృహమందే యెక్కుడు ప్రేమకలవాఁడని భావము. ఎట్లనఁగా ఘ్రాణేంద్రి యము గంధమందు లోభముగలది. నేత్రము రూపమందు లోభము గలది. ఈప్రకారముగా నా యాయింద్రియంబు లాయాగుణమందు లుబ్ధములయి యుండుటచే లోభున కింద్రియంబులు తావులనుట యుచితమె. అందు రసన యెట్లధికప్రేమాస్పదమయ్యెనన, తక్కిన యింద్రియంబులవలె నది కేవలము రసా ద్యనుభవమందే లుబ్ధముకాక కానవచ్చినవానినెల్ల దీనాతిదీనముగా యాచించి ధనము సంగ్రహించును. కాన లోభున కిది ముఖ్యస్థానమని చెప్పవచ్చు. ఎవ్వా నికిన్ = ఏలోభునకు, సంప్రార్థనాధీనచాటూక్తి = యాచనకధీనమయిన చాటువచ నము, ఆజన్మసంసిద్ధము = పుట్టుకతోడనే లభించినది, ఐనమతము, లోభమున్న వాఁడు దీనాతిదీనముగా యాచించునుగాన లోభునకట్లు యాచించుట సహజ మగుచున్నదని భావము. ఎవ్వాఁడు = ఏలోభుఁడు, అవగ్రహమయి = అనావృష్టిదో షమయి, పాత్రహస్తములపై = దానార్హులగువారి చేతులలో, పడుదానజలవృష్టి కిన్ = పడుచున్నట్టి దానజలమనెడి వర్షమును, వారించున్ = నివారించుచున్నాఁ డో, అవగ్రహదోషము వర్షయుచున్న వర్షము ప్రతిబంధించునట్లు లోభగుణము న రుఁడు [illegible] దానోదకము

విడుచుండఁగా "ధనము వ్యయమగును, కానదానమువలదు, గీనమువలదు" అనిమా న్పించును, అన్యవిత్తాపేక్ష=పరధనాభిలాషయు, ఆత్మవిత్తాపరిత్యాగము=స్వీయ ధనమును విడువకుండుటయు, ఎవ్వని యంతరంగగుణము= ఏలోభునియంతరంగ మందుండెడిముఖ్యగుణమో, ఎవఁడు జార... భూమి-జార=జారులు, చోర=దొం గలు, ఆదిమొదలయిన, ధూర్త=ధూర్తజనులకు, విహారభూమి=విహారస్థానమయిన వాఁడో-అనఁగా లోభగుణముండుటచేతనే జారత్వమును, పరధనాపహారత్వ ను జారచోరులుచేయుచున్నారు. లేనిచో వారట్లు ప్రవర్తిల్లరు. కానజారచోరా దులను దత్తద్దుష్కార్యములందుఁ బ్రోనుపువాఁడు లోభుఁడే కాన యతఁడు వారికి విహార భూమియగుచున్నాఁడని భావము. ఎవఁడు దైన్య... కరుఁడు— దీనత్వము, కార్పణ్యము=దారిద్ర్యమనెడి, జలరాశి=సముద్రమునకు, ధవళక రుఁడు=చంద్రుని వంటివాఁడో, లుబ్ధత్వము దైన్యమును నిలు పేదతనమును వృద్ధి నొందించును. ఎట్లనఁగా లోభికి ధనాశమెండుగాన ప్రతివారిని యాచించుచు వారు కసరికొట్టుచున్న కొలఁది తానుమఱింత దీనత్వమును జూపును లోభికి ధనము మెండుగానున్నను వాఁడు దరిద్రునితో సమానుఁడే. ఏమన ధనమువ్యయ మగునని యేవస్తువును తెచ్చికొనఁడు దేనిని ననుభవింపఁడు. ధనము సుంతేనియు లేని దరిద్రునివలె వీఁడు సుంతేనియు ననుభవింపఁ జాలకయుండఁగా లోభి యైన ధనికునకును దరిద్రునకు నేమి యంతరముకలదు. మీఁదు మిక్కిలి ధనర క్షణమునందుఁ బ్రయాసమొకటి యధికముగానుండునేమో అంతకంటె వేఱు విశేషముండదు కానలోభము దారిద్యమును వర్ధించుననియే తెలియఁదగినది, ఎవఁడు, కలిమహారాజునెచ్చెలికాఁడు=కలిపురుషున కాప్తమిత్రుఁడో, అతఁడు లోభుఁడు=ఆలోభుఁడు, సురలకున్=ఇంద్రాదులకు, జోహారువు, అనుచున్, మ్రొక్కెన్=నమస్కరించెను.

తా. ఎవని కింద్రియములన్నియు స్థానభూతములయినను జిహ్వాంచలము ము ఖ్యస్థాన మగుచున్నదియో యెవనికిఁ బ్రార్థనాయత్తమగు చాటువచనములు స హజములగు చున్నవియో, యెవఁడు తగినపాత్రములకు దానముచేయఁదలంచి యుండ నమ్రగ్రహదోషము వర్షము నువలె నివారించునో, పరాధనాభిలాషయు

ను, దనధనమును విడుచి కుండుటయు ననెడి గుణము లెవ్వనికిఁ బ్రధానములో యెవఁడు జారచోరాది ధూర్తులకుఁ బ్రవర్తకుఁడో యెవఁడు దారిద్ర్యమును దైన్యమును వర్ధించునో యెవఁడు కలిరాజునకు గారాబుచెలికాఁడో యట్టిలోభుఁడు వచ్చి యింద్రాదులకు నమస్కరించెను.

వ. అనంతరంబ. 57

మ. తనకుం బట్టపురాణివాస మగుమిథ్యాదృష్టి చేసేతఁ గీ
లొ్కనహత్తించివిరించిముఖ్యదివిషత్కోటిన్విడంబించుచున్
ఘనమార్గంబున నేఁగుదెంచెనుమహాకాయంబుమోహాంబు
మో,హనవిద్యాగమసంప్రదాయఘటనావ్యాపార మేపారఁగన్.

టీ. మహాకాయంబు=గొప్పశరీరముగల, మోహాంబు, మోహన...వ్యాపారము—మోహనవిద్యా=మోహింపఁజేయుట యనెడి విద్యయందున్న, ఆగమ=శాస్త్రములయొక్క, సంప్రదాయ=గురుపారంపర్యముగా వచ్చెడిరహస్యములు, ఘటనా=కూర్చుటయందలి, వ్యాపారము = క్రియ, ఏపారఁగన్ =వర్ధిల్లునట్లుగా, కేవలము గ్రంథాలోకనమువలనఁ దెలియఁబడనివై గురుపరంపరోపదేశము వలననే తెలియఁదగిన వ్యాకరణాదిశాస్త్రములందలి రహస్యములకే శాస్త్రసంప్రదాయము లందురు. అట్లె మోహనవిద్యయందుఁ గూడ శాస్త్రసంప్రదాయము లుండవచ్చు. ఆట్టివానిని సమకూర్పఁ దగినదని భావము. పూర్తిగా నజ్ఞానము గల్గించునదని ఫలితార్థము. తనకున్ = మోహమున కనుట. పట్టపురాణివాసము=పట్టపుదేవి, అగుమిథ్యాదృష్టి చేన్ = అయినట్టి యసత్యజ్ఞానము యొక్క,. చేతిని, చేతన్=తనచేతితో, కీల్కొనన్, హత్తించి=దగ్గఱగాఁ బట్టికొని, అనఁగా దనకుఁ బ్రియురాలగు మిథ్యాదృష్టి చేతినిబట్టుకొని, విరించి ముఖ్యదివిషత్కోటిన్ = బ్రహ్మ మొదలగు దేవతాసమూహమునుగూడ, విడంబించుచున్=అనుసరించుచు, అనఁగా వారినిగూడఁ దనయధీనము గావించుకొనుచు, ఘనమార్గంబునన్=ఆకాశమార్గమునుండి, ఏతెంచెన్=వచ్చెను.

తా. విపులమగు నాకారము గలమోహము మోహవిద్యయందు గలసంప్ర

చాయను వెల్లడియగునట్లు వర్తించుచుఁ దన ప్రియురాలయిన యసత్యేజ్ఞానము చేతినవలంబించి బ్రహ్మాదిసురులనుగూడఁ దనయధీనము గావించుకొనుచు గగనవీథిం బడివచ్చెను.

తే. బాలురాత్మకుటుంబ జంబాలమగ్ను
లనధిగతశాస్త్రి లనధీతు లలసమతులు
దన్ను సేవింప మోహంబు దప్పుఁద్రోవ
నల్లనల్లన సురల డాయంగ వచ్చె. 59

టీ. మోహంబు, బాలురు = జ్ఞానహీనులు, ఆత్మ...మగ్నులు—ఆత్మ=తమ సంబంధమగు, కుటుంబ=సంసారమనెడి, జంబాల=బురదలో, మగ్నులు, మునింగినవారును, అనధిగతశాస్త్రిలు = పొందఁబడని శాస్త్రిములుగలవారును, అనఁగా శాస్త్రిములఁ జదువనివా రనుట, అనధీతులు= వేదములఁ జదువనివారు, అలసమతులు=మందబుద్ధులును, తన్ను, సేవింపన్ = సేవించుచుండఁగా, తప్పుత్రోవన్ = అన్యాయమార్గమున, అల్లనల్లన=మెల్లమెల్లగా, సురలన్ =ఇంద్రాదులను, డాయంగన్ =సమీపించునట్లుగా, వచ్చె.

తా. మోహంబు, అజ్ఞులును, సంసారమగ్నులును, వేదశాస్త్రివిముఖులును, మందమతులును దన్నుఁ గొనియాడుచుండ మెల్లగా దుష్పథంబున సురలఁ దఱి నేతెంచెను. మఱియు, నీచెప్పఁబడినవారే మోహబద్ధు లగుచుందురని తెలియవచ్చుచున్నది.

సీ. జ్ఞానప్రదీపికా జంఝూసమీరంబు
కామలోభక్రోధ కారణంబు
సంసారకపటేంద్ర జాలవిద్యా పింఛ
మామ్నాయపథకంట కాంకురంబు
శూన్యవాదారణ్య శుండాలకలభంబు
కుమతసిద్ధాంత విభ్రమగృహంబు

బహుళశఘట్టకుటీ (ప్రకీర్ణాతదిగ్భ్రమబంధు
వంధపరంపరావ్యాప్తి ఖురళి
తే. కన్నులకు నిద్రయును మదికిన్ను శ్రుతికి
వినమియును జేయు నెద్ది భావించి చూడ
నమ్మహామహా డెదురుగా నరుగుదేర
భ్రమసిచూచిరి వాసవాద్యమరవరులు. 60

టీ. ఎద్ది=ఏమోహము, జ్ఞానప్రదీపికాఝంఝాసమీరంబు=జ్ఞానమనెడి దీపమునకు పెనుగాలివంటిది. గాలి దీపమునార్చినట్లు మోహము జ్ఞానమును నశింపఁజేయుననిభావము. కామలోభక్రోధకారణము = కామమునకును, లోభమునకును, గోపమునకును, హేతుభూతమైనదో,మహామోహితు లయినప్పుడే కామాదులు గల్గును. విశ్వామిత్రాదులు జ్ఞానవంతులయ్యును, మోహము నొందినతోడనే కామపీడితులయి మేనకాదుల కూటమి కిష్టపడిరి. కావునఁ గామాదులకు మోహమే ముఖ్యకారణము. సంసార...పించము-సంసార=సంసారమనెడి, కపట=వంచకమయిన, ఇంద్రజాలవిద్య = ఇంద్రజాలమునకు, పింఛము=కుంచె వంటిదో, ఇంద్రజాలవిద్యను బ్రదర్శించుటకు ముఖ్యకారణమగు నొక కుంచె యుండును. ఆకుంచెను దాఁకకుండ నైంద్రజాలకుఁ డేమియుం జేయఁజాలఁడు. అట్లె సంసారమునకు మోహమే ముఖ్యకారణము. మోహమువలననే నరుఁడు సంసారమునఁబడి పలుకార్యము లాచరించుచున్నాఁడు. ఆమ్నాయపథకంటకాంకురంబు = వేదమార్గమునకు ముల్లువంటిదో. మార్గమందున్న ముండ్లు జనులను విచ్చలవిడిగా సంచరింపనీయవు. అట్లే మోహము జనుల భ్రమింపఁజేసి నిరాఘాటముగు వేదోక్తాచారము లందన్యథాజ్ఞానము గలిగించి యందుఁ బ్రవర్తింపకుండఁ జేయుచుండును. శూన్య...కలభంబు—శూన్యవాద = నిరీశ్వరవాదమనెడి, అరణ్య=అడవికి, శుండాలకలభంబు = ఏనుఁగుపిల్లవంటిదో, అనఁగా నరణ్యమునఁ గరికలభము విచ్చలవిడి సంచరించుచున్నట్లు మోహము శూన్యవాదమున సంచరించుచున్నది. మోహమోహితు లయినప్పుడే యీశ్వరుం

డు లేఁడనెడిబుద్ధి జనించుచుండును. గాన మోహసంబంధము లేకుండ శూన్య వాద ముండదని భావము. కుమతసిద్ధాంతవిభ్రమగృహంబు = కుత్సితమతము గలవారి సిద్ధాంతవచనములకుఁ గ్రీడామందిరము వంటిదో. కుత్సితమతసిద్ధాంత ముల నీమోహము వెల్లడిచేయుచున్నదని భావము. బహుళ...బంధువు—బహు ళ=అధికమయిన, ఘట్టకుటీప్రభాత = ఘట్టకుటీప్రభాత న్యాయసిద్ధమగునట్టి, దిగ్భ్రమ=దిగ్భ్రాంతికి, బంధువు=చుట్టమువంటిదో, తాను దిగ్భ్రమ చెంద లేదని యనుకొనియు దిగ్భ్రమచెందుట, అట్టిదిగ్భ్రాంతి నీమోహము చుట్టము వలె నాదరించుననిభావము. ఘట్టికుటీప్రభాతన్యాయమునుగూర్చి, చతుర్థాశ్వా సమున 75-వ పద్యమున విపులముగా వ్రాయఁబడియె. అంధ...ఖురళి=అంధ పరంపరా = అంధపరంపరాన్యాయముయొక్క, వ్యాప్తి=ప్రచారమునకు, ఖు రళి=సాముచేసెడి స్థలమువంటిదో. అట్టిప్రచారము గల్గించుటకు హేతువయిన దనిభావము. "శతాన్ధాః కూపంప్రవిశన్తి" అనఁగా నూర్వురు గ్రుడ్డివాం డ్రును నూతిని బ్రవేశించిరఁట. నూఱుగురు గ్రుడ్డివాండ్రుకలిసి యొండొరుల చే తులుపట్టుకొని, యొకరితరువాత నొకరుచొప్పునఁ బ్రయాణముచేయుచు దారి తప్పి యొక నేల నూతినిజేరి ముందునడుచు వాఁడందుఁబడియె. తక్కినవారు వా డెందుచేతఁ జేయివిడిచిపోయెనో ముందేమియున్నదో, యాలోచింపక వాని నడుగక వాఁడు నడిచినదే మార్గమనియు వాఁడు త్వరగా నడుచుచుండెను గాన దాను నల్లెనడిచి వానిగలిసికొందుననియుఁ బ్రతివాఁడు నూహించుకొని యందఱును నూతిలోఁబడిరి. దీనివలననే యంధపరంపరాన్యాయము వ్యాపించె. ఈన్యాయమున మూలకారణము మోహమేయని తెలియవలెను. భావించి, చూడఁగ =ఆలోచింపఁగా, ఎద్ది=ఏమోహము, కన్నులకుఁ = నేత్రములకు, నిద్ర యును=నిద్దురయును, మదికిఁ =మనస్సునకు, అన్ను =పారవశ్యమును,శ్రుతికిఁ = చెవికి, వినమియుఁ =వినకపోవుటను, చేయుఁ =కలిగించునో, అనఁగా మో హముచేతనే, నేత్రములకు నిద్రయును, జిత్తము పరవశమగుటయును, జెవు లకు వినఁబడకుండుటయును సంభవించును. అమ్మహామహుఁడు = అట్టిగొప్ప సామర్థ్యముగల మోహుఁడు, ఎదురుగాఁ =అభిముఖముగా, అరుగుదేరఁ =

వచ్చుచుండఁగా, వాసవాద్యమరవరులు = ఇంద్రాదిసురలు, భ్రమసి=భ్రాంతి నొంది, చూచిరి.

తా. గతార్థము.

సీ. పాతకంబులు నీలిపట్టు బొందడములు
పగలింటినిద్రలు పచ్చడములు
పరదూషణంబులు ప్రాలంబహారంబు
లన్యకాంతాసక్తి యంగరాగ
మీర్ష్యాపరత్వంబు హేలావతంసంబు
బుధజనద్వేషంబు పువ్వుదండ
మిథ్యాప్రలాపంబు మృగనాభితిలకంబు
బహుళాశనత్వంబు పరికరముగఁ

తే. బరులఁ జూపులు వాఁల్పఁ బ్రసభలీల
రాసభాంగరుహాగ్ర ధూమ్రప్రకార
బర్బరాకారదేహు లంబరము నిండి
సరస వచ్చిరి కలిరాజసైన్యభటులు. 61

టీ. పాతకంబులు=పాపములు, నీలిపట్టుబొందడములు = నల్లనిపట్టుతోఁ గుట్టిన కవచములుగాను అనఁగాఁ బాపములనెడి కవచములు కలవారయియని భావము. ఇట్లే ముందుముందు యోజించుకొనవలెను. పగలింటినిద్రలు=పగటిపూఁట నిద్రించుటలు,పచ్చడములు=దుప్పటులగుచుండఁగా, పరదూషణములు=పరులనిందించుటలు, ప్రాలంబహారంబులు = మెడనుండి సరిగా వక్షస్థలమున వ్రేలాడు హారము లగుచుండఁగా,అన్యకాంతాసక్తి=పరకాంతాభిలాషము, అంగరాగము = చందనాదులపూఁత యగుచుండఁగా, ఈర్ష్యాపరత్వంబు=పరులగుణములంగల దోషము లెంచుటయందలి యాసక్తి, హేలావతంసంబు=విలాసార్థమయిన శిరోభూషణమగుచుండఁగా,బుధజనద్వేషంబు=పండితజనులతో విరోధించుట,పువ్వుదండ=పుష్పమాలిక యగుచుండఁగా,మిథ్యాప్రలాపంబు=అసత్య

వచనము, మృగనాభితిలకంబు=కస్తూరిబొట్టగుచుండఁగా, బహుళాశనత్వంబు= అమితముగా భుజించుట, పరికరముగన్ =నడికట్టగుచుండఁగా, ప్రసభలీలన్ = త్వరగా, రాస... దేహులు-రాసభ = గాడిదలయొక్క, అంగరుహ=రోమముల యొక్క, అగ్ర=కొనలందున్న, ధూమ్ర=ధూమవర్ణముయొక్క, ప్రకార=పోలికగలిగినట్టియు, బర్బరాకార = కఱకయిన యాకారముగల, దేహులు=శరీరముగలవారు. అనఁగా వారిదేహములు వర్ణమునందు గాడిద వెండ్రుకల కొనలకును, నాకారమున బర్బరవృక్షములకును, దులయగుచున్నవని భావము. కలిరాజసైన్యభటులు = కలిరాజుసైన్యములోని వీరులు, పరులన్ =ఇతరులను, చూపులు, వాకొల్పన్ = అఱచునట్లుచేయగా, అంబరము=ఆకసము, నిండి, సరసన్ =సమీపమునకు, వచ్చిరి.

తా. కలిరాజుసైనికులు పాపములను వస్త్రములఁగాఁ దాల్చి, దివాస్వాపమనెడి పచ్చడముధరించి,పరదూషణమును హారముగా వేసికొని, పరకాంతాసక్తి యనెడి చందనాదులను బూసికొని,యీర్ష్యయనెడి యలంకారము దాల్చి, బుధజనులతో ద్వేషించుటయనెడి పూలదండ వేసికొని, యసత్యమనెడి కస్తూరి బొట్టువెట్టుకొని, తిండిపోతుతన మనెడి నడికట్టుకట్టి, గాడిదరోమాగ్రములవలె ధూమ్రమగు దేహచ్ఛాయయు కఱకయిన యాకారమును గలిగి యాకసంబును నిండి యాదేవతలసన్నిధికి వచ్చిరి. అలం. రూపకములు.

వ. అనుభటుల యుభయపార్శ్వంబుల. 62

సీ. కుండబొజ్జలక్రింద కే ద్రిండుగా బి గియించి
గడితంపుమడుఁగులు కే గట్టినారు
బూజువట్టినదేహా కేములపై దళంబుగా
మలయజపంకంబు కే లలఁదినారు
నునుబట్టతలలపైఁ కే గనకంపుఁ జెఱఁగుల
పట్టుచీరలు మూయఁ కేజుట్టినారు
కరముద్రవేలుడులెన కే కర పాశంబులఁ

దోరంపుఁబోఁగులు దొడిగినారు

తే. వెలయ మృగనాభి గీర్బొట్టు వెట్టినారు
పసిఁడిలాతాలు సేతులఁ బట్టినారు
చండముద్రాధరుల్ నభోమండలంబు
బూరటిల బట్లు గలిరాజుఁ బొగడి పొగడి. 63

టీ. కుండబొజ్జలక్రిందఁ = కుండలవలెనున్న పెద్దకడుపులకుఁ గ్రిందుగా, ద్రిండుగా=దట్టిగా, బిగియించి, గడితంపుమడుగులు=ముదుగైన వస్త్రములను, కట్టినారు=కట్టినవారు, బూజువట్టినదేహములపైఁ = సంస్కారము లేకపోవుటచే విస్తారముగా మలినమయిన శరీరములందు, దళంబుగాఁ = దట్టముగా, మలయజగంధంబులు=మంచి గంధములు, అలందినారు=పూసినవారు, నునుబట్టతలలపైఁ =నున్నని వెంట్రుకలులేని తలలందు, కనకంపుచెఱఁగుల పట్టుచీరలు=బంగారుటంచులుగల పట్టువస్త్రములు, మూయఁ =శిరస్సు గానరాకుండఁగా, చుట్టినారు, కరము=మిక్కిలి, వ్రేలుడులు=వ్రేలాడుచున్నవి. ఐనకర్ణపాశంబులఁ =అయినట్టి చెవులందు, తోరంపుఁబోఁగులు=పెద్దపోఁగులు, తొడిగినారు=ధరించినవారు, వెలయఁ =ఒప్పునట్లుగా, మృగనాభిఁ =కస్తురిని, గీర్బొట్టు =గీఱునామమును, పెట్టినారు=ధరించినవారు, పసిఁడిలాతాలు=బంగారపుముద్దు, చేతులన్ పట్టినారు. చండముద్రాధరులు=కోపస్వభావమును ధరించినట్టివారు, ఆయిన, బట్లు=వందులు, నభోమండలంబు=ఆకాశమండలము, బూరటిల్లఁ = నిండుకొనునట్లు, కలిరాజుఁ, పొగడిపొగడి.

తా. పెద్దకుండలవలెఁ గానవచ్చుచున్న బొజ్జలకుఁ గ్రిందుఁగా నెత్తుగా ముదుగువస్త్రములను దట్టికట్టుగాఁ దాల్చి, బూజుపట్టిన శరీరములందు దట్టముగా గందమలందికొని, నున్నని బట్టతలలు గనఁబడకుండ నుండునట్లు వస్త్రములు జుట్టికొని క్రిందికి వ్రేలాడుచున్న చెవులందుఁ బోఁగులు ధరించి కస్తూరిబొట్టు వెట్టికొని బంగారపుముద్దు చేతఁబట్టికొని కోపస్వభావముగలవారగు వందులు గగనతలము నిండునట్లు తమప్రభువయిన కలిరాజును నుతించి.

వ. త్రైలోక్యంబును వినునట్లుగా నిట్లనిరి. "యాగఫలంబు పాషాణసలిలోన్మజ్జనంబు, దేశాంతర దేహాంతరకాలాంతరంబులం గర్మఫలభోక్త యాత్మ యనుమాట యసత్యంబు. వేదం బప్రమాణంబు. వేదచుర్మభేదంబునం గదా బోధిసత్త్వంబు సత్త్వహేతువుగా జగం బస్థిరం బని సమర్థించె. ఎద్దియెద్ది సత్తద్దియద్ది యధ్రువంబు. అగ్నిహోత్రంబుం ద్రయీతంత్రంబుం ద్రిదండంబుఁ భస్మకుంఠనంబు బుద్ధిపౌరుషహీనులగు పురుషాధములకు జీవికోపాయంబులు. స్వచ్ఛందంబు ధర్మంబు. కామదేవుండ దైవంబు. మరణంబె యపవర్గంబు. భస్మీభూతం బగుభూతంబునకుం బునరాగమనంబు గలదనుట భ్రాంతిగాదే? ఆమ్నాయంబు లేమియెఱుంగు? ఎఱింగెనేని 'కోహితద్వేద యద్యముష్మిఁ లోకేఽస్తివానవేతి' యని సందేహించునే" యని వెండియు. 64

టీ. త్రైలోక్యంబును=ముజ్జగములవారును, వినునట్లుగా, ఇట్లు,అనిరి.. యాగఫలంబు=యజ్ఞాదుల నొనర్చుటవలనఁ గల్గునట్టి ఫలము, పాషాణసలిలోన్మజ్జనంబు=బండరాయి నీళ్లలో తేలుటవంటిది. అనఁగా జ్యోతిష్టోమముచేసినవాఁడు స్వర్గసుఖము వొందును నని చెప్పెడిశ్రుతి "గ్రావాణః ప్లవంతే" యనెడి శ్రుతి వలె నసత్యమైనది. నీళ్లలో ఱాయి తేలునని శ్రుతిచెప్పఁగా నది యనుభవ విరుద్ధముయిన ట్లె ప్రత్యక్షముగాఁ గానవచ్చునది. పాషాణోన్మజ్జన శ్రుతి యెట్లు సత్యముగాదో జ్యోతిష్టోమాదులవలన స్వర్గముగల్గునని చెప్పెడి శ్రుతిగూడ సత్యముగాదు. కావున దానివలన ఫలములేదని యెఱుంగునదని బోధించుచుండిరని భావము. ఆత్మ=మనజీవాత్మ, దేశాంతర...రంబులన్—దేశాంతర = పరలోకమునందు, దేహాంతర=మఱియొకదేహమునుదాల్చి, కాలాంతరంబులన్ = వేఱొకకాలమందు, కర్మఫలభోక్త = కర్మఫలము ననుభవించును, అనుమాట=అనిచెప్పెడి వచనము. అసత్యంబు...దేహమును

బొంది యీలోకమునఁ జేసినపుణ్యాపాపకర్మములను నీదేహవిసర్జనానంతరమున వేఱొకదేహమును బొంది తత్తత్ఫలం బనుభవించునని చెప్పుచుండఁగా నదివట్టి కల్లమాట. ఈదేహములోఁ జేసిన కర్మముల ఫలము వేఱొకదేహముచే వేఱొక లోకంబున మఱియొక కాలంబు ననుభవించుననుట యసత్యమని భావము. వేదంబు, అప్రమాణంబు=ప్రమాణముకాదు. అనుభవవిరుద్ధము లగునర్థములను దెలుపుచుండ నది యెట్లు ప్రమాణమగును. వేదమర్మభేదంబునంగదా = వేదము ఆయపట్టును భంజించుటచేతనేకదా, బోధిసత్వుండు= మహాప్రాజ్ఞుఁడయిన బుద్ధుఁడు, సత్వహేతువుగాన్=సత్వరూపమగు హేతువుచేతనే, జగంబు= విశ్వము, అస్థిరంబు=నశ్వరమయినది, అని, సమర్థించెన్ =స్థిరపఱిచెను. అనఁగా జినుఁడు వేదరహస్యములను భంజింపసమకట్టి, యట్లుచేసి, ఎద్ది, ఎద్ది=ఏదేది, సత్తు=సత్పదార్థమో, అద్దియద్ది=ఆయాపదార్థము, అధ్రువంబు=అనిత్యమయినది. అగ్నిహోత్రంబును=ప్రాతస్సాయం సమయములం దగ్నిహోత్రకర్మ మాచరించుటయు, త్రయీతంత్రంబును=వేదవిహిత మగుకర్మకలాపమును, త్రిదండంబును=పాశుపతవ్రతమును, భస్మకుంఠనంబును=బూడిదపూఁతయు, బుద్ధిపౌరుష హీనులు=బుద్ధిసామర్థ్యము లేనివారు, అగుపురుషులకున్ =అయినట్టి మనుజులకు, జీవికోపాయంబు=బ్రతుకుఁ దెరువు. అనఁగా అగ్నిహోత్రకర్మము లాచరించుట, వేదోక్తకర్మముల నాచరించుట, పాశుపతవ్రతముసలుపుట, భస్మమును దాల్చుట, మొదలగునవి చేసినవారు పవిత్రులనియు, గొప్పవారనియు, నట్టివారు పూజింపఁ దగినవారనియుఁ జెప్పుట బుద్ధి సామర్థ్యముచే బ్రదుకనేరని వారికి జీవనోపాధి నిమిత్తము చెప్పఁబడెను గాని వేఱొకఫలము గల్గునని కాదని భావము. స్వచ్ఛందంబు= స్వేచ్ఛావిహారమే, ధర్మంబు, కామదేవుండ = మన్మథుఁడే, దైవంబు= దేవుఁడు, మరణంబె=చావే, అపవర్గంబు-మోక్షము, భస్మీభూతంబు=భస్మమయినది. అగుభూతంబునకు=అయినదానికి, పునరాగమనంబు =మగిడివచ్చుట కలదు, అనుట. భ్రాంతి, కాదే, ఆమ్నాయంబులు=వేదములు ఏమి,ఎఱుంగు=ఏమి నిర్ణయింపఁగలవు. ఎఱింగ నేని=వానికే తెలిసినచో,యత్ =ఏది, ఆముష్మిన్, లోకే=పరలోకమందు, అస్తివా=ఉన్నదో, నవా=లేదో,

తత్=దానిని, కోహి, వేద=ఎవఁడెఱుంగును ? ఎవనికిని దెలియదనిభావము. అని, సందేహించు నే=సంశయమొందునా, అని=అనిబోధించి, వెండియున్= ఇంకను.

క. తారు దముఁ గాచుకొన లే
రీరసమునఁ గావఁబోదు రింతుల వంశా
చారస్థితి డాంభికు లగు
వారు మరుఁడు తనుకె కాని వారికి లేఁడే. 65

టీ. వంశాచారస్థితిన్=కులాచారములయొక్క, స్థితి= మర్యాదచే, డాంభికులు=కపటులు, అగువారు=అయినపురుషులు, అనఁగాఁ దమ కులాచారరీతుల నెంతమాత్రమును దప్పలేనట్లు పైకి నటించువారు, తారు, తముఁ=తమ్మును, కాచుకొనలేరు=విషయేచ్ఛవలన రక్షించుకొనలేరు, కాని, ఈరసమునన్=కోపముతో,ఇంతులన్=స్త్రీలను,కావఁబోదురు=రక్షింపఁబోదురు. అనఁగాఁబురుషులు సత్ప్రవర్తకులైనట్లు నటించుటయె కాని వాస్తవముగాఁ గాదు. వారు తమచిత్తంబుల మరల్చుకొనలేక పరకాంతారతిని గోరి వర్తింతురు. కాని తమవలెనె స్త్రీలు పరపురుషరతిని గోరి చరించిన వలదనివారింతురు. మరుఁడు =మన్మథుఁడు, వారికెకాని=ఆపురుషులకేకాని, వారికిన్=ఆ స్త్రీలకు, లేఁడే= మన్మథుఁ డాపురుషులను బాధించునట్లు స్త్రీలను మాత్రము బాధింపఁడా, కావునఁ బురుషులు పరకాంతాసక్తు లయినప్పుడు స్త్రీలు పరపురుషాసక్తుల గుట తప్పుగాదు.

తా. తమ కులాచారమర్యాదలను దప్పమని బీరములు పలుకుపురుషులు మన్మథబాధ కోర్వలేక పరకాంతలఁ బొందుచుండియుఁ దమకాంతలను నడ్డుచుందురు. ఆలోచింప మన్మథుఁడు పురుషులకేకాని స్త్రీలకు లేఁడుకాఁబోలును.

క. శతమన్యునంతధర్మ
స్థితి యెఱిఁగినవాఁడు గలఁడె త్రిభువనమునయం
దతనియహల్యాజారత
యితరుల జారత కమజ్ఞ మెయిచ్చుటకాదే. 66

టీ. త్రిభువనమునయందు=మూఁడులోకములందును, శతమన్యువంత = దేవేంద్రుఁడంత, ధర్మస్థితి=ధర్మమర్యాదను, ఎఱిఁగినవాఁడు=తెలిసినవాఁడు, కలఁడే=ఉన్నాఁడా? లేఁ డనుట. అతని యహల్యాజారత=అతఁడు చోరవృత్తితోఁ బోయి యహల్యతోఁగూడుట, ఇతరుల జారతకున్=ఇతరులు జారత్వమవలంబింపవచ్చునని, అనుజ్ఞ, ఇచ్చుటకాదే=అనుమతించుటయేకదా.

తా. ముజ్జగంబులందును దేవేంద్రునంతటి ధర్మజ్ఞుఁడులేఁడు. అట్టిధర్మజ్ఞుఁడయిన యింద్రుఁడు జారత్వమున నహల్యనుగూడెను. అట్లు గూడుట ధర్మవిరుద్ధమయిన నతఁ డేలయాచరించును. కావున నతఁడు జారత్వ మవలంబించుట యితరులు జారత్వమవలంబించుటవలన దోషములేదని చెప్పుటయే కాదా! కావున మీరు జారులయి సుఖింపవచ్చును.

క. మారుఁడు దుర్వారుఁడు సం
సార మిది యనాది వంశసంరక్షణ మం
భోరుహవదనలచేతిది
యేరూపున జాతిశుద్ధి యేర్పఱుపనగున్. 67

టీ. మారుఁడు=మన్మథుఁడు, దుర్వారుఁడు = వారింపఁదరముగానివాఁడు, ఇది సంసారము=ఈసంసారము, అనాది=మొదలులేనిది. అనఁగా నిది యెప్పటినుండి వచ్చుచున్నదో తెలిసికొనలేము. వంశసంరక్షణము=కులసంరక్షణము, అంభోరుహవదనలచేతిది= స్త్రీల యధీనమయియున్నది. ఏ రూపునన్=ఏవిధముగా, జాతిశుద్ధి=కులముయొక్క పవిత్రత్వము, ఏర్పఱుపనగున్=నిర్ణయింపఁగలము. "ఆహారోద్విగుణ స్త్రీణాం బుద్ధిస్తాసాంచతుర్గుణా । షడ్గుణోవ్యవసాయశ్చ కామశ్చాష్టగుణస్స్మృతః" అనునట్లు స్త్రీలకుఁ బురుషులకంటెఁ గామ మధికమగుటచేతను, మన్మథుఁడు దుర్వారుఁడై బాధించు చుండుటచేతను, సంసారము చిరకాలమునుండి వచ్చుచుండుటచేతను, గామ మధికముగాఁగల స్త్రీలవలననే వంశము వర్ధింపఁదగియుండుటచేతను స్త్రీలలో నెవరైన నొక కాలమున మదనపీడితయై వ్యభిచరించి యుండకలేదు. అనాదియైన సంసారములో నధిక కాముకులు స్త్రీలు దుర్వారుఁడయిన మారునిచే

గ్రస్తలై వ్యభిచరింపకుండ నుండఁగలరని యెవ్వరుచెప్పఁగలరు. కావున నుభయ వంశముల సంబంధముండుటచే నెట్లయినదోషము సంభవింపక తీఱదు. ఇట్లుండఁగా నీకులము నిష్కలంక మయినదని యెవ్వరు చెప్పగలరు.

క. రాజానుమతము ధర్మము
రాజు నిశాకరుఁడు మీకు ♦ బ్రాహ్మణులారా
రాజు ప్రవర్తించినపే
రోజన గురుతల్పగమన ♦ ముచితము మీకున్. 　　68

టీ. బ్రాహ్మణులారా, రాజానుమతము=రాజుచే నంగీకరింపఁబడినది, ధర్మము. అదియే ధర్మముకాని వేఱొండుకాదని భావము. మీకున్, రాజు=ప్రభువు, నిశాకరుఁడు=చంద్రుఁడు, రాజు=చంద్రుఁడు, ప్రవర్తించినపేరోజన=ప్రవర్తించినవిధముగానే, మీకున్, గురుతల్పగమనము=గురుభార్యతో సంభోగాదుల నొనర్చుట, ఉచితము.

తా. ఓ బ్రాహ్మణులారా! రాజానుమతమగునదేదో యదేధర్మము కాని వేఱొండులేదు. మీరాజయినచంద్రుఁడు గురుభార్యను వరించెను గాన మీరునట్లు చేయుటయే సముచితము. ధర్మమాచరించిన పాపమెట్లు వచ్చును?

క. ఏకార్యంబు సుఖోత్తర
మాకార్యముసేయనర్హ ♦ మగునెడ సుకృతం
బాకాంక్షితురు సురతము
నాకాంక్షింప రదియేమి ♦ యవనీవిబుధుల్. 　　69

టీ. ఏకార్యంబు=ఏపని, సుఖోత్తరము= సుఖాభివృద్ధికలదో, ఆకార్యము=ఆపని, చేయన్, అర్హమగునెడన్=చేయుటయే యుక్తమైనప్పుడు, అవనీవిబుధుల్=బ్రాహ్మణులు, సుకృతంబు=పుణ్యమును, ఆకాంక్షింతురు=కోరుదురు. సురతమున్=సంభోగమును, ఆకాంక్షింపరు=కోరరు. అదియేమి= అదేకారణమున? అనఁగా సుఖముగల్గించు కార్యమాచరించుట యందఱకు సముచితము. ఇట్లుండఁగా బ్రాహ్మణులు పుణ్యముగల్గించు సురతమును

మాని సందేహాస్పదమగు సౌఖ్యమును సమకూర్చుచాంద్రాయణాది తపముల నేల చేయుదురో తెలియదు. కావున కష్టములగు తపములవిడిచి సుఖకరమగు సురతము నంగీకరింపుఁ డని భావము.

చ. మలిచినఱాలయందుఁగుసుమంబులుపూయఁగమీఁదనెన్నఁ
డే,ఫలమొకనాఁడు గల్గుననుపల్కదియెవ్వఁడు నమ్మినాఁడుకో
మలవనరాజిలోనఁ గుసుమంబులు గోయుట యెప్పుడప్పుడే
ఫలములుపూవుపోవునోయుపాసకులార తలంచిచూడుఁడా.

టీ. మలిచిన ఱాలయందుఁ = చెక్కిన గుండు ఱాలయందు, కుసుమంబులు పోయఁగన్ = పూలతోఁ బూజింపఁగా, మీఁదన్ = ముందుకాలమున, ఎన్నఁడే = ఏదినముననో, ఒకనాఁడు = ఒకదినమందు, ఫలము, కల్గును, అనుపల్కు = అనెడివచనమును, అది = దానిని, ఎవ్వఁడు, నమ్మినాఁడు = ఎవఁడు విశ్వసించెను? కోమలవనరాజిలోనన్ = మనోహరమగు నుద్యానవనపంక్తిలో, కుసుమంబులు = పువ్వులు, ఎప్పుడు, కోయుట = త్రుంచుటయో, అప్పుడే = ఆసమయమందే, ఫలములు = పండ్లు, పూవో = పోకుండునా, పోవునో = నశించితీరునా? ఫలములు పూర్తిగానశించునని యర్థము. అనఁగా లోకములో నుపాసకులు గుండుఱాలను బుష్పంబులతోఁ బూజించినచో నేదోముందు ఫలము వచ్చునని యట్లుచేయుచుందురు. కాని దానివలన నింతేనియు ఫలములేదు. చెట్లనుండెనేని పువ్వులు ఫలదాయకములయి లోకమున కుపకరించును. కాని ఱాతిమీఁదఁ బెట్టిననేమి ఫలముగలదు. లోకోపకారమొనరించు వాని భంజించుటవలన మీదు మిక్కిలిపాపమే కలుగును. కానవిగ్రహారాధనముకై పూలు కోయఁ గూడదని భావము.

తా. ఓయుపాసకులారా ! మలిచి గుండ్రముగాజేసిన ఱాలను బూజించిన ఫలముగల్గునని యెవఁడోచెప్పఁగా, దానినమ్మరాదు. దానివలన నేమియుఁ బ్రయోజనము లేదు. అపూజవలన నేమియులాభములేదు కాని పూవులు కోయుటచే ఫలములు లేకుండఁబోవుచున్నవి. ఆలోచింపుఁడు.

తే. అన్యదేహాప్తి సందేహ కైమైనయెడను
గలుషములు మాన నెబ్భంగి కేవలయునేని
విడుఁడు యాగంబు లోవేదకవిప్రులార
జంతుహింసానుహాదోష కసంశయమున. 71

టీ. ఓ వేదవిప్రులార=వేదాధ్యయనముచేసిన యోబ్రాహ్మణులారా! అన్య దేహాప్తి=మఱియొక దేహమును బొందుట, సందేహము=సంశయాస్పదమయి నది. అనఁగా వేదోక్తములగు ఫలములు పెక్కులు విరుద్ధములుగాఁ బరిణమిం చుటచేఁ దదుక్తమయినదేహాంతరప్రాప్తిని గుఱించి సందేహింపవలసినదే, అయినయెడఁన్ = అయినప్పటికిని, జన్మాంతరమున, నరకాదిదుఃఖము లనుభ వింపవలసివచ్చును గాన పాపములు చేయరాదని కొంద ఱనుచున్నారు. ఏదేహ ముచేఁ బాపాదికర్మము లాచరించితిమో యాదేహమిచ్చటనే దహింపఁబడఁగా దానికి దేహాంతరమున్నదని చెప్పుట యసంగతమని కొంద ఱనుచున్నారు. ఇట్లు దేహాంతరమును గుఱించి సందేహించుచున్నారు. దేహాంతరము లేదన్నప్పుడు మీకు బాధలేదు గాని యుఁడియున్నప్పుడు బాధించును గావున, కలుషములు=పా పములు, ఎబ్భంగిన్=ఏవిధముగా, మానవలయునేని=విడిచిపెట్టవలసియున్నచో, జంతు...సంశయమునన్=జంతుహింసా=ప్రాణిహింసచేయుటయనెడి మహా దోష=గొప్పదోషమందలి, సంశయమునన్=సంశయముచే, యాగములు, విడు వుఁడు=యాగములు చేయకుఁడని యర్థము. దేహాంతరమే లేదుగాన పాపములు చేయవచ్చును. అప్పటికిని పాపము చేయరాదందురేని జంతుహింసపాపము గాన తదాత్మకములయిన యాగములను మానుఁడని భావము.

తే. స్మృతులయందు బలాత్కార కృతములెల్ల
నకృతములుగా విధించినాఁ డట్టె మనువు
బలిమి బ్రాహ్మణులార పాపములు చేయుఁ
డేమి చేసినఁ జేయర యెవ్వఁదరు మీకు. 72

టీ. మనువు=మనుస్మృతియనుధర్మశాస్త్రప్రకర, స్మృతులందున్=మను

స్మృతి మొదలగు గ్రంథములందు, బలాత్కృతములు = బలాత్కారముచేఁ జేయఁబడినవి, అకృతములుగాఁ = చేయఁబడనట్టుగా, విధించినాఁడట్టె = ఏర్పఱిచినాఁడు. అనఁగా మనువు "బలాద్దత్తంబలాద్భుక్తం బలాద్యాన్యపి కృతంచయత్" అని చెప్పినట్లు బలాత్కారముగాఁ జేయఁబడినవి చేయఁబడనట్టె యగును గాన, బ్రాహ్మణులారా, పాపములు = పరస్త్రీసంగమాది పాపములు, బలిమిఁ =బలాత్కారముగా, చేయుఁడు, ఏమిచేసినఁ =ఎట్టిపాపములుచేసినను, మీరు, చేయరు. అయ్యెదరు= చేయనట్టివారే యగుదురు,మీకుఁ బ్రామాణికగ్రంథమున మనువట్లుచెప్పటంబట్టి మీరెట్టిపాపము లాచరించినను, నవి బలాత్కారముగాఁ జేయఁబడెనేని మిమ్మును జెందవు. తత్ఫలము మీరనుభవింపవలసిన యవసరము లేదు. కాన మీరుస్వేచ్ఛగాఁ బరస్త్రీసంగమాదులను జేయవచ్చునని భావము. ఇటనాస్తికులయిన కలిభటులు మనువు చెప్పినవచనమున కన్యార్థము పరికల్పనము చేసి మీమనువు మతముచొప్పున మీరుపాపము లాచరింపవచ్చునని బోధించుచున్నారని తెలియఁదగినది.

తా. ఓబ్రాహ్మణులారా! మీకు ధర్మశాస్త్రమురచించిన మనువు బలాత్కరించి చేసినపాపములు చేయఁబడనట్టివని నుడివెను గాన మీరిఁకసంకోచముविడిచి పరస్త్రీగమనాదుల నొనర్పుఁడు. బలిమితోఁజేసిన మహాపాతకములయినను మిమ్ము బాధింప నేరవు.

సీ. ఐకమత్యంబులే ♦ దఖలశాస్త్రములకు
నిగమంబు లోకజాడ ♦ నిలువ కాదు
నాగమంబులఁద్రోవ ♦ యది యొంటుచందంబు
పంకంబులోని కంటకంబు తర్క
మతిగూఢ మై యుండు ♦ పూవుళంబులచాయ
యుపనిషత్తులభావ ♦ మొక్కరీతి
బహువిధంబులు మంత్ర ♦ పారాయణంబులు
సాంఖ్యయోగముల వాసనలు వేఱు

గీ. పట్టియేదర్శనం బైనఁ గ్రబతిభ కలిమి
వలసినట్లు వక్కాణింప నె వచ్చియుండు
నరసి దుఃఖంబు లేక సౌఖ్యంబు గలుగు
ధర్మ మొకఁడేరికొనుఁడు విద్వాంసులార. 73

టీ. విద్వాంసులార= ఓపండితులారా! అఖిలశాస్త్రములకున్ =సమస్త శాస్త్రములకును, ఐకమత్యంబులేదు=ఏకత్వములేదు. అనఁగా నొక్కయర్థము నే యొక్కొక్కశాస్త్రి మొక్కొకవిధముగా బోధించుటచే వాన్నికన్నిటికిని సమ్మేళనము కానేరదనియు నిట్లు పరస్పరవిరుద్ధములగు వానిలో నేవి ప్రమాణములో నిర్ణయించుటకు గమకము లేకపోవుటచే నవియన్నియు నప్రమాణము లయియుండునుగాన వానినన్నింటిని బరిహరింపవలయుననియు భావము. నిగమంబులు=వేదములు, ఒకజాడన్ =ఒకమార్గమును, నిలువన్ , అడవు=సిద్ధాంతించిచెప్పవు-మీరు ప్రమాణములని నమ్మెడి వేదములయినను నొకయర్థము నే బోధింపక పలువిధముల బోధించుచుండునుగాన నవియు నప్రమాణములే యని భావము. ఆగమంబులత్రోవ=శ్రౌతాగమాదులయొక్క మార్గము, అది, ఒండుచందంబు=వేఱువిధముగానుండును,తర్కము=తర్కశాస్త్రము,పంకంబులోనికంబము=బురదలోఁబాఁతిన కంబమువంటిది.అనఁగా బురదలోఁబాఁతినకంబ మేవైపునకుఁబడునో చెప్పఁజాలము. అట్లె తర్కశాస్త్ర మేదిసిద్ధాంతమో చెప్పఁజాలము. ఆ స్తంభ మెట్లు బరువుగానుండునో యట్లె యొఱగును. తర్కశాస్త్రమునఁగూడ నెవఁడు పెక్కులు యుక్తులు సెప్ప నేర్చునో వాఁడన్నదియే సిద్ధాంతమని నిర్ణీతముకాదనియు, సిద్ధాంతరహితము శాస్త్రము వ్యర్థమనియు భావము. యామళంబులచాయ=యామళమతస్థులమతము, అతిగూఢమై=మిక్కిలి గుప్తమై, ఉండును. ఉపనిషత్తులభావము=ఉపనిషద్వాక్యముల యభిప్రాయము, ఒక్కరీతి=వేఱొకమార్గమునఁ బోవును, మంత్రపారాయణములు=గాయత్ర్యాదిమంత్రములనుజపించుటలు, బహువిధంబులు=అనేకమార్గములుగలవి. సాంఖ్యయోగముల వాసనలు=సాంఖ్యయోగశాస్త్రమర్యాదలు, వేఱు=మఱియొకవిధముగా నుండును. ప్రతిభకలిమిన్ =బుద్ధిబలముచే, ఏదర్శనంబు, ఐనన్ =

యేశాస్త్రిమునైనను, పట్టి=స్వీకరించి, అనఁగా నాలోచించియనిభావము. వలసినట్లు=మన కిష్టమగునట్లు, వక్కాణింపన్=అర్థముచేసి చెప్పుటకు, వచ్చియుండున్=తగియుండును, అరసి=ఆలోచించి, దుఃఖంబు, లేక, సౌఖ్యంబుగలుగు ధర్మము=సౌఖ్యములను సమకూర్చునట్టి సుఖమును, ఎఱిఁగికొనుండు=తెలిసికొనుఁడు. అనఁగా మీశాస్త్రములును మీవేదములును దుఃఖములనే కాని సుఖంబులనీయఁ జాలవు కాన వానివిడిచి మీకు సౌఖ్యముగల్గించు ధర్మమును జేపట్టుఁడని భావము.

తా. ఓవిద్వాంసులారా! మీరు ప్రమాణములనియు, దదుక్తప్రకారము నడిచినచో సౌఖ్యదాయకము లగుననియు నమ్ముకొనియున్న శాస్త్రిములన్నియు బూటకములు; మీశాస్త్రిముల కైకమత్యములేదు. వేదము లౌకయర్థమును స్థిరపఱుపఁజాలవు. ఆగమముల మార్గములేఱు. తర్కమునకు నిశ్చితమగు సిద్ధాంతములేదు. అది బురదలోని స్తంభమువలె నుండును. యామళమతంబులు మిక్కిలి గుప్తములైయుండు. ఉపనిషత్తుల యభిప్రాయము వీనికన్నింటికిని వ్యతిరిక్తముగానుండును.మంత్రపారాయణములు మఱియొకవిధముగా నుండును. యోగశాస్త్రిసిద్ధాంతము వేఱొకవిధముగానుండు. కావున మీ వేదశాస్త్రిదులకు బుద్ధిబలముచే మనకిష్టమువచ్చినట్లర్థము చెప్పవచ్చును. ఇట్లు పరస్పరమసంబద్ధములగు వేదాదులను విడిచిపెట్టి సుఖముగల్గించు ధర్మమును యోజించుకొనుఁడు.

తే. అస్మితాబుద్ధి గలదేహ ◈ మనలశిఖల
భస్మమై పోవ నెవ్వోటఁ ◈ బాప ముండు
సౌఖ్యదము లయినపరదార ◈ సంగమాది
పాపములు సేయఁ డోపినభంగి జనులు. 74

టీ. జనులు=ఓజనులారా! మధ్యమపురుషయోగముచే సంబోధనయుదాహరగాగమమురాలేదు. అస్మితాబుద్ధి= నేను అనెడి బుద్ధి, కలదేహము = కలిగినట్టిశరీరము, అనలశిఖలన్=అగ్నికొనలందు, భస్మమై =బూడిదయై, పోవన్,

పాపము, ఎచ్చోటన్=దేనియందు, అనఁగా దేని నాశ్రయించుకొని యర్థము. ఉండును. దేహమే యాత్మ కాని దేహాతిరిక్తమగునది వేఱొకటిలేదు. ఉన్నట్టు ప్రమాణంబుగానరాదు. కావున పాపాముల సంపాదించిన దేహ మిక్కడనే భస్మమైపోఁగా నాపాపము మఱల వానికి దుఃఖము గల్గించుటెట్లు ? కావున నట్లనుట యసత్యమనినమ్మి, ఓపినభంగిన్=శక్తికొలందిని,సౌఖ్యదములు=సౌఖ్యమును గలిగించునవి, అయిన పరదారసంగమాదిపాపములు=అయినట్టి పరస్త్రీసంగమాదిపాపములను, చేయుఁడు=ఒనరింపుఁడు.

తా. ఓజనులారా! దేహమే యాత్మ. మరణమే యపవర్గము. సుఖదుఃఖములే పుణ్యపాపములు. పలువిధములగు పుణ్యపాపకృత్యము లాచరించిన దేహమిక్కడ నగ్నిలోఁబడి భస్మముకాగాఁ బాపము లిఁక నెక్కడనున్నవి. కావున మిక్కిలి సుఖము గల్గించినచో నెట్టిపాపములనయినను శక్తికొలంది నాచరింపుఁడు.

క. మృతుఁడఁట పుట్టుఁ బెరుఁగును
మృతుఁడఁట వేఱొకఁడు గుడువ నే మేకొనుఁ దృప్తిన్
మృతునకు నఁట కర్మఫలం
బతిధూర్తుల వార్త లేటికి నే కావర్తింపన్. 75

టీ. మృతుఁడు=చచ్చినవాఁడు, పుట్టునఁట=జన్మించునఁట, పెరుఁగునఁట=వర్ధిల్లునఁట, వేఱొకఁడు=మఱియొకఁడు, కుడువన్=తినఁగా, మృతుఁడు=చచ్చినవాఁడు, తృప్తిన్=సంతృప్తిని, మేకొనునఁట=పొందునఁట, మృతునకున్=చచ్చినవానికి, కర్మఫలంబు, అఁట = మునుపు చేసిన పుణ్యపాపకర్మముల ఫల మనుభవించునఁట. అతిధూర్తులవార్తలు=పరులను వంచింప స్వభావముగల మూర్ఖులవచనములు, ఆవర్తింపన్, ఏటికి=చేకొనుట యెందులకు? చచ్చినవాఁడుమగుడ జన్మించునని యు, వర్ధిల్లునని యు, మగుడఁ జచ్చునని యు, నీజన్మమున నొనర్చిన కర్మముల నుత్తరజన్మమున ననుభవించునని యుఁ, జచ్చినవానికిఁ దిలోదకపిండాదు లిచ్చినయెడల వాఁడు సంతుష్టిఁజెందు ననియు సిద్ధాంతము

లయిన మతముల నాక్షేపించుచున్నారు. ఓ బ్రాహ్మణురాలా! దేహాతిరిక్తమగు నాత్మ లేకుండఁగా నాదేహమిచ్చుటనే యగ్నిదగ్ధమై బూడిదయైపడఁగా నది మగుడజన్మించుననుట యసంభవము. మఱియుఁ జచ్చినవారికిఁ జెందునను నాసతో ధనవ్యయముచేసి యితరులను భుజింపఁజేయుచున్నారు. వీరిచ్చుట భుజింపఁగాఁ జచ్చినవారు తృప్తినొందెదరనుట యనుభవవిరుద్ధము. లోకములో రాముఁడన్నములిన్నచో గోవిందునకిఁ గడుపునిండునా! కావున నట్టివానినమ్మి చెడిపోవకుఁడు. ఒకవేళ దేహాతిరిక్తమగు నాత్మయున్నను, పాపాదికర్మముల నొనరించిన దేహమిచ్చుట నశింపఁగా దానిపాపములు దానికంటె వ్యతిరిక్తమగు నాత్మయనుభవించుననుట యసంభవము. దేహముచేసిన పాపాదికమును దేహాతిరిక్తమగు మఱియొకటి యనుభవించుననిన లోకమున దేవదత్తుఁడను వాఁడుచేసిన పాపాదికమును యజ్ఞదత్తునియందున్న యాత్మకూడ ననుభవింపవలయును. ఆత్మయొక్కటియని వాదించుటచే మీకదితప్పదు. అది మిక్కిలివిరుద్ధముగాన దాని నాదరింపకుఁడు. ఇట్లు మిమ్ముఁ జేయు మనుటకుఁ గారణజీవనోపాధి కల్పించుకొని సుఖముగా జీవింపఁదలంచి వంచకు లిట్లుకల్పించిరి. అంతియకాని కర్మాదులవలన సుంతేనియు ఫలములేదని తలపోయుఁడని భావము.

ఉ. చీటికి మాటికిన్ నిఖిల జీవులునుం బొనరించుపాపముల్
 గోటులుదన్నుఁజుట్టుకొని ఘోరపుబాధలఁబొందుచొంటిమైఁ
 బాటిలునాత్మకున్ భరమె పాపము నీయది నిండుబండికిన్
 జేటభరంబెయేమిటికిఁ జేయవు విప్రుఁడ కిల్బిషంబులన్. 76

టీ. నిఖిలజీవులునున్ = సమస్తమయినజీవాత్మలును, చీటికిమాటికిన్ = మాటిమాటికి, పొనరించుపాపముల్ = చేయుచున్నపాపకృత్యములు, కోటులు = కోట్లు కొలంది, తన్నున్, చుట్టుకొని = ఆవరించి, ఘోరపుబాధలన్ = భయంకరములగు కష్టములను పొందుచు, ఒంటిమైన్ = ఏకాకిగా, పాటిలునాత్మకున్ = వర్తించెడిఆత్మనకు, పాపము, నీయది = నీవొక్కఁడుచేయుపాపము, భరమె = కష్టమా! జీవులెల్లను ఆత్మఒక్కఁడే అగును. ఆలెక్కలేని జీవులు చేయుపాపములెల్లను

ఆయాత్మ భరించుచుండఁగా నీఒక్కనిపాపము దానికి బరువా? కానేరవని భావము. నిండుబండికిన్ = వస్తుసముదాయముతో నిండి యున్నబండికి, చేట, భరంబె=బరువగునా? విప్రుఁడ=ఓబ్రాహ్మణుఁడా! కిల్బిషంబులన్ =పాపము లను,ఏమిటికిన్, చేయవు=ఎందుల కొనరింపవు,"ఆత్మయొక్కటియేయని వాదించుచున్నారు. మఱియు నాత్మయొక్కటియే కావున దాను బరులునను వ్యవహారము లేదు గాన పరదారయనియు బరధనమనియు వ్యవహార మెట్లుకలుగును? కావున యథేష్టపరదారిగమనాదిపాపములు చేసినను కొంచెమైనను బాపమును బొందలేవు. ఆలోచింప కేలభయపడెదవు. యథేచ్ఛముగాఁ బాపములాచరింపు"మని కొందరి భావము.

చ. కలుగుట లేమిసందియము కార్యఫలంబులయందునిట్టిచో
ఫల ముదయించెనేనిఁ దమపాలిటివేల్పులు మంత్రతంత్ర శ
క్తులును దదీయలాభమునకుం దగుహేతువు లందు రన్యథా
కలనకునంగలోపములు కారణమందురుమాంత్రికాధముల్.

టీ. కార్యఫలంబులయందున్ = కార్యములఫలములందు, అనఁగాఁ బుత్రకామేష్టి మొదలగు కార్యములం దనుట, కలుగుటయు=ఫలముకలుగుటయు, లేమి=కలుగకపోవుటయు, సందియము=సందేహాస్పదము- అనఁగాఁ గార్యములాచరింపఁబడినప్పుడు ఫలముగల్గుటయో లేకపోవుటయో నిశ్చయమనిభావము. లేక, కార్యభరంబులయందు, కలుగుటలు=ఫలమోఫలాభావమో, లభించుటలు, ఏమిసందియము = సందేహమేమున్నది. ఏదోయొకటి కాకమానదని భావము. ఇట్టిచోన్ =ఫలము విషయమై సందేహమువచ్చినప్పుడు ఫలము=కార్యసిద్ధి, ఉదయించెన్, ఏని=కార్యఫలముగల్గినచో, తదీయలాభమునకున్ =ఆఫలప్రాప్తికి, మాంత్రికాధముల్ =జపాదులనొనరించుధూర్తులు, తమపాలిటివేల్పులును=తమదేవతలును, మంత్రతంత్రశక్తులును=మంత్రశాస్త్రమందలి సామర్థ్యములును, తగుహేతువులు=ముఖ్యకారణములని, అందురు, అన్యథాకలనకున్ =విపరీతముగా పరిణమించినచో, అనఁగా ఫలసిద్ధికలుగనిచోనని భావము. అంగలోపములు= తమయొనర్చిన పుత్రకామేష్టి మొదలగు కార్యముల కంగభూతములగు దక్షి

ణలందలిలోపములు, కారణములు, అందురు, పుత్త్రికామేష్టి చేసినప్పుడు, పుత్త్రిం డుదయించినచో మాంత్రికులు మామంత్రబలముచేత మేముపాసించిన దేవతయనుగ్రహముచేతను గల్గెనని చెప్పుదురు. అట్లుకలుగనిచోఁ దామొనర్చిన జపాదులకు దగినట్లు దక్షిణలియ్యకపోవుటచే ఫలము కలుగలేదని పలుకుదురు. ఇట్లు మాంత్రికులువంచింతురుకాన వారిమాటలు విశ్వసింపరాదనిభావము.

తా. కార్యములందు ఫలముగల్గుటయో లేకపోవుటయో నిశ్చయము. ఇట్లుండ దుచ్ఛలయిన మాంత్రికులు ఫలముగల్గెనేని తమమంత్రబలమనియుఁ గలుగనిచోఁ దగినదక్షిణలీయకపోవుటచే నట్లయ్యెననియుఁ బల్కుదురు. కాన వారినమ్మఁజనదు.

తే. అర్థి నర్జింప వర్జింప కే నలవికాని
ధర్మము నధర్మమును జెప్పెఁ కే దగిలిమనువు
నేరములు వెట్టి దండువు కే నిశ్చయించి
ధరణిఁగలచోట నర్థమెకె త్తంగఁ దలఁచి. 78

టీ. మనువు, నేరములు = విధినిషేధరూపములగు ధర్మాధర్మముల నతిక్రమించుట యనెడి యపరాధములను. పెట్టి = ఏర్పటిచి, దండువు = ఆయపరాధమునకుఁ బరిహారమును, నిశ్చయించి = ఈయపరాధమున కీప్రాయశ్చిత్తము చేయవలయునని చెప్పి, ధరణిన్ = భూమియందు, కలచోటన్ = ధనవంతులయియున్నవారియొద్ద, అర్థః=ధనము, ఎత్తంగన్, తలఁచి=లాగవలెననియెంచి, అర్థిన్ =ప్రీతితో, అర్జింపన్ = చేయుటకును, వర్జింపన్ =విడుచుటకును, అలవికాని=శక్యముకాని, ధర్మమును, అధర్మమును, తగిలి=అత్యాసక్తికలవాఁడయి, చెప్పెన్ =వచించెను. ఆచరించుటకుఁగాని, విడిచిపెట్టుటకుఁగాని శక్యముగాని ధర్మాధర్మములనన్నింటినిగూర్చి మనువు స్మృతిగ్రంథమును రచించెను. అట్లు సులభసాధ్యములు కాని ధర్మాధర్మములుచెప్పుటకుఁ గారణమేమనఁగాఁజెప్పిన విధినిషేధవాక్యములను నతిక్రమించినచోఁ బ్రాయశ్చిత్తాదిమూలమున ధనవంతులనుండి ధనము సులభముగా నాకర్షించుటకే కాని

వేఱుకాదు. ఎట్లనఁగా మనువుచెప్పిన యొకవిధిని జేయనిచో విధి నతిక్రమించెనుగాన వానికిఁబాపము సిద్ధమయ్యెనది ప్రాయశ్చిత్తముచేఁ బోవునని చెప్పి దానములని పేరుచెప్పి ధనమును వెచ్చింపఁజేసి చేకొనవచును. అట్లె దీనినిజేయరాదని మనువు నిషేధింపఁగా దాని నెవ్వఁడేనిఁజేసినచో వాఁడు పాపాక్రాంతుండగును. కాని వానికిఁ బ్రాయశ్చిత్తాదులఁజేయించి ధనము స్వీకరింపవచ్చును. ఈయుద్దేశముతోనే మనువట్లు గ్రంథమును రచించెను. కాని యంతకంటె వేఱుఫలము లేదనిభావము.

తా. మనవు నేరములెంచి తత్పరిహారార్థము ధనమును స్వీకరించుటకే యిట్లుచేయుటకు విడుచుటకును దరముగాని ధర్మాధర్మముల నిరూపించి చెప్పెను.

శా. లాలామూత్రపురీష ఘర్మజలకీలాలాత్మిక ల్భామలం
చేలారోఁతలుపుట్టనాఁడుదురుయోగీంద్రుల్ వృథాలాపముల్
లాలామూత్రపురీష ఘర్మజలకీలాలాత్ములో తారకే
ప్రాలేయాంబుపటీరపంకఘనసారక్షోదదివ్యాత్ములో. 79

టీ. భామలు=స్త్రీలు, లాలా...త్మికల్—లాలా=చొంగ, మూత్రపురీషములు, ఘర్మజల=చెమ్మట, కీలాల=రక్తము, ఆత్మికులు = దేహముగాఁ గలవారు, అంచుక్=అనిపల్కుచు, యోగీంద్రుల్ = యోగీశ్వరులు, రోఁతలు=స్త్రీలపైవిరక్తి, పుట్టక్=కలుగుటకు, వృథాలాపములు = జుగుప్సాకరములగు వచనములు, ఏలనాడుదురు=ఎందులకుఁ బలికెదరు. అనఁగా నట్లు పలుకరాదనుట, వైరాగ్యవంతులయిన యోగులు పెఱవారికిఁగూడ వైరాగ్యము గలిగింపవలయునని యెంచి "స్త్రీలమనోహరాంగముల నన్నిటిని జుగుప్సావచనములతో స్త్రీలముఖముచొంగ గలదని, స్తనములు మాంసపుముద్దలని, శరీరము మూత్రపురీషాదులు గలదని" వినువారికి రోఁతపుట్టునట్లు స్త్రీలను నిందించిరి. అట్లు చేయుట తప్పు. తానట్టివాఁడు కానిచో వారినిందింపవచ్చునుకాని తానునువారివలె నుండ నిందింపనేల యని ముందుపాదములచేఁ జెప్పుచున్నాఁడు. తారు = తాము, లాలామూత్రపురీష ఘర్మజలకీలాలాత్ములో ... మగు దేహ

ములుగలవారేయైన, తారజే= తామేకాఁబోలును, ప్రాలేయా...త్మకుల్— ప్రాలేయాంబు = హిమజలము, పటీరపంక = మంచిగంధము, ఘనసారక్షోదను = పచ్చకపురపుఁబొడియు మొదలగువానిచే, దివ్య=మనోహరమగు, ఆత్మలో = శరీరములు గలవారా. అనఁగా స్త్రీలశరీరము లెట్లో యట్లె యా యోగీశ్వరుల శరీరములును లాలాదులు గలవియే కాని సుగంధద్రవ్యములు కావు. అట్లుండ వారిని నిందింప నేల యనిభావము.

తా. స్త్రీలు మూత్రపురీషాదులగు హేయపదార్థములు గలవారని వారి యందు రోఁతపుట్టునట్లు యోగులు పల్కుచుందురు. ఆ స్త్రీ లట్టివారేకాని వారుమాత్రమే పటీరాది సుగంధద్రవ్యములతోఁ గూడిన శరీరములు గలవారు కాఁబోలును ?

వ. పురాణంబుఁ బ్రమాణీకరింతుమేని తత్ప్రణేత పారాశర్యుం
డు పాండవుల నగరి చాటుకవి. కవులమాటల కేటిపాటి? మ
త్స్యపురాణంబునందు మత్స్యంబు వక్త యఁట. తిర్యగ్జంతు
మతంబులు సిద్ధాంతీకరింపనచ్చునే? అది యట్లుండె. 80

టీ. పురాణంబుక్ = మత్స్యాదులగు నష్టాదశపురాణములను, ప్రమాణీకరింతుమేని=ప్రమాణములని స్వీకరించితిమేని, తత్ప్రణేత = ఆపురాణముల రచించినవాఁడు, పారాశర్యుండు = వ్యాసుఁడు, పాండవుల నగరిచాటుకవి. పాండవుల పురమగు హస్తినాపురమందుండి వారికిఁ బ్రియంబులు చెప్పెడికవి. కవులమాటలకుక్ =కవులవాక్యములకు, ఏటిపాటి=ఏపాటిప్రామాణ్యము? అనఁగాఁ బురాణముల రచించిన వ్యాసుఁడు నీచస్త్రీయందుఁ బుట్టినవాఁడు. మఱియు వాఁడు తనసోదరుని భార్యలతోను దాసితోను భోగించి సంతానముకన్న దుష్ప్రవర్తనుఁడు, పాండవులయొద్దనుండి వారికిఁ బ్రియమగునట్లుగా వారికి శత్రువులగు దుర్యోధనాదుల నిందించుచు, వారికి మిత్రుఁడయిన కృష్ణుని నుతించుచుఁ బరాధీనుఁడయి యున్నవాఁడు. అట్టివ్యాసుండు వ్రాసినభారతాదులు ప్రమాణములుకావనిభావము. మత్స్యపురాణంబునందుక్, మత్స్యంబు=

చేఁప,వక్తయఁట=చెప్పవదఁట, తిర్యగ్జంతువుల=జ్ఞానరహితములగు పశుపక్ష్యా దుల, మతంబులు, సిద్ధాంతీకరింపవచ్చునే = స్థిరపఱుపవచ్చునా! కూడదనుట. కావునఁ బురాణాదులన్నియు నప్రమాణములనిభావము.

సీ. దిననాథనందను దిత్త్రొల్చి విడిచిరి
　　　కరుణలే కెముక లేరిరి దధీచిఁ
పాతాళబిలమునఁ బలిఁ గట్టివైచిరి
　　　జీమూతవాహను జీవి వాపి
రెత్తి పాల్గొనిరి శిబీంద్రునంతటివానిఁ
　　　గలగుండు వెట్టిరి కలశవార్ధిఁ
దివుటఁ జుక్కలఁ జేనిఁ దినగోరు మెసఁగిరి
　　　పండు దుల్చిరి కల్పపాదపంబు
తే. నయ్యె లెంతకు నేర రర్థార్థిజనులు
వీరిమనసులు వట్ట నెవ్వారితరము
కీర్తి యటు లుండ విడుఁడు దాక్షిణ్య మింకఁ
దారు గల్గినఁ బదివేలు తమకుఁ గలవు.　　81

టీ. అర్థార్థిజనులు=ప్రయోజనాభిలాషులు,దిననాథనందనుతిత్తి=సూర్యపుత్త్రుఁ డయినకర్ణునియొక్క చర్మమును, ఒల్చి,విడిచిరి=పాఱవైచిరి,పూర్వ మింద్రుఁడు బ్రాహ్మణవేషమునఁ గర్ణునిసన్నిధికేగి యతని సహజకవచకుండలముల నడిగిపుచ్చు కొని తనకు నతనికిఁగూడ లేకుండఁజేసెను. కరుణలేక=దయలేక, దధీచి=దధిచి మహామునియందున్న, ఎముకలు, ఏరిరి = ఏరికొనిరి. పూర్వము వృత్రాసురునిఁ జంపఁబూనియింద్రాదిసురలు నారాయణోపదేశమునఁబోయి దధీచినిఁ బ్రార్థించి యతనింజంపి యెముకలు పుచ్చుకొనిరనిభావము. పాతాళబిలమునన్ =పాతాళ లోకమునందున్, బలిన్, కట్టివైచిరి=బంధించిరి. పూర్వ మింద్రాదుల జయిం చిన బలిని జయింపఁ దలంపుతో విష్ణువు వామనమూర్తియై బలిని భూమినియా చించి త్రివిక్రముఁడయి ముల్లోకములను బుచ్చుకొని పాతాళమందుఁ ద్రోచి

బంధించెను, ఆభాగవతకథ యిచ్చట ననుసంధింపఁబడియె. జీమూతవాహను
జీవి=జీమూతవాహనునిప్రాణమును, పాపిరి = తొలంగించిరి. జీమూతవాహనుఁ
డనెడి యొకరాజకుమారుఁడు పరోపకారశీలుఁడయి యేకపుత్త్రిశోకముచే దుః
ఖించుచున్న యొకనాగాంగనకు సంతసము గలుగునట్లుగా, వానికుమారునికి
మాఱుగాఁ దానే గరుడున కాహారమయ్యెను. జీమూతవాహనుఁడు తనంతటఁ
దానే పరోపకారాసక్తుఁడుకాఁగాఁ గవి దానిమార్చి యాచకులు యాచింపఁ
బ్రాణములు విడిచెననిచెప్పెను. శిబీంద్రునంతటివానిన్ = శిబిరాజువంటి చక్రవ
ర్తిని, ఎత్తి=తూఁచి, పాల్గొనిరి=పంచిపుచ్చికొనిరి అనఁగాఁ బూర్వము శిబి
యాగ మొనరించుచుండఁగా నతని ధర్మబుద్ధిని బరీక్షింప నింద్రాగ్నులు శ్యేన
కపోతరూపంబులఁదాల్చి శ్యేనంబుచే వెంబడింపఁబడుచుఁ గపోతంబు శిబిని
జేరి శరణుసొచ్చిన దానివెంబడినే వచ్చుచున్నడేగ పలుధర్మము లుపదేశించి
దాని యెత్తుమాంసమును నతనిశరీరమునుండి తీసి యీయవలయునని కోరి మాయ
చేసి యతనినే పుచ్చుకొనె నగెడి భారతకథ నిందుఁ జేర్పవలయును. కలశ
వార్ధిన్ =పాలసముద్రమును, కలగుండువెట్టిరి=కలఁచివైచిరి. పాలసంద్రమును
దఱచిరని భావము. తివుటన్ = కాంక్షతో, చుక్కలరేనిన్ = చంద్రుని, దిన
గోరు = దినభాగము, మెసఁగిరి=తినిరి, చంద్రుఁడు దేవతల కన్నమయ్యెనని
భావము. కల్పపాదపంబు=కల్పవృక్షమును,పండు,డుల్చిరి, కోరినవారికోర్కుల
నిచ్చెడి కల్పవృక్షముల ఫలములను రాల్చివైచిరనుట - దంతములుడుల్చిరనియు-
అయ్యలు,అర్థార్థిజనులు,ఎంతకున్, నేరరు=ఎంతలేనికృత్యముల నాచరింపఁజాల
రు.యాచకులు మిక్కిలి ఘోరకృత్యము లాచరింపఁ దగినవారని భావము. వీరిమన
సులు=ఈయాచకులకోర్కులు, పట్టన్ =నెఱవేఱుటకు,ఎవ్వారితరము=ఎవ్వరికిని
శక్యముకాదని భావము. కీర్తి=యశస్సు, అటులుండెన్ = ఆరీతిగా నుండెను.
దానధర్మాదులవలనఁ బెద్దయశంబు గలుగుననుమాటకేమి దాని నటుండనిండని
భావము. ఇఁకన్, దాక్షిణ్యమును = యాచకులయందు జాలిని, విడువుఁడు=
విడిచిపెట్టుఁడు, తారు=తాము, కల్గినన్ =బ్రదికినచో, తమకున్, పదివేలు=
పదివేలలాభములు, కలవు. యాచకులు వచ్చి దీనాతిదీనముగా యాచించినను

వారియందు జాలిగల్గి యడిగినకోరిక లీయఁబూనకుఁడు. దానివలనఁ గీర్తివచ్చు నని మీరనుకొనుచుందురు కాని కీర్తిమాట లటులుండఁగా సమస్తశ్రేయస్సుల సంపాదింపఁజాలిన దేహము నశించుచున్నది. తాము బ్రతికియున్న వేవిధములఁ గీర్తిసంపాదించుకొనవచ్చును. యాచకులఁ గోర్కులనుమాత్రము దీర్ప సమకట్ట కుఁడు. అట్లు పూనినచో యాచకులు మీకుఁ బ్రాణాపాయకరములగు నాపద లను గల్గింపకమానరు. కావున దానములఁ జేయుటమానుఁడని భావము. దానము కర్తవ్యమని చెప్పెడిపురాణములే దానముచేయువారి కష్టములు తప్పక మూడకమానవని చెప్పుచున్నవి కాన మాయీమాటలకును బురాణములే ప్రమాణ ములు- ఇంతియకాక దానముచేసిన వారిలక్ష్మి పోవుచున్నది; చేయనివారియొద్ద స్థిరముగా వర్తించుచున్నది. కావున నేవిధ మాలోచించినను దానాదుల నొన ర్చుటవలన నష్టమేకాని లాభములేదని తాత్పర్యము.

తే. శాంతమతిఁ గాముకత మాని సప్తతంతు
　దీక్ష గైకొన్నవారలతెఱఁగు లెస్స
　స్వర్గమున కేఁగి రంభాదివారసతుల
　కుచభరంబులపైఁ బ్రాలఁ గోర రేని.　　　82

టీ. కాముకతన్ = విషయానురాగిత్వము, మాని=విడిచి, శాంతమతిన్= విషయములనుండి మరలినచిత్తముతో, సప్తతంతుదీక్షన్ = యజ్ఞదీక్షను, కై కొన్నవారలతెఱఁగు=స్వీకరించినవారియొక్క ప్రవర్తనము, లెస్స=యుక్తముగా నుండును, ఏమిచేసినచో యుక్తముగానుండును, స్వర్గమునకున్ = స్వర్గలోక మునకు, ఏఁగి=వెళ్లి, రంభాది...పైన్—రంభాది=రంభ మొదలగు, వారసతు ల=భోగస్త్రీలయొక్క, కుచభరంబులపైన్=స్థూలములయిన స్తనములమీఁద, వ్రాలన్=పడుటకు, అనఁగా రంభాదుల స్తనముల నాలింగనము చేసికొనుటకు, కోర రేనిన్=అపేక్షింపకపోయినచో,మరణానంతరమందు స్వర్గమునుజేరిరంభా సంభోగము నపేక్షింపనిచో యజ్ఞదీక్ష కైకొన్నవారి ప్రవర్తనము లెస్సగా నే యుండును. కాని యట్లు జరుపలేదు. ఏమన లోకములో వంచకబ్రాహ్మణులు

శాంతాత్ములవలెను, నిష్కాములవలెను గానవచ్చుచు, నెక్కుడధనము వ్యయముచేసి చూచువారి కచ్చెరువు గలుగునట్లు బ్రహ్మచర్యాదికమును జూపుచు నాత్మనుపంచించి, యాగము చేయుచున్నారు. వారు నిజముగాఁ గాముకత విడువనివారే. మరణానంతరమందు రంభాసంభోగమునుగోరి వర్తించువారు నిష్కాము లెట్లగుదురు. సామాన్యజనులు యావజ్జీవముమాత్రము కాముకులై యుందురు. కాని యాగ మొనర్చినవారు మరణానంతరముకూడఁ గాముకు లగుచున్నారు కావున వారు సామాన్యులకంటెఁ దక్కువవారనిభావము.

తే. ఆహవంబున మృతు లయినయట్టివీరు
లమరలోకంబునకుఁ బోదురనుట గల్ల
నిజమయేని దైత్యారిచే నిహతిఁ బొంది
యతనితో విగ్రహింపరే యసురు లచట. 83

టీ. ఆహవంబునన్=యుద్ధమునందు, మృతులు = చచ్చినవారలు, అయినయట్టివీరులు=అయినయోధులు, అమరలోకంబునకున్=స్వర్గలోకమునకు, పోదురు, అనుట, కల్ల=అసత్యము, "అనఁగా రణాదపలాయనాత్స్వర్గః" అని చెప్పఁబడినవిధముగా సంగరమునఁ జచ్చినవారందఱు స్వర్గము చేరుదురనుట యసత్యము. వారికి రణమందుఁ బ్రాణత్యాగముతక్కఁ దక్కిన ఫలము వేఱొండు లేదనిభావము. నిజమయేని=ఆవాక్యము సత్యమేయైనచో, అసురులు=హిరణ్యకశిపుఁడు మొదలగు రక్కసులు, దైత్యారిచేన్, నిహతిన్=చావును, పొందన్=పొందఁగా, అచటన్=ఆస్వర్గమందు, అతనితోన్=అవిష్ణువుతో, విగ్రహింపరే = పోరాడుచుండరా, మీమతమందు యుద్ధమునఁ జచ్చినవీరులు స్వర్గమున సుఖము లనుభవించుచున్నారనికదా! చెప్పుచున్నారు. అట్లయినచో, "యయంవాపి స్మరన్భావ" మ్మనెడి యభియుక్తోక్తిప్రకారమున మరణకాలమం దేభావమును స్మరించుకొందురో యనంతరమందు దానినేకదా పొందుదురని చెప్పఁబడియుండెఁ గాన యుద్ధమందు హరిచే సంహరింపఁబడిన రక్కసులు హరివైరమునే మనమందుంచికొని చచ్చి యావల నాహరివైరమునే పొంది స్వర్గములోఁగూడ హరితోఁ బోరాఁడవలయును. కాని యట్లు పోరాడు

చున్నట్టు చెప్పఁబడలేదు. కాన యది యప్రమాణమనియే తెలియఁదగినదని భావము.

తా. యుద్ధమందుఁ జచ్చినవీరులు స్వర్గముచొత్తురన్నచో వారిచేఁ జచ్చిన హిరణ్యాక్షాదులు స్వర్గమున వారితోఁ బోట్లాడుచుండవలె. అట్లుచేయుచున్నట్టు లేపురాణములఁ జెప్పలేదు; కావున నదియెంతయు నప్రమాణమని నమ్ముఁడు.

క. అక్షచరణుండు చెప్పిన
మోక్షములు శిలాస్వరూపకములు వీనికిఁ గాఁ
బ్రేక్షావంతులు దచ్ఛా
స్త్రాక్షరములు చదువ నేల కో యతిబాలిశు లై. 84

టీ. అక్షచరణుండు=కాలియందు నేత్రముగల గౌతముఁడు, చెప్పినమోక్షములు=వచించిన ముక్తులు, శిలాస్వరూపములు=పాషాణస్వరూపములు, అనఁగా గౌతముఁడు న్యాయశాస్త్రమున "తదత్యంతవిమోక్షోఽపవర్గః" అను నివి కొన్నింటిచే సమస్తవిశేషగుణములు లేకపోవుటయే ముక్తియనియు ముక్తుఁడు పాషాణమువలె నుండుననియుఁ బ్రతిపాదించె ననిభావము, వీనికిఁగాన్ = ఇట్టి శిలాస్వరూపముక్తికై, ప్రేక్షావంతులు=బుద్ధిమంతులగు మీరు, అతిబాలిశులై= మిక్కిలి యవివేకులరై, తచ్ఛాస్త్రాక్షరములు=ఆగౌతముచేసిన న్యాయశాస్త్రపు వచనములు, చదువ నేల=చదువుటవలన నేమి ప్రయోజనము. జ్ఞానవంతులయినవారికి శిలాస్వరూపముక్తి గల్గునని చెప్పిన గౌతముఁడు గౌతముఁడే, గౌతమ=వృషభశ్రేష్ఠుఁడే అనఁగా జ్ఞానహీనమగు పశువువంటివాఁ డని తెలియఁదగినది. జ్ఞానహీనుఁ డగునాగౌతముఁడు చెప్పినను జ్ఞానవంతు లగుమీరును మోహితులై యాతని శాస్త్రమును జదువుచున్నారు. దానివలన మీకు సుంతేనియు ఫలములేదని భావము.

తా. గౌతముఁడు ముక్తులు శిలాస్వరూపములని చెప్పెను. జ్ఞానవంతులకట్టి ముక్తి చెప్ప[illegible] తెలివి[illegible] బుద్ధి[illegible] [illegible]క వాని

కంటె బుద్ధిహీనతతో నాశాస్త్రిమును జదువుచున్నారు. దానివలన నేమియు లాభములేదు.

ఆ. దైన్యమునకుఁ ద్రోవ కే దలఁప నస్తైన్యంబు
కుక్షివంచనంబు కే కుడు పుడుగుట
బుద్ధి యైనయట్ల కే భోగింప నేర్చుట
సారమైన బోధి కే సత్త్వమతము. 85

టీ. తలఁపఁగ =ఆలోచింపఁగా, అస్తైన్యంబు=దొంగతనము చేయకపోవుట, దైన్యమునకుఁ =దారిద్య్రిమునకు, త్రోవ=మార్గము, కుడుపు=భోజనము, ఉడుగుట=మానుట, కుక్షివంచనంబు=కడుపును వంచించుటయె, బుద్ధియైనయట్ల=మనంబున కింపయినట్లు, భోగింప నేర్చుట=అనుభవింపఁగలుగుట, సారము=శ్రేష్ఠమైనది, ఐనబోధి సత్త్వమతము=అయినట్టి (బౌద్ధ) ప్రాజ్ఞులమతము, చోరత్వముకూడదనియు, నుపవాసాదులు చేయవలయుననియు జెప్పుచుందురు కాని దొంగతనము చేసి ధనమార్జింపనిచో దారిద్య్రిమెప్పుడును బోదు, ఉపవాసాదులను జేయుట కుక్షినివంచించుటయే. కావున స్మృత్యాదులందుఁ జెప్పఁబడిన నిషేధములను బరిత్యజించి సర్వసుఖ కారణమయిన స్వేచ్ఛాసంచారమునే యవలంబింపుఁడని భావము.

తా. మీధర్మశాస్త్రిములందుఁ జెప్పినవిధమున దొంగతనము చేయనిచో పేదతనము తొలంగదు. ఉపవాసములు చేయుట కుక్షిని మోసపుచ్చుటయె, కావున మీమతములు మంచివికావు. యథేష్టముగావర్తించి సుఖము లనుభవించుట ప్రాజ్ఞులమతము.

తే. క్రోధనులు దార పరుల కే క్రోధశిక్ష
చేయుచుందురు కపటవ కే సిష్ఠమునులు
దారు నిర్ధనులై యుండి కే ధాతువాద
మొకరికిం జెప్ప విప్రలం కే భకులు ప్రాలె. 86

టీ. కపట = కపటముచే, వసిష్ఠమునులు = గొప్పమునులవలె నటించువారు,

తారు=తామె, క్రోధనులు=అకారణ కోపముగలవారు, పరులకున్=ఇతరులకు, అక్రోధశిక్ష=క్రోధ మన్నివిధములచేతను బరిత్యజనీయ మయినదనియు, నట్లు వర్తింపవలయు ననెడిశిక్షను, చేయుచుండుదురు. దూర్వాసోముఖు లయినమునులు మహాకోపవంతులయినను వారికోపము నడఁగించుకొనక పరులకుఁ"గోపముచెడ్డది, విడువవలయు" నని బోధించుచుందురు. తమకోప మడఁచుకొనకుండఁ బరుల కుపదేశించుట తెలివిమాలినపనియని భావము. ఎవరివలెననఁగా, తారు, నిర్ధనులై =బీదలై, ఉండి, ధాతువాదము=లోహములు కొన్నివస్తుసంయోగమువలన వెండిబంగారులగునని, ఒకరికిన్=పెఱవానికి, చెప్పువిప్రలంభకులు వోలెన్=ఉపదేశించు వంచకుల చందంబున, అని వెనుకన్వయము. లోకమునఁ గొందఱు వంచకులు పరులవలన ద్రవ్యము లాగవలెనని యెంచి "నేను ధాతువుల రిపుమిత్రభావము నెఱుంగుదు ధాతువులకు సంయోగము గల్గించి సువర్ణాదికమును జేయఁగలను, నీవు నాకుఁ గొంచెము ధనమిత్తువేని నీకావిద్య నుపదేశించెద" నని చెప్పి వాని వంచించి ధనములాగుచుందురు. అట్టి వంచకులవలె మునులును దాము క్రోధము విడువనేరరు కాని కోపముత్యజనీయమని పెఱవారి కుపదేశించుచుందురు. అది యయుక్తమనిభావము. "స్వయంతీర్ణః పరాంస్తారయే త్త"న్నట్లు బుద్ధిమంతులైనచోఁ దమ దారిద్ర్యము ముందుఁ దొలంగించుకొని పరుల దారిద్ర్యమును దొలంగింపఁ బ్రయత్నింపవలె. అట్లుకాక తాము పేదవారై యుండి పరుల కట్లుపదేశించుట యోజింపఁ బరుల వంచించి ధనములాగుటకే వారట్లు చేయుచున్నారని తెలియఁదగినది.

తే. కలవు విధ్యర్థ మంత్రభాగములు మూఁడు
 శ్రుతుల, నామూఁటియందు మీమాంసమతికి నెక్క
 కర్థవాదాంశ మఖిలంబు సనృత మయ్యె
 నట్ల యగుఁగాక మంత్రవిధ్యంశములును." 87

టీ. శ్రుతులన్=వేదములందు, మూఁడు, విధ్యర్థమంత్రభాగములు=విధిభాగము, అర్థభాగము, మంత్రభాగము, ననునవి, కలవి. అనఁగా శ్రుతులు విధి భాగ మనియు నర్థభాగ మనియు, మంత్రభాగ మనియు నేర్పఱుపఁబడినవి,

ఆమూఁటియందున్ =ఆమూఁడుభాగములందును, మీమతిక్, ఎక్కుడు=మీ మనసునకుఁ గూర్పక, అర్థవాదాంశము అఖిలంబు=అర్థవాదభాగ మంతయు, అనృతమయ్యెన్ =అసత్యములయ్యె, మంత్రవిధ్యంశములు=మంత్రభాగ విధిభాగ ములును, అట్లుగుఁగాక=ఆయర్థభాగమువలె నసత్యములగుఁ గాక. ఓ బ్రాహ్మణు లారా! మీరు వేదములను మూఁడుభాగములుగా విభజించికొని చదువుచు, వా నిని జక్కఁగ నేర్చికొని యా మూఁడుభాగములలోను నర్థవాదభాగ మనృతమని చెప్పుచున్నారు. తక్కిన విధిభాగమంత్రభాగములను సత్యములనుచున్నారు. మూఁడును బ్రమాణములయినఁ గావలయును లేక యసత్యములయినఁ గావలయు. అంతియకాని కొంతసత్యమనియుఁ గొంతయసత్యమనియుఁ జెప్పి యర్ధజరతీయ న్యాయ మాశ్రయింపరాదని భావము.

తా. విధిమంత్రార్థభాగముల మూఁడింటిలోను నర్థవాదాంశ మసత్యమని మీకేతట్టుచున్నది. దానివలెఁ దక్కినభాగములును నసత్యములని నిశ్చయింపుఁడు.

వ. అని యీప్రకారంబు వాచాటులై టిట్టిభంబులునుంబోలెఁ గర్ణకంటకంబులైన దుర్వర్ణనంబుల వేదంబు ప్రమాణంబు గాదనియును, నాగమంబుల నగడుసేసియు, ధర్మంబుల మ ర్మంబులుచ్చిపోనాడియుఁ, బురాణంబుల ప్రాణలు సెఱచియు నితిహాసంబుల నపహసించియు, జన్నంబులఁ జిన్నవుచ్చియు, మంత్రపారాయణంబులఁ దృణీకరించియు, హోమశంబులం గలంచియు, గలికిఁ గౌతూహలంబును, జైనులకు సన్మానం బును, బౌద్ధులకు నుద్ధతియును, జార్వాకులకు నిర్వృతియు, లోకాయతుల కుత్సేకంబును, బాషండులకుం జెవులపండు వును, గాపాలికుల కుపకారంబునుం గాఁ గైవారంబుసేయు పాతకులంగనుంగొని శక్రుండు సక్రోధుండును, వరుణుం డరు ణాలోచనుండును, నగ్ని యుద్విగ్నమానసుండును, గృతాం తుం డత్యంతరోషుండును నై యయ్యాశాపతులు నలువురు

నల్దిక్కు మొగంబై యొదురాత్ములారా "ఏమి? దుర్భాషణం బులాడెదరు! దంభోళిధారాసంరంభంబును బాశవల్లీ సము ల్లాసంబును, సముజ్జ్వలజ్వాలాకరాళతయు నుద్దండగదా తాడనంబును, నెఱుంగరే? ఏల ప్రేలెదరు? పుత్రకామేష్టి శ్యేనకారీరీప్రముఖంబులగు మఖంబులు దృష్టఫలంబు లగుట గన్నులంగానరే? ఆవేశంబున గయాశ్రాద్ధాదు లపేక్షించు భూతంబులం జూచి పుణ్యఫలంబులు దెలియరాదే? అంగా రప్రవేశంబుల దేహంబులు వ్రేక్కకుండుట, నేత్రోత్పాట నంబునఁ గన్నులు వచ్చుట యాదిగాఁగలవిశేషంబుల దేవతా ప్రభావంబులు భావింపందగదే? ఇవ్విధంబునం బ్రల్లదంబు లాడెదరు గాన మిమ్ము నాలుకలు గోయక సెలవులు వ్రీల్పక ప్రాణంబులం గొనక యోర్లు సైరింపవచ్చు?'' ననిన భయం బంది యవ్వందిజనంబులు బృందారకులకు నమస్కరించి యిట్లనిరి. 88

టీ. అని ఈప్రకారంబు=పైని వర్ణించినవిధమున, వాచాటులై=కుత్సితభా షణములు పలుకుచున్నవారై, టిట్టిభంబులునుంబోలెక్ = తీతువు పిట్టలవలె, కర్ణకంటకంబులు=చెవులకు ముండ్లవలెఁ దాఁకునవి, ఐనదుర్వర్ణనంబులు=అయి నట్టి చెడుస్తోత్రములు, వేదంబు, ప్రమాణంబు, కాదనియును, ఆగమంబులక్= శాస్త్రములను, అగడుసేసియు=నిందించియు, ధర్మంబుల మర్మంబులు = ధర్మ శాస్త్రరహస్యములను, ఉచ్చిపోనాడియుక్ =చెడునట్లు పలికియు, అనగా నెవ్వరును ధర్మశాస్త్రమునకు సుముఖులు కామండునంతటి రోఁతనుకల్గించియు నని భావము. పురాణంబుల ప్రాణలు=పురాణముల శక్తులను; చెఱచియు, ఇతి హాసంబులక్ =భారతాదీతిహాసగ్రంథంబులను, అపహసించియుక్ = గేలిచేసి యు, జన్నంబులక్ =యాగములను, చిన్నపుచ్చియు=తిరస్కరించియు, మం త్రపారాయణంబులక్= మంత్రోపాసనములను, తృణీకరించియుక్, యామ

శంబులన్ =యామళమతములను, కలంచియున్ =చెఱిచియు, కలికిన్ =కలిపురుషునకు, కౌతూహలంబును=వేడుకయు, జైనులకున్ =జైనమతస్థులకును, సన్మానంబును=గౌరవంబును, బౌద్ధులకున్, ఉద్ధతియున్ =అతిశయమును, చార్వాకులకు = చార్వాకమతస్థులకు, నిర్వృతియున్ =ఆనందమును, లోకాయతులకున్ =లోకాయత మతస్థులకు, ఉత్సేకంబును=గర్వంబును, పాషండులకున్ = చెవులపండువులును, కాపాలికులకు, ఉపకారంబునుంగాన్ =ఉపకారమగునట్టుగాను, కైవారంబు=స్తోత్రము, చేయుపాఠకులన్ =చేయునట్టి కలిపండిజనంబును, కనుంగొని=చూచి, శక్రుండు=ఇంద్రుఁడు, సక్రోధుండును=క్రోధముగలవాఁడును, వరుణుండు, అరుణలోచనుండును=ఎఱ్ఱని నేత్రములుగలవాఁడును, అగ్ని, ఉద్విగ్నమానసుండును = ఉద్రేకించుచున్న చిత్తముగలవాఁడును, కృతాంతుండు=యముఁడు, అత్యంతరోషుండును=అధికకోపముగలవాఁడును, ఐ, అయ్యాశాపతులు, నల్వురు=ఆదిక్పతులు నలువురును, నల్దిక్కు మొగంబై=నలువైపులఁ దిరిగి, ఓరురాత్ములారా, ఏమిదుర్భాషణంబులు = ఎటువంటి చెడుమాటలు, ఆడెదరు = ఆడుచున్నారు, దంభోళిధారాసంరంభమ్మును = వజ్రాయుధపు టంచులయొక్క యతిశయమును, పాశవల్లీసముల్లాసంబును=లతవంటి పాశముయొక్క పెంపును, సముజ్జ్వల జ్వాలాకరాళతయు=అగ్నిహోత్రుని మంటలయొక్క భయంకరత్వమును, ఉద్దండగదాతాడనంబును=భయంకరమగు యమదండముయొక్క దెబ్బను, ఎఱుంగక=తెలిసికొనక ? ఏల, ప్రేలెదరు = వదరుచున్నారు, పుత్త్రి...ముఖంబులు—పుత్త్రికామేష్టి=పుత్త్రికామేష్టియు, శ్యేనకారీరీ= శ్యేనకారీరీయాగము, ఆది= మొదలయిన, ప్రముఖంబులు=శ్రేష్ఠములు, అగుమఖంబులు=అయినట్టి యాగములు, దృష్టఫలంబులు=కానవచ్చుచున్న ఫలములుగలవి, అగుట, కన్నులన్, కానరే=చూడలేదా ? ఆవేశంబునన్ =ఒకని నావేశించుటవలన, గయాశ్రాద్ధాదులు=గయాశ్రాద్ధము మొదలగునవి, అపేక్షించు భూతంబులన్ =కోరుచున్న భూతములను, చూచి, పుణ్యఫలంబు, తెలియన్, రాదే! తెలిసికొనఁగూడదా! అంగారప్రవేశంబులన్ =నిప్పుకలలోఁ బ్రవేశించుటవలన, దేహంబులు = శరీరములు, పొక్కక, ఉండుట

యుఁ=పోస్కు లెక్కకపోవుటయు, నేత్రోత్పాటనంబునఁ=నేత్రము లూడివచ్చినప్పటికి, కన్నులు, వచ్చుట=మరల సంభవించుటయు,ఆదిగాఁగల విశేషంబులు=మొదలయిన గొప్పకార్యములు, దేవతాప్రభావంబులు=దేవతాసామర్థ్యమువలనఁ గల్గినవి, అని, భావింపఁ, తగదే=భావింపవలదా? ఇవ్విధంబునఁ=ఈప్రకారముగా, ప్రల్లదంబులు=విరుద్ధవాక్యములు, అడెదరు=పలుకుచున్నారు, కాన, మిమ్ముఁ, నాలుకలు, కోయక, సెలవులు=మర్మస్థానములు, వ్రీల్పక=చీల్పకుండఁగా, ప్రాణంబులఁ, కొనక, ఎట్లు, సైరింపఁ, వచ్చు, అనినఁ=భయంబు, అంది, అవ్వందిజనంబులు = కలియొక్క స్తోత్రపాఠకులు, బృందారకులకుఁ=దేవతలకు, నమస్కరించి, ఇట్లు=అనిరి.

మ. బలభిద్వహ్ని యమ ప్రచేతసులకుఁ క్బ్రహ్మాయు,వే మెల్లనుం
గలిభూపాలుని యొద్దిపాఠకుల మీకై వారదుర్భాషణం
బులకుం గానియతండు మెచ్చఁడుదయా క్ బుద్ధిం బరాధీనవృ
త్తులనీపేదల మమ్ముఁ గావఁదగు నీక్ద్రోహంబు లేకుండఁగన్.

టీ. బల... చేతసులకుఁ—బలభిత్=బలాసురునిఁ జంపినవానికి, అనఁగా దేవేంద్రునకనుట, వహ్ని=అగ్నిహోత్రునకును, యమ=యమునకును, ప్రచేతసులకుఁ=వరుణదేవునకును, బ్రహ్మాయువు=బ్రహ్మకుఁగల్గినంతయాయువు గలుగుఁగాక, ఏము, ఎల్లనుఁ=మేమందఱమును, కలిభూపాలునియొద్ది పాఠకులము=కలిరాజునొద్దనుండెడి వందులము, ఈకై వారదుర్భాషణంబులకుఁ=వందులస్తోత్రరూపములగు నీచెడుభాషణములకు, కాని అతఁడు=ఆకలి, మెచ్చఁడు=సమ్మతింపఁడు, దయాబుద్ధిఁ=కృపామయమయిన బుద్ధితో, పరాధీనవృత్తులము=పరులకధీనమగు జీవనోపాధిగలవారమును, ఈపేదలఁ, మమ్మున్ = నిఱుపేదలగు మమ్మును, ఈద్రోహంబు=మా చేసిన యపరాధము, లేకుండఁగఁ=లేకుండనుండునట్లు-అనఁగా నిట్లుపరాధీనత చేఁగాని మాకు బుద్ధిపుట్టి నుతింపలేదు, కానయిది మారాజు ననవలయునుగాని మమ్మనవలసిన పనిలేదని భావము. కావఁ తగుఁ=చేయవలయును.

తా. ఓయింద్రా! ఓయగ్నిహోత్రా! ఓయమా? ఓవరుణా! మీకుబ్రహ్మకున్నంత యాయువుగల్గుగాక; యేము కలిరాజువందులము. మేమిట్లు దుర్భాషణంబులు పలుకక పోయినచో నతఁడు మమ్ము మెచ్చఁడు. అతని సంతుష్టికయి చేయుచుంటిమి కాని వేఱుకాదు. పరాధీనుల మగుమమ్ము దయార్ద్రహృదయులయి సంరక్షింపుఁడు.

సీ. వందిజాతులము మా ♦ వాచాటతాటోప
మునకు నల్గకుమయ్య ♦ యనిమిషేంద్ర
యనపరాధులము మా ♦ యందు నక్కటికంబు
పాటింపుమయ్య కృ ♦ పీటజన్మ
పరతంత్రులము మా య ♦ బద్ధవాక్యములకుఁ
దప్పపట్టకుమయ్య ♦ ధర్మరాజ
యాశార్థులము మా య ♦ హంకృతిస్ఫురణకు
నెరసు లేరకుమయ్య ♦ వరుణదేవ
తే. భయముఁగొందుము నిర్ఘాత ♦ పాతమునకుఁ
దలఁకుదుము భీషణోల్కా ప్ర ♦ దాహమునకుఁ
జంచలింతుము పటుదండ ♦ చండిమలకుఁ
బగులుదుము పాశవల్లరీ ♦ బంధములకు. 90

టీ. అనిమిషేంద్రా=ఓదేవేంద్రా, వందిజాతులము=వందిజాతికిఁజేరినవారము, మావాచాటతాటోపమునకున్=మాబహుభాషిత్వముయొక్క యతిశయమునకు, అల్గకుము, అయ్యా=కోపింపవలదు "ఓయింద్రా! మేముప్రభువున కింపగునట్లు నుతించియతని దయను సంపాదించి జీవించెడి వందులము. అట్టి మామీదఁ గోపించుట సముచితముగాదని భావము. కృపీటజన్మ=ఒయగ్నిహోత్రా, అనపరాధులము=అపరాధము లేనివారము,మాయందున్, అక్కటికంబున్=దయను, పాటింపుము, అయ్యా=ఉంపుము, ఓయగ్ని, మేమేమియు నేరముచేయనివారము, చిత్తులయి యుండుఁడు. ధర్మరాజ = ఓయముఁడా,

పరతంత్రులము=పరులకధీనమగు జీవనోపాధిగలవారము, మాయబద్ధవాక్యముల కుఁ=అసందర్భములగు మావాక్యములకు తప్పు, పట్టకుమయ్యా=నేరమెంచవద్దు. వరుణదేవ, ఆశార్థులము=ప్రభువు నపేక్షగలవారము, మాయహంకృతి స్ఫురణ కుఁ = మాయొక్క యహంకారాతిశయమునకు, నెరసులు=తప్పులు, ఏరకుమ య్యా=ఎంచవద్దు, నిర్ఘాతపాతమునకుఁ=నీవజ్రాయుధపు దెబ్బకు, భయమునొం దుము=భయపడుదుము, భీషణోల్కాప్రవాహమునకుఁ=భయంకరమైన, కట్టె నిప్పుల దహించుటకు, తలఁకుదుము=భయపడుచున్నాము, పటుదండచండిమ లకుఁ=సమర్థమగు యమదండముయొక్క తీవ్రతలకు, చంచలింతుము=వడఁకు చున్నారము. పాశవల్లరీబంధములకుఁ=లతవంటిపాశముయొక్క బంధనము నకు, పగులుదుము=వ్రయ్యలగుదుము.

తా. ఓయింద్రా! మేముస్తోత్రపాఠకులము. మాబహుభాషిత్వమునకుఁ గో పింపవలదు. నీవజ్రపాతమున కెప్పుడును భయము నొందుచుందుము. ఓయగ్ని హోత్రా! మేము నేరములేని వారము. మాయందు దయయుంపుము. లేక కో పించినచో నీయగ్నిజ్వాల కోర్వఁజాలము. ఓధర్మరాజా! మేముపరాధీనులము. మాయసందర్భ వచనములందు నేరము లెంచకుము. నీ వ ట్లెంచి కోపించితివేని తీవ్రమగు నీదండమునకు భయపడుచున్నాము. ఓవరుణదేవా! మేము ప్రభు దయనుజెందునట్లు పొగడుచున్నాము. మేమెంతమాత్రము గర్వించి యట్లుచేయ లేదు. కావున మా నేరము లెంచి కోపింపకుము. అట్లయిన నీపాశబంధనములకుఁ బగిలిపోవుదుము.

వ. అనియంజలి పుటంబులు లలాటంబున ఘటియించి యచ్చా టుకారులు, గై వారంబు లుకిగియూరకుండి రనంతరంబ.

ఆ. గగనమండలమునఁ గ్రాలాయసపుఁదేర
మాలకాకిపడగ గ్రాలియాడ
ద్వాపరంబుఁదాను దన్మధ్యవర్తి నై
వచ్చువాని నీల వర్ణ దేహు.　　　92

టీ. గగనమండలమునన్=ఆకసమునందు, కాలాయసపుఁదేరన్=ఇనుపరథమునందు, మాలకాకిపడగ = మాలకాకిచేఁ జిహ్నిత మయినధ్వజము, తూలి ఆడన్=ఆడుచుండఁగా, ద్వాపరంబును=ద్వాపరపురుషునితో, తాను=ఆకలిపురుషుఁడు,తన్మధ్యవర్తియై=ఆరథమధ్యమునఁ గూర్చుండి, వచ్చువానిన్=వచ్చుచున్నట్టివానిని, నీలవర్ణదేహున్=నల్లనిదేహచ్ఛాయగలవానిని అని ముందుపద్యముతో నన్వయము. ఇటనాత్మార్థంబగు "తాను" అనుపదము ప్రయుక్తమగుటచే సమాపక క్రియలకుఁబోలె విశేషణంబులకుఁ గూడ నేకవచనంబు వచ్చుననుట కిది యొకనిదర్శనమని యెఱుంగునది.

తా. ఆకాశమునఁ గాలాయసముతోఁ జేయఁబడిన రథమునందు మాలకాకిపడగ చలించి యాడుచుండఁగాఁ ద్వాపరునితోఁ గూడనందుఁ గూర్చుండి నల్లనిదేహముతో నొప్పుచువచ్చుచున్న కలిపురుషుని దేవతలు చూచిరని ముందు పద్యంబుతో నన్వయము.

సీ. కఱకులై పెరిఁగిన ♦ కుఱుచవెండ్రుకలతోడ
బట్టయౌదలఁ గావి ♦ పాగ యమర
నిగిడి పూతేకుబాకు ♦ గుఁగఁగ త్తిరించిన
గడ్డంబుకొనఱొమ్ము ♦ గప్పురింప
బంఢికందెనతోడఁ ♦ బ్రబలివచ్చుమై చాయ
నీలిపచ్చడముతో ♦ మేలవింప
నవరక్తచందనద్రవకల్పితం బైన
నూత్నత్రిపుండ్రంబు ♦ నొసల నొప్పఁ
తే. గోరమీసలు మిడిగ్రుడ్లు ♦ కుఱుచపొడవు
డొప్పచెవులును గొగ్గిపంక్తులును గలిగి
యున్నమద్దిగ్రిప్రుఁడై వచ్చు ♦ చున్నవానిఁ
గలిమహారాజుఁ గనిరి దిక్పాలవరులు. 93

టీ. కఱకులై=కర్కశములై, పెరిఁగినకుఱుచవెండ్రుకలతోడన్=పెరిఁగినపొ

ట్టివెంట్రుకలతోఁగూడ, బట్టయౌదలక్ = రోమరహితమగు తలయందు, కావి పాగ = ఎఱ్ఱనిపాగ, అమరక్ = ఒప్పుచుండఁగా, నిగిడి, పూఁటేకు = ప్రువ్వుటేకు వలె, బాగుగక్, కత్తిరించిన గడ్డంబు, కొనబొఁమ్ము = బొమ్ముగొనయందు, కమ్మ రింపక్ = మాయుచుండఁగా, బండికందెనతోడక్ = బండియిరుసునందు మసి తో, ప్రతివచ్చుమైచాయ = సాటివచ్చు శరీర కాంతి, నీలిపచ్చడముతోక్ = నల్లని పైవస్త్రముతో, మేళవింపక్ = కలియుచుండఁగా, నవ...కల్పితంబు—నవరక్త చందన = క్రొత్తయెఱ్ఱచందనముయొక్క, ద్రవ = రసముచే, కల్పితంబు = సిద్ధము చేయఁబడినది, ఐన, నూత్న త్రిపుండంబు = బూది మొదలగువానిలేఖలు, నొసలక్ = నుదుటిభాగమునందు, ఒప్పక్ = ప్రకాశించుచుండఁగా, కోరమీసలు = పెద్దమీ సములును, మిడిగ్రుడ్లు = ముందునకుఱికిన నేత్రములును, కుఱుచపొడవు = పొట్టిరూ పము, డొప్పచెవులును = దొన్నెలవలె నున్న చెవులు, గొగ్గిపండులును = వంకరగా నున్న పలువాలును, కలిగి, ఉన్నమద్గ్రీవుఁడై = కంఠమెత్తినవాఁడయి, వచ్చుచు న్నవానిక్, కలిమహారాజుక్, దిక్పాలవరులు, కనిరి = చూచిరి.

తా. ఇంద్రాది దిక్పాలకులు, కఱకుఱుచవెంట్రుక లచ్చటచ్చటఁగల బట్ట తలపై నెఱ్ఱని పాగ తాల్చి, కత్తిరింపు గడ్డముబొమ్మునందు వ్యాపింపఁగా బండి యిరుసుమసివంటి శరీరము పై నీలిపచ్చడము కప్పుకొని రక్తచందన ద్రవము తో మేళవించి యమర్చిన త్రిపుండ్రము ఫాలమున నతిశయింపఁగా గోరమీస ములును, మిడిగ్రుడ్లును, పొట్టికడుపును దొప్పచెవులును గొగ్గిరిపండ్లును వింత పు ట్టించుచుండఁ గంఠ మెత్తిచుక్కలు చూచుచు వచ్చిన కలిపురుషునిఁ జూచిరి.

క. హేలాబృందారకుఁ డగు
నాలవయుగరాజుఁ గాంచి నళినయనాంబుజముల్
వ్రాలిచిరి నిర్జరేంద్రులు
మాలనిఁ గనుఁగొన్నయుత్తమద్విజులక్రియన్. 94

టీ. హేలాబృందారకుఁడు = తిరస్కారపు దేవత, అనఁగా నందఱను దిరస్కరించువాఁ డని భావము. అగు నాలవయుగరాజుక్ = అయినట్టి కలి

యుగమున కధిపతియగుకలిని, కాంచి, నిర్జరేంద్రులు=ఇంద్రాదులు, మాలనిఁ= చండాలుని, కనుఁగొన్నయుత్తమద్విజులక్రియఁ = చూచినట్టి యుత్తమబ్రాహ్మణులచందంబున, నయనాంబుజములఁ=నేత్రపద్మములను, ద్రాల్చిరి; అనఁగాఁ జూడలేక పోయిరని యర్థము.

తే. ప్రౌఢగురుకోపరీఢావలీఢుఁ డయిన
యాత్రిశంకుండువోలె జంభారియెదుటఁ
గాంతిసంపదఁ గోల్పోయి కలియుగంబు
సాధ్వసాతిరేకంబున జలదరించె. 95

టీ. ప్రౌఢ...లీఢుఁడు-ప్రౌఢ=గొప్పదయిన,గురు=గురువుయొక్క,కోప=కోపముచేతనైన, రీఢ=అవమానముచేత, అవలీఢుఁడు=వ్యాప్తుఁ డయినవాఁడు, అయినయాత్రిశంకుండువోలెఁ=అయినట్టి త్రిశంకురాజువలెను, కలియుగంబు= కలియుగాధిపతి, జంభారియెదుటఁ=ఇంద్రునియెదుట, కాంతిసంపదఁ=తన కాంతి సమృద్ధిని, కోల్పోయి=విడిచిపెట్టి, సాధ్వసాతిరేకంబునఁ=భయాతిరేకముచే, జలదరించెఁ=వడఁకెను.

తా. ఇట్లు దనుక నింద్రాదులందు మిక్కిలి కోపమును, దిరస్కారమును జూపెడి కలిపురుషుఁ డింద్రాదుల సన్నిధిఁ బడఁగానే త్రిశంకువువలెఁ దన కాంతిసంపదను విడిచి భయముచే వడఁకసాగెను.

వ. ఇట్లు ప్రభావ్రాప నమ్రుఁడై ప్రణిపాతంబుచేసి. 96

తే. సేమమే నిర్జరస్వామి శిఖి సుఖంబె
శర్మమే నీకు నోయమ ధర్మరాజ
స్వస్తియే పాశహస్త మీప్రశస్తవమునఁ
దగ నపాస్తరజస్తమస్తముఁడ నయితి. 97

టీ. ఓనిర్జరస్వామి=ఓయింద్రా, సేమమే=నీకుక్షేమమే కదా! శిఖి=ఓయగ్ని, సుఖంబె, ఓయమధర్మరాజ, నీకు, శర్మమే = నీకుసుఖముగలదు గదా! పాశహస్త=ఓవరుణా, స్వస్తియే=శుభమేకదా! మీప్రశస్తవమునఁ=మీయొ

క్క-సంబంధముచే, తగన్=ఒప్పునట్లుగా, అపాస్త...తముఁడన్—అపాస్త=తొలగింపఁబడిన, రజస్తమస్తముఁడ=రజస్తమోగుణములు గలవారిలో మొదటివాఁడను, అయితిన్.

తా. స్పష్టము.

వ. దమయంతీస్వయంవరంబునకుఁ బోవుచున్నవాఁడ. కాలాతిపాతంబుగాకుండ నన్ను వీడ్కొలుపుఁడు. నామనోరథంబు సఫలం బగునట్లుగా ననుగ్రహంబు సేయుండు. మీయాశీర్వాదంబునం గృతార్థుండనై శికాధీశ్వరతనూభవ వివాహంబై మిమ్ము దర్శింపంగలవాఁడ నని పల్కుటయు. 98

క. వారన్యోన్యంబు ముఖాం
భోరుహములఁ జూచి నేత్రకములఁ జిఱునగవుల్
దేరఁగ నిట్లనిరి యహం
కారగుణాంకురితబహుళకలికిం గలికిన్. 99

టీ. వారు=ఆయింద్రాదులు, అన్యోన్యంబు=పరస్పరమును, ముఖాంభోరుహములన్=ముఖపద్మములను, చూచి, నేత్రములన్, చిఱునగవుల్=మందహాసములు, తేరఁగన్ = ప్రకాశించునట్లుగాఁజేసి, అహంకార...కలికిన్—అహంకారగుణ=దర్పగుణముచేత, అంకురిత=మొలచినట్టి, బహుళ=విస్తారములగు, కలికిన్=కలహములుగల, కలికిన్=కలిపురుషునకు, ఇట్లు, అనిరి.

తా. ఆయింద్రాదు లాకలిమాటలువిని పరస్పరముఖావలోకనము గావించి యహంకారగుణముచే బహుళములగు కలహములఁ గల్గించునట్టి కలిపురుషుం గాంచి మందహాసముచేయుచు నిట్లనిరి.

సీ. దగునయ్య కలిరాజ తగవు ధర్మము దప్పి
యాడుదె యిట్లు నీ వెయంతవాఁడు
పరమేష్ఠి నైష్ఠికబ్రహ్మచారిగ నిన్ను
నాఁ డెఱుంగఁగఁ జేసె నాఁడు తొలుత

నవకీర్ణియని నిన్నవధరించిన యప్డు
ద్రోహిఁగాఁ దలఁపఁడె ద్రుహిణుఁ డాత్మ
నీశ్వరాజ్ఞాసేతు వెట్లు దాఁటఁగ వచ్చుఁ
దదధీనులకు నన్యథాకరించి.

తే. మాకుఁ జూడంగ నిది యసమంజసంబు
మిన్న కరుగుము గాదు నీకన్న తెఱఁగు
సత్వరంబునఁ బరుల కిచ్ఛావిఘాత
మాచరింపరు కృతబుద్ధులైనవారు. 100

టీ. కలిరాజ, తగునయ్య=నీకుయుక్తమా, తగవు = న్యాయమును, ధర్మమును, తప్పి=విడిచి, నీయంతవాఁడు = నీయంతగొప్పవాఁడు, ఇట్లు=ఈవిధముగా, ఆడునే=పలుకఁదగునా, అనఁగాఁ గూడదనుట, పరమేష్ఠి = బ్రహ్మ, నిన్నున్, నైష్ఠికబ్రహ్మచారిగన్ =నియమముగల బ్రహ్మచారిగా, నాఁడు=వెనక, తొలుతన్ = నీవుజన్మించిన యనంతరమందే, ఎఱుంగఁగన్, చేసెన్ = తెలియఁజేసెను. అనఁగా నీవవతరించినకాలమందే బ్రహ్మ నిన్నుంజూచి యావజ్జీవమును బ్రహ్మచర్యము నడపుదువని చెప్పెననిభావము. నిన్నున్, అవకీర్ణియని=నశించిన బ్రహ్మచర్యవ్రతము కలవాఁడవని, అవధరించినయప్డు=విన్నప్పుడు, ద్రుహిణుఁడు=బ్రహ్మ, ఆత్మన్ =మనసునందు, ద్రోహిఁగాన్ =ద్రోహముగలవాఁడని, తలంపఁడే = యోజించుకొనఁడా! బ్రహ్మ నిన్ను బ్రహ్మచారియని నిర్దేశించె. నీవును దదనుగుణంబుగా నింత దనుక వర్తించితివి. ఇప్పుడు దమయంతిని వరించితివేని తనయాజ్ఞ మీఱినందుకై బ్రహ్మ కెంతయో కోపమువచ్చును. కాన బ్రహ్మశాసనము నతిక్రమింప రాదనిభావము. ఈశ్వరాజ్ఞాసేతువు=భగవంతుని యానతి యనెడి అనకట్టను, తదధీనులకున్ =ఆభగవంతునికి లోఁబడినవారికి, అన్యథాకరించి=భగవంతునియాజ్ఞను ధిక్కరించి, ఎట్లు, దాఁటఁగవచ్చున్ = ఏరీతిగా దాఁటఁ గలుగును. బ్రహ్మ మనకుభగవంతుఁడు; బ్రహ్మ కధీనులమయి వర్తించు మనము బ్రహ్మశాసనము నెట్లతిక్రమింపఁగలము. నీకన్న తెఱఁగు=నీవాలోచిం

చినమార్గము, కాదు, మిన్నక, అరుగుము = పొమ్ము, మాకుఁ, చూడఁ = ఆలోచింపఁగా, ఇది = నీవు దమయంతిని వరింపఁ బూనుట, అసమంజసమ్ము=అయుక్తము. కృతబుద్ధులు, ఐనవారు, సత్వరంబునఁ = బలాత్కారముగా, పరులకుఁ=ఇతరులకు, ఇచ్ఛావిఘాతము=మనోరథములకంతరాయము, ఆచరింపరు=చేయరు. బుద్ధిమంతులగువారు పరులమనోరథమున కంతరాయము కల్పింపరాదు. కాన నీమనోరథమునకు విఘ్నము గల్గించుటవలన మాకేమి ప్రయోజనము; కాని నీవామె వరింపఁదలంపును వదలుట మంచిదనిభావము.

తా. స్పష్టము.

వ. త్రిభువనానంద మాకందవాటికా వసంతం బైనయావృత్తాంతంబు సరిగడచె అచ్చోటనుండియకదా మేము మరలి వచ్చుచున్నవారము. సానురాగులగు నాగులం బరిత్యజించి, యనల్పులగు వేల్పుల నధిక్షేపించి, యసమాను లగురాజసూనులం దృణీకరించి యన్నళినాక్షి నలుండనువాని వరించె, ఏమిసేయవచ్చు. ఈశ్వరాజ్ఞ బలీయసి. నీవును మాతోడి వాఁడవకదా. మఱలి రమ్మనవుడు రోషాంధుండై యక్కలి రాజు దివిజరాజుల కిట్లనియె. 101

టీ. త్రిభువన...తసంబు—త్రిభువన=మూఁడులోకములయొక్క, ఆనంద = సంతసమనెడు, మాకందవాటికా = క్రొమ్మావితోఁటకు, వసంతంబు=ఆమనియైనది - మూఁడులోకములకు ఆనందమును బెంచునది యనుట. ఐనయావృత్తాంతంబు=అయినట్టి స్వయంవరవృత్తాంతము, సరికడచెఁ=గతించెను. అచ్చోటనుండియకదా = అకుండినపురమునుండియేకదా? మేము, వచ్చుచున్నవారము, అన్నళినాక్షి=ఆదమయంతి, సానురాగులు = తనయం దనురాగముగలవారు, అగునాగులఁ=అయినట్టి నాగకుమారులను, పరిత్యజించి=విడిచి, అనల్పులు = గొప్పవారు, అగువేల్పులఁ=అయినట్టి దేవతలను, అధిక్షేపించి=తిరస్కరించి, అసమానులు=సాటిలేనివారు, అగురాజసూనులఁ = అయినరాజకుమారులను,

తృణీకరించి, నలుండు, అనువానిన్, పరించెన్, ఏమి, చేయవచ్చున్, ఈశ్వ రాజ్ఞ=దైవశాసనము, బలీయసి=గొప్పది. తక్కినవారి బలముకంటె దైవబలము గొప్పది కనుక ఆదైవశాసనము ప్రకారముగా నే వర్తించునుగాని మనవంటివారి యిష్టము చెల్లదనుట. నీవును, మాతోడివాఁడవు = మావంటివాఁడవేకదా? మఱి, రమ్ము, అనవుడున్ = ఇంద్రాదు లిట్లు పలుకగానే, అక్కలిరాజు, రోషాంధుండై=కోపాతిశయమున గ్రుడ్డివాఁడయి, దివిజరాజులకున్ = ఆయింద్రాదులకు, ఇట్లు, అనియెన్.

గీ. పద్మజున కేమి మీ కేమి పరుల కేమి
యంగనాపరిభోగలోలాత్మకులకు
నైష్ఠికబ్రహ్మచారి నై నష్టిఁ బొంది
చేరుగడలేక కలి చెడం జెడియెఁ గాక. 102

టీ. అంగనా...త్మకులకున్ = అంగనాపరిభోగ = స్త్రీసౌఖ్యములందు, లోల=ఆసక్తిగల, ఆత్ములకున్=చిత్తములుగలవారగు, పద్మజునకున్=బ్రహ్మకు, ఏమి=ఏమినష్టము? మీకున్, ఏమి=ఏమికొఱంత, పరులకున్=లోకులకు, ఏమి=ఏమినష్టము, కలి=కలిరాజ నగు నేను, నైష్ఠికబ్రహ్మచారినై = బ్రహ్మచర్యనియమముగలవాఁడనై, నష్టిన్=సుఖనాశమును, పొంది, చెడన్=చెడినచో, చేరుగడ=దిక్కు, లేక, చెడియెఁగాక=భ్రష్టుఁడగుదు నేకాని, అనిపూర్వార్థముతో నన్వయము. ఓయీ! బ్రహ్మ నన్ను బ్రహ్మచారినిగా నిర్దేశించెననియు, నట్లె యుండవలయుననియు మీరు పలుకుచున్నారు. బ్రహ్మచారికి సౌఖ్యము లెట్లు కలుగును? భార్యాదులు లేనిచోఁ గష్టకాలమున నాకాధార మెవ్వరు. కావున నింతకాలము దాఁకను, బ్రహ్మచర్య మాశ్రయించి, యిఁక మీఁదనుగూడ నాశ్రయించి స్త్రీసౌఖ్యమన నెట్టిదియో యెఱుంగక; దిక్కులేనివాఁడయి చెడినచో, కలిరాజు చెడిపోవునుగాని సంతతమును స్త్రీసౌఖ్యము లనుభవించు బ్రహ్మకేమి పోయినది. మీకేమిపోయినది. పరులకేమిపోయినది. మీరు చక్కఁగ సుఖము లనుభవించుచుండుటవలన మీరు తక్కినవారికి శ్రీరంగనీతులు దెల్పుచుందురు. కాన యిఁక

మీమాట నటింపను. బ్రహ్మశాసనమును మన్నింపను. తప్పక దమయంతిని వరించి సుఖము లనుభవించెద ననిభావము.

వ. ఏకపత్నీవ్రతస్థు లైనమీ రేల దమయంతిం గామించిపోయితిరి. ధర్మంబు పరుల కుపదేశింపవచ్చుంగాక తమకుం జేయవచ్చునె? పోదురు గాకేమి మీయం దొక్కరుం డక్కొమ్మ వరియింపం గలిగెనే? నిషధరాజు భోజకన్యక వరియింప, మీరు లజ్జ వరియించితిరి. ఇంతియకాక యేమి? మిమ్ముం గడకంటం జూచుచు నెమ్మొగం బోరపుచ్చుచు నటఁగడచి యప్పణఁతి యెట్లుసనియె? మీ రెట్లు సహించితిరి? ఇదియ సంగతంబు. చిత్తంబులు చిలివిలిపోవ నర్రత్తి మీరు సూచుచుండ నమ్మత్తకాశిని మనుష్యు నెట్లు వరించె? మీయంత వార లపేక్షించియుండ నప్పద్మాక్షి నతిసాహసంబున నవ్వైర సేని యెట్లుచేకొనియె? అతండు చేకొనినం గొనియెఁగాక యీకృపీటయోని యతనివివాహంబునం గూటసాక్షి యై కైలాటంబు సేసి యప్పాటఁ దనకుం బెండ్లి ఘటింపం జేయ నావటం బై యుండునట్లు సేయక హుతంబెట్లు పరిగ్రహించె? మహానుభావులగు మీరు భావంబుల నిట్టి యభిమానభంగం బెబ్భంగి నంగీకరించితిరో కాని నను బోఁటి కియ్యపవాదకందళి చందురునియందుఁ గందునుంబోలె డొందంబునం బాయదు. మీయందఱ కొక్కవిన్నపంబు అనుగ్రహించి వినుండు. అవ్వసుమతీశు మోసపుచ్చి యమ్మచ్చెకంటి నెత్తుకొని మింటిమీఁదికిం దెచ్చెద. అప్పుడు మీకడగంటికింగెంపు రాదుగదా? మహాలాభంబుపట్టున నీర్ష్యారోషంబు లెట్టివారికిం బుట్టు. అనాదికాలప్రవృత్తంబు లైన రాగద్వే

షంబులు భేదింప నెవ్వరికి శక్యంబగు? అదియట్లుండె. మఱి యొక్కయుపాయం బవధరింపుఁడు. పాకశాసనుండు, పావకుఁడు, ప్రేతపతి, పాశహస్తుండు పంచముండ నైన యేను నిద్యేవురముం బాండవులు పాంచాలినిఁబోలెఁ బంచికొని యనుభవింతము గాని యప్పంకజాక్షిం బట్టికొనిపత్తునే? అని పరమకపటోపాయమాయాప్రయోగపరిపాటీపాటవంబు దేటపడ బహుప్రకారంబులం బలికిన. 103

టీ. ఏకపత్నీవ్రతస్థులు=ఒక్కభార్యతో వర్తించెదమను వ్రతమాచరించెడివారు, ఐనమీరుఁ, దమయంతిఁ, కామించి=కోరి, ఏలపోయితిరి=ఎందులకేగితిరి. ధర్మంబు, పరులకుఁ=ఇతరులకు, ఉపదేశింపవచ్చును, కాక, తమకుఁ = ఉపదేశకర్తలకు, చేయఁ, వచ్చునే? ఓయింద్రాదులారా? మీరు నన్నుంజూచి "దమయంతిని వరింపఁదగదనియు, బ్రహ్మచారివై యుండవలయుననియు" జెప్పుచున్నారు. నాకిట్టి ధర్మోపన్యాసము చేయు మీరు మీయేకపత్నీవ్రతమును విడిచి దమయంతి వరింప నేల పోయితిరి? మీరు ధర్మమాచరింప లేనప్పుడు పరుల కుపదేశింప నేల? యనిభావము. పోదురు, గాక, ఏమిఁ కామవశులగుటంజేసి ధర్మమార్గము విడిచిపోయినఁ బోవచ్చును. అందులోఁ దప్పులేదు. మీయందుఁ=మీలో, ఒక్కరుండు=ఒకపురుషుఁడును, అక్కొమ్మఁ=దమయంతిని, వరింపఁ, కల్గెనే = వరింపఁగల్గితిరా? ధర్మమును విడిచి పోయినను, నాకాంతను వరింపలేకపోయితిరి, ధర్మాతిక్రమణదోషమేకాక దమయంతి వరింపలేదన్న పరాభవముగూడ సంప్రాప్తమయినదని భావము. నిషధరాజు=నలుఁడు, భోజకన్యకఁ, వరింపఁ, మీరు, సిగ్గుఁ, వహియించితిరి. అనఁగా నలుఁడు దమయంతిని వరింపఁగా నింద్రాదులయ్యుఁ దామామెను వరింపలేమిచే సిగ్గు పొందుచున్నారని భావము. ఇంతియకాక, ఏమి=ఎంతపని వర్తిల్లెను. అప్పడఁతి, మిమ్ముఁ, కడకంటఁ, చూచుచు, జెఱ్ఱగంబోరచేయుచు, అట = మీరున్న స్థలమునుండి, కదలి, ఎట్టు, చనియెఁ, త్రిలోకాధిపతులగు

మీరచ్చట నుండఁగా మిమ్మునువిడిచి యాదమయంతి మోహోరసేసి వరింపకుండఁ బోవుట కెట్లు సాహసింపఁ గలిగెను అనిభావము. మీరు, ఎట్లు, సహించితిరి? ఆమె యట్లు సాహసించిపోవుచుండగా నున్నతప్రభావులగు మీరాదుడుకు పని కెట్లు సహించితిరి అనిభావము. ఇది, అసంగతంబు = మీరిట్లుచేయుట యుక్తముకాదు. చిత్తంబులు, జిలివిలివోవఁగా =చిన్నపోవునట్లుగా, అట్టిత్తి, మీరు, చూచుచుండఁగా, అమ్మత్తకాశిని=ఆదమయంతి, మనుష్యుఁగా, ఎట్లు వరించె, మీయంతవారలు=మీవంటి దిక్పాలకులు, అపేక్షించియుండఁగా =కోరు చుండఁగా, అవైరసేని = ఆనలుఁడు, ఆపద్మాక్షిఁగా, ఎట్లుచేకొనియె? అనఁగా దమయంతి తెలివితక్కువచే మీవంటిగొప్పవారిని విడిచితన్ను వరించిన వరిం చుఁగాక, ఆనలుఁడయినను యోజించి యాకాంత మిమ్మువరించునట్లు చేయ కుండనుండుట యతనిది పెద్ద నేరమనిభావము. అతఁడు, చేకొనియెఁగా, కాక= బుద్ధిహీనతచే నలుఁడా దమయంతినిచేకొన్నప్పటికిని, ఈకృపీటయోని = ఈయగ్నిహోత్రుఁడు, అతనివివాహంబునఁగా =ఆవివాహసమయమందు, కూట సాక్షియై = కపటసాక్షియై, కైలాటంబుచేసి = మాయోపాయముచేసి, ఆ ప్పాటఁగా =ఆపట్టున, తనకుఁగా, పెండ్లి, ఘటింపఁగా, చేయఁగా =అగునట్లుచేయు ట, ఆసటంబై =పొందికయై, ఉండు, నలదమయంతుల వివాహసమయమున నీయగ్నిగూడ సాక్షియైయుండెను గాన నప్పుడు మాయోపాయముచేసి దమ యంతిని దనకుఁ బెండ్లిచేసికోవలసినది. అట్లుచేయక = అట్లు పెండ్లియాడుట మాని, హుతంబు=వారలిచ్చిన హవిస్సును, ఎట్లుపరిగ్రహించెను. అగ్నిహో త్రుఁడు మాయోపాయముచే దమయంతిని వరించుటకు మాఱుగా హవిస్సును స్వీకరించుట మిక్కలి తెలివిమాలినపని, మహానుభావులు... పాయదు=మహాను భావులయ్యును మీరాయవమానము నెట్లుసహింపఁ గల్గితిరో కాని నావంటివాని డెందమున నాయపవాదము చంద్రునియందు మచ్చవడువున మానఁజాలదని భావము. అవ్వసుమతీశుఁగా ... తెచ్చెద = ఆనలునిమోసపుచ్చి దమయంతినాఁక సమువీదికిఁదెచ్చెదను. అప్పుడు మీకంటికిఁ గెంపురాదుగదా=అప్పుడుమీకుఁ గోపమురాదుగదా, మహాలాభంబు పట్టునఁగా = గొప్పలాభము సంప్రాప్తమై

నప్పుడు, ఎట్టివారికిన్, ఈర్ష్యారోషంబులు = అసూయయుఁ గోపంబును, పుట్టును=జనించును, అనాదికాలప్రప్రవృత్తంబులు = చిరకాలమునుండి ప్రవర్తిల్లుచున్నది. అయిన రాగద్వేషంబులు, ఎట్టివారికి, పుట్టును, పాకశాసనుండు... వత్తునే, మీరునల్వురును, నేనును గలిసియైదుగురమును, పాండవులు ద్రౌపది ననుభవించినట్లుగా ననుభవింపవచ్చును. మాయోపాయముచే దమయంతిని గొనివత్తునా! అని భావము. పరమ...పాటవంబు—పరమ=గొప్పదగు, కపటోపాయ=కపటోపాయముయొక్కయు, మాయాప్రయోగ=మాయ నుపయోగించుటయొక్క, పరిపాటీ=క్రమముయొక్క, పాటవంబు = చాతుర్యము, తేటపడన్=స్పష్టము కాఁగా, బహుప్రకారంబులన్, పలికిన౯.

ఆ. హరిహయాదివిబుధు ♦ లక్కలిమూర్ఖతా
ముఖరతావికార♦ములకు రోసి
కడఁగి పలికి రపుడు ♦ గంభీరభారతీ
భారతీవ్ర మైన♦భాషణముల. 104

టీ. హరిహయాదివిబుధులు= ఇంద్రాదిదేవతలు, అక్కలి...ములకున్ = అక్కలిరాజుయొక్క, మూర్ఖతా= మూర్ఖత్వముయొక్కయు, ముఖరతా = బహుభాషిత్వముయొక్కయు, వికారములకున్ =చెడుమార్పులకు, రోసి=అసహ్యపడి, గంభీర... తీవ్రము—గంభీర=అర్థగంభీరములగు, భారతీ=వాక్యముల యొక్క, భార=అతిశయముచేతను, తీవ్రములు=పరుషములయినవి, ఐన భాషణములన్ =అయినట్టివచనములను, అపుడు=ఆకలి యట్లు పలికినపుడు, కడఁగి= ప్రయత్నించి, పలికిరి.

తా. స్పష్టము.

సీ. అర్హమెవ్వనిరూప ♦ మంగసంభవరాజ్య
రుక్మసింహాసనా ♦ రోహమునకుఁ
గడుగునెవ్వనికీర్తి ♦ కార్తికీతిథినిశా
నాథబింబంబు నెన్నడిమికందు

భవన మెవ్వనిప్రతాపప్రదీపమునకుఁ
బుండరీకభవాండ మండలంబు
చుట్ట మెవ్వనికేలు సురభిచింతారత్న
రోహణాచలవారివాహములకుఁ

తే. గలుష మెవ్వాని దలఁచినఁ గ్రాఁగిపోవుఁ
బుణ్య మెవ్వానిఁ గీర్తింపఁ బొడవు నడయు
వాఁడు నిషధేశ్వరుండు మాకవరుసవాఁడు
కలిమహారాజ మన్నింతు గాక వాని. 105

టీ. కలిమహారాజ, ఎవ్వనిరూపము=ఏనలునియొక్క సౌందర్యము, అంగ... రోహమునకున్—అంగసంభవ=మన్మథునియొక్క, రాజ్య=రాజ్యసంబంధియగు, రుక్మసింహాసన = బంగారుసింహాసనమును, అరోహమునకున్ = ఎక్కుటకు, అర్హము=తగినదో, అనఁగా నానలునిసౌందర్యము మన్మథసౌందర్యముతో సమమయినదని భావము. ఎవ్వనికీర్తి=ఏనలునియశస్సు, కార్తికీ...కందుర్—కార్తికీతిథి=కార్తికదినములందలి, నిశానాథబింబంబు=చంద్రబింబముయొక్క, నెన్నడిమికందుర్=మధ్యభాగమునందున్నమచ్చను, కడుగున్=ప్రక్షాళించునో, నలునికీర్తిశరత్కాలచంద్రునికంటె నెక్కువ ధవళముగానున్నదనుట. చంద్రుని కళంకమును బ్రక్షాళించునని చెప్పుటచేనది నిష్కళంకమనియు నిష్కళంకమగు దానితో సకళంక మగుచంద్రబింబము సాటికాఁజాలదనియు భావము. ఎవ్వని ప్రతాపప్రదీపమునకున్ = ఏనలుని ప్రతాపమనెడి గొప్పదీపమునకు, పుండరీకభవాండమండలంబు = బ్రహ్మాండగోళము, భవనము = మందిర మగుచున్నదియో, నలునిప్రతాపము బ్రహ్మాండగోళమునంతను బ్రకాశింపఁ జేయఁ జాలినదని భావము. ఎవ్వనికేలు=ఏనలునిచేయి, సురభి . వాహములకున్, సురభి=కామధేనువునకును, చింతారత్న=చింతామణికిని, రోహణాచల=రోహణపర్వతమునకును, వారివాహములకున్ = మేఘములకున్—చుట్టము = బంధువో, అనఁగా బంధుత్వముసమానులకే యర్హము కాన యితనిచేయి వానితో బాంధవ్యము

సలుపుచున్నదనుటచే దానమందుఁగామధేన్వాదుల కెనవచ్చుచున్నదని భావము. ఎవ్వానిన్=ఏనలుని, తలఁచినన్ = స్మరించినచో, కలుషము = పాపము, క్రాఁగిపోవున్=ఇంకిపోవునో, ఎవ్వానిన్, కీర్తింపన్=నుతింపఁగా, పుణ్యము, పొడవువడయున్ = అధికమగునో, వాఁడు, నిషధేశ్వరుండు = అనలుఁడు, మాఏరుసవాఁడు = మాతోసమానుఁడు, వానిన్=ఆనలుని, మన్నింతుఁగాక = గౌరవింపవలెను.

తా. ఓకలిరాజా! ఆనలునిసౌందర్యము మన్మథునినిమించును. అతనికీర్తి శరత్కాలచంద్రబింబము కంటెను మిక్కిలితెల్లనిది. అతని ప్రతాపము బ్రహ్మాండము నంతను ప్రకాశింపఁజేయుచున్నది. అతని దానగుణము కామధేనువు, చింతామణి మొదలగువాని దానగుణముతో సమమయినది. అతనినామస్మరణము పాపములడంచును. అతని నుతించినవారికిఁ బుణ్యమలబడును. ఆనలుఁడు మాతో సమానుఁడు కాని సామాన్యుఁడుకాఁడు. కావున మావలె నానలుండును నీకుం బూజనీయుఁడు. అతనిమన్నింపవలెనుగాని యతనికి బాధలు కలిగింపవలదు.

ఉ. మచ్చికవీరసేనుని కుమారునకుం బరమోపకారికిన్
మెచ్చిజగంబెఱుంగఁదమునెయ్యపుఁజెల్లెలి నిండుకొల్వులో
నిచ్చితి మింతలోపల నెయింతటివారముఁ దప్పనేర్తుమే
యచ్చపలాక్షిఁగూఁతురతఁడల్లుఁడుమాటలు వేయునేటికిన్.

టీ. మచ్చికన్=ఆసక్తితో, పరమోపకారికిన్=గొప్ప యుపకారమొనర్చినట్టి, వీరసేనునికుమారునకున్=వీరసేనుని పుత్త్రుఁడయిన నలునకు, మెచ్చి = అతనిగుణములకు మెచ్చుకొని, నిండుకొల్వులో=పెద్దసభలో, జగంబు=లోకులందఱును, ఎఱుంగన్ = తెలియునట్లుగా, దమునెయ్యపుఁజెల్లెలిన్ =దమునిముద్దుసోదరియగుదమయంతిని, ఇచ్చితిమి=ఒసంగితిమి, ఇంతటివారము=ఇంతగొప్పవారము,ఇంతలోపలనే=ఈస్వల్పకాలములోనే,తప్పన్, నేర్తుమే=చేసినకార్యమునకువిరుద్ధముగాఁ బ్రవర్తింపఁ గలుగుదుమా, మాటలు, వేయు=వేయిపలుకులు, ఏటికిన్=ఎందులకు, అచ్చపలాక్షి=ఆదమయంతి, కూఁతురు=కుమారిక, అతఁడు=ఆనలుఁడు, అల్లుఁడు.

తా. ఓకలిరాజా! లోకులందఱకుఁ దెలియునట్లు మహాసభలోమహోప కారియయిననలుని సుగుణసంపదకు సంతసించి దమయంతి నతని కధికసంతసము తో నొసంగితిమి. అట్లిచ్చి యెంతో కాలము కాలేదు. లోకాధిపతులమని ప్రసి ద్ధికెక్కినమే మీస్వల్పకాలములోనే నీచవాక్యములువిని వారి కప్రియముచేయఁ బూనుదుమా;వట్టిమాట! వేపలుకులేల. కడమాటవినుము. ఆదమయంతి మాకుమా రికయనియు, నలుఁ డల్లుఁడనియు భావించుచున్నారము.

ఉ. ఏము నలుపురందు నెవ్వాఁడు కాఁజాలు
నిచ్చిపుచ్చుకొన్న యీాలగ్రద్ద
మాకు నింపు గావు మాను మీాసుద్దులు
కలహముల మొగంబ! కలియుగంబ. 107

టీ. కలహముల మొగంబ = కలహములకుఁ గారణమైన, కలియుగంబ=కలి యుగాధిపతీ! ఏమునల్వురందు = మానలువురయందును, ఇచ్చి = ఒరుల కర్పించి, పుచ్చుకొన్నయీాలగ్రద్ద = తిరిగిపుచ్చుకొనెడి లోభి, ఎవ్వాఁడు కాఁజాలుక్ =ఎవఁడుకాసమర్థుఁడగును, దయంతిని నలునకు మేమే మాచేతుల తో నిచ్చినవారము కాన యట్లిచ్చినదమయంతిని మగుడఁదీసికొను నంతటిలోభి వాఁడు మాలోనొకండును లేఁడనిభావము. సుద్దులు=నీచేష్టలు, మాకుక్,ఇంపు గావు=ఇష్టములుకావు. మానుమీా=విడిచిపెట్టుమా.

తా. ఓకలిరాజా! మేమే మాచేతులతో నే దమయంతిని నలునికొసంగి యిప్పుడు మగుడఁ బుచ్చుకొనునట్టిలోభి మాలో నొకండును లేఁడు. కావున నీ చేష్టలు మాకెంతమాత్రమును రుచింపవు. విడిచిపెట్టుము.

క. పామరతఁ బట్టఁ బాఱకు
పామర! కలిరాజ! నిషధపతి మదలీలా
పామరసావేశంబునఁ
బా మరవిందారిఁబట్టు బాఱినభంగిన్. 108

టీ. ఉపామర=దేవతలవంటివాఁడా, కలిరాజ, మద ... వేశంబునన్ =మద లీలా=గర్వాతిశయ మనెడి, పామ=దురదయొక్క, రస=అనుభవించుటయొక్క,ఆవేశంబునన్ =ఉద్రేకముచే, అనఁగా మదోన్మత్తుఁడవయి పాపకార్యములుచేయ నధికాసక్తి గలవాఁడవను యభిప్రాయము, పాము=రాహువు, అరవిందారిన్ =చంద్రుని, పట్టన్,పాటినభంగిన్ =పర్విడునట్లుగా, నిషధరాజున్ =నలరాజును, పామరతన్ =అజ్ఞతచే, పట్టన్, సాఁకెను=పట్టిబాధింపఁబోకుము.

తా. స్పష్టము.

క. కాలోచిత మగుకార్యం
బాలోచితముగ నొనర్పు మది మేలు విరు
ద్ధాలాపంబులు పలుమఱు
నేలా పచరింప నిపుడు హేలానిమిషా ! 109

టీ. హేలానిమిషా=విలాసముదేవుఁడా, కాలోచితము=కాలమునకుఁ దగినది,అగుకార్యంబు=అయినట్టికార్యమును, ఆలోచితముగన్ =ఆలోచనముకలుగునట్లుగా, ఒనర్పుము= చేయుము, అది=అట్లుచేయుట, మేలు = యుక్తము, ఇపుడు, పలుమఱు =అనేకపర్యాయములు,విరుద్ధాలాపంబులు=విరుద్ధములయిన వాక్యములు, పచరింపన్ =చేయుటకు అనఁగా విరుద్ధ వచనములు, పలుకుట, ఏలా=ఎందులకు ?

తా. ఓకలిరాజా! చక్కఁగ నాలోచించికాలమునకుఁ దగిన కార్య మాచరింపుము. అదిమంచిది, అంతియకాని యిప్పుడు విరుద్ధ వచనములు పలుకుటవలన నేమి ప్రయోజనము.

వ. అని తమలోన. 110

క. పోయెదరు పో యిపుడు తా
ర్క్ష్యీయాకయుగంబునుం దుకేరీయయుగంబున్
దోయి యయి నలున కుపహతి
సేయుంగా లేరు వాని శీలముకలిమిన్. 111

టీ. ఇపుడు, తార్తీయీకయుగంబున్ = మూడవయుగమయిన ద్వాపరమును, తురీయయుగంబున్ = నాల్గవయుగమగు కలియును, దోయి, యయి=జోడుగట్టి, పోయెదరు పో= వెళ్లుదురుగాక, వానిశీలము కలిమిన్ =ఆనలుని సత్ప్రవర్తన సంపదచే, నలునకున్, ఉపహతి, చేయంగాలేరు, చేయఁజాలరు. అచ్చు ప్రతులలోను, వ్రాతప్రతిలోను. 'వాదీ యీకలియుగమునుం దృతీయయుగమ్మున్' అనియు 'రాత్రీ యీకలియుగము', అనియును బాఠములు గానవచ్చుచున్నవి. అవి యనన్వితములు కావున 'నలంప్రత్యనపేతా ర్తితార్తీయీక తురీయులు' కర్తలగుచుండిరి. కాన నాల్గవ పాదములోని బహువచనక్రియతో సమముగా పోయెదరు పోయని సవరింపఁబడెను.

క. యుగశేష మశేషమహీ
జగదవనపరాయణుండు సమధిక బాహా
యుగయుగయుగపదుపార్జిత
జగతీ విజయుఁడు నలుఁడు సామాన్యుండే. 112

టీ. యుగశేషము=ఈకృతయుగపుమిగతకాలము, అశేష...ణుండు—అశేష=సమస్తమైన, మహీజగత్ =భూలోకమును, అవన=రక్షించుటయందు, పరాయణుండు = ఆసక్తిగలవాఁడును. సమధిక...విజయుండు—సమధిక=మిక్కిలి గొప్పవగు, బాహాయుగయుగ=కాఁడులవంటి బాహుద్వయముచే,యుగపత్ = ఒక్కమాఱుగా, ఉపార్జిత=సంపాదింపఁబడిన, జగతీ = భూమియొక్క, విజయుండు=విజయముగలవాఁడును, అగునలుండు, సామాన్యుండే = సామాన్యమానవుఁడా!

వ. అని వెండియు నాఖండలాదులు 'పరోక్షప్రియా దేవా' యను పురాణవచనంబు గారణంబుగా నిగూఢప్రౌఢనిజభాషణ విశేషంబున. 113

గీ. యామిత్రేతేత్యసజ్జ్ఞాన మమరశేష!
రాజసం స దిహాస్యతాం రహతమాంసి

తత్రైత్ మాగా స్త్వమితిగతో కద్వాపరేణ
రాజసం సది హాస్యతాం క్రథమ మనిరి. 114

టీ. అమరశేవ=సురలలోనీచుఁడా, తత్ర, నలునిఁబరాభవించుటకై నిషధపురమునకు, యామి=వెడలుచున్నాను, ఇతి=ఇట్లు, పలుకునట్టి జ్ఞానము, రాజసం=రజోగుణసంబంధియగునది(అనఁగా నాలోచనశూన్యమయినదనుట)సత్ = అగుచు, అసత్=అయుక్తమగుచున్నది. ఇహ=ఇక్కడనే, ఆస్యతాం=ఉందువుగాక, తమాంసి=అజ్ఞానములను, రహ=విడువుము, తత్ర=అనిషధనగరమునకు, త్వం=నీవు, మాగాః=వెళ్లకుందువుగాక, ఇతి=మాచెప్పినమాట వినకయీవిధముగా వెళ్లినచో, ద్వాపరేణ = ద్వాపరునితోఁ గూడ, రాజసంసది=నలసభయందు, ప్రథమం=ముందుగా, హాస్యతాం=పరిహాసమును, గతః=పొందుచున్నవాఁడవగుదువు. అనిరి=అనిపల్కిరి, నీవక్కడికేగినచో నలసభయందు నీవు తప్పకుండ నవమానము నొందుదువు.

వ. మఱియు బహుప్రకారంబుల బుద్ధిసెప్పియుఁ బ్రియంబువలికియు హెచ్చుకుందాడియు బృందారకులు గలిద్వాపరంబుల భూలోకగమనంబు ప్రతిషేధించిరి. ఇట్లు ప్రతిషేధించినను వారిసుభాషితంబులు పెడచెవులంబెట్టి మోహకంబును సాహసంబును, మదంబును,. నసూయయు, నవివేకంబును దనకు నైజ గుణంబులగుటం గలియుగంబు కరయుగంబు మొగిచి యిట్లనియె. 115

టీ. మఱియున్, బహుప్రకారంబులన్=అనేకరీతుల, బుద్ధి, చెప్పియున్, ప్రియంబు=హితము, పలికియున్=హితోపదేశముచేసియు, హెచ్చుకుందు=ఎక్కువతక్కువలు, ఆడియున్=చెప్పియు, బృందారకులు=ఇంద్రాదులు, కలిద్వాపరంబుల భూలోకగమనంబు=కలిద్వాపరయుగములుభూలోకమున కరుగుటను, ప్రతిషేధించిరి=వలదనివారించిరి. ఇట్లు, ప్రతిషేధించినను=వద్దనివారించినను, వారిసుభాషితంబులు=ఇం[illegible] పెడచెవులన్, పెట్టి=

చెవులం జొరనీయక, అనఁగా వినక, మోఱకఁబును=మూర్ఖతయు, సాహసంబును, మదంబును=గర్వఁబును, అసూయయుఁ=గుణములందలి దోషముల నెంచుటయు, అవివేకంబును=అజ్ఞతయు, తనకుఁ = ఆకలి పురుషునకనుట, నైజగుణంబులు=స్వభావసిద్ధ గుణములు, అగుటఁ=అవుటంబట్టి, కలియుగంబు, కరయుగంబుఁ=రెండుచేతులను, మొగిచి=మోడిచి, ఇట్లు, అనియెఁ.

ఉ. వేలుపులార మీకుఁ బదివేలనమస్కృతులాచరించెదఁ
మేలుదలంపుఁడే నవని మీఁదఁ జరించెదఁ గొంతకాలము
ద్వేలత నెవ్వఁడే నొకఁడు దేశములోన నధర్మవర్తియై
వ్రాలినవాఁడు లేఁడె పలుకవఁకలునారసి చూడవచ్చినన్.

టీ. వేలుపులార=ఓదేవతలారా! మీకుఁ, పదివేలనమస్కృతులు, ఆచరించెదఁ=చేసెదను, మేలు=నాశ్రేయస్సును, తలంపుఁడు = కోరుచుండుఁడు, ఏను, అవనిమీఁదఁ=భూలోకమందు, కొంతకాలము, చరించెదఁ=వర్తించెదను, దేశములోనఁ=భూమియందలి దేశములలో, ఎవ్వఁడేని, ఒకఁడు=ఎవఁడయిన నొకపురుషుఁడు, ఉద్వేలతఁ=మర్యాదల నతిక్రమించుటచే, అధర్మవర్తియై=అధర్మమందు వర్తించుచున్నవాఁడై, వ్రాలినవాఁడు = గర్వించినవాఁడు, పలువంకలు ఆరసి, చూడఁ,వచ్చినఁ=అంతటను వెదుకగా, లేఁడె= లేఁడా, ఉండకపోఁడని భావము.

తా. ఓయింద్రాది దేవతలారా! మీకు పదివేల దండములు పెట్టెద, నాకు శ్రేయస్సు గలుగున ట్లాశీర్వదింపుఁడు. నేనుగొంతకాలము భూలోకంబున సంచరించెదను. భూలోకమున గర్వాతిశయము గలవాఁడయి ధర్మమర్యాదల నతిక్రమించిన వాఁడొకఁడయిన నుండఁడా? ఉండకపోఁడు. అట్టివాని నాశ్రయించి భూమియందుఁ బ్రవేశించెదను.

తే. వానిదుర్వృత్తి నెపముగా వసుధ యేలు
నలునిపైఁ బ్రత్యవాయంబు గొలుపువాఁడఁ

గొలిపి యతనిఁ బ్రవేశించి కే నిలుచువాఁడ
నిలిచి యాతని మననీక కే యలఁచువాఁడ. 117

టీ. వానిదుర్వృత్తినెపముగాన్ =ఆయధర్మపరుని దుర్వ్యాపారముమిషచే, వసుధన్, ఏలునలునిపైన్ =ఏలునట్టి నలచక్రవర్తిపై, ప్రత్యవాయంబు= దోషమును, కొలుపువాఁడన్ =కలిగించువాఁడను, కొలిపి=కలిగించి, అతనిన్, ప్రవేశించి=అనలునినావహించి, నిలుచువాఁడన్ =స్థిరముగా నుండువాఁడను, నిలిచి, ఆతనిన్, మననీక=బ్రదుకనీయక, అలఁచువాఁడన్ =బాధించువాఁడను.

తా. ఆదుర్మార్గుని నెపమున నలునిపై దోషములు పన్నెదను. పన్నితన్మూలమున వాని నావహించెదను. ఆవహించి వాని బ్రదుకనీయక బాధించెదను.

మ. వినుఁడీనాదు ప్రతిజ్ఞ వేల్పులు జగ ద్విఖ్యాతచారిత్రు నా
తని నేఁబట్టెద నెద్దియేని యొకరంధ్రం బబ్బెడుం గాక యే
నను వేలంబును గొల్చు దేవతలు తా కేలా యేమి యానంతద
ప్పనయినఁ గలి సొచ్చుఁ గాసి మెయిమైఁ బోనిచ్చునే యెవ్వరిన్.

టీ. వేల్పులు=ఓదేవతలారా! నాదుప్రతిజ్ఞన్, వినుఁడీ, జగద్విఖ్యాతచారిత్రున్ =జగంబునఁ బ్రఖ్యాతిగాంచిన ప్రవర్తనముగల, ఆతనిన్ =అనలుని, నేన్ పట్టెదన్ =లొంగఁదీసికొనియెదను. ఏను, అనువేలంబును=ప్రతిదినంబును, కొల్చుదేవతలు=కొల్చునట్టి దేవతలు, తాలా? ఏమి=మాహాత్మ్యశూన్యములయిన, గులకతాలయియుందురా? అనఁగా వారు ప్రభావశూన్యులయియుండరనియు వారియనుగ్రహంబునన్, ఎద్ది, ఏని, ఒకరంధ్రంబు = ఏదయిన నొకసందు, అబ్బెడున్, కాన=కలుగునుగాక, నాకొల్చిన దేవతలయనుగ్రహంబువలన నాకుఁ బ్రవేశింపఁదగిన యవకాశమెద్దియైన లభించుఁగాకయని భావము, కలి=కలిరాజు, ఆనంతతప్పునన్, ఐనన్ = ఆవగింజంత నేరమున్నప్పటికిని, చొచ్చున్ కాక=ప్రవేశించును, కానిఎవ్వరిన్ = ఎంతగొప్పవారినైనను, మెయిమైన్ = ప్రాణములతో, పోనిచ్చునే=పోనిచ్చునా? అనఁగాఁ బోనీఁడని భావము.

తా. ఓదేవతలారా! ఇదే నాప్రతిన వినుఁడు. ప్రసిద్ధచరిత్రుఁడగు నలుని

నాపహించెదను. దైవానుగ్రహమువలన నాకతనియందుఁ బ్రవేశింపఁదగిన సందు లభింపకపోదు. ఆవగింజంత యవకాశము దొరకినను గలి నలునియందుఁ బ్రవేశింపఁగలఁడు. కలియెంతవారినైన నూరకపోనీయఁడు.

తే. ఆవగింజలు తాటికాయలుగ నాడి
దొడ్డ సేయుదు సన్నంపు దోసమైన
హరిహరబ్రహ్మ లైన నాకంతవారె
కపటమాయేంద్రజాలాది కౌశలమున. 119

టీ. ఆవగింజలు=ఆవగింజలంతలేసి నిందా వాక్యములను, తాటికాయలుగన్ =తాటికాయలంత పెద్దవిగా, ఆడి=పలికి, సన్నంపుదోషము=చిన్నదోసము, ఐనన్ =అయినప్పటికిని, దొడ్డ సేయుదున్ =గొప్పదానిగాఁ జేయఁగలుగుదును, కపట...కౌశలమునన్ —కపట=వంచనము, మాయా=మోసము, ఇంద్రజాలము, ఆది=మొదలయిన విద్యలందలి, కౌశలమునన్ =నేర్పుచే, హరిహరబ్రహ్మలు = విష్ణువు, శివుఁడు బ్రహ్మ యయినను, నాయంతవారె=నాయంత గొప్పవారా? అనఁగాఁ గారనుట.

తా. ఓయింద్రాది సురులారా! చిన్నచిన్న వాక్యములను నామాయాబలము చేఁ బెద్దపెద్ద వానిఁగాఁ గల్పించిపలికి చిన్నదోషమునైనను గొండంతదోసము గాఁజేయుదును. కపటము, ఇంద్రజాలము మొదలగు విద్యలందు, నాకు బ్రహ్మాదులయిన సములుగా నేరరు.

క. కాదంబరిఁ ద్రావింతును
జూదం బాడింతు నలలఁ జొక్కులఁ బెట్టం
బైదలుల నియోగింతును
వైదర్భతనూజ విడిచి వల పుడిగింతున్. 120

టీ. నలునిచే "అనుపదమధ్యాహార్యము" కాదంబరిన్ =కల్లును, త్రావింతున్ =త్రాగునట్లు చేయుదును, జూదంబు, ఆడింతున్ =ఆడునట్లు సేసెదను, నలలన్ =మాయలచేత, జొక్కులన్ బెట్టన్ =మోహింపఁ జేయుటకు, పైదలు

లక్ = స్త్రీలను, నియోగింతును=పంపుదును, వైదర్భతనూజమీఁదివలపుల్ = దమయంతియందలి ప్రేమమును, ఉడిగింతుర్=తొలంగునట్లు చేసెదను.

తా. స్పష్టము.

తే. వేయు మాటలవేల యోవిబుధులార
యవధరింపుఁడు నిజము మీయడుగులాన
భైమితో భూమితోఁ బెడఁబాపువాఁడ
నిమిషమాత్రంబునంద యానిషధపతిని. 121

టీ. ఓవిబుధులార=ఓయింద్రాదులార, వేయుమాటలు, అవి, ఏల=ఎందులకు, మీయడుగులాన=మీపాదసాక్షిగాఁ జెప్పెదను, నిజము=సత్యమును, అవధరింపుఁడు=ఆలకింపుఁడు, నిమిషమాత్రంబునంద=అప్పపాటుకాలములోనే, ఆనిషధపతిని=ఆనలరాజును, భైమితోన్=దమయంతితోను, భూమితోన్=భూమండలముతోను, పెడఁబాపువాఁడన్=ఎడఁబాపెదను.

తా. ఓయింద్రాదులారా! వేయుమాట లెందులకు? మీపాదసాక్షిగా సత్యము చెప్పెదను వినుండు, నిమిషకాలములోనే యానలుని దమయంతితో వియోగము పొందునట్లుగాను రాజ్యభ్రష్టుఁడగునట్లుగాను జేసెదను.

వ. అని పలికిన నెమ్మనంబులం గుత్సించుచు నతనియుత్సాహంబు దైవకల్పితంబు గావున నన్యథాకరింప నలవిగాక నాకప్రముఖు లగుబర్హిర్ముఖు లన్యోన్యముఖావలోకనంబు సేసి మనకుం గలిరాజుతోడ సంవాదం బింతియ చాలు తమ్ముండు నన్నయు నగు కలిద్వాపరంబులు బ్రహ్మలోకంబునుండి యాబ్రహ్మనియోగంబునఁ బోవుచున్నవారు గావలయు. పాఱెడు నీళ్లకుం గట్టపెట్టం బనియేమి? పోదండుపోదండని పోయిరి. కలియును గామక్రోధలోభమోహపరివారపరివృతుం డై నిషధదేశంబుచాయన భూమండలంబునకు డిగ్గి వచ్చెను. 122

టీ. అనిపలికినన్ = కలియట్లుపలుకఁగా, నాకప్రముఖులు=ఇంద్రుఁడు మొదలగువారు, అగుబర్హిర్ముఖులు=అయినట్టిదేవతలు, నెమ్మనంబులన్ = తమమనస్సులందు, కుత్సించుచున్ = నిందించుచు, ఆతనియుత్సాహంబు = ఆకలియొక్క ప్రయత్నము, దైవకల్పితంబు, కావునన్, అన్యథాకరింపన్ = తిరస్కరించుటకు, అలవికాక, అన్యోన్యముఖావలోకనంబు=పరస్పరము ముఖములను జూచికొనుటను, చేసి, మనకు...చాలున్ = కలిరాజుతో నిప్పుడు చేసిన సంభాషణము చాలును, తమ్ముండును, అన్నయు, అగు కలిద్వాపరంబులు, బ్రహ్మలోకము నుండి...పోవుచున్నవారు=బ్రహ్మయాజ్ఞ తలఁదాలిచి సత్యలోకమునుండి పోవుచున్నవారు, కావలయున్ = అయియుండవచ్చును, పాఱెడు...ఏమి = ప్రవహించునీళ్లకుఁ గట్టఁగట్ట శక్యంబుకాదు. పోదండు, పోదండు,అని, పోయిరి. కలియును, కామ...వృతుండై— కామము,క్రోధము, లోభము,మోహములను, పరివార=పరిచారకులతో, పరివృతుండై=ఆవరింపఁబడి, నిషధదేశంబుచాయన= నిషధదేశమువైపుగానే, భూమండలమునకున్, డిగ్గెన్, అప్పుడు.

సీ. హోమాజ్యగంధోర్మి • కుద్వేగ మొందుచుఁ
 గ్రతుధూమములచేత • గాసిపడుచు
నతిథిపాదక్షాళ • నాంభఃప్లుతము లైన
 గృహమేధిమందిర • క్షితితలముల
జీరువాఱుచుఁ బూర్త • శిశిరానిలంబులఁ
 జలివట్టి వణఁకుచు • సవనశుష్మ
పుటపాకముల వెక్కఁ • బురపురం బొక్కుచుఁ
 బశుబంధములఁ జూచి • భయముపడుచు
తే. వ్రతులబృసులకు యతికోటి • రాంభములకు
బ్రహ్మచారులయాషాఢ • పంక్తులకును
నంతరంగంబులో నాత్మ • హానన శంక
తరతరమ యుద్భవిల్లఁగఁ • దల్లడిలుచు. 123


57

టీ. (అవతారిక) కలిపురుషుఁడు తనపరివారముతో నిషధప్రాంతమునకు వచ్చియు నందుఁ బ్రవేశింపలేకుండెనని చెప్పుచున్నాఁడు. కలి, అనుపదము (అధ్యాహార్యము) హోమాజ్యగంధోర్మికిన్ - హోమాజ్య=హోమపు నేతిసంబంధి యగు, గంధ=పరిమళముయొక్క, ఉర్మికిన్ = తరంగమునకు, ఉద్వేగము= భయము, ఒందుచున్=పొందుచు, క్రతుధూమములచేతన్ = యజ్ఞసంబంధి యగుపొగచేత, గాసిపడుచున్ = బాధనొందుచు, అతిథి... ప్లుతములు—అతిథి=అతిథులయొక్క, పాదక్షాళన = కాళ్లుకడుగుటకుఁ బోసిన, అంభః= నీటిచే, ప్లుతములు = తడిసినవి, ఐనగృహమేధి మందిరక్షితితలములన్=అయి నట్టి గృహస్థులయొక్క యింటివాకిళ్లయందు, జీరువాఱుచున్ = జాఱిపడుచు, పూర్తశిశిరానిలంబులన్—పూర్త = ధార్మికులు నిర్మించిన వాపీకూప తటాకా దులనుండి వచ్చెడి, శిశిరానిలంబులన్ = చల్లనిమారుతములచే, చలిపట్టి=చలి గొని, వణఁకుచున్ = కంపమునొందుచు, సవన...యుక్కన్—సవనశుష్మ= యాగాగ్నిసంబంధియగు, పుటపాకములు=రెండుప్రక్కలందును గలిగెడి తాప ములయొక్క, వెక్కన్=వెట్టచే, పురపురన్, పొక్కుచున్=దుఃఖించుచు, అనఁగా నిషధదేశమందు యాగములు బహుళముగాఁ బ్రవర్తిల్లుటంజేసి యు భయపార్శ్వములందును వహ్నితాపము మిక్కిలి పీడించుచుండఁగాఁ గలి సహింపలేక దుఃఖము నొందుచుండెననిభావము. పశుబంధములన్=యాగపశు వులను బంధించుటలను, చూచి, భయము, పడుచు, వ్రతులబృసులకున్=మునీ శ్వరుల దర్భాసనములకు, యతికోటిరాంభములకున్=యతీంద్రులవెదురుకఱ్ఱ లకును, బ్రహ్మ...పంక్తులకును=బ్రహ్మచారులమోదుగు దండములవరుసలకును, అం తరంగంబులోన్=మనస్సులో, ఆత్మహననశంక=తాను జచ్చునేమోయని సందే హము, తరతరమ=క్రమముగా, ఉద్భవిల్లంగన్=కలుగఁగా, తల్లడిలుచున్= భయమునొందుచు, వేదాధ్యయనములచేతను, వ్రతములచేతను, యోగముల చేతను, బ్రహ్మచర్యాదివర్ణాశ్రమధర్మములచేతను, బరమపవిత్రులయినవారిని స మీపించినచోఁ దనప్రాణంబులు వోవునేమోయని మనమున భయమందుచు దూరముగాఁ దొలఁగిపోవుచుండెను. ఈచెప్పుటచే నిషధదేశము యాగాదులచే సమృద్ధమయుండుటచేఁ గలికిఁ బ్రవేశింప నలవికాకుండెననిభావము.

తా. కలి తన పరివారముతో నిషధదేశముపంక వచ్చెను. కానియందుఁ బరమపవిత్రములగు కార్యములు ప్రవర్తిల్లుచుండుటచే నెచ్చటను గాలూనుట కవకాశములేదు. అందువాఁడు యాగములు జరుగుచుండు ధూమములనుజూచి భయపడుచుండెను. క్రతుధూమములచే గాసిచెందుచుండె. అతిథుల పాదప్రక్షాళనార్థముపోసిన జలముచేఁ దడిసిన గృహస్థులగృహాంగణములందు జాఱిపడుచుండెను. ధార్మికులు త్రవ్వించిన తటాకాదులందలి చల్లనిగాలులకు వడంకుచుండెను. ఉభయపార్శ్వముల వర్తిల్లు యాగములందలి యగ్నితాపమునకు దుఃఖించుచుండెను. పశుబంధములఁజూచి తన్నుఁగూడ నట్లు బంధింతురేమో యని భయపడుచుండె. దర్భాసనములను, యతీశ్వరులవెదురుఁగఱ్ఱలను, బ్రహ్మచారుల దండములను జూచి తనకుఁ బ్రాణాపాయము గల్గునేమోయని మనమున భయపడఁ జొచ్చెను.

సీ. సవనయూపస్తంభ సంభారములఁ జూచి
శూలంబులో యని స్రుక్కి స్రుక్కి
భూదేవనిటలోర్ధ్వ పుండ్రంబు లీక్షించి
ఖడ్గంబులో యని కలఁగి కలఁగి
బ్రహ్మచారి జనోత్కరంబు మౌంజులు సూచి
పాశంబులోయని భ్రమసి భ్రమసి
యధ్వరస్రుజ్జిహ్మకా యంబు లాలోకించి
యురగంబులోయని యులికి యులికి.

తే. విప్రనికరం బనుష్ఠాన వేళలందుఁ
బాణిపంకేరుహోదరా భ్యంతరమున
నిలిచి యెత్తిన యాచమ నీయ తీర్థ
జలము శాపోదకం బని యలికి యలికి. 124

టీ. (అవ) కలి చండాలరూపుఁడుకాన యజ్ఞాదిసత్కార్యములందలి సంభారములు వానికి భయంకరములై యుండెనని చెప్పుచున్నాఁడు... 

భారములన్ — సవన=యజ్ఞమందలి, యూపస్తంభ=చంద్రమొదలయిన యూపస్తంభములయొక్క, సంభారములన్ = సమృద్ధులను, చూచి, శూలంబులో= శొల్లులేమోయని, స్రుక్కి, స్రుక్కి = మిక్కిలిజంకి, యూపస్తంభములు వానికి భయంకరశూలములవలెఁ గానవచ్చుచుండెనని భావము. భూదేవ...పుండ్రంబులు—భూదేవ=బ్రాహ్మణులయొక్క, నిటల=నుదుటియందున్న, ఊర్ధ్వపుండ్రంబులు=విబూదిరేఖలు, ఖడ్గంబులో యని=కత్తులేమోయని, కలఁగి, కలఁగి= మిక్కిలికలఁతచెంది, బ్రహ్మచారిజనోత్కరంబు మౌంజులు=బ్రహ్మచారులు మొలలందుఁదాల్చిన ముంజగడ్డితో నల్లినత్రాళ్లను, చూచి, పాశంబులు ఓ, అని= పాశములనెడి బంధనవిశేషము లేమోయని, బ్రమసి, బ్రమసి = మిక్కిలియు భ్రాంతిచెంది, అధ్వర...కాయంబులు—అధ్వర=యాగములందలి, స్రుక్= సర్పాకృతిగాఁ గట్టతోఁ జేయఁబడిన హోమసాధనములను, ఆలోకించి = చూచి, ఉరగంబులో=సర్పములేమోయని, ఉలికి, ఉలికి = మిక్కిలి త్రుళ్లిపడి, విప్రనికరంబు=బ్రాహ్మణసమూహము, అనుష్ఠానవేళలందున్ = నిత్యకర్మాచరణకాలములందు, పాణి...తరమునన్—పాణిపంకేరుహ = పాణిపద్మములయొక్క, ఉదరాంతరమునన్ = మధ్యప్రదేశమునందు, నిలిచి = నిలువఁబడి, ఎత్తిన, ఆచమనీయతీర్థజలము = తీసికొన్న యాచమనము కొఱకయిన జలము, శాపోదకంబని=శాపమిచ్చుటకు వసలుచున్న జలమేమోయని, అలికి, అలికి= మిక్కిలిభయపడి, సంధ్యాదిసమయములందు బ్రాహ్మణోత్తము లాచమనము చేయు జలము చేతులోనుంచుకొని నిలిచి జపించుచుండ నది కలి శాపమొసఁగఁ బట్టిన జలమని మనంబున భయపడెనని భావము.

తా. కలిపురుషుఁడు యాగార్థము కొనివచ్చిన యూపస్తంభంబులనుగాంచి తన్నుఁ జంప సమకూర్చిన శూలము లేమోయని భావించి మిక్కిలి జంకుచుండెను. బ్రాహ్మణులు నుదుటఁబెట్టిన బూదిరేక లాకలికి ఖడ్గములవలె భయము గొలుపుచుండె. బ్రహ్మచారుల మొలలందున్న మౌంజీబంధములు పాశంబులవలె భీతి గలిగించెను. అధ్వరములందు హోమసాధనములగు దారుమయములగుస్రుక్కులు సర్పములవలెఁ గానవచ్చుచుండెను. బ్రాహ్మణులు సంధ్యాసమ

యములందు హస్తములందుఁ దాల్చిన జలము శాపోదక మేమోయని భయము గొనుచుండెను.

సీ. ఆత్మఘాతకుఁ జూచి హర్షింపఁగా నేల
యతఁడు సర్వస్వార యజ్ఞకర్త
బ్రహ్మఘ్నుఁ గని యేల పరితోషమందంగ
నాతఁడు సర్వమేధాభిరతుఁడు
బ్రహ్మచారిత్వరీ రతి కేల మోదింప
నది మహావ్రత దీక్షకంగకంబు
విప్రులమధుపాన విధి కేల యలరంగ
సౌత్రామణేష్టి యాజకులు వారు
తే. ధూళిధూసరుఁ బరికించి యేల నిక్క
పావనస్నానవిధిమృదా భవ్యుఁ డాతఁ
డనుచు మూఁడవయుగము దన్నచట నచట
భ్రాంతి దీర్పఁగ గతిలేక భంగపడుచు. 125

టీ. (అవ) ఇందుఁగలితనకాశ్రయముగలుగుచున్నదని భ్రమచెందిసంతసించుచుండఁగా, ద్వాపరుఁడువాని భ్రాంతిని దొలఁగించుచున్నాఁడు. ఓకలిరాజా, (అనుపదమధ్యాహార్యము) నీవు, ఆత్మఘాతకున్ = తన్నుఁదాఁజంపుకొన్నవానిని చూచి, హర్షింపన్ = సంతసించుట, ఏల? అతఁడు = అట్లాత్మహత్యచేసికొన్నవాఁడు, సర్వస్వారయజ్ఞకర్త = సర్వస్వారమనెడియజ్ఞమును జేసినవాఁడు, అనఁగా నీవాత్మహత్యచేసి కొన్నవిప్రుంగాంచి యాశ్రయములభించెనని సంతసించుచున్నావు. కాని యావిప్రుఁడు సర్వస్వారమను యజ్ఞమునుజేసి తన్నాహుతిగాఁ జేసినపుణ్యాత్ముఁడు. అంతియకాని నీవనుకొన్నట్లు పాతకిగాఁడని భావము. బ్రహ్మఘ్నున్ = బ్రాహ్మణునిఁజంపినవానిని, కని, సంతోషము, అందంగన్, ఏల = సంతసించుటయెందులకు, ఆతఁడు, సర్వమేధాభిరతుఁడు = సర్వమేధమనెడి యజ్ఞమందాసక్తు [illegible] బ్రహ్మ [illegible] హాపా

తకుఁడని తలంచివానినాశ్రయించి యిందుఁ బ్రవేశింపఁగలనని సంతసించుచున్నా
వు. కాని యతఁడు నీవనుకొన్నట్లు పాపాత్ముఁడు కాఁడు, వాఁడు సర్వమేధమ
నుయాగమును జేయఁదలంచి"బ్రాహ్మణో బ్రాహ్మణమాలభేత" యనెడి శ్రుతిప్ర
కారము బ్రాహ్మణుని జంపెనుగాని యకారణముగాఁ జంపలేదు. అతఁడు
యాగార్థము చంపుటచే నెంతమాత్రమును పాపాత్ముఁడు కాఁడని భావము.
బ్రహ్మచారీత్వరీరతికిన్ = బ్రహ్మచారియును, జారిణియునగల్పెడి సంభోగమునకు,
మోదింపన్, ఏల = మోదించుటయెందులకు, అది = ఆబ్రహ్మచారి జారిణీసమాగమ
ము, మహావ్రతదీక్షకున్ = మహావ్రతమనెడి యజ్ఞమునకు, అంగకము = అంగమై
యున్నది. ఓకలిరాజా! బ్రహ్మచారి జారిణితో సంభోగించుటంజూచి, యది
పాతకమనియు, దాని ననుసరించి నీవిందుఁ బ్రవేశింపవచ్చుననియుఁ దలంచు
చున్నావు కాని నీమనోరథము విఫలమయ్యె. వారట్లు చేయుట మహావ్రతమ
నెడియజ్ఞమును బూర్తిగావించుటకే కాన యది పుణ్యమే కానిపాపము కాద
నియు, దానివలన నీకుఁ బ్రవేశింపనవకాశము లేదనియుభావము. విప్రులమధు
పానవిధికిన్ = బ్రాహ్మణులు మద్యపానము చేసినందులకు, అలరఁగన్, ఏల =
సంతసించుట యెందులకు? వారు = ఆమద్యపానము చేసెడి బ్రాహ్మణులు,
సౌత్రామణేష్టియాజకులు = సౌత్రామణియను నిష్టినిజేయువారు. నీవు మద్య
పానము చేయు బ్రాహ్మణులను జూచి తన్మూలమునఁ బ్రవేశింపవలెనని చూ
చుచున్నావు కాని. "సౌత్రామణ్యాం సోమగ్రహాంశ్చ సురాగ్రహాంశ్చ
గృహ్ణాన్తి" యనెడి శ్రుతిప్రకారము సౌత్రామణీష్టి చేయువారు సురాపా
నము చేయవచ్చును. కావున వానిమూలమున నీవు ప్రవేశింప వలను పడదని
భావము. ధూళిధూసరున్ = బూడిదచేఁగప్పఁబడినవాని, పరికించి = చూచి,
నిక్కన్, ఏల = ఎగిరిపడుట యెందులకు, అతఁడు = వాఁడు, పా
వన...భవ్యుఁడు — పావన = పవిత్రమైన, స్నానవిధిమృదా = స్నానకర్మపు
మట్టిచే, భవ్యుఁడు = శుభప్రదుఁడయినవాఁడు, ఓకలిరాజా! ఒంటిపైబూది
నలందుకొన్న వారినిగాంచి, వారుమలినులనియు, వారిమూలమునఁ బ్రవే
శింపవచ్చుననియుఁ [illegible] మాత్రమై భూతి ధరిం

-చినవారు. కాని నీవన్నట్లు మలినులు కారని తెలియుమనిభావము. అనుచున్, మూడవయుగము=ద్వాపరయుగము, తన్నున్ = కలియుగముననుట, అచట, చటన్, భ్రాంతిన్, తీర్పఁగన్ = కలిరాజుభ్రమను దొలంగించుచుండఁగా, గతి, లేక=దిక్కులేక, భంగపడుచున్=భంగపాటునుజెందుచు, అనిపైపద్యముతో నన్వయము.

వ. నిషధదేశంబులోఁ జనువాఁడు మఱియును. 126

తే. స్నాతకుల ఘాతుకులఁగాఁగ సంస్మరించి
    నహితులకుఁబోలె వెఱచు నగ్న్యాహితులకుఁ
    దలఁచు దాంతుఁ గృతాంతుఁగాఁ గలియుగంబు
    మానితం బైనయమ్మహీమండలమున. 127

టీ. మానితంబు=పూజ్యమైనది, ఐనయమ్మహీమండలమునన్ = అయినట్టియానిషధదేశమునందు, కలియుగంబు, స్నాతకులన్ = విద్యాస్నాతకులు మొదలగువైదికులను, ఘాతుకులన్ కాఁగన్ = మారకులనుగా, సంస్మరించి=తలంచుకొని, అగ్న్యాహితులకున్=ఆహితాగ్నులకు, అహితులకుఁబోలెన్=శత్రువులకువలె, వెఱచున్ = భయపడును, దాంతున్ = ఇంద్రియనిగ్రహముగలపూజ్యుని, కృతాంతుఁగాన్=యమునిఁగా, తలంచున్=భావించుచుండును.

తా. ఆకలిరాజు నిషధదేశమున సంచరించుచు స్నాననిష్ఠులు మారకులనియు నాహితాగ్నులు శత్రువులనియు, దాంతుఁడు యముండనియు భావించుచుండెను.

సీ. బౌద్ధులఁ బొటించుఁ బరమబంధులఁబోలెఁ
        జార్వాకులకుఁ గరాంజలి ఘటించు
    జైనులం బొడగన్న సంతోషమునఁ దేలు
        జే యని మ్రొక్కుచుఁ జెలఁగి నవ్వు
    వైతండికుల కభివాదనం బొనరించుఁ
        బాషండులకుఁ జాలశోభ కిఁ జేయుఁ

గాపాలికులకు సత్కారంబు గావించుఁ
బరిచయించును దిగంబరులతోడఁ
తే. బాశుపతకక్షపాలికాభస్మధూళి
పాళి యుద్ధూళనక్రియావేళయందు
గాలివెంబడిఁ బైరాలఁ గళవళించుఁ
గలియుగము పావకస్ఫులింగమ్ము లనుచు. 128

టీ. కలియుగము,(కర్త) బౌద్ధులన్ =బౌద్ధమతమువారిని, పరమబంధులన్, పోలెన్ =నచ్చినచుట్టములనువలె, పాటించున్ =గౌరవించుచుండును, చార్వాకులకున్ =నాస్తికులకు, కరాంజలిన్ = చేమోడ్పును, ఘటించున్ =చేయును, అనఁగా నమస్కరించుననుట, జైనులన్ =జైనమతస్థులను, కన్నన్ = చూచినచో, సంతోషమునన్, తేలున్ =పొంగిపోవును. చెలఁగి=అతిశయించి, జేయని మ్రొక్కుచున్, నవ్వున్, వైతండికులకున్ = వితంతావాదముసల్పువారలకు, అభివాదనంబు=నమస్కారమును, ఒనరించున్ =చేయును, పాషండులకున్ = పాషండమతమువారికి, చాలన్, భక్తి, చేయున్ =భక్తి చూపును, కాపాలికులకున్ =కాపాలికమతమువారికి, సత్కారంబును = సమ్మానమును, కావించున్ =చేయును, దిగంబరులతోడన్ = దిగంబరులైవర్తించువారిలో, పరిచయిను చేయును, పాశుపత...పాళి—పాశుపత=పాశుపతవ్రతమాచరించుశైవుల యొక్క, కక్షపాలికా=సన్యాసులు ధరించునొకదినుసు సంచియందున్న, భస్మధూళిపాళి=భూతిసమూహముయొక్క, ఉద్ధూళనక్రియావేళలందున్ =ఒడలికిఁబూసికొనెడిసమయమందు,గాలివెంబడిన్ =వాయువశమున, పైని=తనమీఁద, రాలన్ =రాలినచో, పావకస్ఫులింగంబులు=అగ్నిహోత్రకణములు, అనుచున్, కళవళించున్ =తొట్రుపడుచుండును, కలి, బౌద్ధజైనకాపాలికచార్వాకాదిమతములవారి నెక్కుడుగా గౌరవించిసంతసించుచుండెననియు, శైవులుశరీరమునిండ బూడిదపూసికొను నప్పుడదిగాలిచేఁ గొట్టికొనివచ్చి తనపైఁ బడినచో నాభూతికణములు పవిత్రములగుటంజేసి యగ్నికణములవలెఁ దాఁకఁగాఁ గలఁత చెందుచుండెననియు

క. వేగుంబోకల మేల్కని
భాగవతోద్గీయమాన ♦ భగవద్గీతా
రాగంబులకును మది ను
ద్వేగంబు వహించుఁ జేఁదు ♦ తిన్నవిధమునన్.

టీ. వేగుంబోకలన్=వేకువజాములందు, మేల్కని=తెలివిచెంది, భాగ... రాగములకున్—భాగవత=భగవద్భక్తులచే, ఉద్గీయమాన=గానము చేయఁబడు చున్న, భగవద్గీతా = భగవద్గీతాశ్లోకములయొక్క, రాగంబులకున్=గానములను, లేకమాధుర్యములను, మదిన్=మనస్సులో, చేఁదు=విషము, తిన్నవిధంబున్=తిన్నచందమున, ఉద్వేగంబు, వహించున్=భయముచెందుచుండును.

సీ. అపరాకుఁడు పరా ♦ కమ్మగా శేతెంచు
  శ్రోత్రీవకు దూరంబు ♦ తొలఁగిపోవు
నాదోషకారి స ♦ న్న్యాసి దవ్వులఁగాంచి
  యోలంబునకుఁదారి ♦ యొదిఁగి యుండు
నాపాపజాతి మా ♦ సోపవాసిని గని
  లంఘింపఁబోయి కా ♦ ల్నలియఁ గూలు
నావెఱుఁగొఱుకు యా ♦ యావరవ్రతధారి
  బవదారి యని పేర్చి ♦ పండ్లుగొఱుకు
తే. నానృశంసుఁ డోసరిలు వై ♦ ఖానసులకు
నాదురాత్ముండు శ్రోత్రియు ♦ నపహసించు
నాఖలుఁడు సోమయాజి ని ♦ రాకరించు
నక్కరాతుఁ డనుష్ఠాతు ♦ ధిక్కరించు.  130

టీ. అపరాకుఁడు = నీచుఁడయిన యాకలిరాజు, పరాకమ్మగారు=పంద్రెండుదుర్రాత్రులుపవాసము చేసిచేసెడి పరాకమనెడి వ్రతమాచరించెడి స్త్రీ), ఏతెంచు తోరివరున్ — వచ్చుచున్న త్రోవను, దూరంబు=దూరముగా, తొలఁగి

పోవుక్, అనఁగా నరాకమనెడివ్రతమునాచరించువారెవ్వరైన వచ్చుచున్నచోఁ జూచి భయపడి దూరముగాఁ బాఱిపోవునని భావము. ఆదోషకారి=ఆపాపాత్ముఁడు, సన్న్యాసిక్, దవ్వులక్, కాంచి=దూరమునఁజూచి, ఓలంబునకుక్ = పృష్ఠాదులచేగూఢమైన స్థలమునకు, తారి=పోయి, ఒదిఁగి, ఉండుక్=పొంచి యుండును; ఆపాపజాతి=పాపజాతికలి, మాసోపవాసిని = మాసముదినము లుపవసించుట యనెడివ్రతమునుబూనినదాని, కని=చూచి, లంఘింపక్, పోయినక్= దాటఁబోయి, అనఁగా భయముచే దాఁటుచుఁ బర్వెత్తఁబోయి, కాలు, నలియక్ = చూర్ణమగునట్లుగా, కూలుక్ = నేలఁబడును, ఆవెనుగొలుకు= ఆదూషకుఁ డయిన కలి, యాయావరవ్రతధారిక్ = యాయావరవ్రతమును దాల్చినవానిని, పగదారి = శత్రువని, అని, పేర్చి = అతిశయించి, పండ్లుకొఱుకక్, ఆనృశంసుఁడు=అక్రూరుఁడు, వైఖానసులకుక్=వానప్రస్థులకు, ఓసరిలుక్=తప్పించుకొనిపోవును. ఆదురాత్ముఁడు, శ్రోత్రియుక్= వేదాధ్యయనపరుని, అపహసించుక్ = పరిహసించును, ఆఖలుఁడు, సోమయాజిక్, నిరాకరించుక్=తిరస్కరించును, అక్కిరాతుఁడు = ఆనీచుఁడు, అనుష్ఠాతుక్=అనుష్ఠానపరుని, ధిక్కరించుక్=తిరస్కరించును.

తా. ఆదురాత్ముఁడయిన కలిపురుషుఁడు, పరాకాఖ్యమగు వ్రతము సలుపువారింజూచి భయమున దూరముగాఁ దొలఁగిపోవును, సన్న్యాసులనుజూచి భయమునఁ జాటునకేఁగి దాఁగియుండును. మాసోపవాసము చేయువారిని గని భయమున లంఘించి పర్విడఁబోయి కాళ్లు విఱుచుకొనును. వ్రతధారిని విరోధియని తలంచు. వానప్రస్థులకు జంకి ప్రక్కకుఁబోవును, వేదాధ్యయనపరులను వెక్కిరించును. సోమయాజులను నిరాకరించును. అనుష్ఠానపరులను దిరస్కరించుచుండును.

శా. ఆనిర్భాగ్యుఁడుగాళరాత్రియనిహాహాకారముం జేయుడెం
దానన్సాధ్వసమంది బ్రాహ్మణులు సంధ్యావేళఁ జేతస్సమా
ధానంబొప్పఁగ నావహింప నుదయత్సప్తాశ్వబింబంబులోఁ
గా నానాపథములు మించినొని శ్రీగాయత్రి వేత్తేర్గాన్.

టీ. అనిర్భాగ్యుఁడు=భాగ్యహీనుఁడయినకలి, బ్రాహ్మణులు,సంధ్యావేళలు=ప్రాతస్సంధ్యాకాలమందు, చేతస్సమాధానంబు=మనస్సునకుసావకాశత,ఒప్పన్ =ఒప్పునట్లుగా, ఉపహింపన్ =ఉపాసింపఁగా,ఉదయ...లోఁగాన్ =ఉదయించుచున్నసూర్యమండలములోనుండి, ఆకాశపథంబున్ =గగనమార్గమును, నిండికొని=వ్యాపించి, శ్రీగాయత్రి= ప్రాతస్సంధ్యాధిష్ఠానదేవతయగు గాయత్రీదేవి, ఏతేరఁగాన్ =వచ్చుచుండఁగా, కాళరాత్రి, అని=శక్తిస్వరూపురాలయినదుర్గాదేవియని, డెందానన్ =మనస్సునందు,'సాధ్వసము = భయము, అంది, హాహాకారమున్ =సంతాపము సూచించుచు మొఱవెట్టుచుండును.

తా. ఆనిషధదేశమునందలి బ్రాహ్మణులు నియతిపరులై చిత్తమును దృఢపఱచికొని గాయత్రీదేవి నుపాసింపఁగా,నామె సూర్యమండలమునుండి వెలువడి యాకాశమును దనప్రభలతోఁగప్పి వచ్చుచుండెను. కలిపురుషుఁడది చూచి సర్వసంహారకారిణియు, శక్తిస్వరూపియునగు దుర్గయనికొని మనంబున భయపడి సంతాపము నొందసాగెను.

మ. యజమానప్రమదావికస్వరభగన్యస్తాశ్వదీర్ఘస్మర
　ధ్వజదండం బగునశ్వమేధమఖతంత్రంబు న్నిరీక్షించి య
　క్కుజనుండొత్తిలి నవ్వె వేదవిదులంగుచ్ఛించిపుష్పాస్త్రిచే
　నిజహస్తంబునవేసియశ్రుకణముల్ నిండారనేత్రంబులన్.

టీ. గోపనీయము.

తే. జినగవేషణనిరతుఁడౌచెట్ట సూచు
　నజివవద్బ్రహ్మచారిచయంబు నెదుర
　క్షపణకాలోకనార్థి యాఖలుఁడు గాంచు
　నక్షపణకేళి రాజసూయాధ్వరమున.　　133

టీ. జిన...నిరతుఁడు—జిన=జినుని (బుద్ధవిశేషుని) గవేషణ=వెదకుటయందు, నిరతుఁడు=ఆసక్తిగలవాఁడు, ఔచెట్ట=అయినట్టిదుష్టుఁడగు కలిపురుషుఁడు, "ఔజెష" యనుపాఠమున, అయినపెద్దమ్మయగు కలియనియర్థము

ఎదురన్ =ఎదుటియందు, అజినవత్ =కృష్ణమృగచర్మమును ధరించిన, బ్రహ్మచారి చయంబున్ =బ్రహ్మచారిసమూహమును, చూచున్ = చూచుచుండును. జినుసివలె లేని బ్రహ్మచారులనుజూచునని యర్థాంతరము. ఆదేశమునందంతటను వేదవిహిత కర్మము లాచరించు వారేకానవచ్చుచుండిరి కాని, వేదబాహ్యులెవ్వరును గాన రాలేదనిభావము. క్షపణకాలోకనార్థి—క్షపణక=క్షపణకులను, ఆలోకన=చూచుటను, అర్థి=కోరుచున్నవాఁడగు, ఆఖలుఁడు=ఆనీచుఁడయినకలి, రాజసూయాధ్వరమునన్ = రాజసూయయాగమందు, అక్షపణకేళిన్—అక్ష=పాచికలసంబంధియగు, పణ=ధనమందలి, కేళిన్ = ఆటను, క్షపణకులులేనట్టి యాటనని యర్థాంతరము. కాంచున్, అనఁగా క్షపణులనుజూడఁబోయి యక్షపణకేళి గలవారి(జూదమాడుటకుధనమునొడ్డుటయందాసక్తిగలవారి) చూచుచుండును. "రాజసూయేయజమానోఽక్షైర్దీవ్యతి." అని వేదము దిగంబరుల జూడబోవునీచుని కెక్కడఁజూచినను రాజసూయయాగముల నే చేయుచు నందుజూదమాడ ధనము లొడ్డుచునున్నవారు గానవచ్చుచున్నారని భావము.

తా. గతార్థము.

వ. ఇవ్విధంబున. 134

ఉ. భాండికమండలీప్రకృతి బంధుఁడు బంధకికాప్రియుండు పా
షండసఖుండు జైనతరుషండవసంతుఁడునుం దిరస్కృత
స్థండిలశాయియుం గపటధార్మికమిత్రుఁడు నై వినిందక
ర్ముం డతఁ డుండెఁ గొన్నిదినములు నిషధావనిమండలంబునన్.

టీ. భాండిక...బంధుఁడు-భాండికమండలీ=లండుబోతులసమూహమునకు, ప్రకృతిబంధుఁడు=స్వాభావికమగుచుట్టము, బంధకికాప్రియుండు=జారిణీస్త్రీలను ప్రేమించుచున్నవాఁడును, పాషండసఖుండు=పాషండులకు మిత్రుఁడును, జైన...వసంతుఁడునున్ - జైన=జైనులనెడి, తరుషండ = వృక్షసమూహమునకు, వసంతుఁడు = వసంతునివంటివాఁడును, తిరస్కృతస్థండిలశాయియున్-తిరస్కృత=ధిక్కరింపఁబడుచున్న, స్థండిలశాయియున్=కటికి నేలశయనించి

నియమముతో వేదాధ్యయనము చేయువారుగలవాఁడును, అనఁగా వేదాధ్యయనపరులను దిరస్కరించుచున్నవాఁడనిభావము. కపటధార్మికమిత్రుఁడు=కపటులయిన ధార్మికులకు స్నేహితుఁడును, ఐ, వినింద్యకర్ముండు= కుత్సితములగు కర్మములుకలవాఁడు, అతఁడు=ఆకలి, నిషధావనిమండలంబునన్ =నిషధదేశమునందు, కొన్నిదినంబులు, ఉండెను.

తా. లందుబోతులకుఁ జుట్టమై, జారిణులకుఁ బ్రియుండై, పాషండులకు నెచ్చెలియై, జైనులకానందకరుండయి, స్థండిలశాయులగు వేదాధ్యయన పరులను దిరస్కరించుచు, డాంభికధర్మము లాచరించువారికి హితుఁడై వర్తిల్లుకలి పురుషుఁడు కొన్ని దినములు నిషధదేశమందుండెను.

మ. కలికాలంబు విదర్భరాజతనయాగాఢాంకపాలీమహో
త్కలికాలంబమునం జరించె నిషధక్ష్మామండలి న్మార్గభూ
నలనిగ్రాహిణి యైనపారిషదసైన్యశ్రేణిదర్పోద్ధతుల్
నలసిగ్రాహిణియైనయాత్రకుసముల్లాసంబుసంధింపఁగన్.

టీ. కలికాలంబు=కలిపురుషుఁడు, మార్గ...పాణి - మార్గ = దారియందు, భూ=పుట్టియున్న, నల=కిక్కసగడ్డిని, నిగ్రాహిణి=నిగ్రహించునది, ఐన... ద్ధతుల్ = అయినట్టితన స్నేహితులయొక్కయు, సేనయొక్కయు, పంక్తియొక్క, దర్పోద్ధతుల్=దర్పాతిశయములు, కలిమిత్రులును, సైనికులును ద్రోవల నెచ్చటనైన నలమనెడి తృణముగానవచ్చినను దాని నలియఁగొట్టి, యిట్లైనలుని గూడదండింతుమని తమప్రభువునకుఁ దెలియఁజేయసాగిరి. వారట్లు చూపుచున్నదర్పాతిశయము, నల...కున్ =నలరాజును దండించునదైన దండయాత్రకు, సముల్లాసంబు=అధికోత్సాహము, సంధింపన్ = కలిగింపఁగా, విదర్భ...లంబమునన్—విదర్భరాజతనయా=దమయంతియొక్క, గాఢ=బిగువయిన, అంకపాలి=కౌఁగిలింతయందలి, మహత్ =గొప్పదయిన, ఉత్కలికా=వేడుకయొక్క, ఆలంబమునన్ =స్పర్శముచేత, అనఁగానట్టి యాసక్తితో, నిషధక్ష్మామండలిన్ =నిషధదేశమునందు, చరించెన్.

తా. తనమిత్రులును, దనసైనికులును, మార్గమందు నల మనెడి కిక్కిస గడ్డిని సైతమునసహింపక నశింపఁజేయుచుఁ జూపుచున్న దర్పముచేతఁ, దాను దప్పక నలునిజయింతునని నిశ్చయించికొని మిక్కిలి యుత్సాహముతోఁ గూడి, కలిపురుషుఁడు దమయంతిని గౌఁగిలించుకొన నధికాసక్తికలవాఁడై నిషధదేశమున సంచరించుచుండెను.

వ. ఇవ్విధంబునఁ గలియుగంబు దిరిగితిరిగి యెప్పట్టునం బాపంబు రూపింపలేక యొక్కచోట నేకాంతంబునం దనయంతవట్టు వారినింగూడి, మంతనంబుండి 'రంధ్రాన్వేషణంబులంగాని దోషంబులు గానంబడవు. రంధ్రాన్వేషణంబులు గాలక్రమంబునంగాని ఫలింపనేరవు కావున ద్వాపరం బదేశంబున వివాదలేశంబు లరయునది. నాకుం గామక్రోధలోభమోహంబులకును వేఱువేఱ యధికారంబులు పాలువెట్టెద. అది యెయ్యదియంటేని. 136

టీ. ఇవ్విధంబునన్, కలియుగంబు, తిరిగి, తిరిగి=మిక్కిలిసంచరించి, ఎప్పట్టునన్=ఏస్థలమందును, పాపంబు = తనకాశ్రయమైనదోషమును, నిరూపింపన్=స్థిరపఱుచుటకు, లేక, ఒక్కచోటన్, ఏకాంతంబునన్=రహస్యప్రదేశమున, తనయంతవట్టువారినిన్=తనసహాయులనందఱను, కూడి, మంతనంబు, ఉండి=ఆలోచించి, రంధ్రాన్వేషణంబులన్=అవకాశములు వెదకుటవలన, కాని, దోషంబులు=నేరములు, కానంబడవు. రంధ్రాన్వేషణంబులు, కాలక్రమంబునన్ కాని=కాలమతిక్రమించిన కొలఁదినికాని, ఫలింపన్, నేరవు-కావునఁ ద్వాపరంబు=ద్వాపరయుగము, అదేశంబునన్ = కానిచోటను, వివాదలేశంబులు=వివాదాంశములను, అరయునది = చూచుఁగాక. నాకున్, కామక్రోధలోభమోహంబులకున్=కామము, క్రోధము, లోభము, మోహము వీనికి, వేఱువేఱ = ప్రత్యేకముగా అధికారంబులు, ప్రభుత్వములు, పాలు, పెట్టెద=పంచిపెట్టెదను. అది, ఎయ్యది, అంటేని.

సీ. యతి మాచకమ్మయు • నతిథి దీక్షితపత్ని
  మగనిఁబాసినయింతి • మరునిపాలు
తీర్థవాసులును మాం • త్రికులు దాయాదులుఁ
  దర్కవాదులును గ్రో • ధంబుపాలు
యజనదీక్షితులు న • ధ్యయనపాఠకులును
  భస్మకుంఠనులు లో • భంబుపాలు
బాలవైతండిక • పామరాహంకార
  చుంబకమతులు మో • హంబుపాలు
తే. కేళిసౌధమహాచంద్ర • శాలయందు
హంసతూలికపాన్పుపై • నహరహంబు
నవవధూకేళివిహరణో • న్మత్తుఁడైన
నిషధనాథుండు నాపాలు • నిక్కమరయ. 137

టీ. యతి=సన్న్యాసియు, మాచకమ్మ, యనుచో=నెలదినము లుపవాసము చేయువాఁడును, అతిథి, దీక్షితపత్ని=దీక్షవహించినవాని భార్యయు, మగనిన్, పాసినయింతి=విడిచిపెట్టిన స్త్రీయును, మరునిపాలు=కామమువంతు. తీర్థవాలును = తీర్థయాత్రసల్పువారును, మాంత్రికులును = మంత్రశాస్త్రవేత్తలును, దాయాదులును=జ్ఞాతులును, తర్కవాదులు = తర్కశాస్త్రవాదము సలుపువారును, క్రోధంబుపాలు=కోపమువంతు, యజనదీక్షితులును= యజ్ఞదీక్షవహించినవారును, అధ్యయనపాఠకులును=వేదాధ్యయనముచేయువారును, భస్మకుంఠనులు=బూడిదపూఁతలఁదాల్చి తపంబొనర్చువారును, లోభంబుపాలు=లోభమువంతు, బాల...మతులు - బాల= బాలకులయొక్కయు, వైతండిక=స్వపక్షపాతముగావాదించు వారలయొక్కయు, పామర = అజ్ఞులయొక్కయు, అహంకారచుంబక=అహంకారమునకుపశోలయిన వారియొక్కయు, మతులు= బుద్ధులు, మోహంబుపాలు=మోహముభాగము. కేళి...యందున్ - కేళిసౌధ= క్రీడాహర్మ్యముసంబంధియగు, మహత్=గొప్పదయిన, చంద్రశాలయందున్ =

శిరోగృహమునందు, హంసతూలికతల్పంబుపైన్ = హంసలయొక్క మెత్తని యీఁకలతోఁగుట్టినతల్పమందు, అహరహంబున్ = ప్రతిదినమును, నవవధూ...న్మత్తుఁడు - నవవధూ = క్రొత్తగాఁ బెండ్లాడినభార్యతో, కేళి = క్రీడించుటయనెడి, విహరణ = విహారముచేత, ఉన్మత్తుఁడు = మదించినవాఁడు, ఐననిషధనాథుండు = అయినట్టి నలరాజు, అరయన్ = ఆలోచింపఁగా, నిక్కము = సత్యముగా, నాపాలు = నావంతు.

తా. స్పష్టము.

వ. అని యందఱ నియోగించి. 138

ఉ. కాకపతాకతోఁ ఘనసృగాలకిశోరకరథ్యపంక్తితోఁ
గీకసపేటికాఘటితకింకిణకావలితోడఁ గూడి భ
ల్లూకపకృత్తిక్లృప్తమగులోహశతాంగముఁగొంచుఁబోవనా
జ్ఞాకృతిఁబంచె నప్డు నిజసారథియైనదురాత్ముదుస్సహున్. 139

టీ. కలి (అనుకర్తృపదమధ్యాహార్యము) అప్డు = నిషధదేశము ప్రవేశించిన పిమ్మట, కాకపతాకతోన్ = కాకచిహ్నితమగు టెక్కెముతోడను, ఘన...పంక్తితోన్ - ఘనసృగాల = పెద్దనక్కలయొక్క, కిశోరక = పిల్లలనెడి, రథ్య = గుఱ్ఱములయొక్క, పంక్తితోన్ = వరుసతోడను, కీకస...తోడన్ — కీకసపేటికా = నుఎముకల సమూహములచే, ఘటిత = నిర్మితములయిన కింకిణికావలితోడన్ = చిఱుగంటలపంక్తితోడను, కూడి = యుక్తములయి, భల్లూకప...క్లృప్తము = మేటిఎలుగుబంటితోలుతో నావృతమైనది, అగులోహశతాంగమున్ = అయినట్టి యినుపరథమును, కొంచుపోవన్ = తీసికొనిపోవుటకు, నిజసారథి = తనరథచోదకుఁడు, ఐనదురాత్మున్ = అయినట్టిదురాత్ముని, దుస్సహున్ = దుస్సహుఁడను వానిని, ఆజ్ఞాకృతిన్ = అజ్ఞాకృత్యముచే — అనఁగా నాజ్ఞాపించి, పంచెన్ = పంపెను.

తా. అకలి పురుషుఁడు నిషధదేశము ప్రవేశించిన తరువాత, మాలకాకితోఁ జిహ్నితమయిన టెక్కెముతోడను, నక్క పిల్లలనెడి గుఱ్ఱములతోను, ఎముకల

లోనైన చిఱుగంటలతోడను నొప్పుచు, నెలుఁగుబంటి చర్మములోనావృతమైన యనుపరథమును మగుడఁ దననివాసమునకుఁ గొనిపొమ్మని తనసారథి యగు దురాత్మున కప్పగించెను.

వ. పంచి యనంతరంబ యన్నిర్దయుండు దానును గార్దభధూళిలగ్నంబున నిషధనగరంబుఁ బ్రవేశించి, సంధ్యాకాలంబున మసమసక చీఁకటిం గుఱుమాపుడుంబుట్టంబు ముసుంగు వెట్టుకొని పెడతెరువున శూన్యభవనద్వారవేదికాటంకంబుల విశ్రమించుచు, దేవమందిర ప్రాంగణంబులకుం దొలంగి, వేశ్యవాటంబు నడుమ నొయ్యననడిచి యట మలంగి దురోదర క్రీడావినోదంబుల నను మోదించుచుఁ, గాదంబరీ గృహంబు లొరసికొనుచుఁ, జైత్యంబులు గడచి శృంగాటకంబులు దాఁటి, దూరంబు చని నిభృతప్రకారంబున నృపాగారంబుడాసి యచ్చేరువం గేళీసౌధంబు కెలన శిలాప్రాకారపరివృతంబై నందనవనంబునకు విందనం జాలి, చాలం జెన్నొందు మందిరోద్యానంబుఁదఱిసి నెత్తమ్మికొలని కుత్తరంబునఁ గేళాకూళికిం బడమటఁ గుటజకురంటకి ఝింటికాసర్జ ఖర్జూర కేతకీషండ మండలంబు లోనం గారుకొని గాలికిం దూఱరానియొక్క యూరంబు సొచ్చి యచ్చట, 140

టీ. పంచి = తనసారథినిబంపి, అనంతరంబ—అ=అటుతర్వాత, అన్నిర్దయుండు = దయారహితుఁడయిన యాకలిరాజు, తానును, గార్దభధూళిలగ్నంబునన్ = గాడిదల ధూళిరేఁగుసమయమున, నిషధనగరంబున్ = నిషధపురంబును, ప్రవేశించి. అనఁగా గాడిదధూళి యపవిత్రమయినది. సంధ్యాకాలంబునన్ = సాయంసమయమందు, మసకమసకచీఁకటిన్, కుఱుమాపుడుంబుట్టంబు = కొంచెము మాసిన వస్త్రమును, ముసుంగుపెట్టికొని, పెడతెరువునన్ =తప్పు మార్గమునంబడి, శూన్య...టంకంబులన్ —శూన్యభవన=జనశూ

న్యములై మలినములైన యిండ్లయొక్క, ద్వారవేదికా విటంకంబులన్ =ద్వారములకు సమీపముననుండు నరుఁగులపై, విశ్రమించుచున్, దేవమందిరప్రాంగణంబులకున్ =దేవాలయప్రాంతములకు, తొలంగి=దూరమయి, వేశవాటంబుల నడుమన్ =భోగపువీథుల మధ్యమునను, ఒయ్యనన్ =మెల్లగా, నడచి, అట, మలంగి=అచోటుననుండి కదలి, దురోదర క్రీడావినోదంబులన్ =జూదమాడుట వలని విలాసములను, అనుమోదించుచు, కాదంబరీ గృహంబును = కల్లున్నమందిరములను, ఒరసికొనుచు=చొచ్చిపోవుచు, చైత్యంబులు=రథ్యావృక్షములను, కడచి,శృంగాటకంబులు=నాలుగుత్రోవలు కలిసిన స్థలములను, దాఁటి, దూరంబు, చని, నిభృతప్రకారంబునన్ =గూఢమార్గముచే, నృపాగారంబు=రాజమందిరమును, డాసి, అచ్చేరువన్ ,కేళిసౌధంబు కెలనన్ =క్రీడాహర్మ్యముయొక్క ప్రక్కను, శిలాప్రాకార పరివృతంబు=ప్రాతిగోడచేఁ బరివృతమైనది,ఐ, నందనవనంబునకున్ =దేవతలయుద్యానమునకు, విందు=చుట్టము అనన్ , చాలి, చాలన్ చెన్నొందు మందిరోద్యానంబున్ , తటిసి = సమీపించి, సౌత్తిమ్మికాలనికిన్ = పద్మాకరమునకు, కేళీకూలికిన్ =క్రీడాసరస్సునకు,పడమటన్ , కుట...లోన— కుటజ = కుటజవృక్షములయొక్కయు, కురంట = గోరంటచెట్లయొక్కయు, ఝింటికా=ములుగోరింట చెట్లయొక్కయు, సర్జ = మద్దిచెట్లయొక్కయు, ఖర్జూర=ఖర్జూరవృక్షములయొక్కయు,కేతకీ=మొగలిచెట్లయొక్కయు, షండ= సమూహముచే, మండలములోనన్ =వర్తులముగానున్న ప్రదేశములో, కాఱు కొని=దట్టముగానుండి, గాలికిన్ =వాయువునకుఁగూడ, దూఱరాని=చొరశక్యముగాని, ఒక్కయిరము=ఒక్కపొదరింటిని చొచ్చి, అచ్చట.

శా. సంతోషంబున నాశ్రయించె విలసచ్ఛాఖోపశాఖాశిఖా
సంతానోదయచుంబితాంబరదిశాచక్రంబు భూపాలశు
ద్ధాంతారామరమాంగనాభిసరణవ్యాపారసంకేతవి
శ్రాంతిస్థానకమున్విభీతకమహాసర్వంసహాజాతమున్. 141

టీ. ఆకలిపురుషుఁడు (అధ్యాహార్యము) విలసత్ ...చక్రంబు—విలసత్ = ప్రకాశించుచున్న, శాఖోపశాఖ=పెద్దకొమ్మలయొక్కయు, చిన్నకొమ్మలయొ

క్కయు, శిఖాసంతాన=కొనలయొక్క సమూహముయొక్కయు, ఉదయ=అభివృద్ధిచేత, చుంబిత=తాఁకఁబడుచున్న, అంబర=ఆకాశమును, దిశాచక్రంబు=దిక్కులయొక్క సమూహమును గలదియు, భూపాల...స్థానకమున్—భూపాలశుద్ధాంత=రాజునంతఃపురముయొక్క, ఆరామ=తోఁటయొక్క, రమా=లక్ష్మియనెడి, అంగనా=పడతియొక్క, అభిసరణవ్యాపార = (నలునిగూర్చిన) అభిసారక్రియకు, సంకేత = గుఱుతుఏర్పఱుపఁబడిన, విశ్రాంతిస్థానకమున్, విశ్రాంతి స్థానమైనదియు, విభీతక...జాతమున్—విభీతక = తాండ్ర అనెడు, మహాత్=గొప్పదయిన, సర్వంసహాజాతమున్ = వృక్షమును, సంతోషంబునన్, ఆశ్రయించెన్.

తా. కలిపురుషుఁడు దిక్కులను వ్యాపించి యాకాశమును దాఁకుచు వెలయుచున్న శాఖోపశాఖలసమూహముచే నొప్పుచు రాజాంతఃపురోద్యానపు లక్ష్మి నలునితో నభిసరించుటకయిన సంకేతస్థలముననెనున్న పెద్ద తాండ్రచెట్టును సంతోషముగ నాశ్రయించి యుండెను.

వ. ఇట్లు కలిరాజు నిషధరాజధర్మణీధర్మంబు శుద్ధాంత లీలావనం
　బులోని తాఁడి మ్రానికోటరంబున నివసించి రంధ్రాన్వేషణ
　తత్పరుండై యుండె నటపూర్వంబు.　　142

తే. అవ్విధంబున నిషధదేశాధిరాజు
　నగరు సొత్తెంచి యంతరాంతరములందు
　దొరల మంత్రుల దండనాథులను నృపుల
　నిజనివాసంబులకు నన్పె నిలిచి నిలిచి.　　143

టీ. అవ్విధంబునన్=ఆప్రకారముగా, నిషధదేశాధిరాజు=నలరాజు, నగరు=పురమును, చొత్తెంచి=ప్రవేశించి, అంతరాంతరములందున్=మార్గమధ్యమందచ్చటచ్చట, నిలిచి, నిలిచి, దొరలన్=ప్రభువులను, మంత్రులను, దండనాథులను=సేనానాయకులను, నృపులన్=మిగిలినరాజులను, నిజనివాసంబులకున్=వారివారిని వాసములకు, అన్పెన్=పంపెను.

తా. స్పష్టము.

ఉ. పాయఁ దొలంగుఁడంచుభయపార్శ్వములం బగళంబు సేయుచున్, దోయజలోచనల్ గొలిచి తోఁ జనుదేరఁగఁ బెండ్లికూఁతురత్యాయతవైభవస్ఫురణ నంతిపురంబున కేఁగుదెంచెఁ బైడాయఁగ జిడ్డి వైచినకడానిమెఱుంగుపసిండి పాలకిన్. 144

టీ. పెండ్లికూఁతురు=దమయంతి, పాయన్, తొలంగుఁడు=దూరముగా వెడలుఁడు, అంచున్=అనిపల్కుచు, ఉభయపార్శ్వములన్=రెండుప్రక్కలందును గల జనములను, బగళంబు, చేయుచున్=ఒత్తిగించుచు, తోయజలోచనల్=స్త్రీలు, కొలిచి=సేవించి, తోన్=కూడ, చనుదేరఁగన్=వచ్చుచుండఁగా, అత్యాయతవైభవస్ఫురణన్=అధికమయిన పెద్దవైభవముతో, పైన్=మీఁద, డాయఁగన్=తాఁకునట్లు, జిడ్డి=మోటుగుడ్డ, వైచిన=అమర్చియుంచిన, కడాని మెఱుంగుపసిండిపాలకిన్=ఉత్తమైన మెఱుఁగు బంగారుతోఁజేసిన పల్లకియందు, గూర్చుండి, అంతిపురంబునకున్ = అంతఃపురమునకు, ఏఁగుదెంచెన్=వచ్చెను.

తా. దమయంతిని జూడవచ్చిన జనసమూహము నొత్తిగించి దారిచేయుచు సేవించుచు స్త్రీజనంబు వచ్చుచుండఁగా దమయంతి ముదుగుగుడ్డ వేసిన మేలిబంగారు పల్లకిలోఁ గూర్చుండి మహావైభవముతో నంతఃపురముప్రవేశించె.

ఉ. కైశికవృత్తియొప్పఁ గ్రథకైశికరాజసుతావివాహదీక్షాశుభవస్తుసంయుతము గా బయకారులొనర్చినట్టిప్రావేశికమంగళధ్రువలు వీనుల కింపుగఁ బాడిరంగనల్ దేశివిధంబు మార్గమునఁ దేటయు నొక్కటసాళగింపఁగాన్.

టీ. బయకారులు = సంగీతోపాధ్యాయులు, కైశికవృత్తి = కైశికయనెడి పదరచన, ఒప్పన్=ఒప్పునట్లుగా, క్రథ...యుతముగాన్ - క్రథకైశికరాజసుతా=దమయంతియొక్క, వివాహదీక్ష=పెండ్లిదీక్షయనెడు, శుభవస్తు=మంగళకథతో, సంయుతముగాన్=కూడునట్లుగా, ఒనర్చినట్టి ప్రావేశికమంగళధ్రువలు=చేయుచున్న ప్రవేశకాలమున కయిన కల్యాణగీతములు. వీనులకున్, ఇంపు=విందు, గొల్పుచుండఁగా, దేశివిధంబు=దేశియనెడి గీతమును, మార్గమున

తేటయు=మార్గమనెడి సంగీతవిశేషముయొక్క నిగ్గును, ఒక్కటఁ = ఒకమారు, సాళగింపఁగాన్ =కలియుచుండఁగా, అంగనలు= స్త్రీలు, పాడిరి, సంగీతము దేశి యనియు,మార్గమనియు రెండువిధములు, దేశియనఁగా దేశదేశములందున్న ప్రజలకు హృదయరంజనమగు విధముగా నేర్పడినగానము.మార్గమనఁగా మహేశ్వరుని యొద్దనుండి బ్రహ్మాదులచేఁ దేఁబడి భరతాదులచేఁ బ్రయోగింపఁబడిన గానము. ఇట్లుద్వివిధమగు గానవిశేషములును నేకీభావము నొందునట్లుపాడిరి.

తా. దమయంతీదేవి వివాహదీక్షయనెడు మంగళ కథవిషయముగాఁగొని గాయకులొనర్చిన కల్యాణవుఁబాటలు వీనులకు విందొనర్చుచుండ స్త్రీలు దేశి మార్గములనెడి రెండువిధముల సంగీతమును మిళితముగాఁ జేసిపాడిరి.

వ. అనంతరంబ వధూవరులు లౌకిక వైదికాచార పారంగతు లగు పెద్దలపనుపున గృహప్రవేశసమయోచితంబు లగుమంగళాచారంబులు ప్రవర్తించుచుండిరి. అప్పుడు వివిధ శిల్ప కల్పనా నిపుణులగు శిల్పిజనులు సుపర్వపర్వత శిఖరోత్సేధం బగు విహారసౌధం బలంకరించి రందు.　　　147

టీ. అనంతరము = పురము ప్రవేశించినపిమ్మట, వధూవరులు = దంపతులు, లౌకిక...గతులు—లౌకిక=లోకానుగతములు, వైదిక=వేదోక్తములును, నగు, ఆచార = అచారములందు, పారంగతులు = మేరనుబొందినవారు, అనఁగా నాచారములను జక్కఁగఁ దెలిసినవారనుట, అగు పెద్దలపనుపునన్ =అయినట్టి పెద్దలయాజ్ఞచేత, గృహప్రవేశసమయోచితంబులు = గృహప్రవేశమునకుఁదగినవి, అగు మంగళాచారంబులు= అయినట్టి మంగళ కృత్యములను, ప్రవర్తింపుచుండిరి. అప్పుడు వివిధశిల్పకల్పనానిపుణులు = పలువిధములగు శిల్పములను సృజింపసమర్థులు, అగు శిల్పిజనులు=అయినట్టి శిల్పాచార్యులు, సుపర్వ...త్సేధంబు= మేరువు శిఖరమువలె నున్నతము, అగు విహారసౌధంబు=అయినట్టి క్రీడాసౌధమును, అలంకరించిరి. అందు.

క. ఒకచోటఁ బువ్వుఁబందిరి
　యొకచోట జప్పరము తూఁగుటుయ్యెల యొకచో

సకినలగిలిగిలిమంచం
బొకచోఁగప్పురపుఁబలుఁగుకటోవరి యొకచోన్. 148

టీ. అందు=ఆమేడయందు, ఒకచోటన్ = ఒకస్థలమందు. పువ్వుపందిరి. ఒకచోన్, చప్పరము=గుడారము, ఒకచోన్, తూఁగుటుయ్యెల, ఒకచోన్, సకినల, గిలిగిలిమంచము=సుందర మయినమంచము, ఒకచో, కప్పురపుఁబలుఁగున్=కర్పూరమువంటి స్ఫటికశిలలచేసైన, ఓవరి = చంద్రశాలయును గలదు. అధ్యాహార్యము.

తా. స్పష్టము.

సీ. ఒకచోట సాలభంజిక గీలు వన్నిన
మురిపెంపురవగొండ్లిఁ బరిఢవించుఁ
గుడ్యగర్భాగార గూఢమై యొకచోట
నలవ్రాక యొక్క పద్మాక్షివలుకు
నొకచోట జలయంత్ర యుక్తి నీలపురాల
మొగులుగూర్చినచిన్ని మునురు గురియు
నొకచోటఁ బగలుచంద్రికలు గాయుచునుండుఁ
జంద్రకాంతోపల స్తంభవితతి
తే. రమణఁ బోషితరాజకీరములతోడ
నొక్కచోట విటంకనిర్ వ్యూహపంక్తి
యసమశరశాస్త్రకారిక లభ్యసించు
శారికలు నూత్నకనకపంజరములందు. 149

టీ. ఒకచోటన్=ఒకస్థలమున, కీలు=మజి, పన్నినన్=అమర్పఁగా, సాల భంజిక = ఒకబొమ్మ, మురిపెంపురవగొండ్లి = విలాసములుగలచిన్న నృత్యమును, పరిఢవించున్ = ఆడును, ఒకచోటన్, కుడ్యగర్భాగారగూఢమై= గోడలో [illegible] ఒక పద్మాక్షి=ఒక స్త్రీ,

అలవోక=లీలగా, పలుకుక్ = సంభాషించును, అనఁగాఁ గుడ్యమునకు మధ్య భాగమున మనుష్యులుండఁదగినంత యవకాశము కలిగింతురు. అందు రసికు రాండ్రయిన స్త్రీలుండి శృంగారోద్దీపకముగాఁ గథలు చెప్పుచుందురు. అట్లే నల దమయంతులకుఁ జెప్పుచుండెనని భావము. ఒకచోటక్ జలయంత్రయు క్తిక్=నీటియంత్రము యొక్క సంగతిచే, నీలపు రాల మొగులు = ఇంద్రనీలముల మాణిక్యములతో నమర్చిన మేఘములు, కూర్చినక్ = సంఘటింపఁజేయఁగా చిన్నిముసురు, కురియుక్=వర్షించును. శిల్పచాతుర్యముచే నింద్రనీలమాణిక్య ములచే మబ్బులుగా నొనర్చి జలయంత్రసంబంధము కలిగింపఁగా నవి పలుచగా మబ్బులు వర్షించునట్లు మనోహరముగా వర్షించుచుండునని భావము. ఒక చోట, చంద్రకాంతోపల స్తంభవితతి = చంద్రకాంత రత్నమయములయిన స్తంభముల సమూహము, పగలు = పగటిపూఁట, చంద్రికలు = వెన్నెలలను, కాయుక్=ప్రసరింపఁజేయును. చంద్రకాంత మణులతోఁగూర్పఁబడిన స్తంభం బులు చంద్రతుల్యములై ప్రకాశించుచుఁ గామోద్దీపకముగాఁబగటిపూఁట వెన్నె లలఁ బ్రసరింపఁజేయుచుండెనని భావము.రమణక్=ఒప్పునట్లుగా,ఒకచోటక్, విటంకనిర్యూహపంక్తి - విటంక=పక్షులునివసించుటకై శిలాదులచే నిర్మితము లగు చిన్నయిండ్లతోఁగూడిన, నిర్యూహ = వాకిళ్లయొక్క, పంక్తి = వరుస, రాజకీరములతోడక్ శుకవిశేషములతో,ఒప్పును,కనకమూల్న పంజరములందు= కనకవికారములగు గూండ్లయందు, శారికలు=గోరువంకలు, అసమశరశాస్త్రి కారికలు—అసమశరశాస్త్రి=కామశాస్త్రిమందలి, కారికలు = శ్లోకములను, అభ్యసించుక్ = నేర్చుచుండును.

తా. స్పష్టము

తే. కోరగించిన కడకంటి కొలికిఁ జూచి
వాడివాలికపూఁదూపు వంకదీర్చు
చొరగి రతిదేవిపాలిండ్ల నొత్తగిలిన
యించువిలుకాని వ్రాసినా రిడుపునందు.　　150

టీ. కోరకించి ..కొలికిన్—కోరకించిన=ముకుళించిన, కడకంటి=కడకన్ను యొక్క, కొలికిన్ = కొలికితో, చూచి, వారి...వంకన్ = వాఁడియయి నిడుదయయిన బాణమువంకను, తీర్చుచున్ = చక్కఁజేయుచు, కత్తులు మొదలగునవి వంకరగా నున్నపుడు కన్నుగొంచెముమూసి కడకంటి కొలికి దగ్గఱ దానిని చూచుటకలదు. అట్లె మన్మథుఁడు బాణముల వంకలుదీర్చుచు, ఒరగి, రతిదేవి పాలిండ్లన్, ఒత్తగిలినయించు విలుకాని=చేరఁబడినమన్మథుని, ఇడుపునందున్=గోడయందు, వ్రాసినారు.

సీ. అమరవల్లభుఁడు గౌతమకూర్మియిల్లాలిఁ
జీఁకటితప్పుసే సినవిధంబు
సితభానుఁ డాచార్యు చిగురాకు బోఁడిపైఁ
గన్నువైచినకన్నె కలుపుమరులు
నట్టేట దాశకన్యకకు నువ్విళులూరి
జాలిఁబొందిన పరాశరువిరాళి
గారాపుఁగూఁతుపైఁ గాఁగానిపనిఁబూను
వనజసంభవుని నెమ్మఁము వెలితి
తే. దారువనవీథి శీతాంశుధరునిరంతు
శౌరిగోపాలకామినీచాపల్యకేళి
కామరసభావములు మించికానఁబడఁగ
నీర్చి యిడుపులయందుఁ జిత్రించినారు 151

టీ. ఇడుపులందున్ = ఆ కేళీమందిరముయొక్క గోడలందు, అమరవల్ల భుఁడు=దేవేంద్రుఁడు, గౌతముకూర్మియిల్లాలిన్ = గౌతమునిభార్యయగు నహ ల్యను, చీఁకటితప్పు, చేసినవిధంబు = సంభోగించినరీతియు. సితభానుఁడు=చం ద్రుఁడు, ఆచార్యుచిగురాకుబోఁడిపై = గురుపత్నియగుతారపై, కన్నువైచిన, కన్నెకలుపుమరులు = దృష్టిప్రసరింపఁజేసిన నూతనమగు కూటమికైన మోహ మును. అనఁగాఁ జంద్రుఁడు దారపై దృష్టిప్రసరింపఁజేసి మోహముచెందిన విధ

మునసుట. నట్టేటన్ =నదీమధ్యమునందు, దాశకన్యకకున్ =జాలరివానికూఁతు రగు యోజనగంధికొఱకు, ఉవ్విళులూరి=ఊటలూరి, జాలి = మన్మథసంతాప మును, పొందిన పరాశరువిరాళి = పొందినట్టి పరాశరమునియొక్క విరహతాప మును, గారాపుకూఁతుపైన్ = తనముద్దుకూఁతురగు సరస్వతిమీఁద, కాఁ గానిపని=తగనిపనిని—సంభోగమును పూనువనజసంభవుని, నెమ్మనమువెలితి=బ్రహ్మ యొక్క మనస్సుయొక్క లోపమును, దారువనవీథిన్ = దారుకావనపంక్తి యందు, శీతాంశుధరువిరఁతు = శంకరుఁడుచేసిన క్రీడయును, శౌరి... కేళి- శౌరి = కృష్ణునియొక్క, గోపాలకామినీ చౌర్యకేళి = గొల్లభామలతోఁ జేసిన దొంగరతియు, కామరసభావములు = శృంగారరసభావములు, మించి = అతిశ యించి, కానఁబడఁగన్ =కానవచ్చునట్లు, తీర్చి=దిద్ది, చిత్రించినారు=ముద్రించి నారు. కామోద్దీపనముకై శృంగారరస మనుభవించుచు సంభోగావస్థలోనున్న స్త్రీపురుషుల పటములను గోడలందు చిత్రించినారని భావము.

చ. భవజలరాశి దాఁటు నెడ ♦ భావజవాయువు వీచినం దపః
ప్రవహణముల్ సమున్నతసు ♦ పర్వవధూకుచపర్వతాహతిం
బవిలిన దీనతావికల ♦ భావమునొందిన వానినావిక
ప్రవరులభావచిత్రములు ♦ వ్రాసినవారు కపోతపాలికన్. 152

టీ. భవజలరాశి=సంసారసముద్రము, దాఁటునెడన్ =తరించునపుడు, భావజ వాయువు=కామమనెడిగాలి, వీచినన్ = ప్రసరింపఁగా, తపఃప్రవహణముల్ = తపస్సనెడియోడలు, సమున్నత సుపర్వవధూకుచ పర్వతాహతిన్ = మిక్కిలి యున్నతములయిన దేవతాకాంతల స్తనములనెడి పర్వతములయొక్క తాఁకు టచే, పవిలినన్ =బ్రద్దలుకాఁగా, దీనతావికలభావము=దైన్యముచేఁ దొట్రుపా టును, ఒందిన... భావచిత్రములు=పొందినట్టి మునీశ్వరులనెడి నావికులయొక్క యవస్థలపటములు, కపోతపాలికన్ =కొణిగయందేర్పఱచిన పావురములగూఁటి యందు వ్రాసినవారు. సముద్రము దాఁటునపుడు మహావాయువశమునఁ దన పడవ పర్వతమునుదాఁకి బ్రద్దలగుటచే విచారించెడి నావికులవలె, సంసారము దాఁటుటకుఁ జేసిన తపోతతియును దేవతాస్త్రీల సమున్నత కుచములనుజూచి

వికారము నొందుటవలనఁ జెడఁగొట్టుకొని మన్మథతాప మనుభవించెడి మునుల
పటములను గోడలందుఁ జిత్రించిరి.

శా. చూడాహేమవిటంకకోణముల ఽ యంచుల్మెట్టియెవ్వారికిం
జూడం గాళ్లు వడంకునన్నెలవునం ఽ జోద్యంబు వేద్యంబుగా
బాడుం గోమలపంచమస్వరములం ఽ బంచేషుశౌర్యాంకముల్
గ్రీడాకిన్నరయుగ్మముల్ నఖరపాళిం గిన్నెరల్ మీటుచున్. 153

టీ. చూడాహేమవిటంక = సువర్ణవికారమయిన విటంకముల శిఖరముల యొక్క, కోణములయంచుల్ =కొట్టకొనలందు, మెట్టి=నిలువఁబడి, చూడన్ = చూచినచో, ఎవ్వారికిన్ = ఎట్టివారికయినను, కాళ్లువడంకునన్నెలవునన్ = కాళ్లువడఁకించునట్టి స్థలమునందు, చోద్యంబు = వింత, వేద్యంబుగాన్ = తెలియఁబడునట్లుగా, నఖరపాళిన్ =గోళ్లతో, కిన్నెరల్ =కిన్నెరయను వాద్యవిశేషమును, మీటుచున్, క్రీడాకిన్నరయుగ్మముల్ = విలాసార్థమమర్చినకిన్నరద్వంద్వములప్రతిమలు, పంచేషుశౌర్యాంకముల్ =మన్మథునిపరాక్రమసూచకములయినగాథలను, కోమలపంచమస్వరములన్ =మృదువయిన పంచమస్వరముచే, పాడున్ =పాడుచుండును.

తా. సువర్ణవికారములగు కపోతపాలికలయొక్క కొట్టకొనలందు చూచువారికి భయాతిశయము గలుగునట్లుగా నంటియు నంటనట్లు నిలువఁబడి కిన్నరద్వంద్వములు కిన్నెరలు మీటుచు మనోహరములగు పంచమధ్వనులు విలసిల్లునట్లుగా మన్మథపరాక్రమసూచకములగు గాథలను బాడుచుండెను.

తే. వలచుఁ గస్తూరినిగరాల ఽ తలుపు దెఱవ
గాజుటోవరిలో ధూప ఽ గంధలహరి
హాటదురుస్ఫూర్తి నాసికా ఽ పుటకుటీర
కోటరాంతఃకుటుంబితా ఽ పాటవమున. 154

టీ. కస్తూరినిగరాలతలుపు= మేలైనకస్తూరితోఁజేసినతలుపు, తెఱవన్ =తీయఁగా, [illegible] ధూపగంధల

హారి = ప్రసరింపఁజేయుచున్న, ధూపవాసనా ప్రవాహము హాటత్... స్ఫూర్తిక్=హాటత్=ఒప్పుచున్న గొప్పదయిన స్ఫురణముచేతను, నాసి... పాటవమునన్—నాసికాపుట= పుటమువంటినాసికా రంధ్రములనెడి, కుటీర= చిన్నగుడిసెలయొక్క, కోటర=వివరముయొక్క, అంతః = మధ్యమునందు, కుటుంబితా=కుటుంబిత్వముయొక్క, పాటవమునన్ = సామర్థ్యముచేతను, వల చున్=పరిమళంబులనీనుచున్నది. ఇండ్లలోగృహస్థులు సర్వదావాసము చేయు చున్నట్లు కస్తూరివాసనలరూపమునఁ బోయి యీగదిలోనికిఁ బోవువారినాసి కారంధ్రములందుఁ గాఁపురముచేయుచున్నదని భావము.

తా. కస్తూరితోఁ జేసినతలుపు దెఱచునంతలో, నచ్చటి చంద్రశాలలలో నలుగడలకునువ్యాపింపఁజేసిన ధూప పరిమళమువెల్లిగొని యాగృహము చొచ్చిన వారినాసికారంధ్రములందుఁ గాఁపురముండిమిక్కిలిసువాసన గొలుపుచుండెను.

క. అచ్చట నచ్చట నిడుపుగ
  విచ్చినఁ గుసుమాస్త్ర శాస్త్ర * వేదులమనముల్
  మెచ్చించుఁ దెరలమంజిడి
  పచ్చడములు చతురశీతి * బంధంబులతోన్.    155

టీ. అచ్చటనచ్చటన్=ఆకేళిసౌధమునందొక్కొక్కచోట, తెరలమంజి డి పచ్చడములు=విచిత్రవర్ణములు గలతెరచీరలు, నిడుపుగన్ = పొడుగుగా, విచ్చినన్=విప్పినచో, చతురశీతిబంధవములతోన్ = ఎనుబదినాల్గుబంధముల తోను, కుసుమా...మనముల్ = కామశాస్త్రమును బాగుగాఁ దెలిసినవారి మనస్సులను, మెచ్చించున్=మెచ్చునట్లు చేయును.

క. కలకంఠులకును సురతపుఁ
  గులుకుటెలుఁగు లలవరించు * గురువులపోలెన్
  వలభులఁ గలకలరవములఁ
  గలకలయని పలుకుఁ గలికి * కలవింకంబుల్.    156

టీ. కలికి కలవింకంబుల్=మనోహరమైన యూరఁబిచ్చుకలు, కలకంఠు లకును=మధురమగు కంఠధ్వనిగల స్త్రీలకు, సురత...ఎలుఁగులు= సురతకాల

మందేవిధముగాఁ బలుకవలెనోయట్టి,పలుకులను, అలవరించుగురువులపోలెన్ = నేర్పుచున్న యుపాధ్యాయులవలె, పలభులన్ = గువ్వగూండ్లయందు, కలకలరవములన్ = కలకలధ్వనులతో, కలకల, అని, పలుకన్.

ఉ. టంకముఖంబుల న్మణివిటంకములన్లిఖియించియున్నమీ
నాంకరసప్రసంగమధురాదిమగాథలు పారదారికా
హంకరణక్రియాసమభిహారమహాపరిహాసంకథా
సంకలితంబు లొప్పిదపుశైలిఁబఠింతురుప్రౌఢభామినుల్.

టీ. ప్రౌఢభామినుల్ = శృంగారమునందారితేఱిన స్త్రీలు, మణివిటంకములన్ = రత్నమయములయిన కొణిగెలయందు - టంకముఖంబులన్ = ఉలులయొక్క కొనలచేత, లిఖించియున్న = చెక్కఁబడియున్న, పార ... కలితంబులు - పారదారిక = పర స్త్రీలతో సంగమించుచున్న, అహంకరణక్రియా = అహంకారముతోఁ జేసినచేష్టలయొక్క, సమభిహార = మరలమరల చేయుటయొక్క, మహాపరిహాస = మిక్కిలి పరిహాసమును గల్గించునట్టి, సంకథా = చరిత్రములతో, సంకలితంబులు = కూడియున్నవగు, మీనాంక ... గాథలు = మీనాంకరస = శృంగారరసముయొక్క, ప్రసంగ = ప్రసక్తిచేత, మధుర = శ్రావ్యములయిన, ఆదిమగాథలు = పురాతనగాథలను, ఒప్పిదపుశైలిన్ = సొగసైనరీతితో, పఠింతురు = గానము చేయుచుందురు.

తా. ఆకేళీసౌధమునందు,శృంగారరసానుభూతలై ప్రౌఢివహించిన స్త్రీలు పూర్వకాలమునఁబరదారలతో విహరించిన జారులచర్యలచేఁ బరిహాసమును బుట్టించునవియును, శృంగారరసద్యోతకములగుటచే విన మధురములగునవియునగు గాథలను రత్నమయములగు కొణిగెలయం దులులతోఁజెక్కినవానిని నింపుగాఁ బఠించుచుందురు.

వ. ఇట్టికేళిసౌధంబున నిషధరాజు వధూసహాయుండై రతిసహాయుం డయిన మన్మథుండునుంబోలె నభీష్టవిషయోపభోగంబులం దృతీయపురుషార్థంబు చరితార్థంబుగాఁ జేయువాఁడై.

తే. కామశరవృత్తవర్తికా గంధతైల
దీపితానేకదీపికా దీప్తిజాల
వర్ధితాటోపకామదేవప్రతాప
మయిన యాహర్మ్య మెక్కె నింతియును దాను. 159

టీ. ఇంతియును=దమయంతియు, తాను, నలుండనుట, కామ .. తాపము-కామశర=కర్పూరమువలన, వృత్త=పుట్టిన, లేక సృజింపఁబడిన, వర్తికా=వత్తులచేతను, గంధతైల=సుగంధద్రవ్య రసయుతమగు తైలముచేతను, దీపిత = వెలిఁగింపఁబడిన, అనేకదీపికా=అధికమగు దీపములయొక్క, దీప్తి=కాంతియొక్క, జాల=సమూహముచేత, వర్ధిత=వృద్ధిపొందింపఁబడిన, ఆటోప=అతిశయముగల, కామదేవప్రతాపము = మన్మథప్రభావముగలది, అయినయాహర్మ్యము= అయినట్టిసౌధమును, ఎక్కెన్, సుగంధద్రవ్యములు కాలుటవలనఁగలుగుపరిమళముచేతను, వింతవింతలగు దీపములచేతను మనోహరమగు నాసౌధము మిక్కిలి మన్మథోద్దీపకమగుచున్న దనియు, దానిని నలదమయంతులు ప్రవేశించిరనియు భావము.

సీ. ప్రథమానురాగంబు రాజహంసముచేతఁ
దెలిపియంపినయట్టి దిట్టతనము
పేరోలగంబునఁ బెద్దగద్దియనుండి
దృష్టించి డిగ్గసి ధీరతయును
నుత్తరప్రత్యుత్తరోక్తినైపుణశక్తి
గర్వంబుసూపిన కలికితనము
వరణావసరమున వాసవాదులమాయ
మాయింప నేర్చినమతిబలంబు

తే. నాత్మదివ్యావతారతా వ్యంజకంపుఁ
బ్రౌఢి బచరింప వ్రీడాభరంబుకలిమి

వైశికం బయి యుండు నెవ్వరికిఁ జూడ
గాన లజ్జింప లజ్జించెఁ గమలవదన. 160

టీ. కమలవదన = పద్మమువంటిముఖముగల దమయంతి, రాజహంసము చేతన్ = నలునిచేఁ బట్టుపడియతని కుపకారము చేయ దలంచి రాయబారిగావచ్చిన రాజహంసముచే, ప్రథమానురాగంబు = మొదటియనురాగము. తెలిపి=నలునిఁ దానువరింతుననిచెప్పి, అంపినయట్టి దిట్టతనము = పంపినధైర్యము, పేరోలగంబునన్ = పెద్దసభయందు, పెద్దగద్దియన్ = ఎత్తైనపీఠముపై, ఉండి=కూర్చుండి, దృష్టించి=నలునిఁజూచియు, డిగ్గనిధీరతయును, అనఁగా నలుఁడింద్రాదులకు రాయబారిగాఁ బోయినప్పుడు దమయంతి దూతగావచ్చిన నలునిఁజూచి లజ్జాభయంబులఁ జెందకయట్లెకూర్చుండెను. కానిదిగలేదని అట్టి ధైర్యమును. ఉత్తర...శక్తి-ఉత్తర = నలుఁడిచ్చిన యుత్తరములకుఁ దగిన ప్రత్యుత్తరముగాఁ బలికిన పలుకులందలి నిపుణతాసామర్థ్యముచే, గర్వంబు,చూపిన కలికితనము=కనఁబడఁజేసిన, నేర్పరితనమును, నలుఁడింద్రాదుల వరింపుమని బోధించినప్పుడతనికి యుక్తియుక్తముగాను నిపుణముగాను బ్రత్యుత్తరమిచ్చెను. అట్టి నేర్పు అని భావము. వరణావసరమునన్ = స్వయంవరకాలమునందు, వాసవాదులమాయన్ = ఇంద్రాదులమోసమును, మాయింపన్ = నశింపఁజేయుటకు, నేర్చిన, మతిబలంబు = బుద్ధిబలమును, స్వయంవరకాలమున నింద్రాగ్ని యమవరుణులు "నలుఁడెవఁడో యామెకుఁ దెలియకుండ జేయవలె" నని నలరూపధారులయి కూర్చుండియుండఁ దమయంతి తన బుద్ధిబలముచే సూక్ష్మములగు మనుష్య దేవతాభేదములరసి నలునే వరించినది. అట్టి బుద్ధిబలమును, ఆత్మ... ప్రౌఢి = తనయొక్క దివ్యావతారత్వమునకు వ్యంజకమయిన ప్రౌఢియు, పచరింపన్ = స్పష్టముగా దెలియవచ్చుచుండఁగా, వ్రీడాభరంబుకలిమి=ఆసమయమందుఁజూపుచున్న త్రపాతిశయమును, చూడన్ =ఆలోచింపఁగా, ఎవ్వరికిన్ = ఎట్టివారికిని, వైశికంబయి = వంచకముగానున్నదయి, ఉండును. ఇది వఱలోఁ బౌఢత్వమువహించి దమయంతి యప్పుడు సిగ్గునూనినచో నందఱును

నాసిగ్గును కపటలజ్జనుగా భావింతురని భావము. కాన, లజ్జింపఁగ = నలునితో విహరించునపుడు సిగ్గుపడుటకు, లజ్జించెఁ=సిగ్గుచెందెను.

తే. స్వప్న సంభోగ శతసహ స్రములు వ్రాయె
భ్రమ సమీక్షా వినోదార్బు దములు సనియె
మనములో నిండియున్నది యనుపుఁగూర్మి
యింక లజ్జాభయంబుల కెడముగలదె.   161

టీ. స్వప్న...స్రములు=స్వప్నసంభోగములయొక్క లక్షలు, పోయెఁ= లక్షపర్యాయములు సప్నసంభోగంబులయ్యెనని భావము. భ్రమ...మును=భ్రాంతిచేఁ జూచుట యనెడి వినోదములయొక్క కోటిదశకము చనియెఁ=పది కోట్ల పర్యాయములు భ్రాంతిచేఁ బరస్పర సందర్శనము కలిగినదని భావము. ననుపుఁగూర్మి=కామముచేఁగూఢమయినప్రేమ, మనములోఁ - నిండియున్నది. ఇంకఁ=ఇఁకమీఁద, లజ్జాభయంబులకుఁ=సిగ్గునకును,భయమునకును, ఎడము= అవకాశము, కలదె=ఉన్నదా? లజ్జాభయములు కామముచే నశించెనని భావము.

తే. ఉపలములకంటెఁ గఠినంబు లొక్కవేళఁ
గుసుమములకంటె నొకవేళఁ గోమలములు
గాన లజ్జాభయంబులు గలవులెవు
పువ్వుబోఁడుల హృదయంబు లెవ్వఁ డెఱుఁగు.   162

టీ. ఒక్కవేళ, పువ్వుబోఁడుల హృదయంబులు= స్త్రీలమనములు, ఉప... బులు=రాలకంటె గట్టివి, ఒకవేళ, కు...కంటెఁ=పువ్వులకంటెను, కోమలములు=మెత్తనివి, కాన = లజ్జాభయంబులు, కలలో లేవో యెవ్వఁడు ఎఱుఁగును. స్త్రీలు సమయోచితముగాఁ బ్రవర్తించుచుందురు కాన వారల మనోవర్తన మిట్లుండునని భావము. మఱియుఁ బూర్వము చిట్టితనమునుండిన దమయంతి యిప్పుడు లజ్జాభయములను చెందుచున్నది. కాన యీమె మనోవృత్తిని దెలిసికొనుట కష్టమనుట, అనఁగా నలునిచెంత లజ్జాభయములను బొందుచుండెనని భావము.

వ. కళావతీ ప్రముఖ సఖీ ప్రయత్నంబున నవగత్న శయ్యాసనా
థంబును ధవళదుకూలకీలిత మనోజ్ఞంబునుఁ బ్రత్యంత
స్థాపిత కనక కలశ భృంగారు తాలవృంత దర్పణ తాంబూల
పేటికాఫల కుసుమ గంధ కస్తూరికాది పరికరోపశోభితం
బును నగు కౌతుకాగారంబు ప్రవేశించి. 163

టీ. శయ్యాసన సనాథంబును=పడుకలతోను ఆసనములతోను గూడినది. ధవళ.. మనోజ్ఞంబును=తెల్లపట్టు గుడ్డతోఁ కప్పఁబడి సొగసయినది. ప్రత్య... శోభితంబును=దాపున ఉంపఁబడిన బంగారుగిండి, విసనకఱ్ఱ, అద్దము, తమల పాకుపెట్టె, పండ్లు పువ్వులు, వాసనద్రవ్యములు, కస్తూరి, మొదలగు పరికర ములచే ఒప్పునది, కౌతుకాగారము=క్రీడాగృహము.

క. వ్రీళాసరిన్ని మజ్జన
లీలోచితనమనసల్ల కలితముఖి యగుచుఁ
నేలఁ బదాంగుళి వ్రాయుచు
బాలామణి నిల్చెఁ దలిమపర్యంతమునన్. 164

టీ. బాలామణి=దమయంతి, వ్రీళా...ముఖి=సిగ్గుఅనెడు నదియందుఁ గ్రుం కుట అనెడు పనికి తగిన దైనవంచుటచే సొగ సయిన మొగము గలది, అగు చును, నేలన్=నేల, పదాంగుళిన్=కాలిబొటనవ్రేల, వ్రాయుచున్, దలిమ పర్యంతమునన్=పాన్పుదగ్గఱ, నిల్చెను. ఏటిలో మునుఁగునపుడు తల వంచు నట్లె యిట తలవంచుట లజ్జయనెడు నేటిలో మునుఁగుటచే నైనదని భావము.

ఉ. భావము పల్లవింపఁబుపుఁ బానుపుమీఁదికి నేర్పునన్వయ
స్యావళిదార్ప నెంతయును నర్మిలితోఁ గుసుమాస్త్ర శాస్త్రవి
ద్యావిదుఁడయ్యె బైఁ దిగిచి యక్కునఁ జేర్చెభుజాయుగాంక
పాళీనలయంబులోనఁ దవి లించి కురంగవిశాబలోచనన్.

టీ. వయస్యావళి=చెలికత్తెలసమూహము, భావము పల్లవింపన్ = మనసు ఉల్లసిల్లఁగా, కురంగశాబవిలోచనన్ = లేడిపిల్ల కన్నులవంటి కన్నులుగలదమ

యంతిని, చేర్పనర్, పువుఁబానుపుమీఁదికిన్ = పూవుసెజ్జపయికి, తార్పన్ = చేర్పఁగా, భుజా...యంబులోన్ = రెండుబుజములయొక్క కాఁగిలియనెడు చుట్టులో, తగిలించి=చిక్కించి, అక్కునన్=అ్రొమ్మున, చేర్చెను.

క. హారపరీక్షామిషమున
భూరమణుఁడు గమిచె నింతి పొంకపుఁజన్నుల్
కూరిమి మీఱఁగఁ బులకాం
కూరంబులు వ్రేఁకమఁ జిగురుఁగోరులకొనలన్. 167

టీ. భూరమణుఁడు=రాజు,హార...మిషమునన్=ముత్తెపుసరిని పరిశీలించు నెపమున, చిగురుఁగోరులకొనల=చిగుళ్లవలెనున్న కొనగోళ్లతో,కమిచెన్=పట్టెను.

చ. శుచియగు హారదామమున శుక్తిజరత్నవిభావరీక్షణం
బుచితపుఁగైతవంబుగఁ బ్రియుండు ప్రియంబెసలారఁ జాఁచినన్
గుచలికుచద్వయంబొరసి కొంచుఁబయింబులకాంకురంబులన్
బ్రచురము సేయుచున్నిగిడెఁ బాణి వధూమణి కంఠసీమకున్.

టీ. శుచి...దామమునన్=శుద్ధమైనముత్తెపుసరియందు, శుక్తి...క్షణంబు= ముత్తెములను రత్నముల కాంతిని పరీక్షించుట, ఉచితపుకైతవంబుగన్=తగిన సాకుగా, కుచలికుచద్వయంబు=గజనిమ్మపండ్లవంటి రెండు పాలిండ్లు, పులకాంకురంబులన్=గగురుమొలకలను, ప్రచురంబుసేయుచున్=దట్టము గావించుచు.

తే. నవసమాగమవేళ నత్యవసరమున
నుపిదలజ్జాభరంబున కోహటించి
మైదుపదిసేసె వలరాజు నంతవాఁడు
నరయ నెవ్వాఁడిసొమ్ము జయాపజయము. 169

టీ. వలరాజునంతవాఁడు=మన్మథునియంతటివాఁడిట్టి, నవసమాగమనవేళ = ప్రథమసంగమకాలమందు, ఉవిదలజ్జాభరంబునకున్ = దమయంతి సిగ్గుపెంపునకు, ఓహటించి= వెనుదీసి, ఐదు...సేసెన్=ముందటికాలు, వెనుకకుఁ బెట్టెను.

సీ. ఒకదీప మార్చిన నున్నదింబులు
నప్పుడ తనకుఁదా నూఱుటయును
దాలవృంతానిల చేలాంచలాదిక
వ్యాపారముల దీపమాఱమియును
నాఱినదీపంబు లప్రయత్నంబున
మఱి చూడఁ జూడఁగ మండుటయును
మంకి యాఱియు నాఱి మండినదీపంబు
వెలుఁగుఁ జీఁకటియుఁ గావించుటయును

తే. గలుగునట్లుగ వరశక్తిఁ నలన రాజు
శిల్పముల నవ్వుటాలకుఁ జేయుచుండఁ
దరుణి కుతుకత్రపాద్భుతాతంక భార
సంకటస్థాయివై సారి ణాంక యయ్యె. 170

టీ. తాల...లాదిక = వీవనగాలి వస్త్రపుచెఱఁగు లోనగువాని, కుతు... ణాంక = తమకము సిగ్గు జంకు అనువీని పెంపుల యిఱుకటమందు నిలిచియున్న మన్మథుఁడు కలది.

తే. తరుణి లజ్జాభరంబుచేఁ దన్నువడియుఁ
దోయజానన వెఱపుచేఁ ద్రోపువడియు
నుల్లమున ఖేదమొందక యుండునట్లు
బాలుఁడాయేమి తలపోయఁ బంచశరుఁడు. 171

ఉ. ఇంచుక యుల్లసించినను నేచుని చెప్పఁగ లజ్జ వచ్చి త
ర్జించును సాధ్వసం బడరి శిక్షయొనర్చును మౌగ్ధ్యమేచి వా
రించుఁ బ్రగల్భభావము ధరించియు లేని వధూమనోగతిం
బంచశిలీముఖుండు పసిపాపఁడు పోలె నవసంగమంబునన్.172

టీ. తర్జించును=అదల్చును, సాధ్వసంబు=భయము,మౌగ్ధ్యము=బేలతనము.

సీ. చూర్ణాలకంబుల • గ్రుక్కుఁ జక్కఁగఁ దీర్చి
నలువు నెమ్మనములో • మొలవఁబెట్టు
కర్పూరహారంబు • కదియించు నెపమునఁ
గుచకోరకంబుల • గోళ్లఁ గముచుఁ
దల్పయంత్రణనిరోధంబునంకిలి గూర్చి
యర్ధాంకపాళిక • నాదరించు
నిబిడనీవీబంధ • నిర్మోక్షణమునకుఁ
బనిపూని భీతిఁ గంపంబునొందు
తే. నూరుసంవాహమునకు • నుత్సహించు
ఘననితంబంబుపై నుండ • మనసువెట్టు
నిమ్ననాభికి డిగ్గంగ • నెమ్మిసేయుఁ
బద్మలోచన మరిగి భూపాలునకరము. 173

టీ. నలువు=మచ్చిక, తల్ప...కిలికిన్=శయ్యయం గట్టిగా ఒత్తుటచేత కలిగిన అడ్డువలని జాగును. అర్ధాంకపాళికన్=అలకౌఁగిటిని.

తే. విభుఁడు పరిహాసమాడి నవ్వింపఁ గాసి
పడఁడు లేఁడయ్యె నెన్నియుపాయములను
రాజబింబాస్య తాంబూలరాగసుభగ
దంతకురువిందమాలికాదర్శనంబు. 174

టీ. రాజబింబాస్య = చంద్రబింబమువంటి మొగముగల దమయంతియొక్క, తాంబూల...దర్శనంబు=వీడియపు ఎఱుపుచేత సొగసయిన కెంపులవంటి పలువరుసయొక్క చూచుటను. నలుఁ డెన్నియుపాయములు పన్ని దమయంతిని నవ్వింపఁ జూచినను, ఆబిడపలువరుస తెలియునట్లు పెదవులువిచ్చి నవ్వినదిగాదు. పెదవుల మూసికొనియే యల్లనినవ్వుగా నవ్వెననుట. అల-రూపకము. విశేషోక్తి.

మ. మనుజాధీశుఁడు మగ్నహారలతికా • మాణిక్యముద్రాంకిత

స్తనభారంబుగ గాఢనిర్దయపరిష్వంగంబు పూఁబోఁడికిం
ననుపుంగూరిమిమైవడిం మరపెఁ దత్సాంద్రాక్షభారంబునుం
దనపూవిల్లునునొక్క చందమునఁగందర్పుండొగిన్వంపఁగాన్.

టీ. మనుజాధీశుఁడు=రాజు-నలుఁడు, మగ్న... భారంబుగన్ = లోఁతుగా ఒత్తుకొన్న ముత్తెపుసరిలోని పద్మరాగముయొక్క ఒత్తుడుచేత గుజీలింపఁ బడిన బలితంపు గుబ్బలు గలదియగునట్లుగా, గాఢ... ష్వంగంబు=బిగువై కని కరములేని కౌఁగిలిని, ననుపుంగూరిమిమైవడిన్ = వికాసముగల మక్కువతో, తత్... భారంబును = ఆదమయంతి సిగ్గుపెల్లును, కందర్పుఁడు = మన్మథుఁడు, మరపెన్ = పనుపజీచెను— నేర్పెననుట.

తా. నలుఁడు మక్కువ పిక్కటిల్లఁగా తన ముత్తెపు సరియందలి నాయక మగు పద్మరాగమణి దమయంతి కుచములందు గట్టిగా నొత్తుడువడునట్టు లామెను బిగియఁ గౌఁగిలించుకొనెను. దాని కాబిడ్డ చొక్కటచే సిగ్గు కొంత కొంతగా వీడెను. మన్మథుఁడును గొంచెము గొంచెముగా నామెను పయి కొనెను. అనఁగా లజ్జ తగ్గుచును మన్మథావేశము హెచ్చుచును ఉండె ననుట. అల - అతిశయోక్తి.

తే. మెలఁత యప్పుడు మందాక్షమీలితములు
సౌహృదస్మేరములు నైనసంగమములు
ముకుళితంబులుఁ బుష్పితంబులును నైన
భూజములతోడి యుద్యానభూమిఁ బోలె. 176

టీ. అప్పుడు=అట్లు మన్మథావేశము అతిశయించినప్పుడు, మందాక్షమీలిత ములు=సిగ్గుచేత మూడువంబడినవి, సౌహృదస్మేరములు=నెయ్యముచేత వికసించి నవి, సంగమములు=కలయికలు, ముకుళితములు=మొగ్గలుగలవి, పుష్పితంబులు= పూవులుగలవి, భూజములు=వృక్షములు, ఉద్యానభూమిన్=తోఁటప్రదేశమును, ఇట మీలితస్మేరములయిన సంగమములకును ముకుళిత పుష్పితములయిన భూజ ములకును, దమయంతికిని ఉద్యానభూమికిని, ఉపమ.

సీ. అధరంబుచవిఁ జూపు • మన్య మేమియునొల్ల
నని చెక్కుఁ జేరి మంతనము వలుకు
దైన్యంబు దోఁపఁ బ్రార్థన సేసి తుదిఁబోయి
బలిమిసొంపునను జుంబన మొనర్చు
వదనారవిందాసవముఁ బ్రసాదము సేసి
నను నేలికొంటిగా • యనుచు మెచ్చు
ననుఁగుభృత్యునకు నీపని యర్హ మగు నంచు
నూరుసంవాహనం • బొయ్యఁ జేయు

తే. నేల కుసుమాస్త్రకేళికి • నింత వెఱవ
వెఱవ కే నేమి నీసఖీవితతి యేమి
యనుచుఁ దగ బుజ్జగించి హస్తాంబుజమున
వలపుఁగీలు దెమల్చు భూవల్లభుండు. 177

టీ. మంతనము = రహస్యము, తుదిఁబోయి = కడపట, బలిమిసొంపునను= మిక్కిలి బలాత్కారముచేత, చుంబనము = ముద్దు, వదన అరవింద ఆసవము= మొగము తామర యనెడి మద్యమును, అనుఁగుభృత్యునకున్ =ప్రియ సేవకునకు, ఊరుసంవాహనము = తొడలను చేతితో పిసుకుట, కుసుమాస్త్రకేళికిన్ = రతి క్రీడకు, ఏ నేమి... ఏమి= నేను నేమి నీచెలికత్తెలు వేమి-నీచెలికత్తెలవంటి యంత రంగుడ నేకదా నేననుట, వెఱవకు=భయపడకుము, వలపుఁగీలున్ =పోఁకముడిని, తెమల్చున్ =తీసివైచును.

సీ. పతిపాణిపల్లవ • చ్యుతనీవిబంధన
వ్యగ్రబాలాహస్త • వనరుహంబు
ధవకృతాధరబింబ • దశనక్షతవ్యథా
భుగ్నలీలావతీ • భ్రూలతంబు
ధరణినాయకభుజా • పరిరంభమండలీ

గాఢపీడితవధూ ♦ ఘనకుచంబు
పరనఖాంకురమృదు ♦ వ్యాపారపులకిత
నీరజాక్షీనితం ♦ బోరుయుగళి

తే. యస్తివామ్యభార ♦ మస్తికౌతూహలం
బస్తిఘర్మసలిల ♦ మస్తికంప
మస్తిభీతి యస్తి ♦ హర్షమస్తివ్యథం
బస్తివాంఛమయ్యె ♦ నపుడు రతము. 178

టీ. పతిపాణిపల్లవ=నలుని చిగురువంటి చేతి చేత, చ్యుత=ఊడిన, నీవిబంధన=పోఁకముడిని ముడుఁచుకొనుటయందు, వ్యగ్ర=ఆసక్తమయిన, ధవ=నలునిచేత, కృత = చేయఁబడిన, అధర... వ్యథా = దొండపండువంటి మోవియందలి పలు నొక్కుల నొప్పికి, భుగ్న=వంకరయైన - ముడిపడిన, భ్రూలతంబు=తీఁగవంటి కనుబొమలుగలది-నొప్పికి బొమలు ముడిపడుట ప్రకటము. భుజా... మండలీ= బాహువుల కౌఁగిలింతయొక్క వలయమునందు, గాఢపీడిత = గట్టిగా ఒత్తఁ బడిన, నితంబ=పిఱుఁదు, ఊరుయుగళి=రెండుతొడలు, అస్తి వామ్యభారము= ఉన్నట్టి ప్రాతికూల్యాతిశయముగలది - మొదట దమయంతి మిక్కిలి ప్రతి కూలముగా నుండెనట, అస్తి కౌతూహలంబు = ఉన్నట్టి వింతపాటుగలది, అస్తి... సలిలము = ఉన్నట్టి చెమటనీరుగలది. అస్తికంపము=ఉన్నట్టి వడఁకు గలది, అస్తిహర్షము = ఉన్నట్టి సంతోషముకలది. అస్తివ్యథంబు = ఉన్నట్టి (దంతక్షతాది) పీడగలది. అస్తివాంఛము = ఉన్నట్టి కోరికగలది. అస్తి అను నది విభక్తి ప్రతిరూపకావ్యయము.

చ. కుతుకమునం గురంగమద ♦ కుంకుమచర్చ వహించి నీలలో
హితరుచులై స్వయంభులయి ♦ యీహితసౌఖ్యవిధాయులై నయా
యతివపయోధరంబులకు ♦ నర్ధనిశాసమయంబునం దనం
చితనఖకింశుకార్చనము ♦ సేసె మహీపతిభక్తి యేర్పడన్.

టీ. ఇందు దమయంతీస్తనములకును శివునకును అభేదాధ్యవసాయముచే అర్థద్వయము. కురంగ... రుచులై=కస్తూరియొక్కయు కుంకుమముయొక్కయు పూఁతనుదాల్చి నల్లని ఎఱ్ఱనికాంతులుగలవై యని కుచపరమైన యర్థము. శివుఁడు కంఠమందు నల్లగాను కేశములందు ఎఱ్ఱగాను ఉండునని భావము. స్వయంభు లయి=తమకుఁదామే పుట్టినవై-శివుఁడును తనంతటనే పుట్టినవాఁడని భావము. ఈహిత... యులు=కోరఁబడిన సుఖమును కలిగించునవి. శివుఁడు కోరిన సౌఖ్యముల నిచ్చువాఁడనిభావము. ఐన, అతివపయోధరంబులకున్ = దమయంతి పాలిండ్లకు, అర్ధనిశాసమయంబునన్ = అర్ధరాత్రివేళయందు, సమ...కార్చ, నము=మిక్కిలి ఒప్పుచున్న గోటినొక్కులు అనెడి మోదుగుఁబువ్వుల పూజను చేసెను. శివునివలెనున్నవిగాన పాలిండ్లకు శివునికింబోలె గోటినొక్కులనెడి మోదుగుఁబువ్వులతో రాజు పూజించెననుట. ఉత్ప్రేక్ష శ్లేషరూపకాను ప్రాణితము.

తే. లావునను గూడి పాణిపల్లవయుగమున
నొత్తిపట్టిన సరకు గాకుల్లసమున
హారకాంతిచ్ఛలంబున నల్లనవ్వు
తరుణిచన్నులు రాజుచిత్తము హరించె. 180

టీ. హారకాంతిచ్ఛలంబునన్ =ముత్తెపు సరులకాంతి యనెడి నెపముచేత, అల్లనవ్వు=కొంచెముగా నవ్వుచున్న, నవ్వు తెలుపు గాన తెల్లని హారకాంతిని నవ్వుగా నపహ్నుతి.

క. తరుణికి ధాత్రీపతికిని
బరిచుంబనవేళ దంతపరిపీడన ని
క్షురసంబు పానకములో
మిరియపుఁగారంబువోలె మెచ్చొనరించెన్. 181

టీ. పరిచుంబనవేళన్ =అధరచుంబనసమయమందు, దంతపరిపీడనము=పలు నొక్కు, ఇక్షురసంబు=చెఱకుపాలతోనైన, మెచ్చు=ఇంపు.

తే. చూచియుఁ జూచుఁ గ్రమ్మఱ సుదతిఁ దివుటఁ
గాఁగిలించియు నప్పడ కాఁగిలించుఁ
జుంబనము సేసియును రాజసూనుఁ డెలమిఁ
జుంబనము సేయుఁ బౌనరుక్త్యంబు గాఁగ. 182

టీ. క్రమ్మఱన్ = మరల, తివుటన్ = కోరికతో, పౌనరుక్త్యంబు గాఁగన్ = మరలమరలనగునట్లుగా, మరలమరల నెన్నిమాఱులు చుంబనాదులు సేసియు నలునికి తృప్తి కలుగదయ్యె ననుట.

తే. కులుకు వెలుఁగుల నలరారు పులకములను
గంపములను సమగ్రసీత్కారములను
జుంబనక్రీడలందు రాసుతునిమోము
శీతకరుఁ డౌటఁ జెప్పక చెప్పె నహహా ! 183

టీ. కులుకు+ఎలుఁగులున్ = సొగసయిన కంఠధ్వనులచేతను, మణితముల చేతను, పులకములున్ = గగుర్పాటులచేతను, కంపములను = వడఁకులచేతను, సమగ్రసీత్కారములను = నిండయిన సీత్కృతులచేతను, రాసుతునిమోము= నలునిముఖము, శీతకరుఁడు ఔటన్ = చంద్రుఁడగుటను, చలిచేత కలుగు కులుకు వెలుఁగులు మొదలయినవి రాజముఖమును చుంబనము సేయునపుడును గలుగుటచే ఆముఖము చలివెలుంగు అనఁగా చంద్రుఁ డగుట సిద్ధించుచున్నది. అలం. అనుమానము.

ఉ. వంచన లేక యాననము వాంచినయప్పుడు ఫాల మోరగా
వించివఁ జెక్కుటద్దములు వ్రీడభరంబునకీ లెటెంగి చుం
బించిమనంబుతాలిమిగభీరత రిత్తకు రిత్త పూనిన
మించి ముఖాబ్జచుంబనము మేకొని నవ్విభుఁడు నేర్పునన్.

టీ. ఆననము వాంచిన యప్పుడు = (దమయంతి) ముఖమును (మిక్కిలి) వంచుకొన్నప్పుడు, ఫాలము ... (దమయంతి తన

ముఖమును) ప్రక్కవాటుగాఁ ద్రిప్పఁగా, చెక్కుటద్దములు=అద్దమునంటి ఆమె చెక్కిళ్లను, విభుండు=రాజు, వ్రీడభరంబునకీలు ఎఱింగి=సిగ్గుపెల్లిదముయొక్క మర్మమును కనుఁగొని. అనఁగా దమయంతి మొదట సిగ్గు మిక్కుటమగుటచే తల మిక్కిలియు వంచుకొనఁగా నలుఁడప్పుడు వీలయిన యామె నుదుటిని మాత్రమును పిదప సిగ్గుకొంచెముతీసి మొగమును బ్రక్కకుఁ ద్రిప్పుకొనఁగా నపుడు దొరకొన్న యామె చెక్కిళ్లను, నిట్లు సిగ్గు యెక్కువతక్కువ మర్మములనెఱింగి యందుల కనుగుణముగా, చుంబించి = ముద్దుపెట్టి, మనంబుతాలిమి=మనస్సునందలి ధైర్యముచేత—నుదుటిని ఫాలమును నలుఁడు ముద్దుగొనుటచే దమయంతి చుంబనభయమును వీడినదైయనుట, గభీరత=నిర్వికారతను—అనఁగా సిగ్గులేమిని, రిత్తకురిత్త=మిక్కిలి వ్యర్థముగా, పూనిన=వహింపఁగా-సిగ్గును చాల వదలి మొగమును బయికెత్తెననియు, అట్లు సిగ్గు వదలుటచే ఆమెకుఁ బస యేమియు లేదనియు - అనఁగా దానికిఁ బసయగు నలచుంబనవారణము కలుగదయ్యెననియు భావము. గభీరతచే ముఖమును బయికెత్తుట వ్యంజితము. దానిచే నలుఁడు ముఖాబ్జచుంబనమును, మేకొని = పొంది, నవ్వెనని యర్థము. దమయంతిసిగ్గుపెంపు ననుసరించి మొదట నుదుటిని ముద్దిడి పిదపఁ గొంత జంకు వీడి యాబిడ మొగమును బ్రక్కకుఁద్రిప్పఁగా చెక్కిళ్లను ముద్దిడి యిట్లు రెండు మార్లును ముద్దిడంబడుటచే చుంబనభయము చాలఁ దొలఁగఁగా మనసు దిటచేసికొని సిగ్గులేనిదానివలె గంభీరముగా మొగమును బయికెత్తికొన్న విభుండూరకుండునని చూడఁగా, ఆతెఱఁగెఱిగి నలుఁడామె నెమ్మొగమును ముద్దిడెనని యర్థము.

తే. సతతతాంబూలభోగకషాయితములు
  నుదయభాస్కరనవసారశోభోల్బణములు
  నయిన యధరామృతముల నింకొకియును బతియుఁ
  జలిపి రన్యోన్యమధుపానకేలలితకేళి.  185

టీ. సత...యుతములు = ఎడతెగక వీడెము ననుభవించుటచే ఎఱ్ఱనైనవి,

ఉదయ—భోళ్ళణములు = ఉదయభాస్కరమనెడి కర్పూరవిశేషముయొక్క, క్రొత్తవాసనచేత స్ఫుటములు. ఈ రెండును అధరామృతములకు విశేషణము. అన్యోన్య... కేళి=ఒండొరుల (పుక్కిటి) మద్యములను త్రాగుటయొక్క సొగసయిన క్రీడను - మధుపానులు కషాయితమును వాసితమునైన మధువును గ్రోలుదురు. అధరామృతమును కషాయితమును వాసితమునగుటచే దానిని గ్రోలుట మధువును ద్రాగుటగా చెప్పఁబడెనని తెలియునది. అలం నిదర్శన.

చ. అవహితభావభావిత సహస్రకరామృతభాను మండలుం
డవుచు నసమ్మతక్షణసముభ్యుదితం బగు భావలాఘలా
ఘవము మదిన్ జయించి ప్రియకాంతరసాంతరసన్నిరుద్ధమా
ర్దవఁ గరఁగించుచుం గరఁగె రాజు సమంచితపారవశ్యుఁడై.

టీ. అవహిత...మండలుండు — ఎచ్చరికగల మనస్సుతో భావింపఁబడిన సూర్య చంద్ర బింబములుగలవాఁడు. సూర్యచంద్రధారణచేత నకాలమందు సిద్ధియని తెలియునది. అసమ్మ...లాఘవమున్ =ఇష్టపడని క్షణమందు పుట్టిన భావ ప్రాప్తిచేతనయిన ఉరవడిని—పదటమునునుట. మదిన్ జయించి=మనస్సులో గెలిచి - హృదయమందలి సూర్యచంద్రధ్యానముచేసి యట్టిసమయమునఁ బుట్టిన భావము నుదుటును మనస్సులోపలనే యడంచినాఁడనుట. రసాంత...మార్దవన్=వేఁఱురసముచేత (లజ్జాదులచేతననుట) అడ్డగింపఁబడిన మెత్తఁదనము (అనఁగా రతికి సులువుగా నియ్యకొనుట) గలది—అనఁగా భావము నుదుటు లేనిది, అగు ప్రియకాంతన్, కరఁగించుచు తాను కరఁగెనని యర్థము. మనస్సునందు సూర్య చంద్ర బింబధారణచేత భావోద్ధతి నడఁచి (భావోద్ధతి లేకున్న) ప్రియురాలికి దానిచే భావలాభము కలిగించి కరఁగించుచుఁ దాను కరఁగినాఁడని యర్థము.

తే. భాగ్యవశమున భావలాభంబు లపుడు
రెండు సమమైనఁ గుసుమకోదండ నర

కర్మకాండసమాపన శర్మసార
సంవిభాగంబు సమమయ్యె సతికిఁ బతికి. 187

టీ. భావ...మైనన్ =ఇరువురకును భావప్రాప్తులు సమానముగానపుడు కలుగఁగా, కుసు...విభాగంబు = మన్మథునియొక్క విలాసకార్యముల సమూహమును ముగించుటవలని సౌఖ్యముయొక్క సారము పంచుకొనుట. ఇరువురును మన్మథకేళి కృత్యములవలని సుఖమును సమముగా ననుభవించిరని తాత్పర్యము.

వ. ఇవ్విధంబున నవ్వామవామపాదతల విలుప్తమన్మథశ్రీవిలాసుండైన యవ్విలాసివలనం బ్రథమపరిహాసంబునం బతంగపుంగవగవీహైయంగవీనరసాయ నాస్వాదప్రరూఢంబును జిరకాలావస్థాన సుస్థిరంబును వివిధవిఘ్నపరంపరానిస్తార నిరంకుశభాగ్యోదయంబును సౌభాగ్యగర్వసర్వస్వసహాయంబును నైన నిజానురాగంబునకుందగి వ్రీడాజితమన్మథంబులును దుల్యలజ్జాస్మరంబులునుగందర్పవిజితమందాక్షంబులునునగు కేళీవిశేషంబులఁ గుచకుంకుమ పంకంబుల చేతను ముంగురులచిన్నిపువ్వులచేతను నడుగునెత్తమ్ములక్రొత్తలత్తుకచేతను బింబాధరంపుఁ దాంబూల రసరాగంబులచేతనుం బర్యంకభాగంబు దేటపఱుపం దులాకోటీరటనంబును గంకణఝుణత్కారంబును మేఖలాకలాప కింకిణీకలకలంబును గులుకుఁబలుంగులం గలసి సకినలకీలుఁబఱపులచప్పుళ్లువిప్పసేయుం గ్రమంబున విచ్ఛిన్నహారమండలం బగుసురతతాండవంబునకుం గళాసికయగు పారవశ్యంబునం గుసుమకార్ముకనర్మకర్మకాండ కేళీసమాపనాశర్మసారంబు సమవిభాగంబుగాఁ బంచికొని యనుభవించుచు నిశ్వాసధారాసారంబుల వాసాగారం బధివాసించుచు నెడనెడం బ్రియనఖక్షతార్పణంబులు ఫాణితంబునం దొనర్చిన

మరిచావచూర్ణంబులంబోలు నర్ధనిమీలిత నయనతార కంబును బ్రస్వేదబిందుకందళితనాసికాశిఖరంబును జర్వణా ఘాతబింబాధరశయాళుయావకంబును సామిలుప్తలలాటతిల కంబును నగువదనకమలంబు హృదయవల్లభువక్షస్స్థలైక దేశంబునం జేర్చి నప్పు డమ్మిథునంబు. 188

టీ. అవ్వామ=ఆ దమయంతి, వామ...విలాసుండు = ఎడమపాదముచేత పోఁగొట్టఁబడిన మన్మథుని శోభయొక్క సోయగముగలవాఁడు, అతిశయముగా నొకరిని వర్ణింపవలసినచో వాని యెడమకాలి యందము రాదనుట లోకోక్తి— మన్మథునికంటె మించిన శోభావిలాసములుగలవాఁడనుట. ప్రథమపరిహాసంబు నన్ = తొలుతటి క్రీడయందు, పతంగ...ప్రరూఢంబును = పక్షిశ్రేష్ఠమయిన హంసయొక్క వాక్కనెడి ( నిన్నటి యావుపాల ) నేతియొక్క రసమనెడి రసాయనముయొక్క ఆస్వాదించుటచేత మొలచినదియు—హంసము తీపారఁ జెప్పిన మాటవలనఁ గలిగినదియనుట, చిర...స్థిరంబును = చాలఁగాలమునుండి ఉండినందున గట్టిగ నెలకొన్నదియు, వివిధ...దయంబును—పలువిధములయిన విఘ్నముల వరుసను దాఁటుటచే అడ్డులేని భాగ్యముయొక్క తోఁపికకల దియు, సౌభాగ్య...సహాయంబును=చక్కందనపు గరువముయొక్క సర్వస్వ మునకు తోడయినదియు, ఇవన్నియు నిజానురాగంబునకు విశేషణములు— వ్రీడాజితమన్మథంబులు = సిగ్గుచేత గెలువఁబడిన మన్మథుఁడు కలవియు, తుల్య లజ్జాస్మరంబులును = సమానమయిన సిగ్గును మన్మథుఁడును గలవియు, కందర్ప విజిత మందాక్షంబులును=మదనునిచేత జయింపఁబడిన సిగ్గుగలవియు, అగు కేళీ విశేషములన్ =రతివిశేషములను, చిన్నిపువ్వులు=ముంగురుల కలంకారముగా నుపయోగించు నొకరంజకద్రవ్యము. కేళీవిశేషంబులను కుచకుంకుమ పంకాదుల చేతఁ బర్యంకభాగము తేటపఱిచె ననుటచే నన్యోన్యబంధములచేత వారు క్రీడిం చిరని తెలియునది. తులాకోటీరటనంబు = అందెలచప్పుడు, మేఖలా...కల కలంబును = మొలనూలనెడి యాభరణముయొక్క చిఱుగంటల చప్పుడును,

కులుకుటెలుంగులన్ = మణితములను, సకినల=కీఁచుకీఁచుమని శబ్దించెడి, విప్పు నేయన్ = అధికము సేయఁగా, విచ్ఛిన్నహారమండలంబు=తెగినపేరుల సమూహముగలది, గళాసిక=మెడగత్తెర—సురతక్రీడను నిలుపునది. విశ్వాస...సారంబులన్=నిట్టూర్పు పరంపరయనెడి జడివానలచేత, వాసాగారంబున్=శయన గృహమును, అధివాసించుచున్=పరిమళింపఁజేయుచు, ఫాణితంబునన్=కండ చక్కెరచేత, మరిచాచమూర్ణంబులు=మిరియపుఁబొళ్లు, అర్థ...తారకంబును= సగముమూయఁబడిన కంటినల్లగ్రుడ్లుగలదియు, ప్రస్వేద...శిఖరంబును=చెమట చిన్నబొట్లుగల ముక్కుకొనగలదియు, చర్వ...యావకంబును=చుంబనముచేత కడిగివైవఁబడిన దొండపండువంటి మోవియందున్న లత్తుకగలదియు, సామి... తిలకంబును=నగములోపించిన నొసటిబొట్టుకలదియు, ఇవన్నియు వదనకమల మునకు విశేషణములు. వక్షస్థల ఏకదేశంబునన్ =టొమ్ముననొక్క భాగమున.

మహా. సరియాతాయాతరంహః శ్ఛలకలితరతి శ్రాంతినిశ్వాస ధారా, పరిషద్వ్యామిశ్రభావ ప్రవిఘటితమిథః ప్రాణభేదోదయంబై, యొరిమన్వక్షోజపాళీ యుగకరిమకరీయుగ్భుజామధ్యచిహ్నాభరణవ్యక్తైకభావా భయవిలసితహృద్భాగమై నిద్రవూయెన్. 189

టీ. యాతా...దయంబై—యాతాయాత=రాకపోకలయొక్క, రంహః= వేగముయొక్క, ఛల=నెపముచేత, కలిత=తెలుపఁబడిన, రతిశ్రాంతి=రతియందలి బడలికకలవి అగు, నిశ్వాసధారాపరిషత్ = నిట్టూర్పు పరంపరల సమూహములయొక్క, వ్యామిశ్రభావ=కలయికచేత, ప్రవిఘటిత=పోఁగొట్టఁబడిన, ప్రాణభేద=ప్రాణముల వేఱువేఱుగుటయొక్క, ఉదయంబై=తోఁపికగలదై- నలదమయంతు లిరువురును వేగముగా నూర్పులుగొనుచును బుచ్చుచునుండుట చేత వారు సురతమందు బడలిరనియు వారిరువుర నిట్టూర్పులు నొకటిగాఁ గలసికొని నిగుడుటచే నాయిరువురకు వేఱువేఱు ప్రాణములుగాక నొకటె ప్రాణమున్నట్లు తోఁచుటయుఁ గలిగెననుట, ఒరిమన్ = ఐకమత్యముచేత,

వక్షోజ...భాగమై—వక్షోజపాళీ= స్తనప్రదేశముయొక్క, యుగ=జంటయందలి, కరిమకరీయుక్ =కరిమకరీరూపములయిన పత్త్రరేఖలతోఁ గూడిన, భుజామధ్య=నలునివక్షమందలి, చిహ్న ఆభరణ=ముద్రలనెడి అలంకారములచేత, వ్యక్త=తేటపడిన, ఏకభావ=ఐక్యముగలవైన, ఉభయ=ఇద్దఱియొక్క, విలసిత=ఒప్పుచున్న, హృద్భాగము = హృదయభాగము గలదియునై—ఈ రెండును మిథునమునకు విశేషణములు—దమయంతి కుచములందలి కరిమకరీరేఖలు నలునివక్షస్థలమందు ముద్రితములుకాఁగా నాసమానచిహ్నితచేత నిరువురహృదయములు నొకటియె యని తోఁచినదని యర్థము.

వ. మఱియును. 190

తే. సురతపారవశ్యంబులఁ జొక్కిచొక్కి
కేళినిద్రాసుఖంబులఁ దేలితేలి
మేలుకొని బాహ్యరతిలీల మించిమించి
దంపతులు క్రీడ సల్పిరి తనివి సనక. 191

సీ. ప్రాణేశునొసలిలాంఛనంబు వ్రేఁగాంచి
ముసిముసినవ్వుతో మోము మలఁచు
నేల నవ్వితి చెప్పు మిప్పుడం చడిగిన
నధిపుచేతికి మించుటద్ద మిచ్చు
నుఱుము పెట్టి చనుదోయి మదనాంకములుసూచుఁ
దను నవ్వువిభుఁ జూపులన యదల్చు
రాజుచేఁ జికురభారము సెజ్జ మోవంగ
మ్రొక్కించుకొనుఁ బాదములకు నలిగి

తే. రుద్రమూర్తిజిగీషాను రూపకలన
కతనుఁ డేకాదశాకృతి యైనభంగిఁ

జరణనఖదర్పణములందు కి ధరణివిభుఁడు
లీలఁ బ్రతిబింబితుండుగా కి లోలనయన. 192

టీ. ప్రాణేశు...కంబు = నలుని నుదుటియందలి లత్తుక గుఱుతు, ముసిముసినవ్వులోన్ =ఇంచించుక నవ్వుతో — నలునినొసటియందు లత్తుక దమయంతి పాదములందలిది, అది బంధ క్రీడయందు నతని నొసటఁదగిలినది. అందులకై దమయంతి యోరమోమిడి చిఱునవ్వు నవ్వినదనుట. అద్దమిచ్చుటయతని నే మొగమునఁజూచి తాను నవ్వినందులకుఁ గారణమును దెలిసికొమ్మనుట. తనకునోరఁ జెప్పరాదనియు భావము. మదనాంకములు=మన్మథచిహ్నములు=నఖక్షతాదు లనుట. తనకాలిలత్తుక నలునియందు మదనాంకముగా నున్నట్లె యతని నఖక్షతమును తనయందు మదనాంకముగా నుండుటను జూచుకొన్నదనుట,నలుఁడు తనవలెనే దమయంతియు మదనాంకములను దాల్చియుండుటకై నవ్వినాఁడనుట. చికురభారము=సిగముడి, సెజ్జమోపంగన్ =శయ్యకుఁదగులునట్లుగా—మిక్కిలియు తలవాంచియనుట- రుద్ర...కలనకున్ =రుద్రునియొక్క (పదునొకండు) మూర్తులను జయింపఁగోరుటకు తగినట్టి సవరణకొఱకు, అతనుఁడు=మన్మథుఁడు, ఏకాదశ ఆకృతి= పదునొకండుమూర్తులు గలవాఁడు, అయినభంగిన్ =అయ్యెనోయనునట్లుగా, ధరణివిభుఁడు=రాజు, చరణనఖదర్పణంబులన్ =దమయంతి పాదముల గోళ్లనెడి అద్దములందు, ప్రతిబింబితుండుగాన్ =(అద్రమొక్కుటచే) ప్రతిబింబించునట్లుగా, మ్రొక్కుచుకొనును. పదిగోళ్లయందు పదిప్రతిబింబములును నలుని నిజరూపమునుజేరి పదునొకండుమూర్తులు—నలుఁడు మన్మథుఁడును సమానసౌందర్యముగలవారు-అనఁగా ఒకటే రూపుగలవారు గనుక నలుని యీపదునొకండురూపులును మన్మథుని పదునొకండు రూపులుగా నుత్ప్రేక్షితములయినవి.

సీ. దంతక్షతవ్యథా కి దాయి కాస్యమునకు
దంతక్షతవ్యథ కి దండు వయ్యెఁ
గుచకుంభమర్దన కి క్రూరకర్మం బైన

కరము పాదములొత్తి కరుణఁవడసె
దీప మార్చినయప్డు దీప్తిసూపినకల్ల
మౌళిరత్నము మ్రొక్కి మాన్చికొనియె
నొత్తినతప్పువ్రా నుడిపెఁ గ్రీడాశ్రాంతి
నమృతంబుగురిసి దివ్యాభరణము
తే. మోసగాఁడు నపరాధములకుఁ దగిన
శాస్తి యన్నింటి కిబ్బంగి సంభవించె
సతికిఁ బతికిని నవ్వేళ సంఘటిల్లు
శంబరారాతిధర్మయుద్ధంబునందు. 193

టీ. దంత...కిన్ — ఆస్యమునకున్ = పలుగాటుచే (దమయంతి పెదవికి) బాధయిచ్చునట్టిది అగునలుని మొగమునకు, దంతక్షతవ్యథ, దండువు=అపరాధము, కుచ...కర్మంబు=కుంభములవంటి దమయంతి కుచములను ఒత్తుటయనెడి క్రూరకృత్యముగలది. ఆక్రూరకృత్యముచేసినందులకై, పాదములొత్తి = దమయంతి యడుగులొత్తి, మౌళిరత్నము = నలుని శౌదలయందలిమణి, దీప...కల్ల=దమయంతి దీపమునార్పిన సమయమందు వెలుతురును గలిగించిన తప్పును, దివ్యాభరణము=నలుని దివ్యమైనహారము, ఒత్తినతప్పుతోన్ = తన నాయకమగు పద్మరాగముచే దమయంతి స్తనములందు ఒత్తినతప్పు పోవునట్లుగా, అమృతంబున్ కురిసి, క్రీడాశ్రాంతి = సురతకేళిశ్రమను, ఉడిపెన్ =పోఁగొట్టెను. శాస్తి=శిక్ష, శంబరారాతిధర్మయుద్ధంబునందు=మన్మథుని ధర్మయుక్తమయిన పోరునందు యుద్ధమందోడినవారు దండుగనిచ్చియు అడుగులొత్తియు, మ్రొక్కియు, బడలికయుడిపియు నపరాధక్షామణము చేయఁదగుదురు.

ఉ. వంకైనపూవుమీఁదియళి మాడ్కి నృపాధరవల్లవ్రాదరా
లంకృతి యైనదంతపద లాంఛనముం గని కన్నుఁగోనలం
దంకురితంబులై నదరహాసలవంబులు పద్మనేత్ర యి
ఱ్ఱింకులుసేసెఁ బక్ష్మముల యీఱమిఁగాటుకచిమ్మచీఁకటిన్.

టీ. అళిమాడ్కిన్ =తుమ్మెదరీతిని, నృపా...లంకృతి = రాజుచిగురువంటి పెదవిపొట్టకు నాభరణము. ఐన, దంత పదలాంఛనముల్ =పల్లొత్తుగుఱుతును, కని=చూచి, పద్మనేత్ర=దమయంతి, కన్నుఁగోనలన్ =కంటికొనలందు, అంకురితంబులు=మొలచినట్టివి, ఐన, దరహాసలవంబులు=చిఱునగవు లేశములను, పక్ష్ములలోఱమిన్ = ఱెప్పవెండ్రుకల దట్టమునందు, కాటుకచిమ్మచీఁకటిన్ = కాటుకయొక్క దట్టమయిన చీఁకటియందు, ఇఱ్ఱింకులు=చక్కగా ఇంకిపోవునట్లు, చేసెను. రాజు పెదవిపయిని తన పల్లొత్తునుజూచి దమయంతి కన్నుఁగొనలందుఁ గొంచెము నవ్వుచుఁ దోడనే యా చిఱునవ్వును కనుఱెప్పల గుబురునందును గాటుక నలుపునందును మఱుఁగుపఱిచెనని యర్థము.

ఉ. క్రిక్కిఱిచన్నుదోయియిరుప్రేవలకాంతియుఁబంచబాణుఁగ్రొ
వ్వెక్కఁగఁజేయహస్తయుగళీమెత్తి విహారభరంపుఃబేర్మికిన్
వికిప్రసూనముల్గురియ వేనలి వీడిచి కొప్పువెట్టుచోఁ
జొక్కులఁబెట్టెభూవరునిచూపులఁగోమలిబాహుమూలముల్.

టీ. ఇరుప్రేవల = రెండుపార్శ్వములయొక్క, పంచబాణు = మన్మథుని, క్రొవ్వెక్కఁగన్ చేయన్ = గర్వించునట్లుచేయఁగా, రాజునకు నవి మిక్కిలి మన్మథోద్దీపకములుగానుండెననుట. విహార...పేర్మికిన్ = క్రీడయొక్క భేదముల పెల్లిదముచేత, వికి=ప్రిదిలి, ప్రసూనముల్=పువ్వులను, వేనలి=జడ, చొక్కులఁబెట్టెన్=మిక్కిలి చొక్కించెను.

శా. వాసోభూషణగంధమాల్యరచనా వైచిత్ర్యసజ్జాంగియై
యాసీమంతినియన్యకాంతయనుమిథ్యాభ్రాంతిపుట్టించుచున్
వాసాగారమునందు నొక్కతెయ నానాభంగివర్తించు న
త్యాసక్తిన్నవసౌఖ్యలీలలవిభుం డామోదముంబొందఁగాన్.

టీ. ఆ సీమంతిని=ఆ దమయంతి, వాసో...జ్జాంగియై=వస్త్రములు సొమ్ములు, పరిమళములు, పూదండ (లను వీనిని) రచించుట యందలి విచిత్రప్రకారముల చేత, సజ్జ=అలంకరింపఁబడిన, అంగియై=ఒడలుగలదై = నానావిచిత్ర ప్రకా

రముల వస్త్రాదులఁ గైసేసికొనుచుననుట, అన్యకాంత=వేఱుస్త్రీ, అను, మిథ్యా భ్రాంతి==కల్లభ్రమను, పుట్టించుచుఁన్, వాసాగారమునందుఁన్=పడుకటింటి యందు, ఒక్కతెయ=ఒక్కతియె, నానాభంగిన్=పెక్కువిధములను-వేఱు వేఱు పడఁతులవలె ననుట, విభుండు = పెనిమిటియగు నలుఁడు, అత్యాసక్తిన్=మిక్కిలితగులుతో, నవసౌఖ్యలీలలన్ = అప్పటికప్పుడు క్రొత్తలయిన సుఖక్రీడలచే, ఆమోదమున్ = ఆనందమును, పొందఁగా = పొందునట్లుగా, వర్తించును.

తా. దమయంతి వస్త్రభూషణాదులను వింత వింతలగురీతుల నలంకరించు కొని తానొక్కతియె వేఱువేఱు పడఁతులవలెఁ గనుపట్టుచు నలుని నప్పటప్ప టికిఁ, గ్రొత్తక్రొత్తలగు సౌఖ్యలీలలఁ దేల్చుచుండెను.

ఉ. కైటభవైరియున్ జలధికన్యయునాదిగఁ గీటకంబునుం
గీటకపత్నియుం దుదిగఁ గృత్స్నము రాజును దానునై నిరా
ఘాటరతిన్ సుఖించుటకుఁ గాంక్షయొనర్చు మనోంబుజంబునన్
బాటలగంధి నిత్యనిరుపాధికరాగనిబంధనంబునన్. 197

టీ. కైట...నాదిగన్=విష్ణుఁడును లక్ష్మియు మొదలుగా, కీట...దుది గన్=మగపురుగును దానిభార్యయైన యాఁడుఁబురుగును కడపలగా, కృత్స్నము=అంతయు—అన్ని జీవులును, రాజును తానును ఐ=లక్ష్మీవిష్ణులు మొదలు గా కీటకకీటకపత్నివఱకుఁగల సకల జీవులందు మగరూపు నలుఁడును ఆఁడు ది తానునుగా నభినయించి, నిరాఘాటరతిన్ = మేరలేని క్రీడచేత, పాటల గంధి=పాదిరి పువ్వులతావివంటితావిగల దమయంతి, నిత్య...నిబంధనంబు నన్=నిలుకడయై ఒకనెపమును బట్టిగాక తనంతటఁ బుట్టినదైన అనురాగము యొక్క కట్టుచేత—అట్టిమక్కువ కట్టుపడి, మనోంబుజంబునన్ = హృద యకమలమునందు, సుఖించుటకున్ = రమించుటకు, కాంక్షయొనర్చున్= కోరును. సమస్తప్రాణులయందు దంపతులరూపులను దామిరువురు నభిన యించి రమింపఁగోరినదని తాత్పర్యము.

ఆ. వనితరూపవేష • వాసోంగవాసనా
భూషణాదిబహువి • శేషరచన
నవ్యదివ్యకాంత • యనుశంక పుట్టించి
నేర్పు క్రొత్తగాఁగ • నృపతిఁ గవయు. 198

వ. ఇవ్విధంబున నమ్మిథునంబు నిధువనక్రియాపరాధీనంబై యా నందజలధి నోలలాడుచుండ నవ్విభావరి జరాభావంబు ధరించె మనోభవుండు కోదండంబెక్కుడించి సంగ్రామవిరామ సూచకంబుగాఁ గుక్కుటకంఠకాహళంబులు వట్టించె నప్పుడు వైతాళికులు గేళీప్రాసాదపర్యంతభాగంబుననుండి యుచ్చైస్స్వరంబున నిట్లనిరి. 199

టీ. అమ్మిథునంబు = ఆదంపతులు—నలదమయంతులు, నిధువనక్రీడాపరాధీనంబై=రతిక్రీడకు మిక్కిలిలోనై, విభావరి=రాత్రి, జరాభావంబు=ముదిమిని ధరించెను—అనఁగా తెల్లవారెననుట. మనోభవుండు=మన్మథుఁడు, సంగ్రామ ...కంబుగాక్=యుద్ధమును ఉడుగుటకు గుఱుతుగా—దంపతులు చేయురతి క్రీడను మానుటకు నెచ్చరికగా ననుట. కుక్కుటకంఠకాహళంబులు=కోడిగొంతులనెడు కాళెలను, పట్టించెను=ఊఁదునట్లు చేసెను. ఆదంపతులు కోడికూఁతను విని తెల్లవాఱవచ్చెనని క్రీడ యుడిగిరని తాత్పర్యము.

మ. ప్రణతానేక నృపాలమౌళివలభీ • పర్యంకరత్నావళీ
ఘృణికిర్మీరితపాద పీఠ జయలక్ష్మీ • కేళి మాణిక్యద
ర్పణ,దర్పాంధ విరోధిరాజనివహ • ప్రాణానిలాహారభ
క్షణకుక్షింభరిభూరిదక్షిణభుజా • స్తంభాసి కుంభీనసా. 200

టీ. ప్రణతా...దర్పణ—ప్రణత=నమస్కరించుచున్న, అనేక=పెక్కురయిన, నృపాల=రాజులయొక్క, మౌళి=శిఖలనెడి, వలభీ=చంద్రదశాలలనేడి, పర్యంక = మంచములందున్న, రత్నావళీ = రత్నపంక్తులయొక్క, ఘృణి = కిరణములచే, కిర్మీరిత=పలువర్ణములుకలదిగా చేయఁబడిన, పాదపీఠ=పాదము

లుంచుకొనెడి గద్దియయనునట్టి, జయ...దర్పణ=విజయలక్ష్మీ విలాసార్థమైన మ ణిముకురముగలవాఁడా, సమస్తరాజులును రత్నమయములగు తమ కిరీటములు సోఁకునట్లు మ్రొక్కఁగా సింగనామాత్యు పాదపీఠము చిత్రవర్ణములుగలదై తాను క్రొత్తగావరించిన జయలక్ష్మికి మణిమయమగు నద్దమువలె నే ప్రకాశించు చున్నదని భావము. దర్పాంధ...భీనసా—దర్పాంధ=గర్వాంధులయిన, విరో ధిరాజ=శత్రురాజులయొక్క, నివహ=సమూహముయొక్క, ప్రాణానిల=ప్రాణ వాయువనెడి, ఆహార=భోజనమును, భక్షణ=భక్షించుటయందు,కుక్షింభరి=అ ధికాసక్తిగల,భూరి... స్తంభ=గొప్ప స్తంభంబువంటి కుడిచేతియందున్న,అసి= కత్తియనెడి, కుంభీనసా=సర్పరాజుగలవాఁడా, అనఁగా సర్పము వాయు వును భక్షించుచున్నట్లు సింగనామాత్యునిచేతిలోనున్న కత్తి గర్వాంధులయిన శత్రురాజుల ప్రాణము లపహరించుచున్న దని భావము.

క. ప్రౌఢజయశ్రీకుచభర
గాఢపరీరంభకేళికౌతుకసుఖసం
రూఢనవపులకముకుళ
వ్యూఢోరస్స్థల విలోచనోత్సవమూర్తీ. 201

టీ. ప్రౌఢ...స్థల, ప్రౌఢ=ప్రౌఢురాలయిన, జయశ్రీ=జయలక్ష్మియొక్క, కుచభర=పెద్దకుచములను, గాఢపరీరంభ=గట్టిగాఁ గౌఁగిలించుకొనుటయనెడి, కేళి=ఆటయందు, కౌతుక=వేడుకచేతను, సుఖ=సౌఖ్యముచేతను, సంరూఢ= పుట్టిన, నవ=క్రొత్తవయిన, పులకముకుళ=మొగ్గలవంటి గగుర్పాటు గలదియు వ్యూఢ=వెడల్పయినదియు,అగుఉరఃస్థల=వక్షఃస్థలముగలవాఁడా,విలోచ...ర్తి నేత్రముల కానందము గొల్పుయాకారముగలవాఁడా, సంతతమును జయలక్ష్మిని వరించుచున్నవాఁడనియు, విశాలమగు వక్షస్థలముగలవాఁడనియు నేత్రానంద కరమైన యాకారముగలవాఁడనియు భావము.

మాలిని. అమృతజలధికన్యాప్రాణనాథాంఘ్రిసీమా
సముదితసురగంగాసామ్యకీర్తిప్రదీపా

క మలభవపురంధ్రీ కె కంఠనక్షత్రమాలా
సమధికమణిరోచి కె స్స్వచ్ఛలీలానులాపా. 202

టీ. అమృత...దీపా-అమృతజలధికన్యా=లక్ష్మీదేవియొక్క, ప్రాణనాథ=ప్రియునియొక్క, అనఁగా నారాయణునియొక్క, అంఘ్రిసీమ=పాదతలమున, సముదిత=పుట్టిన, సురగంగా=గంగానదియొక్క, సామ్య=సాటికల, కీర్తి=యశస్సుచేత, ప్రదీపా=ప్రకాశించువాఁడా, కమల...లాపా-కమలభవపురంధ్రీ=సరస్వతియొక్క, కంఠ=గళమందున్న, నక్షత్రమాలా=నక్షత్రమాలికయంచలి, సమధిక=గొప్పవయిన, మణీ=ముత్యములయొక్క, రోచిః=కాంతివలె, స్వచ్ఛ=నిర్మలమయిన, లీలా=విలాసములు గల, అనులాపా=వాక్కులుకలవాఁడా. అలం. ఉపమ. రూపకము.

ఇది శ్రీమత్కమలనాభపౌత్త్రి మారయామాత్యపుత్త్ర సకలవిద్యాస
నాథ శ్రీనాథ ప్రణీతంబయిన శృంగారనైషధకావ్యంబునందు
సప్తమాశ్వాసము సమాప్తము.

శుభంభూయాత్.





శ్రీరస్తు.

# శృంగారనైషధము

## అష్టమాశ్వాసము.





శ్రీధామ రెడ్డివేమ
క్ష్మాధీశ్వరసచివసింగ నామాత్య దిశా
సౌధశిఖరాగ్రకీలిత
సాధీయస్స్ఫటికకుంభ సన్నిభకీర్తీ. 1

టీ. శ్రీధామ=లక్ష్మికిస్థానమైనవాఁడా, రెడ్డి వేమక్ష్మాధీశ్వరసచివ=రెడ్డికులజుఁడైనవేమభూపాలునకు మంత్రియగువాఁడా, సింగనామాత్య, దిశా...కీర్తీ- దిశా=దిక్కులనెడి, సౌధ=మేడలయొక్క, శిఖరాగ్ర = శిఖరములకొనలందు, కీలిత=అమర్పఁబడిన, సాధీయః=మిక్కిలి మేలయిన, స్ఫటికకుంభ=పటికపుకలశములతో, సన్నిభ=సమానమయిన, కీర్తి=యశస్సుకలవాఁడా, అనఁగాఁ దిగంతములవఱకు వ్యాపించిన యశస్సుగల సింగనామాత్యా! అనిసంబోధనము. అల. ఉపమ.

తా. స్పష్టము.

వ. అవధరింపుము. 2

మ. జయశీతాంశుకులావతంస! నిషధ స్వామీ! మహారాజ! యు
వ్వయధైర్యాకర! నిద్రమేల్కొనుము! సంధ్యావేళ యేతెంచె

నీ,నయనాబ్జంబులకిచ్చుభవ్యశకునా । నంధైకకల్యాణముల్
శయనోత్థాయముభోజరాజ తనయా। సంఫుల్ల నేత్రాబ్జముల్.

టీ. శీతాంశుకులావతంస=చంద్రవంశజులగురాజులకు శిరోభూషణమువంటి వాఁడా,నిషధస్వామీ= నిషధదేశాధీశ్వరా, మహారాజ, అవ్యయధైర్యాకర= నాశనములేనిధైర్యమునకు స్థానమగువాఁడా, జయ=సర్వోత్కర్షములోవర్తింపుము, సంధ్యావేళ=ప్రాతస్సంధ్యాసమయము, ఏతెంచెన్=వచ్చెను. నిద్ర= నిద్రనుండి, మేల్కొనుము = తెలివితెచ్చుకొనుము, శయన+ఉత్థాయము= పడుకనుండిలేచినంతనే-ఇట ఉత్థాయ అనుచో 'ణముల్' తెలియునది. 'అపాదానేపరీప్సాయాం' అను సూత్రముచే పరీప్సయందిటవచ్చినది. భోజరాజ... వర్తింబునన్—భోజరాజతనయా= దమయంతియొక్క, సంఫుల్ల=వికసించినట్టి, నేత్రాబ్జముల్ = కనుదమ్ములు, భవ్య...కల్యాణముల్—భవ్య=ఉత్తమమయిన, శకున=శకునమువలనఁ గల్గిన, ఆనంద=సంతోషమనెడు, ఏక=ముఖ్యమైన, కల్యాణముల్=మంగళములను, నీనయనాబ్జంబులకున్ = నేత్రపద్మములకు, ఇచ్చుక్=ఒసంగుఁగాక, ప్రాతఃకాలమున నిద్రనుండి మేల్కనఁగానే ప్రియజనముఖమును జూడనలయునని శాస్త్రము. నీకు దమయంతికంటెఁ బ్రియమగు వస్తువులేదుకాన నీవు మేల్కని యాదమయంతి ముఖమునే దర్శింపుము. ప్రియతమమగు దమయంతి ముఖమును జూచుచు శయ్యనుండిలేచుట. శుభశకునమయి నీ కమితమగు మంగళములును నానందమును గల్గించుననిభావము. మఱియు 'పశ్చాచ్ఛయనం పూర్వముత్థానం' అని స్మృతి. అనఁగా భర్తకంటె వెనుక నిద్రించి ముందుగా మేల్కొనుట. ఉత్తమురా లయినదమయంతి నీకంటె ముందుగా మేల్కొనును. కాన జాగ్రదవస్థచేఁ దెలివిగాంచిన దమయంతి ముఖము నీకు దర్శింప సులభమైయుండును.

తా. ఓనలరాజా! నీవు సర్వోత్కర్షముచే వర్తింతువుగాక. సంధ్యాకాల మేతెంచెను. నిద్రనుండి మేల్కనుము. ప్రియతమమగు దమయంతి మొగమును ముందుగాఁ జూచుటవలన నీకు మేల్కాంచు మంగళములను గల్గించుఁ గాక.

మ. వరుణప్రేయసియైనదిక్కుఁగదియన్వాంఛించు చుంజంద్రికా
పరిధానంబుఁగ్రమక్రమంబునఁబరిభ్రంశంబు నొందించుచం
దురునింగన్గొని యింద్రదిగ్వనిత ప్రత్యూషప్రసాదోదయ
స్ఫురణవ్యాజమునన్నిజాననమునంబూనెంబ్రహాసద్యుతుల్.

టీ. ఇంద్రదిగ్వనిత=తూర్పుదిక్కనెడిస్త్రీ, వరుణప్రేయసి=వరుణదేవునకుఁ బ్రియయైనది, ఐనదిక్కున్=అయినట్టిదిక్కును, అనఁగాఁ బడమరదిక్కును నను ట, కదియన్=సమీపించుటకు-నాయక పక్షమున సంభోగించుటకు, చంద్రికా పరిధానంబున్=వెన్నెలయనెడి కట్టుపుట్టమును-రెండవపక్షమున, వెన్నెలవలెఁ దెల్లని పరిధానమును, క్రమక్రమంబునన్=క్రమక్రమముగా, పరిభ్రంశంబున్ =నాశనమును, రెండవపక్షమును అనురాగవశమున వస్త్రత్యాగమును, ఒందించు చందురునిన్=పొందించునట్టి చంద్రుని,కన్గొని=చూచి, నిజాననమునన్ = తన ముఖమునందు,ప్రత్యూష...వ్యాజమునన్—ప్రత్యూష=ప్రాతఃకాలమందలి, ప్రసాద=నైర్మల్యముయొక్క,ఉదయస్ఫురణ=ఉత్పత్తిప్రకాశమనెడి, వ్యాజ మునన్=మిషచేత, ప్రహాసద్యుతుల్=నవ్వుసంబంధియగు కాంతులు,పూనెన్ =భరించెను. ప్రాతఃకాలారంభమునఁ దూర్పుదిక్కు కాంతులచేఁ దెల్లగా నుండెను. చంద్రుఁడు కాంతిహీనుఁడై పడమటిదిక్కును జేరియుండెను. కవి యీసమయము నిట్లుగా వర్ణించె. ఇటఁ దూర్వదిక్కు స్వీయ, పశ్చిమదిక్కు పరకీయ,చంద్రుఁడు నాయకుఁడు ఇటఁ జంద్రుఁడు వరుణదిక్కునం దనురాగము పూని, యనురాగాతిశయముచే విగతవసనుఁ డయి కాంతను గదియు నాయ కునివలెఁ జంద్రిక యనెడిపరిధానమును విడజార్చుచు సమీపించెను. తన భర్త యన్యకాంతపై ననురక్తిపూని రాగాతిశయముచే వస్త్రహీనుఁడై పోవుటను జూచి పూర్వదిక్కాంత నవ్వెను.ఇంతియకాక నాయం దనురక్తుఁడై యున్నం తకాలమును నభ్యుదయమునువహించి కాంతిమంతుఁడై యుండినచంద్రుఁడిప్పు డపరదిక్కాంతను జేరుట తోడనే కాంతి విహీనుఁ డయ్యెననియుఁ బూర్వ దిక్కాంత నవ్వెనని భావము. ఈరీతి హసించిన పూర్వదిక్కాంత దరహాస కాంతులవలెఁ బ్రత్యూషకాంతులు ప్రకాశించెననిభావము. ఓనలరాజా! తూర్వ

తెల్లవారెను. చంద్రుఁ డరుణకిరణములచేఁ గాంతిహీనుఁ డై పడమట నస్త మించుచున్నాఁడు. కావున శీఘ్రముగా మేల్కొనుమని ఫలితార్థము. అలం. సాపహ్నవోత్ప్రేక్ష, రూపకానుప్రాణితము.

తా. చంద్రుఁడు పశ్చిమకాంతతోఁ గ్రీడింపఁదలంచి చంద్రికయనెడి వస్త్రమును రాగాతిశయముచే దిగఁ జార్చుచు దాని సమీపించుచుండెను. ఇంద్రదిక్కాంత యది చూచి ప్రాతఃకాల కాంతులనెడి నెపమున నవ్వసాగెను.

సీ. చంద్రాతపంబులు సాంద్రక్షపాతమ
  సహాయుద్ధ్వలై పరిశ్రాంతిఁ బొందె
నతిదరిద్రాణదేహద్యుతిప్రాణ మై
  ప్రాలేయకిరణ బింబంబు ప్రాలె
నపరస్పరంబు లై యాకాశవీధికిఁ
  గొన్ని భాస్కరకరాంకురము లెగసె
నమహాతితరదీప్తి నంతంతఁ జుక్కలు
  సంఖ్యావిధేయ శేషంబు లయ్యెఁ
తే. గుముదకేదారముననుండి క్రొత్తవిరియు
  కమలషండంబునకు వేడ్కఁ గాఁపువచ్చె
కొదమతుమ్మెదకడతెక్కఁ గుసుమనెట్టె
  నభినవం బైన ప్రథమ సంధ్యాగమంబు. 5

టీ. చంద్రాతపంబులు=వెన్నెలలు, సాంద్ర...యుధ్వలై—సాంద్ర=దట్టములయిన, క్షపా=రాత్రియందలి, తమః = చీకట్లతో, సహాయుధ్వలై=కూడఁ బోరాడినవై, పరిశ్రాంతిక్ = విశ్రాంతిని, పొందెను. చంద్రకాంతులు చీకట్లతోఁ బోరాడి వానిఁ దఱిమి తాము యుద్ధరంగంబును విడిచి విశ్రాంతిని బొందెనని యర్థము. ప్రకృతమున యుద్ధభూమి సదృశమగు రోదసీకుహరమునఁ జీఁకట్లుగాని వెన్నెలలుగాని లేవని ఫలితార్థము. అతి...ప్రాణమై—అతిదరిద్రాణ=మిక్కిలి క్షీణత్వమును బొందిన, దేహద్యుతి=దేహకాంతియనెడి, ప్రాణ

మై=సత్తునకలదై, ప్రాలేయకిరణబింబంబు = చంద్రమండలము, వ్రాలెన్ = ఒరగిపోయెను. అరుణకాంతి సంతానముచే విగతకాంతిమై చంద్రుండు పడమట వ్రాలిపడియుండెనని భావము. కొన్ని భాస్కరకరాంకురములు=కొన్ని సూర్య కిరణములు, అపరస్పరంబులై=అవిచ్ఛిన్నములై, ఆకాశ వీథికిన్ =గగన మార్గమునకు,ఎగసెన్ =ఎగిరివ్యాపించెను, అమహాతితరదీప్తిన్ =మిక్కిలి సూక్ష్మమగుకాంతిచే, అంతంతన్ =అచ్చటచ్చన్, చుక్కలు, సంఖ్యావిధేయశేషంబులు=లెక్కింపఁదగినంత మిగులు కలవి, అయ్యె, అనఁగా చుక్కలు చాలవఱకు మఱుఁగయి మిగిలినవి లెక్కింపఁగూడునట్లు కొన్నిమాత్రమే కనఁబడుచుండె ననుట. అభినవంబు = క్రొత్తదయినది, ఐనప్రథమసంధ్యాగమంబు= అయినట్టి ప్రాతస్సంధ్యారాగము, కుముదకేదారముననుండి=కలువమడినుండి, క్రొత్త=నూతనముగా, విరియు కమలషండంబునకున్ =వికసించెడి పద్మసమూహములకు, వేడ్కన్ =వేడుకతో,కాఁపువచ్చు కొదమతుమ్మెదకడ ఱెక్కన్= కాఁపురమువచ్చెడి తుమ్మెదకొదమలయొక్క ఱెక్కకొనను, కుసుమవెట్టె=కుసుంభవర్ణముగలవానిగాఁ జేసెను-అనఁగా సంధ్యాసంబంధియగు నెఱ్ఱఁదనము గలవానిఁగాఁ జేయుచుండెను.

తా. రాత్రియందు దట్టములై వ్యాపించిన చీఁకట్లను దొలఁగించిన వెన్నెలలు నశించెను. చంద్రుఁడు కాంతిహీనుఁడై పడమట వ్రాలెను. సూర్యకాంతులాకసమునఁ బ్రకాశింపఁజొచ్చె; రాత్రియందు నధిక కాంతులుగల చుక్కలు చాలమఱఁగి లెక్కింపఁగూడినట్లు కొన్నిమాత్రము మిగిలియున్నవి. సంధ్యారాగకాంతులు కుముదవనములనుండి యప్పుడే వికసించుచున్న పద్మవనములకు వచ్చుచున్న తుమ్మెదల కొనఱెక్కలకుఁ గుసుంబారంగు వేయుచుండెను.

క. కరవాఁడిసూదిఁగుదమొన
నర దఱువఁబడిన ముత్తికయంబునుబోలెన్
గర మొప్పె రజనికరిణీ
కరవమథువుహిమము కుశశిఖాశిఖరమునన్. 6

టీ. రజని...వమధువు—రజనికరిణీ = రాత్రిఅనెడి ఆఁడుఏనుఁగుయొక్క, కర=తొండముయొక్క, వమధువు=తుంపరయగు, హిమము=మంచు, కుశశిఖా శిఖరములన్ =దర్భచిగుళ్లయొక్క కొనయందు, కరవాఁడిసూదితుదమైనన్ = మిక్కిలివాఁడియైన సూదియొక్క మొనచేతను, అరదఱుకంబడిన ముత్తియంబునుబోలెన్ =సగముతొలువఁబడిన ముత్తియమువలె, కరమొప్పెన్ =మిక్కిలి ప్రకాశించెను. ముత్యములకు రంధ్రములు తొలుచుటకుగా శిల్పులు సూదిమొన ముత్యమును గ్రుచ్చుదురు. దర్భకొనలందున్న మంచుబిందువల్లె ప్రకాశించుచున్నదని భావము. అలం. ఉపమ.

మ. దివిషద్దంపతితల్పమైనగగనోద్దేశంబునం దారకా
నివహంబుల్ కుసుమస్రగంశములుగా నిర్వాణకాంతిచ్ఛటా
నవతూలప్రకరోదరంభరినిశానాథుండు గండోపధా
నవిధాలీల వహించె నత్తఱి నఖండంబైనబింబంబుతోన్.

టీ. అత్తఱిన్ =ఆ ప్రాతఃకాలసమయమున, దివిషద్దంపతితల్పము=దేవతామిథునములకు పానుపు, ఐనగగనోద్దేశంబునన్ =అయినట్టి యాకాశప్రదేశమునందు, తారకానివహంబుల్ =నక్షత్రములసమూహములు, కుసుమస్రగంశములుగాన్ =పుష్పమాలికయొక్క తునియలగుచుండఁగా, నిర్వాణ...భరి—నిర్వాణ=శాంతించిన, కాంతిచ్ఛటా=కాంతిసమూహములనెడి, నవతూలప్రకర=క్రొత్తదూదిగుంపుచే, ఉదరింభరి=కడుపునిండించుకొన్నవాఁడగు,నిశానాథుండు= చంద్రుఁడు, అఖండంబు=పూర్ణమైన, బింబంబుతోన్ =మండలముతో,గండోపధానవిధాలీలన్ =చెక్కుటిదిల్లతలగడయొక్క విలాసమును, వహించెన్ =ధరించెను. గగనతల్పము దేవతాద్వంద్వములు శయనించెడి పానుపువలెను నక్షత్రములు సురతసమ్మర్దమువలనఁ దెగిపడిన పుష్పమాలికల పువ్వులవలెను, చంద్రుఁడు వర్తులమయిన దూదితలగడవలెను ప్రకాశించెనని భావము. అలం. నిదర్శన.

తా. ఆప్రాతఃకాలసమయమున దేవతామిథునములకు శయ్యయైన గగనతలమందు నక్షత్రములు సురతమందుఁ జెదరిన పుష్పములవలె నొప్పుచుండఁగా,

కాంతి సమూహములనెడి దూదిని గర్భమునఁ దాల్చిన చంద్రుని పూర్ణబింబము దలగడవలెఁ బ్రకాశించెను. అలం. రూపకము.

శా. శ్యైనంపాతమె యిన్నభంబునఁ సహస్రాంశుండు నై చెంగర
శ్యేనవ్రాతము నంధకారబలిభుక్ శ్రేణీ జిఘాంసారతిన్
దానం జంద్రుఁడు పశ్చిమాశకు శశత్రాణార్థమై యేఁగెను
డ్డీనంబయ్యె నుడువ్రజంబు పరిపాటిం బారు వాలోయనన్.8

టీ. సహస్రాంశుండు=సూర్యుఁడు, శ్యైనంపాతమెయిన్ =డేగవేఁటతో, అంధకార...రతిన్ - అంధకార=చీఁకటియనెడి, బలిభుక్ =కాకులయొక్క, శ్రేణీ=పంక్తులయొక్క, జిఘాంసా=చంపుటయందలి, రతిన్ =ఆసక్తిచే, నభంబునన్ = ఆకాశమునందు, కరశ్యేనవ్రాతము = కిరణములనెడి డేగల సమూహమును, వైచెన్ =వదలెను. వేఁటకాండ్రు పక్షులనుబట్టి చంపునిమిత్తము పెంపుడు డేగలను విడుతురు. అట్లె సూర్యుఁడు చీఁకటియను కాకులనుజంపుటకై తన కిరణములనెడి డేగలను విడిచెను. కాన యిప్పుడు సూర్యుడు డేగలతో వేఁటాడుచున్నాఁడని భావము. దానన్ =ఆడేగలతో వేఁటాడుచుండుటచేతనే, చంద్రుఁడు, శశత్రాణార్థమై=తనయొద్దనున్న చెవులపిల్లిని రక్షించునిమిత్తము, పశ్చిమాశకున్ =పడమటకు, ఏఁగెన్ =పోయెను, ఉడువ్రజంబు=నక్షత్రసమూహము, పరిపాటిన్ =క్రమముగా, పారువాలోయనన్ =పారువాపిట్టలేమో యనునట్లు, ఉడ్డీనంబు, అయ్యెన్ =ఎగిరి యదృశ్యమయ్యెను. డేగవేఁట ప్రారంభమయినదన్న సమాచారము తెలియగానే చంద్రుఁడు తనశశమును దక్కించుకొనుటకుఁ బర్విడెను. నక్షత్రములు పార్వాలో యన్నట్లు పాఱిపోయె. సూర్యకిరణము లాకాశమునఁ బ్రసరించునప్పటికిఁ జీఁకట్లు నశించెను. చంద్రుఁడు పడమటికేఁగెను. చుక్క లదృశ్యమాయెను. వేగముగా మేల్కొనుమని ఫలితార్థము. అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

తా. సూర్యుఁడు చీఁకట్లనెడి కాకులను జంపనెంచి, తనకరము లనెడిడేగలను నాకాశమున విడిచెను. కావుననే చంద్రుఁడు తనశశమును రక్షించుకొనఁ

బడమటకుఁ బఱ్వెడుచున్నాఁడు. చుక్కలు పావురాలో యనునట్లు పఱ్వెడి యదృశ్యమయ్యె.

క. లఘుగతి ననూరుసారథి
విఘటితతిమిరుఁ డయి వీఁడె వివ్చ్చెసె దివిన్
మఘవపురప్రాసాద
ప్రఘాణకోణాంగణము లుపఘ్నంబులుగాన్. 9

టీ. అనూరుసారథి=అనూరుఁడే సారథిగాఁగలవాఁడు, అనఁగా సూర్యుఁ డనుట, లఘుగతిన్ =సులభ గమనముచే, విఘటితతిమిరుఁడయి=చీఁకట్లను దఱిమినవాఁడై, మఘవ... గణములు - మఘవ=ఇంద్రునియొక్క, పురప్రాసాద=పురమందున్న వైజయంతమనెడి మేడయొక్క, ప్రఘాణ=తలవాకిటివైపున్న చిన్నగదులయొక్క, కోణ=మూలనున్న, అంగణములు=వాకిళ్లు, ఉపఘ్నమ్ములుగాన్ =సమీపాశ్రయము లగుచుండఁగా, వీఁడే=ఇదిగో,దివిన్=ఆకసమందు,విచ్చేసెన్ =వెడలివచ్చెను. సూర్యుఁడు త్వరితగమనముచే వచ్చుచుఁ, జీఁకట్లఁ దఱుముచు నింద్రప్రాసాదమునకుఁ దగ్గఱగా నున్నవాకిళ్లను దఱియ వచ్చుచున్నాఁడని భావము. అనఁగా సూర్యుఁ డాకాశమును గొంత యతిక్రమించెను గాన మేల్కొనుమని ఫలితార్థము.

తా. సూర్యుఁడు చీఁకట్లను దఱిమినవాఁడయి యింద్రప్రాసాదమునకు దగ్గఱనున్న వాకిళ్లను దఱియ నిదిగో వచ్చుచున్నాఁడు.

చ. గ్రహములు నిర్జరీసురతకాల విసూత్రితహార రత్న సం
గ్రహములు మేఘవీథియను కౌతుకమందిరచత్వరంబునన్
బహుకరమార్జనావిధిప్రభాత ముఖంబునఁ బాయఁదట్టె ని
ష్ఠహహ!భుజిష్యవోనియతియంతకయారసిచూడవచ్చినన్.

టీ. మేఘ...రంబునన్ = ఆకాశమనెడి కేళీమందిరముయొక్క వాకిటియందు, నిర్జరీ...గ్రహములు - నిర్జరీ=దేవతాస్త్రీలయొక్క, సురతకాల=రతిసమయమున, విసూత్రిత=తెగిపోయినవగు, హార=సరులలోని, గ్రహములు=నక్ష

త్రములు, ఇట గ్రహపదమునకు నక్షత్రార్థము లక్షింపవలెను. రత్న=రత్నముల యొక్క, సంగ్రహములు=సముదాయములు, వానిని, బహుకర...విధి - బహుకర=సూర్యుఁడనెడి, కర్ల మతుడుచువానియొక్క, మార్జనావిధి=తుడుచుట యనెడి, క్రియ, ప్రభాతముఖంబునన్=ప్రాతఃకాలమునందు, పాయఁదట్టెన్ =తుడిచివైచెను, అహహా, అరసి, చూడన్, వచ్చినన్=బాగుగా నాలోచింపఁగా, నియతి=అదృష్టము. భుజిష్యవో = పరిచారిక కాఁబోలును, అంతక=అదియే సత్యము కావచ్చును. ఆకాశము కేళీమందిరము. దేవతల సురతకాలమందుఁ దెగిపోయిన హారములలోని ముత్యములే యీనక్షత్రములు. వానిని, నియతి యనెడిపరిచారిక సూర్యుఁడనెడి యూడ్చువానినిగొని తుడిచివేయుచున్నది. గృహమాలిన్యమును దాసి తుడిచివేయుచున్నట్లు నియతియు నట్లుచేయుచున్నదని భావము. సూర్యుఁ డుదయించెననియు, నక్షత్రము లదృశ్యమయ్యెననియు భావము.

తా. స్పష్టము.

సీ. అమ్నాయశాఖాసహస్ర వివర్తంబు
లుడురాజకల్యాణ హోమవహ్ని
లాకాశహర్మ్యాగ్ర హస్తదీపంబులు
ప్రాలేయజలరాశి బాడబములు
చక్రవాకమనో విశల్యౌషధంబులు
దశదిశీకుంకుమ స్థాసకములు
రాజమండలకాంతి రాజయక్ష్మను లంధ
కారవేదండకంఠీరవములు
తే. పద్మవన నిర్నిబంధన బాంధవములు
కైరవాకర సమ్మోహ కారణములు
సవితృమణిపావకేంధన సామిధేను
లెగసె నుదయాద్రియవుల నీరెండకొనలు. 11

టీ. ఆమ్నాయ...వివర్తంబులు - ఆమ్నాయ=వేదములందుఁ గల, శాఖా సహస్ర=తైత్తిరీయాదులగు వేయిశాఖలయొక్క, వివర్తంబులు=రూపాంతరములు. అనఁగా సూర్యుని వేయికిరణములును, వేదశాఖా రూపములే యని భావము. ఉడురాజ...వహ్నులు - ఉడురాజ=చంద్రునియొక్క, కల్యాణ= వివాహ మహోత్సవమందలి, హోమవహ్నులు=హోమాగ్ని హోత్రములు, ఆకాశ...దీపంబులు=ఆకాశ మనెడి మేడకొనయందుఁ బట్టికొన్న కాగడలు, ప్రాలేయజలరాశి బాడబములు=మంచనెడి సముద్రమునకు, బడబాగ్నివంటివి. అనఁగా సూర్యకిరణములు, సముద్రజలమును హరించు బడబాగ్నివలె, మంచును హరించుచున్నవని భావము. చక్రవాక మనోవిశల్యౌషధంబులు= చక్రవాక పక్షులయొక్క మనస్సులకు విశల్యయనెడి అనఁగా మనస్సునతాటిన బాణపుటలుగును దీసివైచునట్టి యోషధివంటిది. అనఁగాఁ జక్రవాకములు రాత్రులందు విరహశల్యము నొంది ప్రాతఃకాలమున నది వీడిగలియుట సహజము. దశదిశీ కుంకుమస్థాసకములు = పదిదిక్కులందును గుంకుమ నుంచుచున్నవి. అనఁగాఁ బ్రాతఃకాల సూర్యకిరణము లెఱ్ఱగానుండును. కాన యవి దిక్కులందు వ్యాపించినప్పుడు కుంకుమపుఁబూఁతవలెఁ దనరారుచున్నవి. రాజమండలకాంతి రాజయక్ష్మంబులు =చంద్రమండల కాంతికి క్షయరోగములనంటివి. క్షయరోగ మనివార్యమై క్షయమును బొందించునట్లు సూర్యకిరణములు చంద్రకాంతిని నశింపఁజేయు చున్నవనుట. అంధకార వేదండ కంఠీరవములు=చీఁకట్లనెడి యేనుఁగులకు సింహములవంటివి, పద్మ ...బాంధవములు- పద్మవన=కమలవనములకు, నిర్నిబంధన=అకారణములయిన, బాంధవములు=చుట్టములు, కైరవాకర... కారణములు =కలువతోఁటలకు మూర్ఛగల్గింప హేతువులు, సవితృ...సామిధేనులు - సవితృమణి=సూర్యకాంత మణులందు, పావక=అగ్నిని, ఇంధన=ప్రజ్వలింపఁజేయు, సామిధేనులు=ధాయ్యనంటివి. ధాయ్యయనఁగా యాగమం దగ్నినిఁ బ్రజ్వలింపఁజేయు ఋక్కులు. ఆఋక్కు లగ్నిని బ్రజ్వలింపఁజేసినట్లు సూర్యకిరణములు సూర్యకాంతములం దగ్నిని బ్రజ్వలింపఁ జేయుచున్నవని భావము. ఉద

యాద్రియవుల=పొడుపు కొండమీఁది భాగములందు, ఈరెండకొనలు, ఎగ సెన్ =వ్యాపించెను. అలం. రూపకము.

తా. బాలసూర్య కిరణములు, సహస్రవేదశాఖల రూపములఁ దాల్చుచున్న జంద్రుని వివాహమందలి యగ్నులై, యాకాశ సౌధాగ్రమందలి కరదీపిక లవలెఁ దనర్చుచు, బడబాగ్ని సముద్రమునువలె మంచును హరించుచు, విశే ల్యౌషధివలెఁ జక్కవల విరహశల్యమును బుచ్చుచు, బదిదిక్కులందుఁ గుంకుమను వెదఁజల్లుచు, చంద్రునికాంతి హరించుచు, సింహము లేనుంగుల వలెఁ జీఁకట్లనడఁగించుచుఁ, బద్మవనముల వికసింపజేయుచుఁ, గలువలముకుళిం పఁజేయుచు, ధాయ్యయనెడి బుక్కు లగ్నినివలె సూర్యకాంత మణులందు వహ్నిని బ్రజ్వలింపఁజేయుచు, నుదయాద్రిని దాఁటి వ్యాపించెను.

క. పసిపాప యెండకొనలును
మసమసకని యిరులుఁ గలిసి ॥ మనములరించెన్
దెసలనలుగడలఁ గుంజా
విసరంబుల సరులు వ్రేల ॥ విడిచినభంగిన్. 12

టీ. పసిపాప యెండకొనలును= బాల సూర్యకాంతులును, మసమసకని యిరులు=మసక మసకమనెడి చీఁకట్లును, కలిసి, దెసలు, నలుగడలన్=దిక్కు లందంతటను, గుంజావిసరంబుల సరులు=గురివెందగింజలు గూర్చినదండలు, వ్రేలవిడిచిన భంగిన్=వ్రేలాడ వైచినట్లుగా, మనము, అలరించెన్=సంత సింపఁజేసెను. గురిగింజ మిక్కిలి యెఱుపును నడుగునఁ గొంతనలుపును గలిగి యుండును. ఎండ యెక్కువగను జీఁకట్లు తక్కువగను నుండెనని గుంజాసా మ్యముచే వ్యంజితము.

తా. ఎఱ్ఱని సూర్యకిరణములును, నల్లచీఁకట్లును గలిసినప్పుడు గురివెంద గింజల దండలు నలుదిక్కులు వైచినట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

సీ. నముచిసూదనువీటి ॥ నడువీథిచక్కికి
నింతకునేతెంచు ॥ నినునితేరు

కట్టుపకాసులై గగనాంగణంబున
  మందేహు లింతకు మాఱుకొండ్రు
స్రవియించు నింతకుఁ బ్రథమాద్రిచఱులలో
  నూష్మసోఁకి శిలాజతూత్కారములు
ప్రీతి నింతకు నేఁగుఁ బిచ్చుకుంటుకు మ్రొక్క
  వినుతసౌభ్రాత్రుండు వినతపట్టి
తే. మేలుకొనఁగదె రాజన్య మీనలక్ష్మ
కాలకంఠసమర్చనా కాలమయ్యె
విశ్వ విశ్వంభరాభార విధృతిదక్ష
దీర్ఘతరనేత్ర నిషధధాత్రీకళత్ర. 13

టీ. ఇంతకున్ = ఈపాటికి, ఇనుని తేరు=సూర్యుని రథము, నముచి...చక్కికిన్-నముచిసూదను = ఇంద్రునియొక్క, వీటినడువీథి చక్కికిన్ = పురమందున్న వీథిమధ్యమునకు, ఏతెంచున్ =వచ్చును. ఇంతకున్ = ఈపాటికి, గగనాంగణంబునన్ = ఆకాశమనెడి చత్వరమందు, కట్టుపకాసులై =మిక్కిలి పస్తుపడి యున్నవారై, మందేహులు=మందేహులనెడి రక్కసులు, మాఱుకొండ్రు=ఎదిరింతురు. మందేహులనెడి రక్కసులు సూర్యునితో మార్కొందురనియు విప్రు లొసంగిన యర్ఘ్యప్రదానమువలన నశింతురనియుఁ బ్రసిద్ధి. ఇంతకున్ = ఈపాటికి, ప్రథమాద్రి చఱులలోన్ =పొడుపుకొండ లోపలలో, శిలాజతూత్కారములు=శిలాజిత్తుల సమూహములు, ఊష్మసోఁకి=వెట్టతగిలి, స్రవించున్ =కరఁగుచుండును. ఇంతకున్ = ఈపాటికి, ప్రీతిన్ =ప్రేమతో, వినుతసౌభ్రాత్రుండు=నుతింపఁబడుచున్న మంచిసోదరభావముగల, వినతపట్టి= గరుత్మంతుఁడు, పిచ్చుకుంటుకున్ =అనూరునకు, మ్రొక్కన్, ఏఁగున్ =నమస్కరింపఁబోవును. రాజన్య మీనలక్ష్మ=ఓరాజమన్మథుఁడా, కాలకంఠ సమర్చనా కాలము=ఈశ్వరునిఁ బూజించునట్టి కాలము, అయ్యెన్ =సమీపించెను. విశ్వ...దక్ష [illegible] =బరు

వును, విధృతి=భరించుటయందు, దక్ష=నేర్పుగలవాఁడా, దీర్ఘతరనేత్ర = మిక్కిలి నిడుపలయిన నేత్రములు గలవాఁడా, నిషధధాత్రీకళత్ర=నలరాజా, మేలుకొనఁగదె= మేలుకొనుమా ?

తా. ఓనలరాజా! ఈపాటికి సూర్యునిరథము స్వర్గపురములో వీథిమధ్యము నకు వచ్చియుండును. ఈపాటికి మందేహులనెడి రక్కసులాఁకలితో సూర్యుని పైఁ గవయుచుందురు. ఈపాటి కుదయాద్రి గుహలలో సూర్యతాపమునకు శిలాజిత్తు కరఁగుచుండును. ఈపాటి కనూరునకు నమస్కరింపఁ బ్రేమతో గరుడుఁడు పోవుచుండును. దీర్ఘములయిన నేత్రములు గలవాఁడా, సమస్త భూభారమును వహించినయోనిషధరాజా, శివపూజాసమయ మేతెంచెను. ఇక నిద్రనుండి మేల్కొనుము.

వ. మఱియుం దిమిర విరహపాండూయమాన దిఙ్మండలంబును, విచేయ తారకంబును, దరిద్రాణ ప్రాణ రోహిణీ రమణ బింబ చుంబ్యమాన చరమాచల శిఖరభాగంబును, శిశిర సలిలక్షో దకుక్షింభరి క్షీరకంఠ రవిమయూఖంబును, కుముద కేదార నిద్రాసుఖ నిదానంబును, నిశావిరహ విహ్వల చక్రాహ్వయ విహంగమ స్త్రీపుంస హృదయ బృంహితాహ్లాదంబును, గువ లయినీకుక్షి భ్రూణాయమాన మధుస్రుత బంభరంబును, లవ ణాస్య దాపవాహ్యాహయ విలేహ్యమాన మాణిమంథ శిలా శకలంబును, సంధ్యామాన వ్రతపరాయణ విశిష్టాధ్యేతృజన విహితాధ్యయన విరామంబును, బ్రాహ్మణాభి మంత్రితా ర్ఘ్యాంజలి జల వజ్రధారావి దారిత మందేహ దేహంబును, నైయ త్తటిం, గ్రొత్తవిరియు నెత్తమ్మి విరుల కేసరంబుల వాసనలు గ్రోలి మత్తిల్లి యుల్లాసంబునం దూలియాడు కొదమతుమ్మెద కదుపులు ఘుస్సణ సూమన శ్రేణిశోణంబగు పొడుపుసంజ కెం

జాయయుఁ గలయఁబెరసి గురివెంద పేరుల యాదంబు వహిం
చుటయును, గుళ కిసలయంబులమీఁదం బ్రాలేయాంభఃకణ
క్రమసంభృతంబులై రజనియను పిశీయేనుఁగు ఫూత్కా
రంబు సేసి యుమిసినం జిలికిన కరవమథుశీకరంబులంబోని
యుదక బిందుసందోహంబులు సుషిర కరణ నిపుణకర నిశా
శాయస సూచీశలాకాశిఖాంకురసంకరంబునం గరమ్మువహ్హిన
ము త్తియంబుల ననుకరించుటయు, వికసితైకదళంబులగు
కుశేశయ కోరకంబులచేతం గమలాకరంబులు మిహిర
కిరణాభోగ భోజనార్థంబు సంధ్యారాగాంబువుం జేత మొదల
నాపోశనం బెత్తు భావంబు భజియించుటయుఁ, జులుకిత
తమస్సింధు పూరంబులగు బిసినీబాంధవుని కరంబులవలన
రంధ్రస్రుతంబులగు సంధకార బిందుసందోహంబు లిందిం
దిర వ్యాజంబున నంభోజవనంబులలోనం దొరఁగి విస్రుమర
మధుస్రోతః కచ్ఛద్వయీ పరిసరంబులం బంకశంకావహం
బగుటయుఁ, దటరుహతరునికాయ నిష్కుహ క్రీడానీడం
బుల నిద్రించి మేల్కాంచి కలగొనం బలుకు పులుఁ
గుల మెలుంగుల కోలాహలంబులచేతనుంబోలెఁ బ్రత్యు
ద్బుద్ధంబులగు సరోజాతంబులలో మధువ్రతవ్రాతంబులు,
వధూవదన లబ్ధ మధురాధర సుధాపానంబుతోడ సాధు
విధీయమానంబులైన మధుపాన మహోత్సవంబులం
బ్రవ ర్తిల్లుటయును, గాఢ తమ స్తమాల గహనభంగ మా
తంగంబులుం గనదనఘ కనక రేణుత్రస రేణువిసర పిశంగం
బులునగు పతంగ కిరణ శృంగంబులు భవనవలభి జాలంబు
లందూఱి, [illegible]

భ్రాంతి నాపాదించుటయు, విభాతలక్ష్మీవిలాసంబు విశ్వ
నయనోత్సవం బయ్యె నెండియు. 14

టీ. మఱియు, తిమిర ... మండలంబును-తిమిర=చీఁకట్లయొక్క, విరహ=లేకపోవుటచేత, పాండూయమాన=తెల్లనిదగు, దిఙ్మండలంబును=దిక్సమూహము గలదియును, విచేయతారకంబును=వెదకఁదగిన నక్షత్రములు గలదియు, దరిద్రాణ ... భాగంబును - దరిద్రాణ = క్షీణతనొందిన, ప్రాణ=ప్రాణతుల్యమగు కాంతిగల, రోహిణీరమణ బింబ=చంద్రబింబముచే, చుంబ్యమాన=తాఁకఁబడుచున్న, చరమాచల=పడమట కొండయొక్క, శిఖరిభాగంబును=శిఖరిప్రదేశముకలదియు, శిశిర ... మయూఖంబును - శిశిరసలిల = మంచునీటియొక్క, క్షోద=లేశములను, కుక్షింభరి=మ్రింగినట్టి, అనఁగా నపహరించినట్టి యని భావము. క్షీరకంఠరవి మయూఖంబును = బాలసూర్య కాంతులు గలదియు, కుముద ... నిదానంబును - కుముదకేదార=కలువ వనములకు, నిద్రాసుఖ=నిద్రా సౌఖ్యమునకు, నిదానంబును = మూలమయినదియు, ప్రాతఃకాల మగుటచేఁ గుముదంబులు ముకుళించుచున్నవని భావము. నిశా ... హ్లాదంబును-నిశావిరహ=రాత్రియందలి యెడఁబాటుచే, విహ్వల=వివశములయిన, చక్రాహ్వాయ విహంగమ=చక్రవాక పక్షులయొక్క, స్త్రీపుంస=మిథునములయొక్క, హృదయ=మనస్సులందు, బృంహిత=వర్ధింపఁబడిన, ఆహ్లాదంబును=సంతసము గలదియు, రాత్రి వియోగము నొందిన చక్రవాకములఁ గలుపునట్టిది కాన యాసమయము వాని కాహ్లాదకర మగుచున్నదని భావము. కువలయ ... బంభరంబును - కువలయినీ=కలువతీఁగయొక్క, కుక్షి=గర్భమునకు, భ్రూణాయమాన = గర్భస్థ జంతువులుగాఁ జేయఁబడినవియు, మద=మత్తుచే, సుప్త=నిద్రించినవియునగు, బంభరంబు=తుమ్మెదలు కలదియు, అనఁగా దుమ్మెదలు కలువలందలి మకరందమును ద్రావఁబోయి మత్తుగఁ ద్రావి వానియందు నిద్రించెను. అంత సూర్యరశ్మిచే నవి ముకుళితము లయ్యెను. అప్పుడాతుమ్మెదలు కువలయలత గర్భమందున్న జంతువులవలెఁ దనరారుచున్నవని భావము. లవణస్యాత్=ఉప్పతినఁగోరుచున్న,  ... చేత, విలేహ్య

మాన=నాకఁబడుచున్న, మాణిమంథశిలాశకలంబును=సైంధవలవణపు గండ్ల
తునుకలుగలదియు, ఇందుప్పుతునియలు గుఱ్ఱములకు వేసవనుబెట్టుట ప్రకటము.
సంధ్యా...విరామంబును - సంధ్యా = సంధ్యాకాలమందు, మానవ్రత=మా
నవ్రతో మవలంబింప, పరాయణ=ఆసక్తులయినట్టియు, విశిష్ట=శిష్టులయినట్టియు
నగు, అధ్యేతృజన=అధ్యయనము చేయువారిచే, విహిత=చేయఁబడుచున్న,
అధ్యయన విరామంబు=అధ్యయనముయొక్క యవసానము గలదియు, తెల్ల
వాఱుజామున లేచి వేదాధ్యయనము చేసి సంధ్యాసమయ కృత్యములను నెఱవే
ర్చుకొనుటకుఁగా నాసమయమందు నధ్యయనము మానుచున్నారని భావము.
బ్రాహ్మణా... దేహంబును-బ్రాహ్మణ=విప్రులచే,అభిమంత్రిత=మంత్రింపఁబడిన,
అర్ఘ్యాంజలిజల=అర్ఘ్యప్రదానజలములనెడి, వజ్రధారా=వజ్రాయుధపుటంచుచే
త,విదారిత=చెక్కలుచేయఁబడిన,మందేహ=మందేహరాక్షసులయొక్క,దేహం
బును=దేహములుగలదియు-ఆసమయమందే బ్రాహ్మణులొసఁగినయర్ఘ్యములవలన
మందేహ రాక్షసులు దేహములను విడుచుచున్నారనిభావము. అయి,అత్తఱిన్ =
ఆప్రాతఃకాలంబున, క్రొత్తవిరియు=నూతనముగా వికసించుచున్న, నెత్తమ్మి
విరుల కేసరంబులవాసనలు = మనోహరములగు తామరపూవులయొక్క,
కింజల్కముల పరిమళములను, క్రోలి = అనుభవించి, మత్తిల్లి = మదించి,
ఉల్లాసంబునన్ = సంతసముచే, తూలియాడు=ఎగిరిపడెడి, కొదమతుమ్మెద
కదుపులును,ఘుసృణసుమనశ్శ్రేణీశోణంబు=కుంకుమపువ్వువరుసవలె నెఱ్ఱనిది,
అగుపొడుపుసంజకెంజాయయు=అయిన యుదయకాల సంధ్యారాగమును,కల
యన్ బెరసి=కలియఁగూడికొని, గురివెంద పేరులయందంబు = గురివెందగింజల
పేరులయొక్కరీతిని,వహించుటయును=తాల్చుటచేతను, కుశకిసలయంబులమీఁ
దన్=దర్భకొనలపయిని, ప్రాలేయా...సంభృతంబులై—ప్రాలేయాంభఃకణ=
మంచుబిందువులయొక్క, క్రమ=వరుసచే,సంభృతంబులు= సంపాదితములై,
రజనియను పిడియేనుఁగు=రాత్రియనెడి ఆఁడేనుఁగు, ఫూత్కారంబు, చేసి,
పూరించి, ఉమిసినన్=ఉమియఁగా, చిలికిన కరవమధుశీకరంబులంబోని=విడఁ
జల్లినతుండ[illegible], సుషి

రక్షరణ నిపుణ=బెజ్జవేయుటయందు నేర్పుగలవాని, కర=చేతియందలి, నిశా త...క్షురంబులన్ — నిశాత = వాఁడియైన, ఆయస సూచీశలాక = ఇనుప సూదులమొక్క, శిఖాంకురంబులన్ = కొట్టకొనలందు, కరమ్ము=మిక్కిలి, హ త్తినము త్తియంబులన్=అంటియున్న ముత్యములను, అనుకరించుటయును= విడంబించుటచేతను, అనఁగా రాత్రియందు మంచు వర్షించును. కాన నా మంచుబిందువులు దర్భదళములపైఁ బడఁగా నాబరువుచే నవివంగును. అట్లు వంగుటవలన పైనున్నమంచంతయుఁ గ్రమంబుగా జాఱి కొనలకుఁజేరి బిందు రూపముదాల్చి యట్రవేలాడును. అట్లున్నమంచుబిందువులు దొలచుటకై సూ చికాగ్రములగ్రుచ్చిన ముత్తెములవలె నున్నవని భావము. మఱియు నాయుదక బిందువులు రాత్రియనెడియేనుఁగుఫూత్కరించి యుమిసిన మదజలబిందువులవలెఁ దనరారుచున్నవని భావము. వికసితైక దళంబులు=వికసించినట్టి యొక దళ ముగలది ఆగు, కుశేశయకోరకంబులచేతన్=అయినట్టి తామర మొగ్గలచేత, కమలాకరంబులు= తామరకొలఁకులు, మిహిర...నార్థంబు—మిహిర=సూర్యుని యొక్క, కిరణాభోగ=కిరణసమూహమును, భోజనార్థంబు=తినుటకొఱకు, సం ధ్యారాగ+అంబువున్=సంజ కెంజాయ అనెడినీటిని, చేతన్=తనచేతియందు, మొదలన్=భోజనమునకు ముందు, ఆపోశనంబు ఎత్తుభావంబు=ఆపోశనము ను బుచ్చుకొన్నరీతిని, భజియించుటయున్=అవలంబించుటచేతను, అప్పుడే యుదయమగుటచే నొక దళము మాత్రమే వికసించిన కోరకములుగల తామ రల కొలఁకులు మిహిరకిరణములను భుజించుటకుముందుగ సంజకెంజాయ యను జలము నాపోశన మెత్తుచున్నట్లున్నవని యర్థము. ఇట తామరమొగ్గలు చేతు లుగాను, ఒంటిరేకు పుడిసిలిగాను, సంజకెంజాయ నీరుగాను తెలియునది. లేక ద్విజులు భోజనమునకుఁ బూర్వము చిటికెనవ్రేలుమాత్రము చాఁచి తక్కినవాని ముడిచిపట్టిన హస్తకుహరమున నీరుపోసి మంత్రమునుజెప్పి త్రావుట స్మృత్యు క్తమై యాచరింపఁబడుచున్నది. ఇటఁ దామరకొలఁకులు ద్విజులవలెను, వికసిం చిన దలమొక్కటియుఁ జిటికినవ్రేలువలెను కోరకములు ముడిచి పట్టుకొన్న చేతులవలెను, అందుఁ బొలయు సంజకెంజాయ ఆపోశనపు నీటివలెను

నుండుటచే, దామరకొలంకులు సూర్యకిరణములను భుజించుటకుముం దాపోసనమెత్తుచున్నట్లు గానవచ్చుచుండెనని భావము. చులుకిత...పూరం బులగు - చులుకిత = హస్తపుటరంబున గ్రహింపఁబడిన, తమస్సింధుపూరం బులు = చీఁకటిసముద్రము గలవియగు, బిసినీబాంధవుని = సూర్యునియొక్క, కరంబుల = కిరణములయొక్క, (చేతులయొక్క యనియు) రంధ్రస్రు తంబులు=రంధ్రములవలనఁ గ్రిందికిజాఱినవి, అగు నంధకారబిందు సందో హంబులు=అయినట్టి చీఁకట్లయొక్క బిందుసమూహములు, ఇందిందిరవ్యాజం బునన్=తుమ్మెదలనెపమున,అంభోజవనంబులలోనన్=పద్మవనములందుండి, తొ రఁగు=ప్రవహించుచున్న, విసృమర.. పరిసరంబులన్—విసృమర=వ్యాపించిన మధుస్రోతః=మకరంద ప్రవాహముల సంబంధులగు, కచ్ఛద్వయీ=మకరంద ముచేఁ దడిసినభాగముల జతయొక్క, పరిసరంబులన్=తీరములందు, అనఁగా మకరందముచేఁ,దడిసిన యుభయతీరము లందునని భావము. పంకశంకావహం బులు అగుటయున్=బురదయనెడి శంకను గల్గించుచుండుటంబట్టియు, తుమ్మె దలు ప్రాతఃకాలమున నెగిరిపోయి పద్మవనములందుఁ బ్రవహించు మకరంద ప్రవాహముల ప్రక్కలనుజేరి పానముచేయుచుండెను. ఇట్లుండ నాకాశమున నెగురుచున్నప్పుడు తుమ్మెదలు, సూర్యుఁడు చీఁకటి యనెడి సముద్రమును దన హస్తపుటరమునందు జేర్పఁగా వ్రేళ్లసందులనుండి క్రిందికి జాఱుచున్న తమో బిందువులవలె నుండెననియుఁ బద్మవనములందుఁ దొరఁగు మకరంద ప్రవాహ ముల ప్రక్కలను జేరియున్నప్పుడవి చీఁకటిసంద్రమును దానుబూర్తిగాఁ ద్రా వుటచే నడుగున మిగిలియుండిన బురదవలెనున్నవనియుఁ గవియుత్ప్రేక్షించెను. ప్రాతఃకాలమయ్యెననియుఁ, జీఁకట్లు నశించెననియుఁ దుమ్మెదలు పద్మవనములఁ జేరి మకరందపానముచేయుచుండెననియు ఫలితార్థము. తట...నీడంబులన్— తట=నదీతీరములందున్న, తరునికాయ=వృక్షసమూహములయొక్క, నిష్కు హ=తొఱ్ఱలనెడి, క్రీడానీడంబులన్ = క్రీడాకులాయములందు, నిద్రించి, మె ల్కాంచి, కలగొనన్=వ్యాపించునట్లుగా, పలుకు... చేతనంబోలెన్=కూయు చున్నపక్షులయొక్క కోలాహలధ్వనులచేతనుంబోలె,ప్రత్యుద్బుద్ధంబులు=మే

ల్కొలుపఁబడినవి, అగుసరోజాతంబులలోన్ =అయినట్టి పద్మములలో, మధు వ్రతవ్రాతంబులు=తుమ్మెదలగుంపులు, వధూ...తోడన్—వధూ=ఆఁడుతుమ్మెదల యొక్క, వదన=ముఖములవలన, లబ్ధ=పొందఁబడిన, మధుర=తియ్యని, అధర సుధాపానంబుతోడన్ =అధరోష్ఠమందలి యమృతపానముతోఁగూడ, సాధు విధీయమానంబులు=లెస్సగా చేయఁబడుచున్నవి. ఐన మధుపాన మహోత్సవం బులన్ =అయినట్టి మధుపానకేళులచేత, ప్రవర్తిల్లుటయు=ప్రవర్తించుచుండుట చేతను, ప్రాతఃకాలమగుటచేఁ బద్మములు వికసింపఁగా నవి తమతమ కులాయ ములనుండి లేచి నల్గడలకు వ్యాపించి కూయుచున్న పక్షుల కోలాహలములచే మేల్కొంచినవని యుత్ప్రేక్షించె. నిద్రించినవాఁడు గొప్పధ్వని వినవచ్చినచో నిద్రనుండి లేచుటకలదు. అట్లె పద్మములు మేల్కనినవని భావము. అట్లు విక సించిన పద్మములంజేరి యాఁడుతుమ్మెదల యధరామృతరసముతో మేళవించి మకరందమును దుమ్మెదలు ద్రావుచున్నవని భావము. గాఢ...మాతంగంబు. లున్- గాఢ=దట్టమైన, తమః=చీఁకట్లనెడి, తమాలగహన=కానుగుతోఁపును, భంగ=ధ్వంసముచేయుటయందు, మాతంగంబులు= ఏనుఁగులవంటివియు, కన త్...పిశంగంబులు - కనత్ =ప్రకాశించుచున్న, అనఘ=నిర్మలమైన, కనకరే ణు=బంగారపులేశములయొక్క, త్రసరేణువిసర=త్రసరేణువుల సమూహము వలె, త్రసరేణువు, అనఁగా మూఁడు పరమాణువులు కూడియున్న భాగము. అగు పతంగ కిరణశృంగంబులు=అయినట్టి సూర్యకిరణముల యగ్రములు, భవన... జాలంబులన్ =ఇండ్ల ముంజూరులందున్న గవాక్షములను, చూచి =ప్రవేశించి, భ్రమదణుగణాక్రాంతంబులై =తిరుగుచున్న యణుసమువయముచే వ్యాప్త ములై, కుంభపరిభ్రమణభ్రాంతిన్ =తరిమెనచక్రమందు తిరుగుటయనెడిభ్రాం తిని, ఆపాదించుటయున్ =చేయుటచేతను, విభాతలక్ష్మీ విలాసంబు=ప్రాతః కాలశోభ, విశ్వనయనోత్సవంబు=అందఱనేత్రములకును సంతసముగల్గించునది, అయ్యె, వెండియు=మఱియు.

మ. సలిలాభ్యుక్షిత కంబుసంభవ రజోజంబాల పాండూభవ

జ్జలజచ్ఛిత్కరపత్ర భావభజనన్ సంధిల్లె శీతాంశుమం

డల మిప్డ నస్తమితార్ధబింబ మగుచుంగ్ నక్షత్రశంఖచ్ఛిదా
కలనోత్సేక సరోజబాంధవకరాగ్రస్వైర నిష్పీడనన్. 15

టీ. శీతాంశు మండలము=చంద్రమండలము, ఇప్డు=ఈసమయమందు, అస్త మితార్ధబింబము=అస్తమించిన సగము బింబముకలది, అగుచున్, నక్షత్ర... నిష్పీడనన్—నక్షత్రశంఖ=నక్షత్రరూపమగు శంఖములను, ఛిదా=ఛేదించుటయ నెడి, కలన=లీలయందలి, ఉత్సేక=గర్వముగల, సరోజబాంధవ = సూర్యుని యొక్క, కరాగ్ర=కిరణములనెడిచేతులయగ్రములచేత, స్వైర=యథేష్టముగా, నిష్పీడనన్ =పీడించుటచేతను, లేకకోయుటచేతను, సలిలా... భజనన్ -సలిలా భ్యుక్షిత=నీటిచేఁ దడుపఁబడి, కంబుసంభవ=శంఖములవలనఁగల్గిన, రజః=ధూళి సంబంధియగు, జంబాల=బురదచేత, పాండురాభవత్ = తెల్లనిదగు, జలజచ్ఛిత్ = శంఖమును గోసెడిదగు, కరపత్ర=అంపముయొక్క, భావ=ధర్మముయొక్క, భజ నన్ =ప్రాప్తిచే, సంధిల్లెన్ =ఒప్పెను. సూర్యుఁడనెడి శంఖశిల్పకారినక్షత్రరూప ములగు శంఖములను గోయఁదలంచి యథేష్టముగా నిష్పీడన చేయుచున్న అం పమువలె నర్ధచంద్రమండలము ప్రకాశించుచున్నది. చంద్రుఁ డస్తమించుచుం డుటచే, సగముబింబముమాత్రమే గానవచ్చుచుండెను. ఆచంద్రఖండము శం ఖములను గోయుఅంపము వలెనుండెను. ఆఅంపమునకు ధావళ్యమెట్లు వచ్చెననిన కఠినపదార్థము సులభముగాఁ దెగుటకై దాని నీళ్లతోఁదడిపి కోయుదురు. కోఁతవలన గలిగి శంఖసంబంధియగు తెల్లనిధూళి జలసంపర్కముచే బురదయై అంపమున కంటుకొనుటచే మొదట నది లోహమయమగుటవలన నల్లగానున్నను జంబాలసమ్మేళనముచే ధవళముగా నగుచున్నదనిభావము. శంఖాదులను గోయు అంప మర్ధచంద్రాకారముగా నుండునని ప్రసిద్ధి. క్రుంకుచున్న చంద్రుఁడా కరప త్రముతో సమముగానుండెను. సూర్యుఁ డుదయించెను. నక్షత్రము లదృశ్యము లయ్యె. చంద్రుఁడు సగ మస్తమించెనని ఫలితార్థము. తా. గతార్థము. అలం. గమ్యోత్ప్రేక్ష రూపకానుప్రాణితము.

చ. తటుకునన స్తమించెఁ బతికై దైన్యముఁజూడఁగనోడితారకాల్.
పటలమునున్గ్రదియామమునుకొబాపురె! యింతులవాఁడిపంతము

కటకట తద్వియోగమునఁ గ్రాఁగినశింపఁడ నిష్ఠురాత్ముఁడై
పటిక మొకో విధుండు నడుఁ బట్టుకలంకము నల్లఱాయియో.

టీ. తారకాపటలమునన్ =నక్షత్రసమూహమును, త్రియామయును = రాత్రియును, పతిదైన్యము = తమభర్తయగుచంద్రుని దురవస్థను, చూడఁగన్ ఓడి=భయపడి, తటుకునన్ =శీఘ్రముగా, అస్తమించెన్ =నశించెను. బాపురే= ఐహ్వారే, ఇంతులవాఁడిపంతముల్ =స్త్రీలయొక్క పంతములు మిక్కిలి సాహసవంతములు కదా? కటకట=అయ్యయో? తద్వియోగమునన్ =తనభార్యలగు తారకారాత్రుల యెడఁబాటుచే, గ్రాఁగియున్ =సంతాపమునొందియు, నిష్ఠురాత్ముఁడై=కఠినహృదయుఁడై, నశింపఁడ=నశింప నే నశింపఁడు.విధుండు=చంద్రుఁడు, పటికమొకో=పటికఱాయి కాఁబోలును, నడుపట్టుకళంకము = మధ్యభాగమందున్న మచ్చ, నల్లఱాయియో=నల్లరాయి కాబోలును. ఆలోచింపఁ జంద్రుఁడు దెల్లగాను మధ్యమునందు నల్లగాను గానవచ్చుచున్నాఁడు. తెల్లనిభాగమంతయుఁ బటికఱాయియు మధ్యముననల్లగాఁ గానవచ్చు భాగము నల్లఱాయియునైయుండవచ్చును. కానిచోఁదాను దురవస్థలోనున్నపుడు తారారాత్రులు చూడలేక యస్తమించినట్లు తెలిసికొని యస్తమింపకుండనుండఁగలఁడా? కావున చంద్రుఁడు శిలామయుండు కాని, అమృతమయుఁడు కాఁడనిభావము.

తా. తారకలును రాత్రియును, దమపతియగు చంద్రుని దురవస్థఁగన్నులారచూడలేక యాతఁడస్తమింపకుండఁగనే శీఘ్రముగా నస్తమించెను. స్త్రీలసాహసముకొనియాఁడదగినదికదా? అయ్యయో! వారివియోగానలమునఁ దపించియుఁ జంద్రుండు కఠినహృదయుఁడయి యస్తంగతుఁడు కాలేకపోయెను. ఆలోచింపఁ జంద్రుఁడు స్ఫటిక శిలకాఁబోలును. మధ్యనున్న మచ్చనల్లఱాయి కాఁబోలును. కానిచో విచారపరీతుఁడయి యేలనశింపఁడు ?

ఉ. నిద్దుర మేలుకొమ్ము,రజనీకర వంశవతంస! కుంకుమం
బద్దినభంగి మింటనదె యామినిచెల్లెలు కాల్యసంధ్య దా
నుద్దియ సేయుచున్నయది యుష్ణమయూఖసుతప్రసూతికిన్
ప్రొద్దులు సొచ్చియున్నయవి పూర్వదిశాసరసీరుహాక్షికిన్.

టీ. రజనీకరవంశవతంస=చంద్రవంశమునకు భూషణమువంటి యోనలరాజా, మింటన్=ఆకాశమునందు, అదె=అల్లదిగో, యామినిచెల్లెలు=రాత్రికిసోదరియైన కాల్యసంధ్య=ప్రాతఃకాలసంధ్య, తాన్, కుంకుమంబు, అద్దినభంగిన్=పూసిన చందమున, ఉద్దియ, చేయుచున్నది=నిన్ను వేగిరించుచున్నది, ఉష్ణమయూఖ సుతప్రసూతికిన్=సూర్యుఁడనెడి కుమారుని కనుటకు, పూర్వదిశాసరసీరుహాక్షికిన్=పూర్వదిక్కనెడి స్త్రీకి, ప్రొద్దులు=దినములు, చొచ్చియున్నయవి=నిండినవి. ప్రాతఃకాలసంధ్యారాగముచే నాకసముకుంకుమపూఁతపూసినట్లున్నది. తూర్పున సూర్యుఁ డుదయింప సిద్ధుఁడయి యున్నవాఁడనిభావము. నిద్దుర, మేలుకొమ్ము=నిద్రనుండి లెమ్ము.

తా. ఓనలరాజా! రాత్రికిఁ జెల్లెలివంటి ప్రాతఃకాలసంధ్య మింటియందుఁ గుంకుమము పూసినట్లు ప్రకాశించుచున్నది. సూర్యుఁడనెడి కొడుకును గనుటకుఁ దూర్పుదిక్కనెడి భామకు నెలలు పూర్తిగానిండినవి. ఉదయసమయముగానున్నది. కావున నిఁక నిద్రనుండి మేల్కొనుము.

శా. వైదర్భీహృదయేశ! మేలుకొని నిర్వర్తింపు సంధ్యానవ
ప్రాదుర్భావవిధేయముల్ విధికలాపంబు న్ముహూర్తంబులో
నాదిత్యుండిటఁ దోఁచుసూపుఁ బటు రంహఃపిష్టపిష్టీకృత [న్.
క్ష్మాదిగ్వ్యోమమహాతమోఘమున మోఘుంబున్మయూఖౌఘము

టీ. వైదర్భీహృదయేశ=దమయంతికిఁ బ్రియుఁడవగు నోనలరాజా! మేలుకొని, సంధ్యా...విధేయముల్-సంధ్యా=సంధ్యాకాలముయొక్క, నవప్రాదుర్భావ=క్రొత్తగా సంభవించుటయందు, అనఁగా సంధ్యాకాల ప్రాదుర్భావమునందనుట, విధేయముల్=చేయఁదగినదగు, విధికలాపంబున్=క్రియాకలాపమును, నిర్వర్తింపుము=నెఱవేర్పుము, ముహూర్తకాలంబులోన్=ముహూర్తకాలములో, ఆదిత్యుండు = సూర్యుఁడు, ఇటన్, పటు...తమోఘముల్—పటు=సమర్థమయిన, రంహః = వేగముచే, పిష్టపిష్టీకృత = మిక్కిలిచూర్ణముగాఁ జేయఁబడిన, క్ష్మా = భూమిసంబంధియు, దిక్=దిక్కులసంబంధియు, వ్యోమ=ఆకాశసంబంధియునగు, తమోఘముల్ = చీఁకటియనెడి మాలిన్యము

కలదియు,అమోఘంబుల్=వ్యర్థముకానిదియు, అగు,మయూఖౌఘముల్=కిరణ సమూహమును, తోడుసూపుల్=ప్రసరింపఁజేయును.

తా. ఓనలరాజా! త్వరగా నిద్రనుండి లేచి ప్రాతఃకాలమందు నెఱవేర్పఁ దగినకృత్యములన్నింటిని నిర్వర్తింపుము. ఇఁక విలంబముచేయవలదు. ముహూర్తకాలములో సూర్యుఁడు దిక్కులందును, రోదసీకుహరమునందును గల చీఁకట్లను బూర్తిగా నశింపఁజేసినవియు, వ్యర్థముకానివియునగు కిరణసమూహమును లోకముపై ప్రసరింపఁజేయును.

శా. ప్రాతఃకాలము వాయసంబు పణినాపశ్లోక్తశాస్త్రంబులోఁ
దాతఙ్ స్థానులు చెప్పఁడెవ్వియను చందంబొప్పఁగా కాయనం
జాతుర్యం బలరార నుత్తరము విస్పష్టంబుగాఁ గోకిల
వ్రాతంబిచ్చెఁ దుహీతుహీయని గృహారామప్రదేశంబులన్.

టీ. ప్రాతఃకాలము=ఉదయకాలమునందు, వాయసము = కాకి, పణినాపశ్లోక్తశాస్త్రంబులోన్=పాణినీయవ్యాకరణశాస్త్రమునందు, తాతఙ్ స్థానులు= తాతఙ్, అనెడి యాదేశమునకు, స్థానులను, చెప్పఁడు. ఎవ్వి = అవి యెవ్వి? అనుచందంబు=అనురీతిని, ఒప్పన్, 'కా, కా,' యనన్ 'కా, కా,' అనిధ్వనిచేయఁగా, కోకిలవ్రాతంబు=కోవెలల సమూహము, గృహారామప్రదేశంబులన్=గృహోద్యానవనములందు, విస్పష్టంబుగాన్=స్పష్టముగా, చాతుర్యంబు=నేర్పు, అలరారన్=ఒప్పునట్లుగా 'తుహీ తుహీ' యనువర్ణములని, ఉత్తరము, ఇచ్చెన్=సమాధానము చెప్పెను. ప్రాతఃకాలమునఁ గాకి 'కా, కా' అని కూయును, కోకిల 'తుహీతుహీ'యని కూయును, దానిని గవి యిట్లుత్ప్రేక్షించెను. 'కా' అనుశబ్దము ప్రశ్నవాచకమగు కిం శబ్దమునకు ప్రథమాద్వివచన విభక్తిరూపము. ఎట్లన 'కః, కా. కే. అనుప్రథమావిభక్తిద్వివచనమున 'కా' అను రూపముండును. మఱియువ్యా. 'సూ'తుహ్యోస్తాతఙ్ఙాశిష్యన్యతరస్యాం' అనఁగా నాశీరర్థమునందు, తుహ్యోః=తు,హి, అనెడిక్రియా విభక్తులకు, తాతఙ్ అనునది, అన్యతరస్యాం=వికల్పముగా ఆదేశమగునని సూత్రార్థము. తు, హి, అనెడి క్రియావిభక్తుల కాదేశముగా, 'తాతఙ్'వచ్చును. ఎట్లనఁగా భవతు;

భవతాత్’ భవ, భవతాత్’ అనునప్పుడు ‘తు’ అనుదానికిని ‘హి’ అనుదానికిని తాతఙ్ రాఁగాఁ బైరూపములయినవి. ఉత్ప్రేక్షయెట్లనఁగా, కాకి పాణినీయ వ్యాకరణమునందు ‘తాతఙ్’ అనుదానికి స్థాను లేవియనునట్లు ‘కా కా’ అని ప్రశ్నించెననియు వానికిఁ గోకిలలు ‘తుహీ’ ‘తుహీ’ యనునవి యని సమాధానము చెప్పినట్లుగాను వర్ణించెను. ప్రభాతమాయెను. కాకులును గోయిలలును ధ్వని చేయుచున్నవనియు ఫలితార్థము.

తా. గతార్థము. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. వారక రాత్రియెల్లఁ బ్రియవల్లభుఁడైన శశాంకుఁగూడి యి
　　చ్ఛారతికేళి జాగరము సల్పిన ఖిన్నతనొక్క దీర్ఘికా
　　కైరవరాజి యిప్డు నిజగర్భనివిష్ట మదద్విరేఫ ఝం
　　కారమిషంబునం దలుచఁగాఁగుఱువెట్టుచు నిద్రవోయెడిన్.

టీ. వారక=విడువక, రాత్రియెల్లన్=రాత్రిపూఁటయంతయును, ప్రియవల్లభుఁడు=ఇష్టుఁడయినభర్త, ఐనశశాంకున్=అయినట్టి చంద్రుని, కూడి, ఇచ్ఛారతికేళి=ఇష్టమువచ్చినట్లు సురతక్రీడయందు, జాగరము=నిద్రాభావమును, సల్పినఖిన్నతచేతనొక్క=సల్పినట్టి ఖేదముచేతనుగాఁబోలు, దీర్ఘికాకైరవరాజి=క్రీడాసరస్సునందున్న తెల్లఁగలువపంక్తి, నిజ...మిషంబునన్—నిజ=తమయొక్క, గర్భ=గర్భములందు, నివిష్ట=ప్రవేశించియున్న, మదద్విరేఫ=మత్తిల్లిన తుమ్మెదలయొక్క, ఝంకారమిషంబునన్ = ఝంకారధ్వనులచేతను, తలుచగాన్=అధికముగా, గుఱువెట్టుచు, నిద్రవోయెడిన్=నిద్రించుచున్నది. తుమ్మెదలు రాత్రియందు వికసించిన కలువలందుఁజేరి మకరందమును ద్రావి మత్తిల్లి యందు శయనించియుండఁగాఁ బ్రాతఃకాలమగుటచేఁ గలువలు ముకుళించె. అందుచేఁ దుమ్మెదలు పైకిరాలేక యందుండి యప్పటప్పట ఝంకారములు చేయుచుండెను. సూర్యస్పర్శముచేఁ గలువలుముకుళించెను. ఇట్లుండఁగాఁ దన మనోహరుఁడయి చంద్రునితో రతిక్రీడసల్పుచు రాత్రియందెల్ల జాగరముండుటచేత నే కలువపఙ్క్తి పగటిపూఁట నిద్రించి తమలో నుండఁగయున్న తుమ్మెదల

ఝుంకార మనెడి నెపముచే గుఱుపెట్టుచు నిద్రించుచుండెనని యుత్ప్రేక్షించెను. అలం. సాపహ్నవోత్ప్రేక్ష.

తా. తెల్లకలువపంక్తి రాత్రియంత కాలంబును దమప్రియుఁడయిన చంద్రునిఁగూడి స్వేచ్ఛగా సురతక్రీడ గావించుచు నిద్రమాని వర్తించుటచే మిక్కిలియాయాసపడి యాయాసమును దీర్చికొనుటకై కాఁబోలు తమగర్భములందు నివసించిన తుమ్మెదల ఝుంకారములను మిషచేత గుఱుపెట్టుచు నిద్రించుచుండెను.

వ. అని యివ్విధంబునం బ్రభాతకాలవర్ణనంబుచేయు వైతాళికుల నాదరించి. 21

మహాస్ర. బలవద్దారిద్ర్యముద్రా ప్రకుపిత క
మలాపాటలా పాంగరోచిః
కలికా సందేహదాన క్షమ కమలమణి
గ్రామజాగ్రన్మయూఖో
జ్జ్వల శుద్ధస్వర్ణభూషా సముదయ ముద
యత్స్వాంతసంప్రీతి నా సూ
తులకుం బుత్తెంచె భూ నాధుసతి యుఁ డిగ
పుంగవోయజాతాక్షి చేతన్. 22

టీ. భూనాథుసతి=దమయంతి, ఉదయత్స్వాంతసంప్రీతిన్ =పుట్టుచున్న మనస్సంతోషముచే, బలవత్ ... సముదయము—బలవత్ =బలవంతమగు, దారిద్ర్యముద్రా= పేదతనము నిలుకడపై, ప్రకుపిత=మిగులఁగోపమువహించిన, కమలా=లక్ష్మీదేవియొక్క, పాటల=ఎఱ్ఱని, అపాంగ=కడకంటి చూపులయొక్క, రోచిఃకలికా = కాంతియొక్క మొగ్గలోయనెడి, సందేహ=సంశయమును, దాన= ఇచ్చుటయందు, క్షమ=సమర్థములయిన, కమలగ్రామ=పద్మరాగసమూహములయొక్క, జాగ్రత్ = ప్రసరించుచున్న, మయూఖ = కిరణములచేత, ఉజ్జ్వల=ప్రకాశించుచున్నవియు,శుద్ధ=మాలిన్యరహితములయినవియు,స్వర్ణ=సువర్ణవికారములయినవియు, ... సముదయ

ము=సమూహమును, ఉడిగపుందోయజాతాక్షిచేతన్=పరిచారిక చేత, అసూతులకున్=ఆవైతాళికులకు, పుత్తెంచెన్=పంపెను. వైతాళికులొనరించిన ప్రాతఃకాలవర్ణనమును విని దమయంతి తన చెలికత్తె చే దారిద్ర్యమును దొలఁగింపజాలినవియు పద్మరాగమయములైనవియు, సువర్ణవికారములయినవియు నగు నలంకారములను వైతాళికులకుఁ బంపెనని భావము.

తా. దమయంతి వైతాళికుల ప్రాతఃకాల వర్ణనమునకు మిగుల సంతసించి గొప్పదగు దారిద్ర్యము విషయమై కోపము వహించిన లక్ష్మీదేవి యెఱ్ఱని కడకంటిచూపుల కాంతులేమో, యనెడిసందియము కలిగింపఁజాలు పద్మరాగమణికాంతులచే సముజ్జ్వలములయిన సువర్ణాలంకారములను దీసి తన చెలికత్తెచేతి కిచ్చి వారికిఁ బంపెను.

వ. అప్పుడు. 23

తే. తనకు నెద్దానిఁ గన్యాక ప్రదానవేళ
యౌతుకంబున నిచ్చె నెకెయ్యంపుమామ
యట్టి యీశ్వరవరద త్తకమైనరథముఁ
గామగమనంబుఁ దలఁచె నా క్షణమ నృపతి. 24

టీ. నెయ్యంపుమామ = తనమామయగు భీమరాజు, కన్యాప్రదానవేళన్ = దమయంతినిచ్చునపుడు, యౌతుకంబునన్ = అరణముగా, ఎద్దానిన్=ఏరథమును, తనకున్, ఇచ్చెన్, అట్టి యీశ్వర వరదత్తము, ఐనరథము = ఈశ్వరవరమువలన లభ్యమయిన రథమును, కామగమనంబున్ = స్వేచ్ఛాగమనముకలదానిని, ఆక్షణమ=అప్పుడే, నృపతి=నలుఁడు, తలఁచెన్=స్మరించెను.

తా. నలరాజపుడు తనకు భీముఁ డొసఁగినదియుఁ గామగమనము గలదియు నగు రథంబును దలంచుకొనెను.

క. మదిఁ దలఁచి నంతమాత్రన
యుదయించు సహస్రరశ్మికకుపమానం బై
మదన క్రీడాసౌధము
తుదనిలువున నిలిచె రథము తో యదలిన్. 25

టీ. మదిన్, తలఁచినంతమాత్రన = తలఁచిన క్షణములోనే, ఉదయించు సహస్రరశ్మికిన్ = ఉదయించుచున్న సూర్యునకు, ఉపమానంబై = సాటివచ్చుచు, మదనక్రీడాసౌధముతుదనిలువునన్ = కేళికాసౌధముయొక్క కొనయంతస్తునందు, తోయదవీథిన్ = ఆకాశమార్గమునందు, నిలిచెన్ = నిలువఁబడెను.

తా. సులభము.

తే. కనక కింకిణికాజాలకములు మెఱయ
గగనతరు పుష్పమగు పుష్పకంబువోలె
నెచటనుండియొ యేతెంచి యెదుటనున్న
పసిఁడితే రెక్కె వసుమతీపాలసుతుఁడు. 26

టీ. గగనతరుపుష్పము = ఆకాశమనెడి వృక్షమునకుఁ బుష్పమువంటిది, అగు పుష్పకంబువోలెన్ = అయినట్టి పుష్పకమనెడి విమానమువలె; కనక కింకిణికాజాలకములు = బంగారపు చిఱుగంటలయొక్క సమూహములు, మెఱయన్ = ప్రకాశించుచుండఁగా, ఎచటనుండియొ = ఎక్కడనుండియోకాని, ఏతెంచి = వచ్చి, ఎదుటనున్న పసిఁడితేరు ఎక్కె, వసుమతీపాలసుతుఁడు = నలరాజు, అని పైపద్యముతో నన్వయము. అలం. ఉపమ.

తా. సులభము.

శా. వాతాహారవిరోధి నెక్కి చనువిష్వక్సేనుఁడుంబోలె ని
ర్ధౌతాసిద్యుతి మేచకంబగు వియద్భాగంబునన్ భాస్కర
ద్యోతాన్వీతవిమానమెక్కి మదిలో నుత్సాహ మేపారఁగాఁ
బ్రాతస్స్నానము చేయఁబోయె ధరణీపాలుండు మిన్నేటికిన్.

టీ. వాతాహారవిరోధిన్ = గరుత్మంతుని, ఎక్కి = అధిష్ఠించి, చనువిష్వక్సేనుఁడుంబోలెన్ = వెళ్లెడు విష్ణునివలె, నిర్ధౌతాసిద్యుతి మేచకంబు = తోమఁబడిన కత్తియొక్క కాంతులువలె నల్లనిది, అగు వియద్భాగంబునన్ = అయినట్టి యాకసమునందు, భాస్కర...విమానములు - భాస్కరద్యోత = సూర్యకాంతులవంటి  మదిలో,

ఉత్సాహము=సంతసము, ఏపారఁగాన్ =వర్ధిల్లునట్లు, ధరణీపాలుఁడు=నలుఁడు, మిన్నేటికిన్ =గంగానదికి, ప్రాతస్స్నానము, చేయన్, పోయెను=వెళ్లెను.

తా. స్పష్టము. అలం. ఉపమ.

వ. ఏఁగి యట మహానటజటాటవీవాటి నవతరించి నభోవీథీమేథీభూతంబగు ధ్రువమండలం బొరసికొనుచు శింశుమారాకారంబునం దారకామూర్తియై ప్రజ్వలించిన పాంచజన్యధరుని చరణపల్లవంబు ప్రక్షాళించుచు, సోమార్కమయ మహాసోపానంబులం బ్రవహించి పరివహపవన ఝంపాసంపాతంబులం దూఁగియాడు కరళ్లచప్పుళ్లు దిక్తటంబుల నాస్ఫోటింపం బ్రదిష్ట పలలాటికా తిలకంబును, నరికపుర గోపురద్వార దంతాగ్గళయును, నారాయణ చరణారవింద మకరందబిందు నిష్యందంబును, బుండరీక భవ కమండలు తీర్థధారయు, నైన యమ్మహానది డాసి విమానంబుడిగ్గి, జలావగాహ నాయాత జంభారాతి కుంభి కుంభస్థలీ సాంద్రసిందూర పరాగ సంధ్యాయమాన సలిలంబును, నప్సరఃకుచతటీ పటీరచర్చామ చర్చికా సురభితంబును, ప్రతీర పారిజాతకుసుమ ధూళిపాళి పిశంగిత సైకతంబును జింతామణి శిలాసంఘాత సంఘట్టన సముచ్చల జ్జలశీకరాసారచ్ఛటా స్ఫోటిత గగనభాగంబును, గనత్కనక ఫలిన వేదికా మధ్యాసీన కామధుక్ధేనూధస్యధారా ధోరణీ ప్రవాహ బృంహితోర్మియునగు నొక్క రేవున డిగ్గి తత్ప్రదేశంబున. 28

టీ. ఏఁగి, అట, మహా... వాటిన్ —మహానట = ఈశ్వరునియొక్క, జటాటవీవాటిన్ =జటలనెడి, వనవీధినుండి, అవతరించి=దిగి, నభోవీథీ మేథీభూతంబు=ఆకాశమార్గమునకు కట్టుగొఱ్ఱు, అగుధ్రువమండలంబు, ఒరసికొనుచున్ = తాఁకుచు, శింశుమారా కారంబునన్ = మొసలియొక్క రూపమున, తారకామూర్తి

రై=నక్షత్రరూపుఁడై, పవ్వళించినపాంచజన్యధరుని=శయనించియున్న నారాయణునియొక్క, చరణపల్లవంబు=చిగురువంటిపాదమును, ప్రక్షాళించుచుక్=కడుగుచును, సోమార్కమహాసోపానంబులక్ = చంద్రుఁడును సూర్యుఁడును నను నెడి గొప్పమెట్లనుండి, ప్రవహించి=పాఱి, పరివహ పవనఝంపా సంపాతంబులక్=పరివహమను వాయువుయొక్క చెంగలింపులచేత, తూఁగియాడు=ఊఁగుచున్నట్టి, కరళ్లచప్పళ్లు=కెరటములధ్వనులు, దిక్పటంబులక్=దిక్కుల సంధులను, ఆస్ఫోటింపక్=పగులఁగొట్టుచుండఁగా, త్రివిష్టపలలాటికా తిలకంబును = స్వర్గమునకు ముత్యాలబాసికమనెడు తిలకముగానున్నదియును, సరక...ర్గళయును—నరకపుర=యమపురముయొక్క, ద్వార=ప్రవేశమార్గమునకు, దంతార్గళయు=దంతమయమగు నడ్డుకఱ్ఱవంటిదియు-అనఁగా గంగానది యమపురమార్గమును నిరోధించుటయందు దృఢమగు నడ్డుకఱ్ఱవంటిదనిభావము. నారాయణ...నిష్యందంబును, నారాయణ=విష్ణువుయొక్క, చరణారవింద=పాదపద్మములందలి, మకరందబిందు=మకరందపు బొట్లయొక్క, నిష్యందంబును=స్రవణమైనదియు, హరియొక్కపాదమందుఁ బుట్టినదని భావము. పుండరీకభవ కమండలు తీర్థధారయు=బ్రహ్మయొక్క కమండులువులోని జలధారయైనదియు, బ్రహ్మ త్రివిక్రమావతారమున నాకసమాక్రమించెడి యతనిపాదమును దన కమండులూదకముతోఁ గడిగెననియు, నదియె గంగానదియయ్యెననియు నితిహాసము, ఐన యమ్మహానది = అయినట్టి గంగానదిని, డాసి = సమీపించి, విమానంబు, డిగ్గి, జలా...సలిలంబును—జలావగాహ = గంగానదీ జలములో నీఁదులాడుటకు, ఆయాత = వచ్చిన, జంభారాతికుంభి = ఐరావతముయొక్క, కుంభస్థలీ=కుంభప్రదేశములందున్న, సిందూరపరాగ=సిందూరచూర్ణముచేత, సంధ్యాయమాన=సంధ్యాకాలమువలె నెఱ్ఱగాఁగానవచ్చు, సలిలంబును=జలము గలదియు,అప్సరః...సురభితంబును- అప్సరః=అచ్చరలయొక్క, కుచతటీ=స్తనతటములందున్న, పటీర చర్చామచర్చికా = శ్రేష్ఠమయిన మంచి గందపుపూఁతలచేత, సురభితంబును = పరిమళించునదియును, అనఁగా నచ్చరలువచ్చి యందుఁ [illegible] మందుఁ గలి

యుటచే నాజలము మిక్కిలి పరిమళించుచున్నదని భావము. ప్రతీర...సైక
తంబున—ప్రతీర=ఒడ్లయందున్న, పారిజాత = పారిజాత వృక్షములయొక్క,
కుసుమ=పుష్పములందున్న,ధూళిపాళి=పరాగ సముదయముచే,పిశంగిత=పచ్చని
దగు, సైకతంబును=ఇసుకదిన్నెలు కలదియు, చింతా...భాగంబును - చింతా
మణి=చింతామణులనెడి, శిలాసంఘాత = రాలసముదయముయొక్క, సంఘ
ట్టన=తాఁకుటచే,సముచ్ఛలత్=మీఁదికెగయుచున్న, జలశీకరాసార=వర్షరూప
ముగాఁబడు జలబిందువులయొక్క, ఛటా = సమూహముచేత, ఆస్ఫోటిత=
చఱువఁబడుచున్న, గగనభాగంబును=ఆకాశముగలదియు, కనత్...తోర్మి
యును—కనత్=ప్రకాశించుచున్న,కనకపులినవేదికా=అరుగులవంటి బంగారపు
టిసుకతిన్నెలలయొక్క, మధ్య = మధ్యభాగమునందు, ఆసీన=ఉండిన,కామ
ధుక్=కోర్కులనిచ్చు, ధేను = కామధేనువుయొక్క, ఊధస్య = పొదుగు
నుండి కాఱుచున్న క్షీరములయొక్క, ధారాధోరణీ=ధారలవిధములయొక్క,
ప్రవాహ=ప్రవాహముచే, బృంహిత=వర్ధింపఁబడిన, ఊర్మియుక్=తరంగములు
కలదియు, అగు నొక్కరేవునక్, డిగ్గి=లోపలికిఁబ్రవేశించి, తత్ప్రదేశంబున.

సీ. అత్యంత నియతిఁ బంచాంగంబు పఠియించె
నఘమర్షణ స్నాన మాచరించె
దైవత ఋషి పితృ తర్పణం బొనరించె
సంధ్య నారాధించె సవితృఁ గొల్చె
గాంగేయవాలుకా లింగమూర్తిని నిల్పి
కాంచనాబ్జములఁ బూజించె శివునిఁ
బారిజాత కలతా పల్లవాగ్రంబులు
చిదిమి యొయ్యన మేపెఁ ద్రిదశగవికిఁ

తే. గేలుదోయెత్తి యాదలఁ గీలుకొల్పి
గగన మునిరాజాలయము ... ...

దివ్యరథమెక్కి వేగ యేతెంచె మరలి
యధిపుఁ డట్టులు సురనదీ యాత్ర సల్పి. 29

టీ. అధిపుఁడు = అనలుఁడు, అత్యంతనియతిన్ = మిక్కిలి నియమము చేత, పంచాంగంబు = తిథి వార నక్షత్రయోగకరణముల నైదింటిని, పఠియించెన్, అఘమర్షణ స్నానము = అఘమర్షణమను మంత్రమును జపించుచుఁ జేయు స్నానమును, ఆచరించెన్, దైవత ఋషి పితృతర్పణంబున్ = దేవతలకును, ఋషులకును, పితృదేవతలకును దర్పణంబును, ఒనరించెన్ = చేసెను. సంధ్యన్, ఆరాధించెన్, సవితృన్ = సూర్యుని, కొల్చెన్ = సేవించెను. గాంగేయవాలుకాలింగమూర్తిని = గంగానదిలోని యిసుకతో లింగమును, నిల్పి, శివునిన్, కాంచనాబ్జములన్ = బంగారు కమలములచే, పూజించెన్, పారిజాతకలతా పల్లవాగ్రంబులు = పారిజాతపు తీవెలయొక్క చిగుళ్లు, చిదిమి = కోసి, ఒయ్యనన్ = మెల్లగా, త్రిదశగవికిన్ = కామధేనువునకు, మేపెన్, కేలుదోయి = కరద్వయము, ఎత్తి, ఔదలన్ = తలపై, కీలుకొల్పి, గగనమునిరాజులు = ఆకసమందున్న మునిశ్రేష్ఠులయినట్టియు, చుక్కలు = నక్షత్రాకారము నొందిన సప్తర్షులకు, మ్రొక్కి, దివ్యరథము = దేవవిమానమును, ఎక్కి, అట్టులు = సురనదీయాత్ర = గంగాయాత్ర, సలిపి = చేసి, మరలి, ఏతెంచెన్ = వచ్చెను.

తే. హృద్యసౌధాగకుట్టిమా నేకరూప
ధాతుకాధిత్యకాతటాంతరము సేరె
ధరణినాథపురందరా ధ్యాసితంబు
రత్నదివ్యవిమానధా రాధరంబు. 30

టీ. ధరణి...ధ్యాసితంబు—ధరణినాథ = నలరాజనెడి, పురందర = ఇంద్రుని చే, అధ్యాసితంబు = అధిష్ఠింపఁబడినదియైన, రత్న...ధరంబు—రత్న = రత్నవికారమైన, దివ్య = దేవతాసంబంధియగు, విమాన = విమానమనెడి, ధారాధరంబు = మేఘము, హృద్య...తరము—హృద్య = మనోహరమైన, సౌధ = మేడయనెడి, అగ = పర్వతముయొక్క, కుట్టిమ = నానావిధరత్నమయములగు కట్టడములనెడి,

అనేకరూప=పలువిధములగు, ధాతుకా=గైరికాదిధాతువులుగల, అధిత్యకా=ఉపరిభాగముయొక్క, అంతరంబు=మధ్యభాగమును చేరెను. మేడనుపర్వతము వలెను, దానియూర్ధ్వభాగమునఁ గట్టఁబడిన రత్నమయములగుకట్టడములు, గైరికాదిధాతువులుగల పర్వతోపరిభాగమువలెను, నలుఁడింద్రునివలెను విమానము మేఘమువలెను. నొప్పుచున్నవని యర్థము.

తా. దేవేంద్రుఁడు మేఘములపై నధివసించి గైరికాదిధాతువులుగల పర్వతోపరిభాగముంబోలె, నలుఁ డా దేవవిమానమునఁగూర్చుండి రత్నమయమగు తనమేడయొక్క యుపరిభాగమును జేరెను.

తే. దివసముఖకార్యజాతంబు 'తీర్చివచ్చు
పతి నెదుర్కొనె భక్తిసంభ్రమ మెలర్పఁ
జెలువ ప్రత్యగ్దిశాసింధు సలిలవీచి
తూర్పుదెస వచ్చునిండు చందురునిఁబోలె. 31

టీ. చెలువ=దమయంతి, ప్రత్యగ్దిశాసింధు సలిలవీచి=పడమటి సముద్రపుకెరటము, తూర్పుదెస=తూర్పుదిక్కునుండి, వచ్చునిండుచందురునిబోలెన్=ఉదయించుచున్న పున్నమచంద్రునివలె, దివసముఖకార్యజాతంబు=ప్రాతఃకాలకృత్య సమూహమును, తీర్చి=నెఱవేర్చి, వచ్చుపతిని=వచ్చుచున్ననలరాజును, భక్తిసంభ్రమము=భక్తివలనితొట్రుపాటు, ఎలర్పన్=ఒప్పునట్లుగా, ఎదుర్కొనెన్=అభిముఖముగాఁ బోయెను. పున్నమ చందురునిఁ జూచి యుప్పొంగు సముద్రతరంగమువలె దమయంతి నలునిఁజూచి పొంగెనని భావము.

తా. తూర్పున నుదయించు నిండుచంద్రుని నెదుర్కొను సముద్రతరంగము వలె, దమయంతి ప్రాతఃకాలకృత్యములఁ దీర్చివచ్చు తనభర్తను భక్తితోను దొందఱపాటుతోను నెదుర్కొనెను.

వ. తరణిఖరకిరణకందళితమందాకినీకనకారవిందంబునకు విందై, నిజసందర్శనానందమందస్మితసుందరంబగు నయ్యిందువదన వదనంబు మదనరాగంబు సంపాదింప సర్వనర్వాంసహానిలింప సార్వభౌముండు. 32

టీ. సర్వ...సార్వభౌముండు=సమస్తభూమికి నధిపతియగు నలచక్రవర్తి, తరణి...విందంబునకున్ -తరణి=సూర్యునియొక్క, ఖర=వాఁడియైన, కిరణ=కిరణములచే, కందళిత=వికసించిన, మందాకినీకనకారవిందంబునకున్ =గంగానది సంబంధియగు బంగారుపద్మమునకు, విందై=చుట్టమై, నిజ...సుందరంబు=తనదర్శనానందమువలనఁ గల్గిన మందహాసముచే, నందమైనది, అగు నయ్యిందువదనవదనంబు=ఆదమయంతి ముఖము,మదనరాగంబు=మన్మథవికారమును, సంపాదింపన్ =కలిగింపఁగా, అని పద్యముతో నన్వయము.

ఉ. మానససంప్రమోదము సమగ్రముగా సురలోకవాహినీ
స్నానవిధిప్రవృత్తి వచనంబునఁ జెప్పక చెప్పినట్లు స
న్మానతఁ దన్నెదుర్కొనిన మానవతీజనతాలలామకున్
గానుకయిచ్చెఁ దావి వెలిగాని కనత్కనకారవిందమున్.

టీ. మానససంప్రమోదము=మనస్సంతోషము, సమగ్రముగాన్ =నిండుగాఁగా, సుర...వృత్తిన్ -సురలోకవాహినీ=గంగానది సంబంధియగు, స్నానవిధి=స్నానరూపమగు కార్యమందు, ప్రవృత్తి=తానెట్లుప్రవర్తించెనో యట్టిచందమును, వచనంబునన్ =మాటలతోడ, చెప్పక=చెప్పకుండఁగా, చెప్పినట్లు=చెప్పినవిధముగా, సన్మానతన్ =గౌరవముతో, తన్ను,ఎదుర్కొనిన...మకున్ =అభిముఖముగా వచ్చుచున్న, స్త్రీలలో శ్రేష్ఠురాలగు దమయంతికి, తావి=వాసన, వెలిగాని = తీసిపోకయున్న, కనత్కనకారవిందమున్ = ప్రకాశించు బంగారు కమలమును, కానుక, ఇచ్చెన్ =బహుమానముచేసెను. బంగారు కమలములు గంగానదిలో మాత్రమే కలవుగాన తాను గంగానదిలోఁ దానమాడినట్లు మాటలతోఁజెప్పకపోయినను నట్టితామరపువ్వు నామెకు బహుమతి గానిచ్చుటచే నాతామరపువ్వే యతని గంగాస్నానవిధానమును దెలుపుచున్నదని భావము.

తా. నలుఁడు నిండయిన మనస్సంతోషముతో దాను గంగానదిలోఁ దానమాడిన వృత్తాంతమును జెప్పక పోయినను దన్నెదుర్కొనవచ్చిన దమయంతికి నందుండి తెచ్చిన కనకకమలమునుగానుక యిచ్చుటచేఁజెప్పినట్లయయ్యెను.

క. పురుషోత్తమలాలిత య
త్తరుణీమణి మిగులనొప్పెఁ దత్సమయమునన్
సురసింధుహేమకమలము
కరకమలంబున ధరించు కమలయుఁబోలెన్. 34

టీ. పురుషోత్తమ = పురుషశ్రేష్ఠుఁడయిన నలునిచే, లాలిత = మన్నింపఁబడిన, అత్తరుణీమణి=ఆదమయంతి, తత్సమయమునన్ = ఆసమయమందు, సురసింధుహేమకమలము=గంగానదిలోని బంగారుపద్మము,కరకమలంబునన్, ధరించి=తాల్చి, పురుషోత్తమలాలిత=విష్ణువుచే మన్నింపఁబడిన, కమలయుఁబోలెన్ = లక్ష్మీదేవివలెనే, మిక్కిలి,ఒప్పెన్ =ప్రకాశించెను.

తా. సులభము.

తే. రాజముఖికి నయ్యేకవరాటకంబు
లలిత సమ్మానమున నేకలక్షమయ్యె
రాజకృప గన్న యొక్కవరాటకంబు
నేకలక్షంబ మఱి సంశయింపనేల ? 35

టీ. రాజముఖికిన్ =చంద్రునివంటి ముఖముగలదమయంతికి, ఆ యేకవరాటకంబు=ఆ ఒక్కతామరదుద్దు, లలితసమ్మానమునన్ =నలుఁడు చూపిన యర్హాగౌరవముచేత, ఏకలక్షము = అదియొక్కటిమే నేత్రమునకు విషయమైనది, అయ్యెన్ =అదియొక్కటియే యయినను నలుఁడుప్రేమపూర్వకముగా నిచ్చెను గాన దమయంతి దానినే లక్షపద్మములతో సమముగా నెంచుకొని తదీయశోభను మాటిమాటికిని జూడసాగెనని భావము. రాజకృపన్ =రాజుదయను, కన్నయొక్కవరాటకంబు = కాంచినట్టియొక్క గవ్వయును, ఏకలక్షంబ = ఒకలక్షసంఖ్యాపరిమితిమగు వస్తుసమూహముతో సమానము కదా ! గుణములన్నియును ప్రేమమందుఁగలవుకాని వస్తువునందులేవని యందురు. కాన కమల మొక్కటయినను నలుఁడు ప్రేమపూర్వకంబుగా నిచ్చుటచే లక్షాదిసంఖ్యకంటెను మిక్కిలియధికమైనది యయ్యెనని ఫలితార్థము. మఱి సంశయింపన్ ఏల ! అట్లగుననుటలో సంశయములేదని భావము.

తా. దమయంతి దనకుఁ బ్రియుం డధికగౌరవంబుతో నిచ్చుటచేఁ, బద్మ మొక్కటియైనను దానినే మాటిమాటికిఁ జూచుచు మిగుల సంతసించెను. ఒక్క పద్మమును మాత్రమునే చూచుటచేత దమయంతి కెట్లు సంతసముగల్గునని సంశయింపఁబనిలేదు. రాజు దయాపూర్వకముగా నిచ్చిన దొకగవ్వయైనను లక్షవస్తువులతో సమానమగును గదా!

వ. అనంతరంబ విధివిశేషంబు సమాప్తింపంగోరి చకోరలోచనం గడకంట నీక్షించుచు నిషధాధ్యక్షుం డగ్నిహోత్రంబునకుంజని.

తే. తన కరిష్టంబు లగుకలి ద్వాపరముల
కేతుపూపియుఁబోలె ధాత్రీశ్వరుండు
నిత్యసత్త్రిత ఋత్విక్ప్రణీత యైన
త్రేత సేవించె విజితామిత్త్రేతరుండు. 37

టీ. విజితమిత్రేతరుండు=జయింపఁబడిన శత్రువులుగల, ధాత్రీశ్వరుండు=నలుఁడు, నిత్యసత్త్రిత=ఎల్లప్పుడును యజ్ఞములతోఁ గూడినదియు, ఋత్విక్=ఋత్విజులచే, ప్రణీత = మంత్రపూర్వకముగాఁ బ్రజ్వలింపఁ జేయఁబడినది. అయినత్రేతన్ = అయినట్టి త్రేతాయుగమునని యర్థము. మూఁడగ్నులని భావము. తనకు, అరిష్టంబులు=హానికలిగించునవి. అగు కలిద్వాపరములకున్ = అయినట్టి కలిద్వాపరములకు, ఏతుపూపియుఁబోలెన్ = అసూతాహేతువును జూపువానివలె సేవించెను. ఇట త్రేతా ద్వాపర కలియుగములు మూటిలో నిష్టమయిన త్రేతను సేవించుట తక్కిన రెంటును దన కనిష్టములను కారణము తెలుపునట్లగునని యర్థము.

తా. గతార్థము.

తే. విభుఁడు ప్రాహ్ణేతసత్క్రియా విధికలాప
మీవిధంబునఁ దీర్చి సద్భావ మొప్ప
భామినీభావజిజ్ఞాసఁ బాదపద్మ
యుగము నిశ్శబ్దముగ మెట్టుచొయ్య వచ్చె. 38

టీ. విభుఁడు=నలుఁడు, ప్రాహ్ణేతనక్రియా విధికలాపము=వేకువనుసంబంధించిన కార్యసమూహమును, ఈవిధంబునన్=ఈరీతిగా, తీర్చి, నెఱవేర్చికొని, సద్భావము=మంచి మనస్సు, ఒప్పన్, భామినీభావజిజ్ఞాసన్=దమయంతి హృదయమును దెలిసికొను తలంపుతో, పాదపద్మయుగము, నిశ్శబ్దముగన్=చప్పుడు కాకుండ, మెట్టుచు=వేయుచు, ఒయ్యన్, వచ్చెను.

తా. నలుఁడీవిధముగా ప్రాతఃకాలఃక్రియలు నెఱవేర్చికొని దమయంతిచిత్తమును దెలిసికోఁగోరి చప్పుడుకాకుండ నడుగులిడుచు నామెను సమీపించెను.

ఉ. మిన్నక చేరవచ్చి యొక మేలపుమైపడిఁ బువ్వుఁబోఁడి క్రా
ల్గన్నులు మూసెఁ బాణికమలంబుల భూపతినవ్వుచున్న యా
సన్నసఖీజనంబుఁ గను సన్న నదల్చుచు నవ్వధూటి క్రా
ల్గన్నులఁ జేరలం గొలుచుకైవడిఁ గన్నుల నవ్వు దేఱఁగాన్.

టీ. భూపతి=నలుఁడు, మిన్నక=ఊరకయే- అనఁగా నిశ్శబ్దముగాననుట. చేరవచ్చి=సమీపించి, నవ్వుచు...జనంబున్ = నవ్వుచున్నట్టి సమీపముననున్న చెలికత్తెలను, కనుసన్నన్=కనుసైగచే, అదల్చుచున్ = బెదరించుచు, కన్నులన్, నవ్వు తేఱఁగాన్=నవ్వువచ్చుచుండఁగా, అవ్వధూటిక్రాల్గన్నులన్=ఆదమయంతియొక్క బెళుకులయిన నేత్రములను, చేరలన్, కొలుచుకైవడిన్=కొలుచునట్టి విధముగా, పువ్వుఁబోఁడి క్రాల్గన్నులు=దమయంతి నేత్రములను, మేలపుమైపడిన్=పరిహాసార్థముగా, పాణికమలంబులన్=చేతులతో మూసెను. నలుఁడు పరిహాసార్థము దమయంతి నేత్రములను జేతులతో మూయఁగా నది యామెనేత్రములెంత లేసియున్నవో యని చేరలతోఁ గొలుచుచున్నట్టులుండెనని భావము.

తా. నలరాజట్లు నిశ్శబ్దముగా వచ్చి తన్నుఁజూచి నవ్వుచున్న చెలికత్తెలను గను సంజ్ఞలచే బెదరించుచు, దననేత్రములందు నవ్వు పొడముచుండఁగా దమయంతి నేత్రములను జేరలతోఁ గొలుచుచున్నట్లుగాఁ, బరిహాసమునకై యామె నేత్రములు మూసెను. అల. ఉత్ప్రేక్ష.

తే. ఒక్కపూఁబోఁడి భూపసంజ్ఞ నొయ్యఁబిలిచి
యాత్మహస్తాధికార మయ్యబ్జవదన

హ స్తముల కిచ్చి యెఱుఁగని ✽ యట్లు తాను
వసుమతీశుండు నగె నప్పై ✽ వచ్చినట్లు. 40

టీ. ఆత్మహస్తాధికారంబు = తనచేతులపనిని - దమయంతి కన్నులమూయుట ననుట.

తే. జ్ఞాతహస్తాంబుజాంతర ✽ స్పర్శయగుటఁ
గైతవంబు నెపంబుగాఁ ✽ గమలనయన
మానసంబున మానసం ✽ పద వహించె
నాననంబున ధరియించె ✽ మౌనముద్ర. 41

టీ. జ్ఞాత...యగుటన్ = తెలియబడిన వేఱుచే దమ్మియొక్క తాఁకుడు గలది—మునుపుమూసినది రాజనియు పిదప మూసినది సఖియొక్కరనియుఁ దెలిసికొన్నది యగుటచేత, కైతవంబునెపంబుగాన్ =అట్లు చేసినమోసము కారణముగా, మానసంపదన్ =కోపము పెంపును, ఆననంబునన్ = ముఖమందు, మౌనముద్రన్ =మాటాడకుండు నియమమును ధరియించెను.

చ. కుటిలకటాక్షవీక్షణముఁ ✽ గోమలనూత్నకపోలరాగముం
జటులసమంచితభ్రుకుటి ✽ సంవళనంబును జూచువేడుకన్
జిటపొట రేఁచె రాజు సర ✽ సీరుహనేత్రకుఁ గాముకేళికిన్
గటువులుగానిమానముల ✽ కావె ప్రదీపనసిద్ధిహేతువుల్.

టీ. రాజు=నలుఁడు, కుటిలకటాక్షవీక్షణమున్ = వక్రమయిన కడకంటి చూపును, కోమల...రాగము— కోమల=మృదువయిన, నూత్న=నవకమయిన, కపోల=చెక్కిళ్లయందలి, రాగమున్ =(కోపమునలన)ఎఱ్ఱఁదనమును,చటుల... సంవలనంబును—చటుల=చలించునట్టివియు,సమంచిత=ప్రకాశించునవియునగు, భ్రుకుటి=కనుబొమ్మలయొక్క,సంవలనంబును=తిరుగుడును,చూచువేడుకన్ = చూడవలెనన్న కౌతుకముతో, సరసీరుహనేత్రకున్ = దమయంతికి, చిటపొటన్ =ఈర్ష్యచేఁ గలిగినకోపమును,రేఁచెన్ = హెచ్చించెను. కాముకేళికిన్ = సురతమునకు, కటువులు= వెగటయినవి, కానిమానముల=కానట్టి ప్రణయకోప

ములే, ప్రదీపనసిద్ధిహేతువుల్ = కామోద్రేకమును గల్గింపఁగారణములు, కావె? తప్పకరైె తీఱునని భావము. ప్రణయకోపము వహించిన స్త్రీలకు కటాక్ష వీక్షణములు వక్రముగాను, నునుపైనచెక్కిళ్లయందెఱ్ఱఁదనమును, కనుబొమలు మిక్కిలిగాఁ జలించుటయుసంభవించి మిక్కిలి సుందరముగాఁ గానవచ్చును.

తా. నలరాజు దమయంతియొక్క వక్రములయిన కడకంటి చూపులును, నెఱ్ఱఁబడిన చెక్కులను, బరిభ్రమించుటచే సుందరములగు కనుబొమలను జూడవలెనన్న వేడుకతో, దమయంతికి గోపముహెచ్చించెను. అనురాగ భంజకములు కానిప్రణయకోపములు సురతమునుద్దీపించుటకు గారణములుకదా.

వ. అప్పుడు నృపతి సామోపాయంబునం బ్రణయమానం బప నయింపఁ దలంచి యిట్లనియె. 43

టీ. ప్రణయమానంబుక్ = పొలయలుకను, సామపాయంబునక్ = లాలన రూపమయిన వెరవుచేత, అపనయింపక్ = పోఁగొట్టుటకు.

ఉ. దాస్యమునిన్న రేకుసుమ ధన్వుఁడొకండును సాక్షిగా సరో జాస్య వహించినాఁడ వినుమ మప్పుడ మ్రొక్కుట లేదు నీకు వి శ్వాస్యుఁడఁగాన మ్రొక్కుగొను మ స్వస్తటినీసలిలాభిషేకసా రస్యపవిత్రమస్తకము మ వ్రాల్చెద నీపదయుగ్మకంబుపై. 44

టీ. సరోజాస్య = పద్మమువంటిముఖముగల దమయంతీ! నిన్నరే = నిన్నరాత్రి, కుసుమధన్వుఁడు = మన్మథుఁడు, సాక్షిగాక్ = సాక్షాద్ద్రష్టయైయుండగా, దాస్యము = నీకు సేవను, వహించినాఁడక్, వినుము, అప్పుడు = అట్లుసేవచేయు నప్పుడు, మ్రొక్కుటలేదు, నీకు, విశ్వాస్యుఁడక్ = నమ్మఁదగినవాఁడను. కాన, స్వస్త...మస్తకముక్ — స్వస్తటినీ = గంగానదియొక్క, సలిలాభిషేక = జలస్నానముయొక్క, సారస్య - సరసపుఁదనముచే, పవిత్ర = పాపరహితమయిన, మస్తకము = శిరస్సును, నీపదయుగ్మకంబుపైక్ = నీపాదపద్మములపై, వ్రాల్చెదక్ = చేర్చెదను, మ్రొక్కుగొను = నానమస్కారమును దీసికొనుము.

తా. ఓదమయంతీ! గతించినరాత్రి యంతయును నీసేవనుజేసితిని. లేదను

టకు వీలులేదు. మన్మథుఁ డందులకు సాక్షియైయున్నవాఁడు, సేవచేసితినిగాని యప్పుడు నీకు దండము పెట్టలేదు. నేను నీకు విశ్వసింపఁ దగినవాఁడను, కాన గంగాస్నానముచేఁ బవిత్రమయిన నాశిరస్సును నీపాదముపైఁ జేర్చెదను. నానమస్కారమును స్వీకరింపుము.

తే. కుటిలమగు నీకటాక్షంబు ♦ కువలయాక్షి
యించుకించుక నామీఁద ♦ నెఱ్ఱఁబాటి
నిగిడి మరలినభావంబు ♦ నిజము తెలిసె
శ్రవణకూపనిపాత నైక ♦ శంకఁ జూవె. 45

టీ. కువలయాక్షి, కుటిలము = వక్రమైనది, అగు నీకటాక్షంబు = అయినట్టి నీకడకంటిచూపు, ఇంచుకించుక = కొంచెముకొంచెము, నామీఁదన్, ఎఱ్ఱఁబాటి = ఎఱ్ఱఁదనమువహించినదై, నిగిడి = నాపైఁబడి, మరలినభావంబు = మగిడి పోయినరీతియొక్క, నిజము = సత్యము, తెలిసెన్ = తెలియవచ్చెను. శ్రవణ... శంకన్ - శ్రవణకూప = చెవులనెడినూతులందు, నిపాత = పడుటయనెడి, ఏక = ముఖ్యమయిన, శంకన్ చూవె = జంకుచేత నేచుమీ! దమయంతి కడకంటి చూపులచే నలుఁజూచినది. అప్పు డామెచూపు దమయంతిచెవులను దాఁకుచుండెను. అది చూచి నలుఁడు దమయంతింగాంచి " ఓ ప్రియురాలా! వంకరగా నాపైకిఁ బ్రసరించినకడకంటిచూపు నీచెవులవఱకు వ్యాపించి మరలినది. అది యెందుకు మరలెనంటేని నూతులవలెనున్న శ్రవణకుహరములందు గూలుదునో యనియె మరలెనుజుమీ! యాథార్థ్యము తెలిసినదని భావము. చూప కాను ప్రాణితమైన యుత్ప్రేక్ష.

తా. స్పష్టము.

క. లేయెంత వేఁడి యయ్యుం
దోయజషండముల కింపు ♦ దొలఁకించుక్రియన్
నీయలుక పరుసనయ్యును
నాయెడఁదకు వేడ్క సేయు ♦ నలినదళాక్షీ. 46

టీ. నలినదళాక్షీ, దమయంతీ! లేయెండ=బాలసూర్యునికాంతి, వేఁడి=తీవ్రమైనది, అయ్యున్, తోయజషండమును, తొలఁగించుక్రియన్=వికసింపఁజేయు నట్లుగా, నీయలుక=నీప్రణయకోపము, పరుసనయ్యున్ = తీవ్రమయినప్పటికిని, నాయెడన్=నాకు, తగన్, వేడ్కసేయు=వేడుకపుట్టించుచున్నది.

తా. సులభము.

తే. చివురుఁగెమ్మోవిచిఱుగాటు ♦ నెపము గాఁగఁ
దామరసనేత్ర! కోపింపఁ ♦ దగదు మమ్ము
ఫలరసాస్వాద మొనరించు ♦ చిలుక మీఁద
బింబవల్లీమతల్లి కో ♦ పింపనట్లు. 47

టీ. తామరసనేత్ర=దమయంతీ! చివురుకెమ్మోవిచిఱుగాటు=నీచిగురువంటి యధరోష్ఠమునందుఁ జేసినదంతక్షతము, నెపము గాఁగన్=మిష చేసికొని, ఫలరసాస్వాదము=పండ్లరసము ననుభవించుటను, ఒనరించు చిలుకమీఁదన్=చేయుచున్న చిలుకపై, బింబవల్లీమతల్లి=శ్రేష్ఠమయిన దొండతీవె, కోపింపనట్లు=కోపింపనివిధముగా, మమున్, కోపింపఁదగదు. దొండతీవె తనపండ్లను గొఱికి రసాస్వాదనము చేయుచున్న చిలుకలమీఁద నెప్పుడు కోపగింపదు. అట్లె నీవును నీయధరోష్ఠమాను నప్పుడు దంతక్షతము చేసితినన్న మిషచే నన్నుఁ గోపింపరాదని భావము.

తే. ఉవిద నీమాట విననొల్ల ♦ మూరకుండు
కాదనక వింటిమే నేమి ♦ కారణంబొ
రాజకీరంబు మము నిష్ఠు ♦ రంబు లాడుఁ
బ్రతిదినంబును బరుసగాఁ ♦ బలుకు వీణ. 48

టీ. ఉవిద=దమయంతీ, నీమాట=నీపలుకు, వినన్, ఒల్లము=అంగీకరింపము, కాదనక=వలదనలేక, వింటిమేని=విన్నచో, ఏమి కారణంబొ=ఏమికారణమో తెలియదుకాని, రాజకీరంబు=రామచిలుక, మమున్, నిష్ఠురంబులు= కఠినోక్తులు, ఆడున్, వీణ, ప్రతిదినంబును, పరుసగాన్=కఠినముగా,

పలుకును. నలుఁడు దమయంతివాక్యమును విన నిష్టముగలిగియు లేనట్లు చెప్పుచు న్నాఁడు. ఓదమయంతీ ! నీవచనముల విన్నచో, చిలుకయు వీణయుఁ దమ పలుకులకంటె మధురములగు నీవచనములు వినుటచే మచ్చరపడి మమ్మునిందిం చును. కావున మాటాడకుండుటయే మంచిదని బహిరర్థము. వీణానాదముకం టెను, జిలుకపలుకుకంటెను నీవాక్యము మధురమైనదని భావము.

వ. అని వెండియు రసావేశంబున. 49

తే. చూడవేటికి నిడువాలు సోగమీల
సూడుపట్టంగఁ జాలెడి చూపుఁగొనలఁ
బలుకు పలుకున నమృతంబు చిలుకుచుండఁ
బలుకవేటికిఁ జిలుకల కొలికి కాన. 50

టీ. నిడువాలుసోగమీలన్ = మిక్కిలి నిడివిగలకోలచేఁపలను, సూడు పట్టంగన్ =విరోధించుటకు, చిలుకలకొలికికాన-కాన యిటవాత్సల్యద్యోతక మయిన సంబోధకము.

శా. కోపంబింతయునుజ్జగించి సుమనః కోదండనారాచధా
రాపాణింధమమైన నీధవళ నేత్రజ్యోత్స్న పైఁజల్ల వే
తాపం బారఁగఁ గౌఁగిలించుకొనవే తథ్యంబు నీబాటనే
యోపుంస్కోకిలవాణి! యోశశిముఖి! యోపక్వబింబాధరా.

టీ. ఓపుంస్కోకిలవాణి=మగకోయిలయొక్క కంఠస్వరమువంటి కంఠస్వ రముగలదానా ! ఓశశిముఖీ = ఓచంద్రవదనా ! ఓపక్వబింబాధరా ! పండిన దొండపండువంటి యధరముకలదానా ! కోపంబు, ఇంతయున్ = కొంచెము, ఉజ్జగించి=విడిచి, సుమనః...ధమను - సుమనఃకోదండ=మన్మథునియొక్క, నారాచధారా=బాణములయంచులకు,పాణింధమము=కొలిమితిత్తివంటిది,ప్రేర కమైనదనుట. ఐననీధవళ నేత్రజ్యోత్స్న=అయినట్టి తెల్లని నీ నేత్రముల వెన్నెల, పైన్=నాపైని, [illegible] నశించునట్లు,

కాఁగిలించుకొనవే, తథ్యంబు, నేను, నీబంటను, అనఁగా నన్ను నీకడకంటి చూపులతోఁజూచి కాఁగిలింపుమని భావము.

మ. విసమాచున్నది కాలయాపనము నుత్ప్రీళ్లా లశేషభావముల్
రసభంగంబగు మానరోష మతి దీర్ఘంబయ్యె నే నింతటన్
బ్రసభాలింగనపూర్వకంబుగ మనోరాగంబు రెట్టింపఁగా
ణిసిధాత్వర్థ మనుగ్రహింపఁగదవే నీ రేజపత్రేక్షణా !. 52

టీ. మానదోషము=పొలయలుక, ప్రసభాలింగనపూర్వకంబుగన్=తటాలున పైపడి కాఁగిలించుటముందు గలుగునట్లుగా, ణిసిధాత్వర్థము. (ణిసిచుంబనేయను ధాత్వర్థమునఁబట్టి) చుంబనమును.

వ. అని పలికి బలిమిన యాలింగనంబు సేసి తల్పంబునకుఁ దార్చి.

తే. పతి కళావతియనుదానిఁ బద్మనయన
దమసహోదరి గారాపుదాదికూఁతు
నంతికమునకు రప్పించి యాదరించి
నర్మసాక్షిణిఁ గావించి నగుచుఁ బలికె. 54

వ. కలావతీ ! నీవు నిగారంపు మాటలాడుంప్రోడవని విందుము. నీవెఱుంగని పాడిపంతంబులు లేవు. తగవుదప్పక చెప్పెదేని గొన్నిమాటలడిగెదము. మాటలాడక విచారించి యుత్తరం బిమ్ము. 55

తే. అన్యపురుషునిఁ గలలోన నైనఁ దలఁప
దాత్మలో నంద్రడు మీ విదర్భాత్మజాత
యన్యపురుషుండు గాఁడె పుష్పాయుధుండు
వనిత దనయాత్మలోన నెట్లునిచెఁ జెపుమ. 56

టీ. మీవిదర్భాత్మజాత=మీదమయంతి, కలలోనైనన్, అన్యపురుషునిన్= పరపురుషుని, ఆత్మలోన్=మనసునందు, తలఁపదు=స్మరింపదు. అంద్రడు=అని

పలుకుచుందురు. పుష్పాయుధుండు= మన్మథుఁడు, అన్యపురుషుండుకాఁడె= పరపురుషుఁడుకాఁడా, వనిత=దమయంతి, తనయాత్మలోనన్ =తనమనస్సులో, అతనిన్ =ఆపుష్పాయుధుని, ఎట్లు, ఉనిచెన్ =ఏరీతిగానుంచుకొనెను.

తా. ఓకళావతీ ! మీ నెచ్చెలియగు దమయంతి స్వప్నమందైనను బర పురుషునిమనములో స్మరింపఁదని పలికితివిక దా ! పరపురుషుఁడయిన మన్మథుని మనస్సున నెట్లుంచుకొనెను ?

వ. అని యడిగిన నది యిట్లనియె. 57

తే. వనితహృదయంబులో నున్న వాఁడ వీవు
నీప్రతిచ్ఛాయ మదనుండు నృపవరేణ్య
యట్లు గాకున్న నశరీరి యైన యతఁడు
పుణ్యశుభమూర్తి దేవరఁ బోలు టెట్లు. 58

టీ. నృపవరేణ్య=ఓ నలరాజా! వనిత హృదయంబులోన్ =దమయంతి మన స్సులో, ఈవు, ఉన్నవాఁడవు. మదనుండు, నీప్రతిచ్ఛాయ = నీ ప్రతిబిం బము, అట్లుకాకున్నన్ =అట్లేకానిచో, అశరీరి=శరీరము లేనివాడు, ఐనయతఁ డు=అయినట్టి వాఁడు, పుణ్యశుభమూర్తి=పవిత్రమగు మంగళ విగ్రహముగల, దేవరన్ =ప్రభువారిని, ఎట్లుపోలుట=ఏరీతిగాఁబోలును. నలుఁ డడిగిన ప్రశ్న మునకుఁ గళావతి యిట్లు ప్రత్యుత్తరమిచ్చె. ఓ నలరాజా! దమయంతి హృద యములో నీవేయున్నాఁడవు. నీ ప్రతిబింబమే యా మన్మథుఁడు. అంతియ కాని మన్మథుండు వేఱొకఁడులేఁడు. అట్లు నీ ప్రతిబింబమే మన్మథుండు కానిచో శరీర రహితుఁడయిన మన్మథుఁడు దివ్యమంగళ విగ్రహముగల మిమ్ము నెట్లు పోలఁగలుగును? అశరీరియగు మదనుఁడు నీకు సాటియగుట నీ ప్రతి బింబ మగుటచేతనే; బింబ ప్రతిబింబములకు నభేదము కావునను, నీవే యామె హృదయములో నుండుటవలనను దమయంతి పాతివ్రత్యమునకు భంగములేదని భావము.

వ. అనిన నృపాలుఁ డిట్లనియె. 59

తే. తోఁకచుక్కలఁ బోలు దృక్తోయజముల
వెలితి లేకుండ మీబోఁటి చెలులఁ జూచుఁ
గాంత వీక్షింప దరకంటఁగాని మమ్ము
నేము చేసిన యపరాధ మేమి చెపుమ. 60

టీ. కాంత=దమయంతి, తోఁకచుక్కలన్, పోలుదృక్తోయజములన్ =సరి పోలుచున్న నేత్రములచేతను, వెలితిలేక, ఉండన్ = సుంతేనియు లోపము కలుగకుండఁగా, మీబోఁటిచెలులన్ =మీవంటిచెలికత్తెలను, చూచున్, అర కంటన్, కాని=అర్ధనిమీలిత దృష్టితోనేకాని, మమ్మున్, వీక్షింపదు=చూడదు, ఏము, చేసినయపరాధము=చేసినట్టి నేరము, ఏమి=ఏదియో చెపుము... ఓ కళావతీ! మిమ్మును బూర్ణదృష్టితోఁ జూచును. నన్ను నరకంటితో మాత్రమే చూచును. నేఁజేసిన నేరమేమియో చెప్పుమా! అని భావము.

క. భూపాల! మెఱుఁగుఁబోఁడుల
చూపులకున్ డాయు నీదు సొబగట్లగుటన్
మాపిన్నది యినువింతల
చూపుల నరగంట వెఱచుచున్ నినుఁజూచున్. 61

టీ. భూపాల=ఓ నలరాజా! మెఱుఁగుఁబోఁడుల చూపులకున్ =స్త్రీలదృష్టులకు, నీదుసొబగు=నీసౌందర్యము, డాయున్ = అంటుకొనును, అనఁగా నీవధిక సౌందర్యవంతుఁడవగుట నీయందుఁ జొచ్చిన నేత్రములు మగిడి రావు. అట్లగుటన్=నీయందుఁ బ్రవేశించినవి మగిడి రాకపోవుటచే, మాపిన్నది=మా దమయంతియు, వెఱచుచున్=నీయందుఁబ్రవేశించినవి, మగిడివచ్చునో రావో యని భయమునొందుచు, ఇనువింతలచూపులన్=రెట్టించిన వింతతోడి చూపులచే, అరకంటన్, నినున్, చూచున్, ఓ నలరాజా! నీయందుఁ జొచ్చిన చూపులు మగిడివచ్చునో రావో యని భయముచే నట్లు చూచుచున్నది కాని వేఱొండుకాదు. మఱియుఁ గడకంటి చూపు లనురాగ సూచకములు కాన నీయందలి అనురాగమును సూచించుచున్నవని భావము.

క. కలకంఠి తనకు వలసినఁ
 గలికీ! యని నిన్నుఁ బిలువఁ గలమధురముగా
 నల యను రెండక్షరములు
 పలుకఁగ నాలుకకు నెంత భారంబో కదా. 62

టీ. సులభము.

తే. మగువ దేవర దివ్యనామమును జపించు
 నెమ్మనమ్మున నిత్యవ్రతమ్ము గాఁగ
 నచ్ఛముక్తా ఫలైకావళిచ్ఛలమునఁ
 జన్నుఁగవ నక్షసూత్రంబు సంతరించి. 63

టీ. మగువ=దమయంతి, అచ్ఛ... ఛలమునన్ =స్వచ్ఛమైన ముత్యాలహార మనెడి మిషచేత, చన్నుఁగవన్ =కుచద్వయమునందు, అక్షసూత్రంబు=జపమాలను, సంతరించి = ధరించి, నెమ్మనమ్మునన్ = నిండుమనమునందు, నిత్యవ్రతమ్ము గాఁగన్ = ఎల్లప్పుడును నియమముగా, దేవర దివ్యనామమున్ =తమయొక్క శ్రేష్ఠమయిన నామమును, జపించున్ = జపము చేయుచున్నది. ఓ నలరాజా! నీవు మిమ్మును బిలిచినట్లు నన్నుఁబిలువదేమి? యని యడిగితివి. భర్తృనామము నుచ్చరింపఁ గూడక పోవుటచే మానెను. అంతియకాని నీయందనురాగము లేక పోలేదు. ఈ దమయంతి మనమున నిన్నే యుంచుకొని ముక్తాదామమనెడి జపమాలను ధరించి నియమముతో సర్వదా నిన్నే జపించుచుండును. నీకంటె వేఱొకనిఁ దలఁపలేదని భావము.

వ. అనిన నలుం డిట్లనియె. 64

చ. మదగజరాజ కుంభములకు మచ్చరికించు చురోజకుంభముల్
 గదిసి కలంత మేరయును గైకొనియున్నవి యెల్లవారికి
 న్విదితముగాఁగ నిట్టి తఱి నీచెలి డెందమునందు నేనియున్
 గదలక మాకు నుండ నవకాశము లేదుగదే కళావతీ. 65

టీ. కళావతీ! మదగజరాజ కుంభములన్ = మదించిన యేన్గుఁగు కుంభము

లను, మచ్చరికించుచుఁ=ద్వేషించుచు, ఉరోజకుంభములే = స్తనకుంభములు, కదిసి = విజృంభించి, ఎల్లవారికిఁ, విదితముకాఁగఁ = స్పష్టమగునట్లుగా; కలంత మేరయును = ఉన్న స్థలమునంతయును, కైకొనియున్నవి = ఆక్రమించి యున్నవి. అనఁగా దమయంతి స్తనములు వక్షఃస్థలమునంతను నాక్రమించి యున్నవని భావము. ఇట్టి తఱిఁ = ఇటువంటి సమయమందు, నీచెలిడెందము నందు నేనియుఁ=నీచెలియైన దమయంతి మనస్సులోనైనను, స్తనపరముగా డెందమనుటకు వక్షమని యర్థము. కదలక=చలింపకుండగా, నుండఁ, అవకాశంబు, మాకును, లేదు; కదే=లేదుగదా! ఓ కళావతీ! మీ చెలి హృదయములో "నీవున్నాఁడవని" చెప్పితివి. మీచెలి స్తనము లాస్థలమునంతను నాక్రమించి యుండఁగా నేనందుండ నవకాశమేది? కావున నీవసత్యము పలుకుచున్నావని భావము.

తా. ఓ కళావతీ! నేను మీచెలి హృదయములో నుంటినని పలికితివి. అందఱకును స్పష్టమగునట్లుగా నేనుఁగు కుంభముల నీసడించు స్తనములు మీ చెలిడెందము నంతయు నాక్రమించుకొని యుండఁగా మాకందుండ నవకాశ మేది?

తే. రమణి హృదయంబునను మహారాజ వీవు
　　గరిమ విచ్చేసియుండిన కారణమున
　　దీని వక్షోరుహంబు లాలోన నుండ
　　నెడము లేకున్న మఱి కదా వెడలె వెలికి.　　66

టీ. రమణి హృదయంబునను=దమయంతి హృదయములో, మహారాజవు, ఈవు, గరిమఁ = అతిశయముచే, విచ్చేసియుండిన కారణమునఁ = ఉన్న హేతువుచేత, దీని వక్షోరుహములు, ఆలోనఁ, ఎడము, లేకున్నఁ, మఱి కదా=అవకాశము లేకపోవుటచేత నే కదా! వెలికిఁ=బయటికి, వెడలెఁ= నిర్గమించెను. ఓ నలరాజా! నీవు "దమయంతి కుచములామె హృదయము నాక్రమించియుండుటచే నేనందుండ నవకాశములే"దని చెప్పితివి. అది పొరపాటు. నీ వామె హృదయమును మహారాజ వై ... నుండుటచే వారుండ

వెలిచి యీామె స్తనములు బైటికి వెడలివచ్చెను. లేనిచో నవి లోపలనే యేల యిమిడియుండరాదు ? అని భావము.

వ. అని కళావతి రాజు నుద్దేశించి. 67

ఉ. వంచన యింత లేక కర ౯ వాఁడి నఖంబుల నొక్కినొక్కి నొ
ప్పించితి రెండుచేతులను ౯ బెద్దయు లావున నొత్తియొత్తి పీ
డించితి విట్టి ఱాకటికి ౯ డెందము వానికి నీకుఁగాదె మా
చంచల నేత్రయొప్పులకుచంబులు పయ్యెదలోన డాఁగెడిన్.

టీ. వంచన, కపటము, ఇంత లేక కరవాఁడినఖంబులన్ = వాఁడియగు గోళ్లచే, నొక్కి నొక్కి, నొప్పించితివి. రెండుచేతులను, బెద్దయులావునన్ = సత్తువుకొలఁది, ఒత్తి, ఒత్తి, పీడించితివి. ఇట్టి, ఱాకటికి డెందము వానికిన్ = ఱాయివలె కఠినమగుచిత్తముగల, నీకుఁగాదె = నీకు భయపడియేకదా, మా చంచల నేత్ర యొప్పుల కుచంబులు, పయ్యెదలోనన్, డాఁగుచున్నవి.

తా. సులభము.

ఉ. క్రుచ్చిలి గంధవారణసమూహము కుంభవిలాససంపదల్
క్రుచ్చిలిమించుపయ్యెదల౯లోపలడాఁగుచునుండు నెప్డు మీ
నెచ్చెలికత్తె చన్నుఁగవ ౯ నీవు విచారము చేయుమా మదిన్
క్రుచ్చుల గిట్టిపట్టుదురు౯నొంపుదు రేమన వచ్చు రాజులన్.

టీ. మీచెలికత్తె చన్నుఁగవ, గంధ...సంపదల్ = గంధజాతి యేనుఁగుల యొక్క కుంభములయొక్క కాంతి సంపదలను, క్రుచ్చిలి=హరించి, క్రుచ్చిలి=వంచించి, పయ్యెదలలోపలన్, డాఁగుచునుండును, దొంగ యేదేని వస్తువును దొంగలించి రహస్యముగా దాఁగియుండుటకలదు. అట్లే నీ చెలి కుచములు చేసియున్నవనిభావము. నీవు, మదిన్, విచారము, చేయుమా! క్రుచ్చులన్ = దొంగలను, గిట్టి, పట్టుదురు=అనుకూలించునట్లు చేసి, పట్టుకొందురు, నొంపుదురు=మర్దింతురు, రాజులన్, ఏమనవచ్చున్=ఏమనఁగలము. రాజులు

దొంగలను బీడించుట కలదు. నేనురాజను, అవి దొంగలు. వాని బాధించుట మాకు విధిగదా! అని భావము.

వ. అని పలికి రాజు, కళావతీ! మామాటలకుఁ బ్రత్యుత్తరం బులు పొసంగనిచ్చితివి. మేలనవచ్చు. ఈప్రసంగం బిట్లుండె. నీచెలికత్తియ నేఁడు మాతోడ నేలపలుకదు? నీవు చెవిఁజేరి మంతనంబుండి తదభిప్రాయం బెఱింగి మాకుం జెప్పవమ్మా! మెచ్చుగలదు. అనినఁ బ్రసాదంబని మదనరాజకార్య పాడ్గుణ్య చక్రవర్తియగు నయ్యింతి దమయంతిం, జేరవచ్చి షడక్షీణమంత్ర రహస్యంబున. 70

మ. వరివస్యా నియమం బఖండితముగా వాత్స్యాయ నీయాదిక స్మరశాస్త్రంబులు వింటినాముఖమునన్ జాణండు నీభర్త నే ర్పరివై చిత్తముకీ లెఱింగి సురత ప్రాగల్భ్యముల్ చూపితే సరసీజానన! యన్నసుగ్మలివయస్య ర్వేసెఁ గెందామరన్.

టీ. సరసీజానన=పద్మములవంటి ముఖముగల యో దమయంతీ! వరివస్యా నియమంబు=శుశ్రూషా నియమము, అఖండితముగాన్ = అవిచ్ఛిన్నముగా, నాముఖమునన్ = నావలన, వాత్స్యాయనీయాదిక స్మరశాస్త్రము మొదలగునవి, వింటివి = అభ్యసించితివి. నీభర్త, జాణండు = కామశాస్త్రాదులందు మిక్కిలి నేర్పుగలవాఁడు, నేర్పరివై=నేర్పుగలదానవై, చిత్తముకీలు = మనో రహస్యము, ఎఱింగి, సురతప్రాగల్భ్యముల్ = రతిచాతుర్యములు, చూపితే= చూపించితివా! అన్నన్ =అనిపలుకఁగా, సుగ్మలి=దమయంతి, వయస్యన్ = చెలికత్తెను, కెందామరన్=ఎఱ్ఱఁదామరతో, వ్రేసెన్ =కొట్టెను.

తా. సులభము.

వ. వ్రేసి యసూయా కుటిలం బగుకటాక్షవీక్షణంబునం దర్జించె. ఇట్లు నిర్భర్త్సింపఁబడి వైదర్భింజూచి రిత్తయులుక దెచ్చికొని యుపదేశగురువ నగునాకు రతిరహస్యవార్త సెప్ప వైతివి.

ధూర్తవై నీవు చెప్పకుండుదువుగాకేమి? నానేర్పున నీమగనిచేతన చెప్పించెద. అటు చూడుమని మఱియునుం గొంతతడవు మంతనంబున్నయదియై శుద్ధాంత చారిణి మహీకాంతునితో నిట్లనియె.

టీ. అసూయాకుటిలంబు = ఈసుచేవంకరయైనది, తర్జించెన్ = అదల్చెను, నిర్భర్త్సింపఁబడి = అదల్పఁబడి, శుద్ధాంతచారిణి = అంతఃపురపు పనికత్తె.

తే. అధిప ! వైదర్భి దర్భాంకురాగ్రబుద్ధి
మనతలంపులఁ బోలదే ? మగువ తలఁపు
బాల యనుచున్నవార మిప్పుడ్మనయన
యిట్టి ప్రౌఢియుఁ గలదె ? యే యింతులకును. 73

టీ. దర్భాంకురాగ్రబుద్ధి = దర్భమొనవలె వాఁడియైన బుద్ధిగలది.

వ. ప్రణయ కోపంబులు రతి దీపనౌషధంబులు. పొలయలుకలు లేక మగవారికి మగువలు ప్రాఁతులుగారు. దీర్ఘంబులయ్యేనేని యవియే ప్రేమభంగ కారణములు. కావునఁ గోపంబింతమాత్రంబ చాలు. అని పలికి దేవర మాఱుగాఁ బాదప్రణామంబు సేయంబోయి లీలాకమలంబున మొత్తునడితి. పడుదుఁగాకేమి? అమ్మత్తకాశిని చిత్తంబెఱింగి వచ్చితి నవధరింపుము. 74

టీ. రతిదీపన - ఔషధంబులు = రాగమును పెరరేఁపునట్టి మందులు. ప్రాఁతులు = ఇంపయినవారు.

ఉ. తా మది నమ్మకున్నది విదర్భనరేంద్రతనూజ నిన్ను సుత్రాముఁడనంచు నీయరమరంబునఁ బో మనసీదునీకు సుత్రాముఁడు కాని వానికిఁ బ్రతాపము నం జదలేటి పైఁడికెందామరపువ్వు దేవశమె ! యిధాత్రికి మాటలువేయు నేటికిన్.

టీ. విదర్భనరేంద్రతనూజ = దమయంతి, తాన్, నీవు, సుత్రాముఁడవం చున్ = దేవేంద్రుండవని, అనఁగా నీవు నలరూపంబునవచ్చిన సురేంద్రుఁడవను చు, నిన్నున్, మదిన్ = మనస్సునందు, నమ్మకున్నది=విశ్వసింపకున్నది. నీకున్, ఈ యరమరంబునన్, పో= ఈ సందేహముచేత నే, మనసు, ఈదు = మనసిచ్చి మాటాడకున్నదని భావము. వేయుమాటలు, ఏటికిన్ = ఎందులకు, ధాత్రికిన్ = భూమికి, ప్రతాపమునన్ = బలము చేత, చదలేటిపైఁడికెందామరపూవు=ఆకాశ నదియందున్న బంగరుకమలము, సుత్రాముఁడు కానివానికి= దేవేంద్రుఁడు కాని వానికి, లేన్, వశమే? కాదనుట, కలావతి దమయంతి ప్రణయకోపము నెఱిఁగి దాని కోపమును బోఁగొట్టవలెనని తలంచి నలరాజుచే రాత్రి వర్తిల్లిన సంభోగచిహ్నములను జెప్పించినచో దానివలనఁ బొడమిన సిగ్గుచేతను గాని యది వినుటవలనఁ గల్గిన కామోద్రేకముచేఁగాని కోపము పోవునని నిశ్చయించి నలునిసమీపించి కోపకారణము నిట్లు చెప్పుచున్నది. ఓ నలరాజా! దమయంతి నిన్నుఁ దత్వనలునిఁగా నమ్మకున్నది. స్వయంవర కాలమందువలె నిప్పుడు నల రూపముతో వచ్చిన దేవేంద్రుఁడవే కాని తత్త్వనలుండవు కావని భావించి నీతో మాటాడకున్నది. నీవు దేవేంద్రుఁడ వే కానిచో గంగానదియందుండిన పద్మ మును దెచ్చుటయెట్లు? సామాన్యులకది యలవడదే. కావున నీవు సురేంద్రుఁ డవే యని భావము. ఈ యభిప్రాయము వాస్తవముగా దమయంతికిఁగాని దాసికిఁగానిలేదు. అయినను గలావతి మాయోపాయముచే రతిరహస్యములను జెప్పింపఁదలంచి యిట్లు చేసినది. నలుఁడు కన్నులు మూయుటచేత నే దమ యంతి కోపము వహించియుండఁగా నింద్రుఁడనెడి సందియము వలన కోపము వహించి యున్నదని కారణమునుమార్చి చెప్పినది. ఇట్లు చేసినచో నలుఁడు తన యాథార్థ్యము స్థాపించుటకు రహస్య వృత్తాంతములఁ జెప్పకమానఁడనియు, దానివలనఁ గోపము పోవుననియు దాసి యెఱుంగును. ముందు పద్యములచే తను గూడ నలుఁడు దేవేంద్రుఁడే యని స్థాపించుచున్నది.

క. దంభోళి భాగ్యరేఖా

దంభంబునఁ బ్రస్ఫుటముగ ధరియించెదు హ

స్తాంభోజమ్మున దేవర
జంభారివి యగుటకేల ? సందేహింపన్. 76

టీ. దేవర=ఓ నలరాజా!. నీవు, హస్తాంభోజంబునన్ = కరకమలమందు, భాగ్యరేఖాదంభంబునన్=భాగ్యరేఖ యనెడినిపచేత, దంభోళిన్ = వజ్రమును, ప్రస్ఫుటముగన్=స్పష్టముగా, ధరియించెదు = తాల్చుచున్నావు. జంభారివి=సురేంద్రుఁడవు,అగుటకున్, సందేహింప నేల?=సందేహించుట యెందుకు.

తా. ఓ రాజా ! నీవు భాగ్యరేఖా మిష చేతను వజ్రాయుధమును ధరించి యుండగా దేవేంద్రుఁడవనుటకేమి సందియము కలదు?.

తే. లోకపాలుఁడ వస్వల్పలోచనుఁడవు
వజ్రపాణివి దేవతా వల్లభుండ
విన్నిలాంఛనములుఁగూడ నింద్రుఁ డౌదు
నైషధుండ వగుటకుఁ జిహ్నంబు చెపుము. 77

టీ. లోకపాలుఁడవు = లోకమును పాలించువాఁడవును, అస్వల్పలోచనుఁడవు=అనేకములగు నేత్రములుగలవాఁడవు, వజ్రపాణివి=వజ్రము హస్తమందు గలవాఁడవు, దేవతావల్లభుఁడవు, ఇన్ని, లాంఛనములు = ఇన్ని గుఱుతులు, కూడన్ = సమకూఱుటచే, ఇంద్రుఁడు = ఇంద్రుఁడవు, ఔదు=అగుదువు, నలుఁడు లోకమును పాలించువాఁడును, విశాలమగు నేత్రములు గలవాఁడును, వజ్రరేఖ పాణియందుఁ గలవాఁడును, దేవతాకాంతలకుఁగూడఁ బ్రేమింపఁదగిన వాఁడును, కాన నలునికిఁగూడ నీ విశేషణము నన్వయింపవలెను. నైషధుఁడు=నలరాజవు, అగుటకు, చిహ్నంబు = గుఱుతును, చెపుము. ఇన్ని యింద్ర లక్షణములు నీయం దుండుటచే నీవు దేవేంద్రుఁడవే యగుదువు. కానిచో నలుని లక్షణంబు లేమియున్నవో చెప్పుము.

వ. మహేంద్రుం డింద్రజాల మాయావిదుండు. స్వయంవరంబు నం దెట్లట్ల నలరూపధారియై వచ్చెనో యని శంకించుచున్న

యది. మందాకినీ కాంచన కమల దానం బీసందేహమునకు నిదానంబు. 78

ఉ. రోయఁ డొకించుకేనియు మరుత్పతి యన్యకళత్ర దూషణా
న్యాయము సేయమన్మథమదాంధత నాశ్రమభూమిఁ గొక్కురో
కోయని కూయఁడే యతఁడు కుక్కుటమైనడిరేయి గౌతమ
ప్రేయసిఁ బొందఁగోరి తనపెద్దతనంబు జలంబు పాలుగాఁ.

టీ. మరుత్పతి = ఇంద్రుఁడు, అన్యకళత్రదూషణాన్యాయము=పరస్త్రీలను చెఱుపుట వలనఁ గల్గిన పాపమనెడి యన్యాయమును, చేయన్ = చేయుటకు, ఒకించుకేనియున్ = కొంచెమైనప్పటికిని, రోయఁడు=ఏవగించుకొనఁడు, అతఁడు=ఆయింద్రుఁడు, గౌతమప్రేయసిన్ =అహల్యను, పొందన్, కోరి, తనపెద్ద తనంబు=తన గొప్పతనము, జలంబుపాలుగాన్ = నీటిపాలగునట్లుగా, మన్మథ మదాంధతన్ = కామాతిశయమువలనఁ గల్గిన గ్రుడ్డితనముచేత, ఆశ్రమభూమిన్=గౌతమముని యాశ్రమమునందు, కుక్కుటమై = కోడియై, నడిరేయి= మధ్యరాత్రమునందు, కొక్కురోకోయని, కూయఁడే! అటులేదా! దేవేంద్రునివంటి మహానుభావుఁడు పరకళత్ర సంగమము నపేక్షించునా యని సందేహింపఁబనిలేదు. అతఁ డర్ధరాత్రమందుఁ గోడియై కూసి మునిని మోస పుచ్చి యతని భార్యను బొందలేదా! కావున నింద్రున కిట్టి పనులు చేయుట సహజమని భావము.

తా. ఇంద్రుఁడు పరకళత్ర సంగమముచేయ వెనుకదీయఁడు. అతఁడు కామాంధుఁడై గౌతమునియింటిపంచను గోడియై కూసి యతని మోసపుచ్చి యహల్యను గలియలేదా?

వ. నీవు తత్త్వవైషధుండ వయితివేని, యనన్యసాక్షికంబులగు శయ్యారహస్యంబు లుగ్గడించి యిప్పంకజాక్షి శంకాకలంకం బపనయింపు మనుటయు; మందస్మితసుందరవదనారవిం

దుండై యయ్యిందుముఖి నుద్దేశించి పురందరుఁ డనుసందే
హంబు డిందు పడునట్లుగా మహీపురందరుం డిట్లనియె.

టీ. నీవు—అనన్యసాక్షికంబులు=పరులకుఁ దెలియరానివి, అగుశయ్యారహస్యంబులు = అయినట్టి సంభోగమర్మములను, ఉగ్గడించి=చెప్పి, శంకాకలంకంబు = కళంకమువంటి శంకను, అపనయింపుము, అనుటయుఁ, అనఁగానే, మంద...విందుండై=చిఱునవ్వుచే సుందరమగు ముఖపద్మముకలవాఁడై, డిందుపడునట్లుగాన్=తొలఁగునట్లుగా, మహీపురందరుండు=భూదేవేంద్రుఁడగు నలుఁడు, ఇట్లనియె.

తే. మఱచితే నెమ్మనమ్ములో నీ మెఱుఁగుఁబోఁడి
ప్రథమ రతికేళి నతిపరిశ్రాంతిఁ బొంది
కూడి రెండవ రతికి నూకొల్కనని నన్ను
గ్రీష్మయామిని యనియేను నీ వేలిగొంటి. 81

టీ. నూల్కొనని=ఒప్పుకొనని, గ్రీష్మయామిని = వేసవిరాత్రి - వేసవిరాత్రి కాలము తక్కువ యగుటచేత రెండవరతికి వీలుగాదు గాన నా పేరఁబిలుచుట.

తే. నీవు మృదుశయ్యఁ గపటంపు నిద్రవోవ
నెలఁత కేల్దమ్మి యిడితి నీకసున్న నాభి
నప్పు డచ్చోటఁ బులకంబు లంకురింప
నంబురుహనాభి వైన చందంబు తలఁపు. 82

టీ. నెలఁత, నీవు, మృదుశయ్యన్, కపటంపునిద్రవోవన్ = కపటముగ నిద్రించుచుండఁగా, నీవీస్రంసనార్థమై, నీ నిమ్నానాభిన్=లోఁతైన నీపొక్కిలియందు, కేల్దమ్మిన్ = నా హస్తపద్మమునుంచితిని. నా హస్తస్పర్శమువలన నచ్చట, పులకంబులు, అంకురింపన్=రోమాంచము కలుగఁగా, అంబురుహనాభివి=పద్మము నాభియందు గలదానవు=విష్ణుమూర్తివి. అయితివి. ఐనచందంబు, తలఁపు=స్మరింపుము, నలుని కేల్దమ్మి పద్మమును, దాని సంస్పర్శమువలనఁ గల్గిన రోమాంచములు అంకురములును గాఁగా దమయంతి యంబురుహనాభి యగుట

సముచితమని భావము. విష్ణుఁడంబురుహనాభుఁడు - నీవంబురుహనాభివి-అనఁగా స్త్రీత్వముచే భేదపడిన అంబురుహనాభుఁడ వనుట. ఇరువురకును గపట నిద్ర సమానము.

ఉ. కామినిఘర్మబిందువులు కస్తురిబొట్టునఁ దోఁగి రేఖలై
కోమలగండపాళికల కోణములన్ దిగజాఱ నంచల
శ్యామల మైనయాత్మవదనాబ్జముఁ జూతుగదే మదీయ చిం
తామణిదర్పణాంతరము నన్నెఱిఁదత్సమయోచితంబుగాన్.

టీ. కామిని, ఘర్మబిందువులు=సురతశ్రమవలనఁ గల్గిన చెమట బిందువులు, కస్తురిబొట్టునన్ తోఁగి=మిళితమై, రేఖలై=చాఱలై, కోమలగండపాళికలకోణములన్=మృదువయిన చెక్కిళ్ల ప్రదేశములయంచు లందుండి, దిగజాఱి, అంచలశ్యామలము=కొనయందు నల్లనిది, ఐనయాత్మవదనాబ్జమునన్=అయిన నీవదనపద్మమును, మదీయచింతామణి దర్పణాంతరమున్=నా చింతామణిదామ మనెడి యద్దముయొక్కమధ్యమందు, నెఱిన్ = యుక్తముగాను, తత్స...తంబుగాన్=ఆపురుషాయిత సమయమున కనుగుణముగా, చూతుగదే, పురుషాయితము సల్పుచున్న దమయంతి వదనము కస్తురిబొట్టుతో మిళితమగుటచే నల్లనివగు చెమటబిందువులు చెక్కిళ్లనుండి జాఱి శ్మశ్రువులవలెఁ దనరుటచే నది పురుషుని వదనమువలెఁ గానవచ్చుచుండెనని భావము.

తే. తరుణి యెఱుఁగవె వీటికాదానవేళ
గురుజనప్రాంతమునయందు గూఢవృత్తి
నాగవల్లీదళంబు నెన్నడుమఁ జీఱి
మడిచి యందిచ్చినపుడు గోరిడుదుఁ గేల. 84

టీ. తరుణి=దమయంతి ! గురుజనప్రాంతంబులందు = పెద్దవారుమనయొద్దనున్న సమయంబునందు, వీటికాదానవేళన్=తములపాకులు చుట్టియిచ్చుసమయమున, నాగవల్లీదళంబు నెన్నడుమన్, చీఱి=చీలిచి, మడిచి, అందిచ్చినపుడు =నాకొసంగెడి సమయమున, గూఢవృత్తిన్ = ఒరులకు తెలియకుండఁగా,

కేలన్=నీచేతియందు, గోరిడుదున్ = నఖక్షతముచేయుదును, ఎఱుఁగవె = తెలియదా.

ఉ. మానిని ! భోజనావసర మధ్యమునం గొనియాడ గోస్తనిం
దేనియ సంస్తుతింప వినుతింపను మీఁగడ ఖండశర్కరా
పానక ముగ్గడింపఁ బ్రతిపక్షచటూక్తి నిసర్గరోష ర
క్తానన మైననీయధరమల్లునొయంచు మదిం దలంకుచున్.

టీ. మానిని=ఓదమయంతీ, భోజనావసరమధ్యమునన్ = భోజనకాలమునందు, ప్రతిపక్ష...ననము—ప్రతిపక్ష = తనకు శత్రువులయిన ద్రాక్షాదులయొక్క,చటూక్తి=నుతించుటచే, నిసర్గ=స్వాభావికమైన, రోష=కోపముచే,రక్తాననము=ఎఱ్ఱనిముఖముగలది. ఇట యధరముయొక్క సహజారుణ్యమును సహజకోపప్రయుక్తారుణ్యముగాఁ జెప్పినాఁడు. లోకములోఁ దమ శత్రువుల వర్ణించినచోఁ దమకుఁ గోపముగల్గుట సహజము. అట్లె మాధుర్యమునందు దనతో శత్రుత్వమువహించిన గోస్తన్యాదులను వినుతించుటచే దమయంతి యధరమా కోపముచే నెఱ్ఱఁబడిన దని భావము. ఐన నీయధరము, అల్లునొయంచున్=అల్గునేమోయని, గోస్తనిన్=ద్రాక్షను, కొనియాడన్=నుతింపలేదు, తేనియన్, సంస్తుతింపను, మీఁగడన్ = వినుతింపను, ఖండశర్కరాపానకమున్, ఉగ్గడింపను = పొగడను, మదిన్, తలంకుచున్=భయపడుచు, నివియెల్లఁ జేయనని సంబంధము.

తా. ఓదమయంతీ ! మాధుర్యమునందు నీయధరమున కీడువచ్చెడి గోస్తన్యాది పదార్థముల వర్ణించినచో నీయధరమునకుఁ గోపమువచ్చునని, గోస్తనిని తేనెను మీఁగడను పంచదారపానకమును భయముచే నుతించుట మానితిని.

తే. ఆననం బాదిగా నాభి యవధి గాఁగఁ
బ్రేమ భవదంగకములు చుంబించునపుడు
చరమచుంబనవేళ నో సరసిజాక్షి
యేను జెక్కిలి గిలిగింత లిడుటఁ దలఁతె. 86

టీ. సులభము.

మ. అని సంకల్పభవైకసాక్షులగు శయ్యానేకసంభోగచి
హ్నానలన్ భూపతిప్రత్యభిజ్ఞకొఱకై యందందు ప్రాకువ్వన
వ్వనితారత్నము వాలుగన్నులఁ బతిన్ వారించుచున్ మూసెనొ
య్యనధాత్రేయిశ్రుతిద్వయంబు నిజహస్తాంభోజయుగ్మంబునన్.

టీ. భూపతి=నలరాజు, ప్రత్యభిజ్ఞకొఱకై=ఆనవాలు నిమిత్తము, అని=ఈ ప్రకారముగా, సంకల్ప భవైకసాక్షులు=మన్మథుఁ డొక్కఁడే సాక్షిగాఁ గలవి, అగు...హ్నానలన్—అగు=అయినట్టి, శయ్యా=శయ్యాసంబంధులగు, అనేక= పెక్కులయిన, సంభోగచిహ్నానలన్=రతిచిహ్నాలను, అందందు=ఒక్కొక్కటి చొప్పున, వ్రాకువ్వన్=చెప్పుచుండఁగా, అవ్వనితారత్నము=ఆదమయంతి, వాలుఁ గన్నులన్=దీర్ఘములయిన నేత్రములతో, పతిన్=భర్తను, వారించుచున్= ఇఁకఁ జెప్పవద్దని నిషేధించుచు, ఒయ్యనన్=మెల్లగా, నిజహస్తాంభోజయుగ్మం బునన్ = తనహస్తపద్మములతో, ధాత్రేయిశ్రుతిద్వయంబు = దాది కూఁతు రగు కళావతి రెండు చెవులను, మూసెన్=కప్పిపుచ్చెను, ఆరహస్యములు దాని కిఁ దెలిసినచోఁ దన్ను పరిహాసము చేయుననియెంచి దానికా నలునిమాటలు వినఁ బడకుండ నుండుటకుఁగా దాని చెవులను మూసెను.

తా. నలుఁడిట్లు తన్ను నమ్ముటకై యొరులకుఁ దెలియరాని రహస్యములను జెప్పుచుండఁగా దమయంతి సిగ్గుచెందుచు నిఁకఁ జెప్పవద్దని భర్తకుఁ గనుసంజ్ఞ చేయుచు నామాటలు దానికి వినఁబడకుంటకై కళావతి చెవులను మూసెను.

వ. ఇట్లు లజ్జావశంబునఁ దనవీనులు మూసిన. 88

తే. అధిప! తాటంకచక్రధారాంచలములు
వాఁడు లతికోమలములు పూఁబోఁడిచేతు
లొయ్యనే తెంచి శ్రుతిరోధ ముడుప నీకు
నర్హ మామాసమైనను నమ్మెఁ గాని. 89

టీ. అధిప=నలరాజా, తాటంకచక్రధారాంచలములు=చక్రములవంటి నాచె

వుల పూవులకొట్టకొనలు, వాఁడులు=మిక్కిలి తీవ్రముగానుండును, పూఁబోఁడి చేతులు = దమయంతి చేతులు, అతికోమలములు ఆయాసము = ప్రయాసము, ఐనను అయ్యెఁ, కాని=అయినప్పటికిని, ఒయ్యక, ఏతెంచి=వచ్చి, శ్రుతిరోధము, ఉడుపక=మానిపించుట- నీకు, అర్హము=తగినది. మిక్కిలివాఁడియైన నాచెవులపువ్వుల కొనలుదగిలి మృదులములైన దమయంతిచేతులు క్షతములుగాఁ గలవు. కావున నీప్రియురాలిచేతులకట్టి యపాయము రాకుండఁజూచుకొనుట నీకు యుక్తకార్యము. కావున నాయాసమని యెంచకవచ్చి దమయంతి చేతులను బట్టుకొనుమని భావము. ఓనలరాజా ! యీదమయంతి ప్రణయకోపము తొలఁగినది. నీకింక వశయగును. వచ్చి యామెచేతులను బట్టుకొని కొనిపోయి నీయభీష్టము నెఱవేర్చుకొమ్మని గూఢాభిప్రాయము.

వ. అనినవిని "మాన్యురాలవు, నీమాట యతిక్రమింపవచ్చునే" యనుచు నమ్మచ్చెకంటిం గుచ్చికౌఁగిలించికొని శయ్యాతలంబునకుం దెచ్చి, ముచ్చటవ్రోవం జెక్కుటద్దంబులు ముద్దువెట్టుకొనియె. నయ్యవసరంబున సమీపకక్ష్యాంతరంబున నుండి వైతాళికపురంధ్రి యుచ్చైస్స్వరంబున. 90

టీ. వైతాళిక పురంధ్రి= మేలుకొలుపు పాడెడుస్త్రీ.

సీ. అవధారు దేవ మహాధ్యాహ్నసంధ్యావేళ
దినయావనంబు దోఁతెంచె నిప్పు
డతితీవ్రతాప తప్తాంగి యై మేదిని
భవ దాప్లవనవాఃపిపాసువయ్యె
మార్తాండమండలీ మధ్యభాగంబున
నీడెందమునఁబోలె నిలిచె శివుఁడు
నిష్ప్రతీపం బైన నీప్రతాపంబుతో
హెచ్చుకుందా డబీరెండవేఁడి

తే. నీలనీలంబు లయిన నీకనిడుదనెఱుల

యందుఁ బ్రవహించు విమల గంగాంబుధార
దలఁచుఁగాక కళిందజా సలిలవేణి
తరళతరవీచికా పూర్వపరిచయంబు. 91

టీ. దేవ=ఓనలరాజా, అవధారు=వినుము, దినయౌవనము= దినమునకుయౌవనమువంటిదగు, మధ్యాహ్నసంధ్యావేళ=మధ్యాహ్నకాలసంధ్య, తోఁతెంచెన్=వచ్చెను, ఇప్పుడు, మేదిని=భూమి, అతి ..తప్తాంగియై మిక్కిలిసంతాపముచే దప్తమైనదేహముగలదై, భవత్ ...పిపాసువు - భవత్ = నీయొక్క, ఆప్లవన=స్నానసంబంధియగు, వాః= జలమును, పిపాసువు = త్రావఁదలంపుగలది, ఉర్వ్యెన్, భూమిసూర్యతాపముచేమిక్కిలి తప్తమైయున్నది, అట్టిస్థితి, మధ్యాహ్నసమయముననే సంభవించును. కాన మాధ్యాహ్నికక్రియలు లొనర్పఁ దానమాడవలయునని భావము. మార్తాండమండలీ... భాగంబునన్ =సూర్యమండలముయొక్క మధ్యభాగమునందు, శివుఁడు=ఈశ్వరుఁడు, నీడెందమునన్, పోలెన్ =నీమనస్సునందువలెను, నిలిచెన్, ప్రాతర్మధ్యాహ్నసాయంసమయములందు సూర్యుఁడు, ప్రాతఃకాలమున బ్రహ్మాత్మకుఁడును, మధ్యాహ్నమున శివాత్మకుఁడును సాయంసమయమున నారాయణాత్మకుఁడునై యుండునని చెప్పుదురు. కావున నిప్పుడు శంకరుఁడు సూర్యునందు వెలయుచున్నాఁడు కాన నిది మాధ్యాహ్నికక్రియ లొనర్పఁదగిన సమయమనుట. 'నీడెందమునఁబోలె' అని చెప్పుటచే నలుఁడు శివభక్తుఁడని తెలియనగు. నిష్ప్రతీపంబు = నిస్సపత్నమయినది. ఐననీప్రతాపంబుతోన్ =అయినట్టినీతేజస్సుతో, బీరెండవేఁడి=మిడియెండవేఁడి, హెచ్చుకుండాడెన్ =ఇంచుమించుగాసరిపోలుచున్నది. నీలనీలంబులు=మిక్కిలి నల్లనివగు, నీ...యందున్ =నీపొడుగైనకేశములందు, ప్రవహించు...ధార=పాఱుచున్నస్వచ్ఛమయినగంగానదిజలధార, కళిందజా...పరిచయంబు-కళిందజా=యమునానదియొక్క, సలిలవేణి=జలప్రవాహమండలి, తరళతర=మిక్కిలి చంచలములయిన, వీచికా= తరంగములయొక్క, పూర్వపరిచయంబు = తొల్లింటిపరిచయమును, తలఁచుఁగాక=స్మరించుకొనుఁగాక, యమునానదీతరంగములతోఁ గలసిమెలసివర్తిల్లు గంగానదీజలమునను నిప్పుడు యమునాప్రవాహమువలె

కల్లనిదగు నీకేశపాశమునందుఁబడి పూర్వపు పరిచయమును స్మరించుకొనుఁ గాక యని యర్థము. గంగాజలములో నీవు స్నానమొనరింతువుగాక యని ఫలితార్థము. ఇందు. 2. పాదమున నతిశయోక్తియు, 3. 4. పాదములందు పమయు, గీతమందు స్మరణము నలంకారములు.

వ. అని వైతాళిక పురంధ్రి పలికిన. 92

తే. ధరణినాథుఁడు కేళిసౌధంబుడిగ్గి
జలకమింటికి నేతెంచె సమ్మదమున
నవసరము వేచి యున్న నానావనిపులు
దవ్వుదవ్వుల నిలిచి వందన మొనర్ప. 93

టీ. ధరణినాథుండు, కేళిసౌధంబు=క్రీడాసౌధమును, డిగి, అవసరము = సమయమును గూర్చి, వేచియున్న నానావనిపులు = ప్రతీక్షించియున్న బహుదేశరాజులు, దవ్వుదవ్వులన్ = మిక్కిలిదూరముగా, నిలిచి, వందనము, ఒనర్పన్ =నమస్కరించుచుండఁగా, సమ్మదంబునన్ = సంతోషముతో, జలకమింటికిన్ = మజ్జనశాలకు, ఏతెంచెన్ = వచ్చెను, తనదర్శనముకై వేచియున్న రాజులచే నమస్కారములు గొనుచుఁ గేళిసౌధముడిగి స్నాన గృహమున కేఁగెనని భావము.

తే. అంగుళిక్షేప లోచనాపాంగభంగి
విభ్రమభ్రూతరంగసంవేల్లనముల
నాదరంబు ప్రసాదించి యవ్విభుండు
సకలనృపతుల నిజనివాసముల కనిచె. 94

టీ. అవ్విభుండు, అంగుళి... వేల్లనములన్ - అంగుళిక్షేప=వ్రేటలుకదల్చుటచేతను, లోచనాపాంగభంగి=కడకంటియొక్క రచనచేతను, విభ్రమ=విలాసముతోఁగూడిన, భ్రూతరంగ=తరంగమువంటికనుబొమలయొక్క, సంవేల్లనములన్ = చలనములచేతను, ఆదరంబున్, ప్రసాదించి, వారివారిమర్యాదకుఁ దగునట్లుగా నాదరముచూపి, సకలనృపతులన్, నిజ... ములకున్, అనిచెన్ =పంపెను, నలరా

జాంగుళిక్షేపాదిక్రియలచేతనే యారాజులం దర్పహీనులుగా నాదరము నిలిపి వారి వారియిండ్లకుఁ బంపివేసెను.

వ. అనిచి మజ్జనశాలకరిగి. 95

తే. కలపములతోడి నవయక్షకర్దమమున
నలుఁగు వెట్టించికొని రాజనందనుండు
మహితమృగనాభిపంకంబు మౌళిఁదాల్చి
జలజలోచన లార్పంగ జలకమాడె. 96

టీ. రాజనందనుండు, కలపములతోడి=పరిమళద్రవ్యసమ్మేళనముచే సిద్ధపఱిచిన, నవ=క్రొత్తదయిన, యక్షకర్దమమునన్=కర్పూరము, అగరుచందనము, కస్తూరి, కుంకుమపువ్వు, లక్కోలము, వీనితోఁ జేయఁబడిన వస్తువుచే, నలుఁగు, పెట్టించికొని=నలిపించుకొని, మహిత...పంకంబు=శ్రేష్ఠమయినకస్తూరిని, మౌళిన్=శిరస్సునందు, తాల్చి, జలజలోచనలు=స్త్రీలు, ఆర్పంగాన్=స్నానమాడింపఁగా, జలకము, ఆడెన్=స్నానముచేసె.

చ. మహిపతి భామినీకరసమంచితకాంచనకుంభతీర్థవా
ర్లహరులు మూర్ధభాగమునఁ ద్రావఁగనొప్పవిలోచనోత్సవా
వహమహనీయమూర్తియయి వారిజలోచన పాదతీర్థవా
ర్లహరులుమూర్ధభాగమునఁ ద్రావఁగనొప్పుహిమాద్రికైవడిన్.

టీ. మహిపతి=రాజు, భామినీ...లహరులు-భామినీకర = స్త్రీలచేతులందు, సమంచిత=ఒప్పుచున్న, కాంచనకుంభ = బంగారుకడవలందలి, తీర్థవాః=పవిత్రమగు గంగాజలముయొక్క, లహరులు = పెద్దతరంగములు, స్త్రీలు బిందెలతో వంచుచుండఁగా నతనిశిరమునఁ దరంగరూపముగాఁ బడుచున్నవని భావము. మూర్ధభాగమునన్ = శిరస్సునందు, ద్రావఁగన్ = పడుచుండఁగా, లోచనో...మూర్తి=నేత్రములకువిందొనర్చు పూజ్యమగు నాకారముగలవాఁడు, అయి, వారిజ...లహరులు-వారిజలోచన=విష్ణువుయొక్క, పాద = పాదమందుఁబుట్టిన, తీర్థ=గంగానదియొక్క, లహరులు=పెద్దతరంగములు, మూర్ధభాగమునన్=

శృంగభాగమునందు, ప్రాలఁగాన్ = పడుచుండఁగా, ఒప్పు...కైవడిన్ = ప్రకాశించుచున్న హిమవంతమువలె, ఒప్పన్, గంగాతరంగపాతముచే మనోహరమును, బవిత్రమును నైన హిమాలయశిఖరమువలె స్నానసమయమున నలుని మూర్ధభాగము ప్రకాశించెను.

క. వ్యామగ్రాహ్యస్తను లగు
భామలు మును జలకమార్పఁ బదపడి నిషధ
స్వామికిఁ దీర్థం బార్చిరి
భూమీనిర్జరులు మంత్రపూతాంబువులన్. 98

టీ. వ్యామగ్రాహ్యస్తనులు = బారతోఁబట్టుకొనఁదగిన కుచములుగలవారు, అగుభామలు, మును = ముందుగా, జలకమార్పఁగన్ = స్నానము చేయింపఁగా, భూమీనిర్జరులు = భూదేవతలు, అనఁగా బ్రాహ్మణులనుట. మంత్రపూతాంబువులన్ = అఘమర్షణాది మంత్రములచేఁ బవిత్రమయిన యుదకములచేత, నిషధస్వామికిన్, తీర్థంబు, ఆర్చిరి = స్నానము చేయించిరి.

ఉ. అంతరకల్ప్యమాన చులుకాచమనంబుగ నైషధక్షమా
కాంతుఁడు తీర్థమాడె మధుకైటభవైరిపదాంబుజోదరో
ద్వాంతమధూళి యైనశుభవారి మహీదివిజు ల్వినిర్మల
స్వాంతులు చేరువన్నిలిచి వారుణసూక్తము లుచ్చరింపఁగన్.

టీ. వినిర్మలస్వాంతులు = మిక్కిలి స్వచ్ఛమగు చిత్తముగలవారగు, మహీదివిజుల్ = బ్రాహ్మణులు, చేరువన్ = సమీపమున, నిలిచి, వారుణసూక్తములు = వరుణదేవతాకమగుమంత్రములను, ఉచ్చరింపఁగాన్ = పఠించుచుండఁగా, మధు....ధూళి - మధుకైటభవైరి = మధుకైటభులనెడిరాక్షసులను జంపిన నారాయణునియొక్క, పదాంబుజ = పాదమనెడిపద్మముయొక్క, ఉదర = గర్భమునుండి, ఉద్వాంత = నిర్గమించుచున్న, మధూళి = మకరందరూపము, ఐనశుభవారిన్ = అయినట్టిపవిత్రజలముచేత, నైషధక్షమాకాంతుఁడు = నలభూపాలుఁడు, అంతర...మనంబుగన్ - అంతర = స్నానమధ్యమున, కల్ప్యమాన = స్వీకరింపఁబడిన

లేక చేయఁబడిన, చులుక=పుడిసిటిజలముయొక్క, ఆచమనంబుగన్ =ఆచమన ముకలుగునట్లుగా, తీర్థము, ఆడెన్ =స్నానముచేసెను.

తే. కమల కింజల్క రేణు సంకాశమైన
　గౌరమృత్స్నద్రవం బంగకముల బూసి
　తీర్థమాడె మహారాజు త్రిదశసింధు
　పుణ్యజలముల సంకల్పపూర్వకముగ.　　100

టీ. కమల...సంకాశము-కమలకింజల్క=పద్మకేసరములయొక్క, రేణు=పరాగముతో, సంకాశము = సమమైనది, ఐన...ద్రవంబు=అయినట్టి పచ్చని శ్రేష్ఠమైన మట్టిసంబంధియగు ద్రవమును, అంగకములన్ = అవయవములయందు, పూసికొని, మహారాజు, త్రిదశసింధుజలములన్ = గంగానదీజలములందు, సంకల్పపూర్వకముగన్ = సంకల్పము చెప్పుకొని, తీర్థమాడెను = స్నానము చేసెను.

క. గర్భధృత హారిత కోమల
　దర్భంబై యొప్పె ధరణిధవు హస్తము వై
　దర్భీ కుచయుగ విరహ హ
　విర్భుగ్ధూమాంకురాభివృతముం బోలెన్.　　101

టీ. ధరణిధవుహస్తము = నలునిచేయి, గర్భ...దర్భంబై -గర్భ=అఱచేతియందున్న, హారిత=ఆకుపచ్చని, కోమల=మృదువయిన, దర్భంబు=దర్భలు కలదియై, వైదర్భీ...బోలెన్ - వైదర్భీకుచయుగ = దమయంతి స్తనములతోఁ గల్గిన, విరహ=వియోగమనెడి, హవిర్భుగ్ధూమాంకుర = అగ్నిధూమముయొక్క చిగుళ్లచే, ఆవృతంబునుబోలెన్ = ఆవరింపఁబడినట్లు, ఒప్పెన్ =ప్రకాశించెను. జలతర్పణాదుల కొఱకు నలుండు దర్భాంకురములను నఱచేత ధరించియుండఁగా నా దర్భాంకురంబులు, దమయంతి కుచములతోఁ జేతికిఁ గలిగిన వియోగమనెడి యగ్నిసంబంధియగు ధూమరేఖలన్నట్లు ప్రకాశించెనని యుత్ప్రేక్షించెను. అలం. ఉత్ప్రేక్ష.

తే. మృదుల తరగౌరమృద్బిందు వదనచంద్ర
చికుర శేషాంబుమౌక్తిక ప్రకర దశన
గురుపయఃకుంభ పృథుల వక్షోజకుంభ
పతి భజించె గంగాజలాప్లవనలక్ష్మి. 102

టీ. మృదుల...చంద్ర—మృదులతర=మిక్కిలి మెత్తనిదగు, గౌరమృత్=పచ్చని మట్టియొక్క, బిందు=తిలకమనెడి, వదనచంద్ర = ముఖచంద్రుఁడు గలదియు, చికుర...దశన=కుంతలములందు మిగిలిన నీటిముత్తెములసమూహమనెడి పలువరుసగలదియు, గురు...కుంభ=గొప్పవగు, గురు పయఃకుంభ=జలకుంభములనెడి, పృథులవక్షోజకుంభ=గొప్ప స్తనములు గలదియునగు, గంగాజలాప్లవనలక్ష్మి=గంగాజలస్నానమనెడిలక్ష్మి, పతిక్=నలరాజును, భజించెక్ = సేవించెను. నలుని స్నానము సమాప్తమయినదని భావము. స్నానక్రియ యనెడి లక్ష్మికి, నలుఁడు ధరించిన మృత్తికాతిలకము వదనమగుచుండెననియు, కేశపాశము కొనయందంటుకొని ముత్యములవలెఁ గానవచ్చు జలబిందువులు పలువరుసయు, జలకుంభములు స్తనములు నగుచుండెననియు నుపమానార్థము. అలం.రూపకము.

సీ. సీమంత మేర్పడఁ జికురభారమున సు
శ్లిష్ట బంధంబుగ శిఖ యమర్చి
గన్నేరుపూచాయఁ గనుపట్టు జిలుగైన
సలిలకాషాయవస్త్రంబు గట్టి
చంద్రాతపముతోడ సరియైన వలిపట్టుఁ
బుట్ట ముత్తరవాసముగ ధరించి
ప్రక్షాళితము లైన పదియాఱువన్నియ
కనకంపు గొడుగుఁ బాగాలు దొడిగి

తే. శైవుఁ డగు బ్రాహ్మణ బ్రహ్మచారి యిచ్చు
హస్త మవలంబనంబుగ నల నడిచి

నియతమౌనవ్రతంబుతోఁ దా నృపతి సొచ్చె
శాంతచిత్తుఁడై దేవపూజాగృహంబు. 103

టీ. నృపతి=నలుఁడు, సీమంతము=పాపట, ఏర్పడన్=స్పష్టమగునట్లుగా, చికురభారంబునన్ = కేశపాశమునందు, సుశ్లిష్టబంధంబుగన్ = చక్కఁగాఁ గూడియున్న ముడిగలదిగా, శిఖ, అమర్చి = చక్కఁజేసి, పాపటదిద్ది కేశములను జాలుముడిగా బంధించెననుట. ఉత్తరదేశపురాజులకుఁ బాపటయుండుట యాచారము. గన్నేరుపూచాయన్ = గన్నేరుపూవుయొక్క కాంతివంటి కాంతితో, కనుపట్టు...వస్త్రంబు-కనుపట్టు=కానవచ్చు, జిలుగైన = సన్నని, సలిలకాషాయవస్త్రంబున్=నీర్కావి దోవతిని, కట్టి, చంద్రాతపములోడన్= వెన్నెలతో, సరియైన=సమానమయిన, వెలిపట్టుపుట్టము=తెల్లని పట్టువస్త్రము, ఉత్తరవాసముగన్=పైవస్త్రముగా, ధరించి, ప్రక్షాళితములు=బాగుగాఁ దోమఁబడినవి, ఐన...పాగాలు - అయిన పదాలుపన్నియ బంగారపు గొడుగులుగల పావకోళ్లను, తొడిగి, శైవుఁడు=శివభక్తుఁడు, అయిన బ్రాహ్మణ బ్రహ్మచారి= అయినట్టి బ్రాహ్మణవటువు, ఇచ్చుహస్తము, అవలంబనంబుగన్ = ఊఁతగా, అల్లన్=మెల్లగా, నడిచి, నియతమౌనవ్రతంబుతోన్=సదాచారమయిన మౌనవ్రతములోఁగూడి, శాంతచిత్తుఁడయి=వికార రహితమగు మనస్సుగలవాఁడై, దేవపూజాగృహంబున్=దేవునికిఁ పూజసేయఁదగినయింటిని, చొచ్చెన్=ప్రవేశించెను.

తా. నలుఁడు దేవపూజాగృహంబు సొచ్చునప్పుడు, పాపటగల్గిన కేశపాశము ముడిగా నమర్పఁబడెను. గన్నేరుపువ్వువంటి నీర్కావిదోవతి ధరించెను. వెన్నెలవలెఁ దెల్లనిపట్టువస్త్రమును పైనిధరించెను. బంగారపు గొడుగుపావకోళ్లుదాల్చె. శివభక్తుఁడును బ్రాహ్మణుఁడునునగు బ్రహ్మచారియిచ్చిన చేతినూఁతగాఁ జేకొనెను. మౌనవ్రతమవలంబించెను.

అవ. నలుఁడొనరించు దేవపూజావిధానమును వర్ణించుచు, మొదట శివపూజను గూర్చి చెప్పుచున్నాఁడు.

సీ. అభినవాజ్యసమేధి ౯ తాఖండదీపంబు
పుష్పమండపికావి ౯ భూషితంబు
ననవద్య బహుళనైవేద్య సమన్వితంబును
వివిధచిత్రసువ స్త్రి ౯ విలసితంబు
నఖిలతీర్థాంబు పూర్ణార్ఘ్యపాత్రంబును
గలధౌతరత్నోప ౯ కరణచితము
శశికాంతకుట్టిమ ౯ స్థూకుట్టమితమును
జందనస్రక్కుశా ౯ క్షత యుతంబు
తే. నయిన యద్దేవపూజాగృ ౯ హంబు నందు
భద్రపీఠాసనస్థుఁ డై ౯ పరమనియతి
నాగమోక్తప్రకారంబు ౯ ననుసరించి
శంభులింగంబుఁ బూజించె ౯ జనవిభుండు. 104

టీ. అభి...దీపంబు-అభినవ=క్రొత్తదయిన, ఆజ్య=నేతితో, సమేధిత = వర్ధింపఁబడిన, అనఁగాఁ బ్రజ్వలింపఁజేయఁబడిన, అఖండదీపంబు = సర్వకాలములందును వెలుఁగుచుండెడి దీపముగలదియు, పుష్ప...షితంబు = పువ్వులచేనయిన చిన్నమండపముచే బ్రకాశించుచున్నదియు, అనవద్య ... సమన్వితంబును — అనవద్య = తక్కువ కాని, బహు=నానావిధములగు, నైవేద్య =నివేదనార్థముసిద్ధముచేసిన పదార్థములతో, సమన్వితంబు=కూడినదియును, వివిధ...విలసితంబు - వివిధ=పలువిధములగు, చిత్ర = చిత్రవర్ణములుగల, సువస్త్రి=మంచివస్త్రిములచే, విలసితంబు= ప్రకాశించుచున్నదియు, అఖిల ...పాత్రంబును - అఖిల = సమస్తమైన, తీర్థ = పుణ్యనదులవలనఁదేఁబడిన, అంబు=నీటితో, పూర్ణ =నిండిన, అర్ఘ్యపాత్రంబును=పూజాపాత్రలుగలదియు, కల...చయము - కలధౌత= రజతమయములును, రత్న = రత్నమయములును నగు, ఉపకరణచయము=పూజాసాధనములు గలదియు, శశి...కుట్టమితంబును- శశికాంత=చంద్రకాంతరత్నములయొక్క, కుట్టిమత్వా=కట్టనపు నేలయందలి,

కుట్టమితము=ప్రతిఫలించిన శృంగారచేష్టా విశేషములుగలదియు, చందన... యుతంబు - చందన = మంచిగందములోను, స్రక్ = పూలదండలతోను, కుశ=దర్భలతోను, అక్షత=అక్షతలతోను, యుతంబు=కూడినది, అయిన... సందుర్ = అయినట్టి యాదేవపూజా గృహములో, భద్రపీఠాసనస్థుఁడై = మంగళప్రదమగు నాసనమందు గూర్చున్నవాఁడై, పరమనియతిన్ = నిశ్చలమగు నిష్ఠతో, ఆగమోక్తప్రకారంబు = శాస్త్రోక్తప్రకారమును, అనుసరించి, జనవిభుండు=నలుఁడు, శంభులింగంబున్, పూజించెన్, నానా విధపూజాద్రవ్యములుగల పూజాగృహమున మంగళప్రదమగు నాసనమునఁ గూర్చుండి నలుండు నియమముతో శంకరునిఁ బూజించెనని భావము.

తే. పసిఁడిధత్తూరపుష్పంబు ♦ ఫాలనయను
　పానవట్టంబుపైఁ బెట్టి ♦ పార్థివుండు
　విశ్వపతి కాత్మసంగ్రామ ♦ విజయలబ్ధ
　మదనకాహళముగఁ దాని ♦ మదిఁ దలంచె.　　105

టీ. పార్థివుండు = నలరాజు, పసిఁడిధత్తూరపుష్పంబు = బంగారముతోఁ జేసినయుమ్మెత్తపువ్వును, ఫాలనయను పానవట్టంబుపైన్ = శంకరునియొక్క లింగముండు పీఁటపైని, పెట్టి, విశ్వపతికిన్ = శివునకు, ఆత్మ ... ముగన్ —ఆత్మసంగ్రామ విజయ = తన యుద్ధ విజయమునందు, లబ్ధ = పొందఁబడిన, మదనకాహళముగన్=మన్మథుని కాహళమనెడి వాద్యవిశేషముగా, దానిన్=అపుష్పమును, మదిన్, తలంచెను, లోకములోఁ దనవలెఁ బరాక్రమాదిగుణములతో నొప్పు శత్రువుని జయించి వానివలన నాయుధాదులను బలాత్కారముగా స్వీకరించి రాజభటుఁడు తనరాజున కర్పించుట ప్రసిద్ధము. ప్రస్తుతమున నలుఁడు నిరుపమాన సౌందర్యవంతుఁడు. మఱియు శివునకు భక్తుఁడు. సౌందర్యవంతుఁడని ప్రసిద్ధిచెందు మన్మథునితో స్పర్ధ వహించినవాఁడు. మన్మథుఁ డదివఱకే శివునకు విరోధియై యున్నాఁడు. ఇప్పుడు నలునకుఁగూడ విరోధియయ్యెను. నలుఁడు, తనకును, తనప్రభువయిన శివునకును శత్రువయిన మన్మథునిజయించి యవమానపఱిచి బలాత్కరించి యతని వాద్యవిశేషమగు

కాహళమును దీసికొని తనప్రభువున కర్పించినట్లుగా నాపుష్పమును దలంచె నని యుత్ప్రేక్షించె. "ఇందు. పెట్టన్" అనెడి తుమున్నర్థపాఠము మూలమున కనుకూలపడమిచే విడిచిపెట్టఁబడియె. నలుఁడే యాపువ్వు నర్పించి యట్లుతలం చెనని చెప్పవలయు. అట్లయినప్పుడే యీపద్యము నలుఁడు నిరుపమానసౌందర్య వంతుఁడన్న యర్థమునిచ్చును. అలం. ఉత్ప్రేక్ష.

అవ. ఈసీసమున శివుని నానావిధనామములకుఁ గొంచెము వర్ణసాదృశ్యము గల పూలతోఁ బూజించుచున్నట్లు వర్ణించుచున్నాఁడు.

సీ. ఖట్వాంగపాణిఁ జెంగల్వపుష్పంబుల
ఫాలలోచను బిల్వపల్లవముల
నాగేంద్రకేయూరు నాగకేసరముల
బాలేందుకోటీరుఁ బాటలములఁ
గుసుమకోదండారి గుండవర్ధనములఁ
గాంచనాచలచాపుఁ గాంచనముల
నంబికాహృదయేశు నసితాంబుజంబుల
దక్షాధ్వరధ్వంసి దమనకములఁ
తే. బొండుమల్లియ విరిదండఁ ఖండపరశు
నఖిల సురసార్వభౌము దూర్వాంకురముల
బంతి శ్రీవత్సలాంఛన ప్రాణబంధు
శివునిఁ జేమంతిబంతిఁ బూజించె నలుఁడు. 106

టీ. నలుఁడు, ఖట్వాంగపాణిన్ = మంచపుఁగోడు పాణియందుఁ గలశివుని, చెంగల్వపుష్పంబులన్ = ఎఱ్ఱఁగలువపూలచేతను, మంచపుగోడుతూఁడుగలపువ్వు వలెనుండును. ఇట్లే మీఁద నందందు తెలియునది. బిల్వపల్లవములన్ = మారేడు దళములచేత, ఫాలలోచనున్ = నుదుటఁ గన్నుగలవానిని, నాగకేసరములన్ = నాగకేసరపుష్పములచేత, నాగేంద్రకేయూరున్ = సర్పరాజగు నవంతుఁడే బాహుపురి ... పాటలములన్ ... కలుగొట్టపువ్వుల చేత, బాలేందు

కోటీరుఁ=బాలచంద్రుఁడు కిరీటమునందుఁగలవానిని, గండవర్ధనములఁ = గండవర్ధనములనెడి పూవులతో, కుసుమకోదండారి = పూవిల్తునకు శత్రువగు వానిని, కాంచనములఁ=ఉమ్మెత్తపువ్వులచే, కాంచనాచలచాపుఁ=బంగారు కొండవిల్లుగాఁగలవానిని, అసితాంబుజంబులఁ = నల్లఁగలువపూవులతో, అంబికాహృదయేశుఁ=పార్వతీవల్లభుని, దమనకములఁ= దవనములనెడిపూలతో, దక్షాధ్వరధ్వంసిఁ=దక్షునియజ్ఞమువాడు చేసినవానిని, ఖండపరశుఁ, బొండుమల్లియవిరిదండఁ = పెద్దమల్లెపూవులతోఁ గూర్చిన పుష్పమాలికచేతను, దూర్వాంకురములఁ=గఱికచిగుళ్లచేతను, అఖిలసురసార్వభౌముఁ=సకలదేవతలకును జక్రవర్తి యగువానిని, బంతిఁ = పూవుబంతిచే, శ్రీవత్సలాంఛన పాత్రిణబంధుఁ=విష్ణువునకువచ్చినచుట్టమగువానిని, చేమంతిబంతిఁ=చేమంతిపూలతోఁగూర్చిన బంతిచేతను, శివునిఁ, పూజించెఁ.

ఉ. డగ్గఱి మేదినీపరివృఢప్రవరుండు సువర్ణపాత్రలఁ
బుగ్గన దివ్యసౌరభవిభూతి యెలర్పఁగసాత్కరించెఁ బెం
ప గ్గలమైనభక్తి మహిసాక్షి ఘాతుగజస్త్రసరేణుసమ్మిళ
ద్గుగ్గులు ధూపధూమములు కోమలతారకరాజమౌళికిన్.

టీ. మేదినీపరివృఢప్రవరుండు=రాజశ్రేష్ఠుఁడయిన నలుఁడు, కోమలతారకరాజమౌళికిఁ=బాలచంద్రుని శిరంబునఁ దాల్చినశంకరునకు,డగ్గఱి=సమీపమునందు, సువర్ణపాత్రలఁ=బంగారపు పళ్లెరములందుండి, బుగ్గనఁ=వేగముగా, దివ్యసౌరభవిభూతి=శ్రేష్ఠమైనపరిమళసంపద, ఎలర్పఁ=వ్యాపించునట్లుగా, పెంపు, అగ్గలమైనభక్తి = అత్యధికమయిన భక్తివిశేషముచే, మహిసా...ధూమములఁ - మహిసాక్ష=మైసాక్షియను గుగ్గులు సంబంధియగు,రజః=పరాగముయొక్క, త్రసరేణు = చిన్నినలుసులతో, మిళిత్ = కూడియున్న, గుగ్గులుధూపధూమములఁ=గుగ్గులుసంబంధియగు ధూపద్రవ్యముయొక్క పొగలచేత, సాత్కరించెఁ=గౌరవించెను. గుగ్గులు ధూపపరిమళముల నతిభక్తితో నిచ్చెనని తాత్పర్యము. సత్కరించె ననెడి పాఠము దీనికంటె సాధుతరమని తోఁచెడిని.

తా. నలుఁడతిభక్తియుక్తుఁడై శివునిసమీపించి పరిమళములు వెడలునట్లుగా బంగారుపళ్లెరములో, ధూపమునిచ్చి యతని సత్కరించెను.

తే. సరసధూపార్థమై కామ శరములందుఁ
బురములందును బొగసూపె భూవరుండు
మదనసంహారుఁడును, బురమర్దనుండు
నయిన దేవర కామోద మావహిల్ల. 108

టీ. భూవరుండు = నలుఁడు, మదనసంహారుఁడును = కామునిదహించినవాఁడు, పురమర్దనుండు=త్రిపురములను దహించినవాఁడు, అయినదేవరకున్ = అయినట్టిశంకరునకు, మోదము=సంతసము, ఆవహిల్లన్ =కలుగునట్లుగా, సరసధూపార్థమై=మనోహరమగు ధూపముకొఱకు, కామశరములందు=మన్మథబాణములందును (కర్పూరమందును) పురములందును=త్రిపురములందును, పొగసూపెన్ =పొగనుగల్గించెను. కామశరములను,పురములను దహించెను. శంకరుఁడు కామహరుండును, బురహరుండును గనుకఁ దత్సజాతీయములగు పను లొనరించిన నతనికి సంతసముగల్గునని యు నతనియనుగ్రహము సంపాదించుకొనవచ్చునని యు,నలరాజు, కామశరములను, బురములను దహించెనని యర్థము. శంకరుఁడు మోహనమనెడి కాముని బాణమును, గామునిఁ బురములను దహించెనని పురాణప్రసిద్ధి. ధూపార్థమై కామశరాది దహనమేమి? యనగా, కామశరమనఁగాఁ, గర్పూర మనియు, పురము లనఁగా, గుగ్గులు వనియు శ్లేషార్థము. నలుఁడు శంకరునికి ధూపాదులతోఁ బూజసల్పెనని ఫలితార్థము.

సీ. పద్మాసనస్థుఁడై భావించె మానస
కమలకర్ణికయందుఁ గాలకంఠుఁ
బంచాస్యమంత్రమోల జపించెఁ బంచబ్రహ్మ
పంచాక్షరంబులఁ బరమనియతి
భక్ష్యభోజ్యాదిక బహుపదార్థంబుల
నప[illegible]

రాజదేవోపచారప్రకారంబుల
  నతిభక్తిఁ గొలిచె రాజార్ధమౌళి

తే. మంత్రపుష్పంబుఁ బెట్టె మన్మథవిరోధి
మూర్ధభాగమునందు సమ్మోదమెసఁగ
నవనిసంస్పృష్టసకలాంగుఁ డగుచు మ్రొక్కె
నిఖిలలోకైకభర్తకు నిషధరాజు. 109

టీ. నిషధరాజు, పద్మాసనస్థుఁడై=పద్మమనెడి యాసనము నవలంబించినవాఁడయి, కుడియెడమ పాదములను నూరు మూలములందుఁ జేర్చి కూర్చుండినచోఁ బద్మాసనమందురు. అట్లుగాఁ గూర్చుండి, మానసకమలకర్ణికయందున్=మనః పద్మముయొక్క కర్ణికయందు, కాలకంఠున్=నల్లని కంఠముగల యీశ్వరుని, భావించెన్=స్మరించెను. పద్మాసనస్థుఁడై శంకరుఁ దన హృదయకమల కర్ణిక యనెడి సింహాసనంబున నిల్పి ధ్యానించె నని యర్థము. పంచాస్యుమ్రోలన్=అయిదు ముఖములుగల్గిన శివునియెదుట, పంచబ్రహ్మ పంచాక్షరంబులన్=పంచబ్రహ్మస్వరూపమును సూచించు, "నమశ్శివాయ" యను నైదక్షరములచేతను, పరమనియతిన్=దృఢనియమముతో, జపించెను. పంచాక్షరీమంత్రమును, జపించెననుట. శంకరునకు, సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము అనెడి యైదుముఖయులుగలవని తెలియనగు, అసమాక్షున కున్=మూడు నేత్రములుగల యీశ్వరునకు, భక్ష్య...పదార్థంబులన్ = భక్ష్యము, భోజ్యము, చోష్యము, మొదలగు తినుబండములను, ఉపహారము— ఇచ్చెన్ = కానుకలిచ్చె, రాజార్ధమౌళిన్ = చంద్రఖండము కిరీటమందుఁగల యీశ్వరుని, రాజ...బులన్—రాజ = రాజోపచారములచేతను, దేవోపచారములన్ = దేవోపచారములచేతను, అతిభక్తిన్=గొప్పభక్తితో, కొలిచెన్= సేవించెను. మన్మథవిరోధి...నందున్=కాముకుని శత్రువయిన యీశ్వరుని యొక్క, శిరంబునందు, సమ్మోదము = సంతసము, ఎసఁగన్=ఒప్పునట్లుగా, మంత్రపుష్పంబున్ = మంత్రసహితమగు పుష్పమును, పెట్టెన్ = ఉంచెను.

నిఖిల...భర్తకున్=సమస్తలోకములకును బ్రధాననాయకుఁడయిన శంకరునకు, అవని...లాంగుడు—అవని = భూమియందు, సంస్పృష్ట = స్పృశింపఁబడిన, సకలాంగుండు=అవయవములుగలవాఁడు, అగుచున్, మ్రొక్కెన్.

తా. నలరాజు పద్మాసనాసీనుఁడై యధికభక్తితో హృదయకమలమందు శివుని స్మరించెను. మిక్కిలి నియమముగలవాఁడై దక్షిణామూర్తి రూపుఁడగు శివుని మ్రోలఁ బంచాక్షరీమంత్రమును జపించెను. భక్ష్యములు, భోజ్యములు మొదలగు పదార్థములను గానుకగా నిచ్చెను. సకలమగు రాజోపచారములను జేసెను. మంత్రపుష్ప మిచ్చెను. భూమిని సకలాంగములును దాఁకునట్లుగా నమస్కరించెను.

వ. అనంతరంబ పరమపురుషునిం బురుషోత్తము నారాధింప నద్దేవుని సన్నిధికి వచ్చి. 110

సీ. కీలుకొప్పునఁ బైఁడి • గేదంగి ఱేకులు
  గొనలు గానంగరాఁ • గుదురుపఱిచి
కర్ణపాశంబులఁ • గలధౌతమయపాండు
  పుండరీక వతంసకములు ధరించి
బాహు మధ్యంబునఁ • బవడంపుఁ జివుళులఁ
  పచ్చలఁదోమాలె • యచ్చుపఱిచి
చరణ పీఠంబుల • గరుడాంక మణిఖండ
  తులసీదళంబులు • నెలవు కొలిపి
తే. పురుషసూక్తనిపాఠంబు • పరిచయించి
పావనాష్టాక్షరీ మంత్ర • పఠనఁ దగిలి
పాంచరాత్రోదిత క్రియా • పథమునందు
నలిననాభు సమారాధనంబు సేసె. 111

టీ. కీలుకొప్పునన్=బంధింపఁబడినకేశపాశమందు, పైఁడిగేదంగిఱేకులు= బంగారమువంటి గేదఁగిపువ్వుల ఱేకులను, బంగారముతోఁ జేసిన

మొగలిరేకులను, కొనలు, గానంగరాన్ = కనఁబడునట్లుగా, కుదురుపఱిచి=చక్కఁజేసి, కర్ణపాశంబులన్ = పాశమువంటి కర్ణములందు, కల...ములు—కలధౌత=రజతమయములయిన, పాండు = తెల్లని, పుండరీకవతంసములు=తెల్లఁదామరపువ్వులనెడి, భూషణములను, ధరించి, అలంకరించి, బాహుమధ్యంబునన్=వక్షస్థలమునందు, పవడంపు...మాలె = పవడపుచిగుళ్లయొక్కయు, మరకతములయొక్కయు, దండను, అచ్చుపఱిచి=అర్పించి, చరణపీఠమ్మునన్ = పాదపీఠమునందు, గరుడ...బులు—గరుడాంకమణి = గరుడపచ్చలయొక్క, ఖండ=తునుకలనెడి, తులసీదళంబులు=తులసిదళములను, నెలవుకొలిపి=స్థాపించి, పురుషసూక్తనిపాఠంబు= పురుషసూక్తమనెడి మంత్రములను జదువుట, పరిచయించి=చేసి, 'పావన...పఠనన్—పావన=పాపహారమయిన, అష్టాక్షరీమంత్ర=“ఓంన్నమోనారాయణాయ” యను మంత్రమునుయొక్క, పఠనన్=పఠించుటయందు, తగిలి=ఆసక్తికలవాఁడై, పాంచరాత్రో...నందున్ - పాంచరాత్ర=పాంచరాత్రమనెడి గ్రంథమునందు, వైష్ణవపూజా సంప్రదాయ సూచకమగు గ్రంథమునందనుట. ఉదిత = చెప్పఁబడి, క్రియా = పనులయొక్క, పథమునందున్=రీతిచే, నలిననాభున్=పద్మము నాభియందుఁగలవానిని-నారాయణునిననుట. సమారాధనంబు, చేసెన్ = ఆరాధించెను.

తా. నలుఁడు భక్తియుతుఁడై నారాయణుని సమీపించి కేశపాశమునందు బంగారు మొగలిరేకులను దుఱిమెను. చెవులందు వెండితోఁ జేసిన తామరపూవును భూషణముగానుంచెను. వక్షఃస్థలమునందు, గరుడపచ్చలతోను బవడపుఁ జివుళ్లతోను జేర్చినదండను నెలకొల్పెను. పాదమూలమునందు మరకతమణిఖండములతోఁజేసిన తులసీదళముల నర్పించె. పురుషసూక్తమును జదువుచుఁ బూజగావించెను. పాపహారమగు నారాయణ మంత్రమును జపించె. పాంచరాత్రమందుఁ జెప్పఁబడువిధమున నారాధించెను.

చ. గురుతర కౌస్తుభాఖ్యమణి కుట్టిమమైన రథాంగపాణిపే
రురమునఁ బూన్చెనొక్కయసితోత్పలమాలిక షట్పదావళీ

గరుదనిలావతారమునఁ గంపము నొందెడి తేకు లిందిరా
తరళకటాక్షవీక్షణవిధా వికటాయిత మభ్యసింపఁగన్. 112

టీ. గురు...మను-గురుతర=మిక్కిలి గొప్పదైన, లేక, విష్ణువు నాభరణ మనుటచే మిక్కిలి పూజ్యమైన, కౌస్తుభాఖ్య=కౌస్తుభమనెడి, మణికుట్టిమము=రతనంపు కట్టనపు నేల, ఐన...రమునన్ = అయినట్టి నారాయణునియొక్క, విశాలమయిన వక్షస్థలమునందు, షట్... తారమునన్—షట్పదావళీ=తుమ్మెద సమూహములయొక్క, గరుత్ = ఱెక్కలయొక్క, అనిల = గాలియొక్క, అవతారమునన్ = ప్రసారముచే, కంపము=చాంచల్యము, ఒందెడి ఱేకులు=పొందుచున్న కలువ ఱేకులు, ఇందిరా...కటాయితము—ఇందిరా = లక్ష్మీదేవి యొక్క, తరళ = చంచలమైన, కటాక్షవీక్షణ = కడకంటి చూపులయొక్క, విధా=రీతియొక్క, వికటాయితము = విలాసమును, అభ్యసింపఁగన్ = నేర్చునట్లుగా, ఒక్క...మాలికన్ = ఒకనల్లగలువల దండను, పూన్చెన్ = అమర్చెను. విష్ణువు వక్షమనెడి విశాలసమప్రదేశము. అందున్న కౌస్తుభము రత్నమయమగు నెలకట్టువలె నుండెను. అద్దానియందు నలుఁడు నల్లఁగలువలదండ నుంచెను. ఆ దండఁగల పువ్వు లింకను మకరందమును స్రవించుచుండుటచేఁ దుమ్మెదలువచ్చి యెగురుచు వ్రాలుచు మకరందపానము చేయుచుండెను. అట్లెగురునప్పుడు వాని ఱెక్కల గాలిచేఁ గలువ ఱేకులు చలింపఁజొచ్చెను. అట్లు చలించుచున్న ఱేకులు, సర్వదా హరివక్షస్థలమును మందిరముగాఁ జేసికొన్న లక్ష్మీదేవియొక్క, చంచలములయిన కడకంటిచూపులను నభ్యసించుచున్నట్లుండెను. ఈచెప్పుట కలువఱేకులకంటెను లక్ష్మి కన్నులెక్కువ విలాసములు కలవని తెలియవచ్చుచున్నవి. నలుఁ డుత్పలమాలికను నారాయణుని మెడలో వైచెనని ఫలితార్థము. అలం. ఉత్ప్రేక్ష.

క. అలనాటి కాళియోరగ
వలనంబులు దలఁపకున్నె వనమాలి మదిన్
నలదత్త వికచవిచికల
కలికాడుండుభ కదంబ ఘటితాంగకుఁ డై. 113

టీ. వనమాలి=వనమాలకలవాఁడు-నారాయణుఁడనుట. నల...గకుఁడై-నల=నలునిచే, దత్త=ఈయఁబడిన, వికచ=కొంచెము వికసించిన, విచికల కలికా దుండుభ = రెండు తలలుగల పామువలెనున్న మల్లెమొగ్గల దండలయొక్క, కదంబ=సమూహముచేత, ఘటిత=కూర్పఁబడిన, అంగకుఁడై=అవయవములుగలవాఁడై, అల...వలంబులు—అలనాఁటి =పూర్వకాలమందలి, కాళియోరగ=కాళియుఁడనెడి సర్పరాజు చుట్టిన, వలనంబులు=వేష్టనములను, తలంపకున్నె=తలంపకపోవునా? నలరాజు మల్లెమొగ్గల దండలతో హరి యవయవములఁ జుట్టెను. పూర్వము, కాళియుఁడు కోపావిష్టుండై కృష్ణుని శరీరమునంతను దన కాయముతోఁ జుట్టివైచెను. నలుడు చుట్టిన మల్లికా మాలికల వేష్టనములు, నాసర్పరాజు వేష్టనములవలె నున్నవని భావము. అలం. ఉత్ప్రేక్ష.

క. నరనాథ సమర్పిత మగు
విరవాదులదండ యొప్పె వెన్నుని పాదాం
బురుహంబున నంగుటమున
నురలిన యాకాశగంగ కుపమానంబై. 114

టీ. నరనాథ సమర్పితము = నలరాజుచే సమర్పింపఁబడినది, అగు విరవాదులదండ=అయినట్టి విరజాజిపూలదండ, వెన్నుని పాదాంభోరుహంబునన్ = విష్ణువు పాదకమలమందు, అంగుటమునన్ = బొట్టనవ్రేలినుండి, ఉరలిన యాకాశగంగకున్ = స్రవించుచున్న గంగానదికి, ఉపమానంబై = సాటిదై, ఒప్పెన్, నలుఁడు కృష్ణుని పాదమందర్పించిన విరజాజిపూదండ నతని పాదాంగుష్ఠంబునుండి ప్రవహించిన గంగానదివలెఁ బ్రకాశించెనని భావము. అలం. ఉపమ.

వ. ఇవ్విధంబున నిషధదేశాధ్యక్షుండు పుండరీకాక్షు నర్చించి ప్రణామంబుచేసి యప్పరమపురుషు నిట్లని నుతించె. 115

సీ. జయభూర్భువస్స్వ స్త్రి జగదేకనాయక!
జయసర్వదేవతా సార్వభౌమ!
జయపూర్వ గీర్వాణ సంహార కారణ!

జయకుక్షి నిహిత విశ్వప్రపంచ!
జయజహ్నుకన్యకా జనకపాదాంభోజ !
జయకోమలాంబుద శ్యామలాంగ!
జయ వైజయంతికా స్రక్పరిభాలంకార !
జయ పుండరీక విశాలనయన!
తే. జయశత క్రతుముఖ మరుచ్చక్రవాళ
కనక కోటీరచారు సంఘటిత నూత్న
రత్న నీరాజన క్రియా రాజమాన
చరణ పీఠాంతికోద్దేశ! జయరమేశ ! 116

టీ. భూర్...నాయక—భూర్భువస్స్వర్లోకములకు ముఖ్యాధిపతివయిన యో వాసుదేవా ? జయ=సర్వోత్కృష్టుఁడవై వర్తింపుమా ! ఇట్లే జయ యను పదమునకు ముందు ముందర్థమును గ్రహింపవలయు, సర్వదేవతా...భౌమ=సమస్త దేవతలకుఁ జక్రవర్తివంటివాఁడా ! పూర్వ...రణ - పూర్వగీర్వాణ=రాక్షసుల యొక్క, సంహార = చంపుటకు, కారణ - హేతుభూతమయిన వాఁడా! కుక్షి...పంచ - కుక్షి=గర్భమందు, నిహిత=ఉంపఁబడిన, ప్రపంచ=లోకముగల వాఁడా, జహ్ను...భోజ - జహ్నుకన్యకా=గంగానదికి, జనక = కారణమైన, పాదాంభోజ=పాదపద్మములుగలవాఁడా, పూర్వము భగీరథుఁడు గంగను గొని వచ్చునప్పుడు మార్గమధ్యమున యజ్ఞమొనరించుచున్న జహ్నువనెడి ముని యాగవాటికను ముంచి గంగానది పాఱుచుండఁగా ముని కోపించి త్రావెననియు భగీరథ ప్రార్థనచేఁ గర్ణకుహరంబునుండి విడిచెననియు జహ్నువువలనఁ గల్గినది కాన జాహ్నవియనియు జహ్నుకన్యకయనియు గంగకు నామములు గల్గెనని యుఁ బురాణప్రసిద్ధము. కోమ...లాంగ=నూతన మేఘమువలె నల్లనిదేహముగల వాఁడా! వైజ...కార = వైజయంతి యనెడి వనమాలయే యలంకారముగాఁ గలవాఁడా, పుండ...నయన=తెల్లదామరవంటి నేత్రములుగలవాఁడా, శత... ద్దేశ—శతక్రతుముఖ =ఇంద్రుఁడు మొదలయిన, మరుత్, దేవతలయొక్క,

చక్రవాళ=సమూహముయొక్క, కనకకోటీర=బంగారుకిరీటములందు, సంఘటిత=కూర్పఁబడిన, నూత్నరత్న=క్రొత్తరత్నములనెడి, నీరాజన=ఆరతియొక్క, క్రియా=ఇచ్చుట యనెడి కార్యముచే, రాజమాన=ప్రకాశించు, చరణపీఠ=పాదపీఠముయొక్క, అంతిక+ఉద్దేశా=సమీపభూమిగలవాఁడా, రమేశా.

క. భవదీయములగు మహిమము
లవాఙ్మనస గోచరంబు లంభోరుహాసం
భవ భవుల కనిన శక్యం
బవునే? మావంటివారి కచ్యుత! పొగడన్. 117

టీ. అచ్యుత=నాశములేని యోయీశ్వరా, భవదీయములు=నీసంబంధులు, అగుమహిమములు=అయినట్టిప్రభావములు, అంభో...వులకన్—అంభోరుహాసంభవ=పద్మమందుఁబుట్టినవాఁడగు బ్రహ్మకును, భవ=శివునకును, అవాఙ్మనసగోచరంబులు=వాక్కునకును, మనస్సునకును గోచరింపనివి, అనిన = అని చెప్పవలసివచ్చినప్పుడు, మావంటివారికిన్, పొగడన్=నుతించుటకు, శక్యంబు, అవునే=తరమగునా? ఓ నారాయణా! బ్రహ్మశంకరులే నీమహిమలను దెలిసికొనలేకపోవుటయేకాక మన మందూహింపనైన నశక్తులని చెప్పవలసినప్పుడు మావంటివారు పొగడఁగలుగుదురా?

శా. ఓదామోదర! యిందిరాయువతి విద్యుల్లేఖతో నూత్న పిం
ఛాదామ త్రిదశేంద్ర కార్ముకముతో సమ్యక్కృపావృష్టితో
నీ దేహం బను మేచకాంబుదము మన్నేత్రద్వయీచాతకా
హ్లాదంబుం బొనరించుఁగాక భవతాపాటోపముం బాపుచున్.

టీ. ఓదామోదరా! ఇంది...ఖతోన్ - ఇందిరాయువతి=లక్ష్మీదేవియనెడి, విద్యుల్లేఖతోన్=మెఱుపుఁదీవెతోను, నూత్న...కముతోన్ - నూత్న=క్రొత్తదయిన, పింఛాదామ=నెమలిపురిదండయనెడి, త్రిదశేంద్రకార్ముకముతోన్=ఇంద్రధనుస్సుతోను, సమ్యక్కృపావృష్టితోన్ = అధికమగు దయయనెడి వర్షముతోను, నెలయుచున్న, నీదేహంబను మేచకాంబుదము నల్లనిమేఘమనెడి

నల్లనిమేఘము, భవతా...మ్ = సంసారతాపాతిశయమును, పాపుచున్ = తొలంగించుచు, మన్నేత్ర...దంబున్ = నా నేత్రములనెడి చాతకపక్షి ద్వయమున కానందంబును, ఒసరించున్, కాక = చేయుఁగాక, మేఘము చాతకములకు గ్రీష్మతాపము తొలఁగించి యానందము గల్గించునట్లు నీ కమనీయదేహము సంసారతాపమును దొలంగించి సుఖము గల్గించుఁగాక అని భావము.

అవ. విష్ణువు దశావతారములను వర్ణించుచు నందు మొదట మత్స్యావతారమును వర్ణించుచున్నాఁడు.

తే. కపట మత్స్యంబవై నీవు కడలి నడుమఁ
బుచ్ఛ మల్లార్ప నెగసిన భూరిజలము
మింటఁ గడుఁదెల్లనై పాఱు చుంటఁ జూచి
యభ్రనదియంచు వర్ణించె నఖిల జగము. 119

టీ. ఓ దేవ! నీవు, కపటమత్స్యంబవై = మత్స్యావతారమును దాల్చినవాఁడవై, కడలినడుమన్ = సముద్రమధ్యమందు, పుచ్ఛము = తోఁక, అల్లార్పన్ = ఆడింపఁగా, ఎగసిన భూరిజలము = మీఁదికెగసిన విస్తారమయినసీరు, మింటన్ = ఆకసమునందు, కడున్ = మిక్కిలి, తెల్లనై = తెల్లఁదనముకలదై, పాఱుచున్, ఉంటన్ = ప్రవహించుటను, చూచి, అఖిలజగము = ప్రపంచమంతయు, అభ్రనది = ఆకాశగంగ, అంచున్, వర్ణించెన్ = పొగడెను. నీతోఁకవలన నెగసినజలమే గంగానదికాని వేఱొండుకాదని ఫలితార్థము.

తా. ఓ నారాయణా! నీవు మత్స్యావతారముదాల్చి సముద్రమధ్యమున వర్తిల్లుచు నీతోఁక నాడించితివి. దానంజేసి నీ రాకసమున కెగసి తెల్లఁగాఁ గనిపింపఁగా లోకులుచూచి యాకాశగంగయని నుతింప నారంభించిరి. అలం. ఉత్ప్రేక్ష.

## కూర్మావతార వర్ణనము.

క. గత భువన సర్గ సముదయ
ధృత భూవలయాంక సదృశ దృఢచరమతనూ

వితత బహుచక్ర చిహ్నముఁ
బతగధ్వజ! కపట కచ్ఛపము నినుఁ గొల్తున్. 120

టీ. పతగధ్వజ=గరుత్మంతుఁడు, ధ్వజచిహ్నముగలవాఁడా! గత...చిహ్నముక్-గత=అతీతమైన,భువనసర్గ=లోకసృష్టులయొక్క,సముదయ=సమూహమునందు, ధృత=ధరింపఁబడిన, భూవలయ=భూచక్రములయొక్క, అంక=చిహ్నములతో,సదృశ=సమానమయిన,దృఢ=గట్టిదైన,చరమతనూ=పృష్ఠభాగమునందు, వితత=స్పష్టమగుచున్న,బహు=అనేకములగు, చక్ర=వలయాకారములగు, చిహ్నము=గుర్తులుగలది, అగు, కపటకచ్ఛపముక్=కూర్మావతారము ధరించిన, నినుక్, కొలుతుక్=సేవింతును. ఓదేవా! నీవు చిరకాలమునుండి ప్రతిసృష్టి యందును భూమండలమును నీవీఁపునఁ దాల్చుటంజేసి దానిరాపిడిచేత వలయాకారములగు వీఁపు మచ్చలు గానవచ్చుచున్నవి. వీఁపు మచ్చలు, పడునట్లు ప్రతి యుగమునందును భూమండలము దాల్చుచున్న నిన్ను సేవింతునని భావము. కూర్మపృష్ఠమున స్వభావసిద్ధముగానుండు నల్లని గుండ్రని మచ్చలను భూమి మోచుటచేతఁ గద్దె ననుటచే, ఉత్ప్రేక్షాలంకారము.

అవ. వరాహావతార వర్ణనము.

తే. చించి వెడలిన తనురుహశ్రేణిచేతఁ
బద్మజాండంబు కడప పూఁబంతిఁ బోలఁ
బెరిఁగియున్నట్టి కిటిరూపధరుని నిన్ను
ఖురచతుష్టయ బిలచతుశ్శరధిఁ గొలుతు. 121

టీ. చించి=చీల్చికొని, వెడలిన... చేతక్ = నిర్గమించి వచ్చుచున్న రోమసమూహముచేత, పద్మజాండంబు = బ్రహ్మాండము, కడప...బంతిక్ = కడప పూవులతోఁ గూర్చిన, బంతిని,పోలక్=పోలునట్లుగా, పెరిఁగియున్నట్టి=వర్ధిల్లియున్నట్టి,కిటిరూపధరునిక్=వరాహరూపముదాల్చినవానిని,ఖుర...శరధిక్= ఖురచతుష్టయ=నాల్గుడెక్కలచేతను చేయబడిన, బిల=గుంటలయిన, చతుశ్శరధిక్ = నాల్గుసంద్రములు కలవానిని, నిన్నుక్, కొలుతుక్ = సేవించెదను.

నీవు వరాహరూపముదాల్చి బ్రహ్మాండము పిక్కటిలునట్లు పెరుగఁగా మి క్కిలి వాఁడు లయిననీరోమములు బ్రహ్మాండమును నుచ్చికొని పైకివచ్చెను. అప్పుడు బ్రహ్మాండము నిగిడిన కేసరములు గల్గిన కడప పువ్వులబంతివలె నుండెనని భావము. గొప్పది యగుబ్రహ్మాండము బంతివలెనున్నదని చెప్పుటచే వరాహరూపము దానికంటెఁ యెక్కుడెట్లు గొప్పదని తెల్లమగుచున్నది. మఱియు నతఁడు మహాభారము గలవాఁ డగుటచే డెక్కలు దిగఁబడు టవలన నేర్పడిన గుంటలందుఁ బ్రళయకాలజలము నిండఁగా నది సముద్ర ములయ్యెనని యర్థము. అతని డెక్కలే సముద్రము లున్నంతప్రదేశమును నావ రించియుండె ననుటచే, నతని శరీరము మిక్కిలి గొప్పదని తెల్లమగుచున్నది.

అవ. నృసింహావతారవర్ణనము.

మ. అతిగంభీర హిరణ్య దైత్యహృదయాహంకార కూపోదరా
పతితస్వర్గ రమాసువర్ణకలశీ ప్రత్యుద్ధృతి ప్రక్రియా
యతపంచాంగుళ లోహయంత్రమగునీహా స్తంబువర్ణింతును
ద్ధతకంఠధ్వనికుంఠితారిహృదయోత్కంఠా నృకంఠీరవా.122

టీ. ఉద్ధత...కంఠా - ఉద్ధత=అతిశయించిన, కంఠధ్వని=కంఠనాదము చే, కుంఠిత=మొక్కపోవునట్లుచేయఁబడిన, అరి=శత్రువులయొక్క, హృద య=మనస్సులోని, ఉత్కంఠా=వేడుకగలవాఁడా! అంతవఱకు నవలీల విష్ణు తుదముట్టింతుమని వేడుకపడుచున్న శత్రువులు నరసింహుని కంఠనాదము విని భయపడి తమయుత్సాహమును విడిచిరని భావము. నృకంఠీరవా=ఓనార సింహ, అతి...యంత్రము—అతిగంభీర=మిక్కిలిలోఁతయిన, హిరణ్యదైత్య= హిరణ్యకశిపు వనెడిరాక్షసునియొక్క, హృదయ=మనస్సులోని, అహంకార= గర్వమనెడి, కూప=నూతియొక్క, ఉదర = గర్భమందు, పతిత=పడినట్టి, స్వర్గరమా = సురలోకరాజ్యలక్ష్మి యనెడు, సువర్ణకలశ = బంగారుపాత్ర యొక్క, ప్రత్యుద్ధృతీ=పైకెత్తుట యనెడి, క్రియా = వ్యాపారమునకు, ఆయత=పొడువైన, పంచాంగుళ=అయిదుకొక్కెములు గల, లోహయంత్ర ము=[illegible] నీహా స్తంబుక =

నీచేతిని, వర్ణింతుర్ = కొనియాడుదురు. ఇట హిరణ్యశబ్దము హిరణ్యకశిపువను పదమునకు బదులుగా వాడఁబడెను. సత్యభామాపదములోని, సత్యపదముచేత సత్యభామపిలువఁ బడుచున్నట్లు హిరణ్యపదముచేత హిరణ్యకశిపుపదము చెప్పఁ బడుచున్నదని యెఱుంగునది. దీనికి 'నామైకదేశేనామగ్రహణ' మ్మనునది ప్రమాణము. హిరణ్యకశిపుహృదయమున నున్నగర్వము లోఁతయిన కూపమువలెను, స్వర్గలోకలక్ష్మి సువర్ణకలశమువలెను, నారసింహుని గోళ్లతోఁగూడిన హాస్త మినుపగాలమువలెను నుండెననుట. ఓనారసింహా! లోఁతయిననూతిలో మునిఁగి యున్న బంగారపు కలశమును గాలముపైకి వెడలించినట్లు నీచే హిరణ్యకశిపుని గర్వమున నడఁగియున్న స్వర్గరాజ్యము నుద్ధరింపఁబడినదని ఫలితార్థము. నరసింహుఁడు వాఁడిగోళ్లతో హిరణ్యకశిపుని హృదయమును చీల్చి చంపి స్వర్గరాజ్యము దేవతలకిచ్చెనని తాత్పర్యము.

అవ. వామనావతారమును నుతించుచున్నాఁడు.

తే. భోగి సహవాస సంబాధకములు భజింతు
భువనధార హస్తంబునఁ కొ బోయు మనుచు
రెంటమాటల బలిఁ బ్రతారించినట్టి
దంభ వామన! మామన కొ స్తాప ముడుపు. 123

టీ. (నీవు) భోగి...ములు - భోగి = సుఖవంతులతో, సహవాస = కూడియుండుటవలనఁగలుగు, సంబంధములు=యోగములు, భజింతు=పొందుదువు. భువనధారర్ = దానోదకధారను, హస్తంబునర్ = నాచేతియందు, పోయుము= విడువుము. ఓబలీ! నీవు సౌఖ్యవంతులలోఁ గలసిమెలసి యుండుటకు నాచేతిలో నుదకధారను వదలుము. నీవుదానములుచేసి నిఖిలసుఖము లనుభవింపుమని భావము. ఇది ప్రకాశితార్థము. ఇందు "భోగి భువన" పదములు శ్లేషించును; భోగమనఁగా, సౌఖ్యమనియు, సర్పకాయమనియు నర్థము. అదికలవాఁడు భోగియనఁబడు. అట్లే "భువన" శబ్దమునకు జలమనియు, లోకమనియు నర్థము. పైనిచెప్పినదానికంతరార్థ మేమనఁగా, ఓబలీ! నీవు, భోగి...ములు-భోగి—

సర్పములతో, సహవాస = కూడియుండుటయనెడి, సంబంధములు = యోగములను, భజింతు = పొందుదువు. భువనధారన్ = లోకములపంక్తిని, హస్తమునన్ = నా చేతియందు, వోయుము, నా చేతికధీనముగాఁజేయుము. ఓబలీ! నీవుదుర్మార్గుఁడవు కాననీ వేలుచున్నలోకముల నాకప్పగించిపాములునివసించునట్టి పాతాళమునకుఁ బొమ్ము, అని యంతరార్థము. అనుచున్ = అనిపల్కుచు, రెంటమాటలన్ = రెండర్థములు గలమాటలచే, బలిన్ = బలిచక్రవర్తిని, ప్రతారించినట్టి ...వామన = మోసపుచ్చిన యోకపటవామనుఁడా, మామనస్తాపము = మాయొక్క మనస్సంతాపమును, ఉడుపు = తొలఁగఁద్రోయుము. నీభక్తుఁడ నగు నా మనోవ్యథ తొలఁగింపుమని భావము.

మ. తఱినాక్రాంత సమస్తలోక బలిదైత్యశ్వంసి యోదేవ నీ
యఱకాలుద్ధతి రాహుమండలము బ్రహ్మాండంబుతో నొత్తినం
గుఱుగుఱ్ఱం చెడసందిబిట్టొరలు నాఘోరాహి నీయంఘ్రికిన్
గిఱుఁజెప్పైన విధంబు నామనములోఁ గీలించి నట్లయ్యెడిన్.

టీ. ఆకాంతసమస్తలోక = ఆక్రమింపఁబడిన సమస్తలోకములు గలవాఁడా, బలిదైత్యధ్వంసి = బలియనెడి రక్కసునిఁ జంపినవాఁడా, ఓదేవ = ఓ వాసుదేవా! తఱిన్ = తగినసమయమందు, నీయఱకాలు = నభోమండలమును గొలుచుటకై యెత్తిననీయఱకాలు, ఉద్ధతిన్ = అతిశయముచే, రాహుమండలమున్, బ్రహ్మాండముతో, ఒత్తినన్ = గట్టిగానదుమఁగా, ఎడసందిన్ = బ్రహ్మాండమునకును, నీకాలికిని మధ్యముననున్నయవకాశమునందు, గుఱుగుఱ్ఱంచున్ = గుఱ్ఱుమనుచు, బిట్టు = గట్టిగా, ఒరలు నాఘోరాహి = ఏడ్చుచున్న కూరుఁడయినయారాహువు, నీయంఘ్రికిన్ = నీపాదమునకు, కిఱుఁజెప్పు = కిఱ్ఱుకిఱ్ఱుమనిధ్వని చేయునట్టి చెప్పు, ఐనవిధంబున్ = అయినట్టి రీతి, నామనంబులోన్, కీలించినట్లు = హత్తుకొనినట్లు, అయ్యెడు. బలియిచ్చిన భూమిని గొల్చుటకు నారాయణుండు త్రివిక్రమావతారమెత్తి యాకాశమండలమును గొలుచుటకై ... యెత్తిన ... రాహుమండలమును బ్రహ్మాం

డకర్పరనుతోఁ బట్టియదుమఁగా, నారాహువు నడుమఁజిక్కిపోయి తప్పించు
కొనశక్తిచాలక గుబ్బుగుబ్బుమనియేడునఁ జొచ్చెను. అప్పుడు నల్లనయి గుబ్బు
పెట్టుచుఁ, గాలినావరించియున్న యారాహువు భగవంతునికిఁ గిబ్బుచెప్పవలె
నుండెనని కవి యుత్ప్రేక్షించెను. అలం. ఉత్ప్రేక్ష.

తే. తిరిగెనఁట జాంబవంతుండు ♦ దేవ నీకు
దైత్యబంధనవేళఁ బ్రదక్షిణంబు
తద్భ్రమీచక్రవలయంబు ♦ దంభవటుక
యుచితబంధనరజ్జువై ♦ యుండకున్నె. 125

టీ. దంభవటుక=కపటబ్రహ్మచారివగు నో వాసుదేవా, దేవ, దైత్యబంధ
నవేళన్=నీవు బలిరాక్షసుని బంధించుసమయమందు, నీకున్,జాంబవంతుండు=
జాంబవఁతుఁడనెడిభల్లూకాధిపతి,ప్రదక్షిణంబు,తిరిగెనఁట=ప్రదక్షిణనమస్కా
రములు చేసెనఁట. తత్ భ్రమీచక్రవలయంబు-తత్=ఆజాంబవంతునియొక్క,
భ్రమీచక్ర=గుండ్రముగాఁదిరుగుటయనెడి వలయంబు, ఉచితబంధనరజ్జువై
=తగినట్టిబంధించుపాశమై, ఉండకున్నె=ఉండకపోవునా, వామనుఁడు బలిని
ద్రాళ్లతో బంధింపలేదు, అయినను గవియట్లుత్ప్రేక్షించుచున్నాఁడు. త్రివిక్ర
ముఁడు బలిని బంధించుసమయమున జాంబవంతుఁడు భగవంతునికిఁ బ్రదక్షిణనమ
స్కారముచేసెనఁట. అతఁడొనర్చినప్రదక్షిణము బలిబంధనరజ్జువై యొప్పచుం
డెనని యూహించెను. జాంబవంతుఁడు-ఇతఁడు బ్రహ్మవలన సంభవించె. ఇతఁడు
భల్లూకాధిపతియై త్రేతాయుగమున రామునకుఁ బంటై లంకనుజయించుటలోఁ
గొంతసాయముచేసి పిమ్మట ద్వాపరమునందుఁ గృష్ణునితోరణంబొనర్చి తుదక
తని భగవంతుండని తెలిసికొని నమస్కరించి జాంబవతి యనుకన్యకనిచ్చి పెండ్లి
చేసెను. అలం. ఉత్ప్రేక్ష.

తే. క్షత్త్రజాతికి నీచేయి ♦ కారణంబు
దత్తయంబున కదియ నిర్దానమయ్యెఁ

గారణమునందవిలయంబు కార్యమునకు
ననుట యుచితంబుగాదె రామావతార. 126

టీ. రామావతార = పరశురామావతారమెత్తినయోభగవంతా! క్షత్త్రిజాతికిన్=క్షత్త్రియవంశమునకు, నీచేయి=నీబాహువు, కారణంబు=జనకము, అనఁగా విరాట్పురుషుని బాహువులవలన క్షత్త్రియు లుద్భవించిరని వేదములుచెప్పుచున్నవి. శ్రు॥ "బాహూరాజన్యఃకృతః" అనియున్నది. తత్క్షయంబునకున్ = దానినాశనమునకును, అదియ = ఆబాహువే, నిదానము= కారణము, అయ్యెన్, కారణమునందు, కార్యమునకున్ = పుట్టినపదార్థమునకు, విలయంబు=నాశనము అనుట. ఉచితంబు, కాదె=యుక్తముకదా? ఓదేవా! క్షత్త్రియజాతి నీబాహువులవలన జన్మించినది. నీబాహువులవలననే తెగటారినది. కార్తవీర్యాదిక్షత్త్రియులు కూరులయి ధర్మోల్లంఘనంబుచేసి లోకములబాధింపుచుండఁగాఁ బరమపురుషుఁడవగు నీవు పరశురామునియం దావేశించి క్షత్త్రియుల నిరువదియొక్కమాఱు జయించి నాశనమును బొందించితివి. కార్యముకారణమునలయ మొందుననుటకు,''అద్భ్యోఽగ్నిర్బ్రహ్మతః క్షత్త్రమశ్మనోలోహ ముత్థితం। ఏషాం సర్వత్రగం తేజః స్వాసుయోనిషుశామ్యతి.'' అను భారతవచనము ప్రమాణము. అలం. అర్థాంతరన్యాసము.

అవ. దశరథరామావతారమును నుతించుచున్నాఁడు.

సీ. తనుసృజించిన విధాతకుఁ బూర్వ రాముండు
లీలాభ్యసన హస్త లేఖనముగఁ
దనవిశ్వభూషణ త్వముతోడ ఖరదూష
ణచ్ఛిదా కేళి యన్వయము నొందఁ
దన్నుఁజింతించు నధ్యాత్మ వేదులు రావ
ణానీక హృన్మోహ మానపడఁగఁ
దనఖడ్గధార ద్రెళ్లిన శంబుకునికీర్తి

తే. దివ్యనామ సహస్రప్రకీర్తినిధియునఁగఁ
దారకబ్రహ్మమనఁ దన కే పేరు మెఱయ
నతిశయిల్లిననీ సప్తమావతార
మహరహంబును వర్ణింతు నే నాదిపురుష. 127

టీ. ఆదిపురుష=బ్రహ్మాదులకుఁగూడ మొదటివాఁడనగు నోపరమేశ్వరా! తనున్ =సప్తమావతారమగు రామునిననుట. సృజించినవిధాతకున్ = సృజించినబ్రహ్మకు, పూర్వరాముండు= పరశురాముఁడు, లీలా=సృజించుటయందలి, అభ్యసన=అభ్యాసముకొఱకయిన, హస్తలేఖనమునకున్ = చేతివ్రాఁతయగుచుండఁగా, లేఖకుఁడు ముందుగాఁ దనచేతికి నేర్పలవడుటకై వేఱొకదానిమీఁద వ్రాసి,తనచేతికట్టిచాతుర్యము లభించినతోడనే ప్రధానమగుదానిని వ్రాయును. శిల్పియుఁ దనకుఁ జాతుర్యమలవడుటకై ముందుగా సామాన్యపు బొమ్మలను చెక్కును. అట్లే బ్రహ్మ నిన్ను సృజింపఁ దలంచి, నీకు ముందుగాఁ బరశురాముని సృజించి నేర్పలవఱచుకొని నిన్ను నిర్మించెనని భావము. ఈచెప్పుటచే రాముఁడు నిరుపమ శౌర్యాదిగుణవంతుఁ డని స్పష్టమగుచున్నది. తన విశ్వభూషణత్వముతోడన్ =తనయొక్క జగంబునకలంకారమగుటతోడ, ఖర...కేళి-ఖర = ఖరాసురునియొక్కయు, దూషణ=దూషణుఁడను రాక్షసునియొక్కయు, లేక, ఖర = క్రూరులయొక్క, దూషణ = దూషణముల యొక్క అనఁగా రజకాదుల దూషణములయొక్క, ఛిదా = ఛేదించుట యనెడి, కేళి=విలాసముతోడి, అన్వయము=సంబంధము, అందన్ =పొందుచుండఁగా, రాముఁడు జగదలంకారమువంటివాఁ డనఁగా లోకములో శ్రేష్ఠుఁడనుట. అట్టిశ్రేష్ఠత్వము వహించినవానికి, దుష్టుల దూషణముల ఖండించుట సముచితమేయనిభావము. రాముఁడు లోకశ్రేష్ఠుఁడై యుదయించి ఖరదూషణాది ఘోరరాక్షసులఁ ద్రుంచెననియు రజకదూషణము మాఁపుటకై సీత నరణ్యమున కంపెననియు ఫలితార్థము. తనున్, చింతించు...వేదులు=ధ్యానించుచుండెడి వేదాంతవిద్యావిదులు, రావణా...మోహామున్ —రావణానీక= రావణునియొక్కయు, సేనయొక్కయు, స్వాంతే=మనస్సునందలి, మోహ

మును = భ్రాంతిని, ఆసపడఁగాన్ = కోరుచుండఁగా, రావణుఁడును వాని సైనికులును, రాముని యస్త్రపాతములకు భీతిం జెంది జగమంతయు రామమయమే మాయనిమోహపడిరి. అట్టిమోహమును వేదాంతవిదులు కోరుచున్నారని భావము. రావణునివంటివానిఁగూడ భయభ్రాంతునిఁ గావించెననుటచే, రాముని నిరుపమానపరాక్రమత్వము వెల్లడియగుచున్నది. సమస్తము రామమయమని మనంబున భావించుటయె యాధ్యాత్మికలక్షణము. తనఖడ్గధారన్ = తన ఖడ్గముయొక్కయంచుచే, త్రెళ్లినశంబుకునకీర్తి = చచ్చినశంబూకుఁడనెడి శూద్రునికీర్తి, కడలి...బంబున్ = సముద్రమందున్న శంఖములసముదాయమును, గెలువన్ = జయింపఁగా, గొప్పవారిచే మరణముగల్గుట యల్పులకుఁ గీర్తికరము. భగవంతుని పూర్ణావతారమగు రాముఁడు లోకకంటకుఁడును, మహాపరాక్రముండు నగు రావణునిఁ జంపుటకై యుదయించి, యట్లొనరించియు, దుర్బలుఁడును, బ్రాహ్మణధర్మముల నాచరించువాఁడును నగు శంబూకునిఁ జంపుటచే నాశూద్రునికి సముద్రి శంఖములమించినధవళకీర్తి కల్గెననిభావము. రామునిచేతఁ జచ్చినవారు ముక్తులగుదురని రామాయణప్రసిద్ధి. అట్లుండ బలహీనుఁడును, బాపియు, గపటవేషధారియునగు శంబూకుఁడు రాముచేఁ జచ్చి ముక్తిచెందుట యతనికిఁ గీర్తికర మని వేఱచెప్పవలయునా ! రాముఁడు రాజ్యమేలుచున్నప్పుడు, శూద్రుఁడగు శంబూకుఁడు బ్రాహ్మణవేషధారియై ధూమపానము చేయుచుఁ దపంబొనరించుచుండఁగా నాయధర్మకృత్యముచే లోకమున విపరీతమరణములు పుట్టెననియు, నప్పుడు రాముఁడు మృతినొందిన బ్రాహ్మణశిశువును బ్రదికింపఁగాఁ బుష్పకమెక్కిపోయి శంబూకుఁగూల్చెననియు నుత్తరరామాయణము. శంబుక మనఁగా కప్పచిప్ప-కప్పచిప్పకు సంకువులకన్న ఎక్కుడుకీర్తియని చమత్కారము. తనపేరు = తననామము, దివ్య...యనఁగన్ — దివ్య = దేవతాసంబంధియయిన, నామసహస్ర = వేయినామములకు, ప్రతినిధి = సమానమయినది. అనఁగా విష్ణునామసహస్రమునకు రామనామము సమానమనిభావము. అనుసట్లుగా తారకబ్రహ్మము = సంసారసాగరమునుండి తరింపఁ జేయునట్టిపరబ్రహ్మము. అనన్ — మెఱయన్ = ఒప్పుచుండఁగా, పార్వతి, పరమే

శ్వరుంజూచి, శ్లో॥ కేనోపాయేనలఘునా, విష్ణోర్నామసహస్రకం। పండితైః పఠ్యతేనిత్యం మహాపాతకనాశనమ్॥ మహాపాపములం దొలఁగించునదైయున్న విష్ణునామసహస్రమును బండితులు నిత్యమును సులభముగాఁ బఠించుమార్గ మేదియని ప్రశ్నించెను. దాని కీశ్వరుఁడు, "శ్రీరామ రామరామేతి రమే రామే మనోరమే, సహస్రనామతేస్తుల్యం రామనామ వరాననే" ఓదేవీ! యేహేతువువలన రామనామము విష్ణుసహస్రనామములకు సమమో, యాహేతువుచే నేను విష్ణుసహస్రమునువిడిచి శ్రీరామరామరామయని క్రీడించుచున్నాను. నీవు నట్లే చేయుమని యీశ్వరుఁడుచెప్పెను. అతి...తారము=అతిశయమయినట్టి నీరామావతారమును, అహరహంబును=ప్రతిదినమును, వర్ణింతును.

సీ. జనకాజ్ఞకును లోక ✱ జనవాదమునకుఁ గా
నుర్వీజ యగులక్ష్మి ✱ నుజ్జగించి
తజునిఁ బుత్త్రునిఁజేసి ✱ తట్టినెయ్యము పొంలె
నజునిపౌత్త్రుండ వై ✱ యవతరిలితి
ధాత్రి నిక్ష్వాకు సంతతి ✱ నుద్భవం బంది
యాశ్రయించిన వారి ✱ కమృతమిత్తు
వాలాయముగ విశ్రవసు కూర్మి ✱ కన్నెకు
విశ్రవస్త్వము గూర్పఁ ✱ వేడ్క పడితి

తే. పెద్దకాలంబు వాసితి ✱ ప్రియవధూటి
ననుజు నొకనాఁడు వాసి దేహంబు దొఱఁగి
తెవ్వఁ డెఱుఁగును నీచంద ✱ మిట్టి దనఁగ
రాజితానేక గుణభద్ర ✱ రామభద్ర. 128

టీ. రాజి...భద్ర—రాజిత=ప్రకాశించుచున్న, అనేక = పెక్కులయిన, గుణ=గుణములచే, భద్ర = మంగళప్రదుఁడా, అనఁగా మంగళప్రదములగు ననేకములగు గుణములు కలవాఁడని భావము. రామభద్ర, జనకాజ్ఞకును,

సీతం(డియనుమతికిని, లోకజ...వాదకును=లోకమున జనులవలనఁ గల్గిన యప వాదమునకును, ఉర్వీజ = భూపుత్త్రి, అగులక్ష్మి = అయినలక్ష్మీదేవిని, ఉజ్జగించి తివి=విడిచితివి. "రాఘవత్వేభవత్సీతా, రుక్మిణీకృష్ణజన్మని" యనెడి వచన ప్రకారము తన్ను నొకప్పుడును విడిచియుండలేనంత ప్రేమ చూపుచున్నను లక్ష్మిని, జనకాజ్ఞ పాలించుటకును, లోకాపవాదము తొలంగించుటకును విడి చెనని చెప్పుటచే రాముని పితృభక్తియు, నిష్కళంకకీర్తియు విశదమగుచు న్నది. తన తండ్రియగు దశరథుఁడు సీతను విడువుమని చెప్పలేదు. అయినను జనకాజ్ఞ వనమునకుఁ గారణ మగుచున్నది. ఆవనవాసము సీతాత్యాగమునకు హేతువగుచున్నది. కాన పరంపరాకారణ మగుచున్నదని యెఱుంగునది. ఒక రజకుఁడు ప్రసంగవశమున సీత లంకానివాసదూషితయని దూషింపఁగా, రా ముఁడు తనకీర్తికి మచ్చరాకుండునిమిత్తము రెండవమాఱు సీతను విడిచిపుచ్చెను. అజునికిన్=బ్రహ్మను, పుత్త్రికిన్=కుమారునిఁగా, చేసితివి=కంటివి, అట్టినెయ్యా ముపొంటెన్=ఆస్నేహముచేత, అజునిపౌత్త్రిండవై=అజమహారాజునకు మను మఁడవయి జన్మించితివి, "అజుని కుమారునిగాఁ బడసినవాఁ డజునికి మనుమఁ డెట్లగు"నని విరోధము. బ్రహ్మను గుమారునిగాఁ బడసినవాఁడనియు, నజమహా రాజునకు మనుమఁ డయ్యెననియు నజపదమునకు రెండర్థములు చెప్పుటచే నా భాసము. ధాత్రిన్=భూమియందు, ఇక్ష్వాకుసంతతిన్=ఇక్ష్వాకుఁ డనురాజు వంశంబున, ఉద్భవంబు, అంది, ఆశ్రయించినవారికిన్, అమృతము = అమృత రసమును, ఇత్తువు, భూమియం దమృతమిచ్చుట యెట్లని విరోధము. ఆవిరో ధము, అమృతమను పదమునకు మోక్షమని యర్థము చెప్పినచోఁ బరిహార మగును. నీవు రాముఁడవయి జన్మించి నిన్నుఁ గొల్చినవారికెల్లను మోక్షసుఖము నిచ్చుచున్నాఁడవనిభావము. వాలాయమున్గాన్=అత్యంతము, విశ్రవసుకూర్మి క న్నెకున్=విశ్రవసుబ్రహ్మకుమారికయగు శూర్పణఖకు, విశ్రవస్స్వము=విశ్రవసు యొక్క ధర్మమును, కూర్పన్=కలిగించుటకు, వేడ్కపడితివి=కుతూహలము చెందితివి. "విశ్రవసుయొక్క ధర్మము నతనికూతునకు సమకూర్చుట యె" ట్లని విరోధము. విశ్రవస్స్వము, పోయిన చెవులుగలవాని ధర్మమని యర్థము

చెప్పుటచే నది పరిహారమగును. రాముఁడు శూర్పణఖ ముక్కును జెవులను గోయించెనని రామాయణము. ప్రియవధూటిక్ =ప్రేమాస్పదురా లగుభార్యను, పెద్దకాలంబు, పాసితివి=విడిచితివి. అనుజుక్ = తమ్ముఁడగు లక్ష్మణుని, ఒకనాఁడు, పాసి, దేహంబు, దొఱఁగితివి=విడిచితివి. ప్రియురాలిని జిరకాలము విడిచి జీవించినవాఁడవు తమ్ముని నొకనాఁడువిడిచి ప్రేమలయుండలేకపోయితివి? ఇట భార్యావియోగముకంటె సోదరవియోగము గొప్పగాఁ జెప్పుటచే రాముని భాతృప్రేమ తెల్లమగుచున్నది. లక్ష్మణుఁడు స్వర్గమున కేఁగిన మఱునాడే రాముఁడు నిర్యాణము నొందెను. నీచందము=నీయభిప్రాయము, లేక, నీరీతి, ఇట్టిది=ఇటువంటిది, అనఁగక్ =అనిచెప్పుటకు, ఎవ్వఁడెఱుఁగును=ఎవఁడుతెలిసికొనఁగలఁడు, నీయభిప్రాయము తెలియనేతెలియనప్పుడు, ఇటువంటిదని స్వరూపనిర్దేశము చేయుట యెట్లని భావము.

తే. కామసమ్మోహితక్రౌంచకఘాతమునకు
వగచి నీచాటుకవి చెంచుకవానిఁ గినిసెఁ
గామమోహిత యగునింతిఁ గష్టపఱుప
ననుజుఁ బురికొల్పితివి నీకుఁ గనుమె రామ. 129

టీ. నీచాటుకవి = నీచరిత్రమును వర్ణించువాల్మీకి, కామ...మునకుక్ — కామ=మన్మథవికారముచే, సమ్మోహిత=మిక్కిలి మోహము నొందిన, క్రౌంచ= క్రౌంచపక్షియొక్క, ఘాతమునకుక్ =కొట్టినందులకు, వగచి=విచారించి, చెంచువానిక్, కినిసెక్ =శపించెను."అనఁగా, మానిషాదప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీస్సమాః। యత్క్రౌంచమిథునాదేక మవధీః కామమోహిత"మ్మని శపించెను. కామమోహిత = కామపీడిత, అగునింతిక్ =అయినస్త్రీ శూర్పణఖను, కష్టపఱుపక్ =బాధించుటకు, అనుజుక్ = తమ్ముని, పురికొల్పితివి, రామ, నీకుక్, తనుమె=యుక్తమా! నీయొద్దనుండు కవికున్నంతదయ యయినను నీకుండవలదా యనిభావము. దుర్మార్గురాలయి నిన్నుమోహించి సీతను ఖేతిల్లఁజేసిన శూర్పణఖుఁ దగినశిక్ష గావించితివని స్తుతి. వ్యాజముచే రామ స్తవమింతుఁ జేయఁబడెనుగాన, అలం. వ్యాజస్తుతి.

అవ. కృష్ణావతారవర్ణనము.

తే. నంద నోద్యానవాటికాంతరము సొచ్చి
వితరణస్పర్ధఁబోలె దైవతకుజంబు
పెఱికి భువిమీఁదఁ బడవైచి పేర్చినట్టి
విక్రమాలంకరిష్ణు శ్రీవిష్ణుఁ గొలుతు. 130

టీ. వితరణస్పర్థన్, పోలెన్ = దానగుణమందలి విరోధముచేతనువలె, నంద...తరము—నందన = నందనమను పేరుగల, ఉద్యానవాటికా=ఉద్యానవనము వీథియొక్క, అంతరము=మధ్యభాగమును, చొచ్చి= ప్రవేశించి, దైవతకుజంబున్=కల్పవృక్షమును, పెఱికి, భువిమీఁదన్, పడవైచి=పడునట్లుత్రోచి, పేర్చినట్టి=అతిశయించిన, విక్రమాలంకరిష్ణున్ = పరాక్రమమునే యలంకారముగాఁ దాల్చుస్వభావముగల, శ్రీవిష్ణున్ = విష్ణుమూర్తిని, కొలుతున్ = సేవింతును. నారదుఁ డిచ్చిన పారిజాతపుష్పములను కృష్ణుఁడు రుక్మిణి కిచ్చెనని సత్యభామ కోపము వహించియుండఁగా దానిఁ దొలంగించుటకై యతఁడు స్వర్గమునకేఁగి పారిజాతవృక్షమును దెచ్చి సత్యభామ యారామమున స్థాపించెను. సత్యభామ కోప ముపశాంతినొందుటకుఁ దెచ్చినపారిజాతమును, సమస్తవాంఛలను దాను భక్తుల కిచ్చుచుండఁగాఁ దనవలె వితరణము సల్పుచున్న పారిజాతమునందు స్పర్ధవహించి దాని నిర్మూలముగాఁజేసి భూమిపైఁ బాఱవైచెనని కవి యుత్ప్రేక్షించె. అలం. ఉత్ప్రేక్ష.

తే. శైశవమునాఁడు కర్పరీశకలపాళిఁ
దెచ్చి కాళింది తరగలఁ ద్రెవ్వవైతు
భావి బాణ భుజాదండ భంజనమున
కభ్యసనమయ్యె నీ కది యబ్జనాభ. 131

టీ. అబ్జనాభ = కమలము నాభియందుఁ గలవాఁడా, శైశవమునాఁడు= చిన్నతనమందు, కర్పరీశకలపాళిన్ = కుండపెంచులసమూహమును, తెచ్చి, కాళిందితరగలన్ =యమునానదీతరంగములను, త్రెవ్వన్ =ఖండితమగునట్లుగా,

సైతువు, బాలురు చిల్లపెంకులు మొదలగునవి తటాకములు మొదలగువానికిఁ గొనిపోయి నీటిమీఁదిభాగమును దగులునట్లు విసరగా నవి వాయువువలన నెత్తుగావచ్చు తరంగములను జీల్చుకొని కొంతదూరముపోయి పడుచుండును. ఇట్లు బాలురాడుకొనుట కలదు. అట్లె కృష్ణుండును జిన్నతనమునందు యమునానదిం జేరి యానదీతరంగములు తెగునట్లుగాఁ జిల్లపెంకులను విసరుచుండెను. అది=ఆవిసరుట, నీకు, భావి...మునకున్ — భావి=ముందువచ్చెడి, బాణ=బాణాసురునియొక్క, భుజాదండ= స్తంభంబులవంటి భుజములయొక్క, భంజనమునకున్ =ఛేదించుటకు, అభ్యసనము=అలవాటు,అయ్యెన్.అలం.ఉత్ప్రేక్ష.

తా. ఓకృష్ణా! నీవు చిన్నతనమునఁ జిల్లపెంకులచే యమునానదీ తరంగములను ఛేదించుట, బాణాసురునిచేతులను ఖండించుటకు నభ్యాసమయ్యెను.

చ. వలపలికన్ను నీకు రవి కే వారిజలోచన చందురుండు దా
పలినయనంబు గర్ణుఁడును కే బార్థుఁడుఁ దత్ప్రియనందనుండు ద
త్కులజుఁడు,వీరొకండొకనికేతోఁగలహింపసహించి తెట్లొకో
వలపలిలోచనాబ్జమును కే వామదృగబ్జము వేఱె యచ్యుతా.

టీ. వారిజలోచన = పద్మలోచనా, అచ్యుతా = నాశరహితుఁడవగునో కృష్ణా! నీకు, రవి = సూర్యుఁడు, వలపలికన్ను, చందురుండు, దాపలినయనంబు = ఎడమకన్ను, కర్ణుఁడు, తత్ప్రియనందనుండు=అ నీకుడినేత్రమయిన సూర్యుని కుమారుఁడు, పార్థుఁడు=అర్జునుఁడు, తత్కులజుఁడు=నీకెడమనేత్రమగు చంద్రవంశమునందుఁ బొడమినవాఁడు, వీరు = ఈకర్ణార్జునులు, ఒకండు, ఒకనితోన్, కలహింపన్ = పోట్లాడుచుండఁగా, సహించితవి, ఎట్లొకో = ఏరీతినోర్చితివో, వల...ముతి = పద్మమువంటి నీకుడికన్ను, వామదృగబ్జము= పద్మవంటి యెడమకన్నును, వేఱె=వేఱయినవా? రెండునేత్రములును నీకు సమానమేకదా! మఱియు నీకుడినేత్రము కుమారుఁడయిన కర్ణుఁడు, మనుమఁడు కదా! మఱియు సమీపబంధువు- అర్జునుఁడు ఎడమనేత్రమయిన చంద్రుని కులమందుఁ బుట్టినవాఁడు, కాన వాఁడు దూరపుబంధువు. ఇట్లుండ దూరపుబంధువగు నర్జునునిపక్ష మవలంబించి సమీపబంధువగు కర్ణునిఁ గూల్చుట సముచితము

కాడని నింద. నీవు భక్తవత్సలుఁడవు కాన దూరపుబంధుఁడగు నర్జునుడు ధర్మమార్గానువర్తియు, భక్తుండునగుటచేత రక్షించితివి. సమీపబంధువైనను నధర్మవర్తియగు కర్ణునిఁ గూల్పించితివి. గుణములును ధర్మవర్తనమును గలవారే నీకుఁ బ్రియులుకాని కేవలబంధుత్వముచేత నగువారు కారని స్తుతి. అలం. వ్యాజస్తుతి.

తా. ఓకృష్ణా! నీకు సూర్యుండును జంద్రుండు కుడియెడమ నేత్రము లగు చుందురు. నీకీ రెండు నేత్రములు సమానములేకదా! ఇట్లుండఁగా నీకుడికంటికిఁ బ్రియకరసూనుఁడైన కర్ణుఁడును, నీయెడమకన్నగు చంద్రుని వంశజుండగు నర్జునుండును బోరుచుండఁగాఁ జూచి నీవెట్లు సహించితివి.

తే. అమరపతిసూను నిర్జించి తార్కిఁ గూడి
దైత్యమర్దన! రామావతారవేళ
నామనఃక్లేశ ముడుగనే యార్కి నడఁచి
తమరపతిసూనుఁ గూడి కృష్ణావతార. 133

టీ. దైత్యమర్దన = దైత్యులను సంహరించెడి యో విష్ణూ? రామావతారవేళన్ = దశరథరాముఁడవై జన్మించినప్పుడు, ఆర్కిన్ = సూర్యపుత్త్రుఁడయిన సుగ్రీవుని, కూడి, అమర...సూనున్ = ఇంద్రపుత్త్రుఁడయిన వాలిని, నిర్జించితివి= జయించితివి, కృష్ణావతార=కృష్ణావతారమెత్తిన యో భగవానుఁడా, ఆమనః క్లేశము=అయింద్రపుత్త్రునకున్న మనోదుఃఖము, ఉడుగనే=నశించుటకే, అమరపతిసూనున్ = ఇంద్రపుత్త్రుఁడయిన యర్జునుని, కూడి, ఆర్కిన్ = సూర్యపుత్త్రుఁడగు కర్ణుని, అడఁచితి=సంహరించితివి. ఓ యీశా! నీచేష్ట లతివిచిత్రములు. రామావతారమున రవిపుత్త్రునిఁగూడి యింద్రపుత్త్రునిఁ గూల్చితివి. కృష్ణావతారమున నింద్రపుత్త్రునిఁగూడి సూర్యసూనునిఁ జంపితివి. ఇందువలన దుష్టత్వ సాధుత్వములను బురస్కరించుకొనియె సంహారమును బాలనమును జేయుదువు. నీకుఁ బక్షపాతము లేదని భావము. అలం. వ్యాజస్తుతి.

తే. దైత్యమర్దన ! శ్రీవత్సధారణంబు
పొసఁగు దేవర ! శ్రీవల్లభుండ వగుటఁ
దామరస నేత్ర ! నీవు రాధా ప్రియుండ
వకట ! రాధేయుఁ జంపించు టర్హమగు నె. 134

టీ. దేవర, దైత్యమర్దన ! దైత్యులమర్దించిన యో రమేశా! శ్రీవల్లభుండవు= శ్రీకిఁబ్రియుండవు, అగుటన్ = అయియుండుటంబట్టి, శ్రీవత్సధారణంబు=శ్రీదేవి కుమారునిఁ జేరఁదీయుట, (శ్రీవత్సమనెడి చిహ్నమును ధరించుట) పొసఁగున్=ఒప్పును. తామరస నేత్ర=పద్మములవంటి నేత్రములుగలవాఁడా, నీవు, రాధాప్రియుండవు = రాధకుఁ బ్రియుండవు, అకట = అయ్యయ్యో, రాధేయున్=రాధకుమారుని, చంపించుట, అర్హము, అగునే, ఓదేవా! నీకృత్యము లందుఁ బక్షపాతమున్నది. శ్రీదేవికి వల్లభుండవయితివి గావున శ్రీవత్సమును జేరందీసితివి. దీనివలన నీకుఁ బ్రియులగువారిని జేపట్టుదువనుట నిశ్చయము. ఇట్లుండఁగా నీవు రాధకుఁగూడఁ బ్రియుండవే కదా, ఆరాధకుమారునిఁ జంపించుట యేటిన్యాయము, అని నింద. ఓదేవ! నీవు శ్రీవత్సమనెడి లాంఛనమును దాల్చినవాఁడవు. శ్రీదేవికి మనోహరుఁడవు. మఱియు రాధయనెడి యొక గోపికకు వల్లభుండవనియు, దురాత్ముఁడగు కర్ణునిఁగూల్చితివనియు, స్తుతి. రాధ కర్ణుని పెంపుడుతల్లి, కావున నతనికి రాధేయుఁడనెడి నామము కల్గినది. అల. వ్యాజస్తుతి.

అవ. ఈ పద్యమునందు బలరాముని నుతించుచు శ్లిష్టపదముల చేతఁ జంద్రునకును బలరామునకు నర్థము వచ్చునట్లు వర్ణించుచున్నాఁడు.

తే. కుముద బాంధవ ! రేవతీరమణ ! భద్ర
కామపాల, శరన్మేఘ గౌరవర్ణ
త్రిజగతీలోచనోత్సవ, దేవ నీకు
నందమైయుండు నీలాంబరాకలనము. 135

టీ. బలరామార్థము, కుముద బాంధవ=కుముదులకు ... బంధు

వగువాఁడు, బలరాముఁడు శేషుఁడే కాన నాగరాజ సంబంధము సరిపడు చున్నది. రేవతీరమణ = రేవతియను పేరుగల యువతికిఁ బ్రియుఁడా, భద్ర =మంగళదాయకా, లేక బలభద్రుఁడను నామముగలవాఁడా, కామపాల= భక్తుల కోర్కులను బూరించువాఁడా, శరత్...వర్ణ—శరత్ = శరత్కాల సంబంధియగు, మేఘ = మేఘమువలె, గౌర = తెల్లని, వర్ణ =దేహచ్ఛాయగల వాఁడా, త్రిజ...త్సవ=మూఁడు జగములకును నేత్రపర్వము లొనరించువాఁడా, దేవ, నీకు, నీలాంబరాకలనము=నల్లనివస్త్రమును స్వీకరించుట, అందమైయుఁ డుఁ =అందముగానుండును, తెల్లని యొంటిపై నల్లని వస్త్రము మిక్కిలి రాణిం చునని భావము. "నీలాంబరోరౌహిణేయః" అని కోశము. చంద్రపక్షార్థము— కుముద...ధవ=తెల్లకలువలకుఁజుట్టమా, రేవతీరమణ=రేవతీనక్షత్రమున కధిపతీ, భద్ర, కామపాల = మన్మథునిఁ బోషించువాఁడా, శర...వర్ణ =శరత్కాల మేఘమువంటి వర్ణముగలవాఁడా, త్రిజ...త్సవ = ముల్లోకముల నేత్రముల కానందము గలిగించువాఁడా, దేవ, ఓచంద్రా, నీకు, నీల...నము=నల్లనియాక సమునఁ బరిభ్రమించుట, అందమైయుండును. అలం. శ్లేషము.

క. బలరామ కృష్ణ సంజ్ఞలఁ
దెలుపు నలుపునైన దివ్యతేజంబులతో
నిలమీఁద నవతరించిన
జలజాక్షునినెఱులు శర్మసౌరభ మొసఁగున్. 136

టీ. బలరామ...సంజ్ఞలఁ = బలరాముఁడు, కృష్ణుఁడు ననెడి నామము లతో, తెలుపు...లతోఁ = తెల్లనిదియు, నల్లదియునయిన దేవతాసంబంధి యగు తేజములతోఁగూడ, బలరాముఁడు తెల్లని దేహచ్ఛాయతోను, గృష్ణుఁడు నల్లని దేహచ్ఛాయతోను, నని భావము. ఇలమీఁదఁ = భూమియందు, అవత రించిన... నెఱులు=పుట్టిననారాయణునియొక్క కేశములు, శర్మసౌరభముఁ= సౌఖ్యాతిశయమును, ఒసఁగుఁ=కల్గించుఁగాక, నారాయణుఁడు జార్చిన తెల్ల నిదియు, నల్లనిదియునగు రెండు వెండ్రుకలును బలరామ కృష్ణరూపంబులఁ దాల్చెననియు, తద్రూపమునొందిన యా వెండ్రుకలు సుఖమొసంగుఁగాక యని.

యుఁ బ్రార్థనము. నారాయణునందు జార్చిన వెండ్రుకలు బలరామ కృష్ణులయి రనుటకుఁ బ్రమాణము. విష్ణుపురా:- "ఉజ్జహారాత్మనః కేశౌ సితకృష్ణౌ తథా మునే"! యను దానిచేతను, "సచాపి కేశౌ హరిరుజ్జహ్రే శుక్లమేకమపరం చాపికృష్ణం । తౌ చాపి కేశావిశతాం యదూనాం కులే స్త్రియౌ రోహిణీందేవకీంచ, తయోరేకో బలభద్రో బభూవయోసౌ శ్వేతస్తస్య దేవస్య కేశః కృష్ణోద్వితీయః కేశవస్సంబభూవ కేశోయో సౌవర్ణితః కృష్ణవర్ణః" యనెడి భారతవచనముచేతను, తెలియఁదగినది.

తే. ఏక, యద్వయవాది, త్రయీవిదూర
యనవగీత చతుర్విధ ఖ్యాతిమార్గ
పంచబాణారి! షడభిజ్ఞ! పరమపురుష
బుద్ధ సంపత్పరంపరావృద్ధి యొసఁగు. 137

టీ. ఏక = ఏకాకారమైన జ్ఞానసంతతియే మతముగాఁ గలవాఁడా! ఇట మూలములోనున్న "ఏకచిత్తతతి" అను పదార్థమును నిందున్న యేకపదముచే లక్షింపవలయును. అంతియకాని "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" యను శ్రుత్యర్థ ప్రకార మొకఁడవని యర్థముచెప్పరాదు. ఏమన వేదప్రామాణ్య మొప్పని యతనికిఁ దదుక్తార్థమెట్లు సంఘటించు? బుద్ధుఁడు నారాయణావతారమే కనుక, నారాయణబుద్ధిచే నతని నట్లు స్మరింతుమనిచెప్ప వలనుపడదు. బౌద్ధమత పరిభాషచేతనే నుతించుచున్నట్లు గ్రంథకర్త కభిప్రాయము చెప్పక తీఱదు. లేనిచోఁ దక్కిన విశేషణములు విపరీతముకానచ్చును. ఈయభిప్రాయమునే నారాయణీయవ్యాఖ్యానములో స 21-87. శ్లోకవ్యాఖ్యానమున విశదీకరింపఁబడియె. జ్ఞానసంతతితక్క వేఱొక్కటి లేదన్న మత మవలంబించిన వాఁడు కావునసే, అద్వయవాది = రెండవవస్తువులేదని వాదించువాఁడు-బాహ్యములయిన ఘటపటాది వస్తువుల భేదము లసత్యములని ప్రతిపాదించి యొక్క జ్ఞానాకారత్వమే సత్యమని యంగీకరించిన వాడవుటంబట్టి యతని కద్వయవాది పదముచెల్లును, త్రయీవిదూర = వేదప్రామాణ్య మంగీకరింపక పోవుటచే వేదములకు దూరము [illegible] అనవగీత = చెప్ప

బడని, అనఁగా నంగీకరింపఁబడని యని భావము. చతుర్విధ = నాలుగు విధము లగు, ఖ్యాతిమార్గ = జ్ఞానరీతులుగలవాఁడా, సత్ఖ్యాతి నంగీకరించు సాంఖ్యమత సిద్ధాంతమును, అసత్ఖ్యాతి నొప్పెడి వేదాంతుల సిద్ధాంతమును, సదసత్ఖ్యాతి నవలంబించెడి మీమాంసకుల సిద్ధాంతమును, ననిర్వచనీయ ఖ్యాతినొప్పెడి యద్వైతుల సిద్ధాంతమును నిరాకరించినాఁ డనుట, "ఇదంసర్వం శూన్యం శూన్యం" అనెడి బౌద్ధసూత్ర మవలంబించిన సర్వశూన్యవాదుల మతమే అయినను సర్వశూన్యవాదులనఁబడు మాధ్యమికుల మతముగూడ బౌద్ధసిద్ధాంతములలోఁ జేరినదే కావున నాయర్థమును సంగ్రహింపఁగవి యిట్లు చెప్పెను. "నస న్నాసన్నసదసన్నచా ప్యనుభయాత్మకమ్ । చతుష్కోటి వినిర్ముక్తం తత్త్వం మా ధ్యమికావిదుః" అని మాధ్యమిక బౌద్ధమతము, పంచబాణారి = కాముని జయించినవాఁడా, "మారజిల్లోకజిజ్జినః" అని కోశము, షడభిజ్ఞ =ఆఱయిన జ్ఞానప్రకారములుకలవాఁడా, ఆయాఱు జ్ఞానప్రకారంబు లేవి యనిన, దేశాంతరమందున్న వస్తువులను సైతము చూచుటయు, దేశాంతరములందున్న శబ్దంబును గూడ వినుటయు, బూర్వజన్మస్మృతియు, నితరులహృదయమును దెలిసికొనుటయు, నవిద్య, నస్మి, రాగము, ద్వేషము, అభినివేశము, నాఁ బడునైదు క్లేశములను బరీక్షించుటయు, నణిమాది సిద్ధులును, పరమపురుష = ఓపూజ్య పురుషా! బుద్ధ=బుద్ధావతారుఁడా! సంప...వృద్ధిక్ =సంపదలయొక్క యభివృద్ధిని, ఒసఁగుము=ఇమ్ము, వేదములనమ్మక వానికి విరుద్ధముగ వర్తించుబుద్ధుఁడు మనకు దేవుండెట్లులగును ? అతఁడు మనకెట్లు స్తోత్రపాత్రుఁడగును ? అని యడుగ వచ్చును, పూర్వము దైత్యులు వేదముల ననుసరించి వేదోక్త కర్మములను యథోక్తముగా నాచరించి మహాశక్తిమంతులై దేవతలను బరాభవింపఁగా వారు విష్ణుని శరణుచొచ్చిరి. అప్పుడు నారాయణుఁడు వారి ననుగ్రహించి బుద్ధరూపమున నవతరించి వేదమునకు విపరీతార్థములుచెప్పి మోహింపఁజేసి శక్తిహీనులఁగాఁ జేసెను. అప్పుడు సురలచే నా రాక్షసులు సులభముగా జయింపఁబడిరి.

తే. బుద్ధ ! నీగట్టిహృదయసంస్పృష్టము ద్రాక్షి

కుంఠితములయ్యె మరునంప ♦ కోలలెల్ల
మొద్దువోయికదా యిప్డు ♦ మురవిరోధి
యలరులెల్లను వర్తులా ♦ స్యంబు లయ్యె. 138

టీ. బుద్ధ=ఓబుద్ధదేవా! మరు... లెల్లన్ =మన్మథునియొక్క, బాణసమూహములన్నియు, నీగట్టి...టను - నీసంబంధియుఁ బెట్టైనంటిదియునగు హృదయమును, తాఁకి, కుంఠితములు=మొక్కవోయినవి, అయ్యెన్, మురవిరోధి=మురాసురునకు శత్రు వగునోదేవా, మొద్దువోయి, కదా = కుంఠితములగుటనే కదా,అలరులు=పువ్వులు, ఎల్లను, వర్తులాస్యంబులు=గుండ్రని మొగములుగలవి, అయ్యెన్, మొదటమన్మథునిబాణములు బాణములేకాన సూదులవలె వాఁడిగలవయి యుండెను. అవి నీధైర్యకంచుకమును దాఁకుటచే మొక్కవోయి గొడుగువలె గుండ్రని యాకారమును గలవగుటచేత నాబాణములు పుష్పరూపములయ్యెను. వికసించిన పుష్పములు స్వతస్సిద్ధముగానే వర్తులాకారము లయియుండఁగా నావర్తులాకారత్వము బుద్ధునిధైర్యకంచుకమునం దాఁకుటచేతనే మొక్కపోయి యట్లుండెనని యుత్ప్రేక్షించెను. బుద్ధునివంటి జితేంద్రియుఁడు వేఱొకఁడులేఁడని భావము. అలం. ఉత్ప్రేక్ష.

తే. ముఖ్యచతురాననుఁడ వీవు ♦ మునిశరణ్య
గౌణచతురాననుం డల ♦ కమలభవుఁడు
నీవు సర్వజ్ఞుఁడవు బుద్ధ ♦ దేవ! నిజము
శంభు సర్వజ్ఞుఁడగుట లౌకికోక్తి వృత్తి. 139

టీ. మునిశరణ్య=మునులను రక్షింపసాధువగు నో దేవా! నీవు, ముఖ్యచతురాననుఁడవు=వాస్తవిక చతురాననుఁడవు, నీకుఁజతురమగువాక్కులు స్వతస్సిద్ధముగాఁగలవాఁడవు కాన ముఖ్యచతురాననత్వము నీకుఁదగియున్నది. మఱియు, ముఖ్య...డవు - ముఖ్య=అభిధావృత్తిచేఁజతురాననుఁడవు, నేర్పగువచనములు నీకుసహజములగుటచేఁ జతురాననశబ్దమునీకు వాస్తవముగా నభిధాయకమగుచున్నది. అలకమలభవుఁడు=ఆబ్రహ్మ, గౌణచతురాననుండు= గుణసంబంధము

చేవచ్చిన చతురములగు వాక్యములుగలవాఁడు కాని వాస్తవముగా నట్టివాఁడు కాఁడు. ఓదేవా! నీవిచ్చినసామర్థ్యముచే నీగుణవర్ణనమందుఁ జతురములగు టంబట్టి యతనికిఁ జతురాననుఁడను, పేరుగలిగినది. అంతియకాని నాలుగుముఖములుండుటచేతఁగాదని తెలియవలయును. బుద్ధదేవ, నీవు, నిజము=సత్యముగా, సర్వజ్ఞుఁడవు=సమస్తమును దెలిసినవాఁడవు. శంభు=శంకరుఁడు, లాక్షణికవృత్తిన్=లక్షణావృత్తిచేత, సర్వజ్ఞుఁడు, ఆసర్వజ్ఞశబ్దమభిదావృత్తిచేనిన్నే చెప్పును. మఱి శివుని కెట్లుకలిగెనన లక్షణావృత్తిచేఁ గలిగెనని భావము. ఈ చెప్పుటచే బుద్ధుఁడు బ్రహ్మశంకరులకంటె నుత్కృష్టుఁడని భావము. అలం. అపహ్నవము.

తే. జ్ఞానకర్మేంద్రియోపాధి సంప్రభూత
దశమహాకల్కనీహార దశశతాంశు
దశమదివ్యావతారు నత్యంతనియతిఁ
గల్కిదేవుని నినుఁగొల్తుఁ గైటభారి. 140

టీ. కైటభారి=కైటభుఁడనెడి రక్కసునిఁ జెండాడినవాఁడా, జ్ఞాన... అంశున్ - జ్ఞాన= జ్ఞానేంద్రియములయొక్కయు, కర్మేంద్రియ=కర్మేంద్రియములయొక్కయు, ఉపాధి=ఉపాధివలన,సంప్రభూత=పుట్టిన, దశ=పదియైన, మహాకల్క=మహాపాపములనెడి, నీహార=మంచునకు, దశశతాంశు=సూర్యునివంటివాఁడును, దశమ... తారున్=పదవయవతారమెత్తినవాఁడు, ఈచెప్పుటచే బలరామ కృష్ణుల నొక్కయవతారముగానే భావించుకొనవలెను. అగు, కల్కిదేవునిన్, నిను, అత్యంతనియతిన్ = అధికమయిననిష్ఠతోడ, కొల్తున్ = సేవింతును. జ్ఞానేంద్రియములు, త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము, కర్మేంద్రియములు, వాక్కు, పాణి, పాదములు, పాయువు, ఉపస్థ.

తా. ఓకైటభాంతకా! పదియింద్రియముల వ్యాపారమువలన జనించిన పది మహాపాపములను సహస్రకరుఁడగు సూర్యుఁడు మంచునుంబోలె నశింపఁజేయుచుఁ బదవయవతారమైన కల్కిదేవుని

క. విశ్వవ్యాప్తయశోని
త్యైశ్వర్య సమృద్ధి విష్ణుకీ యశుఁ డనునామం
బీశ్వర కల్కిసమాహ్వయ
విశ్వసదర్థమయి చెల్లు నీజనకునకున్. 141

టీ. ఈశ్వర=జగన్నియామకా, కల్కిసమాహ్వయ = కల్కియను నామముగలవాఁడా, నీజనకునకున్=నీతండ్రికి, విష్ణుయశుఁడు, అనునామంబు=అనెడిపేరు, విశ్వ...సమృద్ధి—విశ్వ=అంతటను, వ్యాప్త = వ్యాపించిన, యశః = కీర్తియొక్క, నిత్య=స్థిరమయిన, ఐశ్వర్య=సంపదయొక్క, సమృద్ధిన్ = పెంపుచేత నే, విశ్వసదర్థము=జీవించినయర్థముగలది, అనఁగా సార్థకమయినదనుట. అయి, చెల్లున్, మొదట నీతండ్రికి విష్ణుయశుఁడనెడిపేరు వ్యర్థముగా నుండెను. కాని విష్ణుండవగునీవతనికడుపునఁబుట్టి కీర్తిదెచ్చితివి కాన, యతఁడు విష్ణుయశుండని పిలువఁబడుచున్నాఁడు. విష్ణుయశుఁడనుమాటకు, కల్కిమూర్తి యతనికి గల్గుటచే వ్యాపనశీలముగల కీర్తివాఁడని వ్యుత్పత్త్యర్థము.

తా. ఓకల్కిమూర్తీ! నీజనకునకు విష్ణుయశుండను నామము నీవుదయించి కీర్తితెచ్చుటచేత నే సార్థకమయినది.

క. కురువీరపంక్తికంధర
హిరణ్యకశిపుల జయించితీ వంబురుహోద
దర! మూఁడవతారంబుల
నరహరి లీలావిడంబనప్రౌఢుఁడ వై. 142

టీ. అంబురుహోదర = పద్మమువరమందుఁగల యో పరమేశా! మూఁడవతారములందు, నర...డవై - నర=అర్జునునియొక్కయు, హరి=నారాయణునియొక్కయు, లీలా=చేష్టలను, విడంబన = అనుకరించుటయందు, ప్రౌఢుఁడవై=నేర్పుగలవాఁడవై, కురువీర=భీష్మాదివీరులను, జయించితివి. కృష్ణార్జునులరూపమున భీష్మాదులను సంహరించితివని భావము. నర...పవై=నరవానరుల వ్యాపారము నవలంబించి, పంక్తికంధరున్ = రావణుని, నర...డవై=నరసింహ

మూర్తి యొక్క వ్యాపారమునవలంబించి, హిరణ్యకశిపులన్, జయించితివి, నరహరి శబ్దమునకు, ఇట ఒకమాఱు, కృష్ణార్జునులనియు, నొకమాఱు, నర వానరులనియు, మఱియొకమాఱు, నరసింహుఁడనియు నర్థము గ్రహించునది.

తే. అర్జునచ్ఛేద మొనరించి తర్ధచక్ర
సన్నిభం బైన శితపరశ్వధము చేత
సర్వలోకేశ సంపూర్ణ చక్రధార
బాణ భంజన మొనరింప బరువె నీకు. 143

టీ. సర్వలోకేశ = సమస్తలోకములకు నధిపతివగు నోయీశ్వరా, అర్ధ చక్రసన్నిభంబు=చక్రముయొక్క సగముభాగముతో సమానమైనది, ఐన... చేతన్ =అయినట్టి వాఁడియైన గండ్రగొడ్డంటిచేత, అర్జునచ్ఛేదము = కార్త వీర్యునిఖండించుటను, ఒనరించితివి=చేసితివి. సంపూర్ణ ... ధారన్ =పూర్ణ మగు చక్రముయొక్క యంచుచే, బాణభంజనము= బాణాసురవధను, ఒనరింపన్= చేయుటకు, నీకున్, బరువే=భారమా? అర్ధచక్రాకారముగల గండ్రగొడ్డంటి చేతనే వేయిభుజములు గలకార్తవీర్యుని ఖండింపఁగల్గినప్పుడు పూర్ణమగుచక్ర ముచే వేయిమాత్రమే చేతులు గలబాణుని భంజింప నీకుఁ గష్టకార్యముకాదు. పరశురాముఁడ వయి కార్తవీర్యునిఁ జంపితి వనియు, కృష్ణుఁడ వయి చక్రముచే బాణుని జంపితి వనియు భావము. అలం. అర్థాపత్తి.

తే. ప్రథమపరమేష్ఠి వైననీ ప్రకృతియందు
శేషఫణిరాజ వయిన నీ శిరమునందుఁ
గపటబాలుండ వయిననీ కడుపునందు
విశ్వములు పండు నని నాథ విందుశ్రుతుల. 144

టీ. నాథా=ఓయధీశా! ప్రథమపరమేష్ఠివి=మొదటిబ్రహ్మవు, ఐననీప్రకృతి యందున్=అయినట్టి నీమాయయందు, శేషఫణిరాజవు=శేషుఁడనెడిసర్పనా యకుఁడవు, అయిననీశిరమునందున్ = అయినట్టి నీతలయందు, కపటబాలుం డవు=కృత్రిమబాలకుఁడవు, అయిన...నందు=అయినట్టినీగర్భగోళమందును,

విశ్వములు=భువనములు, పండుర్ = శయనించియుండు, అని, శ్రుతులర్ =వేదములందు, విందుర్ =వినుచున్నాను. భువనములు, సృష్టికి బూర్వమునఁ బ్రకృతియందేయుండును. సృజింపఁబడినపిమ్మట శేషుఁడు వానిని తలతో మోయుచున్నాఁడు. ప్రళయమునందు వానిని నీ కడుపులో నుంచుకొని వటపత్రమున శయనించియున్నావు అని సృష్టికిఁ బూర్వమును, సృష్టి కనంతరమును, ప్రళయమునందును లోకము లెచ్చటనుండునో యిందుఁ దెలుపఁబడె. ఈచెప్పుటచే భగవంతుఁడు సృష్టిస్థితిలయకర్తయని తెలుపఁబడెను.

క. సంసారినికరమానస
సంసద్భవనావకరరజశ్శోధని యో
కంసారి నీపదాబ్జని
నంసాపరిశుద్ధి బుద్ధినైపుణిదలఁపన్. 145

టీ. ఓకంసారి=కంసునిఁజంపిన యోకృష్ణా ! బుద్ధినైపుణిర్ = బుద్ధిచాతుర్యముచే, తలఁపర్ =ఆలోచింపఁగా, నీపదా...శుద్ధి - నీపదాబ్జ = నీపాదపద్మములయొక్క, నినంసా=నమస్కరించుటయందలి తలంపుయొక్క, పరిశుద్ధి = నైర్మల్యము, సం...ధని—సంసారి = సంసారమందున్నవారియొక్క, నికర = సమూహముయొక్క, మానస = మనస్సనెడి, సంసద్భవన = సభామందిరమునందున్న, అవకరరజః=రాగద్వేషాదులను గల్గించు రజోగుణమనెడి పరాగమును, శోధని=తుడుచునట్టిది. పలువురు జనుల సంబంధముచే సభామందిరాదులందు సంభవించుచున్నపరాగమును జీపురు శుభ్రపఱచునట్లు, భార్యాపుత్రులయొక్కయు, మిత్రామిత్రులయొక్కయు సంబంధము సర్వదా గలుగుచుండుటచే, సంసారుల మనమందు సంభవించెడి రాగద్వేషాది హేతువగు రజోగుణమును నశింపఁజేసి మనంబులను నిర్మలంబులుగాఁ జేయునది నీపాదధ్యానముకంటె వేఱొండులేదని భావము.

తే. ధర్మబీజ ! వియన్నదీశీతపాద !
కామితార్థప్రదానైకకల్పవృక్ష !

కామజనక ! చిదాత్మ ప్రకాశరూప !
కమలనాభ ! చతుర్వర్గ గతివి నీవ. 146

టీ. ధర్మబీజ=ధర్మమునకుఁ గారణభూతుఁడవు, వియత్ ...పాద—వియన్నదీ=గంగానదికి, తాత=జనకమగు, పాదచరణములు గలవాఁడా, లోకములను బవిత్రింపఁజేసెడి గంగానదిని నతని పాదములు పుట్టించినవనుటచేఁ దత్పాదములు పరమపావనములని తెలియవచ్చుచున్నది. కామి...వృక్ష—కామిత=కోరఁబడిన, అర్థ=ధనాదులను, ప్రదాన=ఇచ్చుటయందు, ఏక=ముఖ్యమగు, కల్పవృక్ష=కల్పవృక్షమువంటివాఁడా, కల్పవృక్షమువలెఁ గోరినకోర్కు లిచ్చుచున్నాఁడవు. ఈచెప్పుటచే నర్థపురుషార్థదాతయనుట స్పష్టము. కామజనక=కామునిపుట్టించినవాఁడా, చిత్ ...రూప—చిత్=జ్ఞానమే, ఆత్మ=స్వరూపము గాఁగల, ప్రకాశరూప=కాంతియే మూర్తిగాఁగలవాఁడా, అనఁగా జ్ఞానరూపమగు ప్రకాశముగలవాఁడనుట. లేక, చిత్ ...రూప—జ్ఞానరూపమగు, నాత్మప్రకాశమే స్వరూపముగాఁగలవాఁడా! ఈ చెప్పుటచే మోక్షపురుషప్రదాతయని తెల్లమగుచున్నది. కమలనాభ=ఓ నారాయణా! నీవ, చతుర్వర్గ గతివి=నాలుగు పురుషార్థములకు దిక్కగువాఁడవు.

తా. ఓ దేవా? నీవు ధర్మమును నిష్టపదార్థములను, గామమును, మోక్షమును, సమకూర్చుచుంటివి. కావున ధర్మార్థకామ మోక్షములకు నీవే యాధారుఁడవు.

తే. విశ్వరూప ! భవద్భూరి విభవమహిమ
యెంత వర్ణింపఁజాలు మా యీమనంబు
ప్రాఁత పైచీరచెఱఁగున బడుగువాఁడు
హేమశైలంబు చిదిపి ముడుచు ? 147

టీ. విశ్వరూప = ప్రపంచమే రూపముగాఁ గలవాఁడా, భవత్ ...మహిమ—భవత్=నీయొక్క, భూరి=గొప్పదగు, విభవమహిమ = సామర్థ్యాతిశయమును, మాయీమనంబు, ఎంత...చాలు = ఏపాటివర్ణింపఁగలము, బడుగు

వాఁడు=నిఱుపేద, ప్రాతపైచీరచెఱఁగునన్ =చినిఁగిన పైవస్త్రముయొక్క కొన యందు, హేమశైలంబున్ =బంగారుకొండను, చిదిపి=శిథిలముగాఁజేసి, తాలు ఎన్నిముడుచున్ = ఏపాటి మూటఁ గట్టును.

తా. నిఱుపేద బంగారపుఁ గొండను ముక్కలుగాఁ జేసి పైవస్త్రమున నన్నింటినిగాక కొన్నింటినిమాత్రమే మూటఁగట్టు చందంబున, మా మనస్సు లనంతములగు నీ మహిమలలో నొక కొన్నింటినిమాత్రమే గ్రహింపఁ జాలును. అలం. దృష్టాంతము.

వ. అని యనేకప్రకారంబులఁ బ్రస్తుతించి నమస్కరించె. ఇవ్విధంబున దేవతార్చనం బొనరించి, భోజనకార్యంబులు దీర్చి విజిత వైజయంతం బగుశుద్ధాంత కేళీసౌధం బెక్కి, విహిత కులదేవతాభక్తియుఁ, గృతభుక్తియు నగు దమయంతీ మహాదేవితోడం గూడె. అనంతరంబ. 148

టీ. ...విజితవైజయంతంబు=జయింపఁబడిన దేవేంద్రుని మేడగలది, విహిత...భక్తియు = చూపఁబడిన యిలువేల్పులందు భక్తిగలదియు, కృతభుక్తియు=చేయఁబడిన భోజనముగలదియు, శేషము సులభము.

శా. ఆరామారమణుల్ రమాసతియు దైత్యారాతియుంబోలె శృం
గారక్రీడలఁ బ్రొద్దుపుచ్చిరి వధూగంధర్వ విద్యాకళా
కీరాలాపకలాప కోకిల కుహూకేళీమయూరాంగనా
చారీమండల తాండవార భటికాసంరంభ సంభావనన్.

టీ. ఆరామా...ణుల్ = ఆ నల దమయంతులు, రమాసతియు=లక్ష్మీదేవియు, దైత్యారాతియున్ పోలెన్ = నారాయణుఁడునువలె, వధూ...సంభావనన్—వధూ = స్త్రీలయొక్క, గంధర్వవిద్యా = గానవిద్యయందలి, కళా= చాతుర్యము, కీరాలాపకలాప = చిలుకపలుకుల సమూహము, కోకిలకుహూ= కోయిలల కుహూధ్వనులు, కేళీమయూర=క్రీడామయూరములయొక్కయు, అంగనా = స్త్రీలయొక్కయు, చారీ = చారి యనెడి పేరుగలదియు, మండల=

మండలమను పేరుగలదియు, నగు తాండవారభటీ=నాట్యవిశేషము, వీనియొ
క్క, సంరంభ=అతిశయముయొక్క, సంభావనన్ = గౌరవముచేతను, అన
గా స్త్రీలు, కీరములు, కోయిలలు, నెమిళ్లు, ఆటకత్తెలు, తమతమ చాతుర్యము
చూపుచుండగాఁ వినియుఁ గనియు సంతసించి వానిని మిక్కిలి యాదరించుచని
భావము. శృంగారక్రీడలన్, ప్రొద్దుపుచ్చిరి=కాలమును గడపిరి. గీతాది గోష్ఠి
చేఁ గాలమును బుచ్చిరని భావము.

వ. అంత. 150

తే. గగన హారినీల శైల శృంగంబునుండి
డొల్లిపడెఁ బ్రొద్దు జేగురుఁ గల్లువోలెఁ
దన్నిపాత సముద్ధూత ధాతుధూళి
చందమునఁ దోఁచె దివసావసాన సంధ్య. 151

టీ. గగన...నుండి—గగన=ఆకసమనెడి, హారినీల = ఇంద్రనీల మణిమయ
మయిన, శైల=పర్వతముయొక్క, శృంగంబునుండి = శిఖరమునుండి, ప్రొద్దు=
సూర్యుఁడు, జేగురుఁగల్లువోలెన్ = జేగురుఱాతివలె, డొల్లిపడెన్ = కూలి
పడెను. తత్...చందమునన్—తత్=ఆ జేగురుఱాతియొక్క, నిపాత=పడుట
చేత, సముద్ధూత=ఎగసినట్టి, ధాతు=గైరికాది ధాతువులయొక్క, ధూళిచంద
మునన్=పరాగమని, దివసావసానసంధ్య = సాయంకాలసంధ్య, తోఁచెన్=
కానవచ్చెను. ఉన్నతప్రదేశమునుండి యేదేని గురుపదార్థము క్రిందికిఁబడుచున్న
ప్పుడు వాని తాఁకుడుచే మధ్యనున్న మెత్తని శిలలు మొదలగునవి చూర్ణమై
ధూళు లాకసమున కెగయుట ప్రత్యక్ష దృష్టము. అట్లె సూర్యుఁ డనెడిపెద్ద
జేగురుఱాయి నీలాకాశమనెడి యున్నత ప్రదేశమునుండి జాఱి క్రిందికిఁ బడు
చుండఁగా దాని రాపిడిచే నలఁగిన గైరికాది ధాతువులయొక్క పరాగమువలె
సాయంకాలసంధ్య యొప్పుచున్నదని భావము. సూర్యుండు శాంతకిరణుఁడై
పశ్చిమదిశకేగుచున్నాఁడనియు, సాయంకాల సంధ్యారాగము వ్యాపించిన
దనియు ఫలితార్థము. అలం రూపకము. ఉత్ప్రేక్షయు.

ఉ. కోమల తామ్రచూళికల క్రొవ్వె్వ్రజసంజకుఁ బ్రోదివెట్ట ని
స్సీమ కఠోరతార రుతిఁ జెట్టుపలార్చుచు నట్టులెత్తి వి
శ్రామమువోలెఁ గూసె విలసచ్చరమాచలకూట పక్కణ
గ్రామటికాకుటీర శిఖరంబులఁ గుక్కుటచక్రవాళముల్.

టీ. కుక్కుటచక్రవాళముల్ = కోళ్లసమూహములు, విలసత్...రంబులన్ - విలసత్ = ఒప్పుచున్న, చరమాచల = అస్తాచలముయొక్క, కూట = శృంగములం దున్న, పక్కణ = శబరులు నివసించెడి, గ్రామటికా = చిన్నపల్లెలందున్న, కుటీర = గుడిసెలయొక్క, శిఖరంబులన్ = కొనలందు, వ్రజసంజకున్ = అరుణ కాంతులుగల సంధ్యారాగమునకు, కోమల...క్రొవ్వు - కోమల = మృదువయిన తామ్ర = ఎఱ్ఱని, చూళికలక్రొవ్వు = జుట్టులయొక్క యతిశయము, ప్రోది వెట్టన్ = పెంపుగల్గించుచుండఁగా, నిస్సీమ...రుతిన్ - నిస్సీమ = హద్దులేని, కఠోర = కఠినమయిన, తార = మిక్కిలి పెద్దదియగు, రుతిన్ = కూతను, చెట్టు పలు = ఱెక్కలు, ఆర్చుచున్ = ఆడించుచు, అట్టులు = మెడలు, ఎత్తి, విశ్రామమువోలెన్ = విశ్రాంతిస్థానమువలె, కూసెను. సాయంసమయమందుఁ గోళ్లు క్రూర మృగాదులవలని భయమునుండి తప్పించుకొనుటకై యింటికొప్పు లందు వసించుటగలదు. అట్టు లిండ్లకొప్పులపయినున్న కోళ్లగుంపుల యెఱ్ఱని జుట్టుల కాంతులు సంధ్యారాగమును వర్ధించుచున్నట్టులుండెను. ఇది ముద్రితగ్రం థములందును, వ్రాతప్రతులందును బరిపరివిధములగు పాఠములతో నుండెను. అయిన నిది సీతారామాచార్యులవారి శబ్దరత్నాకరమున నుదాహృత పద్య మును బురస్కరించుకొని దిద్దఁబడెను. మఱియు కొక్కరో, కో యను ధ్వని విశ్రాంతి స్థానమువలె నుండెనని భావము.

తా. అస్తాచలకూటముననున్న పల్లెలందలి గుడిసెలపై నెక్కి కోళ్లగుంపులు తమజుట్టుల యరుణకాంతులచే సంధ్యారాగ మతిశయించుచుండఁగా ఱెక్క లాడించి గొంతులెత్తి, హద్దులేని భీకరధ్వని విజృంభించునట్లుగాఁ గొక్కరో కోయని కూసెను.

చ. తలఁ బ్రతిబింబభానుమణిఁ దాల్చి విహారవనాంతరంబునన్
మలఁగిమలంగి పెంజిలువనాతియభంగి నవీనసారణీ
సలిలభరంబు దోలుకొని చయ్యనవచ్చినఁ జూచిభీతిబి
ట్టులికియుఁబోయెనత్తఱివియోగముఁబొందిరథాంగదంపతుల్.

టీ. అత్తఱిన్=ఆసాయంకాలసమయమందు,నవీన.. భరంబు-నవీన=నూతన ముగా వచ్చుచున్న, సారణీ=కాలువయొక్క, సలిలభరంబు = జలప్రవాహము, తలన్=శిరమునందు, ప్రతిబింబభానుమణిన్=జలములోఁ బ్రతిఫలించినసూర్యుఁ డనెడి రత్నమును, తాల్చి=ధరించి, విహారవనాంతరంబునన్=ఉద్యానవనము యొక్క మధ్యభాగమునుండి, మలఁగి, మలంగి = వంకరగానడుచుచున్నదై, పెంజిలువనాతియభంగిన్=పెద్దనాగకన్యకవలెనే, తోలుకొని = వెంబడించి, చయ్యనన్=శీఘ్రముగా, వచ్చినన్, చూచి, భీతిన్=భయముచే, బిట్టు=అధిక ముగా, ఉలికియుఁబోలెన్=చలించినవియువలె, వియోగమున్ = ఎడఁబాటు ను, ఒంది, రథాంగదంపతుల్=చక్రవాకద్వంద్వములు, పోయెన్ = ఎగిరిపో యెను. సాయంసమయములందు, సర్పములాహారార్థము తమ కలుఁగులు విడిచి బయట విహరించుటయు, దమ సమీపమునకు వచ్చుచున్నప్పుడు భయపడి పక్షులు మొదలగునవి యెగిరిపోవుటయు సుప్రసిద్ధము. మఱియు సూర్యాస్త మయ సమయంబునఁ జక్రవాకములు వియోగమునుబొంది పోవుటయుఁ బ్రసి ద్ధము. సాయంకాలమగుటచే స్వాభావిక సిద్ధమగు వియోగమునొంది యుద్యా న వనములందున్న కాలువలోఁ గ్రీడించుచున్న చక్రవాకపక్షులు ఆ సమయమున నెగిరిపోవుచుండెను. సాయంసమయమందుఁ బూవులు మొక్కలు మొదలగు వానికి నీరుకట్టుట మిక్కిలి మంచిదను తలంపుతో నుద్యానవనపాలకు లపుడే కాలువలనుండి నీరు వదలిరి. ఆనీరు వక్రవక్రముగాఁ గాలువలలోనుండి ప్రవ హించుచుండెను. అప్పుడు సాయంకాల సూర్యకిరణములు ప్రవహించి వచ్చు చున్న జలప్రవాహాగ్రమునందుఁ బ్రతిఫలించుచుండెను. ఈయర్థమును గవి యిట్లుత్ప్రేక్షించుచున్నాఁడు. అప్పుడే విడువఁబడిన జలప్రవాహముయొక్క యగ్రమునఁ బ్రతిఫలించిన సూర్యుఁడు తలయందున్నమానికమువలె నుండఁగా

వనమధ్యమందు వంకరగాఁ బాఱుచున్న జలప్రవాహము,వంకరగ జరుగుచున్న నాగకన్యకవలె నున్నదనియు, నది నడిపడి తమ చెంతకు వచ్చుచుండఁ జూచి యంతవఱకుఁ గాలువలందు విహరించు చున్నచక్రవాకములు భయమునుబొంది యెగిరిపోయినట్లును వర్ణించెను. స్వభావసిద్ధమగు వియోగమున నెగురుచున్నజక్కవలు జలప్రవాహమును బామునుగా భావించినట్లు చెప్పుటచే; అలం. ఉత్ప్రేక్ష.

శా. రశ్మిగ్రాహి గరుత్మదగ్రజ కరారబ్ధావిరామభ్రమిన్
గాశ్మీరాభ కరేష్టకారుచి పరాగంబున్ సహస్రాంశు శా
ణాశ్మంబు న్గదియించె ధాత నవసంధ్యాఖడ్గము న్వేదనా
వేశ్మస్వాంత రథాంగదంపతి చమూవిచ్ఛేద లీలార్థమై.

టీ. ధాత=బ్రహ్మ, వేదనా...లార్థమై—వేదనా=వియోగసంతాపమునకు, వేశ్మ=మందిరమువంటివగు, స్వాంత=చిత్తములుగల, రథాంగ=చక్రవాకములయొక్క, దంపతి=మిథునములయొక్క, చమూ=సమూహముయొక్క, విచ్ఛేద=వియోగమునుబొందించుటయనెడి, లీలార్థమై=వ్యాపారముకొఱకు, నవసంధ్యాఖడ్గమున్=క్రొత్తసంధ్యాకాలమనెడి ఖడ్గమును, రశ్మి...భ్రమిన్—రశ్మి=ప్రగ్గములనెడి త్రాళ్లను, "కిరణప్రగ్రహౌరశ్మీ" అని కోశము. గ్రాహి = పట్టుకొనుచున్న, గరుత్మదగ్రజ=గరుడుని యన్నయగు ననూరునియొక్క, కర = చేతులచే, ఆరబ్ధ=ప్రారంభింపఁబడిన, అవిరామ=ఎడతెగని, భ్రమిన్=తిరుగుట గలిగినట్టిదియు, కాశ్మీరా...గంబున్ - కాశ్మీరాభ=కుంకుమవలె నెఱ్ఱగానున్న, కర=కిరణములనెడి, ఇష్టకా=ఇటికలయొక్క, రుచి=కాంతియనెడి, పరాగంబున్=చూర్ణముగలదియును, సహస్రాంశు...ంబున్—సూర్యుఁడనెడి సానఱాతిని, కదియించెన్=చేర్చెను. అనఁగా సానఁబట్టెనని భావము. లోకములోఁ గత్తులను సానఁబట్టుట కొక రీతిగలదు. తిరుగటి దిమ్మవంటి యొక రాతికి నొక కొయ్య యిరుసు నమర్తురు. ఆయిరుసుకొన నొక దారువునకుఁ గ్రువ్వఁబడిన యొక యినుపచీల కమర్తురు. ఱాతిచక్రములోనుండి చొచ్చిపోయిన రెండవ కొనను న[illegible] నాఱాతి

చక్రము తిరుగుచుండును. అట్లు తిరుగునపుడు కత్తులను నాచక్రాంచలమునఁ బెట్టి పదనుగల్గించుచుందురు. నడుమనడుమ నిటికపొడుముగాని మెత్తనియిసుక గాని యాచక్రమునవేసి నీళ్లుఁజల్లుచుందురు. ఆనీటి సంపర్కముచే నాధూళి పంకమయి యా చక్రము నంటియుండును. ఇట్లుండఁ గాలాధారముననున్న సూర్యబింబము సానఱాయివలె నుండఁగా, సూర్యసారథియగు ననూరుఁడా శాణచక్రమును బ్రగ్గములనెడి త్రాళ్లతోఁ ద్రిప్పుచుండగా, సాయంకాల మగుటచే నెఱ్ఱని సూర్యకిరణములకాంతి యిటికపొడుమగుచుండఁగా, బ్రహ్మ యను శిల్పి చక్రవాక మిథునముల సంబంధమును ఛేదించుటకై కావలసి యున్న సంధ్యాకాలమనెడి ఖడ్గమును సానఁబట్టుచున్నట్లులుండెను. చక్రవాకముల సంబంధమును ఛేదించి వియోగము గల్గించుటకు సాయంకాలము ఖడ్గము వలె నొప్పుచున్నదని భావము. సాయంకాలము చూపట్టఁగాఁ జక్రవాకము లెగిరిపోయెనని ఫలితార్థము. ఇట రెండవపాదము కొన్నింటి ప్రతులలో "కాశ్మీరాజనవేష్టకా రుచిరరాగంబుల్" అని యున్నది. మఱి కొన్నింటిలో "వరేష్టకా" యని యున్నది. కాని యీ పాఠము మూలమునకు సరిగానట్టు తోఁచుచున్నది. "అంశ్రీస్థారుణిమేష్టకా విసరశాణోర్వీశే" అని యున్నది. అనఁగా, సూర్యకిరణము లందున్న యరుణిమ యనెడి యిష్టకాచూర్ణములచేత నెఱ్ఱనిది, అని యర్థము. అందులకుఁ దగినట్టుగా "కాశ్మీరాభకరేష్టకా రుచిపరాగంబుల్" అని మార్పఁబడెను. సూర్యకిరణములనెడి యిటికల సంబంధియగు, రుచిపరాగంబుల్ = కాంతియనెడిధూళి కలదియని యర్థమనుకూలముగా నుండెను. కిరణములం దిష్టకాత్వమును, గాంతియందుఁ దచ్చూర్ణత్వమును నారోపితములయ్యె. అలం. ఉత్ప్రేక్ష, రూపకము.

తే. సలిలనిధి సార్వభౌమకాశ్మాపురంధ్రి
యోలగందంపుఁబస పాడె నోకొ యనఁగఁ!
గమల కింజల్క రేణు సంకాశ మగుచు
నిండి నెఱ్ఱ సంజ కెంజాయ నిన్నటిల్లె.

టీ. సలిల...రంధ్రి—సలిలనిధి=సముద్రములకు, సార్వభౌమ= మండలేశ్వరుఁడయిన వరుణునియొక్క, కాష్ఠా = దిక్కనెడి, పురంధ్రి = స్త్రీపడఁతి యనుట. ఓలగందంపుఁబసపుడ్ =పూఁతపసపులో,ఆడెడ్, ఒక్కొ అనఁగడ్ = స్నానముచేసినదేమో యన్నట్టుగా, నెఱసంజకెంజాయ = పూర్ణమైన సాయంకాల సంధ్యారాగము, కమల...శము—కమలకింజల్క=పద్మకేసరములందలి, రేణు=పరాగములో, సంకాశము=సమమగునది, అగుచుడ్, నింగిడ్ =ఆకాశమునందు, నివ్వటిల్లెడ్ =వ్యాపించెను. పద్మకేసరములతో సమమయిన సాయం సంధ్యారాగముచే వ్యాప్తమగు పడమటిదిక్కు పూఁతపసపుతోఁ దానమాడినదో యనునట్లుండెను.

క. కుసుమం బద్దినవిధమున
బసపున హత్తించినట్లు బంగారమునన్
బస నిచ్చినగతి, సంధ్యా
వసరంబున నింగి యరుణవర్ణం బయ్యెన్. 156

టీ. నింగి=ఆకాశము, సంధ్యావసరంబునన్=సంధ్యాసమయమందు, కుసుమంబు = కుసుంబారంగు, అద్దినవిధమునన్ =అంటించినరీతిగా, పసపునన్, హత్తించినట్లు=పూఁతపూసినట్లుగాను, బంగారమునన్ =బంగారముచే,పసను= ఎఱుపుమించిన పసపుచాయను, ఇచ్చినగతిన్ = అనఁగాఁ బంగారునీటితోఁ బూఁతపూసినట్టుగాను, అరుణవర్ణంబు=ఎఱ్ఱని వన్నెగలది, అయ్యెన్—అలం. ఉత్ప్రేక్షలు.

తా. సులభము.

క. అభినవ సంధ్యా తాండవ
రభస రయచ్ఛిన్న హిమధరాధర కన్యా
ప్రభుహారాస్థులభంగిని
నభస్థలిం దారకాగణంబులు వ్రేఁచెన్. 157

టీ. తారకాగణంబులు = చుక్కముత్తములు, అభి.. భంగిన్ - అభినవ = అప్పుడే ప్రారబ్ధమయిన, సంధ్యా=సంధ్యాసమయమందలి, తాండవ = నృత్య

మునందున్న, రభస = సంతోషముచేనైన, రయ=వేగముచే, ఛిన్న=తెగినట్టి, హిమ...ప్రభు = పార్వతీపతియొక్క, హార=తాపళిములోని, అస్థులభంగిన్ = ఎమ్ములతోఁజేసిన పూసలవలె, నభస్థలిన్ = ఆకసమునందు, పొడిచెన్ = ఉదయించెను. సాయంసమయమం దుదయించిన నక్షత్రము లాసమయమందు హర్షాతిశయముచే నృత్యము చేయుచుండుటచేఁ దెగినట్టి శంకరుని తాపళిములోని యెమ్ముల పూసలవలె నుండెనని భావము. అల - ఉత్ప్రేక్ష.

మ. చరమాశా నికషోపలాంచలమునన్ సంధ్యాప్రకాశోదయం
బొరఁగావించి విరించిచేఁ గొనినసూర్యుండన్పదార్వన్నెబం
గరపుం బూదియకై వియద్విపణి వేడ్కంగాలమన్బచ్చు చె
చ్చెరఁజెల్లించిన గవ్వచాక మనమించెం దారకాచక్రముల్.

టీ. కాలమన్బచ్చు=కాలమనెడి బేహారి,చరమా ..మునన్ -చరమాశా=పశ్చిమదిక్కనెడి,నికషోపల=గీటుఱాతియొక్క, అంచలమునన్=కొనయందు,ఇటఁ జరమాశయందునికషోపలాంచలము నారోపింపవలయును. అట్లయినచో,నాకాశ మొక గీటుఱాయివలెను,పశ్చిమ దిక్కొక కొనవలెను నున్నదనిచెప్ప నొప్పియుండును. మఱియు సామాన్యముగా నికషముయొక్క కొనయందే సారాసారమును గ్రహించుటకై బంగారమును గీటుబెట్టుచుందురు. సంధ్యా...దయంబు=సంధ్యాకాంతియనెడి, ఒరన్=గీటును, కావించి=చేసి, విరించిచేన్ =బ్రహ్మవలన, కొనిన...పూదియకై =కొన్నట్టిసూర్యుఁడనెడి,పదాఱువన్నెబంగారపుఁ బూస నిమిత్తము,వియద్విపణిన్=ఆకాశమనెడి యంగడియందు, వేడ్కన్ =వేడుకతో, చెచ్చెరన్ = వేగముగా,చెల్లించిన గవ్వచాకము=వెలకుఁగానిచ్చినగవ్వలయొక్క, పుంజీలు, అనన్ = అనునట్లుగా, తారకాచక్రముల్ = చుక్కమొత్తములు, మించెన్ = అతిశయించెను. బ్రహ్మయనెడి శిల్పి పదాఱువన్నె బంగారములోఁ జేసిన సూర్యుఁడనెడి పెద్ద పూసనుజేసి గగనమనెడి యంగడికిఁ దెచ్చి యమ్మఁ జూపఁగాఁ గాలమనెడి వర్తకుఁడు, దానిని పశ్చిమాశయనెడి గీటుఱాయి కొనయందు సంధ్యారాగ మనెడిగీటును బెట్టి పరీక్షించి దానివెల నిమిత్తమై చెల్లిం

చుచున్న గవ్వచౌకములో యన్నట్లు చుక్కమొత్తములు ప్రకాశించెను. శిల్పు లేదని మనోహర వస్తువునుజేసి యంగడికిఁ గొనిపోవుటయు నచ్చటి వర్తకులు దానిఁ బరీక్షించి పుచ్చుకొనుటయుఁ బ్రసిద్ధము. మఱియు మనదేశములో నాణె ములిచ్చి బంగారమునుగొన్నట్లు కొన్నిదేశములందు గవ్వలిచ్చి బంగారమును గొనుటయునుగలదు. దీనికిమూలమునందు "ఆకాశమనెడి స్త్రీ సూర్యుఁడనెడి బంగారుఁబూసను నిచ్చివేసి పుచ్చుకొన్న గవ్వలవలె నక్షత్రము లొప్పెనని చెప్పఁబడినది. అందాకసమునకు 'ద్యౌః'అని ప్రయోగింపఁబడె. స్త్రీలింగమువలన నాకాశ మనెడి స్త్రీ లోకవ్యవహారము నెఱుంగనిది కావున హెచ్చువిలువగల బంగారమునిచ్చి గవ్వలుపుచ్చుకొనుచున్నదని వక్కాణింపఁబడె. ఆస్త్రీకి బదులు గా నిందు ఛాందసుఁడగు బ్రహ్మనువాడెను. లోకవ్యవహారమెఱుంగని బ్రహ్మను వంచించి యతండుదెచ్చిన సూర్యుఁడనెడి బంగారు పూసను బుచ్చికొని వాని కిచ్చుటకై తనసంచిలోని గవ్వమొత్తములను నొక్కపరి గ్రుమ్మరించెను. అట్లు గ్రుమ్మరింపఁబడిన గవ్వమొత్తములవలెఁ జుక్కలువిలసిల్లెనని భావము. సూర్యుం డస్తమించె ననియుఁ జుక్క లాకసమున వ్యాపించె ననియు ఫలితార్థము. అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

మ. నభమెల్లం గలయంగ నిండఁబొడిచె న్సంధ్యావశేషాదృతా
రభటీడంబరతాండవభ్రమరికారంభంబునన్, శాంభవీ
ప్రభుపాదాహతిమీఁదికిన్నెగయుచున్ బ్రహ్మాండగోళంబుతో
నభిసంబద్ధములయ్యెనోరజతశైలాళ్యంబులన్నట్టుడుల్. 159

టీ. సంధ్యా...రంభంబునన్—సంధ్యా=సంధ్యాకాలముయొక్క, అవశే ష=మిగిలిన భాగమందు, అనఁగా సంధ్యాకాలాంతమందనుట, ఆదృత=ఆద రింపఁబడిన, లేక, అంగీకరింపఁబడినడియు, ఆరభటీ=నేర్పుయొక్క, డంబర= అతిశయముచేతనైన, తాండవ=నాట్యముయొక్క, భ్రమరికా = తిరుగుటల యొక్క, ఆరంభంబునన్ =ప్రారంభదశయందు, శాంభవీ...హతిన్—శాం భవీప్రభు=శంకరునియొక్క, పాదాహతిన్ =కాలిదెబ్బలచే, మీఁదికిన్ నెగ

యుచుఁ, రజతశైలాశ్మంబులు=వెండికొండయొక్క తాలు, బ్రహ్మాండగోళంబుతో, అభిసంబద్ధములు=అంటుకొన్నవి. అయ్యెనో, అన్నట్లులు, ఉడులు=చుక్కలు, నభమెల్లఁ కలయంగఁ=అకాశమందంతటను, పొడిచెఁ=ఉదయించెను. సంధ్యాకాలాంతమునందే చుక్కలు చూపట్టుచుండును. కాన పద్యమున, సంధ్యావశేషమని ప్రయోగింపఁబడినది. శివుఁడు సాయంసమయాంతమం దతిశైపుణ్యముతోఁ గైలాసపర్వతమునందు నాట్యము సలుపఁగా నతని కాలితాఁకుడుచే శిథిలములయి వీఁదికెగసి బ్రహ్మాండ కర్పరమునకుఁ గ్రిందిభాగమున నంటుకొన్న వెండికొండశిలలుగాఁబోలునని తోఁపించుచుఁ జుక్కలు గగనము నావరించెను. అలం. ఉత్ప్రేక్ష.

సీ. చుక్కలోయివిగావు సురలోకవాహినీ
విమలాంబుకణ కదంబములుగాని
తారలోయివిగావు తారాపథాంబోధి
కమనీయ పులిన సంఘములుఁగాని
యుడువులోయివిగావు మృడునంబరంబునఁ
దాపించినట్టి ముక్తాఫలములుగాని
రిక్కలో యివిగావు రేచామతుఱుము పైఁ
జెరివిన మల్లె క్రొవ్విరులుగాని

తే. యనుచు లోకంబు సందేహమందుచుండఁ
బొడిచె బ్రహ్మాండపేటికా పుట కుటీర
చారుకర్పూర ఫాలికా సంచయములు
మెండుకొని యోలి నక్షత్ర మండలములు. 160

టీ. ఇవి=ఈకానవచ్చుచున్నవి, చుక్కలో=నక్షత్రములా? సుర...కాని-సురలోకవాహినీ=గంగానదియొక్క, విమల=స్వచ్ఛమైన, అంబుకణ=ఉదకబిందువులయొక్క, కదంబములు=సమూహములుగాని, కావు=చుక్కలుగావు. ఇవి, తారలో, తారా...ఘములు - తారాపథాంబోధి=ఆకాశమనెడి సముద్ర

ముయొక్క, కమనీయ=మనోహరమైన, పులినసంఘములు=సైకతములసముద యములుకాని, కావు=తారలు; కావు. అనఁగాఁ జుక్కలు గగనము సముద్ర మువలెను, చుక్కలిసుకతిన్నెలవలెను విరాజిల్లుచున్నవని భావము. ఇవి ఉడు వులో=నక్షత్రములా, మృండునంబరంబునన్=శంకరునివస్త్రమునందు, అనఁగా నాకాశమందనుట. శంకరుఁడు దిగంబరుఁడు కాన, యాకాశముగూడ నట్టిదే కాన యీచెప్పుట సరిపడుచున్నది. తాపించినట్టి ముత్యాలుకాని, కావు, రిక్కలో, ఇవి కావు, రేచామ=రాత్రియనెడిస్త్రీ, తుఱుముపైన్=సిగమీఁద, చెరివినమల్లె క్రొవ్విరులు=ముడిచినట్టి మల్లెపువ్వులుకాని, అనుచు, లోకంబు= ప్రజలు, సందేహము, అంనుచుండన్, బ్రహ్మాండ...చయములు - బ్రహ్మాండపేటి కాపుట=బ్రహ్మాండమనెడి పెట్టెయొక్కపైభాగము, కుటీర = గుడిసెగాఁగల, చారు=సుందరమైన, కర్పూరఘాలికా=కర్పూరఖండములయొక్క, సంచయ ములు=సమూహములు, అగు నక్షత్రమండలములు, మెండుకొని=వ్యాపించి, పొడిచెన్=కానవచ్చెను.

తా. గంగానదియొక్క జలకణములుకాని యివి చుక్కలుకావని కొంద ఱును,నివి యాకాశమనెడి సముద్రముయొక్క యిసుకతిన్నెలుగాని చుక్కలు గావని కొందఱును,శంకరునివస్త్రమునఁ దాపించిన ముత్యాలుకాని నక్షత్రములు కావని కొందఱును, రాత్రియనెడి స్త్రీ కొప్పున ముడుచుకొన్న మల్లెపువ్వులు గాని తారలుకావని కొందఱును,సందేహించునట్లుగాఁ బ్రహ్మాండమనెడిపెట్టెలో నుంపఁబడిన సుందరములగు కప్పురపుఁబలుకులచందంబున నక్షత్రము లాకస మునఁ జూపట్టెను. అలం=సందేహము.

చ. హటమరులీల నిర్జరులు నచ్చరలేమ లువేల్పుటేటనొ
క్కటవిహరింప, సాదశికిఁ గాక తొలంగిచరించుమీనక
ర్కటమకరంబులొక్కయనఁగాగగనాగ్రమునందుమీనక
ర్కటమకరంబులెంతయుఁబ్రకాశమునొందెనిశాప్రసంగతిన్.

టీ. నిర్జరులు=ముదుసలితనములేనివారు, అనఁగా దేవతలనుట. అచ్చరలేమ లున్=అప్సరఃస్త్రీలును, హటమరులీలన్=ప్రకాశించుచున్న గొప్పదగు విలాస

ముతో, వేల్పుటేటన్ = గంగానదియందు, ఒక్కటన్ = ఒక్కమాఱుగా, విహరింపన్ = జలక్రీడలు సలుపుచుండఁగా, సందడికిన్ = వారిరాపిడికి, కాక = ఓర్వఁజాలక, తొలంగి = అటనుండి తప్పించుకొని, చలించు...మకరంబులు = సంచరించుచున్న చేఁపలు, ఎండ్రులు, మొసళ్లు, ఒకొ, అనఁగాన్ = అనునట్లుగా, గగనాగ్రమునందు = వియత్తలమునందు, నిశాప్రసంగతిన్ = రాత్రిసమయము వచ్చుటచే, మీన...రంబులు = మీనకర్కాటకమకరరాసులు, ఎంతయున్ = మిక్కిలి, ప్రకాశమునొందెన్ = ఒప్పెను.

తా. సురలును సురస్త్రీలును, నధికమగునాసక్తితోను, తొందఱపాటులోడను, గంగానదియందు విహారముసల్పుచుండ వారిరాపిడిని సహింపలేక భయముతో, నందున్న మీనములు, కర్కటకములు, మొసళ్లును గగనసీమకు వచ్చిచేరినవేమో యనునట్లుగా మీన కర్కటకమకరరాసులు రాత్రిసమయమగుటచే నాకసమునఁ జూపట్టెను. అలం. ఉత్ప్రేక్ష.

మ. విపులాకాశ నిపాతభీతి కలనా ౯ విన్యస్తదుర్వర్ణకీ
లపరిస్ఫూర్తినిశాలతా కుసుమముల్ ౯ భాసిల్లె బ్రహ్మాండమం
టపకాష్ఠామల కీటరంధ్రరజముల్ ౯ నాకాపగా చక్రవా
కపురంధ్రీనయనాశ్రు బిందువులన౯ తుత్రగ్రహాగ్రామముల్.

టీ. విపుల...స్ఫూర్తిన్ - విపుల = విశాలమయిన, ఆకాశ = మింటియొక్క, నిపాత = పడుటయందలి, భీతి = భయముయొక్క, కలనా = అతిశయముచే, విన్యస్త = తాపింపఁబడిన, దుర్వర్ణకీల = వెండిమేకులయొక్క, పరిస్ఫూర్తిన్ = ప్రకాశమును, అనఁగా నక్షత్రములు పెద్దదియగు నాకాశము పడిపోవునేమో యన్న భయముచే దృఢత్వముకై తాపింపఁబడిన వెండిమేకులవలె వెలయుచున్నవని భావము. నిశాలతాకుసుమముల్ = రాత్రియనెడితీవెయొక్క పువ్వులును, బ్రహ్మాండ...రజముల్ — బ్రహ్మాండమంటప = బ్రహ్మాండమనెడి మంటపముసంబంధియగు, కాష్ఠ = దిక్కులనెడి దూలములయొక్క, అమల = స్వచ్ఛమయిన కీటరంధ్రరజముల్ = పురుగులయొక్క రంధ్రములనుండి పడిన పరాగములును, నాకా...దువులు - నాకాపగా = గంగానదియందలి, చక్రవాకపురం

ద్రీ=అఁడు చక్రవాకపక్షులయొక్క, నయన = నేత్రములనుండి జాఱుచున్న, అశ్రుబిందువులు=కన్నీటిబొట్లును, (ఐన) నక్షత్రగ్రహగ్రామముల్ = నక్షత్రములయొక్కయు, గ్రహములయొక్కయు, సముదయములు, భాసిల్లెన్= ప్రకాశించెను. రాత్రిసమయమునఁ బతివియోగమునకోర్వలేక చక్రవాకసమూహము దుఃఖించుచు విడుచుచున్న కన్నీటిబిందువులవలెఁ జుక్కలు విలసిల్లుచున్నవని భావము. అలం. ఉత్ప్రేక్ష.

తా. ఆకాశము పడిపోకుండ దృఢంబుగా నుండుటకై తాపించిన వెండిమేకులవలెనున్న నక్షత్రసమూహములు రాత్రియనెడి లతయొక్క పువ్వులవలెను, బ్రహ్మాండమంటపమున కమర్చినదిక్కులనెడి దూలములందున్న పుర్వుల కన్నములనుండి రాలిన తెల్లనిపరాగములవలెను గంగానదియందుండి భర్తృవియోగము సహింపలేక జక్కవలు కన్నులనుండి జాఱవిడుచున్న నీటిబిందులవలెనుఁ బ్రకాశించెను.

ఉ కాలకిరాతపాదతల ఘట్టనఁ జేసి వియద్వనీమహా
కాలఫలంబు భాస్కరుఁడు గ్రక్కున నస్తమహామహీధర
స్థూల శిలాస్థలింబడి యోఁ దోరములైన తదీయబీజముల్
నీలరుచుల్ వడింజెదరె నింగి ననచ్ఛ తమశ్ఛలంబునన్. 163

టీ. వియత్ ... ఫలంబు-వియద్వనీ=ఆకాశమనెడి వనసంబంధియగు,మహాకాలఫలంబు=ముసిండిపండయిన, భాస్కరుఁడు=సూర్యుఁడు, కాల... చేసి, కాల=కాలమనెడి, కిరాత=కిరాతునియొక్క, పాదతల=అఱకాలియొక్క, ఘట్టనన్ చేసి=రాపిడిచేత, గ్రక్కునన్ =వేగముగా, అస్త... స్థలిన్-అస్తమహామహీధర = అస్తాద్రియనెడి పెద్ద కొండయొక్క, స్థూల= పెద్దదయిన, శిలా=పాషాణముయొక్క, స్థలిన్ =ప్రదేశమందు, పడియోన్, నీలరుచుల్ = నల్లనికాంతులుగలవియు, తోరములు=పెద్దవియు, ఐన తదీయబీజముల్ =అయినట్టి యా ముసిఁడిపండులోని గింజలు, నింగిన్ =ఆకాశమునందు, అనచ్ఛ... లంబునన్-అనచ్ఛ=మలినమైన, తమశ్ఛలంబునన్ = చీఁకటియనెడి మిషచేత, వడిన్ =శీఘ్రముగా, చెదరెన్ =వ్యాపించెను.

తా. కాలమనెడి కిరాతునియొక్క పాదతాడనముచే నాకసమనెడివనము లోని ముసిడిపండనెడి సూర్యుఁడు వేగముగా నస్తాచలమందున్న శిలాతలము పైఁబడి శిథిలముకాఁగా దానిలోని నల్లనిగింజ లాకసమునఁ జీఁకట్లనెడిమిషచేత వ్యాపించెను. అలం. రూపకము. అపహ్నవము. ఉత్ప్రేక్ష.

తే. పగలు బ్రహ్మాండభాండ కర్పరమునందు
గగనమణిదీపమున నైన కజ్జలంబు
రాలెనో కాక యంధకారంబు పేరఁ
గాలవాతూలహతి, నిశావేళయందు. 164

టీ. పగలు=పగటిపూఁట, బ్రహ్మాం...నందున్-బ్రహ్మాండభాండ=బ్రహ్మాండ గోళమనెడి, కర్పరమునందు=కొప్పెరయందు, గగనమణిదీపమునన్=సూర్యుఁ డనెడిదీపముచేత, ఐనకజ్జలంబు = ఉద్భవించినకాటుక, నిశావేళలందున్= రాత్రిసమయమందు, కాల...హతిన్-కాల=కాలమనెడి, వాతూల = మహా వాయువుయొక్క, హతిన్=దెబ్బచేత, అంధకారమనుపేరన్=చీఁకటియను మిషచేత, రాలెనోకాక=రాలినదికాఁబోలును.

తా. పగటిపూఁటయందు సూర్యుఁడనెడి దీపపుకొనవలనఁ బ్రహ్మాండకర్పర మునకుఁ బట్టియున్న కాటుక, రాత్రియందు కాలమనెడి మహావాయువు వీవఁ గాఁ జీఁకటియనుపేరితో రాలినది కాఁబోలును. అలం. రూపకము. అప హ్నుతి. ఉత్ప్రేక్ష.

వ. అంత నమ్మహీకాంతుం డట మున్న నిశాముఖోచిత క్రియాకలాపంబులు నిర్వర్తించుచుం జేసి క్రీడాసౌధంబు నేక వనిలువునకు దమయంతీసమేతంబుగా నరిగి, యచ్చోట శుద్ధాం తకాంతాజనంబు పరివేష్టింపఁ గొలువుండె. అప్పుడు పొడుపు గుబ్బలిమీఁదం బొడతెంచు పూర్ణచంద్రబింబంబుఁ బొడగని యంగన కిట్లనియె. 165

తే. శుద్ధకాంచనపిండంబు సూర్యుఁ దిగిచి
పూర్ణశశిఁ బూఁత బంగారుపూదె నొసఁగి
సాయమనుధూర్తు వంచించె జగము నెల్లఁ
దెల్లఁబాఱెడు నదె చూడు తెలివ! విధుఁడు. 166

టీ. తెలివ - ఓదమయంతీ! సాయమనుధూర్తుఁడు=సాయంకాలమనెడి వంచకుఁడు, శుద్ధకాంచనపిండంబు = మేలిమిఅగు బంగారుగుండయిన సూర్యుని, తిగిచి=తీసికొని, పూఁతబంగారుపూదె=పూఁతబంగారుతోఁజేసిన పూసయగు, పూర్ణశశిన్=పూర్ణచంద్రుని, ఒసంగి=ఇచ్చి, జగము నెల్లన్=లోకమునంతను, వంచించెన్=మోసపుచ్చెను. విధుఁడు=చంద్రుఁడు, తెల్లఁబాఱెడున్=తెల్లగాఁగానవచ్చుచున్నాఁడు, అదె,చూడు=అదిగో చూడుము. లోకములో వంచకులు తమయొద్ద సామాన్యవస్తువుండినచో దానిఁ దమ మాయచే నమూల్యవస్తువుగాఁ గనఁబడునట్లు చేసి యితరులకుఁజూపి మోసపుచ్చి, వారి కావస్తువునొసంగి వారియొద్దనుండు మంచివస్తువుదీసికొనుట ప్రసిద్ధము. ఓ దమయంతీ! అట్లే యిప్పుడు కాలమనెడి మోసగాఁడు జగమునొద్దనున్న సూర్యుఁ డనెడి బంగారుగుండునుజూచి, దానిఁ దీసికోవలెననియెంచి తనయొద్దనున్న చంద్రుఁడనెడి వెండిపూసను బంగారునీటిలోముంచి మోసపుచ్చి యా పూసను లోకమునకిచ్చి సూర్యుఁడనెడి కాంచనపిండమును లాగికొనెను. బంగారుచాయ క్రమముగాఁ బోవుటచే సాయంకాల ధూర్తుఁడు చేసినమోసము తెల్లమగుచున్నది. వాఁడు చేసినది మోసమే కానిచో మొదట బంగారుచాయతోనుండిన చంద్రుఁడనుపూస క్రమక్రమముగాఁ దెల్లఁబడనేల? చంద్రుఁ డుదయకాలరక్తిమనువిడిచి ధవళత్వమును వహించుచుండెనని ఫలితార్థము. అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

సీ. ఇందుకాంతంబుల నెబ్భంగివశీసెనో
నిష్యంద కీలాల నిర్ఝరములు
చక్రవాకములలో చేనయోగ్యకములెన

ట్లుబ్బెనో విరహ బాష్పోదకములు
చంద్రాతపమున నేరీతి చందానఁగురిసెనో
ధారాళమగుచు నీహారవృష్టి
విపినవీథికల నేరీతి విధమునఁ గారెనో
శేఫాలికాపుష్పసీధుధార

తే. యిన్నివిధముల నభివృద్ధి యెసఁగదేని
యొదిఁగి పవలింటియట్టుల నుండుఁగాక
యూరకేల విజృంభించు నుదధు లేడు
నుత్పలేక్షణ యీ శశాంకోదయమున. 167

టీ. ఉత్పలేక్షణ=నల్లఁగలువవంటి నేత్రములుగల దమయంతీ! ఈశశాంకోదయమునన్=ఈచంద్రుఁ డుదయించుచున్న సమయమునందు, ఇందుకాంతంబులన్=చంద్రకాంతరత్నములందు, ఎబ్భంగి=ఏవిధముగా, నిష్యందకీలాల నిర్ఝరములు=స్రవించుచున్న జలప్రవాహములు, పడిసెనో = స్రవించెనో, చూడుము) చంద్రకిరణములు తాఁకినప్పుడు చంద్రకాంతశిలలు జలమును వెడలఁగ్రక్కుట స్వాభావికము. చక్ర—మునన్ = చక్రవాకపక్షులయొక్క నేత్రద్వంద్వంబులందు, విరహబాష్పోదకము = వియోగసంతాపమువలనఁ గల్గిన కన్నీరు, ఎట్లుబ్బెనో=ఏరీతిగాఁ బ్రవహించుచున్నదో, (చూడుము) చంద్రాతపంబునన్ = వెన్నెలచేత, ఏచందానన్ = ఏవిధముగా, నీహారవృష్టి = మంచువాన, ధారాళమగుచున్ = నిరాటంకముగాఁ గురిసెనో (చూడుము.) విపినవీథికలన్ = అరణ్యసీమలందు, శేఫాలికా...ధార-శేఫాలికాపుష్ప = వావిలిపువ్వులయొక్క, సీధు=మకరందముయొక్క, ధార=ప్రవాహము, ఏవిధమునన్, కారెన్=ప్రవహించుచున్నదో (చూడు) ఇన్నివిధములన్ = ఇన్నికారణములచే, అభివృద్ధి= పెంపు, ఎసఁగదేని=అతిశయింపకపోయినచో, ఉదధులు ఏడును=సముద్రములేడును, పవలింటియట్టులన్ =పగటిపూఁటయందువలె, ఒదిఁగి ఉండున్, కాక, ఊరక, విజృంభించున్ = పెంపొందునె ఉదధులు ?

తా. ఓదమయంతీ! యీ చంద్రకిరణముల తాఁకుడుచేఁ జంద్రకాంతములనుండి కాఱుచున్న జలప్రవాహములును, రాత్రియందు వియోగావస్థకు విలపించుచుఁ జక్రవాకపక్షులు గార్చుచున్న నేత్రోదకములును, వెన్నెలచేఁ గురిసినమంచు, వానయొక్క జలములును, వనప్రదేశములందలి వావిలిపూవుల మకరందప్రవాహములును గూడి, మహానదులవలె సముద్రములోఁ బ్రవేశించుటచేతనే చంద్రోదయసమయమున సముద్రము లేదును బొంగుచున్నవి. లేనిచోఁ బగటిపూఁటవలెనే యుండిపోవును. అలం. ఉత్ప్రేక్ష.

క. లీలావతియామవతీ
కాలిందీసైకతంబు కై గగనోదన్వ
ద్వేలాడిండీరము చం
ద్రాలోకం బింత యొప్పునే నా యివ్వేళన్. 168

టీ. లీలావతీ=మంచివిలాసములుగల దమయంతీ, చంద్రాలోకంబు = చంద్రకాంతి, యామ...తంబు-యామవతీ=రాత్రియనెడి, కాళిందీ = యమునానదియొక్క, సైకతంబు=ఇసుకతిన్నె అయియుండవచ్చును, లేక, గగ... డీరము- గగన=ఆకాశమనెడి, ఉదన్వత్ = సముద్రముయొక్క, పోటుసంబంధియగు, డిండీరము=నురుగు అయియుండును, కానిచోఁ, ఇవ్వేళన్ = ఈ సమయమందు, ఇంతయొప్పునా = ఇంత చక్కగాఁ బ్రకాశించునా? రాత్రియనెడి యమునయొక్క సైకతమో లేక గగనమనెడి సముద్రముయొక్క పోటువలనఁగల్గిన నురుఁగో, అయియుండును. కావుననే యిది యింతమనోహరముగాఁ బ్రకాశించుచున్నది. అల. రూపకము.

ఉ. దేవి! తమోమహీరసము కై తేటఁబోసంగఁగ గట్టివెట్టి యం
కావళివ్రాయఁగాఁ దొడఁగె కై నంబరసంపుటకాంతరంబునం
బూవిలుకానిశౌర్యగుణకై ముల్ హరిణాంకుఁడు ముత్తియంబులం
దావడముల్ రచించిన విశేషంబునరుక్షటికాముఖంబులన్.

టీ. దేవి=ఓదమయంతీ! అంబర...రంబునన్ -అంబర= ఆకాశమనెడి, సంపుటకా=బరణివంటి పెట్టెబల్లయొక్క, అంతరమునన్ = లోపలిభాగము

నందు, తమోమషీరసము లేటన్ = చీఁకటి యనెడిమసిపొడితోఁ గలిసిన నీటి యొక్క తేటచే, పొసంగఁగన్ = తేటపడునట్లుగా, గట్టిపెట్టి = గట్టించి, అనఁగా సుద్దతోఁ వ్రాయునపుడు స్పష్టముగాను దెల్లగాను గానవచ్చుటకై నల్లని ద్రావకముతోఁ గ్రానిబల్లలకుఁ బూఁతవెట్టుటసుప్రసిద్ధము. హరిణాంకుఁడు = లేడియనెడి చిహ్నముగలవాఁడు, అనఁగాఁ జంద్రుఁడనుట. పూవి...ముల్ = మన్మథునిశౌర్య సూచకము లగుగుణములను, రుక్ఖటికాముఖంబులన్ = కాంతి యనెడి సుద్దకణి కలయగ్రములచే, చంద్రునకెక్కువ కరములున్నవి కాన బహువచనము. ముత్తియంబులన్, తావ...ధంబునన్ = పేరులుగ్రుచ్చునట్టివిధముగా, అంకావళి= అక్షరములపంక్తులను, వ్రాయఁగాఁదొడఁగెన్ = వ్రాయనారంభించెను. చీఁకటిచే మిక్కిలి నల్లనియాకసము నల్లనిద్రావకముచేఁ బూఁతవేసిన పెద్దబల్ల వలెను, సందున్న నక్షత్రపంక్తులు చంద్రుఁడు తనకిరణములనెడి సుద్ద ముక్కలతోఁ, తనమిత్రుఁడగు మన్మథునిశౌర్యోద్దీపకములగు గుణములు లోకులకుఁ దెలియునట్లుగా వ్రాసినయక్షరముల పంక్తులవలెను ప్రకాశించెనని భావము.

తా. ఓదమయంతీ! చీఁకటి యనెడి నల్లనిద్రావకముతోఁ బూఁతవెట్టిన నాకస మనుబల్లపై తన కిరణఖటికములచే మన్మథుని గుణముల సూచింపఁగా ముత్యాలపేరుగ్రుచ్చినట్లు వ్రాసిన వర్ణపంక్తులువలె నక్షత్రములు ప్రకాశించుచుండెను. గమ్యోత్ప్రేక్ష, ఉపమ.

తే. చామ యీశానమౌళి నీచందమామ
కొంచెమై యుండు నవయవాంకురముకంటె
డాసి గ్రహముండ మాల్య మంకీషనము నడుమఁ
గీల్కొలిపిన రాహువక్త్ర మీక్షించి యొక్కొ. 170

టీ. చామ = ఓదమయంతీ! ఈచందమామ, ఈశానమౌళిన్ = శంకరుని జటాజూటమందు, నవయవాంకురముకంటెన్ = నూతనమైన యవధాన్యపు మొలకకంటె, కొంచెమై = స్వల్పమై, ఉండును. డాసి = సమీపించి, గ్రహ... నడుమన్ = గ్రహ [illegible] = గ్రహములనెట్టి, ముండ = [illegible]ముక్క, మాల్య=

దండ, యనెడి, మండనము నడుమఁ = అలంకారమధ్యమునందు, కీల్కొనిన రాహుపఙ్క్తియు = ఉన్నట్టి రాహువుయొక్క ముఖమును, ఈక్షించి యొక్కొ = చూచియే కాఁబోలును? ఈశ్వరుని శిరంబునకుఁ దలపుర్రెల మాలికకలదని వాఁడుక. అదియె యతనికొక యలంకారము. ఒకానొక రాక్షసునితలయె రాహువనిప్రసిద్ధి. చంద్రుఁ డీశ్వరుని మౌళియందుండె. దానికిఁ జుట్టును గపాలమాలిక చుట్టఁబడియుండెను. చంద్రున కందున్న రాహువు కాన వచ్చుచుండెను. భయాతురుఁ డయినవాఁడు కృశించును గాన శంకరుని జట లందు సంతతమును భయమున వర్తించుచున్న చంద్రుఁడును గృశించుచుండె నని భావము. పెక్కింటి ప్రతులలో "మండలమునడుమ" అనుపాఠము గాన వచ్చుచున్నది. ఒకానొకవ్రాఁతప్రతిలోనున్న "మండనమునడుమ" ననెడి పాఠము యుక్తముగాఁదోఁచుటచే నట్లు మార్పఁబడెను. అలం...రూపకము. అతిశయోక్తి.

క. శివునకుఁ జకోరములకుఁ
దివిజులకును నిచ్చుఁ దుహిన దీధితి యీతం
డవయవము రుచుల నమృతము
నువిద! తగుం గల్పతరు సహోదరుఁ డగుటన్.    171

టీ. ఉవిద = ఓ స్త్రీరత్నమా, తుహినదీధితి=చల్లని కిరణములుగల, ఈతండు=ఈచంద్రుఁడు, అవయవమురుచులఁ=పదాఱుకళలయొక్క కాంతుల చేతను, అమృతముఁ=సుధారసమును, శివునకుఁ = ఈశ్వరునకును, చకోరములకుఁ=వెన్నెలపులుఁగులకును, దివిజులకుఁ=దేవతలకును, ఇచ్చుఁ=ఇచ్చు చున్నాఁడు. ఇట నవయవమనునెడ జాత్యేకవచనమని యెఱుంగునది. కల్పతరు...గటఁ=కల్పవృక్షమునకుఁదోఁబుట్టువగుటచేత, తగుఁ=అట్లు దానముచేయుట మిక్కిలి యర్హమగును. కల్పవృక్షము పాలసముద్రమున నుదయించినట్టును గోరిన కోర్కులనిచ్చుచున్నట్టును బ్రసిద్ధి. ఈచంద్రుఁడును పాలకడలిపట్టి కావునఁ గల్పవృక్షమువలె దానముచేయ నర్హుఁడని భావము.

ఉ. అంగద నంకవర్తి హరిణాభ్యవహార విలోలబుద్ధియై
మ్రింగువిధుంతుదుం డనెడిమేటిభుజంగమ మీశశాంకు సా
రంగముఁ బాయఁడీయవసరంబున మేలనిమెచ్చియోచుమీ
మ్రింగియుఁగ్రాయునచ్చిలువ,మెత్త!విధుంగసుకందకుండఁగన్.

టీ. మెత్త=ఓస్త్రీరత్నమా! విధుం...గమను = రాహువనెడి పెద్దపాము, అంగదన్=ఆఁకలిచే, అంక...బుద్ధియై—అంకవర్తి=తనయొడిలోనున్న (చంద్రునియొడిలో) హరిణ=లేడియొక్క, అభ్యవహార=తినుటయందు, విలోల=అధికాసక్తిగల, బుద్ధియై= చిత్తముగలదయి, ఈశశాంకున్ = ఈచంద్రుని, మ్రింగున్, ఈయవసరంబునన్ = ఇట్టిసమయమందయినను, అనఁగాఁ దన్నాశ్రయించినలేడికై తన తను వీయవలసినసమయమందయినను అనిభావము. సారంగము=లేఁడిని, పాయఁడు=విడువఁడు, మేలు=ఆశ్రితవాత్సల్యత మిక్కిలి కొనియాడఁదగియున్నది, అని, మెచ్చియోసుమీ = మెచ్చుకొనియే కాఁబోలును. అచ్చిలువ=ఆరాహువు, విధున్=చంద్రుని, మ్రింగియున్, కసుగందకుండఁగన్=కొంచెమేనియు నొప్పి గలుగనీయకుండఁగా, క్రాయున్ = వెడలఁగ్రక్కుచున్నాఁడు. రాహువు చంద్రుని మ్రింగుటకును, మగుడ విడుచుటకును గారణమూహించెను. కొండచిలువలు మొదలగు పెద్దపాములు లేళ్లు మొదలగు వానిమ్రింగుట ప్రసిద్ధము. రాహువనెడి పెద్దపాము చంద్రునితొడయందున్న లేడిని మ్రింగఁదలంచి దానికై పెనఁగులాడినను జంద్రుండు వదలక పోవుటచే దానిఁ జంద్రునితోఁగూడ మ్రింగివైచెను. చంద్రుని మ్రింగవలెనని తలంపు లేకపోయినను మ్రింగవలసివచ్చెను. అట్లు మ్రింగఁబడియుఁ జంద్రుఁడు లేడిని విడువలేదు. రాహు వదిచూచి యతని యాశ్రితవాత్సల్యమునకు మెచ్చికొని చంద్రునిఁ గొంచెమైనను బాధగలుగకుండ విడిచిపెట్టెను. అలం. ఉత్ప్రేక్ష.

తే. లతలక్రీనీడఁ దిలతండులితము లగుచుఁ
గాంత! యీనిండు రేతేని కరము లమరు

నంగుళీకీలితేంద్ర నీలాంగుళీయ
కంబులును బోలె లీలావనంబునందు. 173

టీ. కాంత=ఓప్రియురాలా! ఈనిండురేయేని కరములు=ఈపూర్ణచంద్రుని కిరణములు, లీలావనంబునందున్=పుష్పవనమునందు, లతల క్రీనీడన్=తీవెల యొక్క, క్రిందినీడయందు, తిలతండులితములు=తిలతండుల న్యాయము కలవి, అగుచున్, అంగుళీ...బులును—అంగుళీ=వ్రేళ్లయందు, కీలిత=సంఘటింపఁబడిన, ఇంద్రనీలాంగుళీయకంబులును బోలెన్ = ఇంద్ర నీలమాణిక్యములతోఁ గూర్పఁబడిన యుంగరములు గలవానివలెను, అమరున్=ప్రకాశించును. తెల్లని చంద్రకిరణములు లతాదులపత్రములలోనుండి క్రిందికిఁ బ్రసరించినప్పుడు లతాదులక్రిందిభాగమునఁ దెలుపును,నలుపును గలవై, తండులములును దిలలును గలిసి యున్నట్లు పొడచూపుచు, నింద్రనీలమణిమయము లగునుంగరములను దాల్చినట్లు ప్రకాశించుచుండె నని భావము.

తా. ఓదమయంతీ! లతాదులనీడలతో మిశ్రితములై తిలతండులములవలె నలరాఱుచున్న యీనిండుచంద్రుని కరము లింద్రనీలమయములగు నుంగరంబులఁ దాల్చినట్లు ప్రకాశించుచున్నవి.

తే. తండ్రి కంభోనిధికిఁ బోలె నో ధవళనేత్ర
హాని వృద్ధులు గలవీ శశాంకునకును
రాజబింబనిభాస్య! కారణగుణంబు
గార్యమున సంక్రమించుట యో గలదకాదె. 174

టీ. ధవళనేత్ర=తెల్లని కన్నులు గలదమయంతీ! ఈశశాంకునకును=ఈచంద్రునకు, తండ్రికిన్=తండ్రియైన, అంభోనిధికిన్, పోలెన్=సముద్రునికివలె, హానివృద్ధులు=క్షయము, వృద్ధియును, కలవు. సముద్రుఁ డొకప్పుడు క్షీణించుటయు, వేఱొకప్పుడు పెంపుచెందుటయును గలదు. అట్లె చంద్రుఁడును వృద్ధిక్షయముల నొందుచున్నాఁడు. రాజ...స్య = చంద్రబింబముతో సమమగు మొగముగలదానా, కారణగుణంబు = కారణమందున్న గుణములు, కార్య

మునన్ = పుట్టినవస్తువులందు సంక్రమించుట, కలద, కాదె. ఎట్లనితంతువు-
లందున్న యెఱుపు తత్కార్యమగుపటమందు సంక్రమించుట చూచుచున్నా-
ము కాన కారణమగు సముద్రునకుఁగల క్షయవృద్ధులు కార్యమగు చంద్రునకు
సైతముగలిగినవని భావము. అలం. అర్థాంతరన్యాసము.

తే. వహ్ని మొదలగు నఖిల దైవతగణంబు
దృప్తిఁ బొందుదు రీ సుధా దీప్తియందు
మహిత పుణ్యాత్ము కల్యాణ గృహమునందుఁ
బాలఁతి! యభ్యాగతులు తృప్తిఁ బొందునట్లు. 175

టీ. బాలఁతి=ఓదమయంతీ! మహిత...నందున్-మహిత=పూజ్యుఁడయిన, పుణ్యాత్ము=పుణ్యమే స్వరూపముగాఁ గలవానియొక్క, కల్యాణ=శుభప్రదమైన, గృహమునందున్ = ఇంటియందు, అభ్యాగతులు=భోజనసమయమునకు వచ్చిన పరదేసులు, తృప్తిన్=తనివిని పొందునట్లు, వహ్ని...గణంబు=అగ్నిహోత్రుఁడు మొదలయిన దేవతాసమూహము, ఈసుధాదీప్తియందున్=సుధామయము లగుకాంతులు గలవాఁడు, అనఁగాఁ జంద్రునియందనుట. తృప్తిన్, పొందుదురు "అగ్నిముఖా వైదేవాః" అని యుండుటంబట్టి యగ్నిహోత్రుఁడును దైవతగణమున కాహారాదులచేఁ దృప్తినొందించువాఁడె. అట్టి యగ్నిహోత్రుఁడుగూడ నీచంద్రునందుఁ దృప్తిచెందుచున్నాఁ డనుటచేఁ జంద్రునకు మఱింత యతిశయము ద్యోతితమగుచున్నది. అందులకే వహ్నిశబ్దమును ప్రధాననిర్దేశముచేసెనని తెలియఁదగినది. ఇందు దైవతగణంబు, అని యేకవచనాంతము కర్తయగుచుండఁగాఁ గ్రియ బహువచనాంతము ప్రయోగింపఁబడె. ఇట్లె 2 ఆ. 46. లో, అన్నారీనివహంబు—ఏతెంచిరి" అని ప్రయోగించె. దీనింబట్టి యోజింప మహద్వాచకసముదాయ మేకవచనాంతము కర్తయైనచోఁ గ్రియ బహువచనమగుట యితని కభిప్రాయమని తోఁచెడిని.

తా. ఓదమయంతీ! పుణ్యాత్ముని గృహమందు నభ్యాగతులు తృప్తినొందునట్లు వహ్ని మొదలగు దేవత లీచంద్రునియందుఁ దృప్తిని బొందుదురు.

తే. ప్రవహావాయుకురంగ మంబరమునందు
డప్పిగొని యీసుధాంశు మండలము సొచ్చి
యమృతపంకంబులో నంఘ్రు లణఁగుటయును
వెడల లేకున్నయది చూడు విద్రుమోష్ఠి. 176

టీ. విద్రుమోష్ఠి=పగడమువంటి పెదవిగలదానా, అంబరమునందున్=ఆకాశమునందు, ప్రవహావాయుకురంగము=ప్రవహమనెడి వాయువునకు వాహనమైన లేడి,డప్పికొని=తృష్ణాపీడితమై, ఈసుధాంశుమండలము=ఈచంద్రమండలమును, చొచ్చి=ప్రవేశించి, అమృతపంకంబులోన్ = అమృతమనెడిబురదలో, పాదములు, అణఁగుటయున్=దిగఁబడిపోవుటచే, వెడలలేకున్నయది=పైకిరాలేకున్నది, ఆకాశమునఁ బ్రవహమనెడి వాయువు సంచరించుచున్నట్టును, నతనికి వాహనము లేడియనియుఁ బురాణప్రసిద్ధము. దప్పిగొన్న యాలేడి చంద్రమండలమున నీరు ద్రావఁబోయి బురదలోదిగఁబడి రాలేకపోయెను. అందుచేత నే చంద్రునం దది మచ్చగా నిప్పటికిని గానవచ్చుచున్నదని భావము. అలం. ఉత్ప్రేక్ష.

తా ఓ దమయంతీ! ప్రవహమనెడివాయువుయొక్క లేడి, దప్పిగొని చంద్రమండలము చేరి నీరు ద్రావుచుండఁగా నందున్నయమృతసంబంధియగు బురదలో దిగఁబడి రాలేకపోయెను.అదియే యిప్పటికిని మచ్చవలె గానవచ్చుచున్నది.

సీ. ఓషధీ సందేశ భాషాప్రణిధి యైన
మృగము గాఁబోలు నీమృగము తరుణి
రుద్రాగ్రహత్రాస విద్రావితం బైన
మృగము గాఁబోలు నీమృగము తరుణి
ప్రవహానామకమహా పవనవాహన మైన
మృగము గాఁబోలు నీమృగము తరుణి
రోహిణీసంబద్ధ ... బద్ధ మైన

మృగము గాఁబోలు నీ మృగము తరుణి
తే. సతతసేవాసమాయాత సకలభువన
భవ్యవిపినౌషధీలతా పల్లవాగ్ర
భక్షణక్షీబమై సుధా పాయియగుచు
మగువ ! యీచంద్రునందు నీ మృగము బ్రదికె. 177

టీ. తరుణి=ఓదమయంతీ ! ఈమృగము, ఓషధీ...ణిధి— ఓషధీ=ఓషధీలతలనెడి నాయికలయొక్క, సందేశభాషా = సందేశవచనమునకు, ప్రణిధి=దూత, ఐనమృగము=అయినట్టిలేడి, కాఁబోలుఁ, చంద్రుఁ డోషధీశుఁడు కావున నోషధు లనెడినాయికలు తమనాయకుఁడగు చంద్రునికి మదనసందేశముపంపఁగా నదివచ్చి యిందుండెను గాఁబోలును. లేడి స్త్రీలచేఁ బంపఁబడుటయు, నతివేగముగాఁ బరువెత్తుటయు సుప్రసిద్ధము. కావున నడవిలోనున్నయోషధీనాయికలు చంద్రునియొద్దకు లేడినే పంపుట సముచితముగానున్నది. ఈమృగము, రుద్రా...తంబు— రుద్ర=శంకరునియొక్క, ఆగ్రహ=కోపముచే, విద్రావిత=పర్వెత్తింపఁబడినది, ఐన మృగముగాఁబోలు. పూర్వమీశ్వరుఁడు వీరభద్రావతారమై దక్షుని యజ్ఞమును ధ్వంసము గావింపఁగా నాయజ్ఞము మృగరూపమై పర్విడెనని పురాణప్రసిద్ధము. అట్లు పర్విడి వచ్చి యీచంద్రునియందున్నది కాఁబోలునని భావము. ఈమృగము, ప్రవహా...నము=ప్రవహమనెడిపేరుగలవాయువునకు వాహనమైనది, ఐనమృగము గాఁబోలు, రోహిణీ...ద్ధితము— రోహిణీ=చంద్రునిభార్య యగురోహిణీదేవిచే, శుద్ధాంత గేహ=అంతఃపురమునందు, వర్ధితము=పెంపఁబడినది. ఐనమృగముగాఁబోలు, ఈమృగము, సతత...క్షీబమై—సతత=ఎల్లప్పుడును, సేవా=చంద్రునిసేవనిమిత్తము, సమాయాత=వచ్చినట్టి, సకలభువన=సమస్తలోకములందున్న, భవ్య=శ్రేష్ఠమైన, విపిన=అడవులయందలి, ఓషధీలతా=మందుతీవెలయొక్క, పల్లవ=చిగుళ్లయొక్క, అగ్ర=కొనలను, భక్షణ=తినుటచేత, క్షీబమై=మదించినదై, సుధాపాయి=అమృతమును దావివునది, అగుచు, ఈచంద్రునందు, బ్రదికెఁ =జీవించెను-నివసించెననుట. తమ నాయకుఁ డగుచంద్రుని సేవింప సమ

స్తములగు నోషధీలతలును వచ్చినప్పు డీలేడి వానిచివుళ్లనుదినుచు,నిందు నందలి సుధారసమును ద్రావుచు సుఖముగా జీవించుచున్నది. సమస్తౌషధులను దినుచుండుటచేతను సంతతము సుధారసము ద్రావుటచేతను నీలేడి యజరామరమై యున్నదని ఫలితార్థము. ఇందు "సుఖం వసత్యే షకలంక రంకుః" అనునట్టి మూలమున కనుగుణముగా, "బ్రదికె" అనుదానికి "బ్రదుకు"నని సాతత్యమునం దద్ధర్మార్థకము ప్రయోగించిన నుచితమని తోఁచెడిని.

తే. కంతుఁడును నీవిధుండు నొక్కంతవారు
సఖ్య మీయిద్దఱకు నొప్పు సదృశు లగుట
ముదిత! యొక్కండు హరుని నేత్రముకంట
నొకఁడు కంసారి కుడికంట నోహటిలిరి. 178

టీ. ముదిత=ఓదమయంతీ, కంతుండును=మన్మథుఁడును, ఈవిధుండును=ఈచంద్రుఁడును, ఒక్కంతవారు=సమానులు, సదృశులు అగుటన్=సమానులయియుండుటంబట్టి, ఈయిద్దఱకును = ఈకంతుచంద్రులకిరువురకును, సఖ్యము=స్నేహము, ఒప్పున్=తగును, దుష్టులయినను శిష్టులయినను సమానులకే స్నేహము వాటిల్లుచుండును.వీరిరువురు విరహదశయందుండువారు దయనీయులనియెంచక బాధించు పాపులుగాన సఖ్యముసరిపడును. ఒక్కండు=ఆయిరువురలోనొకఁడయిన మన్మథుఁడు, హరుని...కంటన్=శంకరుని ఫాలనేత్రముచేతను, ఒకఁడు=రెండవవాఁడగు చంద్రుఁడు, కంసారికుడికంటన్=విష్ణువు కుడినేత్ర మయినసూర్యునిచేతను, ఓహటిలిరి=లయమొందిరి.ఇరువురును దుర్మతులే కావున దుర్మరణము సంభవించెనని తెలియనగు. మన్మథుఁడు శివునికంటిమంటలచే భస్మీభూతుఁడగుట ప్రసిద్ధము.చంద్రుఁడు సూర్యకాంతిచే నెల్లప్పుడును నష్టప్రాయుండగుటయేకాక యమావాస్యయందుఁ బూర్తిగా లయ మందుచున్నాఁడని భావము.

తా. దమయంతీ! ఈచంద్రుఁడును మన్మథుఁడును దుష్ప్రవృత్తిలో సమానులు. సములుకావుననే సఖ్యములభించినది. శంకరుని కంటిచే మరుండును, విష్ణువు కుడికన్నయిన సూర్యునిచేఁ జంద్రుండును లయించిరి.

ఉ. బాలిక ! యీసుధాకరుఁడు ♦ పంకజనాభునివామభాగ దృ
గ్గోళకమైననాఁడు నవ ♦ కోమలబాలతమాలకందలీ
కాళిమఁ గేలి సేయునదు♦కందిది తన్నయనాంతరంబునన్
నీలకనీనికామఘువ ♦ నీలమణిత్వము నొందకుండునే. 179

టీ. బాలిక, ఈసుధాకరుఁడు = ఈచంద్రుఁడు, పంక...గోళకము — పంకజనాభుని=పద్మము నాభియందుఁగలవానియొక్క, అనఁగావిష్ణునియొక్క యనుట. వామభాగ=ఎడమభాగమందున్న, దృగ్గోళకము=కంటిగ్రుడ్డు, ఐన నాఁడు = అయినప్పుడు, నవ...కాళిమన్ — నవ = నూతనముగాఁ బుట్టిన, కోమల=మృదువయిన, బాల = లేఁతయైన, తమాలకందలీ =తమాలపల్లవముల యొక్క, కాళిమన్ = నల్లఁదనమును, కేలి, చేయునదుకందు = పరిహాసము చేయఁజాలిన చంద్రునిలోనున్నమచ్చ,ఇది, తన్న...బునన్ =ఆవిష్ణువుయొక్క నేత్రమధ్యమందున్న, నీల...మణిత్వము - నీల=నల్లనిది, కనీనికా...త్వము= ఇంద్రనీలమణివంటినల్లగ్రుడ్డు,ధర్మమును, ఒందకుండునే = పొందదా ! విష్ణుని కనీనిక యింద్రనీలముపలెనున్నది, కాన చంద్రుఁడాతని నయన మయినప్పుడు చంద్రునియందున్న తమాలపల్లవముల నిరసింపఁజాలిన మచ్చ నల్లగ్రుడ్డైయుండుట కేమి యభ్యంతరమున్నది?ఏమియునులేదు. చంద్రుఁ డతనినేత్రమనియు మచ్చ నల్లగ్రుడ్డనియు ఫలితార్థము. అలం. ఉత్ప్రేక్ష.

ఆ. కమల విపినదాహ ♦ కంఠోక్త పటు తీవ్ర
శక్తియగు హిమాగ్ని ♦ సంగమమునఁ
గందఁబోలు శిశిరకరు♦డింద మీభంగి
నాతి యొందు కారణంబు లేదు. 180

టీ. నాతి, కమల...శక్తి-కమలవిపిన=పద్మవనములను, దాహ=దహించుటయనెడి, కంఠోక్త=నిశ్చయమగు, పటు=సమర్థమయిన, తీవ్ర=భయంకరమయిన, శక్తి=సామర్థ్యముగలది, అగు...మమునన్ =అయినట్టిహిమమందున్న యగ్ని యొక్క సంపర్కముచే శిశిరకరు డెందము ... ము, ఈభం

గిక్ కందఁబోలు=ఈకలంకమునకు,ఒండుకారణంబు=మఱియొకకారణములేదు. మంచునందుఁ బద్మవనముల మాడుచు నట్టి దాహశక్తియుండుటచేతను,దాహశక్తి యగ్నియందు మాత్రమేయుండెడి దగుటచేతను, జంద్రకిరణములం దగ్ని యుండకతీఱదు. ఆయగ్నిజ్వాల సంపర్కముచేత నీచంద్రుని చిత్తము గందఁగా, నాకందినభాగమును మచ్చగా జనులు తలంచుచున్నారు. అంతకుఁ దప్పవేఱుకారణములేదు. అలం. ఉత్ప్రేక్ష.

క. హరితచ్ఛాయాచ్ఛలమున
భరఖేదమువాయ నమృత ♦ పానీయసరో
వరమగు నీశశియందుం
దరుణీ! యోలాడుచున్న ♦ ధరణిం గంటే.　　181

టీ. తరుణీ, హరిత...ఛలమునన్=నల్లనికాంతులయొక్క మిషచేత, భరఖేదము=భూతములబరువువలనఁ గల్గిన యాయాసము,పాయన్=పోవునట్లుగా, అమృత...వరము=అమృతమనెడి యుదకముతో నిండిన (శ్రేష్ఠమయినసరస్సు), అగునీశశియందున్=అయినట్టియీచందురునియందు, ఓలాడుచున్నధరణిన్=జలక్రీడసలుపుచున్నభూమిని, కంటె = చూచితివా. భారఖిన్నులయినవారు తటాకాదులంజేరి జలకమాడుట ప్రసిద్ధము. చందురునియందలి మచ్చను భూచ్ఛాయనుగావర్ణించుట నితఁడేకాదు "అంకంకేపి శశంకిరే జలనిధేః పంకం పరేమేనిరే, సారంగం కతిచిచ్చ సంజగదిరే, భూచ్ఛాయమైచ్ఛన్పరే" అని యున్నది. అలం. సాపహ్నవోత్ప్రేక్ష.

తా. ఓదమయంతీ! భూమి సమస్తభూతకోటులను మోయుటవలన మిక్కిలి శ్రమచెంది యమృతముతో నిండి సరోవరమువలె నున్న చందురునియందుఁ దాన మాడుచున్నది. ఆభూమియొక్కఛాయయే మనకు మచ్చవలెఁ గానవచ్చుచున్నది, చూడుము.

తే. జనకుఁ డగుదుగ్ధవార్ధికి ♦ వైచ్ఛ్రవంబు
గలిగె నాయామనమున ♦ గలిగె నట్టి

తనకు గారాబుపట్టికి ◊ వనజవైరి
కొక్క కుందేలు కలుగుట ◊ యువిద ! యరుదె. 182

టీ. జనకుఁడు=చంద్రునకుఁ దండ్రి, అగు, దుగ్ధవార్ధికిన్=పాలసంద్రమునకు, ఉచ్చైశ్శ్రవంబును= ఉచ్చైశ్శ్రవమను పేరుగలగుఱ్ఱము, కలిగెన్, ఐ...బును=ఐరావతమనెడి యేనుఁగును, కల్గెన్ = సంభవించెను. గారాబుపట్టికిన్ = ఆసముద్రమునకు ముద్దుకుమారుఁడును, వనజవైరికిన్=పద్మములకు విరోధియునగు, అట్టితనకున్=చంద్రునకనుట. ఒక్క కుందేలు, కలుగుట, అరుదె=ఆశ్చర్యమా, తండ్రియగు సముద్రమధ్యముననుండి గజాశ్వాదులు వెడలినప్పుడు కొడుకునడుమనుండి కుందేలు వెడలెననుటలో నాశ్చర్య మేమున్నది? కుందే లతని మధ్యముననుండెను కాన యది మచ్చవలెఁ గానవచ్చుచున్నదని భావము. అలం. అర్థాపత్తి.

తే. జ్యోత్స్న నాఁగఁ దమిస్ర నా ◊ నుభయభార్య
లుడుపతికి నందు నొకతె దె◊ల్లోర్తు నల్ల
తాను వారికి మెచ్చుగాఁ ◊ దాల్పెఁ బోలు
తెలుపు నలుపును నగుమేను ◊ నెలఁత యితఁడు. 183

టీ. నెలత=ఓస్త్రీరత్నమా, ఉడుపతికిన్=చుక్కలకురాజైన చంద్రునకు, జ్యోత్స్న నాఁగన్=జ్యోత్స్న 'యను పేరుగలదియు, తమిస్రనాన్=తమిస్రయను పేరుగలదియునగు, ఉభయభార్యలు=ఇద్దఱుభార్యలు, కలరు. వెన్నెలరాత్రియనియుఁ, జీఁకటిరాత్రియనియు నిద్దఱుభార్యలు కలరనుట, అందు= ఆయిర్వురలో, ఒకతె=జ్యోత్స్నయనునది, తెల్ల=తెల్లనిది, వెన్నెలతోఁ గూడియుండునుగాన యట్లు చెప్పఁబడియె. ఓర్తు=తమిస్ర, నల్ల=నల్లనిది, చీఁకటితోఁ గూడియుండునుగాన యట్లుచెప్పబడియెను. తాను=ఆచంద్రుఁడు, వారికిన్=ఆయిర్వురుభార్యలకును, మెచ్చుగాన్=మెప్పుకొఱకు, తెలుపు...మేను=తెల్లనిదియు, నల్లనిదియు నగునట్టిశరీరమును, ఇతఁడు, తాల్పెఁబోలున్= ధరించెను గాఁబోలును. అలం. ఉత్ప్రేక్ష.

తా. అనుకూలుఁ డగుభ ర్త భార్యల యిష్టముచొప్పున వర్తించును గాన చంద్రునకుఁగల తెల్లనిదగు జ్యోత్స్నకుఁ బ్రియమగునట్లుగాఁ గొంత తెల్లని భాగమును, నల్లనితమిస్రకుఁ బ్రియమగునట్లుగాఁ గొంత నల్లనిభాగమును శరీరమునఁ దాల్చియుండనోపు. లేనిచో నీల శ్వేత కాంతులు గలశరీరము గలవాఁడై యుండ నేల ?

మ. గణుతింపంగ నితండు పాల్కడలికిం గారాబుపుత్త్రుండు బ్రా
హ్మణరాజోషధిభర్త నెట్టుకొని సంపాదించినన్ బ్రాఁతియౌ
మణిమంత్రౌషధముల్ పురావిహితకర్మం బెట్టిదో కాక ల
క్షణకాలుష్యము రాజయక్ష్మమును జిక్కం బెట్టలేఁడయ్యెడున్.

టీ. గణుతింపఁగాన్ =ఆలోచింపఁగా, ఇతండు=ఈచంద్రుఁడు, పాల్కడలికిన్, గారాబుపుత్త్రుండు=ముద్దుకొడుకు, బ్రాహ్మణరాజు=బ్రాహ్మణుల కధిపతి, ఓషధిభర్త=ఓషధీలతలకు నాయకుఁడు, కావునన్, బ్రాఁతియౌ=లభింపఁబడని వగు, మణి...ధముల్ =మణులను, మంత్రములను, నౌషధములను, నెట్టుకొని=ప్రయత్నించి, సంపాదించినన్ =ఆర్జించినప్పటికిని, పురావిహితకర్మంబు=పూర్వజన్మమునఁ జేసినకర్మము, ఎట్టిదో=ఎటువంటిదో కాని, లక్షణకాలుష్యము = లాంఛనరూప మగు నల్లఁదనమును, రాజయక్ష్మమును = క్షయరోగమును, చిక్కన్ =నశించునట్లుగా, పెట్టలేఁడు, అయ్యెడున్ =చేయఁజాలకున్నాఁడు. లోకమున సమస్తవ్యాధులను దొలంగింపఁజాలినవి మణులు, మంత్రములు, నౌషధములునై యున్నవి. ఇందులో నొక్కొక్కటి యున్నను వ్యాధులను గుదుర్చుకొనవచ్చును. ఈమూఁడును జేకూరినప్పుడు రోగములు కుదురునని వేఱచెప్పవలయునా? ప్రస్తుతమునఁ జంద్రుండు తాను సముద్రునికిఁ బ్రియతనూజుఁడు కావున గౌస్తుభాదిమణులను, బ్రాహ్మణులకు రాజుగావున వారివలన మంత్రములను, నోషధీలతలకుఁ బ్రియుండు కావున వానివలన నౌషధములను సంపాదింపఁగల్గెను. మణి మంత్రౌషధములు మూఁడును గలవాఁడైనను దనవచ్చును, క్షయరోగమును దొలంగించుకోలేకపోయెను. ఆలోచింపఁగా నతని పురాకృత కర్మము సుమీ? లేనిచో నివియేల నశింపవు. అలం. విశేషోక్తి.

క. కాలతమతిమిరనీలీ
కాళీదళరస కళంక కజ్జలపంక
క్షాళన గోక్షీరము లివె
ప్రాలేయ కరాంశు లంబరము శోధించెన్. 185

టీ. కాల...క్షీరములు—కాలతమ=మిక్కిలి నల్లని, తిమిర = చీకట్లనెడి, నీలీ=పెను నీలిచెట్టుయొక్కయు, కాళీ=సామాన్యపు నీలిచెట్టుయొక్కయు, దళ=ఆకులయొక్క, రస=రసముచేఁగల్గిన, కళంక=మచ్చలను, కజ్జలపంక=కాటుకబురదను, క్షాలన=కడుగుటకు, గోక్షీరములు=ఆవుపాలువంటివగు, ఇవె, ప్రాలేయకరాంశులు=ఈ చంద్రకిరణములు, అంబరమున్=ఆకాశమనెడి వస్త్రమును, శోధించెన్=శుభ్రపఱిచెను. వస్త్రమునకుఁ గాటుకమచ్చలుగాని, పెను నీలియాకుల పసరుచేఁ గల్గిన మచ్చలుగాని యున్నచో నవి ఆవుపాలవలనఁ దొలంగును.అట్లె యాకాశముననున్న చీఁకట్లు చంద్రకిరణములవలనఁ దొలంగెనని భావము. వస్త్రములందున్న కాటుకమచ్చలు మొదలగునవి పోవునని చెప్పుటకుఁ బ్రమాణము. 'తైలంఘృతేన, తచ్చోష్ణజలైరుగ్ధేనకజ్జలం,నాశయేదంబరస్థంతు, మలంక్షారేణ సోష్మణా' అనియున్నది. అలం. రూపకము.

తే. జలదకాళిమఁ బాపంగఁ జాలెఁ గాని
సహజకాళిమఁ బాపంగఁ జాలదయ్యె
శారదారంభవేళ యీచందురునకు
నతివ ; యయ్యెడి దొఁగాని యదియుఁగాదు. 186

టీ. అతివ, శారదారంభవేళ=శరత్కాలము, జలదకాళిమన్=వర్షాదికాలసంబంధియగు మేఘములనెడి నల్లఁదనమును, పాపంగన్, చాలెన్, కాని=తొలఁగింపఁగలిగెను కాని, ఈచందురునకున్, సహజకాళిమన్=చంద్రునియందున్న సహజనైల్యమును, పాపంగన్, చాలదు అయ్యెన్=సమర్థము కాకపోయెను, అయ్యెడిది=అగునట్టికార్యము, ఔన్ = అయితీఱును. కానియది యన్=కానికార్యము,కాదు. శరత్కాలము గగనమునందున్న మేఘమాలిన్య

మును బోఁగొట్టఁగల్గెనుగాని చంద్రకళంకము బోఁగొట్టఁజాలక పోయెను. శరత్కాలమున మేఘము లదృశ్యమగుటయుఁ జంద్రకళంకము మిక్కిలిగాఁ బ్రకాశించుటయును గలదు. అలం. అర్థాంతరము.

తే. అస్తమించినయప్పుడీ కేయమృతకరుని
కళలు పదునొక్కఁడెక్కు రుద్రులశిరంబు
లసమబాణుని దొనఁ జొచ్చు నైదుకళలు
కాంత! యిదిసూవె పదియాఱుకళలలెక్క. 187

టీ. కాంత! అస్తమించినయప్పుడు=చంద్రుఁడస్తమించినప్పుడు, ఈయమృతకరునికళలు=ఈచంద్రునియొక్కకళలు, పదునొక్కఁడు, రుద్రులశిరంబులను=ఏకాదశరుద్రులతలలపైకి, ఎక్కున్, ఐదుకళలు,అసమబాణునిదొనన్=మన్మథుని యమ్ములపొదిని, చొచ్చున్=ప్రవేశించును, పదియాఱుకళల లెక్క, ఇదిసూవె=ఇదియేసుమీ! ఇతని నాశ్రయించిన పదాఱుకళలు నితఁ డస్తమించినప్పు డెచ్చటనుండు ననఁగాఁ బదునొకండుకళలు రుద్రులశిరంబు లందును, మన్మథుని యమ్ములపొదిలో నైదుకళలునుండుననిభావము. మన్మథబాణములకుఁ జంద్రకళాసంబంధము గల్గుటచేతనే నవి విరహులఁ బీడింప సమర్థము లగుచున్నవని ఫలితార్థము. అలం. ఉత్ప్రేక్ష.

తే. అమృతజంబాలమున సందు లదికియదికి
వేయునక్షత్రముల నొక్కవిధము వానిఁ
జేర్చి విధి చందురునిగా నొనర్చెనేని
లలన! నీమోముసరి సకళంకుఁ డితఁడు. 188

టీ. లలన, విధి=బ్రహ్మ, వేయునక్షత్రములన్=పెక్కులు నక్షత్రములను, ఒక్కవిధమువానిన్ = సమానములయినవానిని, చేర్చి=సమకూర్చి, అమృతజంబాలమునన్=అమృతసంబంధియగు బురదతో, సందులు=నక్షత్రములకు మధ్యనున్న కన్నములు,అదికి,అదికి=సందు లేకుండఁబూడిచి, చందురునిఁగాన్, ఒనర్చెనేని=చేసినచో, నీమోముసరి = నీవదనమునకు సాటియగును. ఇతఁడు

సకళంకుఁడు=మచ్చతోఁగూడినవాఁడు, నీపెక్కింటిచుక్కల నేకముగాఁ జేర్చి యమృతపంకముతో నడుమనున్న కన్నములను బూడ్చి నిష్కళంకమగు చంద్రుని బ్రహ్మ చేసినచో నీమొగమునకు సాటియగును. అంతియకాని నిష్కళంకమగు నీవదనముతో సకళంకుఁడగు నీ చంద్రుఁ డెట్లు సాటివచ్చును. అలం. అభూతోపమ.

తే. చంద్రమండలమిది పితృస్థాన మగుట
జన సమావర్జితస్వధా సలిల తిలలు
మంత్రబలమున నెక్కె నీమధ్యమునకుఁ
జంద్రబింబాస్య ! లాంఛన చ్ఛాయగాదు. 189

టీ. చంద్రబింబాస్య=చంద్రునితో సమానమయిన వదనముగలదానా, చంద్రమండలము, ఇది=ఈచంద్రమండలము, పితృస్థానము=అగ్నిష్వాత్తాదిపితృదేవతలకు నిలయము, శ్రు 'చంద్రో వై పితృలోకః' అని వేదము. అగుటన్=అయియుండుటంబట్టి, జన...తిలలు—జన=భూలోకజనులచేత, సమావర్జిత=ఈయఁబడిన, స్వధా=పితృదేవతల కన్నమైన, సలిలతిలలు=తిలోదకములు, ఈమధ్యమునకున్=ఈచంద్రునిమధ్యభాగమునకు, మంత్రబలమునన్=మంత్రబలముచేత, ఎక్కెన్, లాంచనచ్ఛాయ, కాదు = కళంకముకాదు. అలం. ఉత్ప్రేక్ష.

తా. ఓదమయంతీ ! చంద్రమండలము పితృదేవతలకు స్థానమని వేదములు చెప్పుచున్నవి. కావున, భూలోకవాసులు తమ పితృదేవతల కర్పించెడి తిలోదకములు మంత్రబలముచేఁ జంద్రమండల మధ్యమును జేరెను, ఆతిలలే కళంకముగాఁ గానవచ్చుచున్నవి; అంతియకాని యది కళంకముకాదు.

మ. ఇదె వీక్షింపు చకోరశాబకనిభాక్షీ ! దీర్ఘికాహంసి యిప్డు దకాంతః ప్రతిబింబితుణ్ గగనమధ్యోపస్థితుం జంద్రునిన్
వది దర్శించి నిజాధినాథుఁడనుచున్ వాత్సల్య మేపారఁగాఁ
జదురొప్పంబరిచుంబనంబొనరుచున్ జంచూపుటాగ్రంబునన్.

టీ. చకోర...శాక్షీ—చకోరశాబక=వెన్నెలపులుఁగుపిల్లలతో, నిభ=స

మానమయిన, అక్షీ=నేత్రములుగలదానా ! దీర్ఘికాహంసి = క్రీడాసరస్సులో నున్న యాఁడుహంస,ఇప్డు=ఈసమయమునందు, ఉదకాంతః ప్రతిబింబితున్ = జలమందుఁ బ్రతిఫలించినవాఁడును, గగనమధ్యోపస్థితున్ = ఆకాశమధ్యమందున్నవాఁడును,నగు,చంద్రునిన్,నదిన్,దర్శించి=చూచి, నిజాధినాథుఁడు=తన యధిపతియని,మదిన్=మనస్సులో,అనుచున్=భావించుకొనుచు,వాత్సల్యము=ప్రేమము, ఏపారఁగాన్=వర్ధిల్లునట్లుగా, చదురు=నేర్పు, ఒప్పన్, చంచూపుటాగ్రంబునన్=పుటమువంటి చంచువుయొక్క యగ్రముతో, పరిమంబనంబు, ఒనరుచున్=ముద్దుపెట్టుకొనుచున్నది. ఇదె, వీక్షింపుము = చూడుము, ఆహారాదులకుఁగాని విలాసార్థముగాని హంసద్వంద్వము జలములో మునిఁగెను. పురుషపక్షికి మిక్కిలి యీఁత నేర్పుండుటచేఁ జిరకాలము నీళ్లనుండఁగలిగెను. ఆఁడుపక్షి యట్లుండలేక నీళ్లపైకి లేచి తన భర్తకై చూడ తనసమీపమున చంద్రప్రతిబింబముగానవచ్చెను. అదిచూచి తనభర్తయేయనుకొని ముద్దిడుచుండెను. సామాన్యముగా నీళ్లలోమునిఁగియుండి కొంతసేపటికి పైకిలేచి చూచినచో దిగ్భ్రమ చెందినట్లు గానవచ్చుట యనుభవసిద్ధము. కావున నీహంసయు భ్రాంతిచేఁ జంద్రబింబమును దనప్రియుండనుకొని ముద్దుగొనెను. మూలమున 'భ్రమేణయ చుంబతి రాజహంసి'యని వర్తమానకాల క్రియయున్నది. కానఁ దదనుసారముగాఁ దత్కాలక్రియ నుంచుట యుక్తమని 'ఒనరుచున్' అని దిద్దఁబడెను. అలం. భ్రాంతిమత్తు.

మ. అకలంకాఖిలదీర్ఘికాజల తపస్యత్కైరవశ్రేణికా
ముకులీభావ సమాధి భంగకలనాశ్రీమద్గ్రాప్సరఃకామినీ
వికచాస్యాంబుజమీనిశాకరుఁడు దేవీ!చూడుమీసాంద్రచం
ద్రికలే తద్దరహాసచంద్రికలు సందేహంబు లేదెంతయున్.

టీ. దేవీ! ఈనిశాకరుఁడు=ఈచంద్రుఁడు, అకలం...బుజము—అకలంక=నిష్కళంకములైన, అఖిల=సమస్తమైన, దీర్ఘికా=సరస్సులందలి, జల = నీటియందు, తపస్యత్=తపస్సుచేయుచున్న, కైరవశ్రేణికా=తెల్లఁగలువపంక్తులయొక్క, ముకుళీభావ=సంకోచించి యుండుటయనెడి, సమాధి = తపస్సుయొ

క్క, భంగకలనా=భంగము కల్గించుటయందు, ముగ్ధ=సుందరియైన, అప్సరః కామినీ=అచ్చరయొక్క, వికచ=వికసించిన, ఆస్యాంబుజము = ముఖపద్మము, ఈ సాంద్రచంద్రికలు=దట్టమైన యీ వెన్నెలలు, ఏతద్దరహాసచంద్రికలు=ఈము ఖముయొక్క మందహాసకాంతులు, ఎంతయున్, సందేహంబు లేదు, చూడు మీ, మహామునులు మొదలగువారు తప మొనరించుచుండఁగా దేవతాప్రేరిత లయిన యచ్చరలు వచ్చి తమ విలాసములచే మోహింపఁజేయుట పురాణప్రసి ద్ధము. మునులు జలమందు నిలిచి తపంబు చేయుచుండుటయుం గలదు. ప్రస్తుత మున నాకసమున నున్న పరిపూర్ణచంద్రబింబము జలములందు ముకుళత్వము నొంది చేయుచున్న తెల్లఁగలువల తపస్సునకు విఘ్నము చేయుటకై వచ్చిన య చ్చరయొక్క ముఖపద్మమువలె నున్నదనియు, వెన్నెలలు, మందహాసమువలె నున్నదనియు నెఱుంగునది. సుందరులగు నప్సరస్త్రీలముఖంబు చూచినక్షణమందె మునులు సమాధివిడిచి దానితో సంతసంబున వర్తించినట్లు కలువలును చంద్ర దర్శనముచే వికసించినవనిభావము. అలం. రూపకము. ఉత్ప్రేక్షము.

మ. నవలావణ్యరసంబు పల్లెరములోఁ గ్రొత్తగాఁ బోసి యగ్రంబునన్
భవదీయాస్య మొనర్చి యూర్చి పిదపం బ్రాలేయ రుఙ్మండలం
బువినిర్మించె విరించి, యచ్చిలుము వోఁ బూఁబోఁడి యా చిహ్నమం
బువులం దాతఁడు చేఁదొలంచుమిసిమింగ్రొబ్బెట్టెన్ సరోజాతముల్.

టీ. పూఁబోఁడి=పూవులవంటిశరీరముకలదానా, విరించి=బ్రహ్మ, పళ్లెరములో నన్, నవలావణ్యరసంబున్=క్రొత్తదయిన లావణ్యమనెడిరసమును, పోసి, అగ్రంబునన్=ముందుగా, భవదీయాస్యము=నీముఖమును, ఒనర్చి=సృజించి, ఆర్చి=తడియార్చి, పిదపన్, ప్రాలే...బు- ప్రాలేయరుక్=చంద్రునియొక్క మండలంబు, వినిర్మించెన్=చేసెను. ఆచిహ్నము = ఆ చంద్రమండలమునందు న్న లాంఛనము, అచ్చిలుమువో=ఆలావణ్యమందలి మురికిఁగాఁబోలును, ఆతఁ డు=బ్రహ్మ, అంబువులన్=నీటిలో, చేన్=చేతిని, తొలంచు=కడుగుకొన్న, మిసిమిన్=ఆ చేతినంటియున్న లావణ్యముచేత, సరోజాతములు = పద్మ

ములు, పుట్టెఁ, ఓదమయంతీ బ్రహ్మ నీముఖమును సృజింపఁదలంచి ప్రతివస్తు వందునుంగల లావణ్యమునుదీసి ముందుగా నీవదనంబును సృజించెను. పిమ్మటఁ జంద్రుని నిర్మించెను. చేయి కడుగుకొనునప్పుడు చేతి నంటుకొన్న లేశములు నీళ్ల లోఁబడి పద్మములయినవి. బ్రహ్మకు నీముఖమును జంద్రునిసృజించుటకే శ్రమ కలిగెను. కాని పద్మసృష్టికై సుంతేనియు శ్రమ చెందలేదు. మఱియు నొకపాత్రములో నేదేని ద్రవపదార్థము పోసినచో మీద నిష్కళంకమయిన దుండి యడుగున మలినమైనదుండును. బ్రహ్మ పాత్రములో లావణ్యమును బోసి మీఁదనున్న నిష్కళంకలావణ్యముచే నీవదనముగావించెను. కనుక నే నీవదనము నిష్కలంకమైనది. అడుగుననున్న మలినంపులావణ్యముతోఁ జంద్రునిఁ జేసెను. కావున నే యామాలిన్యము మచ్చవలెగానవచ్చుచున్నదని భావము. దమయంతి వదనము చంద్రపద్మములకంటెను సుందరమయినదని భావము. అలం. ఉత్ప్రేక్ష.

శా. ఛాయామార్గభుజంగహారమును జంచత్తారకామండల
స్ఫాయద్దివ్యకపాలభూషణముజ్యోత్స్నాభస్మగౌరంబునై
యీయాకాశముశంభుమూర్తియగుతన్నేర్పాటునందెల్పెడుం
దైత్రియక్షాణిమభూతిసూక్ష్మతరమధ్యా! దీనివీక్షింపుమీ.

టీ. త్రై...మధ్యా-త్రైయక్ష= ముక్కంటిసంబంధియగు, అణిమ=అణుత్వమనెడి, భూతి = సిద్ధికంటెను, సూక్ష్మతర = మిక్కిలిసూక్ష్మమైన, మధ్యా = నడుముగలదానా! అణువు మిక్కిలి చిన్నదనియు, దమయంతి నడుము దానికంటెను చిన్నదనియు, భావము. ఛాయా...రమును = ఛాయామార్గమనెడి సర్పహారముగలదియును,ఛాయామార్గమనఁగా, ఇంద్రధనుస్సువలె నుత్తరదక్షిణములకు వ్యాపించి నక్షత్రములచే దట్టమై రాజమార్గమువలెఁ గానవచ్చునది. చంచ...భూషణము-చంచత్ =ఒప్పుచున్న, తారకామండల=నక్షత్రమండలమనెడి, స్ఫాయత్ =పెద్దదియగు,దివ్య=శ్రేష్ఠమైన,కపాలభూషణము= కపాలమాలయనెడి యాభరణముగలదియు,జ్యోత్స్నాభస్మగౌరంబు=వెన్నెలయనెడిబూడిదచే తెల్లనిదియునై, [illegible]

నినిుదిమూర్తులలోను నొకటియగు, తన్నుక్=ఆకాశమునినుట, ఏర్పాటునక్= స్పష్టముగా, తెల్పెడుక్=తెలుపుచున్నది. పంచభూతములును, సూర్యుఁడును, చంద్రుఁడును, సోమయాజియును, శంకరుని నెనిమిదిమూర్తులనుట ప్రసిద్ధము. ప్రస్తుతమున, నీశ్వరుని తనువైనయాకాశము, ఛాయామార్గమనెడి సర్పహారము ను, నక్షత్రసమూహమను కపాలమాలికయు, నక్షత్రపంక్తియనెడి బూడిద పూఁతయును గలదగుటచే, తాను శివమూర్తియనుటను సార్థకపఱుచుచున్నదని భావము. ఆకాశము ఛాయామార్గముతోను నక్షత్రములతోను వెన్నెలతోను నొప్పుచున్నదని ఫలితార్థము. రూపకము.ఉత్ప్రేక్ష.

తే. దేవి యితఁడు హార్యక్షీ
భావము భజియించియుండఁ బ్రకృతివిరోధం
బే వెంటఁ గలిగెనొక్కొ
కావలమున కకట సింహికాసూనునకున్. 194

టీ. దేవి=దమయంతీ, ఇతఁడు=ఈచంద్రుఁడు, హార్యక్షీభావము= విష్ణువు నేత్రధర్మమును, మఱియు హార్యక్షమనఁగా సింహము, కాన సింహధర్మభావ మును, భజియించి=పొంది, ఉండన్; కావలమునకుక్=దుష్టుఁడగు,సింహికా సూనునకుక్ =ఆసింహికకొడుకయిన సింగపుఁగొదమకు మఱియు,సింహికయనెడి రాక్షసికొడుకునకు, అనఁగా రాహువునకనుట. అక్కట=అయ్యయో, ప్రకృతి విరోధము=స్వభావసిద్ధ మగువైరము, ఏవెంటక్ కలిగెను, ఒక్కొ=ఏవిధ ముచేతఁ గలిగినదోకదా, చంద్రుఁడు హరికి నేత్రమగుచున్నాఁడు కావున హార్యక్షియనఁబడును. దానిధర్మము హార్యక్షీభావము. ఇతఁడు మగసింహమగు చుండఁగా సింహికకొడుకునకు జనకుఁడగును. కాన యీసింహికాసూనుఁడు సిం హమందు పితృభక్తిచూపవలయును. ఇట్లు సహజవైరము వహించుట యేపాప ముచేతనో కదా! తండ్రికిని గొడుకునకును విరోధ మున్నదనిన, విరోధమును చంద్రరాహువులని యర్థముచెప్పుటచేఁ బరిహారమును నగును.

మ. అలరుంబోఁడి! సహస్రపత్రతులనా కీహాంకారలీలావిశ్రం

ఖలసౌభాగ్యకళాకలాపమగు నీకాంతాస్యముం బోలఁగా
వలదా యీశశికిం గళంకికి మృగవ్యాధోత్తమాంగస్థలీ
వలదాకాశధునీతటావనివనీవానీరకోయష్టికిన్. 195

టీ. అలరుంబోఁడి=పువ్వువంటి మేనుగల దమయంతీ,సహస్ర...కలాపము-సహస్రపత్ర= వేయి రేకులుగల పద్మముయొక్క, తులనా=తిరస్కరించుటయందలి, అహంకార=గర్వముయొక్క, లీలా=విలాసము చేత, విశృంఖల=నిరాటంకమైన, సౌభాగ్యకళా=సౌందర్యకళయే, కలాపము = భూషణముగాఁగలది? అగు నీకాంతాస్యమున్ = అయినట్టి మనోహరమయిన నీవదనమును, కళంకికిన్=కళంకముగలవాఁడును, మృగ...కోయష్టికిన్-మృగవ్యాధ=మృగమును వేఁటాడినవాఁడు,దక్షునియజ్ఞము మృగరూపమై పర్వెత్తుచుండఁగావాని వేఁటాడెనని భావము. అనఁగా నట్టియీశ్వరునియొక్క, ఉత్తమాంగస్థలీ=శిరఃప్రదేశమునందు, వలత్=పాఱుచున్న,ఆకాశధునీ=గంగానదియొక్క, తటావని=తీరప్రదేశములందున్న, వనీ= చిన్నయడవులందున్న, వానీర= నీటిప్రబల్చిచెట్లయొక్క, మధ్యమునవసించునట్టి, కోయష్టికిన్=గ్రుడ్డికొంగయయినవాఁడును, నగు ఈ శశికిన్ =ఈచంద్రునకు, పోలఁగాన్, వలదా=సామ్యమునుబొందవలదా ? అనఁగా సమత్వమునుబొంద శక్యమాయని భావము.ఈయర్థమున దీనికిఁ బ్రయోగాంతరము మృగ్యము. స్వతస్సిద్ధమగు కళంకముతోఁగూడి, శంకరుని తలయందుఁ బాఱుచున్న గంగానదీతీరములందున్న నీటిప్రబ్బచెట్లలో వసించెడి గ్రుడ్డికొక్కరవంటివాఁడగు నీచంద్రుఁడు, వేయిదళములుగలపద్మమును దిరస్కరింపఁజాలిన సౌందర్యాతిశయము చే నొప్పుచున్న నీవదనమునకు సాటిరాలేఁడని భావము. అలం. రూపకము.

స్రగ్ధర. నానాధావళ్యసంతానములకునునిదానంబునానొప్పు నీరా,కానక్షత్రేశు మేనంగలదెయొకకళంకంబునుంగాక తాళీయానంబై త్రోవరాఁగాహరిహయనగరీహస్తిరాడ్గండపిండస్థానా... . 196

టీ. పైత్రోవన్ =మీఁదుమార్గమున, అభ్రవీథిన్ = గగనమందుండి, రాఁగాన్ =వచ్చుచున్నసమయమునందు, హరి...లవములన్- హరిహయ=ఇంద్రుని యొక్క, నగరీ=పురమగు నమరావతియందున్న, హస్తిరాట్=ఐరావతముయొక్క, గండపిండ=పిండములవంటికటములయొక్క, స్థాన=ప్రదేశము, అపాదాన=అపాదానముగాఁగల, అనఁగా నందుండిస్రవించుచున్నదనుట. దానద్రవ=ద్రవరూపమయిన మదముయొక్క, నవ=క్రొత్తవైన, లవములన్=లేశములు, లేక బిందువులు, తాఁకెన్ కాక=తాఁకెనుగాని. నానా...దానమ్ము-నానా=పలువిధములయిన, ధావళ్య=ధవళకాంతులయొక్క,సంతానమునకున్=సమూహమునకు, నిదానంబు=మూలమైనవాఁడు, నాన్=అనిచెప్పుచుండఁగా, ఒప్పసీరాకానక్షత్రేశు మేనన్ = అలరుచున్న యీపూర్ణచంద్రునియొక్క శరీరమునందు, ఒకకళంకంబునున్=ఒకమచ్చయినను, కలదే=ఉన్నదా.

తా. దమయంతీ! ఈచంద్రుఁడు ధవళకాంతులకెల్లను స్థానభూతుఁడు. అట్టి యితనికిఁ గళంకముగలుగుట యెట్లు సంభవించును? వాస్తవముగాఁ జంద్రునికి దిలేదు. మఱి మచ్చ గానవచ్చుటకుఁ గారణమేమందువేని యితఁడాకాశమార్గమున నమరావతి బడివచ్చుచుండఁగా నందున్నయైరావతముయొక్క మదజలకణములు తూలి తెల్లనిచంద్రునిపైఁబడి మచ్చగాఁ గానవచ్చుచున్నవి.

మ. ఉడువీథీ హరి నీల రత్నమయ పాత్రోత్సంగభాగంబునన్
గడుగారామున రేఝషాంకునకునంశకచ్ఛాయయన్నంజునూ
టిడితోఁగూడసుధాంశుబింబమను నేర్పయింబాయసాహారముం
గుడువం బెట్టెనో బంతికూళ్లకునుజాకోరంబు లేపారఁగాన్.

టీ. చాకోరంబులు=వెన్నెలపులుఁగులమొత్తములు,బంతికూళ్లకును=తరువాత బంతిభోజనములు చేయఁదలంచినవయి, ఏపారంగన్=ఒప్పునట్లుగా, ఉడు...భాగంబునన్-ఉడువీథీ=ఆకాశవీథియనెడి, హరినీలరత్నమయపాత్ర=ఇంద్రనీలరత్నములతోఁ జేయఁబడిన పాత్రయొక్క, ఉత్సంగభాగంబునన్=మధ్యభాగమునందు, [illegible]రాత్రియందు,

ఝుషాంకునకున్ = మత్స్యముచిహ్నముగాఁగలమన్మథునకు, అంక...తోఁగూడన్-అంక=మచ్చయొక్క, ఛాయ=కాంతి,అన్ =అనునట్టి, నంజు=నంజుకొనువస్తువగు,నూటిడితోఁగూడన్ =నూవుపిండితోఁజేసిన భక్ష్యవిశేషములోఁగూడ, సుధాంశు...హారమున్-చంద్రబింబమనెడి నేతిని,పాయసాన్నమును, కుడువన్ పెట్టెనో=భోజనముపెట్టెనుగాఁబోలును. ఇట,నంజు, నూ+ఇడితోన్ =అనివిభాగము. ఇది, 'పూటడేదము' వంటిది.ఇడియనఁగా నావిరినుడుకఁబెట్టినపిండితోఁజేయు నొకానొక భక్ష్యవిశేషము.నువ్వుశబ్దమునకు నూశబ్దము రూపాంతరమని యెఱుంగునది.పాయసాన్నము కేవలము మధురముగానుండునుగావున వేగముగా బానియందరుచిపుట్టకుండనుండుటకై కమ్మనిదియు నూవుఁబిండితోఁజేసినదియు నగు పదార్థమును వ్యంజనముగానుంచెననిభావము. ఆకాశ మొక యింద్రనీలమయమగు పాత్రమువలెను, నంకచ్ఛాయ, పాయసభక్షణము సహాయద్రవ్యమువలెను,చంద్రబింబము ఘృతయుక్తమైనపాయసాన్నమువలెను నొప్పుచున్నవి. తామనుభవింపవలసిన యాపదార్థమునుముందుగా దేవునకు నివేదించి పిమ్మటఁదచ్ఛేషమును దక్కినవారు భుజించుటకలదు. అట్లే చకోరములు తమ కాహారమగు చంద్రుననుభవింపఁగోరి ముందుగాఁ దమదైవమగుమరునికి నివేదించెనని భావము. ఇందు "అను"నెడి తద్ధర్మార్థకవిశేషణము 'అలరురతిన్ రతీశు' ననుచోటను, నీధనువును బాణంబులు, కృపాణంబులు అనుచోటను, విశేషణ యుష్మచ్ఛబ్దములవలె వ్యవహితముతోఁగూడ నన్వయించునని తెలియవలయును.

శా. అభ్రాంతంబున సింహికాతనయదంష్ట్రాంకూరయంత్రోద్భవ
    శ్వభ్రాళీపతయాళుదీధితిసుధాసారచ్ఛటావాహియై
    శుభ్రాంశుండు సహస్రధారకలశస్ఫూర్తిం బ్రవర్తిల్లె హే
    లాభ్రాజిష్ణు రతిస్మరోద్వాహన కల్యాణాభిషేకంబునన్. 198

టీ. అభ్రాంతంబునన్ =ఆకాశమధ్యమున, శుభ్రాంశుండు = తెల్లనికిరణములుగలవాఁడు, అనఁగాఁ జంద్రుఁడనుట, సింహి...వాహియై— సింహికాతనయ = రాహువుయొక్క, దంష్ట్రాంకూరయంత్ర = కోఱలనెడి సాధనములవలన, ఉద్భవ=పుట్టిన, శ్వభ్రాళీ=కన్నములవరుసనుండి, పతయాళు=పడు

చున్న, దీధితి=కిరణరూపములయిన, సుధా=అమృతముయొక్క, ఆసార=జడి వానయొక్క, ఛటా=పంక్తిని, వాహియై =వహించువాఁడై, హేలా...కం బునన్—హేలా=విలాసములచే, భ్రాజిష్ణు=ప్రకాశించెడి స్వభావముగల, రతి స్మర=రతిమన్మథులయొక్క, ఉద్వాహ=వివాహ సంబంధియగు, కల్యాణాభి షేకంబునన్=మంగళస్నానమునందు, సహస్ర...స్ఫూర్తిన్= వేయిధారలు గలకలశమువలె, ప్రవర్తిల్లె=ఒప్పెను. రాహు వనేకపర్యాయములువచ్చి చంద్రుని గ్రసింపఁగా నతని కోఱలచేఁ జంద్రమండలమున ననేకములగు రంధ్రములు పడెను. ఆరంధ్రములనుండి యమృతము విస్తారముగాఁ గురియుచుండెను. అట్లు కన్నములనుండి యమృతమును స్రవింపఁజేయుచున్న చంద్రుఁడు రతి మన్మథుల వివాహసమయమున, మంగళస్నానముచేయింపనుంచిన సహస్రధార కలశమువలె నొప్పెననిభావము. ఇటఁ బెక్కింటి ప్రతులలో, కల్యాణార్థసం సిద్ధికిన్=అనియున్నదికాని, మూలమున, పుష్పేషునః ప్రియాపరిణయా నందాభిషేకోత్సవే" యనియుండెను. తదనుగుణముగా మార్పఁబడెను. అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

క. పదియేనుదినంబులకుం
బదియేన్కళలెక్కి మేను పరిపూర్ణముగాఁ
బదియాఱవకళ యితనిది
మదిరాక్షి వృషధ్వజుండు మౌళి ధరించున్. 199

టీ. మదిరాక్షి, పదియేనుదినంబులకున్=ప్రతిపత్తిథిమొదలు పౌర్ణమివఱకును గలపదునైదుదినములలోను, పదియేనుకళలు, ఎక్కి = సంక్రమించి, మేను= చంద్రునిమండలము, పరిపూర్ణముగాన్ = నిండినదాటచే, ఇతనిది=ఈచంద్రు నిది, పదియాఱవకళను, వృషభధ్వజుండు=వృషభమే ధ్వజచిహ్నముగాఁ గల వాఁడు, అనఁగా శివుఁడనుట, మౌళిన్=కిరీటమునందు, ధరించున్.

సీ. ముక్కంటి తలపువ్వు ముమ్నీటి లేఁబట్టి



[illegible]

గగనలక్ష్మికి దంతకాండతాటంకంబు
కలువల విందు జక్కవలగొంగ
నలరాజువెల్లల్లి వనజబాంధవునుద్ది
శిశిరాంశురత్నంబు చేదుమందు
కన్నులపండువు గ్రహసార్వభౌముండు
సురలయోగిటిపంట యిరులుదాయ
తే. శ్రీమహాలక్ష్మి సైదోడు శేషభువన
సౌధకలధౌతకలశంబు చందమామ
రాజవదన కల్యాణపరంపరాభి
వృద్ధిఁ గావించుఁగాత యీ విశ్వమునకు.　　200

టీ ముక్కంటి...పువ్వు=శంకరునకుఁ దలపూవైనదియు, మున్నీటిపట్టి=సముద్రునకు కుమారుఁడును, కైట...దమ్మి = విష్ణువునకు నెడమనేత్రపద్మమును, గగనలక్ష్మికిన్, దంత...కంబు = దంతమయమైన కర్ణాభరణమును, కలువలవిందు=కలువలకుఁ జుట్టమును, జక్కవలగొంగ=చక్రవాకములకు శత్రువును, నలరాజు వెల్లల్లి=మన్మథుని చేతి తెల్లగలువ-నలరాజు నెచ్చెలి (అను ...ర మున)మన్మథునకు హితుఁడును, వనజబాంధవునుద్ది=సూర్యునకు జోడైనవాఁడును, శిశిర...త్నంబు=చల్లనికాంతులుగల రత్నంబును, చేఁదుమందు=విషమును ద్రిప్పఁజాలిన యమృతమనెడి మందుగలవాఁడును, కన్నులపండువు, గ్రహసార్వభౌముండు, సుర...పంట=దేవతలకాహారమైనవాఁడును, ఇరులదాయ=చీఁకటికిశత్రువు, శ్రీమహాలక్ష్మి సైదోడు=లక్ష్మికిఁదోడఁబుట్టినవాఁడు. అశేష...కలశంబు — సమస్తభువనములనెడి మేడమొక్క యగ్రమందుండు వెండికుంభమును, అగుచందమామ, రాజవదన, కల్యా...వృద్ధిన్ =శుభపరంపరల యభివృద్ధిని, ఈవిశ్వమునకున్ = ఈ ప్రపంచమునకు, కావించుఁగాత = చేయునుగాక.
వ. అనుచు నిజవంశమకుట మాణిక్యం బైన రోహిణీరమణు
నకు రమణీయ మీతంబుగాఁ బుష్పాంజలి సమర్పించి యాంగ్లీ

యక మణిప్రభాసందోహంబు చంద్రికా ప్రవాహంబుపై వెల్లిగొన భూవల్లభుండు పాణిపల్లవంబులు మొగిచి ఫాల భాగంబునం గీలుకొలిపె నివ్విధంబున నాదంపతు లనురాగ సంపద పొంపిరివోవం బారిజ్యంబు లగు రాజ్యసుఖంబుల ననుభవించుచుండిరి. తత్కాలంబునం జాతుర్వర్ణ్యంబు నిజ ధర్మంబుఁ దప్పక మెలంగె. వాతజ్వరాగ్ని క్షుత్పిపాసావ్యాధి తస్కరభయంబు లుడిగె. పర్జన్యుండు గాలంబుదప్పక వర్షించె. దేశంబులు ధనధాన్య సమృద్ధంబులయ్యె. సురభు లమృతంబు లఁ గురిసె. తరువులు పుటక పుటకంబుగ మధుస్యందంబుఁ జెందె. సకలజనంబులు పరమానందంబు నొందిరి. మామల్ల దేవీనందనుండును శ్రీహీరరోహణాచల రత్నప్రరోహం బును చింతామణి మంత్రచింతనఫలంబును గన్యాకుబ్జరాజా స్థాన రంగమంగళాభరణంబును గౌడవిజయకావ్య కర్తయుఁ గవి చక్రవర్తియు ఖండనగ్రంథకారుండును వైతండిక కమ లషండవేదండంబును నగు భట్టహర్ష మహాకవీశ్వరుండుఁ గవికులాదృష్టాధ్వపాంథుం డొనర్చిన నైషధశృంగార కావ్య ప్రబంధ విశేషంబున నశేషమనీషిహృదయంగమంబుగా శబ్దంబనుసరించియు నభిప్రాయంబు గుఱించియు భావంబు పలక్షించియు రసంబుఁబోషించియు నలంకారంబు భూషిం చియు నౌచిత్యంబాదరించియు ననౌచిత్యంబుఁ బరిహరించి యు మాతృకానుసారంబునఁ జెప్పఁబడినయీభాషా నైష ధకావ్యం బాపస్తంబసూత్ర! భారద్వాజగోత్ర! యుభయకు లపవిత్ర! దానవిద్యాసత్ర! నెల్లూరి తూర్కరాజపౌత్ర! మా మిడి పెద్దనామాత్యపుత్ర! పెదకోమటి వేమభూపాలకరుణా

పాత్ర ! వినయవివేక సాహిత్యసింగనామాత్యా ! నీవు కృతి
భర్తవుగాఁ బుణ్యశ్లోకుండు నలుండు కథానాయకుండుగా
విలసిల్లు నా చంద్రతారార్కంబు. 201

టీ. అనుచున్, నిజవంశ...మాణిక్యంబు = తన వంశమనెడి కిరీటమునకు రత్నమువంటివాఁడు, ఐన ..రోహిణీరమణునకున్ = అయిన చంద్రునకు, రమణీసమేతంబుగన్ = దమయంతితోఁగూడ, అంగుళీ...సందోహంబు అంగుళీయక = ఉంగరముల సంబంధియగు, మణిప్రభా = మణికాంతులయొక్క, సందోహంబు = సమూహము, చంద్రికాప్రవాహంబుపైన్ = వెన్నెలపై, వెల్లిగొనన్ = ప్రవహించునట్లుగా, భూవల్లభుండు = నలుండు, పాణి...కీలుకొలిపె = చేతులు ఫాలమందుఁ జేర్చి నమస్కరించెను. ఆదంపతులు, అనురాగసంపద = అనురాగ సమృద్ధి, పొంపిరివోవ = వర్ధిల్లునట్లుగా, ప్రాజ్యంబులు = గొప్పవి, అగు రాజ్యసుఖంబులు; అనుభవించిరి. చాతుర్వర్ణ్యము = బ్రహ్మ క్షత్త్రియ వైశ్యశూద్రులు, వాత ..భయంబులు - వాతభయము, రోగభయము, నగ్నిభయము, క్షుత్పిపాసలవలని భయము, మనోవ్యాధివలనిభయము, తస్కరభయములు, ఉడిగెన్ = నశించెను. సురభులు = గోవులు, అమృతంబులు = క్షీరములు, కురిసెన్, తరువులు, పుటకపుటకంబునన్ = చోటచోటమని, మధుస్యందంబున్ = మధుస్రావమును, చెందెన్, మామల్ల...నుండును - మామల్లదేవికుమారుఁడును, శ్రీహీర...హంబును = శ్రీహీరుఁడనెడిరోహణపర్వతమునకు, రత్నాంకురమువంటివాఁడును, చింతా...ఫలంబును = చింతామణి మంత్రమును జపించినందులకు ఫలమైనవాఁడును, కన్యా...భరణంబును - కన్యాకుబ్జనగరాధిపతిసభకు మంగళాభరణమువంటివాఁడును, గౌడ...కర్తయున్ = గౌడవిజయమనెడి గ్రంథము న్వ్రాసినవాఁడును, కవి...వర్తియున్ = కవులలో సార్వభౌమునివంటివాఁడును, ఖండన ...కారుండును; ఖండనగ్రంథములరచించినవాఁడును, వైతండిక ... వేదండంబును = వైతండికులనెడిపద్మసమూహములకేనుఁగువంటివాఁడును, భట్టహర్షమహాకవీశ్వరుండు, కవి...పాంథుండు - కవిసమూహములచేఁ జూడఁబడని

క్రొత్తమార్గములం గ్రొక్కినవాఁడు, ఒనర్చిన...విశేషంబులన్ = చేసిట్టి నైషధమనెడి శృంగారప్రబంధంబునందు, అశేష .. బుధాళిన్ = సమస్త పండితులకు సంతసము కలుగునట్లుగా, చెప్ప.........వ్యంబు=తెనిఁగించిన యీనైషధగ్రంథమును, ఆపస్తంబసూత్ర, భారద్వాజగోత్ర = భారద్వాజ గోత్రముగలవాఁడా, ఉభయ...పవిత్ర = పితృమాతృవంశములను బవిత్రముచే యువాఁడా, దానవిద్యాసత్ర = దానవిద్యకు సత్రమువంటివాఁడా, మామిడి పెద్దనామాత్యపుత్త్రి), పెద..పాత్ర=పెదకోమటి వేమభూపాలుని కరుణా రసమునకుఁ జోటయినవాఁడా, వినయ...మాత్యా= వినయవివేకాదులుగల సింగనామాత్యా; నీవు, కృతిభర్తవు=కృతిపతివి, కాఁగాన్, పుణ్యశ్లోకుండు, నలుఁడు, కథానాయకుండు = కథాధిపతి, కాన్, ఆచంద్రతారార్కంబు = సూర్యచంద్రనక్షత్రములున్నంతకాలమును, విలసిల్లున్ = ప్రకాశించుఁగాక.

సీ. నలచక్రవర్తి పుణ్యశ్లోకుఁ డగుటను
దమయంతి పతిదేవతావతంస
మగుట నప్పరమభవ్యపురంధ్రి పురుషుల
చరితంబు సత్కావ్యసరణిఁ గూర్చి
చింతామణీమంత్రసిద్ధుండు పాధ్యాయ
భట్టహర్షుండు వాక్ప్రౌఢిమెఱయఁ
జెప్పిననైషధశృంగారకావ్యంబు
దెలియఁ జెప్పితి నాంధ్రదేశభాష
తే. నిమ్మహాకృతి బఠియించు నెవ్వఁడేని
వాఁడు ధపగతకలిదోషుఁడగుచుఁ గాంచు
నాయురారోగ్య విమల విద్యావివేక
భాగ్యసౌభాగ్యవైభవ ప్రాభవంబు. 202

టీ. నలచక్రవర్తి;పుణ్యశ్లోకుఁడు=పవిత్ర మగు చరిత్రకలవాఁడు,అగుటన్= అయియుండుటచేతను, దమయంతి, పతి...వతంసము=పతివ్రతలకు శిరోభూ

షణము, అగుటను=అయియుంటను, అనగాఁ బతివ్రతాశ్రేష్ఠయనుట. అప్ర
రమ ..షులచరితంబు=ఆ మిక్కిలి కొనియాడఁదగిన దంపతులయొక్క చరిత్రము
ను,సత్కావ్యసరణిన్=నిర్దుష్టమగు కావ్యమార్గమందు, కూర్చి=పొందుపఱిచి,
చింతా... సిద్ధుండు=చింతామణియను మంత్రసిద్ధిగల,ఉపాధ్యాయ భట్టహర్షుం
డు=శ్రీహర్షుఁడు,వాక్ప్రౌఢి=వాక్చాతుర్యము,మెఱయన్ =ప్రకాశించునట్లుగా,
చెప్పిన, నైషధశృంగార కావ్యంబు=నైషధమను శృంగారకావ్యమును,ఆంధ్ర
దేశభాషన్ = తెలుఁగుబాసతోఁ, దెలియఁజెప్పితిన్ = తెలియునట్లు చెప్పినాడ
ను,అనగాఁ దెనిగించితిననుట.ఎవ్వఁడేని=ఏపురుషుఁడు,ఇమ్మహాకృతిన్ =ఈమహా
కావ్యమును,పఠించున్ =చదువునో, అతఁడు, అప...షుఁడు=పోయిన కలికాల
దోషము కలవాఁడు,అగుచున్,ఆయు...ప్రాభవంబు=ఆయువుయొక్కయుఆ
రోగ్యముయొక్కయు,పరిశుభ్రమగు విద్యయొక్కయు, వివేకముయొక్కయు,
అనఁగాఁ గార్యాకార్యవివేచనమనుట.భాగ్య=సంపదయొక్కయు,సౌభాగ్య=
శుభములయొక్కయు, వైభవ=భోగములయొక్కయు, ప్రాభవంబు=అతిశ
యమును,అనఁగా సమృద్ధిననుట, కాంచున్=పొందును. ఇందు ప్రతీతిసిద్ధమగు
స్వభావోక్తి అలం.

తా. పవిత్ర చరిత్రగల నలచక్రవర్తియొక్కయు పతివ్రతయగు దమ
యంతియొక్కయు చరిత్ర, చింతామణీమంత్రసిద్ధి గల శ్రీహర్షునిచే మున్ను చె
ప్పఁబడియె.దాని నిపుడు నే నాంధ్రీకరించినాఁడను. ఈ మహాకావ్యము నెవ్వ
రు పఠింతురో వారు కలికాల దోషమును దఱిఁజేరనీక సకల సంపదలచే
నొప్పుదురు. అనునిది దీని నాంధ్రీకరించిన శ్రీనాథుని వచనము.

శా. ఆలంకాపురి శంకరాచలమహీ వ్యాపారపారంగత !
ప్రాలేయద్యుతి కీర్తి మండల!కృపా పాథోనిధీ! దాన వి
ద్యాలంకార! కరాళహాలహాల జిహ్వాభీల నిస్త్రింశ! లో
కాలోకాపరభాగసంతమససం హారప్రతాపాతపా!. 203

టీ. ఆలంకాపురి...గత=ఆలంకాపురి మొదలు కైలాసమువఱకు వ్యాపించి
యుండు,భూమియందలి సంచారవ్యాపారమునందు జడ్డను పొందిన ప్రాలేయ

...మండల=చంద్రునిఁబోలు కీర్తిగలవాఁడా, కృపాపాథోనిధీ = దయాసముద్రుఁడా, దాన విద్యాలంకార =దానవిద్యకలంకారమువంటివాఁడా-పెక్కు దానములనొసంగువాఁడా అనుట. కరాళ . నిస్త్రింశ=ఉన్నతమగు విషజ్వాలవలె భయంకరమగు ఖడ్గముకలవాఁడా, లోకా...తపా=చక్రవాళపర్వతముయొక్క యావలిభాగమందున్న దట్టమగు చీఁకటిని చిమ్మివైచు ప్రతాపమను యెండగలవాఁడా, సూర్యునికిరణములచేఁ బోగొట్టఁబడని చక్రవాళపర్వతమున కవ్వలనైపునున్న చీఁకటి యీతని ప్రతాపప్రభచేఁ బోగొట్టఁబడుచుండెనని చెప్పుటచే సూర్యునికంటె నీతని ప్రతాపమునందలి యాధిక్యము చెప్పఁబడియె కాన వ్యతిరేకాలంకారము. మీదఁ జెప్పఁబడిన రూపకాదులు తెల్లంబులే. భావము స్పష్టము.

క. హాటకమ యరత్నతులా
కోటిఝుళంఝుళకఠోర ♦ కోలాహల వి
స్ఫోటితకుటిలమహీభృ
త్కోటీకఠినాంతరంగ ♦ తులితానంగా. 204

టీ. హాట...రంగ=బంగారువికారమైన, రత్నఖచితమగు కాలియందుండు బిరుదుటందెయొక్క ఝుళంఝుళ యను వినసహ్యముగాని పెద్దచప్పుడుచేత పగిలింపఁబడిన కుటిలులగు శత్రురాజుల సమూహములయొక్క కఠినమగుమనస్సుగలవాఁడా,అనఁగా నీతనిపాదమందుండు బిరుదు పెండేరపు చప్పుడు వినినతోడనే శత్రురాజులగుండె లవియుచుండెనని భావము. తులితానంగా=సమానుఁడయిన మన్మథుఁడుకలవాఁడా మిక్కిలి చక్కనివాఁడా అనుట.
తా. స్పష్టము.

మాలిని. జగదవనధురీణా ♦ సాధురక్షాప్రవీణా
నగపతిసమధైర్యా ♦ నందితాచార్యవర్యా
యగణితగుణభద్రా ♦ త్యాగముద్రాసముద్రా
విగతసకలదోషా ♦ శిష్టలోకైకభూషా 205

టీ. జగదవనధురీణా = జగత్తుయొక్క రక్షించుట యందలి భారమును వహించువాఁడా, సాధు...వీణా-సాధుల రక్షించుటయందుఁ బ్రావీణ్యముకల వాఁడా, నగపతిసమధైర్యా = హిమవత్పర్వతమువంటి ధైర్యముకలవాఁడా, నందితాచార్యవర్యా = ఆనందింపఁజేయఁబడిన గురువులుగలవాఁడా, అగణిత గుణభద్రా = లెక్కింపరాని గుణములచేత మంగళముకలవాఁడా, త్యాగ ముద్రాసముద్రా=దాన ముద్రచేత సముద్రుఁడయినవాఁడా - సముద్రునివలె దాతయనుట. విగతసకలదోషా=పోయిన అన్ని దోషములును గలవాఁడా, విశ్వలోకైక భూషా=ప్రపంచమందలి జనులకు ముఖ్యమైన యాభరణమా, జనులందఱు తానిచేఁ బ్రకాశించుచుండిరని భావము.

తా. స్పష్టము.

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్రమారయామాత్యపుత్త్రి సకల విద్యాసనాథ శ్రీనాథ భట్టప్రణీతం బయినశృం గారనైషధకావ్యంబునందు అష్టమాశ్వాసము.

శృంగార నైషధకావ్యము.

సంపూర్ణము.

గద్య. ఇది శ్రీమత్కేతవరపు వేంకటశాస్త్రి విరచితమగు గూఢార్థ ప్రకాశికయను శృంగారనైషధ వ్యాఖ్య సమాప్తము.

శ్రీకృష్ణార్పణమస్తు.

శుభం భూయాత్.

